# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (త - న)

### నాలుగో సంపుటం

ప్రధాన సంపాదకుడు

డా॥ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

డాక్టర్ అత్తలూరి నరసింహారావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ బాల అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ.
శ్రీ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, ఎమ్.ఏ.
శ్రీమతి కందాళ కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ.
శ్రీమతి నేమాని వెంకటరమణ, ఎమ్.ఏ.
శ్రీమతి శ్రీపాద సీతామహాలక్ష్మి, ఎమ్.ఏ.
శ్రీ ముచ్చు సీతారామయ్య, ఎమ్.ఏ.
డాక్టర్ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ సజ్జా మోహనరావు, ఎమ్.ఏ.




1985

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు

వాల్తేరు, విశాఖపట్టణం 530 003

మహామనీషి



# ఆచార్య కోనేరు రామకృష్ణారావు

పిఎచ్.డి., డి.లిట్.

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# మున్నుడి

భాషా జీవితంలో వ్యుత్పత్తికోశానికి ప్రత్యేక స్థానం ఉంది. పదాలు పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడంవల్ల అర్థావగతి అత్యంత సులభమౌతుంది. భాషలో ఈ ప్రయత్నం ఒక పర్యాయం మాత్రమే జరుగుతుంది. తదనంతర కాలంలో కూర్పులూ చేర్పులూ మార్పులూ ఉంటే ఉండవచ్చు. కాని మూలం మాత్రం మారదు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో 1957 నుంచి జరిగే ఈ బృహత్ప్రయత్నం నాకు తెలుసు. తెలుగు శాఖతో నాకు సన్నిహిత సంబంధ ముండటమే దీనికి కారణం. ఈ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో పనిచేసిన ఆచార్య గంటి జోగిసోమయాజి, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య యస్వీ జోగారావు, ఆచార్య తూమాటి దొణప్ప గార్లు ఈ పథక నిర్మాణంలో పాలు పంచుకొన్నారు. ఇప్పుడు తెలుగుశాఖలో రీడరుగా ఉన్న డాక్టర్ లకంసాని చక్రధర రావు ఉత్సాహంగా పనిచేస్తూ తెలుగు వ్యుత్పత్తి కోశ పథకావభృథ స్నానానికి సిద్ధం కావటం సంతోషాన్ని కలిగిస్తోంది. ఈ కోశ పరిసమాప్తి ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు గర్వ కారణం.

ఎనిమిది సంపుటాలలో వెలువడే తెలుగు వ్యుత్పత్తి కోశ పరంపరలో ఇది నాలుగో సంపుటం. 'త' నుంచి 'స' వరకు ఉన్న ఈ సంపుటంలో సుమారు 16,000 పదాలున్నాయి. 19,082 పదాలతోకూడిన 'ప' నుంచి 'భ' వరకు ఉన్న ఐదో సంపుటం ముద్రణకు సిద్ధంగా ఉంది. వివిధ దశలలో ఉన్న మిగిలిన సంపుటాల పని దాదాపు పూర్తి గావచ్చింది. ఇంతవరకు ఐదు సంపుటాల్లో పూర్తియైన పదాల సంఖ్య 77,688.

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి, ఈ సంపుటాలను సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయానికి, తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘ సభ్యులందరికీ, శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగార్లకు కృతజ్ఞతలు. త్వరలోనే మిగిలిన నాలుగు సంపుటాలూ ముద్రించబడగలవని హామీ యిస్తున్నాను.

ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# పీఠిక

31–3–1984 నాటికి పూర్తి కావలసిన ఎనిమిది సంపుటాల 'తెలుగు వ్యుత్పత్తి కోశం' ఆనాటికి పూర్తికాకపోగా ఈనాటికి సుమారు 16,000 పదాలతో కూడిన ఈ నాలుగో సంపుటం (త – న) మీ ముందుంచుతున్నాం. విఘ్నేశ్వరుడి పెళ్ళికి వేయి విఘ్నాలనే సామెత మా కోశ నిర్మాణ విషయంలో వాస్తవమైంది. సుమారు 19,000 పదాలతో కూడిన ఐదో సంపుటాన్ని (ప – భ) 27–2–1985 వ తారీఖున ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయానికి అచ్చుకై అందించాము. ఆరో సంపుటం (మ – ఱ) లో ఇప్పటికే 7,000 పదాల రాతప్రతి సిద్ధమైంది. 30–6–1985 నాటికి ఈ సంపుటాన్ని మొత్తం పూర్తికావించి ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులకు ముద్రణ నిమిత్తం సమర్పించగలం; 13,000 పదాలతో కూడిన ఏడో సంపుటాన్ని సెప్టెంబరు '85 నాటికి; 10,000 పదాలతో కూడిన ఎనిమిదో సంపుటాన్ని మార్చి '86 నాటికి ముద్రణకు అందించగలమని హామీ ఇస్తున్నాం. మొత్తం ముద్రణ 30–6–1986 నాటికి పూర్తి కాగలదని ఆంధ్ర విశ్వకళాపరిషదధికారులు మాకు గట్టి హామీ నిచ్చారు. వారి సంకల్పం నెరవేరగలదని ఆశిద్దాం.

ఈ నాలుగో సంపుటం కృషిలో భాగస్వాములు : డా॥ లకంసాని చక్రధరరావు, డా॥ అత్తలూరి నరసింహారావు, డా॥ బాల అరుణకుమారి, శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, శ్రీ లక్కింశెట్టి కోటమల్లేశ్వరరావు, శ్రీమతి కందాళ కనకమహాలక్ష్మి, శ్రీమతి నేమాని వెంకటరమణ, శ్రీమతి శ్రీపాద సీతామహాలక్ష్మి, శ్రీ ముచ్చు సీతారామయ్య, డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, శ్రీ సజ్జా మోహనరావు, శ్రీ గోనెళ్ళ వెంకటసీతారాం (టైపిస్టు), శ్రీ బోర వెంకటరమణారెడ్డి (ప్యూన్).

డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ, బి.ఏ. (ఆక్స్‌ఫర్డ్), పిఎచ్.డి. (వియన్నా) గారు ఆంధ్ర విశ్వకళాపరిష దుపాధ్యక్షులుగా 1949–61 మధ్యకాలంలో ఉన్నారు. వారి పరిపాలనా కాలాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయ చరిత్రలో స్వర్ణయుగంగా చారిత్రకులు భావిస్తారు. 1957 లో తెలుగు వ్యుత్పత్తి కోశ ప్రాదుర్భావానికి ప్రేరకులైనవారు ఆచార్య గంటి జోగి సోమయాజిగారు కాగా కారకులైనవారు డాక్టర్ వి.యస్. కృష్ణగారు. వారికి ఆంధ్రభాషపై ఉన్న ఆదరం అపురూపమైనది. కళాప్రపూర్ణ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు తమ 'ద్రావిడ భాషా పరిశీలనము' (రెండు సంపుటాలు)ను 1955 లో డాక్టర్ కృష్ణగారికి అంకితం కావించారు. 1955 లో యక్షగాన ప్రచురణను ప్రోత్సహించినవారు వీరే. ఏవంవిధ వివిధ సద్గుణ గణ గరిష్ఠులైన తెలుగు వ్యుత్పత్తి కోశ ప్రాదుర్భావ కారకులైన డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణగారికి ఈ కోశాన్ని అంకితం కావించటానికి అనుమతించిన గుణగణ గ్రహణ పారీణులు, సదసద్వివేకచతురులు, ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారికి అభినందనలు, కృతజ్ఞతలు.

తెలుగు వ్యుత్పత్తి కోశ పథకానికి ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృతజ్ఞతలు.

ఈ సంపుటానికి ముచ్చటైన మున్నుడిని తెలుగులో ఇచ్చిన అంతర్బహి స్సుందర మూర్తులు, ఆంధ్రాంగ్ల భాషాకోవిదులు, సహృదయ సమ్రాట్టులు, మనస్తత్వ పరామనస్తత్వా

చార్యవర్యులు, తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్. గారికి చేతలద్వారా మనః పూర్వకంగా కోశానికి స్ఫూర్తిని కల్గిస్తున్నందుకు హృదయపూర్వక కృతజ్ఞతా సుమాంజలి.

తమ అమూల్యమైన సలహాలద్వారా పథక విజయానికి కారకులయిన, అనుభవజ్ఞులైన తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘ సభ్యులు : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఆచార్య జి.ఎన్. రెడ్డి, ఉపాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, డాక్టర్ వావిలాల గోపాల కృష్ణయ్య, డాక్టర్ వడ్లమూడి గోపాల కృష్ణయ్య, శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి, ఆచార్య చేకూరి రామారావు, డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి గార్లకు—

ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ నిర్మాణానికి సర్వదా, సర్వథా సహకారాన్నందిస్తున్న ఆంధ్ర విశ్వకళాపరిషత్కుల సచివులు మృదు వచస్కులు డాక్టర్ మద్ది గోపాలకృష్ణరెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.యల్., పిఎచ్.డి., గారికి—

ఇటీవలనే ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ ఆనరరీ డైరెక్టర్‌గా పదవీబాధ్యతల్ని స్వీకరించిన ఆచార్య వేముల సుబ్బారావు, బి.ఇ. (మెకానికల్), ఎమ్.ఇ. గారికి—

ఈ కోశాన్ని సర్వాంగసుందరంగా సంతరించటంలో సహకరించిన ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ డిప్యూటీ డైరెక్టరు శ్రీ జి. మదనరాజ్, బి.ఏ. గారికి, ముద్రణాలయ సిబ్బందికి—

హార్దిక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషివల్ల కోశ సంపూర్తికి కారకులయిన మా వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి—

మనఃపూర్వకమైన అభినందనలు.

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తికోశ పథకం

వాల్తేరు
8-4-1985

ఆంధ్ర రాష్ట్ర అవతరణకు
అసువులను అర్పించిన



అమరజీవి

# శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘం

అధ్యక్షులు:

**డాక్టర్ కోనేరు రామకృష్ణారావు**, పిఎచ్.డి., డి.లిట్.
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

సభ్యులు:

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి**, డి.లిట్.
గౌరవాచార్యులు, రవీంద్ర సాహిత్యం
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

**ఆచార్య జి.ఎన్. రెడ్డి**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
ఉపాధ్యక్షులు, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం

వాఙ్మయ మహాధ్యక్ష
**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
హైదరాబాదు

**శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి**
మదనపల్లి

**డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
సత్తెనపల్లి

**ఆచార్య చేకూరి రామారావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
భాషాశాస్త్ర శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం

**డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
తెలుగు శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

**డాక్టర్ ఎల్. చక్రధరరావు**, ఎం.ఏ., పిఎచ్.డి.
కార్యదర్శి
డైరెక్టర్, ప్రధాన సంపాదకుడు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం

అంకితం

ప్రముఖ విద్యావేత్త



డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ

బి.ఏ. (ఆక్స్‌ఫర్డ్), పిఎచ్.డి. (వియన్నా)

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు (1949-61) గారికి

# త

**త**[1] వి. దంత్య శ్వాసస్పర్శం, అల్పప్రాణం. ఆధునికోచ్చారణంలో ఇది దంతమూలీయం. ఈ అక్షరం అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

<మూ.ద్రా. *త.

**-త**[2] ప్రత్య. ధాతువుకు ఆశీరాద్యర్థంలో వచ్చే ప్రత్యయం. భార. ఆది. 8.63.

**-త**[3] ప్రత్య. కొన్ని శబ్దాలకు స్త్రీమతుబర్థాల్లో వచ్చే తద్ధిత ప్రత్యయం.

ఉదా. మాలెత, బోయెత.

**-త**[4] ప్రత్య. సాధారణంగా "యు" వర్ణాంత ధాతువులకు వచ్చే కృత్ప్రత్యయం. ఉదా. చేఁత, నవఁత, కలఁత.

**తకతక** చూ. తత్తకతక. వి. తాళంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

క. తకతకనె. నాట్యవేగానికి అనుకరణం; తు. తకతక; మ. తకతక. తాళంవేయు.

**తకతకలాడించు** స.క్రి. తాళంతో చప్పుడుచేయు. **తకతకలాడు** అ.క్రి. **1**. తొందరపడు; **2**. ఆవేదనపడు, విశ్రాంతి లేనట్లుగా అనిపించు.

**తకతోం** వి. ఒకానొక మృదంగ శబ్దానుకరణం. దశా. 7.1.

**తకత్తు** రూ.చూ. తఖ్తు. వి. **1**. సింహాసనం; **2**. రాజధాని.

**తకపిక** వి. సంచలించడంలో అయ్యే ధ్వనికి అనుకరణం. మల్హా. 3.10.

క. తకపకనె. నాట్యవేగానికి అనుకరణం; తు. తకపక; మ. తకతక. తాళంవేయు.

**తకపికలగు** అ.క్రి. కిందుమీదు అయ్యే రీతిగా ధ్వనిఅగు. తాళ్ల. సం. 8.132. **తకపికలాడించు** స.క్రి. మోసపుచ్చు, కలతపెట్టు. **తకపికలాడు** అ.క్రి. **1**. కలగు, సంచరించు. ద్వి. హరిశ్చ. పూ. 1411 పం; **2**. ఇటూ అటూ కదలు. శశా. 4.61; **3**. మోసపడు. **తకపికలుచేయు** స.క్రి. కలతలు కలిగించు. **తకపికలుపెట్టు** అ.క్రి. ఎగిరిపడు. మల్హా. 3.10.

**తకరరు** రూ.చూ. తకర్రరు. వి. వివాదం.

**తకరర్రు** రూ.చూ. తకర్రరు. వి. వివాదం.

**తకరా** రూ.చూ. తకర్రరు. వి. వివాదం.

**తకరారు** రూ.చూ. తకర్రరు. వి. వివాదం.

**తకర్రరు** రూ. తకరరు, తకరర్రు, తకరా, తకరారు. వి. వివాదం.

హిం. తకరార్. వివాదం, ఏదేని ఒకమాటపై మరీ మరీ చెప్పటం; మరా. తకరార్, తక్రార్. పునరుక్తి, విరుద్ధ భాషణం; ఉ. తక్రరుర్. నియుక్తి, నిశ్చయం; పార. తక్రరుర్. స్థిరపరచటం, నియుక్తి; అర. తక్రరుర్. స్థిరపరచటం, స్థాపించటం.

<ఉ. తకర్రుర్.

**తకలా** వి. నేతపనివాళ్ళు అచ్చుకట్టేటప్పుడు, అచ్చుబిళ్ళకు చేర్చి వడిదారం చుట్టే ఇనపపుల్ల.

హిం. తక్‌లా, తకిలీ. దారం వడికే సాధన విశేషం.

<హిం. తక్‌లా.

**తకావి** వి. సేద్యం చేయడానికి సాయంగా ఇచ్చే సొమ్ము.

హిం. ఉ. అర. తకావీ. పంట అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం రైతులకిచ్చే అప్పు; మరా. తగాఈ;

క. తకావి.

<ఉ. తకావీ.

**తకిట** రూ. తక్కిట. వి. తాళం ధ్వనికి అనుకరణం. పార్వ. 5.123.

**తకిమా** విణ. తతిమ్మ, మిగిలిన.

**తకిలీ** రూ. తక్లీ, తగిలీ. వి. చేతితో నూలు వడికే ఇనపపుల్ల.

హిం. తక్‌లా, తకిలీ. నూలువడికే సాధన విశేషం.

<హిం. తకిలీ.

**తకిసా** రూ.చూ. తక్కిసా. వి. పర్యాయం, తడవ.

**తక్క** రూ. త్రిక్క[2]. అవ్య. ద్రు. వినార్థకం. భార. ఆది. 7.179.

**తక్కక** చూ. తక్కు[1].

**తక్కటి**[1] చూ. తక్కు[1].

**తక్కటి**[2] వి. త్రిముఖ దీపిక, మూడు వత్తులు వెలిగించటానికి ఉపయోగించే దీపపు ప్రమిద. ఆం.భా. 2.165.

సం. త్రిక-. మూడు.

**తక్కరి** రూ. టక్కరి. చూ. తక్కు[2]. వి. **1**. వంచకం. హర. 9.122; **2**. మాయకలవాడు. భాగ. 10.398.

క. టక్కరి. దొంగ, టక్కు. మోసం; తు. టక్కు; కుఋ. ఠకాస్. వంచకుడు; బ్రా. టస్. వంచకుడు; టగ్గి. మోసం;

జై. మహా. తక్క. దేశీ. టక్కర-. మోసం; నే. ఠక్క, స్థిగ-. వంచన, దుర్నీతి; అ.మా. తక్కర-; మరా. ఠక. మోసం.

**తక్కరీఁడు** వి. మోసగాడు. అచ్చ. భా. 1.17.

**తక్కల** వి. కళవళం.

త. టక్కర్.

**తక్కలపడు** అ.క్రి. కలవరపడు, కలతపొందు. సిం. ద్వా. 11.55.

**తక్కలి** రూ.చూ. తక్కిలి. వి. ఒకజాతి నెల్లిచెట్టు, బుడసర.

**తక్కలిగొను** చూ. తక్కు[2].

**తక్కాలు** రూ.చూ. తక్కాళ. వి. రామములగ, టమాటో,

చల్లని తోటల్లో పెంచే తీగెపైరు (Lycopersicum esculentum).

**తక్కాళ** రూ. టెక్కలి, తక్కాలు, తక్కాళీ. వి. రామములగ కాయ (Lycopersicum esculentum).

క. తక్కాళి. రామములగ ; త.మ. తక్కాళి.

<త. తక్కాళి + కాయ.

**తక్కాళీ** రూ.చూ. తక్కాళ. వి. టక్కోరపువంకాయ, రామములగకాయ.

**తక్కించు**[1] చూ. తక్కు[1].

**తక్కించు**[2] చూ. తక్కు[2].

**తక్కించుకొను** చూ. తక్కు[1].

**తక్కట** రూ.చూ. తకిట. వి. తాళధ్వనికి అనుకరణం. పార్వ. 5.123.

**తక్కడి**[1] చూ. తక్కు[2].

**తక్కడి**[2] రూ.చూ. తక్కెడ[1]. వి. త్రాసు, తుల.

**తక్కడిబద్దలు** వి. బ. వ. దూది తూచటానికి, త్రిభుజాకారంలో తాళ్ళతో బిగించే సేరుకోలకు వేలాడదీసిన బద్దలు.

**తక్కడికాఁడు** చూ. తక్కు[2].

**తక్కడితనము** చూ. తక్కు[2].

**తక్కడిది** చూ. తక్కు[1].

**తక్కడిబిక్కడి** రూ.చూ. తక్కరిబిక్కరి. విణ. నిలకడలేని, అడ్డ దిడ్డమైన.

**తక్కనవాఁడు** చూ. తక్కు[1].

**తక్కనవారలు** చూ. తక్కు[1].

**తక్కరిబిక్కరి** రూ. తక్కడిబిక్కడి. విణ. గందరగోళమైన.

**తక్కలి** రూ. తక్కలి, తక్కె[2], తక్కెడ[2], తక్కెడు[2], తక్కెల[2], తక్కేడు, తక్కేల. వి. బుడ్డబునర, ఒక రకం చెట్టు, ఒకజాతి నెల్లిచెట్టు. హంస. 4.11 (Premnaintegrifolia).

సం. తర్కారీ. ఒకజాతి నెల్లిచెట్టు ; ప్రా. తక్కలి, తక్కలీ ; అమా. తక్కలి ; పా. తక్కారి.

క. తక్కలె ; త.మ. తక్కాళి.

<ప్రా. తక్కలి.

**తక్కసా** రూ. తకిసా. వి. పర్యాయం, తడవ.

**తక్కు**[1] రూ. త్రిక్కు[1], దక్కు[1]. అ.క్రి. **1**. మిగులు, శేషించు. భార. ఆది. 2.141 ; **2**. ఉడుగు, అణుగు. భార. ఆది. 6.86; **3**. పోవు. భార. విరా. 2.319 ; **4**. తక్కువగు. రం. రా. ఉ. 8పు, 4పం ; **5**. తొలగు. అపసరిల్లు. హరి.ఉ. 3.8 ; స.క్రి. **1**. విడుచు. భార. ఆది. 5.71, భార. భీష్మ. 3.307 ; **2**. మానుకొను. భార. విరా. 1.116 ; విణ. ఇతరమైన, అన్యమైన. భార.శాంతి. 1.9. వి. **1**. విసర్జనం, విడుపు. ఆం. భా. 2.173 ; **2**. శేషం, మిగులు.

క. దక్కు. మిగులు, మిగల్చబడు ; త. తంకు. మిగులు, మిగుల్చు ; తక్కు. తగ్గు, ఆగు ; మ. తఞ్ఞుక. ఆగు, మిగులు ; తంచుక ; నా. తక్. ఆగు, మిగులు.

మూ.ద.ద్రా. *తన్క్–/ *తక్క్–.

**తక్కక** అవ్య. **1**. అవశ్యం. విజ్ఞా. ఆచా. 22 ; **2**. పూనివదలక. హరి.ఉ. 2.68 ; **3**. వెనుదీయక. గౌ. హరి.పూ. 1186పం. మను. 3.4 ; **4**. విచారంలేక. విక్ర. 3.10 ; **5**. సంకోచించక. కళా. 4.160. **తక్కటి**[1] విణ. ఇతరమైన, మిగిలిన. భార. ఆది. 5.75. **తక్కించు**[1] స.క్రి. తొలగించు, తప్పించు, మరల్చు. సిం.ద్వా. 6.90. <తక్కు[1] + —ఇంచు[3]. **తక్కించుకొను** స.క్రి. కాపాడుకొను. భార.ఉద్యో. 4.234. **తక్కడిది** విణ. పనికిరాని వస్తువు. **తక్కనవాఁడు** విణ. అన్యుడు, ఇతరుడు. నిర్వ.రా. 4.163. **తక్కనవారలు** విణ.బవ. మిగిలినవాళ్ళు, ఇతరులు. భార. విరా. 3.116. **తక్కుఁగల (-కల)** విణ. తక్కన, మిగిలిన. భార. విరా. 2.35. **తక్కుడు** వి. **1**. విడవటం. నిర్వ.రా. 4.66 ; **2**. మిగలటం. **తక్కునంగలుగు** విణ. ఇతరమైన. హరి.ఉ. 3.158. **తక్కువెట్టు (-పెట్టు)** స.క్రి. తక్కువగా తలచు, తిరస్కరించు. పండి.చ. 4పు. 214. **తక్కొండు** విణ. ఇతరమైన. కావ్యా.చూ. 5.78. <తక్కు[1] + ఒండు. **తక్కొరుఁడు** వి. ఇతరుడు. భార. విరా. 2.335. <తక్కు[1] + ఒరుఁడు. **తక్కొరులు** వి.బ.వ. ఇతరులు. భార. అను. 5.113. <తక్కు[1] + ఒరులు.

**తక్కు**[2] వి. **1**. మోసం, వంచన, జిత్తు. విక్ర. 3.29 ; **2**. విలాసం, విలాసచేష్ట, కులుకు. దశా. 2.383 ; **3**. అసత్యం. ఆం.భా. 1.119 ; **4**. నటింపు, కపటప్రవర్తన ; స.క్రి. **1**. వంచించు. ఆము. 5.68, కాళ. 4.31 ; **2**. టక్కుచేయు. శుక. 2.217.

క. తక్కు. మోసం, కపటోపాయం ; తు. టక్కు. యుక్తి, మాయ, నటింపు, కపటప్రవర్తన.

పో.చూ. హిం. ఠగ్నా. వంచించు ; గు. ఠగ్వూ ; మరా. ఠక్ణె. చూ. ఠగ్న.

**తక్కులిగొను (-కొను)** స.క్రి. దొంగిలించు. కవిక. 6.158. **తక్కించు**[2] స.క్రి. మోసపుచ్చు. వేంక. పంచ. 4.618. <తక్కు[2] + - ఇంచు[3]. **తక్కడి**[1] విణ. **1**. అబద్ధమైన, చెన్నబసవ. 2.302 ; **2**. వంచకమైన ; వి. మోసం. త. తక్కన్ ; సం. తస్కర-. దొంగ ; ప్రా. తక్కర-. **తక్కడికాఁడు** వి. వంచకుడు. అచ్చ.రా. సుందర. 47. **తక్కడితనము** వి. మోసం. విప్ర. 4.28. **తక్కుబిక్కు** విణ. మంచిచెడ్డ. **తక్కులఁబడు (-పడు)** అ.క్రి. మోసపోవు. పండి. చ. 5.518పు. 16పం. తాళ్ళ. **తక్కులఁబెట్టు (-పెట్టు)** స.క్రి. **1**. చిక్కులలో పెట్టు. తాళ్ళ. సం. 9.6 ; **2**. మోసపుచ్చు. విష్ణు పు. 1.144. **తక్కులాఁడి** రూ.చూ. టక్కులాఁడి. వి. **1**. వంచకురాలు ; **2**. విలాసవతి. <తక్కు[2] + - లు + - ఆఁడి. **తక్కులాఁడు** రూ.చూ. టక్కులాఁడు. వి. **1**. వంచకుడు ; **2**. విలాసవంతుడు. <తక్కు[2] + - లు + ఆఁడు[2].

**తక్కువ** విణ. న్యూనమైన, హీనమైన. భార. ఆది. 5.75 ; వి. లాఘవం, అల్పత్వం. భార. ఉద్యో. 3.296, 4.59.

క. తాఱు. అడుగు భాగం, తగ్గు. నీచస్థితి, గుంట, పల్లం ; తు. తారుని. మునగటం, తగ్గు. పల్లం, లోయ ;

త. తాల్ (-వ్,-న్ద్). కిందపడటం, తగ్గటం, క్షీణించటం, నిరాశపడటం, తాఴత్తి. న్యూనతాభావం, నీచస్థితి, అగౌరవం; తాఴమ్. తక్కువస్థాయి; తాఴ్చి. తగ్గించటం, అవమానం, తలవంపు; కువి. తలెని. కింద; కోలా. తంటె, తంటాడ్. కింద; నా. తల్. కింద; గ. తాండర్. కింద.

**తక్కువచేయు** స.క్రి. కించపరచు. హంస. 1.124.
**తక్కువపడు** అ.క్రి. న్యూనతపొందు. పండి.చ. 2.124పు.
**తక్కువపఱచు** స.క్రి. చులకనచేయు. భీమ. 1.117.
**తక్కువపాటు** వి. న్యూనత. భార. అరణ్య. 6.17.
**తక్కువయగు (-అగు)** అ.క్రి. తగ్గిపోవు. విప్ర. 5.29.
**తక్కువసూపు (-చూపు)** వి. సరిగా చూడకపోవడం.

**తక్కె**[1] వి. రెండు వీసెల పరిమితి.
క. తక్కె. సందెడు కర్రలు మొదలైనవి.
**తక్కెడు**[1] వి. వీసెడు, తూకపు కొలత, 120 తులాల బరువు.

**తక్కె**[2] రూ.చూ. తక్కిలి. వి. తక్కెడు చెట్టు, బుడ్డబుసర చెట్టు.

**తక్కెడ**[1] రూ. తక్కిడి2, తక్కేడ. వి. రెండు పేపకుడ కలుగల త్రాసు. శేషధ. 2. ఆం. భా. 2.50.
క. తక్కడి. త్రాసు; తు. తక్కడి. పెద్ద త్రాసు. కాటా; త. తక్కటి. త్రాసు, మోసం, తక్కట్టై. త్రాసు; మ. తక్కటి. త్రాసు.
న. త్ర్యంటుక-. ఒక విధమైన ఉట్టి.
పో.చూ. మరా. తాగ్డి. త్రాసు.
**తక్కెడడుగు** వి. పెళ్ళిలో మామ అల్లుణ్ణి, పిల్లవాడి తండ్రి పెళ్ళికూతుర్ని ఇంకోసారి ఇలాగే పెళ్ళికొడుకు పెళ్ళికూతుర్ని ఎత్తుకొని పందిరిచుట్టూ ఆడుతూ తిరగటం. <తక్కెడ[1] + అడుగు[1].

**తక్కెడ**[2] రూ.చూ. తక్కిలి. వి. ఒక జాతి నెల్లిచెట్టు. ఆం.భా. 2.50.

**తక్కెడు**[2] రూ.చూ. తక్కిలి. వి. బుడ్డబుసర చెట్టు, చెడు వాసన కల్గి పచ్చపూలు పూసే ఒకరకం చెట్టు (Premnaintegrifolia).

**తక్కెఱ** చూ. తక్కు[1]. విణ. అల్పమైన.

**తక్కెల**[1] వి. గడ్డి, కసువు, చెత్త, తాలు.
క. తక్కె. (గడ్డి మొ. వాటి) కుప్ప, రాశి.

**తక్కెల**[2] రూ.చూ. తక్కిలి. వి. బుడ్డబుడుసర, ఒకరకం చెట్టు.

**తక్కేడ** రూ.చూ. తక్కెడ[1]. వి. త్రాసు.
**తక్కేడు** రూ.చూ. తక్కిలి. వి. ఒక జాతి నెల్లిచెట్టు.
**తక్కేల** రూ.చూ. తక్కిలి. వి. బుడ్డబుడుసర, ఒకరకం చెట్టు.
**తక్కొండు** చూ. తక్కు[1].
**తక్కొను** చూ. తల[1].
**తక్కొరుఁడు** చూ. తక్కు[1].
**తక్కొరులు** చూ. తక్కు[1].
**తక్కొరువంకాయ** వి. రామములగ, చల్లటి చోట తోటల్లో పెంచే తీగపైరు (Lycopersicum esculentum).

**తక్త** రూ.చూ. తఖ్తు. వి. **1**. రాష్ట్రం; **2**. సింహాసనం.
**తక్తు** రూ.చూ. తఖ్తు. వి. **1**. సింహాసనం; **2**. రాజధాని.
**తక్లీ** రూ.చూ. తకిలీ. వి. చేతితో నూలు వడికే ఇనప పల్ల.
**తక్సీమ్** వి. విభాగం.
హిం. తక్సీమ్. విభజన, వేరు; ఉ. తక్సీమ్. భాగం, విభజనం; పార. తక్సీమ్. పంపకం, విభాగం; అర. తక్సీమ్. విభాగం.
<ఉ. తక్సీమ్.

**తక్సీర్** రూ.చూ. తక్సీరు. వి. అపరాధం.
**తక్సీరు** రూ. తక్సీర్. వి. అపరాధం, నేరం. రంగా.చ. 2.153.
హిం. తక్సీర్. న్యూనత, అపరాధం, తప్పు; ఉ. తక్సీర్. నేరం, తప్పు; పార. తఖ్సీర్. తప్పు; అర. తక్ సీర్. అపరాధం, నేరం.
<ఉ. తక్సీర్.
**తక్సీరుమాపుచేయు** స.క్రి. తప్పు క్షమించు. రంగా.చ. 2.153.

**తఖ్తా** రూ.చూ. తఖ్తు. వి. **1**. సింహాసనం; **2**. రాజధాని.
**తఖ్తు** రూ. తకత్తు, తక్త, తక్తు, తఖ్తా, తఖ్తూ. వి. **1**. సింహాసనం; **2**. రాజధాని.
హిం. తఖ్త్. సింహాసనం; మరా. తక్త, తఖ్త, తఖ్త. సింహాసనం, ఆసనం; ఉ. తఖ్త్. రాజ సింహాసనం, రాజ్యం, రాష్ట్రం; పార. తఖ్త్. సోఫా, రాజ సింహాసనం, పరుపు, రాజ్యం.
<ఉ. తఖ్త్.

**తఖ్తూ** రూ.చూ. తఖ్తు. వి. **1**. రాజ్యం, రాష్ట్రం; **2**. సింహాసనం.

**తగటి** రూ.చూ. తగడు[2]. వి. **1**. జరీ. శశా. 5.4. దశా. 1.71; **2**. జరీగల వస్త్రం. ఆం.భా. 2.155.
**తగటీ** రూ.చూ. తగడు2. వి. **1**. జరీ. చంద్రాంగ. **4**.70; **2**. జరీబట్ట. రాజ. వి. 2.52.
**తగటు** రూ.చూ. తగడు[2]. వి. **1**. జలతారు. దా.మం. 1.29. అచ్చ.రా. బాల. 194; **2**. బంగారం రేకు. రసిక. 1.78; **3**. బంగారం మొ. వాటి పూత. సీమం. 3.181.
**తగటుచేయు** స.క్రి. బంగారు మొదలైన వాని పూత పూయు. **తగటుదట్టీ** వి. జరీదట్టి. యయా. 1.65.

**తగడ** వి. పచ్చపూలు పూసే ఒక పెద్ద చెట్టు. (Stereospermum Chelonoides).
**తగడం** వి. ఒకరకం లేత నీలం రంగు.
**తగడు**[1] రూ.చూ. తగరు[1]. వి. పొట్టేలు.
**తగడ్లు** వి.బ.వ. మగ గొర్రెలు, పొట్టేళ్ళు. ద.హిం.గా. సంపు. 6. శా.సం. 218.

**తగడు**[2] రూ. తగటి, తగటీ, తగటు, తవటీ. వి. **1**. బంగారం మొ. వాటి రేకు. భార. భీష్మ. 1.242; **2**. పొర.
క. తగడు. లోహపు రేకు; తు. తగడు. పల్చని లోహపు రేకు; త. తకటు. లోహపురేకు, భూమి పొర; మ. తకటు, తకిటు. పల్చని లోహపురేకు, తళతళ మెరిసేది; తకిట. రాగిరేకు.

పో.చూ. మరా. తకట్, తక్టె. లోహపురేకు.

తగడెత్తు అ.క్రి. పొరలెత్తు, పొరలుగా లేచు. భీమ. 4.130. <తగడు[1]+ఎత్తు.

**తగడెత్తు** చూ. తగడు[2].

**తగడ్లు** చూ. తగడు[1].

**తగయిరి** రూ.చూ. తగైరు. వి. బర్తరఫు. ఉద్యోగం పోవటం.

**తగయిరు** రూ.చూ. తగైరు. వి. బర్తరఫు. ఉద్యోగం పోవటం.

**తగర** రూ.చూ. తగిరిన. వి. ప్రపున్నాడం, పచ్చపూలు పూసే చిన్న మొక్క. క్రీడా. 2.32.

**తగరం** రూ.చూ. తగిరిన. వి. పొదగా పెరిగే ఒకరకం చెట్టు (Cassiator oralata).

**తగరపాలు** వి. తుప్పగా 6, 8 అడుగుల ఎత్తు పెరిగే ఒకరకం కలుపు మొక్క (Labernaemontanagenus).

**తగరము**[1] రూ.చూ. తవరము. వి. వంగమనే మెత్తని లోహం.

తగరమువాడిచేయు అ.క్రి. కానిపనికి పూనుకొను. కు. సం. 7.33.

**తగరము**[2] రూ.చూ. తగరు1. వి. పొట్టేలు.

**తగరు**[1] రూ. తగడు[1], తగరము[2], తగురు. వి. మగగొర్రె, పొట్టేలు. భార.ఉద్యో. 1.237.

క. టగర, టగరు, టిగరు, తగర్. పొట్టేలు; తు. టగరు, తగరు; త. తకర్.

తగరురవుతు రూ. తగరురౌతు. వి. అగ్ని, మేష వాహనుడు. తగరురౌతు రూ.చూ. తగరురవుతు. వి. మేష వాహనుడు, అగ్ని. తగరులవిడుపులు వి.బ.వ. బాలక్రీడా విశేషం. ఇందు. 2.18.

**తగరు**[2] వి. అడవుల్లో పెరిగే ఒక మద్దె చెట్టు (Morinda Tinctoria).

**తగల** చూ. తగులు. వి. 1. ఆచారం, కట్టుబాటు, మర్యాద; 2. కంచెలో దారి కడ్డంగా పెట్టిన తలుపు.

**తగలు**[1] చూ. తగులు. వి. 1. మాదిరి, విధం, తీరు; 2. కట్టు కారుకు వచ్చిన పద్ద.

**తగవరి** చూ. తగవు.

**తగవరిపలుకులు** చూ. తగవు.

**తగవు** చూ. తగు. వి. 1. తగి ఉండటం, యుక్తత. భార. సభా. 2.116; 2. న్యాయం. భార.ఉద్యో. 1.251; 3. జగడం, కలహం. భీమ. 5.95; 4. వివాహాది శుభ కార్యాల్లో ఇచ్చే కానుక. శివరా. 2.62; 5. తీర్పు, నిర్ణయం. జైమిని భా. 8.209; 6. మేలు, ఉపకారం. విక్ర. 6.76; 7. రీతి. విధం. కకుత్స. 4.30; విణ. తగిన, యుక్తమైన. భార.విరా. 1.64.

క. తక్క. తగిన; తక్కు. పెద్దతనం; కొడ. తక్క. తగిన; త. తకవు, తకై, తహవు. తగి ఉండటం, స్థితి, పద్ధతి, పోలిక. న్యాయం, ప్రవర్తన, నీతి; మ. తక్కమ్. తగి ఉండటం.

తగవరి వి. తీర్పరి. విజ్ఞా. ప్రా. 122. విణ. న్యాయ శీలుడైన. భాగ. 10.762. <తగవు+-అరి. తగవరి పలుకులు వి.బ.వ. ముదిమి వచ్చినట్లు, సర్వజ్ఞుడైనట్లు. మాట్లాడే మాటలు. కాశీ. 4.49. తగవుగావించు(-కావించు) స.క్రి. తీర్పుచెప్పు, పంచాయతీ చేయు. గౌ.హరి.ఉ. 773 పు. తగవుగోరి(-కోరి) వి. సంధి చేసేవాడు. కవిక. 4.113. తగవుచెడు అ.క్రి. పాడితప్పు. ఉ.హరి. 1.70. తగవుతగములు వి.బ.వ. న్యాయాన్యాయాలు. భార. శాంతి. 2.187. తగవులాడు వి. న్యాయస్థుడు, న్యాయశీలుడు. వరాహ. 10.48. తగవులిచ్చు స.క్రి. ఆడపడుచులకి కానుక లిచ్చు. శివరా. 2.62. తగవెఱుగు అ.క్రి. నీతి తెలియు. కు.సం. 2.14. <తగవు+ఎఱుగు.

**తగవెఱుగు** చూ. తగవు.

**తగాదా** రూ. తగాయిదా. వి. 1. వ్యాజ్యం, తగవు; 2. ఒత్తిడి చేయడం.

హిం. తకాజా. ఆవశ్యకత; మరా. తగాదా. అభ్యర్థన; ఉ. తకాజా. పోట్లాట, ఆవశ్యకత; పార. తకాజా. ఒత్తిడి చేయటం, అభ్యర్థన, ఆవశ్యకత; అర. తకాజా. పోట్లాట, తన అభిమతం సరైనదని ఇతరులతో వాదించటం.

క. తగాదె. అభ్యర్థన, వ్యాజ్యం.

<ఉ. తకాజా.

**తగాయిదా** రూ.చూ. తగాదా. వి. వ్యాజ్యం, తగవు.

**తగార** రూ.చూ. దాగర. వి. రొట్టె పిండిపిసకడానికి, బోర్లించి రొట్టె తట్టేందుకు వాడే మట్టిపాత్ర.

**తగారి** రూ.చూ. దాగర. వి. రొట్టెపిండి పిసికేదానికి, బోర్లించి రొట్టె తట్టేందుకు వాడే మట్టిపాత్ర.

**తగారు** రూ.చూ. దాగర. వి. 1. రొట్టెపిండి పిసకడానికి, బోర్లించి రొట్టె తట్టేందుకు వాడే మట్టిపాత్ర; 2. ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.

**తగిచ్చి** రూ.చూ. తగిరిన. వి. పొదగా పెరిగే ఒకరకం చెట్టు (cassia tora or alata).

**తగిటిన** రూ.చూ. తగిరిన. వి. పొదగా పెరిగే ఒకరకం చెట్టు (cassia tora or alata).

**తగిడి**[1] వి. ఒకరకం చెట్టు. హంస. 4.10.

**తగిడి**[2] రూ.చూ. తగుడు[1]. వి. పల్చని కొయ్య ముక్కలను చివ్వటానికి వాడే రేకు పనిముట్టు.

**తగిడి**[3] రూ.చూ. తగుడు[2]. వి. పల్లం, దిగుడు.

**తగిర** రూ.చూ. తగిరె. వి. పనకంచీల, కాడి మధ్య పైవైపు కొట్టిన ఇనపమేకు.

**తగిరన** రూ.చూ. తగిరిన. వి. తగిరింత, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క (cassia tora or alata).

**తగిరి** రూ.చూ. తగిరె. వి. 1. పనకం చీల, కాడి మధ్య పైవైపు కొట్టిన ఇనపమేకు; 2. ఇనకను, జల్లెడ మీదికి విసరే రేకు సాధనం.

తగిరిచీల వి. కాడికి పట్టెడను కట్టడానికై నాటిన మేకు.

**తగిరింత** చూ. తగిరిన. వి. ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క.

**తగిరిన** రూ. తగర, తగరం, తగిచ్చి, తగిటిన, తగిరన, తగిరిసె, తగిరెసి, తగిర్స, తగిర్సె, తగిలెన. వి. ప్రపున్నాడం, పచ్చపూలు పూసే చిన్న మొక్క, తంటెం (cassia tora). ఆము. 4.134.

క. చగచె, చొగచి, చొగర్చి, తగచి, తగచె, తగర్చె, తగ్గచ్చి, తగరిసె. ఒకరకం చెట్టు; త. తక్కరై. ఒకరకం చెట్టు.

పో.చూ. సం. చక్రగజ-, చక్రమర్ద-.

**తగిరిసె** రూ.చూ. తగిరిస. వి. పొదగా పెరిగే ఒకరకం చిన్న పచ్చపూల మొక్క (cassia tora or alata).

**తగిరె** రూ. తగిర, తగిరి, తమిర, తమిరి, తమిరె, తమెర, తరిమి, తైర. వి. పనకం చీల, కాడి మధ్య వేసిన ఇనప మేకు.

**తగిరెసి** రూ.చూ. తగిరిస. వి. తగిరింత. ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క (cassia tora or alata).

**తగిర్స** రూ.చూ. తగిరిస. వి. తంటెం, ప్రపున్నాడం. హంస. 4.132.

**తగిర్సె** రూ.చూ. తగిరిస. వి. తగిరింత, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క (cassiatora or alata).

**తగిలించు** చూ. తగులు.

**తగిలీ** రూ.చూ. తకిలీ. వి. చేతితో నూలువడికే ఇనపపుల్ల.

**తగిలెస** రూ.చూ. తగిరిస. వి. తగిరింత, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క (cassiatora or alata).

**తగీరు** రూ.చూ. తగైరు. వి. బర్తరఫు, ఉద్యోగం పోవటం.

**తగు** రూ. తవు[2], తొ. అ.క్రి. **1**. అర్హమగు. భార.ఆది. 1.55; **2**. న్యాయమగు, ధర్మమగు. భార.ఆది. 1.86; **3**. అనుకూలమగు. భార.ఆది. 5.10; **4**. సమర్థమగు. భార.సభా. 1.31; **5**. సమానమగు. భార.భీష్మ. 1.129; **6**. శోభిల్లు. శృం.నై. 2.105; **7**. తప్పనిసరిఅగు. విప్ర. 2.69; **8**. వర్తించు, ఉండు. విప్ర. 2.73; **9**. కొంచెమగు, స్వల్పమగు. విప్ర. 3.81.

క. తగు (తక్క్). తగిఉండు, యోగ్యమైన; తక్క. తగిన, యోగ్యమైన, యుక్తమైన; తు. తక్క. తగిన. యోగ్యమైన, యుక్తమైన; త. తకు (తక్క్-, తకు-న్), తగిఉండు, యోగ్యమైన, దివ్యంగాఉండు, తగిన, పోలిక కలిగిఉండు; తక్కు. తగియుండు; తకవు. అనుగుణ్యం, న్యాయం; మ. తకు (తక్క్-). తగియుండు; కుయి. సాంజ. తగియుండు, యోగ్యమైన, శోభిల్లు.

మూ.మ.ద్రా. *చాయ్-/*చయ్-.

<మూ.ద.ద్రా. *తాయ్. *తక్.

**తగుకత్తి** వి. సాధనకు ఉపయోగించే ఆయుధం. **తగుతగములు** వి.బ.వ. యుక్తాయుక్తాలు. **తగునెడమొఱయిడు(-ఇడు)** స.క్రి. దిక్కున్నచోటికి పోయి చెప్పుకొను. కళా. 3.230. **తగుమానం** వి. తగినంత, చాలినంత. **తగువారు** విణ.బ.వ. యోగ్యులు.

**తగుడు**[1] రూ. తగిడి[2]. వి. **1**. సెలగ పారరేకు; **2**. పల్చని కొయ్యముక్కలను చివ్వడానికి వాడే రేకు పనిముట్టు.

క. తగడు; త. తకటు; మ.తగడు, తగిడు; మరా. తకట.

<క. తగడు.

**తగుడు**[2] రూ. తగిడి[3], తగ్గుడు. వి. పల్లం, దిగుడు.

**తగుడుజోగివాళ్లు** రూ. తగుడుజోగోళ్ళు. వి.బ.వ. గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒక తెగ.

**తగుడుజోగోళ్ళు** రూ.చూ. తగుడుజోగివాళ్లు. వి.బ.వ. గొంగళ్ళు నేసే కురమవాళ్ళలో ఒకతెగ.

**తగుముద** వి. గుమురుబేకు, గృహోపకరణాలు తయారు చేయడానికి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (gygmelia arborea).

**తగురు** రూ.చూ. తగరు[1]. వి. గొర్రె, మేషం.

**తగులగట్టు** చూ. తగులు.

**తగులమి** చూ. తగులు.

**తగులము** చూ. తగులు.

**తగులబడు** చూ. తగులు.

**తగులబెట్టు** చూ. తగులు.

**తగులవేయు** చూ. తగులు.

**తగులాట** చూ. తగులు.

**తగులాటకత్తియ** చూ. తగులు.

**తగులాటకత్తె** చూ. తగులు.

**తగులాటకాడు** చూ. తగులు.

**తగులాటము** చూ. తగులు.

**తగులాయము** చూ. తగులు.

**తగులు** రూ.చూ. తవులు. స.క్రి. **1**. వెంబడించు. భార.ఆది. 1.103; **2**. కూడిఉండు. భార.ఆది. 8.25; **3**. కూడు. విక్ర. 4.228; **4**. పురికొల్పు. కళా. 2.387; **5**. ఆశ్రయించు. కళా. 3.222; **6**. చుట్టబడు, కట్టబడు; అ.క్రి. **1**. ఆసక్తిగొను. భార.ఆది. 1.160; **2**. ఇష్టపడు. భార.ఆది. 2.149; **3**. చిక్కు లగ్నమగు. భార.ఆది. 8.157; **4**. సంభవించు, కలుగు. హరి.పూ. 1.181; **5**. దొరుకు. ద్వి.నల. 1.346; **6**. కలగజేసుకొను; **7**. పుట్టు; **8**. లభించు. స.క్రి. అ.క్రి. **1**. మోహించు. కు. సం. 7.20; **2**. తాకు. కళా. 5.10, మను. 1.37; వి. **1**. అభిలాష. భార. ఆరణ్య. 2.63; **2**. మోహం, వలపు. భార. ఉద్యో. 4.275; **3**. సంబంధం. భార. శాంతి. 6.62; **4**. చిక్కు. భార. అశ్వ. 3.104, 105; **5**. సంతోషం. భార. స్వర్గ. 54; **6**. ఆలోచన. దశకు. 7.38; **7**. అడ్డు, నిరోధం. హరి. ఉ. 5.84; **8**. బంధం. భాగ. 8.58; **9**. రతి. విష్ణుపు. 6.18, కాశ. 1.44; **10**. కలయిక, సంఘటన. హంస. 1.92; **11**. దండుగ, నష్టం; **12**. పశువుల మెడకువేసిగుంజకు కట్టేతాడు. పలుపు, కట్టుతాడు; **13**. గొడ్లనుకట్టేగుంజ; .విణ. **1**. సక్తమయిన. ఉ. హరిశ్చ. 4.143, భోజ. 3.112; **2**. ఆశ్రితుడయిన. విప్ర. 5.271; **3**. ప్రియురాలైన. విజయ. 364.

**తగిలించు** రూ. తవిలించు. స.క్రి. **1**. మోహింపచేయు.కు. సం. 7.14; **2**. కూర్చు, చేర్చు (రతిలో). నిర్వ. రా. 8.18; **3**. లగ్నంచేయు, బంధించు, చిక్కించు. భార. విరా. 1.211; **4**. సక్తంచేయు. విక్ర. 8.38, హంస. 4.48; **5**. సంబంధం కలిగించు. శుక. 2.290; **6**. ముట్టించు, నిప్పు అంటించు. శుక. 3.204. క. తగలిసు, తగిలిసు, తగులిసు. సంబంధం కలిగించు (రతిలో).

కూర్చు, చేర్చు, కలుపు, సక్తంచేయు; తు. తగరుని. దగ్గరకిలాగు. **తగుల(గట్టు(-కట్టు)** స.క్రి. తగిలించు. భాగ. 10పూ. 1738. **తగులమి** రూ. తవులమి. వి. అనక్తత. భార. శాంతి. 5.453. **తగులము** వి. 1. ప్రేమ, ఆసక్తి. భార. విరా. 2.253; 2. సంబంధం. భాగ. 3.885; 3. నిరోధం. ఆము. 4.85. **తగుల(బడు(-పడు)** రూ.చూ. తవుల(బడు. అ.క్రి. 1. చిక్కు, లగ్నమగు. శేయూర. 4.44; 2. దగ్ధమగు; 3. పాడగు, చెడిపోవు. **తగుల(బెట్టు(-పెట్టు)** స.క్రి. 1. తగలచేయు; 2. కాల్చు, దహించు; 3. పాడుచేయు. **తగులవేయు** స.క్రి. పాడుచేయు. **తగులాట** రూ. తగులాటము. వి. 1. సంబంధం. వేమన. 3.84; 2. రతి సంబంధం. < తగులు + – ఆట. **తగులాటకత్తియ** రూ. చూ. తగులాటకత్తె. వి. సంగిని, జారిణి. **తగులాటకత్తె** రూ. తగులాటకత్తియ. వి. జారిణి, తగులాటం కలస్త్రీ. ఆం. భా. 2.110. **తగులాటకా(డు** వి. రతిసంబంధం కలవాడు, విటుడు, జారుడు. **తగులాటము** రూ.చూ. తగులాట. వి. 1. రతి సంబంధం. ఉ.రా. 7.470; 2. సంబంధం. **తగులాయము** విణ. సంబంధి, కావలసినవాడు. వేంక. పంచ. 1.640, తాళ్ల. సం. 11.3. భా. 133. **తగులుకొను** రూ. చూ. తగుల్కొను. స.క్రి. 1. అంటు, సోకు. దశా. 4.74; 2. వలచు, మోహించు. శుక. 1.328. అ.క్రి. 1. లగ్నమగు; 2. అంటుకొను. **తగులుకొలుపు** రూ. చూ. తవులుకొలుపు. స.క్రి. తగుల్కొనచేయు. **తగులుకొల్పు** రూ.చూ. తవులుకొలుపు. స.క్రి. తగుల్కొనచేయు. **తగులుకోలు** రూ. తగుల్కోలు, తవులుకోలు, తొలుకోలు. వి. తగులుకోటం. **తగులుగొండి** రూ.చూ. తవులుగొండి. వి. 1. తగులుకొనే స్వభావం కలవాడు; 2. తగులుకొనేది. **తగులుచు** రూ. తగుల్చు, తవులుచు, తొలుచు. స.క్రి. 1. కూర్చు, చిక్కుకొనచేయు, లగ్నంచేయు. భార. ద్రోణ. 3.201; 2. నిప్పు అంటించు, ముట్టించు. **తగులుడు** రూ. తవులుడు. వి. తగలటం. భార. శాంతి. 3.272. **తగులుదల** రూ.చూ. తవులుదల. వి. తగలటం. **తగులుపడు** రూ.చూ. తగుల్పడు. అ.క్రి. 1. తాకు. కాశీ. 1.133; 2. సక్తమగు. ఆసక్తినొందు. భాగ. 7.363; 3. అంటు, నాటు. పాండు. 3.158; 4. లభించు, దొరుకు. యయా. 4.77; 5. వశమగు. చిత్ర భా. 8.5; 6. ఆగు, నిరుద్ధమగు; 7. చిక్కుకొను. **తగులుపఱుచు** రూ. తవులుపఱుచు, తొలుపఱుచు. స.క్రి. 1. సక్తంచేయు. ప్రబోధ. 1.75; 2. లగ్నంచేయు. ఉ.రా. 2.163; 3. నిలుపు. అచ్చ. రా. యు. 438. **తగులుపాటు** రూ. తగులువాటు, తవులుపాటు, తొలుపాటు. వి. 1. తగులుబడి, వ్యయం; 2. సక్తమవటం; 3. చిక్కు; 4. అడ్డు; 5. దొరకటం. **తగులుబడి** రూ. తవులుబడి, తొలుబడి. వి. 1. పెట్టుబడి, వ్యయపరచడం, ఖర్చు; 2. అచ్చుకోవలసివచ్చిన ధనం. **తగులువడు(-పడు)** రూ.చూ. తగుల్పడు. అ.క్రి. 1. చిక్కుకొను, లగ్నమగు. హరి. ఉ. 5.80; 2. తాకు. కాశీ. 1.133; 3. అంటు, నాటు. పాండు. 3.157; 4. సక్తమగు. కళా. 7.92; 5. దొరుకు. ఆం. భా. 3.115; 6. అడ్డుకలదగు, ఆగు. **తగులువాటు (-పాటు)** రూ. చూ. తగులుపాటు. వి. 1. తగులుబడి, వ్యయం; 2. సక్తమవటం; 3. చిక్కు; 4. దొరకటం; 5. అడ్డు. **తగులువిడిబేరము** వి. దేనికదిగా ఎప్పటికప్పుడు అడిగితెచ్చుకో వలసిన బేరం. పాండు. 1.65. **తగులూడు** స.క్రి. 1. బంధం తొలగు. కళా. 4.150; 2. అనుబంధంతొలగు. < తగులు + ఊడు. **తగులైయుండు** అ.క్రి. సంబంధించిఉండు. తాళ్ల. సం. 9.17. < తగులు + ఐ + ఉండు. **తగులొనర్చు** అ.క్రి. సంబంధించు. రుక్మా. 3.77. < తగులు + ఒనర్చు. **తగుల్కొను** రూ. తగులుకొను, తవులుకొను, తవుల్కొను, తొలుకొను. అ.క్రి. లగ్నమగు. పారి. 5.79; స.క్రి. అ.క్రి. 1. అంటుకొను. కాళ. 2.98; 2. అంటు, సోకు; స.క్రి. 1. వలచు, మోహించు; 2. కాల్చు. **తగుల్కోలు** రూ. చూ. తగులుకోలు. వి. తగులుకోటం. **తగుల్చు** రూ. చూ. తగులుచు. స. క్రి. 1. నిప్పుముట్టించు, అంటించు. ఉ. హరి. 4.86; 2. కూర్చు. **తగుల్పడు** రూ. తగులుపడు, తగులువడు, తవులుపడు, తవులువడు, తవుల్పడు, తొలువడు. అ.క్రి. 1. ఆగు, నిరుద్ధమగు. హరి. ఉ. 10.282; 2. లగ్నమగు. చిక్కుకొను. రామా. 6.130; 3. పట్టువడు. వర. రా. ఆరణ్య. 141పు. 7పం.; 4. సక్తమగు; 5. దొరుకు; 6. అంటు, నాటు.

**తగులూడు** చూ. తగులు.

**తగులైయుండు** చూ. తగులు.

**తగులొనర్చు** చూ. తగులు.

**తగుల్కొను** చూ. తగులు.

**తగుల్కోలు** చూ. తగులు.

**తగుల్చు** చూ. తగులు.

**తగుల్పడు** చూ. తగులు.

**తగైరు** రూ. తగయిరి, తగయిరు, తగీరు. వి. బర్తరఫు, ఉద్యోగం పోవటం.

హిం. *తగయ్యూర్*, *తగీర్*. తొలగించటం, మార్పు; మరా. *తగిరీ*. మార్పు, తొలగించటం, ఉ. *తగయ్యూర్*, *తగీర్*. మార్పు, పరివర్తనం, తీసివేయటం; పార. *తగయ్యూర్*. తీసివేయటం, తొలగించటం; అర. *తగయ్యూర్*. మార్పు, పరివర్తనం.

< ఉ. తగీర్.

**తగ్గించు** చూ. తగ్గు[1].

**తగ్గింపు** చూ. తగ్గు[1].

**తగ్గు[1]** రూ. డగు[2]. అ.క్రి. 1. ఒరుగు, వాలు. భార. విరా. 4.87; 2. తక్కువగు. సు.శ. 103; 3. వెనుదీయు. శివరా. 4.83; 4. కృశించు, క్షీణించు. విప్ర. 2.53; 5. కుంగు కుంగబడు. కువ. చ. 4.207; 6. నశించు, పోవు; వి. 1. ఒదగటం, అవయవ సంకోచం. సుదంతా. 1.83; 2. తక్కువ, న్యూనత. ఆం. భా. 2.170; 3. క్షయస్థాన వృద్ధులలో ఒకటైన క్షయం. విణ. తగ్గిన. ప్రబంధ. 17.

క. *తగ్గు*, *తర్గు*, *తఱగు*. తక్కువగు, తగ్గిన, ముందుకు వంగు, క్షీణించు, ధరలోతగ్గుదల; తాళ్. తక్కువగు, కృశించు; తు. *తగ్గని*. అణకువగాఉండు, వంగు, ఒరుగు.

త. తాబి (తాబ-న్త్ -) ఒరుగు, తక్కువగాఉండు, కిందకి పడిపోవు, క్షీణించు, కుంగు, తగ్గు; మ. తాఴుక. మునుగు కిందకు వచ్చు, వంగు, తగ్గు; తాఴత్తుక. కిందకి దించు; కో. తగ్. పోట్లాటనుంచి వెనక్కితగ్గు; తొ. తొగ్. తగ్గించు, తోయ్-(తోస్-). తక్కువగాఉండు, కుఇ̆తాలి. చిన్నదైన, పరిమాణంలో తగ్గు; కువి. తలెని. కింద; కురు. తర్కా. నిశ్శబ్దం; మాల్తో. తార్. కిందకు పడు, నరుకు; బ్రా. దర్. కిందకుదిగు.

మూ.ద.ద్రా.* తఴున్క్-/ *తఴుక్క్-.

< మూ.ద్రా. తాఴ్.

**తగ్గించు** స.క్రి. తగ్గచేయు, కృశింపచేయు. పాండు. 5.186. **తగ్గింపు** వి. తగ్గుదల. శృం.నై. 3.41. **తగ్గుగుంజ** వి. కాలిగుంజ, నిట్రానికి చుట్టూగాని, పందిరిగుంజలకు పక్కనగాని, పాతిన పొట్టిగుంజ. **తగ్గుడు** రూ.చూ. తగుడు[2]. వి. పల్లం, దిగుడు. **తగ్గుదల** వి. తక్కువ. **తగ్గునేల** వి. పల్లం భూమి. నెల్లూరి శాసనాలు, కందుకూరు. 22. **తగ్గుపడు** అ.క్రి. **1**. కృశించు. చంద్రాంగ. 2.123; **2**. నశించు. హంస. 1.190. **తగ్గుమొగ్గు** వి. **1**. తక్కువ ఎక్కువ, హెచ్చు తగ్గులు. కళా. 3.266; **2**. సరాసరి, నగటు; **3**. డబ్బుకు ఇబ్బంది.

**తగ్గు**[2] రూ.చూ. తఴుగు[2]. స.క్రి. **1**. ఖండించు, కోయు. కు.సం. 11.193, పండి.చ. 4.245 పు.; **2**. తొలివేయు; వి. క్రయ విక్రయాల్లో మధ్యవర్తి తీసుకొనేడబ్బు; విణ. తరుగరి, కొనేవాడికి అమ్మేవాడికి వ్యవహారం కుదిర్చి డబ్బుతీసుకొనే వాడు.

**తంకర** వి. పొల్లు, గింజలేని ధాన్యం. ఆం.భా. 2.238.

**తంగ**[1] వి. **1**. చాదస్తం; **2**. వెర్రితనం.

హిం.ఉ. తంగ్. ఇబ్బంది.

**తంగ**[2] చూ. తుంగ. వి. కొండ కోనల్లోను, నల్లరేగడి నేలల్లోను చిట్టిపొదగా పెరిగే కలుపు మొక్క.

**తంగడు** రూ.చూ. తంగేడు[1]. వి. బొ. తంగేడు. సంపు. 5. శా.సం. 10.

**తంగరంచు** రూ.చూ. తంగెడంచు. వి. తగిరిసె, పొదగా పెరిగే ఒకరకం చెట్టు (Cassia tora or alata).

**తంగిడికంప** రూ.చూ. తంగెడికంప. వి. తంగేడు చెట్టు కంప.

**తంగిణ** చూ. తంగుడు. వి. ఒకరకం చెట్టు (Xylia dolabriformis).

**తంగు**[1] రూ.చూ. టంగు[1]. వి. గుర్రపుగంత జారిపోకుండ బిగగట్టేవారు, అశ్వమధ్యబంధం. ఆం.భా. 2.199.

**తంగువారు** రూ.చూ. తంగువాఱు. వి. తంగు, గుర్రం మీది గంత జారకుండ బిగకట్టేవారు, అశ్వమధ్యబంధం. **తంగువాఱు** రూ. తంగువారు, తంగోరు. వి. తంగు, గుర్రం మీది గంత జారకుండ బిగకట్టేవారు. **తంగోరు** రూ.చూ. తంగువాఱు. వి. బొడ్డువారు, ఎద్దులకు అలంకారంగా నడుం చుట్టూవేసే తోలుపట్టీ.

**తంగు**[2] అ.క్రి. ఆగు.

**తంగుడు**[1] రూ.చూ. తంగేడు[1]. వి. కొండకొనల్లో, నల్లరేగడి నేలల్లోను చిట్టి పొదగా పెరిగే కలుపు మొక్క.

**తంగుడు**[2] రూ. తంగేడు[2]. వి. మంచాలు మొ. తయారు చేయడానికి, గృహ నిర్మాణానికి ఉపయోగపడే కలపనిచ్చే కొండతంగేడు చెట్టు (Xylia dolabriformis).

**తంగుకారు** వి. కృష్ణా, కర్నూలు, కడప జిల్లాల్లోనూ కర్ణాటక చెంగల్పట్టు మొ. చోట్ల కొండల మీద పెరిగే ఒక చెట్టు.

**తంగెటిజున్ను** చూ తంగెడు.

**తంగెడంచు** చూ. తంగెడు.

**తంగెడాకు** చూ. తంగెడు.

**తంగెడికంప** చూ. తంగెడు.

**తంగెడు** రూ.చూ. తంగేడు[1]. వి.బొ. అనా. ఒకరకం చెట్టు. రసిక. 5.131 (Cassia auriculata).

**తంగెటిజున్ను** రూ.చూ. తంగేటిజున్ను. వి. అందుబాటులో ఉన్న అమూల్య వస్తువు. శివరా. 4.30. **తంగెడంచు** రూ. తంగరంచు. వి. తగిరిసె, పొదగా పెరిగే ఒకరకం చెట్టు (Cassia tora or alata). < తంగెడు + అంచు[3]. **తంగెడాకు** వి. తంగేటి గుల్మ పత్రం. ఆము. 6.71. < తంగెడు + ఆకు. **తంగెడికంప** రూ. తంగిడికంప. వి. తంగేడుచెట్టు కంప. **తంగెడుపొరక** రూ. తంగెడుబొరక. వి. తంగేడు చెట్టు కంప. **తంగెడుబొరక** రూ.చూ. తంగెడు పొరక. వి. తంగేడు చెట్టుకంప.

**తంగేటిజున్ను** చూ. తంగేడు[1].

**తంగేడు**[1] రూ. తంగడు, తంగుడు[1], తంగెడు, తంగేరు. వి. కొండకోనల్లోను నల్లరేగడి నేలల్లోను చిట్టిపొదగా పెరిగే కలుపు మొక్క, ఒకరకం చెట్టు. పచ్చని పూలుపూసే ఒక అందమైన మొక్క. కాళ. 3.110 (Cassia auriculata).

క. తంగేడి. ఒకరకం చెట్టు.

**తంగేటిజున్ను** రూ. తంగెటిజున్ను. వి. సులభంగా లభించేది. బసవ. 7.207. **తంగేడుగొరవంక** వి. తంగేడు పూవువలె పచ్చని రంగులో ఉండే గోరువంక. హంస. 3.12. **తంగేడుపురుగు** వి. పొగాకు మొక్క ఆకు తినే తెల్లటి, సన్నటి పురుగు.

**తంగేడు**[2] రూ.చూ. తంగుడు[2]. వి. మంచాలు మొ. చేయటానికి, గృహనిర్మాణానికి ఉపయోగపడే కొండతంగేడు చెట్టు (Xylia dolabriformis).

**తంగేరు** రూ.చూ. తంగేడు[1]. వి. పచ్చపూలు పూసే ఒక అందమైన మొక్క.

**తంగోరు** చూ. తంగు[1].

**తచ్చ** రూ.చూ. తచ్చన. వి. టక్కు, కపటం, జిత్తు. గౌ. హరి. ఉ. 154 పం.

**తచ్చసేయు(-చేయు)** రూ.చూ. తచ్చనసేయు. స.క్రి. మాయచేయు, మిషపెట్టు.

**తచ్చన** రూ. తచ్చ. వి. **1**. అసత్యం, కపటం, మోసం. రం.రా. ఆరణ్య. 151 పు. 16 పం.; **2**. గేలి, పరిహాసం, పరిహాసవచనం. కాళ. 4.30; **3**. సాకు; **4**. మోసం; క్రి.విణ.ద్రు. పరిహాసంగా. శృం.నై. 3.95; విణ. **1**. అసత్యమైన. శుక. 3.70; **2**. కృత్రిమమైన. ప్రబంధ. 78; **3**. కపటంతో కూడిన.

సం. తర్జన-. బెదిరించటం; ప్రా. తజ్జణ-. బెదిరించటం, తిరస్కారం; పా. తజ్జనా; అ. తాజ్నా. కఠినశిక్ష; గు. తాజ్ణొ. కొరడా.

<ప్రా. తజ్జణ-.

**తచ్చనగొండి(-కొండి)** వి. మోసకత్తె. చెన్నబసవ. 2.24. **తచ్చనచేయు** రూ.చూ. తచ్చనసేయు. స.క్రి. గేలిచేయు, పరిహసించు. **తచ్చనలాడు** అ.క్రి. సంచలించు. అష్టమ.క. 4.287 పు. 28 పం. స.క్రి. **1**. గేలిచేయు. విష్ణుమా. పూ. 3 ఆ; **2**. వంచించు, మోసపుచ్చు. **తచ్చనవాటు** వి. వేళాకోళపువేటు. శృం.నై. 3.95. **తచ్చనవినయములు** వి.బ.వ. దొంగ వినయాలు. వసు. 4.23. **తచ్చనసేయు(-చేయు)** రూ. తచ్చనచేయు. తచ్చసేయు. స.క్రి. గేలిచేయు, పరిహసించు. పాండు. 1.199. **తచ్చనాడ(బడు** అ.క్రి. మోసపుచ్చబడు. <తచ్చన+ ఆడు+-అ[7]+పడు. వేమన. 2.111. **తచ్చనాడు** స.క్రి. **1**. మోసగించు; **2**. గేలిచేయు.

**తచ్చనాడ(బడు** చూ. తచ్చన.

**తచ్చనాడు** చూ. తచ్చన.

**తచ్చాడు** చూ. తచ్చ. అ.క్రి. అటూ ఇటూ తిరుగు.

**తచ్చు** చూ. తఱచు. అ.క్రి. నేతకుంగు, నేత ఒక వైపున ఎక్కువ రెండో వైపున తక్కువ అగు.

**తచ్చుకట్టు** స.క్రి. పన్నెకట్టుబడిలో దండెల మధ్య ఈనెలు దగ్గర దగ్గరగా పెట్టి పుల్లల మధ్య సందులు తక్కువగా ఉండేటట్లు కట్టు. **తచ్చుడుజేయు(-చేయు)** స.క్రి. పడుగేరే కర్రల మీద పోగులు సర్దు, నెరుపు. **తచ్చుపోత** వి. ఆసుకు తక్కువనూలు పొయ్యటం.

**తజిబీజు** రూ. తజివీజు. వి. **1**. ఊహ, తలపు. చంద్రరే. 3.32; **2**. ఆజ్ఞ, ముదల.

హిం. తజ్‌వీజ్. సమ్మతి, అభిప్రాయం, నిర్ణయం; మరా. తజ్‌వీజ్, తస్వీజ్. ఉపాయం, యుక్తి; ఉ. తజ్వీజ్. సలహా, అభిప్రాయం, యోచన, ఉపాయం, ప్రయత్నం, నిర్ణయం; పార. తజ్‌వీజ్. సమ్మతి, విచారణం, అభిప్రాయం, తీర్పు, నిర్ణయం; అర. తజ్‌వీజ్. ఉద్దేశం, ఆలోచనం.

<అర. తజ్‌వీజ్.

**తజివీజు** రూ.చూ. తజిబీజు. వి. **1**. ఆజ్ఞ, ముదల. రంగా.చ. 2.39; **2**. అభిప్రాయం, తలంపు, ఊహ.

**తంజము** వి. సహాయం.

త. తంచమ్. సహాయం, ఆసరా, నిరాకరించు, గొప్పతనం.

<త. తంచమ్.

**తంజాపూరుసత్రము** వి. పనిలేని సోమరులంతా తిండికి చేరే సత్రం; వ్య. తంజాపూరుసత్రంలోకి ఎవరుప్రవేశించినా ఉచితంగా ఆహారం లభిస్తుంది. ఏపనీ చేయటానికి ఇచ్చగించనివారు కేవలం భోజనం కోసం ఇందులో చేరేవారు.

**తంజిరాయి** వి. డొలుపును మండిగానికి పట్టించే మేకు.

**తంజేల** వి. బండి ఇరుసును మండిగానికి రెండువైపుల బిగించి పట్టేమేకు.

**తటకా** వి. **1**. ఆశ్చర్యం; **2**. కలత, కంగారు; **3**. నిశ్చేష్టత.

ఒ. తట్‌కా. సంబంధం, తంటా; హిం. టట్‌కా, తట్‌కా. తాజా, కొత్త; మరా. తట్‌కా. సంబంధం, తంటా.

<ఒ. తట్‌కా.

**తటకాపడు** అ.క్రి. **1**. చేష్టలు దక్కు. రాధికా. 1.129; **2**. ఆశ్చర్యపడు. ఆం. భా. 3.101; **3**. కలతపడు, కంగారుపడు. ప్రబంధ. 536. **తటకాపాటు** వి. **1**. ఆశ్చర్యం. ఆం.భా. 1.132; **2**. నిశ్చేష్టత, నివ్వెరపాటు.

**తటంగి** వి. చప్పుడు చేసి జంతువులను బెదరగొట్టటానికి బొంగు చీల్చి కట్టిన యంత్రం.

**తటతట** వి. **1**. గుండె మొదలైనవి అదిరేటప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం. భార. విరా. 4.80; **2**. బాధ, భయం మొ॥ వాటివల్ల కాళ్ళు, రెక్కలు మొదలైనవి కొట్టుకోవటంలో అయ్యేధ్వనికి అనుకరణం. ప్రభా. 3.126; **3**. గాలి వేగంగా విసరటంలో అయ్యేధ్వనికి అనుకరణం. శేషధ. 1 ఆ; **4**. వడగళ్ళు మొదలైనవి పడేటప్పుడయ్యేధ్వనికి అనుకరణం. హంస. 4.221.

త. తటతట. తడబడు.

**తటతట(దాకు** అ.క్రి. బాధపడు, తాపంపొందు. శ్రీరం. మా. 3.617. **తటతటపడు** అ.క్రి. బాధపడు. వైజ. 2.146.

**తటపటాయించు** అ.క్రి. వెనుక ముందులు ఆలోచించు.

త. తటవు. సంకోచించు, వెనుకాడు; తట-తట-. తడబడు.

**తటపెట** వి. తుడుం మొదలైన వాద్యాల ధ్వనికి అనుకరణం. క్రీడా. 225.

**తటమట** రూ. తటవట. విశ. కలతపొందిన. నృసింహ. 4.192; వి. **1**. మోసం. రాధికా. 2.134; **2**. కలత; **3**. అసత్యం.

క. తట-వట. మోసం, కల్ల; తాట్టోటమ్ తాట్టోటు, తటుమాఱ్ఱం. మోసం, వంచన, కల్ల.

**తటమటించు** స.క్రి. **1**. కలచు. భాగ. 4.746; **2**. మోసగించు, వంచించు, గౌ. హరి. ఉ.164పం.

**తటమటించు** చూ. తటమట.

**తటవట** రూ.చూ. తటమట. వి. **1**. మోసం, వంచన. కృష్ణశ. 71; **2**. కల్ల. ఆం.భా. 1.119; విశ. **1**. వంచకమయిన. ద్వి.సా.చ. 2.64పు. 4పం; **2**. కలత పొందిన.

**తటవటచేయు** స.క్రి. మోసగించు. దశా. 2.382.

**తటస్థపడు** అ.క్రి. ఎదురుపడు.

సం. తటస్థ-. ఒడ్డునఉన్న, ఏ పక్షంలోనూ చేరక ఉన్న.

<సం. తటస్థ-+ పడు (అర్థవిపరి.).

**తటస్థమగు** అ.క్రి. ఎదురుపడు.

సం. తటస్థ-. ఒడ్డునఉన్న, ఏ పక్షంలోనూ చేరక

ఉన్న.

<సం. తటస్థ-+-ము+అగు (అర్థవిపరి.).

**తటస్థించు** అ.క్రి. కలుగు, సంభవించు. హర. 3.85.

సం. తటస్థ-. ఒడ్డునున్న, ఏ పక్షంలోనూ చేరని.

<సం. తటస్థ-+-ఇంచు[3] (అర్థవిపరి.).

**తటాకమగు** అ.క్రి. పూర్తిగా నిండు.

సం. తటాక-. చెరువు.

<సం. తటాక-+-ము + అగు.

**తటాకించు** అ.క్రి. చొచ్చు, ప్రవేశించు. ఆం.భా. 3.122.

సం. తటాక-. చెరువు.

<సం. తటాక-+-ఇంచు[3] (అర్థవిపరి.).

**తటాన** రూ. తటాలున, తటాల్న. క్రి.విశే.ద్రు. **1.** ఆకస్మికంగా. రామా. 8.123 ; **2.** శీఘ్రంగా. కకుత్స. 3.106.

క. తట్టనే. శీఘ్రంగా.

**తటాయించు** అ.క్రి. **1.** దూసుకొనిపోవు, తూలివెలికిపోవు. భోజను. 3.116 ; **2.** సమమైన మట్టంలో ఉండు ; **3.** నాటు ; స.క్రి. అడ్డగించు, నివారించు. ఆం.భా. 3.120, సాంబ. మాన. 27.

క. తటాయిసు. అడ్డగించు, నివారించు.

**తటారించు** అ.క్రి. **1.** చచ్చు. ఆం.భా. 3.122; **2.** స్పృశించు, తాకు. బలరా. 4.117.

**తటాలు** వి. **1.** ఆకస్మికంగా సంభవించటంలో అయ్యే అనుకరణం. హర. 2.25 ; **2.** గుండె అదరటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. జైమిని భా. 6.13.

**తటాలున** రూ.చూ. తటాన. క్రి.విశే.ద్రు. **1.** ఆకస్మికంగా. వసు. 2.84 ; **2.** శీఘ్రంగా, వెంటనే. విజయ. 2.19.

**తటాల్న** రూ.చూ. తటాన. క్రి.విశే.ద్రు. **1.** శీఘ్రంగా. వెంటనే. వైజ. 3.53 ; **2.** ఆకస్మికంగా.

**తటుకు** విశే. తటుకుమనే ధ్వనిగల, బిగిసడలిన. వేమన. 2.244.

**తటుకున** రూ. తటుక్కున, దడుగ్గున. క్రి.విశే.ద్రు. **1.** అనాలోచితంగా. కాశీ. 2.111 ; **2.** అవలీలగా. జైమిని భా. 4.107 ; **3.** అతిశీఘ్రంగా. ద్వి.హరిశ్చ. పూ. 556 పం. ; **4.** ఆకస్మికంగా, హఠాత్తుగా. మను. 5.81.

క. తటుక్కనె. శీఘ్రంగా, ఆకస్మికంగా ; తటారనె. ఒక్కసారిగా, శీఘ్రంగా ; తట్టనె, తొట్టనె, తొట్టెనె, తొట్టగె. ఒక్కసారిగా, శీఘ్రంగా, ఆకస్మికంగా ; తు. తట్టనె, తటానె, తటుక్క. వేగంగా, తొందరగా, ఆకస్మికంగా ; తట్టుప్ప, తటుప్ప. హఠాత్తుగా.

పో.చూ. త. చటుక్కెనల్.

**తటుక్కున** రూ.చూ. తటుకున. క్రి.విశే.ద్రు. శీఘ్రంగా. భీమ. 6.65.

**తటుక్కుమని** చూ. తటుకున. అవ్య. వెంటనే, అకస్మాత్తుగా.

**తట్ట[1]** రూ. తట్టం, తట్టి[2], తట్టె. వి. **1.** పళ్ళెం, తబుకు, భోజనపాత్ర. ఆం.భా. 2.244, శశా. 3.5 ; **2.** వెదురుబద్దలు పేముతీగలు మొ. వాటితో అల్లిన సిబ్బి, పల్లెక.

క. తట్టె. వెదురుగంప, పళ్ళెం ; కొడ. తట్టె. తమలపాకుల పళ్ళెం ; తు. తట్టుగ. అన్నం వడ్డించే వెడల్పు పాత్ర ; త. తట్టమ్. చిన్నగిన్నె, భోజనపాత్ర.

**తట్టకొమ్ము** వి. వేటసాధనాల్లో ఒకటి. రుక్మా. 3.70. **తట్టగిల్లు** అ.క్రి. తట్ట అగు. **తట్టగోలెం** వి. పశువులకు దానా పెట్టే మట్టితొట్టి. **తట్టతగులవేయు** స.క్రి. సంబంధాన్ని పూర్తిగా తెంచుకొను. **తట్టపాగ** వి. తట్టలాగ ఎత్తుగా విశాలంగా చుట్టిన తలపాగ. చెన్నబసవ. 2.206. **తట్టపుటికె** వి. ఈతపేళ్ళబుట్ట. **తట్టమీఱుగు** అ.క్రి. అత్యధికమగు. ఆం.భా. 3.101. **తట్టిల్లు** వి. నిట్టాడిమీద చచ్చౌకంగా కట్టిన గడ్డికప్పుగల ఇల్లు. <తట్ట[1]+ఇల్లు.

**తట్ట[2]** చూ. చట్టము[4]. వి. **1.** బండి అడ్డ లేక డొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చట్రం ; **2.** గింజపట్టని తోలుకాయ ; **3.** నూరు తమలపాకుల బొత్తి ; **4.** వేరుసెనగ మొ. వాటి కొమ్మలకు పుట్టి నేలలో పాతుకొనే వేరు.

**తట్టకర్ర** వి. పరం, బండి అడ్డలేక డొలుపుమీద వేసిన నిలువు అడ్డపట్టెల చట్రం. **తట్టకాయ** వి. కంది, పెసర మొ॥ వాటి తెగులు.

**తట్టం** రూ.చూ. తట్ట[1]. వి. వెదురు మొదలైన వాటితో అల్లిన పెద్దబుట్ట.

**తట్టము[1]** వి. శ్రమ, బాధ. కు.సం. 12.172.

క. తట్టు.

**తట్టము[2]** రూ. చట్టము[1]. వి. **1.** ఎండిపోయిన చర్మం. కాశీ. 6.44 ; **2.** ఉప్పుకూరి ఎండపెట్టి నిలవచేసిన పెద్దచేప. రుక్మా. 3.6.

**తట్టర్చు** చూ. తట్ట[1]. స.క్రి. కుండల్ని నర్సేటప్పుడు తేమను సలపకు అద్దుకొంటూ కొట్టు.

**తట్టన** వి. ధైర్యం. ఉ.హరి. 3.123.

**తట్టాడు** చూ. తట్టు[1].

**తట్టాడుచిట్టాడు** చూ. తట్టు[1].

**తట్టాయి** వి. కలబంద, నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పూగల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచులో వాడిముళ్ళూ ఉండి నారగా ఉపయోగపడే మొక్క (Aloe barbadensis).

**తట్టి[1]** వి. **1.** వేటతెర, అడ్డువల. నిర్వ.రా. 5.100 ; **2.** పొలం చుట్టూ పెద్దరాళ్ళతో కట్టిన గోడ.

క. తట్టి. గోనెగుడ్డ, బౌద్ధ జైన సన్యాసులు ధరించే అంగీ ; తట్టివలె. ఒకరకం వల : త. తట్టు.

సం. తరపట్టు-(?) ; దేశీ. తరవట్టు-(?) ; మరా. తరటు. గోనెగుడ్డ.

**తట్టి[2]** రూ.చూ. తట్ట[1]. వి. **1.** కంచం. ఆం. నా. నం. మాన 30 ; **2.** వెదురు మొ. వాటితో అల్లిన బుట్ట.

**తట్టి[3]** రూ.చూ. తొట్టు[3]. వి. చెక్కపెట్టెకు రెండు వైపులా బొంగులు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం.

**తట్టింపుబల్ల** రూ.చూ. దట్టింపుబల్ల. వి. గెట్టించుసలప.

**తట్టిల్లు** చూ. తట్ట[1].

**తట్టివేయు** చూ. తట్టు[1].

**తట్టు**[1] రూ. త్రట్టు. స.క్రి. 1. చేతితో మెల్లగా కొట్టు. కు.సం. 10.68 ; 2. కొట్టు. కు.సం. 12.172 ; 3. నిలువుకొను. మార్క. 1.163 ; 4. వాయించు. భాగ. 10 స్కం. ఉ. 883 ; 5. విడుచు. పార్వ. 4.42, వాల్మీ. 2.129 ; 6. చేరు. అచలా. 1.72 ; 7. తోయు. పార్వ. 4.42 ; 8. తప్పించుకొను. రాజ.వి. 3.64 ; 9. ఇది కొన్ని క్రియల తుమున్నంతరూపంగా ప్రయుక్తమై ఆ ఆధాతువుల ప్రేరణార్థం ఇస్తుంది. ఉదా. : పోపఁదట్టు; వి. 1. చరచటం, కొట్టటం మొ॥ వాటివల్ల చర్మం పొంగటం. విజ్ఞా.ప్రా. 51 ; 2. నిర్బంధం. కాశీ. 6.221 ; 3. పొంగు. చర్మరోగ విశేషం, ఒక విధం అయిన స్ఫోటకం; అ.క్రి. 1. కరుగు. ఆము. 2.16 ; 2. కలుగు, సంభవించు. వసు. 2.140 ; 3. స్ఫురించు, తోచు. హంస. 2.127 ; 4. గట్టిగా తాకు.

క. తట్టు. మెల్లగాకొట్టు, తాకు, కొట్టు, తోలు, మనసు కరగించే, చరుపు, చదును ; తాటు. ఎదురుగా కొట్టు, తాకు ; తు. తట్టుని. కొట్టు ; త. తట్టు. కొట్టు, మెల్లగా కొట్టు, డోలుకొట్టు ; మ. తట్టుక. కొట్టు, మెల్లగా కొట్టు ; తట్టు. దెబ్బ ; తటుక్కుక. ఎదురుగా కొట్టు ; కోట. తట్ (తచ్-)-తట్టు. అరచేతితో కొట్టు ; కుఇ. తప్పా. సమం తగ్గించటం ; కువి. తస్స. చరుపు ; కుర్. తర్. కొట్టు, కొరడాతో కొట్టు ; మాల్తొ. తర్బ. చరుపు.

సం. తడ్. కొట్టు ; ప్రా. తాళ-. సంగీతతాళం.

<మూ.ద్రా. తట్.

**తట్టాడు** అ.క్రి. 1. తప్పటడుగులు వేయు. కు.సం. 3.33 ; 2. ఇటూఅటూ తిరుగు. బసవ. 2.57 పం. ; 3. అడుగులు అటూఇటూ వేయు. నృసింహ. 3.147 ; 4. వీచు, ప్రసరించు. ఉ.హరి. 1.123 ; 5. కంపించు, చలించు. ప్రభు. 2.52 పు. 14 పం. < తట్టు[1] + ఆడు. **తట్టాడుచిట్టాడు** అ.క్రి. గబగబా అడుగులు వేయు. ఉ.హరి. 1.150. **తట్టివేయు** స.క్రి. 1. తట్టు, వెనుకకు గెంటు. పార్వ. 2.217 ; 2. అపహరించు. **తట్టుకొను** అ.క్రి. 1. నడిచేటప్పుడు కాలికి రాయి మొ॥నవి ఎదురు తగులు ; 2. బాగుపడు. స.క్రి. ఒక చేత్తో రాయి, మరొకచేత్తో సలపను పట్టుకొని మట్టి పాత్రల్ని సాగగొట్టు. **తట్టుకొయ్య** రూ. తట్టుడుకొయ్య. వి. 1. గుంజుడుకొయ్య, మిడిగూటానికి వేసిన నేతమోకు, పడుగుకు అడ్డురాకుండా తగిలించటానికి పాతిన గూటం ; 2. ఆరుదలకు వచ్చినపాటిని సర్వే సుత్తెలాంటి కొయ్య పరికరం. **తట్టుగట్టు(-కట్టు)** అ.క్రి. చరచడం, కొట్టడం మొ. వాటిచే చర్మం పొంగు. **తట్టుగాలి**[1] వి. 1. కోపం ; 2. చిరాకు ; 3. వినాశకాలం. **తట్టుచేయి** వి. కోటకొమ్మమీది అవయవ విశేషం. రం.రా.యు. 281 పు. 3 పం. **తట్టుడుకొయ్య** రూ.చూ. తట్టుకొయ్య. వి. 1. గుంజుడుకొయ్య, మిడిగూటానికి వేసిన నేత మోకు, పడుగుకు అడ్డురాకుండా పాతిన గూటం ; 2. ఆరుదలకు వచ్చినవాటిని సర్వే సుత్తిలాంటి కొయ్య పరికరం. **తట్టుడుపలక** వి. ఆకుకప్పుమీద మిట్టపల్లాలు సరిచేసే కొయ్య సాధనం. **తట్టుడులిక్కి** వి. ఒకరకం లిక్కి, గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసే పరికరం. **తట్టుతగులు** అ.క్రి. అడ్డుతగులు. **తట్టుపునుఁగు** రూ. తట్టుపున్గు. వి. పూతిపునుగు. రం.రా.బాల. 64 పు. 14 పం.; త. తట్టుప్పానుపూ. పూతిపునుగు. **తట్టుపున్గు** రూ.చూ. తట్టుపునుఁగు. వి. పూతిపునుగు. **తట్టుపులుఁగు** వి. గరుత్మంతుడు. తాళ్ల. సం. 12.197. **తట్టుపోయు** అ.క్రి. ఒకరకం మశూచికం వచ్చు, పొంగుచూపు. **తట్టుబిగువు** వి. నాగవాసాన్ని బిగించిపట్టే వాసం. **తట్టుముట్టు**[1] వి. పనిముట్టు, గృహోపకరణం. **తట్టువడు(-పడు)** అ.క్రి. 1. డీలుపడు, నిస్సత్త్వమగు. మను. 4.37 ; 2. వెనుకబడు, ఆగు. తాళ్ల. సం. 6.27 ; 3. సక్తమగు, తగులు, చిక్కుకొను. వసు. 2.140.

**తట్టు**[2] వి. 1. వైపు, పక్క. అచలా. 1.37 ; 2. తీరం, ఏటి ఒడ్డు. ఆం.భా. 1.155 ; 3. దిక్కు. హంస. 1.183 ; 4. కిటికీలోని పైరెక్కా కిందిరెక్కా కలిసేచోట పట్టెల్లో తీసిన గాడి ; 5. బాల్కనీ ; 6. రాతిస్తంభపు గద్దెమీద అర్ధచంద్రాకారపు గుంటగా మలచిన భాగం.

క. తట్టు. తీరం ; త. తట్టు. తీరం.

సం. తట-. తీరం. ఒడ్డు.

**తట్టుకట్టు** వి. సరైన కట్టుబడి. **తట్టుగట్టు-(కట్టు)** స.క్రి. మూసను కట్టు. **తట్టుగాలి**[2] వి. పక్కగాలి. **తట్టుగూటం** వి. బలపట్టెగూటం, ఉన్నిమగ్గం తాడు బిగింపుకు, అడ్డదారి పక్కన నేలలో పాతిన గూటం. **తట్టుదర్వాజా** వి. తలుపు పట్టేటంత మందంలో తీసిన గాడిగల దర్వాజా. **తట్టువడు** అ.క్రి. గట్టుపడు, బట్టలో కొంత చిక్కగా నేసినప్పుడు మిగిలిన నేతలో తేడావచ్చు. **తట్టుముట్టాడు** అ.క్రి. నిండుకొను, పెల్లగు, అతిశయించు. భాగ. 10 ఉ. 966, ద్విప. భా. కల్యా. పు. 138. **తట్టుముట్టు**[2] అ.క్రి. అపారమగు. **తట్టుముట్టుపడు** అ.క్రి. తొట్రుపడు. తాళ్ల.సం. 11.131. **తట్టురాయి** రూ. తట్రాయి. వి. కట్టుబడిచేసేటప్పుడు సమయానికి అందుబాటులో ఉన్న రాయి, ఇటుక. **తట్టువాలు(-పాలు)** అ.క్రి. వెనుదీయు, వెనక్కి మరలు. క్రీడా. 230. **తట్టువిఱుగఁబండు(-పండు)** అ.క్రి. అధికంగా పండు, పక్కకు ఒరిగేటట్లు పండు. **తట్టువిఱుగు** అ.క్రి. ఎక్కువగు. **తట్టూర్చిపోవు** అ.క్రి. నిండుకొను, అతిశయించు. కు.సం. 9.247. < తట్టు[2] + ఊర్చు + పోవు. **తట్టూర్చు** అ.క్రి. ఎక్కువగు. **తట్టొరగు** రూ.చూ. తట్టొఱగు. అ.క్రి. ఒకవైపుకు ఒరుగు, పక్కకు వంగు. చంపూరా. 5.29. < తట్టు[2] + ఒరగు. **తట్టొఱగు** రూ. తట్టొరగు. అ.క్రి. ఒకవైపుకు ఒరగు. పక్కకు వాలు. < తట్టు[2] + ఒఱగు. విప్ర. 2.14. **తట్రాయి** రూ.చూ. తట్టురాయి. వి. కట్టుబడి చేసేటప్పుడు సమయానికి అందుబాటులో ఉన్న రాయి, ఇటిక.

**తట్టు**[3] వి. నులి, చిక్కుపడ్డ పోగు.

**తట్టు**[4] రూ.చూ. తట్టువ[1]. వి. నీచజాతి గుర్రం. వేణు.శ. 20, రామలిం.శ. 67.

**తట్టు**[5] వి. శబ్దదోషాల్లో ఒకటి. భల్లా. 1.

**తట్టుడు** చూ. తట్టు[3]. వి. గుంటక తోలేటప్పుడు పలుగుకు చుట్టుకున్న గడ్డీగాదం.

**తట్టువ**[1] రూ. టట్టువ, తట్టు[4], తట్టువము. వి. 1. నీచజాతి గుర్రం. ఘటికా. 2.207 ; 2. గుర్రం, అశ్వం. అచ్చ.

రా.యు. 169 ; 3. వాహనం ; 4. పొట్టిగుర్రం.

హిం. టట్టూ. పొట్టిగుర్రం, రింగణా; గు. టట్టూ. పొట్టి గుర్రం ; మరా. తట్టూ. నీచజాతి అశ్వం, పొట్టిగుర్రం.

త. తట్టు.

< మరా. తట్టూ.

**తట్టువ**[2] వి. కిందపరుచుకునే పట్ట.

**తట్టువము** రూ.చూ. తట్టువ[1]. వి. 1. వాహనం. అచ్చ. రా. బాల. 37 ; 2. నీచజాతి గుర్రం ; 3. గుర్రం.

**తట్టూర్చిపోవు** చూ. తట్టు[2].

**తట్టూర్చు** చూ. తట్టు[2].

**తట్టె** రూ.చూ. తట్ట[1]. వి. వెదురుబద్దలతో అల్లిన తడిక.

**తట్టెపాకు** వి. తగిరిసె, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క.

**తట్టొరగు** చూ. తట్టు[2].

**తట్టొఱగు** చూ. తట్టు[2].

**తట్ర** వి. బంగారంపనిచేసి జీవించే జాతి.

త.మ. తట్టాన్. కంసాలి.

సం. త్వష్టా. కంసాలి.

**తట్రది** వి. బంగారంపనిజేసి జీవించేజాతి స్త్రీ. **తట్రవాడు** విఃణ. బంగారంపనిచేసి జీవించే జాతివాడు.

**తట్రాయి** చూ. తట్టు[2].

**తట్రు** వి. వాలుగాఉన్న ఆకుకప్పు.

**తట్లు** వి.బ.వ. గోనెపట్టలు, గోతాంనంచులు.

**తట్లుచీరు** స.క్రి. చిక్కుపడ్డ పోగులు విడదీయు.

**తడ**[1] వి. 1. ఎడ, పట్టు. యయా. 5.113 ; 2. అడ్డు, ఆటంకం, నిరోధం. సమీర.వి. 1.175 ; 3. దూరం. చంద్రికా. 3.88 ; 4. నిర్మోకం, కూనం. దశా. 4.6 ; 5. తొట్రుపాటు.

క. తడ, తడె. అడ్డు, ఆటంకం, నిరోధం, నిలుపుదల ; కొడ. తడె. నిరోధింపబడిన ; తు. తడవు. నిలుపుదల. అడ్డు, ఆటంకం ; తడెవు. అడ్డు, ఆటంకం ; తడెపావుని. అడ్డు, నిరోధించు ; తడెపిని, తడెపుని. నిరోధించు, ఆపు, అడ్డగించు ; తడెప్పు. అడ్డు ; తడెయుని, తడెవుని. నిలుచు, వెనుకఉండు, సహించు, ఓర్చు ; త. తటు, తటై. అడ్డు, నిరోధం, నిషేధం, ఆటంకం ; తటుక్కు. ఆటంకం ; తడై ; మ. తట. అడ్డగించు, ఎదిరించు ; కో. తర్వ్. అడ్డగించు ; తొ. తర్ఫ్. నిరోధించు ; కురు. తండ్‌నా. నిరోధం, అడ్డు.

**తడకట్టు** విఃణ. 1. స్తంభింపజేసేది, నిరోధించేది. వసు. 5.36 ; 2. అధిక్షేపించేది, పారద్రోలేది. **తడకాలు** రూ. తడగాలు. వి. 1. మల్లబంధాల్లో ఒకటి. ఆం.భా. 2.209 ; 2. వణికేకాలు. **తడకాళ్లపడు** రూ. తడకాళ్లువడు. అ.క్రి. కాళ్ళువణకు. వసు. 1.46. **తడకాళ్లపడు (-వడు)** రూ.చూ. తడకాళ్లపడు. అ.క్రి. కాళ్ళువణుకు. **తడగాలు (-కాలు)** రూ.చూ. తడకాలు. వి. 1. మల్లబంధ విశేషం ; 2. వణికే కాలు. **తడపెట్టు** స.క్రి. తడబరచు, తారుమారుచేయు. హరి. ఉ. 3.8. క. తడెయిడు. తారుమారుచేయు ; త. తడైప్పడుత్తు. **తడమాటము** వి. తత్తరపాటు, గాబరా, తబ్బిబ్బు; తు. తడమాట. తడబాటు ; త. తటుమాఱ్ఱు, తటుమాఱ్ఱమ్. తత్తరపాటు, సంభ్రమం, సంకోచం, భయం. **తడ(బడు (-వడు)** అ.క్రి. 1. క్షోభించు, కళవళపడు. భార.ఆది. 2.214 ; 2. ఒకదానితో ఒకటి కొట్టుకొను. భార.ఆది. 5.166 ; 3. తొట్రువడు. భార. విరా. 5.402 ; 4. తప్పు, తారుమారగు, వ్యత్యస్తమగు. భార.భీష్మ. 3.351 ; 5. వెనుదీయు, కొంకు. రం.రా. 2.215, ఉ.రా. 2.101 ; 6. ఏకమగు. హరి.ఉ. 7.54 ; 7. ఒకదానిని ఒకటి మించు. భీమ. 1.40 ; 8. చలించు, కంపించు. ఆము. 1.56 ; 9. పొరపడు, ప్రమాదపడు. కళా. 3.176 ; 10. తారుమారు. కళా. 5.92. **తడ(బఱచు (-వఱచు)** రూ. తడ(బఱుచు. స.క్రి. 1. తారుమారుచేయు, మార్చు. విజ్ఞా.ప్రా. 61 ; 2. బాధించు, క్షోభపెట్టు. కళా. 7.224. **తడ(బఱుచు (-వఱుచు)** రూ.చూ. తడ(బఱచు. స.క్రి. 1. తారుమారుచేయు, మార్చు. కళా. 5.92 ; 2. కలత పొందించు, క్షోభపెట్టు. **తడ(బాటు (-పాటు)** రూ. తడవాటు. వి. 1. విభ్రమం. నిర్వ.రా. 8.53 ; 2. కష్టం, బాధ. హరి.ఉ. 6.93 ; 3. వ్యత్యయం, తారుమారు. శివరా. 4.56 ; 4. పొరపాటు. మను. 4.52 ; 5. తొట్రుపాటు, తబ్బిబ్బు. పారి. 1.101 ; 6. చలనం. విప్ర. 1.68. త. తడపడత్తల్. తడబాటు. **తడవాటు (-పాటు)** రూ.చూ. తడ(బాటు. వి. అడ్డం, నిరోధం. ద్వి.హరిశ్చ. పూ. 290 పం. త. తటై. నిరోధం. **తడవాటువన్ను (-పన్ను)** స.క్రి. మాటలతో వలపన్ను. ద్వి.హరిశ్చ. పూ. 204 పం.

**తడ**[2] వి. 1. ధన్వం (వృక్షవిశేషం) లోలగుచెట్టు, వాసాలకు, కావడిబద్దలకు, బల్లేలకు, బరిసెలకు పనికివచ్చే గట్టికలప నిచ్చే చెట్టు. హంస.4.11. (pterospermum subrifolium) ; 2. వామి కట్టుబడిలో అడుగుభాగం.

క. తడె. వృక్షవిశేషం ; త. తటై.

**తడవిల్లు** వి. తడబద్దలతో చేసిన విల్లు. భార.ఆరణ్య. 1.300. **తడాకు** వి. దుకాణాల్లో తినుబండారాలు కట్టడానికి, క్రయవిక్ర చేయడానికి వాడే ఆకు, ధనుర్వృక్షం ఆకు. < తడ[2] + ఆకు.

**తడ**[3] వి. అడవుల్లో పెరిగే ఇంధనంగా ఉపయోగించే మొక్క (Helicteres isora).

**తడక** రూ. తడిక[1], తడికి, తడికె, తడుకు, తడ్క, తరక[2]. వి. 1. తడకలాగ నిస్సారంగాను శిథిలంగాను ఉన్న వస్తువు. జైమిని భా. 7.197 ; 2. బిగిలేని వాక్యరచన. ప్రబంధ. 21 ; 3. వెదురుబద్దలు, కొబ్బరి, తాడి మొ. వాటి ఆకులతో అల్లి, తలుపు మొ. వాటిలా ఉపయోగించబడే సాధనం. వేణు శ. 93 ; 4. చెక్కడపు పనిచేసిన రంధ్రాలున్న పిట్టగోడ ; 5. డాబీకోలలు లేపటానికి గొలుసు మాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం.

క. తట్టి. వెదురుచాప ; తడకు, తడికె, తడుక్కు. వెదురుచట్రం ; తట్టి. బెత్తుచాప, వెదురుచాప ; తట్టు. తెర, చాటు ; తటుక్కు. చాప ; మ. తట్టి. తలుపుగా ఉపయోగించే తడికె; కోలా. తడ్క. గడ్డి, వెదురు మొ. వాటితో అల్లినవి. పో.చూ. ప్రా. టట్టి.

**తడకకట్టు** స.క్రి. అధిక్షేపించు, హేళనచేయు. **తడక తలుపు** రూ. తడికతలుపు. వి. వెదురుబద్దలతో అల్లిన తలుపు. **తడకద్రోపరి (-త్రోపరి)** రూ. తడికద్రోపరి. వి. తలుపు బద్దలుకొట్టి లోపల ప్రవేశించే దొంగ. వేంక.పంచ. 4.240. **తడకద్రోపు (-త్రోపు)** వి. తడక బద్దలుకొట్టి లోపల ప్రవేశించే దొంగ. **తడకపింజెర** వి. ఒకరకం డాబీ. **తడకలుకట్టు** స.క్రి. అధిక్షేపించు, హేళనచేయు. **తడకలు త్రోయు** అ.క్రి. **1**. వ్యభిచరించు ; **2**. కట్టుతప్పి ప్రవర్తించు. **తడకవిప్పుకొను** అ.క్రి. చాటుమాటు లేకుండా ఉండు. **తడకవెట్టు (-పెట్టు)** అ.క్రి. పారద్రోలు. వేణు.శ. 63. **తడకార్చి** వి. మట్టమార్చి, పైభాగం బల్లపరువుగా ఉండే అర్చి. < తడక + ఆర్చి.

**తడకచువ్వ** రూ.చూ. తడికచువ్వ. వి. ఉత్తరసర్కారుల్లో, దక్కను, కర్ణాటక అడవుల్లో పెరిగే ఒక చిన్న చెట్టు (Grewiapilosa).

**తడకార్చి** చూ. తడక.

**తడగము** రూ. తణగము, తణగాము. వి. పక్కాలి, ఎద్దు మీది నుంచి నీళ్ళు తెచ్చే తోలుసంచి. గౌ. హరిశ్చ. ఉ. 1956 పం.

సం. తృణక-. తోలుసంచి ; ప్రా. తణగ-. తృణసం బంధమైనది ; అ.మా. తణగ-.

< ప్రా. తణగ-.

**తడజాన** వి. బండిభాగాల తయారీకి ఉపయోగపడేచెట్టు (Grewiatiliaefolia).

**తడప** రూ. తరప. వి. **1**. త్వక్కు, పట్ట. ఆం.భా. 2.37 ; **2**. తాటికమ్మ మొ॥వాని నుండి తీసేనార ; **3**. పేననినార ; **4**. సారెలోపల పెండెకట్టుకు వాడేనార.

త. తడల్. నార.

**తడపగొట్టు(-కొట్టు[1])** స.క్రి. తడిసేటట్లుచేయు. **తడపచుట్టు** వి. తాటితోకట్టిక కట్టు. **తడపరాయి** వి. సర్సేటప్పుడు సల పను తడిచేసుకోడానికి తడిబట్ట పెట్టుకొనేరాయి.

**తడము** రూ. తడవు[1], తడుము, తాడు[2]. స.క్రి. **1**. నిమురు. కు.సం. 5.144 ; **2**. రక్షించు. భార. విరా. 2.214.

క. తడవు. నిమురు, తడ. తాకటం, తడమటం ; త. తటవు, తడవు. దెబ్బకొట్టు, దేవులాడు ; మ. తటవుక. దెబ్బకొట్టు, తట్టు ; కో. తర్క్. వెదకు ; కుఇ. దహ్పా. వెదకు, కోరిక, అపేక్షించటం,

మూ.ద.ద్రా. *తటవ్-, మూ.ద్రా. *తట్-. *తటవు. < *తవటు (వర్ణవ్యత్యయం).

పో.చూ.మ. తప్పక. తడుము, అక్కడక్కడ తట్టు.

**తడయక** చూ. తడయు.

**తడయు** అ.క్రి. **1**. ఆలస్యంచేయు, జాగుచేయు. భార. ఆది. 2.83, 6.161 ; **2**. ఆలస్యమగు. భార. ఆది. 4.102 ; **3**. వసించు. భార. మౌసల. 197.

క. తడె. ఆలసించు, నిలుపు, అడ్డగించు, ఆపివేయు, ఆటంకం ; తడె. నిలుపు, ఆలస్యం ; తళువు, తళ్వు. ఆలస్యంచేయు, నిలుపు, ఆలస్యం ; తడ. ఆలస్యం, ఆటం కం ; తు. తడెయుని, తడెవుని. నిలుపు, నిలబడు ; తడెపుని. పట్టుకొను, అడ్డగించు ; తడెవు. నిలుపు. ఆటంకం ; తడవు. ఆలస్యం, ఆటంకం ; తటు. ఆపివేయు, ఆటంకం ; తట్టు. ఆటంకపర్చు, అడ్డగించు ; తడె. అడ్డగించు, నిలుపు, ఆటంకం, తళ్ (తడ్డ్-). అడ్డగించు, నిలుపు ; తడైతల్. అడ్డంకి ; మ. తటుయుక. ఆటంకపర్చు ; తడెక్క. నిలుపు ; తట. తటవు. ప్రతిబంధకం ; కో. తడ్వ- (తడ్-). ఆటంకపర్చు ; తొ. తర్ఫ్- (తడ్). ఆలసించు, ఆటంకపర్చు ; కురు. టడ్డ్. ఆటంకపర్చు. అడ్డుపెట్టు. (< *తణ్-త్-).

< మూ. ద్రా. *తట్ - < *తళ్ - త్-, *తళ్ -/ *తణ్ -.

పో.చూ.సం. తట-. ఒడ్డు ; ప్రా. తడ-.

**తడయక** అవ్య. **1**. శీఘ్రంగా. భార. ఆది. 2.158 ; **2**. వెనువెంటనే. భార. ఆది. 4.102.

**తడవ** రూ.చూ. తడవు[2]. వి. మారు, పర్యాయం. ఆం.నా.సం. మాన. 62, 63.

**తడవతడవకు** అవ్య. ద్రు. మాటిమాటికి.

**తడవపుగుడ్డ** చూ. తడియు. వి. వార్పుగుడ్డ.

**తడవాడు** చూ. తడవు[1].

**తడవియాడు** చూ. తడవు[1].

**తడవు[1]** రూ.చూ. తడము. స.క్రి. **1**. నిమురు. భార. భీష్మ. 2.141 ; **2**. ఆలోచించు, చింతించు. భార. శాంతి. 2.187 ; **3**. వెదకు, అన్వేషించు, వెదకిపట్టు. భార. ఆరణ్య. 7.29 ; **4**. పెంచు, పోషించు. మార్క. 2.57 ; **5**. ఎంచు, గణించు, తలచు. హరి. పూ. 1.87 ; **6**. చేయు, చేయబూను. ఉ. హరి. 5.185 ; **7**. సంపాదించు, సంగ్ర హించు. భాగ. 1.365 ; **8**. నిందించు. భాగ. 10. పూ. 32 ; **9**. ఉగ్గడించు, వెల్లడించు. భాగ. 10 ఉ. 1030 ; **10**. పలుకు, ఉచ్చరించు. భాగ. 10 పూ. 1702 ; **11**. స్తుతించు. వరాహ. 1.18 ; **12**. తాకు, అంటు, ముట్టు. వరాహ. 10.16 ; **13**. తలచు. కాళ. 1.50 ; **14**. ప్రసం గించు, ప్రస్తావించు. కళా. 3.38 ; **15**. అడుగు, ప్రశ్నించు. గౌ. హరిశ్చ. పూ. 323. పం ; అ.క్రి. **1**. దోగాడు, నెమ్మ దిగా పాకు. హరి. పూ. 5.190 ; **2**. కూడగు, యత్నించు. భాగ. 4.347, ద్వి.పరమ. వి. 2.52 ప. ; **3**. మెలగు, వర్తించు. నీలా. 153 ; విఁణ. చిరమైన, మిక్కిలి కడిచిన. కుచే. 2.78.

**తడవాడు** రూ.చూ. తడవియాడు. అ.క్రి. **1**. దోగాడు. భాగ. 10 పూ. 290 ; **2**. క్షోభపడు. భాగ. 10 పూ. 290. స.క్రి. **1**. వెదుకు. పాండు. 2.19 ; **2**. చేతులతో తడవు. రాధా. 2.140. < తడవు[1] + ఆడు. **తడవియాడు(-ఆడు)** రూ. తడవాడు. అ.క్రి. దోగాడు. భాగ. 10 పూ. 281 ; స.క్రి. చేతులతో తడవు. కాళ. 3.30. **తడవుకొను** అ.క్రి. తడవు, వెదకు. సకలనీతి. 35 ప. 307 పం. **తడవుడు** వి. వెదక టం. ఆం.భా. 2.173. **తడవులాడు** అ.క్రి. తడవాడు, దోగాడు. < తడవు + -లు + ఆడు.

**తడవు[2]** చూ. తడయు. రూ. తడవ. వి. **1**. జాగు, ఆలస్యం.

భార. ఆది. 4.55 ; **2.** సమయం. కు.సం. 5.88 ; **3.** చాల సేపు, దీర్ఘకాలం. శృం. నై. 6.122 ; **4.** (కాలంలో) తెరపి, అవకాశం. పారి. 4.66 ; **5.** చిరాయువు. నీలా. 1.111 ; విశ. **1.** చాల. కుచే. 2.78 ; **2.** అధికమైన (సంవత్సరం).

క. తడవె. సమయం, పర్యాయం ; త. తటువై.

**తడవుపట్టు** అ.క్రి. ఆలస్యమగు. శుక. 4.18. **తడవుల నిదుపఁడు** వి. అనంతుడు, శేషుడు. అచ్చ.రా.యు. 55. వేంక. తిర్య. 104. వ్యు. చిరకాలం నుంచి ఉండే శరీరం ఉన్న పాము. **తడవుసూపు(-చూపు)** అ.క్రి. ఆలస్యంచేయు. గంధ. 115. **తడవోర్చు** అ.క్రి. నిదానించు. సు.శ. 49.

**తడవోర్చు** చూ. తడవు[2].

**తడాకు** చూ. తడ[2].

**తడాపిడా** చూ. తడ[1], పెద. క్రి.విశ. ఒకటి వెన్క ఒకటి.

**తడార్** వి. పచ్చపూలు పూసేమొక్క (Diospyros cansolleana.)

**తడి** వి. **1.** తేమ. కు.సం. 5.73 ; **2.** నీరు. ఆము. 4.118, చంద్రాంగ. 4 ; **3.** తడిబట్ట. కవిరా. 3.188 ; **4.** కష్టం. రామలిం.శ. 89; **5.** పొలానికి ఒక పర్యాయం కట్టిన నీరు; **6.** రంగుల అద్దకంలో వాడే మిశ్రం ; **7.** ధనం ; **8.** ఖర్చు. విశ. ఆర్ద్రమైన, తేమకల. ఆము. 4.156.

క. తణ్. చల్లదనం, చల్లని ; తన్నీర్. చన్నీరు ; తణిసు, తణసు, తణ్ణస. చల్లదనం, అతిశీతలం, చల్లని, తమ్పు, తమ్బు. చల్లదనం, తేమ, తడి ; తణి. చల్లబడు, తడి. తేమ ; కొడ. తణితణిపి. చల్లదనం ; తు. తణు ; తను. చల్లదనం, చల్లని ; తణ్ణీర్. నీరు ; తణసు, తనసు, తడి, తేమ ; తన్పైన. చల్లని ; తణ్బు. చల్లదనం ; తణ్ణి. నీరు ; తట్టుమ్, చల్లని, ఆర్ద్రం, దయ, ప్రేమ ; మ. తన్. చల్లని ; తణ్ణి, తణ్ణీర్. చల్లనినీరు, మంచినీరు ; తణుపు. తేమ.

**తడికన్ను** వి. ఎప్పుడూ నీళ్ళుకారుతుండేకన్ను. పండి. చ. 4.108 పు. **తడిగుడ్డ** వి. కుండల్ని సర్వేటప్పుడు సలపను తడుపు కోటానికి వాడేతడిబట్ట. **తడిగుడ్డతోగొంతు కోయు** స.క్రి. నయవంచనచేయు. **తడిగుండె** వి. ఆర్ద్ర హృదయం. **తడితగిలించు** స.క్రి. కొట్టు. **తడితీయు** అ.క్రి. ఎండు, ఆరు, దశా. 2.136. **తడిపడుగు** వి. గంజితడి ఆరని పడుగు. **తడిపాతకుత్తుకకోయు** స.క్రి. నయవంచన చేయు. ప్రభా. 5.124. **తడిపాతగొంతుకోయు** స.క్రి. మెత్తగానే ద్రోహం చేయు, నయవంచన చేయు. పాంచాలీ. 3, కువ.చ. 4.30. **తడిపాతమెడకోయు** స.క్రి. నయ వంచనచేయు. తాళ్ల. సం. 3.583. **తడిపొడి** విశ. కొంచెం తడి కలిగి పొడిగా ఉన్నది. **తడిబండ** వి. సర్వేటప్పుడు సలపను తడిచేసుకోడానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి. **తడిమసి** వి. ఆముపేర్పులో కుండలమీద చెత్తవేసి ఆవిరి పైకి పోకుండా వాటిపైన పోసే తడి బూడిద. **తడియార్చు (-ఆర్చు)** స.క్రి. వెంట్రుకల తడి ఆరజేయు. పారి. 4.40. **తడియాఱు (-ఆఱు)** అ.క్రి. ఎండు. కు. సం. 9.93, మార్క. 2.34. **తడియొత్తు (-ఒత్తు)** వి. తడి తుడుచుకొనే వస్త్రం. ఆము. 5.89. అ.క్రి. తుడుచుకొను. ఆము. 5.89 ; స.క్రి. తుడుచు. కళా. 7.65. **తడిరంగు** వి. చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు. **తడిరాయు** స.క్రి. కుండల్నిసర్వేటప్పుడు సాపు రావటానికి తడిగుడ్డతో అద్దు. **తడివెండి** వి. పాదరసం. **తడిసుడు** వి. తడిఒత్తు. తడితుడుచుకొనేబట్ట. పరమ. వి. 5.428పు. త. సుడు. ఎండేటట్లుచేయు. **తడేరు** స.క్రి. తడిసేటట్లుచేయు. <తడి+ఆఱు. **తత్పుతీర్చు** స.క్రి. నూలుకు తడిఅద్దు.

**తడిక**[1] రూ.చూ. తడక. వి. **1.** ఆకులు వెదురు బద్దలు మొ. వాటితో చాపలాగ అల్లి, దడి తలుపు మొ. వాటిలాగ ఉపయోగించేసాధనం. వేమన. 2.329 ; **2.** నిస్సార మైన వాక్యరచన. ప్రబంధ. 21 ; **3.** కవాటం, తలుపు ; **4.** తాపేటుతడక, డాబీకిపైన బిగించిన ఇనపఊచల చట్రం ; **5.** తార్పుడు కత్తె.

**తడికకప్పు** రూ. తడిక్కప్పు. వి. తడికలు వేసికప్పిన కప్పు. **తడికడ్డముపెట్టు** స.క్రి. రావద్దని నిరోధించు. <తడిక+అడ్డముపెట్టు. **తడికతలుపు** రూ.చూ. తడక తలుపు. వి. వెదురు బద్దలతో అల్లిన తలుపు. **తడికదాసరి** వి. **1.** దొంగదాసరి ; **2.** అప్రయోజకుడు. **తడికద్రోపరి (-త్రోపరి)** రూ.చూ. తడకద్రోపరి. వి. తలుపులు తోసి వేసి లోపల దూరే దొంగ. ఆం.భా. 2.291. **తడికేసు కోవటం** వి. కాలం తప్పించి పనిచేయటం. **తడిక్కప్పు** రూ.చూ. తడికకప్పు. వి. తడికలు వేసికప్పిన కప్పు.

**తడిక**[2] వి. మఖ్మల్‌లాఉండే ఆకులున్నచెట్టు. (Grewia pilosa).

**తడికచువ్వ** రూ. తడకచువ్వ. వి. మఖ్మల్‌లావుండే ఆకులు కల్గిన ఒక చెట్టు. (Grewia pilosa). **తడికముల్లు** వి. మఖ్మల్‌లాఉండే ఆకులున్న చెట్టు (Grewia pilosa).

**తడికె** రూ.చూ. తడక. వి. **1.** ఆకులు, వెదురు బద్దలు మొ. వాటితో చాపలాగ అల్లి దడి తలుపు మొ. వాటిలాగ ఉప యోగించేసాధనం ; **2.** నిస్సారమైన వాక్యరచన ; **3.** కవాటం, తలుపు ; **4.** తాపేటు తడక, డాబీకిపైన బిగించిన ఇనపఊచల చట్రం ; **5.** తార్పుడు గత్తె ; **6.** వెదురుబద్దల వంటి వాటితో అల్లిన చాప ; **7.** చెక్కడపు పని చేసిన రంధ్రాలున్న పిట్టగోడ ; **8.** మరాసు మీద పడుగు తోడేటప్పుడు, డబ్బాలకు ఉన్నసూలు ఒగ్గులపట్టె వరకూ సాపుగా పోవటానికి నిలువు గుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్యలు ; **9.** పరం, బండి అడ్డ లేక డొలుపు మీద వేసిన నిలువు అడ్డ పట్టెల చదరం.

**తడికెకట్టు** వి. నేతలో ఒకరకం డిజైన్లు నేయటానికి, కర్రలకు పడిదారాలు కట్టి తయారు చేసిన పనిముట్టు. స.క్రి. నేతలో ఒకరకం డిజైను రావటానికి అచ్చుమాదిరి పరికరం (తడికె) తయారు చేయు. **తడికెచీల** రూ.చూ. తడికెచీల. వి. బండిపరాన్ని పోలుగర్రకి కలిపేమేకు. **తడికెబిల్ల** రూ.చూ. తడికెబిళ్ళ. వి. తడికె కట్టటానికి. పడిదారం చుట్టిన కొయ్యపనిముట్టు. **తడికెబిళ్ళ** రూ. తడికెబిల్ల. వి. తడిక కట్టటానికి, పడిదారం చుట్టినకొయ్య

పనిముట్టు.

**తడికె** రూ.చూ. తడక. వి. 1. తడకలాగ నిస్సారంగా ఉన్న వస్తువు; 2. బిగిలేని వాక్యరచన; 3. వెదురు బద్దలు మొ. వాటి ఆకులతో అల్లబడే వస్తువిశేషం; 4. చెక్కడపు పని చేసిన రంధ్రాలున్న గోడ; 5. డాబీ కోలలు లేపటానికి గొలుసు మాదిరిగా సన్నబద్దలు కూర్చిన సాధనం.

**తడికెచీల** రూ. తడికచీల. వి. బండి పరాన్ని పోలు గగ్గరకి కలిపేమేకు.

**తడికేసుకోవటం** చూ. తడిక[1].

**తడిక్కప్ప** చూ. తడిక[1].

**తడిగ** రూ.చూ. తళియ. వి. భోజన పాత్రం. శ్రీరం. మా. 6.77.

**తడిపి** చూ. తడియు. వి. ధనం, సొమ్ము.

**తడిబము** రూ.చూ. తలివము. వి. శయ్య. ఆం. భా. 2.164.

**తడిమము** రూ.చూ. తలివము. వి. శయ్య. ఆం. భా. 2.164.

**తడియు** అ.క్రి. ఆర్ద్రమగు. భార. సభా. 2.308.

క. తడి. చెమ్మగిలిన; చళి. చల్లదనం, చల్లని; తణి. చల్లబడు; తణ్. చల్లదనం; తు. సణి-ఫుని; సణియుని. చల్లబడు; చలి, చళి. చల్లని, చల్లదనం; త. తణ్. చల్లదనం; తళి. వర్షంలాకారు, వర్షం, చల్లదనం; చళి. చల్లని, చల్లదనం; మ. తణియుక. చల్లని, నెమ్మదియైన; తణొక్క. చల్లన, నెమ్మదియైన; చళి. బురద; కో. తయ్ణ్-(తణ్ప్-). (చనిపోయే ముందు శరీరం) చల్లనగు; తొ. తొణ్య్-(తొణ్ప్-). చెమ్మగిలు, చల్లన; తొణ్ప్-(తొణ్ప్). చల్లన, నెమ్మదియైన; పర్జి. తల్ల. చల్లదనం.

పో.చూ. కుర్. చఇఁద్. తడుపు, మునుగు; చ్వ్ర. తడిఅగు.

<మూ.ద్రా. *చళ్-/ *చణ్-.

**తడిసిగుడిసెకట్టు** స.క్రి. అనుభవానికి వచ్చినప్పుడే తెలుసుకొను. **తడిసినకుక్కలగు** అ.క్రి. కుంచించుకొనిపోవు. **తడిసిముప్పందుఅగు** రూ.చూ. తడిసి ముప్పందు మగు. అ.క్రి. స్వయంకృతాపరాధంతో బాధపడు. **తడిసి ముప్పందుమగు** రూ. తడిసి ముప్పందుఅగు. అ.క్రి. కష్టనష్టాలు ఎక్కువగు. **తడిసిముప్పందుము** వి. లాభంలాగా కనబడే గొప్పనష్టం. **తడిసిమోపెడగు** అ.క్రి. కష్టనష్టాలు ఎక్కువగు.

**తడిసిగుడిసెకట్టు** చూ. తడియు.

**తడిసినకుక్కలగు** చూ. తడియు.

**తడిసిముప్పందుఅగు** చూ. తడియు.

**తడిసిముప్పందుమగు** చూ తడియు.

**తడిసిముప్పందుము** చూ. తడియు.

**తడిసిమోపెడగు** చూ. తడియు.

**తడుకు** రూ.చూ. తడక. వి. 1. పక్షుల్ని వేటాడేవాడు, మరుగుగా ఉపయోగించుకొనే వేట సాధన విశేషం. భాగ. 7.59; 2. తడక. ఆం. భా. 2.12; 3. కంచె; 4. వెదురు బద్దలవంటి వాటితో అల్లినచాప; 5. చెక్కడపుపని చేసిన రంధ్రాలున్న పిట్టగోడ; 6. కొబ్బరిమట్టలతో మూల వంపుగా కట్టిన పందిరి.

**తడుకుపొడుచు** రూ.చూ. తడుకువొడుచు. స.క్రి. 1. కంచెచేయు. ఆము. 3.17; 2. తడకలుపరచు. **తడుకుఁబెండెము(-పెండెము)** వి. తెట్టుకోసం ముళ్ళతో అల్లినతడక. ఆము. 3.27. **తడుకువొడుచు (-పొడుచు)** రూ. తడుకు పొడుచు. అ.క్రి. 1. కంచెవేయు. మను. 4.37. స.క్రి. కంచెవేసినట్లు చిమ్ము. రామా. 6.201.

**తడుకున** క్రి. విశ. ద్రు. తటుకున, శీఘ్రంగా. కవిక. 4.96.

**తడుపాతచేయు** చూ. తడియు. స.క్రి. గంజి పిడచతో పడుగు తట్టు.

**తడుపు** చూ. తడియు. స.క్రి. 1. ఆర్ద్రమొనర్చు. భార. ఆది. 6.52; 2. లంచం ఇచ్చు; వి. 1. వస్త్రం. భార. శల్య. 2.160; 2. పిల్లల మొలకు చుట్టేచిన్నగుడ్డ. హరి. పూ. 5.22; 3. వటువు ఆచమనాదుల్లో ధరించే చిన్నవస్త్రం. కళా. 4.41, వైజ. 3.136; విశ. తడిసిన. భాను. 2.90.

క. తడుపు. చిన్నగుడ్డ.

**తడుపుకంకర** వి. సున్నంతో కలిపిన రాతిముక్క. **తడుపుగుడ్డ** వి. డిజైను అద్దకానికి రంగుతొట్టిలో మెత్తపైన వేసిన తడిగుడ్డ. **తడుపుదాలుపు (-తాలుపు)** రూ.చూ. తడుపుదాల్చు. వి. బ్రహ్మచారి, వడుగు. వేంక. ఆం. మాన. 38. **తడుపుదాల్చు (-తాల్చు)** రూ. తడుపుదాలుపు. వి. బహ్మచారి, వడుగు. ఆం. భా. 2.176. **తడుపుబోత** రూ. తడుప్పాత. వి. స్నానం చేసేటప్పుడు కట్టుకొనే చిన్న గుడ్డపాత. **తడుపుఁబొత్తులు (-పొత్తులు)** వి.బ.వ. బోయీలు దండె ఒత్తుడు తగలకుండా భుజాలపై పెట్టుకొనే గుడ్డచుట్టలు. కువ. చ. 4.213. **తడుప్పాత** రూ. తడుపుబోత, తడుబోత, తడుబ్బాత. వి. స్నానం చేసేటప్పుడు కట్టుకొనే చిన్న గుడ్డపాత. <తడుపు+పాత. **తడుబోత** రూ.చూ. తడుప్పాత. వి. స్నానం చేసేటప్పుడు కట్టుకొనేచిన్న గుడ్డపాత. <తడుపు+పాత. **తడుబ్బాత** రూ.చూ. తడుప్పాత. వి. స్నానం చేసేటప్పుడు కట్టుకొనే చిన్నగుడ్డపాత. <తడుపు+పాత.

**తడుప్పాత** చూ. తడుపు.

**తడుబోత** చూ. తడుపు.

**తడుబ్బాత** చూ. తడుపు.

**తడుమన** రూ. తడుమని. విశ. మందమైన, అల్పమైన. కు. సం. 9.133; వి. సంశయం. భాగ. 9.911.

త. తడిమన్. జడత;

సం. జడిమన్. జడత్వం.

**తడుమని** రూ.చూ. తడుమన. విశ. మందమైన, అల్పమైన. వీర. వి. 2.169; వి. సందేహం.

**తడుము** రూ.చూ. తడము. స.క్రి. నిమురు. కు. సం. 5.134.

**తడేరు** చూ. తడి.

**తడ్క** రూ.చూ. తడక. వి. 1. వెదురుబద్దలవంటివాటితో అల్లిన చాప; 2. చెక్కడపు పని చేసిన రంధ్రాలున్న పిట్ట.

గోడ ; **3.** డాబీకోలలు లేపటానికి గొలుసు మాదిరిగా సన్న బద్దలు కూర్చిన సాధనం.

**తడ్కలు** వి.బ.వ. మురుకులాంటి పిండివంట.

**తడ్చు** చూ. తడియు. అ.క్రి. నెమ్మకొను.

**తణకు** రూ.చూ. తనికి. నదులఒడ్డున, కొండల్లోనూ పచ్చగా పెరిగే మొక్క (Homonoia Riparia).

**తణగము** రూ.చూ. తడగము. వి. ఎద్దుమీద పెట్టి నీళ్ళుతెచ్చే తోలుసంచి. హంస. 5.97.

**తణగాము** రూ.చూ. తడగము. వి. ఎద్దుమీద పెట్టి నీళ్ళుతెచ్చే తోలుసంచి. హంస. 4.84.

**తణగామెద్దు** వి. తణగంలో నీళ్ళుమోసి తెచ్చే ఎద్దు.

**తణగామెద్దు** చూ. తణగాము.

**తణికి** రూ.చూ. తనికి, నదీప్రాంతాదుల్లో పెరిగేమొక్క (Homonoia Riparia).

**తణుకు**[1] వి. ఒకరకం కాయ (Wriviling nut) (Gyrocarpus Jacquini).

త. తణక్కు. ఒకరకంకాయ ; మ. తణక్కు. ఒకరకంకాయ.

**తణుకు**[2] వి. జరీతోగాని, కృత్రిమపు పట్టుతోగాని వరసగా 2-6 పోగులతో నేసిన డిజైను.

**తణుకు**[3] రూ.చూ. తనికి. వి. నదీతీరాల్లోనూ ప్రవాహాలపక్క, రాళ్ళమధ్య మొలిచేమొక్క (Homonoia Riparia).

**తణుకు**[4] వి. ఆటవస్తువుల తయారీకి పనికివచ్చే చెట్టు (Sterculiawrens).

**తణ్కు** చూ. తాఁకు. రూ. తాన్కు. స.క్రి. తాకు, ఎదుర్కొను. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 623. పం.8. క్రీ.శ 9/10 శతాబ్దాలు.

క. తాచుని. ఎదుర్కొని, తాకి ; త. తొక్కు, తాంకు ; మ. తాక్కుక ; పో. చూ. తె. తాఁకుడు, తాఁచు, తాఁపు. తగులు, తగులము.

<మూ. ద్రా. *తాయ్-ఒన్-/-క్క.

**తంట** రూ. తంటా. వి. **1.** మోసం. రాధా. 3.134, చంద్రాంగ. 3.107 ; **2.** అధర్మం. ద్వి. సార. చ. 1.48పు. 17పం. ; **3.** చిక్కు. పార్వ. 5.137 ; **4.** కలహం ; **5.** చాడీ, కొండెం ; **6.** కష్టం ; **7.** అప్పు ; **8.** అవినీతిసంబంధం.

ఒ. హిం. తంటా, టంటా. కలహం ; మరా. తంటా. కలహం , వాదం, తగవు.

క. తంటె. మోసం ; త. తండె.

<మరా. తంటా.

**తంటలమారి** రూ. తంటాలమారి. వి. **1.** వంచకుడు , వంచకురాలు. ఉ. హరిశ్చ. 4.45 ; **2.** బాధకుడు, బాధకురాలు.

**తంటసము** రూ. తండసము. వి. మంగలి వెంట్రుకలూడలాగే సాధనం. పండి. చ. 2.134.

క. తండస. వెంట్రుకలూడదీసే సాధనం ; మ. తనాంసు ;

పో. తెనజ్.

**తంటా** రూ.చూ. తంట. వి. **1.** కలహం, జగడం, తగవు. చంద్రరే. 2.90 ; **2.** మోసం ; **3.** అధర్మం ; **4.** చాడీ, కొండెం ; **5.** చిక్కు ; **6.** అప్పు.

**తంటాలమారి** రూ.చూ. తంటలమారి. వి. ఒకరికొకరికి తగాదాలు పెట్టేవాడు, పెట్టేది.

**తంటి** రూ.చూ. తంటెము. వి. తగిరిసె, ఏటామొలిచి పొదగా పెరిగే మొక్క.

**తంటిపి** రూ.చూ. తంటెము. వి. తరిగిసె, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క (Cassia tora or alata).

**తంటియము** రూ.చూ. తంటెము. వి. తగిరిస, ఒకానొక చెట్టు.

**తంటిరి** వి. తోటల్లోను, దడుల మీద పెంచబడే అందమైన తీగ (Clitoria Ternatea).

**తంటీము** రూ.చూ. తంటెము. వి. తగిరిసె, ఏటా మొలిచి పొదగా పెరిగే మొక్క.

**తంటెము** రూ. తంటి, తంటిపి, తంటియము, తంటీము. వి. తగిరస, వృక్షవిశేషం. చంద్ర.రే. 2.90 (Cassia tora).

**తండ** చూ. తడక. వి. వెదురు బద్దలతో అల్లిన తడికె.

**తండతండములు** చూ. తండము.

**తండతండములైయుండు** చూ. తండము.

**తండము** వి. గుంపు, రాశి, పోగు. భార. భీష్మ. 3.385.

సం. షండ-. గుంపు ; ప్రా. సండ-. ; మరా. తాండా. గుంపు.

క. తండ.

<ప్రా. సండ-.

**తండతండములు** వి.బ.వ. తండోపతండాలు, గుంపులు గుంపులు. పండి. చ. 1.1 పు. **తండతండములైయుండు** అ.క్రి. గుంపులు గుంపులుగా ఉండు. కళా. 1.186.

**తండలు**[1] వి.బ.వ. గుంపులు.

**తండలు**[1] చూ. తండము.

**తండలు**[2] చూ. తండు[1].

**తండసము** రూ.చూ. తంటసము. వి. **1.** మంగలివెంట్రుకలూడలాగే సాధనం, చిమ్మట. కాశీ. 4.68 ; **2.** జరిమానా.

**తండా** రూ. టండా. వి. **1.** లంబాడీ మున్నగు వాని గుంపు ; **2.** సరుకు నింపిన గోనెల సమూహం ; **3.** మందం, లావు, చిక్కదనం.

మరా. తంటు. గుంపు, వేరుచేయబడ్డ కొంత జనం ; తాండా. గుంపు, సమూహం, తెగ ;

తు. తండు, తండ. గుంపు, సేన, సమూహం.

<మరా. తాండా.

**తండారు** అ.క్రి. చల్లారు, ఉపశమిల్లు. రం.రా. అయో. 112. పు. 29 పం.

క. తండు. చల్లన.

<క. తండు +- ఆరు[6].

**తండిగ** వి. గృహప్రవేశం నాడు ఇచ్చే మేకపోతుల బలి.

**తండిగము** వి. ఒక విధమైన గోనె సంచి. హంస. 5.97.

**తండిరి** రూ.చూ. తండ్రి. వి. జనకుడు. భోజ. 6.370.

**తండు**[1] చూ. దండు[1]. స.క్రి. **1.** బాకీలు వసూలు చేయు ; **2.** చందాలు అడుగు.

క. తళె. పొందు ; తలపు, తలుపు. పొంది ఉండు ; తణ్ణాకాఱ. కూడబెట్టినవాడు, ఎక్కువ ధనం కలిగి ఉన్న వాడు ; తు. దణ్ణియుని. దేన్నయినా పొందటానికి చేయి సాచు ; త. తణ్ణు. పన్నులు, అప్పులు వసూలు చేయు ; మ. తెణ్ణుక. పొందు, అక్కడక్కడ ఇటూ అటు తిరుగు, పురుగువలె తిరుగు ; తెణ్టో. బిచ్చగాడు ; కో. తడ్ఞ్. అప్పు తీర్చివేయు, పోటీలో గెలుచు, (అప్పు) తీర్చడమైనది ; దడ్ఞ్. బాకీ తీర్చు ; పో.చూ. దణ్ణుగు, దణ్ణుగ, దణ్ణువు, దణ్ణువ. జరిమానా చెల్లించటం, వ్యాపారంలో నష్టం ; పో.చూ. గో. తడ్ఞ్. బయటకు తీసుకొను, నూనెలాగ పిండు.

మూ.ద.ద్రా. *తళ్-/ *తణ్-.

<త. తణ్ణు.

**తండలు**[2] వి.బ.వ. అప్పిచ్చి నిర్ణయ ప్రకారం ప్రతి దినం వసూలు చేసే పద్ధతి.

**తండు**[2] చూ. దంటు. వి. 1. కాయ తీసిన తర్వాత కట్టిన వేరు సెనగ చెత్తమోపు ; 2. ఉలవ, పెసర మొ. వాటి గింజలు లేని కాయకు ఏర్పడే తెగులు ; 3. ఉలవ, పెసర, వేరుసెనగ, అలచంద, అనుము మొ. పైర్లు వేసే తీగె ; 4. రాతిగని లోపలికి దారి తీసే సొరంగానికి మూత ఉన్న పెద్ద బండ.

**తండుగోల(-కోల)** వి. 1. చేపల్ని పొడిచే చిల్లకోల. వేంక. పంచ. 1.603 ; 2. తెడ్డు. త. తండుక్కోల్. **తండుజీల(-చీల)** వి. ఏడికోలను పణతలో దూర్చి ఊడ కుండా చివరకొట్టే కొయ్యమేకు. **తండుమన్ను** వి. బురద మట్టి, చిక్కటి పాకంలో ఉన్న అడుసు. **తండువేయు** అ.క్రి. కాపుకాయకుండా పైరు బలియు.

**తండుముండుపడు** అ.క్రి. తొట్రుపడు. తాళ్ల. సం. 6.56.

**తండెలు** రూ.చూ. తండేలు. వి. ఓడ పెత్తనగాడు.

**తండేలు** రూ. తండెలు. వి. పడవ యజమాని.

క. తండేల్. పడవ యజమాని ; తు. తండెలు, తండెలె. నౌకాధికారి ; త. తంటల్. ఓడ అధికారి, నౌకాధిపతి ; మ. తంటల్. స్థానిక నౌకాధికారి.

పో.చూ. మరా. తాడెల్. పడవయజమాని.

**తండోపతండములగు** చూ. తండోపతండములు.

**తండోపతండములు** వి.బ.వ. గుంపులు గుంపులు, అసంఖ్యా కాలు. వేమ. 2.18.

క. తండొపతండ. గుంపు.

**తండోపతండముల** అ.క్రి. గుంపులు గుంపులగు. శుక. 1.271.

**తండ్రి** రూ. తండిరి. వి. 1. కన్నవాడు, జనకుడు. భార. ఆది. 2.171 ; 2. వాత్సల్యం, భక్తి మున్నగు వాటిని సూచించేటప్పుడు ఉపయోగించే పదం. భార. ఆరణ్య. 1.366.

క. తండె. తండ్రి ; త. తంతై. తండ్రి ; ఎంతై. నా తండ్రి, మన తండ్రి, అన్న ; ఆన్‌తైదున్‌తై. మీ తండ్రి ; మ. తంత. తండ్రి ; కుఇ. తంజి. తండ్రి ; కువి. తంజి. తండ్రి ; పర్జి. తెండ్. తండ్రి ;

పో.చూ. క. తందె ; త. టన్‌తై; మ. తంత ; కుఇ. కువి. తంజి. మొ.

మూ.ద.ద్రా. *తన్ట్.

<మూ.ద్రా. *తన్-ట్.

**తండ్రితండ్రి** వి. పితామహుడు, తాత.

**తండ్లాడు** చూ. తన్ను. స.క్రి. ప్రాణం పోకకొట్టుకొను.

**తతకారము** వి. తాళం వేసేటప్పుడు చేసే శబ్దోచ్చారణం. విష్ణుప. 7.280.

సం. తత్తకార-. తాళంవేసేటప్పుడు చేసే శబ్దో చ్చారణం.

<సం. తత్తకార-.

**తతంగము** వి. అనవసరమైన ఆర్భాటం.

సం. తంత్రగ-. తంత్రాన్ని పొందినది.

**తతి** వి. యుక్త సమయం. కాశీ. 4.13.

క.త. తతి. తగిన సమయం ;

సం. తత్. ఆ ; మరా. తథీ. ఆ రోజున.

**తతిగొను**[1](-కొను) స.క్రి. సమయం కనిపెట్టు. రం.రా. అయో. 107 పు. 22 పం., భాగ. 10. ఉ. 37.

**తతిగొను**[2] (-కొను) స.క్రి. మందవేయు, పశువులను మందగా చేర్చు.

సం. తతి-. సమూహం, గుంపు.

<సం. తతి-.+కొను.

**తతిమ్మ** రూ.చూ. తతిమ్మా. విశ. తక్కిన, మిగిలిన.

**తతిమ్మా** రూ. తతిమ్మ. విశ. తక్కిన, మిగిలిన.

ఉ. తతిమ్మహ్. ప్రతివస్తువుయొక్క మిగిలిన భాగం ; పార. తతిమ్మహ్. పరిశిష్టభాగం, మిగిలినది ; అర. తతిమ్మహ్. మిగిలిన.

<ఉ. తతిమ్మహ్.

**తత్తకతక** చూ. తకతక. వి. తాళంలో అయ్యే ధ్వనికి అనుకరణం. శశా. 4.65.

**తత్తడి** రూ. తత్తళా. వి. 1. వాహనం. హర. 5.16, ఆము. 5.98 ; 2. గుర్రం. జాహ్నవీ. 2.59.

**తత్తడిమోరపైదలి (తత్తడి+మోర+పైదలి)** వి. కిన్నర స్త్రీ. అచ్చ.రా.సుందర. 35.

**తత్తదిగ** వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర.

**తత్తబడ** వి. 1. సైన్యం. నిర్వ.రా. 6.146 ; 2. పరిజనం. ఉ.హరి. 3.114.

క. తత్త. తథ్యం.

**తత్తర** రూ.చూ. తత్తెర. వి. తాబేలుకాయ, తాబేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే మట్టి పాత్ర.

**తత్తరేనిగె** రూ. తత్తిరేని, తత్తిరేనుగు, తత్రాణి, తత్రేణిగి, తర్తిరేనుగు. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా చిన్న మూతితో నీళ్ళు నింపుకొని చంకకు తగిలించుకొని వెళ్ళడానికి వాడే మట్టిపాత్ర.

**తత్తఱ** రూ. తత్తఱము, తఱతఱ. వి. 1. తొందర. రం.రా. అయో. ; 2. ఆకులపాటు ; విశ. సంభ్రమంతోకూడిన, తొందరతోకూడిన.

క. తత్తర, తత్తఱ, తత్తళి, తత్తళ, తఱతఱ. తడబాటు, తొట్రుపాటు; తత్తరమ్. వణుకుకున్న, కంపం, తొందరపాటు, తొట్రుపాటు ; మ. తత్తరమ్. కలవరం.

**తత్తఅపడు** అ.క్రి. 1. ఆకులపాటుపొందు. భాస్క.రా. యు. 2058 ; 2. తొందరపడు. విష్ణుపు. 5.152. **తత్తర పాటు** వి. 1. ఆకులపాటు. ఉ.హరి. 2.129 ; 2. తొందర పాటు, సంభ్రమం. కాశీ. 2.49. **తత్తఅపెట్టు** స.క్రి. తొందరపెట్టు. విక్ర. 8.54. **తత్తఅబిత్తర** విణ. కలత నొందిన. ప్రభు. 1.3. గతి. 20 పు. 16 పం. క. తత్తఱ బిత్తఱ. **తత్తఱించు** అ.క్రి. 1. క్షోభపడు, ఆకులతనొందు. ఉ.హరి. 3.65 ; 2. తొందరపడు. కాశీ. 4.106 ; 3. భయపడు. మను. 4.108, నరస. 2.115 ; 4. ఊగులాడు. రాజవా. 5.79 ; 5. చలించు. దశా. 2.301. <తత్తఱ+ -ఇంచు[3]. **తత్తఱింత** వి. తొందర. కేయూ. 1.69. **తత్తఱిలు** రూ.చూ. తత్తఱిల్లు. అ.క్రి. 1. తొందరపడు. కళా. 7.76 ; 2. భయపడు. మృత్యు. 2.84 ; 3. కలతపొందు. **తత్తఱిల్లు** యా. తత్తఱిలు, దద్దఱిల్లు. అ.క్రి. 1. తొందరపడు. కళా. 3.34 ; 2. కలతపొందు ; 3. భయపడు.

**తత్తఅము** రూ.చూ. తత్తఱ. విణ. తొందరతో కూడిన. ఉ. హరి. 3.136. వి. 1. తొందర. రుక్మా. 5.9 ; 2. ఆకుల పాటు. పారి.1.101.

**తత్తఱించు** చూ. తత్తఱ.

**తత్తఱింత** చూ. తత్తఱించు.

**తత్తఱిలు** చూ. తత్తఱ.

**తత్తఱిల్లు** చూ. తత్తఱ.

**తత్తళంగంతోం** వి. మృదంగధ్వనికి ఒకానొక శబ్దానుకరణం. దశా. 7.1.

**తత్తళా** రూ.చూ. తత్తడి. వి. 1. వాహనం. గంధ. 145 ; 2. గుర్రం.

**తత్తవలు** వి.బ.వ. దరువులు, ఆటలు, విపరీతపుచేష్టలు.

**తత్తిర** రూ.చూ. తత్తెర. వి. తాబేలుకాయ, తాబేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే మట్టి పాత్ర.

**తత్తిరి** రూ.చూ. తత్తెర. వి. తాబేలుకాయ, తాబేలు ఆకారంలో ఉండే మట్టిపాత్ర.

**తత్తిరికాయ** రూ.చూ. తత్తెరకాయ. వి. తాబేలు ఆకారం లాగ బద్దపాటుగా గుండ్రంగా చిన్న మూతితో నీళ్ళు నింపుకొని చంకకు తగిలించుకొని వెళ్ళటానికి వాడే మట్టి పాత్ర.

**తత్తిరేని** రూ.చూ. తత్తరేనిగె. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో నీళ్ళు నింపుకొని చంకకు తగిలించుకొని వెళ్ళడానికి వాడే మట్టిపాత్ర.

**తత్తిరేనుగు** రూ.చూ. తత్తరేనిగె. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా చిన్నమూతితో నీళ్ళు నింపుకొని చంకకు తగిలించుకొని వెళ్ళడానికి వాడే మట్టిపాత్ర.

**తత్తుగలియు** (-కలియు) అ.క్రి. పొత్తుకుదురు.

**తత్తురుబిత్తురు** వి. వంకరటింకర. ధ్వన్యను.

**తత్తెర** రూ. తత్తర, తత్తిర, తత్తిరి. వి. 1. సారాయిపోసే తిత్తి. రం.రా.సుందర. ; 2. తాబేలుకాయ, తాబేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే మట్టి పాత్ర.

**తత్తెరకాయ** రూ. తత్తిరికాయ. వి. తాబేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే మట్టి పాత్ర.

**తత్తెలక** రూ.చూ. తత్తెలుక. వి. తాబేలు ఆకారంలాగా బద్ద పాటుగా గుండ్రంగా నన్నమూతితో ఉండే మట్టిపాత్ర.

**తత్తెలుక** రూ. తత్తెలక. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా నన్నమూతితో ఉండే మట్టిపాత్ర.

**తత్రాణి** రూ.చూ. తత్తరేనిగె. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో నీళ్ళు నింపుకొని చంకకు తగిలించుకొని వెళ్ళడానికి వాడే మట్టిపాత్ర.

**తత్రేణిగి** రూ.చూ. తత్తరేనిగె. వి. తాబేలు ఆకారంలో ఉండే మట్టిపాత్ర.

**తత్వాకారిఅంచు** వి. మధ్య నల్లగీరలు పెట్టి నేసిన బొట్టంచు.

**తదియ** రూ. తద్దియ, తద్దె[2]. వి. మూడవతిథి. భార.అరణ్య. 5.207.

నం. తృతీయా. మూడవ తిథి ; ప్రా. తదియా, తఇఆ, తఇఅ, తఈఅ, తజ్జఅ, తేఅ, తిఇయ, తిఅ, తఇజ్జ, తిఇజ్జ ; జైన.మహా. తఇయ; అశో.ప్రా. తతియ ; శౌ. తదిఅ ; అ.మా. తఇయా, తలిఅ, తతియా ; మా. తదిఅ ; పా. తలియ ;

క. తదిగె.

<ప్రా. తదియా.

**తద్ద**[1] అవ్య. మిక్కిలి. భార.ఆది. 4.65.

**తద్దయు** అవ్య.ద్రు. మిక్కిలి. భార.ఆది. 1.91.

**తద్ద**[2] వి. బండి భాగాల తయారీలో పనికివచ్చే చెట్టు (Grewia Tiliaefolia).

**తద్దపళ్ళు** రూ. తద్దపుళ్ళు. వి. కొరి, గొరివి. కాగడాలకు ఉపయోగపడే చెట్టు (Ixoraparviflora).

**తద్దపుళ్ళు** రూ.చూ. తద్దపళ్ళు. వి. కొరి, గొరివి. కాగడాలకు ఉపయోగించే చెట్టు.

**తద్దినము** వి. 1. ఆబ్దికం. రం.రా.అరణ్య. 141 పు. 16 పం. ; 2. ఆబ్దికదినం, ప్రతిసంవత్సరం చనిపోయినవారికి భోజనం పెట్టే రోజు. చౌడప్ప శ. 67.

నం. తద్దిన-. ఆరోజు.

<నం. తద్దిన- (అర్థవిపరి.).

**తద్దినముకొనితెచ్చుకొను** స.క్రి. అనవసరంగా, బుద్ధి పూర్వకంగా నష్టాన్ని తెచ్చిపెట్టుకొను.

**తద్దియ** రూ.చూ. తదియ. వి. పండుగరోజయిన తద్దె.

**తదె**[1] వి. సత్యం. బసవ. 3 ; ఆం.నా.నం. 160.

నం. తథ్య-. సత్యమైనది, సత్యం ; అ.మా.ప్రా.పా. తచ్చ.

<నం. తథ్య-.

**తద్దె**[2] రూ.చూ. తదియ. వి. పండుగదినమైన తదియ, అట్లతద్దె, ఉట్లతద్దె, ఉండ్రాళ్ళతద్దె, కోమట్లతద్దె, పెద్దతద్దె, బ్రాహ్మణ తద్దె అని వ్యవహారం.

**తన**[1] చూ. తాను[1].

**తన**[2] వి. బండి భాగాల తయారీకి ఉపయోగపడే చెట్టు (grewiatiliaefolia).

**తనకాళ్ళపైనిలబడు** చూ. తాను[1].

**తనకలాడు** రూ.చూ. తన్నుకలాడు. అ.క్రి. అవస్థపడు, గింజుకొను, తన్నుకలాడు.

**తనకలి** విశ. 1. చిక్కుల్లోపెట్టేవాడు. ఉ.హరి. 3.113 ; 2. చిక్కుపడిన. యయా. 4.135 ; వి. చిక్కు, కష్టం. రం.రా.అయోధ్య.

**తనకీ** రూ. తనఖీ, తనికీ, తనిఖీ. వి. విచారణం, పరిశీలనం.

హిం. తన్‌కీహ్. విచారణం, పరిశీలనం ; ఉ. తన్‌కీహ్. విచారణ, పరిశీలనం ; పార. తన్‌కీహ్. పరిశీలించటం, నేరశోధనం, సోదాచేయటం ; అర. తన్‌కీహ్. పరిశీలనం.

<ఉ. తన్‌కీహ్.

**తనకు** వి. ఆటవస్తువులు పెట్టెలు మొ. గృహోపకరణాల తయారీకి పనికివచ్చే కలప కలిగిన ఒక చెట్టు (Gyrocarpus ame.icanus).

**తనకు(దాన** చూ. తాను[1].

**తనఖా** వి. భూమిపన్ను, జీతం. ద.హిం.శా.సంపు. 10. శా. సం. 759, క్రీ.శ. 1663 సం.

హిం. తన్‌ఖాహ్, తన్‌ఖ్వాహ్. వేతనం, జీతం ; మరా. తనఖా. వేతనం, పన్ను, ప్రతిఫలంగా ఇచ్చే ధనం ; ఉ. తన్‌ఖ్వాహ్. జీతం, వేతనం ; పార. తన్‌ఖ్వాహ్. భూసమర్పణం, భూదానం, నెల నెల ఇచ్చే జీతం.

<మరా. తనఖా.

**తనఖాదారు** వి. తాకట్టుగలవాడు. పార. -దార్. కలవాడు. <మరా. తనఖా + పార. -దార్.

**తనఖీ** రూ.చూ. తనకీ. వి. పరిశీలనం.

**తనతన** చూ. తాను[1].

**తనతనయంత** చూ. తాను[1].

**తననీడకడవంగ(బొఅనేర్చు** చూ. తాను[1].

**తనంతటివా(డు** చూ. తాను[1].

**తనంతతాను** చూ. తాను[1].

**తనంతన్** చూ. తాను[1].

**తనంతనేయగు** చూ. తాను[1].

**తనబీ** రూ.చూ. తనాబి. వి. తాగాడి, కొయ్యదూలం.

**తనబ్బి** రూ.చూ. తనాబి. వి. అలమరగూడు, తలుపులేని అలమర.

**-తనము** ప్రత్య. భావార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం. భార. ఉద్యో. 1.344.

**తనంబి** రూ.చూ. తనాబి. వి. అలమరగూడు, తలుపు లేని అలమర.

**తనయంతన్** చూ. తాను[1].

**తనరారు** చూ. తనరు.

**తనరించు** చూ. తనరు.

**తనరు** అ.క్రి. 1. ఒప్పు, శోభిల్లు, ప్రకాశించు. భార.ఆది. 3.54 ; 2. ఆరితేరు, గడితేరు. భార.ఆది. 7.181 ; 3. పొంగు. భార.విరా. 2.133 ; 4. ఎత్తగు. భార.శల్య. 2.228 ; 5. అతిశయించు. మార్క. 3.82 ; 6. పెరుగు, వర్ధిల్లు. హరి.పూ. 1.118 ; 7. వసించు, ఉండు, వర్తిల్లు. విక్ర. 1.78.

క. తని. వృద్ధిపొందు, పెరుగు ; తు. తనెయుని. (పశువులు) ఎదపట్టు, తనె. (పశువులు, గొర్రెలు) పిల్లల్ని కను ; త. తని. అద్వితీయం, అసమానత్వం, తణి. పుష్కలంగాఉండు, పరిమాణంలో పెరుగుదల ; మ. తన్. వ్యాపించు ; మాల్తో. తాన్‌డ్య- (తాన్‌డ్ప). వ్యాప్తి చేయు, బయటకు సాగదీయు, తాన్‌డ్గ్. వ్యాపించు. తన్యర్. ధనవంతుడగు.

<మూ.ద్రా. *తాన్-/*తన్-.

**తనరారు** అ.క్రి. 1. ఒప్పు. కు.సం. 9.59 ; 2. ప్రసిద్ధుడగు. హరి.ఉ. 3.5 ; 3. విజృంభించు. రాఘవ. 4.68 ; 4. అతిశయించు. **తనరించు** స.క్రి. 1. కలిగించు. కావ్యా.చూ. 5.102 ; 2. సంతోషపెట్టు, అలరించు. ద్వి.పరమ.వి. 2.65. ; 3. వర్ధిల్లచేయు. ద్వి.పరమ.వి. 5.410 ; 4. చేయు, కావించు. అచలా. 1.73. **తనరుచు** రూ.చూ. తనర్చు. అ.క్రి. 1. పొంగు, అతిశయించు, అధికమగు ; 2. ఒప్పు ; 3. ఉండు, వర్తించు ; 4. విజృంభించు. స.క్రి. కలిగించు, కావించు. **తనరుపు** రూ. చూ. తనర్పు. వి. 1. ఎత్తు, ఔన్నత్యం, పొడవు ; 2. స్థౌల్యం, పృథులత్వం ; 3. అతిశయం, భుజంగప్రయాతం ; 4. వెడల్పు, విస్తృతి, వైశాల్యం. **తనర్చు** రూ. తనరుచు ; అ.క్రి. 1. పొంగు, అతిశయించు, అధికమగు. భార.ఉద్యో. 2.188 ; 2. ఒప్పు. విక్ర. 1.33, ప్రభా. 1.138 ; 3. ఉండు, వర్తించు. దశా. 2.139 ; స.క్రి. కలిగించు, కావించు. నృసింహ. 4.8. **తనర్పు** రూ. తనరుపు. వి. 1. ఎత్తు, ఔన్నత్యం, దూరం. భార.ఆది. 2.10 ; 2. స్థౌల్యం, పృథులత్వం. కు.సం. 8.16 ; 3. అతిశయం. భార.స్త్రీ. 1.88 ; 4. వెడల్పు, విస్తృతి, వైశాల్యం. విక్ర. 1.68 ; 5. పొడుగు.

**తనర్చు** చూ. తనరు.

**తనర్పు** చూ. తనరు.

**తనవారితనము** చూ. తాను[1].

**తనవారుకానివారు** చూ. తాను[1].

**తనసొమ్మనితల(చు** చూ. తాను[1].

**తనాబఆర్చి** రూ.చూ. తనాబీ ఆర్చి. వి. ద్వారబంధాల కిటికీల మీద వేసే ఆర్చి.

**తనాబి** రూ తనబీ, తనబ్బి, తనంబి, తనాబీ. వి. 1. స్తంభాల మీదగాని గోడలమీదగాని వేసే పెద్దదూలం లేదా పలక ; 2. అలమరగూడు, తలుపులేని అలమర.

హిం. ఉ. తనాబ్. స్తంభంతాడు ; అర. తెనాబ్.

<ఉ. తనాబ్.

**తనాబీ** రూ.చూ. తనాబి. వి. 1. స్తంభాల మీదగాని గోడల మీదగాని వేసే పెద్ద దూలం లేక పలక ; 2. అలమర గూడు, తలుపులేని అలమర.

తనాబీఆర్చి రూ. తనాబఆర్చి. వి. ద్వారబంధాల కిటికీ మీద వేసే ఆర్చి.

**తని**[1] విణ. అల్పమయిన, కొంచెమైన, చిన్న. కు.సం. 9.126. సం. తను-. అల్పమైన, సూక్ష్మమైన ; ప్రా. తణు-. < సం. తను-.

తనివెచ్చ వి. కవోష్ణం, గోరువెచ్చ. జైమిని భా. 6.85.

**తని**[2] విణ. 1. పరిపక్వమైన, దాగాపండిన. కు.సం. 5.162 ; 2. అచ్చమైన, మిశ్రంగాని, శుద్ధమైన. వేంక. పంచ. 1.687 ; 3. సమృద్ధమైన, నిండైన. కృ.శకు. 1.13. క. తని. పరిపక్వమైన, నిండైన ; తు. దణియ ; త. తణి.

**తని**[3] వి. 1. పెంకు పేర్పులోని వరస ; 2. గోడలో పెట్టిన గుండ్రటి కంత.

**తని**[4] వి. కొత్తదనం, కలకలలాడటం.

**తని**[5] వి. ఒకరకం కరక చెట్టు. దీని కాయలు చర్మ పరిశ్రమలో ఉపయోగిస్తారు (Terminalia bellerica).
త. తని ; మ. తని.
ఉ. తర.

**తనికి** రూ. తణకు, తణికి, తణుకు[3]. వి. ఒకరకం మొక్క (Homonoia riparia).

**తనికీ** రూ.చూ. తనకీ. వి. పరిశీలనం.

**తనిఖీ** రూ.చూ. తనకీ. వి. విచారణం, పరీక్ష.

తనిఖీచేయు స.క్రి. 1. పరీక్షించు ; 2. సోదా చేయు.

**తనియించు** చూ. తనియు.

**తనియు** అ.క్రి. తృప్తిపడు, ఆపోవు. భార. ఆది. 5.119.
క. తణి. తృప్తిపడు, తనివి తీర్చు ; తణిపు. తృప్తిపరచు, శాంతపరచు ; తు. తణియుని. నిశ్శబ్దమగు, తణు. ఆర్పటం ; త. తణి. శాంతపరచు, తృప్తిపడు, నెరవేర్చటం ; పో.చూ. కురు. తర్కా. నెమ్మదియైన, శాంతమైన.
మూ.ద.ద్రా. *తణ్-.

తనియించు స.క్రి. తనియచేయు, తృప్తిపరచు. నీలా. 1.53. తనిసికోలు వి. ఎక్కువ.

**తనివారు** చూ. తనివు.

**తనివి** చూ. తనియు. రూ.చూ. తనివు. వి. తృప్తి, ఆపోక. ఉ.రా. 2.40.

తనివిగా క్రి.విణ.ద్రు. వేరుగా, స్వేచ్ఛగా. తనివిచను రూ.చూ. తనివిసను. అ.క్రి. తృప్తి చెందు. హర. 5.52. **తనివితీరు** అ.క్రి. సంతృప్తి అగు. **తనివిపడు** రూ.చూ. తనివుపడు. అ.క్రి. తృప్తిపడు. **తనివిసను(-చను)** రూ. తనివిచను, తనిసను, తన్విసను. అ.క్రి. తృప్తినొందు. భార. విరా. 5.177. **తనివోవు** అ.క్రి. తృప్తిపడు, తనియు. కు.సం. 4.105, భార. ఉద్యో. 1.328. < తనివి + పోవు. **తనిసను** రూ.చూ. తనివిసను. అ.క్రి. తృప్తినొందు, ఆపోవు. భాస్క.రా. 395, రం.రా. కిష్కిం. 219 ప. 30 పం. < తనివి + చను.

**తనివు** చూ. తనియు. రూ. తనివి, తన్వి, తన్వు. వి. ఆపోక, తృప్తి. భార. కర్ణ. 3.264 ; విణ. నిండైన, పూర్ణమైన.

తనివారు అ.క్రి. తృప్తినొందు, ఆపోవు. ఇందు. 5.98. < తనివు + ఆరు[1]. **తనివుపడు** రూ. తనివిపడు. అ.క్రి. తృప్తిపడు. కాశ. 1.35.

**తనివోవు** చూ. తనివి.

**తనిసను** చూ. తనివి.

**తనిసి** వి. దంతి, పొదవైన ముళ్ళున్న చెట్టు (Gymnosporia montana).

**తనిసికోలు** చూ. తనియు.

**తనీగా** చూ. తనివి. క్రి.విణ.ద్రు. ప్రత్యేకంగా.

**-తను** విణ. వృత్తిలో 'తనుపు' శబ్దానికి అంత్యవర్ణం లోపించగా మిగిలిన రూపం.

**తనుకరువలి** చూ. తనుపు.

**తనుకాడు** చూ. తనుపు.

**తనుకు**[1] రూ. తన్కు[1]. వి. 1. భయం. భార. కర్ణ. 1.110. 3.347 ; 2. వజ్రకాంతి. ఆం.భా. 3.42. అ.క్రి. 1. మండు. జ్వలించు. భార.శాంతి. 3.317 ; 2. అతిశయించు. రం. రా.యు. ; 3. భయపడు ; భాగ. 8 స్కం ; 4. తపించు, పరితాపంపొందు. పాండు. 4.2 ; 5. ప్రకాశించు, వెలుగు, పె.శకు. 2.196.
పో.చూ. క. తణల్. జ్వలించే బొగ్గులు ; త. తణల్. ఆరిపోక మండుతున్న బొగ్గులు, కణకణమండుతున్న నిప్పులు.
మూ.ద.ద్రా. *తణ్-.

**తనుకు**[2] రూ. తన్కు[2]. అ.క్రి. 1. కలుగు, సంభవించు. భార. సభా. 1.42 ; 2. వ్యాపించు, ప్రసరించు. భార. అరణ్య. 1.141.
క. తఱు (తఱ్-). కలియు, సమీపించు, దగ్గరకు వచ్చు.

**తనుకులాట** చూ. తన్ను. వి. ప్రాణం పోవటానికి ముందు అటు ఇటు పడటం.

**తనుగాలి** చూ. తనుపు.

**తనుగు** రూ. తన్గు. వి. పలుపు, పశువుల మెడకు వేసి గుంజకు కట్టే తాడు.
క. తనక, తన్క. ఒక ప్రమాణం.

**తనుంగానిది** చూ. తాను[1].

**తనుదాన** చూ. తాను[1].

**తనుదానె** చూ. తాను[1].

**తనుపడు** చూ. తనుపు.

**తనుపారు** చూ. తనుపు.

**తనుపాఱు** చూ. తనుపు.

**తనుపు** రూ.చూ. తన్పు. వి. 1. చల్లదనం, శైత్యం. కు.సం. 3.87 ; 2. తనివి, తృప్తి, తుష్టి. కు.సం. 12.196 ; 3. తడి, చెమ్మ. సారంగ. 2.246 ; 4. పితృయజ్ఞం, పితృతర్పణం. ఆం.భా. 2.171 ; 5. జ్ఞాపకం ; విణ. 1. చల్లని, శీతలమైన. భార. ఉద్యో. 1.93 ; 2. మనోజ్ఞమైన. ఆము. 2.69 ; 3. తృప్తికరమైన ; స.క్రి. 1. సంతుష్టి నొందించు, తృప్తిపరచు. రాశి. 3.226 ; 2. రక్షించు, కాపాడు, వసు. 3.176.

క. తణిపు, తన్. చల్లదనం, జలుబు; తు. తణు. ఆయాసం, అలసట.

**తనుకరువలి** వి. చల్లనిగాలి. పారి. 2.52. <తనుపు+కరువలి. **తనుకాఁడు** వి. తృప్తినిచ్చేవాడు. రాజవా. 3.3. తనుపు+-కాఁడు. **తనుగాలి** వి. చల్లనిగాలి. నిర్వ.రా. 4.78. <తనుపు+గాలి. **తనుపడు** రూ.చూ. తనువడు. అ.క్రి. తనుపు పొందు. <తనుపు+పడు. **తనుపారు** రూ. తనుపాఱు. అ.క్రి. 1. చల్లనగు, శీతలమగు. కు.సం. 5.145; 2. తనియు, తృప్తిపడు. పి.శకు. 3.38; 3. తృప్తికరమగు. భోజ. 5 188. < తనుపు + -ఆరు. **తనుపాఱు** రూ.చూ. తనుపారు. అ.క్రి. తనియు, తృప్తిపడు. హరి. పూ. 8.165. < తనుపు + పాఱు. **తనుపుసేయు (-చేయు)** అ.క్రి. చల్లదనంకల్గించు. కు.సం. 3.87. **తనుపెక్కు** అ.క్రి. చల్లబడు. పండి. చ. 1.443 పు.<తనుపు+ఎక్కు. **తనువడు** రూ. తనుపడు. అ.క్రి. తనుపుపొందు, చల్లబడు. భార. శాంతి. 6.135. < తనుపు + పడు. **తనువొందు** అ.క్రి. చల్లబడు. చంద్రభా. 4.95.

**తనుపెక్కు** చూ. తనుపు.

**తనుబిల్ల** రూ.చూ. తన్నుబిల్ల. వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

**తనుబిళ్ల** రూ.చూ. తన్నుబిల్ల. వి. బాలక్రీడా విశేషం.

**తనుయాత్ర** వి. 1. భోజనం. శృం.నై. 5.19; 2. జీవయాత్ర.

సం. తనుయాత్రా-. శరీరప్రయాణం.

<సం. తనుయాత్రా (అర్థవిపరి.).

**తనువడు** చూ. తనుపు.

**తనువొందు** చూ. తనుపు.

**తనుసు** వి. 1. చదరంగాఉండే గానుగాడిన సున్నపు కుప్ప; 2. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీకట్టిన చిన్న గోడ.

**తనుసుకొను** స.క్రి. పుచ్చుకొను.

**తన్కు**[1] రూ.చూ. తనుకు[1]. అ.క్రి. 1. మండు, జ్వలించు; 2. అతిశయించు; 3. భయపడు; 4. తపించు, పరితాపం పొందు; 5. ప్రకాశించు. వి. 1. భయం; 2. వజ్రకాంతి.

**తన్కు**[2] రూ.చూ. తనుకు[2] అ.క్రి. 1. కలుగు, సంభవించు; 2. వ్యాపించు, ప్రసరించు.

**తన్గు** రూ.చూ. తనుగు. వి. పలుపు. పశువుల మెడకు వేసి గుంజకు కట్టే తాడు.

**తంతరగొట్టు** రూ.చూ. తంత్రగొట్టు. వి. కుచ్చితుడు.

**తంతి**[1] రూ.చూ. తంతియ. వి. 1. వీణ మొ. వాటికి వేసే ఉక్కు తీగ, తంత్రి. ఆం.భా. 1.126; 2. వార్తలందించే ఉక్కు తీగ; 3. వార్తలందించే ఉక్కు తీగద్వారా వచ్చే సమాచారం; 4. సారెముల్లు, వాటల్ని కోయడానికి వాడే సన్నటి పొడుగాటి ఇనపకమ్మి; 5. సన్నటిచువ్వ; 6. ఉండేలుకు కట్టిన తీగ; 7. గోడకట్టేటప్పుడు మునుముందు పెంచుకోడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి, మూరెడెత్తున కట్టే రాతి కట్టుబడి వరస; 8. బగ్గి, మరానుమీద పడుగుతోడేటప్పుడు, అనులు పడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్య పట్టెకు బిగించిన రేకుముక్క; 9. తీగె, మరాను కట్టుబడిలో ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపతీగ(లు); 10. గొలుసు ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు; 11. తారు, ఇనపవడి; 12. నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడదీసిన ఇనపఊచ; 13. పురితాడు.

**తంతిఊచ** వి. నవారుమగ్గం అచ్చులో వరసగా బిగించిన ఇనపతీగలు. **తంతికమ్మి** వి. ఇనపవడి. **తంతికుఱుపు** వి. నారికురుపు. **తంతితీగ** వి. లోహపుతీగ. **తంతివాద్యము** వి. తీగలుగల వాద్యం.

**తంతి**[2] వి. పర్యాయం, సారి, మారు తూరి.

సం. తంతి-. వరస, విరివి.

<సం. తంతి- (అర్థవిపరి.).

**తంతియ** రూ. తంతి[1], తంతె[1]. వి. మెట్టు. ముకుంద. 1.21 పు. 3 పం.

సం. తంత్రీ. వీణ; ప్రా. తంతీ.

<ప్రా. తంతీ (అర్థవిపరి.).

**తంతీపు** వి. ఆశ్చర్యం.

**తంతు** వి. 1. ఉత్సవం. ఆం.భా. 1.143; 2. ఉభయార్థసాధకమైన ఉపాయం; 3. చేయదగిన పని; 4. మోసం.

సం. తంత్ర-; ప్రా. తంత-, తంతు. వాద్యవిశేషం;

క. తంతు. తంత్రం.

<ప్రా. తంతు.

**తంతునడుపు** స.క్రి. వ్యవహారం నడపు.

**తంతె**[1] రూ.చూ. తంతియ. వి. 1. మెట్టు. ఆం.భా. 2.22; 2. ఉండేలు కట్టిన తీగ; 3. మెట్టు ఎక్కడానికి దిగడానికి వీలుగా కట్టిన నిర్మాణం; 4. బట్టీపొయ్యిమీది అంతస్తు; 5. గోడమూల బయటికి పొడుచుకొని వచ్చేటట్లు బిగించిన రాయి; 6. సారెముల్లు, వాటల్నికోయడానికి వాడే సన్నటి పొడుగైన ఇనపకమ్మి; 7. బగ్గి, మరానుమీద పడుగు తోడేటప్పుడు అనులు పడేట్టు పోగును జరపటానికి ఒక కొయ్యపట్టెకు బిగించిన రేకుముక్క; 8. తీగె, మరాను కట్టుబడిలో ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనప తీగ(లు); 9. గొలుసు, ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు; 10. పేటుదారం, నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసిన అంచు పడుగులోకి వేలాడదీసిన దారం; 11. తూకం, పేటువడికి, కిందవేలాడ గట్టిన బరువు; 12. తారు, ఇనపవడి.

**తంతెదబ్బ** వి. అంచుపెంకు కోయడానికి కుమ్మర్లు వాడే విల్లువంటి సాధనం. **తంతెపట్టె** రూ. తెంతిపట్టె. వి. ఒగ్గులపట్టె, మరానుకట్టుబడిలో పడుగుపోగులు దూర్చే, బెజ్జాలుగల రేకుముక్క, ఉంగరాలు బిగించిన రేకుముక్క. **తంతెపూస** వి. ఇనపవడి. **తంతెబండ** వి. మెట్లుకట్టడానికి వాడేరాయి. **తంతెలపట్టె** వి. ఒగ్గులపట్టె.

**తంతె**[2] వి. కాలవ తవ్వినప్పుడు పక్కనవిడిచిన ప్రదేశం.

**తంత్రగొట్టు** రూ. తంతరగొట్టు. వి. కుచ్చితుడు.

సం. తంత్ర-. రాజ్యాదుల పరిపాలన వ్యవస్థ, నీత్యవయవం.

<సం. తంత్ర + - గొట్టు.

**తంద** రూ.చూ. తొందర. వి. తొందరపాటు.

**తందనతానలు** చూ. తందనము.

**తందనపదములు** చూ. తందనము.

**తందనము** రూ. తందాన. వి. **1**. తాన శబ్దపూర్వకంగా చేసే రాగాలాపం; **2**. పోరు, జగడం; గంతులు వేస్తూ సంతోషంతో పాడే పాట.

**తందనతానలు** రూ. తందానతానలు. వి.బ.వ. 'తందన తాన' అనే పల్లవితో పాడేపాట. వేంక. పంచ. 2.133. **తందనపదములు** రూ. తందానపదములు. వి.బ.వ. 'తందాన తాన' అనే పల్లవితో పాడేపాటలు. **తందనాల జడదారి** వి. నారదుడు, కలహముని. కళా. 2.387. **తందనాలు** వి.బ.వ. **1**. కలహం, దెబ్బలాట. భోజసుతా. 1.66; **2**. మాటి మాటికి తాన శబ్దపూర్వకంగా చేసే రాగాలాపన. దశా. 6.137. **తందనాలుతొక్కు** అ.క్రి. చిందులుతొక్కు.

**తందనాలజడదారి** చూ. తందనాలు.

**తందనాలు** చూ. తందనము.

**తందనాలుతొక్కు** చూ. తందనము.

**తందర**[1] వి. **1**. కునికిపాటు. కువ. చ. 2.80; **2**. దిగటం, కాళిందీ. 2.172; **3**. అలసట. రాధికా. 3.112.

సం. తంద్రా. సోమరితనం, అలసట;

క. తంద్రి-. అలసట, సోమరితనం, విసుగు, తంద్రి. మత్తుగాఉండు, అలసటచెందు, శ్రమచెందు.

<సం. తంద్రా.

**తందరమీఱఁగా** క్రి. విశ. ద్రు. బహుప్రయాసంతో. హరభక్త. 1.

**తందర**[2] రూ.చూ. తొందర. వి. **1**. శీఘ్రం, వేగం; **2**. తొందరపాటు.

**తందరబిందర** వి. మానసికకల్లోలం.

**తందర**[3] వి. కలపస్తంభాలకు పంటచెరకుకు ఉపయోగపడే ఒక చెట్టు (Lumnil zeraree mose).

**తందాడు** (-తాడు) వి. మోటతోనిలిపినప్పుడు బొక్కెనవేలాడ గట్టి ఉంచడానికి బిళ్ళకు కట్టేతాడు.

**తందాన** రూ.చూ. తందనము. వి. **1**. తానశబ్దపూర్వకంగా చేసే రాగాలాపం; **2**. గంతులువేస్తూ సంతోషంతో పాడే పాట; **3**. జగడం.

**తందానకత** వి. బుర్రకథ, జంగంకథ. **తందానతానలు** రూ.చూ. తందనతానలు. వి.బ.వ. 'తందానతాన' అనే పల్లవితో పాడేపాటలు. **తందానపదములు** రూ.చూ. తందన పదములు. వి.బ.వ. 'తందానతాన' అనేపల్లవితో పాడే పాటలు.

**తన్నందినవారుతనంతలు** చూ. తాను[1].

**తన్నితగులవేయు** చూ. తన్ను.

**తన్నితలకుపోయు** చూ. తన్ను.

**తన్నినపఱుపుపైపడినతెఱగు** చూ. తన్ను.

**తన్నిపట్టు** చూ. తన్ను.

**తన్నిపెట్టుకొను** చూ. తన్ను.

**తన్నివేయు** చూ. తన్ను.

**తన్నీ** రూ.చూ. తన్ను. వి. బట్టీగోడలు పక్కకువాలి పోకుండా పోటీకట్టిన చిన్నగోడ.

**తన్నీగోడ** రూ.చూ. తన్నుగోడ. వి. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీగాకట్టిన చిన్నగోడ.

**తన్నీరు** వి. **1**. నీరు; **2**. పులక, గింజలు చల్లినతర్వాత ఒక పూట మాత్రమే పెట్టేనీరు.

క. తణ్ణీర్. చల్లటినీరు; తు. తణ్ణి. చల్లన; త. తణ్ణీర్, తణ్ణి. చల్లనినీరు, నీరు; మ. తణ్ణీర్, తణ్ణి.

<ద. తణ్ణీర్.

**తన్నీరుతిత్తులు** వి.బ.వ. నీళ్ళుంచే తిత్తులు. వర. రా. అమో. పు. 254 పం. 17. **తన్నీరుదాసళ్ళు** వి.బ.వ. దేవాలయాల్లో స్థలాది శుద్ధికై నీటినితెచ్చే భక్తులైన సేవకులు.

**తన్ను** రూ. తన్నీ, దన్ను, దిన్ను. స.క్రి. **1**. తాచు (కాలితో) తాడించు, పాదతాడనం చేయు. కు. సం. 9.76; **2**. తాకు, అంటు, స్పృశించు. కు. సం. 9.128; **3**. తోయు. ఆము. 2.75; **4**. కమ్ము, ఆక్రమించు. ఆము. 4.165; **5**. ఒరయు. రామా. 1; **6**. కొట్టు; **7**. మట్టిని ఇసక చేర్చి తొక్కు; వి. **1**. తాపు, పాదతాడనం. దశకు. 9.33; **2**. దెబ్బ; **3**. పోటుకంబం, బోటు; **4**. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీకట్టిన చిన్నగోడ.

క. తళ్ళు, తొయు, విసరు, నిరాకరించు, తళిసు. కొట్టు; తు. తళ్ళుని, తల్లుని. లోపలికితోయు, తల్లుని. కొట్టు, గట్టిగా బాదు; త. తళ్ళు. తోయు, తరిమివేయు, నిరాకరించు, అణచు, తణి. శిక్షించు; మ. తళ్ళుక. తోయు, ప్రతిగాకొట్టు, తల్లుక. కొట్టు, తన్నుక. చితకగొట్టు; కో. తళ్-(తయ్ళ్-). తోయు; తొ. తొల్ (తొల్య్). తోయు; గోం. తన్న్. తోయు, తోసివేయు; కురు. తడ్- (తడ్చ్-). కొరడాతో కొట్టు; పో. చూ. కువి. తహ్. చితగకొట్టు.

మూ. ద్రా.* తళ్-/ *తణ్-.

**తన్నితగులవేయు** స.క్రి. తరిమివేయు. **తన్నితలకుపోయు**. స.క్రి. అవమానించు, దండించు. **తన్నినపఱుపుపైపడిన తెఱగు** వి. చెడుపుచేయగా వానికి మంచి కావటం. పండి. చ. 2.387పు. **తన్నిపట్టు** స.క్రి. కాలితో అదిమిపట్టు. కాశ. 3.118. **తన్నిపెట్టుకొను** స.క్రి. బిగియు చూచు. **తన్నివేయు** అ.క్రి. ఫలమిచ్చేది కాకుండు; స.క్రి. తొలగించు. **తన్నుకలాడు** రూ. తనకలాడు. అ.క్రి. చేసేపనిలో, ఎక్కువశ్రమ పడు. **తన్నుకాడు** అ.క్రి. తన్నుకొను. **తన్నుకుచచ్చు** అ.క్రి. బాధపడు, గింజుకొను. **తన్నుకొను** అ.క్రి. **1**. (బాధతోకాళ్ళు చేతులు) కొట్టుకొను, మిక్కిలి బాధపడు. భాస్క. రా. యు. 991; **2**. ఆలోచించు; స.క్రి. **1**. గట్టిగా అంటిపట్టుకొను; **2**. (అపహరించటానికై పక్షులు) ఆకస్మికంగా పైబడి కాళ్ళతో పట్టుకొను, ఏమర పాటున అపహరించు. **తన్నుకొయ్య** వి. కిందపడకుండా ఆపుగా ఉంచినకొయ్య. **తన్నుకోళ్ళు** వి.బ.వ. పందెంలో తన్నుకొనే కోళ్ళు. **తన్నుగర్ర** (-కర్ర) రూ. తొన్నిగర్ర. వి. మోటబావి.

ఉద్దీమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య. **తన్నుగుంజ** రూ. తన్నుడు గుంజ. వి. మోటబావి ఉద్దీమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య. **తన్నుగోడ** రూ. తన్నీగోడ. వి. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్న గోడ. **తన్ను(గోల (-కోల)** వి. ఏటవాలుగా పోటుపెట్టినకోల, ఊతకర్ర. **తన్నుచీల** రూ. తన్నుజీల. వి. బండినొగలకింద పీటలు బిగించే చీల. **తన్నుజీల** రూ.చూ. తన్నుచీల. వి. బండినొగల కిందపీటలు బిగించే చీల. **తన్నుజెడి** వి. గుజ్జుకర్ర. **తన్నుడు** వి. ఆనిక, పూటీ. **తన్నుడుకొయ్య** వి. పళ్ళచక్రం గూటంపై పట్టెకు ఆధారంగా పక్కగా బిగించిన కొయ్య. **తన్నుడుగుంజ** రూ.చూ. తన్నుగుంజ. వి. మోటబావి ఉద్దీమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య. **తన్నుడుచెక్క** వి. మరమగ్గం బొమ్మకు, నిలువుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **తన్నుడుదిమ్మ** వి. గోడబలానికి పక్కన కట్టిన దిమ్మ. **తన్నుడుబద్ద** రూ. తన్నుబద్ద. వి. ఒకరకం మరాను (=మడతాను) కట్టుబడిలో, కొలకుల కోలకు, చక్రం ఆకుకు అయిమూలగా బిగించిన కొయ్య బద్ద, దోనె ముందర నేసిన గుడ్డ ముడుచకుపోకుండా అడ్డంగా పై వైపున బిర్రుపెట్టే ఒకరకం చేదుబద్ద. **తన్నుబద్ద** రూ.చూ. తన్నుడుబద్ద. వి. ఒకరకం మరాను. **తన్నుబల్ల** వి. 1. ద్వారం అరికాళ్లమీద వేసే బల్ల ; 2. చరణఫలకం, కాలు ఆనుకొని ఎక్క, దిగటానికి ఉపయోగించే బల్ల. **తన్నుబిల్ల** రూ. తనుబిల్ల, తనుబిళ్ల, తన్నుబిళ్ల. వి. కాలితో బిల్ల తన్ని ఆడే ఒక ఆట, బాలక్రీడా విశేషం. కాశ. 3.33. **తన్నుబిళ్ల** రూ.చూ. తన్నుబిల్ల. వి. బాలక్రీడా విశేషం. పాండు. 3.178. **తన్నుమాను** వి. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలువుగుంజ)కు పోటీపెట్టిన ఏటవాలుకొయ్య. **తన్నులాడు** అ.క్రి. ఒకటి కొకటి తన్నుకొను, పరస్పరం తన్నుకొను. ప్రబంధ. 616. <తన్ను + -లు + ఆడు. **తన్నులాడువారు** విణ.బ.వ. కలహించేవారు. కు.సం. 9.80. **తన్నులుతిను** అ.క్రి. దెబ్బలుతిను. **తన్నువడు(-పడు)** అ.క్రి. 1. పరాభవించబడు. శృం.నై. 7.170 ; 2. తన్నులుతిను, తాపులు పడు.

**తన్ను(దానెఱు(గకుండు** చూ. తాను[1].

**తన్నుముంచినదేసముద్రము** చూ. తాను[1].

**తన్నేలినవా(డు** చూ. తాను[1].

**తన్పు** చూ. తనియు. రూ. తనుపు, తంపు. స.క్రి. 1. తృప్తి పరచు. భార.ఆది. 1.89 ; 2. రక్షించు, కాపాడు. కళా. 6.166 ; వి. 1. శైత్యం, చల్లదనం. శృం నై. 2.81 ; 2. తృప్తి. కువ.చ. 5.31 ; 3. పితృయజ్ఞం, పితృతర్పణం ; 4. తడి, చెమ్మ ; విణ. 1. తృప్తికరమైన. ఆము. 2.69 ; 2. మనోజ్ఞమైన. మల్హ. 52.

**తన్వి** రూ.చూ. తనివు. వి. 1. తృప్తి, ఆపోశ. విజయ. 2.111 ; 2. పలుచనైన దేహంగల స్త్రీ ; 3. సాలపర్ణి.

**తన్విసను (చను)** రూ.చూ. తనివిసను. అ.క్రి. తృప్తి నొందు. భార.ద్రోణ. 5.322.

**తన్వు** రూ.చూ. తనివు. విణ. నిండైన, పూర్ణమైన. భీమ. 5.44. వి. తృప్తి.

**తపతప** వి. 1. మద్యపానాదులవల్ల మత్తుతో చేసే నృత్యంలోని పాదధ్వనికి అనుకరణం. ప్రబోధ. 3.60 ; 2. పక్షుల రెక్కలు కొట్టుకొనేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం. కళా. 8.24.

**తపముపండు** అ.క్రి. కోరికలు ఫలించు, కోరిక తీరు. శుక. 4.13.

సం. తపస్. తపం.

<సం. తపస్ + పండు.

**తపల** రూ.చూ. తబల. వి. ఒకరకం మట్టివాద్యం.

**తపలాకుండ** రూ.చూ. తబలాకుండ. వి. తాళాచిప్ప ఆకారంలో చిన్నదిగా, మందంగా, గుండ్రంగా కొద్దిగా తక్కువ మూతితో లోతుగా ఉండే వాద్యం.

**తపశీలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం, తార్కాణం.

**తపసి** రూ. తబిసి, తవిసి. వి. 1. తాపసుడు, ఋషి. భార.ఆది. 4.233, హరి.పూ. 5.92 ; 2. అగస్త్యవృక్షం, అగిసెచెట్టు. మను. 3.77 (Holoptelea Integrifolia) ; 3. బైరాగి, సాధువు. దశా. 1248 ; 4. అడవిమునగ, వనశిగ్రువు. ఆంధ్రపదాకరము. నానా. 59 ; 5. తాపసతరువు; గారచెట్టు, తపస్వి.

సం. తపస్విన్. ఋషి, ముని, ఒకజాతి కానుగచెట్టు ; ప్రా. తవస్సి ; జై.మహా. తపస్సి ; శౌ. తపస్సి ; అ.మా. తపస్సి ; మా. తవశ్శి ;

క. తపసి, తవసి ; త. తపసి, తవసి, తవచి ; మ. తవచి.

<సం. తపస్విన్.

**తపసికన్నుంబాప** రూ.చూ. తపసికన్పాప. వి. అత్రి మహాముని నేత్రాలవల్ల పుట్టిన బిడ్డ, చంద్రుడు. ప్రబంధ. 162. **తపసికన్పాప** రూ. తపసికన్నుంబాప. వి. అత్రి మహాముని నేత్రాలవల్ల పుట్టినబిడ్డ, చంద్రుడు. ప్రబంధ. 51.

**తపారము** రూ.చూ. తప్పరము. వి. ఒకవిధమైన కుళ్ళాయి. ఆము. 2.75.

**తపారు** రూ.చూ. తప్పరము. వి. ఒకవిధమైన కుళ్ళాయి.

**తపాలంచు** రూ.చూ. తపేలంచు. వి. పాత్రలకు బద్దగా వెనక్కి వంచిన అంచు.

**తపాలంటు** రూ.చూ. తప్పేలంటు. వి. తపేలా లోపలిభాగం చుట్టూ వరిపిండి అప్పచ్చులు అంటించి, వేడిచేసి పాకం చేసిన పిండివంట.

**తపాలా** రూ.చూ. టపాలు. వి. టప్పాల్, అంచెలద్వారా ఉత్తరాలు పంపటం.

**తపాలాఅంచు** రూ.చూ. తపేలంచు. వి. పాత్రలకు బద్దగా వెనక్కి వంచిన అంచు.

**తపాళకుండ** రూ.చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర.

**తపికెరాయి** వి. మూడురాయి, కుండమాడును తయారుచేసేటప్పుడు వాడే రాయి.

**తపిక్కున** క్రి.విణ.ధ్రు. వి. తటాలున. ధ్వన్యను.

**తపిల** రూ.చూ. తపెల. వి. లోహపాత్ర, వంటచేసుకొనే కంచుపాత్ర.

**తపిలకడవ** వి. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే తపిలె ఆకారపు మట్టిపాత్ర.

**తపిసిలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం, ఖార్కాణం.

**తపిసీలు** రూ.చూ. తఫిసిలు. వి. ఆరా, వివరం.

**తపుకు** రూ.చూ. తబుకు. వి. పళ్ళెం.

**తపెల** రూ. తపిల, తపేల, తపేలా, తపేళా, తప్పెల, తప్పేల, తప్పేలా, తబేలా[1], తవెల, తెపాల, తెపాలా. వి. పచన పాత్రం, వంటగిన్నె. రాజవా. 2.103.

మరా. తపేలేఁ. పాకానికి ఉపయోగించే పాత్ర, పాత్ర విశేషం ;

క. తపలె, తపేలి. పాత్రవిశేషం ; త. తపిలై.

<మరా. తపేలేఁ.

**తపెలంటు** రూ.చూ. తప్పేలంటు. వి. తపేలా లోపలి భాగం చుట్టూ వరిపిండి అప్పచ్చులు అంటించి, వేడిచేసి పాకం చేసిన పిండివంట.

**తపేటకుండ** రూ.చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర.

**తపేటాకుండ** రూ.చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర.

**తపేడాకుండ** రూ.చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర.

**తపేడాదాక** రూ చూ. తపేలాదాక. వి. వెడల్పుగా లోతుగా అంచు పెద్దదిగా ఉండే మట్టిపాత్ర.

**తపేల** రూ.చూ. తపెల. వి. పచనపాత్రం, వంటగిన్నె.

**తపేలకుండ** రూ. చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర. **తపేలగురిగె** వి. తపేలామాదిరి ఉండే మట్టిపాత్ర. **తపేలంచు** రూ. తపాలంచు, తపాలా అంచు, తపేలా అంచు, తెపాలంచు. వి. పాత్రలకు బద్దగా వెనక్కి వంచిన అంచు.

**తపేలా** రూ.చూ. తపెల. వి. వంటగిన్నె.

**తపేలాఅంచు** రూ.చూ. తపేలంచు. వి. పాత్రలకు బద్దగా వెనక్కి వంచిన అంచు. **తపేలాకుండ** రూ. తపాళకుండ, తపేటకుండ, తపేటాకుండ, తపేడాకుండ, తపేలకుండ. తపేళాకుండ, తేపాలకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర. **తపేలాదాక** రూ. తపేడాదాక, తపేల్దాక, తెపేలాదాక. వి. వెడల్పుగా లోతుగా అంచు పెద్దదిగా ఉండే మట్టిపాత్ర. **తపేల్దాక** రూ. చూ. తపేలాదాక. వి. వెడల్పుగా లోతుగా అంచు పెద్దదిగా ఉండే మట్టిపాత్ర.

**తపేల్దాక** చూ. తపేలా.

**తపేళా** రూ.చూ. తపెల. వి. ఒకరకం ఇత్తడి గిన్నె.

**తపేళాకుండ** రూ. చూ. తపేలాకుండ. వి. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టిపాత్ర.

**తప్తు** చూ. తఖ్తు. వి. సింహాసనం.

**తప్ప**[1] చూ. తప్పు.

**తప్ప**[2] వి. బీజంలేని ధాన్యం, తుచ్ఛధాన్యం, తాలు. ఆం.భా. 2.239 ; విణ. బీజంలేని, నిస్సారమైన (కాయ మొ.).

**తప్పకాయ** వి. విత్తు పట్టని కాయ.

**తప్పక** చూ. తప్పు.

**తప్పకచూచు** చూ. తప్పు.

**తప్పకనుజూచు** చూ. తప్పు.

**తప్పకన్ను** చూ. తప్పు.

**తప్పకుండ** చూ. తప్పు.

**తప్పకుత్తి** చూ. తప్పు.

**తప్పఁజరించు** చూ. తప్పు.

**తప్పఁజూచు** చూ. తప్పు.

**తప్పట** రూ.చూ. తప్పెట[1]. వి. తమ్మట.

**తప్పటగొట్టియార్చు (-కొట్టియార్చు)** స.క్రి. దండోరా వేయు. కళా. 8.25.

**తప్పటడుగు** చూ. తప్పు.

**తప్పటడుగులుపెట్టు** చూ. తప్పు.

**తప్పటలు** రూ.చూ. చప్పట్లు. వి.బ.వ. వేళ్ళు చాపిన అరచేతులను ఒకదానితో ఒకటి కలిసేటట్లు కొట్టే దెబ్బలు.

**తప్పట్లు** రూ.చూ. చప్పట్లు. వి.బ.వ. వేళ్ళు చాపిన అరచేతులను ఒకదానితో ఒకటి కలిసేటట్లు కొట్టే దెబ్బలు.

**తప్పడు** చూ. తప్పు.

**తప్పడుగు** చూ. తప్పు.

**తప్పదాఁటు** చూ. తప్పు.

**తప్పద్రొబ్బు** చూ. తప్పు.

**తప్పనడచు** చూ. తప్పు.

**తప్పనదారులు** చూ. తప్పు.

**తప్పనాడు** చూ. తప్పు.

**తప్పనిసరి** చూ. తప్పు.

**తప్పనూఁకొను** చూ. తప్పు.

**తప్పఁదలఁచు** చూ. తప్పు.

**తప్పఁదార్చు** చూ. తప్పు.

**తప్పఁద్రాగు** చూ. తప్పు.

**తప్పఁద్రొక్కు** చూ. తప్పు.

**తప్పఁద్రోచు** చూ. తప్పు.

**తప్పఁద్రోయు** చూ. తప్పు.

**తప్పఁబలుకు** చూ. తప్పు.

**తప్పరము** రూ. తపారము, తపారు. వి. ఒకవిధమైన కుళ్ళాయి. పండి.చ. 4.279.

**తప్పరించు** చూ. తప్పు.

**తప్పాడు** చూ. తప్పు.

**తప్పాలచెక్క** వి. తపేలా లోపలిభాగం చుట్టూ వరిపిండి అప్పచ్చులు అంటించి, వేడిచేసి పాకంచేసిన పిండివంట.

**తప్పికొను** చూ. తప్పు.

**తప్పిజాతియైన** చూ. తప్పు.
**తప్పించి** చూ. తప్పు.
**తప్పించు** చూ. తప్పు.
**తప్పించుకొను** చూ. తప్పు.
**తప్పిటిపలక** వి. తప్పెట, ఒకవైపు తోలు మూసిన వృత్తాకారపు వాయిద్యం.
**తప్పిడికుండ** వి. తాశాకుండ, గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగా ఉండే మట్టి పాత్ర.
**తప్పిడిగుండ్లు** వి.బ.వ. జాతరలో ఉపయోగించే చిన్న మృదంగం.
**తప్పిడిగుల్లు** రూ.చూ. తప్పిడిగుళ్ళు. వి. తాశాకుండ, గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగాఉండే మట్టిపాత్ర.
**తప్పిడిగుళ్ళు** రూ. తప్పిడిగుల్లు. వి. తాశాకుండ. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగాఉండే మట్టిపాత్ర.
**తప్పితము** చూ. తప్పు.
**తప్పిదము** చూ. తప్పు.
**తప్పిదారి** చూ. తప్పు.
**తప్పినకన్ను** చూ. తప్పు.
**తప్పినవారు** చూ. తప్పు.
**తప్పిపోవు** చూ. తప్పు.
**తప్పిసేయు(-చేయు)** చూ. తప్పు.
**తప్పు** స.క్రి. **1.** అతిక్రమించు, మీరు, ఉల్లంఘించు, దాటు. అహదనకర శాసనం. క్రీ.శ. 847. భార.ఆది. 2.126 ; **2.** కోల్పోవు, పోగొట్టుకొను. భార.విరా. 1.238 ; **3.** విడుచు, వదలు, మాను. నిర్వ.రా. 8.136, భార.ఉద్యో. 3.259 ; **4.** మరచు. భాగ. 1.355 ; **5.** తప్పించుకొను, తొలగించుకొను. శుక. 2.128 ; వి. **1.** అపరాధం, దోషం, నేరం, పాపం, ద్రోహం. భార.ఆది. 4.70 ; **2.** బొంకు, అసత్య వచనం. రం.రా.అయోధ్య. 92 పు. 31 పం. ; **3.** లోపం, కొరత. ఇందు. 1.77 ; **4.** వైయర్థ్యం, నిష్ఫలత్వం, కొరగామి. సారంగ. 2.29 ; **5.** (మైకం మొ. వానిచే ఆడే) అస్ఫుటవచనం; విణ. దోషయుక్తమైన. దుష్టమైన. ఆము. 4.270 ; అ.క్రి. **1.** వ్యర్థమగు, నిష్ఫలమగు. భార.విరా. 1. 63 ; **2.** తొలగు. భార.విరా. 2.108 ; **3.** తప్పుచేయు, అపచారంచేయు, అపకారంచేయు. భార.ఉద్యో. 3.394 ; **4.** పొరపడు, ప్రమాదపడు. భార కర్ణ. 3.3 ; **5.** అనను కూలమగు, ప్రతికూలమగు. భార.కర్ణ. 3.377 ; **6.** దొరక కుండు, చిక్కకుండు, వశంగాకుండు. కేయూ. 3.340 ; **7.** చ్యుతినొందు, జారు.హర. 2.44 ; **8.** తగులకుండు, చెదరు. శృం.నై. 2.67 ; **9.** చచ్చు, మరణించు. భాగ. 3.11 ; **10.** విడివడు (తెగనుండి) వేరుపడు. భాగ. 10 ఉ. 466 ; **11.** హానిచేయు, ద్రోహంచేయు. వరాహ. 3.95 ; **12.** చెడు, పాడగు, నశించు. వరాహ. 9.129 ; **13.** అసత్య మగు, కల్లయగు. వసు. 4.35 ; **14.** కడచు, మించిపోవు. రాఘవ. 4.19 ; **15.** విడుచు ; **16.** అందకపోవు.

క. తప్పు. తప్పటడుగువేయు, జారు, కోల్పోవు, తప్పు చేయు, అపచారం చేయు, పోగొట్టుకొను, వదలుకొను, ఉల్లంఘించు, దోషం, తప్పిదం ; కొడ. తప్ప్. తప్పించు కొను ; తప్పి. పొరపాటు ; తు. తప్పుని. తప్పుచేయు, పాపంచేయు, తప్పించుకొను, పోగొట్టుకొను ; తప్పు. దోషం, పొరపాటు ; త. తప్పు. తప్పుచేయు, తప్పించు కొను, వదిలివేయు, పోగొట్టుకొను, పనికిరాకుండు, తప్పిదం, దోషం ; మ. తప్పుక. పారిపోవు ; తప్పు. పెద్దతప్పు ; కో. తప్(-తప్య-). తప్పు చేయు, పోగొట్టుకొను, తప్పించు కొను ; తొ. తొప్-(తొప్య-). వాయిదావేయు, రాలేక పోవు ; కుఇ. దప. అబద్ధం ; కువి. తప్. అడ్డగించు ; తప్క. శాంతించు ; తప్ప్. తప్పుచేయు ; తప్పహాన్నె. తప్పిపోవు ; కొలా. తప్. చిందరవందరయిన.

< మూ.ద్రా. తప్-, *తవ్.

**తప్పు**[1] అవ్య.ద్రు. వినార్థకం, తక్క, కాక. భార.ఆది. 5.54. <తప్పు+-అ[7]. **తప్పక** తప్పుధాతువు యొక్క వ్యతిరేకక్త్వార్థక రూపం. అవ్య. **1.** తప్పకుండా. భార. ఆది. 2.150 ; **2.** మానక, విడవక. భార.ఆది. 3.52 ; **3.** తదేక దృష్టితో, చలింపక. భార.విరా. 4.267, శృం. నై. 1.65 ; **4.** అవశ్యం, రూఢిగా. భార.స్త్రీ. 2.161 ; **5.** సావధానంగా, శ్రద్ధతో. నీలా. 2.53. **తప్పకచూచు** స.క్రి. నిశ్చలంగా చూచు. కళా. 4.51. **తప్పకనుజూచు (-చూచు)** స.క్రి. పారజూచు. అం.భా. 3.133. **తప్పకన్ను** వి. వంకరకన్ను. ద్వి.పరమ. వి. 4.753. **తప్పకుండ** అవ్య. ద్రు. **1.** తప్పిపోకుండ. భార.ఆది. 3.51 ; **2.** మాన కుండు, అవశ్యం. భీమ. 3.90 ; **3.** సరిగా, యథార్థంగా. కాశీ. 1.104. <తప్పక+ఉండు+-అ[7]. **తప్పకత్తి** వి. 'కంపలటెంకి' అనే ఒకరకం చేప. **తప్పఁజరించు** అ.క్రి. అన్యథా ప్రవర్తించు. భాస్క.రా. అరణ్య. 2.337. <తప్పు+-అ[7]+చరించు. **తప్పఁజూచు** స.క్రి. **1.** ఉపేక్షాభావంతో చూచు, అనాదరం చేయు. భార.ఆది. **4.**92. **2.** అన్యథా భావించు. పల్నా. 13 పు. <తప్పు+-అ[7]+చూచు. **తప్పటడుగు** రూ.చూ. తప్పడుగు. వి. తడబడే అడుగు. **తప్పటడుగులుపెట్టు** అ.క్రి. చిన్నపిల్లలు తడబడుతూ అడుగులువేయు. కళా. 6.197. <తప్పు+అడుగులు పెట్టు. **తప్పడు** స.క్రి. తప్పించుకొను. <తప్పు+పడు. **తప్పడుగు** రూ. తప్ప టడుగు, తప్పటడుగు. వి. తొట్రుపడే అడుగు, తడబడే పాదం, తడబడే నడక. హరి.పూ. 5.185. <తప్పు+ అడుగు. **తప్పదాఁటు** అ.క్రి. తొలగిపోవు, తొలగు. కృ.శకు. 3.33. <తప్పు+-అ[7]+దాఁటు. **తప్పద్రొబ్బు** స.క్రి. తొలగతోయు, పోగొట్టు. విప్ర. 3.64. <తప్పు+-అ[7]+ ద్రొబ్బు. **తప్పనడచు** స.క్రి. మాను, విడుచు. కాశీ. 5.75. <తప్పు+-అ[7]+నడచు. **తప్పనడారులు** వి.బ.వ. తప్పు తోవలు. కు.సం. 5.78. **తప్పనాడు** రూ. తప్పాడు. స.క్రి. **1.** (ద్యూతాదులు) తప్పుగా ఆడు, అక్రమంగా ఆడు. దశకు. 5.64 ; **2.** నిందించు, దూషించు. ప్రబోధ. 3.36. అ.క్రి. అసత్యమాడు, బొంకు. ద్వి.హరిశ్చ. ఉ. 2114.

పం: ఉ.హరి. 3.124. < తప్పు + -అ$^{7}$ + ఆడు. **తప్పనిసరి** వి. అనివార్యం. కృష్ణశ. 51. **తప్పనూఁకొను** స.క్రి. అశ్రద్ధగావిను. ఆము. 4.7. < తప్పు + -అ$^{7}$ + నూఁకొను. **తప్పఁదలఁచు** అ.క్రి. అన్యథాభావించు. భార.ద్రోణ. 2.248. < తప్పు + -అ$^{7}$ + తలఁచు. **తప్పఁదార్చు** స.క్రి. తప్పుదారి పట్టించు. హంస. 4.103. < తప్పు + -అ$^{7}$ + తార్చు. **తప్పఁద్రాగు** అ.క్రి. స్మృతి తప్పేటట్టు మద్యాదులు తాగు. < తప్పు + -అ$^{7}$ + త్రాగు. **తప్పఁద్రొక్కు** స.క్రి. విడుచు, వర్జించు. భార.ఆది. 5.54. < తప్పు + -అ$^{7}$ + త్రొక్కు. **తప్పఁద్రోచు** స.క్రి. తొలగతోయు, పోగొట్టు. రాఘవ. 1.31. < తప్పు + -అ$^{7}$ + త్రోచు. **తప్పఁద్రోయు** స.క్రి. తొలగతోయు, పోగొట్టు. విష్ణుపు. 4.337. < తప్పు + -అ$^{7}$ + త్రోయు. **తప్పఁబలుకు** అ.క్రి. అసత్య మాడు. బొంకు. భార.ఆది. 4.78 ; స.క్రి. తప్పుగా చెప్పు, అక్రమంగా చెప్పు. భార.ఆది. 7.254. < తప్పు + -అ$^{7}$ + పలుకు. **తప్పరించు** స.క్రి. తప్పించుకొను, వంచించు, మోసపుచ్చు. చెన్న బసవ. 5.142. < తప్పు + -ఇంచు$^{3}$. **తప్పాడు** రూ.చూ. తప్పనాడు. స.క్రి. నిందించు, దూషించు. భాస్క.రా. ఆరణ్య. 2.84. < తప్పు + ఆడు. **తప్పికొను** స.క్రి. ఉల్లంఘించు. ద.హిం.శా. సంపు. 10. శా. సం. 76. అ.క్రి. అపచారం చేయు. **తప్పిజాఱియైన** అవ్య. ద్రు. పొరపాటుగా అయినా. అచ్చ.రా. సుందర. **తప్పించి** అవ్య. వినార్థకం, కాక, తక్క. రం.రా. ఉ. 5.20. కాశీ. 2.83. **తప్పించు** స.క్రి. 1. తొలగించు, పోగొట్టు. భార. భీష్మ. 1.190 ; 2. చెడచేయు, నశింపచేయు. భార.భీష్మ. 3.6 ; 3. తప్పించుకొను, తొలగించుకొను. భార.భీష్మ. 3.450 ; 4. దొరకకుండ చేయు, దూరం చేయు. ఆము. 4.226 ; 5. కడపు, మించిపోచేయు. విష్ణుపు. 4.213 ; 6. విప్పు, విడచేయు. కవిక. 1.17 ; 7. చేయక విడచు, మాను. రామలిం. 57. < తప్పు + -ఇంచు$^{3}$. **తప్పించుకొను** స.క్రి. తప్పుకొను. భార. విరా. 2.48. **తప్పితము** రూ.చూ. తప్పిదము. వి. 1. దంభం ; 2. తప్పు, నేరం. **తప్పిదము** రూ. తప్పితము. వి. 1. పొరపాటు, ప్రమాదం. భార.ద్రోణ. 4.288 ; 2. నేరం, అపరాధం. ద్వి.సార.చ. 1.43 పు. 11 పం. **తప్పిదారి(-తారి)** అవ్య. 1. దైవవశాన, ఒక వేళ. ఆము. 2.27 ; 2. ప్రమాదపడి, పొరపడి. పాండు. 1.221 ; 3. చెదరి, చెదరిపడి. శుక. 3.258 ; 4. గురితప్పి. కృ.శకు. 2.33. **తప్పినకన్ను** వి. సరిగాలేని కన్ను. పండి.చ. 2. 4. పు. 108. **తప్పినవారు** విణ బ.వ. 1. పోగొట్టుకొన్నవాడు. అహదనకర శాసనం. క్రీ.శ. 847 ; 2. దేవాలయాల్లో తీర్థప్రసాదాలు పొందటానికి అర్హులుకానివారు. క్రీ.శ. 1603. A.P.G.A.S. 3.40 ; 3. (మంత్రతంత్రాల్ని) జపించ టానికి అధికారం లేని వారు. A.P.G.A.S. 3.40 ; 4. (ఆయా దేవతలకు) అపచారం, లేక పాపం చేసేవారు. క్రీ.శ. 1603. A.P.G.A.S. 3.40 ; 5. (విభూతి రుద్రాక్షలను) ధరించటానికి అర్హత లేని వారు. **తప్పిపోవు** అ.క్రి. అలసిపోవు. **తప్పిసేయు(-చేయు)** స.క్రి. తప్పుచేయు.

తాళ్ల.సం. 17 సంపు. 448 కీర్తన. **తప్పుకల్గు** అ.క్రి. పొరపాటు జరుగు. పారి. 1.116. **తప్పుకాచు** స.క్రి. మన్నించు, (తప్పును) క్షమించు. **తప్పుకొను** అ.క్రి. 1. అపసరిల్లు, తొలగు. కళా. 8.100 ; 2. తప్పుచేయు, అపరాధం చేయు. **తప్పుకోలు** వి. తప్పుచేయటం. శుక. 2.368. **తప్పుగాలి** వి. తప్పుగా వీచినగాలి. తాళ్ల. 11 సంపు. 79 వ. కీర్తన. **తప్పుచేయు** రూ. తప్పుసేయు. స.క్రి. తప్పుగా తలచు. విష్ణుపు. 6.40. **తప్పుటడుగు** రూ.చూ. తప్పడుగు. వి. 1. తొట్రుపడే అడుగు, తడబడే పాదం, తడబడే నడక. ఇందు. 2.141 ; 2. (భయాదులచే) తడబడే అడుగులు. వేం.మా. 4.56. < తప్పు + అడుగు. **తప్పుటడుగువెట్టు(-పెట్టు)** అ.క్రి. చిన్నపిల్లలు అడుగులు తడబడుతూ నడచు. కాళ. 3.30. **తప్పుడు** వి. 1. తప్పటం, తప్పుదల. విణ. చెడ్డ. **తప్పుడుగాయ** వి. ఒకా నొక పక్షి. **తప్పుడుపొయ్యి** వి. కాళ్యాములో గాలి పోవడానికి ప్రత్యేకంగా ఉంచిన పొయ్యి. **తప్పుడుపోగు** వి. ఆసు పోసినపుడు, పడుగులో ఆనిపడకుండా తప్పిన పోగు. **తప్పుడువడు(-పడు)** అ.క్రి. తప్పుపడు, దోషి అగు. **తప్పుతంట** వి. జంటపదం. రాధికా. సాం. 3.27. **తప్పుతీయు** అ.క్రి. తప్పుపట్టు. **తప్పుత్రోవ** వి. తప్పుదారి. ఆం.భా. 3.33. **తప్పుదండుగలు** వి.బ.వ. జరిమానాలు. కుక్కు. 19. **తప్పుదల** వి. తప్పటం. **తప్పుదారి** వి. తప్పు తోవ, అపథం. **తప్పుదెబ్బలు** వి.బ.వ. 1. బడికి పొద్దుపోయి వచ్చినందుకు వచ్చిన క్రమాన్ని బట్టి బాలుర్ని ఉపాధ్యా యులు కొట్టే ఒకటి రెండు మూడు మొ. దెబ్బలు ; 2. నేరస్థునికి విధించే దెబ్బలు. **తప్పున** రూ.చూ. చప్పున. క్రి.విణ.ద్రు. శీఘ్రంగా, వెంటనే. **తప్పునీళ్లు** వి.బ.వ. కల్లు, మద్యం. శుక. 3.23. **తప్పుఁదెరువు (-తెరువు)** వి. తప్పు దారి. కాశీ. 5.64, తాళ్ల. 9 వ. సంపు. 274 వ కీర్తన. **తప్పుఁదోపులు(-తోపులు)** వి.బ.వ. తప్పుగా దోచు కోవటం, కొల్లగొట్టడం. తాళ్ల. 5 వ సంపు. 91 వ కీర్తన. **తప్పుపట్టు** రూ.చూ. తప్పువట్టు. స.క్రి. లోపమెన్ను. కళా. 3.256. **తప్పుపని** వి. తప్పించు కోటానికై కల్పించే పని. కువ.చ. 3.72. **తప్పుమీఁదఁబెట్టు (-పెట్టు)** స.క్రి. తప్పుమోపు. భార. శాంతి. 2.366. **తప్పులతడక** వి. తప్పులు కుప్పలుగా ఉన్నటు వంటిది. సుగ్రీవ. 47. **తప్పులుపట్టు** రూ. తప్పులువట్టు. స.క్రి. 1. దోషిగా ఎంచు. విష్ణుపు. 2.321 ; 2. తక్కువ పరచు ; 3. దోషాలను ఎంచు. **తప్పులువట్టు (-పట్టు)** రూ.చూ. తప్పులుపట్టు. స.క్రి. 1. దోషాలనెంచు. చంద్రాంగ. 4.189 ; 2. దోషిగా తలచు. **తప్పులెంచు** స.క్రి. తప్పులుపట్టు. < తప్పు + -లు + ఎంచు. **తప్పులోఁగొను** స.క్రి. తప్పు క్షమించు. వర.రా. కిష్కిం. పు. 448 పం. 23. **తప్పువట్టు(-పట్టు)** రూ. తప్పుపట్టు. స.క్రి. 1. తప్పులెంచు. పండి. చ. 2.4 ప్ర. 186 పం ; 2. లోపం. ఉ.రా. 1.178 ; 3. దోషిగానెంచు. **తప్పువడు(-పడు)** అ.క్రి. తప్పుడువడు, తప్పు చేయు, దోషియగు. భాగ. 9.543. **తప్పుసేయు(-చేయు)** రూ.చూ. తప్పుచేయు. స.క్రి. తప్పుగా తలచు. మను. 2.73.

**తప్పెట**[1] రూ. తప్పట, తబట. వి. చర్మవాద్య విశేషం. యయా. 4.158.

క. తంబటు, తంబటె, తపటె, తప్పటె, తబటె, తమటె, తమ్మటు, తమ్మటె. కంజరి, పెద్ద చర్మ వాద్యం; తు. తంబటు, తంబటె, తమ్మటె. గిలకలు తప్పెట, భేరి (యుద్ధాలలో వాయించే డోలు); త. తంపట్టమ్. చర్మవాద్య విశేషం; తప్పట్టై, తప్పట్టమ్. గిలకలు తప్పెట; మ. తప్పిట్టు; నా. తప్ప. డోలు, వాద్య విశేషం, తప్పటె.

**తప్పెట**[2] వి. అడవి ఉలవ, వనకులత్థం. ఆం.భా 2.58.

**తప్పెట**[3] వి. 1. వృత్తాకారంలో ఉండే మట్టిపాత్ర; 2. డబ్బు.

**తప్పెల** రూ.చూ. తపెల. వి. పచనపాత్రం, వంటగిన్నె.

**తప్పేల** రూ.చూ. తపెల. వి. పచనపాత్రం, వంటగిన్నె.

**తప్పేలంటు** రూ. తపాలంటు, తపెలంటు. వి. తపేలా లోపలి భాగం చుట్టూ వరిపిండి అప్పచ్చులు అంటించి, వేడిచేసి పాకం చేసిన పిండి వంట.

**తప్పేలా** రూ.చూ. తపెల. వి. పచనపాత్రం, వంటగిన్నె.

**తప్సిలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం, తార్కాణం.

**తప్సీలు** రూ.చూ. తఫిసిలు. వి. లెక్కల వివరం.

**తఫశీలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం, తార్కాణం.

**తఫామతు** చూ. తఫావతు. వి. 1. వేరు, అంతరం; 2. వ్యత్యయం; 3. లోపం.

**తఫారతు** రూ.చూ. తఫావతు. వి. 1. వేరు, అంతరం; 2. వ్యత్యయం; 3. లోపం.

**తఫావతు** రూ. తఫామతు, తఫారతు, తఫావత్తు, తభావతు. వి. 1. భేదం; 2. లోపం; 3. తక్కువ; 4. మాటతేడా; 5. వేరు, అంతరం, వ్యత్యయం.

హిం.మరా. తఫావత్. అంతరం, భేదం; ఉ. తఫావుత్. అంతరం, వేరు, విలంబం; పార. తఫావుత్. భేదం, దూరం; అర. తఫావుత్. తేడా, అంతరం, దూరం.

<ఉ. తఫావుత్.

**తఫావత్తు** రూ.చూ. తఫావతు. వి. 1. వేరు, అంతరం వ్యత్యయం; 2. లోపం.

**తఫిశీలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం, తార్కాణం.

**తఫిసిలు** రూ. తపశీలు, తపిసిలు, తపిసీలు, తప్సిలు, తప్సీలు, తఫశీలు, తఫిశీలు, తఫిసీలు, తబిసీలు, వి. వివరం, తార్కాణం.

హిం.ఉ.పార.అర. తఫ్సీల్. వివరణలు, లెక్కలు, కైఫీయత్తు; మరా. తవ్శిల. వివరణం.

<ఉ. తఫ్సీల్.

**తఫిసీలు** రూ.చూ. తఫిసిలు. వి. వివరం.

**తబసి** రూ. తబసె, తబును, తబ్బు. వి. ఆటబొమ్మల కుపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Sterculia Urens).

**తబసె** రూ.చూ. తబసి. వి. ఆటబొమ్మల కుపయోగించే కలప నిచ్చే ఒకరకం చెట్టు.

**తబక** చూ. తబుకు. వి. 1. పలుకులేని (జొన్న) గింజ. ఆం.భా. 2.238; 2. తప్ప, గింజలేని కాయ. రెట్టమతము. 1.60.

**తబట** రూ.చూ. తప్పెట[1]. వి. వాద్య విశేషం.

**తబము** వి. తపస్సు. యయా. 2.43.

సం. తపస్. తపస్సు; ప్రా. తబ, తవ; అ.మా. తవ; అప. తవు;

క. తవ. తపస్సు; త. తపమ్, తవమ్.

<ప్రా. తబ-.

**తబరగిన్నె** వి. మాంసం వండుకోడానికి వాడే వెడల్పు మట్టి పాత్ర.

**తబల** రూ. తపల, తబలా, తబలె. వి. 1. ఒకేకన్ను కలిగి మద్దెలను పోలిన చర్మవాద్యం. వరాహ. 3.52; 2. ఒకరకం కుండ.

హిం. తబ్లా. ఒకవిధమైన మద్దెల; ఉ. తబ్ల్; మరా. తబలా; పార. తబ్ల్, తబ్లా, తబ్ల; అర. తబ్లా.

<ఉ. తబ్ల్.

**తబలా** రూ.చూ. తబల. వి. చర్మవాద్య విశేషం.

**తబలాకుండ** రూ. తపలాకుండ. వి. తాకాచిప్ప ఆకారంలో చిన్నదిగా, మందంగా, గుండ్రంగా కొద్దిగా తక్కువమూతితో లోతుగా ఉండే వాద్యం.

**తబలె** రూ.చూ. తబల. వి. ఒకరకం కుండ.

**తబాయగు** అ.క్రి. చెడిపోవు.

హిం.ఉ. తబాహ్. నాశం, నష్టం, పూర్తిగా చెడి పోయినది.

<ఉ. తబాహ్+అగు.

**తబిలెసట్టి (-చట్టి)** చూ. తబల. వి. మూతి వెడల్పుగా ఉండే వంటచేసుకోడానికి వాడే మట్టిపాత్ర.

**తబిసి** రూ.చూ. తపసి. వి. 1. ముని, ఋషి. హర. 7.55; 2. సన్యాసి. ఆం.భా. 2.176; 3. తపసిచెట్టు.

**తబిసీలు** రూ.చూ. తఫిసిలు. వి. కైఫియత్తు. బే.ప. 77.

**తబుకు** రూ. తపుకు. వి. 1. వెదురుపళ్ళెం. రం.రా.బాల. 76 పు. 7 పం.; 2. తమలపాకులపళ్ళెం; 3. పళ్లెం.

హిం.ఉ.మరా.పార.అర. తబక్. వెడల్పైన పళ్ళెం.

<ఉ. తబక్.

**తబుణ్డు** రూ. తబుస్డు, తమ్ముణ్డు, తమ్ముండు. వి. తమ్ముడు. కపిలేశ్వరపురం శాసనం. తూ.గో. జిల్లా. క్రీ.శ. 740.

పో.చూ. క. తమ్మ. తమ్ముడు; కొడ. తమ్మణె; తు. తమ్మెయ. చిన్నతమ్ముణ్ణి ప్రేమగా పిలిచే విధం, త. తంపి. చిన్నతమ్ముడు; మ. తంపి, తంపాన్: కొండ. తంబెజి, తంబెజ్సి; గోం. తమ్మర్, తమ్ముడాల్; కుఇ. అంబెస, తంబెస; కొలా. ఐల్తామా. చెల్లెలిభర్త.

మూ.ద్రా. మూ.మ.ద్రా. *తమ్బ్-.

**తబుస్డు** రూ.చూ. తబుణ్డు. వి. చిన్నతమ్ముడు.

**తబును** రూ.చూ. తబసి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగ పడే మెత్తని కలప కలిగిన ఒక పెద్దచెట్టు (Sterculia Urens).

**తబేల** రూ. తబేలా[2]. వి. అశ్వశాల.

హిం. తబేలా. గుర్రాల్ని కట్టే శాల; మరా. తబేలా

అశ్వాల ; పార. తవీలహ్. అశ్వాల.

<మరా. తబేలా.

**తబేలా**[1] రూ.చూ. తపెల. వి. పచనపాత్రం, వంటగిన్నె.

**తబేలా**[2] రూ.చూ. తబేల. వి. గుర్రాల్ని కట్టే చావడి.

**తబ్దీలు** వి. 1. మార్పు ; 2. రవాణా.

హిం.ఉ.పార.అర. తబ్‌దీల్. మార్పు.

<ఉ. తబ్‌దీల్.

**తబ్బిబ్బగు** చూ. తబ్బిబ్బు.

**తబ్బిబ్బు** విశ 1. వ్యాకులమైన, కలతనొందిన. శివరా. 4.81 ; 2. సంకులమైన, తుములమైన. పి.శకు. 3.219 ; 3. తడబాటుకల, తొట్రుపాటుపొందిన. కళా. 6.128 ; 4. వ్యత్యస్తమైన, తారుమారైన, విపరీతమయిన. కళా. 8.140 ; 5. అసత్యమైన. వేం.మా. 5.38 ; వి. 1. తడబాటు, తొట్రుపాటు. మను. 3.28 ; 2. వైపరీత్యం, వ్యత్యయం. కళా. 5.24 ; 3. వ్యత్యస్తవచనం, విపరీతపు మాట. ప్రభులిం. 3.82 పు. 24 పం. ; 4. టక్కు, మాయ, వంచన. శుక. 2.253.

క. తబ్బరిసు. విస్మయంపొందు, గాబరాపడు, తికమక పడు ; తబ్బిబ్బు. దిగ్భ్రమచెందు, గాబరా, చిక్కు ; తు. తబ్బిబ్బు, తబ్బుదిబ్బు. పరధ్యానం, వ్యాకులం, కలత, గందరగోళం, భేదం, మార్పు, వ్యత్యాసం, క్రమంగాలేని.

**తబ్బిబ్బగు** అ.క్రి. తల్లక్రిందులగు; తన్మయమగు.

**తబ్బిబ్బుపాటు** వి. తడబాటు. కువ.చ. 2.114.

**తబ్సు** రూ.చూ. తబసి. వి. ఆటబొమ్మల కుపయోగించే కలప నిచ్చే చెట్టు (Sterculia Urens).

**తభావతు** రూ చూ. తఫావతు. వి. అనుకొన్న నిర్ణయానికి వ్యతిరేకంగా నడవటం.

**తమ** చూ. తాము.

**తమకపడు** చూ. తమకము[1].

**తమకము**[1] వి. 1. మోహం. భార.అరణ్య. 1.360 ; 2. ఉత్సాహం, పూనిక. నిర్వ.రా. 8.73 ; 3. త్వర, సంభ్రమం. భార.ద్రోణ. 1.209, ఉ.హరి. 4.253 ; 4. బాళి, కాంక్ష, కోరిక. భార.ద్రోణ. 5.314 ; 5. ఉత్కంఠ, తహతహ, వేడుక. విక్ర. 2.105 ; 6. చెలిమి, స్నేహం; 7. యువతీయువకుల సంభృతప్రేమ.

క. తవక. కోరిక, వాంఛ ; తు. తబకుని. కోరిక, వాంఛ, కాంక్ష, ఆపేక్ష. తబెపుని. కోరిక, ఆతురతతో కూడిన కోరిక.

**తమకపడు** అ.క్రి. 1. వేగిరపడు, తొందరపడు. భాస్క. రా.యు. 1684, జైమినిభా. 2.22 ; 2 ఉత్కంఠపొందు, తహతహపడు. శృం.నై. 6.84 ; 3. మోహపడు. **తమకి** వి. 1. లోభి, స్వార్థపరుడు. భార.శాంతి. 2.179 ; 2. తమకం కలవాడు, తమకం కలది ; 3. త్వరకలవాడు, త్వరకలది. <తమకము+-ఇ.[9] **తమకించు**[1] అ.క్రి. 1. మోహించు. కు.సం. 9.104 ; 2. గమకించు, ఉత్సహించు, యత్నించు. భార.విరా. 3.191 ; 3. తొందరపడు, వేగిర పడు. భార.శాంతి. 2.178 ; 4. తలకు, జంకు. నార. పంచ. 2.11.

**తమకము**[2] రూ.చూ. తమగము. వి. కోట వెలుపలి మండపం. ఆం.భా. 3.55.

**తమకి** చూ. తమకము[1].

**తమకించు**[1] చూ. తమకము[1].

**తమకించు**[2] చూ. తమకు.

**తమకు** వి. విధం, రీతి. పాండు. 3.178 ; 2. (భయంవల్ల) అడగు. దాగు. చంద్రాంగ. 6.94 ; 3. భయపడు. హరిశ్చ. 4.114.

క. తవు, తవుంకు. తగ్గు, తగ్గించు, తగ్గిపోవు, వాలి పోయిన, అణిగిఉండటం ; తు. తమకె. ఆలస్యం, ఆల స్యం చేయడం; త. తవంకు (తవంకె). అడ్డగించు, ఆటంక పరచు, ఆలసించు, బాధపడు, తవక్కమ్. ప్రతిబంధకం, అడ్డం, పేదరికం, ఆలస్యం. తవక్కు, అవమానానుభవం, తవంకమ్. దుఃఖం, విచారం.

**తమకించు**[2] స.క్రి. చలింపజేయు, భయపెట్టు. కృ.శకు. 1.5.

**తమగము** రూ. తమకము[2]. వి. 1. రాజు మొ॥ వారు కూర్చో డానికి ఏర్పరచిన ఉన్నతస్థలం, హరి.పూ. 9,59, భాగ. 10 పూ. 2372 ; 2. కోట వెలపలి మండపం, మండపం, రామాభ్యు. 6.128, కువ.చ. 2.51 ; 3. మంచె.

సం. తమఙ్గ-, తమంగ. మంచె, వేదిక ; ప్రా. తమఁగ- ;

క. తమంగ, తనగ, తవంగ. వేదిక, అరుగు ; త. తముక్కమ్. వేసవివిడిది, రాజప్రాసాదం ; మ. తము, క్కమ్. ఏనుగులు పోరాడేతావు.

<ప్రా. తమంగ.

**తమట** వి. కీల, అగ్నిజ్వాల. ఆం.నా.శే. 70.

**తమటము** రూ.చూ. తమ్మటము. వి. చర్మవాద్య విశేషం. తప్పెట. రుక్మా. చ. 1.121. ఆం.భా. 1.127.

**తమర** రూ. తమరు[2]. వి. పగులు, చీల్పు, కొమ్మలో చీలు కొమ్మ పుట్టినచోటు.

త. తమర్. పగులు, చీల్పు, తమరె. కొమ్మ, పంగ. మ. తమర్. పగులు, చీల్పు.

<త. తమర్.

**తమరకట్టె** రూ.చూ. తమరుకట్టె. వి. ఆము కాల్పుకు ముళ్ళ కంపల్ని తీసుకు రావడానికి వాడే పంగలకర్ర. **తమర కొయ్య** వి. ఎదురు దోనెను మోసే ఎడమవైపు కొయ్య గూటం.

**తమరసము** రూ. తమ్మరసము. వి. తాంబూల రసంలాగ ఎర్ర నైనది. విప్ర. 2.24.

**తమరు**[1] సర్వ బ.వ. మీరు. పల్నా. 119.

క. తామ్, తమ్, తావు, తవ్. వారు, తమరు, నీవు. కొడ. తంగ. తమరు ; త. తామ్, తమ్, తమ్మ్. వారు, తమరు, నీవు ; మ. తామ్, తమ్, తమ్మ్. తమరు ; కో. తమ్. తమరు ; తొ. తమ్. తమరు ; గోం. తమ్మా తమ్మట్. తమరు, వారు ; కుఇ. తారు, తాయి, తాఅన్. తమరు, వారు ; కువి. తంబూ, తమ్, తాంబు, తమ్. వారు, తమరు ; ప. తామ్, తమ్. వారు, తమరు ; కొలా.

తమ్. వారు, తమరు; గ. ఒల్లా. తామ్, తమ్; కుర్. తామ్, తమ్; మాల్తో. తమ్, తమి.

**తమరు²** రూ.చూ. తమర. వి. చెట్టుకువేసే పక్క కొమ్మ, కొమ్మ, పంగ.

**తమరుకట్టె** రూ. తమరకట్టె, తమిరెకట్టె. వి. రాగోల, ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగలకర్ర.

**తమర్త** రూ. తమర్తము. వి. ఊరగాయకు ఉపయోగించే పళ్ళు కాసే వృక్ష విశేషం (Averrhoea Carambola).

త. తమరత్తయ్. వృక్షవిశేషం; మ. తమరత్త.

**తమర్తము** రూ.చూ. తమర్త. వి. ఊరగాయకు ఉపయోగించే పుల్లని పళ్ళుకాసే ఒకరకం చెట్టు.

**తమలపాకార్చి** చూ. తమలము.

**తమలపాకు** చూ. తమలము.

**తమలము** రూ.చూ. తమ్మలము. వి. తమలపాకులతీగ. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 1188, క్రీ.శ. 1250, హర. 1.15. (Piperbetle).

**తమలపాకార్చి** రూ. తమ్మలపాకార్చి. వి. మధ్యభాగం గుమ్మటంలాగుండి, పై చివర మొనదేలి ఉండే ఆర్చి. < తమలపాకు + ఆర్చి. **తమలపాకు** రూ.చూ. తములపాకు. వి. 1. తాంబూలపు ఆకు. పీఠి. 32; 2. స్త్రీ శిరోభూషా విశేషం. < తమలము + ఆకు. **తమలంపుటిరులు** వి. తాంబూలపు రక్తిమలో చేరిన నీలకాంతులు. < తమలము + ఇరులు.

**తమలంపుటిరులు** చూ. తమలము.

**తమాం** రూ.చూ. తమాము. విశ. సమస్తం.

**తమాట** రూ.చూ. టొమాటో. వి. రామములగ, చల్లటిచోట తోటల్లో పెంచే పైరు (Averrhoea Carambola).

**తమాటకాయ** వి. టొమేటొకాయ.

**తమాను** వి. హిజారు, పొడుగులాగు, పైజామా, ఇజారు. పార్వ. 5.149.

మరా. తుమ్బా. ఇజారు, పైజామా; ఉ. పార. తుంబాన్.

< ఉ. తుంబాన్.

**తమాము** రూ. తమాం. విశ. అంత. క్రి.విశ. పూర్తిగా. సంపూర్ణం. ద.హిం.శా.సంపు. 10, శా.సం. 772. క్రీ.శ. 1696.

హిం. మరా. ఉ. పార. అర. తమామ్. అంతా, మొత్తం, ముగింపు.

< ఉ. తమామ్.

**తమాయించు** అ.క్రి. 1. నిదానించు, సంబాళించు; 2. శాంతించు, శమించు.

**తమాషా** రూ. తమాసా, తమాసు. వి. వేడుక.

హిం. తమాశా. తమాషా, వేడుక; మరా. తమాశా. దృశ్యం, ప్రదర్శనం, గమ్మత్తు, నాటకం, కుస్తీ; ఉ. తమాశా. క్రీడ, మనోరంజక దృశ్యం, అద్భుతవస్తువు; పార. తమాశా. కాలక్షేపంకోసం ఇతరదేశాలకు వెళ్ళటం, ప్రదర్శనం, నాటకం, సంతోషం, క్రీడ; అర. తమాశీ, తమాశా. గతి, స్థితి.

< ఉ. తమాశా.

**తమాసా** రూ.చూ. తమాషా. వి. 1. చమత్కారం. కటి.శ. 70; 2. గమ్మత్తు; 3. వేడుక; 4. ప్రజ్ఞ; 5. శక్తి; 6. మాయ.

**తమాసు** రూ.చూ. తమాషా. వి. బాళి, కోరిక. ప్రబంధ. 640, పార్వ. 5.149.

**తమి** చూ. తమకము¹. వి. 1. ఉత్సాహం, పూనిక. కు.సం. 4.104; 2. త్వర, తొందర. మను. 3.97; 3. ఆసక్తి, ఆపేక్ష, కుతూహలం. మను. 6.13, యయా. 3.52; 4. వలపు, మోహం. మను. 6.41; 5. పారవశ్యం, మైమరపు. వసు. 4.75.

**తమికొను** అ.క్రి. 1. మోహపడు; 2. అపేక్షపడు; 3. కుతూహలపడు; 4. త్వరపడు, **తమికొల్పు** స.క్రి. మోహపరచు, వలపించు. అచ్చ.రా. అరణ్య. 58. **తమిపుట్టు** అ.క్రి. కోరికపుట్టు, అపేక్షపడు. తాళ్ల. సంపు. 6.195వ కీర్తన. **తమిరేచు** స.క్రి. కోరికను రేపు. సంపు. 7.83 వ కీర్తన.

**తమిద** రూ.చూ. తవ్వింద. వి. చోడిపైరు.

**తమిదె** రూ.చూ. తవ్వింద. వి. చోడిపైరు.

**తమిద్ర** రూ.చూ. తవ్వింద. వి. సస్యవిశేషం, చోడిపైరు. రాగులు. గడ్డి పశుగ్రాసంగా ఉపయోగపడుతుంది (Eleusine coracana, Gaerten cynosurus).

**తమిద్రపిండి** వి. చోడిపిండి. చెన్నబసవ. 2.47.

**తమిద్రరొట్టె** వి. చోడిరొట్టె. ప్రబంధ. 132.

**తమిర** రూ.చూ. తగిరె. వి. పనకంచీల, కాడిమధ్యవైపున కొట్టిన ఇనపమేకు.

**తమిరి** రూ.చూ. తగిరె. వి. పనకంచీల.

**తమిరె** రూ.చూ. తగిరె. వి. కాడిమధ్యచీల, శమ్య.

**తమిరెకట్టె** రూ.చూ. తమరుకట్టె. వి. రాగోల, ముళ్ళకంప ఎత్తడానికి వాడే పంగలకర్ర.

**తమిళము** వి. అరవభాష.

క. తమిళు. తమిళభాష; త. తమిళ్; మ. తమిళ్. సం. ద్రావిడ-; ప్రా. దమిలా, దవిడ, దవిడీ, దవిళ, దామిలీ; శౌ. దమిళ, దవిడ; అ.మా. దమిళా, తవిళ, దామిల, దామిలి; పా. దమిలీ.

< త. తమిళ్.

**తముకు** రూ. టంకు², టముకు. వి. 1. చర్మ వాద్య విశేషం, తుడుం. ప్రబంధ. 622; 2. దండోరా చాటింపు. శుక. 2.548.

ఉ. తమ్‌క్. ఆజ్ఞల్ని ప్రకటించడంకోసం వాయించే వాద్య విశేషం.

త. తముక్కు. చర్మవాద్య విశేషం.

< ఉ. తమ్‌క్.

**తముకువేయు** స.క్రి. 1. తలారి తముకు వాయిస్తూ ప్రకటించు. శుక. 4.111; 2. ప్రకటించు.

**తములపాకు** చూ. తములము.

**తములపుటాకు** చూ. తములము.

**తములము** రూ.చూ. తమ్మలము. వి. 1. పోకచెక్కలు మొ.నవి గల నాగవల్లీదళం, వీటిక. దశకు. 3.80; 2. నమిలిన. నాగవల్లీదళాదికం, తమ్మ. హర. 1.15.

**తములపాకు** రూ. తమలపాకు, తములపుటాకు. వి. తాంబూలంలో ఉపయోగించే ఆకు, నాగవల్లీదళం. ఉ. హరి. 4.28. ప్రబా. 2.15. <తములము + ఆకు.
**తములపుటాకు** రూ.చూ. తములపాకు. వి. తాంబూలంలో ఉపయోగించే ఆకు, నాగవల్లీదళం. రాధికా. 1.39. **తములముసేయు (-చేయు)** స.క్రి. తాంబూలంవేయు. సు.శ. 53.
**తమెర** రూ.చూ. తగిరె. వి. పనకం చీల.
**తమోటా** రూ.చూ. టొమాటో. వి. రామములగ, చల్లటిచోట తోటల్లో పెంచే తీగపైరు.
**తంప** వి. బరువు.
**తంపట** చూ. తంపర². వి. పదార్థాన్ని కుండలో పెట్టి బోరగిల జేసి పైనమంట పెట్టి ఉడికించడం; **2.** పెద్దమంట.
**తంపటదోసకాయ** వి. క్రమవిరుద్ధంగా తయారైన దోసకాయ.
**తంపము** చూ. తంపర¹. విశ. సాంద్రమైన, దట్టమైన. వి. సమూహం.
**తంపర¹** చూ. తంపి. వి. **1.** సమూహం. సుదంతా. 1.53; **2.** తియ్యని నీరూరే పల్లప్రదేశం; **3.** తామరగుంపు; **4.** సమూహం; **5.** ఒకరకం కలుపుమొక్క. విశ. సాంద్రమైన. ఆం. భా. 3.16.
**తంపరభూమి** వి. నీళ్ళునిల్చే భూమి.
**తంపర²** వి. తంపటి, జొన్న, సజ్జ మొ. వాటి కంకులను ఉడుకు బూడిదలో కాల్చటం.
**తంపరమొల** వి. పల్లుగలమొల, రాతిని చీల్చడానికి పనికివచ్చే ఉక్కుపరికరం.
**తంపి** రూ. తుంపు², త్రంపి. వి. **1.** దాలిగుంట. హరి. పూ. 5.206. ఆం. భా. 2.241; **2.** కలహం; **3.** పిడకలతో గుండ్రంగా అమర్చిన పొయ్యిమంట.
క. తణలు. మండేబొగ్గులు; త. తఴల్ (తఴల్వ్, తఴఙ్). ప్రకాశించు, మండు, మంట, కణకణ మండే నిప్పులు, తఴలి. మంట; తఴఙ్చి. వేడి, మంట; త. తణల్. కణకణ మండేనిప్పులు; గోం. తర్మీ, మండేకర్రబొగ్గులు, తడ్మీ. మంట; పర్జి. తడ్, తడ్వ్. వేడిగాఉండు, తడ్కిప్- (తడ్కిత్). వేడికి, తడురన్, వేడి; కొలా. తరి (-తరిత్). (నిప్పు) మంటలు, తర్ప్ (-తరప్త్). వెలుగు (నిప్పు); నా. తర్. నిప్పు అంటుకొను, తర్ప్. వెలుగు.
**తంపిపెట్టు** రూ.చూ. త్రంపిపెట్టు. స.క్రి. **1.** కుండల్ని కొద్దిగా కాల్చు; **2.** తంపటిలో కాల్చు; అ.క్రి. జగడానికి పురి కొల్పు.
**తంపు** రూ.చూ. తన్పు. వి. జ్ఞాపకం.
**తంబ¹** చూ. తంబాకు¹. రూ.చూ. తమ్మ¹. వి. పుక్కిటపెట్టుకొనే పొగాకు. తమలపాకు, సున్నం కలిపిన పదార్థం.
**తంబ²** వి. రాగిసంబంధమయిన.
**తంబకడువ** వి. రాగికడవ. ద. హిం. శా. సంపు 6. శా. సం. 904. క్రీ.శ. 1291. సం. తామ్రకటాహ-. రాగి కడవ. **తంబకాయ** వి. రాగికాయ. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1173. **తంబకుండ** వి. రాగికుండ ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1214. **తంబగిరయ** వి. రాగికుండ లేక రాగిముంత. ద. హిం. శా. సంపు. 6. శా. సం 791. **తంబముంత** వి. రాగికడవ.
**తంబ³** రూ.చూ. తమ్మ³. వి. శింబి దీనికాయలు కూరలకు ఉపయోగిస్తారు. ఆం. భా. 2.72.
**తంబ⁴** వి. వడ్రంగానికి ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు (Shorea Tombuggaia).
త. తంబగమ్.
**తంబజముళ్ళు** రూచూ. తమ్మజములు. వి.బ.వ. అచ్చుతికేటప్పుడు పన్నె గూడులో దూర్చిన నాలుగుపడుగు పోగులు.
**తంబరు** వి. పంగ, కర్రలకు చివర సహజంగా ఏర్పడేపాయ.
**తంబళ** రూ.చూ. తమ్మళ. వి. శివపూజచేసే ఒక జాతి. వేణు. 72. చంద్రరే. 3.161.
**తంబళఅనుమానము** వి. అనవసరమైన అనుమానం కలిగి దాని నివారణకై చిక్కుల్లో తగుల్కోవటం. **తంబళజోస్యం** వి. అసంబద్ధం. **తంబళతలతిక్క** వి. అనవసరమైన అనుమానం కలిగి దాని నివారణకై చిక్కుల్లో తగులుకోవటం.
**తంబళి** రూ.చూ. తమ్మళి. వి. శివార్చకుడు. హంస. 1.182. ఆం. భా. 2.184.
క. తమ్మడి. దేవునివిగ్రహం దగ్గరుండే అర్చకుడు.
**తంబళ్ళఇనాం** వి. శైవపూజార్లకిచ్చే ధనం.
**తంబళ్ళఇనాం** చూ. తంబళి.
**తంబాకు¹** వి. పుక్కిట పెట్టుకొనే పొగాకు.
హిం. తంబాక, తంబాకూ, తమాకూ, తమాఖూ. నిషాకలిగించే ఒకరకమైన ఆకులుగల మొక్క; మరా. తంబాఖు, తమాఖు, తమాఖూ. ఒకవిధమైన మొక్క; పో. టుబైకో; డచ్చి. తబక్.
<మరా. తంబాఖు.
**తంబాకు²** వి. రాగి, తుత్తునాగం కలసిన ఒకమిశ్రలోహం.
పో. తంబాక. ఇండో-చైనాలో తయారైన రాగి తుత్తునాగం కలసిన మిశ్రలోహం; మల. తంబగం.
సం. తామ్రక. రాగి.
<పో. తంబాక.
**తంబి** రూ. తంబు². వి. తమ్ముడు. చెన్నబసవ. 3.158.
త. తంబి. తమ్ముడు.
<త. తంబి.
**తంబిగి** రూ.చూ. తంబుగు. వి. మెడ నిడుపుగా ఉండే చెంబు.
**తంబు¹** రూ.చూ. తమ్మ¹. వి. తంబ, పుక్కిట పెట్టుకొనే పొగాకు, తమలపాకు, సున్నం కలిపిన పదార్థం.
**తంబు²** రూ.చూ. తంబి. వి. **1.** తమ్ముడు; **2.** వాత్సల్యంగా ప్రేమగా పిలిచే పిలుపు.
**తంబుగ** రూ.చూ. తంబుగు. వి. మెడ నిడుపుగా ఉండే చెంబు.
**తంబుగు** రూ. తంబిగి, తంబుగ. వి. నీళ్ళు తాగటానికుపయోగపడే ఒకరకం పాత్ర. ద్వి.పరమ.వి. 5.248 పు.
క. చంబు, చెంబు, చొంబు. గుండ్రని రాగి లేక నీళ్ళు తాగటానికి వాడే గాజుపాత్ర; చంబిగె, తంబిగె, తంబుగె. గుండ్రని రాగి లేక గాజుపాత్ర; కొడ. చెంబి,

రాగి, చిన్నలోహపాత్ర ; తు. చెంబు. ఇత్తడి, రాగి, చిన్న రాగి లేక ఇత్తడికుండ ; తంబిగె. గుండ్రని చిన్న లోహపాత్ర ; త. చెంపు. రాగి, బంగారు, లోహపాత్ర, ద్రవపదార్థాల కొలత ; తంపికై. ఒకరకం చిన్న నీళ్ళ పాత్ర ; మ. చెంపు. రాగిపాత్ర ; కో. కెబికెబ్-, గిణ్ణి. గొట్టంఉన్న గుండ్రని, లోహ, నీళ్ళపాత్ర ; తొ. తెబ్. రాగి ; తొ(బ్)బిళి. రాగిఉంగరం ; కొబ్. చిన్న ఇత్తడి పాత్ర.

పో.చూ. మరా. చఁబూ. లావుగాఉండి, మూతి రాను రాను సన్నగాఉన్న లోహపాత్ర, కూజా.

<క. తంబుగె.

**తంబుర** రూ. తంబురా, తంబూర, తంబూరా. వి. 1. గాయకులు శ్రుతికై వాయించే తంత్రీ వాద్యం. ఉ.రా. 6.136, కువ.చ. 4.108 ; 2. డప్పు.

సం. తుమ్బుర-. వింధ్యపర్వతంలో నివసించే జాతి ; తుమ్బురు-. ఒక గంధర్వుడు ; హిం. తంబూరా, తంబోరా. నాలుగు తీగలుగల టర్కీ తంతు వాద్యవిశేషం; ఉ. తమ్బూర, తమ్బూరా. తంతువాద్యవిశేషం ; పార. తమ్బూర్. తంతువాద్యవిశేషం, డప్పు ; అర. తంబూరా. తంతువాద్యవిశేషం.

క. తంబురా.

<ఉ. తమ్బూర/తమ్బూరా.

**తంబురా** రూ.చూ. తంబుర. వి. 1. గాయకులు శ్రుతికై వాయించే తంత్రీవాద్యం. ఆం.భా. 1.127, వేణు.శ. 73 ; 2. డప్పు. పద్మ.యు. 272.

**తంబూర** రూ.చూ. తంబుర. వి. తంత్రీవాద్యవిశేషం.

**తంబూరా** రూ.చూ. తంబుర. వి. తంత్రీవాద్యవిశేషం.

**తంబోజి** వి. పారుదలకాల్వలు చీలే చోటు.

**తమ్మ**[1] చూ. తంబాకు. రూ. తంబ[1], తంబు[1], తొంబ[2]. వి. 1. పది పదిహేను అంగుళాల పొడవున బద్దగాఉండే కాయలు గుత్తులు గుత్తులుగా కాసే ఒకరకం మొక్క ; 2. చిలుము (Canavalia Ensiformis).

**తమ్మ**[2] చూ. తమ్ములము. వి. నమిలిన తాంబూలం. ప్రబోధ. 3.61, కవిక. 6.154.

**తమ్మకర** రూ.చూ. తమ్మకఱ. వి. తాంబూల రసంవల్ల కలిగిన మరక. **తమ్మకఱ** రూ. తమ్మకర. వి. తాంబూల రసంచే పెదవిపై ఏర్పడ్డ గీత. **తమ్మచిట్టము** వి. తాంబూలపు ఉమ్మితో అయిన మురికి. ద్వి.పరమ.వి. 7.97. **తమ్మతసుకు** వి. పడిగం, తాంబూలపు ఉమ్మిని ఉమిసే పాత్ర. **తమ్మతొట్టి** వి. పడిగం, తాంబూలం ఉమ్మిని ఉమిసే పాత్ర. **తమ్మపడిగ** రూ. తమ్మపడిగె. వి. పడిగం, తాంబూలపు ఉమ్మిని వేసే పాత్ర. అచ్చ.రా.సుందర. 35, రసిక. 4.4. **తమ్మపడిగము** రూ.చూ. తమ్మపడిగె. వి. తాంబూలం ఉమ్మివేసే పాత్ర. తాళ్ల. 15 సంపు. 106 కీర్తన. **తమ్మపడిగె** రూ. తమ్మపడిగ, తమ్మపడిగము. వి. తాంబూలం ఉమ్మి వేసే పాత్ర. పల్నా. 3. **తమ్మరసము** రూ.చూ. తమ రసము. వి. తాంబూలరసం.

**తమ్మ**[3] రూ. చమ్మ[1], తంబ[3]. వి. శింబి, చమ్మ. వేంక.పంచ. 4.522.

**తమ్మజములు** రూ. తంబజముళ్ళు. వి. వరసతప్పి అతికిన జమిలి పోగులు.

**తమ్మటము** రూ. తమటము. వి. చర్మవాద్య విశేషం, తప్పెట. పల్నా. 4 పు. ఆము. 4.35.

క. తంబటు, తంబటె, తపటె, తప్పటె, తబటె, తమటె, తమ్మటు, తమ్మటె. కర్రలతో వాయించే పెద్ద ఖంజిరా ; తు. తంబటు, తంబటె, తమ్మటె, తంబడ, తమటె, తబితె. ఖంజిరా, యుద్ధభేరి ; త. తంబట్టమ్, తంపట్టమ్. తప్పట్టై, తప్పట్టమ్. వాద్యవిశేషం ; మ. తప్పిట్ట, తమ్మిట్టమ్. చేతితోవాయించే తాళం ; కో. తబట్క్. సమతలంగా ఉండే ఒక పెద్ద వాద్య విశేషం.

**తమ్మట్లు** రూ.చూ. తమ్మంటులు. వి.బ.వ. రాళ్ళు బిగించిన బంగారు కమ్మలు.

**తమ్మడి** రూ.చూ. తమ్మళి. వి. శివాలయంలో పూజారి, శివార్చన చేసి జీవించేవాడు. H.A.S. 13 - 16.

**తమ్మడిసాని** వి. తమ్మళ్ళసాని. క్రీడా. పు. 91.

**తమ్మంటు** వి. తమ్మచెట్టు.

**తమ్మంటులు** చూ. తమ్మె.

**తమ్మంట్లు** చూ. తమ్మె.

**తమ్మలపాకార్చి** రూ.చూ. తమలపాకార్చి. వి. మధ్యభాగం గుమ్మటం లాగుండి పై చివర మొనదేలిఉండే ఆర్చి.

**తమ్మళ** రూ. తంబళ. వి. శివార్చన చేసి బ్రతికే ఒకజాతి. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 659. క్రీ.శ. 1525.

క. తమ్మడి. శివార్చన చేసేవాడు.

**తమ్మళది** విణ. శివార్చన చేసి బతికే స్త్రీ. **తమ్మళవాఁడు** విణ. శివార్చనచేసి బతికేవాడు.

**తమ్మళి** రూ. తంబళి, తమ్మడి. వి. తమ్మళజాతివాడు. బసవ. 5.549.

క. తమ్మడి. శివార్చన చేసేవాడు.

**తమ్మి**[1] వి. 1. పద్మం, తామరపువ్వు. భార. ఆది. 4.78 ; 2. పద్మంవలె ఉండేది, పద్మవ్యూహం, నరస. 1.64 (Nelumbium Speciosum).

క. తామరె, తావరె. పద్మం, కమలం ; కొడ. తవరె ; తు. తామరె ; త. తామరై ; తమ్మి ; మ. తామర ; కువి. తంబె ; పర్జి. తామర్.

పో.చూ.సం. తామరస-. పద్మం.

**తమ్మికంటి** వి. 1. అందమైన కన్నులుగల స్త్రీ. భోగిని ; 2. కమలాక్షుడు, విష్ణువు. నీలా. 1.80. వ్యు. కమలాలవంటి కన్నులు కలది, కలవాడు. **తమ్మికెంపు** వి. పద్మరాగమణి. అచ్చ. రా. బాల. 4. **తమ్మికేలు** వి. పద్మంలా ఉండే చేయి. **తమ్మిగద్దియ** వి. పద్మాసనం. వేంక. ఆం. దేవ. 6. **తమ్మిగద్దియదళవాయి** వి. బ్రహ్మ. **తమ్మిగద్దియబోఁటి** వి. లక్ష్మి పద్మాలయ. సాంబ. దేవ. 6. **తమ్మిచక్కిలిగింత** వి. సూర్యుడు. పద్మప్రియుడు. సాంబ. దేవ. 9. **తమ్మిచుట్టము** వి. సూర్యుడు. ఆం.భా. 1.81. వ్యు. పద్మానికి బంధువు. **తమ్మిచూలి** వి. పద్మోద్భవుడు, బ్రహ్మ. రం. రా. కిష్కిం. 199· 28 పం. వ్యు. పద్మం గర్భంగా కలవాడు. **తమ్మిచెలి** వి.

సూర్యుడు. వి. పద్మానికి సఖుడు. **తమ్మిచెలికాఁడు** వి. పద్మ సఖుడు, సూర్యుడు. అచ్చ.రా.యు. 4.76. **తమ్మిదాయ** వి. కమలవిరోధి, చంద్రుడు. అచ్చ.రా.యు. 264. (తమ్మి$^{1}$+ దాయ). **తమ్మిదీవి** వి. పుష్కరద్వీపం. **తమ్మిదొర** వి. సూర్యుడు. రామాభ్యు. 5.259. వ్యు. తామరలకు ప్రభువు. **తమ్మిదోదుమ్మిజోదు** వి. మన్మథుడు. కువ.చ. 2.4. వ్యు. పద్మాలు ఆయుధంగా గల యోధుడు. **తమ్మినూలు** వి. బిస తంతువు, తామరకాడ తంతువు. ప్రబంధ. 750. **తమ్మిపగతుఁడు** వి. చంద్రుడు, అబ్జారి. వ్యు. పద్మాలకు విరోధి, **తమ్మిపుట్టు** వి. పద్మంనుంచి పుట్టినవాడు. బ్రహ్మ. భాను. 1.3. **తమ్మిపువ్వుఁబాపఁడు** వి. బ్రహ్మ. చంద్రాంగ. 2.120. వ్యు. పద్మంనుంచి పుట్టిన పాప. **తమ్మిపూచూలి** రూ.చూ. తమ్మిపూఁజూలి. వి. బ్రహ్మ. శృం.నై. 2.138. **తమ్మిపూఁజూలి** రూ. తమ్మిపూచూలి. వి. బ్రహ్మ. హర. 5.16. వ్యు. పద్మం గర్భంగా కలవాడు. **తమ్మిపొక్కిలివాఁడు** విశే. పద్మనాభుడు, విష్ణువు. అష్టమ. క. 4.202. 3 పం. వ్యు. పద్మంనాభిలో ఉన్నవాడు. **తమ్మిమొలక** వి. పద్మోద్భవుడు, బ్రహ్మ. చెన్నబసవ. 1.117. **తమ్మిమోహరము** వి. పద్మ వ్యూహం. **తమ్మియనుఁగు(-అనుఁగు)** వి. పద్మాలకు ప్రియమైన వాడు, సూర్యుడు. అచ్చ.రా.యు. 403. **తమ్మియింటిగరిత(-ఇంటిగరిత)** వి. లక్ష్మి. ఆం. నా. సం. దేవ. 10. **తమ్మియింటితొయ్యలి(-ఇంటితొయ్యలి)** వి. పద్మాలయ, లక్ష్మి. అచ్చ.రా.బాల. 182. **తమ్మిఱాయి** వి. పద్మరాగమణి. **తమ్మివాల్గంటిమగఁడు** వి. సూర్యుడు. వ్యు. పద్మం అనే స్త్రీకి భర్త. **తమ్మివిందు** వి. సూర్యుడు. రాజ.చ. 2.69. వ్యు. పద్మాలకు విందు. **తమ్మిసూడు** వి. చంద్రుడు. ముకుంద. 2.208, చెన్నబసవ. 2.231. వ్యు. పద్మాలకు శత్రువు. **తమ్ములదాయ** వి. చంద్రుడు. పె.శకు. 1.43. వ్యు. కమలాలకు శత్రువు. **తమ్ములదొర** వి. సూర్యుడు. రాజవా. 1.80. వ్యు. తామరలకు ప్రభువు. **తమ్ములపగవాఁడు** విశే. చంద్రుడు. ఆం.నా.సం. దేవ. 15. వ్యు. కమలాలకు విరోధి. **తమ్ములయిల్లు(-ఇల్లు)** వి. కమలాకరం, సరస్సు. భాగ. 10. పూ. 492. **తమ్ములవిందు** వి. సూర్యుడు. యయా. 5.30. వ్యు. పద్మాలకు విందు.

**తమ్మి$^{2}$** రూ.చూ. తమ్మె. వి. చిన్నతాడు, పశువులకు కట్టేతాడు.

**తమ్మి$^{3}$** వి. వృక్షవిశేషం.

**తమ్మియ** రూ.చూ. తమ్మె. వి. 1. చెవియొక్క అడుగుభాగం; 2. పశువుల మెడకు తగిలించే పలుపు ముందుభాగం.

**తమ్ము** స.క్రి. జాడించు.

**తమ్ముచేయు** స.క్రి. జాడించు. భార. ఉద్యో. 3.248.

**తమ్ముగమి** చూ. తమ్ముఁడు.

**తమ్ముఁగుఱ్ఱ** చూ. తమ్ముఁడు.

**తమ్ముణ్డు** రూ.చూ. తబుణ్డు. వి. అనుజుడు. ధర్మవరం శాసనం. ఒంగోలు తాలూకా, ప్రకాశం జిల్లా. క్రీ.శ. 897.

**తమ్ముఁడు** రూ.చూ. తబుణ్డు. వి. 1. అనుజుడు, అవరజుడు, భార. ఆది. 8.106; 2. వాత్సల్య సంబోధనం. భాస్క. రా. అయోధ్య. 3; 3. ఔపమ్య ద్యోతకం. భాస్క.రా. యు. 2.77.

**తమ్ముగమి** వి. తమ్ముల సమూహం భార. ద్రోణ. 4.219. **తమ్ముఁగుఱ్ఱ(-కుఱ్ఱ)** వి. ప్రియమయిన తమ్ముడు, భార. ద్రోణ. 2.229. **తమ్ముదోయి** వి. 1. కవలుగా పుట్టిన కనిష్ఠ సోదరులు, భార. అశ్వ. 4.143; 2. తమ్ములజత. **తమ్ముపిండు** వి. తమ్ముల సమూహం, అనుజబృందం. భార. కర్ణ. 2.156. **తమ్మువాఁడు** విశే. తమ్ముడు.

**తమ్ముదోయి** చూ. తమ్ముడు.

**తమ్ముపిండు** చూ. తమ్ముఁడు.

**తమ్ములదాయ** చూ. తమ్మి$^{1}$.

**తమ్ములదొర** చూ. తమ్మి$^{1}$.

**తమ్ములపగవాఁడు** చూ. తమ్మి$^{1}$.

**తమ్ములము** రూ. తమలము, తములము. వి. 1. నమిలిన నాగవల్లీ దళాదికం, తమ్మ. కు.సం. 7.105; 2. పోక చెక్కలు మొ. నవి గల తమలపాకుల వీటిక. భార.ఉద్యో. 1.257; 3. నాగవల్లి, తమలపాకు తీగ.

సం. తాంబూల-. తాంబూలం; ప్రా. తంబోల-, తంబోలి, తంబోలీ. జై. మహా. తంబోల; శౌ. తంబోల; అ.మా. తంబూల. తంబోల, తంబోలయ, తంబోలీ; పా. తంబూల;

క. తంబుల, తమ్ములము. తాంబూలం, తంబులి, తంబులిగ. తాంబూలకుడు; తు. తాంబూల. తాంబూలం; త. తంబలమ్, తంబళమ్; మ. తాయూలమ్, తంపలమ్; కువి. తాంపల. ఆకు.

<ప్రా. తంబోల-.

**తమ్ములముచేయు** అ.క్రి. తాంబూలం వేయు. శృం. నై. 6.63.

**తమ్ములయిల్లు** చూ. తమ్మి$^{1}$.

**తమ్ములవిందు** చూ. తమ్మి$^{1}$.

**తమ్ములవైచిదాఁటు** అ.క్రి. ప్రమాణం చేయు, సారంగ. 2.205.

**తమ్మువాఁడు** చూ. తమ్ముఁడు.

**తమ్మె** రూ. తమ్మి$^{2}$, తమ్మియ. వి. 1. చెవి అడుగు భాగం. రం.రా. యు. 412. 6 పం; 2. పశువుల మెడకు తగిలించే పలుపు ముందు భాగం.

సం. తర్మన్. యూపస్తంభం యొక్క మీది కొన; ప్రా. తమ్మియ. అగ్రభాగం, కొన;

క. తమ్మె. చెవి తమ్మి లేక ముక్కు మృదులాస్థిలాంటి మెత్తని భాగం, తాడుముడి; తు. తొమ్మె. చెవితమ్మె; పర్జి. దెమ్మ; కొలా. తంబక్.

<ప్రా. తమ్మియ.

**తమ్మంటులు** రూ. తమ్మట్లు, తమ్మంట్లు, తమ్మెట్లు. వి.బ.వ. కుండలాలు, చెవికి ధరించే ఆభరణాలు. వరాహ. 11.8, పాండు. 1.165. <తమ్మె+అంటులు. **తమ్మంట్లు** రూ.చూ. తమ్మంటులు. వి.బ.వ. కుండలాలు, చెవికి ధరించే ఆభరణాలు. **తమ్మెట్లు** రూ.చూ. తమ్మంటులు. వి. దుద్దులు, చెవి పోగులు.

**తమ్మెట** వి. చర్మవాద్యవిశేషం. హంస. 3.29.

**తయారు** విశే. సిద్ధమైన, సంసిద్ధుడైన.

హిం. ఉ. తయార్. సిద్ధమైన; మరా. తయార్.

తయ్యార్ ; పార. తయ్యార్ ; అర. తైయార్.

<ఉ. తయార్.

తయిద రూ.చూ. తవ్విఁద. వి. 1. రాగి ధాన్యం ; 2. చోళ్ళు.

తయినాతి రూ.చూ. తైనాతి. వి. సేవకుడు, కనిపెట్టుకొని ఉండేవాడు.

తయినాయితి రూ.చూ. తైనాతి. వి. నౌకరు, నియుక్తుడు.

తయిపారు రూ.చూ. తైపారు. వి. 1. రుజువు; 2. సరిపోల్చటం.

తర[1] వి. నూలు చిలపకు రంగుచుక్క అద్దే అచ్చు.

తర[2] వి. బండి భాగాల తయారీలో ఉపయోగపడే కలప నిచ్చే, పెద్ద ఆకులు కల ఒక చెట్టు (Grewia Tiliaefolia).

తరం రూ. తురం, తొరం. వి. 1. పెంకు పేర్పులోని వరస; 2. పట్టను జోలెలాగ మడిచి తాళ్ళతో బద్దకు వేలాడ దీసిన సాధనం; 3. ఎక్కటానికి దిగటానికి వీలుగా కట్టిన నిర్మాణం; 4. బట్టీ గోడలు పక్కకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్న గోడ; 5. బట్టీ పొయ్యి మీద అడ్డంగా ఉంచిన రాయి; 6. దున్నినప్పుడు మెదగని గడ్డలు; 7. గడ్డివామి వేసేటపుడు అడుగున పరచిన కట్టలు.

తరంగట్టు(-కట్టు) స.క్రి. బండిని బాగా లాగలేనపుడు ముందు బోయే ఎద్దువైపు కాడిని వెనక్కిలాగి పరానికి కట్టు.

తరక[1] రూ. తొరక. వి. 1. ఉతికిన బట్టలలో అక్కడక్కడ రంగు వెలసిన తెల్లనైన భాగం; 2. నూక; 3. వెన్న చిలికిన తరువాత కూడ మజ్జిగలో మిగిలిపోయిన కణాలు; 4. గింజ పట్టని తాలు, తూర్పార పట్టినప్పుడు వేరుగా పడే పొల్లు; 5. కాల్చిన సున్నాన్ని జల్లించగా వచ్చిన తుక్కు.

సం. తరంగ-. అల, కెరటం.

<సం. తరంగ-.

తరక[2] చూ. తడక. వి. 1. వెదురు బద్దల వంటి వాటితో అల్లిన చాప; 2. చెక్కడపు పని చేసిన రంధ్రాలున్న గోడ.

తరకట రూ.చూ. తఱకట. విశ. వ్యర్థమైన, అసత్యమైన.

తరకటబరకట విశ. అసత్యమైన. దశా. 7.289.

తరకటబురకట విశ. అసత్యమైన. ప్రబంధ. 626. వేం. మా. 5.129.

తరకటించు చూ. తరకము.

తరకటింపు చూ. తరకము.

తరకమాను వి. తురకలలో ఒక జాతి వ్యక్తి. విశ్వే. క.

హిం. తుర్కమాన్. టర్కీదేశం మహమ్మదీయులలో ఒక జాతి వ్యక్తి, టర్కీగుర్రం; ఉ. తుర్కమాన్. టర్కీదేశీయుల్లో ఒక జాతి; పార. తుర్కమాన్. టర్కీదేశీయుడు.

<ఉ. తుర్క్మాన్.

తరకము రూ.చూ. తర్కము. వి. 1. తర్కం, వాదం; 2. కలహం.

తరకటించు అ.క్రి. తర్కించు. ఇందు 5.46. తరకటింపు వి. తర్కం. ఆం.భా. 1.103.

తరకవేప రూ. తరకువేప, తరుకవేప. వి. గృహోపకరణాలకు ఉపయోగించే చెట్టు (Melia Azedaveh).

తరకువేప రూ.చూ. తరకవేప. వి. గృహోపకరణాలకు ఉపయోగించే ఒక చెట్టు.

తరకసము రూ. తరకసా. వి. అమ్ములపొది, తూణీరం. మను. 4.28.

హిం. ఉ. పార. తర్కశ్. తూణీరం; మరా. తర్కస, తర్కశ. తూణీరం.

<ఉ. తర్కశ్.

తరకసా రూ.చూ. తరకసము. వి. అమ్ములపొది, బాణం. రాజవా. 2.51.

తరగతి చూ. తరము[1].

తరగతిగుండ్లు చూ. తరము[1].

తరగతులు చూ. తరము[1].

తరగనేప వి. లేతపసుపు రంగుకల ముళ్ళుగల చెట్టు (Olax Scandens).

తరగంపియ రూ.చూ. తరగంపె. వి. ఒక విధమైన రంపం.

తరగంపె రూ. తరగంపియ. వి. ఒక విధముయిన రంపం. ఆం.భా. 2.301.

సం. తర-. దాటేది, దాటటం, నిప్పు.

తరగరి చూ. తరగు.

తరగు రూ.చూ. తఱుగు[1]. వి. 1. తగ్గుదల; 2. అమ్మేవాడికి కొనేవాడికి వ్యవహారం కుదిర్చి నందుకు తీసుకొనే డబ్బు అ.క్రి. తగ్గు.

తరగరి వి. దళారి.

తరగొని చూ. తరము. అవ్య. క్రమంగా. కు.సం. 12.94.

తరఁగ వి. 1. అల, కెరటం. భార. ఆది. 8.79; 2. తరంగంవంటిది, వళి, కడుపుమీది ముడత. కవిక. 3.13.

సం. ప్రా. తరంగ-. కెరటం; శౌ. తరగ; అమా. తరంగ;

క. తరంగు.

<ప్రా. తరంగ-.

తరఁగలెత్తు అ.క్రి. తరంగితమగు, అతిశయించు. కవిరాజ 1.106. <తరఁగ+-లు+ఎత్తు.

తరచు రూ.చూ. తఱుచు. వి. బాహుళ్యం, అధికం. పల్నా. 100.

తరజిమ్మా రూ.చూ. తర్జుమా. వి. అనువాదం.

తరటు రూ.చూ. తఱటు. వి. 1. కశ, కొరడా. విక్ర. 5.8; 2. అశ్వాదుల శీఘ్రలంఘనం; 3. తోలునారి; స.క్రి. కొరడాతో కొట్టు; విశ. మూర్ఖమైన.

తరటుగావించు (-కావించు) స.క్రి. కొరడాతోకొట్టు. శశా. 5.21.

తరతర రూ.చూ. తరతరము. వి. తత్తర, తొందర.

తరతరపుట్టు అ.క్రి. విపరీతమైన భయంకలుగు. తరతరలాడు అ.క్రి. తత్తరపడు. <తరతర+-లు+ఆడు.

తరతరమ చూ. తరము[1].

తరతరము చూ. తరము[1].

**తరతరములనైన** చూ. తరము[1].
**తరతరాలనుండివచ్చు** చూ. తరము[1].
**తరద్దూదు** వి. **1**. పరిశ్రమ; **2**. ప్రయత్నం, విణ. సాగు కాని.
హిం. తరద్దుద్. చింత, శోచనీయమైనస్థితి; ఉ. తరద్దూద్. చింత, శోచనీయం. కృషికర్మ, పొలానికి సంబంధించిన పనులు; పార. తరద్‌దూద్. ఆతురత, మానసికపరిస్థితి, తిరస్కారం; అర. తరద్‌దూద్. వ్యవసాయసంబంధి, చింత, శోచనీయం, కలవరం.
< ఉ. తరద్దూద్.
**తరద్దూదుజాబితా** వి. వేసిన విత్తనాల పరిమాణాన్ని జాతిని తెలియ చెప్పేపట్టీ.
**తరప** రూ.చూ. తడప. వి. పేననినార.
**తరపడి** వి. తరిమెన.
**తరపి** రూ.చూ. తఱపి. వి. అరు నెలల దూడ.
**తరపు**[1] చూ. తఱుగు[1]. రూ. తఱుపు[3]. స.క్రి. **1**. తగ్గించు. భార. అను. 5.104; **2**. పోగొట్టు, హరించు. భాగ. 6.89; **3**. అణచు.
పో.చూ. క. తరగు. కృశించటం, తక్కువవటం; త. తఱుగు. తగ్గిపోవు.
**తరపుకర్ర** వి. మాగాణిలో పెళ్ళలు చితకడానికి తోలే అడ్డపట్టె, **తరపుసేద్దెం** రూ.చూ. తరపుసేద్యం. వి. తొలకరి ముందు పొలంలో గుంటకతోలుచున్నటం. **తరపుసేద్యం** రూ. తరపుసేద్దం, తరిపిసేద్దెం. వి. తొలకరిముందు పొలంలోగుంటకతోదున్నటం.
**తరపు**[2] స.క్రి. ఉల్లంఘించు, దాటు. వరాహ. 9.123.
పో.చూ. మరా. తారమ్. దాటు, వ్యాపించియుండు.
**తరపు**[3] రూ. చూ. తరఫు. వి. పక్షం.
**తరఫియ్యతు** రూ.చూ. తరిబియతు. వి. శిక్షణ.
**తరఫు** రూ. తరపు[3], తరుపు[1]. వి. పక్షం, దేశం.
హిం. తరఫ్. పార్శ్వం, పక్క; మరా. తరఫ్, తర్ఫ్. దేశభాగం, పక్షం; ఉ. తరఫ్. పక్షం, వైపు; పార. తరఫ్, తర్ఫ్. పార్శ్వం, భాగం; అర. తరఫ్, తర్ఫ్. పక్షం, పక్క, వైపు.
< ఉ. తరఫ్.
**తరబడి** చూ. తరము[1].
**తరబడిలెక్క** చూ. తరము[1].
**తరమగు** చూ. తరము[1].
**తరమానికుండ** రూ.చూ. తరవాణికుండ. వి. పుల్లనీళ్ళుపోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టికుండ.
**తరమిడి** చూ. తరము[1].
**తరము**[1] రూ. తలము[1]. వి. **1**. జీవితకాలం. భార. ఆది. 4.221; **2**. క్రమం, వరస. కు.సం. 10.72; **3**. రకం, దినుసు. భార. విరా. 4.47; **4**. తారతమ్యం, హెచ్చు తగ్గు, భేదం. భార. ఉద్యో. 4.218; **5**. తరగతి, తెగ. భార. ఉద్యో. 4.221; **6**. విధం, తెరగు. భార. ఉద్యో. 4.260; **7**. పురుషాంతరం, వంశానుస్యూతపురుషుడు. భార. అను. 2.110; **8**. బరువుగా ఉండే పెద్దమూకులు మొ. వాటిని మోసుకుపోవడానికి వాడే సాధన విశేషం, జడ్డి. హరి. 8.70; **9**. సామ్యం, పోలిక. శివరా. 3.127. వసు. 1.41; **10**. కొలది, ప్రయాణం. జైమినిభా. 2.16; **11**. నిగ్గు. ఘటికా. 2.87; **12**. తత్తరం. చంద్రికా. 4.125; **13**. దేశకాలాను గతంగా హెచ్చింపబడుతూ ఉండేపన్ను; **14**. దాటటం; **15**. ఓడకూలి; **16**. ఇద్దరు మోసేబరువు; విణ. **1**. సమానమైన. భార. ద్రోణ. 1.199; **2**. శక్యమైన, సాధ్యమైన. భార. కర్ణ. 2.77; **3**. ప్రశస్తమైన, శ్రేష్ఠమైన. వాల్మీ. 1.18; **4**. శక్తమైన, సమర్థమైన. దశా. 5.46; **5**. దాటునది.
సం. అంతర-. భేదం;
క. తర; త. తరమ్.
< సం. అంతర-.
**తరగతి** వి. తరాన్ని తెలిపే భాగం, క్లాసు. < తరము[1] + గతి. **తరగతిగుండ్లు** వి.బ.వ. సైజువారీగా ఉన్న బంగారు గుళ్ళసరం. **తరగతులు** వి.బ.వ. స్త్రీ కంఠ భూషావిశేషం. **తరతరమ** అవ్య. ద్రు. క్రమ క్రమంగా. కు.సం. 5.50. **తరతరము** రూ. తరతర. క్రి.విణ. **1**. క్రమక్రమంగా. భార. ఆది. 2.4, కు.సం. 5.14; **2**. వరుసపెట్టి, మునుమిడి. భార. భీష్మ. 3.177; **3**. వంశపరంపరగా. భార. మహా. 1.18; **4**. అత్యంతం, మిక్కిలి. శృం.నై. 7.123; విణ. పుంజీభూతమైన, గుంపైన, తరచు, బహుళం. భార. ద్రోణ. 2.310; వి. **1**. వంశపరంపర. ద. హిం. కా. సంపు. **5**. కా.సం. 164. క్రీ.శ. 1169; **2**. వంశానుస్యూతుడైన పురుషుడు. కాశీ. 3.141. **తరతరములనైన** అవ్య. ఎన్నటికైనా. హర. 3.76. **తరతరాలనుండివచ్చు** అ.క్రి. చాలా కాలం నుంచి ఉండు. **తరబడి** వి. **1**. కొలది, పరిమాణం. సిం. ద్వా. 10.125; **2**. తెగ, తరగతి. పాంచాలీ. 1.39; **3**. వరుస; **4**. వస్తువు; **5**. పద్ధతి; విణ. **1**. అర్హం, పాత్రం. చిత్ర భా. 5 49; **2**. సదృశం, సాటి. అం.భా. 2.302. అవ్య.ద్రు. వెంబడి, వెంట. కృష్ణ. 2.123. < తరము[1] + బడి. **తరబడిలెక్క** వి. ఆస్తుల వివరాలు రాసినలెక్క. **తరమగు** అ.క్రి. సాధ్యమగు. భార.కర్ణ. 2.77, కాళ్ళ.సం. 7.79. < తరము[1] + అగు. **తరమిడి** అవ్య. **1**. వదలక, విడవక. భార.విరా. 3.61; **2**. వరుస పెట్టి, మునుమిడి, క్రమంగా, వరసగా. భార.విరా. 5.170; **3**. తారతమ్యమెంచి. ద్వి.హరిశ్చ. 240 పం. క. తరమ్పిడి. < తరము[1] + ఇడు + -ఇ[13]. **తరమెఱుఁగు** అ.క్రి. విలువకట్టు. భార.విరా. 4.47. < తరము[1] + ఎఱుఁగు. **తరాతరప్రకారం** వి. హెచ్చుతగ్గులమేర. **తరాలనాఁటితాటికాయ** వి. చాలాకాలంనాటి మనిషి.
**తరము**[2] రూ. తురం. వి. నిండు బండి కదలిపోకుండా చక్రాల దగ్గర పెట్టే రాయి.
**తరమువేయు** స.క్రి. బండి గీరకు (గాళ్ళకు, చక్రాలకు) అడ్డంగా రాళ్ళు అడ్డు.
**తరమెఱుఁగు** చూ. తరము[1].

**తరలచేప** వి. ఒకరకం చేప.

సం. తరల-, తరళ-. చంచలమైన, కదలే.

**తరలబట్టు** చూ. తరలు.

**తరలిక** చూ. తరలు.

**తరలించు** చూ. తరలు.

**తరలు** రూ. తర్లు, తఱలు. అ.క్రి. **1.** నడుచు, సంచరించు. భార.ఆది. 5.150 ; **2.** జంకు, భయపడు, చలించు. కు.సం. 6.72 ; **3.** తొలగు, అపసరిల్లు. ఉ.హరి. 1.19 ; **4.** పోవు, నశించు. వసు. 3.20 ; **5.** ప్రయాణమగు, బయలువెడలు. దశా. 2.65 ; **6.** చనిపోవు ; స.క్రి. విడుచు, వదులు. భాగ. 5.1.164.

క. తళర్. కదలు, వణకు ; త. తళర్. వదులగు, బిగువులేని, నశించు, వాలిపోవు. చూ. తలఁకు, తలరు.

**తరలబట్టు** స.క్రి. బావిని ఒకవైపు పెంచి త్రవ్వు. **తరలిక** రూ. తఱలిక. వి. యాత్ర, ప్రయాణం. ఆం.భా. 2.219. **తరలించు** రూ. తఱలించు. స.క్రి. **1.** లాక్కొని పోవు, కొనిపోవు. పల్నా. 31, వసు. 3.135; **2.** తొలగించు, పోగొట్టు. వాసి.రా. 1.123; **3.** ప్రయాణం చేయించు, బయలువెడలజేయు. చెన్నబసవ. 2.304. **తరలుచు** రూ.చూ. తరల్చు. స.క్రి. తొలగించు, పోగొట్టు. **తరలుడు** రూ. తఱలుడు. వి. యాత్ర, ప్రయాణం. ఆం.భా. 2.219. **తరలుదోలు (-తోలు)** స.క్రి. మట్టిని పాళం చేయటానికి ఎత్తునుంచి పంతకు తోలు. **తరల్చు** రూ. తరలుచు, తఱలుచు, తఱల్చు. స.క్రి. తొలగించు, పోగొట్టు. కళా. 1.76.

**తరల్చు** చూ. తరలు.

**తరవణకుండ** రూ.చూ. తరవాణికుండ. వి. పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టికుండ.

**తరవరి** రూ. తరవలి, తరవళి, తరవారి[1]. వి. **1.** పట్టాకత్తి (30 అంగుళాలకు మించినది), పిరంగికత్తి. భాస్క.రా.యు. 1163 ; **2.** కత్తి.

సం. తరవారి-. కత్తి ; ప్రా. తరవారి ; హిం. తల్వార్ ;

క. తరవార్, తరవారి.

<సం. తరవారి.

**తరవలి** రూ.చూ. తరవరి. వి. పట్టాకత్తి, ఫిరంగికత్తి. ఉ.హరి. 4.229.

**తరవళి** రూ.చూ తరవరి. వి. **1.** పట్టాకత్తి ; **2.** కత్తి.

**తరవాణకుండ** రూ.చూ. తరవాణికుండ. వి. పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టిపాత్ర.

**తరవాణి** రూ. తరువాణి, తర్వాడీ, తర్వాణి. వి. పుల్లనీళ్ళు, అన్నంతో కలిపి పులియబెట్టిన గంజి.

సం. తరణా. పల్చని గంజి.

<సం. తరణా.

**తరవాణికుండ** రూ. తరమానికుండ, తరవణకుండ, తరవాణకుండ, తర్వాణికుండ. వి. గంజి, పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టికుండ. **తరవాణిమాడుగు** వి. పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టి పాత్ర.

**తరవాయి** రూ.చూ. తరువాయి. వి.బౌ. **1.** మునుం, వరస, క్రమం, అనుక్రమం. హరి.పూ. 7.81 ; **2.** కాలం. రం.రా.యు. ; **3.** అనంతరభాగం, శేషభాగం. ఆము. 3.4 ; **4.** వల్లె, చెప్పినదే పెక్కుతడవులు చెప్పటం. రాజవా. 2.85 ; **5.** తడవ, ఆవృత్తి.

**తరవాయిగొను (-కొను)** స.క్రి. వెన్నంటు. భార.కర్ణ. 1.249. **తరవాయిచెప్పు** స.క్రి. సంతచెప్పు, వల్లించు. రాజ.వి. 2.8.

**తరవారి[1]** రూ.చూ. తరవరి. వి. **1.** పట్టాకత్తి ; **2.** కత్తి.

**తరవారి[2]** వి. భూములు లేదా గ్రామాలయొక్క స్థిరపరచిన లెక్క.

**తరవారిగ్రామములు** వి.బ.వ. రైత్వారిపద్ధతికిందఉన్న గ్రామాలు.

**తరహా** వి. విధం, ప్రకారం. మె.సం. 493.

హిం.ఉ.పార.అర. తరహ్. ప్రకారం, విధం, పద్ధతి.

<ఉ. తరహ్.

**తరాకు** వి. **1.** వసతి ; **2.** వీలు, వాటం.

హిం.ఉ. తరీకా. విధం, వ్యవహారం, ఉపాయం.

**తరాజు** రూ.చూ. త్రాసు. వి. తూచేసాధనం, ఏషణిక, త్రాసు, తక్కెడ. అడిదము సూరన చాటువు. ఆం.భా. 2.300.

**తరాతరప్రకారం** చూ. తరము[1].

**తరాయి** వి. దూలంమీద అడ్డంగాకాని, దూలానికి బదులుగా కాని, గోడలమీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కన వాసం.

హిం. తరాఈ. కొండకనుమ, కొండకింది మైదానం.

**తరాలనాఁటితాటికాయ** చూ. తరము[1].

**తరాసు[1]** రూ.చూ. త్రాసు. వి. తూచేసాధన విశేషం, ఏషణిక. ఆం.భా. 2.300.

**తరాసు[2]** వి. బొమ్మమేడిచెట్టు (Ficus Hispida).

**తరి[1]** చూ. తరుచు[1]. వి. **1.** కవ్వపుకొండ, మందరపర్వతం. భాస్క.రా.బాల. 474 ; **2.** త్రచ్చటం, మథనం. భీమ. 4.94 ; **3.** కవ్వం. చమ. 1.9 ; **4.** వెన్న, నవనీతం. సారంగ. 3.195.

**తరికంబము** వి. కవ్వం తగిలించి త్రచ్చటానికి ఉపయోగించే స్తంభం, కుటరం. భాగ. 8.205. **తరికాఁడు** రూ. తరిగాఁడు. వి. త్రచ్చేవాడు, మథించేవాడు. భాగ. 8.205. **తరికుండ** వి. పెరుగు కలిగిన కుండ. **తరికొండ** రూ. తరిగొండ. వి. మందరపర్వతం. హర. 6 76. **తరిగట్టు** వి. మందరపర్వతం, కవ్వపుకొండ. అచ్చ.భా. 2.28. **తరిగట్టుత్రాడు** వి. శేషఫణి. శృం.నై. 2.123. **తరిగట్టుదారి** వి. మందరధరుడు, విష్ణువు. ఆం.నా.సం.దేవ. 7. **తరిగడవ (-కడవ)** వి. పెరుగుత్రచ్చేకడవ, మందని. భాగ. 8.205. **తరిగంబము** వి. కవ్వంకట్టే స్తంభం. భాగ. 8.205. **తరిగలగొడ్డు** వి. బాగా వెన్నవచ్చే పాలుగల గొడ్డు. **తరిగాఁడు** రూ.చూ. తరికాఁడు. వి. త్రచ్చేవాడు, మథించేవాడు. **తరిగుండు** వి. మందరపర్వతం, కవ్వపుకొండ. చంద్రాంగ. 2.45. **తరిగొండ (-కొండ)** రూ. చూ. తరికొండ. వి.

మందర పర్వతం, కవ్వపు కొండ. శృం. నై. 2.123. వరాహ. 10.118. **తరిగొల్లి (-కొల్లి)** వి. ఒక దినుసు కూరాకు, విశల్య. ఆం.భా. 2.68. **తరిగోల(-కోల)** వి. కవ్వం, మంథానం. **తరిచల్ల** వి. అప్పుడే చిలికినమజ్జిగ. **తరిచుట్టు** స.క్రి. పెరుగుదేవతాదులకు నివేదించు. **తరిచోటు** వి. మజ్జిగ చిలికేగది, చల్లగది. భీమ. 3.51 **తరితాడు** రూ.చూ. తరిత్రాడు. వి. ఔ. కవ్వంతాడు. **తరిత్రాడు** రూ.చూ. తరిద్రాడు. వి. ఔ. చిలికినప్పుడు కవ్వంతిప్పే తాడు. పారి. 3.29. **తరిదాలుపు (-తాలుపు)** రూ. చూ. తరిదాల్పు. వి. విష్ణువు, మందర పర్వతాన్ని ధరించిన వాడు. **తరిదాల్పు(-తాల్పు)** రూ. తరిదాలుపు. వి. విష్ణువు. నృసింహ. 1.54. **తరిద్రాడు** రూ. తరితాడు. తరిత్రాడు. వి. ఔ. చిలికినప్పుడు కవ్వంతిప్పేతాడు, మందరజ్జువు. హరి. పూ. 5.196. **తరిపాలు** వి. అప్పుడే పిండినపాలు. సారంగ. 3.194. **తరిమజ్జిగ** వి. అప్పుడే చిలికినమజ్జిగ. **తరిమల** వి. మందరపర్వతం, కవ్వపుకొండ. ప్రబంధ. 160. **తరివట్టు(-పట్టు)** విణ. దేవతల్ని ఉద్దేశించి పెరుగును త్రచ్చక నిలిపే. ఉ. హరి. 4.308. **తరివెన్న** వి. అప్పుడే తీసినవెన్న.

**తరి**[2] వి. మాగాణిపొలం.

హిం. ఉ. తరీ. మాగాణిపొలం.

< ఉ. తరీ.

**తరినాగలి** వి. బురదనాగలి, తరి (మాగాణి) నేలదున్నే నాగలి. **తరిపొలం** వి. మాగాణి, కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల.

**తరికగుర్రం** వి. దేవతదగ్గర మొక్కుబడిగాపెట్టే మట్టిగుర్రం.

హిం. తుర్కీ. టర్కీకి సంబంధించిన.

**తరిగ** రూ.చూ. తలుగు[1]. వి. తగ్గింపు.

**తరిగాకు** రూ.చూ. తలుగాకు. వి. కొయ్యతోటకూర, ఏడాదిపొడవునా పెరిగే ఆకుకూర(Amarantus tris:is).

< తరిగ + ఆకు.

**తరిగాకు** చూ. తరిగ.

**తరిటి** రూ. తరిటీ. వి. రెండుకొనలకు, రెండు మూటలుగా కట్టి మధ్యలో బిగించి ఎద్దు మొ. వాటి వీపుమీద వేసే గోనెసంచి.

సం. తరపట్టు-. గోనెసంచి ; దే. ప్రా. తరవట్టు. ?; మరా. తరట. గోనెసంచి.

< మరా. తరట.

**తరిటీ** రూ.చూ. తరిటి. వి. రెండుకొనలకు రెండుమూటలుగా కట్టి మధ్యలో బిగించి ఎద్దు మొ. వాని వీపుమీదవేసేగోనెసంచి.

**తరిణ** రూ.చూ. తణిమెన. వి. చెక్కమీదతీసిన సన్నటిగాడి.

**తరిణబట్టు** రూ. తరిణెబట్టు, తరినబట్టు, తరిమణపట్టు, తరివెనబట్టు. స.క్రి. వడ్రంగులు కర్రపై పనితనం చేయడానికి, నునుపు చేయటానికి మంచం కోళ్ళు మొదలగు వాటిని ఒక సాధనంలో బిగించి ఒకరు ఆకర్రను తాడుతో తిప్పుతూండగా ఉలిని దానికానించి తీర్చు.

**తరిణి** రూ.చూ. తణిమెన. వి. చెక్కడప్పని.

**తరిణిగుజ్జు** వి. నగిషీ పనిచేసిన గుజ్జు.

**తరిణె** రూ.చూ. తణిమెన. వి. **1**. చెక్కమీద తీసిన సన్నటి గాడి ; **2**. తరిమెన యంత్రం.

**తరిణెబట్టు(-పట్టు)** రూ.చూ. తరిణబట్టు. స.క్రి. కర్రను తాటితో తిప్పుతుండగా దానిపై రూపులు తీర్చు. **తరిణె స్తంభం** వి. నగిషీపనిచేసినస్తంభం.

**తరితీపరి** చూ. తరితీపు.

**తరితీపు** **1**. మోహం, వలపు. పల్నా. 89. ప్రబోధ. **1.75 ; 2**. విలాసం, శృంగారచేష్ట. పల్నా. 96 ; **3**. బాధ, యాతన. విక్ర. **4.204 ; 4**. మదన మాధుర్యం, తరచటం వల్ల కలిగే మాధుర్యం. మను. 5.47 ; **5**. తమకం, తహతహ. ప్రభా. 5.45 ; **6**. ప్రీతి, సంతోషం. పాండు. 1.14 ; **7**. ఉపేక్ష. ఉ. రా. 6.51 ; **8**. అపేక్ష. శశా. 2.91 ; **9**. అతిశయం ; **10**. చెలిమి. < తరి[1] + తీపు.

**తరితీపరి** వి. **1**. కాముకి. ధనా. 2.60 ; **2**. కాముకుడు. < తరితీపు + -అరి. **తరితీపుచేయు** రూ.చూ. తరితీపుసేయు. స.క్రి. **1**. వలపించు. భోజ. 4.156 ; **2**. బాధించు, పీడించు. ద్వి. సారంగ. 20పు. 17పం. అ.క్రి. గర్వించు. **తరితీపుపుట్టించు** స.క్రి. ఇష్టపడచేయు. విప్ర. 4.16. **తరితీపులఁబెట్టు** అ.క్రి. బాధించు. విక్ర. 4.204. < తరితీపు + -లు + -అ[7] + పెట్టు. **తరితీపుసేయు (-చేయు)** రూ. తరితీపుచేయు. అ.క్రి. గర్వించు. స.క్రి. **1**. పీడించు. రం. రా. అరణ్య. 190 పు. 30 పం. ; **2**. బాధించు ; **3**. ఉపేక్షించు.

**తరిన** రూ.చూ. తటిమెన. వి. **1**. కర్రను తాడుతో తిప్పుతూ రూపుతీర్చేయంత్రం ; **2**. చెక్కమీద తీసిన సన్నటిగాడి.

**తరినబట్టు (-పట్టు)** రూ.చూ. తరిణబట్టు. స.క్రి. కర్రను లాటితో తిప్పుతుండగా దానిపైరూపులు తీర్చు.

**తరిపి** రూ.చూ. తఱపి. వి. **1**. ఆవు, గేదె మొ. నవి ఈని చాలా రోజులైన దశ ; **2**. పాలుతాగటం విడిచిన వయస్సు.

**తరిపిగిత్త** వి. ఈని చాలారోజులైన ఆవు, గేదె మొ. నవి. **తరిపిగుంట** వి. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి తియ్యటానికి మెట్టలో తోలేగుంటక. **తరిపిదూడ** యా. తరుపుదూడ, తటిపిదూడ, తఱుపుదూడ. వి. ఆరునెలల దూడ అనికొందరు, ఏడాది దూడ అనికొందరు, లేతదూడ. **తరిపిపాలు** చూ. తరిపాలు. రూ. తరిప్పాలు. వి. గొడ్డు వట్టిపోవటానికి ముందు కొన్నిరోజులు ఇచ్చేపాలు. **తరిపిపెయ్య** రూ. తరిప్పెయ్య. వి. పాలువిడిచిన పెయ్య. **తరిప్పాలు** రూ.చూ. తరిపిపాలు వి. గొడ్డు వట్టిపోవటానికి ముందు కొన్నిరోజులు ఇచ్చేపాలు. **తరిప్పెయ్య** రూ.చూ. తరిపిపెయ్య. వి. పాలువిడిచిన పెయ్య.

**తరిపిసేద్దెం** రూ.చూ. తరపుసేద్యం. వి. తొలకరిముందు పొలంలో గుంటకతో దున్నటం.

**తరిప్పాలు** చూ. తరిపి.

**తరిప్పెయ్య** చూ. తరిపి.

**తరిఫీజు** రూ.చూ. తరిబియతు. వి. శిక్ష, నేర్పటం.

**తరిఫీదు** రూ.చూ. తరిబియతు. వి. అలవరచటం, శిక్షణ.

**తరిబియతు** రూ. తరపియ్యతు, తరిఫీజు, తరిఫీదు, తరిబీతు

తరిబీదు, తరిబీయతు, తర్బీదు. వి. శిక్షణ, అలవరచటం.

హిం. తర్‌బియాత్. దీక్ష, శిక్షణ, పోషణ ; మరా. తర్‌బియేత్. దీక్ష. శిక్షణ, ఉద్ధరణ ; ఉ. పార. అగ. తర్‌బియత్. శిక్షణ, ఉద్ధరణ, పోషణ ; ఒ. తర్‌బిద్. శిక్షణ.

< ఉ. తర్‌బియత్.

**తరిబీతు** రూ.చూ. తరిబియతు. వి. నేర్పటం, శిక్షణ.

**తరిబీదు** రూ.చూ. తరిబియతు. వి. శిక్షణ.

**తరిబీయతు** రూ.చూ. తరిబియతు. వి. శిక్షణ.

**తరిమణ** రూ.చూ. తటిమెన. వి. తరిమెనయంత్రం.

**తరిమణపట్టు** రూ.చూ. తరిణబట్టు. స.క్రి. కర్రను తాటిచే తిప్పుతుండగా దానిపై రూపులుతీర్చు.

**తరిమి** రూ.చూ. తగిరె. వి. పనకం చీల, కాడిమధ్య పైపైపు కొట్టిన ఇనపమేకు.

**తరిమిడి** రూ.చూ. తటిమెన. వి. తరిమెన యంత్రం.

**తరిమిడీ** రూ.చూ. తటిమెన. వి. తరిమెన పట్టే సాధనం.

**తరిమెన** రూ.చూ. తటిమెన. వి. కర్రను తాడుతో తిప్పుతూ రూపుతీర్చే యంత్రం.

**తరివిణి** రూ.చూ. తటిమెన. వి. తరిమెన యంత్రం.

**తరివెన** రూ.చూ. తటిమెన. వి. తరిమెన యంత్రం.

**తరివెనబట్టు(-పట్టు)** రూ.చూ. తరిణబట్టు. స.క్రి. కర్రను తాడుతో తిప్పుతుండగా దానిపై రూపులు తీర్చు.

**తరిఖు** వి. **1**. రీతి, విధం ; **2**. అలవాటు, ఆచారం.

హిం. ఉ. తరీకా, మార్గం, రీతి, పద్ధతి.

**తరుం** వి. గుప్ప, గుట్ట.

**తరుక** వి. గృహోపకరణాలకు ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Melia Azedarach).

**తరుకవేప** రూ.చూ. తరకవేప. గృహోపకరణాలకు ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు.

**తరుగాకు** చూ. తరుగు[1].

**తరుగు**[1] రూ.చూ. తఱుగు[1]. విణ. **1**. తక్కువ చేయబడ్డ ; **2**. వ్యర్థమైన. వి. తగ్గుదల, పచ్చిధాన్యం ఎండించగా వచ్చిన ధాన్యం.

**తరుగాకు** రూ. చూ. తఱుగాకు. వి. కాయగూర. < తరుగు[1] + ఆకు. **తరుగులు** వి.బ.వ. ఎండిన అరటాకులు.

**తరుగు**[2] రూ.చూ. తఱుఁగు[2]. స.క్రి. ఖండించు. పల్నా. 49.

**తరుచు**[1] రూ.చూ. త్రచ్చు. స.క్రి. **1**. మథించు, చిలుకు. భార. ఆది. 2.15 ; **2**. చక్కాడు, పోగొట్టు. కు.సం. 12.220 ; **3**. కర్ర మొ. వాటిని నిప్పు పుట్టించడానికి రాచు, ఒర పెట్టు. భార. శాంతి. 4.159 ; **4**. బాగా విచారించు, పరిశోధించు. శివరా. 2.82 ; **5**. తరిమెనపెట్టు, సానపెట్టు.

తు. తరెపుని. లోహాన్ని వన్నె పరీక్షచేయు. సానబట్టు, తోము.

**తరుపు**[2] వి. తరచటం, మథనం, **తరుపుడ్రాడు(-త్రాడు)** వి. చిలికేటప్పుడు కవ్వం తిప్పేతాడు. హర. 6.40.

**తరుచు**[2] రూ.చూ. తఱుచు. విణ. అధికమైన. పల్నా. 16.

**తరుచునేత** వి. పడుగులో పేకదారం పోగులు కలిసిపోయేట్టు చిక్కగా నేసిన నేత. **తరుచుపుంజంపన్నె** వి. ఈనెలు దగ్గర దగ్గరగా కట్టినపన్నె.

**తరుణము** వి. యుక్తకాలం, అనుకూలసమయం.

త. తరుణమ్ ;

సం. తరుణ-. కొత్త.

< సం. తరుణ- (అర్థవిపరి.).

**తరుణియ** వి. యౌవనవతి అయిన స్త్రీ. భార. ఆది. 8.175.

సం. తరుణీ, తరుణికా, యువతి ; ప్రా. తరుణీ, తలునీ, తరుణిఅ, తరుణియా ; నే. తరుని ; బెం. తలుని ; గు. తరుణీ.

< ప్రా. తరుణిఅ.

**తరుపడి** రూ.చూ. తటిమెన. వి. తరిమెన యంత్రం.

**తరుఫు**[1] రూ.చూ. తరఫు. వి. పక్షం.

**తరుపు**[2] చూ. తరుచు[1].

**తరుపు**[3] రూ.చూ. తఱపి. వి. **1**. గేదె లేదా ఆవుపెట్టిన (ఈనిన) పసరం, లేత ; **2**. ప్రాయంలోఉన్న ఆవు లేక పెయ్య.

**తరుపుదూడ** రూ.చూ. తరిపిదూడ. వి. ఎదిగినదూడ.

**తరుపు**[4] వి. ముదురు తోరమల్లి ; విణ. దృఢమైన.

**తరుపుదారు** వి. చిన్నజిల్లాకు అధికారి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 77 క్రీ.శ. 1740. పన్నులు వసూలు చేసేవాడు.

హిం.ఉ. తరఫ్‌దార్. ఒకపక్షం వహించేవాడు, సహాయుడు ; పార. తరఫ్‌దార్. అనుచరుడు, మండలకరగ్రాహి, భూస్వామి.

< ఉ. తరఫ్‌దార్.

**తరుపుడ్రాడు** చూ. తరుచు[1].

**తరుము**[1] రూ.చూ. తఱుము. వి. **1**. తరిమెనపెట్టు. భార. భీష్మ. 2.315 ; **2**. వెంబడించు. కాశీ. 4.131 ; **3**. బలాత్కరించు ; **4**. వాటాదారంతో వాటా కోయడానికి వాటా అడుగుభాగంలోని మట్టిని గట్టిగా దగ్గరకు నొక్కు.

**తరుము**[2] స.క్రి. కోయు.

**తరువడి** రూ.చూ. తటిమెన. వి. తరిమెన యంత్రం.

**తరువడిమాను** వి. తరిమెన చెట్టు.

**తరువద** వి. ఛందోభేదం.

సం. ధ్రువాపద-. ఛందోభేదం.

**తరువాణి** రూ.చూ. తరవాణి. వి. పులిసినగంజి.

**తరువాత** చూ. తరువాయి.

**తరువాయి** రూ. తరవాయి, తర్వాయి. వి.ఔ. **1**. అనంతరకాలం, అనంతరం. నిర్వ.రా. 4.18 ; **2**. క్రమం, వరుస. భార. ద్రోణ. 2.94 ; **3**. (కథాదుల) పరిశిష్టభాగం, శేషం. వరాహ. 7.43 ; **4**. ఆవృత్తి, తడవ ; **5**. వల్లె.

క. తఱు-వాయ్. వరస, తరువాత : త. తఱువాయ్. సందర్భం, ప్రత్యేక తరుణం, కష్టకాలం, అరుదైన అవకాశం, సమయం ; కువి. దెరి. తరువాత.

**తరువాత** రూ. తర్వాత. అవ్య.ద్రు. పిమ్మట. సాంబ. మాన. 40.

**తరువిడు** చూ. తరువు.

**తరువు** వి. **1**. నిర్బంధం. వరాహ. 12.60 ; **2**. కాముకొని ఉండేవాడు, కావలివాడు. వేంక. పంచ. 4.436, వైజ.

3.10 ; **3.** (ఈయవలసిన ధనాదికాల్ని ఇమ్మని) నిర్బంధించేవాడు, నిర్బంధకుడు. పరమ. వి. 4.145 ; **4.** బాధకం, బాధకుడు. రాజవా. 3.111 ; **5.** ఇద్దరు భుజాలపై పెట్టుకొని మోయడానికి అనువుగా బరువైన వస్తువుకు కట్టిన తాడులోనుండి దొప్పించిన కర్రజడి ; **6.** తొందర ; **7.** ప్రోత్సాహం, ప్రేరణ.

**తరువిడు** స.క్రి. పురికొల్పు. వసు. 5.106 ; **2.** నిర్బంధించు. దశా. 6.85. **తరువుకత్తె** వి. (ఇయ్యవలసిన ధనాదికాలిమ్మని) నిర్బంధించే స్త్రీ. నిర్బంధకురాలు. ఉ.రా. 6.197. **తరువుకాఁడు** వి. (ఇయ్యవలసిన ధనాదికాలిమ్మని) నిర్బంధించేవాడు, నిర్బంధకుడు. వైజ. 2.143. **తరువుచేయు** రూ.చూ. **తరువుసేయు**. స.క్రి. డబ్బుకోసం బలాత్కరించు. **తరువుండు** అ.క్రి. **1.** బాకీడబ్బు యిచ్చేవరకూ వసూలు చేయడానికై వారితోనే ఉండు. గౌ. హరి. పూ. 1515-16; **2.** కావలిఉండు. వేంక. పంచ 4.436.
<తరువ + ఉండు. **తరువుపనుచు** స.క్రి. బాకీవసూలు చేయడానికై మనుషుల్ని పంపు. **తరువుసేయు(-చేయు)** రూ. తరువుచేయు. స.క్రి. పురికొల్పు, ప్రేరేపించు. కుప.చ. 4.54, సారంగ. 3.138 ; అ.క్రి. నిర్బంధించు బలవంతపెట్టు. దశా. 7.25.

**తరువోజ** రూ. తర్వోజ. వి. తెలుగులో ఒక ఛందోభేదం. కావ్యా. చూ. పు. 117.
సం. ధ్రువాపద-. ఛందోభేదం; ప్రా. ధు-అ, ధువ ; మరా. ధ్రుపద, ధృపద, ధృవపద-. గీతికాభేదం.

**తరుసరి** రూ.చూ. తఱుసలి. వి. ఉద్ధతుడు.

**తర్కము** రూ. తరకము. వి. **1.** ఆరు అనే సంఖ్యను తెలిపే సాంకేతికపదం. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 110. క్రీ.శ. 1141 ; **2.** వాదం. సిం.ద్వా. 8.91 ; **3.** కలహం.
సం. తర్క-. న్యాయశాస్త్రం, విచారించటం, కోరిక.
<సం. తర్క-. (అర్థవిపరి.).

**తర్కించు** స.క్రి. **1.** ఊహించు. కు.సం. 9.11 ; **2.** చింతించు, భావించు, తలంచు. చంద్రాంగ. 1.78.
సం. తర్క-. అనుమానించు. విశ్వసించు.
<సంతర్క + -ఇంచు[3].

**తర్కిలేట్** రూ.చూ. తర్కిలేటు. వి. ఒకరకం సబ్బునూనె.

**తర్కిలేటు** రూ. తర్కిలేట్. వి. ఒకరకం సబ్బునూనె.

**తర్గు[1]** రూ.చూ. తఱుగు[1]. అ.క్రి. తగ్గు, కృశించు, క్షయించు. అం.భా. 3.36. వి. క్షీణత, క్షయం ; విణ. తగ్గిన, మందంగా ఉన్న.

**తర్గు[2]** రూ.చూ. తఱుగు[2]. స.క్రి. **1.** ఖండించు. కు.సం. 11.34 ; **2.** నరుకు, పండి.చ. 4.245 పు ; **3.** తాలివేయు ; **4.** కోయు.

**తర్చు[1]** రూ.చూ. త్రచ్చు. స.క్రి. చిలుకు. అచ్చ.రా.యు. 161.

**తర్చు[2]** రూ.చూ. తఱుచు. వి. బహుళం. ఆము. 2.69.

**తర్జమా** రూ.చూ. తర్జుమా. వి. అనువాదం.

**తర్జిమా** రూ.చూ. తర్జుమా. వి. అనువాదం.

**తర్జుమా** రూ. తరజిమ్మా, తర్జమా, తర్జిమా. వి. అనువాదం.
హిం.ఉ. తర్ జుమా. అనువాదం, వ్యాఖ్యానం ; మరా. తర్ జమా. భాషాంతరీకరణం ; పార. తర్ జమహ్. అనువాదం. వ్యాఖ్యానం.
<మరా. తర్ జుమా.

**తర్తిరేసుగు** రూ.చూ. తత్తరేనిగె. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా చిన్నమూతితో నీళ్ళునింపుకొని చంకకు తగిలించుకొని వెళ్లటానికి వాడే మట్టిపాత్ర.

**తర్పిదు** రూ.చూ. తరిబియతు. వి. శిక్షణ.

**తర్రాయి బుర్రాయి తాటికాయచేయు** స.క్రి. మాయచేయు.

**తర్రేపు** వి. సామగ్రి తయారీకి ఉపయోగించే తెల్లని కలపనిచ్చే చెట్టు (Barringtonia Acutangula).

**తర్లించు** చూ. తర్లు.

**తర్లు** రూ.చూ. తరలు. అ.క్రి. ప్రయాణమగు, వెళ్ళు. వేమన. 2.120.
**తర్లించు** స.క్రి. కదల్చు, తరల్చు. వసు. 3.165. **తర్లుచీర** వి. మగపెళ్లివారింటికి, పెళ్ళికి తరలివెళ్ళేటప్పుడు. పెళ్ళికూతురు కట్టుకొనేచీర. **తర్లుబెండ్లి(-పెండ్లి)** వి. స్థలాంతరానికి పెళ్ళికొడుకుపోయి చేసుకొనే పెళ్ళి.

**తర్వాడి** రూ.చూ. తరవాణి. వి. పుల్లనీళ్ళు.

**తర్వాణి** రూ.చూ. తరవాణి. వి. పుల్లనీళ్ళు, అన్నంతో కలిపి పులియబెట్టిన గంజి.
**తర్వాణికుండ** రూ.చూ. తరవాణికుండ. వి. గంజి, పుల్లనీళ్ళు పోసి పెట్టడానికి వాడే బుంగమూతి మట్టికుండ.

**తర్వాత** చూ. తర్వాయి.

**తర్వాయి** రూ.చూ. తరువాయి. వి.బొ. **1.** అనంతరకాలం. అనంతరం. రం.రా. కిష్కిం. 247 పు. 8 పం. ; **2.** కథ. మొ. వాటి మిగిలిన భాగం, శేషం ; **3.** క్రమం, వరుస ; **4.** వల్లె ; **5.** ఆవృత్తి, తడవ.
**తర్వాత** రూ.చూ. తరువాత. అవ్య.క్రదు. పిమ్మట. అం.భా. 3.73.

**తర్వు[1]** రూ.చూ. తఱుగు[1]. అ.క్రి. తగ్గు. వి. తగ్గుదల, క్షీణత.

**తర్వు[2]** రూ.చూ. తఱుగు[2]. స.క్రి. **1.** ఖండించు ; **2.** చింపు.

**తర్సింపాతబండ** వి. కుండల్ని సర్దేటప్పుడు సలపను తడిచేసుకోడానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి.

**తర్వోజ** రూ.చూ. తరువోజ. వి. తెలుగులో ఒక ఛందో భేదం.

**తఱక** వి. **1.** పొల్లుధాన్యం. అం.భా. 2.239 ; **2.** గరుకుతనం, విషమత్వం.
**తఱకట** రూ. తరకట. విణ. వ్యర్థమైన, అసత్యమైన. సమీర. వి. 2.68. **తఱకతఱకలు** వి.బ.వ. మిక్కిలి గరకుతనం, విషమత్వం. క. తరకలు. గరుకుతనం. **తఱతఱకలు వాఱు(-పాఱు)** అ.క్రి. నిమ్నోన్నతమగు, గొగ్గియగు. వేంక. పంచ. 4.540.

**తఱఁకించు** చూ. తఱఁకు.

**తఱఁకు** రూ.చూ. తఱుగు[1]. అ.క్రి. **1.** తగ్గు, క్షీణించు. కు.సం. 6 116 ; **2.** వ్యాపించు, పర్వు. కు.సం. 7.95 ; **3.** తొలగు ; స.క్రి. **1.** వదులు, విడుచు, కు.సం. 9.91 ; **2.** కాంతి కోల్పోవు, ధైర్యం కోల్పోవు.
**తఱఁకించు** స.క్రి. తొలగించు. కు.సం. 9.147.

**తఱచు** రూ.చూ. తఱుచ. వి. **1.** సాంద్రత, చిక్కన. కు.సం.

8.97 ; **2.** పెల్లు, అతిశయం. భార.విరా. 4.62 ; **3.** బాహుళ్యం. భార.భీష్మ. 2.88 ; విశ. **1.** నిబిడమైన, సాంద్రమైన. భార.విరా. 4 114 ; **2.** బహుళం. భార. భీష్మ. 1.91 ; **3.** అధికమైన. భార. ఆరణ్య. 4.295 ; క్రి.విశ. **1.** దట్టంగా, నిబిడంగా, సాంద్రంగా. నిర్వ.రా. 2.37 ; **2.** ప్రాయికంగా, సామాన్యంగా. ఆము. 5.132 ; **3.** అధికంగా, మిక్కిలి. రామాభ్యు. 2.13.

త. *తఱుచు*.

**తఱచుఁదనము(-తనము)** రూ. తఱుచుఁదనము. వి. సాంద్రత్వం. పాండు. 3.201.

**తఱటు** రూ. తరటు. వి. కశ, కొరడా. భార.ఆరణ్య. 1.300. స.క్రి. కొరడాతోకొట్టు. భాగ. 5. 2.142 ; విశ. మూర్ఖమైన.

తొ. *తొత్*. (చేతితో) కొట్టు ; కువి. *తస్సలి*.

**తఱటుగావించు(-కావించు)** స.క్రి. కొరడాతోకొట్టు. శశా. 5.21. **తఱటుగొను(-కొను)** స.క్రి. కొరడాతోకొట్టు. **తఱటుచేయు** రూ.చూ. తఱటుసేయు. స.క్రి. కొరడాతోకొట్టు. పాండు. 1.163. **తఱటున్వ్రేయు** స.క్రి. కొరడాతోకొట్టు. కళా. 3.86. **తఱటువెట్టి** వి. మిక్కిలి వెర్రివాడు. **తఱటుసేయు(-చేయు)** రూ. తఱటుచేయు. స.క్రి. కొరడాతోకొట్టు. మను. 4.115.

**తఱతఱ** రూ.చూ. తత్తఱ. వి. తొట్రుపాటు.

క. *తత్తఱ, తత్తఱి, తత్తళ, తఱతఱ*. గందరగోళం, తత్తరపాటు, ఇబ్బంది ; త. *తత్తరమ్*. వణుకు, కంపన, తడబాటు ; మ. *తత్తరమ్*. తొందర, కలవరం.

**తఱతఱలాడు** అ.క్రి. భయం మొ. వాటిచే తొట్రుపడు, తత్తరపడు.

**తఱతఱకలు** చూ. తఱక.

**తఱతఱకలువాఱు** చూ. తఱక.

**తఱపి** రూ. తరపి, తరిపి, తరుపు[3], తఱిపి. వి. **1.** వత్సతరం, ముదురుదూడ, వత్సతరి. హరి.పూ. 6.9 ; **2.** కొదమ, పిల్ల. పాండు. 4.287 ; విశ. ముదురు. భీమ. 2.46, కాశీ. 1.123.

**తఱపియావు(-ఆవు)** రూ. తఱిపియావు. వి. ముదురుదూడగల ఆవు, చాలాకాలం కిందట ఈనిన ఆవు. ఆం.భా. 2.264. **తఱపివెన్నెల** వి. పండు వెన్నెల. హర. 7.30 కాశీ. 1.123.

**తఱలిక** చూ. తఱలు.

**తఱలించు** చూ. తఱలు.

**తఱలు** రూ.చూ. తరలు. అ.క్రి. **1.** చలించు. భాస్క.రా, యు. 1725 ; **2.** నడచు, సంచరించు ; **3.** ప్రయాణం అగు, బయల్వెడలు ; **4.** తొలగు, అపసరిల్లు ; **5.** పోవు, నశించు ; **6.** జంకు, భయపడు. స.క్రి. విడుచు, వదులు. గౌ. హరిశ్చ. ఉ. 764 పం.

**తఱలిక** రూ.చూ. తరలిక. వి. యాత్ర, ప్రయాణం. **తఱలించు** రూ.చూ. తరలించు. స.క్రి. **1.** తొలగించు, పోగొట్టు ; **2.** లాక్కొనిపోవు, కొనిపోవు ; **3.** ప్రయాణం చేయించు. **తఱలుచు** రూ.చూ. తరల్చు. స.క్రి. తొలగించు, పోగొట్టు. **తఱలుడు** రూ.చూ. తరలుడు. వి. యాత్ర. ప్రయాణం. **తఱల్చు** రూ.చూ. తరల్చు. స.క్రి. తరల చేయు.

**తఱల్చు** చూ. తఱలు.

**తఱి**[1] వి. **1.** సమయం, తగిన సమయం, అదను. భార.ఆది. 6.114 ; **2.** వయఃకాలం, వయసు, ఈడు. భార.విరా. 1.95 ; **3.** తర్వాత. రం.రా.ఉ.పు. 18 ; **4.** అవకాశం, తెరపి. విక్ర. 1 71.

క. *తఱి*. స్థిరపడిన ; కువి. *దరి*. తరవాత.

**తఱిగొను(-కొను)** అ.క్రి. యత్నించు, పూను, కడగు, భార. ఆరణ్య. 7.36. **తఱిగొల్పు(-కొల్పు)** స.క్రి. పూనజేయు. హరి.పూ. 2.225. **తఱిదక్కియుండు** అ.క్రి. అవసాన దశలో ఉఁడు. పాండు. 3.36. **తఱిద్రొక్కు(త్రొక్కు)** అ.క్రి. కాలం సమీపించు, ఆసన్న మరణమగు. **తఱిఁదఱి(-తఱి)** క్రి.విశ.ద్రు. తోడ్తో, వెనువెంట. కు.సం. 8.94.

**తఱి**[2] వి. మాంసం. మల్ల. నీతి. 9.

సం. *తరస-*. మాంసం.

**తఱి**[3] వి. **1.** తరంగం, కరడం. నృసింహ. పీఠి. **4** ; **2.** తాడు మొ. వాటిని ఎత్తడం వల్ల కలిగిన రేఖ, నొక్కుడు జాడ. కాశీ. 5.284. వి.బ.వ. మూడు వళులు, కడుపు మీది ముడతలు. వసు. 5.75.

క. *తఱి, తఱె*. నరుకు, చెక్కివేయు ; కొడ. *తరి*. ముక్కముక్కలుగా నరికివేయు ; తు. *తరిపుని* ; త. *తఱి(-మ్-,-న్ఱ్-)*. నరికిన, విరిగిన ; *తఱికై*. ఒకరకం గొడ్డలి ; మ. *తఱిక్క*. నరికివేయు, *తఱి*. మగ్గం, కర్ర; కో. *తఱ్య్*. నరుకు ; కుఇ. *తప్వ(తప్త-)*. నరిచేయు ; నా. *తర్గ్-*. నరుకు ; కురు. *తార్నా(తార్యస్)*. (చెట్టును) నరుకు ; మాల్తో. *తరె*. నరికివేయు, పడగొట్టు, విరిచి వేయు ; బ్రా. *తడింగ్*. నరుకు, చంపు.

**తఱిగోడు** వి. తరిమెన పెట్టిన ఖట్వాంగం. **తఱిపడు** అ.క్రి. ఒత్తుడుపడు. **తఱిమెన** రూ. తరిణ, తరిణి, తరిణె, తరిన, తరిమణ, తరిమిడి, తరిమిడీ, తరిమెన, తరివిణి, తరుపడి, తరువడి. వి. **1.** పట్టుకారు, సందంశం. భోజ. 7.44 ; **2.** కర్ర మొ. వాటిని నునుపు చేయడానికీ, వాటిమీద నగిషీ చేయడానికీ వడ్రంగులు ఉపయోగించే సాధనం. కళా. 2.15. **తఱిమెనదొడ్డి** వి. తరిణపట్టేచోటు. **తఱిమెనఁబట్టు(-పట్టు)** స.క్రి. తరిమెనతో నునుపు చేయు. తరిమెనతో నగిషీపనిచేయు. **తఱిమెనఁబెట్టు(-పెట్టు)** స.క్రి. తరిమెనతో నగిషీపని చేయు. **తఱివడు (-పడు)** అ.క్రి. నొక్కుపడు, పల్లాలేర్పడు, ఒత్తుడు జాడలుపడు. కాశీ. 3.138. **తఱులమొకపుమెకము** వి. వలీముఖం, కోతి. అచ్చ. రా.యు. 198. **తఱులమెకము** వి. వలీముఖం. అచ్చ.రా.యు. 197. **తఱులమోరమెకము** వి. కోతి, వలీముఖం. అచ్చ. రా.యు. 81. **తఱులువడు (-పడు)** అ.క్రి. నొక్కులుపడు, పల్లాలు ఏర్పడు, ఒత్తుడు జాడలుపడు. కాశ.శ. 4.75.

**తఱిగించు** చూ. తఱుగు[1].

**తఱిగినకదళీచందమున** చూ. తఱుగు[2].

**తఱిగివచ్చు** చూ. తఱుగు[1].

**తఱిపి** రూ.చూ. తఱపి. వి. **1.** వత్సతరం, ముదురు దూడ, వత్సతరి. వేంక. పంచ. 1.586 ; **2.** కోదమ, పిల్ల ; విణ. ముదురు. కృ. శకు. 2.133.

**తఱిపిదూడ** రూ.చూ. తరిపిదూడ. వి. లేతదూడ. **తఱిపియావు(-ఆవు)** రూ.చూ. తఱపియావు. వి. ముదురుదూడ గల ఆవు, చాలకాలం కిందట ఈనిన ఆవు.

**తఱిమించు** చూ. తఱుము.

**తఱిమిపలుకు** చూ. తఱుము.

**తఱిమియడుగు** చూ. తఱుము.

**తఱియఁజొచ్చు** చూ. తఱియు.

**తఱియఁబడు** చూ. తఱియు.

**తఱియఁబాఱు** చూ. తఱియు.

**తఱియు** స.క్రి. **1.** తరించు, దాటు. భార.ఆది. 1.19 ; **2.** (శత్రువులను) తాకు, ముట్టు. భార.విరా. 3.180 ; **3.** చొచ్చు, ప్రవేశించు. భార.శాంతి. 2.64 ; **4.** కడచు, అతిక్రమించు. మార్క. 4.165 ; **5.** విమర్శించు, పరిశోధించు. కాశీ. 2.151 ; **6.** డాయు, సమీపించు. మను. 2.23 ; అ.క్రి. **1.** కూడు, చేరు, కలియు. భార. విరా. 5.16 ; **2.** తొలగు. భార.అను. 4.21.

క. *తఱ్, తఱు(తత్)*. చేరు, సమీపించు ; తు. *తరపుని, తర్పుని*. గట్టిచేయు, గట్టిగా బిగించు ; త. *తఱు(తఱువ్, తఱ్ఱ్)*. బట్టలాగా బిగుతుగా తొడుగుకొను, బిగించు, *తఱై(తఱైవ్, తఱైన్త్)*. గట్టిచేయు, తాఱు ; మ. *తఱుక*. ముందు వెనకల లోపలికి దోపు, *తఱయుక*. స్థిరపడిన, *తఱెక్క*. లోపలికి దిగగొట్టు, సాగగొట్టు, బిగించు, తాఱు. లోపలికి దోపి తొడుక్కునే బట్టలు ; తొ. *తఱ్(-తఱ్థ)*. అంటుకొను, తగులుకొను (బురదలో, కష్టాల్లో), *తఱ్ఫ(తఱ్త్)*. బాధాకరమగు. *తెల్(తెత్)*. నడుంచుట్టూ బిగుతుగా వస్త్రాన్ని చుట్టు ; కువి. *దరి*. దగ్గర ; మాల్తో. *దార్య(దార్వ)*. సరిపోవు, అంగీకరించు, మిగిలిన. పో.చూ. త. *తన్ను*. సమీపించు. చూ. తనుకు[2].

పో.చూ. సం. *తర్*. దాటు.

మూ.ద.ద్రా. *తత్-*.

**తఱియఁజొచ్చు (-చొచ్చు)** స.క్రి. **1.** (శత్రువులను) తాకు, ముట్టు. భార.ఉద్యో. 2.139 ; **2.** కడచు, దాటు, అతిక్రమించు. భార.భీష్మ. 2.37 ; **3.** చొచ్చు, ప్రవేశించు. ఉ.హరి. 2.49. < తఱియు + -అ[7] + చొచ్చు. **తఱియఁబడు** అ.క్రి. **1.** తెగించు, సాహసించు. భార.విరా. 4.233. భోజ. 6.108 ; **2.** చొచ్చు, ప్రవేశించు. మను. 4.37. < తఱియు + -అ[7] + పడు. **తఱియఁబాఱు** స.క్రి. ఉల్లంఘించు, మీఱు, అతిక్రమించు. భార. విరా. 4.233. < తఱియు + -అ[7] + పాఱు.

**తఱివడు** అ.క్రి. ఒరసికొను. కాశీ. 3.138.

**తఱుగరి** చూ. తఱుగు[2].

**తఱుగాకు** చూ. తఱుగు[1].

**తఱుగు[1]** రూ. తరగు, తరిగ, తరుగు1, తర్గు[1], తర్వు[1], తఱఁకు, తఱువు[1]. అ.క్రి. తగ్గు, కృశించు. భార.ఆది. 1.65 ; వి. **1.** క్షీణత, తగ్గుదల. వరాహ. 9.123 ; **2.** అమ్మేవాడికి కొనేవాడికి వ్యవహారం కుదిర్చి ప్రతిఫలంగా తీసుకునే డబ్బు. చంద్రాంగ. 4.278 ; **3.** తరుగు ; విణ. తగ్గిన, మందంగా ఉన్న. చంద్రాంగ. 4.278.

క. *తరగు*. తగ్గిపోవటం, వ్యర్థం, తగ్గించిన మొత్తం, దళారీ రుసుం, తరుగు ; త. *తరకు*. దళారీరుసుం; *తరవు, తరకన్*. దళారీ ; మ. *తరకు*. దళారీరుసుం, తగ్గించిన మొత్తం, *తరకన్*. దళారీ.

**తఱిగించు** స.క్రి. తగ్గించు, క్షీణింపచేయు. కాశీ. 1.111. < తఱుగు[1] + -ఇంచు[3]. **తఱిగివచ్చు(-తఱుగు[1] + -ఇ[13] + వచ్చు)** అ.క్రి. తరుగువచ్చు, క్రమంగా క్షీణించు. విష్ణుపు. 6.315. **తఱుగాకు** రూ. తరిగాకు,తరుగాకు. వి. కొయ్యతోటకూర, ఏడాదిపొడుగునా పెరిగే ఆకుకూర (Amarantus tristis). < తఱుగు[1] + ఆకు.

**తఱుగు[2]** రూ. తగ్గు[2], తరుగు[2], తర్గు[2], తర్వు[2], తఱువు[2]. స.క్రి. **1.** ఖండించు, కోయు. భార. ఆరణ్య. 2.157; **2.** తొలివేయు.

క. *తఱి, తఱె*. బెరడుతీయు, నరికివేయు, నరుకు, *తఱి*. నాటటానికి చెట్టునుంచి కోసిన చిన్న కొమ్మ, చిత్రవధ, నేలలో నాటిన కొయ్య, స్తంభం, పదునైన కత్తి ; కొడ. *తరి (తరిప్, తరిచ్)*. చిన్నచిన్న ముక్కలుగా తరుగు ; తు. *తరిపుని*. నరికివేయు, *తజపుని*. చెక్కు, ముక్కలుగా నరుకు ; త. *తఱి (తఱివ్, తఱిన్త్)*. కోయు, పగిలిన ; (*తఱిప్, తఱిత్*). నరకు, చెక్కివేయు, నరికివేయు, *తఱికై*. ఒక రకం గొడ్డలి, ఉలి ; మ. *తఱిక్క*. నరికివేయు, *తఱి*. స్తంభం, కర్రపుల్ల, నాటటానికి చెట్టునుంచి కోసిన చిన్నకొమ్మ, సాలెవాళ్ళ మరమగ్గం ; కో. *తయ్ర్ (తర్చ్)*. కోయు ; కతి.ర్. (<*కత్య-తయ్ర్, కత్ర్చ్* <*కత్య, -తర్చ్*), కోయు. *తర్య, తయ్ల్, తయ్ర్ గొ.డ్* ). తడికతో కట్టిన గోడ మరియు అలికిన ఇంటిగోడ ; కుఇ. *తహ్ప(తహ్త్)*. చదునుచేయు, తునక, గీరు ; కొలా. *తర్గ్ (తరక్త్)*. నరకు ; నా. *తర్గ్*. నరకు ; కురు. *తార్*. నరికివేయు, *తార్నా (తార్యాస్)*. పడిపోవు (చెట్టు), నరికివేయు ; మాల్తో. *తరె*. నరికివేయు, పగులు, *తార్*. నరికివేయు ; బ్రా. *తడ*. తెగగొట్టు ; *తడింగ్*. నరుకు, నరికివేయు.

మూ.ద్రా. **తత్*.

**తఱిగినకదళిచందమున** అవ్య.ద్రు. కొట్టివేసిన అరటిచెట్టులాగ. ద్వి. హరిశ్చ. 1843,44. **తఱుగరి** వి. తరుగుబేరగాడు (క్రయవిక్రయాలు కుదిర్చి అందుకు ప్రతిఫలంగా డబ్బుపుచ్చుకొనేవాడు). వసు. 3.142. < తఱుగు[3] + -అరి. **తఱుగు బేరము** వి. ఒకరి సరుకును తనవద్ద ఉంచుకొని మరొకరికి అమ్మిపెట్టి వచ్చిన దానిలో కొంత వంతు తీసుకొనే వ్యాపారం.శుక. 3.372.

**తఱుచలి** రూ.చూ. తఱుసలి. వి. ఔప. **1.** ఉద్ధతుడు ; **2.** ఉద్ధతురాలు.

**తఱుచు** రూ. తరుచు[2] , తర్చు[2], తఱచు ; క్రి.విణ. **1.** సాం

్రదంగా, దట్టంగా, నిబిడంగా. భార.సభా. 2.306 ; **2.** అధికంగా, మిక్కిలి. భార.శాంతి. 2.89 ; **3.** ప్రాయికంగా, సామాన్యంగా ; విణ. **1.** నిబిడమైన, సాంద్రమైన. భార. భీష్మ. 4.149 ; **2.** బహుళమైన ; **3.** అధికమైన ; వి. **1.** బాహుళ్యం. భీమ. 3.57 ; **2.** చిక్కదనం, సాంద్రత ; **3.** పెల్లు, అతిశయం.

త. తఱుచు.

**తఱుచుఁగన్నులవేల్పు** (-కన్నులవేల్పు) వి. సహస్రాక్షుడు, ఇంద్రుడు (వెయ్యి కళ్ళుకలవాడు). వసు. 5.94. **తఱుచుఁదనము** రూ. చూ. తఱచుఁదనము. వి. ఒత్తు. **తఱుచులు** వి.బ.వ. బహూక్తులు, పెక్కుమాటలు. అచ్చ.రా. సుందర. 148.

**తఱుపు**[1] వి. కృత్రిమ వజ్రం. ఆం.భా. 2.278.

క. తరపు, తరబు, తరుపు. వజ్రంలాంటి తక్కువ రకం రాయి ; త. తరుప్పు. తక్కువ విలువగల తెల్లరాయి.

**తఱుపు**[2] చూ. తఱియు. స.క్రి. తరియజేయు (కూడబెట్టు, సంగ్రహించు). వేంక.పంచ. 1.763.

**తఱుపు**[3] చూ. తఱుగు[1]. రూ.చూ. తరపు[1]. స.క్రి. **1.** కొంచెపరచు, తగ్గించు. రుక్మా.చ. 2.107 ; **2.** హరించు ; **3.** అణచు.

**తఱుపుదూడ** చూ. తఱపి. రూ.చూ. తరిపిదూడ. వి. లేత దూడ.

**తఱుము** రూ. తరుము[1]. అ.క్రి. **1.** విజృంభించు, ఉద్రేకించు, అతిశయించు. కు.సం. 5.41, భార.ఉద్యో. 1.323 ; **2.** త్వరపడు, వేగిరపడు. భార.విరా. 1.152 ; **3.** అరుము, కలియు, (శత్రువులపై) పడు. భార.ఉద్యో. 4.150 ; **4.** తొట్రుపడు, సంభ్రమించు. ఉ.రా. 2.164 ; స.క్రి. **1.** పరిగెత్తించు. భార.విరా. 3.175 ; **2.** తోలుకొని పోవు. భార.విరా. 4.262 ; **3.** విసర్జించు, పారవేయు. పండి.చ. 2.131 పు. ; **4.** బలాత్కరించు, నిర్బంధించు. భార. భీష్మ. 1.13; **5**. పురికొల్పు, ప్రేరేపించు. భార.శల్య. 2.37; **6.** (చెప్పటంలో) ఒత్తు, నొక్కు, నొక్కిచెప్పు. భార.అను. 1.13 ; **7.** త్వరపెట్టు, తొందరపెట్టు. భార.అను. 1.13 ; **8.** తోయు, గెంటు. ఉ.హరి, 3.124 ; **9**. ఉచ్చాటనం చేయు, పోగొట్టు. శృం.నై. 7.53 ; **10.** ఉల్లానమాడు, అధిక్షేపించు. ప్రభా. 5.80; **11**. కమ్ము, కవియు. శకుత్స. 3.120; **12**. పోగొట్టు. నీలా. 1.103 ; **13**. తరిమెనపెట్టు; వి. **1**. బలాత్కారం, నిర్బంధం. రాజ.చ. 3.96 ; **2.** తోపుడు. శ్రీరం.మా. 1.132.

కురు. చడ్ (చడ్డ్). తరిమివేయు ; పో.చూ. కుఇ. తాజ. తుడుచు. మూ.ద్రా. *చత్/*తత్.

**తఱిమించు** స.క్రి. తరుమచేయు, పరిగెత్తించు. దశా. 5.41. **తఱిమిపలుకు** స.క్రి. పైపై అడుగు. రుక్మాం.5.129. **తఱిమియడుగు** స.క్రి. గుచ్చిగుచ్చి అడుగు. కు సం. 4.58. <తఱుము + -ఇ[13] + అడుగు. **తఱుముడు** వి. తరమటం. **తఱుముడుచెండు** వి. ఒకరకం ఆట. బాల క్రీడా విశేషం. ప్రబంధ. 613. **తఱుముడువడు** (-పడు) అ.క్రి. తరమబడు, పరుగుతో వెంటపెట్టబడు. వేంక.పంచ. 1.605. **తఱుములిడు** స.క్రి. తోయు. శ్రీరం.మా. 1.132. <తఱుము + -లు + ఇడు.

**తఱులమొకపుమెకము** చూ. తఱి[3].

**తఱులమెకము** చూ. తఱి[3].

**తఱులమోరమెకము** చూ. తఱి[3].

**తఱులువడు** చూ. తఱి[3].

**తఱువు**[1] రూ.చూ. తఱుగు[1]. అ.క్రి. తగ్గు, కృశించు, క్షయించు; వి. క్షీణత, తగ్గుదల, క్షయం. విణ. తగ్గిన, మందమైన.

**తఱువు**[2] రూ.చూ. తఱుగు[2]. స.క్రి. తొలుచు, చిల్లిపొడుచు. శృం.నై. 8.6.

**తఱుసంటి** వి. **1.** అజ్ఞుడు. కు.సం. 7.49 ; **2.** ఘనమైనది, గొప్పది, పెద్దది.

**తఱుసలి** రూ. తరుసరి, తఱుచలి. వి. ఔప. పెద్ద. భార.సభా. 2.228, కు.నం. 7.49; వి. **1.** చిన్నవాడు ; **2.** మూర్ఖుడు.

**తఱ్ఱ** రూ.చూ. తఱ్ఱు. వి. నీచుడు.

**తఱ్ఱికాయ** వి. విత్తులులేని తాటికాయ.

**తఱ్ఱు** రూ. తఱ్ఱ. విణ. నీచుడైన, తుచ్ఛుడైన. దాశ. 37.

**తల**[1] వి. **1.** శిరస్సు. భార.ఆది. 2.152 ; **2.** శిరోజాలు, తలవెంట్రుకలు. భార.అరణ్య. 1.136 ; **3.** కొన, చివర. కు.సం. 5.155 ; **4.** అందు అనే సప్తమీ విభక్తి ప్రత్యయార్థాన్ని ఇచ్చే శబ్దం. కు.సం. 5.159 ; **5** ఎత్తు, ఉద్ది; భార.ఉద్యో. 1.75; **6.** వైపు, పక్షం. భార.ఉద్యో. **2**.315. **7.** ముందు భాగం, పురోభాగం. భార.ఉద్యో. 3.360 ; **8**. మొత్తం, సంఘం, గుంపు. భార.శల్య. 1.100; **9.** కలయిక, కూడిక. హరి.పూ. 5.228 ; **10.** ఉత్తరభాగం; శేయూ. 3.39 ; **11.** శిఖరం, అగ్రభాగం. ఆము. 5 33 ; **12.** ధైర్యం ; **13.** పెద్దవాడు ; **14**. తలకాయ, మేకు మీది మొద్దుగా వెడల్పుగా ఉండే భాగం ; **15** గూనచివరి వెడల్పాటి భాగం ; **16**. పణత, ఏడికోల దూర్చే కొయ్య మొద్దు ; విణ. మొదటివాడైన, ముఖ్యుడైన. భార.ఉద్యో. 4.267.

క. తలె, తల. తల, మీదిది, లేక ముఖ్యుడు ; కొడ. తలె. చివర ; తు. తరె. తల, చివర, తలజుట్టు ; త. తలై. తల, శిఖరం, చివర, కొన, జుట్టు, తలైప్పు. మొదలు చివర, బట్టయొక్క చివర లేక అంచు, తలైమై. నాయకత్వం, అగ్రగణ్యత్వం ; త. తలైవన్. ముఖ్యుడు, ఊరిపెద్ద, యజమాని, తలైవి; మ. తల. తల, శిఖరం, మొన, కొన, తలక్కం, తలప్పు. చెట్టు పైభాగం, తలాటి, తలాటు. చెట్టు పైభాగం. మొన, కొన ; కో. తల్. తల, శిఖరం, మీద, మేలైన, తల్వ్. చివర (కర్ర, కొమ్ము, తాడు మొ॥ వాటి) ; తొ. తల్. తల, చివర, అంచు ; తష్, తస్క్. చివర, తస్. చివర నున్నది, తల్వ్. (కర్ర హారన్ మొ॥ వాటి) కొన ; గోం. తలా. తల, తలె. చివర ; కొండ. తల. తల ; కుఇ. త్లా. (బహు.త్లాక) ; కువి. థాయూ, త్రాజూ ; పర్జి. తెల్. కొలా. తల్. నా. తల్. గ. తల్, తల్లు (బహు. తల్కల్.) ; మాల్తొ. తలి. తలజుట్టు.

<మూ.ద్రా. *తల్.

తక్కొను రూ. తలకొను. అ.క్రి. పూనుకొను. భార.ఆది. 4.80. త. తలైక్కొళ్. **తలఅడ్డుమానం పెట్టిఅయినా** అవ్య. ఎన్నికష్టాలుపడిఐనా. **తలఅమ్ముకొను** అ.క్రి. పరాధీనమగు. **తలకచ్చి** వి. సరిచేసిన పడుగులో, అనికిదగ్గరగా లాకలు చేర్చిన మొదటికచ్చి. **తలకట్టు** వి. 1. జుట్టు, కేశపాశం. భార.విరా. 1.228 ; 2. కిరీటం, శిరోభూషణం. వరాహ. 11.54; 3. హల్లుమీద చేర్చే అకార చిహ్నం. పాండు. 1.71; 4. పాగాచుట్టటం; 5. పాగ; 6. జఠ; 7. ప్రయోజకుడు ; 8. ఆకులతాడు, రాట్నం ఆకులకు చుట్టే తాడు; 9. బాసికం కట్టు, పడుగు దువ్వే కుంచెపిడికి బిగించివేసిన తాడు మెలిక; విణ. శ్రేష్ఠమైన, ముఖ్యమైన, ప్రధానమైన. హరి ఉ. 7.144; స.క్రి. కుండల తయారీలో ఆరుదల సమయంలో తొలికను ఒత్తుతూ గుండ్రంగా వచ్చేటట్లు చేయు. క. తలెకట్టు. తలపాగ, అకార చిహ్నం; త. తలైక్కట్టు. తలపాగ; మ. తలెక్కెట్టు. దీర్ఘచతురస్రాకారంగాఉన్న ఇంటి ముందుభాగం. **తలకట్టుగా** క్రి. విణ. ప్రదు. శిఖరప్రాయంగా. విప్ర. 1.45. **తలకట్టుచిట్టె** వి. తలచిట్టె, పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలకట్టుచిద్రం** వి. పంటె తలకట్టుకంటేందుకు, పంటె ఆకుకు పైభాగంలో చేసిన చిల్లి. సం. ఛిద్ర-. చిల్లి. <తలకట్టు + సం. ఛిద్ర-. **తలకట్టుతాడు** వి. చెవులతాడు, పంటెతల చిట్టెలకు పై వైపున ఆకుల్ని కలిపికట్టిన తాడు. **తలకడచు** స.క్రి., అ.క్రి. 1. అతిక్రమించు, కడచిపోవు. భార.విరా 5.2; 2. మీరు, ఉల్లంఘించు. ఉ.రా. 3.22; అ.క్రి. (సంతోషంచే) ఎగయు, పైకిలేచు. భాగ. 1.370. త. తలైక్కడత్తు. **తలకంటగించు** అ.క్రి. ఇష్టంలేకపోవు. **తలకమ్మి** వి. మేరువుపలక, మరమగ్గం చట్రంలో, నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె. **తలకర్ర** వి. తలగడకర్ర, పడుగుకోల తలవైపుదూర్చే పడుగేరే కర్ర. **తలకశిం** రూ. తలకసిం. వి. ఏటిలో ఊటకాల్వ ప్రారంభమైన చోటు. **తలకసిం** రూ.చూ. తలకశిం. వి. ఊటకాలవపుట్టేచోట ఉన్న గుంట. **తలకాచు** స.క్రి. రక్షించు. **తలకాఁడి** వి. 1. బరువు అధికమై రెండెద్దులకంటె హెచ్చుగా కట్టవలసినప్పుడు సంతన చేసి మొదటి కాడికి ముందుకట్టే మరొక కాడి, ప్రాసంగం; 2. నాగలికి కట్టిన దున్నపోతులలో ముందుజత. **తలకాయ** రూ. తలకాయి. వి. 1. శిరస్సు. వరాహ. 11.97; 2. గడ్డపలుగులోని మొద్దువైపు; 3. సిమెంటు గొట్టానికి మధ్యమధ్య బిగించే కట్టు; 4. మేకు మొ॥వాటి పైదిమ్మ. **తలకాయకూజా** వి. ఏదోఒక జంతువు తల ఆకారాన్ని తీర్చి చేసిన నీళ్ళకూజా. **తలకాయలుమార్చు** స.క్రి. మోసగించు. **తలకాయి** రూ.చూ. తలకాయ. వి. తూగుగుండు పైభాగం. **తలకాలువ** రూ.చూ. తలకాల్వ. వి. ప్రధానమయిన కాలువ. **తలకాల్వ** రూ. తలకాలువ. వి. పెద్దకాల్వ, ఏటినుంచి తీసిన మొదటి కాలవ. **తలకిందు** రూ.చూ. తలక్రిందు. వి. 1. తారుమారు; 2. అధోముఖమైన. **తలకీలుపుచ్చు** అ.క్రి. ప్రధానమైన కీలును తెరచు. పండి.చ. 5.484. **తలకు** రూ.చూ. తలా. అవ్య.ప్రదు. 1. ప్రత్యేకంగా. చంద్ర.భా. 3.19; 2. చెరి, ఒక్కొక్కరికి. **తలకుచెప్పులడుగు** స.క్రి. కొవ్వెక్కి మాటాడు.

**తలకుచ్చులు** వి.బ.వ. పసకుచ్చులు, మొగాన వేలాడేట్టు కొమ్ములకు కట్టిన కుచ్చులు. **తలకుంటే ఏనుగునుపొయ్యేవాడు** విణ. చాల పొగరుబోతు (అశ్లీల వ్యావహారిక ప్రయోగం). **తలకుదువపెట్టిఅయినా** అవ్య. ఏంచేసి అయినా, ఎన్నిఅవస్థలు పడి అయినా. **తలకుపోసుకొను** రూ.చూ. తలకుఁబోసికొను. స.క్రి. శిరస్నానంచేయు. **తలకుమాయు** అ.క్రి. క్షౌరం లేదా జుట్టు అసహ్యంగా పెరుగు, క్షౌరానికి డబ్బు లేకుండు. శ్రీనాథుని చాటువు. **తలకుమిగులు** స.క్రి. మించు. **తలకుమించు** అ.క్రి. తాహతుకు మించు. **తలకుమించినపని** వి. అసాధ్యమయిన పని. **తలకు మించినబరువు** వి. అతిభారం. **తలకుమించిపోవు** అ.క్రి. అసాధ్యమగు. **తలకుమీఱు** అ.క్రి. మించు, అతిశయించు. నృసింహ. 2.116. **తలకుఁబోసికొను (-పోసికొను)** రూ. చూ. తలకు పోసుకొను. అ.క్రి. అభ్యంగం చేయు, తలంటుకొను. **తలకురుబిళ్ళ** వి. తలచిట్టె, పంటె ఆకులకు బిగింపువేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలకూడు** అ.క్రి. 1. సిద్ధించు, నెరవేరు, ఫలించు. బసవ. 1.12, భార. అరణ్య. 7.316; 2. కలుగు, సంభవించు. ద్వి. హరిశ్చ. ఉ. 248 పం. త. తలైకూడ్డు. **తలకూరుచు** రూ.చూ. తలకూర్చు. స క్రి. 1. నెరవేర్చు, సిద్ధింపచేయు, ఫలింపచేయు; 2. సమకూర్చు, లభింపచేయు. **తలకూర్చు** రూ. తలకూరుచు. స.క్రి. 1. నెరవేర్చు, సిద్ధింపచేయు, ఫలింపచేయు. రం.రా. ఉ. 20 పు. 10 పం.; 2. సమకూర్చు, లభింపచేయు. నార.పంచ. 1.234. **తలకెక్కినవిషము** వి. శరీరమంతా వ్యాపించిన విషం. సారంగ. 1.22. <తల[1] + -కున్ + ఎక్కిన విషము. **తలకెక్కు** అ.క్రి. 1. ముమ్మరించు, అతిశయించు. వరాహ. 7.45; 2. నెత్తికెక్కు. వసు. 4.29; 3. మందులు మొదలైనవి తలకు ప్రసరించు. సారంగ. 3.63; 4. మనసుకు అంటు, నాటు; 5. బోధపడు. <తల[1] + -కున్ + ఎక్కు. **తలకెడవగు** రూ. తల్లకెడవగు. అ.క్రి. తలకిందులగు. ఉ.హరి. 1.53. **తలకెడవు** రూ. తలగెడవు, తల్లకెడవు. వి 1. తారుమారు, వ్యత్యస్తం. హరి. పూ. 5.172; 2. అవరోహణం. క. తలకెళగు; త. తలైకవిఴ్. **తలకెడవుపడు(-పడు)** అ. క్రి. తలకిందగు. హరి. పూ. 5.187; **తలకెత్తు** స. క్రి. తలమీదకెత్తు. < తల[1] + -కున్ + ఎత్తు. **తలకెత్తుకొను** స.క్రి. నెత్తిన వేసుకొను, భారంవహించు. తాళ్ల.సం. 6.186. **తలకొకమాటగా** అవ్య.ప్రదు. ఒకోవ్యక్తి ఒక్కొమాటగా. < తల + -కున్ + ఒకమాట + అగు + -అ7. **తలకొట్టినట్లగు** అ.క్రి. అవమానమగు. **తలకొట్టిబ్రతుకు** అ.క్రి. 1. దొంగతనంచేసి బ్రతుకు; 2. మోసంచేసి జీవించు. **తలకొట్టివేసినట్లగు** అ.క్రి. అవమానకరమగు. **తలకొట్టు** స.క్రి. 1. ధాన్యం మొదలైనవాటిని కొలిచేటప్పుడు, కొలతపాత్రపై అంచువరకు ధాన్యాన్ని సరిపెట్టు; 2. సంహరించు; 3. మోసంచేయు. **తలకొట్టుట** వి. 1. పరాభవం చేయటం; 2. నిర్జీవం చేయటం. **తలకొట్టుమారి** వి. 1. మోసగాడు; 2. పోకిరి. **తలకొట్లమారి** వి. 1. అవినీతుడు. రాధికా. 2.66; 2. కలహశీలుడు, జగడగొండి; 3. శిరచ్ఛేదనంపొందినవాడు. **తలకొట్లమారితనము** వి. దౌష్ట్యం.

శశా. 3.37. **తలకొత్తు** స.క్రి. అవమానించు. మార్క. 5.207. <తల+-కున్+ఒత్తు. **తలకొను** రూ.చూ. తక్కొను. అ.క్రి. **1.** అతిశయించు, మించు. భార.విరా. 2.45; **2.** కలుగు, పుట్టు. భార.ఉద్యో. 3.323; **3.** పూను, కడగు, యత్నించు. భార.ద్రోణ. 2.315; **4.** రేగు, రెచ్చు. రం.రా.కిష్కిం. 206 పు. 14 పం.; **5.** నెలవుకొను, ఉండు. హంస. 4.213; **6.** తలలో ఉండు, తలను చేరు. సారంగ. 2.83; స.క్రి. **1.** అంగీకరించు, ఇయ్యకొను. భార.భీష్మ. 2.271; **2.** తాల్చు, వహించు. భార.కర్ణ. 1.137; **3.** శిరసావహించు, ఆదరంతో కైకొను. మార్క. 7.253; **4.** అవలంబించు, అనుసరించు. హంస. 5.267. **తలకొనుదెంచు** అ.క్రి. కలుగు, సంభవించు. భార. ఆది. 3.191. **తలకొయ్య** వి. తల్లికొయ్య, మొదటికొయ్య. తలపేటకు ఉండే కొయ్య. **తలకొరివి** రూ.చూ. తలకొఅవి. వి. **1.** శవాన్ని తగులపెట్టేటప్పుడు తలదగ్గర అంటించే కొరవి; **2.** గూఢశత్రువు. **తలకొరివికుండ** రూ. తలగారుకుండ, తలగురవైకుండ, తలగురైకుండ, తలగొరివికుండ, తలగోరుకుండ. వి. శవదహనానికి ముందు నీళ్ళు నింపి చుట్టూ మూడు మార్లు తిరిగి తలదగ్గర పగలగొట్టే మట్టిపాత్ర. **తలకొఅవి** రూ. తలకొరివి. వి. **1.** శవాన్ని తగల బెట్టేటప్పుడు తలదగ్గర అంటించే కొరివి. ద్వి. హరిశ్చ. ఉ. 2058 పం.; **2.** గూఢశత్రువు. **తలకొఅవిడు** స.క్రి. శవానికి తలవైపు దహనానికై అగ్గిపెట్టు. ద్వి. హరిశ్చ. ఉ. 2058. <తలకొఅవి + ఇడు. **తలకొలకి** వి. కోల్తల, పడుగు మొదటగాని చివరగాని అనిపక్కన కర్రదూర్చే భాగం. **తలకొలుపు** రూ.చూ. తలకొల్పు. స.క్రి. **1.** పురికొల్పు, ప్రేరేపించు. భార. ద్రోణ. 5.42; **2.** కలిగించు, కావించు. ప్రభా. 1.56; **3.** సిద్ధింపచేయు. పరమ. 1.38; **4.** లగ్నంచేయు. తాళ్ల. సం. 5.227. **తలకొల్పు** రూ. తలకొలుపు. స.క్రి. **1.** సిద్ధింపచేయు. భార. విరా. 3.62; **2.** కలిగించు, కావించు. భార. మహా. 1.25; **3.** తలకెక్కించు, బోధించు. నార. పంచ. 3.290; **4.** పురికొల్పు, ప్రేరేపించు. కళా. 8.248. **తలకొవ్వు** రూ.చూ. తలక్రొవ్వు. అ.క్రి. మదించు; వి. తలలోనికొవ్వు. **తలకోల** రూ. తలగోల. వి. **1.** సాధువుకాని ఆవును పిదికేటప్పుడు కొనను తాడుకట్టి దానికొమ్ములకు తగిలించి పట్టుకొనేకర్ర. సిం. ద్వా. 2.155; **2.** పడుగులో మొదటగాని చివరగాని అనిపక్కన కర్రదూర్చే భాగం; **3.** పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కర్ర. **తలకోలు** వి. తలకొనటం, ప్రయత్నం. **తలక్రిందగు** అ.క్రి. **1.** అధోముఖమగు. భార. ఆది. 2.73; **2.** కిందుమీదగు. జైమిని భా. 2.78. **తలక్రిందు** రూ. తలకిందు, తల్లక్రిందు. వి. **1.** తారుమారు. భార. భీష్మ. 1.11; **2.** అధోముఖమైన. సానంద. 2.34. **తలక్రిందుగానడచు** అ.క్రి. సంప్రదాయ విరుద్ధంగా ప్రవర్తించు. పండి. చ. 1.362. **తలక్రిందుబ్రతుకు** వి. అస్తవ్యస్త జీవితం. **తలక్రొవ్వు** రూ. తలకొవ్వు. వి. తలపొగరు. వర. రా. యు. 125. 10. అ.క్రి. మదించు. **తలఖాళీఅగు** అ.క్రి. తెలివితేటలు శూన్యమగు. **తలగజ్జెలు** వి.బ.వ. పసగజ్జెలు, ఎద్దుకొమ్ములకు కట్టి నొసటిమీదికి పడేట్టు వేసిన చిరుమువ్వల పట్టెడ. **తలగట్టుకొయ్య** వి. మిడిగూటం, నేతబయలులో చివరపాతిన కొయ్య. **తలగడ** రూ. తలాట[2], తలాడ, తల్గడ. వి. **1.** తలకిందఎత్తుగా ఉంచుకొనే దిండు, ఉపధానం. భార. ఆది. 6.176; **2.** (పడుకొనేటప్పుడు) తలఉంచుకొనే దిక్కు, తలఉంచుకొనే ప్రదేశం. భాగ. 8.707. త. తలైక్కట్టై. తలగడ; మ. తలెక్కట్టై. **తలగడకర్ర** వి. తలకర్ర, పడుగుకోల తలవైపు దూర్చేపడుగేరే కర్ర. **తలగడిగించు(-కడిగించు)** స.క్రి. అభ్యంగ స్నానం చేయించు, తల అంటి నీళ్ళుపోయు. పాండు. 3.27. **తలగడుగు (-కడుగు)** వి. తలంటు, అభ్యంగనం. పాండు. 3.9. అ.క్రి. **1.** అభ్యంగంచేయు, తలఅంటి నీళ్ళు పోసికొను. సు.శ. 89; **2.** అంటిన తలకు నీళ్ళుపోయు. **తలగంప** వి. మేలురాసి నుంచి వినాయకుడి పేరుమీద తీసే గంపెడు గింజలు. **తలగర్రకుండ (-కర్రకుండ)** వి. శవదహనానికి ముందు నీళ్ళునింపి చుట్టూమూడు మార్లు తిరిగి తలదగ్గర పగలగొట్టే మట్టిపాత్ర. **తలగాచు (-కాచు)** స.క్రి. తలతెగిపోకుండా రక్షించు, ప్రాణాలు పోకుండా కాపాడు, కాపాడు. నీతి. 43. **తలగాము** వి. రాహువు, రాహుగ్రహం. ద్వి. భాగ. 8. **తలగారుకుండ** రూ.చూ. తలకొరివికుండ. వి. శవదహనానికి ముందు నీళ్ళునింపి చుట్టూ మూడు మార్లు తిరిగి తలదగ్గర పగులగొట్టే మట్టిపాత్ర. **తలగిరి** వి. సున్నపుబట్టీ పైభాగాన ఉన్న గుండ్రటి గోడ భాగం. **తలగీటు** వి. సారెపై కుండను పట్టేటప్పుడు పైనవేసిన గిర్ర. **తలగుంజ** వి. నిట్రాడు. **తలగుడ్డ** వి. తలకు చుట్టుకొనే వస్త్రం, పాగాగుడ్డ. ద్వి. సార. చ. 1.12పు. 6పం. **తలగుండు** వి. **1.** భయంకరుడు, ప్రాణాంతకుడు. పండి. చ. 1.511; **2.** శవదహనానికి ముందు నీళ్ళునింపి చుట్టూ మూడుమార్లు తిరిగి తలదగ్గర పగలగొట్టే మట్టికుండ. **తలగుండుగండ** రూ.చూ. తలగొండుగండ. వి. శత్రువు. తాళ్ల. సం. 11.3. **తలగుండుగండఁడు** రూ.చూ. తలగొండుగండ. వి. భయంకరమైన వాడు, ప్రాణాంతకుడు. **తలగుమ్మం** వి. సింహద్వారం, ఇంటిలోని మొట్టమొదటి ద్వారం. **తలగురవైకుండ** రూ.చూ. తలకొరివికుండ. వి. శవదహనానికి ముందు నీళ్ళు నింపి చుట్టూ మూడు సార్లు తలదగ్గర పగులగొట్టే మట్టికుండ. **తలగురైకుండ** రూ.చూ. తలకొరివికుండ. వి. శవదహనానికి ముందు నీళ్ళు నింపిచుట్టూమూడుమార్లు తిరిగి తలదగ్గరపగులగొట్టే మట్టిపాత్ర. **తలగూటం** వి. సరిచేసేటప్పుడు ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర. బిగింపుకోసం నేలలో పాతిన కొయ్య. **తలగూడు** అ.క్రి. నెత్తినపడు. గౌ. హరి. 2480.81. **తలగెడపు** రూ.చూ. తలకెడవు. వి. **1.** తారుమారు; **2.** అవరోహణం. **తలగొడుగు** వి. దేవునికుపయోగించే చక్రాకారపు గొడుగు. **తలగొండుగండ** రూ. తలగుండుగండ, తలగుండు గండఁడు, తలగొండుగండఁడు. విణ. తలకోసే శూరుడు. బసవ. 7.95 పం. క. తలెగొండు. తలతీయటం; త. తలెగొళు. తలతీయటం. **తలగొండుగండఁడు** రూ.చూ. తలగొండుగండ. విణ. తలకోసే శూరుడు. ప్రభులిం. 2.13.

పు. 15పం. **తలగొను(-కొను)** స.క్రి. తాల్చు. ధరించు సాంబో. 1.100. **తలగొమ్మ(-కొమ్మ)** రూ. తలగొమ్ము. వి. పొగచెట్టు ఆకులు పెరగటానికి తుంచిన తలపూత. **తలగొమ్ము.** రూ.చూ. తలగొమ్మ. వి. పొగచెట్టు ఆకులు పెరగటానికి తుంచిన తలపూత. **తలగొరిగించిపంపు** స.క్రి. అవమానించిపంపు. **తలగొరివికుండ** రూ. చూ. తలకొరివికుండ. వి. శవదహనానికిముందు నీళ్ళునింపి చుట్టూ మూడు మార్లు తిరిగి తలదగ్గర పగలగొట్టే మట్టిపాత్ర. **తలగోకికొను** స. క్రి. ఆలోచనలోపడు. **తలగోడ** వి. చుట్టుగోడలమీద ముక్కోణం ఆకారంలో కప్పు వరకు కట్టిన పక్కగోడ. **తలగోయు(-కోయు)** స క్రి. **1.** చంపు. భార. ద్రోణ. 4 101 ; **2.** తలనరికి వేయు. ద్వి. భాగ. మధు. 53. **తలగోరుకుండ** రూ.చూ. తలకొరివికుండ. వి. శవదహనానికి ముందు నీళ్ళ నింపి చుట్టూ మూడుమార్లు తిరిగి తలదగ్గర పగులగొట్టేమట్టిపాత్ర. **తలగోరుపట్టుట** వి. అపరకర్మ చేసేవాడు, శవంతో నిప్పుతీసుకొనిపోయి శవం రొమ్మికి నిప్పు ముట్టించి కర్మచేయటం. <తల+కొఱవి పట్టుట. **తలగోల** రూ.చూ. తలకోల. వి. **1.** పడుగులో మొదటగాని చివరగాని అనిపక్కన కఱ్ఱదూర్చే భాగం ; **2.** పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసి పోకుండా వేరు చేసే గుండ్రటి నున్నటి కఱ్ఱ. **తలచమురు** వి. **1.** తలకు రాసుకొనేనూనె ; **2.** ఎక్కువ నష్టం. **తలచాటు** వి. రక్షణ. **తలచాలు** రూ. తల్చాలు. వి. గట్టుదగ్గర దున్నిన చాలు. **తలచావిడి** వి. ఇంటిముందరి చావడి, ఇంటిముందరి వసారాభాగం. **తలచించు** స.క్రి. రద్దుచేయు. **తలచిట్టీ** రూ. చూ. తలచిట్టె. వి. ఆకులబిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. **తలచిట్టె** రూ. తలచిట్టి, తలసిట్ట, తల్చిట్టీ. వి. ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. **తలచిడత** రూ. తలచిరత. వి. తలచిట్టె, పంటెఆకుల బిగుంపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలచిరత** రూ.చూ. తలచిడత. వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలచిల్ల** రూ. తలసిల్ల. వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలచీదర** వి. తలనొప్పి. **తలచీర** వి. **1.** మేలు ముసుగు, అవకుంఠనం, ముసుగు. భార.విరా. 2.323 ; **2.** ఉష్ణీషం, తలపాగ, తలగుడ్డ. విజ్ఞా.ఆచా. **53** ; **3.** రాజకుమారులు తలపై ధరించే వస్త్రం. **తలచీరయెఱుగనిదశ** వి. మైమరచిన, స్పృహతప్పిన స్థితి. కాశీ. 1.139. **తలచీర వాటించు(-పాటించు)** స. క్రి. శిరస్త్రాణం పెట్టుకొను. భార. ద్రోణ. 5.325. **తలచీరవీడినవాఁడు** విణ. శిరస్త్రాణం లేని వాడు. భార.భీష్మ. 3.303. **తలచీల** వి. నిట్రాడును ఏతపు కదురును కలిసేటట్లు చేర్చి బిగించే చీల. **తలచుంచు** వి. ముందరిజుట్టు. సిం.ద్వా. 7.60. **తలచుట్ట** రూ.చూ. తలచుట్టు. వి. **1.** తలపాగ, ఉష్ణీషం. పాండు. 1.165 ; **2.** పాగచుట్టటం, పాగకట్టటం. **తలచుట్టు** రూ. తలచుట్ట. వి. **1.** తలపాగ, ఉష్ణీషం. భార విరా. 5.210 ; **2.** పాగచుట్టటం, పాగకట్టటం. **తలచూపనోడు** అ.క్రి. మొగం చూపలేకపోవు. కళా. 6.172. <తలచూపు + -అ[7] + ఓడు. **తలచూపు** రూ. తల నూపు. అ.క్రి. **1.** కనబడు. భార.విరా. 2.319 ; **2.** పుట్టు. కాశీ. 3.121 ; **3.** సిద్ధపడు. **తలచెడు** అ.క్రి. **1.** ధైర్యం కోల్పోవు, అధైర్యపడు. భాగ. 10 ఉ. 895 ; **2.** వైధవ్యమొందు. పెద్దన చాటువు ; **3.** పరుగెత్తటంచేత జుట్టు చెదిరిపోవు. **తలజీవాలు** వి.బ.వ. పేలు. **తలజుట్టు** వి. మొక్కజొన్న కండెపై పీచు ఏర్పడటానికి మూలమైన ఎన్ను. **తలఁజీల్చుకొను(-చీల్చుకొను)** అ.క్రి. చీకాకుపడు. **తలఁజుట్టుట(-చుట్టుట)** వి. తలకు చుట్టటం. శాల్ల. నం. 5.92. **తలఁజేయి యొనరించు(-చేయి + ఒనరించు)** స.క్రి. తలపైచేయి పెట్టి బాసచేయు. ద్వి.పరమ.వి. 5.420 పు. **తలంటిపిడత** వి. అడుగున గుబ్బిపెట్టి పాత్రమూతికి బిర్రుగా పడేటట్లు చేసిన మూతతో గూడిన పిడత. **తలంటు** రూ.చూ. తలయంటు. వి. తలమీద నూనెపెట్టి రాయటం, అభ్యంగం. ఆము. 4.187 ; అ.క్రి. **1.** అభ్యంగానికి తలమీద నూనె పెట్టి రాచు. ఇందు. 5.24 ; **2.** నెత్తిమీద కొట్టు. **తలంటుకొను** అ.క్రి. అభ్యంగన స్నానంచేయు. **తలంటుతాడు** వి. పనతాడు, అడుగువైపున కొమ్ములు రెండింటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు మొ॥ వాటితో పేని కట్టేతాడు. **తలంటురాయి** వి. మోటబావి లోపలివైపున్న నూదిమాకుల మీద అడ్డంగావేసిన బండ లేక చాపరాయి. **తలండ్లబండ** వి. మోటబావి లోపలివైపున్న నూదిమాకులమీద అడ్డంగా వేసిన బండ లేక చాపరాయి. **తలతగులు** అ.క్రి. అనుభవానికి వచ్చు. **తలతడవిచూచుకొను** అ.క్రి. కార్యభారంపోయిందని ఆనందించు. **తలతనఖాపెట్టిఅయినా** అవ్య. ఏదో విధంగా, ఎన్నికష్టాలుపడిఅయినా. **తలతంత్రము** వి. తొలిసేన, ఎలగోలు మూక. కు.నం. 11.5. (యుద్ధభూమిలో మొదట నవరణ చేయదగిన నాయకుల సముదాయం.) త. తందిరం. సేన. **తలతల**[1] అవ్య. **1.** ప్రతి అనేదాని అర్థాన్నిస్తుంది. హర. 2.21 ; **2.** ప్రత్యక్షంగా. వేంక.పంచ. 1.251. త. తలైదలై. **తలతాకట్టుపెట్టు** అ. క్రి. ఏఅవస్థ అయినా పడు. **తలతాడు** రూ.చూ. తలత్రాడు. వి. **1.** పనతాడు, అడుగు పైవైపున కొమ్ములు రెంటికి కలిపి నూలు, తోలు, వెంట్రుకలు మొ॥ వాటితో పేని కట్టే తాడు ; **2.** రాట్నం ఆకులకు చుట్టిన తాడు, ఆకులతాడు. **తలతిక్క** వి. పట్టినపట్టు వదలకపోవటం. **తలతిప్పు** రూ.చూ. తలత్రిప్పు. అ.క్రి. మైకంచేత లేదా పైత్యంచేత తలతిరుగు. వి. మైకంవల్ల లేదా పైత్యంవల్ల తలతిరగటం. **తలతిరుగు** అ.క్రి. **1.** తలతిరుగుతున్నట్టు తోచు ; **2.** గర్వం కలుగు. **తలతుట్టె** వి. జొన్నతెగులు, తల (ఎన్ను) ద్వారా ప్రవేశించి పురుగు దంటును డొల్లచేసే తెగులు. **తలతోకలేకుండు** అ.క్రి. పద్ధతి తప్పు. **తలత్రాడు** రూ. తలతాడు. వి. పశువుల కొమ్ములకు కట్టే తాడు, కుచ్చు. పాండు. 5.245. **తలత్రిప్పు** రూ. తలతిప్పు. వి. మైకంవల్ల లేదా పైత్యంవల్ల తలతిరగటం ; అ.క్రి. మైకంచేత లేదా పైత్యంచేత తలతిరుగు. **తలత్రిప్పుకొను** అ.క్రి. గణ్యుడుగా ఉండు, గౌరవపాత్రుడుగా ఉండు. **తలదండ** వి. సరిహద్దును రక్షించేది, మేరను కాపాడేది. భాస్క. రా. అయో. 265. **తలదన్ను(-తన్ను)** అ.క్రి. మించు, అతిశయించు. బిల్హ. 2.120. **తలదబ్బ** వి. పంటెఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలదాఁకు(-తాఁకు)**

అ.క్రి. అనుభవానికివచ్చు. **తలదాఁగు** అ.క్రి. అనుభవమగు. **తలదాఁచికొను** రూ. తలదాఁచుకొను. స.క్రి. రక్షణకల్పించుకొను. సింహ. శ. 11. **తలదాఁచుకొను** రూ.చూ. తలదాఁచికొను. అ.క్రి. **1.** శరణం పొందు ; **2.** రక్షణ కల్పించుకొను. **తలదాఁటు** స.క్రి. మించు. **తలదావు** రూ. తల్దావు. వి. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. అ.క్రి. తలపెట్టి నిద్రించు. **తలదిండు** వి. **1.** తలగడ ; **2.** చిన్న కట్టెల మోపు. **తలదిమ్ము** వి. శిరోమాంద్యం. **తలదుడ్డు** వి. తలగలదండం. వేంక.పంచ. 1.598. **తలదువారము** వి. **1.** తలవాకిలి, ఇల్లు మొదలైనవాటి మొదటి ద్వారం. అచ్చ.రా. అయోధ్య. 10. **తలదూర్చు(-తూర్చు)** అ.క్రి. ప్రవేశించు, చిక్కుకొను. **తలదూర్చుకొను(-తూర్చుకొను)** అ.క్రి. నివసించు, ఉండు. జాహ్నవీ 4.81. **తలదెగిపడియప్పదీర్చు** స.క్రి. తలఇచ్చి అయినాసరే అప్పుతీర్చు. గౌ.హరి. ద్వితీ. 659.60. తల + తెగిపడు + -ఇ[13] + అప్పు + తీర్చు. **తలద్రొక్కు(-త్రొక్కు)** స.క్రి. **1.** ఎక్కు, అధిరోహించు. హరి.ఉ. 1.84 ; **2.** అధఃకరించు, మించు. రామాభ్యు. 6.187. **తలధరించు** స.క్రి. శిరసావహించు, వినయంతో గ్రహించు. హర. 1.26. **తలనట్టు** రూ. తలనత్త, తల్నట్టు, తల్నత. వి. వరి, జొన్న, పొగాకు, మిరప మొ॥ పైర్లకు తగిలే తెగులు, వేరుపురుగు కొరకటంవల్ల మోవు లెండే తెగులు. **తలనడ్చుకొను(-అడ్చుకొను)** స.క్రి. తలమీదనేవేసి కొట్టుకొను. బసవ. 7.192. **తలనత్త** రూ.చూ. తలనట్టు. వి. వరి, జొన్న, పొగాకు, మిరప మొ॥ పైర్లకు తగిలే తెగులు. **తలనాదు** వి. ఈనిన నెలలోపల ఆవుకువచ్చే జబ్బు. **తలనిక్కు** వి. గర్వం. **తలనిడు(-ఇడు)** స.క్రి. శిరసావహించు, తలపై పెట్టుకొను, వినయంతో గ్రహించు. భార.భీష్మ. 1.160. **తలనిండఁగ నర్థముపోయు(-అర్థముపోయు)** అ.క్రి. నిలువెత్తు ధనంపోయు. ప్రభా. 1.93. **తలనెకట్టుకొను** స.క్రి. నెత్తిమీద పెట్టుకొను, వహించు. భార.శల్య. 2.72. **తలనెరసినవారు** విశ.బ.వ. పెద్దవారు, అనుభవశాలులు. **తలనేత** వి. బట్ట అడ్డుకొనలో బద్ద అవతల నేసినభాగం. **తలనొచ్చు** అ.క్రి. తలనొప్పి పెట్టు. **తలనొప్పి** వి. **1.** శిరోవేదనం, తలనొచ్చుటం. పల్నా. 66, శుక. 2.209 ; **2.** తలనొప్పివలె బాధపెట్టేది, బాధకం. శుక. 3.20 ; **3.** ఒక మొక్క (Eucabytus Citiriodora) **తలఁదడవి బాసచేయు (-తడవిబాసచేయు)** స.క్రి. నెత్తిమీద చేయిపెట్టి ప్రమాణం చేయు. సు.శ. 55. **తలఁదన్ను(-తన్ను)** స.క్రి. **1.** తలపైని తన్ను. కళా. 2.87 ; **2.** అధఃకరించు. కువ.చ. 3.67 ; **3.** మించు, మీరు. **తలఁదాల్చు(-తాల్చు)** స.క్రి. శిరసావహించు, వినయంతో గ్రహించు. **తలపట్టకపోరు** అ.క్రి. దిగులుపడక పోరాడు. భార. ద్రోణ. 5.37. **తలపట్టి** వి. వెన్నుగాడి, ఇంటినడి కొప్పును మోసేకర్ర. **తలపట్టిచూచుకొను** స.క్రి. తలతడిమి చూచుకొను, కష్టందాటిన తర్వాత బ్రతికామని చేతులతో తల నిమురుకొను. ప్రభా. 1.91. **తలపట్టు** వి. **1.** తలనొప్పి వచ్చినప్పుడు తలకువేసికొనే మంచిగంధం మొ. వాటిపట్టు. రం. రా. అయో. 91పు. 4పం ; **2.** సిగపట్టు పట్టుకోవటం, కలహం, పోట్లాట. గౌ. హరి. 1026. **తలపట్టె** వి. ఊఁడ్తెపైపున బిగించిన అడ్డపట్టె, మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు బిగించిన అడ్డపట్టె. **తలపట్లకుదిగు** అ.క్రి. దెబ్బలాటకు దిగు. **తలపట్లుసిగపట్లు** వి.బ.వ. కలహం, పోట్లాట. **తలపడు** అ.క్రి., స.క్రి. యుద్ధంలో తాకు, కవియు, ఢీకొను. కు. సం. 5.11, భార. ద్రోణ. 3. 116 ; అ.క్రి. **1.** సిద్ధపడు, తొడగు. జైమిని భా. 7.178 ; **2.** కదియు, చేరు, సమీపించు. ఆము. 4.130 ; **3.** ఏర్పడు. **తలపండు** వి. తల, శిరం. సిం. ద్వా. 2.89. అ.క్రి. జుట్టు తెల్లబడిపోవు. **తలపని** వి. క్షౌరం, క్షురకర్మ. మంగలిపని. **తలపనిచేయించుకొను** అ.క్రి. క్షౌరం చేయించుకొను. **తలపన్ను** వి. ప్రతివ్యక్తి దగ్గర వసూలు చేసేపన్ను. **తలపంపులుడుపు (-ఉడుపు)** స.క్రి. పైనున్న నరాల్ని సడల్చు. పండి. చ. 2.333. **తలపరిగి** రూ.చూ. తలిపిరి. వి. వాగుగాపారే చిన్నఊట నీరు. **తలపరిగె** రూ.చూ తలిపిరి. వి. ఊటకాలువకు ఆరంభస్థానం. **తలపరువు** వి. యోగ్యత, ప్రతిష్ఠ. **తలపరువునోరుచెప్పు** అ.క్రి. మనిషి మర్యాద అతడు చెప్పేమాటల్నిబట్టి తెలియు. **తలపలక** వి. కమాను (దూడిఏకేకొయ్య పనిముట్టు) కు ఒకవైపున ఉండే వెడల్పుకొయ్య పలక. **తలపల్ల** వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలపాగ** రూ. తలపాగా. వి. శిరోవేష్టనం, ఉష్ణీషం. శుక. 3.158. **తలపాగా** రూ.చూ. తలపాగ. వి. తలకుచుట్టుకోటానికి వేసినబట్ట. **తలపాటు** వి. **1.** యుద్ధసన్నాహం. నిర్వ. రా. 10.11 ; **2.** తలపడటం, తాకటం. భాస్క. రా. యు. 2086 ; **3.** ఎదిరించటం ; **4.** ప్రారంభం. **తలపాలు**[1] వి. తలపుర్రె. ఆం. నా. నం. మాన. 25, సుద. 1.116. **తలపాలు**[2] వి. స్త్రీలు పెట్టుకునే ఒకరకం (శిరోభూషణం) నగ. వరాహ. 9.88. త. తలైప్పాళై. **తలపిడప** వి. తల ఆరటానికి స్త్రీలు తలకు చుట్టుకొనేగుడ్డ. **తలపిడస** వి. ఒకానొకమొక్క. హంస. 4.14. **తలపిరికి** వి. ఒకరకం నరాల జబ్బు. **తలపీట** వి. పెద్దఅడ్డపీట. **తలపుచ్చె** వి. తలపుర్రె, కపాలం. గౌ. హరి. 1016 పం. **తలపుండ్లుకడుగు** అ. క్రి. బాధానివారణ చేయు. పాండు. 3.68. **తలపుండ్లుగడిగిరక్షించు (-కడిగిరక్షించు)** స.క్రి. అసహ్యపడక నీచోపచారాలు చేసి కాపాడు. ద్వి. హరిశ్చ. 1255పం. **తలపుల్ల** వి. రాటిపైపుల్ల. **తలపువ్వులువాడు** అ.క్రి. కొంచెం శ్రమపడు. భోజ. 6.105. **తలపువ్వువాడు** అ.క్రి. కొంచెం శ్రమపొందు (వ్యతిరేకార్థంతోనే ప్రయోగం). ఉ. హరి. 1.21. **తలపూత** వి. పొగచెట్టు ఆకులు పెరగటానికి తుంచిన తలపూత. **తలపెట్టు**[1] స.క్రి. **1.** కోరిక, వలపు, మోహం. భార. ఉద్యో. 1.176 ; **2.** విచారం, చింత. భార. స్త్రీ. 1.117 ; **3.** ఊహ, అభిప్రాయం. భార. అను. 5.162, ఉ. హరి. 4.93 ; **4.** చింతించు, తలపోయు, తలచు. సారంగ. 2.234. **తలపెట్టు**[2] స.క్రి. తాకించు, ఎదుర్కొనచేయు. భార. ఉద్యో. 4.207. **తలపెండి** వి. వాసాలకు పైనా కిందా బద్దలువేసి బిగించిన పెండె. **తలపెర** రూ.చూ. తలిపిరి. వి. వాగుగా పారే చిన్నఊటనీరు. **తలపేనుతలఁజొచ్చునట్లు (-చొచ్చునట్లు)** అవ్య. **1.** తలలోని పేను పక్కనున్న మరొక తల

లోనికి పోయేటట్లు. కుచే. 2.11 ; **2.** మిక్కిలి దట్టంగా. **తలపైనాలుగక్షింతలుపడు** అ.క్రి. తిట్లుతగులు. **తలపైనెక్కించుకొను (-ఎక్కించుకొను)** స.క్రి. అత్యాదరంచూపు, ఎక్కువ ఆదరం చూపు. విజయ. 1.49. **తలపైఁదలవచ్చినను (-తలనచ్చినను)** అవ్య. ద్రు. ఏమయినా, ఎంత గొప్పవాడైనా. నలచ. 6.30. **తలపొగరు** వి. మదం, గర్వం. **తలపొడుగుధనంపోయు** అ.క్రి. కనకాభిషేకం చేయు. సు.శ. 84. **తలపొలము** వి. **1.** చివరిభాగం. భార. ఉద్యో. 2.13 ; **2.** గ్రామం చివరభాగం, పొలిమేర వెంబడి ఉన్నపొలం. భోజ. 4.211 ; **3.** ఊర్ధ్వ ప్రదేశం. మను. 4.12. త. తలైప్పొలమ్. **తలపోటు** వి. శిరోవేదన. **తలపోఁత** వి. **1.** ఆలోచన. భార. విరా. 2.106 ; **2.** కోరిక, వలపు, మోహం. భార. ఉద్యో. 1.176 ; **3.** విచారం, చింత. భార. స్త్రీ. 1.117 ; **4.** ఊహ, అభిప్రాయం. భార. ఆను. 5.162, ఉ. హరి. 4.93. **తలపోయు** అ.క్రి. **1.** విచారించు, చింతించు. కు. సం. 9.114, భార.విరా. 2.79 ; **2.** యుక్తాయుక్త విచారణ చేయు, వివేచించు, మంతనం చేయు. భార. ద్రోణ. 2.302 ; **3.** సంకల్పించు, ఎంచు. మను. 6.19. స.క్రి. **1.** స్మరించు, జ్ఞప్తికి తెచ్చుకొను. భార. విరా. 2.292 ; **2.** విచారణ చేయు, పరిశీలించు. భార. ఉద్యో. 3.361 ; **3.** ఆలోచించు. భార.ద్రోణ. 1.225 ; **4.** కోరు, కాంక్షించు. వరాహ. 6.15; **5.** ఎంచు, భావించు, తలచు. ఆము. 3.68. **తలపోసికొను** స. క్రి. చెప్పుకొను. రామాభ్యు. 7.6. **తలప్రాణముతోఁకకువచ్చు** అ.క్రి. ప్రాణావశిష్టమగు, చావుకు సిద్ధమగు, మిక్కిలి కష్టమగు. సారంగ. 2.174. **తలబట్టకట్టు** అ.క్రి. **1.** బట్టతల అగు ; **2.** విసుగుపుట్టు. **తలబరువు** వి. కిందిభాగంకన్నా పైభాగం పెద్దది కావడమనే దోషం; **2.** శిరోభారం ; **3.** ఒకమనిషి మోయతగిన బరువు. **తలబల్ల** వి. **1.** అనుపేటలో మొదటిది ; **2.** పంటెబిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలబిగుతాడు** వి. తలకట్టు తాడు, పంటెతల చిట్టెలకు పైపైపున ఆకుల్ని కలిపి కట్టిన తాడు. **తలబిడ్డ** వి. తొలిబిడ్డ. **తలబిరుతాడు** వి. తలకట్టుతాడు, పంటెతల చిట్టెలకు పైపైపున ఆకుల్ని కలిపి కట్టినతాడు. **తలబిరుబద్ద** వి. తలచిట్టె, పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పై బద్ద. **తలబిరుసు** వి. తలపొగరు. **తలబిరుసువాఁడు** విణ. మూర్ఖుడైనవాడు, మొండివాడు. **తలబిళ్ల**[1] వి. తలగడ. **తలబిళ్ల**[2] వి. రాగిడి, చేమంతిపువ్వు, తలపైధరించే ఆభరణం. **తలబీకనకాయలగు** అ.క్రి. **1.** చెల్లాచెదరగు జైమిని భా. 7.102 ; **2.** కలతనొందు. **తలబుట్ట** వి. తలకు సరిపడే టోపీ రూపంలో అల్లిన బుట్ట. **తలబూరు** వి. సారిపెట్టెలో కలిపే వెంద్రుకలు. **తలబొప్పికట్టు** అ.క్రి. **1.** కష్టనష్టాలుపడు ; **2.** విసుగెత్తు. **తలబోదు** వి. రెండుగట్ల వెంబడి ఎద (వెద) బెట్టిన చాలు. **తలబోను** వి. ఒకరకమైన చేప (Muroeha-esox Serridentata). **తలమట్ట** వి. గట్టినార. **తలమనిషి** వి. నిగామనిషి, పెద్దరైతుదగ్గర జీతగాళ్ళచేత వ్యవసాయం చేయించేవాడు. **తలమాటు** వి. భావనాశం, రాబోయే చేటు. నిర్వ.రా. 9.66. **తలమాడు** వి. తలపెట్టి నిదురించే పడక వైపు. **తలమాద** వి. తలలో పెరిగే పుట్టకురుపు. (Cancer). **తలమానికము** విణ. శ్రేష్ఠమైన. రామాభ్యు. 5.189. వి. శిరోరత్నం, అలంకారంగా తలపై పెట్టుకొనే రత్నం. చెన్నబసవ. 1.117. **తలమానిసి** వి. ప్రధాన పురుషుడు, యజమాని. వాల్మీ. 2.122. **తలమాయు** అ.క్రి. క్షౌరం చేసుకోకపోవడంచేత తలపై జుట్టుపెరిగి అసహ్యంగా ఉండు. సు.శ. 56. **తలమాశిగ** వి. ఏనుగు కుంభస్థలానికి అలంకారంగా ఉంచే వస్త్రాచ్ఛాదన విశేషం. ప్రబంధ. 53, వాల్మీ. 3.30. **తలమావి పీడని** విణ. బొత్తిగా చిన్న (దయిన). పాండు. 1.145. **తలమాసినవాడు** విణ. అప్రయోజకుడైనవాడు. **తలమాసు** వి. తలను అంటుకొన్న మావి. కు.సం. 10.166. క. మాసు. జరాయువు. **తలమిగిలితాడిపొడవగు** అ.క్రి. మితిమీరు, తలమునకలగు. చంద్రరే. 248. **తలమిగులు** అ.క్రి. **1.** ముందుకుపోవు. భార.భీష్మ. 2.67 ; **2.** నష్టపడు ; స.క్రి. అతిక్రమించు. భార.శల్య. 1.376. **తలమించినపని** వి. శక్తికి మించిన పని. **తలమించు** అ.క్రి. అతిశయించు, మించు. కవిక. 3.160. **తలమిట్ట** వి. పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తలమిన్న** విణ. శ్రేష్ఠమైన. వసు. 2.42. వి. **1.** శిరోరత్నం ; **2.** శిరోమణి. **తలమీఁదకన్నులు** వి.బ.వ. నెత్తిమీది కళ్ళు (పొగరును సూచించే మాట). **తలమీఁదకువచ్చు** అ.క్రి. **1.** ప్రాణాపాయం సంభవించు ; **2.** తప్పించ రాకుండు. **తలమీఁదఁజెయిపెట్టు** అ.క్రి. **1.** మోసంచేయు ; **2.** నాశనం చేయు. **తలమీఁదదారివచ్చు** అ.క్రి. ప్రమాదం తలపైకి వచ్చు. ద్వి.పరమ. వి. 6.476. **తలమీఁదనిడుకొను (-ఇడుకొను)** స.క్రి. తలమీద పెట్టుకొను. పరమ. వి. 5.1783. **తలమీఁదనుంచు (-ఉంచు)** స.క్రి. శిరసావహించు. వర. రా.బాల. 83.15. **తలమీఁదఁలపడినను** అవ్య. ఏమయినా. **తలమీఁదవచ్చు** అ.క్రి. ప్రాణాపాయం సంభవించు. గౌ. హరి. పూ. 367 పం. **తలమీఁదివారు** వి.బ.వ. తనపై అధికారులు, తనకంటె ఎక్కువవారు. **తలమీఱిచను** అ.క్రి. హద్దుమీరి ప్రవర్తించు. పాండు. 4.282. **తలమీఱు** అ.క్రి. ముందరికి వచ్చు. భార.విరా. 5.31, స.క్రి., అ.క్రి. మించు, మీరు. రం.రా. ఉ. 56 పు. 16 పం. **తలముంచిపాఱు** అ.క్రి. అత్యుత్కటమగు, మిక్కిలి ఎక్కువగు. జాహ్నవీ. 1.76. **తలముడితెవులు** వి. మిరపచెట్లకు సోకు ఆకులు ముడుచుకు పోయే తెగులు. **తలముడులు** రూ.చూ. తలముళ్లు. వి.బ.వ. చోరసాధన విశేషం, ఇతరులకు జుట్టు దొరకకుండా దొంగలూ, క్రూరజంతువులకు తలదొరక్కుండా వేటగాళ్ళూ, ముళ్ళలోపల పెట్టుకొనే జుట్టుముళ్ళు. ద్వి.పరమ. వి. 6.485. పు. **తలమునకలు** వి.బ.వ. ఎక్కువ కష్టాలు. **తలమునిఁగి తాటిప్రమాణమగు** అ.క్రి. పూర్తిగా కష్టాల్లో పడిపోవు. **తలమునుక** రూ. తలమున్క. వి. **1.** తల ముంచేది (బాధకం అని భావం). కు.సం. 4.14 ; **2.** దుస్సహమైనది, దుర్భరమైనది, బాధకమైనది ; **3.** అతిశయించినది, అధికమైనది, మిక్కుటమైనది ; **4.** శిరఃస్నానం ; **5.** పూర్తిగా మునగటం. త. తలైముఴుక్కు. **తలమునుకలు** రూ. తలమున్కలు. వి.బ.వ. అపాయం,

గండం, ఆపద. నిర్వ.రా. 6.57 ; విణ. 1. దుస్సహమయిన. భార.భీష్మ. 3.219 ; 2. తలమునించే. భాగ. 10 పూ. 1000 ; 3. అతిశయించే. హంస. 2.32. తలమునుఁగు అ.క్రి. అతిశయించు, మిక్కుటమగు, దుర్భరమగు. భాస్క.రా.యు. 1397. తలమున్క రూ.చూ. తలమునుక. వి. శిరఃస్నానం. విణ. 1. దుస్సహమైన ; 2. తలముంచే స్వభావం కల ; 3. అతిశయించిన. తలమున్కలు రూ.చూ. తలమునుకలు. విణ. 1. దుస్సహమైన, దుర్భరమైన, బాధాకరమైన. భార.శల్య. 2.408 ; 2. తలముంచే స్వభావం కల. విజయ. 3.15 ; 3. అతిశయించిన, అధికమైన, మిక్కుటమైన. దశా. 7.1 ; వి.బ.వ. శిరఃస్నానాలు. తలముల్లు రూ.చూ. తలముళ్లు. వి.బ.వ. దొంగలు ఉపయోగించే ఒకరకం పనిముట్టు. తలముళ్లు రూ. తలముదులు, తలముల్లు. వి.బ.వ. చోరసాధన విశేషం. వేంక.పంచ. 3.199. ఇతరులకు జుట్టు దొరకకుండా దొంగలూ, క్రూరజంతువులకి తల దొరకకుండా వేటగాళ్ళూ ముళ్లు లోపల పెట్టుకొని వేసుకొనే జుట్టుముళ్లు. తలమూట వి. నరిచేసేటప్పుడు మట్టి పాత్రల కింద ఒత్తుగావాడే మెత్తని దిండు. తలమూటలుమోయు అ.క్రి. కూలికి బరువులు మోయు. తలమొల యెఱుఁగక(-ఎఱుఁగక) అవ్య. మొదలు చివర తెలియక. భాగ. 6.452. తలమొలవీడు అ.క్రి. భయం మొ. వాటిచే తలగుడ్డ కట్టుబట్ట విడిపోవు. ద్వి.పరమ. వి. 6.465. తలమొలెఱుఁగనిచ్చు స.క్రి. తలాతోక తెలియనిచ్చు. తాళ్ల. సం. 6.4. తలమోచు స.క్రి. శిరసావహించు, ఆదరంతో గ్రహించు. భార.ద్రోణ. 2.175. తలమోపులు విణ. బవ. ఎక్కువ మోపెడు. తాళ్ల.సం. 8.111. తలమోయు స.క్రి. శిరసావహించు. భాగ. 10.764. తలమోసల వి. మొగసాలయొక్క తల. వసు. 5.73. తలంబ్రాలకోక వి. పెళ్ళి సమయంలో పెళ్ళికూతురు కట్టుకొనే చీర. తలంబ్రాలగుడ్డలు వి.బ.వ. పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు కట్టుకొనే బట్టలు. తలంబ్రాలచీర రూ. తలవారచీర, తలవాలచీర, తలవాలుసీర. వి. పెళ్ళి సమయంలో పెళ్ళికూతురు కట్టుకొనే చీర. తలంబ్రాలపంచె రూ. తలవాలు పంచె. వి. పెళ్ళికొడుకు కట్టుకొనే ధోవతి. తలంబ్రాలు రూ. తలఁబ్రాలు, తలవాలు, తలువాలు. వి.బ.వ. పెళ్ళిలో వధూవరులు ఒకరిపై ఒకరు తలపై పోసుకొనే బియ్యం. హర. 4.95. తలఁబ్రాలు రూ.చూ. తలంబ్రాలు. వి.బ.వ. పెళ్ళి సమయంలో వధూవరులు దోసిళ్ళతో ఒకరి తలపై ఒకరు పోసుకొనే నానుడు బియ్యం. మను. 5.84. తలయగు(-అగు) అ.క్రి. కలియు. వేంక.పంచ. 4.779. తలయంటు(-అంటు) రూ. తలంటు, తలయంట్టు. అ.క్రి. 1. అభ్యంగానికి తలమీద నూనెపెట్టి రాచు. పి.శకు. 4.62 ; 2. నెత్తిపై కొట్టు; వి. తలంటేవాడు. తలయంట్టు రూ.చూ. తలయంటు. విణ. తలంటేవాడు. ద.హిం.శా. 1165. తలయంపి రూ. తలాపి, తలాపు, తలాఁపి, తల్లఁపి. వి. 1. తలగడ, ఉపధానం. భార.ఆది. 2.157 ; 2. (పడుకొనేటప్పుడు) తల ఉంచుకొనే దిక్కు. రం.రా బాల. 48 పు. 1 పం. తలయాడుకాండ్లు వి.బ.వ. తాకట్టు పెట్టినవారు. శా.శ.కో.పు. 121. తలయూఁచిమెచ్చు(-ఊఁచిమెచ్చు) స.క్రి. ఎక్కువగా మెచ్చుకొను. రాజగో. 1.7. తలయూఁచు స.క్రి. (ప్రశంస, సంతోషం, అంగీకారం మొ॥ వాటిని సూచించటానికై) తల కదలించు. భార.విరా. 2.356. తలయెత్తిమెలఁగు(-ఎత్తిమెలఁగు) అ.క్రి. గౌరవంతో బతుకు. భార. సౌప్తి. 1.49. తలయెత్తు (-ఎత్తు[1]) అ.క్రి. 1. తల పైకెత్తు, ఉన్నమిత శిరస్కమగు. భార.ద్రోణ. 4.275 ; 2. తెగు, సాహసించు. రం. రా. అయోధ్య. 104 పు. 11పం. ; 3. చెలరేగు, విజృంభించు. భాగ. 10పు. 1066 ; 4. పెరుగు, వర్ధిల్లు. తపతీ. 1.75 ; 5. కనబడు, పొడచూపు. తలయేరు[1] రూ. తలేరు[1]. వి. 1. శిరోవేదన, తలనొప్పి. భార. ఆది. 3.191 ; 2. పశురోగవిశేషం. నవనాథ. 1.41పు. 5పం. < తల[1] + ఏరు[2]. తలయేరు[2] రూ. తలేరు[2], తల్లేరు. వి. పొలందున్నడానికి ఏర్పరచిన నాగళ్లలో ముందు నడిచే నాగలి. < తల[1] + ఏరు[1]. తలయేర్చు అ.క్రి. తలనొప్పిపెట్టు. పాండు. 5.231. తలయేఱు (-ఏఱు) వి. మందాకినీనది. రామాభ్యు. 5.312. తలరాత వి. దురదృష్టం, విధి. తలరాయి వి. గోడకట్టేటప్పుడే మునుముందు పెంచుకోడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లుపేర్చినరాయి. తలరాయిఅగు అ.క్రి. బాధాకరమగు. తాళ్ల. సం. 11.3.72. తలరాయిసేసుకొను (-చేసుకొను) రూ.చూ. తలఱాయి చేసికొను. అ.క్రి. నిర్వికారంగా ఉండు. తాళ్ల. సం. 41.222. తలరాసి వి. ప్రధాన పురుషుడు, యజమాని. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1020. క్రీ.శ. 1168. తలరుమాలు రూ. తల్రుమాలు. వి. తలకు చుట్టుకోటానికి నేసిన వస్త్రవిశేషం. తలఱాయిచేసికొను రూ. తలరాయి సేసుకొను. అ.క్రి. నిర్వికారంగా ఉండు. హరి. 4.122. తలలచీరలు వి.బ.వ. తలపాగాలు, ఉష్ణీషాలు. భార. విరా. 5.215. తలలుగట్టికొను (-కట్టికొను) అ.క్రి. విచారించు. హరి. పూ. 8.219. తలలుపట్టు స.క్రి. తార్చు. తలలుమాయు అ.క్రి. క్షౌరం చేసుకోక పోవటంవల్ల తల మీద వెంట్రుకలు పెరిగి అసహ్యంగా ఉండు. పాండు. 5.171. తలలుమార్చు స.క్రి. మోసగించు. తలలుముదురు అ.క్రి. మదించు. పాండు. 3.133. తలలుసూపు (-చూపు) అ.క్రి. పుట్టు. వరాహ. 7.61. తలలూఁచు స.క్రి. (ప్రశంస సంతోషం, అంగీకారం మొ. వాటిని సూచించటానికి తల కదిలించు. వరాహ. 10.4. < తల[1] + -లు + ఊఁచు. తలలూడఁబాఱు అ.క్రి. చెల్లాచెదరై పారు. భాస్క. రా. యుద్ధ. 966. < తల[1] + -లు + ఊడు + -అ[7] + పాఱు. తలలెత్తు అ.క్రి. 1. చెలరేగు, విజృంభించు. భార. స్త్రీ. 1.159 ; 2. తెగు, సాహసించు. రం. రా. ఉ. 138పు. 8పం. ; 3. పొడసూపు, కనపడు. విక్ర. 4.224 ; 4. పెరుగు, వర్ధిల్లు. వేంక. పంచ. 4.465 ; 5. ఉన్నమిత శిరస్కమగు. < తల[1] + -లు + ఎత్తు. తలలేయు స.క్రి. తల నరికి వేయు. భార. మౌసల. 185. < తల[1] + -లు + ఏయు[1]. తలలోనాలుక వి. మంచినలహాలిచ్చే వ్యక్తి. తలవంచు అ.క్రి. 1. తలవాల్చు. విప్ర. 4.27, పల్నా. 70పు. ; 2. అవమానపడు. విష్ణుపు. పీఠి. 46. తలవంచుకొను అ.క్రి. 1. తలవాల్చుకొను ; 2. అవమానపడు. తలవంపు

**వి. 1**. అవమానం. భార. ద్రోణ. 4.258 ; **2**. తలవంచటం. చంద్ర భా. 1.31 ; విణ. దుఃఖకరమైన, అవమానకరమైన. లక్ష్మీ వి. 4.41. **తలపంపులుతెచ్చు** అ.క్రి. అవమానం తెచ్చు. హంస. 1.124. **తలవాకిటనుమెలంగెడుపొలఁతుక** వి. సరస్వతి. వ్య. నోటిలో వర్తించే స్త్రీ. ఆం. నా. సం. దేవ. 11. **తలవాకిటికితెచ్చు** స.క్రి. ప్రకటనచేయు. తాళ్ల. సం. 4.133. **తలవాకిటియిల్లు (-ఇల్లు)** వి. పొరుగిల్లు. కేయూ. 2.67. **తలవాకిలి** రూ. తలాకిలి, తల్వాకిలి. వి. ఔప. 1. ఇల్లు మొ. వాటి మొదటి ద్వారం, ముఖద్వారం. భార. అను. 4.358 ; **2**. నోరు. వసు. 1.36 ; **3**. గృహబహిఃప్రదేశం. **తలవాచేట్టుతిట్టు** స.క్రి. విపరీతంగా తిట్టు. **తలవాపి** చూ. తలయంపి. వి. పడకలో తలపెట్టుకొనే వైపు. **తలవారచీర** రూ.చూ. తలంబ్రాల చీర. వి. పెళ్ళిసమయంలో పెళ్ళికూతురు కట్టుకొనే చీర. **తలవాలచీర** రూ. చూ. తలంబ్రాలచీర. వి. తలంబ్రాలు చీర, పెళ్ళిసమయంలో పెళ్ళికూతురు కట్టుకొనే చీర. **తలవాలసెల్లా** వి. పెళ్ళికొడుకు పైనకప్పుకోటానికి నేసిన కండువా. **తలవాలు** రూ.చూ. తలంబ్రాలు. వి.బ.వ. తలంబ్రాలు పోసే జొన్న గింజలు. **తలవాలుపచ్చడం** వి. ఇరవైనాలుగు మూరల పొడుగు నాలుగుమూరల వెడల్పు చొప్పున రెండు పొరలుగా నేసిన ఒకరకం పచ్చడం. **తలవాలుపంచె** రూ. చూ. తలంబ్రాలుపంచె. వి. పెళ్ళికొడుకు కట్టుకొనే ధోవతి. **తలవాలురైక** వి. పచ్చరంగులోనేసిన రవికెగుడ్డ. **తలవాలుసీర (-చీర)** రూ.చూ. తలంబ్రాలచీర. వి. తలంబ్రాలు చీర, పెళ్ళిసమయంలో పెళ్ళికూతురు కట్టుకొనే చీర. **తలవిడి** వి. తాటిచెట్టు మొ. వాటి తలతుండు. **తలవిఱుచు** స.క్రి. చంపు. ఉ. హరి. 2.64. **తలవిఱుపు** వి. రచనాదోషాల్లో ఒకటి, పద్యానికి గాని అర్థానికిగాని ఇంకొకరు చెప్పిన దానికి కొంచెం మార్పు చేసి చెప్పటం. పండి.చ. 1.6 పు. **తలవిల్లు** వి. ఔప. వింటిముందటి భాగం. సాంబో. 1.93. **తలవిసురు** వి. **1**. పొగరు ; **2**. తలకు సంబంధించిన వ్యాధి. **తలవీడు** వి. తలవాకిలి, ముఖద్వారం. కు. సం. 8.141. **తలవుచ్చు (-పుచ్చు)** అ.క్రి. ఆలోచించు. కు.సం. 12.104. **తలవెంద్రుకలెగఁగట్టు** అ.క్రి. వయసు వచ్చు. శృం. నై. 1.64. **తలవెంద్రుకవాసి** వి. చాలాకొద్ది తేడా. **తలవెట్టి** వి. ఎక్కువపిచ్చి, అధికోన్మాదం. శుక. 1. 76, పాండు. 4.98. **తలవ్రాఁత** వి. **1**. నొసటిరాత, లలాటలిఖితరేఖ. శుక. 2.506 ; **2**. అదృష్టం. **తలశబ్దమిచ్చు** స.క్రి. చప్పట్లుకొట్టు, గొంతిచ్చు. హరి. పూ. 8.46. సం. శబ్ద-. ధ్వని. < తల[1] + సం. శబ్ద- + ఇచ్చు. **తలసాల** వి. తలవాకిలి, గృహముఖద్వారం. వేంక. పంచ. 3.51. **తలసిట్ట** రూ.చూ. తలచిట్టె. వి. ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో పైది. **తలసిల్ల (-చిల్ల)** రూ.చూ. తలచిల్ల. వి. పంటఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పై బద్ద. **తలసుడి** వి. మొక్కజొన్న కండెపైపీచు ఏర్పడటానికి మూలమైన ఎన్ను. **తలసూపు (-చూపు)** రూ.చూ. తలచూపు, అ.క్రి. **1**. తలపడు. ఎదురగు. భార. విరా. 4.195 ; **2**. పొడచూపు, కనపడు. హరి. పూ. 7.186 ; **3**. సిద్ధపడు. కకుత్థ్స. 2.121 ; **4**. పుట్టు, ఉద్భవించు. **తలహెూరా** వి. తలంటి, అభ్యంగనం. **తలా** రూ. తలకు. అవ్య. **1**. చెరి, ఒక్కొక్కనికి, తలకు. ప్రభా. 5.89 ; **2**. ప్రత్యేకంగా. **తలాకిలి** రూ.చూ. తలవాకిలి. వి. వీధిగుమ్మం, సింహద్వారంకు ముందుప్రదేశం. **తలాట[1]** రూ.చూ. తలాటము. వి. **1**. గుర్రానికి తలకుపెట్టే ఆభరణం ; **2**. మురుగులు మొ. వాటినగిషీ చెక్కిన భాగం. **తలాట[2]** రూ.చూ. తలగడ. వి. తలగడ. **తలాటము** రూ. తలాట[1]. వి. **1**. గుర్రానికి తలకు పెట్టే భూషణం, తురాయి. వరాహ. 4.145 ; **2**. (ముదుగులు మొ. వాటియొక్క) నగిషీ చేసినముఖభాగం. సమీర. 3.217. **తలాడ** రూ.చూ. తలగడ. వి. తలకిందఎత్తుగా ఉంచుకొనే దిండు. హర. 4.12. **తలాడబటువు** వి. తలగడ బిల్ల. కువ. చ. 3.207. **తలాది** వి. పునాది. **తలాపి** రూ.చూ. తలయంపి. వి. **1**. పడకలో తలపెట్టుకొనేవైపు ; **2**. తలగడ. **తలాపు** రూ. చూ. తలయంపి. వి. పడకలో తలపెట్టుకొనే వైపు. **తలాఁపి** రూ.చూ. తలయంపి. వి. తలగడ, ఉపధానం. ఉ. హరి. 5.205. **తలారి[2]** వి. కామ (కట్టె) లేనిగొడుగు. **తలారిగాడి** రూ.చూ. తల్లేరుకాడి. వి. ఒక జత ఎద్దులబండివి లాగలేనపుడు రెండోజత ఎద్దులతో కట్టే కాడి. **తలారు** వి. కమాను (=దూదిని ఏకే కొయ్యపనిముట్టు) కు ఒకవైపున ఉండే వెడల్పుకొయ్యపలక. **తలారుగాడి** రూ.చూ. తల్లేరుకాడి. వి. ఒక జత ఎద్దులు బండిని లాగలేనప్పుడు రెండో జత ఎద్దులతో కట్టే కాడి. **తలువాలు** వి.బ.వ. పెళ్ళిలో వధూవరులు ఒకరిపై ఒకరు తలపై పోసుకొనే బియ్యం. **తలెత్తు** అ.క్రి. ప్రయోజకుడగు, సగర్వంగా ప్రవర్తించు. < తల[1] + ఎత్తు[1]. **తలెన్ను** వి. మొక్కజొన్న కండె పైపీచు ఏర్పడటానికి మూలమైన ఎన్ను. < తల[1] + ఎన్ను. **తలేటికాణి** వి. మెట్టదుక్కిలో ఒక కాడికి ముందువైపు కట్టిన మరొక కాడి. **తలేటిగుంటక** వి. పెద్ద గుంటక, వేరుసెనగకాయలు పైకి పెళ్ళగించటానికి తోలే పెద్ద గుంటక. **తలేటినాగలి** వి. ఒకటికంటె ఎక్కువ కాడులు కట్టి దున్నే పెద్ద మెట్టనాగలి. **తలేటిమడక** వి. ఒకటికంటె ఎక్కువ కాండ్లు కట్టి దున్నే పెద్ద మెట్టనాగలి. **తలేటిమోకు** వి. నాగలినుంచి తలేటికాడికి కట్టే మోకు. **తలేత** వి. మొట్టమొదటిసారి. **తలేరు[1]** రూ.చూ. తలయేరు[1]. వి. తలనొప్పి. ఆం.భా. 2.128. < తల[1] + ఏరు[2]. **తలేరు[2]** రూ.చూ. తలయేరు[2]. స.క్రి. ఎక్కువ బరువును లాగించటానికి ఒక కాడి ఎద్దులకు ముందు ఇంకొక కాడి ఎద్దుల్ని కట్టి పూన్చింది. < తల[1] + ఏరు[1]. **తలేరుగాణి** రూ.చూ. తల్లేరుకాడి. వి. ఒక జత ఎద్దులు బండిని లాగలేనప్పుడు రెండోజత ఎద్దులతో కట్టే కాడి. **తలేరుమడక** వి. ఒకటికంటె ఎక్కువ కాడులు కట్టి దున్నే పెద్ద మెట్టనాగలి. **తల్గడ** రూ.చూ. తలగడ. వి. **1**. (పడుకొనేటప్పుడు) తల ఉంచుకొనే దిక్కు, తల ఉంచుకొనే ప్రదేశం ; **2**. తలకింద ఎత్తుగా ఉంచుకొనే దిండు. ఉపధానం. **తల్చిట్టి** రూ.చూ. తలచిట్టె. వి. ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైది. **తల్దాపు** రూ.చూ. తలదాపు. వి. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పైబద్ద. **తల్నట్టు** రూ.చూ. తలనట్టు. వి. వరి, జొన్న, పొగాకు, మిరప మొ॥ పైర్లకు తగిలే తెగులు.

**తల్నత్త** రూ.చూ. తలనట్టు. వి. వరి, జొన్న, పొగాకు, మిరప మొ॥ పైర్లకు తగిలే తెగులు. **తల్మలాయించు** అ.క్రి. తనలోతాను మధనపడు. **త్రలాయి** వి. ఇంటి కప్పుకు వాడబడే రాయి. <తల[1] + రాయి. **త్రలుమాలు** రూ.చూ. తలరుమాలు. వి. తలకు చుట్టుకోటానికి వేసిన బట్ట. <తల[1] + రుమాలు. **తల్లకెడవు** రూ.చూ. తలకెడవు. విణ. వ్యత్యస్తమైన, తారుమారైన. వరాహ. 5.38. **తల్లక్రిందు** రూ.చూ తలక్రిందు. విణ. **1**. అధోముఖమైన. సానంద. 2.34పు ; **2**. తారుమారైన, తబ్బిబ్బుపడిన. **తల్లగెడవగు** రూ.చూ. తలకెడవగు. అ.క్రి. తలకిందగు. పద్మ. 10.96. **తల్లగెడవు** రూ.చూ. తలకెడవు. వి. తారుమారు, వ్యత్యస్తం. పద్మ. 10.96. <తల[1] + కెడవు. **తల్లేరు** రూ.చూ. తలయేరు[2]. వి. ఎక్కువ బరువును లాగించటానికి ఒక కాడి ఎద్దులకు ముందు ఇంకొక కాడి ఎద్దులను కట్టి పూన్చినది. **తల్లేరుకాడి** రూ. తలారిగాడి, తలారుగాడి, తలేరుగాణి. వి. ఒక జత ఎద్దులు బండిని లాగలేనప్పుడు రెండోజత ఎద్దులతో కట్టే కాడి. **తల్వాకిలి** రూ.చూ. తలవాకిలి. వి. **1**. ఇల్లు మొ. వాటి మొదటి ద్వారం, ముఖద్వారం. రం.రా.ఉ. 57 పు. 16 పం. ; **2**. తలకు వాకిలి వంటిది, నోరు ; **3**. గృహబహిః ప్రదేశం. <తల[1] + వాకిలి. **తల్చాలు** రూ.చూ. తలచాలు. వి. గట్టుదగ్గర దున్నిన చాలు. <తల[1] + చాలు.

**తల**[2] రూ. తలం. వి. **1**. చోటు, ప్రదేశం నిర్వ.రా. 6.147 ; **2**. ఎడ, పట్టు. విజ్ఞా.ప్రా. 131.

సం. స్థల-. చోటు, ప్రదేశం; ప్రా. శౌ. అ.మా. ప్రా. థల-.

క.తు. తల, తళ ; త. తలమ్- ; బ్రా. తల్. పల్లపునేల.

<ప్రా. థల-.

**తల**[3] వి. ఒకరకం జలాశయం. హంస. 4.210.

క. తల. గుంట.

**తలకప్ప** వి. జలజంతు విశేషం, జలగోధిక, నీటిఉడుం, ఎర్రచిలగ పురుగు. హంస. 4.186.

**-తల**[4] ప్రత్య. 1. కొన్ని ధాతువులపై భావార్థంలో వచ్చే ప్రత్యయం; 2. కొన్ని విశేషణాలమీద వచ్చే తద్ధిత ప్రత్యయం.

**తలం** రూ.చూ. తల[2]. వి. **1**. ఆవరణ, తావు, ప్రదేశం ; **2**. నేలపై ఆనే పాత్రల అడుగుభాగం.

**తలకి** రూ.చూ. తెలకి. వి. మందులకు ఉపయోగపడే మొక్క (Clerodendron Phlomoides).

**తలగబెట్టు** చూ. తలగు.

**తలగమరి** రూ.చూ. తలిగెమారి. వి. మెట్టనేలల్లో పెరిగే చిన్న కలుపుమొక్క.

**తలగు** రూ.చూ. తలుగు. వి. పశువుల్ని కట్టే తాడు, పలుపు.

**తలగబెట్టు** స.క్రి. తగులుకొనేటట్లు చేయు.

**తలఁకాడు** చూ. తలఁకు[1].

**తలఁకించు** చూ. తలఁకు[1].

**తలఁకు**[1] అ.క్రి. **1**. భయపడు, వెరచు. భార.ఆది. 8.8 ; **2**. కలగు, క్షోభపడు. కు.సం. 12.172 : **3**. చలించు. భార. విరా. 2.23 ; **4**. జంకు, వెనుదీయు, సంకోచపడు. భార. ఉద్యో. 4.26 ; **5**. దుఃఖపడు, చింతించు. మార్క. 1.54; **6**. విరియు, విడిపోవు. బహుళా. 2.10 ; **7**. బాధపొందు, శ్రమపడు. శుక. 2.173 ; వి. **1**. చలనం, చాంచల్యం. కు.సం. 6.70 ; **2**. భయం, వెరపు. భార.విరా. 2.106 ; **3**. దుఃఖం, చింత. కాశీ. 5.66; **4**. సంశయం, సందేహం. కాశ. 4.134.

క. తళ్ళఱ, తళ్ళణ, తళ్ళంక. భయం ; తళర్. వణకు ; మాల్తొ. తల్క్రొ. బలహీనమైన, మృదువైన. సున్నితమైన.

మూ.ద.ద్రా. *తళ్- ; *అళ్.

మూ.ద్రా. *చళ్-/*తళ్- ; *చళ్-.

**తలఁకాడు** అ.క్రి. చలించు, కదలు, తొనుకు. కు.సం. 9.35. <తలఁకు[1] + ఆడు. **తలఁకించు** స.క్రి. **1**. చలింపచేయు. కు.సం, 9.147, భార.భీష్మ. 3.450 ; **2**. తిరస్కరించు. హరిశ్చ. 2.4. <తలఁకు + -ఇంచు[3]. **తలఁకుఁబాటు (-పాటు)** వి. కలత. భాగ. 8.53. **తలఁకొత్తు** అ.క్రి. తలకు పొందు, సందేహించు. మార్క. 5.207. <తలఁకు[1] + ఒత్తు.

**తలఁకు**[2] రూ.చూ. తొలఁకు[1]. అ.క్రి. తొనకు, పైకి ప్రసరించు. కు.సం. 5.30.

**తలఁకొత్తు** చూ. తలఁకు[1].

**తలఁగఁబడు** చూ. తలఁగు.

**తలఁగఁబెట్టు** చూ. తలఁగు.

**తలఁగించు** చూ. తలఁగు.

**తలఁగు** రూ.చూ. తలుఁగు. అ.క్రి. **1**. నశించు, పోవు. భార. ఆరణ్య. 2.64 ; **2**. తొలగు. నిర్వ.రా. 8.34 ; **3**. అంతర్ధానమగు, మాయమగు. కృ.శకు. 2.49 ; స.క్రి. **1**. తొలగించు, పోగొట్టు. శృం.నై. 3.54 ; **2**. విడుచు. కాశీ. 5.198.

**తలఁగఁబడు** అ.క్రి. **1**. వెనుదీయు, నివృత్తమగు ; **2**. తొలగించు. కళా. 8.50. <తలఁగు + -అ[7] + -పడు. **తలఁగఁబెట్టు (-పెట్టు)** స.క్రి. తొలగునట్లు చేయు. దశా. 1.205. **తలఁగించు** స.క్రి. **1**. పోచేయు, నశింపచేయు. పద్మ. 394 ; **2**. తప్పించు. చంద్రాంగ. 2.53. <తలఁగు + -ఇంచు[3]. **తలఁగుడు** వి. తొలగటం, అపసరణం. ఆం.భా. 2.224.

**తలజా** వి. ఆనందం.

ఉ.పార.అర. తలజ్జు. ఆనందం, పరిహాసం.

**తలఁచినతలఁపులు తలకూడు** చూ. తలఁచు.

**తలఁచు** రూ.చూ. తళ్చు. అ.క్రి. **1**. వివేచించు, యుక్తాయుక్త విచారణచేయు. భార.ఆది. 1.84 ; **2**. ధ్యానించు. భార. ఆది. 5.92 ; **3**. స్మరించు, జ్ఞప్తికి తెచ్చుకొను. భార. ఆరణ్య. 2.108 : **4**. ఉద్దేశించు, సంకల్పించు, వాంఛించు. కు.సం. 5.45 ; **5**. ఎంచు, అనుకొను. నిర్వ.రా. 3.116 ; **6**. విచారించు, యోచించు. భార.ఉద్యో. 1.11 ; **7**. పాటించు, గణించు, లెక్కచేయు. హర. 3.44 ; **8**.

స్తుతించు, కొనియాడు. విక్ర. 1.11 ; 9. చేయు. ఆము. 5.49 ; 10. ప్రసంగించు, ప్రస్తావించు. పారి. 1.84.

**తల(చిన త(లపులు తలకూడు** అ.క్రి. కోరిన కోరికలన్నీ ఈడేరు. పండి.చ. 1.387. **తల(పని తల(పు** వి. అకస్మాత్తుగా కలిగిన ఆలోచన. పాండు. 4.257. **తల(పించు** స.క్రి. 1. తలపచేయు, స్మరింపచేయు, జ్ఞప్తికి తెచ్చుకొనేటట్లు చేయు. భార.ఆది. 4.71 ; 2. తెలియబరచు, వ్యక్తంచేయు. < తల(చు + -ఇంచు[3]. భీమ. 5.98.

**తలడించు** రూ.చూ. తల్లడించు. అ.క్రి. 1. లొంగు. భాగ. 10.1560 ; 2. కంపించు ; 3. జంకు ; 4. క్షోభపడు ; 5. దుఃఖించు.

**తలడిలు** రూ.చూ. తల్లడిల్లు. అ.క్రి. 1. బాధపడు ; 2. కంపించు ; 3. దుఃఖించు ; 4. జడియు.

**తలడిల్లు** రూ.చూ. తల్లడిల్లు. అ.క్రి. 1. బాధపడు. భాగ. 10.962 ; 2 కంపించు ; 3. దుఃఖించు ; 4. జడియు.

**తలతల**[2] రూ. తళతళ, తళత్తళ. వి. 1. మెరవటంలో అయ్యే అనుకరణం. కు.సం. 3.26 ; 2. కొంచెం మెరవటంలో అయ్యే అనుకరణం. నిరంకు. 1.15.

క. తళతళ. కాంతి, తళుకు, మెరుపు, సూర్యోదయం, తళతళనె. తళుకుతళుకుమని మెరయునట్లుగా, తళుక్కు మనునట్లుగా ; తళతళిసు. ప్రకాశించు, మెరపు, తళుకు ; తళకు, తళుక్కు. మెరపు, ప్రకాశం, తళుకు ; తళక్కనె. తళుక్కుమనేటట్లుగా, కాంతివంతంగా ; తళప, తళపు, తళుపు. ప్రకాశం, తళుకు, మెరపు ; తు. తళతళ. ప్రకాశం, తళుకు ; త. తళతళ. ప్రకాశించు (శరీరంలా), పుష్టిగా ఉండు, పారదర్శకంగా ఉండు ; తళతళప్పు. కాంతి. తళ-తళెనల్. ప్రకాశించిన ; తళుక్కు (-తళుక్క్). మెరయు, ప్రకాశించు ; కో. తఙ్ తఙ్ ఇన్ (-ఇవ్). (ఉపరితలం, పశువుల కప్పు) తళతళ ; తఙ్ తఙ్ క్ ఇన్ (-ఇద్). (ఉపరితలం) మృదువుగా స్పృశించు.

**తలతలమను**[1] అ.క్రి. వేగంగా పోవు. కు.సం. 2.55. ధ్వన్యను. **తలతలమను**[2] అ.క్రి. తళతళమను, మెరయు. సారంగ. 2.223. **తలతలవెలు(గు** అ.క్రి. తళతళ మెరయు. కు.సం. 3.63.

**తలదిడ** వి. వృక్షవిశేషం. హంస. 4.10.

**తలపిడుచ** వి. ఓషధీవిశేషం. హంస. 4.10.

**తలపెర** రూ.చూ. తలిపిరి. వి. 1. వాగుగా పారే చిన్న ఊట నీరు ; 2. ఊట కాలవకు నీళ్ళు ఊరేచోట ఉన్న గొయ్యి.

**తలపోటకము** వి. తంగేడు (Cassia).

**తలబు** వి. 1. జీతం, వేతనం. విశ్వే.శ. 61 ; 2. విజ్ఞాపనం.

హిం. తలబ్. జీతం, వేతనం; మరా. తలబ్, తలబ. జీతం, పిలుచు, సమను పంపు ; ఉ. తలబ్. వేతనం, యాచించటం, కోరిక ; పార. తలబ్. విజ్ఞప్తి చేయు, అడుగు, జీతం; అర. తలబ్. జీతం.

< ఉ. తలబ్.

**తలమగు** చూ. తలము[1].

**తలము**[1] రూ.చూ. తరము[1]. వి. 1. శక్యం. భార.ద్రోణ. 2.139, మను. 2.12 ; 2. విధం. శుక.చ. 1.3.

**తలమగు** అ.క్రి. సాధ్యమగు. శుక. 2.7. **తలముదవ్వు** అ.క్రి. 1. శక్తికి మించు, అవశ్యమగు. భార.విరా. 1.266; 2. మేరమీరు. కాశీ. 7.70 ; 3. అమితమగు. గో.హరి. పూ. 441 పం.

**తలము**[2] రూ.చూ. తలుము. వి. ఏతాం.

**తల(పని తల(పు** చూ. తల(చు.

**తల(పించు** చూ. తల(చు.

**తల(పు** చూ. తప్పు. వి. 1. ఆలోచన, చింత. కు.సం. 8.162 ; 2. అభిప్రాయం, భావం. భార.విరా. 1.129 ; 3. కోరిక. ఇచ్ఛ, వాంఛ. భార.విరా. 1.187 ; 4. (జాగ్రత్త అనేది తాత్పర్యార్థం), తెలివి, స్మృతి. భార.విరా. 3.107 ; 5. తలచటం, ఎంచటం. భార.ఉద్యో. 1.7 ; 6. వలపు, మోహం. భార.ఉద్యో. 4.275 ; 7. సంకల్పం. భార. శాంతి. 4.82 ; 8. మనస్సు, హృదయం. ఉ.హరి. 4.138; 9. ధ్యానం. నీలా. 2.96.

**తల(పుకెంపు** వి. చింతామణి. రాజ.వి. 1.37. **తల(పుగాని తలంపుగా(-కానితలంపుగా)** అవ్య. ద్రు. అనుకోకుండానే, ఆకస్మికంగా. హర. 4.56. **తల(పుగీడుచేయు(-కీడుచేయు)** అ.క్రి. తలపుచెరచు. భార.సౌప్తి. 1.45. **తల(పుచూలి** రూ.చూ. తల(పు(జూలి. వి. మన్మథుడు, భావజుడు. **తల(పు చేయు** రూ. తల(పుసేయు. స.క్రి. 1. ధ్యానంచేయు. హర. 3.33 ; 2. స్మరింప జేయు, జ్ఞప్తికితెచ్చు. కవిక. 4.128. అ.క్రి. ఎంచు, భావించు. విష్ణుపు. 6.18. **తల(పు(జూలి (-చూలి)** రూ. తల(పుచూలి. వి. భావజుడు, మన్మథుడు. సాంబ. 1.8. **తల(పునకువచ్చు** అ.క్రి. జ్ఞప్తికి వచ్చు. ఉ. హరి. 4.135. **తల(పున(బాఱు(-పాఱు)** అ.క్రి. 1. స్మృతికి వచ్చు, జ్ఞప్తికి వచ్చు. పారి.పీఠి. 20 ; 2. తోచు. మను. 6.9. **తల(పు నిలుపు** అ.క్రి. మనసు నిలుపు. భార.కర్ణ. 1.301. **తల(పు బిడారంపు బలియు(డు** వి. మనసు స్థానంగా గల బలవంతుడు, మన్మథుడు. వేంక.ఆం. 1.8. < తల(పు + బిడారము + బలియు(డు. **తల(పుమిన్న** వి. చింతామణి. విష్ణుపు. 4 ఆ. **తల(పు(బడినడుచు (-పడినడుచు)** అ.క్రి. ఇష్టప్రకారం నడుచు. కళా. 1.301. **తల(పురతనము** వి. చింతామణి. ఆం.భా. 1.58. **తల(పురాయి** రూ. తల(పు ఱాయి. వి. చింతామణి, కోరికల నిచ్చే మణి. రామాభ్యు. 5.182. **తల(పుఱాయి** రూ.చూ. తల(పురాయి. వి. చింతామణి. యయా. 1.98. **తల(పులోవారు** వి.బ.వ. మనస్సులోనివారు, ఆప్తులు. నీలా. 2.96. **తల(పువాఱు(-పాఱు)** అ.క్రి. స్మృతికి వచ్చు, జ్ఞప్తికి వచ్చు. కవిక. 6.28. **తల(పు సాకిరి** విణ. స్మారిత సాక్షి, ఈ సంగతి నీకు తెలిసినదేకదా అని గుర్తుకు తెచ్చుకోమని అడగబడే సాక్షి. **తల(పుసాక్షి** విణ. స్మారితసాక్షి, ఈ సంగతి నీకు తెలిసినదేకదా అని గుర్తుకు తెచ్చుకోమని అడగబడే సాక్షి. విజ్ఞా. వ్యవ. 100.

**తల(పుసేయు(-చేయు)** రూ.చూ. తల(పుచేయు. స.క్రి. 1. స్మరింపచేయు, జ్ఞప్తికి తెచ్చు. పాండు. 2.36 ; 2. ధ్యానం చేయు ; అ.క్రి. ఎంచు, భావించు. **తల(పెత్తు** అ.క్రి. తలపు పుట్టు. భాస్క.రా. అరణ్య. 2.101. < తల(పు + ఎత్తు[1].

**తల(పెత్తు** చూ. తలఁపు.

**తలయారి** రూ.చూ. తలవర. వి. ఆరక్షకుడు, ఆరెకుడు. సారంగ. 3.170.

**తలరారు** చూ. తలరు[1].

**తలరు**[1] అ.క్రి. 1. కలగు, క్షోభించు. భార. ఆది. 5.199 ; 2. చలించు, కంపించు. భార. సభా. 1.244 ; 3. జంకు, వెనుదీయు. భార. ఆరణ్య. 1.309; 4. చింతించు, దుఃఖించు. భార.ఆరణ్య. 2.64 ; 5. తొలగు, చెదిరిపోవు. భార. ద్రోణ. 2.135 ; 6. అతిశయించు, విజృంభించు. భీమ. 1.98 ; 7. సంభ్రమించు, త్వరపడు. ఆము. 4.101; 8. ఒప్పు, ప్రకాశించు. కవిజ. 1.42; వి. వెరపు, జంకు, భయం. ఆం.భా. 1.133.

క. తలర్. చలించు, వణకు, తూగు, తెరళ్. చలించు, వణకు, కదలు, ముందుకుపోవు, వెళ్ళు, బయలుదేరు, తెరళికె, తెరళ్కె. కదిలెడు మొ., తెరళిచు, తెరల్చు. వణకు ; తు. తళబళ, తళమళ. భయపెట్టు, ఆందోళన. త. తళర్. వాలిపోవు, అలసిపోవు, వదులగు, తణి. వదులుచేయు ; మ. తళరుక. వదులగు, మూర్ఛపోవు ; మాల్తో. తల్గ్ కొ. బలహీనమైన, సున్నితమైన.

మూ. ద. ద్రా. తళ్-అర్-.

<మూ. ద్రా. *చళ్-/-*తళ్.

**తలరారు** అ. క్రి. ఒప్పు. అచ్చ. రా. బాల. 137. <తలరు[1]+-ఆరు.

**తలరు**[2] చూ. తరలు. అ.క్రి. వెళ్ళు, ప్రయాణమగు. భార. ఆది. 2.178.

క. తళర్. బయలుదేరు, వెడలు, తళర్చు. ఒకస్థలం దూరంగా వెళ్ళిపోవటం ; త. తణ. బయలుదేరు, అవతలకి వెళ్ళు, వెళ్ళు, వెడలు, అవతల ఉంచు, వదలివేయు, దూరంగా ఉంచు ; మ. తాళ్.

<మూ.ద్రా. *తాళ్.

**తలవర** రూ. తలయారి, తలవరి, తలవారి, తలారి[1], తలాఱ, తళవర, తళవార. వి. 1. గ్రామాధికారి. నాగార్జున కొండ శాసనం. విజయపురి, పల్నాడు తాలుకా, గుంటూరు జిల్లా. క్రీ. శ. 3వ శతాబ్దం ; 2. కావలివాడు.

సం. స్థలవార- ; ప్రా. తలవర-, తలార-, తలారక్ష-, తలేర-. గ్రామరక్షకుడు ; అ. మా. తలవర-, తలార- ; పో. చూ. సం. తలార (క)-, తలవర్గ-. పట్టణరక్షకుడు ; మరా. తళ్వార్. గ్రామాధికారి.

క. తళవర-, తళార-, తలారి. కావలివాడు ; తు. తళవారె. గ్రామరక్షకుడు.

<ప్రా. తలవర-.

**తలవరి** రూ.చూ. తలవర. వి. 1. గ్రామాధికారి. నాగార్జున కొండ శాసనం, విజయపురి, పల్నాడు తాలూకా, గుంటూరు జిల్లా. క్రీ.శ. 3వ శతాబ్దం ; 2. ఆరెకుడు, ఆరక్షకుడు. భార. శాంతి. 1.322 ; 3. దండనాధికారి. మార్క. పీఠి. 35.

**తలవరివా(డు** వి. దండనాధికారి. విష్ణు. 4.112.

**తలవారి** రూ.చూ. తలవర. వి. దండనాధికారి. వైజ. 4.78 ; 2. గ్రామాధికారి ; 3. కావలివాడు.

**తలా** చూ. తల[1].

**తలాకిలి** చూ. తల[1].

**తలాట**[1] చూ. తల[1].

**తలాట**[2] చూ. తల[1].

**తలాటము** చూ. తల[1].

**తలాడ** చూ. తల[1].

**తలాడబటువు** చూ. తల[1].

**తలాది** చూ. తల[1].

**తలాపి** చూ. తల[1].

**తలాపు** చూ. తల[1].

**తలా(పి** చూ. తల[1].

**తలారి**[1] రూ.చూ. తలవర. వి. ఆరక్షకుడు, ఆరెకుడు. కాశీ. 2.38. ద. హిం. శా. సంపు. 4. శాసనం 161. క్రీ.శ. 1297.

**తలారిఇనాం** వి. ఊరికాపలావానికి ఇచ్చేధనం. **తలారికట్నము** వి. తలారిపన్ను. నె. శా. సంపు. 3పు. 1121. ఒంగోలు శాసనం. క్రీ.శ. 1443. **తలారికము** వి. తలారి పన్ను. నె. శా., ఒంగోలు శాసనం. 1275సం. **తలారితనము** వి. తలారిఉద్యోగం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 207. **తలారిదొర** వి. కొత్వాలు. **తలారిపన్ను** వి. తలవరి జీవితానికై విధించేపన్ను. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 521. క్రీ. శ. 1317. **తలారిమాన్యం** వి. ఊరి వెట్టి వాడికి ఇచ్చినభూమి. **తలార్లఇనాం** వి. ఊరికాపలాకాసే వాళ్ళకు ఇచ్చేధనం.

**తలారి**[2] చూ. తల[1].

**తలారిగాడి** చూ.తల[1].

**తలారించు** అ.క్రి. మరలు, మళ్లు. భాగ. 10పూ. 966.

**తలారు** చూ. తల[1].

**తలారుగాడి** చూ. తల[1].

**తలార్లఇనాం** చూ. తలారి[1].

**తలాఱ** రూ.చూ. తలవర. వి. నగరపాలకుడు. ద. హిం. శా. సంపు. 4. క్రీ. శ. 1139.

**తలావు** వి. చెరువు.

సం. తడాగ-. చెరువు ; ప్రా. తడాగ- ; హిం. తలాబ్, తాలాబ్. చెరువు ; గు. తలావ్ ; మరా. తలావ్.

<మరా. తలావ్.

**తలాషు** వి. వెతకటం.

హిం. ఉ. తలాశ్. అన్వేషణం, ఆవశ్యకత ; మరా. తలాశ్, తలాస్. శోధనం, అన్వేషణం ; పార. తలాష్. అన్వేషణం, అధ్యయనం, ఊహ.

<ఉ. తలాశ్.

**తలి** రూ.చూ. తల్లి. వి. తల్లి. హరి. పూ. 5.206. జైమిని. భా. 1.63.

**తలికి** రూ. తలికె. అవ్య. ముందు.

**తలికె** రూ.చూ. తలికి. అవ్య. మునుపు, ముందు.

**తలిగ** రూ.చూ. తళిగ. వి. భోజనపాత్ర, కంచం. ఆం. భా. 2.244.

**తలిగె** రూ. తళిగె. వి. భోజనపాత్ర. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 874. క్రీ. శ. 1620.

క. తళిగె. అంచువంపుగా ఉన్న పళ్ళెం.

<క. తళిగె.

**తలిగెమారి** రూ. తలగమరి. వి. మెట్టనేలల్లో పెరిగే చిన్నకలుపు మొక్క.

**తలిపిరి** రూ. తలపరిగి, తలపరిగె, తలపెర, తలిపెర. వి. **1.** వాగుగాపారే చిన్ని ఊట నీరు ; **2.** ఊటకాలవకు నీళ్ళు వచ్చేచోట ఉన్నగుంట.

**తలిపెకాల్వ** వి. ఊటకాలువ, ఊటనీటికాలవ.

**తలిపెర** రూ.చూ. తలిపిరి. వి. వాగుగాపారే చిన్న ఊటనీరు, ఊటకాలవకు నీళ్ళువచ్చేచోట (నీళ్ళూరేచోట) ఉన్నగుంట గొయ్యి, చెలమ.

**తలియ**[1] రూ.చూ. తళియ. వి. భోజనపాత్ర, కంచం. కాశీ. 4.100.

**తలియ**[2] రూ.చూ. తల్లి. వి. తల్లి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 178. క్రీ.శ. 1151.

**తలిరంపకాఁడు** చూ. తలిరు.

**తలిరాకు** చూ. తలిరు.

**తలిరాకుఁబోఁడి** చూ. తలిరు.

**తలిరించు** చూ. తలిరు.

**తలిరు** విణ. లేత, తరుణమైన. కు.సం. 9.46 ; వి. చిగురు, పల్లవం. భార.భీష్మ. 3.223.

క. తళల్. మొగ్గ తొడుగు, మొలకెత్తు, తళి. మొలకెత్తు, తళిర్. మొలకెత్తు, చిగురు ; తు. తళిరు. మొలక, మొగ్గ ; త. తళిర్ (తళిప్పు-, తళిత్త్). మొలకెత్తు, చిగురించు, అభివృద్ధి, వృద్ధిచెందు, ఆనందించు, మొలక, తళిర్ప్పు. అంకురం ; మ. తళిర్. మొగ్గ, కొత్త ఆకు, తళిర్క్క. మొగ్గతొడుగు, మొలకెత్తు, చిగురించు, తళిర్ప్పు, తళిర్మ్మ. మొగ్గతొడుగు. పో.చూ. త. తుళిర్.

<మూ.ద.ద్రా. తళిర్.

**తలిరంపకాఁడు** వి. మన్మథుడు. వ్యు. చిగురు బాణంగా కలవాడు. ద్వి.పరమ. వి. 3.246 పు. <తలిరు + అంపకాఁడు. **తలిరాకు** రూ. తలిరుటాకు. వి. చిగురాకు. కు.సం. 4.85. <తలిరు + ఆకు. **తలిరాకుఁబోఁడి** రూ. తలిరుటాకుఁబోఁడి. వి. మనోజ్ఞురాలైన స్త్రీ. కాశీ. 3.13. వ్యు. చిగురాకు వలె మనోజ్ఞమైన స్త్రీ. **తలిరించు** అ.క్రి. చిగుర్చు. ద్వి.పరమ. వి. 2.57. <తలిరు + –ఇంచు[3]. **తలిరుకటారికాఁడు** వి. మన్మథుడు. చిగురు బాకుగా కలవాడు. చంపూ రా. 3.92. **తలిరుకొను** రూ.చూ. తలిర్కొను. అ.క్రి. **1.** చిగుర్చు ; **2.** వ్యాపించు. **తలిరుంగైదువుజోదు (-కైదువుజోదు)** వి. మన్మథుడు, చిగురు బాకుగా కలవాడు. ఆము. 5.85. **తలిరుచు** రూ.చూ. తలిర్చు. అ.క్రి. **1.** చిగురించు, పల్లవించు ; **2.** ఒప్పు ; **3.** తోచు, కన్పట్టు ; **4.** మించు ; **5.** సంతోషించు. **తలిరుజిరావజీరు** వి. మన్మథుడు. వ్యు. చిగురు బాణంగా కలవాడు. నీలా. 3.14. **తలిరుటాకు** రూ.చూ. తలిరాకు. వి. లేత ఆకు. <తలిరు + ఆకు. **తలిరుటాకుఁబోఁడి (-పోఁడి)** రూ.చూ. తలిరాకుఁబోఁడి. వి. స్త్రీ. వ్యు. చిగురాకువలె మనోజ్ఞురాలైన స్త్రీ. **తలిరుటెల్లి** రూ. చూ. తలిరెల్లి. వి. చిగురుగొడుగు. <తలిరు + ఎల్లి. **తలిరుదాసరి** వి. ఒకానొక దాసరి. **తలిరుదిండి (-తిండి)** వి. కోయిల, పికం. విజయ. 3.39. త. తళిర్తిన్ని. **తలిరున్విల్తుండు** రూ. తలిరు విలుతుఁడు, తలిరువిల్తుఁడు. వి. మన్మథుడు. వ్యు. తలిరు విల్లుగా కలవాడు. సారంగ. 2.203. **తలిరిపు** రూ.చూ. తలిర్పు. వి. **1.** తలిర్చటం; **2.** అతిశయం, పెంపు. **తలిరుమేఁతరి** వి. కోయిల. వ్యు. చిగురాకులు మేతగా కలది. సాంబ. తిర్య. 77. **తలిరుఁబొన్పు (-పొన్పు)** వి. చిగురుటాకుల పాన్పు. కాశీ. 4.199. **తలిరుఁబోణి(-పోణి)** రూ.చూ. తలిరుఁబోఁడి. వి. స్త్రీ, చిగురువలె మనోజ్ఞురాలైన స్త్రీ. శృం.నై. 6.63. **తలిరుఁబోఁడి(-పోఁడి)** రూ. తలిరుఁబోణి. వి. స్త్రీ. వ్యు. చిగురు వలె మనోజ్ఞంగాఉన్న ఆడది. కు.సం. 5.135. **తలిరువిలుకాఁడు** రూ.చూ. తలిరు విల్కాఁడు. వి. మన్మథుడు. వ్యు. చిగురు విల్లుగా కలవాడు. చెన్నబసవ. 2.207. **తలిరువిలుతుఁడు** రూ.చూ. తలిరున్ విల్తుండు. వి.మన్మథుడు. ఆం.భా. 1.45. **తలిరువిల్కాఁడు** రూ. తలిరు విలుకాఁడు. వి. మన్మథుడు. వ్యు. చిగురు విల్లుగా కలవాడు. **తలిరువిల్తుఁడు** రూ.చూ. తలిరున్ విల్తుండు. వి. మన్మథుడు. **తలిరెల్లి** రూ. తలిరుటెల్లి. వి. చిగురు గొడుగు. కు.సం. 4.103. <తలిరు + ఎల్లి. **తలిరొత్తు** అ.క్రి. చిగుర్చు, తలిర్చు. కు.సం. 4.87. <తలిరు + ఒత్తు. **తలిర్కొను** రూ. తలిరుకొను. అ.క్రి. **1.** వ్యాపించు. ఘటికా. 2.139 ; **2.** చిగురించు. **తలిర్చు** రూ. తలిరుచు. అ.క్రి. **1.** చిగురించు, పల్లవించు. భార.ఆది. 4.20 ; **2.** ఒప్పు. భార.ఉద్యో. 3.110 ; **3.** తోచు, కన్పట్టు. భార.భీష్మ. 1.110 ; **4.** మించు, అతిశయించు. భార.భీష్మ. 1.169 ; **5.** సంతోషించు. భార. ద్రోణ. 1.120. తలిర్పు. రూ. తలిరుపు. వి. **1.** తలిర్చటం. భార.అను. 4.447 ; **2.** అతిశయం, పెంపు. త. తళిర్పు. అంకురం.

**తలిరెల్లి** చూ. తలిరు.

**తలిరొత్తు** చూ. తలిరు.

**తలిర్కొను** చూ. తలిరు.

**తలిర్చు** చూ. తలిరు.

**తలిర్పు** చూ. తలిరు.

**తలివము** రూ. తడిబము, తడిమము, దడిబము, దడిమము[1]. వి. పరుపు, శయ్య. యయా. 2.86.

సం. తలిమ-. దూదిపరుపు, వితానం, కుట్టిమం; ప్రా. తలిమ-. శయ్య ; నివాస భవనం, శయ్యా గృహం ; అ.మా. తలిమమ్. తల్పం.

<ప్రా. తలిమ-.

**తలుకు** రూ.చూ. తల్కు. వి. **1.** మెరుపుకు అనుకరణం ; **2.** ఒప్పు, ఇంపు.

**తలుగు** రూ. తలగు, తలువ, తల్గు[2], తొలుగు[2]. వి. పశువుల్ని కట్టేతాడు, పలుపు. భార. విరా. 1.275. అ.క్రి. **1.** కట్టబడు ;

2. చుట్టబడు.

క. తళ్. కలియు, మెలిపెట్టు, జతకూర్చు, తళె. బంధం, తళ్కి. సంబంధం, సంఘం, దళె. అతుకు ; కొడ. తళె, దళె. తాడుముడి, ఉచ్చు ; తు. తలె. తాటిచెట్లు ఎక్కడానికుపయోగపడే తాడు, తలెపుని. అడ్డగించు, నిలుపు, తళ్కి. అన్యోన్య సంసర్గం, సంఘం ; త. తళై (తళైవ్-, తళైన్త్). బిగించు, నిర్బంధించు, బంధం. (తళైప్ప్-, తళైత్త్). బిగించు, నిర్బంధించు, బంధం, ముడిపెట్టు, బంధించు, అణచు ; తళైయం. బంధాలు, సంకెళ్ళు ; మ. తళ్. సంకెళ్ళు, తాటిచెట్లు ఎక్కటానికుపయోగపడే కాలి బంధం, తళెక్క. బంధించు. బంధం. తళెప్పు. బంధన.

<మూ.ద.ద్రా. *తళ్-.

**తలు(గు** రూ. తల(గు, తల్గు$^{1}$. అ.క్రి. తొలగు, పోవు. భార. ఆది. 6.248 ; స.క్రి. తొలగించు, పోగొట్టు, పోగొట్టుకొను. భార.ఆరణ్య. 3.19.

క. తళ్ళు. తోయు, బయటికి గెంటు, అణచు, వెళ్ళగొట్టు, తిరస్కరించు ; తు. తల్లుని, తళ్ళుని. లోపలికి తోయు ; త. తళ్ళు (తళ్ళి). తోయు, ముందుకు తోయు, బహిష్కరించు, తిరస్కరించు, తీసివేయు, తొలగించు, పోగొట్టుకొను ; మ. తళ్ళుక. తోయు, అణచు, తిరస్కరించు, తళ్ళల్. చొరవగల, నిరాకరణ, తళ్ళు. అణచు, తోయు ; కో. తళ్ (తయ్ళ్). తోయు, తోసివేయు ; తొ. తొళ్ (తొళ్య్), తోయు.

<మూ.ద్రా. *తళ్-.

**తలుపు** రూ. తల్పు. వి. 1. కవాటం, గృహ ద్వారాదుల్ని తెరవడానికి, మూయడానికి వీలుగా అమర్చే కర్రతో చేసే వస్తువు. శృం.నై. 7.154 ; 2. కిటికీ మట్టాన ఉండే పొడుగాటి అలమర.

త. తల్తైప్పు. చీర అంచు, ప్రారంభం.

**తలుపుగూడు** రూ. తల్పుగూడు.వి. గోడలోనే అమర్చిన అలమారు. **తలుపుతడక** వి. మేదరితడక, వెదురుబద్దలతో తలుపులాగ అల్లినతడక.

**తలుము** రూ. తలము$^{2}$. వి. ఏతం, పొలాలకు నీళ్ళుతోడే ఏటవాలు కొయ్యయంత్రం.

**తలుముపీట** వి. ఏతం, పొలాలకు నీళ్ళుతోడే ఏటవాలు కొయ్యయంత్రం.

**తలువాలు** రూ. చూ. తలంబ్రాలు. వి. బ. వ. వధూవరులు వివాహ సమయంలో తలమీదపోసుకొనే బియ్యం.

**తలువు** రూ.చూ. తలుగు. వి. 1. పలుపు, పశువుల మెడకు వేసి గుంజకు కట్టే తాడు ; 2. కళ్ళంలో ఎడ్లవరసకు కట్టిన తాడు ; స.క్రి. తాళ్ళు మొ॥ వాటితో కట్టు.

**తలూకి** రూ.చూ. తెలకి. వి. మందులకు ఉపయోగపడేమొక్క (Clerodendron Phlomoides).

**తలూకు** రూ.చూ. తాలూకు. వి. 1. సంబంధం ; 2. తాలూకాలో ఒక భాగం.

**తలె** రూ.చూ. తళియ. వి. కంచం, భోజనం చేసే పాత్ర.

**తలెత్తు** చూ. తల$^{1}$.

**తలెన్ను** చూ. తల$^{1}$.

**తలేటికాణి** చూ. తల$^{1}$.

**తలేటిగుంటక** చూ. తల$^{1}$.

**తలేటినాగేలి** చూ. తల$^{1}$.

**తలేటిమడక** చూ. తల$^{1}$.

**తలేటిమోకు** చూ. తల$^{1}$.

**తలేత** చూ. తల$^{1}$.

**తలేరు$^{1}$** చూ. తల$^{1}$.

**తలేరు$^{2}$** చూ. తల$^{1}$.

**తలేరుగాణి** చూ. తల$^{1}$.

**తలేరుమడక** చూ. తల$^{1}$.

**తల్కు** రూ. తలుకు, తళుకు, తళుక్కు, తళ్కు. వి. 1. మెరుపుకు అనుకరణం. కు.సం.7.138; 2.ఒప్పు, ఇంపు. కువ.చ. 4.176.

క. తళకు, తల్కు. ప్రకాశం; తళక్కనె. ప్రకాశంగా ; తు. తళతళ. ప్రకాశం ; త. తళుక్కు(-తళుక్క్). ప్రకాశమగు, ప్రకాశం.

**తల్గడ** చూ. తల$^{1}$.

**తల్గు$^{1}$** రూ.చూ. తలు(గు, స.క్రి. తొలగించు, పొగొట్టు. భార. ఆరణ్య. 6.366 ; అ.క్రి. తొలగు, పోవు.

**తల్గు$^{2}$** రూ.చూ. తలుగు. వి. 1. పలుపు, పశువుల మెడకు వేసి గుంజకు కట్టే తాడు ; 2. నారతో పేనిన లావుపాటి తాడు.

**తల్చిట్టి** చూ. తల$^{1}$.

**తల్చు** రూ.చూ. తళ్చు. స.క్రి. 1. స్మరించు, జ్ఞప్తికి తెచ్చుకొను. పండి.చ. 4.288 పు. ; 2. ఎంచు, అనుకొను. కేయూ. 3.114; 3. ఉద్దేశించు, సంకల్పించు, వాంఛించు, కోరు. కళా. 2.101 ; 4. చేయు ; 5. ధ్యానించు ; 6. పాటించు, గణించు, లెక్కచేయు; 7. స్తుతించు, కొనియాడు; 8. ప్రసంగించు, ప్రస్తావించు.

**తల్దాపు** చూ. తల$^{1}$.

**తల్నట్టు** చూ. తల$^{1}$.

**తల్నత్త** చూ. తల$^{1}$.

**తల్పు** రూ.చూ. తలుపు. వి. ఇంటిద్వారాల్ని మూయటానికి, తెరవడానికి చెక్కతో చేసే వస్తు విశేషం. హర. 7.137.

**తల్పుగూడు** రూ.చూ. తలుపుగూడు. వి. దర్వాజా పక్కన ఉన్నగూడు.

**తల్మలాయించు** చూ. తల$^{1}$.

**తల్య** రూ.చూ. తల్లి. వి. తల్లి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1.120. క్రీ.శ. 1151.

**తల్రాయి** చూ. తల$^{1}$.

**తల్రుమాలు** చూ. తల$^{1}$.

**తల్లకెడపు** చూ. తల$^{1}$.

**తల్లక్రిందు** చూ. తల$^{1}$.

**తల్లగెడవగు** చూ. తల$^{1}$.

**తల్లగెడవు** చూ. తల$^{1}$.

**తల్లడకుడుచు** చూ. తల్లడము.

**తల్లడపడు** చూ. తల్లడము.

**తల్లడపఋచు** చూ. తల్లడము.

**తల్లడపాటు** చూ. తల్లడము.

**తల్లడపెట్టు** చూ. తల్లడము.

**తల్లడమల్లడగు** చూ. తల్లడము.

**తల్లడము** వి. **1**. క్షోభం, కలత, బాధ. భార.ఆది. 8.53 ; **2**. భయం. పండి.చ. 3.173 పు.; **3**. చలనం, కంపం. చాంచల్యం. ఉ.హరి. 3.35 ; **4**. సంభ్రమం, తొందర, తొట్రుపాటు. భాగ. 10 ఉ. 90.

క. తల్లణ, తల్లళ. ఆందోళన, ఆశ్చర్యం, హెచ్చరిక, భయం, విచారం ; తల్లణిసు. భయంలేక ఆశ్చర్యంతో ఆందోళన పడు, చిక్కుల్లో పడు, హెచ్చరిక ఉండు, ఆతురతగా ఉన్న; తళంక. కలవరం, భయం మొ॥ ; తు. తల్లణ. అటుఇటు ఊగు, కలత పొందిన.

పో.చూ. సం. తరళ-. చంచలమైన.

**తల్లడకుడుచు** అ.క్రి. తల్లడం పొందు. <తల్లడము + కుడుచు. **తల్లడపడు** రూ. తల్లడవడు. అ.క్రి. **1**. చలించు, కంపించు, వణకు. భార.ఆరణ్య. 2.29 ; **2**. క్షోభపడు, బాధపొందు. భార. భీష్మ. 1.268. < తల్లడము + పడు. **తల్లడపఱచు** అ.క్రి. **1**. బాధపెట్టు, క్షోభపెట్టు. నార.పంచ. 3.172 ; **2**. ఆందోళనపెట్టు, <తల్లడము + పఱచు. **తల్లడపాటు** వి. **1**. భయం. విష్ణు పు. 6.267 ; **2**. కలత, సంక్షోభం, బాధ. ఉ.రా. 6.89. <తల్లడము + పాటు. **తల్లడపెట్టు** స.క్రి. క్షోభపెట్టు, బాధపెట్టు. భార.అను. 5.103. **తల్లడమల్లడగు** అ.క్రి. తపించు. **తల్లడవడు(-పడు)** రూ.చూ. తల్లడపడు. అ.క్రి. **1**. క్షోభపడు, బాధపడు. ఉ.రా. 6.231 ; **2**. చలించు, కంపించు. **తల్లడించు** రూ. తలడించు. అ.క్రి. **1**. కలతపడు, క్షోభపడు. భార.విరా. 2.31 ; **2**. చలించు, కంపించు. పారి. 4.21 ; **3**. భీతిల్లు, జడియు. జంకు. ఉ.రా. 3.246 ; **4**. దుఃఖించు. ఉ.రా. 4.94 ; స.క్రి. క్షోభపెట్టు, బాధపెట్టు. సానంద. 2.34. క. తల్లణిసు. **తల్లడింపు** వి. భయం. ఆం.భా. 1.133. **తల్లడిలు** రూ.చూ. తల్లడిల్లు. అ.క్రి. **1**. జడియు, భీతిల్లు. భార.వి.రా. 4.62 ; **2**. దిగులుపడు. శృం.నై. 7.123 ; **3**. చలించు, కంపించు, వణకు. మను. 5.81 ; **4**. బాధపడు. ఆము. 5.149 ; **5**. దుఃఖించు. **తల్లడిల్లు** రూ. తలడిలు, తలడిల్లు, తల్లడిలు. అ.క్రి. **1**. చలించు, కంపించు. భార.సభా. 1.224 ; **2**. బాధపడు. భార.ఆశ్రమ. 2.163 ; **3**. జడియు, భీతిల్లు. ఆము. 4.206; **4**. విచారించు, దుఃఖించు. కళా. 6.62 ; **5**. దిగులుపడు. క. తల్లణిసు. భయపడు.

**తల్లటవడు** చూ. తల్లడము.

**తల్లడించు** చూ. తల్లడము.

**తల్లడింపు** చూ. తల్లడము.

**తల్లడిలు** చూ. తల్లడము.

**తల్లడిల్లు** చూ. తల్లడము.

**తల్లంటుతీగ** వి. పచ్చనిపూలు పూసేతీగ (Ipomnaea Chrysies).

**తల్లపి** రూ.చూ. తలయంపి. వి. తలఉంచుకొనే దిక్కు. రాజవా. 3.28.

**తల్లాకు** వి. విడాకులు.

హిం. ఉ. తలాక్. విడాకులు.

<ఉ. తలాక్.

**తల్లి** రూ. తలి, తలియ[2], తల్య, తల్లియ. వి. **1**. జనని, మాత. ద. హిం. శా. సంపు. **4**. శా. సం. 1120 క్రీ.శ. 1151 ; **2**. వాత్సల్యార్థకం. భార. ఆది. **4**.61 ; విశే. **1**. మొదటిదైన, పైది, పెద్దదైన ; **2**. ముఖ్యమైన.

త. తళ్ళై. తల్లి ; మ. తళ్ళ. తల్లి, తళ్ళ-విరల్. బొటనవేలు, కాలిబొటనవేలు ; కొం. తడి. ఆడజంతువు ; కుయి. టడి. తల్లి, స్త్రీ, ఆడది, తలి. ఆడపక్షి లేక జంతువు, కోడిపెట్ట ; కువి. తల్లి. తల్లి, తల్లివన్సు. బొటనవేలు ; తాలివ్యాంజూ ; ప. తల్. తల్లి ; తల్‌వంద. బొటనవేలు.

పో. చూ. సం. తల్లీ. యువతి.

మూ. మ. ద్రా. *తల్.

**తల్లికడవ** వి. పెళ్ళిలో వాడే పెద్దమట్టిపాత్ర. **తల్లికదుపు** వి. సూర్యుడు అస్తమించేచోటు. **తల్లికాలువ** వి. పిల్లకాలవలకు మూలమైన పెద్దకాలవ. **తల్లికుండ** వి. పెళ్ళిలో వాడే పెద్ద మట్టిపాత్ర. **తల్లికొట్టు** వి. పొడుగాటి మానుమొక్క. **తల్లికొంగ్ర** వి. మొదటికొంగ్ర, దున్నేటప్పుడు ఎడం వదలి మొదటి అరకతో వేసినచుట్టుచాలు. **తల్లికొయ్య** వి. తలపీటకు ఉండే కొయ్య. **తల్లిగోడ** వి. ఇంటికి ముఖ్యమయిన గోడ. **తల్లిచాలు** వి. కొంగ్రవేసే మొదటిచాలు. **తల్లిచుక్క** వి. బృహస్పతి పేరిటిచుక్క. **తల్లితండ్రి** వి. తాత. **తల్లితల్లి** వి. **1**. లక్ష్మీదేవి. ఆం. నా. సం. 1.10 ; **2**. తల్లిని కన్న తల్లి, అమ్మమ్మ. **తల్లిత్రాడు** వి. అచ్చువడుల్లో పోగులవరస చెడకుండా దూర్చేదారం. **తల్లితోడు** వి. ఒకానొక ఒట్టు. సిం. ద్వా. 3.139. **తల్లితోడుగా** క్రి. విశే. ద్రు. పోషకమూ ప్రాపూ అయ్యేటట్లుగా. ఆము. 5.76. **తల్లిదూలం** వి. వెన్నుదూలం, ముఖ్యమైనదూలం. **తల్లిపడి** వి. చెరువుఅరగాణి. **తల్లిపడుగు** వి. రెండంచులకూ మధ్య భాగంలో ఉన్న నేత పడుగు. **తల్లిపదును** వి. నేలఅడుగుకు దిగిన తడి. **తల్లిపెండి** రూ.చూ. తల్లిబెండి. వి. వాసాలకు పైనా కిందా బద్దలువేసి బిగించిన పెండె. **తల్లిపైవసంతంచల్లు** స.క్రి. కూడనిపని చేయు. **తల్లిపొయ్యి** వి. బట్టీ పొయ్యిల్లో కట్టెలుంచే పెద్ద పొయ్యి. **తల్లిప్రేమ** వి. ఒకరకం అద్దకం డిజైను. **తల్లిబాటరు** రూ.చూ. తల్లిబాడరు. వి. నాలుగైదు రంగులు వరసగా పెట్టినేసిన ఒకరకంఅంచు. **తల్లిబాడరు** రూ. తల్లిబాటరు. వి. నాలుగైదు రంగులు వరసగా పెట్టినేసిన ఒకరకం అంచు. ఇం. Border. అంచు. <తల్లి + ఇం. Border. **తల్లిబెండి** రూ. తల్లిపెండి, తల్లిబెండె. వి. వాసాలకు పైనా కింద బద్దలువేసి బిగించిన పెండె. **తల్లిబెండె** రూ.చూ. తల్లిబెండి. వి. వాసాలకు పైనా కిందా బద్దలు వేసి బిగించిన పెండె. **తల్లిమాలక్ష్మి** వి. స్ఫోటకం. సం. మహాలక్ష్మి. లక్ష్మీదేవి. <తల్లి + సం. మహాలక్ష్మి. **తల్లియిల్లు (-ఇల్లు)** వి. **1**. పుట్టిల్లు. నిర్వ. రా. 1.46; **2**. పుట్టిల్లులాగ అడ్డంకి లేకుండా ప్రవేశించే చోటు. **తల్లియొఱ(-ఒఱ)** రూ. తల్లివర, తల్లివోడ. వి. నూతికి పైనవేసే పెద్దఒర. ఆము. 1.57.

**తల్లివర** రూ.చూ. తల్లియొఱ. వి. కుంపుడు బావుల్లో కింద మొదలుగా ఉండేవర. **తల్లివాయినంచీర** వి. పెళ్ళికూతురి తల్లికి (వియ్యపురాలు) పెట్టేచీర. <తల్లి+వాయనము+చీర. **తల్లివేరు** వి. ముఖ్యమైనవేరు, కూకటివేరు. **తల్లివోడ** రూ.చూ. తల్లియొఱ. వి. బావికి మొదటనేల మీద నిలిపిన పెద్దవర. <తల్లి+ఒర. **తల్లీగలు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**తల్లియ** రూ.చూ. తల్లి. విశ. శ్రేష్ఠమైన. శుక. 2.140.

**తల్లీగలు** చూ. తల్లి.

**తల్లెతాళము** చూ. తల్లి. వి. వాద్యవిశేషం. క్రీడా. 147.

**తల్లేరు** చూ. తల[1].

**తల్లేరుకాడి** చూ. తల[1].

**తల్వాకిలి** చూ. తల[1].

**తల్సాలు** చూ. తల[1].

**తళతళ** రూ.చూ. తలతల[2]. వి. **1.** మిక్కిలి మెరవటంలోని అనుకరణం. భార. ఉద్యో. 2.114; **2.** మిరుమిట్లు కొల్పే కాంతి. భీమ. 1.117.

క. తళతళ. ప్రకాశం, కాంతి, సూర్యోదయం; తు. తళతళ. కాంతి, ప్రకాశం. త. తళతళప్పు. ప్రకాశం. తళతళ (-ప్)-,-త్). మెరయు.

**తళతళమెరయు** అ.క్రి. ప్రకాశించు. **తళతళలాడు** అ.క్రి. ప్రకాశించు, నిగనిగలాడు, మెరయు; త. తళతళ (-ప్)-,-త్-). ప్రకాశించు. < తళతళ+-లు+ఆడు.

**తళత్తళ** రూ.చూ. తలతల[2]. వి. మిరుమిట్లు కొల్పేకాంతి. రాజవా. 2.39.

**తళవర** రూ.చూ. తలవర. వి. తలారి. కొణికి, పల్నాడు తా. గుంటూరు జిల్లా. క్రీ.శ. 669.

**తళవార** రూ.చూ. తలవర. వి. నగరరక్షకుడు. E.I. XXXI. 12.

**తళిగ** రూ. తలిగ. వి. **1.** భోజనపాత్ర. భార.ఆరణ్య. 1.214; **2.** వంట; **3.** దేవుడికి నివేదన చేసిన అన్నం పళ్ళెం.

క. తళిగె; త. తళిగై; మ. తళిక; సం. స్థాలికా. పళ్ళెం; ప్రా. థాలిఆ.

<త. తళిగై.

**తళిగె** రూ.చూ. తలిగె. వి. భోజనపాత్ర, కంచం. ద. హిం. శా. సంపు. **5**. శా. సం. 874.

**తళిప్రసాదము** వి. దేవునికి భోజనపాత్ర లేక కంచంలో పెట్టిచేసిన నైవేద్య ప్రసాదం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 710.

సం. ప్రసాద-. అనుగ్రహం. <తళిగ+సం.ప్రసాద-.

**తళియ** రూ. తడిగ, తలియ[1], తలె, తళిహ, తెలిగ, తెలియ, తెలె. వి. **1.** వంట. కు.సం. 10.191; **2.** భోజనపాత్ర, కంచం. భార.శాంతి. 1.64; **3.** దేవుడికి నివేదన చేసిన అన్నం. వైజ. 2.128.

సం. తల్లికా, స్థాలికా. ఒకరకం పాత్ర; స్థాలికా, ప్రా. థాలిఆ.

<ప్రా. థాలిఆ.

**తళివెట్టు** (-పెట్టు) అ.క్రి. డిబ్బలుపోయు. ద్వి. పరమ. వి. 6.463 పు.

క. తళి. వెదజల్లు, వెదజల్లటం.

**తళిహ** రూ.చూ. తళియ. వి. అన్నంతినే పళ్ళెం.

**తళుకారు** చూ. తళుకు.

**తళుకించు** చూ. తళుకు.

**తళుకు** రూ.చూ. తల్కు. విశ. మెరుస్తున్న, ప్రకాశవంతమైన. శృం. నై. 1.5. వి. **1.** అధికప్రకాశం, తళతళ మనే కాంతి. విక్ర. 4.19; **2.** మెరవటంలో అనుకరణం. ఘటికా. 2.41; **3.** కిరణం. వసు. 4.26; **4.** అతిశయం; **5.** చిన్న బిళ్ళలాగుండే రాళ్ళులేని కమ్మ; **6.** మెరిసే అభ్రకం పలుకు; **7.** ఒకజాతి డేగ.

**తళుకారు** అ.క్రి. మిక్కిలి ప్రకాశవంతమగు. సానంద. 2.32 పు. <తళుకు+-ఆరు. **తళుకించు** స.క్రి. ప్రకాశింప చేయు. కు.సం. 9.147. **తళుకుచూపు** అ.క్రి. **1.** కలుగు, సంభవించు. కాశీ. 1.129; **2.** బయలుపడు, ప్రకాశితమగు. కాశీ. 4.269; **3.** అతిశయించు. కాశీ. 5.119; **4.** కాంతినిచ్చు, ప్రకాశించు. **తళుకుబెళుకు** వి. శ్యేనభేదం. ఆం.భా. 2.90. **తళుకుమన్ను** వి. బంగం కలిసిన మట్టి. **తళుకులాడు** అ.క్రి. మిక్కిలి ప్రకాశించు. <తళుకు+-లు+ఆడు. **తళుకులు** రూ. తాలూకులు. వి.బ.వ. రాళ్ళు బిగించని సాదా కమ్మలు. **తళుకెక్కు** అ.క్రి. ప్రస్ఫుటమగు. నరస. 5.113. <తళుకు+ఎక్కు. **తళుకొత్తు** రూ.చూ. తళ్కొత్తు. అ.క్రి. **1.** ప్రసరించు, వ్యాపించు, అతిశయించు. భార. శాంతి. 6.475; **2.** మిక్కిలి ప్రకాశించు, శోభిల్లు, ఒప్పు. వరాహ. 10.144; **3.** కలుగు, పుట్టు. శృం.నై. 3.36.

**తళుకెక్కు** చూ. తళుకు.

**తళుకొత్తు** చూ. తళుకు.

**తళుక్కు** రూ.చూ. తల్కు. వి. **1.** అధిక ప్రకాశం, తళతళ మనే కాంతి. విక్ర. 6.44; **2.** మెరవడంలోని అనుకరణం. రసిక. 2.76; విశ. తళతళ మెరిసే, మిక్కిలి ప్రకాశించే. సారంగ. 1.129. ధ్వన్యను.

**తళుక్కుతళుక్కను** అ.క్రి. మిక్కిలి ప్రకాశించు. **తళుక్కుతళుక్కు** వి. **1.** మిక్కిలి కాంతి; **2.** మెరవడంలోని అనుకరణం. **తళుక్కుతళుక్కుమను** అ.క్రి. మెరయు, ప్రకాశించు. వరాహ. 7.3. <తళుక్కుతళుక్కు+అను. **తళుక్కురను** అ.క్రి. ప్రకాశించు, మెరయు. చంపూ.రా. 3.124. <తళుక్కు+అను. **తళుతళుక్కు** వి. **1.** అధికప్రకాశం; **2.** మెరవడంలోని అనుకరణం.

**తళుతళుక్కు** చూ. తళుక్కు.

**తళ్కు** రూ.చూ. తల్కు. వి. మెరవడంలోని అనుకరణం.

**తళ్కుబెళ్కులు** వి.బ.వ. తళతళలు. రాధి. 1.64. **తళ్కొత్తు** రూ. తళుకొత్తు. అ.క్రి. **1.** ప్రసరించు, వ్యాపించు, అతిశయించు. కు.సం. 3.33; **2.** మిక్కిలి ప్రకాశించు, శోభిల్లు, ఒప్పు. భార.ఆరణ్య. 7.210; **3.** కలుగు, పుట్టు. పాండు. 5.18. <తళ్కు+ఒత్తు.

**తళ్కొత్తు** చూ. తళ్కు.

**తళ్చు** చూ. తల[1]. రూ. తలఁచు, తల్చు. స.క్రి. ఆలోచించు. కొసినపల్లి, జమ్మలమడుగు తాలూకా కడప జిల్లా. క్రీ.శ.

925-50.

<మూ.ద్రా. *తల్- ఆలోచించు.

**తళ్లు**[1] వి.బ.వ. 1. గట్టును కొట్టుకొనే చిన్నచిన్న అలలు. యయా. 3.62; 2. పనికిరానివి. <తడి + -లు.

**తళ్లుకొను** అ.క్రి. అతిశయించు. ద్వి.పరమ. వి. 5.386 ప. **తళ్లుగొట్టు (-కొట్టు)** అ.క్రి. చల్లదనం కలిగించు.

**తళ్లు**[2] వి.బ.వ. అవస్థలు, కష్టాలు, ఇక్కట్లు. సారంగ. 3.95. సం. తరల-. చంచలమైన.

**తవకం** చూ. తవు[1].

**తవగంప** వి. కొత్త ధాన్యం పాతరపోసేముందు ఇంటి ఆడపడుచుకు ఇచ్చే గంపెడు గింజలు.

**తవటి** వి. బంగారురంగు నూగు లేతఆకులుకల చెట్టు (Erioglossum Edule).

**తవటీ** రూ.చూ. తగడు[2]. వి. జరీ, సరిగ. చంద్రాంగ. 4.82.

**తవణించు** అ.క్రి. ఒప్పు, ఎసగు. శ్రీరం. మా. 3.591.

**తవన** వి. మితి, గడువు, కొద్దికాలం.

త. తవణై. మితకాలం, శిస్తు వసూలుకిచ్చే గడువు; మ. తవణ. మితకాలం, గడువు.

**తవరము** రూ. తగరము[1]. వి. వంగమనే మెత్తని లోహం.

**తవళి** రూ.చూ. దవళి. వి. మోసం.

**తవాయి** వి. 1. లౌకిక వ్యవహారోపద్రవం, అనుకోని పరిస్థితులు; 2. తుల్లు, తప్పగాలి.

హిం.ఉ. తబాహీ. నాశం; గు. తవాఈ. దురదృష్టం, విపరీత పరిస్థితులు; మరా. తవాఈ. అనుకోని పరిస్థితులు. క. తవాయి. కష్టం, ప్రమాదం.

<మరా. తవాఈ.

**తవారి** వి. గుప్తం.

ఉ.పార.అర. తవారీ. రహస్యం, గుప్తం.

<ఉ. తవారీ.

**తవిట** రూ.చూ. తొగట. వి. నేతపనిచేసేవాళ్ళలో ఒక తెగ.

**తవిటబలిజె** రూ. చూ. తొగటబలిజె. వి. నేతపనివారిలో ఒక తెగ.

**తవిటి** రూ.చూ. తొగట. వి. నేతపనిచేసేవాళ్ళల్లో ఒక తెగ.

**తవిటేగు** వి. ఇంధనంగా ఉపయోగించే ఎర్రకలపనిచ్చే చెట్టు (Cipadessa Frutilosa).

**తవిడాడు** రూ.చూ. తడవాడు. అ.క్రి. పొకాడు. సుద. 2.124.

<తడవి + ఆడు. తడవకు వర్ణవ్యత్యయంచే తవుడు అనే రూపం వచ్చింది.

**తవిద** రూ.చూ. తవ్వెంద. వి. చోడిపైరు.

**తవిదెపుల్ల** వి. ఒకరకం వడ్లు.

**తవిఁద** రూ.చూ. తవ్వెంద. వి. సస్యవిశేషం, చోడిపైరు. కాశీ. 3.23; వి.బ.వ. చోళ్లు.

**తవిరి** వి. నెమ్మది, మెల్లన.

**తవిరుదాసరి** వి. ఒకజాతి దాసరి. హంస. 3.29.

**తవిలించు** చూ. తవులు.

**తవిసి** రూ.చూ. తపసి. వి. కఱ్ఱ లేత పసుపు రంగుగాను గట్టిగాను ఉండే చెట్టు (Holoptelea Integrifolia).

**తవిసె** వి. ఒకరకం ఆకెరుపు మొక్క.

**తవు**[1] రూ.చూ. త్రవ్వు. స.క్రి. 1. ఖననం చేయు; 2. కోరాడు, భూమిని చీల్చు; 3. ఉమ్మూలించు, కెల్లగించు, పెల్లగించు; 4. వెనుకటి సంగతులు ఎత్తిచెప్పు; 5. బయటపెట్టు; 6. ప్రస్తావించు, ప్రసంగించు; 7. కొత్తగా చేయు. వి. తవ్వడం.

**తవకం** రూ.చూ. తవ్వకము. వి. మిరప, జొన్న మొ॥ తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమి గుల్లగా ఉండటానికి పారతో తవ్వటం. **తవుకోల** రూ.చూ. తవుగోల. వి. తవ్వడానికి ఉపయోగించే సాధనం. **తవుగాలు** రూ.చూ. తవుగోల. వి. దోకుడుపార, గడ్డి చెక్కే పార. **తవుగోల(-కోల)** రూ. తవుకోల, తవుగాలు, తవ్వుకోల, తవ్వుగోల, తొగోల, త్రవుకోల, త్రవ్వుకోల. వి. తవ్వడానికి ఉపయోగించే సాధనం. ఆం.బా. 2.230.

**తవు**[2] రూ.చూ. తగు. అ.క్రి. 1. యుక్తమగు, అర్హమగు. భార.ఆది. 4.253; 2. ఒప్పు, పొసగు. వేంక.పంచ. 1.727; 3. ఎసగు.

**తవుజీ** వి. జమీందారులకిచ్చే భరణం, భరణం, వర్షాశనం, లవణను.

ఉ. తౌజీహ్. భూస్వాములకిచ్చే భరణం; పార. తౌజీహ్. పోషణ నిమిత్తం ఇచ్చే ధనం; అర. తౌజీహ్. భరణం.

<ఉ. తౌజీహ్.

**తవుటికి** వి. కృష్ణా, కర్నూలు, కడప జిల్లాల్లోని కొండలపై పెరిగే చెట్టు (Allophylus Cobbe).

**తవుటికెకాడ** వి. విశాఖపట్నం, దక్కను మొ. ప్రాంతాల్లో పెరిగే చిన్నఆకులుకల మొక్క (Grewia Salvifolia).

**తవుటిపాము** చూ. తవుడు[1].

**తవుడు**[1] రూ. తౌడు[1]. వి. బొ. బియ్యంమీది మెత్తని పొట్టు, కండనం. ఉ.హరి. 4.62.

క. తవుడు, తవడు, తవుడు; కొడ. తడివ్. బియ్యం గింజలో లోపలిపొర; తు. తౌడు, తవుడు, చిట్టు; త. తవిటు; మ. తవిటు. తవుడు.

**తవుటిపాము** రూ. తౌటిపాము. వి. ములుగుచేప, పాపమీను. **తవుడుగోలెం** వి. పశువులకు తవుడు కలిపిపెట్టేచిన్న మట్టితొట్టి.

**తవుడు**[2] రూ.చూ. తడము. స.క్రి. 1. మెలకువగా అపహరించు; 2. వ్యభిచరించు.

**తవులమి** చూ. తవులు.

**తవులము** చూ. తవులు.

**తవులఁబడు** చూ. తవులు.

**తవులఁబొఱు** చూ. తవులు.

**తవులు** రూ. తగులు, తనుగు, తలువు, తల్గు[2], తౌలు. అ.క్రి. 1. ప్రియపడు, ఇష్టపడు, కడగు, పూను. భార.ఆది. 1.76; 2 అనక్తమగు, ఆసక్తినొందు. భార. ఆది. 3.9; 3. చిక్కు, బద్ధమగు. భార. ఆరణ్య. 1.211; 4. సక్తమగు, అంటుకొను. భార. ఉద్యో. 3.116; 5. విడవకుండపోవు. భార. భీష్మ. 3.349; 6. కలుగు, సంభవించు. భార. స్త్రీ. 1.85; 7. సంబంధం కలిగించుకొను, జోలికలిగించు

కొను. భీమ. 5.146; 8. దొరుకు, చేపడు, లభించు. వసు. 4.22; స.క్రి. 1. పొందు, ప్రాప్తించు. భార. అను. 5.214; 2. ఆశ్రయించు, ఆధారం చేసికొను. రం. రా. యు. 292పు. 18పం; 3. వెంబడించు, తరుము, పారదోలు. వరాహ. 2.105; 4. వలచు, మోహించు. భీమ. 1.110; స.క్రి; అ.క్రి. అంటు, తాకు. భోజ. 6.357; మను. 1.13; వి. 1. అడ్డు, నిరోధం. మార్క. 2.280; 2. సక్తత, విషయసంబంధం. ఆము. 6.30; 3. సంబంధం. రాజవా. 2.71; 4. పశువుల మెడకు కట్టేతాడు; మెడతాడు; విణ. 1. సక్తమైన. వైజ. 2.41; 2. సంబంధి, సంబంధం కల. మల్ల. 31; 3. ప్రియమైన, ఇష్టమైన. వాల్మీ. 1.16.

క. తగలు, తగిలు, తగులు. సన్నిహితమగు, స్పర్శించు. తగులు, రమించు, తగలిసు, తగిలిసు, తగులిసు. తగిలించు, తగులువికె. స్పర్శ, తగుళ్. జతగాకూడు, సన్నిహితమగు, సమీపించు, కలువు, ప్రారంభించు, తరుము, వెంబడించు, అవతలకి తరుము, వెనక్కి తోయు, తగుళిసు. తరుము, అవతలకి తరుము, తగుళ్చ్. కూడు, చేర్చు, కలిపిఉంచు, తగుళ్ప్. కూడిన; తు. తగరుని. దగ్గరకువచ్చు, సమీపించు, తాకుకొను, అతి చిన్నగాకొట్టు, త(క్నా. చిన్నగాకొట్టబడిన; మాల్తో. తకె. తాకు, నొప్పించు (పుండులా), తక్(వె. బాధపడు, దుఃఖపడు.

<మూ. ద్రా. *తక్-/*తయ్.

**తవిలించు** రూ.చూ. తగిలించు. స.క్రి. 1. బంధించు. శృం. నై. 2.15; 2. చిక్కించు, కట్టు. కాశీ. 5.192; 3. నిప్పు అంటించు, ముట్టించు. మను. 4.60. **తవులమి** రూ.చూ. తగులమి. వి. అంటమి, అసక్తత, నిస్సంగం, అంటకపోవటం. దశకు. 1.8. **తవులము** రూ. తగులము. వి. అనుబంధం, జంజాటం. బసవ. 3.60. **తవుల(బడు (-పడు)** రూ. తగుల(బడు, తొల(బడు. అ.క్రి. 1. నిరుద్ధమగు, ఆపబడు, అరికట్టబడు. భార. ఉద్యో. 2.195; 2. తాకు, కవియు, భార. ద్రోణ. 2.25; 3. చిక్కు, లగ్నమగు. భార. శాంతి. 2.124. **తవుల(బాఱు (-పాఱు)** స.క్రి. తగులుకొను. **తవులుకొను** రూ.చూ. తగుల్కొను. స.క్రి. వలచు, మోహించు. నీలా. 2.13. **తవులుకొలుపు** రూ. తగులుకొలుపు, తగులుకొల్పు, తవులుకొల్పు, తొలుకొలుపు, తొలుకొల్పు. స.క్రి. 1. రగులు కొల్పు. జైమిని. భా. 8.114; 2. తగులుకొనచేయు. **తవులుకొల్పు** రూ. చూ. తవులుకొలుపు. స.క్రి. 1. తగులుకొనచేయు; 2. రగులుకొల్పు. **తవులుకోలు** రూ. తగులుకోలు, తొలుకోలు. వి. తగులుకొనటం. **తవులుగొండి** రూ. తగులుగొండి. తొలుగొండి. వి. విటీవిటులను తగులుకొనేవాడు, తగులుకొనేది. **తవులుచు** రూ.చూ. తగులుచు. స.క్రి. చిక్కుకొనచేయు, లగ్నంచేయు, కూర్చు. ప్రభా. 5.41. **తవులుడు** రూ.చూ. తగులుడు. వి. తగలటం. **తవులుదల (-తల)** రూ. తగులుదల, తొలుదల. వి. తగలటం. **తవులుపడు** రూ.చూ. తగుల్పడు. అ.క్రి. 1. సక్తమగు, ఆసక్తినొందు; 2. లగ్నమగు, చిక్కుకొను, బద్ధమగు; 3. దొరుకు, లభించు, వశమగు; 4. నిరుద్ధమగు, ఆగు; 5. తాకు; 6. అంటు, నాటు. **తవులుపఱుచు** రూ.చూ. తగులుపఱుచు. స.క్రి. 1. సక్తంచేయు, విడువకుండచేయు; 2. నియమించు. ఏర్పరచు; 3. కూర్చు, లగ్నంచేయు. **తవులుపాటు** రూ.చూ. తగులుపాటు. వి. 1. తగులబడి, వ్యయం; 2. తగులబడటం. **తవులుబడి** రూ.చూ. తగులుబడి. వి. వ్యయం, వెచ్చం. **తవులువడు (-పడు)** రూ. చూ. తగుల్పడు. అ.క్రి. తగులుపడు. **తవుల్కొను** రూ. చూ. తగుల్కొను. స. క్రి. వలచు, మోహించు. **తవుల్చు** రూ. చూ. తగులించు. స.క్రి. చిక్కుకొనజేయు, కూర్చు. **తవుల్పడు** రూ.చూ. దగుల్పడు. అ.క్రి. 1. ఆగు, నిరుద్ధమగు; 2. లగ్నమగు, చిక్కుకొను; 3. పట్టువడు; 4. సక్తమగు; 5. దొరుకు; 6. అంటు, నాటు.

**తవుల్కొను** చూ. తవులు.

**తవుల్చు** చూ. తవులు.

**తవుల్పడు** చూ. తవులు.

**తవుళి** చూ. తవుడు[1]. వి. అబద్ధం.

**తవెల** రూ.చూ. తపెల. వి. నోరు వెడల్పుగా ఉండే కుండలాంటి లోహపాత్ర.

**తవ్వ[1]** రూ. త్రవ్వ. వి. రెండు సోలల కొలది గల మాన విశేషం. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 79. క్రీ.శ. 1118.

**తవ్వగాము** వి. తవ్వెడు జీతానికి పనిచేసేవాడు. **తవ్వెటికుండ** రూ. తవ్వెడికుండ, తవ్వెడుకుండ. వి. తవ్వెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర. **తవ్వెడికుండ** రూ.చూ. తవ్వెటికుండ. వి. తవ్వెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర. **తవ్వెడుకుండ** రూ.చూ. తవ్వెటికుండ. వి. తవ్వెడు బియ్యం ఉడికే మట్టిపాత్ర.

**తవ్వ[2]** చూ. దవ్వ[1]. వి. వంట చెరకుగా పనికివచ్చే కంపనిచ్చే ఒక రకం చెట్టు.

**తవ్వకము** చూ. తవ్వు.

**తవ్వాటము** చూ. తవ్వు.

**తవ్వికట్టుకొను** చూ. తవ్వు.

**తవ్వితండములు** రూ. తవ్విదండములు. విణ. బ.వ. కోటానుకోట్లు, అసంఖ్యాకాలు.

**తవ్వితలకెత్తు** చూ. తవ్వు.

**తవ్వితలకెత్తుకొను** చూ. తవ్వు.

**తవ్విదండములు (-తండములు)** రూ.చూ. **తవ్వితండములు.** విణ. బ.వ. కోటానుకోట్లు, అసంఖ్యాకాలు.

**తవ్వి(ద** రూ. తమిద, తమిదె, తమి(ద, తయిద, తవిద, తవి(ద, తైద. వి. సస్యవిశేషం, చోడిపైరు. భీమ. 3.57; 2. రాగిధాన్యం.

**తవ్వు** రూ.చూ. త్రవ్వు. స.క్రి. నేలను తొలుచు; వి. తవ్వటం.

**తవ్వకము** రూ. తవకం, తొవ్వకం, తోకం. వి. మిరప జొన్న మొ॥ తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమి గుల్లగా ఉండటానికి పారతో తవ్వటం. **తవ్వాటము** వి. తవ్వకం. **తవ్వికట్టుకొను** స.క్రి. దాచుకొను, తనకై మిగుల్చుకొను. తాళ్ల. సం. 7.37. **తవ్వి తలకెత్తు** స.క్రి. పెద్దగా కూర్చు. **తవ్వి తలకెత్తుకొను** స.క్రి. అనుభవించు. **తవ్వుకోల** రూ.

చూ. తవుగోల. వి. కలుపుతీసే పరికరం. **తవ్వుగోల(-కోల)** రూ.చూ. తవుగోల. వి. తవ్వే సాధనం. **తవ్వుడు** వి. తవ్వకం. **తవ్వోడ** వి. సముద్రంలో తవ్వే ఓడ. <తవ్వు + ఓడ.

**తవ్వెటికుండ** చూ. తవ్వ[1].

**తవ్వెడికుండ** చూ. తవ్వ[1].

**తవ్వెడుకుండ** చూ. తవ్వ[1].

**తవ్వోడ** చూ. తవ్వు.

**తసతి** వి. బంగారు రంగు నూగుకల లేత ఆకులు కల ఒకరకం చెట్టు (Erioglossum Edule).

**తసదికు** రూ.చూ. తసద్దీకు. వి. వార్షికం.

**తసద్దీకు** రూ. తసదికు. వి. వార్షికం.

హిం. *తసద్‌దుక్‌*. దానం, భక్తి, మంచి; మరా. *తస్‌దీక్‌*. దానం; ఉ. *తసద్‌దుక్‌*. కృప, దయ, అనుకంప, కానుక, దానం; పార. *తసద్‌దుక్‌*. త్యాగం, వితరణ; అర. *తసద్‌దుక్‌*.

<ఉ. తసద్‌దుక్‌.

**తసనాఅంచు** వి. పాత్రకు కోసుగా వెనక్కి వంచిన అంచు.

ఉ. *తశ్‌న*. డప్పికొన్న.

**తసనాకుండ** వి. కొంచెం ఎత్తుగా, గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతి వెడల్పుగా చేసిన మట్టి పాత్ర.

త. *తశ్‌న*. డప్పికొన్న.

**తసబీర** వి. వానాకాలంలో పెరళ్ళలోను, మెట్టపొలాల్లోను పెంచే తీగెపైరు (Luffa acutangula).

**తసరపు** రూ. తస్రపు. వి. అపహరించడం.

**తసరాసట్టి(-చట్టి)** వి. మూడు లేకుండా బోడంచుతో ఉండే చిన్న మట్టి పాత్ర.

**తసి** వి. దట్టమైన నారువరన, నడ.

**తసిరీమ్‌** వి. సలాం చేయటం. రంగా.చ. 2.49.

హిం. *తస్‌లీమ్‌*. సలాం, హామి; మరా. *తసల్‌*. వందనం, సంతోషం; ఉ. *తస్లీమ్‌*. పంపటం, సలాం చేయటం, ఆజ్ఞను పరిపాలించటం; పార. *తస్లీమ్‌*. వందనం, సలాం, భద్రత, ఇస్లాం మత స్వీకృతి; అర. *తస్లీమ్‌*. వందనం.

<ఉ. తస్లీమ్‌.

**తసు** రూ. తస్సు[4]. వి. ఒకటిన్నర అంగుళం.

మరా. *తసూ*. గజంలో ఇరవైనాలుగో భాగం; పార. *తసూ*. రెండంగుళాలు.

<మరా. తసూ.

**తసుకరి** చూ. తసుకు.

**తసుకు** వి. అసత్యం, టక్కు, మోసం. ఆం.భా. 1.119; అ.క్రి. 1. ప్రేమ కల్గినట్లు నటించు; 2. జారుకొను, తప్పించుకొను.

త. *తసుక్కు*.

**తసుకరి** వి. 1. టక్కులాడి. ఉ.హరి. 3.113; 2. టక్కులాడు. ఉ.హరి. 3.113. <తసుకు + -అరి[4]. **తసుకులాఁడి** వి. టక్కులాడి. <తసుకు + -లు + -ఆఁడి.

**తసులు** వి. ఒకరకం దగ్గు.

**తస్కర్ణి** చూ. తసు. రూ. దస్తకర్ణి. వి. ఒకటిన్నర అంగుళం పొడవుండే చిన్న కరణి.

**తస్తు** రూ. తస్సు[2], తొస్తు, తోస్సు. వి. మట్టితో చేసిన లోతైన పాత్ర.

క. *తస్తు*. లోహంతో చేసిన నీటి పాత్ర.

**తస్రపు** రూ.చూ. తసరపు. వి. అపహరించడం.

**తస్స** వి. దుర్మాంసం. చంద్రరే. 3.147. ఆం.భా. 2.131.

త. *తసై*. దుర్మాంసం; మ. *తళ*. మానుతున్న పుండు చుట్టూ పెరిగే కుండ.

**తస్సితట్టువారు** అ.క్రి. డస్సిపోవు. క్రీడా. 74.

ఉ. *తశ్‌న*. డప్పికొన్న.

**తస్సు[1]** రూ. త్రస్సు. వి. ముక్కోణం ఆకారంలో కొయ్యతోనో ఇనపబద్దీలతోనో నిర్మించిన చట్రం.

ఇం. *Truss*. ఇంటికప్పు, వంతెన మొ.వాటికి ఆసరాగా ఉండే చట్రం.

<ఇం. Truss.

**తస్సు[2]** రూ.చూ. తస్తు. వి. వెడల్పుగూడ బాన.

**తస్సు[3]** వి. తట్టు, వైపు, పక్క.

పో.చూ. నం. -తస్‌. నుంచి.

**తస్సు[4]** రూ.చూ. తసు. వి. ఒకటిన్నర అంగుళం.

**తహ** వి. సమ్మతి, అంగీకారం.

త. *తహై*. ప్రేమ.

**తహకత్తు** రూ. తాహతు. వి. శక్తి.

హిం.ఉ.పార.అర. *తాకత్‌*. శక్తి, బలం, సామర్థ్యం.

**తహకీదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తహతహ** వి. 1. తమస్సు, అజ్ఞానం. హర. 4.58; 2. చింత; వ్యధ, దుఃఖం. కాశీ. 1.112; 3. తమకం, కుతుకం. మను. 2.20; 4. వేగిరపాటు, తొందర. శుక. 2.488.

క. *తహతహ*; త. *తహైప్పు*.

**తహతహదీరు(-తీరు)** అ.క్రి. ఉత్కంఠతీరు. తాళ్ల. సంపు. 7.142 వ సంకీర్తనం. **తహతహపడు** అ.క్రి. క్షోభపడు, బాధపడు. ఉ.రా. 6.343. **తహతహపెట్టు** స.క్రి. తొందరపెట్టు, వేగిరపెట్టు. రామాభ్యు. 8.31.

**తహపడు** చూ. తహతహ. అ.క్రి. క్షోభపడు, బాధపడు. హంస. 3.109.

**తహబేలు[1]** రూ.చూ. తహవేలి. వి. పోల్చిచూడటం.

**తహబేలు[2]** రూ.చూ. తాఁబేలు. వి. తాబేలు.

**తహవేలి** రూ. తహబేలు[1], తహవేలు. వి. 1. మార్చటం, తారుమారు చేయటం; 2. పోల్చి చూడటం.

హిం. *తహ్‌వీల్‌*. మార్పు, అప్పగింత; ఉ. *తహ్‌వీల్‌*. తారుమారు, మార్పు, ప్రవేశం; పార. అర. *తహ్‌వీల్‌*. మార్పు, తారుమారు.

<ఉ. తహ్‌వీల్‌.

**తహవేలు[1]** రూ.చూ. తహవేలి. వి. పోల్చి చూడటం.

**తహవేలు[2]** రూ.చూ. తాఁబేలు. వి. తాబేలు.

**తహశీరుదారు** రూ.చూ. తహశీల్‌దారు. వి. శిస్తు వ్యవహారం చూసే ఉద్యోగి.

**తహశీలు** రూ.చూ. తహసీలు.వి. పన్ను, సిస్తు.

**తహశీల్‌దార్** రూ. తహశీరుదారు, తహశ్శీలుదారు, తహస్సీలుదారు, తాశీలుదారు, తాస్సీల్దారు. వి. శిస్తు వసూలు చేసే వాడు. రా.చ.

హిం. తహసీల్ దార్. పన్నులు వసూలు చేసేవాడు; మరా. తహసీల్ దార. భూమిపన్ను వసూలుచేసేవాడు; ఉ. తహసీల్ దార్. పన్ను వసూలుచేసే కచేరీ ఉన్నతోద్యోగి; పార. తహసీల్ దార్. శిస్తు వసూలు చేసేవాడు.

<ఉ. తహ్సీల్ దార్.

**తహశ్శీలు** రూ.చూ. తహసీలు. వి. పన్ను, సిస్తు.

**తహశ్శీలుదారు** రూ.చూ. తహశీల్‌దార్. వి. సిస్తు వ్యవహారం చూసే ఉద్యోగస్థుడు.

**తహసీలు** రూ. తహశీలు, తహశ్శీలు, తహస్సీలు, తహాసీల్. వి. పన్ను, శిస్తు. రా. చ.

హిం. తహ్‌సీల్. వసూలు, భూమిశిస్తు; మరా. తహశిల. భూమిపన్నును వసూలు చేయుట, శిస్తు; ఉ. తహ్‌శిల్. జిల్లాలో భాగం, పన్ను, కచేరి, శిస్తు; పార. తహ్‌శిల్. పోగుచేయటం, లాభం, శిస్తువసూలు చేయటం; అర. తహ్‌సీల్. పన్ను.

<ఉ. తహ్‌సీల్.

**తహస్సీలు** రూ. చూ. తహశీలు. వి. శిస్తు.

**తహస్సీలుదారు** రూ. చూ. తహశీల్‌దార్. వి. శిస్తువసూలు చేసేవాడు. రా. చ.

**తహాసీల్** రూ.చూ. తహశీలు. వి. పన్ను, సిస్తు.

**తాకట్టు** చూ. తాకు. వి. వడ్డీకి అప్పుతీసుకొనేటప్పుడు నమ్మకం కోసం అప్పుఇచ్చే వాడిదగ్గర ఉంచే వస్తువు. కాశీ. 4.108. వ్యు. అంటకూడనిది, ఉపయోగించ కూడనిది.

<తాకు+కట్టు.

**తాకట్టుంచు** స. క్రి. కుదువపెట్టు. **తాకట్టువడు (-పడు)** అ.క్రి. కుదువ ఉంచబడు. కాశీ. 4.108. **తాకట్టు వాకట్టుగుట** వి. యుక్తకాలంలో అప్పుతీర్చక పోవటంవల్ల తాకట్టుపెట్టిన వస్తువు అప్పిచ్చిన వాడి సొంతం కావటం. **తాకట్టువెట్టు (-పెట్టు)** స.క్రి. ఆధివెట్టు, కుదువపెట్టు. కాశీ. 4.100.

**తాకదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాకిడి** చూ. తాకు.

**తాకిదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాకీతు** రూ. తహకీదు, తాకదు, తాకిదు, తాకీదు, తాక్కదు, తాక్కీదు, తాఖీదు, తాహదు, తాహుదు. వి. 1. హుకుం. రాజ. వా. 104 పు.; 2. ఆజ్ఞాపత్రం.

హిం. ఉ. తాకీద్. ఆజ్ఞ, హుకుం; మరా. తాకీద. ఆజ్ఞ, హుకుం; పార. తాకీద్. ఆజ్ఞ, హుకుం, నిర్బంధం; అర. తాకీద్. వేగం, ఆజ్ఞ.

<ఉ. తాకీద్.

**తాకీదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాకు** రూ.చూ. తా(కు. వి. ఉంగరం మొ. జారిపోకుండా బంగారం మొ. వాటితో చేసి వేసుకొనే సన్ననిసాదా ఉంగరం. వేంక. పంచ. 1.114; స.క్రి. 1. తగులు, అంటు; 2. కొట్టు. వి. 1. స్పర్శ; 2. దెబ్బ.

హిం. తాక్. స్పర్శ.

**తాకిడి** వి. ఎద్దడి. <తాకు+-ఇడి. **తాకుడు** వి. బలం, శక్తి. **తాకుడుకాళ్ళవాడు.** వి. కాళ్ళు ఒకదానితో ఒకటి రాస్తూ నడచేవాడు. **తాకుతగులు** వి. అడ్డంకి. హరి. ఉ. 5.116. **తాకుసుడి** రూ. తావుసుడి. వి. నడిపీపున ఉండే సుడి. **తాకేయు** స.క్రి. నాగలి మొదలగు వాటిని దిగగొట్టి అమర్చి సిద్ధంచేయు. **తాకొను** అ.క్రి. ఎదురుపడు, తలపడు. **తాగడించు** స.క్రి. బాధించు, పీడించు. భాగ. 9.286. <తాకు+గడించు. **తాగల్లు** వి. బౌ. నూతిమీద అడ్డంగా వేసేకర్ర లేక రాయి. **తాగాడి** రూ.చూ. తాగా(డి. వి. 1. నీళ్ళతో పైకి వచ్చిన ఏతపు బొక్కెన అందుకొనే మనిషి నిలబడటానికి వీలుగా వేసిన కొయ్య లేక రాయి; 2. బావి మీద అడ్డంగా వేసే దుంగ. **తాగాడిసుయ్యి** వి. నేలమట్టాన ఉండేబావి. **తాగాడిబాయి** రూ.చూ. తాగాడిబావి. వి. నేల మట్టాన ఉండేబావి. **తాగాడిబావి** రూ. తాగాడిబాయి, తాగాడుబావి. వి. నేలమట్టాన ఉండే బావి. **తాగాడుబావి** రూ.చూ. తాగాడిబావి. వి. నేలమట్టాన ఉండే బావి. **తాగాణి** రూ.చూ. తాగా(డి. వి. నూతిముఖానికి అడ్డంగా రాతితో గాని, మానుతోగాని ఏర్పరచిన దూలం. **తాగా(డి** రూ. తాగాడి, తాగాణి, తాగా(డు, తాగా(డె. వి. 1. పీనాహం. ఇటుక మొ. వాటితో కట్టిన నూతి వారకట్టు; 2. నూతిపైన అడ్డంగా వేసేమాను, రాయి మొ. వాటిమూలం. < తాకు+కా(డి. **తాగా(డు** రూ.చూ. తాగా(డి. వి. నూతిమీద కొయ్య. **తాగా(డె** రూ.చూ. తాగా(డి. వి. **నూతిమీదికొయ్య.**

**తాకేయు** చూ. తాకు.

**తాకొను** చూ. తాకు.

**తాక్కదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాక్కీదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాఖీదు** రూ.చూ. తాకీతు. వి. 1. ఆజ్ఞ, హుకుం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 767. క్రీ.శ. 1680; 2. హుకుం. రంగా. చ. 2.78.

**తాగ(గలుగు** చూ. తాగు[1].

**తాగడ** వి. గంజిమొదలైన ఆహారం.

**తాగడించు** చూ. తాకు.

**తాగల్లు** చూ. తాకు.

**తాగా** వి. దారం, జరీపోగు.

దే. ప్రా. తగ్గ. దారం; ఒ. తాగ. దారం; హిం. ఉ. తాగా. జరీపోగు.

<ఉ. తాగా.

**తాగాడి** చూ. తాకు.

**తాగాడిసుయ్యి** చూ. తాకు.

**తాగాడిబాయి** చూ. తాకు.

**తాగాడిబావి** చూ. తాకు.

**తాగాడుబావి** చూ. తాకు.

**తాగాణి** చూ. తాకు.

**తాగా(డి** చూ. తాకు.

**తాగా(డు** చూ. తాకు.

**తాగా(డె** చూ. తాకు.

**తాగాయతి** రూ. తాగాయతీ, తాగాయెతీ, తాగ్యాతి. అవ్య. మొదలుకొని.

గు. తాగ. చివర ; మరా. తాగా ఈత్. పర్యంతం, మొదలుకొని ; పార. తాగాయత్. అంతవరకు.

< మరా. తాగాఈత్.

**తాగాయతీ** రూ.చూ. తాగాయతి. అవ్య. మొదలుకొని.

**తాగాయెతీ** రూ.చూ. తాగాయతి. అవ్య. మొదలుకొని.

**తాగితందనాలాడు** చూ. తాగు[1].

**తాగితందనాలుతొక్కు** చూ. తాగు[1].

**తాగినరొమ్మునుగ్రుద్దు** చూ. తాగు[1].

**తాగు[1]** రూ.చూ. త్రాగువు. స.క్రి. 1. నీళ్ళు మొ. వాటిని పానం చేయు ; 2. పొగపీల్చు.

**తాగ(గలుగు(-కలుగు)** రూ.చూ. త్రాగ(గలుగు. అ.క్రి. కూడు గుడ్డకు కొదవ లేకుండా ఉండు. < తాగు + -అ[7] + కలుగు. **తాగితందనాలాడు** అ.క్రి. చిందులుతొక్కు. **తాగి తందనాలుతొక్కు** అ.క్రి. చిందులు తొక్కు. **తాగినరొమ్మును గ్రుద్దు** స.క్రి. ఉపకారికి అపకారం చేయు. **తాగుడు** వి. సారా మొ. పానీయాలు తాగటం. **తాగు(బోతు (-పోతు)** రూ.చూ. త్రాగు(బోతు. వి. మితం తప్పి మద్యపానం చేసేవాడు.

**తాగు[2]** స.క్రి. 1. జీవనాధారంగా ఇచ్చు. ఎ. ఇం. 11. శా. సం. 35. క్రీ. శ. 700–800 ; 2. రక్షించు, సాకు. మాలెపాడు శాసనం. క్రీ. శ. 725.

క. తాంగు, జీవనాధారమిచ్చు.

**తాగేడు** రూ.చూ. తాఁగలి. వి. పల్లపుపొలం.

**తాగ్గూటం** రూ.చూ. తోకగూటం, ఊడ్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన ఇనపగూటం.

**తాగ్యాతి** రూ.చూ. తాగాయతి. అవ్య. మొదలుకొని.

**తాఁక(గనాడు** చూ. తాఁకు.

**తాఁకనాడు** చూ. తాఁకు.

**తాఁకించు** చూ. తాఁకు.

**తాఁకియుండల(చెడువారుకలుగు** చూ. తాఁకు.

**తాఁకు** రూ. తాకు. స.క్రి. 1. తగులు, అంటు. భార. ఆది. 2.108 ; 2. మార్కొను, ఎదుర్కొను. భార.ఆది. 3.29 ; 3. ఒరయు, రాచుకొను. శృం.నై. 2.123 ; 4. కొట్టు. హర. 5.16 ; అ.క్రి. 1. కవియు. కు.సం. 12.134 ; 2. కొట్టుకొను. భార. విరా. 2.134 ; 3. పొడము, కలుగు, సంభవించు. కాశీ. 2.108 ; 4. డయ్యు, బడలు, కృశించు. ప్రబోధ. 1.47 ; 5. లగ్నమగు. వి. 1. కలియటం, తాకటం. భార.ఉద్యో. 4.116 ; 2. దెబ్బ, హతి, ప్రహారం. భార.శల్య. 2.33 ; 3. వేసట, విసుగు. సు.శ. 9 ; 4. నిరోధం, అడ్డు. ఉ.హరి. 5.84 ; 5. పీడ, బాధ. ఆము. 6.7 ; 6. క్షతం, గాయం. కువ.చ. 4.188.

క. తాకు, తాగు, తాంగు. చేరు, తగులు, తాటు. అంటుకొను, కొట్టు, దెబ్బవేయు ; తు. తాకుని, తాగుని. ముట్టుకొను, తాచుని. కొట్టుకొను ; త. తాక్కు. సంబంధం కలుగు, తాకు, కొట్టు, అంటుకొను, కొట్లాడు, తాంకు. వ్యతిరేకించు, కొట్లాడు, అడ్డగించు ; మ. తాక్కుక. తగులు, అంటుకొను, తకుక్కుక, తయ్‌క్కుక. కొట్టటం, తైక్క. దెబ్బవేయు, తగులు ; కో. తాక్. కొట్టుకొను ; తొ. తొ.క్ (తొ.క్య.). తాకు, కోపంతో అరుచు ; కురు. తక్, మెల్లగా తట్టు ; మాల్తో. తక్. అంటుకొను, నొప్పించు.

< మూ.ద్రా. *తాయ్-న్క్-/తాయ్-క్క్-.

**తాఁక(గనాడు** అ.క్రి. మనసు నొచ్చేటట్లు పలుకు. భాస్క. రా. కిష్కిం. 2.65. < తాఁకు + -అ[7] + అగు + -అ[7] + ఆడు. **తాఁకనాడు** స.క్రి. మనసు నొచ్చేటట్లు మాట్లాడు. తాళ్ల. సంప. 12.3. < తాఁకు + -అ[7] + ఆడు. **తాఁకించు** రూ. టాకించు. స.క్రి. 1. తగిలించు, అంటజేయు, ముట్టజేయు. భీమ. 3.193 ; 2. శ్రమపెట్టు, ఆయాసపెట్టు. భోజ. 6.161. < తాకు + -ఇంచు[3]. **తాకియుండల(చెడువారు కలుగు** అ.క్రి. జోలికి వచ్చేవారుండు. పారి. 2.52. **తాఁకుడు** వి. తాకటం, స్పర్శ. సారంగ. 2.197. **తాఁకుడువే(కి** వి. విడుస్తూ తగులుతూ వచ్చే జ్వరం, మన్నెపు జ్వరం, వరుస మేరకు వచ్చే జ్వరం. **తాఁకుడప్పలు(-తప్పలు)** వి.బ.వ. దెబ్బకొట్టడం, తప్పించుకొనడం. రాజవా. 4.124. **తాఁకుదల(-తల)** వి. యుద్ధంలో ఎదుర్కొనటం, తలపాటు. భార. ద్రోణ. 5.250. **తాఁకుదెంచు (-తెంచు)** స.క్రి. కవియు, మార్కొను. భార. ఆది. 6.292. **తాఁకున(బడు** స.క్రి. అనుభవాన్ని పొందు. **తాఁకులాడు** స.క్రి. కొట్టుకొను, ఢీకొను. భాస్క.రా.యు. 1341. < తాఁకు + -లు + ఆడు. **తాఁకొను** స.క్రి. అంటుకొను, రగులుకొను, నార.పంచ. 3.286. < తాఁకు + కొను. **తాఁకొలుపు** స.క్రి. తాకచేయు, కదియ చేయు. సాం.బో. 3.29. **తాఁకోర్చు** అ.క్రి. ఒత్తుడు సహించు భార.విరా. 5.101. < తాఁకు + ఓర్చు.

**తాఁకొను** చూ. తాఁకు.

**తాఁకొలుపు** చూ. తాఁకు.

**తాఁకోర్చు** చూ. తాఁకు.

**తాఁగలి** రూ. తాగేడు. వి. పల్లపుమడి.

**తాచసిప్ప** వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అరడుగు లోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగా ఉండే మట్టి పాత్ర.

**తాచు[1]** స.క్రి. 1. ఖచించు, పొదుగు. హర. పీఠి. 10 ; 2. తొలుచు, మలచు. ఆము. 1.53 ; 3. తాపటంపెట్టు. శివలీ. 1.

త. తై(తైత్). కుట్టు, ముడివేయు (తీగ), అలంకరించు, ఉంచు, పొదుగు, వేచి ఉంచు ; మ. తైక్క. కుట్టు ; కువి. తాజ్. కుట్టు. తచ్. కుట్టు ; బ్రా. తఫ్. కట్టు.

< *తాయ్-.

**తాచు[2]** రూ.చూ. త్రాఁచు. వి. విషపూరితమైన ఒక పాము.

**తాచుపాముపగ** వి. మరచిపోని పగ.

**తాచ్చాడు** రూ.చూ. తచ్చాడు. అ.క్రి. తారాడు, సమీపించకుండా దూరదూరంగా ఉండి తిరుగు.

**తాచ్చారము** రూ చూ. తాత్సారము. వి. ఉపేక్షాభావం.

**తాజా** విశ. 1. నూతనమైన, కొత్త. పద్మ.యు. 49 ;

2. పైన రాయటం మరచి కింద రాసిన.

హిం. తాజా. వికసించిన, చెట్టునుంచి అప్పుడే కోసిన ఫలాదులు, కొత్త; మరా. తాజా. కొత్త, నవీనమైన. ప్రఫుల్లమైన; ఉ.పార. తాజా. కొత్త.

<ఉ. తాజా.

**తాజాకలము** వి. **1**. ఉత్తరం పూర్తయిన తర్వాత రాసిన రాత; **2**. పుస్తకం చివర, మరల రాసిన రాత.

**తాజాకుండ** రూ.చూ. తాళాకుండ. చూ. రాజా. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అరడుగు లోతుతో అంచు సన్నగా అరుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాజీము** వి. బహుమానం, సమ్మానం. భద్ర.శా. **14**, పద్మ. యు. 21.

హిం. తాజీమ్. సలాం చేయటం, సమ్మాన ప్రదర్శనం; మరా. తాజీమ్. గౌరవంగా చూడటం, బహుమానం; ఉ. తాజీమ్. ఆదరం, సత్కారం, సమ్మానం, ప్రతిష్ఠ ప్రణామం; అర. తాజీమ్. సమ్మానంగా చూడటం, బహుమానం.

<ఉ. తాజీమ్.

**తాజు** వి. **1**. కుల్లాయ; **2**. ఒకరకం టీవి.

హిం.ఉ. తాజ్. నవాబుటోపీ, తురాయి.

<ఉ. తాజ్.

**తాఁచు** చూ. తాఁకు. స.క్రి. **1**. తన్ను, పాదతాడనం చేయు. భార.ఆది. 6.299; **2**. అదుము, అణగదొక్కు. భాస్క. రా. ఆరణ్య. 2.118; **3**. తాకజేయు, తగిలేటట్లు విసిరి వేయు. భాస్క. రా. యు. **1434**; **4**. కొట్టు, తాడన మొనర్చు. భాస్క.రా. యు. 1501.

**తాట** వి.బ.వ. స్త్రీ కర్ణ భూషా విశేషం. ధనా. 3.37.

సం. తాటంక-. కర్ణభూషా విశేషం, చెవికమ్మ.

**తాటకి** వి. చాలా పెద్ద సైజు ఉలి.

సం. తాటకా. ఒక రాక్షసి. మారీచుని తల్లి.

<సం. తాటకా (అర్థవిపరి.).

**తాటకుఁడు** వి. మాయావి, టక్కరి. ద్వి.భార. 10.

సం. తాటకా. ఒక రాక్షసి, మారీచుని తల్లి.

<సం. తాటకా. (అర్థవిపరి.).

**తాటదమ్మఁడు** చూ. తాఁట[2]. వి. సన్యాస వేషధారి.

**తాటన** వి. కొట్టటం.

సం. తాడన-. కొట్టటం.

త. తాటుణమ్.

<సం. తాడన-.

**తాటనపుచ్చు** స.క్రి. కొట్టు, వాయించు. బసవ. 3.74పు. 520పం.

**తాటబాణము** చూ. తాటన. వి. ఒకవిధమైన బాణసంచు. హర. 3.28.

**తాటసము** వి. బాణాలు మొ. వాటికి తుప్పుపోవడానికి చమురు మొ. వాటితో మెరుగు పెట్టడం. పాండు. 5.

**తాటాకు** చూ. తాడు[1].

**తాటాకుచక్కెర** చూ. తాడు[1].

**తాటాకుచక్రాలు** చూ. తాడు[1].

**తాటాకుజబ్బు** చూ. తాడు[1].

**తాటాకులుకట్టు** చూ. తాడు[1].

**తాటాదూటము** విణ. సౌందర్యహీనమైన, అందంలేని. అప్ప. 4.382; వి. అతుకులపని, చక్కగా చేయనిపని.

**తాటికట్టువ** చూ. తాడు[1].

**తాటికట్టెడ** చూ. తాడు[1].

**తాటికర్రి** చూ. తాడు[1].

**తాటికల్లు** చూ. తాడు[1].

**తాటికాయ** చూ. తాడు[1].

**తాటిగడ్డ** చూ. తాడు[1].

**తాటిగిలిపాము** చూ. తాడు[1].

**తాటిచన్నులు** చూ. తాడు[1].

**తాటిచిదుగులు** చూ. తాడు[1].

**తాటిచెట్టాట** చూ. తాడు[1].

**తాటిచెట్టు** చూ. తాడు[1].

**తాటిచెల్లాట** చూ. తాడు[1].

**తాటించు** స.క్రి. **1**. మీటు. భార.కర్ణ. 3.183; **2**. కొట్టు, ఒకదానితో ఒకటి తాకించు. పండి.చ. 1.55పు; **3**. వాయించు, కలిపికొట్టు. శృం. నై. 7.46; **4**. చిందులు తొక్కు, నాట్యమాడు. హర. 7.88; **5**. కోపాదులచే దౌడలొకదానితో ఒకటికొట్టు, అప్పళించు. వరాహ. 12. 32; **6**. పొడుచు. మను. **4.115**; **7**. కదల్చు. చంద్రాంగ. 3.98; **8**. ఆలోచించు. చంద్రాంగ. 3.98; **9**. తటతట మనేటట్లు అల్లార్చు, విదుల్చు; **10**. తాపడం చేయు.

సం. తాడ-. తాడన-. కొట్టటం, దెబ్బ; ప్రా. తాడ-. తాడనంచేయు, పీడించు, ప్రేరేచు.

క. తాటు. ప్రతిగాకొట్టు, తాకు, సంబంధం కలుగు, కొట్టు; తు. తాంటుని. తాకు, కొట్టు, కొట్టుకొను, తగుసు, పోట్లాట, తాంటావుని. తాకు. పో. చూ. త. తట్టు.

<ప్రా. తాడ- + -ఇంచు[3].

**తాటిటెక్కెమువాఁడు** చూ. తాడు[1].

**తాటిడొల్దొర** చూ. తాడు[1].

**తాటిదండము** చూ. తాడు[1].

**తాటిదోనె** చూ. తాడు[1].

**తాటినార** చూ. తాడు[1].

**తాటిపడగవాఁడు** చూ. తాడు[1].

**తాటిపండు** చూ. తాడు[1].

**తాటిపిట్ట** చూ. తాడు[1].

**తాటిపేలు** చూ. తాడు[1].

**తాటిపేష్మ** చూ. తాడు[1].

**తాటిపోతగా** చూ. తాడు[1].

**తాటిబద్ది** చూ. తాడు[2].

**తాటిబాణము** చూ. తాడు[2].

**తాటిబెల్లము** చూ. తాడు[1].

**తాటిమట్ట** చూ. తాడు[1].

**తాటిమట్టతెగులు** చూ. తాడు[1].

**తాటిమదుం** చూ. తాడు[1].

తాటిమసర చూ. తాడు[1].
తాటిమానినీడ చూ. తాడు[1].
తాటింపు చూ. తాటించు. వి. 1. తన్ను, తాడనం. పి. శకు. 1.39 ; 2. తాకటం, పొడవటం, కొట్టు. హంస. 5.27.
తాటియాకు చూ. తాడు[1].
తాటియాకులచిలుకలు చూ. తాడు[1].
తాటిరిక్క చూ. తాడు[1].
తాటిరిక్కనెల చూ. తాడు[1].
తాటిలొట్టి చూ. తాడు[1].
తాటిల్లు చూ. తాడు[1].
తాటివెన్నులు చూ. తాడు[1].
తాటిసవుతురిక్క చూ. తాడు[1].
తాటిసిడము చూ. తాడు[1].
తాటిసిడముజోదు చూ. తాడు[1].
తాటిసిడమువాఁడు చూ. తాడు[1].
తాటు రూ.చూ. త్రాడు. వి. నారతో పేనిగాని నారకు పురిబెట్టిగాని తయారు చేసిన లావుపాటి నులక.
తాటేకంచు చూ. తాడు[1].
తాటేకు చూ. తాడు[1].
తాటేకుకమ్మి చూ తాడు[1].
తాటేకుతెగులు చూ. తాడు[1].
తాటేకుసదర చూ. తాడు[1].
తాటేక్కమ్మి చూ. తాడు[1].
తాటోటు రూ. టాటోటు. వి. వంచన, మోసం, టక్కు. సారంగ. 1.73 ; విణ. 1. వంచకుడైన. అచ్చ. రా. యు. 3.17 : 2. వంచకురాలైన. శుక. 3.18 ; 3. వంచకమైన. వేంక. మా. 5.38.

క. తటువటు. మోసథ, అసత్యం ; త. తాట్టోట్టుమ్, తాట్టోట్టు. మోసం, వంచన, గందరగోళం, కలవరం.

తాటోటుకాఁడు రూ.చూ. టాటోటుకాఁడు. వి. మాయావి, మోసగాడు.
తాట్నార చూ. తాడు[1].
తాడక రూ.చూ. తాలిక[2]. వి. ఒరలు, తొట్లు మొ. నవి చేయడానికి మూరెడు నిలువుతో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగా చేసిన మట్టిముద్ద.
తాడవ వి. జంటపొయ్యిలో పొయ్యికి పొయ్యికి పైభాగంలో మధ్యనుండే పల్చని దిమ్మ.

సం. తాడ-. కొట్టేది.

తాడవపెంకు వి. మట్టితోగాని ఇటికతోగాని గోడలాగా చేసిన పొయ్యి. తాడవరాయి వి. అము గోడకి, పొయ్యికి మధ్యలోనిరాయి.
తాడాకు చూ. తాడు[1].
తాడాతగిదిబారావిద్యలు వి.బ.వ. కపటం మోసంతో కూడిన విద్యలు.
తాడి రూ.చూ. తాటు. వి. తాళవృక్షం. నందంపూడి శాసనం. క్రీ. శ. 1053 (Borassus flabelliforenis).

తాడిగిలిపాము రూ.చూ. తాటిగిటిపాము. వి. తాటిచెట్టు మీద ఉండేపాము. తాడిసంపులు వి.బ.వ. తాటితోపులు. తాడితాల్పు వి. తాలాంతకుడు. అచ్చ. రా. యు. 64. తాడిదన్నెడువానినితల(దన్నువాఁడు విణ. ఒకనిమించిన ఇంకొకడు. కళా. 2.87. తాడిలొట్టి రూ. తాటిలొట్టి. వి. తాటిచెట్లకు కల్లు గీతకై కట్టేగుండ్రని చిన్నమట్టిపాత్ర. తాడిల్లుపాము వి. తాటిగిరిపాము, తాటిచెట్టు మీద ఉండే పాము. < తాడి + ఇల్లుపాము.
తాడిడిఫలంబు(గొనుట చూ. తాడు[1].
తాడిపత్రిపంచాయతిచెప్పు స.క్రి. ఇద్దరి తగవును పెద్దలుకలిసి అక్రమమైన తీర్పుచెప్పు. తాడిపత్రి గ్రామనామం.
తాడు[1]. రూ.చూ. తాటు. వి. బొ. తాటిచెట్టు. ఎ. ఇం. 5. శా. సం. 10. క్రీ. శ. 1102. కు. సం. 1.12.

తాటాకు రూ. తాటియాకు, తాటేకు, తాడాకు. వి. తాటిచెట్టుఆకు. శశా. 3.82. తాటాకుచక్కెర వి. బాలక్రీడ. తాటాకుచక్రాలు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. తాటాకుజబ్బు వి. పాండురోగం (?). తాటాకులుకట్టు స.క్రి. 1. ముగించు, కట్టిపెట్టు ; 2. ఎగతాళి చేయు, అపహాస్యం పట్టించు. తాటికట్టువ వి. హద్దుగా ఏర్పరచిన తాటిచెట్ల వరస. తాటికట్టెడ వి. తాటిగిరిపాము. తాటికర్రి వి. కాటికాయ నలుపు. తాటికల్లు వి. తాటిచెట్లనుండి తీసిన కల్లు. తాటికాయ వి. తాటిఫలం, తాటిచెట్టుకాయ. శృం. నై. 7.119. తాటిగడ్డ వి. నేలతాడిచెట్టు. (Curculigo orchioides). తాటిగిటిపాము రూ. తాడిగిటిపాము. వి. తాటిచెట్టుమీద ఉండేపాము. తాటిచన్నులు వి.బ.వ. గట్టిపడి మగతాడి గెలనుండి వేలాడే పూవులు. తాటిచిదుగులు వి.బ.వ. గట్టిపడి మగతాడి నుంచి వేలాడేపూలు. తాటిచెట్టాట వి. బాలక్రీడా విశేషం. దశా. 8.81. తాటిచెట్టు వి. తాడిచెట్టు, తాళవృక్షం. తాటిచెట్లాట వి. బాలక్రీడా విశేషం. సావి.చ. 1.117. తాటిటెక్కమువాఁడు వి. 1. భీష్ముడు. రామ రా. 330 ; 2. బలరాముడు. తాటిడాల్దొర వి. 1. బలరాముడు ; 2. భీష్ముడు. తాటిదండము వి. మల్లసాధన విశేషం. ప్రబంధ. 82. తాటిదోనె వి. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె. తాటినార రూ. తాట్నార. వి. తాటిచెట్టునుండి తీసిననార. తాటిపడగవాఁడు వి. 1. భీష్ముడు ; 2. బలరాముడు. తాటిపండు వి. తాళఫలం. కాశీ. 1.114. తాటిపిట్ట వి. ఒకరకం బూడిద రంగు పక్షి. (Artamus fuscus). తాటిపేలు రూ. చూ. తాటిపేళ్ళు. వి.బ.వ. ఒకరకం వడ్లు. తాటిపేళ్ళు రూ. తాటిపేలు. వి. ఒకరకం వడ్లు. తాటిపోతగా క్రి. విణ. ద్రు. అధికంగా ,కుండపోతగా. తాటిబెల్లము వి. తాటికల్లు వండి చేసే ఒకరకం బెల్లం. తాటిమట్ట వి. చిన్నతాడిచెట్టు. తాటిమట్టతెగులు వి. తాటాకుతెగులు, సకాలంలో వానలు లేక, ఆకులకొనలు తెల్లగా ఎండిపోయే తెగులు. తాటిమదుం వి. తాటిమాను తొలిచి చేసిన చెరువుతూము. తాటిమసర వి. తాటిపండు రంగు. తాటిమానినీడ వి. లేనిది, అతిస్వల్పమైంది. తాళ్ల. సంప. 7.34. తాటియాకు రూ.చూ. తాటాకు. వి. తాటిచెట్టు ఆకు. తాటియాకులచిలుకలు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. < తాడు[1] + ఆకుల చిలుక + -లు. తాటిరిక్క వి. జ్యేష్ఠానక్షత్రం. వ్య. తాటిచెట్టులాగ

కనిపించే నక్షత్రం. **తాటిరిక్కనెల** వి. జ్యేష్ఠమాసం. **తాటిలొట్టి** రూ.చూ. తాడిలొట్టి. వి. తాడిచెట్లకు కల్లుగీతకై కట్టే గుండ్రని చిన్న మట్టిపాత్ర. **తాటిల్లు** వి. తాటాకిల్లు. వాల్మీ. 2.103. <తాడు[1] + ఇల్లు. **తాటివెన్నులు** వి.బ.వ. గట్టిపడి మగతాడినుంచి వేలాడే పూలు. **తాటిసవతురిక్క**. వి. జ్యేష్ఠానక్షత్రం. **తాటిసిడము** వి. తాళధ్వజం. భార. భీష్మ. 1.275. **తాటిసిడముజోదు** వి. 1. బలరాముడు. నీలా. 3.50 ; 2. భీష్ముడు. **తాటిసిడమువాఁడు** వి. భీష్ముడు. ఆం. నా. సం. దేవ. 33. **తాటేకంచు** వి. బెత్తెడు వెడల్పున వేసిన అంచు. < తాడు[1] + ఆకు + అంచు. **తాటేకు** రూ.చూ. తాటాకు. వి. తాటిచెట్టుఆకు. **తాటేకుకమ్మి** రూ. తాటేక్కమ్మి. వి. బెత్తెడు వెడల్పున కడ్డీమాదిరిగా నేసిన ఏకాండికమ్మి. <తాడు[1] + ఆకు కమ్మి. **తాటేకు తెగులు** వి. తాటిమట్ట తెగులు. <తాడు[1] + ఆకుతెగులు. **తాటేకుసదర** వి. తాటాకులతో అల్లినచాప. <తాడు[1] + ఆకుసదర. **తాటేక్కమ్మి** రూ.చూ. తాటేకుకమ్మి. వి. బెత్తెడు వెడల్పున కడ్డీమాదిరిగా నేసిన ఏకాండీ కమ్మి. **తాట్నార** రూ.చూ. తాటినార. తాటికమ్మలు చితక గొట్టితీసిన నార. **తాడాకు** రూ.చూ. తాటాకు. వి. తాటిచెట్టుఅకు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 674. **తాడిడిఫలంబుఁగొనుట (-కొనుట)** వి. వెంటనే లభించని, శ్రమతో లభించే ఫలం అనుభవించటం. కు. సం. 1.12. వ్య. తాటిమొక్కనాటి దానిపండు తినటం. <తాడు[1]. + ఇడిఫలంబుఁగొనుట. **తాడుదన్నువారలఁదలఁదన్నువారు** విణ.బ.వ. ఒకరినిమించిన వారొకరు. రామాభ్యు. 1.181. **తాంటివ్రిక్షము** వి. తాడి చెట్టు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 674. సం. వృక్ష-. చెట్టు. <తాడు[1] + సం. వృక్ష. **తాళ్ళకట్టవ** వి. చేని చుట్టూవేసిన తాటిచెట్లకంచె.

**తాడు**[2] రూ.చూ. త్రాడు. వి. ద్రా. అనా. 1. రజ్జువు, పాశం, నారతోగాని, దారాలతోగాని లావుగా పేనిన పాశం. పల్నా. 20 ; 2. మంగళసూత్రం.

**తాటిబద్ది** వి. నాలుగుపోగులు కలిపి పురిపెట్టిన దారం. **తాటిబాణము** వి. తాడువెలిగించి విడిస్తే మండుతూ నూటిగా వెళ్ళే బాణానంచు. ప్రబంధ. 181, చంద్రాంగ. 2.105. **తాడుకొయ్య** రూ. తాడుగొయ్య. వి. 1. మగ్గం మీద నేతబిర్రు పెట్టటానికి, మోకుకట్టేకొయ్య ; 2. మగ్గం గుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య ; 3. నేతబయలులో చివరపాతిన కొయ్య. **తాడుకొలకడ** రూ. తాడుకొల్కడ. వి. గొంగడి నెయ్యటానికి చాపిన ఉన్నిపడుగ బిగింపుకు, మగ్గం తాడుతో తలగూటానికి వేసినకొలికి **తాడుకొల్కడ** రూ.చూ. తాడుకొలకడ. వి. గొంగడి నెయ్యటానికి చాపన ఉన్నిపడుగు బిగింపుకు, మగ్గం తాడుతో తలగూటానికి వేసినకొలికి. **తాడుగట్టినవాఁడు (-కట్టినవాఁడు)** విణ. వివాహం చేసుకొన్నవాడు. **తాడుగట్టు (-కట్టు)** స.క్రి. వివాహమాడు. **తాడుగుంజ** వి. మగ్గంమీద, నేత బిర్రుపెట్టడానికి మోకు కట్టేకొయ్య. **తాడుగూటం** వి. 1. నేతబయలులో చివరపాతినకొయ్య ; 2. గొంగడి నేసేమగ్గంతాడు బిగింపుకు పనివాడి కుడిచేతి దగ్గర, నేలలో పాతిన కొయ్య ; 3. ఉన్నిమగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతినకొయ్య. **తాడుగొయ్య** రూ.చూ. తాడుకొయ్య. వి. 1. మగ్గంమీదనేత బిర్రుపెట్టటానికి, మోకుకట్టేకొయ్య ; 2. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య ; 3. నేతబయలులో చివర పాతిన కొయ్య. **తాడుతెగు** అ.క్రి. 1. విధవ అగు ; 2. బాధకలుగు. **తాడుత్రెంచు** స.క్రి. కష్టపెట్టు. **తాడుపడు** అ.క్రి. బంధితమగు. తాళ్ల. సం. 9.280. **తాడుపాగడ** రూ. తాడుపాగడి. వి. అచ్చుకర్రమీద బిగించే కొండి తాడు పేనటానికి పనికివచ్చేనూలు. **తాడుపాగడి** రూ.చూ. తాడు పాగడ. వి. అచ్చుకర్రమీద బిగించే కొంకిడి తాడు పేనటావికి పనికి వచ్చే నూలు. **తాడుపేనుబండి** వి. పన్నె కట్టుబడిలో ఈనెలు బిగించటానికి వాడే దారంపురి పెట్టే కదురు. **తాడుబుట్టకొయ్య** వి. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకుకట్టేకొయ్య. **తాడుబేకొయ్య** వి. మగ్గంమీద నేతబర్రు పెట్టటానికి మోకుకట్టేకొయ్య. **తాడుబేనుపుల్ల** వి. పన్నెకట్టు బడిలో ఈనెలు బిగించటానికి వాడే దారంపురి పెట్టేకదురు. **తాడుమగ్గం** వి. ఒకరకం మగ్గం. **తాడులేనికట్టు** వి. ప్రేమబంధం. **తాడూపేడూలేనివాఁడు** విణ. ఏమీలేని వాడు. **తాడూబొంగరం లేనివాఁడు** విణ. ఏమీలేనివాడు. **తాడేనుగర్ర (-కర్ర)** వి. మగ్గం మీదనేత బిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య. **తాడోపేడోతేల్చు** స.క్రి. అటోఇటో పరిష్కరించు. **తాళ్ళకట్ట** వి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట. **తాళ్ళగుత్తి** వి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెండ్లు, మోకు, వారిణె, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట. **తాళ్ళపాములు** వి.బ.వ. తాళ్ళతో పాములల్లి బాలురు ఆడుకొనే ఒకఆట. హంస. 3.146. **తాళ్ళరాటి** వి. ఒకరకం రాటి.

**తాడూపేడూలేనివాఁడు** చూ. తాడు[2].

**తాడూబొంగరంలేనివాఁడు** చూ. తాడు[2].

**తాడేనుగర్ర** చూ. తాడు[2].

**తాడోపేడోతేల్చు** చూ. తాడు[2].

**తాణెము** వి. ఆక్రమించుకొన్న దుర్గాదుల్ని సేనలుంచి రక్షించటం. చంపూ. రా. 5.38, నీతి శ. 29.

సం. తాణ-, స్థానక-, స్థానిక- ; ప్రా. థాణయ-. గస్తుతిరగటం, థాణయో. గస్తుతిరిగేవాడు ; అ. మా. థాణాయం ;

త. తాణైయం.

<ప్రా. థాణయ-.

**తాణెముండు** అ.క్రి. దుర్గాదులకు రక్షణగాఉండు. కువ. చ. 3.96. <తాణెము + ఉండు. **తాణెములొనరించు** స.క్రి. దుర్గాదుల్ని రక్షించటానికి సేనలుంచు. నీతి. శ. 30. <తాణెము + -లు + ఒనరించు. **తాణెముసేయు (-చేయు)** స.క్రి. సేనతో దుర్గాదుల్ని రక్షించు. వరాహ. 5.6.

**తాంటివ్రిక్షము** చూ. తాడు[1].

**తాండవగిత్త** వి. నల్లమల కొండల ప్రాంతాల్లోని పొట్టిఎద్దు.

సం. తాండవ-. నాట్యభేదం.

**తాండవము** వి. కోపంతో చిందులు తొక్కటం.

నం. తాండవ-. నాట్యభేదం.

<నం. తాండవ-. (అర్థవిపరి.).

**తాండవించు** అ.క్రి. **1**. చంచలించు. శశా. 3.9 ; **2**. కోపంతో చిందులుతొక్కు. నం. తాండవ-+-ఇంచు[2].

**తాండవించు** చూ. తాండవము.

**తాండు** రూ.చూ. త్రాడు. వి. నారతో పేనిగాని నారకు పురి పెట్టిగాని తయారు చేసిన లావుపాటి నులక.

**తాండుగ** వి. చిన్న ఆకులు కలిగి తెల్లపూలు పూసే కడిమిచెట్టు (Lumnitzera racemosa).

**తాండురాయి** వి. తాండూరు ప్రాంతంనుంచి వచ్చే చలవరాయి. <తాండూరు+రాయి.

**తాండ్ర**[1] రూ.చూ. తాండి. వి. విభీతకం, తాడి, తెల్లని ఎర్రని కాయలుకాసే ఒకచెట్టు (Terminalia Bellerica). హంస. 4.11.

**తాండ్రకాయ** వి. తాండ్రచెట్టుకాయ. **తాండ్రచెట్టు** వి. ఒకరకంచెట్టు (Terminalia Bellerica). **తాండ్రవిత్తు** వి. తాండ్రవిత్తు.

**తాండ్ర**[2] చూ. తాడు[1]. వి. చాప మొ. వాటిమీద రాసి ఎండబెట్టిన తాడి, మామిడి పళ్ళరసం. రుక్మా. 1.132.

**తాండ్రపురుగు** వి. సాలెపురుగు.

**తాండ్రబీసలతీగె** వి. పులిదుంప (Dioscorea daemona).

**తాండ్రమాను** వి. కాండం మీద ముళ్ళుకలిగిన చెట్టు (Entada Scandens).

**తాఁట**[1] వి. **1**. రేకు. భాస్క. శ. 108 ; **2**. చర్మం. చెన్న బసవ. 4.155 ; **3**. చెట్టుపై పట్ట, బెరడు, విణ, పలచని దళంకాని.

క. తాటి. చెట్టుపై పట్ట.

**తాఁటదీయు (-తీయు)** స.క్రి. **1**. హింసించు ; **2**. తోలు ఒలుచు. **తాఁటపొద్దులు** వి.బ.వ. ఒకరకం కమ్మినేసిన చీరలు. **తాఁటబల్లకోడు** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్వడానికి వాడే నలప.

**తాఁట**[2] చూ. తాటోటు. వి. మోసం. గౌ. హరి. ఉ. 642పం.

**తాఁటకత్తె** వి. మోసకత్తె. గౌ. హరి. ఉ. 19.03 పం. **తాఁటదమ్మఁడు** వి. జీవనార్థంసన్యాసివేషం ధరించినవాడు. ద్వి. పరమ. వి. 4.299. **తాఁటసిరపడు** వి. కపట బ్రాహ్మణుడు.

**తాఁడి** రూ. తాండ్ర[1]. వి. విభీతకం, తాండ్రచెట్టు. భాస్క. రా. యు. 10.67.

క. తాడి. తాటి, తాఱె, తఱి ; తు. దాణ్డిమర ; త. తాన్ఱి, తాణి ; మ. తాన్ని. ; గోం. టాహ్కా, తాహ్కా ; పర్జి. దేన్ది, దేని (దేన్డ్-, దేన్-).

**తాఁడికాయ** వి. కఫం, దగ్గు, దాహం, వాంతి తగ్గించే ఒక కాయ.

**తాండె** రూ.చూ. తాటు[1]. వి. తాటిచెట్టు.

**తాత**[1]. వి. **1**. తండ్రి తండ్రి, పితామహుడు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ. శ. 898–934 (1900), భీమ. 1.10 ; **2**. వృద్ధుడు, ముసలివాడు. భార.ఉద్యో. 4.413 ; **3**. అధికుడు మించినవాడు. భాస్క.రా. యు. 319 ; **4**. వంశంలో మూలపురుషుడు. హర. 1.10 ; **5**. తల్లితండ్రి, మాతామహుడు. ఉ. రా. 2.224 ; **6** పూజ్యతావాచకం.

క. తాత. తాత, పూజ్యతావాచకం ; కొడ. త, తె. తాత ; తు. తాతె. తాత ; త. తాత్తా. తాత, తాతా. తాత, పూజ్యతావాచకం ; మ. తాతన్. పూజ్యతావాచకం ; పర్జి. తాత. పూజ్యతావాచకం.

పో. చూ. నం. తాత-. పూజ్యతావాచకం.

**తాతకుదగ్గులునేర్పు** స.క్రి. అనుభవజ్ఞుని దగ్గర అనుభవం లేనివాడు గొప్పలుచెప్పు. **తాతతాత**[1] వి. తాతకుతాత, వృద్ధప్రపితామహుడు. యయా. 1.91. **తాతమ్మ** వి. తాత తల్లి. **తాతలతరమునాఁడు** వి. అతిప్రాచీనకాలం. దశా. 7.206. **తాతలుదిగివచ్చు** అ.క్రి. అసంభవమగు. **తాతల్ గట్టినచెర్వులు** వి.బ.వ. తాముపర్యవేక్షణ చేయవలసినవి, వానిబాగోగులకు బాధ్యత వహింప వలసినవి.

**తాత**[2] వి. బ్రహ్మదేవుడు. ఉ. రా. 3.119.

నం. ధాతా. బ్రహ్మ.

తు. తాతె. బ్రహ్మ.

<నం. ధాతా.

**తాతతల్లి** వి. లక్ష్మి. వ్యు. బ్రహ్మకుతల్లి. **తాతతాత**[2] వి. విష్ణువు. సిం.హ. శ. 26. వ్యు. బ్రహ్మతండ్రి. నం. తాత-. తండ్రి. <తాత[2]+నం. తాత-. **తాతపనఁటివెల్లి** వి. గంగ. **తాతవేల్పు** వి. బ్రహ్మదేవుడు. శృం. నై. 4.126.

**తాత్పర్యము** వి. భక్తిశ్రద్ధలు. హర. పీఠి. 8.

నం. తాత్పర్య-. అభిప్రాయం, ఉద్దేశం, భా.నం. ఆసక్తి.

నం. తాత్పర్య-. (అర్థవిపరి.).

**తాత్సారము** రూ. తాచ్చారము. **1**. జాగు ; **2**. ఉపేక్షా భావం.

**తాన** రూ.చూ. తాను[3]. వి. తివాసీ నేతలో నిలువుకు వాడే నూలు.

**తానపోయు** స.క్రి. తివాసీ నేతలో నిలువుకు వాడే నూయిలో కింది పోగులకు, పైపోగులకు మధ్య అనులు పడేట్టు అనుపోయు.

**తానం**[1] రూ.చూ. తానకం. వి. పాదు, మొక్కనాటి నీళ్ళు నిలువటానికి చుట్టూరా కట్టిన పళ్ళెం.

**తానంపట్టె** వి. గిలకను బిగించడానికి వీలుగా బావిమీద వేసిన అడ్డుకొయ్య.

**తానం**[2] వి. మూపుమీద ఉండేసుడి.

నం. స్థాన-. చోటు ; ప్రా. థాణ-.

<ప్రా. థాణ-.

**తానపుసుడి** వి. మూపురంమీద ఉండే సుడి.

**తానకం** రూ. తానం[1]. వి. పాదు, మొక్కనాటి నీళ్ళు నిలవ టానికి చుట్టూర కట్టిన పళ్ళెం, ఉనికిపట్టు.

నం. స్థానక-. ఆలవాలం, ప్రదేశం ; ప్రా. థాణగ-, థాణయ-.

<థాణగ.

**తానకము** వి. **1**. తావు, నెలవు, స్థానం. కు.నం. 5.105 ; **2**.

మల్లయుద్ధంలో జెట్లు నిలబడటంలోని భేదం, స్థాన భేదం. భార.విరా. 2.14; **3.** వినయాభినయం, దండప్రణామం. గౌ. హరి. పూ. 1186 పం.; **4.** తులామానంలో దాళా సరిపుచ్చటానికి ఉపయోగించే రాయి, పడికట్టు రాయి. తారక. 1.

సం. స్థానక-. ఆలవాలు, ప్రదేశం, శరీరచేష్టావిశేషం; ప్రా. థాణగ-, థాణయ-.

<ప్రా. థాణగ.

**తానతానగు** చూ. తాను[1].

**తానదీవియలు** చూ. తానము[2].

**తానపుసుడి** చూ. తానం[2].

**తానము**[1] వి. మజ్జనం, స్నానం. కాశీ. 2.49.

సం. స్త్నాన-, స్నాన-. స్నానం; ప్రా. ణ్హాణ-, సణాణ-, సిణాణ-, సినాన-; శౌ. ణ్హాణ-; అమా. ణ్హాణ-, న్హాణ-, సిణాణం-; పా. నహాన-, న్హాన-; అప. ణ్హాణ-; మరా. నహాణ్, న్హాన్.

క. తానమ్; తు. తాణ; త. తానమ్, నానమ్.

<సం. స్నాన-.

**తానము**[2] వి. స్థానం, తావలం. రాజవా. 2.16.

సం. స్థాన-. చోటు, ప్రదేశం; ప్రా. థాణ-. స్థితి, చోటు, ఆశ్రయం; అమా. ఠాణ-, థాణ-. నివాసం, ప్రకారం; పా. ఠాణ-; అప. ఠాణ.

క. టాణ, తాణ; తు. తాణ, తాన; కుఇ. టాణ. నేల.

<ప్రా. థాణ-.

**తానదీవియలు** వి.బ.వ. సానదీపికలు. కు.సం. 12.14.

**తానవరుసలు** వి.బ.వ. తానంయొక్క వరసలు. దశా. 1.264.

సం. తాన-. స్వరం.

<సం. తాన- + వరుస + -లు (మిశ్ర.స.).

**తాని**[1] వి. తోళ్ళు పదునుచెయ్యటానికి ఉపయోగపడే పళ్లు. కాసే చెట్టు (Terminalia Belerica).

**తాని**[2] రూ.చూ. తానె. వి. పడుగునూలు పోసే కొయ్య.

**తానికాలు** రూ.చూ. తానెకాలు. వి. ఆనుపీట బిగించిన పొడుగుపట్టె. **తానికోల** రూ.చూ. తానెకోల. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. **తానికోల కట్టెతాడు** రూ.చూ. తానెకోల కట్టె తాడు. వి. మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం. **తానికోలు** రూ.చూ. తానెకోల. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందకి లాగే కర్ర. **తానిపట్టె** రూ.చూ. తానెపట్టె. వి. ఆసుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె. **తానిషల్ల** రూ.చూ. తానెపల్ల. వి. అనుపీటలకు దిగగొట్టిన నిలువుపల్ల. **తానిరేషం** వి. నాసిరకం పట్టు. హిం. రేషమ్. పట్టు. <తాని + హిం. రేషమ్.

**తాను**[1] వి. ఆత్మార్థక ఏకవచనం. భార.ఆది. 3.201.

క. తాన్. అతడు, ఆమె, అది; కొడ. త.ని. తాను; తు. తాను. తాను, తనను; త. తాన్. తాను; మ. తాన్. తాను, తనను; కో. త.న్. తాను; తొ. తొ.న్. తాను; గోం. తనా, తన్వా. తాను; కుఇ. తాను. అతనే, ఆమే. కువి. తనూ, తాను. తాను, తనను; పర్జి. తాన్. తాను; తనను; కొలా. త.న్. తాను, తన్నె(తనె). తాను; గ. ఒల్లా. తాన్. తాను, తనను; కురు. తాన్. అతనే; మాల్తో. తన్, తని. అతనే, ఆమే, అదే; బ్రా. తేన్. తాను, తేనా-ఈ. తనకు సంబంధించిన.

<మూ.ద్రా. *తాన్.

**తన**[1] సర్వ. **1.** ప్రథమాంతాలైన తాను, తాము తారు రూపాలు కొన్ని చోట్ల పాదపూరకాలుగా ఉపయుక్తాలు. భార.ఆది. 1.9; **2.** తచ్ఛబ్దార్థకం. భార.ఆది. 3.110; **3.** కొన్నిచోట్ల బహుత్వంలోగూడ ఏకవచన రూపంలో ఉంటుంది. కు.సం. 10.530; **4.** అస్మదర్థకం. భార. శాంతి. 6.134; **5.** యుష్మదర్థకం. **తనకాళ్ళపై నిలబడు** అ.క్రి. ఒకరి ఆధారం లేకుండా జీవించుట. **తనకు(దాన** అవ్య. స్వయంగానే, పరాపేక్ష లేకుండానే, అసహాయులుగా ఉండే. భార.ఆది. 4.77. **తనతన** సర్వ. **1.** మీమీ. భార.విరా. 4.89; **2.** వారివారి. భార.భీష్మ. 1.175. **తనతనయంత** అవ్య. ప్రత్యేకంగా, ఇతర సంబంధం లేకుండా. భార.శాంతి. 6.22. **తననీడకడమ(గ(బొఅనేర్చు** స.క్రి. అసాధ్య కార్యాల్ని చేయటానికి తలపెట్టు. పండి.చ. 1.2 పు. 359. **తనంతటివా(డు** విశ. **1.** తనతో సమానుడు, కాశీ. 1.108; **2.** పెద్దహోదాలో ఉన్నవాడు. **తనంత తాను** సర్వ. స్వయంగా, కోరబడకుండా. మను. 2.66. **తనంతన్** రూ.చూ. తనయంతన్. అవ్య. **1.** స్వయంగా. కోరబడకుండా. కళా. 4.69; **2.** వేరుగా, పృథక్కుగా; **3.** అసహాయంగా, పరాపేక్ష లేకుండా; **4.** తనకుతానే, ఎవరినీ అడగకుండానే; **5.** యథేచ్ఛగా; **6.** స్వయంగా. పరప్రయత్నం లేకుండా. **తనంతనేయగు(-అగు)** అ.క్రి. ఒకరి ప్రయత్నం లేకుండానే అగు. కళా. 3.193. **తనయంతన్** రూ. తనంతన్. అవ్య.ద్రు. **1.** వేరుగా, పృథక్కుగా. భార.ఆది. 2.128; **2.** తనకుతానే, ఎవరిని అడగకుండానే. భార. విరా. 3.38; **3.** స్వయంగా, పరప్రయత్నం లేకుండా. ప్రభా. 5.44; **4.** అసహాయంగా, పరాపేక్ష లేకుండ; **5.** యథేచ్ఛగా; **6.** కోరబడకుండా. **తనవారి తనము** వి. ఆత్మీయత, సన్నిహిత బాంధవ్యం, దగ్గరి చుట్టరికం. కాశీ. 6.60. **తనవారుకానివారు** సర్వ. బ.వ. హితులు, అహితులు. హంస. 5.114. **తనసొమ్మనితల(చు** స.క్రి. తనదే అని భావించు. శుక. 1.420. **తనుంగానిది** విశ. తనకు సంబంధం లేనిది, ఉదాసీన భావంతో ఉన్నది. సారంగ. 3.136. **తను(దాన(-తాన)** అవ్య. స్వయంగా, అన్యకృతం కాకుండ. మను. 2.55. **తను(దానె(-తానె)** అవ్య. స్వయంగా, అన్యకృతం కాకుండ. ద్వి.పరమ. వి. 1.31 పు. 3 పం., 286 పు. 10 పం. **తన్నందినవారు తనంతలు** వి.బ.వ. గొప్పవారిని ఆశ్రయిస్తే గొప్పవారే అవుతారు అనే చోట వాడే పలుకుబడి. కళా. 2.104. **తన్ను(దానెఱు(గకుండు** అ.క్రి. ఒళ్ళు ఎరుగకుండా ఉండు. స్మృతితప్పి ఉండు. విప్ర. 4.44. **తన్నుమించినదే సముద్రము** వి. తనకు నచ్చినదే గొప్పది. శుక. 3.129. **తన్నేలినవా(డు** విశ. తన ఏలిక లేదా స్వామి ఐనవాడు. కు.సం. 10.86.

తానతానగు అ.క్రి. తనకు తానై ఉండు. స్వయంప్రేరితు డగు. శివరా. 1.68. < తాను¹ + తాను¹ + అగు.

తానుతాను సర్వ. తనకుతానే. శివరా. 1.71. తానై అవ్య. 1. అప్రయత్నంగా, తనంతటతాను. భార.భీష్మ. 1.202; 2. స్వయంగా. కవిక. 2.47.

తాను² వి. స్పష్టత. బసవ. 3.932.

తాను³ రూ. ఠాను. ఠాన. వి. 1. ఇరవైనాలుగు గజాల పొడుగుండే చొక్కాల గుడ్డ; 2. తివాసీ నేతలో నిలువుకు వాడే నూలు.

ఒ. హిం. ఉ. థాన్. చుట్టగా చుట్టబడిన పొడవైన బట్ట.

< ఉ. థాన్.

తానుపల్ల వి. చేతినాడెగాడిలో అడ్డంగా బిగించిన పల్ల.

తానె రూ. తాని². వి. పడుగు నూలుపోసే కొయ్య పనిముట్టు.

తానెకట్టె చూ. తానెకోల. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. తానెకాలు రూ. తానికాలు. వి. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె. తానెకొయ్య రూ. తానెగొయ్య. వి. అనుపీటకు దిగగొట్టిన నిలువుపల్ల. తానెకోడు రూ. టానికోడు. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర. తానెకోడుతాడు వి. పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు. తానెకోల రూ. తానికోల, తానికోలు. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. తానెకోలకట్టెతాడు రూ. తానికోల కట్టె తాడు. వి. మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం. తానెగుదితాడు వి. మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం. తానెగొయ్య (-కొయ్య) రూ.చూ. తానెకొయ్య. వి. అనుపీటలకు దిగగొట్టిన నిలువు పల్ల(లు). తానెదొడ్డి వి. అనుపీటల మధ్య సందు. తానెపట్టె రూ. తానిపట్టె. వి. అనుకొయ్య (= అనుకు బిగించిన నిలువు పల్ల)లకు ఆధారంగా ఉండే అడ్డపట్టె. తానెపీట వి. అనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె. తానెపల్ల రూ. తానిపల్ల. వి. అనుపీటలకు దిగగొట్టిన నిలువు పల్ల.

తానై తాను¹.

తాన్కు రూ.చూ. తణ్కు. స.క్రి. ఎదుర్కొను, పెదతిప్ప సముద్రం. మదనపల్లి తా. చిత్తూరు జిల్లా. క్రీ.శ. 820-25.

తాప¹ రూ.చూ. తాపరము. వి. 1. సోపానం, మెట్టు, పాపంచ. వరాహ. 1.122; 2. మణి, రత్నం. వరాహ. 3.65; 3. నిచ్చెన, నిశ్శ్రేణి. పారి. 2.93; 4. ఎక్కడానికి దిగడానికి వీలుగా కట్టిన నిర్మాణం; 5. బట్టీపైకి ఎక్కడానికి మెట్లకు బదులుగా కట్టిన వాలుగోడ.

తాపపొట్టింపు తలుపు వి. మూలలనుంచి మధ్య భాగానికి మెట్లుమెట్లుగా చెక్క పొటమరించినట్లు చెక్కి, చట్రంలో బిగించిన చెక్కలతలుపు. తాపలగూడు వి. మెట్లకు ఎండ వాన తగలకుండా కప్పులు పెట్టిన గూడు. తాపలువెట్టు (-పెట్టు) అ.క్రి. మెట్లుకట్టు. మల్హ. 2.41.

తాప² రూ. టాప. వి. గొర్రు, గుంటక మొ॥ వాటి అడ్డమీద బిగువుకు పరిచిన ఇనపరేకు.

తాపకము వి. పోటి.

సం. స్థాపక-. స్థాపించేది; ప్రా. థావఅ-.

< సం. స్థాపక-.

తాపగొను(-కొను) స.క్రి. సహించు. కు.సం. 5.44.

సం. తాప-. వేడిమి, బాధ, కష్టం.

< సం. తాప- + కొను.

తాపటిమేకు వి. 1. అడ్డగడియ; 2. రెండు పలకల్ని కలిపే మేకు.

సం. స్థాపన-. నిలబెట్టేది; ప్రా. థావణ-, థావణా. అడ్డగడియ.

< ప్రా. థావణ- + మేకు.

తాపత్రయము వి. 1. ఆత్రుత; 2. కష్టం.

సం. తాపత్రయ-. ఆధిభౌతికం, ఆధిదైవికం, ఆధ్యాత్మికం.

< సం. తాపత్రయ- (అర్థవిపరి.).

తాపనకొయ్య వి. అనుపొడుగు పీటమీద అమర్చిన కొయ్య.

సం. స్థాపన-. నిలబెట్టేది; ప్రా. థావణ-, థావణా. అడ్డగడియ.

< ప్రా. థావణ- + కొయ్య.

తాపరము రూ. తాప¹. వి. మెట్టు, సోపానం. పి.శకు. 1.86.

తాపసి వి. తపస్వి, ముని. చంపూరా. 3.18.

సం. తాపసీ-. తపస్సుచేసేస్త్రీ.

< సం. తాపసీ (అర్థవిపరి.).

తాపి¹ చూ. తావు. రూ. తాపీ¹. వి. 1. సంకేతస్థలం, రహస్య స్థానం. సిం.ద్వా. 9.19; 2. సంకేతం, రహస్యం; 3. జాడ; 4. విటీవిటులను సంధానంచేయటం; 5. స్థైర్యం.

తాపిక రూ.చూ. తాపికత్తె. వి. తార్పుగత్తె, కుంటెనకత్తె. హంస. 5.135. తాపికత్తియ రూ.చూ. తాపికత్తె. వి. తార్పుడుకత్తె, కుంటెనకత్తె. తపతీ. 3.75. తాపికత్తె రూ. తాపిక, తాపికత్తియ. వి. తారుపుకత్తె, సంధానంచేసేది. ఆము. 5.70. తాపికా(డు వి. 1. ఆచూకీ ఇచ్చేవాడు. భార.ఆది. 4.261; 2. విటీవిటులను తార్చేవాడు, సంధానకర్త. చంద్రాంగ. 5.33. తాపిచేయు స.క్రి. సంధానంచేయు, తార్చు. తాపిచోటు వి. సంకేతస్థలం, రహస్యస్థానం. శుక. 2.368. తాపియిల్లు (-ఇల్లు) వి. రహస్యగృహం, సంకేతశాల. శుక. 3.124.

తాపి² రూ.చూ. తాపీ². వి. 1. ఇటుక సున్నం మొ॥వాటితో ఇళ్ళు మొ॥ కట్టడానికి ఉపయోగించే సాధనం; 2. తాపీ పనివాడు; 3. పడవ అటూ ఇటూ ఒరిగిపోకుండా దాని అడుగున వేసే బరువు.

తాపివా(డు రూ.చూ. తాపీవా(డు. విణ. సున్నం పూసే వాడు.

తాపించు చూ. తావు¹.

తాపిత రూ. తాపితా, తాపు², తాపెత, తాఫ్తా. వి. మేలైన పట్టుపస్త్రం, ప్రశస్తకౌశేయం. వాల్మీ. 1.94.

హిం. తాఫ్తా. మేలైనపట్టువస్త్రం, నెమలిమెడ వన్నె పట్టు బట్ట; మరా. తాఫ్తా, తాఫ్తా. ఒకరకమైన పట్టుబట్ట; ఉ. తాఫ్తా. ఒకవిధమగు పట్టుబట్ట; పార. తాఫ్తా. ఒకవిధమైన పట్టువస్త్రం.

< ఉ. తాఫ్తా.

**తాపితా** రూ.చూ. తాపిత. వి. మేలైనపట్టువస్త్రం, ప్రశస్త కౌశేయం. శుక. 4.22.

**తాపీ**[1] రూ.చూ. తాపి[1]. వి. **1**. సంకేతస్థలం, రహస్యస్థానం ; **2**. సంకేతం, రహస్యం ; **3**. జాడ ; **4**. విటీవిటులను సంధానం చేయటం ; **5**. స్థైర్యం.

**తాపీ**[2] రూ. టాపీ[2], తాపి[2], తాపు[3], తాపె. వి. **1**. ఇటుక సున్నం మొ॥వాటితో ఇళ్ళు మొ॥ కట్టడాని కుపయోగించే సాధనం ; **2**. తాపీపనివాడు ; **3**. పడవ అటూ ఇటూ ఒరిగిపోకుండా దాని అడుగున వేసే బరువు.

హిం. ఉ. థాపీ. సున్నం గచ్చు చేయటానికి ఉపయోగించే సాధనం.

< హిం. థాపీ.

**తాపీదిమ్మ** వి. కొయ్యతో చేసిన తాపి. **తాపీబల్ల** వి. కొయ్యతో చేసిన తాపి. **తాపీరేకు** రూ. టాపీరేకు. వి. తాపీలోని పలచటి లోహభాగం. **తాపీవాఁడు** రూ. తాపివాఁడు. విణ. సున్నం పూసేవాడు.

**తాపు**[1] చూ. తాచు. స.క్రి. **1**. చెక్కు, ఖచించు, పొదుగు. క్రీడా. 39 ; **2**. అదుము, నొక్కు. భాగ. 10 పూ. 1060 ; **3**. ఒరలనుకలుపు ; **4**. తగులుకొనేటట్లుచేయు.

సం. స్థాప-; ప్రా. థావ, థప్పియ. ఉంచబడినది, న్యస్తం ; అప. థప్పి ;

క. తావిసు. స్థాపించు.

**తాపించు** చూ. తాచు. రూ. టాపించు. స.క్రి. **1**. పొదుగు, కూర్చు, అమర్చు. భాస్క.రా.ఆరణ్య. 2.158, శృం.నై. 6.44 ; **2**. మోదు. కాశీ. 7.91 ; **3**. నెలకొలుపు, నిలుపు. విష్ణుపు. 3 ఆ. **తాపుగ** క్రి.విణ. సమీపంగా, చేరువగా. E.I. సంపు. 4. శా.సం. 25. క్రీ.శ. 1548. **తాపుచెక్క** వి. మరమగ్గం నొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **తాపుదాను** రూ. తాప్దాను, తాబ్దానం, దాపుదాను. వి. చిన్నకిటికీ, జాలికిటికీ బదులుగా బిగించే రంధ్రాలున్న సిమెంటుపలక. **తాపెన** రూ. చేపను. వి. బట్టి చుట్టూ పేర్చిన ఇటుక. **తాప్దాను** రూ.చూ. తాపుదాను. వి. చిన్నకిటికీ, జాలికిటికీ బదులుగా బిగించే రంధ్రాలున్న సిమెంటుపలక. **తాబ్దానం** రూ.చూ. తాపుదాను. వి. చిన్నకిటికీ, జాలికిటికీ బదులుగా బిగించే రంధ్రాలున్న సిమెంటుపలక.

**తాపు**[2] రూ.చూ. తాపిత. వి. పంచలజత.

**తాపు**[3] రూ.చూ. తాపీ[2]. వి. బేల్దార్లు కట్టుబడి చేయటంలో వాడే ప్రధాన సాధనం.

**తాపె** రూ.చూ. తాపీ[2]. వి. పచ్చికుండలకు పూజలు పెట్టడానికి ఉపయోగించే ఇనపరేకు.

**తాపెత** రూ.చూ. తాపిత. వి. మేలైన పట్టువస్త్రం. దశా. 7.30.

**తాపెన** చూ. తాపు[1].

**తాప్తా** రూ.చూ. తాపిత. వి. మేలైన పట్టువస్త్రం. ప్రబంధ. 605.

**తాప్దాను** చూ. తాపు[1].

**తాబందు** వి. పావడ, గాగర. వసువ్యా. 4.23.

ఉ. తహ్‌బంద్. కింద ధరించే వస్త్రం, అధోవస్త్రం, లుంగీ ; పార. తహ్‌బన్ద్. నడుముకి చుట్టుకొనే వస్త్రం.

< ఉ. తహ్‌బంద్.

**తాబి** వి. ఎండాకాలంలో వేసే వరిపంట.

హిం.ఉ. తాబ్. కాంతి, శక్తి.

**తాబు** వి. రావుకాగితం. బే.ప. 59.

హిం.ఉ. తా. రావుకాగితం ; పార. తా. కాగితంలో భాగం, రావుకాగితం.

< ఉ. తా.

**తాబుడుబిందె** చూ. తాపు[1]. వి. మూతి చిన్నదిగా ఉండే మట్టి పాత్ర.

**తాబే** వి. అధీనం, వశం.

హిం. ఉ. తాబే. అధీనం, వశం ; పార. తాబి, తాబిఈ. అనుచరుడు, అధీనుడు ; అర. తాబే. అనుచరుడు, వశవర్తి.

< ఉ. తాబే.

**తాబేదారు** రూ. తాబేదారుఁడు. వి. తక్కువపనివాడు, తనకింద సేవకుడు.

హిం.ఉ. తాబేదార్. సేవకుడు.

< హిం. తాబేదార్.

**తాబేదారుఁడు** రూ.చూ. తాబేదారు. వి. **1**. సేవకుడు ; **2**. తొత్తు, మద్దతుదారు.

**తాబ్దానం** చూ. తాపు[1].

**తామ** వి. వంతెన చివర లేదా నదిఒడ్డు.

సం. స్థాన-. చోటు ; ప్రా. ధామ-.

< ప్రా. థామ-.

**తామర**[1] రూ. తామెర. వి. **1**. శరీరంలో పద్మాకారంగా ఉండే షట్చక్రాల్లో ఒకటి. విక్ర. 2.248 ; **2**. పద్మం, తమ్మి. నీలా. 3.7.

క. తామరె, తావరె. పద్మం, కమలం ; కొడ. తవరె. పద్మం, కమలం ; తు. తామరె ; త. తామరై, తమ్మి ; మ. తామర ; కువి. తంబెరి ; పర్జి. తామర్.

పో.చూ.సం. తామరస-. పద్మం, కమలం.

**తామరకంటి** వి. **1**. పద్మాక్షి, స్త్రీ. అచ్చ.రా.బాల. 183 ; **2**. భార్య. అచ్చ. రా. ఆరణ్య. 105 ; **3**. పద్మాక్షుడు, విష్ణువు. **తామరకమలం** వి. అంచులో తామరాకు, తామరపువ్వుల బొమ్మలు నేసిన డిజైను. **తామరకెంపు** వి. పద్మరాగమణి, లోహితకం. యయా. 1.25. **తామరచూలి** వి. కమలగర్భుడు, బ్రహ్మ. హరిశ్చ. 4.157. **తామరచెలి** వి. పద్మమిత్రుడు, సూర్యుడు. **తామరచెలిపట్టి** వి. **1**. యముడు. యయా. 1.98 ; **2**. సుగ్రీవుడు ; **3**. కర్ణుడు. **తామరతంపము** రూ. తామరదంపము. విణ. మిక్కిలి అభివృద్ధి పొందిన, అత్యధికమైన. భాగ. 10 ఉ. 276 ; వి. కమలషండం, తామరల సమూహం. వసు. 3.155. **తామరతంపర** చూ. తామరతంపము. విణ. మిక్కిలి అభివృద్ధి పొందిన, అత్యధికమైన. భార.ఉద్యో. 3.353 ; వి. తామరల సమూహం. ఆం.భా. 1.165. **తామరతూపరి**

వి. పద్మాలు బాణాలుగా కలవాడు, మన్మథుడు. < తామర + తూపు + -అరి[4]. తామరతీఁగె వి. కందారం. తామరదంపము(-తంపము) రూ.చూ. తామరతంపము. వి. తామరతంపర, సమృద్ధి. తామరదుద్దు వి. తామరపూవు మధ్యనున్న దుద్దు, కర్ణిక. తామరదుంప వి. తామరపువ్వున కున్న దుంప. తామరపాకు వి. తామరాకు. భార. ద్రోణ. 4.309. < తామర[1] + ఆకు. తామరపాకు నీటివలె తల్లడ మందు అ.క్రి. గిజగిజలాడు. ఉ.హరి. 335. తామరపాన్పు వి. పద్మశయ్య, తామరపడక. శృం.నై. 1.84. తామర పువ్వు వి. కమలం. భార. ఆరణ్య. 3.373. తామరపువ్వు పేటు వి. తామరపువ్వు ఆకారంలో అంచులోనేసిన డిజైను. తామరపూస వి. తామరదుద్దు. తామరపొక్కిలివాఁడు వి. వెన్నుడు. సాంబ. దేవ. 4. తామరబావి వి. సరస్సు. తామరబాయి వి. పద్మరాగం. తామర రేకు వి. తామరపువ్వుయొక్క రేకు. తామరలదేవర వి. సూర్యుడు. యయా. 5.151. తామరలయనుఁగు (-అనుగు) వి. సూర్యుడు. వాశి. రా. 14. తామరవిందు వి. కమల బాంధవుడు, సూర్యుడు. అచ్చ.రా.యు. 154. తామరాకగు అ.క్రి. సుకుమారమగు. తాళ్ల. సం. 3.580. < తామర[1] + ఆకు + అగు. తామర్లపట్టె వి. నిట్రాడి కొప్పున అమర్చే నాలుగు పలకల చట్రపు చెక్క.

తామర[2] వి. ఒకరకం చర్మవ్యాధి. ఆం.భా. 2.128.

క. తామరె. ఒక చర్మవ్యాధి.

పో.చూ.సం. తామ్ర-. ఒకరకం కుష్ఠువ్యాధి.

తామరాకగు చూ. తామర[1].

తామర్లపట్టె చూ. తామర[1].

తామసమహోత్సవం చూ. తామసము.

తామసము వి. 1. కోపం. రం.రా. ఉ. 146 పు. 15 పం; 2. ఆలస్యం. పారి. 4.11.

సం. తామస-. తమోగుణంకల, ఆలస్యం.

<సం. తామస- (అర్థవిపరి.).

తామసమహోత్సవం వి. జాతర. కాశీయా. 123. తామసించు అ.క్రి. ఆలస్యం చేయు, జాగుచేయు. జైమిని భా. 3.10.

తామసించు చూ. తామసము.

తామా వి. దళసరి, లావు.

హిం. థామ్. స్తంభం.

తాము[1] సర్వ. బవ. 1. తానుకు బహువచనం. భార. శల్య. 2.11; 2. తమరు.

క. తామ్, తావు. వారు, వారే, తమతు, తమత్తు, తమ్మత్తు, తమ్ముతు, తమ్మదు. వారియొక్క, తమర్, తవర్; కొడ. తంగ. వారే: త. తామ్. వారు, వారే; మ. తామ్. వారే, తాంకళ్. వారు, వారే; కో. త.మ్, వారే; తొ. తమ్. వారే; గోం. తమ్మా, తమ్మట్. వారు, వారే; కుఇ. తారు, తాఇ. వారు, వారే; కువి. తంబూ, తాంబు; పర్జి. తాయ్; నా. తామ్; గ. ఒల్లా. తాయ్; కురు. తాయ్; మాల్తో. తమ్, తమి.

<మూ.ద్రా. *తామ్.

తము వి. ఆత్మార్థకంలో. కొరవికాసనం. మహబూబు నగర్ తాలుకా. క్రీ.శ. 892-922. భార. ఆది. 1.41.

తాము[2] వి. బట్టిగోడలు పక్కలకు వాలిపోకుండా పోటిగా కట్టిన చిన్నగోడ.

తామెర రూ.చూ. తామర[1]. వి. తామరపూవు. కృష్ణ. 4.85.

తామేటికాయ చూ. తామేలు.

తామేలు రూ.చూ. తాఁబేలు. వి.బౌ. ఒక జలచరం, తాబేలు. నరస. 1.11.

తామేటికాయ రూ.చూ. తాఁబేలుకాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళ పాత్ర.

తాంబళం చీర రూ.చూ. తాంబూలంచీర. వి. లగ్ననిశ్చయ సమయంలో మగపెళ్ళివారు పెళ్ళికూతురుకిపెట్టే చీర.

తాంబాళము వి. తాంబూలం మొ. పెట్టుకోడానికి ఉపయోగ పడేటట్లు ఇత్తడి మొ. వాటితో చేసిన పళ్ళెం.

క. తాంబాళ. తాంబూలం మొ. వాటిని ఉంచుకొనే పళ్ళెం; త. తాంబాళం.

తాంబుచీర వి. అంచులో పెద్దగీరలు తెలుపు, తొగరు, నలుపు రంగుల్లో పడేటట్లు నేసినచీర.

తాంబుల్ చూ. తమ్ముఁడు. వి. తమ్ములు. చామలూరు శాసనం. క్రీ.శ. 750.

తాంబూలంచీర రూ. తాంబళం చీర, తాంబూలపు చీర, తాం బోలం చీర, తాంబోలపు సీర, తాంబోళం సీర, తాంబోళపు సీర. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలం పుచ్చు కొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.

సం. తాంబూల-. తమలపాకు.

<సం. తాంబూల- + చీర.

తాంబూలతట్ట వి. తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను.

సం. తాంబూల.- తమలపాకు.

<సం. తాంబూల - + -ము + తట్ట (మిశ్ర. స.).

తాంబూలపుచీర రూ.చూ. తాంబూలంచీర. వి. లగ్న నిశ్చయ సమయంలో మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర.

తాంబూలపుపొల్లె రూ.చూ. తాంబూలపొల్లె. వి. లగ్ననిశ్చయ సమయంలో మగపెళ్ళివారు పెళ్ళికూతురుకు పెట్టేచీర.

తాంబూలపొల్లె రూ. తాంబూలపుపొల్లె, తాంబోలపొల్లె. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలాలు పుచ్చుకోనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర.

సం. తాంబూల-. తమలపాకు.

తాంబూలము దయసేయు(-చేయు) స.క్రి. ఒకపనిని అప్పగించు. కు.సం. 4.54.

సం. తాంబూల-. తమలపాకు.

తాంబూలముపైనాళగొలుపు(-కొలుపు) స.క్రి. శృంగారానికి సుముఖునిగా చేయు. విప్ర. 2.84.

సం. తాంబూల-. తమలపాకు.

<సం. తాంబూల-.

తాంబూలమువేయు స.క్రి. 1. అపహరించు; 2. దాచడాని కిచ్చిన ధనాన్ని తిరిగి ఇవ్వకుండు.

సం. తాంబూల-. తమలపాకు.

<నం. తాంబూల - + - ము + వేయు.

**తాంబేటికాయ** చూ. తాంబేలు.

**తాంబేలికాయ** చూ. తాంబేలు.

**తాంబేలు** రూ.చూ. తాఁబేలు. వి. ఒకానొక జలచరం, కూర్మం.

**తాంబేటికాయ** రూ.చూ. తాఁబేలుకాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర. **తాంబేలికాయ** రూ.చూ. తాఁబేలుకాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర. **తాంబేలుకాయ** రూ.చూ. తాఁబేలుకాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతిలో ఉండే నీళ్ళపాత్ర.

**తాంబొళం** రూ. తాంబోలం, తాంబోళం[2]. వి. 1. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలం పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర ; 2. కళ్ళి.

నం. తాంబూల-. తమలపాకు.

<నం. తాంబూల-.

**తాంబోలం** రూ.చూ. తాంబొళం. వి. 1. లగ్ననిశ్చయ సమయంలో మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టేచీర ; 2. కళ్ళి.

**తాంబోలం చీర** రూ.చూ. తాంబూలం చీర. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలం పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర. **తాంబోలపుసీర (-చీర)** రూ.చూ. తాంబూలం చీర. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళి కూతురికి పెట్టే చీర. **తాంబోలపొల్లె** రూ.చూ. తాంబూలపొల్లె. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.

**తాంబోలపుసీర** చూ. తాంబోలం.

**తాంబోలపొల్లె** చూ. తాంబోలం.

**తాంబోళం[1]** రూ. స్థాబాలం. వి. పెద్ద ఇత్తడి పళ్ళెం.

**తాంబోళం[2]** రూ.చూ. తాంబొళం. వి. 1. లగ్న నిశ్చయ సమయంలో మగపెళ్ళివారు పెళ్ళికూతురుకు పెట్టే చీర ; 2. కళ్ళి.

**తాంబోళంసీర(-చీర)** రూ.చూ. తాంబూలం చీర. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలం పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర. **తాంబోళపుసీర(-చీర)** రూ.చూ. తాంబూలపు చీర. వి. లగ్న నిశ్చయ సమయంలో (తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు) మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.

**తాంబోళపుసీర** చూ. తాంబోళం.

**తాఁపు** చూ. తాఁచు. వి. తన్ను, పాదతాడనం. హరి.ఉ. 7.208.

**తాఁబేటికాయ** చూ. తాఁబేలు.

**తాఁబేటిబుడ్డి** చూ. తాఁబేలు.

**తాఁబేటిమాను** చూ. తాఁబేలు.

**తాఁబేలు** రూ. తహబేలు[2], తహవేలు[2], తామేలు, తాంబేలు. వి.ఔ. ఒకానొక జలచరం, కూర్మం. ప్రభా. 2.64.

క. ఆమె, ఆవె, ఏవె. తాబేలు ; కొడ. ఆ.మె. ; తు. ఏమె ; త. యామై, ఆమై ; మ. ఆమ ; కో. ఎ.మ్(బ్) ; గోం. హెమూల్ ; కుఇ. సెంచి ; కువి. తాంబెలి.

**తాఁబేటికాయ** రూ.చూ. తాఁబేలుకాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళ పాత్ర. **తాఁబేటిబుడ్డి** వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్న మూతితో ఉండే నీళ్ళ పాత్ర. **తాఁబేటిమాను** వి. మోట ఉద్దీ నిర్మాణానికి ఆధారంగా అడుగున వేసిన పొడుగాటి మొద్దు లేక బండ. **తాఁబేలుకాయ** రూ. తామేటికాయ, తాంబేటికాయ, తాంబేలికాయ, తాంబేలుకాయ, తాఁబేటికాయ. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళ పాత్ర. **తాఁబేలునడక** వి. నెమ్మదైన నడక. **తాఁబేలుపరుగు** వి. నెమ్మది నడక. **తాఁబేలుబుర్ర** రూ. తావేలుబుర్ర. వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉంటే నీళ్ళ పాత్ర. **తాఁబేలు సురాయి** వి. తాబేలు ఆకారంలాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళ పాత్ర.

**తామ్రపట్టిక** వి. తామ్ర శాసనం. E.I. సంపు. 14. శా.సం. 24.

నం. తామ్ర-పట్టికా. రాగిపట్టి.

<నం. తామ్రపట్టికా (అర్థవిపరి.).

**తాయతు** రూ.చూ. తాయెత. వి. దండకుగాని, మెడకుగాని మొలకుగాని కట్టుకొనే రక్షాభూష.

**తాయము** రూ.చూ. తాయల్లము. వి. 1. అరుదైన వస్తువు, తాయల్లం ; 2. తినుబండారం.

**తాయముపెట్టు** స.క్రి. పిల్లలకు ఏదైన తినుబండారం పెట్టు.

**తాయల్లము** చూ. తాయి. రూ. తాయము, తాయిలము, తాయిల్లము. వి. అరుదైన వస్తువు, తినుబండారం.

<తాయి + అల్ల[1]-ము.

**తాయారు** వి. తల్లి.

త. తాయార్. తల్లి, లక్ష్మీదేవి.

<త. తాయార్.

**తాయి** వి. 1. తల్లి, మాత. పాంచాలీ. 1.28 ; 2. పినతల్లి.

క. అయి, తాయ్, తాయి, తాయె. అమ్మ ; కొడ. త.యి. అమ్మ ; తు. తాయి. అమ్మ ; త. అయ్, ఆయి, యాయ్, ఞాయ్. తల్లి, అయ్చ్చి, అచ్చి. తల్లి, అవ్వ, అచ్చాళ్. తల్లి, ఆయాళ్. తల్లి, నాయనమ్మ, తాయ్. తల్లి, తాయార్. తల్లి, తాయ్మై. మాతృత్వం ; మ. తాయి. తల్లి ; తొ. తొ.య్. తల్లి ; గోం. యాయాల్, యాయె. తల్లి ; కొం. అయ. తల్లి ; కుఇ. ఐఅ, ఐఅవి, ఆజ, ఇఅ, ఇజ, ఇజలి. తల్లి, స్త్రీ ; కువి. ఈయ. తల్లి, ఈజ. తల్లి, స్త్రీ ; పర్జి. ఐయ. తల్లి ; కొలా. అయ్ (? అ.య్.). తల్లి ; నా. అయ్మ. స్త్రీ ; గ. ఒల్లా అఁయ ; అయ. తల్లి ; కురు. అయంగ్. అమ్మ. అయో' తల్లి ; మాల్తో. అయ్య. మాలమ్మ. పో.చూ.త. ఐయ.

పో.చూ.ఆ. అఈ. తల్లి ; బెం. ఆఇ. అమ్మమ్మ లేక

మేనత్త; ఒ. ఆఈ; సిం. ఆఈ. అమ్మ, మేనత్త: గు. ఆఈ. అమ్మ, అవ్వ; మరా. ఆఈ. అమ్మ.

**తాయిత** రూ.చూ. తాయెత. వి. **1.** కేయూరం; **2.** తల్లి పిల్లలకి కట్టే రక్షా బంధనం.

**తాయితకిస్తీ** వి. చట్రం కన్నా తక్కువ మట్టంలో ఉండే కిస్తీ.

**తాయితు** రూ.చూ. తాయెత. వి. దండకుగాని, మెడకుగాని, మొలకుగాని కట్టుకొనే రక్షా భూష. ల.సం. 2.

**తాయిత్తు** రూ.చూ. తాయెత. వి. మొలకుగాని, దండకుగాని, మెడలోగాని కట్టుకొనే రాగి రక్షా భూష.

**తాయిపెంక** వి. పేలాలు వేయించుకోడానికి వాడే మట్టి పాత్ర.

**తాయిలము** రూ.చూ. తాయల్లము. వి. తిను బండారం.

**తాయిలాడి** చూ. తాయి. వి. తంటాలమారి.

**తాయిల్లము** రూ.చూ. తాయల్లము. వి. తాయం, తినుబండారం.

**తాయు** స.క్రి. తాడు మొదలైన వాటితో గట్టిగా కట్టు.

**తాయెత** రూ. తాయతు, తాయిత, తాయితు, తాయిత్తు, తాయెతు, తాయెత్తు, తాయెదు, తావీజు, తావేజు. వి. **1.** రక్ష కోసంగాని, అలంకారం కోసంగాని, తలమీద గాని, మెడలోగాని, సందిటగాని ధరించే వస్తు విశేషం. పల్నా. 17; **2.** కేయూరం, బాహుపురి.

హిం. తావీజ్. రక్షాబంధం; మరా. తావిజ. రక్షా భూష: ఉ. తావీజ్. రక్షాకవచం, తఆవీజ్. శరణంతో కోరటం, రక్షార్థం సర్వేశ్వరుని ప్రార్థించటం; పార. తవీజ్. రక్షాబంధం, రక్షకు ప్రార్థించటం.

<ఉ. తావీజ్.

**తాయెతు** రూ.చూ. తాయెత. వి. **1.** అలంకారం కోసంగాని, రక్ష కోసంగాని, తలమీదగాని, మెడలోగాని, సందిటగాని ధరించే వస్తు విశేషం. మను. 6.44; **2.** కేయూరం, బాహుపురి. ఆం.భా. 2.150.

**తాయెత్తు** రూ.చూ. తాయెత. వి. **1.** రక్షకోసంగాని, అలంకారం కోసంగాని, తలమీద, మెడలోను, సందెటలోను కట్టుకొనే వస్తు విశేషం. కాశ. 3.32; **2.** కేయూరం, బాహుపురి.

**తాయెదు** రూ.చూ. తాయెత. వి. తాయెత్తు.

**తార**[1] వి. ఊదే ఒక వాద్య విశేషం. కళా. 8.118.

క. తార; త. తారై.

**తార**[2] వి. నాలుగుకానుల నాణెం. ద.హిం.శా. సంపు. 7. శా.సం. 573.

**తార**[3] వి. చిచ్చుబుడ్లకు వాడే గుండుమట్టి బుడ్డి.

సం. తారా. బిడ అనే గంధ ద్రవ్యం.

<సం. తారా. (అర్థవిపరి.).

**తారామండలము** వి. చిచ్చుబుడ్లకు వాడే గుండుమట్టి బుడ్డి. సం. తారామండల-. నక్షత్రమండలం.

<సం. తారామండల- (అర్థవిపరి.).

**తారకమ్మ** వి. అభినయంతో మాట్లాడే ఆడది.

సం. తారా. నక్షత్రం.

**తారకాణ** రూ.చూ. తార్కాణ. వి. దృష్టాంతం, నిదర్శనం, ప్రమాణం. ప్రబంధ. 626.

**తారకాణచేయు** రూ.చూ. తార్కాణ చేయు. స.క్రి. సత్యమని చూపు, రుజువు పరచు. **తారకాణయగు(-అగు)** రూ.చూ. తార్కాణయగు. అ.క్రి. అనుభవ సిద్ధమగు. అనుభవం వల్ల సత్యమని తెలియు. **తారకాణసేయు(-చేయు)** రూ.చూ. తార్కాణచేయు. స.క్రి. సత్యమని చూపు, రుజువు పరచు. **తారకాణించు** రూ.చూ. తార్కాణించు. స.క్రి. **1.** నిరూపించు, రుజువుపరచు. సారంగ. 2.280; **2.** నిదర్శన పూర్వకంగా బోధించు.

**తారకాణమగు** చూ. తారకాణము.

**తారకాణము** రూ.చూ. తార్కాణ. వి. నిదర్శనం, దృష్టాంతం, ప్రమాణం.

**తారకాణమగు** రూ. తార్కాణయగు. అ.క్రి. అనుభవ సిద్ధమగు, అనుభవం వల్ల సత్యమని తెలియు. <తారకాణము + అగు.

**తారకాణించు** చూ. తారకాణ.

**తారంగము** వి. పిల్లలను మురిపించే హస్తాభినయ విశేషం.

సం. తారంగ-. తరంగ సంబంధమైన.

<సం. తారంగ- (అర్థవిపరి.).

**తారపీట** రూ. తారాపీట. వి. ఎద్దు వెన్నుమీద వేసే పీట వంటి వస్తువు.

**తారము**[1] వి. **1.** నాలుగు కాసుల రాగినాణెం విలువగల నగ. రుక్మా. 4.122; **2.** నాలుగు కాసుల రాగినాణెం. బహుళా. 5.165.

క. తార. రెండుకాసులరాగి నాణెం.

**తారము**[2] వి. **1.** కట్టలు తూచడంతో గోనెదారం మొ. వాటికి గాను తీసి ఇచ్చేటిది; **2.** నేయి మొ॥ సరకు లమ్మేటపుడు అవిపోసే పాత్రల బరువు.

పో. తారా తూనికతోపుడు; స్పా. తారా; ఫ్రె. తర్; ఇం. టేర్; డ. త్ర్ర;

అర. తర్హా.

<పో. తారా.

**తారవన్నె** వి. ఒకరకం నీలిరంగు.

సం. తారా. నక్షత్రం.

<సం. తారా + వన్నె.

**తారవన్నెచీర** వి. లేతనీలిరంగు చీర.

**తారస్** రూ.చూ. తారస. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్న సైజుఇటిక.

**తారస్సున్నం** రూ.చూ. తారసుసున్నం. వి. ఇంటికప్పు లాదడానికి వాడే బాగాజిగురున్న, మెత్తటి సున్నం.

**తారస** రూ. టార్చి, తారస్, తారసు, తారాసు, తార్స, తార్సి. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్నసైజు ఇటిక.

**తారసచ్చు** వి. తారసు చేసేఅచ్చు. <తారస + అచ్చు[1].

**తారసపడు** చూ. తారు[1].

**తారసపెట్టు** చూ. తారు[1].

**తారసము** చూ. తారు[1].

**తారసించు** చూ. తారు[1].

**తారసిలు** చూ. తారు[1].

**తారసిల్లు** చూ. తారు[1].

**తారసు** రూ.చూ. తారస. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్న సైజు ఇటిక.

**తారసుపని** వి. తారసురాతి కప్పువేయడం. **తారసుసొంబె** వి. తారసరాయి చేసేఅచ్చు. **తారసుసున్నం** రూ. తారస్సున్నం, తార్చాసున్నం. వి. ఇంటికప్పు లాదడానికి వాడే బాగాజిగురున్న మెత్తటి సున్నం. **తారస్సున్నం** రూ.చూ. తారసుసున్నం. వి. మెత్తటి సున్నం.

**తారస్సున్నం** చూ. తారసు.

**తారాచువ్వ** రూ. తారాజువ్వ. వి. పైకెగిరే ఒకబాణాసంచు. మృత్యు. 3.43.

సం. తారా. నక్షత్రం.

< తారా + చువ్వ.

**తారాజువ్వ (-చువ్వ)** రూ.చూ. తారాచువ్వ. వి. పైకెగిరే ఒక బాణాసంచు.

**తారాడు** చూ. తారు[1].

**తారాతిగిడి** రూ. తాలాతిగిడి. వి. మోసం.

**తారాతిగిడిచేయు** స.క్రి. టక్కుటమారం చేయు.

**తారాపీట** రూ.చూ. తారపీట. మి. వి. ఎద్దువెన్ను మీదవేసే పీటవంటి వస్తువు.

**తారామండలం** వి. ఒకమాదిరి ఎర్రంచుపెట్టి నేసిన మేలిరకం చీర.

సం. తారామండల-. నక్షత్రమండలం.

< సం. తారామండల – (అర్థవిపరి.).

**తారామండలము** చూ. తార[3].

**తారాముళ్లు** వి.బ.వ. తంటాలు. < తారు[2] + ముడి + -లు.

**తారాసు** రూ.చూ. తారస. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్న సైజు ఇటిక.

**తారి[1]** చూ. దారము. వి. మంగళసూత్రం.

**తారి[2]** చూ. తారు[1].

**తారికాడు** చూ. తారు[1].

**తారిఖు** రూ.చూ. తారీఖు. వి. తేదీ.

**తారిపోవు** చూ. తారు[1].

**తారీఖు** రూ. తారిఖు. వి. తేదీ.

హిం. *తారీఖ్*. నియతతిథి, ఇతిహాసం; మరా. *తారీఖ్*. మానంలో ఒకదినం; ఉ. *తారీఖ్*. మానంలో ఒకరోజు, తీర్పుచెప్పే రోజు; పార. *తారీఖ్*. తిథి, శకం, నెలలో ఒకరోజు; అర. *తారీఖ్*. చరిత్ర; పంచాంగం శకం, తిథి, వత్సరం.

< ఉ. తారీఖ్.

**తారీతపడ్డ** వి. కొన్ని ఈతలు అయిన పడ్డ (గేదె).

**తారీఫు** వి. పొగడటం. రంగా. చ. 2.90.

హిం. *తారీఫ్*. ప్రశంస, వివరణం; మరా. *తారీఫ*. స్తుతి, ప్రశంస; ఉ. *తారీఫ్*. ప్రశంస, పరిచయం, వ్యాఖ్య; పార. *తరీఫ్*, *తారీఫ్*. వివరించటం, స్తుతి, ప్రశంస; అర. *తఅరీఫ్*. ప్రశంస.

< ఉ. తారీఫ్.

**తారు[1]** అ.క్రి. **1.** సంచరించు, మెలగు. కు. సం. 3.108; **2.** పోవు, వెళ్ళు. కు. సం. 5.14; **3.** పాయు, తొలగు. భాగ. 10ఉ. 1149; **4.** ప్రసరించు, వ్యాపించు. వాశి. రా. 2.102; **5.** చేరు, కువ. చ. 4.2; **6.** కలుగు, పట్టు. రాజవా. 2.112; **7.** ఇటూఅటూ తిరుగు, అల్లాడు. ఉ. రా. 5.29; స.క్రి. సమీపించు. ప్రభా. 2.30.

క. తరిసు. ముందువెళ్ళు, దగ్గరగా ప్రవర్తించు, సార్. దగ్గరకువచ్చు లేక దగ్గరకు వెళ్ళు, సార్చు. సమీపించు; తు. సార్గుని. ముందుకుపోవు; త. చార్. సమీపించు, చేర్చు, కలుపు, చార్తు. చేర్చు; మ. చార. దగ్గరగా, సమీపంగా; తె. తార్-.

మూ. ద్రా. *చార్.

**తారసపడు** అ.క్రి. **1.** సమీపించు; **2.** ఎదురుపడు, ఎదురగు; **3.** కవియు, మార్కొను; **4.** ఒనగూడు, ప్రాప్తించు. **తారసపెట్టు** స.క్రి. ప్రవేశపెట్టు. **తారసము** విశే. **1.** సమీపించిన, దగ్గరైన. పి. శకు. 3.169; **2.** తటస్థించిన, సంభవించిన, కలిగిన. జైమిని భా. 1.139; **3.** కనపడిన, గోచరించిన. మను. 5.81; **4.** గుత్తమైన. హంస. 4.40; వి. **1.** తలపాటు, యుద్ధంలో ఎదుర్కొనటం. జైమినిభా. 5.115; **2.** సమీపం. ఆము. 3.39. **తారసించు** స.క్రి. **1.** సమీపించు, దగ్గరు. మను. 4.42; **2.** తాకు, కవియు, ఎదుర్కొను. చిత్ర భా. 766. తారసము + -ఇంచు[3]. **తారసిలు** రూ. తారసిల్లు. అ.క్రి. **1.** వచ్చు. హర. 4.56; **2.** ప్రసరించు. కళా. 2.128; **3.** కడగు, పూను. దశా. 7.15; **4.** ఎదురుపడు, ఎదురగు. ప్రబంధ. 7.60; **5.** తాకు, కవియు, ఎదుర్కొను; **6.** వెళ్ళు; **7.** కలుగు, సంభవించు; స.క్రి. **1.** తాకు, కవియు, ఎదుర్కొను. కళా. 8.62; **2.** సమీపించు, డగ్గరు. వసు. 1.156. **తారసిల్లు** రూ.చూ. తారసిలు. అ.క్రి. **1.** వెళ్ళు. విప్ర. 3.80; **2.** కలుగు, సంభవించు. కుచే. 1.89; **3.** వచ్చు; **4.** ప్రసరించు; **5.** కరుగు, పూను; **6.** తాకు, కలియు, ఎదుర్కొను; **7.** ఎదురుపడు, ఎదురగు. **తారాడు** అ.క్రి. **1.** అటూ ఇటూ తిరుగు. బసవ. 2.64 పం; **2.** (వస్త్రం మొ.) నేలపై జీరాడు. ఆము. 4.92. **తారి[2]** వి. **1.** ఆటఆడించే సూత్రధారుడు. ఆం. భా. 2.287; **2.** ఇక్కడమాటలు అక్కడ, అక్కడ మాటలు ఇక్కడ చెప్పే ఆడది. < తారు[1] + -ఇ[9]. **తారికాడు** అ.క్రి. పనిసమయంలో పనివదలి చాటు చాటున తిరగడం. **తారిపోవు** అ.క్రి. ముదిరి పండిన గింజలు ఎండు. **తారుకులాడు** అ.క్రి. సమీపించకుండనే దూర దూరంగా ఉండి తిరుగు. **తారుకొను** రూ.చూ. తార్కొను. అ.క్రి. **1.** నిండు, వ్యాపించు, కమ్ముకొను. వరాహ. 11.114; **2.** పైబడు; **3.** కలియు, మిశితమగు; **4.** పుట్టు, జనించు; **5.** ప్రవర్తించు, నడచు; **6.** ఉండు; **7.** సక్తమగు, తగులుకొను, అంటిఉండు. స.క్రి. **1.** కవియు, మార్కొను; **2.** చేరు, చెందు. **తారుకొలుపు** రూ.చూ. తార్కొల్పు. స.క్రి. **1.** కూర్చు, అమర్చు. చిత్ర భా. 5.31; **2.** సక్తంచేయు. **తారుకొల్పు** రూ.చూ. తార్కొల్పు. స.క్రి **1.** సక్తంచేయు; **2.** కూర్చు, అమర్చు. **తారుచు** రూ.చూ. తార్చు. స.క్రి. **1.** (యుద్ధంలో) కూర్చు, సిద్ధపరుచు. హరి. ఉ. 1.110;

2. చేర్చు, కూర్చు. నీలా. 1.110 ; 3. అమర్చు, నిర్మించు ; 4. దగ్గరగాతీయు, కదియించు ; 5. ఉంచు, పెట్టు ; 6. పొందించు, పొందజేయు ; 7. పోజేయు, పుచ్చు ; 8. లాగు, తిరుగు, ఆకర్షించు ; 9. ఒడ్డు, ఒగ్గు ; 10. ప్రసరింపజేయు, వ్యాపింపజేయు ; 11. వేయు ; 12. వహించు, తాల్చు. **తారుమాఱు** వి. తలకిందు. **తారెట్లాడు** అ.క్రి. సంకోచించు. **తార్కొను** రూ. తారుకొను. స.క్రి. 1. కవియు, మార్కొను. భార. ఉద్యో. 4.346 ; 2. చేరు, చెందు, పొందు. నార. పంచ. 1.72 ; అ.క్రి. 1. పైబడు. హరి. ఉ. 6.60 ; 2. కలియు, మిళితమగు. కాశీ. 7.185 ; 3. పుట్టు, జనించు. పారి. 2.52 ; 4. నిండు, వ్యాపించు, కమ్ముకొను. రామాభ్యు. 3.25 ; 5. ప్రవర్తించు, నడచు. ప్రభా. 3.3 ; 6. ఉండు ; 7. సక్తమగు, తగులుకొను, అంటిఉండు. దశా. 4.49. **తార్కొలుపు** రూ.చూ. తార్కొల్పు. స.క్రి. 1. కూర్చు, అమర్చు ; 2. సక్తంచేయు. **తార్కొల్పు** రూ. తారుకొలుపు, తారుకొల్పు, తార్కొలుపు, స.క్రి. 1. సక్తంచేయు. భాగ. 4.827 ; 2. కూర్చు, అమర్చు. **తార్చు** రూ. తారుచు. స.క్రి. 1. చేర్చు, కూర్చు. భార. శాంతి. 5.320 ; 2. దగ్గరగాతీయు, కదియించు. శృం. నై. 1.51 ; 3. ప్రసరింపజేయు, వ్యాపింపజేయు, హర. 7.14 ; 4. ఒడ్డు, ఒగ్గు. మను. 4.49 ; 5. పోజేయు, పుచ్చు. పారి. 1.112 ; 6. వేయు. ఆము. 6.81 ; 7. పొందించు, పొందజేయు. వసు. 1.49 ; 8. లాగు, తిరుగు, ఆకర్షించు. వసు. 3.159 ; 9. ఉంచు, పెట్టు. వసు. 5.108; 10. అమర్చు, నిర్మించు. కువ.చ. 3.120 ; 11. వహించు, తాల్చు. ఆం. భా. 3.119 ; 12. (యుద్ధంలో) కూర్చు, సిద్ధపరచు.

**తారు**[2] రూ.చూ. తాఱు[2]. అ.క్రి. క్షీణించు,తగ్గు, కాంతిహీనమగు. వసు. 4.21.

**తారు**[3] సర్వ. బ.వ. ఆత్మార్థక బహువచనరూపం. భార. ఆది. 3.193.

క. తామ్, తావు. వారు, వారే, తమతు, తమత్తు, తమ్మతు, తమ్మతు, తమ్మదు. వారియొక్క, తమర్, తవర్ ; కొడ. తంగ. వారే ; త. తామ్. వారు, వారే ; మ. తామ్. వారే, తాంకళ్ ; కో. తమ్. వారే ; గోం. తమ్మా, తమ్మట్. వారు, వారే ; కుఇ. తారు, తాఇ. వారు, వారే ; కువి. తంబూ, తాంబు ; పర్జి. తామ్ ; కొలా. త.మ్ ; నా. తామ్ ; గ. ఒల్లా. తామ్ ; కురు. తామ్ ; మాల్తో. తమ్, తమి.

< మూ. ద్రా. *తామ్.

తెలుగు, కుఇ భాషల్లో *మ్ బహువచన స్థానాన్ని దానికంటె ప్రచురమైన *న్ బ.వ. ఆక్రమించింది.

**తారు**[4] వి. 1. మరనాడె మొన అరిగి పోకుండా బిగించిన ఇనప పొన్ను ; 2. సన్నటిచువ్వ.

హిం. తార్. లోహపుతీగ.

< హిం. తార్.

**తారుపిన్ని** రూ. తార్పిన్. వి. నేతనేసేటప్పుడు, పడుగులో తెగిపోయిన పోగును దగ్గరికి లాగటానికి, పన్నెగూడులో నుంచి పోగులను తియ్యటానికి, వాడే ఇనపముల్లు. ఇం. *Pin.* సూది. < తారు[4] + ఇం. Pin. **తారుమేకు** వి. సన్నటిమేకు. **తారుమొల** వి. పెయ్‌లు కోయడానికి వాడే సన్నటికమ్మి. **తార్పిన్** రూ.చూ. తారుపిన్ని. వి. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల. **తార్‌బల్** వి. తివాచీలాగా పనికి వచ్చేమందపాటిగుడ్డ.

**తారు**[5] వి. 1. కందెన, బండిఇరుసులో వేసేగడ్డి, మసి మొ. కలిపిన ఆముదం ; 2. రోడ్లువేయడానికి వాడేనల్లని ద్రవం ; 3. కొయ్యను చెదలు పట్టకుండాను, డాబాకప్పు కురవకుండాను పూసే నల్లటి చిక్కని ద్రవం.

ఇం. *Tar.* రోడ్లువేయడానికి వాడే నల్లని ద్రవం.

< ఇం. Tar.

**తారుపు** రూ.చూ. తార్పు[2]. వి. భూమిలో సొమ్ము దాచుకొనే రాతిపాత్ర.

**తారెట్లాడు** చూ. తారు[1].

**తార్కాణ** రూ. తారకాణ, తారకాణము, తార్కాణము. వి. దృష్టాంతం, నిదర్శనం. ప్రభా. 3.85.

త. తార్కాణ-. నిదర్శనం.

**తార్కాణచేయు** రూ. తారకాణచేయు, తారకాణసేయు, తార్కాణసేయు. స.క్రి. సత్యమని చూపు, రుజువుపరచు. కళా. 2.157. **తార్కాణయగు (-అగు)** రూ. తారకాణమగు, తారకాణయగు, తార్కాణమగు. అ.క్రి. అనుభవసిద్ధమగు, అనుభవం వల్ల సత్యమని తెలియు. కళా. 2.57. **తార్కాణసేయు (-చేయు)** రూ.చూ. తార్కాణచేయు. స.క్రి. సత్యమని చూపు, రుజువు చేయు. కళా. 3.208. **తార్కాణించు** రూ. తారకాణించు. స.క్రి. 1. నిదర్శన పూర్వకంగా బోధించు. గొ.హరి.ఉ. 2522 పం ; 2. నిరూపించు, రుజువుపరచు. ప్రభా. 4.115.

**తార్కాణమగు** చూ. తార్కాణము.

**తార్కాణము** రూ.చూ. తార్కాణ. వి. 1. దృష్టాంతం, నిదర్శనం ; 2. ప్రమాణం.

**తార్కాణమగు** రూ.చూ. తార్కాణయగు. అ.క్రి. అనుభవసిద్ధమగు. < తార్కాణము + అగు.

**తార్కాణించు** చూ. తార్కాణ.

**తార్కొను** చూ. తారు[1].

**తార్కొలుపు** చూ. తారు[1].

**తార్కొల్పు** చూ. తారు[1].

**తార్చుసున్నం** రూ.చూ. తారసునున్నం. వి. ఇంటి కప్పు లాదడానికి వాడే, బాగా జిగురున్న, మెత్తటిసున్నం.

**తార్చు** చూ. తారు[1].

**తార్పిన్** చూ. తారు[4].

**తార్పు**[1] చూ. తార్చు. వి. అమరిక, కూర్పు. పి. శకు. 2.174.

**తార్పులాడు** అ.క్రి. పొట్టేళ్ళు మొ. జగడమాడు. భల్లా. 3. ఆ. < తార్పు[1] + -లు + ఆడు.

**తార్పు**[2] చూ. తాఱు[1]. రూ. తారుపు, తాఱుపు. వి. 1. కరండం, బరిణి. జైమిని భా. 8.199 ; 2. పొణక. వేంక. పంచ. 4.416.

తార్బల్ చూ. తారు[4].
తార్స రూ.చూ. తారస. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్నసైజు ఇటిక.
తార్సకడ్డీ వి. డాబాదూలం మీద పరిచే దంతె. తార్సకమ్మి వి. డాబాదూలం మీద పరిచే దంతె. తార్స పెంకి వి. ఇంటికప్పు తయారీలో వాడే నల్చదరంగా పల్చగా ఉండే పెంకు.
తార్సి రూ.చూ. తారస. వి. ఇంటికప్పు తయారీలో వాడే చిన్నసైజు ఇటిక.
తార్సిటకచ్చు వి. తారసురాయి చేసేఅచ్చు. <తార్సి+ఇటిక+అచ్చు.
తాఱించు చూ. తాఱు[2].
తాఱు[1] అ.క్రి. 1. చొచ్చు, ప్రవేశించు. హరి. ఉ. 7.182; 2. పడు, వాలు, అడగు. ఉ. హరి. 3.58; 3. మరుగుపడి వెళ్ళు, నక్కుతూపోవు. మను. 3.89; 4. దాగు. రాజవా. 5.41.
త. తఱుకు (తఱుకి). వెనకబడు, తచ్చాడు.
తాఱుపు(బెట్టె (-పెట్టె) వి. పెట్టెమూత. విష్ణుపు. 3.89.
తాఱుమాఱు విశ. క్రమంతప్పిన, వ్యత్యస్తమైన. శుక. 2.396. వి. క్రమంతప్పటం, వ్యత్యాసం. క. తాఱుమాఱు. గందరగోళం, క్రమభంగం; తు. తారుమారు. గందరగోళం, క్రమభంగం; త. తాఱుమాఱు. గందరగోళం, క్రమభంగం, వక్రత్వం, వ్యతిరేకం, తలబిరుసుదనం; మ. తాఱుమాఱు. గందరగోళం, క్రమభంగం. తాఱుమాఱుపడు రూ. తాఱుమాఱుపడు. అ.క్రి. వ్యత్యాసపడు, వ్యత్యస్తమగు. మను. 4.37. తాఱుమాఱుపడు రూ.చూ. తారుమాఱుపడు. అ.క్రి. వ్యత్యాసపడు, వ్యత్యస్తమగు.
తాఱు[2] రూ. తారు[2]. అ.క్రి. 1. చెడు. భార. శాంతి. 3.192, హర. 2.31; 2. క్షీణించు, కృశించు. భాస్క. రా. సుందర. 156.
క. తార్, తాఱు. ఎండినదగు, ఎండిపోవు, క్షీణించు, తాఱడే. ఎండినదశ, తాఱిగ. ఎండిపోయిన, బలహీనమైన మనిషి, తఱగు, తఱళె; తు. చర్మెరి. బక్కనైన; మ. తాఱుక. కృశించు, క్షీణించు, బలహీనమగు, వాలిపోవు, తాఱిక్క, తాఱుక. చంపు, కృశించు; తొ. తొ.క్స్.- (తొ.క్స్య-) సన్ననగు, పలుచని.
<మూ.ద్రా. *తా త్.
తాఱించు స.క్రి. తారజేయు, ఈడిగించు, పోగొట్టు. చంద్రికా. 5.104.
తాఱుపు రూ.చూ. తార్పు[2]. వి. 1. కరండం, బరిణ: 2. పొణక.
తాలం రూ.చూ. తాళము. వి. 1. మరాసులో బెండకాయ చక్రం పక్కన బిగించిన ఇనపరేకు; 2. బీగం.
తాలంకుయ్యా వి. పాలపిడత మీద మూతకు వాడేది.
తాలంతుతీగ వి. విభిన్నమైన ఆకులు కల్గి పచ్చపూలు పూసే లత (Impomala chryscides).
తాల(బోయు చూ. తాలు[3].
తాలాతిగిడి రూ.చూ. తారాతిగిడి. వి. మోసం.
తాలారి వి. విలువైన కలపనిచ్చే చెట్టు (Shorea Talurd).
తాలి రూ.చూ. తాళి[1]. వి. పుస్తె, మంగళసూత్రం.
తాలిబొట్టు వి. మంగళసూత్రం.
తాలిక[1] చూ. తాలుచు. వి. 1. మెలిక. భోజ. 3.42; 2. చారు, రేఖ. అష్ట మ. క. 5.236పు.
తాలిక[2] రూ. తాడక, తాల్క, తాళక, తాళిక[1]. వి. ఒరలు, తొట్లు, మొ. చేయడానికి మూరెడు నిలువుతో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగా చేసిన మట్టిముద్ద.
తాలికమైపాళి రూ.చూ. తేలికమైపాళి. వి. తక్కువకాలంలో పండే ఒకరకం వడ్లు.
తాలింఖానా రూ.చూ. తాలింఖానా. వి. గరిడీచేసే స్థలం.
తాలించు[1] స.క్రి. గరిడీచేయు. ప్రబంధ. 788.
హిం. ఉ. తాలిం. విద్యోపాదానం.
<ఉ. తాలీమ్+- ఇంచు[3].
తాలించు[2] చూ. తాలు[3].
తాలిదము చూ. తాలు.[3]
తాలిందాకరాయి చూ. తాలు[3].
తాలిపు చూ. తాలు[3].
తాలిపోవు చూ. తాలు[1].
తాలిమి చూ. తాలు[1].
తాలిమికత్తియ చూ. తాలు[1].
తాలిమికత్తె చూ. తాలు[1].
తాలిమికా(డు చూ. తాలు[1].
తాలిమిడు చూ. తాలు[1].
తాలింపు చూ. తాలు[3].
తాలింపుదాక చూ. తాలు[3].
తాలింపుసట్టి చూ. తాలు[3].
తాలింఖానా రూ. తాలింఖానా. వి. గరిడీశాల.
ఉ. తాలిమ్ఖానా. విద్యనభ్యసించే స్థలం.
< ఉ. తాలీమ్ఖానా.
తాలు[1] రూ. తాళు. స.క్రి. సహించు, ఓర్చు. కు. సం. 5.171; అ.క్రి. ఆగు, నిదానించిఉండు.
క. తాళ్. తాళు (తాడ్-). పట్టుకొను, తీసుకొను, ఆనుకొను, సంపాదించు, పొందు, అనుభవం, ఓర్పుతో. బాధపడు, ఓర్పుతోఉండు, సహించు, వేచియుండు, తాల్దు. పట్టుకొను; తళె. పట్టుకొను, భరించు; తు. తాళుని. భరించు, సహించు, బాధపడు, సహనం కలిగిన; త. తాళు (తాళి). భరించు, బాధపడు, సహించు, విలువగు, సంభవమగు, ఆచరించదగిన, తాల్. తాళు. విశ్రమించు. నిలుపు, నిలుచు; కో. తల్. (త.ల్క్య-). ఆగి వేచియుండు.
మూ. ద. ద్రా. *తాళ్-/*తాల్-.
తాలిపోవు అ.క్రి. తగ్గిపోవు, తీసిపోవు. తాలిమి రూ.చూ. తాల్మి. వి. 1. ధైర్యం, మనఃస్థైర్యం. భార.భీష్మ. 1.106; 2. క్షమ, ఓర్పు. విక్ర. 1.47. తాలిమికత్తియ రూ. తాలిమికత్తె, తాల్మికత్తియ, తాల్మికత్తె. విశ. 1. క్షమావంతురాలైన; 2. ధీరురాలైన. తాలిమికత్తె రూ. చూ. తాలిమికత్తియ. విశ. 1. క్షమావంతురాలైన; 2. ధీరురాలైన. తాలిమికా(డు రూ. తాల్మికా(డు. వి. 1. ధీరుడు.

పండితుడు. అచ్చ. భా. 1.2; 2. క్షమావంతుడు, ఓర్పు గలవాడు. ఆం.భా. 3.11; 3. ధైర్యవంతుడు. **తాలిమిడు** రూ. తాల్మిడు. స.క్రి. క్షమించు, సైరించు. సారంగ. 2.28. **తాల్మి** రూ. తాలిమి, తాళిమి. వి. 1. క్షమ, ఓర్పు. భార. విరా. 2.3; 2. ధైర్యం, మనఃస్థైర్యం. భార. శాంతి. 1.24. క. తాళిమె, తాళుమె, తాళ్మె. సహనం, తు. తాళ్మె. సహనం, ఓర్పు. **తాల్మికత్తియ** రూ.చూ. తాలిమి కత్తియ. విశ. 1. క్షమావంతురాలైన; 2. ధీరురాలైన. **తాల్మికత్తె** రూ.చూ. తాలిమికత్తియ. విశ. 1. క్షమావంతు రాలైన; 2. ధైర్యవంతురాలైన. **తాల్మికాఁడు** రూ.చూ. తాలిమికాఁడు. విశ. 1. ధీరుడైన, పండితుడైన; 2. క్షమా వంతుడైన. 3. ధైర్యవంతుడైన. **తాల్మిడు** రూ. చూ. తాలిమిడు. స.క్రి. క్షమించు, సైరించు. **తాల్మితూలు** స.క్రి. ధైర్యాన్ని కోల్పోవు. కాశ. 1.32.

**తాలు**[2] వి. 1. పొల్లు, తప్పగింజ. పల్నా. 42. ఆం. భా. 2.238; 2. ఎన్నుతీయబడి ఎండిపోయిన పైరు, పంట.

క. తాఌ. బోద లేక ధాన్యం, పువ్వుల మొక్కకాడ; కొడ. త.ళి. బోదె; త. తాళ్. పాదం, చెట్టు లేక పర్వతం మొదలు, బోదె, కాడ; మ. తాళ్. కాడ, బోదె, పాదం; కో. త.ళ్. బోదె, చెట్టుమొదలు, కొండఏటవాలు; తొ. తొ.ళ్. జంతువు వెనకకాలితొడ, చెట్టుమొదలు, కొండఏటవాలు.

**తాలుకట్ట** వి. తూర్పార పోసేటప్పుడు మేలురాని దగ్గర పడేగింజ లేని ధాన్యం. **తాలుకసువు** వి. గింజలులేనిగడ్డి. **తాలుగింజ** వి. గింజపట్టని పొల్లుధాన్యం. **తాలుతబ్బ** వి. గింజపట్టని పొట్టు. **తాలుదంటు** వి. గింజలులేని గడ్డి. **తాలుపొట్టు** వి. కొర్ర, సజ్జ మొ. గింజలపొట్టు. **తాలుబోలు** వి. పనికిరాని తర్రధాన్యం.

**తాలు**[3] అ.క్రి. తిరుగు.

**తాలఁబోయు** స.క్రి. తాలించు, కూర మొ. వాటిని తిరగ బోయు, తాలింపు పెట్టు. హర. 2.121. <తాలు[3]+-అ[7]+పోయు. కొండ. తాలెప్. మసాలాదినుసుల్తో ఆహార పదార్థాల తాలింపు. **తాలించు**[2] రూ. తాళించు[2]. స.క్రి. 1. కూర మొ. వాటిని తిరగబోయు, తాలింపుపెట్టు; 2. ఇసుక మొ. వాటిని బెడ్డలు మొ. వాటిని తీయటానికి పడపోయు. క. తాళిసు, తాళిద, తాళద, తాళ్దా, తాళ్ను, పొగచు; త. తాళి (తాళిప్పు-, తాళిత్తు-), తాళిక్కై, తాళిప్పు; మ. తాళిక్క. **తాలిదము** రూ. తాళిదము. వి. 1. పొగపు, తాలింపు. రాజవా. 2.100; 2. తాలింపు పెట్టిన పదార్థం. **తాలిందాకరాయి** వి. కూరదాకలు నర్పడానికి ఉపయోగించే రాయి. **తాలిపు** రూ.చూ. తాలింపు. వి. రుచిగల కూరయొక్క తాలింపు. భీమ. 2.140. **తాలింపు** రూ. తాలిపు, తాళింపు. చూ. తాలించు[2]. వి. 1. తాలించిన కూర మొ. వాటి పదార్థం. కాశీ. 2.44; 2. కూర మొ. వాటి తిరగబోత; 3. ఆముపేర్పులో జల్లి డిస్కె వెనుకభాగంలో 3 గోత్తెలు కట్టి గోలెం మీద గోలెం బోర్లించు. క. తాళిసు, తాళిద, తాళద, తాళ్దా, తాళ్ను. తాలింపు, ఆహారం; త. తాళి. (తాళిప్పు-, తాళిల్తు-.), తాళికై, తాళిప్పు; మ. తాళిక్క. <త. తాళిప్పు. **తాలింపుదాక** వి. తాలింపు పెట్టుకోడానికి వాడేమట్టి పాత్ర. **తాలింపుసట్టి (-చట్టి)** వి. మూతిఅడుగు వెడల్పుగా ఉండే చిన్న మట్టిపాత్ర. **తాలుపు**[1] రూ. తాల్పు[1]. వి. 1. కూర మొ. వాటి తిరగబోత, తాలింపు, పోపు. భీమ. 2.139; 2. తాలిక.

**తాలుక** విశ. కపటంగల.

**తాలుకతనము** వి. కపటం. దశకు. 5.64.

**తాలుకా** రూ.చూ. తాలూకు. వి. జిల్లాలో ఒకభాగం. పద్మ. యు. 42.

**తాలుకు** రూ.చూ. తాలూకు. వి. జిల్లాలో ఒక భాగం.

**తాలుచు**[1] రూ.చూ. తాల్చు[1]. స.క్రి. 1. పొందు. ఆము. 4.28; 2. (వస్త్రాదుల్ని ధరించు) ధరించు; 3. గ్రహించు, గైకొను; 4. వహించు, మోయు; 5. పూను, అవలంబించు; 6. గుడ్లుపెట్టు.

**తాలుచు**[2] రూ.చూ. తాల్చు[2]. స.క్రి. మెత్తని పిండినుంచి నూకను విడదీయటానికి కోడు.

**తాలుచు**[3] రూ.చూ. తాల్చు[3]. స.క్రి. నూలు మొ. వాటికి పురి ఎక్కించు, పేను, పురిపెట్టు.

**తాలుపరి** చూ **తాలుపు**[2].

**-తాలుపు**[2] చూ. తాలుచు[1]. రూ.చూ.-తాల్పు[2]. విశ. తాల్చే వాడు, ధరించేవాడు.

**తాలుపరి** రూ. తాల్పరి. వి. 1. ధరించినవాడు. అచ్చ. రా. బాల. 3; 2. ధరించినది.

**తాలువ** వి. దవడ. ఆం. భా. 2.143.

సం. తాలు-. కాకుదం, సంస్కృత చవర్గాన్ని ఉచ్చ రించేటప్పుడు జిహ్వ మధ్యం స్పృశించే ఆస్యభాగం.

<సం. తాలు-.

**తాలూక్** రూ.చూ. తాలూకు. వి. జిల్లాలో ఒకభాగం. రా.చ.

**తాలూకా** రూ.చూ. తాలూకు. వి. 1. జిల్లాలో ఒకభాగం. రా. చ.; 2. మహమ్మదీయుల కాలంలో జరిగిన జిల్లా విభజన; 3. సంబంధం.

**తాలూకు** రూ. తలూకు, తాలుకా, తాలుకు, తాలూక్, తాలూకా, తాలూకె, తాలూకే, తాల్కు, తాల్లూకా. వి. 1. సంబంధించి నది. కళింగశాసనం, కళింగదేశచరిత్ర. పు. 139. క్రీ. శ. 1715; 2. సంబంధం.

హిం. తాల్లుక్, తఅల్లుక్, సంబంధం; మరా. తాలుకా; ఉ. తఅల్లుక్. సంబంధం, సంపర్కం; పార. తఅల్లుక్. బంధుత్వం, సంబంధం; అర. తఅల్లుక్. బంధుత్వం, స్నేహం.

<ఉ. తఅల్లుక్.

**తాలూకులు** రూ.చూ. తళుకులు. వి.బ.వ. రాళ్ళుబిగించిన సాదాకమ్మలు.

**తాలూకె** రూ.చూ. తాలూకు. వి. సంబంధం.

**తాలూకే** రూ.చూ. తాలూకు. వి. సంబంధం.

**తాల్కు** రూ.చూ. తాలిక[2]. వి. ఒరలు తొట్లు మొ. వాటిని చేయటానికి మూరెడు నిలువుతో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగాచేసిన మట్టిముద్ద.

**తాల్కు** రూ.చూ. తాలూకు. వి. సంబంధం.

**తాల్చు**[1] రూ. తాలుచు. స.క్రి. **1**. గ్రహించు, కైకొను. భార. ఆది. 3.47 ; **2**. వహించు, మోయు. భార. ఆది. 4.195 ; **3**. పొందు. భార. ఆది. 4.243 ; **4**. వస్త్రాదుల్ని ధరించు, ధరించు. భార. ఆరణ్య. 3.82 ; **5**. పూను, అవలంబించు. ప్రబోధ. 2.7 ; **6**. గుడ్లుపెట్టు. వసు. 4.134.

క. తాళ్, తాళు (తాల్ద్-). పట్టుకొను, తీసుకొను, ఆనుకొను, సంపాదించు, పొందు, అనుభవం, ఓర్పుతో బాధపడు, ఓర్పుతోఉండు, సహించు, పట్టుదల. తాల్దు. పట్టుకొను, తాళిమె, తాళుమె, తాళ్మె. రోగిసహనం, ఓర్పు, తళె. పట్టుకొను, భరించు ; తు. తాళుని. భరించు, సహించు, బాధపడు, సహనం కలిగిన, తాళ్మె. సహనం, ఓర్పు ; త. తాళు (తాళి). భరించు, బాధపడు, సహించు, విలువగు, సంభవమగు, ఆచరించదగిన ; కో. త.ళ్ (త.ళ్య్). ఆగివేచియుండు.

**తాల్చు**[2] రూ. తాలుచు[2], తాల్చు. స.క్రి. మెత్తనిపిండినుంచి నూకను విడదీయటానికి చేటతోకొడు.

త. తాఱ్ఱు. చేటతో చెరగు, చెరగటం.

<మూ. ద్రా. *తాల్-త్-/*తాత్-త్-.

**తాల్చు**[3] రూ. తాలుచు[3]. స.క్రి. నూలు మొ. వాటికిపురి ఎక్కించు, పేను, పురిపెట్టు. విజ్ఞా. ఆచా. 25.

క. తళ్. చేరు, పేను, జతకూడు. తళె. బంధం, పలుపు. తళ్ళి. కూడిక, సహవాసం, దళె. చేరికుట్టు. అతుకు ; కొడ. తళె, దళె. తాడుముడి, జారుముడి ; తు. తలె. కాలిబంధం, తలెపుని. అడ్డగించు, ఆపివేయు. తళ్లి, లావాదేవీలు, సహవాసం ; త. తళై (తళైవ్-, తళైన్త్-). బిగించు, బద్ధునిచేయు, బంధం. (తళైప్ప్-, తళైత్త్-). బిగించు, బద్ధునిచేయు, బంధం, ముడిపెట్టు, బంధించు, బిగించు, బంధించు, తాడు. తళైయమ్. బంధాలు, సంకెళ్ళు ; మ. తళ. సంకెళ్ళు, కాలిబంధం. తళెక్క. బంధించు, బంధం. తళెప్పు. బంధన.

**తాల్పరి** చూ. తాల్పు[2].

**తాల్పు**[1] చూ. తాలు[3]. రూ.చూ. తాలుపు[1]. వి. తాలిక. సిం. ద్వా. 4.234 ; **2**. కూర. మొ. వాటి తిరగబోత, పోగపు. తాలింపు.

కొండ. తాలెప్. తాలింపు.

**తాల్పు**[2] చూ. తాలుచు[1]. రూ. తాలుపు[2]. విణ. తాల్చేవాడు, ధరించేవాడు. నీలా. 1.1.

**తాల్పరి** రూ.చూ. తాలుపరి. వి. **1**. ధరించిన వాడు. అచ్చ.రా. సుందర. 151 ; **2**. ధరించినది.

**తాల్మి** చూ. తాలు[1].

**తాల్మికత్తియ** చూ. తాలు[1].

**తాల్మికత్తె** చూ. తాలు[1].

**తాల్మికాఁడు** చూ. తాలు[1].

**తాల్మిడు** చూ. తాలు[1].

**తాల్మింటి** వి. ఆయుధవిశేషం. కువ. చ. 5.4.

క. తాలి. లోహం. మింటె. ఆయుధం.

<క. తాలిమింటె.

**తాల్మితూలు** చూ. తాలు[1].

**తాల్లారాటి** రూ.చూ. తాళ్ళరాటి. వి. ఒకరకంరాటి.

**తాల్లూకా** రూ.చూ. తాలూకు. వి. సంబంధం.

**తాల్చు** రూ.చూ. తాల్చు[2]. స.క్రి. జల్లెడను రెండుచేతులతో పట్టుకొని గుండ్రంగా తిప్పి జల్లించు.

**తాళక** రూ. చూ. తాలిక[2]. వి. ఒరలు, తొట్లు మొ. చేయడానికి మూరెడు నిలువుతో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగాచేసిన మట్టిముద్ద.

**తాళగించు** అ.క్రి. **1**. తాళంవేయు. నృసింహ. 2.82 ; **2**. రవళించు, ధ్వని చేయు. భాగ. 6.101.

సం. తాళ-. పాడేటప్పుడు లయానుగుణంగా చేతులతో చరచే చరుపు.

<సం. తాళ - + - ఇంచు[3].

**తాళగిరి** వి. తాళం వాయించేవాడు, అం.భా. 2.287.

సం. తాళ-. పాడేటప్పుడు తాళానుగుణంగా చేతులతో చరచే చప్పుడు.

**తాళచిటితాళాలు** వి.బ.వ. చిన్నతాళాలు. ద.హిం.శా. సంపు. 4, శా.సం. 134. క్రీ.శ. 1470.

**తాళపుచెయ్యి** చూ. తాళము.

**తాళపుచెవి** చూ. తాళము.

**తాళపుఁదాకు** చూ. తాళము.

**తాళము** రూ. తాలం. వి. **1**. మల్లబంధ విశేషం. భార. విరా. 2.109 ; అం.భా. 2.22 ; **2**. మరానులో బెండకాయ చక్రం పక్కన బిగించిన ఇనపరేకు.

క. తాల్. తలుపుకమ్మి లేక గడియ ; తాపాళ్. కమ్మి, గడియ ; కొడ. త.ళి. తలుపుగడియ ; తు. తొర్గొలు. తాళంచెవి ; త. తాల్. గడియ, కమ్మి, గొళ్ళెం, దూలాలకి ఆధారంగా గోడలోవుంచే మొద్దులు, తాల్-కొక్కల్, తాలి-కొక్కల్, తాల్-కోల్, తాల్-ప్పాళ్. గడియ, కమ్మి ; త. తాళ్. గడియ, కమ్మి, గొళ్ళెం, తాళం ; మ. తాలి, తలాతు, తాపు, తాకుక్కలి. గడియ, కమ్మి, గొళ్ళెం, తాకొక్కల్. తాళంచెవి ; కో. త.కొ.ల్, త.కొ.ల్గ్. యూరపుతాళం, కప్పతాళం : తొ. తస్త్. పశువులదొడ్డి, వాకిలికమ్మి.

**తాళపుచెయ్యి** వి. తాళంచెవి. <తాళము + చెయ్యి. **తాళపుచెవి** వి. బీగానికున్న చెవి. < తాళము + చెవి[2]. **తాళపుఁదాకు(-తాకు)** వి. తాళంలోపలి తగులు నూడ్చే దొంగవాని సాధనం. వేంక. పంచ. 3.199. **తాళముపట్టుట** వి. **1**. కోపగించటం ; **2**. భరతం పట్టటం ; **3**. అపహసించటం. **తాళవట్టియ** వి. వీణపక్కన తాళం వేయటానికి అమర్చిన తీగ. బసవ. 3.927 పం.

**తాళవట్టియ** చూ. తాళము.

**తాళవారం** రూ.చూ. తాళువారము. వి. వసారా.

**తాళాధ్యాయమువేయు** స.క్రి. రాగం ఏడుపు వచ్చేటట్లు కొట్టు.

సం. తాలాధ్యాయ -. (సంగీతంలో) తాళభాగం.

<సం. తాలాధ్యాయ - + - ము + వేయు.

**తాళాబందు** వి. జరిగిపోయిన సంవత్సరం యొక్క పూర్తి లెక్కలు.

**తాళి**[1] చూ. తాడు[1]. రూ. తాలి, తాళీ. వి. **1**. మంగళ

సూత్రం. పాండు. 4.144 ; 2. లలంతికా విశేషం, వేలాడే ఒకవిధమైనహారం ఉ.రా. 5.305 ; 3. పతకం. రసిక. 1.83.

క. తు. తాలి, తాళి. మంగళసూత్రం ; త. తాలి. మంగళసూత్రం, పిల్లల కంఠహారం, పిల్లలమెడకు కట్టే తాయెత్తు ; మ. తాలి. మంగళసూత్రం ; తొ. తొల్య్. స్త్రీల బంగారపు కంఠాభరణం ; కొలా. తళ్య్. పెద్ద కంఠహారం.

**తాళిగట్టు(-కట్టు)** స.క్రి. పెళ్ళాడు. **తాళిగోణము** రూ. తాళిగోణాము. వి. పైనపతకం కట్టినగోచి, లంగోటీ. పాండు. 3.10. **తాళిగోణాము** రూ.చూ. తాళిగోణము. వి. పైనపతకం కట్టినగోచి. **తాళిపతకము** వి. మంగళసూత్రానికి కట్టే బంగారు ఆభరణం. ప్రబంధ. 273. **తాళిబొట్టు** వి. మంగళసూత్రానికి కట్టే బంగారు ఆభరణం. విప్ర. 1.4.

**తాళి**[2] వి. నెయ్యికి వాడేపాత్ర.

సం. స్థాలీ. కుండ, మూకుడు, సోమపాత్ర ; హిం. ఉ. థాలీ. పళ్ళెం.

<ఉ. థాలీ.

**తాళిక**[1] రూ.చూ. తాలిక[2]. వి. ఒరలు తొట్లు మొ.వి చేయడానికి మూరెడు నిలువుతో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగా చేసిన మట్టిముద్ద.

**తాళిక**[2] చూ. తాళు.

**తాళికగలవా(డు** చూ. తాళు.

**తాళించు**[1] స.క్రి. జూదమాడేటపుడు కిందవేయటానికి పాచికల్ని చేతిలో వుంచుకొని అటూ ఇటూ తిప్పు. ఉ.హరి. 3.120.

**తాళించు**[2] రూ.చూ. తాలించు[2]. స.క్రి. కూరమొదలైనవాటిని పొగచు.

**తాళిదము** రూ.చూ. తాలిదము. వి. 1. తాలింపుపెట్టిన పదార్థం. అష్ట మ. క. 5.248 పు. 6 పం. ; 2. తాలింపు, పొగపు.

**తాళిమి** రూ.చూ. తాల్మి. వి. 1. ధైర్యం, మనఃస్థైర్యం ; 2. క్షమ, ఓర్పు.

**తాళింపు** రూ.చూ. తాలింపు. వి. కూరలు మొ. వాటిని పోపు పెట్టడం.

**తాళిసపత్తిరి** రూ. తాళిసపత్రి. వి. ఒకానొక మందుదినుసు.

సం. తాలీసపత్త్ర-. ఓషధీ విశేషం.

<సం. తాలీసపత్త్ర-.

**తాళిసపత్రి** రూ.చూ. తాళిసపత్తిరి. వి. ఒకానొక మందు దినుసు.

**తాళీ** రూ.చూ. తాళి[1]. వి. 1. లలంతికా విశేషం, వేలాడే ఒకవిధమైన హారం. ఉ.రా. 5.305 ; 2. పతకం. ప్రబంధ. 605 ; 3. మంగళసూత్రం.

**తాళీకు(డు** రూ. దాశీకు(డు. విణ. కార్యసాధకుడైనవాడు, పూనిన పనిని నిర్వహించేవాడు. ఆం. భా. 3.4.

**తాళు** రూ.చూ. తాలు[1]. స.క్రి. సహించు. ఓర్చు. పల్నా. 50పు ; అ.క్రి. ఆగు, నిదానించిఉండు. దశా. 2.365.

**తాళిక**[2] విణ. 1. సహ్యమైన, ఓర్పుకలిగిన. వేమన. 3.117 ; 2. చాలిన సమర్థమైన ; వి. శాంతి, ఓర్పు. ఆం.భా. 1.138. క. తాళికె. బాధ, ఓర్పు, రోగినహనం, పట్టుదల. **తాళికగలవా(డు(-కలవా(డు)** విణ. క్షమగలవాడు, సత్యమైనవాడు. **తాళుకొను** అ.క్రి. 1. ఆగు, నిదానించిఉండు. విప్ర. 3.44 ; 2. ఓర్చు, సహించు. దశా. 2.41.

**తాళువారము** రూ. తాళవారం, తాళ్వారము, తావారము. వి. వసారా, పంచాది. శుక. 3.481.

క. తాఱి. కిందుగాఉన్న, ఏటవాలైన, వాలిన, కింది భాగం, తాఱవార. ఇంటికన్నా కిందుగావున్న వసారా ; త. తాఱ-వారం; తావారం, తాళ్ వారం. ఏటవాలైన ఇంటిపైకప్పు, వసారా ; మ. తావివారం, వసారా, ఇంటికన్నా కిందుగాఉన్నది, ఏటవాలు.

<త. తాళ్వారం.

**తాళ్ళకట్ట** చూ. తాడు[2].

**తాళ్ళకడవ** చూ. తాడు[1].

**తాళ్ళగుత్తి** చూ. తాడు[2].

**తాళ్ళపాములు** చూ. తాడు[2].

**తాళ్ళరాటి** చూ. తాడు[2].

**తాళ్వారము** రూ.చూ. తాళువారము. వి. వసారా.

**తావ.** వి. మట్టిపాత్ర.

**తావకాళ్లు** చూ. తావలము. రూ. తావకోళ్లు, తావుకోళ్లు. వి.బ.వ. ఏతంతోడేవాడు కాళ్లుంచుకోడానికి అమర్చిన కఱ్ఱపెట్టెలు.

**తావకోళ్లు** రూ.చూ. తావకాళ్లు. వి.బ.వ. ఏతాం ఎత్తేవాడు కాళ్లుంచుకోడానికి అమర్చిన కఱ్ఱపట్టెలు.

**తావగొను(-కొను)** రూ. తావుకొను, తావుగొను. అ.క్రి. 1. స్థైర్యం పొందు. కు.సం. 5.44 ; 2. తాళు, ఓర్చు. కు.సం. 5.89 ; 3. నెలకొను. కు.సం. 10.56 ; 4. ఉండు.

**తావడము** రూ. తావళము. వి. హారం, సరం, భక్తులు ధరించే హారం. శృం.నై. 8.170.

క. తావడ. మగవాళ్ళు ధరించే, బొడ్డుదాకా వేలాడే, కలువపువ్వుల్తో కూడిన ఒకరకం కంఠహారం ; త. తాబ్‌వటమ్. ముత్యాలు లేక పూసల కంఠహారం, రుద్రాక్షపూసలదండ ; మ. తాబ్‌వటమ్, తావటమ్. బంగారు, ముత్యాల కంఠహారం. పో.చూ. త. తాబ్, వటమ్.

**తావరము** రూ.చూ. తావలము. విణ. స్థిరమైన. విప్ర. 2.33.

**తావలు** చూ. తావు[1].

**తావలము** రూ. తావరము. వి. 1. స్థానం, ఉనికిపట్టు. భార. విరా. 5.382 ; 2. ఆధారం, ప్రాపు, ఆశ్రయం. భార. శాంతి. 2.169 ; 3. అవకాశం, తెరపి. కళా. 6.11 ; 4. తార్కాణం, దృష్టాంతం. రామాభ్యు. 5.139 ; 5. స్థలం. ఆం.భా. 2.13 ; విణ. స్థిరమైన, విడువని. వసు. 1.121.

సం. స్థావర-. జడపదార్థం ; ప్రా. థావర- ; పా. థావర- ; అప. అ.మా. థావర ;

త. తావళమ్ ; మ. తావళమ్.

<ప్రా. థావర.

**తావళము** రూ.చూ. తావడము. వి. 1. భక్తులు ధరించే

గుౘ్రాక్షలమాల. నవనాథ. 3.231. పు. 23 పం.; 2. హారం, సరం. ఆం.భా. 2.149.

**తావారము** రూ.చూ. తాళువారము. వి. వసారా.

**తావి** వి. 1. వాసన, సువాసన, పరిమళం. భార. విరా. 2.64 ; 2. పళ్ళపాచి. శుక. 3.44.

**తావికొను** స.క్రి. 1. వాసన చూచు. కు.సం. 9.157 ; 2. రుచి చూచు. కు.సం. 12.111. **తావిగట్టు** వి. మలయ పర్వతం, గంధపు కొండ. యయా. 2.61. **తావిగుబ్బలి** వి. మలయ పర్వతం, గంధపు కొండ. యయా. 2.12. **తావిచెంగలువ** వి. పరిమళంగల ఎఱ్ఱకలువ, సౌగంధికం. దశా. 3.35. **తావితాల్పరి** వి. గంధ వహుడు, వాయువు. ప్రబంధ. 217. < తావి తాల్చు + -అరి[4]. **తావినూనె** వి. తావిగల నూనె, అత్తరు. **తావిమల** వి. మలయపర్వతం. అచ్చ.రా. సుందర. 161. **తావిమోపరి** వి. గంధవహుడు, వాయువు. < తావిమోచు + -అరి[4]. **తావివిలుకాఁడు** రూ. తావివిల్కాఁడు. వి. పుష్పధన్వుడు, మన్మథుడు. రామాభ్యు. 2.95. **తావివిల్కాఁడు** రూ.చూ. తావివిలుకాఁడు. వి. పుష్పధన్వుడు, మన్మథుడు. **తావివోవు(-పోవు)** అ.క్రి. నిర్గంధమగు, పరిమళహీనమగు. విప్ర. 2.29. **తావుల కొండ** వి. మలయపర్వతం, గంధపుకొండ. వేంక. పంచ. 4.211.

**తావీజు** రూ.చూ. తాయెత. వి. రక్ష, తాయెత్తు.

**తావు[1]** రూ. టావు, ఠావు. వి. 1. తావలం, స్థానం, చోటు. పల్నా. పు. 10 ; 2. కళాస్థానం. కవిరాజ. 5.216.

క. తావు ; త. తావు.

సం. స్థాప-. నిలబెట్టటం ; ప్రా. ధాఉ ; శౌ. తావ. స్థలం ; పా. దామ ; అప. ధాఉ, ఠాఉ.

**తావఱు** అ.క్రి. స్థానం కోల్పోవు. కు.సం. 5.162. < తావు[1] + అఱు[1]. **తావుకొను** రూ.చూ. తావగొను. అ.క్రి. 1. చిత్తస్థైర్యంతో ఉండు, మనసు కుదిరిక కలిగి ఉండు. నిర్వ.రా. 8.109 ; 2. నెలకొను, వసించు. ఉ.రా. 8.36 ; 3. ఉండు. చంపూ.రా. 3.74. **తావుకోళ్లు** రూ.చూ. తావకాళ్లు. వి.బ.వ. ఏతం తోడేవాడు కాళ్ళుంచు కోడానికి అమర్చిన కఱ్ఱపట్టెలు. **తావుగొను(-కొను)** రూ.చూ. తావగొను. అ.క్రి. 1. నెలకొను ; 2. నిలకడ పొందు, స్థైర్యం పొందు ; 3. తాళు, ఓర్చు. **తావుసుడి** రూ.చూ. తాకుసుడి. వి. ఎద్దులకు నడిపీపున ఉండే సుడి.

**తావు[2]** రూ.చూ. త్రావు. స.క్రి. తాగు.

**తావులకొండ** చూ. తావి.

**తావేజు** రూ.చూ. తాయెత. వి. 1. రక్షకోసంగాని అలంకారం కోసంగాని తలమీదగాని మెడలోగాని సందిటగాని ధరించే వస్తువిశేషం ; 2. కేయూరం, బాహుపురి.

**తావేరేకులు** వి.బ.వ. పెనాలు.

ఒ. తావా. పెనం.

< ఒ. తావా + రేకు + -లు.

**తావేలుబుఱ్ఱ** రూ.చూ. తాఁబేలుబుఱ్ఱ. వి. తాబేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్నమూతితో ఉండే నీళ్ళపాత్ర.

**తాశాకుండ** రూ. టాశాకుండ. టాసాకుండ, తాజాకుండ, తాశెకుండ, తాషేకుండ, తాసాకుండ. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర, చర్మకట్టు వాద్యానికి వాడే మట్టిపాత్ర.

**తాశమార్పు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగులోతుతో అంచు సన్నంగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాశామార్పు** రూ. తాశమార్పు, తాశామాల్పు, తాశెమెరుపు, తాశేమార్పు, తాషామార్పు, తాసామరుపు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాశామాల్పు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాశిలుదారు** రూ.చూ. తహశీల్‌దార్. వి. శిస్తులు వసూలు చేసే ఉద్యోగి.

**తాశెకుండ** రూ.చూ. తాశాకుండ. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాశెమెరుపు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాశేమార్పు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచుసన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాషా** వి. చర్మవాద్య విశేషం, పద్మ.యు. 272.

హిం. తాశా. చర్మవాద్య విశేషం ; మరా. తాశా ; ఉ. తాసా ; పార. తాసా ; అర. తాస్.

< ఉ. తాసా.

**తాషామార్పు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాషేకుండ** రూ.చూ. తాశాకుండ. వి. గుండ్రంగా 12 అంగుళాలు వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచుసన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాసనపురాయి** రూ. శాసన్రాయి, సాసనంరాయి. వి. ఊరి సరిహద్దును సూచించే పొలిమేరరాయి.

సం. శాసన-. చట్టం, పరిపాలన, ఆజ్ఞ.

< సం. శాసన- + రాయి.

**తాసాకుండ** రూ.చూ. తాశాకుండ. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడగు లోతుతో అంచుసన్నగా అడుగున బోడిగా ఉండేమట్టిపాత్ర.

**తాసామరుపు** రూ.చూ. తాశామార్పు. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంతో అర్ధడుగు లోతుతో అంచు సన్నగా అడుగున బోడిగా ఉండే మట్టిపాత్ర.

**తాసు[1]** రూ.చూ. త్రాసు. వి. తక్కెడ, తుల.

**తాసు[2]** వి. పొరలు పొరలుగా ఉన్న బండరాళ్ళలోని విడి విడి

పొరలను, గుర్తించడానికి అనువుగా ఉన్న గీత.

**తాస్కారము** వి. నిర్లక్ష్యం.

సం. తస్కర-. దొంగ.

**తాసీలు** రూ.చూ. తహసీలు. వి. 1. ఆజ్ఞ. రంగా. చ. 2. 39 ; 2. పన్ను.

**తాసీల్దారు** రూ.చూ. తహశీల్‌దార్. వి. ఆజ్ఞ ఇచ్చేఅధికారి.

**తాహతు** రూ.చూ. తహకత్తు. వి. శక్తి, సామర్థ్యం.

**తాహదు** రూ.చూ. తాకీతు. వి. అజ్ఞాపత్రం.

**తాహుదు** రూ.చూ. తాకీతు. వి. ఆజ్ఞాపత్రం.

**తాటు** రూ. తాడి, తాడు[1], తాండె. వి. తాటిచెట్టు. విప్పర్లశాస నం. క్రీ. శ. 641 (Borassus Flabelliforenis).

గోం. తాడ్, తాడి, కల్లుతాడి, తాదీకల్. తాటికల్లు ; కొం. టాడ్‌యరన్, టాటిమరన్. తాటిచెట్టు ; కువి. తాటిమార్సు, తాతి. తాటిచెట్టు ; నా. తాడ్. కల్లుతాడి ; కురు. తాడ్. తాటిచెట్టు ; మాల్తో. తల్మి.

సం. తాల- ; ప్రా. తాడ-, తాల.

<మూ.ద్రా. *తాట్.

**-తి-**[1] ప్రత్య. ఇది ఔప విభక్తికాలైన. 'అట్టు' మొ. శబ్దాలకు ఏకవచనంలో అంతాగమంగానూ 'నూయి' మొ. శబ్దాలకు ఉభయ వచనాల లోనూ అంత్యాదేశంగానూ వస్తుంది.

<మూ. ద్రా. *-త్త్-.

**తి-**[2] ప్రత్య. భూతకాలక్రియావృత్తి అయిన ధాతువుకు మధ్య-మోత్తమ పురుష ప్రత్యయాలు పరమైనపుడు ధాతువుకు పురుషప్రత్యయానికి మధ్య ఆగమంగా వస్తుంది.

<మూ. ద్రా. -*త్త్.

**తికడీ** రూ.చూ. టికిటి. వి. చేతిలో నూలువడికే ఇనప పుల్ల.

**తికతిక** చూ. తిక్క[1]. విఞ. కలత పొందిన, క్షోభపొందిన. ప్రబంధ. 796.

**తికబెట్టు (-పెట్టు)** చూ. తిగియు. స.క్రి. దిగవేయు, బిగించు.

**తికమక** రూ. తికమకము. వి. 1. తడబాటు, తొట్రుపాటు. పల్నా. 201 ; 2. బాధ, పీడ. సమీర. 6.179 ; 3. అవయవాల అస్వాధీనత, శరీరం అవశత ; విఞ. కలగిన, క్షోభించిన. సారంగ. 1.94.

క. తిక్కలు. తడబాటు, తొట్రుపాటు ; త. తికై (తికైప్పు-, తికైత్త్-), తికైప్పు. కలతపొందిన ; తొ. తిక్స్- (తిక్సొ-), తిక్స్‌ఫ్-. (తిక్త్స-) ; పో. చూ. త. తికిల్. భయం.

**తికమకగుడుచు (-కుడుచు)** అ.క్రి. వివశుడగు. భాగ. 6.308. **తికమకగొను (-కొను)** అ.క్రి. తొట్రుపడు, తడబడు, తికమకపొందు. భాగ. 6.175. **తికమకపడు** అ.క్రి. కలత చెందు. **తికమకలాడు** అ.క్రి. 1. కలతపొందు, క్షోభపడు ; 2. తొట్రుపడు, తడబడు ; 3. (అంగాలు) వివశతపొందు, <తికమక + -లు + ఆడు. **తికమకలుగొను (-కొను)** అ.క్రి. తికమకపొందు, తొట్రుపడు, తడబడు. పి. శకు. 3.202.

**తికమకలుసేయు (-చేయు)** స.క్రి. తికమకలుపెట్టు, క్షోభ పెట్టు, కలతపొందించు. విజయ. 2.199.

**తికమకము** రూ.చూ. తికమక. విఞ. క్షోభించిన, కలతపొందిన. వేంక. పంచ. 5.31.

**తికము** రూ. టికము. రెండుపిరుదులును వెన్నెముక కలిసే చోటు, వెన్నెముక అథోభాగం. ఆం. భా. 2.139.

సం. త్రిక-. మూడు ; ప్రా. తిగ-, తిఅ-, తియ- ; అ. మా. తిగం. మూడు దారులు కలిసే చోటు ; తిఅ, తియ. మూడు ; జై. మహా. తియం ; పా. తిక- ; ఒ తిఅ ; పం. తిఅ.

క. తిక, తిగ. మేఖల, జఘనం, గుదం.

చూ. టికము.

<ప్రా. తిగ-.

**తికిటి** రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని "A" అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం.

**తిక్క** రూ. త్రిక్క[1]. వి. 1. ఉన్మాదం, వెర్రి. ఉ. రా. 4.308 ; 2. తీవ్రస్వభావం ; 3. వామిగాలికి లేవకుండా బిగించే గడ్డితాడు ; విఞ. 1. వెర్రిఎత్తినవాడు, ఉన్మాది, వెర్రిఎత్తినది ; 2. తీవ్రస్వభావంకల.

సం. తీక్ష్ణ-. తీవ్రమయిన ; ప్రా. తిక్ఖ. పరుషం, క్రోధం ; జై. మహా. తిక్ఖ ; శౌ. తిక్ఖ ; అ. మా. తిక్ఖ ; మా. తిక్ఖ ; పా. తిక్ఖ ; అప. తిక్ఖ.

క. తిక్కలు. తడబాటు, తొట్రుపాటు ; త. తికై (తికైప్పు-తికైత్-), తిక్‌ప్పు. కలతపొందిన ; తొ. తిక్స్- (తిక్సొ-), తిక్స్‌ఫ్- (తిక్త్స-) ; పో. చూ. త. తికిల్. భయం.

<ప్రా. తిక్ఖ-.

**తిక్కగొను (-కొను)** స.క్రి. తిక్కపట్టు, వెర్రెత్తు. వేమన. 1.71. **తిక్కటమక్కట** వి. కలత, క్షోభం. **తిక్కతెవులు** వి. నువ్వు, కంది మొ. పైర్లు కాయకుండా పొయ్యే తెగులు. **తిక్కదిప్పు (-త్రిప్పు)** స.క్రి. గర్వమణచు. **తిక్కపట్టు** వి. విడవనిపట్టు, వెర్రిపట్టు, మూర్ఖపు పట్టుదల ; అ.క్రి. 1. పిచ్చిపట్టు ; 2. మొండిపట్టు. **తిక్కపాసు** వి. తిక్కమనిషి. **తిక్కబుచ్చిగాడు** వి. అమాయకుడు. **తిక్కబెట్టు (-పెట్టు)** స.క్రి. తిరిగేటట్లుచేయు. **తిక్కమేళం** వి. 1. వెర్రిబాగుల తనం ; 2. తిక్కవారిగుంపు. **తిక్కయెత్తు(-ఎత్తు)** అ.క్రి. పిచ్చిపట్టు. **తిక్కశంకరయ్య** వి. వెర్రిబాగులవాడు.

**తిక్కటి** రూ. చూ. త్రిక్కటి. వి. 1. ఆయుధ విశేషం. రామాభ్యు. 8.16 ; 2. ఇటిక మొదలైనవి అడ్డంగాపేర్చిన పేర్పు ; 3. ఒకదాని మధ్యవరకు మరొకటి దూర్చి పేర్చిన ఇటికరాళ్ళవరస ; 4. మూడుకర్రలతో నిర్మించబడిన అను గ్రర.

**తిక్కడ్** రూ. చూ. తిక్కడి[2]. వి. చేతిలో నూలువడికే ఇనప పుల్ల.

**తిక్కడ** రూ.చూ. టికిటి. వి. ఇటిక మొదలైనవి అడ్డంగా పేర్చిన పేర్పు.

**తిక్కడి**[1] రూ.చూ. టికిటి. వి. మూడు కర్రలతో నిర్మించబడిన అనుగ్రర.

**తిక్కడికంచు** వి. చావపుడు అగ్గి ఎత్తుకొనిపోవడానికి వాడే మట్టిపాత్ర. **తిక్కడికట్ట** వి. వామిపై కొననపెట్టే గడ్డి కట్ట.

**తిక్కడి**[2] రూ. తిక్కడ్, తెక్కడ. వి. 1. నూలువడికే చిప్ప

కదురు ; **2.** నారనుంచి దారంతీసే కదురు.

క. తికడి, తిక్కడి. నూలువడికే కదురు.

**తిక్కతీత** వి. తీతువపక్షి.

**తిక్కనార** చూ. కిత్తనార. వి. అనాసమొక్క మాదిరి ఒకరకం మొక్కనుంచి తీసిన నార.

**తిక్కటి** రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని "A" అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం.

**తిక్కడి** రూ.చూ. టికిటి. వి. **1.** ఇటిక మొదలైనవి అడ్డంగా పేర్చినపేర్పు ; **2.** ఆంగ్లంలోని "A" అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం.

**తిక్కడికర్ర** వి. పోటీగాపెట్టిన కర్ర. **తిక్కడింటు** వి. గడ్డిపేనిన తాడు. **తిక్కడితడికె** వి. ఎదురుబద్దలతో అల్లిన తడిక. **తిక్కడిదబ్బ** వి. మిద్దె కప్పుకింద బద్దలతో అల్లిన తడికె. **తిక్కడిపుల్ల(లు)** వి. తిక్కడి కట్టుబడిలో, చివర బిగించిన పుల్ల(లు). **తిక్కడిమొద్దు** వి. రాటి తిరగటానికి, రాటిదూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు.

**తిక్కు** వి. తక్కెడ తాడులో పడిన మెలిక. స.క్రి. **1.** రుద్దు, గంజి వడగట్టటానికి గుడ్డలోపోసి రుద్దు ; **2.** రూడతో చదునుచేయు ; **3.** దులుపు.

క. తిక్కు, తిక్కను. రుద్దు; తు. తిక్కుని.

<క. తిక్కు.

**తిక్కెడ** రూ.చూ. తిక్కడి[2]. వి. తాడుకు పురిబెట్టే సాధనం.

**తిక్కెడి** రూ.చూ. టికిటి. వి. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొదలైనవి కదలకుండా నిలపడానికి రెండుకర్రలను పైపైపున బిగించికట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు.

**తిగ** రూ. తివ. నర్వ. మూడు. ఉ. హరి. 3.121.

సం. త్రిక-; ప్రా. తిగ-, తిఅ ; అమా. తిఅ, తిక, తియ, తీఅ; పా. తిక ; అప. తిగ ;

క. తిగ.

<ప్రా. తిగ-.

**తిగకంటి** వి. త్ర్యంబకుడు, శివుడు. అచ్చ.రా. అయో. 13, **తిగకన్నులవేల్పు** వి. శివుడు. నీలా. 2.36. **తిగకాళ్ల దేవర** వి. నిప్పు. సాంబ. దేవ. 12. **తిగకొటికలు** వి.బ.వ. మూడుగ్రామాలు. అచ్చ. రా. కిష్కిం. 109. **తిగప్రోలుదాయ** వి. త్రిపురహరుడు, శివుడు. వేంక, దేవ. 5. **తిగప్రోళ్లు** వి.బ.వ. మూడుపురాలు, త్రిపురాలు. నీలా. 1.19. **తిగవంగడపు(బుట్టువు(-పుట్టువు)** వి. వైశ్యుడు. వేంక. మాన. 27, వ్య. మూడో కులంలో పుట్టిన వ్యక్తి. **తిగవంగడము** వి. వైశ్యకులం. వ్య. మూడోకులం. **తిగవంచ** రూ.చూ. తీవంచ. నర్వ. నాలుగు. ఆం.భా. 2.306.

**తిగటు** వి. తెర.

**తిగి** వి. చెరువులోకి వాననీళ్ల వచ్చేవైపు.

త. తికై. దిక్కు.

**తిగిచికొను** చూ. తిగుచు.

**తిగిచికోలు** చూ. తిగుచు.

**తిగిటి** రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని "A" అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్యపరికరం, నేలమట్టం సరిచూడటానికి వాడేది.

**తిగియు** రూ.చూ. తివ్వు. స.క్రి. ఆకర్షించు.

**తిగిరి** రూ. తైరె. వి. కాడిమధ్య పైవేపు కొట్టిన ఇనపమేకు.

**తిగుచు** రూ. తివుచు, తీచు. స.క్రి. **1.** లాగు, ఆకర్షించు, దగ్గరగాలాగుకొను, చేరదీయు. భార.ఆది. 3.32 ; **2.** తీసికొనివచ్చు, తెచ్చు. భార.ఆది. 4.19 ; **3.** వెలికిదీయు, పైకితెచ్చు, తోడు. దశకు. 11.76 ; **4.** విడుల్చు. వదలచేయు. విక్ర. 6.127 ; **5.** లాగివేయు, ఊడదీయు, తొలగించు, పోగొట్టు, విక్ర. 8.101 ; **6.** పెల్లగించు, పెరుకు. మను. 4.37 ; అ.క్రి. తీసిపోవు, తగ్గు. వసు. 2.154.

క. తెగె, తెగి, తెగు. లాగు, తగ్గించు, అదృశ్యమగు ; తెగుని, దెప్పుని ; త. తెక్కు (తెక్కి-), తెవ్వు (తెవ్వి), తెవ్, తెవ్వు, తెవు, తికై, తిచై ; మ. తికయుక ; కో. తెవ్- (తెవ్త్-), తెవ్త్ ; కొలా. తివ్- (తివ్త్-), తివ్వా. తివ్వా. లాగు ; నా. తివ్వా. లాగు. పో.చూ. మాల్తో. తిస్గ్.

మూ.ద.ద్రా. *తిక్-/ *తివ్- ; *తెక్--/ *తెవ్-.

**తిగిచికొను** రూ.చూ. తిగుచుకొను. స.క్రి. ఊడబెరుకు, హరించు. **తిగిచికోలు** రూ. తివిచికోలు, వి. తిగుచుకొనటం, లాగుకొనటం, ఊడబెరకటం. హరి. ఉ. 4.33. **తిగుచుకొను** రూ. తిగిచికొను. స.క్రి. లాగుకొను, ఊడబెరుకు. **తిగుచుడుపోగులు** వి.బ.వ. వేటగాడు వలకుపయోగించేతాళ్ళు. **తిగుచువాడు**. విణ. ఈడ్చేవాడు.

**తిగుట**[1] రూ.చూ. తివుట[1]. వి. ఆసక్తి, కోరిక, తమి. సిం.ద్వా. 7.47.

**తిగుట**[2] రూ. తివుట[2], తీట, తీటి[2], తెగిట, తెవిటి, తైట. వి. తూర్వారపోసేమనిషి కూర్చోడానికి కట్టే మూడుకాళ్ళపీట.

**తిగుల** వి. దేశవిశేషం. జైమిని భా. 1.45.

క. తిగుళర్. తమిళులు ; త. తికళర్.

<క. తిగుళ.

**తిట్ట** వి. **1.** గుట్ట, తిప్ప, రాశి. కు. సం. 5.105 ; **2.** సేనాసమూహం, సేనలగుంపు. భార. విరా. 5.154.

క. తిట్టు. సమూహం ; తిట్టు, తిట్టె, దిడ్డ, దిడ్డుదంటు. గుట్ట, దిబ్బ; తు. దిడ్డు. దిబ్బ; త. తిట్టి, తిట్టు, తిట్టై, తిటర్, తిటవ్, తిటఋ. తటల్. దిబ్బ; మ. తిట్టు, తిట్టు ; కో. తిట్. కొండ ; తొ. తిట్.

**తిట్టము** వి. చిత్ర ప్రారంభంలో రాసే స్థూలాకారం. కు.సం. 5.118.

క. తిట్టు. చిత్రం గీయటానికిముందు రేఖలతో వేసుకునే స్థూలాకారం.

<క. తిట్టు.

**తిట్టాట** చూ. తిట్టు.

**తిట్టాడు** చూ. తిట్టు.

**తిట్టిన మెట్టిన కైవడి** చూ. తిట్టు.

**తిట్టిపోయు** చూ. తిట్టు.

**తిట్టిపోవు** చూ. తిట్టు.

**తిట్టు** స.క్రి. **1.** శపించు. భార. ఆది. 1.138 ; **2.** దూరు,

నిందించు, దూషించు. భార. ఆరణ్య. 3.152; వి. 1. దూషణం, నింద, దూరు. భార. ఉద్యో. 1.331; 2. శాపం. మను. 4.86.

క. తిట్టు. నిందించు, నింద; త. తిట్టు (తిట్టి); బ్రా. ఝుడ్క్.

< మూ.ద్రా. *తిట్ లేదా *చిట్.

తిట్టాట వి. వాక్కలహం, దూషణం. విజ్ఞా. వ్యవ. 103. < తిట్టు + ఆట. తిట్టాడు అ.క్రి. వాక్కలహమాడు. విప్ర. 5.26. < తిట్టు + ఆడు. తిట్టిన మెట్టిన శైవడి అవ్య. ద్రు. దూషిస్తున్నప్పటికీ భూషిస్తున్నట్టే భావించినట్లు. శుక. 1.528. తిట్టిపోయు స.క్రి. తిట్టు, నిందించు. తిట్టిపోవు స.క్రి. తిట్టు. శుక. 4.7. తిట్టుపడు రూ.చూ. తిట్టువడు. స.క్రి. శాపంపొందు. మను. 4.86. తిట్టుపాటు రూ. చూ. తిట్టువాటు. వి. అపవాదు, నింద. తిట్టుపోతు రూ.చూ. తిట్టుబోతు. వి. బూతులు తిట్టేఆడది లేదా మగవాడు. తిట్టుబోతు (-పోతు) రూ. తిట్టుపోతు. వి. నిందించే స్వభావంకల ఆడది లేదా మగవాడు. తిట్టులుపడు అ.క్రి. నిందించబడు. భార. ఉద్యో. 1.131. తిట్టువడు రూ. తిట్టుపడు. అ.క్రి. 1. నిందింపబడు. భాగ. 10.1485; 2. శాపం పొందు. శశా. 4.168. తిట్టువాటు రూ. తిట్టుపాటు. వి. అపవాదు, నింద. రం. రా. అయో. 122పు. 21పం. తిట్లబండి వి. తిట్లవరన. తిట్లమారి వి. నిందించే స్వభావం కలవాడు. తిట్లుతిను అ. క్రి. చీవాట్లుతిను.

తిట్టుమద్ది వి. గట్టి కలపనిచ్చే మద్దిచెట్టు (Terminalia Arifuna).

తిట్లబండి చూ. తిట్టు.

తిట్లమారి చూ. తిట్టు.

తిట్లుతిను చూ. తిట్టు.

తిడి వి. పెట్టెలో ఉండే నూలుకట్ట, లడీ.

హిం. తిక్‌డీ. మంచంయొక్క మూడుతాళ్ళనేత.

తిడిమి రూ. తిడిమ్మి. వి. 1. రథ గమనంలో వచ్చేధ్వనికి అనుకరణం. రామాభ్యు. 8.66; 2. వాద్యధ్వనికి అనుకరణం. ప్రబంధ. 78. ధ్వన్యను.

తిడిమ్మి రూ.చూ. తిడిమి. వి. 1. రథగమనంలో వచ్చేధ్వనికి అనుకరణం. రామాభ్యు. 8.66; 2. వాద్యధ్వనికి అనుకరణం.

తిణింగి రూ. తిణిఁగిణి. వి. మల్లబంధ విశేషం, ముప్పై రెండు విన్నాణాల్లో ఒకటి. ప్రబంధ. 78.

తిణిఁగించు అ.క్రి. తిణిగి అనే మల్లబంధం ఉపయోగించి పట్టు. అష్ట మ. క. 3.151పు. 25పం.

తిణిఁగించు చూ. తిణింగి.

తిణిఁగిణి రూ. చూ. తిణింగి. వి. ముప్పై రెండు విన్నాణాల్లో ఒకటి.

తింట చూ. తిను.

తిండాడు చూ. తిండి[1].

తిండి[1] చూ. తిను. వి. 1. ఆహారం. కు. సం. 7.43; 2. భోజనం, తినడం. క్రీడా. 1.59; విణ. ఆహారంగా ఉన్నది, తినేది. (సమాసాంతంలోనే ఈఅర్థంలో ప్రయుక్తం).

క. తిని. ఆహారం; కొడ. తిండ్. వరి అన్నం తప్ప మిగిలిన ఆహారం; తు. తిని, తిను, తినసు, తెనసు. ఆహారం; త. తిండి, తీన్ని. భక్ష్యపదార్థాలు; మ. తిన్. ఆహారం; కొండ. తినిక; కుఇ. తింబ.

తిండాడు అ.క్రి. కృశించు, సత్త్వహీనమగు, బలహీనమగు. సుద. 2.127. త. తింటాటు. విశ్రాంతి లేకుండా తిరుగు, (మానసికంగా) బాధపడు, తింటాట్టమ్. బాధ, కష్టం, దుఃఖం, విశ్రాంతి లేకుండా తిరగటం. < తిండి[1] + ఆడు. తిండికత్తియ రూ. తిండికత్తె. వి. ఎక్కువగా తినేది, అమిత భక్షకురాలు, ఎక్కువగా తినేది. తిండికత్తె రూ.చూ. తిండికత్తియ. వి. తిండిపోతు, ఎక్కువతిండితినేది. తిండికాఁడు వి. 1. దురాశావంతుడు, లోభి. భార. ఉద్యో. 1.56; 2. తిండిపోతు, మిక్కిలి తినేవాడు. భార. స్త్రీ. 1.19. తిండిపంద వి. ఎక్కువగా తినేవాడు. తిండిపోతు వి. మిక్కిలి తినేవాడు, మిక్కిలితినేది. భార. ద్రోణ. 4.239. తిండీఁడు వి. ఘస్మరుడు, తిండిపోతు. ఆం. నా. శే. 68. తిండీతిప్పలు వి.బ.వ. ఆహారం. మొ. వి.

తిండి[2] వి. దురద, గోకుడు.

సం. తేధా?; మరా. తిడా. దురద.

క. తిన్, తినసు, తినిసు, తెనసు, తిండి. దురద; త. తినవు. దురద.

< మరా. తిడా.

తిండీఁడు చూ. తిండి[1].

తిండీతిప్పలు చూ. తిండి[1].

తిణి రూ. తిణ్ణి. విణ. మూడో, మూడు. ప్రా. శా. 175.పు. క్రి. శ. 668.69.

సం. త్రీణి-. మూడు: ప్రా. తి.; బెం. ఒ. తిని; హిం. ఉ. తీన్.

< సం. త్రీణి-.

తిణ్ణి రూ.చూ. తిణి. విణ. మూడో, మూడు. క్రీ. శ. 668. 69. మూడవ విష్ణువర్ధనుని శాశనం. IA. VII. 185.191.

తిత్తి వి. 1. తోలుసంచి, సంచి. పండి. చ. 5.343, భార. విరా. 2.352; 2. చర్మం, తోలు. భార. శాంతి. 3.285; 3. ఉపాంగం, శ్రుతికోసం ఊదే చర్మ కృతమైన గాన సాధన విశేషం. ఆం. భా. 1.129; 4. భస్త్రి, కొలిమి తిత్తి, కొలిమి ఊదటానికి కమ్మరులు మొ. వారు ఉపయోగించే చర్మకృత సాధనం; 5. సారాయి, నీళ్ళు, నూనె మొ. ద్రవపదార్థాన్ని తీసుకొని పోవటానికి ఉపయోగించే చర్మపాత్ర విశేషం; 6. కోశాకారంగా ఉండే శరీరాంతర అవయవం.

సం. దృతి-. నీళ్ళు మొ. పోసే తోలుతిత్తి, కొలిమి తిత్తి; ప్రా. దిఇ, దితి.

క. తిత్తి, తిది. తోలుసంచి, సంచి; తు. తిత్తి, తిది. సిది, సిదె; త. మ. తిత్తి; కువి. తిత్తూ.

< ప్రా. దితి.

తిత్తికాఁడు వి. సుతికై తిత్తిఊదేవాడు. తిత్తియొల్చు

(-ఒల్చు) రూ.చూ. తిత్తొల్చు. అ.క్రి. చర్మంతీసివేయు. వర. రా. సుందర. 82.18. **తిత్తివ** వి. కథ ; వ్యు.తిత్తి ఊదేటప్పుడు చెప్పుకొనే కథ. **తిత్తొల్చు** రూ. తిత్తియొల్చు. స.క్రి. చమడాలూడగొట్టు, చావదన్ను. బసవ. 7.190.

< తిత్తి + ఒల్చు.

**తిత్తొల్చు** చూ. తిత్తి.

**తిద్దుకొను** రూ.చూ. దిద్దుకొను. స.క్రి. తీర్చుకొను. రాధికా. 1.117.

**తినగాయ** చూ. తిను.

**తినగింజలు** చూ. తిను.

**తినాసము** వి. తినిశం. నెమ్మివృక్షం.

సం. తినిశ-. నెమ్మిచెట్టు ; ప్రా. తినిస-.

<ప్రా. తినిస-.

**తినిఉండబట్టలేక** చూ. తిను.

**తినికుడిచితిమ్మణ్ణిపాడు** చూ. తిను.

**తినిపించు** చూ. తిను.

**తినిజాలరగించుకొను** చూ. తిను.

**తిను** స.క్రి. **1**. భక్షించు, భుజించు. భార. ఆది. 6.294 ; **2**. అనుభవించు. భార. విరా. 4.219 ; **3**. కరచు. కేయూ. 4.76 ; 4. అపహరించు. ఆము. 4.218 ; **5**. నాశం చేయు, చంపు. విష్ణుపు. 7.80 ; 6. బాధించు ; **7**. పాడు చేయు.

క. తిన్, తిన్ను (తిన్ద్-). తిను ; కొడ. తిన్న్- (తిమ్బ్-, తిన్ద్-) ; తు. తిన్పిని, తిన్దుని ; త. తిఙ్, తిన్ (తిన్ఙ్-), (తిన్ప్-, తిన్ఱ్) ; మ. తిన్ను, తిన్నుక ; కో. తిన్-. (తిద్-) ; తొ. తిన్-. (తిద్-) ; గోం. (మరియా.) తిన్ద్, (తిత్-) ; గోం. తిన్ద్-. (తిన్జి) ; కొం. తిన్-. (తిన్జ్-, తిఝ్- ) ; కుఇ. తిన్బ (తిన్-) ; కువి. తిన్జ్-. (తిచ్-), తిన్-, తిన్జలి (S) తిన్నై ; పర్జి. తిన్-. (తిన్ద్-) ; కొలా. తిన్-. (తిన్ద్-) ; నా. తిన్. (తిన్డ్-). తిన్బ ; గ. తిన్-. (తియ్-) ; ఒల్లా. తిన్-. (తియ్-, తిన్డ్-), (S) తిన్- (తియ్-) ; కురు. తిన్ద్- (తిన్ద్చ్-), తిన్ద్నా ; మాల్తో. తిన్డ్, తిన్దె.

<మూ.ద్రా. *తిన్.

**తింట** రూ. తినుట. వి. తినటం, భక్షించటం. భాగ. 9.158. **తినగాయ(-కాయ)** వి. పండబారిన కాయ. **తినగింజలు** వి.బ.వ. తినటానికి అనువైన ముదిరీ ముదరని పాలగింజలు. **తినిఉండబట్టలేక(-పట్టలేక)** అవ్య. అనవసరంగా. **తినికుడిచితిమ్మణ్ణిపాడు** స.క్రి. అనవసరంగా ప్రమేయం లేని దానిలో కల్పించుకొను. **తినిపించు** స.క్రి. తినేటట్లు చేయు. దశా. 2.400. **తినిజాలరగించుకొను** స.క్రి. ఏమితిన్నా హరాయించుకో గలుగు. భార. శాంతి. 1.216. **తినుట** రూ.చూ. తింట. వి. భోజనం చేయటం. **తినుబండము** రూ. తినుబండారము. వి. తినే పదార్థం. **తినుబండారము** రూ.చూ. తినుబండము. వి. చిరుతిండి. **తిన్నూళ్లదిప్పలు పట్టు(-తిప్పలుపట్టు)** అ.క్రి. స్వగ్రామంలోనే కొండలు పట్టి ఉండు, ఆశ్రయం లేక ఉండు. వరాహ. 3.65.

**తినుకు** అ.క్రి. (ప్రసవించటం, విష్టించటం మొ॥ వాటిలో) ఊపిరి బిగపట్టి ముక్కు. బసవ. 7.311. వి. **1**. గుదవేదనం. ఆం.భా. 1.150 ; **2**. ముక్కిముక్కి విష్టించటం.

క. తిణకు, తిణికు, తిణుకు. ఘనీభవించు, దగ్గరకు వచ్చు ; పో.చూ. త. తిణి, తిణుంకు. దట్టమగు, ఘనీభవించు, దగ్గరకు వచ్చు ; మ. తికుక ; మాల్తో. తిన్క్య.

< *తిణుక్క. <మూ.ద్రా. *తిన్-, *తిన్త్-.

**తినె** రూ.చూ. తిన్నె. వి. వేదిక, అరుగు, దేవతాపూజకేర్పరచిన చిన్న అరుగు. విప్ర. 4.32.

**తిన్న** విశ. **1**. మనోజ్ఞమైన, ఇంపైన. భార.విరా. 2.67 ; **2**. అవికలం, ఫలించేది. భార. విరా. 2.287 ; **3**. సౌమ్యం. భార.సౌప్తి. 1 ; **4**. ఉచితం. రం.రా.బాల. 11. పు. 29 పం ; **5**. రుజువు, వంకరలేనిది. పల్నా. 22 ; **6**. యుక్తం. పాండు. 2.121 ; **7**. స్వస్థం, నిశ్చలం. విష్ణుపు. 3. వి. జాగ్రత్తగా శరీరం దగ్గర పెట్టుకోవటం.

సం. తీక్ష్ణ-. చురుకైనది ; ప్రా. తిణ్హ. చొక్కం, శుద్ధం, చతురత, సామర్థ్యం ; అ.మా. తిణ్హ-. కుదిరిక, మెలకువ ; పా. తిణ్హ-. కుదిరిక, మెలకువ.

గోం. తినం. తిన్నని, సరళమైన. తీన్త. తిన్నని, తిగ్నె. సరళమైన ; కొం. తినంఅ. తిన్నని ; కువి. తినంఅ, తినన. తిన్నని.

**తిన్నగా(-కాన్)** క్రి.విశ.ద్రు. సరిగ్గా, నేరుగా. **తిన్నన** విశ. మనోజ్ఞమైన, ఒప్పిదమైన. ఆము. 2.30. వి. **1**. యుక్తత ; **2**. రుజుత్వం ; **3**. స్వస్థత ; **4**. సౌమ్యత. **తిన్నని** విశ. తిన్నగా, సరళ ప్రవర్తనగల, సత్యమైన. **తిన్నఁదనము(-తనము)** వి. **1**. మనోజ్ఞత, చక్కదనం. భార.విరా. 2.292 ; **2**. మెలకువ, జాగ్రత్త. భార.సౌప్తి. 1.16 ; **3**. సౌమ్యత, మంచితనం. భార.సౌప్తి. 1.180 ; **4**. స్వస్థత, కుదిరిక. ఇందు. 3.3 ; **5**. రుజుత్వం ; **6**. యుక్తత, ఔచిత్యం. **తిన్నఁదనముగలవాఁడు** విశ. సరళుడు.

<తిన్న + -తనము + కలవాఁడు.

**తిన్ని** రూ.చూ. తిన్నె. వి. ఎత్తు తక్కువగా ఉండే అరుగు.

**తిన్నియ** రూ.చూ. తిన్నె. వి. **1**. దిబ్బ, తిప్ప. నీలా. 1.27 ; **2**. వేదిక, అరుగు, దేవతా పూజకు ఏర్పరచిన చిన్న అరుగు ; **3**. హస్తినఖం, గవని వాకిట వాటంగా ఏర్పరచిన మట్టిదిబ్బ ; **4**. కొండ.

**తిన్నీరేకు** రూ.చూ. టిన్నురేకు. వి. తగరపురేకు.

**తిన్నూళ్లదిప్పలుపట్టు** చూ. తిను.

**తిన్నె** రూ. తినె, తిన్ని, తిన్నియ, తీనియ, తీనె, దిన్న[2], దిన్నె[1]. వి. **1**. దిబ్బ, తిప్ప. భీమ. 2.44 ; **2**. వేదిక, అరుగు. గా. హరి. పూ. 173 ; **3**. కొండ. ప్రబంధ. 34 ; **4**. గవనివాకిట వాటంగా ఏర్పరచిన మట్టిదిబ్బ, హస్తినఖం. ఆం.భా. 2.21.

క. దిన్నె, దిణ్ణె. దిబ్బ. ఎత్తుఅరుగు ; తు. తిణె, దిన్నె. చిన్నఅరుగు ; త. తిణ్ణై. ఎత్తుదిమ్మ ; మ. తిణ్ణ, తిణ. ఇంటి పై భాగం ; కో. తిఙ్. ఎత్తు ఆసనం ; తొ. తిఙ్, తిఙ్బ్. పడుకొనే ఎత్తిన దిమ్మ.

**తిన్రేకు** రూ.చూ. టిన్ను రేకు. వి. తగరపు రేకు.

**తిపరతాండవము** వి. 1. మనసుకు కుదురుపాటు లేకుండా చేయటం ; 2. కోపంతో చిందులు తొక్కటం.

నం. త్రిపురతాండవ-. త్రిపురాసుర సంహారసంబంధి ఐన తాండవం.

<నం. త్రిపురతాండవ- + -ము

**తిపారం** వి. పొయ్యేకాలం.

**తిపిరి** రూ. తిబిరి. విణ. అనురణనం లేని ఉచ్చనాదం కల. ప్రబంధ. 523 ; వి. 1. మారుపాడు, వ్యత్యాసం ; 2. దురదృష్టం.

తు. తిప్పిలి. రంధ్రం చేసే పరికరం ; కొండ. తిర్ప్ (-త్-). గుండ్రంగా తిప్పు.

**తిపిరికిన్నెర** వి. సొరకాయతో చేసిన వాద్యం. **తిపిరిదండియ** రూ.చూ. తిపిరిదండె. చిన్న పీఠె. రఘు.రా. 2.105. **తిపిరిదండె** రూ. తిపిరిదండియ. వి. చిన్న పీఠె. ఆము. 6.9.

**తిపిలం** వి. గడ్డి కోయటానికి పైరులో కలుపు తీయటానికి పనికి వచ్చే కొడవలి.

**తిపురు** రూ.చూ. తిరుపు. వి. వ్యాపనం.

**తిపురుకట్టు** రూ.చూ. తిరుపుగట్టు. అ.క్రి. వ్యాపించు. విష్ణు. ఉ. 4. ఆ. **తిపురుకొను** రూ.చూ. తిరుపుగొను. అ.క్రి. వ్యాపించు. **తిపురుగొను(-కొను)** రూ.చూ. తిరుపుగొను. అ.క్రి. వ్యాపించు. **తిపురుల్గొను(-కొను)** అ.క్రి. వ్యాపించు. ఇందు. 3.105.

**తిప్ప** రూ.చూ. తెప్ప[3]. వి. 1. దిబ్బ. భీమ. 2.88 ; 2. గుట్ట, చిన్న కొండ, కొండ. ఆము. 3.24 ; 3. రాశి. వసు. 1.100.

**తిప్పకాయ** రూ. డిప్పకాయ, దిప్పకాయ. విణ. ఆకతాయ, పెంకెవాడు, పెంకెది. ద్వి. పరమ. వి. 3.247 పు. ; వి. తిరుగుబోతు. **తిప్పగడ్డి** వి. ఆముపైన మసికింద పడకుండా కప్పడానికి వాడే ఒక రకం గడ్డి. **తిప్పతీఁగ** రూ.చూ. తిప్పతీఁగె. వి. ఒకరకం తీగె, గుడూచీలత (Tinospara Cordifolia). **తిప్పతీఁగె** రూ. తిప్పతీఁగ, తిప్పతీగ. వి. గుడూచి, అమృత. హంస. 4.10. (Tinospara Cordifolia). **తిప్పదీరులాడు** స.క్రి. తీర్చిదిద్దు. తాళ్ల. సం. 11.3.45. <తిప్ప + తీఱు[1] + -లు + ఆడు. **తిప్పద్రిమ్మరి(-త్రిమ్మరి)** వి. నగచరం. కోశ. అచ్చ. రా. కిష్కిం. 28. **తిప్పరాయి** వి. గోడల కట్టుబడికి పనికి వచ్చే రాయి. **తిప్పతెల్లు** వి. పెద్దరెల్లు. **తిప్పలమారి** వి. దెబ్బలాడే వ్యక్తి. **తిప్పలు** వి.బ.వ. కష్టాలు. **తిప్పలుగొను(-కొను)** అ.క్రి. పోగులుపడు, రాసులగు. హరి. పూ. 6.5. **తిప్పలుపడు** అ.క్రి. బాధపడు. **తిప్పలుపెట్టు** స.క్రి. బాధపెట్టు, పీడించు. **తిప్పలువట్టు(-పట్టు)** అ.క్రి. కొండలుపట్టు. ఆము. 3.24. **తిప్పలూర్రాయి** (తిప్పలూరు + రాయి) వి. తిప్పలూరు ప్రాంతంనుంచి వచ్చే చలువరాయి. **తిప్పవెలుఁగు** వి. దావాగ్ని, కార్చిచ్చు. అచ్చ.రా. అరణ్య. 102. **తిప్పసత్తు** వి. తిప్పతీగను ముక్కలుగా నరికి చితక కొట్టి నీళ్ళలో కలిపి మథించి తీసేసారం.

**తిప్పట** చూ. తిప్పు.

**తిప్పణి** రూ. తిప్పన్. వి. ఒకవైపున తగిలించిన పదునైన పల్చని ఇనపరేకు.

**తిప్పన్** రూ.చూ. తిప్పణి. వి. గొర్రివెనక జొన్నలువిత్తే మూడు గొట్టాల అక్కిడి.

**తిప్పివారు** విణ.బ.వ. 1. దేవకర్ములు, దేవాలయ పరిచారకులు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1059.

**తిప్పివేయు** చూ. తిప్పు.

**తిప్పు** రూ.చూ. త్రిప్పు. వి. 1. మైకం ; 2. సారె మొ. ఒకసారి తిరగటం ; స.క్రి. 1. పట్టెకుగాని డబ్బాకుగాని నూలు చుట్టు ; 2. విసురు.

**తిప్పట** రూ.చూ. త్రిప్పట. వి. తిరుగుడు. **తిప్పివేయు** స.క్రి. తిరిగి ఇచ్చివేయు. **తిప్పుకర్ర** వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుచెయ్యి** రూ.చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుచెయ్యి** రూ. తిప్పుచెయ్య, తిప్పుజెయ్యి, తిప్పుడుచెయ్యి, తిప్పుసెయ్య, తిప్పుసెయ్యి. వి. రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి. **తిప్పుజెయ్యి(-చెయ్యి)** రూ.చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుజెవి(-చెవి)** చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుటెద్దు** వి. బంతిలో చివరిఎద్దు. <తిప్పు + ఎద్దు. **తిప్పుడుకడ్డీ** వి. డబ్బారాట్నం ఇరుసుతిప్పే పిడి. **తిప్పుడుగొయ్య(-కొయ్య)** వి. పంటెకునూలు చుట్టేటప్పుడు పంటె కాముకు ఊనిక పెట్టేకొయ్య. **తిప్పుడుచెక్క** వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుడుచెయ్యి** రూ.చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుడుపీట** వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటె కాముకు ఊనిక పెట్టే కొయ్య. **తిప్పుడుబొమ్మ** వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్య పిడి. **తిప్పుడుమొద్దు** వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటె కాముకు ఊనికపట్టేమొద్దు. **తిప్పుపుల్ల** రూ. తిప్పుల్ల. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పులాడి** వి. మగవారిని వలలో వేసుకొనే స్త్రీ. **తిప్పుల్ల** రూ.చూ. తిప్పుపుల్ల. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుసంకటం** వి. కట్టు గొయ్య చుట్టూ పిచ్చెత్తినట్టు తిరగటం. **తిప్పుసెయ్య(-చెయ్య)** రూ.చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి. **తిప్పుసెయ్యి(-చెయ్యి)** రూ.చూ. తిప్పుచెయ్యి. వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్యపిడి.

**తిబిరి** రూ.చూ. తిపిరి. విణ. 1. అనురణనంలేని ఉచ్చనాదం కలది ; 2. లెక్కల్లోని పొరపాటు ; వి. మారుపాటు, వ్యత్యాసం.

**తిబ్బి** వి. ముందుకి కుట్టు పోనిస్తూ వెనక్కి తిప్పికుట్టే గట్టికుట్టు, డిబ్బీకుట్టు.

క. తిబ్బి. ఒకరకంకుట్టు.

**తిమతిమ** చూ. చిమచిమ. వి. ఏదేని పురుగు కుట్టినచోట కలిగే చిన్నబాధ. ధ్వన్యను.

**తిమిటి** రూ.చూ. టికిటి. వి. అంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలోఉండే కొయ్యపరికరం.

**తిమిడి** రూ. తిమ్మి, తిమ్మడి, తిమ్మిడీ, తివిడీ. వి. ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములను బిగించిన ఇనపదిమ్మె,

త. తిమితమ్. ధ్వని.

**తిమితిమి** వి. ముసురుపట్టటం మొ. వాటిలో అయ్యే అనుకర ణం. సిం. ద్వా. 3.67. ధ్వన్యను.

**తిమిరి**[1] రూ.చూ. తిమ్మిరి. వి. స్పర్శ తెలియని వ్యాధివిశేషం.

**తిమిరితిక్క** వి. ఒకజాతిచేప (Astrape Dipterygia).

**తిమిరిమీను** వి. ఒకజాతిచేప. **తిమిరిస్వనము** వి. కంపిత స్వరం. సం. స్వన-. ధ్వని.

**తిమిరి**[2] వి. తిమిరం అనే నేత్రరోగ విశేషం. ఆం.భా. 2.26.

సం. తిమిర-. చీకటి ; ప్రా. పా. తిమిర-.

<ప్రా. తిమిర-.

**తిమిరించు** చూ. తిమురు[1].

**తిముకు** చూ. టముకు. స.క్రి. వేడుకచూడనిచ్చగించు.

**తిమురు**[1] చూ. తిపురు. అ.క్రి. 1. త్వరపడు, తొందరపడు. భాస్క.రా.యు. 350 ; 2. ఉద్రేకించు. విజృంభించు, అతిశయించు. పి.శకు. 1.123 ; 3. ఒడలువిరుచు ; 4. గర్వించు ; 5. ఉరుములేకుండా మెరయు; వి. 1. పొగరు, గర్వం. మను. 2.61 ; 2. తమకం, త్వర, తహతహ. విప్ర. 3.87.

క. తిమ్బు. నింపు, సంపూర్ణత్వం ; త. తిమిర్. హెచ్చు, గర్వం, (తిమిర్ప్పు-, తిమిర్త్త్-) తిమిఱు. (తిమిఱి-) నిండు ; మ. తిమిరుక, తిమిర్క్క, తిమిర్ప్పు, తిముదుక, తికయుక. హెచ్చు, పెరుగు, తిక. సంపూర్ణత్వం.

మూ.ద.ద్రా. *తిమ్-/ *-తిన్.

**తిమిరించు** అ.క్రి. త్వరపడు. హంస. 3.76. **తిమురుకొను** అ.క్రి. 1. ఆగ్రహంతో పెనుగులాడి వదలించుకొను ; 2. స్థిరపడు ; 3. చెక్కతో అంచును సొట్టలు లేకుండా చక్క చేసుకొను.

**తిమురు**[2] రూ.చూ. తిమ్మిరి. వి. స్పర్శతెలియని ఒకవ్యాధి. పార్వ. 2.101.

**తిమురుపట్టు** అ.క్రి. కొరడుపారు.

**తిమ్డి** రూ.చూ. తిమిడి. వి. ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములను బిగించిన ఇనపదిమ్మె.

**తింపు** రూ.చూ. త్రిప్పు. స.క్రి. 1. పంటెకుగాని, దబ్బాకు గాని నూలుచుట్టు ; 2. పొట్టుతోగూడిన గింజలు చేటతో విసురు ; 3. తిరిగేటట్లుచేయు ; 4. విసురు.

**తిమ్మ** వి. స్వాస్థ్యం, నెమ్మది ; విశ. నెమ్మదైన.

సం. స్తిమిత-. స్థిరమయిన ; ప్రా. థిమ-, థిమ్మ-. తడిచేయు, థిమిఅ. నిశ్చలమైన, స్థిరమైన.

త. తిమితమ్. స్థైర్యం.

<ప్రా. థిమిఅ.

**తిమ్మదియ్యము(-తియ్యము)** వి. రతిలో తృప్తి కలగకపోవ టం, విపరీతకామం. **తిమ్మన** విశ. చక్కనైన, మంజులమైన. ఆం.నా.సం. మాన. 54 ; వి. స్వస్థత. **తిమ్మపడు(-పడు)** అ.క్రి. స్వస్థపడు, సేదతేరు. రామాభ్యు. 8.44. **తిమ్మసం ద్రాలు** వి.బ.వ. ఒకరకం వడ్లు. <తిమ్మ+సంద్రము+ -లు.

**తిమ్మఁడు** వి. కోతి, వానరం. ఆం.భా. 2.83.

క. తిమ్మ. కోతి ; త. తిమ్మన్. మగకోతి.

**తిమ్మపబంతి** చూ. తిమ్మఁడు. వి. కోతియొక్క భోజనపుపంక్తి, కోలాహలంగా ఉండే ప్రదేశం.

**తిమ్మనము** వి. 1. పాలు, బెల్లం, పిండి. మొ. కలిపి కొంచెం పల చగాఉడికించిన పదార్థం. కాశీ. 7.186 ; 2. మజ్జిగపులుసు.

సం. తేమన-. ద్రవరూపంలో ఉండే భక్ష్యవిశేషం ; ప్రా. తిమణ-. ఖాద్యవిశేషం ; పా. తేమన-.

<ప్రా. తీమణ-.

**తిమ్మన్న** చూ. తిమ్మఁడు. వి. కోతి.

**తిమ్మప్ప** వి. వెంకటేశ్వర స్వామి.

త. తిరుమలై. పవిత్రమైన పర్వతం, తిరుపతికొండ.

<తిరుమల+అప్ప.

**తిమ్మప్పఁడు** వి. తిరుపతి వెంకటేశ్వరస్వామి. రాజ వా. 1.26.

<తిరుమల+అప్పఁడు.

**తిమ్మరి** చూ. తిమ్మరు.

**తిమ్మరితనము** చూ. తిమ్మరు.

**తిమ్మరీఁడు** చూ. తిమ్మరు.

**తిమ్మరు** రూ.చూ. త్రిమ్మరు. అ.క్రి. తిరుగు.

**తిమ్మరి** రూ. చూ. త్రిమ్మరి. వి. తిరిగేవాడు, దేశ దిమ్మరి. **తిమ్మరితనము** వి. తిరిగేలక్షణం. **తిమ్మరీఁడు** రూ. చూ. త్రిమ్మరీఁడు. వి. తిరిగేవాడు.

**తిమ్మి** వి. కోతి.

క. తిమ్మ. కోతి ; త. తిమ్మన్.

**తిమ్మిడి** రూ.చూ. తిమిడి. వి. ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములను బిగించిన ఇనపదిమ్మె.

**తిమ్మిడీ** రూ.చూ. తిమిడి. వి. ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములను బిగించిన ఇనపదిమ్మె.

**తిమ్మిరి** రూ. తిమిరి[1], తిమురు[2]. వి. 1. స్పర్శ తెలియని వ్యాధి విశేషం. కాశ. 3.177 ; 2. దురద, కండూతి, తీవ్రవాంఛ. చంద్రరే. 2.50 ; 3. పొగరు, గర్వం.

త. తిమర్, తిమిర్, తిమిర్చ్చి, తిమిర్ప్పు, తిమ్మై. తిమ్మిరి ; మ. తిమిర్.

**తిమ్మిరికురచ** వి. పశువులకు కాళ్ళు బిగదీసుకుపోయి నడవకుండా చేసే ఒక రోగం. **తిమ్మిరివాతం** వి. పశువులకు వచ్చే కాళ్ళు పట్టుకపోయే రోగం. **తిమ్మిరెత్తు** అ. క్రి. రక్తప్రసారం ఆగిపోయి ఏదైనా కాలునో చేతినో ఒకే భంగిమలో ఉంచినప్పుడు మ్రాన్పడిపోవు. కాశ. 3.177.

<తిమ్మిరి+ఎత్తు.

**తిమ్మిరెత్తు** చూ. తిమ్మిరి.

**తిమ్ము** వి. నిందించటం. వేంక. పంచ. 1.722 ; స.క్రి. నిందించు.

త. తిమ్మై. పైకిఎత్తు.

**తిమ్మె** రూ.చూ. దిమ్మ[1]. వి. 1. చాలుగాపోసిన తూర్పార పట్టని ధాన్యరాశి ; 2. ఎడ్లమెడకింద వేసే పట్టెడతాడు చివరిముడి ; 3. పలుపులో మెడకు వేసే భాగం.

**తిమ్మెనబల్ల** వి. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టే మూడు కాళ్ళపీట.

**తియ** రూ.చూ. తీయ. విణ. మధురమైన. బహులా. 4.29.

**తియతీపి** విణ. అనురాగం. పి. శకు. 4.85.

**తియ్య** రూ.చూ. తీయ. విణ. 1. మధురమైన, తీపికల. కు. సం. 10.56 ; 2. మనోహరం, ఇంపైన, ప్రియమైన. పండి. చ. 2.130పు ; 3. శ్రావ్యం, వినదగిన. వసు. 4. 120 ; 4. సుగంధి, పరిమళం కల. చంద్రాంగ. 6.129.

**తియ్యకంద** వి. దురదలేని ఒకజాతికంద. పల్నా. 7. **తియ్యకూర** రూ.చూ. తియ్యగూర. వి. 1. తోటకూరకు అల్లం చేర్చి వండినకూర ; 2. పులుసువేయకుండా వండిన కమ్మనికూర. **తియ్యగూర (-కూర)** రూ. తియ్యకూర, తీగూర. వి. 1. పులుసు వేయకుండా వండిన కమ్మనికూర. కాశీ. 7.186 ; 2. తోటకూరకు అల్లం చేర్చి వండినకూర. **తియ్యదానిమ్మ** వి. గింజలు తియ్యగా ఉండే దానిమ్మ (Punica Granatum). **తియ్యదొండ** రూ. తీదొండ. వి. కూరకు ఉపయోగించే ఒకరకం కాయ (Cocacia Indica). **తియ్యన** రూ.చూ. తీయన. విణ. మధురం. రుక్మా. 5.122 ; వి. తియ్యదనం, మాధుర్యం. ఆం. భా. 1.104. **తియ్యనారింజ** వి. ఒకరకం నారింజ (Citrus Amantium). **తియ్యని** విణ. తీపిగానున్న. **తియ్యని నోటికోఁజేదుమేయు** అ. క్రి. ముందుమంచితనం కనపరచి తరువాత చెడుగా మారు. ప్రభా. 1.90. **తియ్యనిమాటలాడు** స.క్రి. మనసులో ఆదరం లేకపోయినా పైకిమంచిగా మాటలాడు. శుక. 2.502. **తియ్యనిమ్మ** వి. కమ్మని నిమ్మ, శర్కరాంశ (Citrus Medica). **తియ్యనివింటిజోదు** వి. మన్మథుఁడు. క్రీడా. 192. వ్యు. చెరకువిల్లుగా కలవాడు. **తియ్యనివిల్లు** వి. చెరకు విల్లు. శృం. నై. 1.81. **తియ్యఁదనము (-తనము)** వి. 1. మాధుర్యం. శృం. నై. 2.81 ; 2. మనోజ్ఞత. ఉ. రా. 4.90. **తియ్యపచ్చడి** వి. చింతపండువేయకుండా నూరిన పెసర పచ్చడి. **తియ్యబిల్లమాటలు** వి.బ.వ. వంచించే తీయనిమాటలు. **తియ్యమండె** వి. తినటానికి పనికివచ్చే ఒకరకం దుంపమొక్క (Ceropegia bulbosa). **తియ్యమాను** రూ.చూ. తియ్యమ్రాను. వి. చెరకు. **తియ్యమామిడి** వి. తియ్యనిపళ్ళు కాసేమామిడి, సహకారం. వేమన. 2.38 (Magnifera Indica). **తియ్యమునగ** వి. ఎర్రమునగ, మధుశిగ్రువు. ఆం. భా. 2.44. **తియ్యమ్రాను** రూ. తియ్యమాను. వి. చెరకు. ఇక్షువు. వేంక. ఆం. స్థా. 82 (Saccharum Officinarum). **తియ్యంబోఁడి(-పోఁడి)** రూ. తియ్యంబోణి. విణ. మనోజ్ఞురాలైన స్త్రీ, స్త్రీ. పాంచాలీ. 3.28. **తియ్యంబోణి (-పోణి)** రూ.చూ. తియ్యంబోఁడి. విణ. మనోజ్ఞురాలైనస్త్రీ, స్త్రీ. **తియ్యవిలుకాఁడు** రూ. తియ్యవిల్కాఁడు. వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. విక్ర. 8.64. **తియ్యవిల్కాఁడు** రూ. చూ. తియ్యవిలుకాఁడు. వి. మన్మథుఁడు. ఆం. నా. సం. 1.14.

**తియ్యము** రూ.చూ. తీయ. వి. 1. తీపి, మాధుర్యం, రుచి, మనోజ్ఞత, ఒప్పిదం. కు. సం. 8.11 ; 2. సంతోషం, ప్రీతి. ప్రేమ, అనురాగం. భార. విరా. 5.393 ; 3. తియ్యని మాట, ప్రియవచనం. ఉ. హరి. 5.31 ; విణ. 1. ప్రియమైన, ఇష్టమైన, హితవైన. హరి. పూ. 5.4 ; 2. మధురమైన, మనోజ్ఞమైన. కావ్యా. చూ. 1.70 ; 3. యుక్తం, మంచిది. రంగా. చ. 2.13.

**తియ్యు** రూ.చూ. తివ్వు. స.క్రి. 1. లాగు, ఈడ్చు, తీసుకొను ; 2. ఆకర్షించు.

**తిరకసు** రూ.చూ. తిరకాసు. వి. 1. వివాదం ; 2. భిన్నం.

**తిరకాసు** రూ. తిరకసు, తిరుకసు, తిరాసు. వి. 1. వివాదం ; 2. భిన్నం.

< తిరుగుడు + కాసు.

**తిరకోసు** చూ. తిరము. వి. లాగటంలో మిగిలిన మూల.

**తిరగడ[1](-కడ)** చూ. తిరి. వి. ఆభరణ విశేషం.

**తిరగడ[2]** రూ.చూ. తిరుగుడు. వి. చాపిన పడుగును తిరగ వెయ్యటానికి ఉపయోగించే కొయ్య పనిముట్టు.

**తిరగడకపిల** రూ.చూ. తిరుగుడుకపిల. వి. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగిపోవటానికి వేరే దోవ ఏర్పాటు చేసిన మోట. **తిరగడకొమ్మెద్దు** వి. బంతిలో చివరి ఎద్దు. < తిరగడకొమ్ము + ఎద్దు. **తిరగడతాడు** వి. తిరుగుడు రెండువైపులా కట్టిన తాళ్ళు. **తిరగడబారి** రూ.చూ. తిరుగుడుబారి. వి. ఒకసారి మోటలాగిన తర్వాత మోట బావివైపు ఎక్కివెళ్ళే దారి.

**తిరగడి** రూ.చూ. తిరుగడ. వి. అడ్డంగా అమర్చిన రాటి.

**తిరగతివాడ(-ఓడ)** చూ. తరగతి. వి. రెండు స్తంభాల చిన్న ఓడ, దోనె.

**తిరగబట్టు** స.క్రి. సారెపైవాట తయారైన తర్వాత మళ్ళీ ఒకసారి నునుపు చేయు.

< తిరుగు + -అ[7] + పట్టు.

**తిరగబడు** అ.క్రి. 1. మాగాణిలోగాని, తోటలోగాని నాటిన నారు వేరుబట్టి బతుకు ; 2. ఎగబడివచ్చు. < తిరుగు + -అ[7] + పడు.

**తిరగబాటు** వి. తిరుగుబాటు, ఎదిరింపు.

< తిరుగు + -అ[7] + పాటు.

**తిరగబారు** అ.క్రి. పైరు పూర్తిగా ఫలించు.

< తిరుగు + -అ[7] + పాఱు.

**తిరగబోత** చూ. తిరుగు.

**తిరగమాత** రూ.చూ. తిరుగఁబోఁత. వి. తిరగబోత.

**తిరగమూత** రూ.చూ. తిరుగఁబోఁత. వి. తిరగబోత.

**తిరగలి** రూ.చూ. తిరుగలి[2]. వి. 1. పిండి మొదలైనవి విసిరే రాతి పనిముట్టు, విసుర్రాయి ; 2. చాపిన పడుగును తిరగ వెయ్యటానికి ఉపయోగించే కొయ్యపనిముట్టు.

**తిరగలిచీల** వి. తిరుగుడును ఊడ్తై అడ్డపట్టెకు కలిపే తాడు బిగింపుకోసం తిరుగుడుపిడికి బిగించిన ఇనపపుల్ల. **తిరగలిదిమ్మ** రూ. తిరగలిదిమ్మె. వి. తిరగలిగా దిమ్మెన అడుగు భాగంగా మలిచివాడేరాయి. **తిరగలిదిమ్మె** రూ.చూ. తిరగలిదిమ్మ. వి. తిరగలిగా దిమ్మెన అడుగు భాగంగా మలచివాడేరాయి. **తిరగలిపిడి** వి. తిరుగుడు బిళ్ళలో దూర్చిన కొయ్య. **తిరగల్రాయి** వి. తిరగలి దిమ్మెన అడుగు భాగంగా మలిచివాడేరాయి. < తిరగలి + రాయి.

**తిరగల్రాయి** చూ. తిరగలి.

**తిరగవాత** రూ.చూ. తిరుగ(బో౹త. వి. తాలింపు.

**తిరగవాను** చూ. తిరుగు. స.[క్రి. కూజా తయారీలో కుతికను బు(రను అతికించు.

**తిరగవేయు** చూ. తిరుగు.

**తిరగాతసల్వ** రూ.చూ. తిరగ్గే తసలప. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సడానికి వాడే సలప.

**తిరగాతేయు** చూ. తిరుగు. స.[క్రి. నున్నగింత సలపతో రెండోసారి నునుపు చేయు.

**తిరగాని** చూ. తిరుగు. వి. ఎద్దుకు కాడిమిరపటానికి గానుగ మాదిరి అమర్చిన కొయ్య యంత్రం.

**తిరగాలకొట్టు** రూ. తిరగోలు కొట్టు, తిరుగోలుకొట్టు. చూ. తిరుగు. స.[క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపు చేయు.

**తిరగింపు** చూ. తిరుగు. స.[క్రి. తిరగతిప్పివేయు.

**తిరుగడ** రూ.చూ. తిరుగుడు. వి. అడ్డంగా అమర్చిన రాటి.

**తిరుగుడు** రూ.చూ. తిరుగడ. వి. అడ్డంగా అమర్చిన రాటి.

**తిరగ్గేతకోడు** చూ. తిరుగు. వి. కుదంకొట్టి తర్వాత పల్చగ, నున్నగ నర్సడానికి వాడే సలప.

**తిరగ్గేతబల్ల** చూ. తిరుగు. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ, నున్నగ నర్సడానికి వాడే సలప.

**తిరగ్గేతవేయు** చూ. తిరుగు. స.[క్రి. నున్నగింత సలపతో రెండోసారి నునుపు చేయు.

**తిరగ్గేతసలప** రూ. తిరగాత సల్వ. చూ. తిరుగు. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సడానికి వాడే సలప.

**తిరగేయు** స.[క్రి. మట్టిలో నీళ్ళుపోసి పారతో కలుపు.

<తిరుగు + -అ$^{7}$ + వేయు.

**తిరగోలుకొట్టు** రూ.చూ. తిరగాలకొట్టు. స.[క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపు చేయు.

**తిరంజన్‌ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం. తీన్. మూడు, రంజన్. అలరించేది, ఖాని. విధం.

<హిం. తీన్‌రంజన్ ఖాని.

**తిరపడు** చూ. తిరము.

**తిరపఱుచు** చూ. తిరము.

**తిరమనిఅంటు** రూ.చూ. తిర్మనంటు. వి. పట్టుకుపెట్టే వరిగం జిలో కలిపే ఒకరకం జిగురు.

**తిరము** విశ. 1. స్థిరమైన, నిశ్చలమైన. భార. ఆది. 8.56 ; 2. ధ్రువమైన, నిశ్చితమైన. నృసింహా. 2.129 ; 3. నాటుకొనిన, గట్టిగా అంటిన. ఉ. హరి. 1.3 ; వి. నెలవు, ఉనికిపట్టు. రంగా. చ. 3.253.

సం. స్థిర-. దృఢమైన, బలమైన ; ప్రా. థిర-. నిశ్చలమైన, చలనంలేని, సంపన్నం ; అ. మా. థిర- ; పా. థిర- ; అప. థిర- ; నే. థిర్, థిరో. దృఢమైన ; అ. బెం. థిర్ ; ఒ. థిర.

క. తిర. స్థిరం, తిరె. భూమి ; తు. తిర ; త. తిరమ్ ; మ. తిరమ్.

<ప్రా. థిర-.

**తిరపడు** రూ. తిరముపడు. అ.[క్రి. స్థిరపడు, కుదురుకొను. ఉ. హరి. 3.91. **తిరపఱుచు** రూ.చూ. తిరముపఱుచు. స.[క్రి. స్థిరపరుచు, నెలకొల్పు. **తిరముకొను** అ.[క్రి. స్థిరపడు. **తిరముకొలుపు** రూ.చూ. తిరముకొల్పు. స.[క్రి. 1. స్థిరంగానిల్పు, స్థిరపడజేయు. రాఘవ. 2.27 ; 2. నాటు, స్థాపించు. **తిరముకొల్పు** రూ. తిరముకొలుపు. స.[క్రి. 1. స్థిరంగా నిలుపు, స్థిరపడజేయు. ద్వి. పరమ. వి. 1.112 ; 2. నాటు, స్థాపించు. చంపూరా. 2.28. **తిరముచేసికొను** స.[క్రి. దృఢం చేసుకొను. **తిరముపడు** రూ. చూ. తిరపడు. అ.[క్రి. స్థిరపడు, కుదురుకొను. **తిరముపఱుచు** రూ. తిరపఱుచు. స.[క్రి. స్థిరపరుచు, నెలకొల్పు. మను. 1.23.

**తిరసకరించు** స.[క్రి. నిరాకరించు, పరిత్యజించు. ప్రబంధ. 215.

సం. తిరస్కార-. నిరాకరణ, తిరస్కృ. నిరాకరించు.

<సం. తిరస్కృ + -ఇంచు$^{3}$.

**తిరస్తు** వి. (సప్తాంగాల్లో ఒకటి అయిన) రాష్ట్రం. అం. భా. 2.189.

**-తిరాల** ప్రత్య. ఎడల అని అర్థమిచ్చే ప్రత్యయం.

**తిరి** రూ. తిటి$^{2}$. వి. 1. సుడి, ఆవర్తం. భార. శాంతి. 3.399 ; 2. జుట్టు. క్రీడా. 226 ; 3. పురి, పెన, మెలి. పి. శకు. 3.165 ; 4. చాకలిబాన ఆటలో ఉపయోగించే మెలిపెట్టిన వస్త్రం. చము. 3.109 ; 5. జడ. ఉ. రా. 3.106 ; 6. క్షోభం, కలత ; 7. తంత్రం, దుర్బోధ ; 8. అంచుల్లో జరీపెట్టి నేసేటప్పుడు పోగులు అతుక్కోటానికి జిగురు పూసే పుల్లకు చివర చుట్టినగుడ్డ.

క. తిరి. తిరుగు, తిరగణి, తిరగణె, తిరుగణి, తిరుగణె, తిరుగుణి ; త. తిరుక్కు. మెలి, వంకర, తిరి-. తిరుగు ; మ. తిరి, తిరియుక. మెలి, మలుపు, తిరివు, తిరిప్పు. మార్పు. తిరుకుక. జడవలె మెలిపెట్టు, తిరుక్కల్. జడవేయు, తిరుక్కుక. గుడ్డలు చుట్టు ; తొ. తిర్య్- (తిర్చ్-). మెలిపెట్టు, తిర్ప్- (తిర్బ్య్.) ; గోం. తిరీతానా, తిరుహ్‌తానా. తిరుగు ; కుఇ. తిప్పు (తిప్తి-), తెర్ప (తెర్త్-) ; కువి. త్రిచలి. మెలి ; పర్జీ. తిర్క ; కొలా. తిర్గిప్- (తిర్గిప్త్-). మెలిపెట్టు.

<త. తిరి.

**తిరిక** వి. మెలిక. <తిరి + ఇక. క. తిరుగువికె. మలుపు ; త. తిరుక్కు. మెలి, మలుపు ; మ. తిరివు. తిరగటం, తిరిక్క. చుట్టూతిరగటం. **తిరికట్టు** రూ.చూ. తిరిగట్టు. అ.[క్రి. 1. మెలికలుతిరుగు, వక్రమగు ; 2. జడగట్టు, అల్లుకొనిపోవు. **తిరికట్టుకొను** అ.[క్రి. 1. మెలికలు తిరుగు. క్రీడా. 226 ; 2. ఎండిపోవు ; 3. వక్రమగు. **తిరికలు** వి.బ.వ. దువ్వని వెంట్రుకలు. పాండు. 1.126. **తిరికోన్‌వంతె** వి. మూడు వంపులు తిప్పికట్టినమెట్టు. **తిరిగట్టు** (-కట్టు) రూ. తిరికట్టు. అ.[క్రి. 1. జడగట్టు, అల్లుకొనిపోవు. పి. శకు. 2.30 ; 2. మెలికలు తిరుగు, వక్రమగు. **తిరితీపు** అ.[క్రి. పెనగు. **తిరితీపులాడు** అ.[క్రి. పెనగులాడు. గౌ. హరి. ఉ. 482వం. **తిరిపడు** రూ.చూ. తిరివడు. అ.[క్రి. సుడివడు, కలతపడు. **తిరిపెట్టు** రూ.చూ.

తిరిపెట్టు. స.క్రి. 1. కలతపరుచు ; 2. ప్రేరేపించు. అ.క్రి. 1. గుడ్డమెలిపెట్టి చెవిలో జొనిపితిప్పు ; 2. తంత్రంపెట్టు, దుర్బోధ చేయు. **తిరిబెట్టు (-పెట్టు)** రూ.చూ. తిరిపెట్టు. స.క్రి. ప్రేరేపించు. **తిరివడు (-పడు)** రూ. తిరిపడు. అ.క్రి. కలతపడు, సుడివడు. భార. ఆది. 1.152. **తిరివెట్టు (-పెట్టు)** రూ. తిరిపెట్టు, తిరిబెట్టు. స.క్రి. 1. కలత పరుచు. భార. స్త్రీ. 2.49 ; 2. ప్రేరేపించు ; అ.క్రి. 1. గుడ్డమెలిపెట్టి చెవిలో జొనిపి తిప్పు ; 2. తంత్రం చేయు, దుర్బోధ చేయు. **తిరులుకట్టు** రూ.చూ. తిరులుగట్టు. అ.క్రి. 1. జడగట్టు, అల్లుకొనిపోవు ; 2. మెలికలు తిరుగు, వక్ర మగు. **తిరులుగట్టు (-కట్టు)** రూ. తిరులుకట్టు. అ.క్రి. 1. జడకట్టు, అల్లుకొనిపోవు. విప్ర. 5.25 ; 2. మెలికలు తిరుగు, వక్రమగు.

**తిరికి** రూ.చూ. తిటికి. వి. మత్స్య విశేషం.

క. తిరికె. తిరగటం ; త. తిరికై. తిరగటం, చక్రం.

**తిరికె** వి. శరీరం మీద రాలిపోయే పొరలు.

క. తిరికె. తిరగటం.

**తిరిగించు** చూ. తిరుగు.

**తిరిగిణి** రూ. తిరిగిని. వి. 1. గుమ్మటంలాటిపనిముట్టు ; 2 అడ్డంగా అమర్చిన రాటి.

క. తిరగణి, తిరగణె, తిరుగణి, తిరుగణె, తిరు గణి. తిరగటం, తిప్పేది, నీళ్ళనుతోడే చక్రం, రోలరు.

<క. తిరగణి.

**తిరిగిణికడ్డీ** వి. రాటితిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **తిరిగిణిచట్టం** రూ. తిరిగిని నట్టం. వి. అడ్డుగుమ్మి అమర్చేకొయ్య చట్రం. **తిరిగిణిచిప్ప** వి. రాటిపై బద్దలను బిగించి, వాటిమధ్య బోర్లించికట్టిన చిప్ప. **తిరిగిణిచెంబు** వి. మరచెంబు. **తిరిగిణిమొద్దు** వి. రాటి తిరగటానికి, రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు.

**తిరిగిని** రూ.చూ. తిరిగిణి. వి. అడ్డంగా అమర్చిన రాటి.

**తిరిగినిసట్టం (-చట్టము)** రూ.చూ. తిరిగిణి చట్టం. వి. అడ్డగుమ్మి అమర్చే కొయ్య చట్రం.

**తిరిగివచ్చు** చూ. తిరుగు.

**తిరిగేతలుపు** చూ. తిరుగు.

**తిరినేలబెండ** వి. దక్కను కర్ణాటకాల్లో బంజరుల్లో పెరిగే మొక్క (Sida Spinosa).

**తిరిప** చూ. తిరియు, తిరిపము. రూ. తిరిపఁడు, తిరిపె. వి. బిచ్చగాడు. వీర. వి. 3.11. పి. శకు. 3.180.

**తిరిపకాఁడు** చూ. తిరిపము.

**తిరిపగాఁడు** చూ. తిరిపము.

**తిరిపగూడ** చూ. తిరిపము.

**తిరిపగొట్టు** చూ. తిరిపము.

**తిరిపజోగి** చూ. తిరిపము.

**తిరిపఁడు** చూ. తిరియు. రూ.చూ. తిరిప. వి. బిచ్చగాడు. వీర. వి. 2.269.

**తిరిపతిండి** చూ. తిరిపము.

**తిరిపపుగూడ** చూ. తిరిపము.

**తిరిపము** రూ. తిరిపెము. వి. 1. భిక్షం. రం.రా.ఉ. 133 పు. 24 పం ; 2. భిక్షకుడు. శ్రీనాథుని చాటువు ; 3. బిచ్చగత్తె కవిక. 5.17.

క. తిరికె. భిక్షాటనం, తిరప. భిక్షాటనం, భిక్ష. తు. తిరుప, తిరుపె. భిక్ష.

**తిరపకాఁడు** రూ.చూ. తిరపగాఁడు. వి. భిక్షకుడు. యాచకుడు. **తిరిపగాఁడు(-కాఁడు)** రూ. తిరిపకాఁడు, తిరిపెగాఁడు. వి. భిక్షకుడు, యాచకుడు. వేమన. 2.54. **తిరిపగూడ** రూ. తిరిపపుగూడ, తిరిపెగూడ. వి. భిక్షా పాత్ర. వైజ. 3.64. <తిరిపము+గూడ. **తిరిపగొట్టు** రూ. తిరిగొట్టు, తిటిగొట్టు, తిటిపగొట్టు. విణ. 1. విరక్తుడు కాని బిచ్చగాడు. ఆం.భా. 2.176 ; 2. తుచ్ఛభిక్షకుడు. <తిరిపము+-గొట్టు. **తిరిపజోగి** వి. 1. బిచ్చమెత్తుకొనే యోగి. వీర. వి. 1.135 ; 2. ముష్టివాడు. <తిరిపము+ జోగి. **తిరిపతిండి** విణ. భిక్షాశనుడు, భిక్షకుడు. పండి. చ. 2.130 పు. **తిరిపపుగూడ** రూ.చూ. తిరిపగూడ. వి. 1. భిక్షాపాత్ర. వైజ. 3.109 ; 2. వైష్ణవుల తిరుమణి పెట్టె, మడిబట్టలు మొ॥ వుంచి చంకను తగిలించుకొనే బుట్ట. **తిరిపమెత్తు** స.క్రి. బిచ్చమెత్తు, భిక్షించు. వేమన. 3.20. <తిరిపము+ఎత్తు[1]. **తిరిపంబుమనువుగా** క్రి.విణ. ద్రు. ఉచితంగా దొరికే భర్తలుగా, కేవలం ఎవరు పిల్చినా వెళ్ళే కాముకులుగా, ఆంబోతులుగా. పండి.చ. 1.115. **తిరిపరి** వి. భిక్షమెత్తుకొనేవాడు. కాశీ. 7.52. <తిరిపము+-అరి[4].

**తిరిపమెత్తు** చూ. తిరిపము.

**తిరిపంబుమనువుగా** చూ. తిరిపము.

**తిరిపరి** చూ. తిరిపము.

**తిరిపె** రూ.చూ. తిరిప. వి. ముష్టెత్తి జీవించేవాడు. ద.హిం. శా. సంపు. 10. శా.సం. 743. క్రీ.శ. 1535.

**తిరిపెగాఁడు** చూ. తిరిపెము.

**తిరిపెగూడ** చూ. తిరిపెము.

**తిరిపెము** రూ.చూ. తిరిపము. వి. 1. భిక్షం ; 2. భిక్షుకవృత్తి ; 3. భిక్షుకుడు ; 4. బిచ్చగత్తె.

**తిరిపెగాఁడు(-కాఁడు)** రూ.చూ. తిరిపగాఁడు. వి. భిక్ష మెత్తుకొనేవాడు. **తిరిపెగూడ** రూ.చూ. తిరిపగూడ. వి. వైష్ణవులు బట్టలు మోసుకొని వెళ్ళటానికుపయోగించే బుట్ట.

**తిరియు** చూ. తిరుగు. స.క్రి. భిక్షం యాచించు, బిచ్చమెత్తు. భార.సౌప్తి. 1.218.

క. తిరి. బిచ్చమెత్తు, తిరికె, తిరప. భిక్షాటనం ; తు. తిరప, తిర్పె. భిక్ష ; మ. తిరెక్క. పొందు.

మూ.ద.ద్రా. *తిర్-/. చూ. తిటికి.

**తిరిర** చూ. తిటికి. వి. తిరికి అనే చేప.

**తిరివీథి** రూ.చూ. తిరువీథి. వి. దేవాలయం వీథి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1048.

**తిరు** విణ. శుభకరమైన, పవిత్రమైన.

క.తు. తిర, తిరి, తిరు, సిరి. పవిత్రం ; త. తిరు. శ్రీదేవి, పవిత్రత ; మ. చిరి, చిరు, తిరి, తిరు. లక్ష్మి. అదృష్టం, శుభకరం ;

సం. శ్రీ- ; ప్రా. సిరీ.

<త. తిరు.

**తిరుకట్టి** రూ. తిరుకట్టె. వి. దేవాలయం ఊడ్చడానికి ఉపయోగించే చీపురుకట్ట. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556. క. కట్టె. చీపురుకట్ట. **తిరుకట్టె** రూ.చూ. తిరుకట్టి. వి. పవిత్రస్థలాలూడ్చడానికి ఉపయోగించే చీపురుకట్ట, సమ్మార్జని. వైజ. 2.115. క. కట్టె. చీపురుకట్ట. **తిరుకణామధు** రూ. తిరుకణామధువు, తిరుకణీమధు. వి. పాయసం. వైజ. 2.131. త. తిరుక్కణ్ణామదై, తిరుక్కణ్ణముతు. పాయసం. <త. తిరుక్కణముతు. **తిరుకణామధువు** రూ.చూ. తిరుకణామధు. వి. పాయసం. **తిరుకణీమధు** రూ.చూ. తిరుకణామధు. వి. పాయసం. వైజ. 2.115. **తిరుకళ్యాణమండపము** వి. దేవుని వివాహ మహోత్సవం చేయడానికి కట్టిన ప్రత్యేక మండపం. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 1305. క్రీ.శ. 1245. త. తిరుక్కలియాడమ్. గుడిలోని దైవ వివాహ మహోత్సవం. **తిరుకాపు** వి. 1. దేవాలయం తలుపు. పరమ. వి. 3.283 ; 2. భగవంతుని యొక్క అలంకారం. త. తిరుక్కాప్పు. దైవరక్షణ, గుడితలుపు. <త. తిరుక్కాప్పు. **తిరుకాళత్తి** వి. కాళహస్తి అనే పుణ్య స్థలం. బసవ. 3.890 పం. క. తిరుకాళతి. శ్రీకాళహస్తి, ఒక పుణ్య క్షేత్రం ; త. తిరుక్కాళత్తి ; సం. శ్రీకాళహస్తీ-. <త. తిరుక్కాళత్తి. **తిరుకాసెదట్టి** వి. జెట్లు మొలకు కట్టుకొనే కాసె. ప్రబంధ. 82. **తిరుకుళము** రూ.చూ. తిరుకొళము. వి. కోనేరు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 763. క్రీ.శ. 1670. **తిరుకొలను** రూ.చూ. తిరుకొళము. వి. పుష్కరిణి, కోనేరు. హంస. 4.210. **తిరుకొళము** రూ. తిరుకుళము, తిరుకొలను. వి. 1. మాయ. బహుళా. 1.40 ; 2. పుష్కరిణి, కోనేరు. శుక. 3.30. త. తిరుక్కుళమ్. కోనేరు. <త. తిరుక్కుళమ్. **తిరుక్కావేరి** వి. పవిత్రమైన కావేరీనది. కులశేఖర చరిత్ర 2. త. తిరుక్కావేరి. పవిత్ర కావేరీ నది. <త. తిరుక్కావేరి. **తిరుక్షవరమగు** అ.క్రి. పూర్తిగా నష్టపడు, తిరుపతిక్షవరమగు. సం. క్షవర-. కేశఖండనం. <తిరు(పతి) + సం. క్షవర- + -ము + అగు. **తిరుచిన్నము** వి. సన్నకాళె, ఊదే వాద్య విశేషం. త. తిరుచ్చిన్నమ్. దేవుడు రాజు మొ॥ వారి ముందు ఊదే వాద్య విశేషం. <త. తిరుచ్చిన్నమ్. **తిరుచుట్టు** వి. దేవాలయం చుట్టు గోడ. శృం.నై. 3.184. త. తిరుచ్చుట్టు. గుడి చుట్టు గోడ. <త. తిరుచ్చుట్టు. **తిరుచుట్టుమాలిక** రూ.చూ. తిరుచుట్టుమాలియ. వి. చుట్టుగోడ. ఎ.ఇం. సంపు. 4.47C. **తిరుచుట్టుమాలియ** రూ. తిరుచుట్టుమాలిక, తిరుచుట్టుమాలె. వి. దేవాలయంలో చిన్నదేవతల నుంచడానికి ఆవరణ చుట్టూ కట్టిన కట్టడం. శా.ప.మం. 70. త. తిరుచ్చుట్టు మాలికై. లోని గుడిచుట్టూ ఉండే గోడ. <త. తిరుచ్చుట్టుమాలికై. **తిరుచుట్టుమాలె** రూ.చూ. తిరుచుట్టు మాలియ. వి. దేవాలయంలో చిన్న దేవతల్నుంచటానికై ఆవరణం చుట్టూ కట్టిన కట్టడం. భీమ. 3.31. **తిరుచూర్ణము** వి. పసుపు, బియ్యం చేర్చి చేసి వైష్ణవులు నొసట ఉంచుకొనే పొడి. పరమ. వి. 3.198. క. తిరుచూర్ణ. వైష్ణవులు నుదుట ధరించే ఎర్రని నామం, త. తిరుచ్చూర్ణమ్. <త. తిరుచ్చూర్ణమ్. **తిరుచూర్ణంపచ్చ** వి. పచ్చిపసుపు (= గడపపచ్చ) రంగు. **తిరుణాపుతిత్తులు** వి.బ.వ. తిరుమణి మొ॥ వాటిని ఉంచే సంచులు. విప్ర. 2.14. **తిరుణాము** వి. వైష్ణవ దేవాలయంలో ఊదే వాద్య విశేషం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 975. **తిరుణాళ్ళు** రూ.చూ. తిరునాళ్లు. వి. ఆలయ ఉత్సవం. **తిరుతేరు** వి. దేవుని రథం. ద.హింశా. సంపు. 4. శాసం. 280. క్రీ.శ. 1556. **తిరుతోమాల** రూ. తిరుతోమాలె. వి. వనమాల, ఆకులు, పువ్వులు కూర్చికట్టిన దండ. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 705. క్రీ.శ. 1391 సం. క. తిరుతోమాలె. పూలదండ ; త. తిరుతోమాలై. <త. తిరుతోమాలై. **తిరుతోమాలె** రూ.చూ. తిరుతోమాల. వి. పవిత్రమైన దండ. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 280. **తిరుతోంపు** వి. తోట, ఫలవృక్షాదులున్న వనం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 280. క్రీ. శ. 1556. త. తిరుత్తోప్పు. గుడికి ఆనుకొని ఉన్న పూలతోట. <త. తిరుత్తోప్పు. **తిరుదండె** వి. దేవుని సన్నిధిలో దీపం ఉంచేకర్రప్రమిద. క. దండె. తీగ, దండ. <త. తిరు + క. దండె. **తిరు దండెదీపము** వి. దేవుని సన్నిధిలో కర్ర ప్రమిదలలో ఉంచే దీపం. ప్రబంధ. 74. **తిరునక్షత్రము** వి. రామానుజీయ శ్రీ వైష్ణవధర్మంలోని అమృత నక్షత్రం. ద. హిం. శా.సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1335. సం. నక్షత్ర-. తార, చుక్క. **తిరునగరు** వి. భాగ్యనగరం. తి. తిరునకర్. ధనవంతమైన పట్టణం. <త. తిరునకర్. **తిరునంద వనము** వి. దేవుని పూలతోట. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1172. క్రీ. శ. 1160. త. తిరునంతవనమ్. గుడిపూలతోట. <త. తిరునంతవనమ్. **తిరునాడు** వి. వైకుంఠం. త. తిరునాటు. వైకుంఠం. <త. తిరునాటు. **తిరునామము** రూ. తిరునాము. వి. వైష్ణవులు నుదుట నిడుపుగా పెట్టుకొనే బొట్టు. వైజ. 1.69. క. తిరునామ. నుదుటను వైష్ణవులు పెట్టుకొనే నామం ; త. తిరునామమ్. వైష్ణవులు నుదుటను పెట్టుకొనే తిలకవిశేషం, పవిత్ర నామం. <త. తిరునామమ్. **తిరునాము** రూ.చూ. తిరు నామము. వి. విభూతి. **తిరునాళసేషము** వి. తిరునాళ్ళలో ప్రశస్తమైనది. నె. శా. కందుకూరు. 65. క్రీ.శ. 1268. త. తిరునాళ్. ఉత్సవాల్లో పవిత్రదినం. **తిరునాళ్లు** రూ. తిరుణాళ్ళు, తిరునాళ్ళు, తిర్నాళ్లు. వి. శుభదినం, దేవోత్సవ దినం, దేవోత్సవం. క్రీడా. 212. త. తిరునాళ్. ఉత్సవాల్లో పవిత్రదినం. <త. తిరునాళ్. **తిరునాళ్ళు** రూ.చూ. తిరునాళ్లు. వి. దేవోత్సవం. **తిరునీరు** రూ.చూ. తిరునీఱు. వి. విభూతి. **తిరునీఱు** రూ. తిరునీరు, తిర్నీరు. వి. శైవులు నొసట ఉంచుకొనే గోమయ భస్మం, విభూతి. బసవ. 1.53. క. తిరునీఱు. పవిత్ర భస్మం ; త. తిరునీఱు, <త. తిరునీఱు. **తిరుపట్టెకురుచ** వి. మల్లసాధన విశేషం. ప్రబంధ. 82. **తిరుపడి** వి. భోజనాది ద్రవ్యం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 874. క్రీ.శ. 1620. **తిరుపడి**

**తాము** రూ. తిరుపడిదాము. తిరుపతితాము. వి. ద్రవ రూపమైన నైవేద్యం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1007, క్రీ.శ. 1389. **తిరుపడిదాము** రూ.చూ. తిరుపడి తాము. వి. ద్రవరూపమైన నైవేద్యం, ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1008. క్రీ. శ. 1389. **తిరుపడియారము** వి. దేవునికి నిత్యనైవేద్యానికి వండే పిండివంట. నె. శా. ఒంగోలు. 54. క్రీ.శ. 1278. **తిరుపణి దాసి** వి. దేవాలయ పనికత్తె, పరిచారిక. నె .శా. ఒంగోలు. 24. త. తిరుప్పణి. దేవాలయంలోని పరిచర్య. సం. దాసీ. సేవకురాలు. <త. తిరుప్పణి + సం. దాసీ. **తిరు పణ్యారము** వి. దేవతాదులకు నైవేద్యం చేసే పిండివంట. వైజ. 2.131. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 710. సం. పణ్యాహార-. భక్ష్యవిశేషం ; ప్రా. పణ్ణార.- ; క. పణ్ణారపు ; త. పణియారమ్. <త. తిరు + సం. పణ్యాహార-. **తిరుపతి** వి. ఒకానొక విష్ణుక్షేత్రం. కాశీ. 5.288. క. తిరుపతి. ఆంధ్రప్రదేశ్ లోని చిత్తూరు జిల్లా లోని పుణ్యక్షేత్రం ; త. తిరుప్పతి. <త. తిరుప్పతి. **తిరు పతికొప్పు** వి. బోడితల. శుక. 3.91. వ్యు. తిరుపతికి వెళ్ళే భక్తులు తమ శిరోజాలను బాలాజీకి అర్పిస్తారు. కాబట్టి ఈ అర్థం. **తిరుపతిక్షవరం** వి. అరకొరపని. వ్యు. తిరుపతిలో క్షవరం సంపూర్ణంగా చేయరు కాబట్టి ఈ అర్థం. **తిరుపతి తాము** రూ. చూ. తిరుపడిదాము. వి. ద్రవ రూపమైన నైవేద్యం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1006. క్రీ. శ. 1389. **తిరుపతిదరుమము** వి. ద్రవరూప మైన నైవేద్యం. నె. శా. కనిగిరి. 34. క్రీ. శ. 1409. **తిరుపతిబెండ** వి. కాయపొడుగ్గా ఉండేబెండ. **తిరుపతిరాగి** వి. రాగిలో ఒకరకం. **తిరుపనిపిల్ల** వి. దేవాలయంలోని సేవకుడు. ప్రబంధ. 112. త. **తిరుప్పణిపిళ్ళై** దేవాల యంలో పనిచేసే సేవకుడు. <త. తిరుప్పణిపిళ్ళై. **తిరుపందేరము** వి. దేవుని నగలుంచే కొట్టు. విప్ర. 5.8. **తిరుపరివట్టము** చూ. తిరుపరివట్టాలు. వి. 1. విగ్రహాన్ని అలంకరించటాని కుపయోగించే చిన్నగుడ్డముక్క ; 2. గౌరవచిహ్నంగా పూజారి ఒకవ్యక్తి తలకికట్టే దేవాలయ వస్త్రం. **తిరుపరివట్టాలు** వి.బ.వ. 1. దేవతా విగ్రహానికి తొడిగే చిన్న వస్త్రం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 674. క్రీ. శ. 1620 ; 2. గౌరవ సూచకంగా పెద్దల తలకు అర్చకుడు చుట్టే పట్టువస్త్రం. త. తిరుప్పరివట్టమ్. దేవతావిగ్రహాన్ని కప్పే వస్త్ర ఖండవిశేషం. <త. తిరు ప్పరివట్టమ్ + -లు. **తిరుపల్ల్యరప్రసాదతల్యలు** వి.బ.వ. తళిగె ప్రసాదం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 914. క్రీ. శ. 1291. **తిరుపాట** వి. దేవస్తుతిగీతం, దేవుని స్తుతించి పాడేపాట. బసవ. 4.122. క. తిరుపాఠ ; త. తిరుప్పాట్టు. దైవస్తోత్రాలు. <త. తిరుప్పాట్టు. **తిరుపావడ (తిరు+ పావడ)** వి. 1. పవిత్రవస్త్రం. కలు. శ. 44 ; 2. దేవతల నుద్దేశించి పరచిన పెద్దబట్ట మీద కుప్పగా పోసిన అన్నం. క. తిరుపావడ, తిరుపావడె ; త. తరుప్పావాడై. దేవతలకు నైవేద్యంగా గుడ్డమీద పోసిన అన్నం. <త. తిరుప్పావాడై. **తిరుపుట్టము** వి. దేవతల నుద్దేశించి కుప్పగా పోసిన అన్నంఉన్న వస్త్రం, పవిత్రవస్త్రమని తాత్పర్యా ర్థం. వైజ. 2.115. **తిరుపళ్ళి** వి. సమాధి. త. తిరుప్పళ్ళి. సమాధి. <త. తిరుప్పళ్ళి. **తిరుప్పల్లాణి** వి. దర్భశయనం, దబ్బపాన్పు. చంపూ రా. 8.37. త. తిరుప్పుల్లాణి. వైష్ణవదేవాలయం. <త. తిరుప్పుల్లాణి. **తిరుప్రతిష్ఠ** వి. దేవప్రతిష్ఠ. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 532. క్రీ. శ. 1322. **తిరుబాస** వి. దేవునిమీద పెట్టుకొనే ఒట్టు. హర. 1.14. **తిరుబోనము** వి. బోనాం, దేవునికి నైవేద్యం చేసే అన్నం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 5. క్రీ. శ. 1404. **తిరుమజ్జనము** రూ.చూ. తిరుమజ్యనము. వి. అభిషేకం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 422. క్రీ. శ. 1269. **తిరుమజ్యనము** రూ. తిరుమజ్జనము, తిరు మంజనము, తిరువంజనము. వి. అభిషేకం. ద. హిం. శా. సంపు. 5. శా. సంపు. క్రీ. శ. 1250. త. తిరుమంచ నమ్. దేవుని విగ్రహాభిషేకం. <త. తిరుమంచనమ్. **తిరుమంజనకాలము** చూ. తిరుమజ్యనము. వి. దేవుని అభిషేకకాలం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 280. క్రీ. శ. 1556. **తిరుమంజనగరయ** చూ. తిరుమజ్యనము. వి. దేవుని అభిషేకం నిమిత్తం ఉపయోగించే కడవ. ద. హిం. శా. సంపు. 6. శా. సంపు. 6. సం. 805. 1388. క్రీ. శ. 1466. **తిరుమంజనము** యా.చూ. తిరుమజ్యనము. వి. అభిషేకం, స్నానం. వేంక. మా. 2.118. త. తిరుమంచనమ్. <త. తిరుమంచనమ్. **తిరుమంజిరంగు** వి. ఎరుపురంగు. **తిరుమట్టపల్లి** రూ.చూ. తిరుమడపల్లి. వి. వంటగది. **తిరుమడపల్లి** రూ. తిరుమట్టపల్లి. వి. దేవాల యాల్లో నైవేద్యాది కైంకర్య వస్తువులు ఉండే గృహం, వంటశాల. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 200. త. తిరు మడైప్పళ్ళి. వంటగది. <త. తిరుమడైప్పళ్ళి. **తిరుమణి** రూ. చూ. తిరుమన్ను. వి. వైష్ణవులు నొసట ఉంచుకొనే ధవళ మృత్తిక. వైజ. 3.18. **తిరుమణివడము** వి. తామరపూసల దండ. పరమ. వి. 3.13. త. తిరుమణివటమ్. <త. తిరుమణివటమ్. **తిరుమంత్రము** వి. అష్టాక్షరి, నారాయణ మంత్రం. పరమ. వి. 5.119. క. తిరుమంత్ర. పవిత్ర మంత్రం ; త. తిరుమంతిరమ్ . అష్టాక్షరి, పంచాక్షరి. <త. తిరుమంతిరమ్. **తిరుమంత్రిభోగము** వి. దేవునికి ఆముదుపడి నైవేద్యం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1276. **తిరుమన్ను** రూ. తిరుమణి, తిర్మణి. వి. వైష్ణవులు నొసట పెట్టుకొనే తెల్లనిమట్టి. ఆము. 6.6. త. తిరుమణ్. వైష్ణవులు నుదుటను ధరించే తెల్లటిమన్ను. <త. తిరుమణ్. **తిరుమల** రూ. తిర్మల. వి. వేంకటాచలం. హర. 1.24. క. తిరుమలె, తిరుమల. తిరుపతికొండ ; త. తిరుమలై. పవిత్రపర్వతం, తిరుపతిలోని వేంకటేశ్వ రుని కొండ. <త. తిరుమలై. **తిరుమళ్ళంచు** వి. మూడురంగు కడ్డీలునేసిన అంచు. **తిరుమళ్ళంచుకమ్మి** వి. మూడుపట్టెలు పడేటట్లు నేసిన ఒకరకం కమ్మి. <తిరు + మూఁడు + - లు + అంచు కమ్మి. **తిరుమాల** వి. వనమాల, ఆకులు పువ్వులుచేర్చి కట్టిన మాల. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 716. క్రీ.శ. 1347. ప్రబంధ. 581. త. తిరు

మాలై. దైవ విగ్రహానికి వేసే పూలదండ. <త. తిరుమాలై. **తిరుమాళిగ** రూ. తిరుమాళిగె, తిరుమాళిహ, తిరుమాళ్హ. వి. గురువు మొ. వారుండే పవిత్రగృహం. వరాహ. 10.16. క. తిరుమాళిగె. పూజ్యులుండే ఇల్లు ; త. తిరుమాళిహై, తిరుమాళికై. పూజ్యులు నివసించే ఇల్లు. <త. తిరుమాళికై. **తిరుమాళిగె** రూ.చూ. తిరుమాళిగ. వి. గురువు మొ. వారుండే పవిత్ర గృహం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 874. క్రీ.శ. 1620. కృష్ణ. 2.4. **తిరుమాళిహ** రూ.చూ. తిరుమాళిగ. వి. పూజ్యులు నివసించే గృహం. వైజ. 2.115. **తిరుమాళ్హ** రూ.చూ. తిరుమాళిగ. వి. వైష్ణవ గురువులుండే పవిత్రగృహం. వైజ. 2.126. **తిరుముట్టము** వి. గర్భగుడి. నె.శా. కనిగిరి. 24. క్రీ.శ. 1268. త. తిరుముఱ్ఱమ్. గుడిలో ప్రధాన విగ్రహానికి ఎదురుగా ఉండే ప్రాంగణం. <త. తిరుముఱ్ఱమ్. **తిరుముడి** వి. **1**. జడలుగా అల్లుకొనే జుట్టు. బసవ. 4.1011 ; **2**. భక్తజనం, వైష్ణవ సమూహం. పరమ. వి. 4.143. క. తిరుముడి. దేవాలయంలో ప్రధాన విగ్రహ శిరస్సు. త. తిరుముటి. <త. తిరుముటి. **తిరుముత్తము** వి. దేవస్థానం, దేవాలయం. బసవ. 6.761. త. ముత్తమ్. ముందరి ప్రదేశం, ప్రదేశం. <త. తిరుముత్తమ్. **తిరుమెయి** వి. మూల విగ్రహం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1266. త. తిరుమెయ్. గుడిలోని మూలవిగ్రహం. **తిరుమేనికావలి** వి. దేవాలయరక్షకుడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556. త. తిరుమేని. గుడిలోని విగ్రహం. <త. తిరుమేని + కావలి. **తిరుమేను** వి. పవిత్ర శరీరం. పరమ. వి. 1.67. త. తిరుమేని. దైవభక్తుడు, విగ్రహం. **తిరుయజ్ఞోపవీతము** వి. దేవుని వినియోగానికి ఉపయోగించే పవిత్ర యజ్ఞసూత్రం, జందెం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 860. క్రీ.శ. 1361. **తిరువజాము** వి. అర్ధరాత్రి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 774. క్రీ.శ. 1380. **తిరువజ్యాఅవసరము** చూ. తిరుమజ్యనము. వి. తిరుమజ్జన విధి, స్నపనవిధి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 722. క్రీ.శ. 1330. **తిరువంజనము** రూ.చూ. తిరుమజ్యనము. వి. విగ్రహానికిగాని, రాజుకిగాని చేసే అభిషేకం, స్నానం. వైజ. 2.115. **తిరువడి** వి. **1**. పవిత్రపాదం. ద్వి. పరమ. వి. 3.13, వైజ. 2.60 ; **2**. భక్తుడు. సమీర. 3.159 ; **3**. పుణ్యస్థలం, తీర్థం. శ్రీరం. మా. 2.35 ; **4**. భక్తుడైన ఆంజనేయుడు. త. తిరువటి. దేవుని లేదా సన్యాసి పవిత్ర పాదాలు, హనుమంతుడు, గరుత్మంతుడు, సన్న్యాసి. <త. తిరువటి. **తిరువడికోల** వి. దాసరివాని దీపస్తంభం. ఆము. 4.35. త. తిరువటికోల్. <త. తిరువటికోల్. **తిరువడిపోతులు** వి.బ.వ. శ్రీపాదాలు. కారెంపూడి శాసనం. క్రీ.శ. 1396. **తిరువద్యానం** వి. పవిత్రగ్రంథ పఠనం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556. త. తిరువత్తియయనం. పవిత్ర గ్రంథాల పఠనం. <త. తిరువత్తియయనం. **తిరువనిచిట్టి** చూ. తిరుమణి. వి. తిరువనిరంగులో కమ్మిలో నేసిన గీరలు. **తిరువని బంక** చూ. తిరుమణి. వి. తిరువని చెట్టుజిగురు.

**తిరువరంగము** వి. శ్రీరంగం, ఒకానొక దివ్యక్షేత్రం. వైజ. 2.132. త. తిరువరంకమ్. శ్రీరంగం. <త. తిరువరంకమ్. **తిరువరంగములు** చూ. తిరువరంగము. వి.బ.వ. శాలిధాన్య విశేషం. **తిరువర్ధజాము** వి. సాయంకాలం అయిన పిదప అర్ధజాముకాలం. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 1116. క్రీ.శ. 1376. **తిరువలికోల** రూ.చూ. తిరువళికకోల. వి. దివిటీ (అని అనిపిస్తున్నది). కారెంపూడి శాసనం. క్రీ.శ. 1396. **తిరువళికకోల** రూ. తిరువలికోల. వి. దేవుని సమక్షంలో పెట్టే దీపదండం, దివిటీ. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 703. క్రీ.శ. 1391. త. తిరువిళక్కు. దేవసన్నిధిదీపం. **తిరువళిక్కి** రూ.చూ. తిరువిళికె. వి. దేవుని దీపం. **తిరువళ్లము** వి. పుష్కరిణి, కోనేరు. నె.శా. ఉదయగిరి. 7. **తిరువళ్ళూరు** వి. శైవ పుణ్యక్షేత్రం. హర. 1.10. త. తిరువళవూర్. తమిళనాడులోని తంజావూరు జిల్లాలోని శైవ దేవాలయం. <త. తిరెవళువూర్. **తిరువాభరణాలు** వి.బ.వ. దేవుని భూషణాలు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 120. క్రీ.శ. 1275. త. తిరువాపరణమ్. విగ్రహాభరణాలు, <త. తిరువాపరణమ్ + - లు. **తిరువాముడి** రూ.చూ. తిరువాయిముడి. వి. ద్రవిడవేదం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 82. విప్ర. 2.31. **తిరువామొళి** రూ.చూ. తిరువాయిముడి. వి. ద్రవిడవేదం. **తిరువాయిముడి** రూ. తిరువాముడి, తిరువామొళి, తిరువాయిమొళి, తిరువాయ్ముడి. వి. ద్రవిడవేదం. ద.హిం,శా. సంపు. 5. శా.సం. 66. వైజ. 4.129. త. తిరువాయ్మొఴి. విష్ణుస్తోత్రాలున్న 1000 సంకీర్తనలున్న గ్రంథం. <త. తిరువాయ్మొఴి. **తిరువాయిమొళి** రూ.చూ. తిరువాయిముడి. వి. ద్రవిడవేదం. **తిరువాయ్ముడి** రూ.చూ. తిరువాయిముడి. వి. ద్రవిడవేదం. **తిరువారాధన** రూ.చూ. తిరువారాధనము. వి. దేవతార్చనం, పూజ. **తిరువారాధనము** రూ. తిరువారాధన. వి. దేవతార్చనం. నె.శా. కనిగిరి 24. క్రీ.శ. 1568. త. తిరువారాతనమ్. దైవపూజ. <త. తిరువారాతనమ్. **తిరువాలవాయి** వి. సర్పంలా చుట్టుకొనిఉన్న మధుర. త. తిరువాలవాయ్. సర్పంలా చుట్టుకొన్న మధుర. <త. తిరువాలవాయ్. **తిరువిడియావములు** వి.బ.వ. తాంబూలం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 540. త. విడైయమ్. తాంబూలం. **తిరువిళక** రూ.చూ. తిరువిళికె. వి. **1**. దీపం. వైజ. 2.121 ; **2**. దేవతాసన్నిధిని పెట్టే దీపం. **తిరువిళికె** రూ. తిరువళిక్కి, తిరువిళక, తిరువెళక్క, తిర్లిక, తిర్విళక, తిల్లిక, తిళ్ళిక. వి. దీపం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 565. క్రీ.శ. 1391. త. తిరువిళక్కు. దేవసన్నిధిదీపం. <త. తిరువిళక్కు. **తిరువీథి** రూ. తిరివీథి. వి. దేవుడ్ని ఊరేగింపుగా తీసుకొనివెళ్ళే వీథి. <త. తిరువీతి. **తిరువీథిసానులు** వి. బ.వ. దేవుడూరేగే వీధుల్లో ఊరేగింపుతో వెళ్ళే వేశ్యలు. నె.శా. ఒంగోలు. 23. క్రీ.శ. 1534. **తిరువీసము** వి. పాయసం. విప్ర. 5.12. త. తిరువిచమ్. <త. తిరువీచమ్. **తిరువుళ్ళము** వి. దేవుడు, రాజు, గురువు (లేక) మరో గొప్ప వ్యక్తియొక్క సంకల్పం (లేక) సంతోషం.

వి్రప. 3.43. త. తిరువుళ్ళమ్. దైవానుగ్రహం. <త. తిరువుళ్ళమ్. **తిరువెళక్క** రూ.చూ. తిరువిళికె. వి. దేవుని కెదురుగా పెట్టే దీపం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556. **తిరుసన్నిధి** వి. దేవుని సమక్షం. ద.హిం. శా.సంపు. 4. శా.సం. 715. క్రీ.శ. 1336. **తిరుసున్నంపట్టు** వి. పచ్చిపసుపురంగు. **తిర్నాళ్లబెండ** వి. దక్కనులోను, కర్ణాటకలోను బంజరునేలల్లో పెరిగే ఒక మొక్క (Sida Spinosa). **తిర్నాళ్లు** రూ.చూ. తిరునాళ్లు. వి. దేవోత్సవం. క్రీడా. 209. **తిర్నీరు** రూ.చూ. తిరునీఱు. వి. విభూతి. **తిర్మణి** రూ.చూ. తిరుమన్ను. వి. వైష్ణవులు నొసట ఉంచుకొనే ధవళమృత్తిక. ఇందు. 5.62. **తిర్మనంటు** రూ. తిరమని అంటు. వి. పట్టుకు పెట్టే వరిగింజలో కలిపే ఒకరకం జిగురు. **తిర్మల** రూ.చూ. తిరుమల. వి. వేంకటాచలం. **తిర్లిక** రూ.చూ. తిరువిళికె. వి. **1**. దేవతా సన్నిధిని పెట్టే దీపం; **2**. దీపం. **తిర్విళక** రూ.చూ. తిరువిళికె. వి. **1**. దేవతాసన్నిధిని పెట్టే దీపం; **2**. దీపం.

**తిరుకసు** రూ.చూ. తిరకాసు. వి. **1**. భిన్నం; **2**. వివాదం.

**తిరుగ** చూ. తిరుగు.

**తిరుగటిపళ్లు** చూ. తిరుగు.

**తిరుగడ** చూ. తిరుగు.

**తిరుగడదబ్బ** చూ. తిరుగు.

**తిరుగడి** చూ. తిరుగు.

**తిరుగఁదీయు** చూ. తిరుగు.

**తిరుగఁదోడు** చూ. తిరుగు.

**తిరుగమాత** చూ. తిరుగు.

**తిరుగఁబడు** చూ. తిరుగు.

**తిరుగఁబాటు** చూ. తిరుగు.

**తిరుగఁబారు** చూ. తిరుగు.

**తిరుగఁబాఱు** చూ. తిరుగు.

**తిరుగఁబోఁత** చూ. తిరుగు.

**తిరుగఁబోయు** చూ. తిరుగు.

**తిరుగలి**$^{1}$ చూ. తిరుగు.

**తిరుగలి**$^{2}$ చూ. తిరుగు.

**తిరుగల్లి** చూ. తిరుగు.

**తిరుగవాత** చూ. తిరుగు.

**తిరుగవేయు** చూ. తిరుగు.

**తిరుగాడు** చూ. తిరుగు.

**తిరుగు** రూ. తిరువు, తిర్గు. చూ. తిరియు. అ.క్రి. **1**. సంచరించు, పరిభ్రమించు. భార.ఆది. 4.38; **2**. మెలగు, ప్రవర్తించు. భార.విరా. 1.122; **3**. మరలు, వెనుదీయు. భార.భీష్మ. 2.52; **4**. గుండ్రంగా భ్రమించు, చక్రభ్రమణం చేయు. భార. ద్రోణ. 5.377; **5**. చుట్టూ ఆవరించు. శృం.నై. 2.38; **6**. మరల మరల వచ్చు, పునఃపునరావృత్తమగు. భాగ. 1.82. కాశీ. 3.103; **7**. పరివర్తనంపొందు, మారు. ఆము. 4.137; **8**. తిరగబడు, ఎదుర్కొను. ఆము. 4.254; **9**. మరలివచ్చు. పారి. 5.14; **10**. ఏర్పడు. పరమ. వి. 3.48; స.క్రి. **1**. వలగొను, ప్రదక్షిణంచేయు. భీమ. 3.169; **2**. దాటు, తప్పు, ఉల్లంఘించు. భాగ. 8.599; **3**. చుట్టు, పరివేష్టించు. విష్ణుపు. 3.45; వి. తిరగటం, తిప్పటం, పర్యటనం. ఆం.భా. 2.174.

క. తిరిగు. పరిభ్రమించు, మరలు, తిరి. తిప్పు, తిరువు, తిరివు, తిరిపు. తిప్పు, తిరుగు. తిరుగు; తు. తిర్ంగుని, తిర్గుని. తిప్పు, తిరుగు; త. తిరుపు, తిరి. తిరుగు, తిప్పు; మ. తిరియుక, తిరిక్క, తిరుకు, మెలిపెట్టు, తిరుగు, తిరి. భ్రమణం, తిప్పు; కో. తిర్గ్, తిర్క్. తిరుగు, తిర్య- (తిర్చ్-); తొ. తిర్క్న్, తిర్క్. తిరుగు; గోం. తిరీ, తిరుహ్తా; గోం.మ. తిర్హా; కుఇ. తిర్గ. వణుకు, తెర్ప. గాలి గుండ్రంగా తిరుగు, త్రేబ. తిరుగు, త్రెహ్పా. తిప్పు; కువి. త్రిగ్. వణుకు, తిడ్వ్. తిరుగు, తేడ్వ్బ, తెర్వ్వ; పర్జి. తిర్ (తిర్య-, తిరి-), తిర్క్; కోలా. తిర్గ్ (తిరిక్); నా. తిర్గ్; కురు. తీర్ (తీర్చ). తిరుగు; బ్రా. స్కిర్. చుట్టుకొనిపోవు, త్రిక్క్. ఎండిపోవు.

మూ.ద్రా. *తీర్-. *తిర్-/*తిరుక్-/*తిరువ్.

**తిరగబోత** రూ.చూ. తిరుగఁబోఁత. వి. తాలింపు. **తిరగవేయు** రూ.చూ. తిరుగవేయు. స.క్రి. తిప్పు, ఒక వస్తువును రెండవప్రక్కకు తిప్పు. **తిరిగించు** స.క్రి. **1**. మరల్చు, నివర్తించు. రం.రా.యు. 361 పు. 12 పం.; **2**. తిప్పు, సంచరింపజేయు. హరి.ఉ. 9.99. **తిరిగివచ్చు** అ.క్రి. మళ్ళీవచ్చు. భార.ఆది. 8.300. స.క్రి. **1**. వలగొను, ప్రదక్షిణించు. ఉ.హరి. 2.169; **2**. పరివేష్టించు, చుట్టు. భాగ. 10 పూ. 495. **తిరిగేతలుపు** వి. ఇరుసుమీద గుండ్రంగా తిరిగే ఏర్పాటున్న చిన్న తలుపు. **తిరుగ** అవ్య.ద్రు. **1**. ఉపర్యర్థకం, అదనంగా, మరి, ఇక. భార.శాంతి. 5.150; **2**. విరుద్ధంగా, వ్యత్యస్తంగా. కాశీ. 6.81; **3**. పునరర్థకం, మరల. వరాహ. 7.26; **4**. తప్పేటట్లు, వ్యర్థమయ్యేటట్లుగా. <తిరుగు+-అ$^{7}$. పరమ.వి. 3.22. **తిరుగటిపళ్లు** వి.బ.వ. దవడపళ్ళు. **తిరుగడ** రూ. తిరగడి, తిరుగుడు. వి. **1**. అడ్డంగా అమర్చిన రాటి; **2**. మరపెట్టిన గొట్టం. <తిరుగు+గడ. **తిరుగడదబ్బ** వి. రాటికి కిందగాని పైన గాని కట్టిన వెదురుబద్ద. **తిరుగడి** వి. కిటికీ రెక్కలను బంధిస్తూ గుండ్రంగా తిరగడానికి వీలుగా అమర్చబడే చిన్న గడియ. <తిరుగు+గడి. **తిరుగఁదీయు** స.క్రి. వ్యతిరేకంగా తిప్పు. <తిరుగు+ -అ$^{7}$+తీయు. **తిరుగదోడు** స.క్రి. **1**. నూలు మొ॥వాటిని మరల చుట్టు; **2**. పునర్విమర్శనకు తెచ్చు. < తిరుగు + -అ$^{7}$ + తోడు. **తిరుగమాత** రూ.చూ. తిరుగఁబోఁత. వి. పోపు. **తిరుగఁబడు** అ.క్రి. **1**. భేదిల్లు, వేరుపడు, మారు. భార.ఉద్యో. 1.52; **2**. విపరీతమగు, తలకిందగు, తారుమారగు. భార.ఆను. 3.146; **3**. తిరుగు, సంచరించు. హరి.పూ. 7.123; **4**. ఎదిరించు, ప్రతిఘటించు. ఉ.హరి. 1.19; **5**. మరలు, వెనుకకు తిరుగు. కాశీ. 2.113. <తిరుగు+ -అ$^{7}$+పడు. **తిరుగఁబాటు** వి. **1**. మరలటం, నివర్తనం

కవిరా. 2.173 ; 2. ఎదురుతిరగటం, ఎదిరించటం. < తిరుగు + -అ$^{7}$ + పాటు. **తిరుగఁబారు** (-పాఱు) రూ.చూ. తిరుగఁబాఱు. అ.క్రి. పండబారు, నీరు పొలం అంతా పూర్తిగా పారు. **తిరుగఁబాఱు** రూ. తిరుగఁబారు. అ.క్రి. మరలిపోవు, పారిపోవు. రం.రా.యు. 315 పు. 5 పం. < తిరుగు + -అ$^{7}$ + పాఱు. **తిరుగఁబోఁత** రూ. తిరగబోత, తిరగమోత, తిరగమోత, తిరగవాత, తిరుగమూత, తిరుగవాత, తెరగవాత. వి. తాలింపు, పొగపు. రాజవా. 2.101. < తిరుగు + -అ$^{7}$ + పోఁత. **తిరుగఁబోయు** స.క్రి. పొగచు, తాలించు. < తిరుగు + -అ$^{7}$ + పోయు. **తిరుగలి**$^{1}$ రూ. తిరుగల్లి. వి. తిరగటం, భ్రమణం. భోజ. 5.59. < తిరుగు + -కలి. **తిరుగలి**$^{2}$ రూ. తిరగలి. వి. 1. పిండి మొ॥ విసరే శిలాయంత్రం, ఘరట్టం, 2. కుసితిరగటానికి వీలుగా దాని కింద అమర్చిన గుంటకల కొయ్యదిమ్మ. < తిరుగు + కల్లు + -ఇ$^{9}$. **తిరుగల్లి** రూ.చూ. తిరుగలి$^{1}$. వి. తిరగటం, భ్రమణం. **తిరుగవాత** రూ.చూ. తిరుగఁబోఁత. వి. పోపు. **తిరుగవేయు** రూ. తిరగవేయు. స.క్రి. తిప్పు, ఒక వస్తువును రెండవ పక్కకు తిప్పు, వ్యత్యస్తం చేయు. వరాహ. 10.40. < తిరుగు + -అ$^{7}$ + వేయు. **తిరుగాడు** అ.క్రి. 1. చుట్టూ తిరుగు, వలయాకారంగా తిరుగు. హర. 7.46 ; 2. తిరుగు, సంచరించు, పరిభ్రమించు. జైమిని భా. 8.125. < తిరుగు + ఆడు. **తిరుగుగిట్ట** రూ. తిరుగ్గిట్ట, తిరుగ్గిట్టె. వి. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలి గిట్ట. **తిరుగుజెముడు** వి. కర్ణాటకలోను నెల్లూరునుంచి తిరునల్వేలి వరకు కల కొండల మీద పెరిగే మొక్క (Euphorbia Tortilis). **తిరుగుజేసికొను**(-చేసికొను) స.క్రి. మార్చుకొను. **తిరుగుడు** రూ. తిరగడ$^{2}$. వి. 1. పర్యటనం, సంచారం. హర. 6.90 ; 2. తిరగటం, భ్రమణం. మను. 4.27 ; 3. చక్రం. హ.న. 4.43 ; 4. మారుపాటు, వ్యత్యాసం ; 5. చిక్కు ; 6. మర ; 7. తిరుగుచీల గల ఇరుకు దాగలి, ఒకరకం పనిముట్టు ; 8. మోటబాన చివరి తొండపు తాడు నేలకి తగలకుండా జరగటానికి వీలుగా అమర్చిన గిలక ; 9. చాపిన పడుగును తిరగవెయ్యటానికి ఉపయోగించే కొయ్యపనిముట్టు ; 10. మలుపు, మంటల్లో విభేదం. **తిరుగుడుఅడ్డ** వి. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్య గుండు. **తిరుగుడుకట్టె** వి. రాట్నం ఇరుసుతిప్పే కొయ్య పిడి. **తిరుగుడుకట్టెదారం** వి. పుల్లిరుసుకు వేసిన అచ్చు సూత్రం. **తిరుగుడుకండ్లు** వి.బ.వ. ఎక్కువగా చుట్టూతిరిగే కనుగుడ్లు. **తిరుగుడుకపిల** రూ. తిరగడకపిల. వి. 1. రెండుజతల ఎడ్లతో తోలే కపిల ; 2. ఎద్దులు మోట లాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరే దోవ ఏర్పాటు చేసిన మోట. **తిరుగుడుకర్ర** వి. మగ్గం మీద అచ్చుతాళ్ళు తగిలించిన, రోకలివంటి గుండ్రటి, పొడుగు కర్ర. **తిరుగుడుకర్రగుబ్బ** వి. పుల్లిరుసు నిలవటానికి, పైపట్టికి బిగించిన చెక్క. **తిరుగుడుకర్రచెవు** వి. పుల్లిరుసు నిలవటానికి, పైపట్టికి బిగించిన చెక్క. **తిరుగుడుకర్రతాడు** వి. పుల్లిరుసుకు వేసిన అచ్చు సూత్రం. **తిరుగుడుకుండీ** రూ.చూ. తిరుగుడుకొండి. వి. ఊడ్దై అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు. **తిరుగుడుకొండి** రూ. తిరుగుడుకుండీ. వి. ఊడ్దై అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని, బిగించిన ఇనపపనిముట్టు. **తిరుగుడుకొను** అ.క్రి. భ్రమించు, తిరుగు. **తిరుగుడుకొలుపు** స.క్రి. తిరగచేయు, భ్రమింపచేయు. బసవ. 3.485 పం. **తిరుగుడుకోల** వి. పడుగును తిరగవెయ్యటానికి కట్టిన కర్ర. **తిరుగుడుగడి** వి. కిటికీ రెక్కలను బంధిస్తూ గుండ్రంగా తిరగడానికి వీలుగా అమర్చిన చిన్నగడియ. **తిరుగుడుగుండు** వి. మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె. **తిరుగుడుగుతి** రూ.చూ. తిరుగుడుగుది. వి. గుదితాడు, తిరుగుడుకు రెండువైపుల కట్టిన తాడు. **తిరుగుడుగుది** రూ. తిరుగుడుగుతి. వి. గుదితాడు, తిరుగుడుకు రెండు వైపుల కట్టిన తాడు. **తిరుగుడుచీల** వి. తిరుగుడునొక్కులుగలచీల, మరమేకు. **తిరుగుడుచెక్క** వి. పుల్లిరుసు నిలవటానికి, పైపట్టికి బిగించిన చెక్క. **తిరుగుడుత్రాడు** వి. పక్షుల్ని పట్టే సాధనం. ద్వి.నల. 3.319 పం. **తిరుగుడుదీపస్తంభము** వి. కర్రసెమ్మెలోని భేదం. **తిరుగుడుదోని** రూ.చూ. తిరుగుడుదోనె. వి. 1. మగ్గం చివర, పడుగునూలుచుట్టే కొయ్యదూలం ; 2. పెంటిదోనె, దోనె మలుపు తరువాత భాగం. **తిరుగుడుదోనె** రూ. తిరుగుడుదోని. వి. 1. మగ్గం చివర, పడుగునూలుచుట్టే కొయ్యదూలం ; 2. పెంటిదోనె, దోనె మలుపు తరవాత ఉన్నభాగం. **తిరుగుడునొక్కు** వి. మేకు మున్నగునవి కోసి తయారు చేసిన తిరుగుడుమర. **తిరుగుడుపడు** రూ.చూ. తిరుగుడువడు. అ.క్రి. 1. చుట్టూ తిరుగు, వలయాకారంగా తిరుగు. వీర.వి. 3.211 ; 2. కలతనొందు, క్షోభపడు. చిత్రభా. 1.62 ; 3. భ్రమణం పొందు ; 4. స్ఖలితమగు, జారు ; 5. మరలు, వెనుదీయు, మరలిపోవు. **తిరుగుడుపంటె** రూ. తిరుగుడుబంటి, తిరుగుడుబంటె. వి. గుమ్మటం లాంటి పనిముట్టు. **తిరుగుడుపాటు** వి. 1. కలగటం, క్షోభపడటం. నిర్వ.రా. 3.2; 2. క్షోభం, కలత. **తిరుగుడుపుల్ల** వి. 1. పొడుగాటి తాడుకట్టిన కొయ్యముక్క ; 2. చుట్టూ గుడిసెకైవారం నమూనా గీయడానికి వాడే సాధనం. **తిరుగుడుపుల్లచెక్క** వి. కుసి తగిలించడానికి రంధ్రం ఉంచి దర్వాజాపై కమ్మిమీద పరిచిన చెక్క. **తిరుగుడుపువ్వు** వి. 1. పొద్దు తిరుగుడుపువ్వు ; 2. స్త్రీలు తలలో పెట్టుకొనే చేమంతి పువ్వు వంటి ఆభరణం. **తిరుగుడుపెట్టు** స.క్రి. భ్రమింపచేయు. ద్వి.పరమ.వి. 3.222 పం. **తిరుగుడుబంటి** రూ.చూ. తిరుగుడుపంటె. వి. గుమ్మటంలాంటి పనిముట్టు. **తిరుగుడుబంటె** రూ.చూ. తిరుగుడుపంటె. వి. గుమ్మటంలాంటి పనిముట్టు. **తిరుగుడుబల్ల** వి. కుసితగిలించటానికి రంధ్రం ఉంచి దర్వాజాపై కమ్మిమీద పరచినచెక్క. **తిరుగుడుబారి** రూ. తిరగడబారి, తిరుగుబారి. వి. ఒకసారి మోటలాగిన తరువాత ఎద్దులు మోటబావివైపు ఎక్కి వెళ్ళేదారి. **తిరుగుడుబిల్ల** రూ.చూ. తిరుగుడుబిళ్ళ. వి. స్త్రీలు తలలో పెట్టుకొనే ఒకనగ. **తిరుగుడుబిల్లలు** రూ.చూ. తిరుగుడుబిళ్లలు. వి.బ.వ. బాలక్రీడా విశేషం. **తిరుగుడుబిళ్ల** రూ.

**తిరుగుడుబిల్ల.** వి. స్త్రీలు తలలో పెట్టుకొనే నగ. **తిరుగుడు బిళ్లలత్రిప్పళ్లు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. **తిరుగుడు బిళ్లలు** రూ. తిరుగుబిల్లలు. వి.బ.వ. త్రిప్పళ్లు, పిల్లలు ఆడే ఒకరకమైన ఆట. హంస. 3.146. **తిరుగుడుబిళ్ళ** వి. పుల్లిరును నిలవటానికి, పైపట్టికి బిగించిన చెక్క. **తిరుగుడు మాను** వి. ఎద్దుకు కాడి మరపటానికి గానుగ మాదిరి అమర్చిన కొయ్య యంత్రం. **తిరుగుడుమోట** వి. ఎద్దులు మోటలాగుతూ దిగి బావివైపు తిరిగి పోవటానికి వేరేదోవ ఏర్పాటు చేసిన మోట. **తిరుగుడురెక్క** వి. తిరిగే రెక్క. **తిరుగుడురోగం** వి. కట్టుకొయ్య చుట్టూ పిచ్చెత్తినట్టు తిరగటం. **తిరుగుడుబాయి** వి. గిరున తిరుగుతూ పోయి తగిలే ఫిరంగి గుండు లాంటి రాయి. కుప.చ. 3.18. **తిరుగుడుపడు(-వడు)** రూ. తిరుగుడుపడు, తిరుగుపడు. అ.క్రి. **1.** కలతనొందు, క్షోభ పడు. భార. విరా. 3,178 ; **2.** మరలు, వెనుదీయు, మరలి పోవు. భార. భీష్మ 1.268. **3.** స్ఖలితమగు, జారు. భార. శాంతి. 4.306 ; **4.** చుట్టూ తిరుగు, వలయాకారంగా తిరుగు. హర. 6.59. **తిరుగుడువడ్డీ** వి. చక్రవడ్డీ. **తిరుగుడువాకిలి** వి. పిడతల మీద తిరిగే తలుపు. **తిరుగుడుసలాక** రూ. తిరుగుడు సలాకి. వి. ఊడ్తె అడ్డపట్టెకుగాని సరిగుంజల అడ్డ పట్టెకుగాని బిగించిన ఇనపఊచ. **తిరుగుడుసలాకి** రూ.చూ. తిరుగుడుసలాక. వి. ఊడ్తె అడ్డపట్టెకుగాని సరిగుంజల అడ్డ పట్టెకుగాని బిగించిన ఇనపఊచ. **తిరుగుడుసీకు(-చీకు)** వి. ఊడ్తె అడ్డపట్టెకుగాని సరిగుంజల అడ్డపట్టెకుగాని బిగించిన ఇనపకొండి. **తిరుగుడోలి** వి. పిడతల మీద తిరిగే తలుపు. **తిరుగుదల(-తల)** వి. మరలటం, నివర్తనం. **తిరుగుదున్నకం** వి. రెండోసారి దున్నటం. **తిరుగుపడు** రూ.చూ. తిరుగుడు పడు. అ. క్రి. కలతనొందు, క్షోభపడు. విష్ణు. నా. 4.6. **తిరుగుపారు** రూ.చూ. తిరుగువాఱు. స.క్రి. పరివేష్టించు. **తిరుగుబండి** వి. వెనుకకు తిరిగి వచ్చే బండి. **తిరుగుబారి** రూ.చూ. తిరుగుడుబారి. వి. ఒకసారి మోటలాగినతరువాత ఎద్దులు మోటబావి వైపు ఎక్కివెళ్ళేదారి. **తిరుగుబారు (-పాఱు)** వి. తాలింపు, పోపు. **తిరుగుబేరము** వి. మారు బేరం. **తిరుగుమరపు** వి. **1.** చిక్కు ; **2.** శుద్ధి చేయటం. **తిరుగుమరుగు** వి. మెలకువ. రాధికా. 3.7. **తిరుగుముఖము పట్టు** అ.క్రి. **1.** తగ్గు ; **2.** మరలి పయనించు. **తిరుగుమొగము** వి. **1.** విముఖం, వెనుతిరిగినది. పాండు. 2.174 ; **2.** పెడమొగం, వెనక్కి తిప్పిన మొగం. **తిరుగుమొరుగు** వి. **1.** శుద్ధి చేయటం ; **2.** చిక్కు. **తిరుగుఁబోతు** వి. **1.** వ్యభిచారిణి. దా.శ. 63 ; **2.** ఒకచోట కాలునిలవక ఎప్పుడూ తిరుగుతుండే వాడు ; **3.** తిరిగే స్వభావం కల. **తిరుగులాడు** అ.క్రి. **1.** సంచరించు, పరిభ్రమించు ; **2.** చుట్టూతిరుగు. <తిరుగు + -లు + ఆడు. **తిరుగువాఱు (-పాఱు)** రూ. తిరుగుపారు. స.క్రి. పరివేష్టించు, చుట్టు వారు. మను. 3.107. **తిరుగోల(-కోల)** వి. చుట్టు. **తిరుగోలుకొట్టు** రూ.చూ. తిరగాలకొట్టు. స.క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపు చేయు. **తిరుగ్గిట్ట** రూ.చూ. తిరుగుగిట్ట. వి. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలిగిట్ట. **తిరుగ్గెట్టె** రూ.చూ. తిరుగుగిట్ట. వి. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలి గిట్ట.

**తిరుగోల** చూ. తిరుగు.

**తిరుగోలుకొట్టు** చూ. తిరుగు.

**తిరుగ్గిట్ట** చూ. తిరుగు.

**తిరుగ్గెట్టె** చూ. తిరుగు.

**తిరుచ** వి. దేవుణ్ణి ఊరేగించే పల్లకి, వాహనం. **వేంక.మా.** 2.112.

త. తిరుచి, తిరుచై. కన్ను.

<త. తిరుచై.

**తిరుచు** చూ. తిరియు. స.క్రి. భిక్షమెత్తు.

**తిరుఁడు** వి. స్థిరమైనవాడు. నరస. 2.99.

సం. స్థిర-. దృఢమైన, బలమైన ; ప్రా. అమా. పా. అప. ఒ. థిర- : నే. థిర్, థిరొ. దృఢమైన ; అ. బెం. థిర్.

<ప్రా. థిర-.

**తిరుపగూడ** వి. గూడ వైష్ణవులు తిరుమణి పెట్టె మొ. ఉంచి చంకను తగిలించుకొనే తాటాకుబుట్ట.

త. తిరుప్పుణ్ కూడై. వైష్ణవులు బట్టలుంచుకొనేబుట్ట.

<త. తిరుప్పుణ్ కూడై.

**తిరుపు** చూ. తిరుగు. రూ. తిపురు. వి. **1.** లాగుకొనటం. కు. సం. 12.157 ; **2.** జక్కిణీ నాట్యవిశేషానికి గల అంశాల్లో ఒకటి. చంద్రభా. 2.141 ; సమీర. 3.217 ; **3.** తిరగటం, భ్రమణం ; **4.** మర.

క. తిరుపు. మెలితిరగటం : త. తిరుప్పు. తిప్పు, పక్కకుతిరగటం.

**తిరుపుగట్టు (-కట్టు)** రూ. తిపురుకట్టు. అ.క్రి. **1.** తిరుగు, భ్రమణం చేయు. నిరంకు. 4.69 ; **2.** నాట్యంలో గిరగిర తిరుగు. చంద్రభా. 2.141 ; **3.** వ్యాపించు, ప్రసరించు. **తిరుపుగొను(-కొను)** రూ. తిపురు కొను, తిపురుగొను. అ.క్రి. నాట్యంలో చక్రభ్రమణంచేయు. కాళ. 4.184. **తిరుపుచెంబు** వి. మరచెంబు. **తిరుపుటెద్దు** వి. చుట్టూ తిరిగే ఎద్దు, గానుగెద్దు. క్రీడా. 103. <తిరుపు + ఎద్దు. **తిరుపులుగట్టు (-కట్టు)** అ.క్రి. **1.** వ్యాపించు, ప్రసరించు. వేంక. పంచ. 4.147 ; **2.** తిరుగు, భ్రమణం చేయు. కకుత్స్థ. 4.98 ; **3.** నాట్యంలో గిరగిరా తిరుగు.

**తిరుమన్** వి. నిర్మాణద్రవ్యంగా ఉత్తమ జాతికి చెందినకలప.

**తిరులు** చూ. తిరి. వి.బ.వ. వెర్రి.

**తిరులుమరులుకొలుపు** స.క్రి. వెక్కిరించు. కు. సం. 4.42.

**తిరులుకట్టు** చూ. తిరి.

**తిరులుగట్టు** చూ. తిరి.

**తిరుపు** రూ.చూ. తిరుగు. వి. తిరుగుడు, భ్రమణం. ప్రబంధ. 110.

**తిరుపుగట్టు(-కట్టు)** అ.క్రి. భ్రమణంచేయు, చుట్టుతిరుగు. దశా. 1.225.

**తిరూసు** రూ.చూ. తిరకాసు. వి. **1.** భిన్నం ; **2.** వివాదం.

**తిర్గు** రూ.చూ. తిరుగు. అ.క్రి. సంచరించు.

**తిర్తులు** చూ. తురికీ. వి.బ.వ. తుర్కీ దేశస్థులు, మహమ్మదీయులు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 765. క్రీ. శ. 1678.

**తిర్నాళ్లబెండ** చూ. తిరు.

**తిర్నాళ్లు** చూ. తిరు.

**తిర్నీరు** చూ. తిరు.

**తిర్మణి** చూ. తిరు.

**తిర్మన్** వి. వ్యవసాయ పరికరాల తయారీకి గృహాదినిర్మాణాలకు పనికివచ్చే కలప, తోళ్ళ చదునుకు పనికివచ్చే ఆకులుకల వృక్ష విశేషం (Anogeissus Latifolia).

**తిర్మనంటు** చూ. తిరు.

**తిర్మల** చూ. తిరు.

**తిర్రి** రూ.చూ. తిఱ్ఱి¹. వి. చేపలుపట్టే బుట్ట.

**తిర్రిగొట్టు (-కొట్టు)** రూ.చూ. తిరిపగొట్టు. వి. యాచకుడు.

**తిర్లమర్ల** చూ. తిరుగు, మరలు. రూ. తిర్ల మర్ల. వి. లోభాగం పైభాగంగా, పైభాగం లోభాగంగా ఉండటం.

**తిర్లిక** చూ. తిరు.

**తిర్వ్యేళక** చూ. తిరు.

**తిఱి¹** రూ.చూ. తిఱికి. వి. మత్స్యవిశేషం.

**తిఱి²** రూ.చూ. తిరి. వి. **1**. మెలి ; **2.** చెవిలోపెట్టుకొని తిప్పేవర్తి.

**తిఱికి** రూ. తిరికి, తిఱి¹. వి. మత్స్యవిశేషం, తిరిర అనేచేప (Trygonseption).

త. తిరుక్కై. ఒకరకం చేప.

**తిఱిగొట్టు (-కొట్టు)** రూ.చూ. తిరిపగొట్టు. వి. యాచకుడు.

**తిఱిపగొట్టు(-కొట్టు)** రూ.చూ. తిరిపగొట్టు. వి. యాచకుడు.

**తిఱుపపహిండి** వి. పెళ్ళిసమయంలో దానరూపకంగా ఇచ్చే రొక్కశుల్కం. ద. హిం ; శా. సంపు. 7. శా. సం. 737. క్రీ.శ. 1188.

**తిఱ్ఱి¹** రూ. తిర్రి. వి. తాటి ఈనెలతో బుట్టవలె అల్లిన చేపలు పట్టే సాధనం. హంస. 4.184.

గోం. త్రిర్. పిట్టల్ని తీసుకుపోవటానికి ఉపయోగించే పంజరం ; కొం. టిఱి. చేపలు వేసుకోవటానికి ఉపయోగించే చిన్నబుట్ట.

**తిఱ్ఱి²** రూ. తిఱ్ఱె. వి. తిరిపగొట్టు, విరాగికాని బిచ్చగాడు. ఆం. భా. 2.176.

**తిఱ్ఱిగొట్టు** వి. విరాగికాని బిచ్చగాడు. ఆం. భా. 2.176.

**తిఱ్ఱె** రూ.చూ. తిఱ్ఱి². వి. యాచకుడు.

**తిలకించు** రూ. తులకించు, తులకరించు. అ.క్రి. **1**. కనపడు, పొడసూపు, వ్యక్తమగు. హరి. పూ. 5.170 ; **2**. నిదానించు. విక్ర. 1.133 ; **3.** ప్రసన్నతనొందు. వైజ. 2.21 ; స.క్రి. **1**. ఎంచు, భావించు. హరి. ఉ. 7.23 ; **2**. వీక్షించు, చూచు. భీమ. 3.93 ; **3**. మెచ్చు, మెచ్చుకొను. భాగ. 10పూ. 112 ; **4**. దిద్దుపెట్టు. సిం. ద్వా. 11.133 ; **5**. ఆదరంతో చూచు, ఆదరించు. వసు. 1.11 ; **6**. చేయు. భర్తృ. నీతి. 99 ; **7**. ప్రకాశించు.

క. తొళగు, మెరయు, మెరుపు ; త. తుళంకు (తుళంకి-.) మెరయు. తుళక్కమ్. మెరుపు, తులంకు (తులంకి-.) ప్రకాశించు, స్పష్టమగు, తులక్కు (తులక్కి-.) ప్రకాశింపచేయు, స్పష్టపరుచు, ప్రకాశం ; మ. తుళఙ్ఙుక. ప్రకాశించు, తుళక్కుక. మెరుగుపెట్టు, తుళక్కమ్. ప్రకాశం. తిళఙ్ఙుక, తెళక్కమ్. కాంతి.

**తిలక్‌రంగు** వి. ఓవల్టీనురంగు.

సం. తిలక-. బొట్టు.

సం. తిలక-+రంగు.

**తిలాలో** వి. ఒలిసెలు, నువ్వుల్లో చేదుగా ఉండే ఒకరకం.

సం. తిల-. నువ్వు.

సం. తిల-+లు.

**తిర్లమర్ల** రూ.చూ. తిర్లమర్ల. వి. తల్లకిందులు.

**తిర్లమర్లపెట్టు.** స.క్రి. తిరగవేయు.

**తిల్ల** వి. వేసవిలో సువాసనగల పసుపుపచ్చపూలు పూసే విషక్షీరంకల చెట్టు (Excoecaria Agallocha).

త. తిల్లై.

**తిల్లిక** రూ.చూ. తిరువిళకె. వి. దీపం.

**తిల్లెవలు** వి. కప్పుమట్టం.

ఇం. *Level*. సమమైన, చదునైన, సమతలం.

**తిళ్ళకాడ** రూ. తిళ్ళికాడ. వి. అడవుల్లో పెరిగే ఒకరకం తీగ (Mucuna Alropurpurca).

**తిళ్ళిక** రూ.చూ. తిరువిళకె. వి. దీపం.

**తిళ్ళికాడ** రూ.చూ. తిళ్లకాడ. వి. అడవుల్లో పెరిగే ఒకరకం తీగ.

**తివ** రూ.చూ. తిగ. విణ. మూడు. అచ్చ. రా. సుందర. 58.

**తివాచి** రూ.చూ. తివాసి. వి. ఉన్నిదారంతో ఒత్తుగానేసిన కంబళి.

**తివాచీ** రూ.చూ. తివాసి. వి. మేలైన చిత్రాసనం, కంబళం. హంస. 5.356.

**తివాటు** వి. నాలుగు చీరల నేతకు సరిపడే మొత్తం పడుగు.

**తివాటువేయు** స.క్రి. **1**. సరిచేసిన పడుగు మొత్తంనేయవలసిన ఉరులకు సరిపడేటంత పొరలువేయు ; **2**. సరిచేసిన పడుగులో కింది పోగులూ పైపోగులూ పాయలు పాయలుగా విడదీసి చాపు. **తివాటెత్తు** స.క్రి. సరిచేసిన పడుగులో కిందిపోగులూ పైపోగులూ పాయలు పాయలుగా విడదీసి చాపు.

**తివాటెత్తు** చూ. తివాటు.

**తివారిబ్రాహ్మణులు** వి.బ.వ. వీరు కన్యాకుబ్జులు, సామవేదులు గౌతమశాఖ, గోబల సూత్రం వారు.

సం. త్రిపాఠిన్. మూడువేదాలు పారాయణ చేసినవాడు ; మరా. తివారీ. బ్రాహ్మణుల్లో ఒక శాఖ.

< మరా. తివారీ + సం. బ్రాహ్మణ + -లు.

**తివాశీ** రూ.చూ. తివాసి. వి. కంబళం. మృత్యు. 3.

**తివాస** రూ.చూ. తివాసి. వి. **1**. రత్నకంబళి ; **2**. కంబళి.

**తివాసి** రూ. తివాచి, తివాచీ, తివాశీ, తివాన, తివాసీ, తివ్వాసి. వి. మేలైన చిత్రాసనం, కంబళం. బహుళా. 1.106, ఉ.రా. 6.128.

మరా.తివాశా. తలగడ, అట్టముక్క ; ఉ. తివాసీ.

ఆస్తరణ విశేషం ; పార. తివాసీ. మేలయిన ఆస్తరణం, రంగురంగుల రగ్గు.

<ఉ. తివాసీ.

**తివాసీ** రూ.చూ. తివాసి. వి. మేలైన చిత్రాసనం, కంబళి. రసిక. 1.61.

**తివాసీకత్తి** వి. తివాసీ నేసేటప్పుడు, పడుగులో ఉన్న పోగులను ఎక్కించి, కొనలుకోసే కత్తి. **తివాసీమగ్గం** వి. తివాసీలు నేసే మగ్గం.

**తివిచికోలు** చూ. తివుచు.

**తివిడీ** రూ.చూ. తిమిడి. వి. ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములను బిగించిన ఇనపదిమ్మె.

**తివియించు** చూ. తివియు.

**తివియు** రూ.చూ. తివ్వు. స.క్రి. 1. ఆకర్షించు, లాగు. భార. ఆది. 7.234 ; 2. నష్టం కలిగించు, విఘ్నంగావించు. H.A.S. 19-21 క్రీ.శ. 1286 ; 3. దిగలాగు, దించు. కాశీ. 7.108 ; 4. గుచ్చు, నాటు. హర. 4.30 ; 5. తిప్పు. మను. 4.111 ; 6. తొలగించు. ప్రభా. 2.5 ; 7. పెరుకు, ఊడదీయు. కళా. 3.188 ; 8. పైకిలాగు, పైకిదీయు. శుక. 2.126 ; 9. మింగు. దశా. 1.137 ; అ.క్రి. 1. జంకు. భార. ఉద్యో. 4.226 ; 2. మరలు, వెనుకకు తిరుగు, వెనుదీయు. భార. భీష్మ. 2.94 ; 3. ఆరిపోవు. వరాహ. 10.28.

**తివియించు** స.క్రి. 1. అపహరింపజేయు. ఆము. 5.30 ; 2. తివియజేయు, పైకి తీయించు. సిం.ద్వా. 1.239; 3. మరల్చు, తిప్పు. ఉ.రా. 4.87. <తివియు + -ఇంచు³.

**తివు** రూ.చూ. తివ్వు. స.క్రి. 1. ఊడదీయు, తీసివేయు. భాగ. 1.476 ; 2. చేరదీయు, దగ్గరగా తీయు. భాగ. 4.219 ; 3. లాగు, ఆకర్షించు. కళా. 3.117 ; 4. లాగుకొనిపోవు. కళా. 7.117 ; 5. తిప్పు. ప్రభా. 4.74 ; 6. దిగలాగు, దించు ; 7. కనిపట్టు.

**తివుచు** రూ.చూ. తిగుచు. స.క్రి. 1. ఈడ్చు. భార. ఉద్యో. 4.199 ; 2. లాగు, ఆకర్షించు, దగ్గరగాలాగుకొను, చేరదీయు. భార.శాంతి. 6.566 ; 3. మరల్చు, వెనుకకు లాగు. శృం.నై. 7.16 ; 4. తోలుకొనిపోవు. దశా. 2.426 ; 5. తీసికొనివచ్చు, తెచ్చు ; 6. పెల్లగించు, పెరుకు ; 7. వెలికితీయు, పైకితెచ్చు, తోడు.

**తివిచికోలు** రూ.చూ. తిగిచికోలు, తిగుచుకొనటం, లాగుకొనటం, ఊడ బెరకటం.

**తివుట**¹ రూ. తిగుట¹. వి. 1. ఆసక్తి, కోరిక, తమి, వాంఛ. కు.సం. 5.41, భార.విరా. 5.395 ; 2. ఉత్సాహం, పూనిక. రం.రా. కిష్కిం. 225. పు. 9 పం. ; క్రి.విశే.ద్రు. శీఘ్రంగా, వడిగా. అం.భా. 1.65.

**తివుట**² రూ.చూ. తిగుట². వి. తూర్పార పోసే మనిషి కూర్చోటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

**తివుడ** వి. తాళ విశేషం. ధనాభి. 2.42.

సం. త్రిపుట-. ఏడక్షరాల కాలం గల ఒక తాళం ; ప్రా. తిఉడ్డ-, తివుడు-.

<ప్రా. తివుడ-.

**తివురించు** చూ. తివురు.

**తివురు** చూ. తిమురు. అ.క్రి. 1. ఇష్టపడు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 900 A.D. భార అను. 2.286 ; 2. ప్రవర్తించు. భార. ఆది. 2.225 ; 3. త్వరపడు, వేగిరపడు. భార.ఆది. 4.36 ; 4. కరుణించు. భార.ఆది. 5.53 ; 5. కడగు, పూను, యత్నించు. భార.ఆది. 7.116 ; 6. కుతూహలపడు, తమికొను. భార.ఆది. 7.173 ; 7. ఇచ్చించు, కోరు. భార.ఆది. 8.242 ; 8. దీక్షవహించు. భార. అరణ్య. 3.3 ; 9. మోగు. కు.సం. 3.30 ; 10. వేడ్కనొందు. భార.విరా. 2.47 ; 11. మారుమోగు. భార.భీష్మ. 2.74 ; 12. అనుకొను, భావించు. భార. అను. 2 286 ; 13. మించు, అతిశయించు. ఉ.హరి. 5.131 ; 14. సిద్ధపడు. ప్రభా. 2.60 ; 15. తిరుగు, సంచరించు. కృ.శకు. 3.5 ; 16. కోపపడు, కోపించు. అచ్చ.రా. సుందర. 57 ; 17. అంగీకరించు. క్రి.విశే.ద్రు. శీఘ్రం. ఆం.భా. 1.65.

సం. తీవ్ర-. తీక్ష్ణమైన, వేగంకల ;

పో.చూ. క. తివు ; త. తివిరి(త్). తొందరపెట్టు. తివరమ్. తీక్ష్ణం. తిమిర్ (తిమిర్వ్-, తిమిర్న్త్-). పెరుగు, అధికమగు ; మ. తిమిరుక. కోపంగా ఉండు, తిమిర్క్క. పిచ్చెక్కినట్లుండు. తిమిర్ప్పు. గర్వం.

<సం. తీవ్ర-.

**తివురించు** స.క్రి. తివురజేయు. త్వర పెట్టు. తొందర పెట్టు. వసు. 2.5. <తివురు + -ఇంచు³.

**తివులదేశము** వి. తమిళనాడు. ఎ.ఇం. సంపు. 30. 280.284.

త. తమిళ్. తమిళదేశం ;

సం. దేశ. నాడు.

<త. తమిళ్ + సం. దేశ- + -ము.

**తివుత్తైసంబు** వి. ఒకరకం పన్ను. కలకడ, వాయల్పాడు. తా॥ చిత్తూరు జిల్లా. క్రీ.శ. 972.

**తివ్వ**¹ రూ.చూ. తీగ. వి. 1. లత. కేయూ. 3.116 ; 2. సన్నటి చువ్వ ; 3. తాడు పేనటానికి వాడే నార ; 4. మరాను కట్టుబడిలో ఆకు బిగింపుకోసం చుట్టిన ఇనప తీగ.

**తివ్వకొక్కిత** వి. ఏనుగులత (Angyreia Speciosa). **తివ్వపాటికె** వి. పచ్చని బెరడూ, గట్టి కాండమూ కలిగిన ఒక తీగ (Hugonia Mystax). **తివ్వబచ్చలి** వి. గడలకు అల్లుపెట్టి పెంచే కూర. **తివ్వముసిడి** రూ. తివ్వముసిడి, తీగముష్టి, తీగముసిని, తీగెముసిడి, తీగె ముసిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్ర మూలం (Tiliacola Racenosa). **తివ్వముసిడి** రూ.చూ. తివ్వముసిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్రమూలం (Tiliacola Racemosa). **తివ్వమోదుగ** రూ.చూ. తీగమోదుగ. వి. ఎరుపురంగు తయారీకి ఉపయోగించే పూలుపూసే ఒక మొక్క (Butea Superba).

**తివ్వ**² చూ. తివ్వు. వి. ఒకరకం కలువ మొక్క.

**తివ్వతీగ** రూ.చూ. తిప్పతీగె. వి. ఇంటి కప్పు మీదకు

అల్లికగా పెట్టే తీగ (Tinospra Cordifolia).

**తివ్వాసి** రూ.చూ. తివాసి. వి. కంబళం. పల్నా. పల్నాటి సంపాదన. 180 పం.

**తివ్వితీగ** వి. ఒకరకం తీగ (Dioscorea Esculata).

**తివ్వు** రూ. తిగియు, తియ్యు, తివియు, తివు, తీయు. స.క్రి. 1. దిగలాగు, దించు. భార.ఆది. 7.26; 2. లాగు, ఆకర్షించు. కు.సం. 8.58; 3. తివ్వు. భార.శాంతి. 1.46; 4. లాగుకొనిపోవు. కళా. 7.117; 5. ఊడదీయు, తీసివేయు. కకుత్థ్స. 3.70; 6. చేరదీయు, దగ్గరగా తీయు.

క. తెగె, తెగు, తెగి. తగ్గింపచేయు, లాగు; తు. తెగుని, దెప్పుని; త. తెకుక్ (తెక్క). పొందు, తీసుకొను, తెవ్వు(తెవ్వి-), తెవ్, తెఫ్వు, తెఫు; కో. తెవ్(తెవ్ద్-, తెచ్-). లాగు; కొలా. తివ్(తివ్-). తివ్వు; నా. తివ్; పో.చూ. మాల్తో. తిన్. ఎత్తు.

మూ.ద.ద్రా. *తిక్-/ *తివ్-లేదా *తక్-/ *తెవ్.

**తిష్ఠపెట్టు** స.క్రి. పీటపెట్టు. భద్రా. 2.

సం. తిష్ఠ. కూర్చో.

<సం. తిష్ఠ+పెట్టు.

**తిష్ఠవేయు** రూ.చూ. తిష్ఠపెట్టు. స.క్రి. పీఠంవేయు.

సం. తిష్ఠ. కూర్చో.

<సం. తిష్ఠ+వేయు.

**తిస్పా** వి. ఎనభై తొమ్మిది. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 753.

ఉ. తిస్అ. తొమ్మిది, ఫా. ఎనిమిది; పార. ఫా.

<ఉ. తిస్అ+ఫా.

**తిస్సాలా** విశ. మూడు సంవత్సరాలు.

హిం.ఉ. తిన్‌సాల్. మూడు సంవత్సరాలు.

<ఉ. తీన్‌సాల్.

**తీ** చూ. తిగ. విశ. సమాసాల్లో తిగళద్దానికి వచ్చే ఆదేశం మూడు.

సం. త్రి-, త్రిణి-. మూడు; ప్రా. తి-, తిణ్ణి-, తీ. అశోకప్రా. తీ. అమా. తి; పా. తి, తిణి; అప. తిణ్ణి.

<ప్రా. తీ.

**తీవంచ** చూ. వంచ[1]. రూ. తిగవంచ. విశ. నాలుగు, నిరంకు. 3.20. పండి. చ. పురా. 125. **తీవంచమోములదిట్ట** వి. నాలుగు ముఖాలుగల దేవుడు, బ్రహ్మ. సాంబ. దేవ. 5. **తీవంచంపట్టి** రూ. తీమంచాపట్టె. వి. సొమ్ముసాలకు మూడు వైపుల వేసే పట్టె.

**తీకటి** రూ.చూ. టికిటి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరాకారంలో ఉండే కొయ్యపరికరం.

**తీకంద** రూ. చూ. తీయకంద. వి. సారవంతమైన గుల్లనేలల్లో సాగుచేసే దుంపపైరు (Amorphalius Campanulatus).

**తీకాతివ్వ** వి. ఉత్తరసర్కారులూ, దక్కనూ, నల్లమలలు మొదలైనచోట్ల అడవుల్లో పెరిగే ఒక పెద్దతీగ.

**తీకు** వి. సుఖం, భోగం. భాగ. 6.421.

తు. తీక్. రుచికరమైన.

**తీగ** వి. తొట్టు, చెరువుకట్ట లోపలిపొలం. తటాకపూర్వ ప్రదేశం. ఆం.భా. 1.163.

**తీగి** రూ.చూ. తీఁగ. వి. 1. సన్నటిచువ్వ; 2. ఉండేలుకు కట్టిన తీగ; 3. మరాను కట్టుబడిలో ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపతీగలు; 4. తండు, రీట, ఉలవ, వేరుసెనగ, అలచంద, పెసర మొ. పైర్లువేసే తీగె.

**తీగిమేకు** రూ.చూ. తీఁగమేకు. వి. సన్నటిమేకు.

**తీగూర** రూ.చూ. తియ్యగూర. వి. 1. పులుసు వెయ్యకుండా వండిన కమ్మనికూర; 2. తోటకూరకు అల్లంచేర్చి వండిన కూర.

**తీఁగ** రూ. తివ్వ, తీగి, తీఁగియ, తీఁగె, తీవ, తీవియ, తీవె. వి. 1. లత, వల్లి. భార. ఆది. 3.38, కు.సం. 5.41; 2. మొలనూలు. విక్ర. 4.160; 3. లోహతంత్రి, తంతి. పారి. 2.36; 4. యోగులు ధరించే రుద్రాక్షాది కంఠమాల. కళా. 3.72; 5. స్త్రీలు మెడలో ధరించే ఒక బంగారు నగ. కళా. 7.66; 6. తీగలాగా సాగే జిగురు పదార్థం; 7. సన్నటిచువ్వ; 8. ఉండేలుకు కట్టిన తీగ; 9. మరాను కట్టుబడిలో ఆకుల బిగింపుకోసం చుట్టిన ఇనపతీగ; 10. ఉలవ, వేరుసెనగ మొ. పైర్లు వేసే తీగ.

క. తిగె. లత, తంతి; కువి. తిగే. గిటారు తీగ; కొలా. తిగ్. లత;

సం. దీర్ఘా. కోలపొన్ను; ప్రా. దీహా; పా. దీఘా.

**తీఁగకంద** వి. కూరగా వాడే ఒకరకం దుంప. **తీఁగకానుగ** రూ. తీఁగకానుగు, తీఁగెకానుగ. వి. సముద్ర తీరంలో ఉన్న అడవుల్లో పెరిగే పెద్దపూలు పూసే ఒకతీగ (Derris Aliginosa). **తీఁగకానుగు** రూ.చూ. తీఁగకానుగ. వి. మర్కటి, ఒకరకం గానుగ. **తీఁగగరిక** రూ. తీఁగెగరిక. వి. నిడుపుగడ్డి, గండాలి (Agolstis Stotorifera). **తీఁగగుమ్మడి** రూ. తీఁగెగుమ్మడి. తీఁగెగుమ్ముడు. వి. ఉత్తరసర్కారుల్లోని కొండలమీద పెరిగే ఒకతీగ (Vitis Pedata). **తీఁగగుమ్ముడు** రూ. తీఁగ్గుమ్ముడు. వి. సామగ్రి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే ఒకచెట్టు (Gmelinaarborea). **తీఁగచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు. **తీఁగచీపురు** రూ. తీఁగెచీపురు. వి. ఉత్తరసర్కారులూ, దక్కనూ, కర్ణాటకల్లోని అడవుల్లో పెరిగే ఒక చిన్నచెట్టు (Greauria Pilora). **తీఁగజాజి** వి. ఒక జాతి జాజి. **తీఁగజీలుగ** రూ. తీఁగెజీలుగ. వి. జిగురుతో కూడిన చిన్న ఆకులు కలిగి నీటిపక్కన పెరిగే ఒకతీగ. (Aeschynomene Indica). **తీఁగంచు** వి. తీఁగ మాదిరి డిజైను నేసిన అంచు. <తీఁగ+అంచు. **తీఁగతమ్మ** వి. పది పదిహేను అంగుళాల పొడవున బద్దగా ఉండే కాయలు గుత్తులుగుత్తులుగా కాసే ఒకరకం మొక్క (Suordbeen, Canavolia Gladiotee). **తీఁగతాడు** వి. ఒసికర్రలపై వేసిన నర్నాలను పారుపట్టెకు కట్టేతాడు. **తీఁగతిగుచు** అ.క్రి. కమ్మచ్చున పెట్టిన బంగారం మొదలైనవాటిని తీగలుగాలాగు, కమ్మచ్చులో తీగతీయు. భార. విరా. 4.143. **తీఁగతుమడి** వి. దీర్ఘమూల, వృక్షవిశే

పం. తీఁగతెంపుగా రూ. తీఁగెతెంపుగా. క్రి. విణ. ద్రు. అవిచ్ఛిన్నంగా. ఎడతెగకుండా. కాశీ. 5.64. < తీఁగ + తెంపు + అగు + -అ. తీఁగతొక్కి వచ్చు అ.క్రి. మతిభ్రమచెందు. తీఁగదూలగొండి రూ. తీఁగె దూలగొండి. వి. దురదపెట్టే ఆకులుకల ఒక తీగ (Tragia Involucrata). తీఁగనవ్వు రూ. తీవనవ్వు. వి. తీగ లాగ సాగే నవ్వు. క్రీడా. 68. తీఁగపాచి వి. శైవలం. తీఁగపారిజాతమంచు వి. తీగ, పారిజాతంపువ్వు కలిసినడిజైను అంచు. తీఁగపాల వి. క్షీరావి, మనుపాల, వృక్ష విశేషం. తీఁగపెసలు రూ.చూ. తీఁగెపెసలు. వి.బ.వ. దేశమంతా విస్తారంగా పండే ఒకరకం పప్పుదినుసు. తీఁగపేటు వి. తీగమాదిరిగా (అంచులో) నేసిన డిజైను. తీఁగపేరికల్కి మగఁడు వి. వల్లీదేవిభర్త, కుమారస్వామి. ఆం.భా. 1.44. తీఁగబచ్చలి రూ.చూ. తీఁగెబచ్చలి. వి. కలంబి, అల్లుబచ్చలి (Convolvulas Repens). తీఁగబుగిడి రూ. తీఁగ బుడిగి, తీఁగబొగిడి, తీఁగెబుగిడి. వి. నేతలోతీగ, బుగిడి పడేట్టు నేసిన డిజైను, అంచునేతలో బుగిడికింద దాపుగా రెండు వరసల్లో ఏటవాలుగా పడేటట్టు నేసిన డిజైను. తీఁగబుడిగి రూ.చూ. తీఁగబుగిడి. వి. నేతలో తీగ, బుగిడి పడేట్టు నేసిన డిజైను, అంచునేతలో బుగిడికింద దాపుగా రెండువరసల్లో ఏటవాలుగా పడేటట్టు నేసిన డిజైను. తీఁగ బెండ వి. ఉత్తర సర్కారులూ, దక్కనూ, కర్ణాటకల్లోని బంజరు నేలల్లో పెరిగే ఒకచెట్టు (Pavonia Odorata). తీఁగబేలు వి. నాలుగు ఆకులు తీగ వరుసగానేసిన డిజైను. తీఁగబొగిడి రూ.చూ. తీఁగబుగిడి. వి. నేతలో తీగ, బుగిడి పడేట్టు నేసిన డిజైను. తీఁగబోర్డరు వి. తీగమాదిరి డిజైను నేసిన అంచు. ఇం. *Boarder*. అంచు. < తీఁగ + ఇం. Boarder. తీఁగమద్దికాయచీర వి. నేత మధ్యలో తీగ మద్దికాయ నమూనాల్లో డిజైను నేసిన చీర. తీఁగమల్లికడ్డి వి. తీగ, ఆకులు, మొగ్గలు వరుసగా కొంగులో పడేట్టు నేసిన డిజైను. తీఁగమల్లియ రూ. తీఁగమల్లె, తీఁగెమల్లియ, తీఁగెమల్లె. వి. పాకి పూచే ఒక జాతి మల్లె. ఆము. 1.66. తీఁగమల్లె రూ.చూ. తీఁగమల్లియ. వి. ఒక జాతి మల్లె. కవిక. 1. తీఁగమల్లెలు రూ.చూ. తీఁగెమల్లెలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. తీఁగముదాకలు వి.బ.వ. అంచులోనేసే ఒకరకం తీగ డిజైను. తీఁగముష్టి రూ.చూ. తివ్వముషిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్రమూలం (Tiliacora Racemosa). తీఁగముసిని రూ.చూ. తివ్వముషిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్రమూలం (Tiliacora Racemosa). తీఁగమెరుపు రూ.చూ. తీఁగమెఱుపు. వి. ఉరుములేని మెరుపు. తీఁగమెఱుఁగు రూ.చూ. తీఁగెమెఱుఁగు. వి. 1. తీగలాగా వ్యాపించిన మెరుపు, ఉరుములేని మెరుపు; 2. పొద్దుతిరుగుడు చెట్టు. తీఁగమెఱుపు రూ. తీఁగమెరుపు. వి. విద్యుల్లత, ఉరుములేకుండా ఎక్కువ కాంతితో తీగలాగా మెరిసే మెరుపు. ప్రబంధ. 190. తీఁగమేకు రూ. తీగిమేకు. వి. నన్నటి మేకు. తీఁగమోడి వి. 1. తీగలా వజ్రంగులు మొ॥ వారు చెక్కే చిత్ర శిల్పం; 2. రాతపని, గొలుసుమోడిరాత. తీఁగమోదుగ రూ. తివ్వమోదుగ, తీఁగెమోదుగ. వి. ఎరుపురంగు తయారీకి ఉపయోగించే పూలుపూసే ఒక మొక్క (Butea Superba). తీఁగఁబోటి రూ. తీఁగఁబోఁడి. తీఁగెఁబోటి, తీఁగెఁబోఁడి, తీవఁబోఁడి, తీవియఁబోఁడి. వి. చక్కని స్త్రీ. శృం.నై. 3.173. తీఁగఁబోఁడి(-పోఁడి) రూ.చూ. తీఁగఁబోటి. వి. చక్కని ఆడది, ఆడది. కాశీ. 7.203. సిం.ద్వా. 4.203. తీఁగయిమ్ము(-ఇమ్ము) రూ.చూ. తీఁగెయిమ్ము. వి. పొదరిల్లు. తీఁగయిల్లు(-ఇల్లు) రూ.చూ. తీవయిల్లు. వి.బొ. పొదరిల్లు. తీఁగయెలుఁగు(-ఎలుగు) వి. సన్ననిగొంతు, హీనస్వరం. ద్వి.నల. 4.393 పం. తీఁగలుపాఱు రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. తీగలాగ వ్యాపించు; 2. వ్యాపించు. తీఁగలువాఱు(-పాఱు) రూ. తీఁగలుపాఱు, తీఁగల్పాఱు, తీఁగల్వాఱు, తీఁగియలుపాఱు, తీఁగియలువాఱు, తీఁగియల్పాఱు. తీఁగియల్వాఱు, తీఁగెలుపాఱు, తీఁగెలువాఱు, తీఁగెల్పాఱు, తీఁగెల్వాఱు. అ.క్రి. 1. వ్యాపించు. కవిక. 6.91; 2. తీగలావ్యాపించు. తీఁగలువేయు రూ. తీఁగెలువేయు. అ.క్రి. 1. లతల్ని వేయు; 2. ప్రసవానికి ముందు చీమునెత్తురుకల పదార్థం బయటికి వచ్చు. తీఁగలుసాఁగు రూ. తీఁగెలుసాఁగు. అ.క్రి. 1. వర్ధిల్లు, అతిశయించు. కేయూ. 1.21; 2. తీగలుగా వ్యాపించు; 3. దీర్ఘమగు, నిగుడు. తీఁగల్పాఱు రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. వ్యాపించు; 2. తీగలా వ్యాపించు. తీఁగల్వాఱు(-పాఱు) రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. వ్యాపించు; 2. తీగలావ్యాపించు. తీఁగవరసబేలు వి. అంచులో, తీగల వరసమాదిరిగా నేసిన ఒకరకం డిజైను. తీఁగవిలుకాఁడు రూ. తీఁగవిల్కాఁడు. వి. మన్మథుడు. ఆం.భా. 1.45. చెరకు మొ॥ వాటిని తీగలుగా కవులు వర్ణిస్తారు. తీఁగవిలుతుఁడు రూ. తీఁగవిల్తుఁడు. వి. మన్మథుడు. చెరకు మొ॥ వాటిని తీగలుగా కవులు వర్ణిస్తారు. తీఁగవిల్కాఁడు రూ.చూ. తీఁగవిలుకాఁడు. వి.మన్మథుడు. తీఁగవిల్తుఁడు రూ.చూ. తీఁగవిలుతుఁడు. వి. మన్మథుడు. తీఁగవేరుసెనగ వి. అల్లుసెనగ. తీఁగవోమిగడ్డి వి. ఒకరకం గడ్డి (Emybopogon Gibarba). తీఁగసరులు రూ.చూ. తీవసరులు. వి.బ.వ. ధాన్య విశేషం. తీఁగసాఁగు రూ.చూ. తీఁగెసాఁగు. అ.క్రి. 1. వర్ధిల్లు. ద్వి. పరమ. వి. 3.1895; 2. తీగలుగా వ్యాపించు. తీఁగాకు రూ.చూ. తీఁగేకు. వి. కణుపుల దగ్గర పుట్టే తమలపాకు. < తీఁగ + ఆకు.

తీఁగాకు చూ. తీఁగ.

తీఁగియ రూ.చూ. తీఁగ. వి. తీగ, లత. కవిజనా. 1.68.

తీఁగియలుపాఱు రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. తీగలాగ వ్యాపించు; 2. వ్యాపించు. తీఁగియలువాఱు (-పాఱు) రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. తీగలాగ వ్యాపించు; 2. వ్యాపించు. తీఁగియల్పాఱు(-పాఱు) రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. తీగలాగ వ్యాపించు. దశా. 2.302; 2. వ్యాపించు. తీఁగియల్వాఱు(-పాఱు) రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. 1. తీగలాగ వ్యాపించు; 2. వ్యాపించు.

తీఁగె రూ.చూ. తీఁగ. వి. 1. లత. కు.సం. 3.39; 2. స్త్రీ

కంఠాభరణ విశేషం. ఐందు. 5.53 ; **3.** తంతి ; **4.** సన్నటి చువ్వ ; **5.** ఉండేలుకు కట్టిన తీగ ; **6.** మరాసు కట్టుబడిలో ఆకుల బిగింపు కోసం చుట్టిన ఇనప తీగ ; **7.** తండు, రీలు, ఉలవ, వేరుసెనగ, అలచంద, పెసర మొ॥ పైర్లు వేసే తీగె.

**తీగెకానుగ** రూ.చూ. తీఁగకానుగ. వి. సముద్ర తీరంలో ఉన్న అడవుల్లో పెరిగే పెద్దపూలు పూసే ఒక తీగ (Derrisuliginosa). **తీఁగెగన్నేరు** వి. తోటల్లో పెరిగే ఒక తీగ (Quisquals Indica). **తీఁగెగరిక** రూ.చూ. తీఁగగరిక. వి. తీగలాసాగే ఒక విధమైన గడ్డి (Agrostis Stotorifera). **తీఁగెగుమ్మడి** రూ.చూ. తీఁగ గుమ్మడి. వి. ఉత్తరసర్కారుల్లోని కొండల మీద పెరిగే ఒక తీగ (Vitis Linnaei). **తీఁగెగుమ్ముడు** రూ.చూ. తీఁగగుమ్మడి. వి. ఉత్తరసర్కారుల్లోని కొండల మీద పెరిగే ఒక తీగ (Vitis Linnaei). **తీఁగెచాలు** వి. పొలంలో చుట్టూరా కొంగ్రవేసి కలుపుకుంటూ వచ్చిన చాలు. **తీఁగెచీపురు** రూ.చూ. తీఁగచీపురు. వి. ఉత్తర సర్కారులూ, దక్కనూ, కర్ణాటకల్లోని అడవుల్లో పెరిగే ఒక చిన్న చెట్టు (Grewia Pilosa). **తీఁగెచుట్టు** వి. లతలా చుట్టుకోవటం. ఆము. 4.84 ; అ.క్రి. పెనవేసి చుట్టు. **తీఁగెజీలుగ** రూ.చూ. తీఁగజీలుగ. వి. జిగురుతో కూడిన చిన్న ఆకులు కలిగి నీటిపక్కన పెరిగే ఒక తీగ (Eschynomems Indica). **తీఁగెజెముడు** వి. ఉత్తర సర్కారుల్లో దక్కనూ, కర్ణాటకల్లో రాతి ప్రదేశాల్లో పెరిగే ఒక తీగ (Sarcoslemma Brevistigma). **తీఁగె జొంపములు** వి.బ.వ. తీగల గుబుర్లు. శృం.నై. 2.5. **తీఁగెటపా** వి. టెలిగ్రాం, తంతివార్త. **తీఁగెట్టు** అ.క్రి. పారిపోవు. **తీఁగెతెంపుగా** రూ.చూ. తీఁగతెంపుగా. క్రి.విణ. ద్రు. అవిచ్ఛిన్నంగా, ఎడతెగకుండా. ఉద్భటా. 1.31. **తీఁగెదండావాలిపేటు** వి. అంచులో నేసే ఒకరకం తీగ డిజైను. **తీఁగెదూలగొండి** రూ.చూ. తీఁగదూలగొండి. వి. దురదపెట్టే ఆకులు కలిగిన ఒక తీగ (Tragiain Volucrata). **తీఁగెనక్కెరి** వి. పడమటి కనుములూ, అణ్ణామలై కొండలు మొ॥ చోట్ల పెరిగే ఒక చిన్నచెట్టు (Olaxwightiana). **తీఁగెపత్తిపువ్వుచీర** రూ. తీఁగెపత్తిపూవు చీర. వి. ఒకరకం డిజైనులో నేసిన చీర. **తీఁగెపత్తిపూవు చీర** రూ.చూ. తీఁగెపత్తిపువ్వుచీర. వి. ఒకరకం డిజైనులో నేసిన చీర. **తీఁగెపెట్టు** స.క్రి. ఏకేముందు దూదిని పొడుగ్గా లాగి మెత్తగాచేయ. **తీఁగెపెసలు** రూ. తీఁగపెసలు, తీఁగె బెసలు, తీవపెసలు. వి.బ.వ. దేశమంతటా విస్తారంగా పండే పప్పుదినుసు (Greengram), (Phaseolusmungo). **తీఁగెబచ్చలి** రూ. తీఁగబచ్చలి. వి. గడలకు అల్లు పెట్టే ఒకరకం ఆకుకూర. ఆం.భా. 2.72. **తీఁగెబుగిడి** రూ.చూ. తీఁగబుగిడి. వి. నేతలో తీగ, బుగిడి పడేట్టు నేసిన డిజైను. **తీఁగెబెండ**[1] వి. మెట్టనేలల్లో పెరిగే ఒకరకం కలుపుమొక్క (Abutilon Indicum). **తీఁగెబెండ**[2] వి. ఉత్తరసర్కారులూ, దక్కనూ, కర్ణాటకల్లో పెరిగే ఒక మొక్క (Pavonia Edorata). **తీఁగెబెసలు** (-పెసలు) రూ.చూ. తీఁగెపెసలు. వి.బ.వ. దేశమంతటా విస్తారంగా పండే పప్పుదినుసు. **తీఁగెమల్లియ** రూ.చూ. తీఁగమల్లియ. వి. పాకి పూచే ఒకజాతి మల్లె. **తీఁగెమల్లె** రూ.చూ. తీఁగ మల్లియ. వి. మల్లెలో ఒకరకం (Jasminum Rittchiei). **తీఁగెమల్లెలు** రూ. తీఁగమల్లెలు. వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112. **తీఁగెమాటలు** వి.బ.వ. ఆగకుండా సాగే మాటలు. పరమ.వి. 18-310. **తీఁగెమినుము** వి. అక్కిడి పైరుగా వేసే ఒకరకం పప్పుదినుసు (Phaseolusmungo). **తీఁగెముషిడి** రూ.చూ. తివ్వముషిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్రమూలం. **తీఁగెముషిణి** రూ.చూ. తివ్వముషిడి. వి. కప్పతీగ, వెర్రిచిత్రమూలం. **తీఁగెమెడ నూలు** వి. మెడనగ. **తీఁగెమెఱుఁగు** రూ. తీఁగమెఱుఁగు వి. **1.** విద్యుల్లత, తీగలాగా వ్యాపించిన మెరుపు. వాశి.రా. 2.99 ; **2.** పొద్దుతిరుగుడుచెట్టు. **తీఁగెమోదుగ** రూ.చూ. తీఁగమోదుగ. వి. ఎరుపురంగు తయారీకి ఉపయోగించే పూలు పూసే ఒక మొక్క (Butea Superba). **తీఁగెఁబోఁణి** రూ.చూ. తీఁగఁబోఁణి. వి. అందమయిన స్త్రీ. **తీఁగెఁబోఁడి** రూ.చూ. తీఁగఁబోఁణి. వి. చక్కనిస్త్రీ. కాశీ. 7.137. **తీఁగెయిమ్ము (-ఇమ్ము)** రూ. తీఁగయిమ్ము. వి. పొదరిల్లు. ముకుంద. 2.132. **తీఁగెలగడ్డి** వి. ఒకరకం కలుపుమొక్క. **తీఁగెలుపాఱు** రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. **1.** తీగలాగ వ్యాపించు ; **2.** వ్యాపించు. **తీఁగెలువాఱు (-పాఱు)** రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. **1.** వ్యాపించు. నీతి. 90 ; **2.** తీగలా వ్యాపించు. **తీఁగెలువేయు** రూ.చూ. తీఁగలు వేయు. అ.క్రి. **1.** లతల్ని వేయు ; **2.** ప్రసవానికి ముందు చీము నెత్తురుకల పదార్థం బయటికివచ్చు. **తీఁగెలుసాఁగు** రూ.చూ. తీఁగలుసాఁగు. అ.క్రి. **1.** తీగలుగా వ్యాపించు, తీగవలెఅగు. ఆము. 5.123 ; **2.** దీర్ఘమగు, నిగుడు ; **3.** వర్ధిల్లు, అతిశయించు. **తీఁగెల్వాఱు (-పాఱు)** రూ.చూ. తీఁగలువాఱు. అ.క్రి. **1.** తీగలాగ వ్యాపించు ; **2.** వ్యాపించు. **తీఁగల్వాఱు (-పాఱు)** రూ.చూ. తీఁగలుపాఱు. అ.క్రి. **1.** వ్యాపించు ; **2.** తీగలావ్యాపించు. **తీఁగెవంకాయ** వి. తీగెమొక్కకు కాసే వంకాయ. **తీఁగెశోభ** రూ. తీఁగె సోబ. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. **తీఁగెసాఁగు** రూ. తీఁగసాఁగు. అ.క్రి. **1.** తీగలుగా వ్యాపించు. కాశీ. 6.41 ; **2.** వర్ధిల్లు, అతిశయించు. మను. 6.29 ; **3.** దీర్ఘమగు, అధికమగు. కళా. 7.76. **తీఁగెసోబ** రూ.చూ. తీఁగెశోభ. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. **తీఁగేకు** రూ. తీఁగాకు. వి. కణుపుల దగ్గర పుట్టే తమలపాకు.

**తీఁగ్గేకు** చూ. తీఁగె.

**తీఁగ్గుమ్ముడు** రూ.చూ. తీఁగగుమ్ముడు. వి. కలపనిచ్చే ఒక చెట్టు (Gmelina Arborea).

**తీచు** రూ.చూ. తిగుచు. స.క్రి. లాగు.

**తీట** రూ.చూ. తిగుట[2]. వి. తూర్పారపోసే మనిషి కూర్చోటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

**తీటి**[1] రూ.చూ. టికిటి. వి. ఆంగ్లంలోని "A" అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం.

**తీటితెవలు** వి. ఆంగ్లంలోని "A" అనే అక్షరం

ఆకారంలో ఉండే కొయ్యపరికరం.

**తీటి**[2] రూ.చూ. తిగుట[2]. వి. తూర్పారపోసే మనిషి కూర్చొటానికి కట్టే మూడుకాళ్ళ పీట.

**తీటు** రూ.చూ. తీఁట. వి. **1**. దురద, కండూతి ; **2**. తమి, ఆసక్తి ; **3**. ఒకవిధమైన గజ్జి.

**తీటుకాఁడు** వి. ఆసక్తికలవాడు. భార.ఉద్యో. 1.56.

**తీడు** రూ.చూ. దీటు. స.క్రి. **1**. వాడిచేయు, పదునుపెట్టు. కాశీ. 7.253, నరస. **3.31** ; **2**. నులిపెట్టు, మెలిపెట్టు. వరాహ. 6.109 ; **3**. చీల్చు, చీరు. ఇందు. **5**.117 ; **4**. ప్రకటించు. కకుత్స. 5.123 ; **5**. చిమ్ము, వ్యాపింపచేయు, వెదజల్లు. హరిశ్చ. 3.15 ; **6**. పళ్ళుకొరుకు. ద్వి.హరిశ్చ. పూ. 2096 ; **7**. పిసికి ముద్దచేయు ; **8**. సారెమీద వాటలకు రూపాల్ని ఏర్పరచేటప్పుడు పక్కల్లోని పెచ్చుమట్టిని తీయు ; **9**. బతిమాలు.

**తీడుకొను** స.క్రి. పదునుపెట్టుకొను. శృం.నై. 6.65.

**తీంట్రము** రూ.చూ. తీఁట. వి. దురద, తీట, కండూతి. ఆం.భా. 2.129.

**తీంద్ర**[1] రూ.చూ. తీంద్రము. చూ. తీపు. వి. **1**. తమి, తీవ్రవాంఛ. మను. 5.17 ; **2**. వేడిమి. ఆము. 5.146 ; **3**. వేగం. పాండు. 3.110 ; **4**. కోపం. ప్రభు. 3.24 పు. 23 పం. ; **5**. ప్రతాపం, ప్రభావం. నార.పు. 3.199 ; **6**. తేజస్సు.

**తీంద్రించు** రూ.చూ. తీఁడిరించు. అ.క్రి. **1**. వెలుగు, ప్రకాశించు. మను. 1.37 ; **2**. ప్రజ్వలించు, మంటలు కక్కు. మను. **4**.17 ; **3**. మెరయు. ఆము. 1.6 ; స.క్రి. నిక్కించు, తీడు. హ.న. 2.19. **తీంద్రింపించు** స.క్రి. ప్రకాశింపచేయు. సుద. 4.15. **తీంద్రిలు** రూ.చూ. తీంద్రిల్లు. అ.క్రి. అతిశయించు. కృ.శకు. 1.32. **తీంద్రిల్లు** రూ. తీంద్రిలు. అ.క్రి. అతిశయించు. భీమ. **3**.52.

**తీంద్ర**[2] వి. లతారూపంలోఉండే ఒకానొక ఓషధి. హంస. 4.10.

**తీంద్రతీగ** వి. ఔషధానికి ఉపయోగపడే ఒకవిధమైన తీగ.

**తీంద్రము** రూ. తీంద్ర[1]. విశ. **1**. తీక్ష్ణమైన, ప్రచండమైన. భాగ. 7.345 ; **2**. తరుణం, పదుచుది. సురా. 59.

క. తీ. కాల్చు, మండు, అగ్ని, నిప్పు. సి. కాలిన, కాలటం ; తు. చీఙ్చని. కాలినదగు, చీస్తుని. కాల్చు, పండువలె మగ్గిపోవు ; త. తీ. (-వ్-, -స్త్-), తీయ్. (-వ్-, -స్త్-). బొగ్గువలె మాడిపోవు, ప్రకాశించు ; మ. తీ. నిప్పు.

పో. చూ. సం. తీక్ష్ణ-. వాడిఐన.

**తీంద్రించు** చూ. తీంద్ర[1].

**తీంద్రింపించు** చూ. తీంద్ర[1].

**తీంద్రిలు** చూ. తీంద్ర[1].

**తీంద్రిల్లు** చూ. తీంద్ర[1].

**తీఁట** రూ. తీటు, తీంట్రము. వి. **1**. దురద, కండూతి. కు. సం. 10.146, భార. విరా. 5.157 ; **2**. తమి, ఆసక్తి. హరి. పూ. 5.92 ; **3**. ఒకవిధమైనగజ్జి.

క. తిటె, తిన్, తినసు, తెనసు, తిండి. దురద ; త. తినవు. దురద.

**తీఁటకన్ను** వి.బ.వ. చిన్నకురుపులు లేచిన కన్ను. పండి. చ. 2.108. **తీఁటకసింద** రూ.చూ. తీఁటకసివింద. వి. కచ్చుర, రేగడిదూల. **తీఁటకసిందు** రూ.చూ. తీఁటకసివింద. వి. తీటగజ్జలాకు, దురదగొండిఆకు. **తీఁటకసివింద** రూ. తీఁటకసింద, తీఁటకసిందు, తీఁటకసివెంద. వి. కచ్చుర, రేగడిదూల, వృక్షవిశేషం. ఆం. భా. **2.54**. **తీఁటకసివెంద** రూ.చూ. తీఁటకసివింద. వి. రేగడిదూల, కచ్చుర, వృక్షవిశేషం. **తీఁటకోవెల** వి. కండూర, దూలగొండి. ఆం. భా. 2.54.

**తీఁడిరించు** రూ. తీంద్రించు. అ.క్రి. **1**. ప్రకాశించు, వెలుగు. కాశీ. 3.234 ; **2**. మెరయు ; **3**. ప్రజ్వలించు, మంటలు కక్కు ; స.క్రి. నిక్కించు, తీడు.

క. సీకరి, కాలినస్థితి, సీకు. కొలింది, పాత్రలోమాడినది ; త. తీప్పి.

**తీతీపులాడు** చూ. తీపు[1].

**తీతుకబొల్లి** చూ. తీతువ. వి. తీతుకపిట్ట లాగా కంటిరెప్పల మీద తెలుపు.

**తీతువ** రూ.చూ. తీతువు. వి. తిత్తిరిపక్షి. హంస. 3.12.

**తీతువు** రూ. తీతువ. వి. తిత్తిరిపక్షి. మను. **4.58**.

సం. తిత్తిర-, తిత్తిరి-. తీతువ ; ప్రా. తిత్తిర, తిత్తిరి-; అమా. తిత్తిర ; పా. తిత్తిర ; కా. తీఁతర్ ; కుమా. నే. తితిరొ, త్రితా ; బెం. తితిర్ ; ఒ. తితిర, తితిరి, టిటీర ; బీ. తీతిర్ ; హిం. తీతర్, తీతరీ, త్రితీ ; గు. తేతర్ ; మరా. తితర్.

పర్జి. తీత ; ఒల్లా. గ. తీతె ; ఒల్లా. తితిర్, తేతార, తేతారీ.

**తీతువుకాళ్లు** వి.బ.వ. సన్నని పొడుగుకాళ్ళు.

**తీదీపు** చూ. తీపు[2].

**తీదీపుచేయు** చూ. తీపు[2].

**తీదొండ** రూ.చూ. తియ్యదొండ. వి. కూరకుఉపయోగించే ఒకరకం కాయ.

**తీనిగుంత** రూ.చూ. తీనెగుంత. వి. మగ్గంచట్టంకింది భాగం నేతనేసేటప్పుడు ముందుకు, వెనక్కు జరగటానికి అనువుగా చేసినపల్లపు చోటు.

**తీనిపొయ్యి** రూ.చూ. తీనెపొయ్యి. వి. వెనకవైపు పొడుగ్గా తిన్నెలాగా పెట్టి ముందు పక్కరెండు పొయ్యిలమర్చినట్టి వంటపొయ్యి.

**తీనియ** రూ.చూ. తిన్నె. వి. **1**. అరుగు, వితర్దిక. చంద్రాంగ. 5.70 ; **2**. దేవతాపూజకు ఏర్పాటు చేసిన వేదిక. అచ్చ. రా. యు. 438.

**తీనుపొయ్యి** రూ.చూ. తీనెపొయ్యి. వి. వెనకవైపు పొడుగ్గా తిన్నెలాగా పెట్టి ముందుపక్క రెండుపొయ్యిలమర్చినట్టి వంటపొయ్యి.

**తీనురేకు** రూ.చూ. టిన్నురేకు, తగరపురేకు.

**తీనె** రూ.చూ. తిన్నె. వి. **1**. అరుగు, వితర్దిక. ఇందు. 3.77 ; **2**. దైవపూజకు ఏర్పరచిన వేదిక. శుక. 2.448 ; **3**. నేల

నుంచి గజం, గజంన్నర ఎత్తున ముదురు రంగు వేసిన గోడభాగం ; 4. రాతికూచాలకు, స్తంభాలకు అడుగు భాగంలో మోపుకింద ఉంచబడిన గుంటగల బండరాయి.

**తీనెగుంత** రూ. తీనిగుంత. వి. మగ్గం చట్టం కిందిభాగం, నేతనేసేటప్పుడు ముందుకు, వెనక్కు జరగటానికి అనువుగా వేసినపల్లపు చోటు. **తీనెగూడు** వి. మట్టిగోడల్లో పెట్టేకోడి గుడ్డు రూపంలో ఉండే చిన్నగూడు. **తీనెపొయ్యి** రూ. తీనిపొయ్యి, తీనుపొయ్యి. వి. వెనకవైపు పొడుగ్గా తిన్నెలాగా పెట్టి ముందు పక్క రెండు పొయ్యిలమర్చినట్టి వంట పొయ్యి.

**తీన్‌కోరి** వి. అంచులో నేసినమూడు గీరలు.

హిం. తీన్. మూడు.

<హిం. తీన్ + కోరు[3].

**తీన్‌తార్** వి. మూడుపోగుల దారం.

హిం. తీన్. మూడు, తార్. తీగ, దారం.

<హిం. తీన్‌తార్.

**తీన్‌తేరగా** రూ. తీన్‌తేరాగా. క్రి. విణ. తారుమారుగా.

హిం. తీన్‌తేరహ్. మూడుపదమూడు.

<హిం. తీన్‌తేరహ్ + అగు + -అ[7].

**తీన్‌తేరాగా** రూ.చూ. తీన్‌తేరగా. క్రి. విణ. తారుమారుగా.

**తీఁత** చూ. తీయు. వి. 1. తగ్గటం ; 2. పెరకటం, పీకటం ; 3. బాధ ; 4. దెబ్బ ; 5. కొబ్బరిచెట్టునుంచి కాయలు కోయటం ; 6 ఈత, తాడి మొ. చెట్లనుంచి కల్లుతీయటం.

**తీఁతకమ్మి** వి. మూడుమొగ్గలు పడేట్టునేసిన కమ్మి. **తీఁతకోత** వి. తీయటం, కోయటం. **తీఁతగుండ్లరాయి** వి. అలంకరణకు పనికివచ్చే పారదర్శకంగా ఉండేఒకరాయి. **తీఁతనేల** వి. చెమ్మ తొందరగా ఆరిపోయేపొలం. **తీఁతబల్ల** వి. 1. వడ్లకొట్టునుంచి ధాన్యం తీసే చోటు తలుపుకు బదులుగా పెట్టినచెక్క ; 2. తాడి, కొబ్బరి మొ. చెట్లు ఎక్కేవాడు నడుముకు కట్టుకునే పరికరం. **తీఁతబొత్తంచు** వి. ఒకరకం చిన్నఅంచు. **తీఁతవాఁడు** విణ. 1. ఇటిక అచ్చు తీసేపనివాడు ; 2. కొబ్బరి మొ. చెట్లనుండి కాయలు, తాడి మొ. చెట్లనుండి కల్లుతీసేవాడు. **తీఁత్రాడు** వి. బండికి చొప్పవేసి బిగించే తాడు. <తీఁత + త్రాడు.

**తీఁత్రాడు** చూ. తీఁత.

**తీనేకు** రూ.చూ. టిన్నురేకు. వి. తగరపురేకు.

**తీపరము** చూ. తీపు[2].

**తీపాడు** చూ. తీపు[1].

**తీపారు** చూ. తీపు[1].

**తీపి[1]** రూ.చూ. తీపు[1]. వి. 1. ఇచ్ఛ, అపేక్ష. భార. విరా. 4.55 ; 2. మాధుర్యం. భార. ద్రోణ. 2.937 ; 3. ప్రేమ. సుద. 2.58 ; 4. రుచి ; 5. కమ్మనిరసం ; విణ. 1. మధురమైన, రుచ్యమయిన ; 2. ప్రేమాస్పదమైన.

**తీపిఉలవి** వి. ఒకరకం చేప (Rhynchobatur-djeddensis). **తీపిచవుడు** వి. రేగడి నేలలో కలిపిన చవుడు. **తీపిపుట్టించు** స.క్రి. ఆకలి కలిగించు.

**తీపి[2]** రూ.చూ. తీపు[2]. వి. దూడలకువచ్చే రోగం.

**తీపు[1]** రూ. తీపి[1]. వి. 1. మాధుర్యం. కు.సం. 8.143 ; భార. విరా. 5.395 ; 2. ప్రేమ. హరి. పూ. 5.568 ; 3. మనోజ్ఞత, ఒప్పిదం. వరాహ. 3.64 ; 4. అపేక్ష, కోరిక. కాళ. 3.123 ; 5. అరటిగెలలోని అత్తం. ఆం.భా. 2.58 ; విణ. 1. మధురమైన, రుచిగల. భార. ఉద్యో. 3.95 ; 2. ఇష్టమైన, ప్రేమాస్పదమైన. భార. ఆరణ్య. 6.111.

క. సి, సియి, సియ్యనె, సిహి. తీయని ; తు. తీకు. మధురమైన, తీకర, తికెరు, తిపె, శీ, శీపె, తీపి ; త. తత్తిప్పు, తీమ్. తీయని, తీవు, తీయమ్, తేమ్, తిత్తి. తీపి, తిత్తిప్పు-, తిత్తిత్. తయారుగాఉండు ; మ. తిత్తు, తిత్తిప్పు. తీపి ; తొ. తిచ్. తీపి ; తిచిన్, తిచిల్. తీపిని రుచి చూచు ; కుఇ. సెమ్బ(సెమ్బి-), సెప(సెత్-). తీయగాఉండు ; కువి. తిప. తీయని ; కురు. తిన్నా. తియ్యగాఉండు.

**తీతీపులాడు** అ.క్రి. మిక్కిలి మధురమగు. రం.రా. ఆరణ్య. 159 పు. 13 పం. < తీపు[1] + తీపు[1] + -లు + ఆడు. **తీపాడు** అ.క్రి. మాధుర్యంపుట్టించు, ఇంపగు, మధురమగు. విజయ. 2.102. <తీపు[1] + ఆడు. **తీపారు** అ.క్రి. 1. ఇంపారు, మిక్కిలి మనోజ్ఞమగు. భార. విరా. 2.118 ; 2. ప్రేమపూర్ణమగు, అనురాగంతోనిండు. భార. స్త్రీ. 2.81 ; 3. మిక్కిలి మధురమగు. మిక్కిలి రుచ్యమగు. నవనాథ. 5.202 పు. 9 పం. < తీపు[1] + - ఆరు. **తీపుటెలుఁగు** వి. మృదుస్వరం. భార. అను. 1.357. < తీపు[1] + ఎలుఁగు. **తీపుదిగవేయు** అ.క్రి. లాభంకలుగు. **తీపులాడు** అ.క్రి. ఇంపగు, మధురమగు. **తీపులాఁడి** వి. మాధుర్యంగల స్త్రీ. బిల్హ. 2.137. **తీపులుగొను(-కొను)** అ.క్రి. తమకించు, కుతూహలపడు. భాస్క.రా. సుందర. 131. **తీపువిల్లు** వి. చెరకువిల్లు.

**తీపు[2]** చూ. తీయు. రూ. తీపి[2]. వి. 1. తీవ్రవేదన, యాతన. శుక. 2.205 ; 2. దూడలకువచ్చే ఒకరోగం.

క. తీ, సీ. మండు, బాధపెట్టు, నిప్పు. తు. చీంచుని. మండు. కాలు, చీస్తుని, తూ, సూ. మండిన ; త. తీ (వ్-, న్త్-) తీయ్ (న్-, న్త్-) (ప్ప్-, త్త్-) బాధపెట్టు, తీయల్, తిచ్చల్. మంటలో కాలినది ; మ. తీ. నిప్పు ; కో. తి.య్- (తి.చ్-), తిచ్ ; తొ. తి.య్. (తి.స్-) (తి.చ్-) బ్రా. తీన్, తీరూన్క్.

**తీదీపు(-తీపు[2])** వి. 1. రారాపు, ఒరపిడి. లక్ష్మీ. 2.71 ; 2. తీవ్రబాధ. **తీదీపుచేయు** స.క్రి. బాధపెట్టు. నవనాథ. 2.69 పు. **తీపరము** వి. నొప్పి. **తీపుకొయ్య** వి. మగ్గం మీదనేత బిర్రు పెట్టటానికి, మోకుకట్టేకొయ్య. **తీపుతాడు** రూ.చూ. తీపుఁద్రాడు. వి. 1. బండికి చొప్పవేసి బిగించేతాడు, జడ్డిగపుపిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు ; 2. అచ్చుకట్టే జంత్రం నిలువుకొయ్యలకు అచ్చుకర్రను బిగించే దారం. **తీపుఁద్రాడు(-త్రాడు)** రూ. తీపుతాడు. వి. వేటలో ఉపయోగించే ఒక సాధనం. కాళ. 3.46.

**తీమంచంరాట** చూ. తిగవంచ. వి. సొమ్ముసాల నిట్రాళ్ళకు పక్కనున్న పొట్టిగుంజ.

**తీమంచాపట్టె** రూ.చూ. తీవంచంపట్టె. వి. సొమ్ముసాలకు మూడు వైపులా వేసే పట్టె.

**తీమునగ** రూ.చూ. తీయమునగ. వి. తియ్యమునగ. ఆం.భా. 2.44.

**తీఁపు** రూ.చూ. తీఁపురము. వి. ఆగడం.

**తీఁపురము** రూ. తీఁపు. వి. తప్పు, ఆగడం, అకార్యం. వేంక. పంచ. 4.467.

**తీయ** రూ. తియ, తియ్య, తియ్యము, తీయము. విశే. **1.** మధురమైన. కు.సం. 1.86 ; **2.** మనోజ్ఞమైన. రం.రా.ఉ. 110 పు. 11 పం. ; **3.** ప్రియమైన. చంద్రాంగ. 3.59.

క. సియ్యనె, సిహి, సీ, సీయి, తియ్యన ; తు. తీకర, తీకెరు. తియ్యని, తేమ్. తీయదనం ; త. తీమ్. తీయని, తియమ్, తీవు. తీపి, తేమ్. తీయదనం, తిత్తి, తిత్తిప్పు. తీయదనం ; మ. తిత్తు, తిత్తిప్పు. తియ్యదనం ; తొ. తిచ్. తియ్యదనం, తిచ్(-ఇన్, -ఇద్). తీపిచూచు ; కుఇ. సెంబ(సెంబి-), సెప(సెత్-). తియ్యగాఉండు, తీపి ; కువి. తీప. తీయదనం ; కురు. తీన్నా. తీయగాఉండు.

**తీయకంద** రూ. తీకంద. వి. సారవంతమైన గుల్లనేలల్లో సాగుచేసిన దుంపపైరు. (Amorphellus Campanulatus). **తీయదోస** వి. తియ్యని దోస. **తీయని** విశే. తియ్యని, తీపిగల. **తీయమునగ** రూ. తీమునగ. వి. ఒకరకం మునగ.

**తీయన** రూ. తియ్యన. విశే. **1.** ప్రియమైన. భాస్క.రా.యు. 784 ; **2** తియ్యని, మధురమైన.

క. సీ, సీయి, సియ్యనె, సిహి. తీయని ; తు. తీకు. మధురమైన, తీకర, తీకెరు, తీపె, శీ, శీపె. తీపి ; త. తిత్తిప్పు, తీమ్. తీయని, తీవు, తీయమ్, తేమ్, తిత్తి. తీపి ; మ. తిత్తు, తిత్తిప్పు. తీపి ; తొ. తిచ్. తిచిన్, తిచిల్. తీపిని రుచిచూచు ; కుఇ. సెమ్బ (సెమ్బి-), సెప (సెత్-). తీయగాఉండు ; కువి. హేని, తీప. తీయని ; కురు. తీన్నా. తియ్యగాఉండు.

**తీయము** రూ.చూ. తీయ. వి. **1.** ప్రియత్వం. మనోహరత్వం. నిర్వ. రా. 6.48 ; **2.** అభిరుచి, ఆసక్తి. భాగ. 9.153 ; **3.** మాధుర్యం. ద్వి. పరమ. వి. 1.11 పు. ; **4.** సాంత్వన వాక్యం, బుజ్జగింపుమాట. ఆం.భా. 1.117.

**తీయించు** చూ. తీయు.

**తీయు** రూ.చూ. తివ్వు. స.క్రి. **1.** (రాగం) సాగించు, ఆలాపించు. భాస్క. రా. బాల. 66 ; **2.** లాగు, ఆకర్షించు. భాస్క.రా.కిష్కిం. 228 ; **3.** పట్టుకొను, వశంచేసికొను. ఇందు. 2.52 ; **4.** కొను. పుచ్చుకొను. విప్ర. 4.23. **5.** వేళ్ళ సందులను విరుచు. విప్ర. 4.23 ; **6.** తెచ్చు. విప్ర. 4.23 ; **7.** తెరచు, తెరిపించు. విప్ర. 4.63 ; **8.** లాగివేయు. దశా. 2.76 ; **9.** దిగలాగు, డించు. నీలా. 3.44 ; **10.** విడదీయు, వేరుగాఉంచు. కుచే. 1.34 ; **11.** వేయు. హరిశ్చ. 4.119 ; **12.** తవ్వు ; **13.** కృశించు ; అ.క్రి. **1.** తగ్గు, క్షీణించు. నార. పంచ. 1.30 ; **2.** పోవు, తొలగిపోవు. ఘటికా. 1.48.

**తీయించు** స.క్రి. తీసివేయించు. < తీయు + - ఇంచు[3].

**తీయువాఁడు** విశే. **1.** గ్రహీత ; **2.** గాయకుడు. **తీశియిచ్చు (-ఇచ్చు)** స.క్రి. వ్రాయించిఇచ్చు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556. **తీసికట్టు** వి. తక్కువది. తేలిక, చులకన. **తీసికట్టుతాడు** వి. పోలుతాడు, కాడిని పోలుకర్రకు కలిపి కట్టేతాడు. **తీసికొను** స.క్రి. **1.** తీసికొను ; **2.** కొను ; **3.** తిను, తాగు. **తీసిగుద్దులు** వి.బ.వ. రెండు పొట్టేళ్ళను విడదీసి మరల వదులుతూవచ్చే పోట్లాట పందెం. **తీసిపెట్టు** స.క్రి. తీసివేయు. **తీసిపోవు** అ.క్రి. **1.** తక్కువగు ; **2.** చిక్కిపోవు. **తీసివేత కాకితాలు** వి.బ.వ. అక్కరలేని కాకితాలు. **తీసివేఁత** వి. **1.** తొలగించటం ; **2.** వ్యవకలనం, ఒకఅంకెను మరోఅంకెనుంచి తీయడం ; విశే. తక్కువరకం. **తీసివేఁతసరకు** వి. తక్కువరకం సరుకు. **తీసివేయు** స.క్రి. **1.** ఖండించు, తెగగొట్టు ; **2.** తొలగించు ; **3.** ఒక సంఖ్య నుంచి వేరొక సంఖ్యను వ్యవకలనం చేయు ; **4.** తక్కువపరచు ; అ.క్రి. వ్యయించు. **తీసేబోలు** వి. దిష్టితీసి వేయడానికి వాడే పగలగొట్టిన కుండ బొచ్చె.

**తీర[1]** రూ.చూ. తీరు[3]. వి. దంతులుగా వాడే వంగిన మాను కర్రలు.

**తీర[2]** వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ వేసిన గీత.

**తీరతము** వి. పుణ్యక్షేత్ర తీర్థాదుల వద్ద జరిగే ఉత్సవం. ఆం.భా. 2.597.

సం. తీర్థ-. పుణ్యక్షేత్రం ; అప. అమా. జై.మహా.; జై.శౌ. ; ప్రా. ; శౌ. తిత్థ. ; అశో. ప్రా. తిధ.

< సం.తీర్థ-.

**తీరనివెట్టి** చూ. తీరు[1].

**తీరవ[1]** రూ.చూ. తీరువ[1]. వి. పిల్లకాలవ, పంటకాలవనుంచి చీలిన చిన్నకాలవ.

**తీరవగడ్డ** వి. మాగాణి నేలచుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట.

**తీరవ[2]** రూ.చూ. తీరువ[2]. వి. విధం, న్యాయం.

**తీరా** చూ. తీరు[1].

**తీరాచేసి** చూ. తీరు[1].

**తీరాలు** వి.బ.వ. అపరక్రియలు, కర్మంత్రాలు.

సం. తీర-. ఒడ్డు.

< సం. తీర- + -ము + -లు (అర్థవిపరి.).

**తీరి** రూ.చూ. తీరు[3]. వి. దంతులుగా వాడే వంగిన మాను కర్రలు.

**తీరిక** చూ. తీరు[1].

**తీరికదీర్చు** చూ. తీరు[1].

**తీరు[1]** రూ.చూ. తీఱు[1]. అ.క్రి. **1.** నెరవేరు, సిద్ధించు. భార. ఆది. 6.264 ; **2.** సుశిక్షితమగు. ఉ.హరి. 4.22 ; **3.** తెగు, పరిష్కృతమగు, కుదురు. భాగ. 8.305 ; **4.** తళుకెక్కు. వసు. 1.19 ; **5.** వాడిగా అగు. సారంగ. 2.113 ; **6.** నిలుచు. ఆం.భా. 3.58 ; **7.** తగు, యుక్తమగు ; **8.** స్వస్థమగు ; వి. **1.** సమీపం. భార. ద్రోణ. 4.156 ; **2.** విధం. హరి.పూ. 2.58 ; **3.** చక్కదనం,

సౌందర్యం. హరి.పూ. 9.8; 4. మేర, సీమ, అవధి. నీలా. 2.27; విణ. చక్కని, ఒప్పిదమైన. పల్నా. 71; సారంగ. 2.43.

తీరనివెట్టి వి. తరగని చాకిరి. బొబ్బి. సం. 6.185.

తీరా అవ్య. 1. చివరికి; 2. సమగ్రంగా. తీరాచేసి అవ్య. ఇంతాచేసి. తీరిక వి. తీరుబడి. తు. తీరికె, తిరువికె, తిర్పికె. ముగింపు. తీరికదీర్చు(-తీర్చు) స.క్రి. నిశ్చయించు. తీరుగడ వి. సమాప్తి, ముగింపు, పూర్తి. తు. తీర్గడె. ముగింపు. తీరుగొట్టు స.క్రి. నున్నగింత సలపతో రెండోసారి నునుపుచేయు. తీరుగొట్టుసలప వి. కుదంగొట్టిన తర్వాత పల్చగ, నున్నగ సర్చడానికి వాడే సలప. తీరుతీరు వి. రకరకాలు. తీరుతెన్నులు వి.బ.వ. అందచందాలు, క్రమ విధానం. తీరుదల(-తల[4]) వి. ముగియటం. తీరుదినుసు వి. అందచందం. తీరుపాటు వి. సావకాశం. తీరుబడి రూ.చూ. తీఱుబడి. వి. సావకాశం. తీరుభోగ్యము వి. అప్పుగా ఇచ్చిన డబ్బు తీరేవరకు ఋణస్థుని భూమిని అనుభవించటం. తీరువడు(-పడు) అ.క్రి. చక్కనగు, సుందరమగు. రం.రా.బాల. 82 పు. 20 పం. తీర్లమిద్దె వి. రాతిదూలాలు వేసిన మిద్దె.

తీరు[2] వి. 1. ఆచారం, కట్టుబాటు; 2. సభ్యత.

తీరు[3] రూ. తీర[1], తీరి. వి. 1. దంతులుగా వాడే వంగిన మాను కర్రలు; 2. కొయ్యలో ఏర్పడిన ముడి.

తీరు[4] వి. మడిలోకి నీళ్ళు వచ్చేకాలవ కంతకు (మడవకు) అడ్డంగా ఉన్న మట్టి.

తీరుకాల్వ వి. మాగాణిలో మడికి పెట్టిన కాలవ.

తీరుకు వి. నాట్యగతి భేదం. ఆం.బా. 1.130.

తీరుచు రూ.చూ. తీర్చు[1]. స.క్రి. 1. నెరవేర్చు. జైమినిభా. 1.137; 2. చక్కబరుచు, సవరించు. కాశి. 2.97; 3. నృత్తగీత వాద్యాలు సమం చేయు; 4. నాశనంచేయు; 5. పాయచేయు.

తీరువరి చూ. తీరువు.

తీరువు చూ. తీర్చు[1]. రూ. చూ. తీర్పు. వి. 1. నృత్తగీత వాద్యాలు సమంగా ముగించటం, ముగించటం. ఉ.రా. 6.139; 2. ఒప్పు, అందం. ప్రబంధ. 78; 3. వివాద పరిష్కారం, న్యాయ నిర్ణయం; 4. చక్కబరచటం, దిద్దుబాటు, సవరింపు; 5. బాకీ తీర్చటం; 6. ధాన్యాదులు కొన్నవారు అమ్మే వారికిచ్చే పద్దు.

తీరువరి రూ.చూ. తీర్పరి. వి. 1. తగవరి, దర్మజ్ఞుడు; 2. చారుడు, వేగులవాడు; 3. కార్యకర్త, కాళీకుడు; 4. పూజ్యుడు, పెద్ద; 5. చక్కన, మనోహరత; 6. న్యాయాధిపతి. తీరువుగోడ వి. డాబా పైభాగంలోని గోడ. తీరుబ్బద్ద రూ.చూ. తీర్పుబద్ద. వి. అచ్చు కట్టేటప్పుడు కర్రలకు కట్టిన వడిదారాలు సరిచూచుకోడానికి వాటి మెలికల్లో దూర్చిన బద్ద.

తీరుబ్బద్ద చూ. తీరువు.

తీరుమానము రూ. తీర్మానము. వి. 1. తీర్మానం, నిర్ణయం; 2. తిరిగి చెల్లించటం.

క. తిరుమాన, తీర్మాన. ముగింపు, తీర్పు, పరిష్కారం; తు. తిరుమాన. ముగింపు, పరిష్కారం; త. తీర్మానమ్. తీర్పు, పరిష్కారం, ముగింపు; మ. తిరుమానమ్. నిర్ణయం, తిర్మా. నిర్ణయం, పరిష్కారం; తొ. తి.ర్‌మ.న్‌. నిర్ణయం.

తీరువ[1] రూ. తీరవ[1]. వి. పిల్లకాలవ, పంటకాలవనుంచి చీలిన చిన్న కాలవ.

తీరువ[2] రూ. తీరవ[2], తీర్వ. వి. 1. భూస్వామి పంట రూపంగాగాని, ధనరూపంగాగాని రాజులకిచ్చేపన్ను, పన్ను. నె.శా. 3.1121; 2. విహితకృత్యం. చంద్రికా. 2.34; 3. తీర్పు, నిర్ణయం.

తీరువజాస్తి వి. నిర్ణయింప బడిన పన్నుకంటే ఎక్కువగా కట్టిన పన్ను.

తీర్చు[1] చూ. తీరు[1]. రూ. తీరుచు. స.క్రి. 1. ముగించు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 894-934; 2. నెరవేర్చు, నిర్వర్తించు, కావించు. భార.ఆది. 2.37; 3. సవరించు, చక్కబరచు. కు.సం. 7.7; 4. (తిలకాదులు) దిద్దు, చక్కగా ఉంచు. నిర్వ.రా. 8.62, హర. 2.107; 5. గుర్రాలు మొ॥ వాటిని శిక్షించి వశపరచు. భార.విరా. 1.95; 6. సమాధానపరచు, ఒప్పించు. భార.ఉద్యో. 1.18; 7. (న్యాయం మొ॥) పరిష్కరించు, నిర్ణయించు. భార.శాంతి. 2.374; 8. ఫలింపజేయు, సఫలంచేయు. పారి. 5.23; అ.క్రి. 1. శుభాశుభ సూచకంగా పక్షులు మొ॥ ఒక పక్కనుండి మరొక పక్కకు పోవు. భాగ. 1.337; 2. అతిశయించు, ముమ్మరమగు. <తీరు[1]+-చు.

తీర్చు[2] చూ. తీఱు[1]. రూ. తీఱుచు. స.క్రి. 1. ప్రతిక్రియచే ఉపశమింపజేయు. భార.ఆది. 1.129; 2. పన్ను, ఒగ్గు. కు.సం. 3.248; 3. అమర్చు. భార. విరా. 4.89; 4. (ఋణం) చెల్లించి పోగొట్టుకొను, ఇచ్చి పరిహరించుకొను. భార.విరా. 4.205; 5. వ్యర్థంచేయు. భార.ఉద్యో. 2.273; 6. చంపు, సంహరించు. భార.ఉద్యో. 4.341; 7. తొలగజేయు, పాపు, పోగొట్టు. భార.ఉద్యో. 4.368, 8. ఏర్పరచు.హర. 3.66; 9. కడపు, వెళ్ళబుచ్చు. శుక. 2.377; 10. నిర్మించు; అ.క్రి. సరిగాజరుగు, శుభప్రదంగా ప్రవర్తిల్లు. సన్యానందము. 3.10 పు. 6 పం.

<తీఱు[1]+-చు.

తీర్తిపూదెలు వి.బ.వ. కుండల మీద చేసే అలంకార విశేషాలు. హంస. 5.13.

తీర్థమాట చూ. తీర్థము.

తీర్థమాడు చూ. తీర్థము.

తీర్థమార్చు చూ. తీర్థము.

తీర్థము వి. 1. దేవునికోసం తెచ్చే పవిత్ర జలం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1269; 2. నూతి దగ్గర కట్టిన తొట్టి; 3. జాతర; 4. గుడిలో ఇచ్చే పవిత్రమైన నీళ్ళు.

సం. తీర్థ-. నీళ్ళు, పుణ్యక్షేత్రం.

<సం. తీర్థ- (అర్థవిపరి.).

తీర్థమాట వి. స్నానం. కాశీ. 5.49. <తీర్థము+ఆట.

**తీర్థమాడు** స.క్రి. 1. స్నానంచేయు. కాశీ. 5.144 ; 2. ప్రసవించు. సం. తీర్థ-. నీళ్ళు. <సం. తీర్థ-+-ము+ ఆడు. **తీర్థమార్చు** స.క్రి. అభిషిక్తునిగాచేయు. కాశీ. 6.270. <తీర్థము+ఆర్చు.

**తీర్పగు** చూ. తీర్పు.

**తీర్పరి** చూ. తీర్పు.

**తీర్పు** చూ. తీర్చు[1]. రూ. తీరుపు. వి. 1. వివాదపరిష్కారం, న్యాయనిర్ణయం. భార.సభా. 2.240 ; 2. చక్కబరచటం, సవరింపు, దిద్దుపాటు. భార.ఉద్యో. 4.143 ; 3. ఒప్పు, అందం ; 4. నృత్తగీతవాద్యాలు సమంగా ముగించటం, ముగించటం ; 5. అప్పు మొత్తం మీద వడ్డీని గుణించి మొదట్లో చేర్చు.

క. తీర్పు. నిర్ణయం, పరిష్కారం ; త. తీర్పు. పరిష్కారం, తీర్పు, తీర్వు. ముగించడం, తీర్వై. ముగింపు, నిర్ణయం, వివాద పరిష్కారం ; మ. తీర్పు. వివాద పరిష్కారం, న్యాయనిర్ణయం, తీర్మ. పరిష్కారం ; కో. తి.ర్ప్, నిర్ణయం, పరిష్కారం.

**తీర్పగు** అ.క్రి. అనుపోయడం పూర్తిఅగు. <తీర్పు+ అగు. **తీర్పరి** రూ. తీరుపరి. వి. 1. తగవరి, ధర్మజ్ఞుడు. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 211. క్రీ. శ. 1236 ; 2. న్యాయాధిపతి. పండి. చ. 1.42 ప. ; 3. కార్యకర్త, ఏలికుడు. హరి. ఉ. 2.178 ; 4. చక్కన, మనోహరత. అచ్చ. భా. 1.4 ; 5. పూజ్యుడు, పెద్ద. నీలా. 1.92 ; 6. కార్యకర్త ; 7. చారుడు, వేగులవాడు. **తీర్పుచివ** రూ.చూ. తీర్పుచివ్వ. వి. అచ్చుకట్టే జంత్రం అడ్డపట్టె కొయ్యకుగాని నిలువుపట్టె కొయ్యకుగాని బిగించిన కర్ర. **తీర్పుచివ్వ** రూ. తీర్పుచివ, తీర్పుసివ. వి. అచ్చుకట్టే జంత్రం అడ్డపట్టె కొయ్యకుగాని నిలువుపట్టె కొయ్యకుగాని బిగించిన కర్ర. **తీర్పుచేయు** స.క్రి. అచ్చుకట్టేటప్పుడు, కర్రలకు గట్టిన దారపు వడులను సరిచేయు. **తీర్పుబద్ద** రూ. తీరుబ్బద్ద. వి. అచ్చుకట్టేటప్పుడు కర్రలకు కట్టిన పడిదారాలు సరిచూసుకోటానికి వాటి మెలికల్లో దూర్చిన బద్ద. **తీర్పుబిల్ల** రూ.చూ. తీర్పుబిళ్ళ. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి, అచ్చువడులలో దూర్చే కొయ్యచెక్క. **తీర్పుబిళ్ళ** రూ. తీర్పుబిల్ల. వి. అచ్చు కట్టేటప్పుడు, పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చువడులలో దూర్చే కొయ్యచెక్క. **తీర్పుసివ** రూ.చూ. తీర్పుచివ్వ. వి. అచ్చుకట్టే జంత్రం అడ్డపట్టె కొయ్యకుగాని, నిలువుపట్టె కొయ్యకుగాని బిగించిన కర్ర.

**తీర్మానము** రూ.చూ. తీరుమానము. వి. తీర్పు, తీరుమానం.

**తీర్మానించు** చూ. తీర్మానము. స.క్రి. నిర్ణయించు.

**తీర్లమిద్దె** చూ. తీరు[1].

**తీర్వ** రూ.చూ. తీరువ[2]. వి. 1. భూస్వామి పంటరూపంగా గాని, ధనరూపంగాగాని రాజుల కిచ్చే పన్ను, పన్ను. ఉ.హరిశ్చ. 1.63 ; 2. విహితకృత్యం.

**తీలి** చూ. తీలు[1].

**తీలమి** చూ. తీలు[1].

**తీలిక** చూ. తీలు[1].

**తీలిపోవు** చూ. తీలు[1].

**తీలు[1]** రూ. తీరు[1]. అ.క్రి. 1. ప్రతీకారంవల్ల ఉపశమిల్లు, భార.ఆది. 1.53 ; 2. తొలగిపోవు, పాయు. భార.ఆది. 4.19 ; 3. ముగియు, అయిపోవు. భార.ఆది. 5.71 ; 4. స్ఫుటమగు, బయల్పడు. కు.సం. 114 ; 5. నశించు, నాశనంపొందు. నిర్వ.రా. 9.66 ; 6. శక్యమగు, సాధ్యమగు. భార.విరా. 2.169 ; 7. (అగ్ని మొ॥) ఆరిపోవు, చల్లారు. భార.విరా. 4.114 ; 8. అవకాశం కలుగు, వీలుపడు. భార.ఉద్యో. 1.42 ; 9. చచ్చు, మరణించు. భార. ఉద్యో. 4.273 ; 10. తప్పు, గత్యంతరం లేకుండు. వేంక.పంచ. 1.492 ; 11. ఉడుగు, విరమించు. ఆము. 4.127 ; 12. కడచు. గతించు. విష్ణుపు. 6.404 ; 13. నిర్మితమగు. శుక. 2.357 ; 14. కలుగు, పొడము. శుక. 3.518 . 15. ఏర్పడు ; 16. సరిపోవు ; వి. సంధి, ఒడంబడిన. భార. ఉద్యో. 3.116. విశ. పొందికైన.

క. తీర్ (తీర్ద్), తీరు (తీరి-). పూర్తగు, నయమగు, చచ్చు, తీర, తీరు. ముగింపు, ఏర్పాటు, అంతం, విధం ; తు. తీరుని. పూర్తిఅగు, తీర్పుని, తీర్పావుని, తీరిసుని, తీరిసావుని. పూర్తిచేయు ; త. తీర్ (-వ్, -న్త్-). ముగియు, మాయమగు, చచ్చు, నాశనమగు, తీర్వు. ముగింపు, తీర్వై. ముగింపు ; మ. తీరుక. పూర్తిఅగు ; కో. తిర్.ర్. (తి.ర్వ్.). పూర్తిచేయు ; తొ. తి.ర్. (తి.ర్య్.). పూర్తిఅగు.

**తీలి** క్రి.విశ.ద్రు. పూర్తిగా, ముగియవచ్చేసరికి. కళా. 6.77. తు. తీర. పూర్తిగా. **తీలమి** వి. అక్కర, పోరామి. భార.ఆది. 4.85. **తీలిక** వి. తీరుబడి, అవకాశం. తు. తీరికె, తీరువికె, తీర్పికె. ముగింపు, పరిష్కారం ; త. తీర్కమ్. అనుకూల్యం, వీలు ; మ. తీర్క. పూర్తిచేయు. **తీలిపోవు** అ.క్రి. చచ్చు, గతించు, అవసానంపొందు. మొల్ల.సుందర. 159. **తీలుగడ** రూ. తేలుగడ. వి. 1. అవసానం, ముగింపు, అంతం. చిత్రభా. 5.40 ; 2. తీరిక, తెరిపి ; విశ. సమాప్తమైన, ముగిసిన. విజయ. 1.2. **తీలుచు** రూ.చూ. తీర్చు[2]. స.క్రి. తీరజేయు, పోగొట్టు, పావు.దశా. 6.128. **తీలుదల** (-తల[3]) వి. ముగియిక, సమాప్తి, అంతం. నిర్వ.రా. 10.84. భార.భీష్మ. 2.203. **తీలుపడు** అ.క్రి. తెరపిఅగు, అవకాశం కలుగు. **తీలుపాటు** వి. తీరిక, అవకాశం. **తీలుపు** వి. 1. ఏర్పాటు ; 2. సంధి. **తీలుబడి** రూ. తీరుబడి. వి. తీరుపాటు, అవకాశం. **తీలుమాటలు** వి.బ.వ. పొందికైన మాటలు. భార.ఉద్యో. 3.116.

**తీలు[2]** వి. పన్ను, కప్పం. శా.ప.మ.

**తీలుమెట్టు** (-పెట్టు) స.క్రి. పన్నుచెల్లించు. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 737. క్రీ.శ. 1115.

**తీలగు** చూ. తీలు.

**తీలు** రూ.చూ. డీలు[1]. వి. అణగటం, తగ్గటం. నిరం. 2.23 ; విశ. 1. క్షీణమైన, అల్పమైన. ద్వి. సార. చ. 16ప,

2పం ; **2**. అణగిన.

**తీలగు** అ.క్రి. **1**. బలహీనమగు. వేంక. పంచ. 1.581 ; **2**. నశించు. వేంక. పంచ. 1.696 ; **3**. అడగు, తగ్గు. ఆము. 2.63 ; <తీలు + అగు. **తీలుపడు** రూ. తీలువడు. అ.క్రి. **1**. దుర్బలమగు, నిస్సత్త్వమగు. వేంక. పంచ. 1.581 ; **2**. నశించు. వేంక. పంచ. 1.696 ; **3**. తగ్గు, క్షీణించు. పాండు. **4**.81 ; **4**. అణగు, మరుగుపడి ఉండు. **తీలురేషం** వి. నాసిరకం పట్టు. హిం. రేషమ్. పట్టు. <తీలు + హిం. రేషమ్. **తీలుపడు (-పడు)** రూ.చూ. తీలుపడు. అ.క్రి. **1**. అణగు, మరుగుపడి ఉండు. ఇందు. 2.165 ; **2**. దుర్బలమగు, నిస్సత్త్వమగు. ప్రబంధ. 224 ; **3**. తగ్గు, క్షీణించు ; **4**. నశించు.

**తీళ్ళాకు** వి. ఒకరకం ఆకెరువు మొక్క.

**తీవ** రూ.చూ. తీఁగ. వి. లత, వల్లి. భార. అరణ్య. 3.312.

**తీవనవ్వు** రూ.చూ. తీఁగనవ్వు. వి. లేత నవ్వు. కవిక. 1.39. **తీవపెసలు** రూ.చూ. తీఁగెపెసలు. వి.బ.వ. దేశమంతటా విస్తారంగా పండే పెసలు. **తీవఁబోఁడి (-పోఁడి)** రూ.చూ. తీఁగఁబోణి. వి. **1**. తీగవలె మనోజ్ఞమైనది, కోమలి. పద్మ. 5.83 ; **2**. ఆడది. అచ్చ. రా. యు. **4**.74. **తీవయిల్లు (-ఇల్లు)** రూ. తీఁగయిల్లు. వి. ఔ. నికుంజం, పొదరిల్లు. భార. విరా. 2.308. **తీవసరులు** రూ. తీఁగసరులు, తీవెసరులు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. **4**.128.

**తీవడ** వి. రెండునొగల బండి నొగలను వెనకవైపున బంధించిన కర్ర.

**తీవరకత్తియ** చూ. తీవరము.

**తీవరకత్తె** చూ. తీవరము.

**తీవరపడు** చూ. తీవరము.

**తీవరపాటు** చూ. తీవరము.

**తీవరపెట్టు** చూ. తీవరము.

**తీవరము** వి. **1**. త్వర, తొందర, వేగం. కళా. **3**.223 ; **2**. చిరాకు, కోపం. నిరంకు. 2.25.

సం. తీ్వ్ర-, తీ్వ్రమ్. అతిశయం, హెచ్చయినవి ; ప్రా. తివ్వ. ప్రబలం, గాఢం, ప్రకృష్టం; అ. మా. తిర్వ ; పా. తిప్ప, తిబ్బ.

క. తీవర. ప్రబలం, రౌద్రం, వాడియైనది, తివరవు, తిబ్బరి ; త. తీవరమ్, తీవిరమ్.

<సం. తీవ్ర-.

**తీవరకత్తియ** రూ.చూ. తీవరకత్తె. **1**. వి. వేగిరపడే స్త్రీ, తొందర పాటుగల స్త్రీ ; **2**. దుష్టురాలు, చండి, తీవ్రస్వభావురాలు. **తీవరకత్తె** రూ. తీవరకత్తియ. వి. **1**. వేగిరపడే స్త్రీ, తొందరపాటుగల స్త్రీ. ఇందు. 6.6 ; **2**. దుష్టురాలైన, చండి, తీవ్రస్వభావంగల. ఆడిదము సూరకవి చాటువు. **తీవరపడు** అ.క్రి. త్వరపడు, తొందరపడు. **తీవరపాటు** వి. తీవరపడటం, తొందరపడటం, వేగిరపాటు. **తీవరపెట్టు** స.క్రి. తొందరపెట్టు, త్వరపెట్టు. ముకుంద. 3.381. **తీవరించు** స.క్రి. త్వరపెట్టు, తొందరపెట్టు. శశా. 4.24. ఉ.రా. 2.136 ; అ.క్రి. కోపపడు, చిరాకుపడు. శశా. 5.13.

**తీవరించు** చూ. తీవరము.

**తీవియ** రూ.చూ. తీఁగ. వి. లత, వల్లరి. అచ్చ. రా. బాల. 164.

**తీవియఁబోఁడి (-పోఁడి)** రూ.చూ. తీఁగఁబోణి. వి. **1**. చక్కని ఆడది. అచ్చ. రా. అరణ్య. 37 ; **2**. ఆడది.

**తీవిరము** వి. తీట, కండూతి. ఆం. భా. 2.129.

**తీవె** రూ.చూ. తీఁగ. వి. లత, వల్లరి. భార. అరణ్య. 2.78, హర. 1.20.

**తీవెసరులు** రూ.చూ. తీవసరులు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**తీశియిచ్చు** చూ. తీయు.

**తీసికట్టు** చూ. తీయు.

**తీసికట్టుతాడు** చూ. తీయు.

**తీసికొను** చూ. తీయు.

**తీసిగుద్దులు** చూ. తీయు.

**తీసిపెట్టు** చూ. తీయు.

**తీసిపోవు** చూ. తీయు.

**తీసివేతకాకితాలు** చూ. తీయు.

**తీసివేఁత** చూ. తీయు.

**తీసివేఁతసరకు** చూ. తీయు.

**తీసివేయు** చూ. తీయు.

**తీసేబోఁఖు** చూ. తీయు.

**తుకడా** రూ.చూ. తుకడీ. వి. కొయ్యముక్క.

**తుకడారౌతు** వి. పనికిరానిరాయి.

**తుకడి** వి. మందుల్లో ఉపయోగపడే ఒకమొక్క (Clerodendron Phlomoides).

**తుకడీ** రూ. తుకడా, తుకిడీ, తుకుడీ, తుకునీ. వి. ఖండం, ముక్క, భాగం.

హిం. టుకడీ. మండలి, సేనావిభాగం ; తురా. తుకడా, టుక్డా. భాగం, ఖండం.

<మరా. తుకడా.

**తుకతుక** వి. **1**. ఉడకటం, కాగటం, నవ్వటం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. వేంక. పంచ. 3.148 ; **2**. కోపం. గౌ. హరి. పూ. 1639 ; **3**. సంతాపం, దుఃఖం. గౌ. హరి. పూ. 1791 ; **4**. ఉడుకుబోతుతనం. చంద్రాంగ. 2.56 ; **5**. ఈసు, అసూయ. చంద్రభా. 1.136. ధ్వన్యను.

**తుకము** వి. **1**. ఉత్పత్తి స్థానం. రం. రా. సుందర ; **2**. నారుమడి. అని. 3.76 ; **3**. నాటటానికి పోసినవరి, మిరప మొ. వాటి మొలకలు.

హిం. తుఖ్మ్. బీజం ; ఉ. తుఖ్మ్. గింజ, జీవాణువు ; పార. తుఖ్మ్. బీజం, వీర్యం, మూలం.

తు. తుకమ్. భూఖండం, వరిమడి.

<ఉ. తుఖ్మ్.

**తుకంమడి** వి. నారుమడి, నారుపోసిన భూభాగం. <తుకము + మడి.

**తుకంమడి** చూ. తుకము.

**తుకాటము** విశ. మిక్కిలిపాతదైన.

**తుకిడీ** రూ.చూ. తుకడీ. వి. ముక్క.

**తుకుడీ** రూ.చూ. తుకడీ. వి. భాగం, ఖండం.

**తుకునీ** రూ.చూ. తుకడీ. వి. పన్నెదండలమధ్య బిగించే పుల్లలు ఒకేపొదుగులో తెంపటానికి కొలిచే కొయ్యబిళ్ళ, కొలతబల్ల.

**తుక్కు** వి. **1.** లోహదోషం, తుప్పు ; **2.** పనికిమాలిన గడ్డి మొ. చెత్త ; **3.** ఒకరకం కలుపుమొక్క ; **4** సారె, పట్టులో కలిపే వారె, వెంట్రుకలు మొ. తుప్పుడు ; విశ. **1.** పనికిమాలిన, నిస్సారమైన, అల్పమైన ; **2.** కావలసినన్ని.

క. తుకుక్క. తుప్పు ; త. తుక్కు.

< క. తుక్కు.

**తుక్కుడు** విశ. పనికిమాలిన, నిస్సారమైన, అల్పమైన. **తుక్కుదూగర** వి. పనికిరాని చెత్తాచెదారం. **తుక్కుపట్టు** వి. సరిసేటప్పుడు పాత్రలకింద ఆధారంగా దిండుగా చేసిపెట్టిన పాతగోతాం. **తుక్కుమూఁక** వి. తుచ్ఛజనసమూహం. **తుక్కురేఁగఁగొట్టు** స.క్రి. బాగా దెబ్బలుకొట్టు.

**తుక్ఖారము** చూ. తుర్క. వి. గుర్రం, సంస్కృత కావ్యాల్లోనూ కోశాల్లోనూ ఈ పదం మృగ్యం. తురకలకు సంబంధించింది (గుర్రం) అనే రీతిలో తెలుగులో ఈపదం ప్రవేశించి ఉంటుంది.

హిం.ఉ. తుఖార్. గుర్రం.

< ఉ. తుఖార్.

**తుగ** రూ.చూ. దుక. విశ. యువ. ఉరుటూరు. క్రీ.శ. 600–625.

**తుగరాజు** రూ.చూ. దుకరాజు. వి. యువరాజు. ఉరుటూరు. క్రీ.శ. 600-625.

**తుగ్లి** వి. నల్లరెంగచెట్టు, గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకంచెట్టు (Albizzia Amara).

**తుంగ** వి. సువాసన వేసే దుంపలు కలిగిన ఒకజాతి గడ్డి. (Cyperus Genus). భార. విరా. 5.183.

క. తుంగె, తుంగ. తుంగ ; తు. తుంగాయి ; పర్జీ. తుంగ.

**తుంగకసవు** వి. తుంగగడ్డి. చెన్నబసవ. 2.204. **తుంగగడ్డ** వి. తుంగగడ్డియొక్క దుంప, ఒకపరిమళ ద్రవ్యం. ద్వి. సార. చ. 280 పు. 13 పం. **తుంగగడ్డి** వి. వాసనవేసే దుంపలున్న ఒకజాతి గడ్డి. **తుంగబుటక** వి. తవ్విన మట్టిలోవచ్చిన తుంగవేళ్ళు. **తుంగమడుగు** రూ.చూ. తుంగమడువు. వి. తుంగగడ్డి అలుముకొన్న మడుగు. భార. సౌప్తి. 1.197. **తుంగమడువు** రూ. తుంగమడుగు. వి. తుంగగడ్డి అలముకొన్న మడుగు. భార. విరా. 5.183. **తుంగముస్తియ** రూ. తుంగముస్తె. వి. తుంగగడ్డియొక్క దుంప. కాశ. 3.151. **తుంగముస్తె** రూ.చూ. తుంగముస్తియ. వి. తుంగగడ్డియొక్క దుంప. **తుంగలు దూలాలుమోయు** అ.క్రి. అసంభవ కార్యంజరుగు. **తుంగలో తొక్కి గంగలోకలుపు** స.క్రి. లెక్కించకపోవు. **తుంగలో త్రొక్కు** స.క్రి. లెక్కించకపోవు, ధ్వంసంచేయు. **తుంగాకు** వి. తృణవిశేషం. హంస. 5.42 < తుంగ + ఆకు.

**తుంగాకు** చూ. తుంగ.

**తుంగు** రూ.చూ. త్రుంగు. స.క్రి. తుంచు.

**తుచ్ఛపెంజెర** రూ.చూ. తుస్సపెంజెర. వి. ఒకరకం కొండచిలువ.

**తుజుగు** విశ. త్వరపడేవాడు, తొందరపడేవాడు.

హిం. తుజుగ్. మర్యాద, సమానం.

**తుంచు** రూ.చూ. త్రుంచు. స.క్రి. **1.** ఖండించు, తునకలు చేయు. హరి. ఉ. 6.163 ; **2.** ఉత్తరించు, చించు. ఉ. హరి. 4.115.

**తుటాయించు** స.క్రి. **1.** అలక్ష్యంచేయు ; **2.** తిరస్కరించు; **3.** నిరసించు ; అ.క్రి. **1.** విరిగిపోవు ; **2.** తెగిపోవు.

హిం. టుటానా. విరవటం, భగ్నంచేయటం.

< హిం. టు టా(నా) + - ఇంచు$^{3}$.

**తుటారమాడు** చూ. తుటారము.

**తుటారము** రూ.చూ. తుతారము. వి. **1.** నింద, తిట్టు. పాండు. 4.147 ; **2.** దిట్టతనం, దార్ఢ్యం. అచ్చ.రా.యు. 363 ; **3.** పరుషవచనం, నిష్ఠురోక్తి. ఆం.భా. 1.117 ; విశ. **1.** పరుషమైన(వాక్కు). హరిశ్చ. 4.169 ; **3.** దిట్టమైన, దృఢమైన, ధైర్యంగల. రసిక. 1.106.

**తుటారమాడు** స.క్రి. నిరసించు, తిరస్కరించు. శుక. 2.96. < తుటారము + ఆడు. **తుటారి** వి. **1.** చెడుగు, దుష్టుడు. నీతి.శ. 9, సమీర. 4.22 ; **2.** పేలరి, వదరుబోతు. ప్రభా. 5.168 ; **3.** దిట్టతనంగల(ది). నీలా. 1.6 ; **4.** దిట్టతనంగలవాడు, దుష్టుడు. చంపూ రా. 2.65, < తుటారము + - ఇ$^{3}$. **తుటారికత్తియ** రూ. తుటారికత్తె. వి. **1.** దిట్టతనంగల స్త్రీ, దుష్టురాలు. నీలా. 1.39 ; **2.** తుంటరి, దుష్టురాలు, కూళ. **తుటారికత్తె** రూ.చూ. తుటారికత్తియ. వి. **1.** తుంటరి, దుష్టురాలు, కూళ. రసిక. 4.178 ; **2.** దిట్టదనంగల స్త్రీ, దుష్టురాలు. **తుటారికాఁడు** వి. **1.** దిట్టతనంగలవాడు ; **2.** తుంటరి, దుష్టుడు, కూళ. **తుటారించు** స.క్రి. తిరస్కరించు. ప్రభు. 384 పు. 7 పం. దశా. 4.236. శుక. 1.314. త. తుటారిసు. నిరసించు.

**తుటారి** చూ. తుటారము.

**తుటారికత్తియ** చూ. తుటారము.

**తుటారికత్తె** చూ. తుటారము.

**తుటారికాఁడు** చూ. తుటారము.

**తుటారించు** చూ. తుటారము.

**తుటుకుతుటుక్కు** చూ. తుటుక్కు. వి. గుండెలు అదరటంలో అయ్యేధ్వనికి అనుకరణం. పాంచాలీ. 2.42.

**తుటుక్కు** వి. గుండెలు అదరటంలో అయ్యే అనుకరణం.

**తుటుము**$^{1}$ రూ. తుడుము$^{1}$. వి. **1.** గుంపు, సమూహం. భాగ. 10 పూ. 784 ; **2.** చతురంగ బలసేన. అచ్చ.రా.యు. 4.80 ; **3.** దండు. సేన. ఆం. పదా. నర. 111 ; **4.** చెడిపోయిన ముద్దకట్టిన చింతపండు మొదలైనవి.

త. తుటుప్పు. పూలగుత్తి.

**తుటుములుగట్టు(-కట్టు)** అ.క్రి. గుమిగూడు. భాగ.

10 పూ. 770.

**తుటుము**[2] వి. మల్లవిద్యా సంబంధమైన షోడశోపవీతాలలో ఒకటి. హంస. 1.206.

**తుట్టు** చూ. తుట్టియ[2]. వి. **1.** పుంజం, సమూహం ; **2.** లేని మాట పుట్టించటం ; **3.** అసత్యం ; **4** నిందారోపణచేయటం ; **5.** మండుతూ గాలికి ఎగిరి మరొకచోట పడిన గడ్డి మొ. వాటిచుట్ట.

**తుట్టకంప** రూ.చూ. తుట్టెకంప. వి. ఆముకాల్వులో వాడే ముళ్ల కంప. **తుట్టపురుగు** వి. పెంటపోగులు మొదలైన వాటిలో ఉండే తుట్టెలాంటి పురుగు. **తుట్టపెట్టు** స.క్రి. బాధించు. రాజవి. 3.121. **తుట్టపెదవులు** వి.బ.వ. లావుగా ఉన్న పెదవులు.

**తుట్టతుద** చూ. తుది; వి. కేవలం చివర. భాస్క.రా. ఆరణ్య. 2.141.

క. తుత్తతుది. చివర, తుట్టె, తొట్టు.

**తుట్టతుది** చూ. తుది. వి. చిట్టచివర. పండి.చ. 5.349 పు. 70 పం.

క. తుట్టు. తొట్టు. చివర.

**తుట్టతుమర** చూ. తుట్టమర. క్రి.విశ.ద్రు. బొత్తిగా, స్వల్పంగానైనా.

**తుట్టమర** రూ. తుట్టమార, తుట్రమర. క్రి.విశ.ద్రు. బొత్తిగా.

**తుట్టమార** రూ.చూ. తుట్టమర. క్రి.విశ.ద్రు. బొత్తిగా, పూర్తిగా.

**తుట్టర** రూ.చూ. తుట్ర. వి. **1.** తూరవాన ; **2.** తుక్కుతుట్రా, ఊడ్చిన కుప్ప.

**తుట్టి**[1] రూ.చూ. తుట్టె[2]. వి. చెడిపోయి ముద్దగట్టిన చింత పండు మొ.నవి.

**తుట్టి**[2] రూ.చూ. తుట్టు. వి. తక్కువ, నష్టం.

**తుట్టియ**[1] రూ.చూ. తుట్టె[1]. విశ. క్షుద్రమైన, నీచమైన.

**తుట్టియ**[2] రూ.చూ. తుట్టె[2]. వి. **1.** సమూహం, గుంపు ; **2.** అడ, అట్ట ; **3.** తేనెపెర.

**తుట్టు** రూ. తుట్టి[2]. వి. **1.** పీడ, బాధ. భాస్క.రా.యు. 2252 ; **2.** నష్టి ; విశ. **1.** బాధకమైన. రాజవా. 3.8 ; **2.** నాశకుడు. 3.8.

క. తుట్టిసు.

**తుట్టుపెట్టు** స.క్రి. బాధించు. రాజవా. 3.121.

**తుట్టునార** చూ. తుట్టియ[2]. వి. ఒకటిగా కరచుకొని ఉన్ననార.

**తుట్టె**[1] రూ. తుట్టియ[1]. విశ. క్షుద్రమైన, నీచమైన.

సం. త్రుటిత-, త్రుటితం. ఖండితం, భిన్నం ; ప్రా. తుట్ట-.

<ప్రా. తుట్ట-.

**తుట్టెపురుగు** వి. **1.** నీచమైన ఒకపురుగు. రామాభ్యు. 3.40 ; **2.** తుచ్ఛసర్పం. ఆం. భా. 1.147 ; **3.** సర్పం ; **4.** పిల్లపాము. **తుట్టెపురుగు గుంపుగొంగ** వి. గరుత్మంతుడు, సర్పహారి. వేంక. ఆం. దేవ. 20. **తుట్టెపురుగుగొంగ** వి. గరుత్మంతుడు.

**తుట్టె**[2] రూ. తుట్టి[1], తుట్టియ[2], త్రుట్టియ, త్రుట్టె. వి. **1.** సమూహం, పోవ. ఆము. 6.17 ; **2.** అడ, అట్ట. అష్ట మ. క. 2.83 ; **3.** తేనె పెర పెర. ఆం. భా. 2.170 ; **4.** పట్టు, గూడు ; క్రి.విశ.ద్రు. బొత్తుగా.

క. తుఱుకు, తుఱకు. కుక్కు, తుఱుగ, తుఱగు. గుంపు, తుఱుగు. గుమికూడు ; త. తుఱు. (తుఱువ్-, తుఱ్జ్-). గుమికూడు, తుఱు. (జనం, పశువులు మొ. వాటి) సాంద్రత.

**తుట్టెకంప** రూ. తుట్టకంప వి. ఆము కాల్వులోవాడే ముళ్ళకంప. **తుట్టెగట్టు (-కట్టు)** అ.క్రి. **1.** అడలుకట్టు, జడలుకట్టు ; **2** పురుగుపట్టి వుండలుకట్టు. **తుట్టెతెవులు** వి. నువ్వుచెట్టు తెగులు. **తుట్టెలుగట్టు (-కట్టు)** అ.క్రి. **1.** అడలుకట్టు, జడలుకట్టు. చంద్రాంగ. 2.84 : **2.** పురుగుపట్టి ఉండలుకట్టు.

**తుట్ర** రూ. తుట్టర. వి. **1.** మంచువంటి తూరవాన, తుషార వృష్టి. ఆం. భా. 1.75 ; **2.** పెంటకుప్పఊడ్చి రాసిగా పోసిన చెత్త ; **3.** చెడిపోయి ముద్దగట్టిన చింతపండు మొదలైనవి.

సం. త్రుటత్ృ. బద్దలవటం, విరగటం ; పా. తుట్టిర-.

<ప్రా. తుట్టిర-.

**తుట్రపురుగు** వి. విషం ఎక్కువగల చిన్నపాము.

**తుట్రిలు** రూ. తుట్రిల్లు. అ.క్రి. ఉరియు, కురియు, రాజవా. 2.70. **తుట్రిల్లు** రూ.చూ. తుట్రిలు. అ.క్రి. ఉరియు, కురియు.

**తుట్రమర** రూ.చూ. తుట్టమర. క్రి. విశ. ద్రు. బొత్తిగా.

**తుట్రిలు** చూ. తుట్ర.

**తుట్రిల్లు** చూ. తుట్ర.

**తుఠారము** రూ. తుటారము. వి. పరుషవాక్యం. వరాహ. 1.137.

క. తుటార. అలక్ష్యం ;

సం. తుట్. పోట్లాడు.

**తుడాయించు** స.క్రి. మాటను కాదను.

హిం. తుడా (నా). తుంచు, వేరుచేయు.

<హిం. తుడా (నా) + -ఇంచు[3] (అర్థవిపరి.).

**తుడిచిపెట్టు** చూ. తుడుచు.

**తుడిచిపెట్టుకొనిపోవు** చూ. తుడుచు.

**తుడిపించు** చూ. తుడుపు.

**తుడిమి** రూ.చూ. తొడిమ. వి. చెలకపారతూము.

**తుడుంకుండ** చూ. తుడుము[2].

**తుడుచు** రూ. తుడ్చు. స.క్రి. **1.** ఒత్తివేయు, ఒత్తిపోగొట్టు. భార. ఆది. 4.241 ; **2.** ఊడ్చు, ఊడ్చిపోగొట్టు. భార. సభా. 2.200 ; **3.** రాచు, రాచిపోగొట్టు. భార. విరా. 5.260 ; **4.** క్షాళనంచేయు, కడిగిపోగొట్టు. శృం. నై. 2.141, కాశీ. 6.292 ; **5.** నిమురు, తడుము మను. 4.115 ; **6.** పోగొట్టు. మానుపు. కకుత్థ్స. 4.58 ; **7.** చంపు. లక్ష్మీ వి. 2.97.

క. తొడె, తొడసు, తొడియిసు, తొడిసు, తొడక. తుడుచు ; తు. తొడెపుని, తుడెపుని. రుద్దు ; త. తుడె (-ప్ప్-,త్త్-). తుడుచు, తొడై (ప్ప్-, త్త్). తుడుచు ; మ. తుడెక్క, తుడెప్పిక్క. తుడుచు, శుభ్రంచేయు.

మూ. ద. ద్రా. *తుట్-, *తుటయ్.

**తుడిచిపెట్టు** స.క్రి. నాశనంచేయు. **తుడిచిపెట్టుకొనిపోవు** అ.క్రి. నిర్మూలమైపోవు.

**తుడుపు**[1] చూ. తుడుచు. రూ. తుడ్పు. విణ. తుడిచేది, తుడిచి వేసేది. ప్రబంధ. 24; వి. **1**. తోమటం, తుడవటం, మార్జనం. ఆం. భా. 2.160; **2**. కొట్టివేసిన రాత.

**తుడిపించు** స.క్రి. చెరిపివేయించు. ద. హిం. శా. సంపు. **4**. శా. సం. 815. క్రీ.శ. 1550. **తుడుపుకంకర** వి. కాంక్రీటులో వాడే ఎర్రటిరాతిముక్క. **తుడుపుదుమారము** వి. మన్నుదుమ్ము. కుమారీశ. 97. **తుడుపువెట్టు(-పెట్టు)** స.క్రి. తుడిచివేయు. బహుశా. 1.60.

**తుడుపు**[2] రూ.చూ. తురుపు. వి. చీట్లాటలోని గెలుపురంగు.

**తుడుము**[1] రూ.చూ. తుటుము[1]. వి. గుంపు, సమూహం. రామాభ్యు. 8.158.

**తుడుము**[2] వి. మద్దెల, చిన్ననగారా. రసిక. 1.80, అచ్చ. రా. సుందర. 109.

క. తుడుబు. వాద్యవిశేషం; కొడ. దుడి; త. తుటి, తుటుమై; మ. తుటి; గోం. తుడుమ్.

**తుడుంకుండ** రూ.చూ. తుడుముకుండ. వి. చర్మకట్టు వాద్యానికి తయారుచేసినకుండ. **తుడుముకుండ** రూ. తుడుంకుండ. వి. చర్మకట్టు వాద్యానికి తయారుచేసినకుండ. **తుడుముగ** క్రి. విణ. ద్రు. పొట్టిగా, లావుగా. **తుడుము మొదలుకొనిదేవతార్చనవరకు** అవ్య. ద్రు. సర్వానికి, అన్ని పనులకు. **తుడుమువేయు** స.క్రి. ఏదైనా ఒక విషయాన్ని గ్రామంలో ప్రకటించడానికి తుడుము వాయిస్తూ చెప్పు.

**తుడ్చు** రూ.చూ. తుడుచు. స.క్రి. **1**. రాచు, రాచిపోగొట్టు. భోజ. 5.149; **2**. ఊడ్చు, ఊడ్చిపోగొట్టు; **3**. ఒత్తివేయు, ఒత్తిపోగొట్టు; **4**. క్షాళనం చేయు, కడిగిపోగొట్టు; **5**. నిమురు, తడుము; **6**. పోగొట్టు, మాన్పు; **7**. చంపు.

**తుడ్డుమంగ** వి. ఎర్రబిక్కచెట్టు (Gardenia Turgida).

**తుడ్పు** రూ.చూ. తుడుపు[1]. విణ. తుడిచేది, తుడిచివేసేది; వి. **1**. తుడవటం, తోమటం, మార్జనం; **2**. కొట్టివేసినరాత.

**తుంట**[1]. చూ. తునియు. రూ. తుంటా, తుండ[1], తూంట[1]. వి. **1**. తునక, ఖండం, ముక్క. ఆము. 6.58; **2**. ఇక్షువు, చెరకు. సారంగ. 2.38, వసు. 3.174.; (Saccharum Officinarum). **3**. గడ్డిపిరి, నిప్పునిలవ చేయటానికి పట్టిగడ్డితో లావుగాను, పొడవుగాను చుట్టిన వెంటి; **4**. మట్టినిమెత్తగా నలగొట్టడానికి మట్టిపాత్రలను దట్టించ డానికి కుమ్మర్లు వాడేసాధనం; **5**. కట్టుబడిలో పనికిరాని చిన్నరాతిముక్క; **6**. దొంగగొడ్డుమెడకు వేలాడ గట్టే బరువుకొయ్య.

క. తుండు. ముక్క; కొడ. తుండి. ముక్క; తు. తుండు, సుండు; త. తుంటమ్. ముక్క. భాగం; తుంటు. ముక్క; మ. తుంటుమ్; కో. తుండ్; తొ. తుడ్; పర్జి. టున్డ.

పో. చూ. త. తుణి-. ముక్కచేయబడిన, చీల్చబడిన, చీల్చు.

**తుంటకొయ్య** వి. నేతమోకు చుట్టే పళ్ళచక్రం కొయ్యకు పైనఅమర్చిన చెక్క. **తుంటదూలం** వి. గోడమీదనుంచి దూలంమీదికి వేసేమరో చిన్నదూలం. **తుంటవింటిదొర** వి ఇక్షుధన్వుడు, మన్మథుడు. రాజవా. 3.132. **తుంట వింటివాఁడు** విణ. ఇక్షుధన్వుడు, మన్మథుడు. వేమన. 2.117. **తుంటవిలుకాఁడు** రూ. చూ. తూంటవిలుకాఁడు. వి. ఇక్షు ధన్వుడు, మన్మథుడు. ఆం. నా. సం. దేవ. **14**. **తుంటవిలుతుఁడు** రూ. చూ. తుంటవిల్తుఁడు. వి. ఇక్షు ధన్వుడు, మన్మథుడు. ఉ. రా. 3.423. **తుంటవిల్కాఁడు** రూ.చూ. తూంటవిలుకాఁడు. వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. బిల్హ. 1.94. **తుంటవిల్తుఁడు** రూ. తుంటవిలుతుఁడు. వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. యయా. **4.41**.

**తుంట**[2] రూ. తూంట[2], తూఁడ, తొట్ట[2]. విణ. **1**. తుంటరి, దుష్టుడైన. భాగ. 10 పూ. 360; **2**. దుష్టమైన; **3**. తుచ్ఛుడైన; **4**. తుచ్ఛురాలైన.

క. తుంటు. దుర్మార్గం, తుంట. దుర్మార్గుడైన. తుంటి. దుష్టురాలు, తుండు. అల్లరి; తు. తుంట. దుష్టమైన; తుంటు, తుంటిది. దుష్టురాలు; త. తుంటన్. హంతకుడు; మ. తుంటన్;

సం. దుష్ట-. దుర్మార్గుడు; ప్రా. దుట్ఠ-.

**తుంటతనము** వి. **1**. దుష్టత్వం; **2**. అల్లరి. క. తుంటతన, తుండుతన. దుర్మార్గం; తు. తుంటుతన. దుర్మార్గం. **తుంటరి** రూ.చూ. తూంటరి. వి. **1**. దుష్టుడు. పి.శకు. 2.27 : **2**. తుచ్ఛుడు. గౌ.హరి.ఉ. 1498 పం.; **3**. తుచ్ఛురాలు; **4**. తుచ్ఛమైనది; **5**. పేలుడు మందును మూటగట్టే గుడ్డ. < తుంట[2] + -అరి[4]. **తుంటరి తనము** వి. ఒడుపరితనం. క. తుంటుతన, తుండుతన. దుర్మార్గం; తు. తుంటుతన. దుర్మార్గం.

**తుంటకూర** రూ.చూ. తుంటికూర. వి. ఒకవిధమైన కూరాకు. విప్ర. 4.275.

**తుంటా** రూ.చూ. తుంట[1]. వి. రాట్నం బొమ్మ చెవులకు దూర్చిన ఇనపపుల్ల.

**తుంటి** వి. నితంబం, పిర్ర. మను. 4.17.

క. తొడె. పిర్ర; కొడ. తొడె; తు. తుడె; త. తుడై, తొడై; మ. తుట; తొ. త్వడ్; కువి. తున్తు; కొలా. దుట్.

**తుంటికూర** రూ. తుంటకూర, తుండికూర, తూంటికూర, తూండికూర. వి. నీటిపట్టుల్లో కాడలుగా పాకే ఒక కూరాకు. విష్ణుపు. 4.275 (Ipomaea Acquatica).

త. తుటుప్పాక్కిరై.

**తుంటె** రూ. తుంటెము. వి. పంచ దించటానికి వీలుగా గోడలోకి దన్ను పెట్టిన కొయ్య వాసం.

**తుంటెము** రూ.చూ. తుంటె. వి. కురచ.

**తుండ**[1] రూ.చూ. తుంట[1]. వి. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య.

**తుండ**[2] చూ. తుట్ట[2]. వి. కుప్ప, గుట్ట.

**తుండము** రూ. తుండియ, తుండు, తుండె, తుండెము. వి. ఖండం, తునక, ముక్క. భార.ద్రోణ. 2.68.

క. తుండు. ముక్క; కొడ. తుండి. ముక్క; తు. తుండు, సుండు; త. తుంటమ్; మ. తుంటమ్,

తుంటిక్క ; కో. తుండ్ ; తొ. తుడ్ ; పర్జి. టున్డ.
పో.చూ. త. తుణి. ముక్క.

**తుండి** వి. రాతి స్తంభంలోని ఒంటికూచం.
క. తుండు. ముక్క ; త. తుంటు. ముక్క, భాగం, తుంటి. వేరుచేయు.
**తుండిపట్టి** వి. తుండిబల్ల మీదుగా కప్పుమీద వేసే పట్టి. **తుండిబల్ల** వి. పెంకు కింది చూరుకు బిగించే చెక్క.

**తుండికూర** రూ.చూ. తుంటికూర. వి. చెరువుల్లోనూ బురద నేలల్లోనూ నీటిమీద తేలుతూ పెరిగే కూరాకు మొక్క (Ipomaea Acquatica).

**తుండించు** చూ. తుండు.

**తుండియ** రూ.చూ. తుండము. వి. ముక్క, తునక. ఆం.భా. 1.79.

**తుండు** రూ.చూ. తుండము. వి. **1**. దారుఖండం, లావైన మాను తునక. పాండు. 5.245 ; **2**. ఖండం, ముక్క, తునక. ఆం.భా. 1.79 ; **3**. కమ్మరి సాధనం ; **4**. కొయ్యముక్క, దూది ఏకేటప్పుడు కమాను నరం కొట్టే కొయ్య బడిత, మడిలో గడ్డ నలగటానికి తోలే కొయ్య మొద్దు ; **5**. చుట్టూ కట్టిన పొట్టిగోడ ; **6**. గునపంలోని పదునులేని కొన ; **7**. తడి తుడుచుకొనే చిన్న గుడ్డ, తువాలు ; **8**. లావైనవాడు.
**తుండించు** స.క్రి. ఖండించు, నరుకు. ఉ.హరి. 6.129. క. తుండిసు. ముక్కలుచేయు ; కొడ. తుండ్- (తుండి-). ముక్కలుచేయు, తెంపు, చించు ; త. తుండీ (-ప్ప్-, -త్త్-). ఖండించు, చించు. **తుండుకోల** వి. చెట్లు గీసే గీతకార్మికులు కత్తి నూరటానికి వాడే రెండు మూర్ల గట్టికట్టె. **తుండుగుడ్డ** వి. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరి బుజంమీద వేసుకోటానికిగాని నేసిన బట్ట, తువాలు. **తుండుపట్టె** వి. పంచ పట్టిని, పైనున్న పంచ వాసాన్ని, కలిపి కట్టడానికి వాడే కొయ్యముక్క. **తుండుపడు** అ.క్రి. మోడులాగఅగు, మొండిఅగు. దశకు. 3.4. **తుండుబల్ల** వి. స్తంభాల మీద వేసే చెక్క. **తుండూతుపాకీయెగురగొట్టు** అ.క్రి. శాస్తిచేయు.

**తుండూతుపాకీయెగురగొట్టు** చూ. తుండు.

**తుండె** రూ.చూ. తుండము. వి. ముక్క, తునక. ఆం.భా. 1.79.

**తుండెము** రూ.చూ. తుండము. వి. ఖండం, ముక్క, తునక. విక్ర. 6.79.

**తుండేటిపట్టి** చూ. తుండు. వి. చూరుపట్టి.

**తుండేటిబల్ల** చూ. తుండు. వి. పెంకుటింటి చూరు కింద వేసిన వెడల్పాటి పట్టి.

**తుతార** రూ.చూ. తుతారా. వి. ఒకరకం ఊదే వాద్యం.

**తుతారా** రూ. తుతార. వి. ఒకరకం ఊదేవాద్యం. వసువ్యా. 2.36.
హిం.ఉ. దుతారా. వాద్యవిశేషం ; పో.చూ. మరా. తుతారీ ;
క. తుతూరి, తుత్తారి, తుత్తూరి. వాద్యవిశేషం ; తు. తుత్తారి, తుత్తూరి ; త. తుత్తారి ; మ. తుత్తారి.
< ఉ. దుతారా.

**తుతినాగము** రూ.చూ. తుత్తినాగము. వి. లోహవిశేషం.

**తుతె** వి. తంతి. ఆం.పదా.నర. 44.
త. తుతమ్. చలనం, కదలిక ;
సం. ధుత. మీటబడినది.

**తుత్తనాగము** రూ.చూ. తుత్తినాగము. వి. తుత్తం, లోహం.

**తుత్తము** రూ. తుత్తరము. వి. మైలతుత్తం, నీలిరంగుగల ఒకవిధమైన తామ్రక్షారం.
సం. తుత్థ-, తుత్థక-. మయిలుతుత్తం ;
క. తుత్త, తుత్తు, తుత్తె. మయిలుతుత్తం ; త. తుత్తమ్ ; మ. తుత్తమ్.
<సం. తుత్థ-.

**తుత్తర** వి. తీవ్రమైన ఆసక్తి.

**తుత్తరము** రూ.చూ. తుత్తము. వి. పాలతుత్తం, మైలతుత్తం.

**తుత్తి** రూ.చూ. తుత్తిరి. వి. కంగునీపత్రం, నూగుబెండ (Sida Populifoliis).

**తుత్తినాగము** రూ. తుతినాగము, తుత్తనాగము. వి. లోహవిశేషం.

**తుత్తిరాకు** చూ. తుత్తిరి.

**తుత్తిరి** రూ. తుత్తి, తుత్తురు[1]. వి. కంగునీపత్రం, నూగుబెండ. హంస. 4.10 (Sida Populifoliis).
క.త.మ. తుత్తి. ఒకరకం బెండ.
**తుత్తిరాకు** వి. నూగుబెండచెట్టాకు. <తుత్తిరి + ఆకు.
**తుత్తిరిబెల్లపాకు** వి. ఒకరకం తుత్తిరిచెట్టు.

**తుత్తునియలగు** చూ. తుత్తునియలు.

**తుత్తునియలు** చూ. తునియ. రూ. తుత్తెనెలు. వి.బ.వ. చిన్న చిన్న ముక్కలు, అత్యల్పఖండాలు. భార.విరా. 5.35.
క. తుణక, తుణుకు, తుండు, తున్తుఋ. చల్లు, ముక్క ; త. తుణి, తుణిక్కై, తుండు, తుణ్డై. ముక్క,
<*తున్ + తునియ + -లు.
**తుత్తునియలగు** అ.క్రి. ముక్కలగు. <తుత్తునియలు + అగు. **తుత్తునియలుసేయు(-చేయు)** స.క్రి. ముక్కముక్కలుగా చేయు. పారి. 3.34.

**తుత్తునుకలగు** చూ. తుత్తునుకలు.

**తుత్తునుకలు** రూ. తుత్తున్కలు, తుందునుకలు, తుందున్కలు. వి.బ.వ. మిక్కిలి చిన్నముక్కలు, అత్యల్పఖండాలు. పండి. చ. 2.109 పు.
క. తుణక, తుణకు, తుణ్ణు, తున్తుఙ్, తున్తుఋ. చల్లు, బిందువు ; త. తుణి, తుణిక్కై, తుండు, తుణ్డై. ముక్క.
<*తున్ + తున్క + -లు.
**తుత్తునుకలగు** అ.క్రి. ముక్కలగు. <తుత్తునుక + -లు + అగు. **తుత్తునుకలుచేయు** స.క్రి. ముక్కలుముక్కలు చేయు.

**తుత్తునెలు** రూ.చూ. తుత్తునియలు. వి.బ.వ. చిన్నచిన్న ముక్కలు. రంగా.చ. 3.200.

**తుత్తున్కలు** చూ. తునుక. రూ.చూ. తుత్తునుకలు. వి.బ.వ. చిన్నచిన్న ముక్కలు, అత్యల్ప ఖండాలు. బసవ.

4.546 పం.

**తుత్తుమురగు** చూ. తుత్తుమురు.

**తుత్తుమురాడు** చూ. తుత్తుమురు.

**తుత్తుమురు** చూ. తుమురు. వి. చిన్నచిన్న ముక్కలు, మిక్కిలి పొడి. భార.భీష్మ. 1.267.

క. తుణక. తుణకు, తుండు, తున్తుళ్, తున్తుఋ, చల్లు, బిందువు; త. తుణి, తుణిక్కై. ముక్క, తుండు, తుణై. ముక్కలగు.

<*తున్ + తుమురు.

**తుత్తుమురగు** అ.క్రి. పొడిపొడి అగు. రాజ.చ. 2.39. <తుత్తుమురు + అగు. **తుత్తుమురాడు** స.క్రి. తుత్తుమురు చేయు, మిక్కిలి నలిచేయు, పొడిచేయు. రాజ.చ. 2.39. <తుత్తుమురు + ఆడు. **తుత్తుమురుచేయు** స.క్రి. పిండిపిండి చేయు. కళా. 6.18. **తుత్తుమురైవిరుగు** అ.క్రి. పిండిపిండిగా అగు. తాళ్ల. సం.; సంపు. 10.21.

**తుత్తుమురైవిరుగు** చూ. తుత్తుమురు.

**తుత్తురు**[1] రూ.చూ. తుత్తిరి. వి. కంగునీ పత్రం, నూగుబెండ.

**తుత్తురు**[2] రూ. తుత్తెర. వి. ఒకరకం కలుపుమొక్క.

**తుత్తురుబెండ** రూ. తూతురిబెండ. వి. తుత్తిచెట్టు (Sida Cordifolia).

త. తుత్తి. ఒకరకం బెండ.

**తుత్తుఋగొను(-కొను)** అ.క్రి. 1. కలవరపడు, వికలమగు. కు.సం. 2.36; 2. కలుషితమగు.

**తుత్తూరుచెట్టు** వి. ఆకులు పట్టుపురుగులకు ఆహారంగా పనికివచ్చే ఒకరకం చెట్టు.

**తుత్తెర** రూ.చూ. తుత్తురు[2]. వి. ఒకరకం కలుపుమొక్క.

**తుథూ** వి. ఉమియటంలో అయ్యేధ్వనికి అనుకరణం. ఉ.హరి. 2.124.

**తుద**[1] రూ.చూ. తుది. వి. 1. అగ్రం, కొన, చివర. కు.సం. 5.139; 2. వినాశం, చేటు; 3. మోక్షం; విణ. చివరి, కడపటిదయిన. శృం.నై. 8.25; అవ్య.ద్రు. అనంతరం, తరవాత.

**తుదకు** అవ్య.ద్రు. వరకు, దాక. వేంక. పంచ. 4.534. **తుదకులమునేర్పరి** వి. కాలి పుట్టువు, శూద్రుడు. సాంబ. మాన. 3. **తుదకువచ్చు** అ.క్రి. అంచుకట్టుకొని వచ్చు. ప్రభా. 1.117. **తుదకెక్కు** అ.క్రి. గట్టెక్కు. తాళ్ల.సం. 7.285. <తుద + -కున్ + ఎక్కు. **తుదగట్టు** వి. అస్తాచలం, అస్త్రాద్రి. లక్ష్మీ వి. 4.118. **తుదచేరు** అ.క్రి. కొనసాగు, నెరవేరు. ఉ.హరి. 4.294. **తుదమీఱు** అ.క్రి. అతిశయించు, అధికమగు. రం.రా.బాల. 34 పు. 5 పం. **తుదముట్టు** రూ.చూ. తుదిముట్టు. అ.క్రి. 1. మోక్షమొందు. భాగ. 3.85; 2. ముగియు. కళా. 5.39; 3. పోవు, గతించు.హంస. 4.81.

**తుద**[2] వి. తెల్ల ఉలిమెర. ఇంధనంగా ఉపయోగపడే ఒక చెట్టు (Diospyros Chloroxylon).

**తుది** రూ. తుద[1], సుత, సుద. వి. 1. కొన, చివర, అగ్రం. భార.ఆది. 6.157; 2. మరణం. కు.సం. 4.62; 3. వినాశం, చేటు. భార.శాంతి. 4.45; విణ. 1. చివరి, కడపటి, అంత్యం. భార.విరా. 1.301; 2. సర్వోత్కృష్ట మైన, అగ్రగణ్యమైన. భార.అను. 3.19.

క. తుది. చివర; తు. తుది; త. తుతి. బిందువు, వాడిఐన అంచు.

**తుదిచీటి** వి. సంబంధం వదులుకొను రాసి ఇచ్చిన ఆఖరిపత్రం. ఉ.రా. 6.302. **తుదికాఁడు** అ.క్రి. 1. ప్రసిద్ధమగు, పరగు. కు.సం. 10.190; 2. సిద్ధించు, నెరవేరు. భార.ఉద్యో. 3.67. **తుదిదిక్కుబెంకి** వి. ఈశానుడు. **తుదినాలుకముల్లు** వి. నాలుక చివర చాల మృదువుగా ఉంటుంది. దానిలో విరిగిన ముల్లు చాలా బాధ కలిగిస్తుంది. అట్లే బాధాకరుడు, భయంకరుడు అని అర్థం. పండి.చ. 1. వాద. 511. **తుదిపక్షము** వి. ఏవో రెండు మార్గాలు చెప్పి అందులో ఆఖరుది అనేటప్పుడు ఉపయో గించే పలుకుబడి. ప్రభా. 3.103. **తుదిపదము** వి. చివరిపదం. తాళ్ల.సం. 6.10 వ రేకు. **తుదిముట్టసునికి (-ఉనికి)** వి. చిరకాలం ఉండటం. హరి.ఉ. 2.97. **తుదిముట్టు** రూ. తుదముట్టు. అ.క్రి. 1. ముగియు, సంపూర్ణమగు. భార.విరా. 1.7; 2. నెరవేరు, సిద్ధించు, కొనసాగు. భార.విరా. 2.234; 3. అయిపోవు, వ్యయ మగు. భార. మౌసల. 1.147; 4. దృఢమగు, రూఢమగు. కేయూ. 3.286; 5. పోవు, గతించు, చచ్చు. అధ్యా.రా. కిష్కిం. 105 పు. 16 పం.; 6. కడచు, కడచను. **తుదిమొదలు** వి. సంపూర్ణం. శుక. 3.381. **తుదిఁబొందు (-పొందు)** అ.క్రి. చనిపోవు. భాస్క.రా. బాల. 453. **తుదిరేయి** వి. 1. కల్పాంతం, కాళరాత్రి, సంహార రాత్రి; 2. చివరి రాత్రి. **తుదివాఁడు** విణ. చివరివాడు. భార.అను. 2.235. **తుదివోవు(-పోవు)** స.క్రి. పూర్తిచేయు, నెరవేర్చు. భార.ఉద్యో. 1.330; అ.క్రి. అంతమగు, పోవు, గతించు.

**తుద్ద** వి. లోలగుచెట్టు, ఎర్రని కర్ర కలిగిన అందమైన చెట్టు (Pterospermum Suberifolium).

**తుద్దపొన్న** రూ. తుద్దుపొన్న. వి. గృహాది నిర్మాణాలకూ వంటచెరకుగానూ ఉపయోగపడే ఒకరకం చెట్టు (Bruguiera Gymnorhiza).

**తుద్దుపొన్న** రూ.చూ. తుద్దపొన్న. వి. ఒకరకం చెట్టు.

**తునక** రూ.చూ. తునుక. వి. ముక్క. భీమ. 4.130.

**తునకలు** వి.బ.వ మాంసం కూర.

**తునకాల** రూ.చూ. తునికోల. వి. దూది తూచే ఒకరకం తక్కెడకట్టె.

**తునకాలు** రూ.చూ. తునికోల. వి. ఒకవైపు పళ్ళెంగల త్రాసు.

**తునకోల** రూ.చూ. తునికోల. వి. ఒకవైపు పళ్ళెంగల త్రాసు.

**తునాతునకలు** వి.బ.వ. ముక్కలుముక్కలు.

**తుని** వి. వెలుతురు కోసం గోడలో వదలిన గుండ్రటి రంధ్రం.

**తునికాకు** చూ. తునికి.

**తునికి** రూ.చూ. తుమికి. వి. ముప్పైనుంచి నలభై అడుగులు దాకా అడవుల్లో పెరిగే చెట్టు (Coramandel Ebony, Diospyros Melamxylon).

**తునికాకు** రూ.చూ. తుమికాకు. వి. ఆముపైన కప్పు డానికి, ఆముపడుగులో పరచడానికి వాడే తుమికి చెట్టు

ఆకు. <తునికి + ఆకు. **తునిక్కొమ్మ** వి. ఒకరకం కలుపు మొక్క. <తునికి + కొమ్మ.

**తునికోల** రూ. తునకాల, తునకాలు, తునకోల, తున్నాకలు, తూనుకోల. వి. తూచేకోల, తులాదండం. రామాభ్యు. 8.122.

**తునికోలదుడ్డు** వి. గమళ్ళవాడు కత్తినూరుకోడానికీ, కల్లుబుడ్డి తగిలించుకొని పోవడానికి ఉపయోగించే తునికోల వంటి దుడ్డుకర్ర.

**తునిక్కొమ్మ** చూ. తునికి.

**తునితగవు** వి. తగవును మధ్యవర్తిగా ఉండి పరిష్కరించటం. తూర్పు గోదావరి జిల్లాలోని 'తుని'కి ఈ పదబంధానికి సంబంధం ఉంది. దీనిపై అనేక గాథలు కూడా ఉన్నాయి.

**తునిమించు** చూ. తునుము.

**తునిమితూ(టాడు** చూ. తునుము.

**తునియ** రూ. తునీ, తునె. వి. **1**. ఖండం, తునక, ముక్క. కు.సం. 11.40. భార.ఉద్యో. 2.272 ; **2**. నిప్పు మొ॥వాటి కణం.

క. తుణక, తుణకు, తుణుకు, తుళకు. ముక్క ; త. తుణిక్కై, తునియల్, తుణుక్కు, తుణుక్కై, తుణివు. చిన్నముక్క. ముక్క ; మ. తుణి. ముక్క ; నా. తున్కె ; పో.చూ.త. తుంటుమ్. ముక్క.

**తునియపెంట** వి. పెంటతుక్కుతో నిండినది. భార. సౌప్తి. 1.228.

**తునియించు** చూ. తునియు.

**తునియు** అ.క్రి. **1**. భిన్నమగు, తెగు, ఖండితమగు. భార. ఆది.7.256 ; **2**. చినుగు, ఛిన్నమగు. ఉ.హరి. 4.79 ; **3**. చెడు, వికలమగు. ద్వి.భార.విరా. 2.45 పు. ; **4**. విడుగు. ఘటికా. 2.16 ; **5**. నశించు. జాహ్న. 2.179.

క. తుణ్టిసు. ముక్కలగు ; త. తుణి (-వ్-, -న్ఱ్-). చించు ; మ. తుణియుక. తగ్గించు, నిర్ణయించు ; పో. చూ. త. తుంటుమ్.

<మూ.ద్రా. *తుణ్.

**తునియించు** స.క్రి. తుంచు, విరుచు. చంపూరా. 3.85. **తునిసిపడు** అ.క్రి. చెడు, భగ్నమగు. హరి.పూ. 8.52, భార.విరా. 5.50 **తునిసిపాఱు** స.క్రి. తునకలగు, పాడగు. భాగ. 3.638.

**తునిసిపడు** చూ. తునియు.

**తునిసిపాఱు** చూ. తునియు.

**తునీ** రూ.చూ. తునియ. వి. ఉప్పుగల్లీ.

**తునుక** చూ. తునియు. రూ. గునక, తున్క. వి. ఖండం, ముక్క. హరి.ఉ. 10.174, నిర్వ.రా. 5.85, భార.సౌప్తి. 1.177.

క. తుణక, తుణకు, తుణుకు, తుళకు. ముక్క ; త. తుణిక్కై, తునియల్, తుణుక్కు, తుణుక్కై. ముక్క ; మ. తుణి ; నా. తున్కె. సగభాగం ; పో. చూ.త. తుంటుమ్. ముక్క.

**తును(గు** అ.క్రి. **1**. విరుగు. రాజ.చ. 2.181 ; **2**. చచ్చు, మరణించు. మొల్ల.రా.సుందర. 159 ; **3**. తెగు, ఖండితమగు.అచ్చ.రా.ఆరణ్య. 109.

క. తుణకు, తుణుకు. ముక్క ; త. తుణి (తుణివ్-, తుణిన్ఱ్-). ముక్కఅగు, (తుణిప్ప్-, తుణిత్త్-). ముక్కచేయు ; మ. తుణియుక. తగ్గించు ; కురు. తొక్ఖ్-, తోంఖ్- (తుంఖ్-, తోంఖ్). చెట్లనుండి ఆకు మొ॥వాటిని కోయు ; మాల్తో. తొక్. కోయు, తొ్క్. ఖండితమగు.

**తునుచు** రూ. తున్చు. స.క్రి. **1**. ముక్కలుచేయు, చించు. యయా. 2.84 ; **2**. పగులగొట్టు, నాశనంచేయు ; **3**. ఖండించు ; **4**. చంపు.

త. తుణి. చించు ; మ. తుణియుక. తగ్గించు ; కురు. తొక్ఖ్-, తొంఖ్- (తుంఖ్-, తోంఖ్). చెట్లనుండి ఆకు మొ॥వాటిని కోయు ; మాల్తో. తొక్. కోయు, తొ్కి. ఖండితమగు.

**తునుమాడు** చూ. తునుము.

**తునుము** రూ. తున్మ. స.క్రి. **1**. చంపు, నశింపజేయు. భార. ఆది. 1.47 ; **2**. ఖండించు, నరుకు, తెంచు. భార. ఆది. 5.243. భార.భీష్మ. 2.179 ; **3**. పోగొట్టు. భాస్క. రా. 6.164 ; **4**. చిదుము, కోయు. వసు. 5.30 ; **5**. చించు, చీల్చు. అచ్చ.రా.యు. 70 ; **6**. పొల్లుచేయు, వ్యర్థం చేయు.

క. తుణ్డిసు. ముక్కలగు ; త. తుణి (తుణివ్-, తుణిన్ఱ్), (తుణిప్ప్-, తుణిత్త్-). చించు ; మ. తునియుక. తగ్గించు, నిర్ణయించు ; పో.చూ.త. తుంటమ్.

<మూ.ద్రా. *తుణ్-.

**తునిమించు** స.క్రి. **1**. నరికించు, ఖండింపచేయు. భార. ఆది. 4.268 ; **2**. చంపించు. రామాభ్యు. 8.100. **తునిమితూ(టాడు** చూ.చూ. తున్మితూ(టాడు. స.క్రి. **1**. తుంచి ముక్కలుచేయు, నిర్మూలించు ; **2**. చంపు ; **3**. హరింపజేయు, పోగొట్టు. **తునుమాడు** రూ.చూ, తున్మాడు. స.క్రి. **1**. తుంచు, ఖండించు. భార భీష్మ. 2.53 ; **2**. చంపు. భాస్క.రా.ఆరణ్య. 1.214 ; **3**. ధ్వంసంచేయు. రుక్మా. 5 31. <తునుము + ఆడు.

**తునె** రూ.చూ. తునియ. వి. **1**. నిప్పు మొ॥వాటి కణం. ద్వి.సార.చ. 29 పు. 27 పం. ; **2**. ఖండం, ముక్క, తునక.

**తున్క** రూ.చూ. తునుక. వి. ఖండం, ముక్క. ఉ.రా. 2.44.

**తున్నాకలు** రూ.చూ. తునికోల. వి. దూది తూచే ఒకరకం తక్కెడ కట్టె.

**తున్కి** రూ.చూ. తుమికి. వి. ముప్ఫైనుంచి నలభై అడుగుల దాకా అడవుల్లో పెరిగే చెట్టు (Coramandel Ebony, Diospyros Melanxylon).

**తున్చు** రూ.చూ. తునుచు. స.క్రి. తుంచు, ముక్కలుచేయు.

**తుంతుర్వని** వి. శీకరం, తుంపర, తుప్పర. కు.సం. 9.72.

క. తుంతుర్వాని. తుప్పర.

<క. తుంతుర్వని.

**తుందుడు** రూ.చూ. దుందుడుకు. వి. తొందరపాటు.

**తుందుడుగొను (-కొను)** అ.క్రి. త్వరపడు, తొందరపడు. ద్వి.పరమ. వి. 8.696.

**తుందుడుకార్చు** చూ. తుందుడుకు.

**తుందుడుకాఱు** చూ. తుందుడుకు.

**తుందుడుకు** రూ.చూ. దుందుడుకు. వి. **1**. మనోవ్యథ. కావ్యా.చూ. 3.62 ; **2**. కంపం, చలనం. మను. 1.5 ; **3**. సంతాపం. కాశ. 3.80 ; **4**. కలత, క్షోభం. సారంగ. 2.144 ; **5**. తొందరపాటు, ఆలోచించకుండా చేయటం. విజయ. 3.23 ; **6**. మోసం. ప్రబంధ. 772 ; **7**. తమి, ఉత్కంఠ, తహతహ. ఉ.హరిశ్చ. 4.153 ; **8**. అతిశయం, ఆధిక్యం. సాంబో. 1.129 ; విణ. తొందరపడి పనిచేసేవాడు, అనాలోచనశీలుడు. వేణుశ. 12.

**తుందుడుకార్చు** అ.క్రి. దౌర్జన్యంగానడచు. వర.రా. సుందర. 169.17. <తుందుడుకు + ఆర్చు. **తుందుడు కాఱు** అ.క్రి. పొగరుఅడగు. నిరంకు. 4.80.

**తుందునుకలు** రూ.చూ. తుత్తునుకలు. వి.బ.వ. మిక్కిలి చిన్నముక్కలు, అత్యల్పఖండాలు, చిన్నచిన్నతునకలు. కవిక. 2.197.

**తుందున్కలు** రూ.చూ. తుత్తునుకలు. వి.బ.వ. చిన్నచిన్న ముక్కలు, అత్యల్పఖండాలు.

**తున్మాడు** చూ.తున్ము.

**తున్మితూటాడు** చూ. తున్ము.

**తున్ము** రూ.చూ. తునుము. స.క్రి. **1**. చంపు, నశింపజేయు. భార. అరణ్య. 4.355 ; **2**. చిదుము, కోయు. వసు. 3.162 ; **3**. ఖండించు, నరుకు. తెంచు ; **4**. చించు. చీల్చు ; **5**. పోగొట్టు ; **6**. పొల్లుచేయు, వ్యర్థంచేయు.

**తున్మాడు** రూ. తునుమాడు. స.క్రి. **1**. తుంచు, ఖండించు. నిర్వ. రా. 4.88 : **2**. చంపు. <తున్ము + ఆడు. **తున్మితూటాడు** రూ. తునిమితూటాడు. స.క్రి. **1**. చీల్చిచెండాడు. భార. విరా. 3.133 ; **2**. హరింపజేయు, పోగొట్టు. కాశీ. 6.39 ; **3**. చంపు, నాశనం చేయు. జైమిని భా. 7.4 ; **4**. తుంచిముక్కలు చేయు. వసు. 3.169.

**తువర** రూ.చూ. తువ్వర. వి. చిన్నచిన్న చినుకులుగా కురిసే వాన మొ.

**తుపాకి** రూ. తుపాకీ. వి. **1**. మందుగుండు వేసి దట్టించి. కాల్చే ఇనప గొట్టంగల సాధన విశేషం. కళా. 7.75 ; **2**. బందూకు, ఒకవిధమైన ఆయుధ విశేషం.

హిం. తుఫక్కు, తుపక్, తోప్. తుపాకి ; ఉ. తుపక్, తోప్ ; తుర్కీ. తుపక్.

క. తు. తుపాకి. తుపాకి ; త. తుప్పాక్కి.

<ఉ. తుపక్.

**తుపాకిగుండు** వి. తుపాకిలో ఉపయోగించే గోళం. కృష్ణ. శ. 3.5. **తుపాకిత్రాడు** వి. జానకితాడు. రాధా. 2.41. **తుపాకిషంది** వి. తుపాకులతో యుద్ధంచేసే సైనిక సమూహం. చంద్రాంగ. 6.73. **తుపాకిమూఁక** వి. తుపాకులతో యుద్ధం చేసే సైనిక సమూహం. రాజ. వి. 5.15. **తుపాకిలొట్టివాడు** విణ. పగటి వేషగాడు.

**తుపాకీ** రూ.చూ. తుపాకి. వి. మందుగుండు వేసి దట్టించి కాల్చే ఇనపగొట్టం గల యుద్ధసాధన విశేషం. ప్రబంధ. 782.

**తుపాను** రూ.చూ. తుఫాను. వి. గాలివాన.

**తుపానుగాలి** వి. వర్షంతో పాటు వేగంగా వీచేగాలి.

**తుపారం** రూ.చూ. తువ్వర. వి. పలచగా పడే సన్న చినుకుల వాన.

**తుపాల** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యం నుంచి పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసేపద్ధతి.

**తుపాసి** రూ. దుబాసి, దుబాసీ. వి. **1**. రెండుభాషలు వచ్చిన వాడు, ఒకభాషను మరొక భాషలోకి మార్చే ఉద్యోగి. ప్రబంధ. 2.16 ; **2**. ప్రభువు. వేంక. అం. మాన. 32.

సం. ద్విభాషీ. రెండు భాషలు మాట్లాడగలవాడు ; హిం. దుబాసీ.

త. తుపాసి.

<హిం. దుబాసీ.

**తుపుక్కు** చూ. తుప్పు2. వి. ఉమియటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**తుప్ప** వి. **1**. చిన్న పొద, డొంక. భార. శాంతి. 5.470 ; **2**. గంట (దుబ్బు) కట్టినపైరు ; విణ. నిస్సారమైన, పొల్ల.

త. తుప్పమ్, పనికిమాలినది ; తొ. తొప్య. పొద ; కొం. దుప ; పర్జీ. తుప్ప ; కొలా. తుప్ప. పక్షిగూడు.

**తుప్పచెట్టు** వి. చిన్నపొదలా ఉన్నచెట్టు. **తుప్పతాలు** వి. కుచ్చితాలు. **తుప్పదూలు** అ.క్రి. **1**. మిక్కిలిచలించు. నవనాథ. 2.79 పు. 8పం : **2**. నిస్సారమై చలించు ; **3**. కంపించు, వణుకు ; **4**. కలగు, క్షుబ్ధమగు. **తుప్ప మిటుకుళ్ళు** వి.బ.వ. పెసలు మాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం. **తుప్పలుదూలఁగఁదోలు** స.క్రి. దొంగలదోలు, పార దోలు. భాస్క.రా.బాల. 39. **తుప్పలుదూలియుండు (తూలి యుండు)** అ.క్రి. కలగు, క్షుబ్ధమగు. భార. శాంతి. 5.470. **తుప్పలుదూలు (-తూలు)** అ.క్రి. **1**. కంపించు, వణుకు. కు.సం. 1.3 ; **2**. కలగు, క్షుబ్ధమగు. భార. శాంతి. 5.470 ; **3**. నిస్సారమై చలించు. భాస్క.రా.బాల. 32, నృసింహ 1.67. **తుప్పలుపట్టు** అ.క్రి. అడవులు పట్టిపోవు. సీలా. 3.28.

**తుప్పటమెఱుఁగుపెట్టు** స.క్రి. వరిపొట్టులాంటివాటితో రుద్ది మెరుగుపెట్టు.

**తుప్పటిల్లు** అ.క్రి. తనియు, తృప్తినొందు. మను. 2.11.

సం. తృప్. సంతృప్తినొందు.

**తుప్పడ** రూ.చూ. త్రుప్పుడు1. వి. తోలు.

**తుప్పడకొఱ్ఱ** రూ.చూ. తుప్పెడకొఱ్ఱ. వి. చామలమాదిరిగా ఉండే ఒకరకం ఆహారధాన్యం.

**తుప్పర** రూ.చూ. తువ్వర. వి. **1**. గాలిచేత చెదిరిపడే నీరు మొ. వాటిబొట్టు, శీకరం. కాశీ. 6.178 ; **2**. లాలాద్రవ బిందువు, చొల్లుబొట్టు.

**తుప్పలు** చూ. త్రుప్పుడు1. వి.బ.వ. వెంట్రుకలు.

**తుప్పిరి** రూ.చూ. తువ్వర. వి. పలచగా పడే సన్న చినుకుల వాన.

**తుప్పు¹** రూ. త్రుప్పు. వి. వాడుకలేని ఇనుముకు పట్టే మలిన పదార్థం. భార. కర్ణ. 2.25.

క. తుకు్క. తుప్పు ; తు. తుక్కు, త. తుకు్క, తుప్పు తురు, తురుచు, తురుచి. తప్పు, తుప్పు ; మ. తురుమ్పు, తురువు.

**తుప్పరగలతిట్టు** స.క్రి. చెడతిట్టు. **తుప్పుపట్టు (-పట్టు)** అ.క్రి. ఉపయోగించక మూలపడి ఉండు. భార. కర్ణ. 2.25.

**తుప్పు²**. వి. **1**. ఉమియటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. హరిశ్చ. 4.162 ; **2**. పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వేంక. పంచ. 2.202 ; అ.క్రి. ఉమ్మివేయు.

క. తూ. ఉమియు, తూంతిఖ, తూపు. ఉమియు ; కొడ. తుప్ప్ (తుప్పి-) ; త. తుప్పు (తుప్పి-), ఉమియటం, తుప్పల్. ఉమ్మి ; మ. తుప్పుక, ఉమియటం. తుప్పు, తప్పల్ ; తొ. తుఫీస్- (ఇద్). ఉమియు ; కుఇ. సూప (సూపి-). ఉమియు, ఉమ్మి ; కువి. హూపలి. ఉమియు, హూప్కి ఐయలి. హూప్కినై, హూప్కి. వాంతిచేసుకొను ; కురు. తుప్నా, తప్పల్ ఖో ; మాల్తో. తుపె, తుప్గ్లె, తుల్గ్పె.

< మూ. ద్రా. *తూ-.

**తుప్పున** అవ్య. క్రి. తుప్పుమనే శబ్దంతో.

**తుప్పు³** రూ.చూ. త్రుప్పుడు¹. వి. గొర్రెరోమం.

**తుప్పుడు¹** రూ.చూ. త్రుప్పుడు¹. వి. **1**. తిర్యగ్రోమం, పక్షి ఈక ; **2**. పక్షిఈకలు గొర్రెబొచ్చు సారెపెట్టెలో కలిపే పెండ్రుకలు ; **3**. నార మొ. వాటితుక్కు.

**తుప్పుడు²** రూ.చూ. త్రుప్పుడు². వి. ఇనుముకు పట్టిన మలిన పదార్థం.

**తుప్పర** రూ.చూ. తువ్వర. వి. పలచగా పడే సన్న చినుకుల వాన.

**తుప్పరు** రూ.చూ. తువ్వర. వి. **1**. చిన్న చిన్న బొట్లుగల జల్లు ; **2**. నీటిబొట్టు.

**తుప్పెడకొర్ర** రూ. తుప్పడకొర్ర. వి. చామలమాదిరిగా ఉండే ఒక రకం ఆహారధాన్యం.

**తుఫాను** రూ. తుపాను. వి. గాలివాన.

హిం. తుఫాన్. తూఫాను, ఆపద ; ఉ. తుఫాన్, కోలాహలం, కలవరం ; మరా. తుఫాన్ ; అర. తూఫాన్. గాలివాన, ఎక్కువ వానపడటం.

క. తుపాను. ఈదురుగాలితో కూడిన వాన ; ఉ. తూపాన్.

< ఉ. తుఫాన్.

**తుబికి** రూ.చూ. తుమికి. వి. తిందుకం, ఒకానొకచెట్టు, నల్లచేవ మాను.

**తుమారం** రూ.చూ. దమరము. వి. **1**. దుమ్ము, **2**. పెందూళి.

**తుమారు** రూ.చూ. తువ్వర. వి. పలచగాపడే సన్నచినుకుల వాన.

**తుమి** రూ.చూ. తుమికి. వి. ఒకరకంచెట్టు.

**తుమిక** రూ.చూ. తుమికి. వి. ఒకరకంచెట్టు.

**తుమికాకు** చూ. తుమికి.

**తుమికి** రూ. టూకి² తునికి, తున్కి, తుబికి, తుమి, తుమిక, తుమిద, తుమ్మికి, తుమ్మిద, తుమ్రి, తూగి, తొనికి, త్రుమ్మికి. వి. తిందుకం, ఒకానొకచెట్టు, నల్లచేవచెట్టు. హర. 1.15. (Diospyros Melanoxylon).

క. తుమకి, తుమరి, తుంబర, తుంబరి, తుంబురు, తూపరె, తూబరె. ఒకరకంచెట్టు ; త. తుమ్పి, తుమ్పిలి, తుమ్పై ; గోం. తుమ్రిమడా. తూమెర్, తుమ్రి. పర్జి. తుంబి ; కొలా. తుమ్కి ; నా. తుమ్కి.

పో.చూ.సం. తుంబురు, తుమ్బురీ, తుబరీ.

**తుమికాకు** రూ. తునికాకు. వి. ఆముపైన కప్పడానికి ఆముపడుగులో పరచటానికి వాడే తుమికిచెట్టుఆకు. < తుమికి + ఆకు.

**తుమిద** రూ.చూ. తుమికి. వి. నల్లచేవచెట్టు.

**తుము** రూ.చూ. తుంబు. వి. కొలమానం. ధరణికోటశాసనం. క్రీ.శ. 747 - 798.

**తుముడ్లు** చూ. తుంబు. వి.బ.వ. తూములు.

**తుమురగు** చూ. తుమురు².

**తుమురు¹** రూ.చూ. తువ్వర. వి. పలచగాపడే సన్నచినుకుల వాన.

**తుమురు²** వి. సూక్ష్మఖండం, నలి, పొడి, ధూళి. భార. విరా. 5.170.

త. తుమి (తుమిల్-, తుమిన్త్-), ఖండింపబడు, (తుమిత్త్-, తుమిత్త్-), ముక్కలగు.

**తుమురగు** అ.క్రి. ఖండితమగు, విరుగు. పండి.చ. 3.228. < తుమురు + అగు. **తుమురుసేయు(-చేయు)** స.క్రి. ధ్వంసంచేయు. రుక్మాం. 1.166.

**తుంప** రూ.చూ. త్రుంపు. వి. ముక్క, తునక.

**తుంపర** రూ.చూ. తువ్వర. వి. **1**. గాలిచేత చెదిరిపడే నీరు మొ. వాటి బొట్టు, శీకరం, తుషారం. ఉ.రా. 3.191 ; **2**. లాలాద్రవ బిందువు, చొల్లుబొట్టు. చంద్రరే. 1.55.

**తుంపిరి** రూ.చూ. తువ్వర. వి. పలచగాపడే సన్నచినుకుల వాన.

**తుంపిళ్లు** చూ. తువ్వర. వి.బ.వ. **1**. తూరవాన ; **2**. నృత్యాలు.

త. తొంటన్. నృత్యం.

**తుంపిళ్లగునియు** అ.క్రి. నృత్యంచేయు. అష్టమ. క. 1.26 పు. 15 పం.

**తుంపు¹** రూ.చూ. త్రుంపు. స.క్రి. తుంచు, తునుగేటట్లుచేయు ; వి. **1**. ఖండం, ముక్క ; **2**. తానులోనుంచి తుంచినగుడ్డ.

**తుంపు²** రూ.చూ. తంపి. వి. జగడం.

**తుంపురు** రూ.చూ. తువ్వర. వి. **1**. గాలిచేత చెదిరేనీరు మొ. వాటి బొట్టు, శీకరం, తుషారం. పల్నా. 85 ; **2**. లాలాద్రవ బిందువు, చొల్లు బొట్లు.

**తుంపెసలాడు** చూ. తుంపెసలు.

**తుంపెసలు** వి.బ.వ. బాలికా క్రీడా విశేషం. భోజసు. 2.9.

**తుంపెసలాడు** అ.క్రి. **1**. చలించు. పారి. 2.9. కవిరా.

2.43 ; **2**. నర్తించు, క్రీడించు, ఆడు. చంద్రాంగ. **4.36** ; **3**. ఒప్పు, ఇంపగు. కృ.శకు. 1.71. < తుంపెసలు + ఆడు.
**తుంపెసలుగునియు** అ.క్రి. **1**. చలించు. భాగ. 10ఉ. 681, 688 ; **2**. నర్తించు, ఆడు.

**తుంపాడి** వి. తుంపోడి అనే ఒకపక్షి, బూటిమారుపక్షి.

**తుంబ** వి. వడ్రంగంపనులకు పనికివచ్చే కలపనిచ్చే ఒకచెట్టు (Shorea Tumbaggaria).

**తుంబానప** వి. ఒకరకం సొరకాయ.

సం. తుంబ-. సొరకాయ.

< సం. తుంబ- + ఆనప.

**తుంబు** రూ. తుము, తూము[2], వి. **1**. ఒకకొలమానం, 2/5 ఎకరాలభూమి. లక్ష్మీపురం శాసనం. క్రీ.శ. 675 ; **2**. మూడుకుంచాలవడ్లు.

త. తూ"మ్, తూమ్బు. ఒకకొలమానం ; పర్జి. తూము, తుమ్‌బొత్త, తుమ్‌బుక్క.

**తుంబెత్త** వి. కత్తిలాగఉండే పెద్దరకం కాయలుకాసే తీగ (Canavalia Ensiformis).

**తుమ్మ** వి. ముళ్ళుకలిగిన ఒకానొకచెట్టు, అరిమేదం. నీలా. 2.76, ఆం.భా. 2.48. ఎ.ఇం. సంపు. 5. శా.సం. 10. క్రీ.శ. 1102.

క. తుమ్బమరన్. (Acacia Arabica, Acasia Fornesiana).

**తుమ్మకంప** వి. ఆముకాల్వకు వాడే తుమ్మచెట్లకంప. **తుమ్మకఱ్ఱ** వి. తుమ్మచెట్టుకఱ్ఱ. **తుమ్మకాయగొలుసులు** వి.బ.వ. తుమ్మకాయలవలె ఉండే స్త్రీల కాలిఆభరణ విశేషం. **తుమ్మకాయచ్చు** వి. పాత్రమీద తుమ్మకాయమాదిరి డిజైను కొట్టే అచ్చు. < తుమ్మకాయ + అచ్చు. **తుమ్మకాయంచుకుండ** వి. తుమ్మకాయలాగా అంచుతేర్చి చేసినట్టి వంట పాత్ర. < తుమ్మకాయ + అంచుకుండ. **తుమ్మకాయబిళ్లలు** వి.బ.వ. స్త్రీలు కాళ్ళకు పెట్టుకొనే మెట్టెలవంటి నగలు. **తుమ్మకాయరంగు** వి. నలుపుతో తెలుపుకలిసిన వన్నె. **తుమ్మగోది** వి. తుమ్మచెట్టు జిగురు. **తుమ్మచెక్క** వి. తుమ్మచెట్టు చెక్క. **తుమ్మపారక** వి. ఆముకాల్వకు వాడే తుమ్మచెట్లకంప.

**తుమ్మలం** చూ. తుమ్మి[2].

**తుమ్మి**[1] రూ. తుమ్మిక. వి. ద్రోణం, ఒకరకం కూరాకు. ఆము. **4.134**.

సం. తుంబీ, ద్రోణం, ఒకరకం కూరాకు ; ప్రా. తుంబీ ; పా. తుంబ ;

క. తుమ్బె, తుమ్బి ; తు. తుమ్బె, తుమ్బి ; త. తుమ్‌పై ; మ. తుమ్ప ; తొ. తిబ్.

< సం. తుంబీ.

**తుమ్మికూర** వి. ఒకదినుసు కూరాకు. H. IV. 165. **తుమ్మిపూరాజనాలు** వి.బ.వ. తుమ్మిపూవుల్లాగ తెల్లగాఉండే బియ్యంగలవడ్లు. హంస. **4.128**.

**తుమ్మి**[2] రూ. తుమ్ము[2]. వి. బంజర్లలో ఏటా పెరిగే తెల్లపూల కలుపుమొక్క. (Phlomis Esculenta, Seucar Aspera).

**తుమ్మలం** వి. ఒకరకం కలుపుమొక్క. < తుమ్మి + అలం.

**తుమ్మి**[3] వి. సొరతీగ.

< సం. తుంబీ. సొర ;

క. తుమ్బి, తుమ్బు ; త. తుమ్బి. సొరకాయ బుర్ర ; మ. తుమ్బమ్. పొడవాటి సొరకాయ.

< సం. తుంబీ.

**తుమ్మిక** రూ.చూ. తుమ్మి[1]. వి. ఒకరకం కూరాకు.

**తుమ్మికి** రూ.చూ. తుమికి. వి. తిందుకం. కాశ. 3.69.

**తుమ్మిద** రూ.చూ. తుమికి. వి. నల్లచేవమాను (Diospyros Melanoxuyon).

**తుమ్ము**[1] వి. **1**. క్షుతం. భార. విరా. 1.137 ; **2**. ముక్కులో బంతిలాగ గడ్డకట్టడం ; అ.క్రి. క్షుతంచేయు. రామలిం. శ.58.

కొడ. తిమ్మ్- (తిమ్మి-), తుమ్మ్- (తుమ్మి-). తుమ్ము ; తు. తుమ్బిలు. తుమ్మటం ; త. తుమ్ము (తుమ్మి-), తుమ్పు (తుమ్పి), తుమ్మటక, తుమ్ము, తుమ్మల్. తుమ్ము : మ. తుమ్మక, తుమ్పుక, తువెక్క. తుమ్ము, తుమెక్క. (పశువులు) తుమ్ము, తుమ్మల్. తుమ్మటం ; కో. తుబ్-(తుబ్య్-) ; తొ. తుబ్ తుబ్య్-) ; కొం. తుప్ ; కువి. తూహ్మతూమినై, తూము, తూహ్మ ; పర్జి. తుమ్ (తుమ్త్-). తుమ్ము ; నా. తుమ్. తుమ్ము ; గ. తుమ్-, తుమ్మ్ ; ఒల్లా. తుమ్ ; కురు. తుమ్నా (తుమ్నయస్), తుమ్- (తుమ్మ్య్, తుమ్య్-) ; మాల్తో. తుమె, తుమ్.

< మూ.ద.ద్రా. *తుమ్-.

**తుమ్ము**[2] రూ.చూ. తుమ్మి[2]. వి. బంజర్లలో ఏటా పెరిగే తెల్లపూల కలుపుమొక్క (Phlosmis Esdulenta).

**తుమ్మెద** వి. భృంగం, తేటి, పూలతేనె తాగే ఒకరకం ఝుంకారం చేస్తూ ఎగిరే నల్లని పురుగు.

క. తుమ్బి, తుమ్బె, దుమ్బి, దుమ్బె. తుమ్మెద ; కొడ. తుమ్బి ; తు. తుమ్బి ; త. తుమ్బి ; మ. తుమ్బి ; తొ. తుబ్య్ ; పర్జి. దుమ్ది ; కొలా. తిబ్ ; కురు. తుమ్బా, తుమ్బిల్ ; మాల్తో. తుమ్బె, తుమ్బెడరె.

**తుమ్మెదకంటు** వి. సంపెంగ. రామాభ్యు. 4.66. వ్యు. తుమ్మెదకు శత్రువు. **తుమ్మెదపదములు** వి.బ.వ. తుమ్మెదా, తుమ్మెదా అని పల్లవిగా చేసి పాడే పాటలు. పండి.చ. 3.513. **తుమ్మెదమామిడి** వి. కొండమామిడి, కోశామ్రం. **తుమ్మెదయల్లె (-అల్లె)** వి. మన్మథుని మొదటిది అయిన వింటి యొక్క నారి. వేంక. అం. 9. **తుమ్మెదరేపుళ్లు** వి.బ.వ. పూవులో అణగిఉన్న తుమ్మెదను రేపి దానికి దొరకకుండా పరుగెత్తుతూ బాలురు ఆడే ఆట. హంస. 3.146.

**తుమ్రి** రూ.చూ. తుమికి. వి. నల్లచేవమాను (D ospyros Melanoxylon).

**తురం** రూ.చూ. తరము[2]. వి. **1**. దున్నినప్పుడు మెదగని గడ్డలు ; **2**. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టలు.

**తురక** రూ.చూ. తురక్క. వి. మ్లేచ్ఛుడు, తురుష్కుడు. మను. 3.42. తురకదేశపువాడు, మహమ్మదీయుడు. ద.హిం.శా.

సంపు. 10. శా.సం. 748. క్రీ.శ. 1577.

**తురకకలబంద** వి. ఒకరకం కలబంద (Aloe Succotrina). **తురకంచు** వి. మహమ్మదీయులు వాడే పాత్రలకు పెట్టే బోడంచు. < తురక + అంచు³. **తురకగ్రుద్దు** వి. తురుష్కముష్టిప్రహారం. కువ.చ. 1.34. విణ. తురకవాని గుద్దువలె అమోఘమైన, వ్యర్థంకాని. **తురకచామంతి** వి. ఒకరకం బంతిపూవు. **తురకటిక** వి. అంచు లేకుండా సర్నిన అటిక. < తురక + అటిక. **తురకడేక్సా** వి. మూతి వెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర. **తురకదొగ్గలి** వి. ఒకజాతి దొగ్గలి, రక్తబాష్పం. **తురకపత్తి** వి. ఒకజాతి పత్తి. హంస. 4.10. **తురకపికిలి** వి. ఒకజాతి పికిలిపిట్ట. **తురకపురుగు** వి. మిరపచెట్లకు పట్టే నల్లటి కట్ల పురుగు. **తురకపువ్వు** వి. చిన్నపువ్వు, బంతిపువ్వు. **తురకపేర్పు** వి. పక్క పెట్టకుండా చేసిన పెద్ద మట్టి పాత్ర. **తురకబంతి** వి. ఒకజాతి బంతి. **తురకముంత** వి. కాళ్ళు, మొగం కడుక్కునేందుకు వాడే మట్టిపాత్ర. **తురకరాయి** రూ.చూ. తురకఱాయి. వి.బౌ. బొంతరాయి. **తురకఱాయి** రూ. తురకరాయి. వి.బౌ. బొంతరాయి. **తురకవేప** రూ.చూ. తురకవేము. వి. పెద్దపెద్ద ఆకులుండే ఒకరకం వేప. **తురకవేము** రూ. తురకవేప, తురుకవేప, తురుకువేప, తుర్కవేప. వి. తృణనింబం, పెద్ద ఆకులు, తెల్లపూలు కలిగిన ఒకరకం వేపచెట్టు. హంస. 4.11 (Cipadessafruticosa). **తురకసీడు** రూ.చూ. తుర్కసీడు. వి. దూదేకు సాహెబులు వడికి, ఆసుపోసి తెచ్చిన పడుగు నూలు. **తురకసురలు** విణ.బ.వ. మెట్టపల్లలో ఒక ముతకరకం. **తురకాణ్యపువారు** విణ.బ.వ. ముసల్మానులు. **తురకాణ్యము** వి. తురకజనం, తురక ప్రభుత్వం. < ఉ. తుర్క్ + ఆణ్యము. **తురకేసల** రూ. తెరకేసర. వి. మహమ్మదీయులు కూరకు వాడే మట్టి పాత్ర.

**తురకాణ్యపువారు** చూ. తురక.

**తురకాణ్యము** చూ. తురక.

**తురకేసల** చూ. తురక.

**తురగవల్లు** రూ.చూ. తురంగవల్లు. వి.బ.వ. వస్త్రవిశేషాలు. ప్రబంధ.272.

**తురంగవల్లు** రూ. తురగవల్లు. వి.బ.వ. వస్త్రవిశేషాలు. హంస. 5.355.

సం. తురంగావళి-. గుర్రాలగుంపు.

< సం. తురంగావళి- లేదా సం. తురంగ- + వడి + -లు.

**తురఁగలి** రూ.చూ. తుఱఁగలి. వి. ప్రకాశం. భీమ. 5.9.

**తురఁగలిగొను (-కొను)** రూ.చూ. తుఱఁగలిగొను. అ.క్రి. 1. ప్రకాశించు. మను. 3.42 ; 2. అతిశయించు.

**తురంజీలకమ్మి** వి. వంకాయ నమూనాలో డిజైన్లు నేసిన కమ్మి.

**తురా** రూ.చూ. తురాయి. వి. 1. మృదువైన విలువ కలిగిన పక్షి ఈకలతోను, రత్నాలతోనూ కూడిన శిరోభూషా విశేషం. దశా. 1.119 ; 2. స్త్రీల రత్న భూషా విశేషం, స్త్రీ శిరోభూషా విశేషం ; 3. నిలువు కాడపెట్టి కట్టిన పూబంతి.

**తురాణీ** వి. టర్కీదేశస్థుడు. రంగా.చ. 2.38.

హిం. తురానీ. టర్కీదేశస్థుడు ; ఉ.పార. తూరానీ.

< ఉ. తురానీ.

**తురాయి** రూ. తురా, తురాయీ. వి. 1. కర్ణావతంసం. రఘు. 7.106 ; 2. ఖడ్గపుపిడి కొనకు అలంకారంగా కట్టిన పూల గుత్తి. ప్రబంధ. 38 ; 3. వృక్షవిశేషం. హంస. 1.184 (Caesalpinia Pulcherrima) ; 4. మృదువైన విలువగల పక్షి ఈకలతోను రత్నాలతోనూ కూడిన శిరోభూషావిశేషం. ఉ.పరిశ్చ. 4 20 ; 5. బట్టలమీద నేసే కలంకారీ అద్దకం డిజైన్లలో ఒకరకం ; 6. పాము కరచిన వాళ్ళకు మంత్రగాడు గుడ్డపీలికలో బెల్లముక్క నుంచి మంత్రించి ముడివేసి, దానిని వాని దండకు కట్టిన తాడు ; 7. మొక్కజొన్న తలపైఉండే పీచుకు మూలమైన ఎన్ను.

హిం. తురాహ్ ; మరా. తురా. తలపాగకుచ్చు ; అర. తుర్రా ;

క. తురాయ, తురాయి. శిరోభూషణం ; త. తురాయి.

< మరా. తురా.

**తురాయికమ్మి** వి. తురాయి డిజైను నేసిన చీర కమ్మి.

**తురాయిస్తంభం** వి. నగిషీపనిచేసిన స్తంభం.

**తురాయీ** రూ.చూ. తురాయి. వి. ఖడ్గపుపిడికొనకి అలంకారంగా కట్టిన పూలగుత్తి. ప్రబంధ. 38.

**తురికి** రూ. తురికీ, తుర్కీ. వి. 1. తురుష్కదేశపు గుర్రం. భాస్క.రా.యు. 2271 ; 2. వాహనం. ప్రబంధ. 162 ; 3. గుర్రం. ఆం.భా. 2.196.

సం. తురుష్క. టర్కీదేశీయుడు ; హిం. తుర్క్. టర్కీభాష, టర్కీగుర్రం ; ఉ. తుర్క్. టర్కీదేశం.

< ఉ. టుర్కీ.

**తురికితువాలు** రూ.చూ. తురికితువ్వాలు. వి. దారపు కొలుకులు ఒత్తుగా పైకి తేలేట్టు గొర్రెబొచ్చు మాదిరిగా నేసిన తువ్వాలు. **తురికితువ్వాలు** రూ. టరికీతువ్వాలు, తురికితువాలు, తురికీతువ్వాలు. వి. దారపు కొలుకులు ఒత్తుగా పైకి తేలేట్లు, గొర్రెబొచ్చు మాదిరిగా నేసిన తువ్వాలు.

**తురికీ** రూ.చూ. తురికి. వి. 1. గుర్రం. పాండు. 1.163 ; 2. వాహనం. ఘటికా. 2.72 ; 3. తురుష్కదేశపుగుర్రం.

**తురికీతువ్వాలు** రూ.చూ. తురికితువ్వాలు. వి. దారపు కొలుకులు ఒత్తుగా పైకి తేలేటట్టు గొర్రెబొచ్చు మాదిరిగా నేసిన తువ్వాలు.

**తురితము** రూ.చూ. తుఱుతు. విణ. శీఘ్రంగా, వేగంగా, త్వరితం.

**తురితి** వి. ముళ్ళు కలిగి మారేడు ఆకులవంటి ఆకులుగల ఒక చెట్టు.

**తురితు** రూ.చూ. తుఱుతు. విణ. వేగంగా.

**తురిమిడిఆకు** వి. ఔషధానికి పనికి వచ్చే ఒక చెట్టు, రాజియాని.

**తురిమిలి** చూ. తురుము².

**తురీన** క్రి.విణ.ద్రు. 1. శీఘ్రంగా. యయా. 3,71 ; 2.

తటాలున, హఠాత్తుగా. కువ. చ. 2.143.

సం. త్వరిత-. వేగం, కల ; అ.మా. తురిఅ. తురియ. ; హిం. తురంత్. వెంటనే.

**తురక** రూ.చూ. తుర్క. వి. మ్లేచ్ఛుడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 748. క్రీ.శ. 1577.

**తురకవేప** రూ.చూ. తురకవేము. వి. ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలపనిచ్చే ఒక చెట్టు (Cipadessa bruticosa).

**తురుకువేప** రూ.చూ. తురకవేము. వి. ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలపనిచ్చే ఒక చెట్టు (Cipadessa bruticosa).

**తురుగు** స.క్రి. కుక్కు ; వి. కొబ్బరిని తురమటం.

క. తుఱుకు, తుఱుకు. కుక్కు, దోపు, దోపబడు ; తు. తుఱు(తుఱువ్-,తుఱ్త్-). మూయబడు, (తుఱుప్పు-. తుఱుత్). నోటిలో కుక్కుకొను ; మ. తుఱుక. గుమికూడు, తుఱు, తుఱుకు. పోగు ; కో. తుర్గ్(తుర్గ్య-). రంధ్రంలో దూరు, తుర్క్(తుర్క్య-). నోటిలో కుక్కుకొను ; పర్జీ. తుత్. అడ్డుపడు, తుతిప్- (తుతిత్-), తుయ్ప్-(తుయ్త్-); కొలా. తుర్క్ (తురుక్త్-). నిప్పులో కట్టెలు వేయు, తుర్స్-(తురుస్త్-). రంధ్రంగుండా తోయు ; కురు. తుబ్సా. అణచు, కుక్కు ; బ్రా. త్రుజ్జింగ్, కుక్కుకొను. పో.చూ. త. తూఱు ;

పో.చూ. సం. తురుష్ప-; మరా. తురుఁబ్.

**తురుజ** వి. ఒకజాతి కూరాకు, గండీరం.

త. తురుత్తు(తురుత్తి-). ఉబుకు, తురున్తు(తురున్తి-). పెద్దదగు ; మ. తుఱిక్క. పైకి వచ్చేటట్లు అదుము.

**తురుజేయు(-చేయు)** రూ. తురుపుజేయు స.క్రి. మొదలుపెట్టు.

**తురుంజు** వి. మాదీఫలం.

**తురుతు** రూ.చూ. తుఱుతు. విశే. త్వర.

**తురుతుతీర్పు** రూ.చూ. తుఱుతు తీర్పు. వి. ఆలోచించకుండా ఇచ్చిన తీర్పు.

**తురుత్తు** రూ.చూ. తుఱుతు. విశే. శీఘ్రం.

**తురుపు** రూ.చూ. తురుఫీ. వి. చీట్లాటలోని గెలుపురంగు (తుడుపు).

**తురుఫీ** రూ. తుడుపు[2], తురుపు, తురుపు. వి. 1. అశ్వదళం, గుర్రపుదండు. నిరంకు. 4.63 ; 2. చీట్లాటలోని గెలుపు రంగు.

హిం. తురుప్. పేకాటలో అందర్నీ గెలిచే నిశ్చితమైన రంగు ;

ఇం. *Trump*. పేకాటలో ఇతరమైన వాటికంటె ఉన్నతమయిన కార్డు.

<హిం. తురుప్.

**తురుపు** రూ.చూ. తురుఫీ. వి. 1. అశ్వదళం, గుర్రపుదండు ; 2. చీట్లాటలోని నాలుగురంగుల్లోను గెలుపుకోసం చెప్పే ఒకానొక రంగు.

**తురుము[1]** రూ.చూ. తుఱుము[1]. వి. పూలుపెట్టిన జుట్టు.

**తురుము[2]** రూ.చూ. తుఱుము[2]. స.క్రి. కోయు ; వి. కొబ్బరి మొ॥ వాటిని సన్నసన్నగా ముక్కలు చేసే విధానం.

**తురిమిలి** వి. తురుముపీట. **తురుముపీట** రూ.చూ. తుఱుముపీట. వి. తురుముకోవటానికి అనువుగా చివరను పండ్లేర్పరచిన వంకర ఇనపకమ్మి చెక్కిన పీట.

**తురుము[3]** వి. ఎక్కువగా వేగంతో వచ్చే కొండవాగు.

**తురుము[4]** వి. కాయపెండలం.

**తురులు** వి. వాద్యవిశేషం. శాళ్ల. 11.354.

**తురుపుజేయు(-చేయు)** రూ.చూ. తురుజేయు. స.క్రి. మొదలు పెట్టు.

**తుర్క** రూ. తురక, తురుక, తుఱుక. వి. మ్లేచ్ఛుడు, తురుష్కుడు. క్రీడా. 149.

సం. తురుష్క-. టర్కిదేశీయుడు ; హిం. తురక, తుర్క ; మరా. తుర్క. మ్లేచ్ఛుడు, తురుష్క జాతీయుడు ; ఉ. తుర్క్, తుర్కీ ; పార. తుర్క్. ఒక జాతి ; క. తురక ; త. తులుక్కన్.

<ఉ. తుర్క్.

**తుర్కవేప** రూ.చూ. తురకవేము. వి. ఇంధనంగా ఉపయోగపడే ఎర్రనికలపనిచ్చే ఒకచెట్టు. **తుర్కసీడు** రూ. తురకసీడు. వి. దూదేకు సాహెబులు వడికి, అనుపోసి తెచ్చిన పడుగునూలు.

**తుర్కీ** రూ.చూ. తురికి. వి. టర్కీదేశం నుంచి తెచ్చిన మేలుజాతి గుర్రం. పద్మ. యు. 7.

**తుర్చికట్ట** వి. పవిత్రమైన తులసి చెట్టు మధ్య ఉన్న అరుగు.

సం. తులసీ. హిందువులు పవిత్రంగా భావించే మొక్క.

క. తొళచి, తొళచె, తొళంచె, తొళసీ, తులసి ; కొడ. తొళసి ; తు. తులచి, తులసి, తుళసి, తొళచి ; త. తురాయ్, తుళచి, తుళవమ్, తుళవు ; మ. తుళసి ;

<సం. తులసీ+కట్ట.

**తుర్పు** రూ.చూ. తూఱ్పు. వి. తూర్పుదిక్కు. మాలెపాడు శాసనం. క్రీ.శ. 725.

**తుర్మ** రూ.చూ. తుఱుము[1]. వి. 1. స్త్రీ యొక్క కొప్పు ; 2. పురుషుని జుట్టుముడి ; స.క్రి. 1. తురుగు, కుక్కు. అదిమిపోవు ; 2. కొప్పులో పుష్పాదుల్ని పెట్టు ; 3. ముడుచు ; 4. సవరించు.

**తుర్రిగడ్డి** వి. మంచి పశుగ్రాసంగా ఉపయోగపడే ఒకరకం గడ్డి (Amphilophis Pertusa).

**తుర్రు** రూ.చూ. తుఱ్ఱు. వి. వేగిరపాటు, వేగం.

**తుర్రుమని** అవ్య. వేగంగా, వెంటనే. ధ్వన్యనుకరణం.

**తుర్వము** వి. తొ్రర. వేమ. 1.230.

క. తురి, తురువు. రంధ్రం చేయు ; త. తుర, తురవు. బొరియ.

**తుఱఁగలి** రూ. తురఁగలి. వి. 1. ప్రకాశం, కాంతి. భార. విరా. 1.294 ; 2. అతిశయం.

క. తుఱుగల్, తుఱుంగల్. గుంపు, దట్టమైన చెట్లు మొ.

**తుఱఁగలిగొను(-కొను)** రూ. తురఁగలిగొను అ.క్రి. 1. అతిశయించు, హెచ్చు. నిర్వ.రా. 6.45 ; 2. ప్రకాశించు.

భార. మౌసల. 169 ; **3.** అధికమగు. భీమ. **2.155** ; **4.** ఒప్పు. పద్మ. 9.284 ; **తుఱఁగలించు** అ. క్రి. **1.** ప్రకాశించు, మెరయు. కు.సం. 5.41 ; భార.భీష్మ. 2.155 ; **3.** ఒప్పు. ఆం.భా. 3.83.

**తుటిగొను** చూ. తుఱుగు. అ.క్రి. గుంపుగూడు, పుంజీభవించు. కిక్కిఱియు. కు.సం. 12.146.

**తుఱక** రూ.చూ. తుర్క. వి. తురుష్కుడు, మ్లేచ్ఛుడు. ద.హిం.శా.సంపు. **4.** శా.నం. 659, క్రీ.శ. 1485.

**తుఱుగు** స.క్రి. కుక్కు, అదిమి దోపు. భార.శాంతి. 1.263, మార్క. 2.101.

క. తుఱుకు, తుఱకు. కుక్కు, తుఱుగు, తుఱుబు, తుఱుమ్బు, తుక్కు. తోయు ; త. తుఱు(తుఱువ్-, తుఱ్ఱ్-), (తుఱుప్పు-తుఱుత్-), తుఱుమ్బు (తుఱుమ్బి-), తుఱుము(తుఱుమి-). కుక్కు, తోయు ; మ. తుఱుక, తుఱుకు, తుఱుతుఱ, తుఱుత్తుక. కుక్కు ; కో. తుర్ (తుర్గ్య-), తుర్క్ (తుర్క్య-). రంధ్రంలోకి తోయు, కుక్కు ; పర్జీ. తుత్, తుతిప్- (తుతిత్-), తుయ్ప్-(తుయ్త్-) ; కొలా. తుర్క్ (తురుక్-), తుర్స్-(తురుస్-). పొయిలో కట్టెలు పెట్టు ; కురు. తుబ్నా, తుర్ద్ ; మాల్తో. తుర్గ్. అస్థికల్ని ఖననంచేయు ; బ్రా. ∠తుజ్జింగ్, ∠తుజ్జ్ ; పో. చూ. త. తూఱు, పో. చూ. సం. తురుష్క- ; మరా. తురుంబ్. ,

< మూ. ద్రా. *తూత్-, *తుత్-, తుత్తుంక్-.

**తుఱుతు** రూ. తురితము, తురితు, తురుతు, తురుత్తు. వి. వేగిర పాటు, తొందర. నీలా. 1.44. రసిక. 4.97 ; విణ. శీఘ్రం, వడి.

సం. త్వరిత-. వేగవంతమైన ; ప్రా. తురిఅ ; జై. మహా. తురియ ; శౌ. తురిద ; అ. మా. తురిఅ, తురియ ; హిం. తురంత్ ; మరా. తురుత్ ;

త. తుఱు-, తుఱువెనల్, తురు-తురువెనల్, తురు-తురెనల్. తొందరకు అనుకరణం, తురుతుదు (తురుతురుప్పు-, తురుతురుత్) తురుతురుప్పు. తీరికలేకపోవు ; తు. తురుతురు. వేగంగా, తురుత, తురిత, తుర్త, తుర్తు. వేగం.

< సం. త్వరిత-.

**తుఱుతుతీర్పు** రూ. తురుతుతీర్పు. వి. ద్రుతలయ, ఆలోచించకుండా చెప్పిన తీర్పు.

**తుఱుము**[1] రూ. తురుము[1], తుర్మ. స.క్రి. **1.** కొప్పులో పువ్వులు మొ. పెట్టు. కు. సం. 5.145 ; **2.** తురుగు. కుక్కు, అదిమిదోపు. భార. ద్రోణ. 2.192 ; **3.** ముడుచు. కళా. 3.156 ; **4.** సవరించు, చక్కజేయు. వైజ. 3.70 ; వి. **1.** స్త్రీధమ్మిల్లం, కొప్పు. భార. విరా. 1.291 ; **2.** (పురుషుని) జుట్టుముడి, సిగ. వీర. వి. 2.274.

క. తుఱుబు, తుఱుమ్బు. సిగలోపూలు పెట్టు, జుట్టు ముడి ; తు. తుర్పు. స్త్రీలజుట్టుముడి ; త. తుఱు (తుఱువ్-తుఱ్ఱ్-) దట్టమగు, (తుఱుప్పు-, తుఱుత్-). కుక్కు, తుఱుమ్బు, తుఱుము. సన్నిహితమగు, గుమిగూడు ; కొలా. తుర్క్ (తుఱుక్-), తుర్స్-,(తురుస్-) పొయ్యిలో కట్టెలుపెట్టు. కురు. తుబ్నా. గుచ్చు.

మూ. ద. ద్రా. తుత్-. ఉమ్బ్-. /*-ఉప్పు. *తూత్, పో. చూ. తూఱు, తూఱుగు.

**తుఱుము**[2] రూ. తురుము[2]. స.క్రి. తురుముపీటతో కొబ్బరి మొ. వాటిని కోరు, ఖండఖండాలుగా చేయు ; వి. ముక్కలు చేసినకొబ్బరి.

క. తురి, తురుపు. బోలుగాచేయు, కొబ్బరి మొ. ముక్కలుచేయు ; తు. తురిపిని, తురిపుని, తురుపుని, తురియుని, తురువుని. బోలుగాచేయు ; త. తుర (తురప్పు-, తురన్త్-), తురువు(తురువి), తురువల్. బోలుగాచేయు ; కువి. ∠తుపక, ∠తుస్ప (∠తుస్-), తుస్ప (తుస్), ∠తూవ (∠తూత్-). బోలుచేయు ; పర్జీ. తురు ; కురు. తుర్నా ; మాల్తో. తురె, తుగ్రె ;

పో. చూ. మాల్తో. తుడ్గ్,. తుడ్గొ.

చూ. త్రుంగు.

**తుఱుముపీఁట** రూ. తురుముపీట. వి. కోరంపీట, కొబ్బరి కాయను కోరటానికి కోరాన్ని అమర్చినపీట.

**తుఱ్ఱు**[1] రూ.చూ. తువ్వర. వి. మంచులాంటివాన.

**తుఱ్ఱు**[2] వి. ఊడ్చిన పెంటకుప్ప.

**తుఱ్ఱు** రూ. తుర్రు. వి. గమన వేగంలోని ధ్వనికి అనుకరణం. పిట్ట ఎగరటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

తు. తురుతురు, తురుత, తురిత, తుర్త, తుర్తు ; త. తుఱు-, తుఱువెనల్, తురు-తురువెనల్, తురు-తురెనల్. గమన వేగంలో ధ్వనికి అనుకరణం, తురుతురుప్పు. వేగం, తొందర.

**తులకరించు** రూ.చూ. తిలకించు. అ.క్రి. **1.** కలుగు, పొటమరించు. వసు. 4.23 ; **2.** ఒప్పు. ఉ. రా. 1.99 ; **3.** ప్రకాశించు, మెరయు. దశా. 7.1. 286 ; **4.** ఆనందించు. కృ. శకు. 3.85 ; **5.** ప్రకటితమగు, తోచు. కనబడు ; **6.** కుతూహలపడు, తమిగొను.

**తులకించు** రూ.చూ. తిలకించు అ.క్రి. **1.** కనబడు, ప్రకటితమగు. కాశీ. 4.145 ; **2.** ఆనందించు, సంతసించు. యయా. 4.70 ; **3** ప్రకాశించు, మెరయు. దశా. 2.122 ; **4.** ఒప్పు, అందమగు. హంస. 1.61 ; **5.** కుతూహలపడు. కృ. శకు. 1.73.

**తులకింపు** అ.క్రి. ప్రకాశించు. వసు. 3.46 ; వి. ప్రకాశం, కాంతి. విజయ. 1.131. క. తొళపు. ప్రకాశం, మెరుపు ; త. తళక్కమ్ ; మ. తిళక్కమ్, తుళక్కమ్, తెళక్కమ్.

**తులకింపు** చూ. తులకించు.

**తులచి** రూ.చూ. తొలసి. వి. పూజార్థం ఇంటి ఆవరణంలో పెంచే పవిత్రమైన మొక్క.

**తులతెంచు** చూ. తులుచు. స.క్రి. తులుచు, రాల్చు. కు. సం. 9.126.

**తులదూఁగు** (-తూఁగు) అ.క్రి. సాటిఅగు. శృం. నై. 1.48.

సం. తులా. తాను, సాదృశ్యం.

< సం. తులా + తూఁగు (మిశ్ర. స.)

**తులము** వి. **1.** తులామానవిశేషం, పలంలో మూడోభాగం,

ఒకరూపాయి ఎత్తు. H.A.S. 13-11 ; 2. 96 గురివింద గింజలఎత్తు.

సం. తులా. తక్కెడ, నూరుపలాలకొలది తూచటం.

క. తొలె ; త. తోలా.

< సం. తులా.

**తులలుదూఁగు** (-తూఁగు) అ.క్రి. సరిపోవు. శివరా. 2.5.

సం. తులా. తక్కెడ, పోలిక.

< సం. తులా + -లు + తూఁగు.

**తులసిఅంబర్‌రోజు** వి. ఒకరకం ముదురురోజారంగు.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క ; అంబర-. పసుపురంగు ; హిం. ఉ. రోజా, గులాబి.

**తులసికోట** రూ. తులిచికోట, తులిశకోట, తులిసికోట, తుల్సికోట. వి. తులసిచెట్టును నాటినకోట.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క.

**తులసికోటసిరారంగు** రూ. తులిసికోట సిరారంగు. వి. ఒకరకం నీలం రంగు.

**తులసిగద్దె** రూ. తులిసిగద్దె, తులిసెగద్దె, తుల్చిగద్దె. వి. 1. తులసిచెట్టు మధ్యనున్న అరుగు ; 2. తులసికోట నమూనాను నేసినఅంచు.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క.

**తులసిపీని** రూ. తులసిపీను, తులసిపీనె. వి. తులసి చెట్టుమధ్యనున్న అరుగు.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క.

**తులసిపీను** రూ.చూ. తులసిపీని. వి. తులసిచెట్టు మధ్యనున్న అరుగు.

**తులసిపీనె** రూ.చూ. తులసిపీని. వి. తులసిచెట్టు మధ్యనున్న అరుగు.

**తులసిపోఁగులు** వి.బ.వ. కర్ణభూషా విశేషాలు. నిరంకు. 2.116.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క.

**తులసిబిందావనం** రూ.చూ. తులసిబ్రుందావనం. వి. తులసి చెట్టు నాటినకోట.

**తులసిబ్రుందావనం** రూ. తులసి బిందావనం. వి. తులసిచెట్టును నాటినకోట.

సం. తులసీబృందావన-. తులసిమొక్కలలో కూడిన వనవిశేషం.

< సం. తులసీబృందావన + -ము.

**తులసివనమాలికలు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

సం. తులసీవనమాలికా. తులసీవనంలోని దండ.

< సం. తులసీవనమాలికా + -లు (అర్థవిపరి.).

**తులాంబరము** వి. సన్నని తెల్ల వస్త్రం.

సం. తులా. సాదృశ్యం, అంబర-. ఆకాశం, వస్త్రం.

త. తులాంపరమ్. రత్నాదులకాంతి.

< సం. తులా + సం. అంబర + -ము (అర్థవిపరి.).

**తులార్జులు** వి.బ.వ. పొడుగు వెడల్పులు.

సం. తులా. తక్కెడ.

**తులి** రూ.చూ. తొలి2. వి. 1. రంధ్రం, బెజ్జం ; 2. రాతిలోగాని కొయ్యలోగాని తొలిచిన రంధ్రం.

**తులిగ** వి. కుసి తిరగడానికి వీలుగా నేలలో తొలిచినగుంట

**తులిచికోట** రూ.చూ. తులసికోట. వి. తులసిచెట్టును నాటిన కోట.

**తులిపి** విణ. పోకిరి చేష్టలు చేసే స్వభావంకల.

**తులిశ** రూ.చూ. తొలసి. వి. పూజార్థం ఇంటి ఆవరణంలో పెంచే పవిత్రవృక్షం.

**తులిశకోట** రూ. చూ. తులసికోట. వి. తులసిచెట్టును నాటినకోట.

**తులిసి** రూ.చూ. తొలసి. వి. పూజార్థం ఇంటి ఆవరణంలో పెంచే పవిత్రమైన మొక్క.

**తులిసికోట** రూ.చూ. తులసికోట. వి. తులసిచెట్టును నాటినకోట. **తులిసికోటసిరారంగు** రూ. చూ. తులసికోట సిరారంగు. వి. ఒకరకం నీలంరంగు **తులిసికోవిలి** వి. తులసిచెట్టు నాటినకోట. **తులిసిగద్దె** రూ.చూ. తులసిగద్దె. వి. తులసిచెట్టు మధ్యనున్న అరుగు.

**తులిసె** రూ.చూ. తొలసి. వి. పూజార్థం ఇంటి ఆవరణంలో పెంచే పవిత్ర వృక్షం.

**తులిసెగద్దె** రూ. చూ. తులసిగద్దె. వి. తులసిచెట్టుమధ్యనున్న అరుగు.

**తులుకు** వి. చలనం, కదలిక. యయా. 5.104.

క. తుళుకు, తుళకు, తుళికు, తుళుంకు. కదల్చు, నంచలించు ; త. తళక్కమ్. కదలిక ; మ. తుళుక్కమ్.

**తులుఁకాడు** రూ.చూ. తొలఁకాడు. అ.క్రి. తొనుకు. చిందు. పండి. చ. 1.5పు.

**తులుచ** విణ. వేగంగల. ద్వి.భాగ. 10 స్కం.

క. తుళుకిసు. కదలించు, చలింపచేయు.

**తులుచన** వి. వేగం. భాగ. 10.

**తులుచు** స.క్రి. చెట్టునుంచి పండు మొ॥ రాల్చు.

క. తుళకు, తుళుకు. కార్చు ; త. తుళి (ప్ప్-, త్త్-). వర్షం, కన్నీరు మొ॥ కారు, తుళుమ్పు (తుళుమ్పి-). కన్నీరుకారు.

**తులుప్ర** వి. ఒకరకం చేప.

**తులుము** చూ. తులుచు. స.క్రి. తులుచు, రాల్చు. చంద్రికా. 4.32.

క. తుళకు, తుళుకు. కార్చు. వర్షం కన్నీరు మొ॥ రాలు ; త. తుళి (తుళిప్ప్-, తుళిత్త్-), తుళుమ్పు (తుళుమ్పి-). కన్నీరుకారు ; మ. తుళిక్క. చుక్కలుపడు ; పర్జీ. తొల్క్. చిలుకు.

**తులువ** చూ. తూలు, వాయి. రూ. తుల్వ. వి. 1. తుంటరి, దుష్టుడు. భార.విరా. 1.110 ; 2. నీచుడు, తుచ్ఛుడు. భార.ఉద్యో. 3.45 ; 3. అవివేకి, మూర్ఖుడు. భాస్క.రా. యు. 101 ; విణ. తుచ్ఛమైన, నీచమైన. వ్య. నిందించే నోరు కలవాడు లేదా కలది.

**తులువకత్తి** వి. వంపు చురకత్తి. **తులువసుజ్జము** వి. నీచాశ్వం. **తులువతనము** వి. తుంటరితనం.

**తుల్కాడు** రూ.చూ. తొలఁకాడు. అ.క్రి. అతిశయించు, ఒప్పు. బసవ. 1.2, భాగ. 6.504.

**తుల్చిగద్దె** రూ.చూ. తులసిగద్దె. వి. తులసిచెట్టు మధ్యనున్న

అరుగు.

**తుల్వ** రూ. చూ. తులువ. వి. **1**. తుంటరి, దుష్టుడు ; **2**. తుచ్ఛుడు, నీచుడు ; **3**. అవివేకి, మూర్ఖుడు ; విణ. నీచమయిన, తుచ్ఛమయిన.

**తుల్సి** రూ.చూ. తొలసి. వి. పూజార్థం ఇంటి ఆవరణంలో పెంచే మొక్క.

**తుల్సికోట** రూ.చూ. తులసికోట. వి. తులసిచెట్టును నాటిన కోట.

**తుళు** వి. కర్ణాటకదేశ పశ్చిమభాగంలోని దేశపు భాష.

క. తుళు. తుళుదేశం, తుళవ, తుళువ. తుళుభాష ; త. తుళు, తుళువమ్. తుళుదేశం, తుళుభాష ; మ. తుళు. తుళుదేశం, తుళువన్. తుళుదేశీయుడు.

**తుళుకరించు** చూ. తిలకించు. అ.క్రి. ప్రకాశించు. దశా. 8.103.

**తుళువ** వి. **1**. కృష్ణరాయలు జన్మించిన దేశం. మను. 1.21 ; **2**. తుళువదేశాన్ని పాలించేవాడు. కృష్ణరా. 3.58 ; **3**. ఒకానొక దేశం.

క. తుళు. తుళుదేశం, తుళువ. తుళుదేశంవాడు, తుళు భాష ; త. తుళు, తుళువమ్. కన్నడదేశ పశ్చిమభాగం లోని దేశం, అక్కడి భాష ; మ. తుళు. తుళుదేశం, తుళువన్. తుళుదేశీయుడు.

**తుళ్లించు** చూ. తుళ్లు.

**తుళ్లిపడు** చూ. తుళ్లు.

**తుళ్లు** రూ. చూ. త్రుళ్లు. అ.క్రి. కుప్పిగంతులువేయు ; వి. ఒక విధమైన చేప.

**తుళ్లించు** రూ. త్రుళ్లించు. స.క్రి. ఎగిసిపడజేయు. **తుళ్లిపడు** రూ.చూ. త్రుళ్లిపడు. అ.క్రి. **1**. ఎగిరిపడు, మండిపడు ; **2**. ఉలికిపడు ; **3**. మిక్కిలి కదలు.

**తువ** రూ.చూ. దువ్వ. వి. దుమ్ము.

**తువచవుడు** రూ.చూ. తువ్వచవుడు. వి. ఇసక కలిసిన చవిటినేల. **తువనేల** రూ.చూ. తువ్వనేల. వి. తవుడులాగా ఉండే మెత్తని ఇసుకనేల.

**తువర**[1] రూ.చూ. తువ్వర. వి. **1**. నీరు మొ॥వాటి బొట్టు ; **2**. చిన్నచిన్న బొట్లుగల జల్లు.

**తువర**[2] రూ. తూవర[2]. వి. **1**. తువరభూమి, ఒగరునేల. ఆం.భా. 2.4 ; **2**. సువాసనగల నేల.

సం. తువర-. ఒగరైనది, ఒగరు.

<సం. తువర- (అర్థవిపరి.).

**తువరికంది** వి. అందమైన పూలు, స్థూపాకారపు గింజలు కాసే కర్ర, పంటచెరకుగా ఉపయోగపడే ఒక చెట్టు (Kandelia Rheedii).

**తువాల** రూ.చూ. తువ్వాలు. వి. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరిగా భుజంమీద వేసుకోటానికి నేసిన బట్ట.

**తువాలు** రూ.చూ. తువ్వాలు. వి. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరిగా భుజంమీద వేసుకోటానికి నేసిన బట్ట.

**తువ్వ** రూ.చూ. దువ్వ. వి. **1**. దుమ్ము ; **2**. పెంకు తయారీకి వాడే ఎరుపు నలుపురంగు కలిగిన జిగటమట్టి.

**తువ్వచవుడు** రూ. తువచవుడు, దుబ్బచవుడు. వి. ఇసక కలిసిన చవిటినేల. **తువ్వనేల** రూ. తువనేల, తూనేల, తూవనేల, దుబ్బనేల. వి. దుమ్ము, ఇసకతో కలిసి వదులుగా ఉండే నేల. **తువ్వపాడు** వి. 'తువ్వ' కలిసిన పాటినేల. **తువ్వబావి** వి. లోపల బావి మునక సరిగా ఉండటానికి చుట్టు గోడ సరిగా కుంచి కట్టిన ఊటబావి.

**తువ్వర** రూ. తుపర, తుపారం, తుప్పర, తుప్పిరి, తుప్పుర, తుప్పురు, తుమారు, తుమురు, తుంపర, తుంపిరి, తుంపురు, తుఱ్ఱు[1], తువర[1], తూపర, తూఁపర, తూర[1], తూవర, దుబ్బురు, దూబర, దూమర, దూవర[2]. వి. **1**. చిన్నచిన్న బొట్లుగల జల్లు. జైమినిభా. 4.234 ; **2**. శీకరం, నీరు మొ॥వాటి బొట్టు. కువ.చ. 4.134.

క. తుంతుఱ్, తుంతుఱి. తుంపర పడటం, జాపఱి, జూపఱు. తుంపరవాన ; త. తువఅల్. వర్షించటం, తూఱ్. శీకరం, తుమితమ్. వానచినుకులు.

**తువ్వరపడు** అ.క్రి. చిన్నచిన్నబొట్లుగాపడు. పరమ.వి. 7.272.

**తువ్వాయి** చూ. తువ్వు[2].

**తువ్వాఱు** రూ.చూ. తువ్వాలు. వి. తుండుగుడ్డ.

**తువ్వాల** రూ.చూ. తువ్వాలు. వి. ఒళ్ళు తుడుచుకోటానికిగాని కండువా మాదిరిగా భుజంమీద వేసుకోటానికి నేసిన బట్ట.

**తువ్వాలు** రూ. టువాలు, తువాల, తువాలు, తువ్వాఱు, తువ్వాల. వి. **1**. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరి భుజంమీద వేసుకోటానికి నేసిన బట్ట ; **2**. చేతిగుడ్డ.

పో. తొఅల్హా. తువాల ; ఇం. *Towel* ;

త. తువాలై.

<పో. తొఅల్హా.

**తువ్వు**[1] రూ.చూ. దువ్వ. వి. పెంకు తయారీకి వాడే ఎరుపు నలుపురంగు కలిగిన జిగటమట్టి.

**తువ్వు**[2] వి. లేగదూడ.

**తువ్వాయి** వి. **1**. అప్పుడే పుట్టిన దూడ ; **2**. పాలు తాగే దూడ.

<తువ్వు[2] + -ఆయి.

**తుస** రూ. తుస్స, తుస్సి, తుస్సె. వి. ఊక. తెనాలి రామకృష్ణుని చాటువు, చాటుపద్య మణిమంజరి.

సం. తుష-. ఊక ; ప్రా. తుస-. తుచ్ఛధాన్యం ;

క. తుస. ఊక.

<ప్రా. తుస-.

**తుసికిలపడు** చూ. తుసుకు.

**తుసితుంగ** వి. పీచుతుంగ, ఒకరకం తుంగ (Fimbrestylis).

**తుసుకు** రూ.చూ. తుసుక్కు. వి. వేగిరపాటు.

**తుసికిలపడు** అ.క్రి. జారిపోవు.

**తుసుక్కు** రూ. తుసుకు. వి. వేగిరపాటు. ధ్వన్యను.

**తుస్స** రూ.చూ. తుస. వి. తువ్వనేల.

**తుస్సి** రూ.చూ. తుస. వి. తువర, తువర భూమి, వగరునేల. ఆం.భా. 2.4 ; విణ. వగరుగల.

**తుస్సు**[1] వి. **1**. అపాన వాయువు విడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం ; **2**. టపాకాయ, సిసింద్రీ, చిచ్చుబుడ్డి మొ. సరిగాకాలక చీదటంలో అయిన ధ్వనికి అనుకరణం.

ధ్వన్యను.

**తుస్సు**[2] విణ. తుచ్ఛమయిన, నీచమైన.

సం. తుచ్ఛ-. నీచమయిన.

<సం. తుచ్ఛ-.

**తుస్సుపెంజెర** రూ. తుచ్చుపెంజెర. వి. ఒకరకం పాము, ఒకరకం కొండచిలువ. **తుస్సుపోవు(-పోవు)** అ.క్రి. నీచ దశపొందు, నీచత నొందు. భార.శాంతి. 4.399.

**తుస్సె** రూ.చూ. తుస. విణ. తువర భూమి. ఆం.భా. 2.4.

**తుస్సెపేటు** వి. ఒకరకం నేతడిజైను.

**తుహీతుహీ** వి. కూయటంలోని ధ్వనికి అనుకరణం. శృం.నై. 8.91.

సం. 'తు' అనేది లోట్ప్రథమ పురుషైక వచనప్రత్యయం. 'హి' అనేది లోణ్మధ్యమ పురుషైక వచనప్రత్యయం.

<సం. తుహితుహి.

**తూ**[1] వి. 1. ఉమ్మటంలో అయ్యేధ్వనికి అనుకరణం. విక్ర. 8.59; 2. నిందలో ఉపయోగించే మాట. ధ్వన్యను.

క. తూ;

సం. థూత్. ఉమ్మటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**తూపొడుచు**[1] రూ. తూపొడ్చు[1]. స.క్రి. 'తూతూ' అంటూ ఉమ్మివేయు. హరి.పూ. 5.189. **తూపొడ్చు**[1] రూ.చూ. తూపొడుచు. స.క్రి. తూతూ అంటూ ఉమ్మి వేయు.

**తూ**[2] వి. 1. ఊదటంలో అయ్యేధ్వనికి అనుకరణం; 2. బాకా మొ. వాటిని ఊదటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**తూగొమ్ము(-కొమ్ము)** వి. బాకా వంటి ఒక విధమైన సుషిరవాద్యం. సిం.ద్వా. 11.26. **తూతూబాకా** వి. 1. మురళి; 2. తూతూ అని ఊదుకొనే బూర; 3. బాకా. **తూపొడుచు**[2] రూ.చూ. తూపొడ్చు[2]. స.క్రి. ఊదు. సిం.ద్వా. 1.291. **తూపొడ్చు**[2] రూ. తూపొడుచు[2]. స.క్రి. ఊదు. బసవ. 3 ఫు. 290 పం.

**తూకంరాయి** చూ. తూకము[1].

**తూకంసంచి** చూ. తూకము[1].

**తూకగ్గుండు** చూ. తూకము[1].

**తూకంకాయ** చూ. తూకము[1].

**తూకంగుండ** చూ. తూకము[1].

**తూకంగుండు** చూ. తూకము[1].

**తూకట్టునేల** చూ. తువ్వ. వి. తువ్వపొరలు పొరలుగా ఉన్న నేల.

**తూకంతాడు** చూ. తూకము[1].

**తూకపురాయి** చూ. తూకము[1].

**తూకము**[1] రూ.చూ. తూకువ. వి. 1. సమభారం. జైమిని భా. 7.40; 2. బరువు, భారం. సురా. 58; 3. ఎత్తు; 4. పేటువడికి కింద వేలాడగట్టిన బరువు; 5. ఊచ, చువ్వ; 6. తాపీపని వాళ్ళు గోడల మట్టం సరి చూడటానికి వాడే పరికరం.

**తూకంరాయి** రూ.చూ. తూకపురాయి. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూకంసంచి** వి. పడుగులో అతికిన పేటు పోగులు బిర్రుగా ఉండటానికి, మగ్గానికి పైన దండెం మీద నుంచి వేలాడ దీసి చివర కట్టిన బరువు. **తూకగ్గుండు** రూ.చూ. తూకం గుండు. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూకంకాయ** రూ.చూ. తూఁగుకాయ. వి. తాపీపని వాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం. **తూకంగుండ** వి. తాపీపని వాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం. **తూకంగుండు** రూ. తూకగ్గుండు, తూకుగుండు. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటి రాయి. **తూకంతాడు** వి. సేరుకోల (=దూది తూచే ఒకరకం తక్కెడ కట్టె) కుపైన వేసిన తాడు. **తూకపురాయి** రూ. తూకంరాయి. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూకమున్నమనిషి** వి. లెక్కించ దగిన మనిషి. **తూకంబల్ల** రూ. తూకంబిళ్ల. వి. గోడల మట్టం సరిచూడడానికి తాపీ పనివాళ్ళు వడంబానికి బదులుగా వాడే పరికరం. **తూకంబిళ్ల** రూ.చూ. తూకంబల్ల. వి. గోడల మట్టం సరిచూడడానికి తాపీపనివాళ్ళు వడంబానికి బదులుగా వాడే పరికరం. **తూకాలగుంత** వి. పేటు తూకాలు నేలకు తగల కుండా వేలాడటానికి తీసిన చిన్న గొయ్యి.

**తూకము**[2] వి. నాట్యంలోని పద్నాలుగు అంగాల్లో ఒకటి.

**తూకంబల్ల** చూ. తూకము[1].

**తూకంబిళ్ల** చూ. తూకము[1].

**తూకరాసి** వి. చాలుగా పోసిన తూర్పారపట్టని ధాన్యం.

క. తూక. బరువు; త. తూక్కమ్;

సం. రాశి-. పోగు, గుంపు.

**తూకాలగుంత** చూ. తూకము[1].

**తూకి** రూ.చూ. తునికి. వి. నల్లచేవమాను. హంస. 4.18. (Coramandel Ebony).

**తూకిఆకు** వి. బీడీలను చుట్టే ఆకు.

**తూకినము** వి. పిల్లనగ్రోవి, తూతకొమ్ము. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1052 క్రి.శ. 1350.

**తూకు**[1] రూ.చూ. తూకువ. వి. 1. కొలది, ప్రమాణం. హరి. ఉ. 10.153; 2. భారం, బరువు; 3. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం; 4. గోడ కట్టేటప్పుడు మునుముందు పెంచుకోడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన హెచ్చురాయి; 5. ఎత్తటం; 6. మరణశిక్ష; 7. దుత్తకు కట్టిన తాడు; స.క్రి. వాటలు తయారీలో కత్తెర పట్టుపట్టిన తర్వాత కింద నుండి పైకి నైస్‌గా పల్చగా ఉబ్బినట్లు ముబ్బును లేపు.

**తూకుకాయ** రూ.చూ. తూఁగుకాయ. వి. తాపీపని వాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం. **తూకుగుండు** రూ.చూ. తూకంగుండు. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటిరాయి. **తూకుడు**

రాయి రూ. తూకుఁద్రాయి, తూకురాయి, తూగుటురాయి, తూఁగుటురాయి, తూఁగుఁట్రాయి, తూఁగుడురాయి, తూఁగు రాయి. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూకుఁద్రాయి** రూ.చూ. తూకుడురాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూకురాయి** రూ.చూ. తూకుడురాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూక్కాయ** రూ.చూ. తూఁగుకాయ. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం. **తూగుండు** రూ.చూ. తూఁగుగుండు. వి. దండె దగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి.

**తూకు**[2] వి. **1**. తూరి, తడవ, మారు. కాశ. 3.47 ; **2**. సమయం, తరి, కాలం కకుత్స. 5.102 ; **3**. యత్నం.

**తూకువ** చూ. తూఁగు. రూ. తూకము[1], తూకు[1]. వి. బరువు. భారం. పండి.చ. 2.127 పు.

క. తూక. తూనిక ; త. తూక్కమ్. బరువు, తూకం, తూక్కు. బరువుతూయు, బరువు, పోలిక.

**తూకొను** చూ. తూఋ.

**తూక్కాయ** చూ. తూకు[1].

**తూగి** రూ.చూ. తునికి. వి. మువ్పైనుంచి నలభై అడుగుల దాకా అడవుల్లో పెరిగే చెట్టు (Coramandel ebony, Dispyros melanxylon).

**తూగు** చూ. తూఁగు. వి. **1**. నీళ్ళు తోడుకోడానికి వాడే మట్టి పాత్ర ; **2**. ఒకవిధమైన బిందె ; **3**. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం.

**తూగుటురాయి** రూ.చూ. తూకుడురాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన రాయి.

**తూగుండు** చూ. తూకు[1].

**తూంకడవ** చూ. తూము[2].

**తూఁకణి** వి. నాట్యవిశేషం. పండి.చ. 5.378 పు.

**తూఁగాడు** చూ. తూఁగు.

**తూఁగించు** చూ. తూఁగు.

**తూఁగిటించు** చూ. తూఁగు.

**తూఁగియాడు** చూ. తూఁగు.

**తూఁగు** అ.క్రి. **1**. ఉద్గతమగు, వెడలు. నిర్వ.రా. 8.49 ; **2**. చలించు, కదులు. నిర్వ.రా. 8.78, పండి.చ. 1.45 పు. ; **3**. తూలిపోవు, దుర్బలమగు, నిస్సత్వమగు. భార. భీష్మ. 2.147 ; **4**. త్రాసులో తూనికపడు, తోలనం పొందు. మార్క. 1.207 ; **5**. కూరుకు, కునికిపట్టు. తంద్రచెందు. విక్ర. 2.88 ; **6**. సిద్ధమగు, సన్నద్ధమగు. నవనాథ. 2.102 పు. 13 పం. ; **7**. జరుగు, సాగు, ప్రవర్తిల్లు. ఆము. 2.94 ; **8**. ఊఁగు. కళా. 1.42 ; **9**. శక్తమగు, సమర్థమగు. విజయ. 1.24 ; **10**. తుల్యమగు, సమమగు ; **11**. నిలువుగా ఉండు ; వి. కునికిపాటు, తంద్ర. ఆం.భా. 1.141 ; విణ. ఊఁగేది.

క. తూగు, తూంకు. తూనికపడు, ఊఁగు, కునుకు, తూఋ. తీవ్రమైన చలనం, తూగిసు. తూగించు, తూక. తూచటం, తూకు, తూగాడు ; కొడ. తుంగ్- (తుంగి-) తుక్- (తుకి-). వేలాడు, జుంగ్. ఊఁగు, (జుంగి-), జుక్- (జుకి-) ; తు. తూంకుని, తూంగుని. ఊఁగు, కునుకు, ఊఁపు, తూకుని. తూచు, ఊఁగటం. తూంకి, తూంకలియుని, తూకలియుని. కునికిపాట్లు పడు, తూంకు. ఊఁగటం, తూకుని, తూగుని. తూచు, తూకావుని. తూచు, తూకు. వేలాడదీయటం, తూగడి. మత్తు, తూగడిపుని. మత్తుగాఉండు ; త. తూంకు (తూంకి-). వేలాడు, ఊఁగు, నిద్రపోవు. తూక్కు (తూక్కి-). తూచు, పోల్చిచూచు, తూక్కమ్. నిద్ర, తూయటం, తుంచు. నిద్రపోవు, కునుకు ; మ. తూజ్ఞుక. తూయబడు, కునుకు, మత్తుగాఉండు, తూజ్ఞల్. వేలాడటం, తూక్కుక. వేలాడు, తూచబడు, తూక్కల్. మత్తు, తూక్కిక్క. తూచబడు ; కో. తు. గ్. (తుగ్య్-). వేలాడు ; తొ. తు.క్. (తుక్య్-), తుక్ (తుక్య్-) ; గోం. సున్సీ). నిద్రపోవటం ; గోం. మాల్తో. హుస్జ్ ; కొండ. దూజ్, దూక్. వేలాడదీయు ; కుయి. ద్రూగ్న (ద్రూగ్ని-), సుగ్జ. నిద్రపోవు ; కువి. తూనలి. ఊఁపు, ద్రూగ్నొలి, ద్రూంగొని. ఊఁపు, తూక్హలి, తూగ్నినై, తూగ్న్. ఊఁగు, తూ- (తున్త్-), తూఖ్. తూచు, హూగ్జ్. కిందపడు ; పర్జి. తుం ; గ. తుయ్. ఊఁగు ; కురు. తుగ్గుల్. కల, జొఖ్. తూచు, పోల్చిచూచు ; మాల్తో. తుంగ్లె. కల, జొక్య్. కొలుచు, తూచు, జొకర్. తూయబడు, జొకర్తర్ ; బ్రా. తుఘ్. నిద్రకల, తుఘీ. మత్తుగా ఉన్న, తుగ్నాన్. నిద్ర ; పో.చూ. త. తొంకు, తుంచు ; మూ.ద్రా. *తూయ్-/*చూయ్.

**తూఁగాడు** రూ. తూఁగియాడు. అ.క్రి. **1**. ఊఁగు, ఊఁగాడు. కు.సం. 9.13 ; **2**. తూలు. భార.ఉద్యో. 4.344 ; **3**. చలించు, కంపించు ; **4**. బలహీనంగా ఊఁగిసలాడు. క. తూగియాడు ; త. తూంగియాటు. **తూఁగించు** స.క్రి. జరిగించు, చేయు. ఆము. 2.94. <తూఁగు + -ఇంచు[3]. **తూఁగిటించు** అ.క్రి. కునుకు. <తూఁగు + -ఇంచు[3]. **తూఁగియాడు** రూ.చూ. తూఁగాడు. అ.క్రి. **1**. చలించు, కంపించు. నిర్వ.రా. 8.50 ; **2**. ఊఁగు, ఊఁగాడు. గంధ. 143 ; **3**. తూలు. **తూఁగుకాయ** రూ. తూకంకాయ, తూకుకాయ, తూక్కాయ, తూఁగ్గాయ. వి. తాపీ పనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం. **తూఁగుగుండు** రూ. టూగ్గుండు, తూగుండు, తూఁగుడుగుండు, తూఁగ్గుండు, తోకుగుండు. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం. **తూఁగుచెక్క** వి. గోడల మట్టం సరిచూడడానికి తాపీపనివాళ్ళు వడంబానికి బదులుగా వాడే పరికరం. **తూఁగుటుయ్యల** రూ.చూ. తూఁగుటుయ్యెల. వి. ఉయ్యాలమంచం. కళా. 2.17. <తూఁగు + ఉయ్యల. **తూఁగుటుయ్యాల** రూ.చూ. తూఁగు

టుయ్యెల. వి. స్త్రీలు విలాసంగా ఊఁగటానికి ఏర్పరచిన మంచం మొ. వరాహ. 4.164. <తూఁగు+ఉయ్యాల. **తూఁగుటుయ్యెల** రూ. తూఁగుటుయ్యల, తూఁగుటుయ్యాల. వి. ఉయ్యాలమంచం, స్త్రీలు విలాసంగా ఊఁగటానికి అనుకూలంగా వేలాడగట్టిన మంచం. శృం.నై. 7.148. <తూఁగు+ఉయ్యెల. **తూఁగుటురాయి** రూ.చూ. తూకుడు రాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలికి వేలాడదీసిన గుండ్రని రాయి. **తూఁగుఁట్రాయి** రూ. చూ. తూకుడు రాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి. **తూఁగుడుగుండు** రూ.చూ. తూఁగుగుండు. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి. **తూఁగుడురాయి** రూ.చూ. తూకుడురాయి. వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ, కిందికి జారకుండా దారం కట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి. **తూఁగుదీపము** వి. నిలువుగా పాతినకర్రకు తాళ్ళసాయం వల్ల వేలాడుతూ ఊఁగుతూ వెలిగే దీపం, ఆకాశదీపం **తూఁగుదీవియ** వి. నిలువున పాతిన వెదురు మొదలగు నిడుపాటి కర్రచివర తాళ్ల ఆధారంతో వేలాడుతూ, ఊఁగుతూ వెలిగేదీపం. చంద్రభా. 4.54. **తూఁగుపలక** వి. తాపీపనివాడు గోడల మట్టాన్ని చూడటానికి వేలాడగట్టిన నిడుపైన పలక. **తూఁగుపాల** వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంనుంచి పొల్లును వేరుచెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికిపోసే పద్ధతి, తూర్పార. **తూఁగుబిళ్ళ** వి. గోడల మట్టం సరిచూడడానికి తాపీపనివాళ్ళు వడంబానికి బదులుగావాడే పరికరం. **తూఁగుమంచము** వి. స్త్రీలు విలాసంగా ఊఁగటానికి ఏర్పరచిన ఉయ్యాల మంచం. కాళ. 3.6. **తూఁగురాయి** రూ.చూ. తూకుడురాయి. వి. పడుగులో అతికిన పేటుపోగులు బిరుగా ఉండడానికి మగ్గానికి పైన దండెం మీద నించి వేలాడదీసి చివరకట్టిన బరువు (రాయి). **తూఁగ్గాయ** రూ.చూ. తూఁగుకాయ. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం. **తూఁగ్గుండు** రూ.చూ. తూఁగుగుండు. వి. 1. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడడానికి వాడే పరికరం; **2**. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటి రాయి.

**తూఁగ్గాయ** చూ. తూఁగు.

**తూఁగ్గుండు** చూ. తూఁగు.

**తూచాతప్పకుండు** అ.క్రి. సరిగా సంపూర్ణంగా అనుసరించి వర్తించు విక్ర. 1.100.

సం. తు, చ. సంస్కృతంలో పాదపూరణార్థం కొన్ని స్థలాల్లో ఉపయోగించబడే వ్యర్థపదాలు.

<సం. తు+సం. చ+తప్పక+ఉండు.

**తూచెక్కభూమి** వి. తువ్వకలిసిన చెక్కనేల.

**తూఁచినట్లు** చూ. తూఁచు.

**తూఁచు** చూ. తూఁగు. స.క్రి. తూనికవేయు, తోలనంచేయు అంచనావేయు. భార. ఆరణ్య. 3.234.

**తూఁచినట్లు** అవ్య. సమంగా. తాళ్ల. సం. 17.573.

**తూట** రూ.చూ. తూఁటు. వి. **1**. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యలో పెట్టిన రంధ్రం; **2**. ఏడికోల దూర్చే కొయ్య మొద్దు, నాగటివంపు పైభాగం.

**తూటా** వి. **1**. రాళ్ళు పగులగొట్టడానికి వాడే పేలుడు ద్రవ్యం; **2**. తుపాకీ గుండు.

హిం. టూటా. ముక్కలయిన. బలహీనమైన.

<హిం. టూటా.

**తూటామందు** వి. రాళ్ళను పగల గొట్టడానికి వాడే పేలుడు ద్రవ్యం.

**తూటి**[1] రూ.చూ. తూఁటు. వి. గుబ్బిగడ్డలోని బెజ్జం.

**తూటికూజా** వి. నీళ్ళు పోయడానికి పక్కన రంధ్రం పెట్టి ఉండే కూజా.

**తూటి**[2] రూ. తూఁటి. వి. చెరువుల్లోను, చెమ్మనేలల్లోను ఏటా లేచి పెరిగే కలుపుమొక్క (Ipomaca Reptans, Ipomaca Aquatica).

**తూట్రాయిదండె** చూ. తూఁటు.

**తూట్లచేయి** చూ. తూఁటు.

**తూట్లుబొంత** చూ. తూఁటు.

**తూట్లుమూకుడు** చూ. తూఁటు.

**తూండు** రూ.చూ. తూఁడు. వి. తాటితో కట్టినకట్టు.

**తూండురాయి** వి. ఇంటి నేలమీదపరిచే పల్చనిరాయి.

**తూఁట**[1] రూ.చూ. తుంట[1]. వి. **1**. ఖండం, ముక్క. పద్మ. 1032; **2**. చెరకు, ఇక్షువు; **3**. గడ్డిపిరి, నిలవచేయటానికి వట్టిగడ్డితో లావుగా, పొట్టిగా చుట్టిన వెంటి.

**తూఁటకట్ట** వి. గడ్డిని జడగా అల్లి నిప్పు ముట్టించే కట్ట, **తూఁటకట్టు** అ.క్రి. కోతపడు. **తూఁటవిలుకాఁడు** రూ. తుంటవిలుకాఁడు, తుంటవిల్కాఁడు. వి. తుంటవిల్తుడు, ఇక్షుధన్వుడు, మన్మథుడు. పి. శకు. 2.139. **తూఁటాడు** స.క్రి. **1**. ఖండించు, ముక్కలుచేయు. భార. విరా. 5.56; **2**. శిథిలంచేయు, జర్జరితం చేయు. మల్ల. శృం. 73; **3**. వేధించు. <తూఁటు[1]+ఆడు.

**తూఁట**[2] రూ.చూ. తుంట[2]. విణ. దుష్టుడైన.

**తూఁటరి** రూ. తుంటరి, తూఁడరి, తొట్టరి. విణ. దుష్టుడైన, తుంటరి అయిన. భాగ. 6.189. <తూఁట+-అరి[4]. త. తుంటరిక్కన్.

**తూఁటాడు** చూ. తూఁటు[1].

**తూఁటి** రూ.చూ. తూటి[2]. వి. నళి, తుంటికూర.

**తూఁటికూర** రూ.చూ. తుంటికూర. వి. **1**. ఒకవిధమైన కూరాకు. హరిశ్చ. 2.166; **2**. చెరువుల్లోనూ, బురద నేలల్లోనూ నీటిమీద తేలుతూ పెరిగే కూరాకు మొక్క (Ipomaca acquatica).

**తూఁటిగానపుఁదేజీగలబోఁటి** చూ. తూఁడు.

**తూఁటు** రూ. తూట, తూటి[1]. వి. **1**. చిల్లి, రంధ్రం. భార. అను. 3.304; **2**. అడగురి; **3**. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యలో పెట్టిన రంధ్రం.

క. తూతు, తూంతు. రంధ్రం; కువి. తూతలి. రంధ్రంచేయు ; మాల్తో. తుతొ.

**తూట్రాయిదండె** వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారం కట్టి, దండెఅవతలకు వేలాడ దీసిన గుండ్రటిరాయి. **తూట్లచేయి** వి. డబ్బునిలవని చేయి. **తూట్లబొంత** వి. చిరుగుల బొంత. తాళ్ల. సం. 11.102. **తూట్లుమూకుడు** వి. సగభాగం వరకు రంధ్రాలుండి గంజివార్పుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టిమూకుడు. **తూఁటుకట్టు** అ.క్రి. చిల్లిపడు, రంధ్రమగు. కు. సం. 12.139. **తూఁటుకొను** అ.క్రి. చిల్లుపడు. **తూఁటుగట్టినకన్ను (-కట్టినకన్ను)** వి. బెజ్జం పడిన కన్ను. పండి. చ. 4.108పు. **తూఁటుపడు** రూ. తూఁటువడు. అ.క్రి. చిల్లిపోవు. రంధ్రంపడు. **తూఁటుపోవు** అ.క్రి. చిల్లుపడు. **తూఁటులుపుచ్చు** రూ. తూటులువుచ్చు. స.క్రి. చిల్లులుపడజేయు, రంధ్రాలుగలదిగా చేయు. మార్క. 2.94. **తూఁటులువుచ్చు (-పుచ్చు)** రూ.చూ. తూఁటులుపుచ్చు. స.క్రి. చిల్లులుపడజేయు, రంధ్రాలు కలదానినిగాచేయు. **తూఁటులువోవు(-పోవు)** అ.క్రి. చిల్లులుపడు, రంధ్రాలు అగు. భార. శల్య. 1.197. **తూఁటులుసేయు (-చేయు)** స.క్రి. చిల్లులు పడజేయు, రంధ్రాలు పడజేయు. భార. భీష్మ. 2.232. **తూఁటువడు (-పడు)** రూ.చూ. తూఁటుపడు. అ.క్రి. రంధ్రమగు. **తూఁటువోవు (-పోవు)** అ.క్రి. చిల్లిపోవు, రంధ్రంపడు. భార. ద్రోణ. 5.28.

**తూఁడ** రూ.చూ. తుంట[2]. విణ. దుష్టుడైన.

**తూఁడరి** రూ.చూ. తూఁటరి. విణ. దుష్టుడైన. భోజ. 6.108. వి. శుంఠ. త. తుంటరిక్కన్. దుష్టుడు.

**తూఁడి** వి.ఔ. ఒకవిధమైనకూరాకు మొక్క, కపోతాంఘ్రి.

**తూఁడికూర** రూ.చూ. తుంటికూర. వి. హఠ అనే చెట్టు (Pisfia Stratiotes).

**తూఁడు** రూ. తూండు. వి.ఔ. మృణాళం, తామర మొ. వాటి కాడ. భార. అను. 3.23.

త. తండు.

**తూఁటిగానపుఁదేజీగలబోఁటి** వి. సరస్వతి. ఆం.భా. 1. 42. **తూఁడుతీఁగ** వి. మృణాళం, తామర మొ. వాటి కాడ. భార.అను. 3.232. **తూఁడుదిండి(-తిండి)** వి. తూడులు తిండిగా గలది, హంస. అచ్చ.రా.యుద్ధ. 30. **తూఁడునూలునారి** వి. మన్మథుని మూడోవింటి నారి. వేంక. ఆం. 9. **తూఁడుమేపుడుపుల్గు** వి. హంస, తూడు ఆహారంగా గలది. అచ్చ.రా.యుద్ధ. 592. **తూఁడువిల్తుఁడు** వి. మన్మథుడు వేంక. ఆం. 8.

**తూతురిబెండ** రూ.చూ తుత్తురుబెండ. వి. పచ్చని పూలుపూసే ఒక మొక్క (Sida Cordifolia).

**తూతురు** వి. కంబళిచెట్లు, పూతికపళ్ళ చెట్లు.

**తూనంగి** రూ.చూ. తోడెంగ. వి. మాగాణిలో పెరిగే కలుపు మొక్క.

**తూనరతుక్కము** చూ. తూరన తుంకములు. వి. బాలక్రీడా విశేషం.

**తూనిక** చూ. తూను.

**తూనికకోల** చూ. తూను.

**తూనికగుండు** చూ. తూను.

**తూనికచెడు** చూ. తూను.

**తూనికదండె** చూ. తూను.

**తూనికరాయి** చూ. తూను.

**తూనికవేయు** చూ. తూను.

**తూనికి** చూ. తూను.

**తూనికె** చూ. తూను.

**తూనిగ** రూ. తూనీఁగ. వి పతంగిక, సెనగగింజ వంటి తల కలిగి పొడవైన తోక కలిగి అవిసె ఆకుల వంటి నాలుగు రెక్కలు గల కీటక విశేషం. భార.ఆది. 4.271.

క. తిప్పఱ్, తుప్పఱ్. పిట్టఈక, తిప్పఱి. కొన్ని పావురాల కాళ్ళ మీద ఉండే ఈకలు ; కొడ. తొప్పిటు. ఈక ; తు. తుయి ; త. తూవల్. ఈక, తూవి, తూ ; మ. తూవల్, తొప్ప, తొప్పల్ ; తొ. తు,ఫ్య. పక్షి తోక.

పో.చూ. సం. తూల-. పత్తి.

**తూనిగతానిగ** రూ. తూనీఁగ తానిగ. వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146. త. తూకుక్కత్తాకుక్క.

**తూనిగిలఁబడు(-పడు)** చూ. తూను.

**తూనిగ్గుండు** చూ. తూను.

**తూనీఁగ** రూ.చూ. తూనిగ. వి. పతంగిక, సెనగగింజ వంటి తల కలిగి పొడవైన తోక కలిగి అవిసె ఆకుల వంటి రెక్కలగల కీటకం.

**తూనీఁగతానిగ** రూ.చూ. తూనిగతానిగ. వి. బాలక్రీడ.

**తూను** చూ. తూఁగు. అ.క్రి. **1**. చలించు, కదులు ; **2**. ఉద్ధతమగు, వెడలు ; **3**. తానులో తూనికపడు, తోలనం పొందు ; **4**. తూలిపోవు, దుర్బలమగు, నిస్సత్వమగు ; **5**. కూరుకు, కునికిపట్టు, తంద్రచెందు ; **6**. సిద్ధమగు, సన్నద్ధమగు ; **7**. జరుగు, సాగు, ప్రవర్తిల్లు : **8**. ఊగు ; **9**. శక్తమగు, సమర్థమగు ; **10**. తుల్యమగు, సమమగు ; వి. కునికిపాటు, తంద్ర ; విణ. ఊగేది.

**తూనిక** రూ.చూ. తూన్కి. వి. **1**. బలం. బసవ. 4.104 పు. ; **2**. పోలిక, సామ్యం. భాగ. 9.230 ; **3**. ఉన్మాదం, తానుతో తూయటం. **తూనికకోల** వి. తాను దండె, తులాదండం. ఆం.భా. 2.300. **తూనికగుండు** రూ. తూనిగ్గుండు, తూనెగ్గుండు. వి. నవలక్షగుండు, దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందకి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటి రాయి. **తూనికచెడు** అ.క్రి. తేలికపడు. బసవ. 4.71. **తూనికదండె** వి. తానుకు మధ్యనున్న దండె. **తూనికరాయి** వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటి రాయి. **తూనికవేయు** స.క్రి. తూచు. **తూనికి** రూ.చూ. తూన్కి. వి. తానులో తూచటం, ఉన్మానం. **తూనికె** రూ.చూ. తూన్కి. వి. తూనిక. **తూనిగిలఁబడు** అ.క్రి. ఈడిగిలబడు. పండి. చ. పురా. 461 పుట. **తూనిగ్గుండు** రూ.చూ. తూనికగుండు. వి.

నవలక్షగుండు, దండెదగ్గర, పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటిరాయి. **తూనుకోల** రూ.చూ. తునికోల. వి. తూచుకొనే కోల, త్రాసుగడ. **తూనెకొట్లాట** వి. బాలక్రీడ.

**తూనెకొట్లాట** చూ. తూను.

**తూనెగ్గుండు** రూ.చూ. తూనికగుండు. వి. నవలక్షగుండు, దండె దగ్గర, పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టి దండె అవతలకు వేలాడ దీసిన గుండ్రటి రాయి.

**తూనేల** రూ.చూ. తువ్వనేల. వి. తపుడులాగ ఉండే మెత్తని ఇసకనేల.

**తూన్కి** రూ. తూనిక, తూనికి, తూనికె. వి. కాసులో తూచటం, ఉన్మానం. భార.అను. 5.104.

క. తూగికె. తూచటం; తు. తూంకణ, తూంకి. ఊగటం; మ. తూజ్ఞల్. వేలాడటం; కువి. తూంగలి, తూఖలి, తూంగినై. ఊగటం.

**తూన్చు** చూ. తూనిక. స.క్రి తూనికవేయు, తోలనం చేయు. కు.సం. 9.13. పో.చూ.

క. తూణ. తీవ్రచలనం, కంఠ స్వరం కంపించు, తూన్.

<*తుయ్-ల్/*తుయ్-న్.

**తూ(తకొమ్ము** వి. మురళి, పిల్లనగ్రోవి. వేంక. పంచ. 1.588.

త. తూతనకొంబు. పిల్లనగ్రోవి.

**తూపర** రూ.చూ. తువ్వర. వి. **1**. శీకరం; **2**. చిన్నచిన్న బొట్లు గల జల్లు.

**తూపరము** విణ. **1**. భ్రష్టమైన, చెడిపోయిన. నృసింహ. 2.57; **2**. చిల్లులుపడిన; వి. **1**. కందకం, గుహ. ఆం. భా. 1.145; **2**. చిల్లి, రంధ్రం: **3**. పిల్లకాలవ; **4**. తూములు కలిసే కప్పులోని భాగం.

క. తూబు, తూమ్బు. గొడ్డలి మొ॥ వాటి తూము, చెవికమ్మగొట్టం; తు. తూమ్బర. పార తూము, తూమ్బరు. పెద్దరంధ్రం, తూబె. రంధ్రం, తూమ్బు, తూమ్బె, సూమ్బు, సమ్బు, సుమ్బె. తూము; త. తూమ్బు. గొట్టం, తూము, వెదురుగొట్టం; మ. తూమ్బు. తూము; పర్జి. తుమ్‌బొత్త, తుమ్‌బుక్క, తూము; మాల్తో. తుమ్బ్డ, తొమ్బ్రబ.

**తూపరాణ** రూ.చూ. తూపరాణి. వి. నీళ్ళు బయటకు వచ్చే తూము, జలదారి.

**తూపరాణము** రూ.చూ. తూపరాణి. వి. నీళ్ళు బయటికి వచ్చే తూము, జలదారి. ఆం.భా. 1.154.

**తూపరాణి** చూ. తూము[1]. రూ. తూపరాణ, తూపరాణము. తూపరాని, తూపురాని. వి. నీళ్ళు బయటికి పోయే తూము, జలదారి. ఆము. 6.10.

క. తుంబు, తూబు. జలదారి; తు. తూంబరు. జలదారి; త. తూంపు. పిల్లకాలవ; మాల్తో. తుంబ్డ. జలదారి, తొంబ్రబ. గొట్టం.

<తూము[1]+రాయి.

**తూపరాని** రూ.చూ. తూపరాణి. వి. నీళ్ళుపోయే దారి.

**తూపాల** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యం నుంచి పొల్లును వేరుచెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి.

**తూపి** వి. గుడిలో మూలవిగ్రహం ఉండే చోటుకు విమానంలా ఎత్తుగా కట్టిన కట్టడం.

త. తూపి. గుడి మొ॥వాటి గోపురం, శిఖరం.

సం. స్థూప-. బుద్ధుని అవశేషాల మీద కట్టిన కట్టడం; ప్రా. థూప-.

<త. తూపి.

**తూపు** వి. బాణం, అమ్ము. కు.సం. 7.41.

**తూపురిక్క** వి. బాణాకారంగా ఉండే నక్షత్రం, శ్రవణానక్షత్రం. **తూపురిక్కనెల** వి. శ్రావణమాసం. **తూపురూపురిక్కనెల** వి. శ్రావణమాసం.

**తూపురాని** రూ.చూ. తూపరాణి. వి. నీళ్ళుపారే తూము.

**తూపుల్లగొంగడి** వి. లావుపాటి దారంతో నేసిన ఒకరకం గొంగడి.

**తూపోల** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యం నుంచి పొల్లును వేరుచెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి.

**తూము**[1] వి. **1**. జలనిర్గమద్వారం, జలదారి. క్రీడా. 28; **2**. (సూది మొ॥వాటి) తొలి, రంధ్రం. పరమ. 1.162; **3**. బండిచక్రం నడిమిరంధ్రం; **4**. నగల మోపులోని రంధ్రం; **5**. గూనముంత, గూనకొయ్యకు ముందున్న రూపం; **6**. పంటకాలవకు పక్కన చేర్చివేసే కుండతూర; **7**. చెరువునీళ్ళు బయటికిపోయే గొట్టం; **8**. కప్పుమీది నీరు కిందకు జారడానికి అమర్చిన పొడుగాటి త్రోవి; **9**. గొడ్డలి, పార మొ॥వాటి కామ బిగించడానికి చేసిన రంధ్రం; **10**. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు; **11**. నాలుగు కుంచాల కొలమానం.

క. తూబు. బండిచక్రం నడిమిరంధ్రం, గొడ్డలి మొ॥ వాటి తూము; తు. తూమ్బర. పారతూము, తూమ్బరు. పెద్దరంధ్రం. తూబె. గొట్టం, తూమ్బు, తూమ్బె. సూమ్బు, సుమ్బు. రంధ్రం; త. తూమ్బు. గొట్టం, బండిచక్రం నడిమిరంధ్రం, జలదారి; మ. తూమ్బు, జలదారి, గొట్టం; పర్జి. తుమ్‌బొత్త, తుమ్‌బుక్క, తూము; మాల్తో. తుమ్బ్డ. తొమ్బ్రబ.

**తూముకట్టు** వి. బండి కుండకు కట్టిన ఇనపకట్టు. **తూము కాలువ** వి. **1**. జలనిర్గమద్వారాలుగల కాలవ. క్రీడా. 29; **2**. మురికినీరు పోవడానికి ఏర్పాటుచేసిన చిన్నకాలవ. **తూము తుండు** వి. నీటిపారుదల అవసరం లేనపుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగా వేసే కొయ్యమొద్దు. **తూముపార** వి. రేకున్న తూములో కఱ్ఱ దిగవేసిన సెలగపార. **తూముబండ** రూ. తూంబండ. వి. నీటిపారుదల అక్కరలేనప్పుడు చెరువు తూముకు అడ్డంగా వేసిన బండ. **తూముమాను** రూ. తూమ్మాను. వి. నీటిపారుదల అవసరంలేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంవేసే కొయ్యమొద్దు. **తూముమొద్దు** రూ. తూమ్మొద్దు. వి. నీటిపారుదల అవసరంలేనపుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగావేసే కొయ్యమొద్దు.

**తూమెణు** విణ. తూమెడు. చేపూరుశాసనం. క్రీ.శ. 915.25.

**తూంబండ** రూ.చూ. తూముబండ. వి. నీటిపారుదల అక్కరలేనప్పుడు చెరువు తూముకు అడ్డంగా వేసిన బండ. **తూమ్మాను** రూ.చూ. తూముమాను. వి. నీటిపారుదల అవసరంలేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగా వేసే కొయ్యమొద్దు. **తూమ్మొద్దు** రూ.చూ. తూముమొద్దు. వి. నీటి పారుదల అవసరం లేనప్పుడు చెరువు తూము రంధ్రానికి అడ్డంగా వేసే కొయ్యమొద్దు.

**తూము**$^{2}$ రూ.చూ. తుంబు. వి. **1**. ఒకానొక భూమానం. 2/5 ఎకరం. ద.హిం.శా. సంపు. **4**. శా.సం. **781**. క్రీ.శ. 1235 ; **2**. నాలుగు కుంచాల కొలపాత్ర. విజ్ఞా. ప్రా. 65 పల్నా. **42**; **3**. ఒక కొలమానం.

**తూంకడవ** వి. తూముడు (32 శేర్లు) నీళ్ళకు తక్కువ గాకుండా పట్టే పెద్దకడవ. **తూముకాగు** వి. తూమెడు గింజలు పట్టే కాగు.

**తూమెఱు** చూ. తూము$^{1}$.

**తూంబండ** చూ. తూము$^{1}$.

**తూఁపర** రూ.చూ. తువ్వర. వి. **1**. నీరు మొ॥వాటి బొట్టు. కళా. 7.370 ; **2**. చిన్నచిన్న బొట్లుగల జల్లు.

**తూమ్మాను** చూ. తూము$^{1}$.

**తూమ్మొద్దు** చూ. తూము$^{1}$.

**తూర**$^{1}$ రూ.చూ. తువ్వర. వి. **1**. ధార, జల్లు. ఆం.భా. 1.95 ; **2**. వానబొట్టు, శీకరవర్షం.

**తూర**$^{2}$ రూ.చూ. తూఱ. వి. **1**. కప్పుమీది నీరు కిందికి కారడానికి వీలుగా అమర్చిన పొడుగాటి క్రోవి ; **2**. నీళ్ళు పారే తూము.

**తూర**$^{3}$ రూ. తూల. వి. **1**. ఒకరకం పెద్దచేప. ఆం.భా. 1.185 ; **2**. పండుచేప.

**తూరనఁగోలలు (-కోలలు)** చూ. తూఱగోలలు. వి. బ. వ. తూరనతుంకాలు, బాలక్రీడావిశేషం. విష్ణుపు. 9.202.

**తూరనతుంకములు** రూ.చూ. తూరనతుంకాలు. వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 3.146.

**తూరనతుంకాలు** రూ. తూరనతుంకములు, తూర్నతుంకాలు. వి.బ.వ. బాలక్రీడావిశేషం. కాశ 3.33.

**తూరఁదారుపోవు** అ.క్రి. చెడిపోవు. కాశీ. 4.142.

**తూరి** వి. పర్యాయం, ఆవృత్తి, తడవ. కాశీ. 5.195.

**తూరు**$^{1}$ అ.క్రి. సన్నగా తుంపరరాలు, శీకరవర్షం కురియు.

క. తూఱు. తుంపరలుపడు, తూఱలు, తున్తుఱ్, తున్తుఱి, తూపఱు, జూపఱ, జూపఱు, తూరు ; త. తూఱు (తూఱి-), తూఱల్, తూఱ్ఱల్, తువఱ్ఱు (తువఱ్ఱి-). తుంపరలుపడు, తువఱల్. తుంపర, తూవల్. చినుకులు పడటం, తువళై. తుంపర, తూవు. వర్షించు, తూఱ్ఱు. వ్యాపించు, ప్రసరించు ; మ. తూఱ్ఱల్. తుంపరవాన, తూకుక, తూవ్రుక. తుంపరలుపడు, తూఱ్ఱు. ప్రసరించు, వెదజల్లు ; గోం. తూర్. దుమ్ము మొ॥ గాలిలో ఎగురు ; కొలా. తూక్. దుమ్ము.

< మూ.ద్రా. *తూవ్-/*తువ్.

**తూరు**$^{2}$ వి. తుచ్ఛధాన్యం, పొల్లుధాన్యం. ఆం.భా. 2.238. స.క్రి. **1**. పొలు పోవడానికి ధాన్యాదుల్ని గాలి కెగరబోయు ; **2**. గద్ద మొదలైన పక్షులు తటాలున ఏటవాలుగా వేగంతో కిందకు దిగి వెంటనే పైకి ఎగిరిపోవు.

క. తూఱు. చెరుగు, తూర్పారబట్టు ; తు. తూపుని, తూపు. చెరుగు ; త. తూఱ్ఱు (తూఱ్ఱి-). వ్యాపింపజేయు, తూర్పారబట్టు ; మ. తూఱ్ఱుక. చెరగటం ; గోం. తూరానా, తురెహ్తాన, తురెహ్ ; కొలా. తూర్పెత్- (తూర్పెత్త్-). చెరుగు.

పో.చూ. సం. శూర్ప-.

**తూరుగడ(-కడ)** రూ. తూలుగడ. వి. తూర్పార పొయ్యకముందు పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపు రాసి. **తూరుగడబోయు(-పోయు)** స.క్రి. పొలంలో గట్టిగింజను వేరు పరచటానికి చేటల్తో ఎత్తి తూర్పార పోయు. **తూరుతట్ట** వి. తూర్పార పొయ్యటానికి ఉపయోగించే తట్ట. **తూరుతుంకములాడు** అ.క్రి. వేలాడు. విప్ర. 6.19. **తూరుపట్టు** స.క్రి. చెరగు, తూర్పారబోయు. **తూరుపానఁబట్టు(-పట్టు)** రూ.చూ. తూరుపువాఱఁబట్టు. స.క్రి. **1**. తీవ్రంగా విమర్శించు ; **2**. ధాన్యాదులలోని పొల్లు పోవటానికి గాలికెదురుగా చేటలతో ఎగరబోయు. **తూరుపాఱఁబట్టు(-పట్టు)** రూ.చూ. తూరుపువాఱఁబట్టు. స.క్రి. **1**. పొల్లుపోవడానికి ధాన్యాదుల్ని గాలికెగరబోయు ; **2**. ఎగరబోయు ; **3**. తిట్టు. **తూరుపాఱు** అ.క్రి. వ్యాపించు. హర. 6.64. **తూరుపాల** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో ఉన్న పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి. **తూరుపు**$^{2}$ రూ.చూ. తూర్పు$^{2}$. వి. సద్గ్రహణం, ఎగరబోసి మంచి ధాన్యాన్ని పొల్లునుంచి విడదీయటం. **తూరుపుగుల్ల** రూ. తూర్పుగుల్ల. వి. ధాన్యం తూర్పార పొయ్యటానికి ఉపయోగించే వెదురుపేళ్ళ తట్ట. **తూరుపుటికె** వి. తూర్పార బోయటానికి వెదురుబద్దలతో అల్లిన పనిముట్టు. **తూరుపుపీట** రూ. తూరుప్పీట. వి. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టిన మూడుకాళ్ళ పీట. **తూరుపుబుట్ట** రూ. తూరుబ్బుట్ట. వి. ధాన్యం తూర్పార పోయటానికి ఉపయోగించే వెదురుపేళ్ళ తట్ట. **తూరుపువాఱఁబట్టు** రూ. తూరుపానఁబట్టు, తూరుపాఱఁబట్టు, తూర్పానఁబట్టు, తూర్పాఱఁబట్టు, తూర్పువాఱఁబట్టు స.క్రి. **1**. పొల్లు పోడానికి ధాన్యాదుల్ని గాలికెగరబోయు. కువ.చ. 1.88 ; **2**. ఎగరబోయు ; **3**. తిట్టు. < తూరుపు$^{2}$ + పాఱు + -అ$^{7}$ + పట్టు. **తూరుపెత్తు** రూ. తూర్పెత్తు. స.క్రి. **1**. వెంట్రుకలు దులుపు, జాడించు. పాండు. 3.30 ; **2**. గాలికెగరబోయు, గాలికి వాటంగా ఎత్తి విడుచు. నిరంకు. **4.84** ; **3**. నిందించు. శుక. 2.105 ; **4**. పొల్లు పోడానికి ధాన్యాదుల్ని గాలికెగరబోయు ; **5**. ఎగరగొట్టు, రేపు ; **6**. వేధించు, బాధించు. < తూరుపు$^{2}$ + ఎత్తు. **తూరుపోత** రూ. తూర్పోత, తూరోపత. వి. పొల్లు పోగొట్టడానికి ధాన్యాన్ని ఎగరబోయటం. **తూరుప్పీట** రూ.చూ. తూరుపుపీట. వి. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టిన మూడుకాళ్ళ పీట. **తూరుబ్బుట్ట** రూ.చూ. తూరుపుబుట్ట. వి. ధాన్యం తూర్పార పోయటానికి ఉపయోగించే వెదురుపేళ్ళ తట్ట.

**తూరు**[3] రూ.చూ. తూఱు. అ.క్రి. **1.** చొచ్చు, చేయు పూనిక ; **2.** ఉదయించు.

**తూరుపు**[1] చూ. కూఱు. రూ.చూ. తూఱ్పు. వి సూర్యుడు ఉదయించే దిక్కు, ప్రాగ్దిశ. హర. 2.25.

**తూరుపుకొడవలి** వి. కక్కుల కొడవలి, పదును వైపు నొక్కులు నొక్కులుగా ఉన్న కొడవలి. **తూరుపుకొండ** రూ. తూరుపు(గొండ, తూర్పుకొండ. వి. తూర్పుగుబ్బలి, ఉదయపర్వతం. ఆం.భా. 2.28. **తూరుపుగట్టు** వి. తూర్పుకొండ, ఉదయపర్వతం. ఉ.రా. 4.151. **తూరుపుగుబ్బలి** రూ. తూర్పుగుబ్బలి. వి. ఉదయపర్వతం, పూర్వాద్రి. ప్రబంధ. 124. **తూరుపు(గొండ(-కొండ)** రూ.చూ. తూరుపుకొండ. వి. ఉదయాద్రి. **తూరుపుదొర** రూ.చూ. తూర్పుదొర. వి. పూర్వదిక్పతి, ఇంద్రుడు. ఆం. భా. 1.46. **తూరుపుమల** రూ.చూ. తూర్పుమల. వి. ఉదయపర్వతం, తూరుపుగుబ్బలి. **తూరుపురేకలారు** అ.క్రి. తెల్లవారు. < తూరుపురేక + -లు + -ఆరు. **తూరుపుఱేఁడు** వి. ఇంద్రుడు.

**తూర్చు** రూ. తూఱుచు, దూర్చు. స.క్రి. **1.** తూరజేయు, చొప్పించు. భార. ద్రోణ. 5.156 ; **2.** నాటు.

క. తూఱు, తూఱిసు. దూర్చు ; పో.చూ. త. తుఱు ; గోం. దుర్సానా ; కురు. తుర్ద్‌నా, తర్దఆనా.

**తూర్నతుంకాలు** రూ.చూ. తూరనతుంకాలు. వి.బ.వ. బాలక్రీడావిశేషం. ఇందు. 2.18.

**తూర్పక్కుళ్ళు** చూ. తూర్పు[1].

**తూర్పాత** చూ. తూర్పు[2]

**తూర్పాన** చూ. తూర్పు[2].

**తూర్పాన(బట్టు** చూ. తూర్పు[2].

**తూర్పార** చూ. తూర్పు[2].

**తూర్పాఱ** చూ. తూర్పు.[2]

**తూర్పాఱ(బట్టు** చూ. తూర్పు[2].

**తూర్పాల** చూ. తూర్పు[2].

**తూర్పిడి** చూ. తూర్పు[3].

**తూర్పు**[1] చూ. తూఱు. రూ.చూ. తూఱ్పు. వి. సూర్యుడుదయించే దిక్కు, ప్రాగ్దిశ. భార.ఆది. 6.216.

**తూర్పక్కుళ్ళు** వి.బ.వ. విశాఖపట్నం వైపువేసే అక్కుళ్ళ రకం వరి. **తూర్పుకొండ** రూ.చూ. తూరుపుకొండ. వి. ఉదయాద్రి. **తూర్పుగుబ్బలి** రూ.చూ. తూరుపుగుబ్బలి. వి. ఉదయపర్వతం, పూర్వాద్రి. అచ్చ.రా. అయో. 18. **తూర్పుదొర** రూ. తూరుపుదొర. వి. ఇంద్రుడు. భోజను. 1.25. **తూర్పుపొగాకు** వి. ఒకరకం పొగాకు. (Nicotiana tabacum). **తూర్పుమల** రూ. తూరుపుమల. వి. ఉదయాద్రి. అచ్చ.రా.యుద్ధ. 403. **తూర్పురాయఁడు** వి. ఇంద్రుడు. అచ్చ.రా.యుద్ధ. 592

**తూర్పు**[2] చూ. తూరు. రూ. తూరుపు[2]. వి. సద్గ్రహణం, ఎగరబోసి మంచి ధాన్యాన్ని పొల్లు నుండి విడదీయటం.

**తూర్పాత** రూ.చూ. తూరుపోత. వి. పొల్లు వేరయ్యేట్టు గాలికి ఎత్తునుంచి ధాన్యాన్ని పొయ్యటం. **తూర్పాన** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో ఉన్న పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి. **తూర్పాన(బట్టు(పట్టు)** రూ.చూ. తూరుపువాఱ(బట్టు. స.క్రి. తీవ్రంగా విమర్శించు. **తూర్పార** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో ఉన్న పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి. **తూర్పాఱ** రూ. తుపాల, తూపాల, తూపోల, తూరుపాల, తూర్పాన, తూర్పార, తూర్పాల. వి. పవనం, తూర్పెత్తటం. ఆం.భా. 3.32. **తూర్పాఱ(బట్టు(-పట్టు)** రూ.చూ. తూరుపువాఱ(బట్టు. స.క్రి. **1.** పొల్లు పోవడానికి ధాన్యాదుల్ని గాలికెగర బోయు ; **2.** ఎగరబోయు ; **3.** తిట్టు. **తూర్పాల** రూ.చూ. తూర్పాఱ. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో ఉన్న పొల్లును వేరు చెయ్యటానికి చేటలతో ఎత్తునుంచి గాలికి పోసే పద్ధతి. **తూర్పిడి** వి. తూర్పార బట్టటం. **తూర్పుగుల్ల** రూ.చూ. తూరుపుగుల్ల. వి. ధాన్యం తూర్పార పొయ్యటానికి ఉపయోగించే వెదురుపేళ్ళ తట్ట. **తూర్పువాఱ(బట్టు** రూ.చూ. తూరుపువాఱ(బట్టు. స.క్రి. **1.** పొల్లుపోవటానికి ధాన్యాదుల్ని గాలికెగరబోయు ; **2.** ఎగరబోయు ; **3.** తిట్టు. **తూర్పెత్తు** రూ.చూ. తూరుపెత్తు. స.క్రి. **1.** ఎగరగొట్టు, రేపు. రామాభ్యు. 9.34 ; **2.** పొల్లుపోవడానికి ధాన్యాదుల్ని గాలికెగరబోయు. శివధ. 5.9 ; **3.** వేధించు, బాధించు. చంద్రాంగ. 3.86 ; **4.** గాలికెగరబోయు, గాలికివాటంగా ఎత్తివిడుచు. శుక. 2.578 ; **5.** వెంట్రుకలు దులుపు, జాడించు. **తూర్పోత** రూ.చూ. తూరుపోత. స.క్రి. పొల్లువేరయ్యేట్టుగాలికి ఎత్తునుంచి పొయ్యటం.

**తూర్పుగుంటచువ్వ** చూ. తూర్పు. వి. మగ్గం అచ్చుదగ్గర ఆనిలో దూర్చిన సన్నబెత్తం.

**తూర్పెత్తు** చూ. తూర్పు[2].

**తూర్పోత** చూ. తూర్పు[2].

**తూఱ** చూ. తూఱు. రూ. తూర[2]. వి. పిల్లకాలవనుంచి పంట చేలకు నీరు పారడానికి తాటి బొందలు మొ. వాటితో ఏర్పరచిన తూము.

**తూఱగొను** చూ. తూఱు.

**తూఱగోలలు** చూ. తూఱు.

**తూఱనాడు** చూ. తూఱు.

**తూఱనెత్తు** చూ. తూఱు.

**తూఱ(బడు** చూ. తూఱు.

**తూఱిపోవు** చూ. తూఱు.

**తూఱు** రూ. తూరు[3], దూరు. స.క్రి. **1.** చొచ్చు, ప్రవేశించు. భార. ఆది. 8.79 ; **2.** కిందినుంచి దూరిపోవు, చొచ్చి బయల్వెడలు. భాగ. 10పూ. 1339 ; **3.** ప్రార్థించు, వేడు. నిరంకు. 1.71 ; అ.క్రి. **1.** వైబడు, కవియు. కు. సం. 8.101 ; **2.** అధికమగు. భార. విరా. 1.182.

క. తూఱు, తూఱిసు. చొచ్చు ; త. తుఱు. చేరు, ప్రవేశించు, తూర్ (తూర్‌త్-). చొప్పించు, నింపు ; మ. తూరుక. కుక్కు, కూరు ; గోం. దుర్స్-. దూర్చు ; కువి. తుస్ప ; కురు. తుర్ద్‌నా, తుర్దఅనా, తూర్ - (తూర్చ్-) ; పో. చూ. త. తుఱు.

<మూ. ద్రా. *తూఱ్-/*తుఱ్.

తూఱకొను అ.క్రి. 1. పూను, కడగు, ఉద్యమించు. భాగ. 3.530 ; 2. చొచ్చు, ప్రవేశించు. భాగ. 10ఉ. 931 ; 3. కలుగు. నవనాథ 1.47. పు. 11పం. ; 4. అతిశయించు. విష్ణుపు. 1.73 ; స.క్రి. 1. గౌరవించు. భాగ. 8.450 ; 2. గ్రహించు. ఉ. హరి. 1.155. <తూఱు + కొను. తూఱఁగొను (-కొను) రూ.చూ. తూఱుకొను. అ.క్రి. దూరి పోవు. తూఱఁగోలలు (-కోలలు) వి.బ.వ. జతగాపడే బాణాలు. కు. సం. 12.136. తూఱనాడు అ.క్రి. దూరి పోయేట్లు వేయు. జైమినిభా. 5.31. <తూఱు + -అ$^{7}$ + ఆడు. తూఱనెత్తు స.క్రి. వెడలనడచు, తరిమి తరిమికొట్టు. కు.సం. 11.46. <తూఱు + -అ$^{7}$ + ఎత్తు. తూఱఁబడు అ.క్రి. తూరు, చొచ్చు. నిర్వ. రా. 4.76. <తూఱు + -అ$^{7}$ + పడు. తూఱిపోవు అ.క్రి. తప్పించుకొని పోవు. హరి. పు. 9.48. తూఱుకొను రూ. తూఱగొను. స.క్రి. చొచ్చు, ప్రవేశించు. కు. సం. 10.64. తూఱుచు రూ.చూ. తూర్చు. స.క్రి. 1. తూరజేయు, చొప్పించు. శృం. నై. 4.81 ; 2. నాటు ; 3. గుచ్చు. తూఱుదండెము వి. భూమి మీద ముంగాళ్ళు ముంజేతులు ఉంచి మీద శరీరాన్ని ధనురాకారంగా నిలిపి, ఆనిన ముంజేతులు నడిమి ఖాళీనుండి రొమ్ముపైకి వచ్చేటట్లు చేసే గరిడీ సాధనలలో ఒకటి, ఒకరకమైన గరిడీ. తూఱుదండెములాడు అ.క్రి. 1. తూరుదండేల సాధనచేయు. అని. 3.76 ; 2. కలిసిపోవు. <తూఱుదండెము + -లు + ఆడు.

తూఱుప్పు చూ. తూఱు. రూ. తుర్పు, తూరుపు$^{1}$, తూర్పు$^{1}$. వి. సూర్యుడుదయించే దిక్కు, తూర్పు. లక్ష్మీపురశాసనం. క్రీ.శ. 675.

తూల రూ.చూ. తూర$^{3}$. వి. 1. ఒకరకం పెద్దచేప. ఆం. భా. 1.185 ; 2. పండుచేప.

తూలగించు చూ. తూలు$^{1}$.

తూలఁగనాడు చూ. తూలు$^{1}$.

తూలనాడు చూ. తూలు$^{1}$.

తూలఁదోలు చూ. తూలు$^{2}$.

తూలపుచ్చు చూ. తూలు$^{1}$.

తూలపోవు చూ. తూలు$^{1}$.

తూలఁబడు చూ. తూలు$^{1}$.

తూలఁబలుకు చూ. తూలు$^{1}$.

తూలఁబాఱు$^{1}$ చూ. తూలు$^{1}$.

తూలఁబాఱు$^{2}$ చూ. తూలు$^{2}$.

తూలాడు చూ. తూలు$^{1}$.

తూలి వి. తూలికాడు, చేపలుపట్టి జీవించే ఒకజాతివాడు.

తులికాఁడు వి. కైవర్తుడు, జాలరి. ఆం. భా. 1.158.

తూలివాఁడు విణ. చేపలుపట్టేవాడు.

తూలికొను చూ. తూలు$^{1}$.

తూలించు చూ. తూలు$^{1}$.

తూలిపోఁబలుకు చూ. తూలు$^{1}$.

తూలిపోవు చూ. తూలు$^{1}$.

తూలియాడు చూ. తూలు$^{1}$.

తూలు$^{1}$ అ.క్రి. 1. చలించు, కదులు. భార. ఆది. 2.92 ; 2. పడు. కు. సం. 2.88 ; 3. భయాదులచే వణకు, కంపించు. కు. సం. 5.155 ; 4. వేలాడు. కు. సం. 12.17 ; 5. చెడు. భార. విరా. 2.70 ; 6. సుక్కు, డయ్యు, కృశించు. భార. శాంతి. 3.363 ; 7. ఒరుగు, వాలు. ఉ. హరి. 1.54 ; 8. దుఃఖపడు. ఉ. హరి. 2.11 ; 9. తగ్గు. గౌ. హరి. పూ. 1699 పం. ; 10. మత్తు మొ॥ వాటిచే ఊగు, ఊగాడు. ఆము. 2.25 ; 11. నశించు. విష్ణుపు. 1.144 ; 12. ఎగయు, ప్రతిఘాతంవల్ల పైకురుకు విష్ణుపు. 2.134 ; 13. అవమానం పొందు ; 14. మాటజారు ; స.క్రి. అవమానం పొందేటట్లు పలుకు, నిందించు. కు. సం. 2.32 ; విణ. పరుషమైన, దూషణకరమైన ; వి. 1. వ్యర్థమైనమాట ; 2. గోడ మొ. వాటి బరువు.

తు. తూలుని. ఊగు, తిరుగు, మగతగా ఉండు (వెంట్రుకలు) ఎగురు, వంగు, నశించు ; త. తూయల్. ఊగు, తూర్. నశించు, అదృశ్యమగు, తుయర్. దుఃఖపడు, తుయంకు. మూర్ఛపోవు. తుయక్కు. గ్లాని, దుఃఖం ; కువి. తూ. అదరు.

<మూ. ద్రా. *చుయ్-/*-తుయ్.

తూలగించు స.క్రి. తృణీకరించు. నవనాథ. 1.55పు. 22పం. సం. తూల-. దూది. <తూలు$^{1}$ + -ఇంచు$^{3}$. తూలఁగనాడు స.క్రి. దూషించు, నిందించు, తిట్టు. కాశీ. 6.223. <తూలు$^{1}$ + -అ$^{7}$ + అగు + -అ$^{7}$ + ఆడు. తూలనాడు స.క్రి. 1. దూషించు, నిందించు, తిట్టు. కాశీ. 4.215 ; 2. పోవోచు, తిట్టు. రుక్మా. 2.28. <తూలు$^{1}$ + -అ$^{7}$ + ఆడు. తూలపుచ్చు స.క్రి. 1. లాఘవపరచు, తక్కువపరచు, అవమానించు. భార.ఉద్యో. 3.298 ; 2. పోగొట్టు, హరించు. రామాభ్యు. 7.157 ; 3. సుక్కించు, నిస్సత్వం చేయు, వాడించు. అచ్చ.రా.యు. 151. తూలపోవు అ.క్రి. 1. తూలు, చలించు. భార.విరా. 4.69 ; 2. లాఘవం పొందు, భంగపడు. భార.భీష్మ. 2.257 ; 3. సుక్కు, బడలు, బాధపడు. పి.శకు. 3.25. తూలఁబడు అ.క్రి. కిందపడు. <తూలు$^{1}$ + -అ$^{7}$ + పడు. తూలఁబలుకు (-పలుకు) స.క్రి. నిందించు, తిట్టు. భోజ. 5.306. <తూలు$^{1}$ + -అ$^{7}$ + పలుకు. తూలఁబాఱు$^{1}$ అ.క్రి. చలించు. కాశ. 2.60. <తూలు$^{1}$ + -అ$^{7}$ + పాఱు. తూలాడు రూ.చూ. తూలియాడు. అ.క్రి. 1. వణకు. కంపించు. భార.విరా. 5.184 ; 2. చలించు. నవనాథ. 4.119 పు. 5 పం. ; 3. మద్యపానాదులచే ఊగాడు, తూగాడు. <తూలు$^{1}$ + ఆడు. తూలికొను అ.క్రి. 1. వాలు, పడు. కు.సం. 2.180 ; 2. మత్తు మొ॥ వాటిచే తూగు, ఊగాడు. కువ.చ. 1.88. తూలించు స.క్రి. 1. తొలగించు, జార్చు. భార.విరా. 2.64 ; 2. బాధించు. భాస్క.రా.సుందర. 184 ; 3. పడేటట్లుచేయు. హర. 6.16 ; 4. పోగొట్టు. పారి. 3.8 ; 5. స్రుక్కించు. మను. 4.42 ; 6. చెదరగొట్టు. చంపూరా. 8.77 ; 7. చంపు. రామరా. 8.199. <తూలు$^{1}$ + -ఇంచు$^{3}$. తూలిపోఁబలుకు (-పలుకు) స.క్రి. నిందించు. ఉ.హరి.

3.17. **తూలిపోవు** అ.క్రి. 1. అవమానంపొందు, లాఘవపడు ; 2. నిస్సత్త్వమగు ; 3. కృశించు. **తూలియాడు** రూ. తూలాడు. విణ. తిట్టుకొనేటటువంటి. కు.సం. 10.169 ; అ.క్రి. 1. చలించు. శృం.నై. 7.92 ; 2. మద్యపానాదులచే ఊగాడు, తూగాడు. శృం.నై. 8.14 ; 3. వణకు, కంపించు. < తూలు¹ + -ఇ + ఆడు. **తూలుచు** రూ. తూల్చు. స.క్రి. 1. చెదరగొట్టు. భాస్క.రా.యు. 1368 ; 2. చలింపజేయు. కకుత్స్థ. 1.196 ; 3. అణచు, పోగొట్టు. కవిక. 5.121 ; 4. చంపు. చంద్రికా. 1.38 ; 5. బాధించు. చంద్రికా. 1.38 ; 6. స్రుక్కించు ; 7. తొలగించు, జార్చు ; 8. పడేటట్లుచేయు. **తూలుమాటలు** వి.బ.వ. తిట్లు, బండబూతులు. **తూల్చు** రూ.చూ. తూలుచు. స.క్రి. 1. అణచు, పోగొట్టు. పల్నా. 25 ; 2. చెదరగొట్టు. పారి. 2.76 ; 3. స్రుక్కించు, బాధించు. పారి. 5.16 ; 4. తొలగించు, జార్చు. కవిక. 6.76 ; 5. చలింపజేయు ; 6. చంపు.

**తూలు²** అ.క్రి. 1. చెదరిపోవు, చెల్లాచెదరగు. కు.సం. 3.12 ; 2. తొలగు, అపసరిల్లు. విజ్ఞా.ప్రా. 32.

క. తూళు, తూళ్. ముందుకు లేదా వెనుకకు పోవు, తూళ్డు. తరుము, తొలగించు ; త. ఉలై. ఓడిపోవు, చెదరిపోవు, చెల్లాచెదరగు ; కువి. తూస్స. వంగు, వెనుదిరుగు ; పర్జి. తూల్. పరుగెత్తు, పారిపోవు ; కొలా. తూల్. పరుగెత్తు ; నా. తూల్. పరుగెత్తు, ప్రవహించు.

మూ.ద.ద్రా, మూ.మ.ద్రా. *తూళ్ : *ఉళ్.

< మూ.ద్రా. *చూళ్.

**తూల(దోలు** స.క్రి. పారదోలు. వి.క. 6.45. < తూలు² + -అ⁷ + తోలు². **తూల(బాఱు²** అ.క్రి. తొలగు. < తూలు² + -అ⁷ + పాఱు². **తూలుగడ(-కడ)** రూ.చూ. తూరుగడ. వి. తూర్పార పొయ్యకముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యపురాసి.

**తూల్చు** చూ. తూలు¹.

**తూవ** రూ.చూ. దువ్వ. వి. 1. పరాగం ; 2. ధూళి.

**తూవనేల** రూ.చూ. తువ్వనేల. వి. తవుడులాగా ఉండే మెత్తని ఇసకనేల.

**తూవర¹** రూ.చూ. తువ్వర. వి. 1. శీకరం ; 2. చిన్న చిన్న బొట్లుగల జల్లు.

**తూవర²** రూ.చూ. తువర². వి. 1. తొగరు, వగరు ; 2. వానచినుకు.

**-తె** ప్రత్య. 'ఒకడు, ఎవ్వడు' అనే సర్వనామాలకు వచ్చే మహతీవాచక ప్రత్యయం. ఉదా. ఒకతె, ఎవ్వతె.

పో.చూ. సం. స్త్రీ, ఆడది ; ప్రా. ఇత్థి.

< మూ.ద్రా. *-త్తి. మహతీవాచక ప్రత్యయం.

**తెకతెక** వి. 1. ఉడకటం, కాగటం మొ॥వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 2.64 ; 2. కాలటం, ఎండ కాయటం, పరితపించడం మొ॥వాటి కనుకరణం. రామాభ్యు. 5.30 ; 3. తాపం. కళా. 1.12.

క. తెక్క. ఒక అనుకరణధ్వని.

**తెకతెక(గ్రాఁగు (-క్రాఁగు)** అ.క్రి. తెకతెకమని ఉడుకు. పారి. 4.22. **తెకతెకమను** అ.క్రి. కుతకుతమను. < తెకతెక + అను. **తెకతెకమీఱు** అ.క్రి. తొందరపడు. వర.రా. బాల.పు. 3. పం. 5.

**తెకతేర** చూ. తేర. వి. 1. వ్యర్థం. వేంక.పంచ. 1.369 ; 2. మిక్కిలిఅనాయాసం, కడుసులభం ; క్రి.విణ. వ్యర్థంగా. వేంక.పంచ. 3.122.

క. తెగె. గ్రహించు, తీసుకొను ; తు. తెగుని ; త. తెక్కు.

**తెకలి** రూ. తెక్కలి². వి. బెరడు ఔషధాల్లో ఉపయోగపడే ఒక చెట్టు (Clerodendron Phlomoides).

**తెకాల్పడు** చూ. తెగులు. అ.క్రి. చేతగాక సొమ్మసిల్లు.

**తెక్కరము** చూ. తెక్కు. వి. విలాసం, ఒయ్యారం. ఆం.భా. 1.139.

**తెక్కలి¹** వి. 1 వంచన, మోసం. భార.శల్య. 2.402 ; 2. దొంగతనం, చౌర్యం భార.శాంతి. 2.89 ; 3. ప్రమాదం, పొరపాటు. భోజరా. 4.230 ; 4. బాధ, కష్టం. గా.హరి.ఉ. 2516 పం.

సం. తస్కర-. దొంగ ; ప్రా. తక్కర-.

< ప్రా. తక్కర-.

**తెక్కలికా(డు** వి. 1. అపహర్త, దొంగ. భార.స్త్రీ. 1.43 ; 2. వంచకుడు, మోసగాడు. భార.స్త్రీ. 2.137. **తెక్కలికొను** రూ.చూ. తెక్కలిగొను. స.క్రి. 1. అపహరించు, ఎత్తుకొనిపోవు ; 2. సంహరించు, చంపు. **తెక్కలిగొను (-కొను)** రూ. తెక్కలికొను. స.క్రి. 1. అపహరించు, ఎత్తుకొనిపోవు. భార.ఆది. 2.105 ; 2. సంహరించు, చంపు. ఉ.హరి. 2.132. **తెక్కలిపాటు** వి. విపత్తు, ఆపద. భాగ. 6.349. **తెక్కలీ(డు** వి. తెక్కలికాడు, దొంగ. వరాహ. 5.59.

**తెక్కలి²** రూ.చూ. తెకలి. వి. బెరడు ఔషధాల్లో ఉపయోగపడే ఒకరకం చెట్టు.

**తెక్కలీ(డు** చూ. తెక్కలి¹.

**తెక్కు** చూ. టెక్కు¹. వి. 1. ఉబ్బు, పొంగు. పారి. 5.10 ; 2. పడుచుదనపుటెక్కు ; 3. గర్వం.

**తెక్కులకా(డు** వి. గర్వంకలవాడు. ప్రభు. 2.

**తెక్కొట్టు** చూ. తెగు.

**తెగ¹** చూ. తెగు. రూ. తెవ¹. వి. 1. వెరవు, ఉపాయం. గా.హరి.ఉ. 16 పం ; 2. నిడుపు, ధైర్యం. భాగ. 10 పూ. 897 ; 3. విధం, పద్ధతి, రీతి. పారి. 1.56 ; 4. సమూహం, గుంపు. రామాభ్యు. 6.80 ; 5. కులం, జాతి. యయా. 3.107 ; 6. ఉద్ది, పక్షం. కకుత్స్థ. 2.86.

**తెగ²** రూ. తెవ². వి. 1. జ్యాకర్షణం, బాణాలు ప్రయోగించటానికి వింటి నారిని లాగటం. భార.విరా. 4.106 ; 2. (ఎక్కుపెట్టిన) నారి, అల్లెత్రాడు, శింజిని. భార.ద్రోణ. 3.205.

**తెగగొను(-కొను)** స.క్రి. 1. (బాణం) సంధించు. భార. ఉద్యో. 4.346 ; 2. ఎక్కుపెట్టు. పి.శకు. 3.113 ; అ.క్రి. బాణప్రయోగానికి నారిలాగు, జ్యాకర్షణం చేయు

సంబంధం.

తెర్వడుచు రూ. తెరువడుచు. అ.క్రి. దారికొట్టు. అభిగ్రహం చేయు. బసవ. 5.384 పం. < తెర్వు + అడుచు. తెర్వరి రూ.చూ. తెరువరి. వి. బాటసారి, పాంథుడు. యయా. 5.81. < తెర్వు + -అరి[4]. తెర్వుగట్టు (-కట్టు) రూ.చూ. తెరువుగట్టు. అ.క్రి. (తోపుడుగాళ్ళు మొదలైన వాళ్ళు) దారి అరికట్టు, మార్గనిరోధం చేయు. తెర్వులుకట్టియేఁగు(-ఏఁగు) అ.క్రి. దారిబట్టిపోవు. పాండు. 5.75. తెర్వులుగట్టు(-కట్టు) రూ. తెరువులుగట్టు. అ.క్రి. (తోపుడుగాళ్ళు మొదలైన వాళ్ళు) దారి అరికట్టు, తోవకట్టు, మార్గనిరోధం చేయు. పాండు. 5.15.

**తెఱ** చూ. తెఱచు. రూ.చూ. తెఱ్ఱ. వి. 1. తెరవటం; 2. ఉపశమనం; 3. మధ్య ఉండే ఎడం; విశే. మరుగు లేని, బయలైన, అసంవృతమైన.

తెఱకొను అ.క్రి. (స్వార్థంలో) బయలుపెడలు. తెఱకొలుపు స.క్రి. బయలుపెడలచేయు. తెఱగంటి వి. 1. అనిమిషం, రెప్ప. తపతీ. 2.16; 2. వేల్పు. జాహ్నవీ. 1.6. తెఱగంటితపసి వి. దేవర్షి, నారదుడు. అచ్చ.రా. అయోధ్యా. 2. తెఱగంటిత్రోవ వి. ఆకాశం. అచ్చ.రా. కిష్కిం. 57. తెఱగంటిదొర వి. ఇంద్రుడు. సమీర. 3.98. తెఱగంటిపెద్ద వి. సురజ్యేష్ఠుడు, బ్రహ్మ.దశా. 1.14. తెఱగంటిబోఁడి వి. దేవతా స్త్రీ. జాహ్నవీ. 1.6, నీలా. 2.37. తెఱగంటిబోనము వి. అమృతం. వేంక.ఆం.దేవ. 20. తెఱగంటిబోనముతెచ్చినలావరి వి. గరుత్మంతుడు. వేంక.ఆం. 18. తెఱగంటిమ్రాఁకు వి. సురతరువు, కల్పవృక్షం. తెఱగంటిమ్రాను వి. సురతరువు, కల్పవృక్షం. దశా. 1.58. తెరగంటియన్నులు(-అన్నులు) వి.బ.వ. అచ్చరలు. తెఱగంటియెకిమీఁడు(-ఎకిమీఁడు) వి. ఇంద్రుడు. రామాభ్యు. 371. తెఱగంటిరారా వి. ఇంద్రనీలమణి. చంద్రికా. 6.112. తెఱగంటిఱేఁడు వి. ఇంద్రుడు, లేఖర్షభుడు. తెఱనోటిమెకము రూ.చూ. తెఱనోరిమెగము. వి. పంచాస్యం, సింహం. యయా. 2.49. తెఱనోరిమెకము రూ.చూ. తెఱనోరిమెగము. వి. పంచాస్యం, సింహం. రామాభ్యు. 2.56. తెఱనోరిమెగము రూ. తెరనోటిమెగము, తెరనోరిమెకము, తెరనోరిమెగము, తెఱనోటిమెకము, తెఱనోరిమెకము. వి. పంచాస్యం, సింహం. వేంక. పంచ. 4.218. తెఱనోరు రూ. తెఱ్ఱనోరు. వి. 1. వివృతాస్యం, తెరుచుకొని ఉండే నోరు. కాశీ. 6.41; 2. (తెరచుకొని ఉండే నోరు కలది) పంచాస్యం, సింహం. ఘటికా. 3.7. తెఱమెకము రూ. తెఱమెగము. వి. సింహం. సాంబ. తిర్య. 71. తెఱమెగము రూ.చూ. తెఱమెకము. వి. సింహం. తెఱవ రూ. తెరవ. వి. 1 ఆడది, భార్య.భార. అరణ్య. 4.295; 2. బయలు, తెరపి. ఆం.భా. 3.54. క. తరువతి. బాలుడు, బాలిక; త. తెరివై. తెఱవాటుగొట్టు (-కొట్టు) రూ. తెరవాటుగొట్టు. స.క్రి. దోపిడీ చేయు. శుక. 3.197. తెఱవామెకము రూ.చూ. తెఱవాయిమెకము. వి. పంచాస్యం, సింహం. ఆం.భా. 2.81. తెఱవాయిమెకము రూ. తెఱవామెకము. వి. పంచాస్యం, సింహం. అచ్చ. రా. అరణ్య. 7.

**తెఱఇవియైనభూమి** చూ. తెజె. వి. పన్నుపరిహరింపబడిన భూమి. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1098. క్రీ.శ. 1153.

**తెఱకువ** చూ. తెఱచు. వి. 1. వివేకం, తెలివి. భాగ. 1.99; 2. ఉపాయం, వెరవు. మను. 2.20.

**తెఱఁగు** రూ. తెరఁగు, తెరవు, తెఱవు. వి. 1. విధం, ప్రకారం. భార.ఆది. 1.10; 2. వృత్తాంతం, సమాచారం. భార. ఆది. 3.5; 3. పద్ధతి. భార. ఆది. 6.265; 4. సంధి. భార. ఉద్యో. 2.68; 5. క్షేమం. భార. భీష్మ. 2.26; 6. పొలుపు, అందం. రం. రా. బాల. 11పు. 29పం; 7. పక్షం. వైపు. కేయూ. 2.116. భీమ. 4.189; 8. స్థితి, దశ, అవస్థ. విక్ర. 1.18; 9. పోలిక, సామ్యం. ఆము. 4.121; 10. చిహ్నం, లక్షణం; 11. స్వభావం; విశే. అనుకూలమైన, క్షేమకరమైన. కు. సం. 3.95, భార. విరా. 3.110; వి. ఐకమత్యం. భార. ఆశ్రమ. 2.47.

క. తెఱ. విధం, మార్గం, రీతి, రూపం, తెఱవు. విధం, పద్ధతి; త. తిఱమ్, తిఱన్. భాగాలు, అంగాలు, అంశాలు, అవయవభాగాలు, అవసరమైన అంశాలు, విధం, తరగతి, రకం, జట్టు, సగం, పద్ధతి, కుటుంబం, వివరణలు, రీతి, వేషం, స్వభావం, అవస్థ, గుణం, సాధనం, పద్ధతి, బలం, శక్తి, మంచితనం, తిఱమై. బలం, శక్తి, ధైర్యం, తిఱల్. శక్తి, ధైర్యం, విజయం, తిఱవతు, తిఱవాన్, తిఱపోన్; మ. తిఱమ్, తిఱవ్. బలం, సామర్థ్యం, చక్కనిరీతి.

తెఱఁగుపడు రూ. తెఱఁగువడు. అ.క్రి. చక్కబడు, నెరవేరు, సిద్ధించు. భార. ఉద్యో. 1.21. తెఱఁగుపఱుచు స.క్రి. 1. శాంతిపరచు. భార. ఉద్యో. 1.44; 2. నెరవేర్చు, తీర్చు. భార. అశ్వ. 3.20; 3. చక్కబరచు, సవరించు. భార. మహా. 8; 4. సరిచేయు, దిద్దు. భాగ. 8.447; 5. సిద్ధపరచు, ఆయత్తంచేయు. కృ. శకు. 1.49. తెఱఁగుమాలు అ.క్రి. 1. న్యాయం తప్పు. భార. స్వర్గా. 24; 2. నీతిమాలు, దుష్టమగు. నీలా. 2.72. తెఱఁగువడు (-పడు) రూ.చూ. తెఱఁగుపడు. అ.క్రి. చక్కబడు, నెరవేరు, సిద్ధించు. దశకు. 7.31.

**తెఱచిరాజను** చూ. తెఱచు.

**తెఱచిరాజు** చూ. తెఱచు.

**తెఱచు** స.క్రి. వివృతం చేయు, తెరవచేయు. భార. ఆది. 2.63. కలకడశాసనం. క్రీ.శ. 972; 2. తీయు, తొలగించు. కు.సం. 9.46; 3. విరియచేయు, వికసింపచేయు. విక్ర. 1.97; అ.క్రి. బయలు మెరయు, బయలుపడు. కు. సం. 3.30.

క. తెజె. తెరచు, తెరచుకొను, తెఱ. సందు; కొడ. తెర్వ్- (తెర్ద్). తెరచు; తు. తెరవు. ఖాళీప్రదేశం, జాగా; త. తిఱ (-ప్ప్-, -న్త్-). తెరచు; మ. తిఱక్క. తెఱచు, తుఱక్క. తెరచు; తొ. తెఱ్- (తెర్త్-); గోం. తరే. తెరచుకొను; కుఇ. (తేప్ప. బయటికిపోయే దారి ఏర్పరచు, వ్యాపించు; కురు. తాడ్. అడ్డంకిని తొలగించు.

<మూ. ద్రా. *తెఱ్-/*తెఱె-.

**తెఱచిరాజను** స.క్రి. తోసిరాజను. భీమ. 1.89, విజయ. 3.113. **తెఱచిరాజు** వి. చదరంగంలో వేసే ఒకఎత్తు.

**తెఱప** రూ.చూ. తెఱపి. విశ. మఱుగులేని, బయలైన, అనం వృతం. పారి. 4.43 ; వి. **1**. తెరవటం ; **2**. ఉపశమనం.

**తెఱపి** చూ. తెఱచు. రూ. తెరపి, తెరిపి, తెరిపిన, తెఱప. వి. దేశకాలాల్లో అవకాశం, ఎడం, సందు. కు.సం. 8.100. నిర్వ. రా. 63.

క. తెఱపు, తెఱపు. జాగా, విరామం, ఖాళీప్రదేశం ; తు. తెరప్పు. ప్రదేశం ; త. తిఱప్పు, తిఱవు. ఖాళీ ప్రదేశం ; మ. తుఱప్పు, తెరవటం ; తొ. తిర్ప్. తాళంచెవిని తిప్పు ; కుఇ. ౘ్రేప్ప (ౘ్రేప్). పరుండపెట్టు.

**తెఱపిగొను (-కొను)** అ.క్రి. సందు చేసుకొను, అవకాశం కలిగించుకొను. కు.సం. 5.39.

**తెఱపు** చూ. తెఱచు. వి. **1**. మూర్ఛనుంచి తేరటం, తెలివి నొందటం. భాస్క. రా. యు. 7.12 ; **2**. చీలిక.

**తెఱపుమఱపు** రూ.చూ. తెరపుమరపు. వి. **1**. తెలివితో కూడిన మది తబ్బిబ్బు ; **2**. అపస్మారం. **తెఱపులుగొను (-కొను)** అ.క్రి. వికసించు, వెడలు. నిర్వ. రా. 8.79. **తెఱపులుచేయు** స.క్రి. చీలికలుచేయు, చీల్చు. భాస్క. రా. యు. 1072.

**తెఱలు** చూ. తెరలు[1]. అ.క్రి. (వానన) బయటికివచ్చు.

**తెఱలుచుట్టు** చూ. తెర. అ.క్రి. వలలు పన్ను. రుక్మా. చ. 3.84.

**తెఱవు** రూ.చూ. తెఱఁగు. వి. మంచిమార్గం, న్యాయం, ధర్మం. కళా. 3.87. అచ్చ.రా.అయోధ్యా. 22.

**తెఱవుగావరి (-కావరి)** వి. కోల్పులి. సాంబ. తిర్య. 1.

**తెఱై** వి. పన్ను. ఆ. సా. ప.ప. 22.5.

క. తెరఙ్ఞు, తెఱె. పన్ను ; త. తెఱపొరుళ్, తిఱై. నష్టపరిహారం, కప్పం, పన్ను, తిఱప్పు. పన్ను విధించిన భూములు ; తో. తెఱ్. అపరాధసుంకం ; గోం. తెరానా. తిరిగిచెల్లించు.

**తెఱ్ఱ** చూ. తెఱపి. రూ. తెఱ. వి. **1**. మధ్య ఏర్పడిన ఎడం ; **2**. తెలివిలేనివ్యక్తి.

**తెఱ్ఱనోరు** రూ.చూ. తెఱనోరు. వి తెరుచుకొని ఉండే నోరు. భల్లా. 4.

**తెల** రూ.చూ. తెల్ల[1]. క్రి. విశ. **1**. తెల్లగా. భార. మౌసల. 1.40 ; **2**. స్పష్టంగా. చెన్న బసవ. 3.35 ; విశ. ధవళమైన, తెల్లని. నార. పంచ. 5.19 ; వి. ధవళిమ, తెల్లని కాంతి. రాజవా. 1.77.

**తెలగాయచుక్క** వి. కుందేటిచుక్క, పొద్దుపొడిచేముందు తూర్పువైపున కనిపించే కాంతివంతమైన నక్షత్రం. **తెలతెలనగు (-అగు)** అ.క్రి. తెల్లవారు. హంస. 1.138. **తెలతెలఁబోవు (-పోవు)** అ.క్రి. **1**. భయాదులచే వివర్ణమగు, తెల్లబోవు ; **2**. తెల్లవారు. **తెలతెలవాఱు (-పాఱు)** అ.క్రి. **1**. భయాదుల వల్ల వివర్ణమగు, తెల్లబోవు. ఉ. హరి. 3 84 ; **2**. వేగు ; తెల్లవారు. భీమ. 2.48 ; **3**. కొంచెం తెల్లవారు. భాగ. 10ఉ. 1002 ; **4**. బాగా తెల్లవారు. యయా. 5.28. **తెలతెలవేగు** అ.క్రి. తెల్లవారు. భార. భీష్మ. 1.162. **తెలన** రూ.చూ. తెల్లన. విశ. తెల్లని, ధవళమైన. కళా. 2.17. **తెలనాకు** రూ. తెల్లనాకు. వి. తెల్లని లేత తమలపాకు. కళా. 2.17. **తెలవాఱు (-పాఱు)** రూ.చూ. తెల్లఁబాఱు. అ.క్రి. వేగు, ఉదయమగు. హంస. 2.68, **తెలాఱు** రూ.చూ. తెల్లఁబాఱు. అ.క్రి. ఉదయమగు, వేగు. **తెల్జొన్న** రూ.చూ. తెల్లజొన్న. వి. గింజ తెల్లగాను, ఎన్ను ముద్దగాను ఉండేఒకరకం జొన్న. <తెల + జొన్న. **తెల్రాయి** రూ.చూ. తెల్లరాయి. వి. **1**. మెరుగినకరాయి, బరంతులు నింపడానికి పునాదులు వేసే దిమ్మెసనింపడానికి వాడే ఒకరకం రాయి ; **2**. రాతినార రానిరాయి. <తెల+రాయి. **తెల్రాతు** వి. మెరుగినక రాయి.

**తెలకపిండి** రూ.చూ. తెలికపిండి. వి. **1**. గానుగచెక్క, పిండి ; **2**. గానుగ ఆడిన నూనెగింజల పిట్టు.

**తెలకి** రూ. తలకి, తలూకి. వి. మందులకు ఉపయోగపడే మొక్క (Cle odendron Fhlomoides).

**తెలక్కుమ్మర్లు** చూ. తెలగ.

**తెలగ** రూ.చూ. తెలగా. వి. శూద్రుల్లో ఒకతెగ.

**తెలక్కుమ్మర్లు** రూ. తెలుక్కుమ్మర్లు, తెల్లగుమ్మర్లు వి.బ.వ. కుమ్మర్లలో ఒకతెగ. **తెలగఉక్కు** వి. చాలగట్టిఇనుము, **తెలగదుంప** వి. చిలగడదుంప, గునుసుగడ్డ. **తెలగబాముల మనిషి** వి. పెద్దమోసగాడు.

**తెలగపిండి[1]** రూ.చూ. తెలికపిండి. వి. గానుగపిండి, తిలపిష్టం.

**తెలగపిండి[2]** వి. ఆకుకూరగా ఉపయోగించే ఒక చిన్నమొక్క (Aerva scandens).

**తెలగా** చూ. తెనుఁగు. రూ. తెలగ. వి. త్రిలింగదేశంలో ఒక శూద్రజాతివారు, కాపులు, ఈ పేరు తెలుగుదేశానికి సంబంధించింది.

**తెలగాబ్రాహ్మణులు** వి.బ.వ. బ్రాహ్మణుల్లో ఒకతెగవారు. **తెలగాలు** వి.బ.వ. తెలుగుదేశంలోని కాపులు.

**తెలగాణము** చూ. తెనుఁగు. రూ. తెలంగాణము, తెలంగాణా. విశ. తెలుగుదేశ సంబంధమైన. విప్ర. 1.41, విష్ణుపు. 1.41 ; వి. ఆంధ్రప్రదేశ్‌లోని కొంతభాగం.

<తెలుఁగు + అణెము.

**తెలగాణ్యులు** చూ. తెలగాణము. వి. స్మార్తబ్రాహ్మణుల్లో ఒకతెగ.

**తెలంగాణము** రూ.చూ. తెలగాణము. వి. ఆంధ్రప్రదేశ్‌లో ఒకభాగం.

**తెలంగాణా** రూ.చూ. తెలగాణము. వి. ఆంధ్రప్రదేశ్‌లో ఒకభాగం.

**తెలచు[1]** రూ.చూ. తెల్చు[1]. స.క్రి. ప్రసన్నత నొందించు. భార. అను. 2.217.

**తెలచు[2]** రూ.చూ. తెలుచు[2]. స.క్రి. **1**. ప్రార్థించు, వేడు. భార. అను. 5.68 ; **2**. స్తుతించు, పొగడు. హరి.ఉ. 10.159 ; **3**. భజించు, సేవించు. పాండు. 5.96 ; అ.క్రి. మొక్కు, నమస్కరించు. పారి. 3.7.

**తెలపరి** వి. ముదురుకాల్పు, అములో కుండలు ఎక్కువగా కాలి ఆకారం చెడిపోవడం.

తెలపాల రూ. తెల్లపాల. వి. కొయ్యటంలోనూ, చెక్కటం లోనూ ఉపయోగపడే పచ్చపూలుపూసే ఒకచెట్టు (Wrightia tomentosa).

తెలసు వి. చిందుగచెట్టు, మంచి కలపనిచ్చే ఒకరకంచెట్టు (Albizzia odoratissima).

తెలాఖు చూ. తెల.

తెలి[1] రూ.చూ. తెల్ల[1]. విణ. 1. తెల్లని, ధవళం. కు.సం. 3.66, భార, విరా. 2.45 ; 2. నిర్మలమైన, స్వచ్ఛమైన. రం.రా.యు. 308 పు. 5 పం. ; వి. 1. వికాసం, తెలివి. భార. సౌప్తి. 1.124 ; 2. తెలుపు, ధావళ్యం. ఆం.భా. 1.108.

తెలికడలి వి. క్షీరాబ్ధి, పాలసముద్రం. అచ్చ.రా. అరణ్య. 114. వ్యు. తెల్లని సముద్రం. తెలికాకి వి. ఒకరకం కాకి. సం. కాక-. కాకి. తెలిగంటి వి. 1. స్త్రీ. దశా. 7.212 ; 2. ధవళాక్షి. ఉ.రా. 2.137. తెలిగన్నులు(-కన్నులు) వి.బ.వ. తెల్లనికన్నులు. కు.సం. 8.16. తెలిగాము వి. శ్వేతగ్రహం, శుక్రుడు. తెలిగిబ్బ వి. 1. శివుని వాహన మైన ఎద్దు. ఆం.భా. 1.54 ; 2. తెల్లఎద్దు. తెలిగొను(-కొను) అ.క్రి. ప్రమాణం చేయించు. విజ్ఞా. ప్రా. 91. తెలిడాలు మెకము రూ. తెలిడాల్మెకము. వి. సింహం. అచ్చ.రా. సుందర. 27. వ్యు. తెల్లటి కాంతిగల మృగం. తెలిడాల్మె కము రూ.చూ. తెలిడాలుమెకము. వి. సింహం. తెలితేజి రూ. తెలితేజీ. వి. తెల్లగుర్రం, ఉచ్చైశ్శ్రవం. దశా. 2.49. తెలితేజీ రూ.చూ. తెలితేజి. వి. ఉచ్చైశ్శ్రవం, తెల్ల గుర్రం. తెలిదమ్మి(-తమ్మి) వి. పుండరీకం, తెల్లతామర. దశా. 1.165, ఆం.భా. 1.164. తెలిదమ్మికంటి(-తమ్మికంటి) వి. పుండరీకాక్షుడు, విష్ణువు. నీలా. 2.40. తెలిదమ్మికరి (-తమ్మికరి) వి. 1. ఎరచిల్ల పులుగు ; 2. ఒకానొక చేప. తెలిదమ్మిగద్దియ(గొలువుండురాయ(డు వి. పుండరీకాసనుడు, తెల్లతామర అనే సింహాసనంమీద కొలువున్న ప్రభువు, బ్రహ్మ. ఆం.నా.సం.దేవ. 8. తెలిదీవి వి. శ్వేతదీపం, తెల్లనిదీవి. ఉ.రా. 1.316. తెలిదీవిదొర వి. శ్వేత ద్వీపాధిపతి, విష్ణువు. చంపూ రా. 2.30. తెలిదీవిమన్నీ(డు వి. శ్వేత ద్వీపాధిపతి, విష్ణువు. సాంబ. దేవ. 4. తెలినువ్వు వి. తెల్లజాతినువ్వు. హంస. 4.127. తెలినువ్వులు వి.బ వ. ధాన్యవిశేషం. తెలిపక్కము వి. శుక్లపక్షం. తెలిపరిగె వి. మత్స్యాకారంగా ఉండే భక్ష్యవిశేషం. హంస. 1.105. తెలిపిట్ట వి. హంస. ఆం.నా.సం. తిర్య. 12, నీలా. 2.91. తెలిపులు(గు రూ.చూ. తెలిపుల్గు. వి. హంస. తెలిపుల్గు రూ. తెలిపులు(గు వి. హంస. నీలా. 1.6. తెలిపువ్వు వి. చంద్రు(డు. హంస. 2.4. తెలిమల వి. కైలాసం, వెండి కొండ. సాంబ. స్థా. 55. తెలిమావు వి. ఉచ్చైశ్శ్రవం, తెల్లగుర్రం. తెలిమావురవుతు వి. ఇంద్రుడు. ముకుం. 1.34. తెలిమిన్న వి. తెల్లనిరత్నం, వజ్రం. చంద్రికా. 2.5. తెలిమెకము వి. సింహం. తెలిమొదవు వి. కామధేనువు. తెలిమోముపక్కి వి. గరుడుడు. సాంబ. దేవ. 15. తెలి మ్రా(కు వి. తెల్లచెట్టు, కల్పవృక్షం. నీలా. 1.45. తెలిమ్రాను వి. తెల్లనిచెట్టు, కల్పవృక్షం. తెలియేఱు(-ఏఱు) వి. ఆకాశగంగ. ఆం.భా. 1.55. తెలిరా వి. తెల్లరాయి. చంద్రకాంతం. పారి. 2.52. తెలిఱెక్కపులు(గు రూ.చూ. తెలిఱెక్కపుల్గు. వి. తెల్లని రెక్కలుగల పక్షి, హంస. అష్ట మ.క. 5.247 పు. 23 పం. తెలిఱెక్కపుల్గు రూ. తెలిఱెక్క పులు(గు. వి. తెల్లనిరెక్కలుగల పక్షి, హంస. చంద్రికా. 2.77. తెలివా(క వి. ఆకాశగంగ. సాంబ. దేవ. 16. తెలివిల్తు(డు వి. మన్మథుడు. వేంక. ఆం. 8, తెలివేల్పు వి. శివుడు. ఆం.పదా.సుర. 10.

తెలి[2] వి. 1. స్నేహం, చమురు. పాండు. 3.74 ; 2. పక్వఘృతం, కాచిననేయి. ఆం.భా. 2 259 ; 3. జలవిషాది దివ్యప్రమాణం (ఒట్టు).

సం. తిల-. నువ్వులు.

<సం. తిల- (అర్థవిపరి.).

తెలిక రూ. తెలికి. వి. 1. నువ్వులు ఆడి నూనె, తెలగపిండి అమ్ముకొని జీవించే ఒక జాతి. శ్రీనాథునిచాటువు ; 2. నువ్వు మొక్క.

సం. తైలిక-. తెలికవాడు ; ప్రా. తేల్లిగ-, తేల్లిఅ, తిల్లగ-, గాండ్లవాడు, తిల్ల-, తెల్ల-. తైలం; పా. తేల్లిఅ ; జై. మహా. తెల్ల- ; శౌ. తెల్ల- ; అ.మా. తిల్ల-, తేల-, తెల్ల-. తైలం ; మా. తెల్ల- ; నే. తెలి ; అ. తేలి ; తేలియా ; బెం. తేలి, తిలి, ఒ. తేలి ; బీ. తేలియ ; గు. తేలీ. గానుగవాడు.

క. తెల్లిగ. తైలికుడు, తెల్లగితి. గానుగది ; కువి. తెల్కురసి. గానుగవాడు.

<ప్రా. తేల్లిగ-.

తెలికజోటి వి. గాండ్లస్త్రీ, తెలికలస్త్రీ. క్రీడా. 102. తెలికపిండి రూ. తెలకపిండి, తెలగపిండి[1], తెలికిపిండి, తెలికెపిండి. వి. గానుగపిండి, తిలపిష్టం. పద్మ. 6.118. తెలికలు వి.బ.వ. నువ్వులు. తెలికవా(డు విణ. తిలఘాత కుడు, గాండ్లవాడు. ఆం.భా. 2.285. తెలికవేవురు వి.బ.వ. తెలిక కుటుంబాలవారు. ఎ.ఇం. సంపు. 6. శా.సం. 35. క్రీ.శ. 1084.

తెలికి రూ.చూ. తెలిక. వి. తిలఘాతకుడు, గాండ్లవాడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 668.

తెలికికాంపులు వి.బ.వ. తెలికికులకాపులు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1076. క్రీ.శ. 1205. తెలికిపిండి రూ.చూ. తెలిక పిండి. వి. 1. గానుగచెక్క, పిండి ; 2. గానుగపట్టిన నూనెగింజలపిట్టు.

తెలికెపిండి రూ.చూ. తెలికపిండి. వి. 1. గానుగచెక్క, పిండి.

తెలిగ రూ.చూ. తళియ. వి. కంచం.

తెలిగా వి. ఎర్రబిక్కిచెట్టు (Gardenia Turgida).

తెలి(గించు చూ. తెలు(గు.

తెలిపించు చూ. తెలుపు[1].

తెలియ రూ.చూ. తళియ. వి. భోజనపాత్ర, కంచం.

తెలియమి చూ. తెలియు.

తెలియ(బడు చూ. తెలియు.

తెలియు అ.క్రి. 1. మూర్ఛాదుఃఖపారవశ్యాదులనుంచి తేరు కొను, స్వస్థతనొందు. భార.ఆది. 7.237 ; 2. వెల్లడించు,

తెలియజేయు. భార.అరణ్య. 3.264 ; **3.** నిద్రనుండి లేచు. నిర్వ.రా. 6.20 ; **4.** తెలివికలిగియుండు. భార. విరా. 5.210 ; **5.** విదితమగు, ఎరుకపడు. భార.ఉద్యో. 2.102 ; **6.** విశదమగు, తేటపడు, స్పష్టమగు. భార.శల్య. 1.351 ; **7.** వికసించు. హరి.పూ. 8.169 ; **8.** ప్రసన్నమగు. సారంగ. 3.168 ; **9.** నమస్కరించు. ప్రబంధ. 880 ; **10.** ప్రకాశించు. పార్వ. 4.93 ; స.క్రి. **1.** ఎరుగు, గ్రహించు. భార.శల్య. 1.352 ; **2.** ఎంచు, తలంచు. ఆము. 6.31 ; **3.** యోజించు. ఇందు. 2.131, రామాభ్యు. 1.137 ; **4.** అడిగి తెలుసుకొను. కువ.చ. 2.26 ; **5.** అరయు, పరిశీలించు. దశా. 3.34.

క. తిళి. తేటఅగు, వెల్లడగు, తెలియు, నేర్చుకొను, తిళిసు. ఎరుకపరుచు ; తు. తిళి. స్పష్టమయిన, తిళువళికె. జ్ఞానం ; త. తెళ్ (తెళ్ళి-). స్వచ్ఛమైన, తెళి. నీటివలె స్వచ్ఛమగు. తెలియు, పరిశీలించు, స్పష్టపరుచు, తెళ్ళు. స్పష్టమగు ; మ. తెళియుక. స్పష్టమగు, స్వచ్ఛమగు ; కో. తెయ్ళ్-/తెళ్చ్-. స్పృహలోకివచ్చు ; తొ. తుళ్య (తుళ్స్-). స్పష్టమగు ; కుఇ. ? తిస్పు. మేల్కొల్పు ; కువి. తెల్ల్- ; కురు. తిల్తిల్. ఉద్రేకంగా కన్పించడానికి సంబంధించిన ; మాల్తో. తెంగ్-. చెప్పు ; బ్రా. తిప్ప్-, తిత్-, ఛా. తెలియు, అవగాహనచేసుకొను. <మూ.ద్రా. *తెళ్-.

**తెలియమి** వి. **1.** అప్రసిద్ధం ; **2.** అజ్ఞానం. **తెలియఁబడు** అ.క్రి. వెల్లడిఅగు, స్పష్టమగు. సాంబో. 2.4. <తెలియు+-అ[7]+పడు.

**తెలివరి** చూ. తెలివి.

**తెలివి** రూ.చూ. తెలివు. వి. **1.** తేట, నిర్మలత్వం. కు.సం. 8.157 ; **2.** కాంతి, శోభ, ప్రకాశం. కు.సం. 8.186 ; **3.** వివేకం. భార.ద్రోణ. 2.213 ; **4.** వికాసం. భార. ద్రోణ. 2.375 ; **5.** తేరటం. భార.శాంతి. 3.34 ; **6.** ఎరుక, జ్ఞానం. భార.అను. 4.194 ; **7.** అనుమతి, అంగీకారం. భార.ఆశ్ర. 1.96 ; **8.** ప్రసన్నత. కాశీ. 4.10 ; **9.** మూర్ఛాదులనుంచి తేరటం, స్మృతి, జ్ఞప్తి. కాళ. 2.20 ; **10.** ఉల్లాసం, సంతోషం. వసు. 4.106 ; **11.** గ్రహణశక్తి. భాస్క.శ. 49 ; **12.** జాగ్రత్త, మెలకువ. దశా. 2.89 ; **13.** సున్నదనం, స్నిగ్ధత. సాంబ.స్థా. 60 ; విణ. **1.** స్పష్టమయిన ; **2.** ప్రకాశవంతమయిన.

**తెలివరి** వి. విద్వాంసుడు. <తెలివి+-అరి. **తెలివికత్తె** రూ. తెల్వికత్తె. వి. ప్రాజ్ఞురాలు, వివేకవతి. ఆం.భా. 2.107. **తెలివికాఁడు** రూ. తెల్వికాఁడు. వి. వివేకి అయినవాడు, ప్రాజ్ఞుడు. ఆం.భా. 3.3. **తెలివిఁగొను (-కొను)** అ.క్రి. తెలివినొందు, మూర్ఛాదులనుంచి తేరు, తెప్పరిల్లు. హంస. 1.74. **తెలివిడి** వి. **1.** జ్ఞానం. ఆం.భా. 1.102 ; **2.** తెలియజేయటం ; **3.** దృష్టాంతం. **తెలివితక్కువ** విణ. బుద్ధితక్కువ. **తెలివితక్కువతనము** వి. తెలివిహీనత, బుద్ధి తక్కువగా ఉండటం. **తెలివితేటలు** వి.బ.వ. నిర్మలమైన బుద్ధి. **తెలివిపడు** రూ. తెల్విపడు. అ.క్రి. **1.** తెలియు, ఎరుకపడు. భార.శాంతి. 6.2 ; **2.** విశదమగు, స్పష్టమగు. వాశి.రా. 3.61 ; **3.** తోచు, స్ఫురించు. విప్ర. 5.58 ; **4.** ప్రసన్నమగు, వికాసమందు. రాఘవ. 2.6. **తెలివిపఱుచు** స.క్రి. తెలియజేయు, ఎరుకపరచు, బోధించు. ఆము. 6.69. **తెలివిలేనితనము** వి. **1.** మరపు ; **2.** మందమైనబుద్ధి. **తెలివిలేనివాఁడు** విణ. స్తబ్ధుడు, బుద్ధిహీనుడు.

**తెలివు** రూ. తెలివి, తెల్వి, తెల్వు. వి. ప్రకాశం, కాంతి. భార.ఆది. 8.27.

క. తళి, తిళి. స్పష్టత, స్వచ్ఛత, కాంతి, తెలివి, తిళవళికె, తిళివళికె, తిళువళికె, తిబ్బళి. తెలివి, తిళివు, తిళిపు. నిశ్శబ్దత, సుహృద్భావం, తెలివి ; తు. తిళువళికె, తిళువళిగె. తెలివి, విజ్ఞానం ; త. తెళ్వుమ్. స్పష్టత, పాండిత్యం, తిళ్మై, తెళ్ళిమై. స్పష్టత, తెలివి ; మ. తెళి. స్పష్టత, కాంతి. తెళివు. స్పష్టత, కాంతి.

**తెలువులొందు** అ.క్రి. తెల్లబడు, వికాసంపొందు. విప్ర. 2.57. <తెలివి+-లు+ఒందు.

**తెలుకట్టు** రూ. తొలికట్టు. వి. తొలికట్టు, మొదలికట్టు, మొదట ఉంచే న్యాసం. ద.హిం.శా.సం. 6. శా.సం. 898. క్రీ.శ. 1349.

**తెలుకులవాఁడు** చూ. తెలిక. విణ. తెలికలజాతివాడు, గాండ్లవాడు.

**తెలుకులి** చూ. తెలిక. వి. తెలికలవాడు.

**తెలుక్కుమ్మర్లు** రూ.చూ. తెలక్కుమ్మర్లు. వి.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ.

**తెలుఁగు** రూ.చూ. తెనుఁగు. వి. **1.** ఆంధ్రభాష. నిర్వ.రా. 1.6, ఆం.భా.భూ. 15 ; **2.** ఆంధ్రదేశం. ఆము. 1.15 ; **3.** ఆంధ్రులు. సిం.ద్వా. 1.42.

**తెలిఁగించు** రూ.చూ. తెనిఁగించు. స.క్రి. తెలుగుచేయు, ఆంధ్రీకరించు. **తెలుఁగుపడు** రూ.చూ. తెనుఁగుపడు. అ.క్రి. తెలుగులోకి మార్చబడు, ఆంధ్రీకరించబడు. **తెలుఁగుపఱుచు** రూ.చూ. తెనుఁగుపఱుచు. స.క్రి. తెలుగులోకి మార్చు, ఆంధ్రీకరించు. **తెలుఁగుబడి** వి. ఆంధ్రీకరణం, తెలుగుసేత. నిర్వ.రా. 1.8. **తెలుఁగుభూమి** వి. ఆంధ్రదేశం. భీమ. 1.62. **తెలుఁగుమీఱు** అ.క్రి. **1.** నాగరికత చెందు ; **2.** టెక్కులుపోవు. **తెలుఁగువాఁడు** రూ.చూ. తెనుఁగువాఁడు. విణ. ఆంధ్రుడు. **తెలుఁగువాళ్ళు** విణ.బ.వ. **1.** ఆంధ్రులు ; **2.** దసలి పురుగులను పెంచేవాళ్ళలో ఒక తెగ తెలగాలు.

**తెలుచు**[1] చూ. తెలియు. రూ.చూ. తెల్చు[1]. స.క్రి. **1.** ప్రసన్నతనొందించు, శాంతపరుచు. భార.విరా. 4.227 ; **2.** తేలుచు, ఓలలార్చు, తేలేటట్లుచేయు. వరాహ. 3.48 ; **3.** తేర్చు, తేటగాచేయు. వాశి.రా. 3.32 ; **4.** సంతుష్టిపరుచు. పాండు. 5.35 ; అ.క్రి. బయల్పడు, కనపడు.

**తెలుచు**[2] రూ. తెలచు[2], తెల్చు[2]. స.క్రి. **1.** భజించు, సేవించు. భార.శాంతి. 4.237 ; **2.** స్తుతించు, పొగడు. భార.అను. 5.167 ; **3.** ప్రార్థించు, వేడు. కళా. 6.270 ; అ.క్రి. నమస్కరించు, మొక్కు. భార.అశ్వ. 4.89.

గోం. తలెహ్క్-, తలహ్క్. వేడు, యాచించు, దేనైనాఅడుగు ; కురు. తెమ్బ్. బిచ్చమడుగు.

తెలుచు[3] రూ.చూ. తెల్చు[3]. స.క్రి. ఎరుగు, తెలుసుకొను. శుక. 2.523.

**తెలుపారు** చూ. తెలుపు[2].

తెలుపు[1] రూ.చూ. తెల్పు[1]. స.క్రి. 1. బోధించు, కరపు. భార. ఆది. 4.72 ; 2. విశదీకరించు, స్పష్టం చేయు. భార.ఆది. 6.15 ; 3. ఎరిగించు, చెప్పు. కు.సం. 3.83 ; 4. సూచించు. భార.భీష్మ. 1.14 ; 5. ఓదార్చు, ఊరడించు. భార.స్త్రీ. 1.100 ; 6. తేర్చు, ప్రసన్నత నొందించు. భార.ఆరణ్య. 6.184 ; 7. నిద్రనుంచి లేపు, మేలుకొలుపు. భార.ఆరణ్య. 7.93 ; 8. ప్రకటించు, చాటించు ; వి. ఊరట.

**తెలిపించు** స.క్రి. 1. మేలుకొలుపు, లేపు. నిర్వ.రా. 6.80 ; 2. తెలియబరుచు, ప్రకటించు. రం.రా. ఉ. 87 పు. 26 పం ; 3. తెలియబరుచు, ఎరిగించు. కళా. 6.151 ; 4. తెలిసేటట్లుచేయు, ఎరింగింపించు. **తెలుపుకొను**[1] స.క్రి. 1. తన సంగతి వివరించి నమ్మ బలుకు ; 2. తనకు జరిగినఅన్యాయాన్ని పెద్దవారితో చెప్పుకొను. **తెలుపుడు** రూ. తెల్పుడు. వి. తెలపటం, ఎరుక. రామాభ్యు. 8.187. **తెలుపుడుచేయు** రూ. తెలుపుడు సేయు, తెల్పుడుసేయు. స.క్రి. ఎరుకపరుచు, ఎరిగించు. కవిజనా. 2.67. **తెలుపుడుసేయు (-చేయు)** రూ.చూ. తెలుపుడుచేయు. స.క్రి. ఎరుకపరచు, ఎరిగించు. రుక్మి. ప. 1.103.

తెలుపు[2] రూ.చూ. తెల్పు[2]. వి 1. పరిశుద్ధి, స్వచ్ఛత. పండి. చ. 4.270 ; 2. ధావళ్యం, తెల్లదనం. భార.విరా. 1.245 ; 3. ధవళవస్త్రం, తెల్లని బట్ట. పారి. 1.115 ; 4. మేహరోగ విశేషం ; విణ. తెల్లని. భార. విరా. 5.315.

తెలుపారు రూ.చూ. తెల్వారు. అ.క్రి. 1. తెల్లనగు. భార.విరా. 5.320 ; 2. ఉదయమగు. < తెలుపు[2] + -ఆరు. **తెలుపుకాల్పు** రూ. తెల్పుకాల్పు. వి. 1. నల్లకాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలినకాల్పు ; 2. కాలీకాలని ఇటుక. **తెలుపుకొను**[2] అ.క్రి. వ్యాధినుంచి బయటపడి కొత్త నెత్తురు పట్టు. **తెలుపురాయి** వి. తెల్లరాయి. **తెలుపురేషం** వి. తెలుపువన్నెపట్టు. హిం. రేషమ్. పట్టు. < తెలుపు[2] + హిం. రేషమ్. **తెలుపువాఱు(-పాఱు)** రూ.చూ. తెల్వారు. అ.క్రి. తెలుపారు, తెల్లనగు. నృసింహ. 3.131. **తెలుపెక్కు** అ.క్రి. తెల్లనగు, ధవళమగు. ఉ.రా. 1.174. < తెలుపు[2] + ఎక్కు.

**తెలుపు**[3] చూ. తెలుచు[2]. రూ. తెల్పు[3]. వి. 1. నమస్కారం. నృసింహ. 4.103 ; 2. దేవపూజకూడా ఉన్న రచ్చబండ.

తెలుపెక్కు చూ. తెలుపు[2].

తెలువులొందు చూ. తెలివు.

తెలె రూ.చూ. తళియ. వి. 1. బోజన పాత్ర. విజ్ఞా.ఆచా. 72 ; 2. కంచం.

తెల్గావారు చూ. తెలగా. విణ.బ.వ. తెలగాలు. ద.హిం.కా. సంపు. 10. కా.సం. 765. క్రీ.శ. 1678.

తెల్గించు చూ. తెల్గు.

తెల్గు రూ.చూ. తెనుఁగు. వి. ఆంధ్రభాష.

**తెల్గించు** రూ.చూ. తెనిఁగించు. స.క్రి. తెలుగుచేయు, ఆంధ్రీకరించు. **తెల్గువాఁడు** రూ.చూ. తెనుఁగువాఁడు. విణ. ఆంధ్రుడు. ఆం.భా. 2.103.

తెల్చు[1] చూ. తెలియు. రూ. తెలచు[1], తెలుచు[1]. స.క్రి. 1. తేర్చు, తేటగాచేయు. కు.సం. 5.147 ; 2. ప్రసన్నత నొందించు, శాంతిపరచు ; 3. తేలుచు, ఓలలార్చు, తేలేటట్లు చేయు ; 4. సంతుష్టి నొందించు ; అ.క్రి. బయల్పడు, కనపడు. విప్ర. 2.64.

త. తెళి. ఓదార్చు, ఊరడించు, ప్రణయకలహం పోగొట్టుకొను.

తెల్చు[2] రూ.చూ. తెలుచు[2]. అ.క్రి. మొక్కు, నమస్కరించు. మార్క. 3.231 ; స.క్రి. 1. భజించు, సేవించు ; 2. స్తుతించు, పొగడు ; 3. ప్రార్థించు, వేడు.

తెల్చు[3] చూ. తెలియు. రూ. తెలుచు[3]. స.క్రి. ఎరుగు. తెలిసికొను. వాల్మీ. 3.114.

తెల్జొన్న చూ. తెల.

తెల్నావులు చూ. తెల్ల[1].

తెల్వారు చూ. తెల్పు[2].

తెల్పు[1] చూ. తెలియు. రూ. తెలుపు[1]. స.క్రి. 1. ఎరిగించు, చెప్పు. భార.ఆది. 2.133 ; 2. బోధించు, కరపు. కు.సం. 6.79 ; 3. ప్రకటించు, చాటించు. భార.విరా. 1.92 ; 4. ఓదార్చు, ఊరడించు. భార. స్త్రీ. 1.100 ; 5. నిద్ర నుంచి లేపు, మేలుకొలుపు. భార.సౌప్తి. 1.147 ; 6. సూచించు. విక్ర. 2.106 ; 7. విశదీకరించు, స్పష్టం చేయు ; 8. తేర్చు, ప్రసన్నత నొందించు. వి. ఊరట. మార్క. 1.134.

**తెల్పుడు** రూ.చూ. తెలుపుడు. వి. తెలపటం, ఎరుక. **తెల్పుడుసేయు(-చేయు)** రూ.చూ. తెలుపుడుచేయు. స.క్రి. ఎరిగించు.

తెల్పు[2] రూ. తెలుపు[2]. వి. 1. ధావళ్యం, తెల్లదనం. కు.సం. 8.59 ; 2. ధవళ వస్త్రం, తెల్లని బట్ట ; 3. పరిశుద్ధి, స్వచ్ఛత ; విణ. తెల్లని. శృం.నై. 8.184.

**తెల్వారు** రూ. తెలుపారు, తెలుపువాఱు. అ.క్రి. తెల్లనగు. కు.సం. 3.24. < తెల్పు + -ఆరు. **తెల్పుకాల్పు** రూ.చూ. తెలుపుకాల్పు. వి. నల్లకాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలినకాల్పు.

తెల్పు[3] రూ.చూ. తెలుపు[3]. వి. నమస్కారం.

తెల్రాయి చూ. తెల.

తెల్రొత్తు చూ. తెల.

తెల్ల[1] చూ. తెలియు. రూ. తెల, తెలి[1]. విణ. 1. తెల్లని, ధవళం. భార. ఆది. 2.34 ; 2. స్పష్టమైన, విశదమైన, నిస్సందేహమైన. హరి. ఉ. 8.304 ; వి. తెలుపు, ధావళ్యం. ఆం.భా. 1.108.

క. తళి, తిళి. స్పష్టమగు, స్వచ్ఛమైన, ప్రకాశమగు, వెలుగులోకి వచ్చు, స్పష్టత, స్వచ్ఛత, ఎరుక, తిళిపు, తిళిపు, తిళుపు, తిళుపు. శాంతపడు, సంతోషపడు,

స్పష్టపరచు, ఎరుకపరుచు, తెలియజేయు, తిళివళికె, తిళవళికె, తిళువళికె, తిబ్బళి. జ్ఞానం, ఎరుక, తిళిసు. తెలియజేయు, తిళిసువికె. తెలియపరచు; కొడ. తెళి(తెళివ్-, తెళిఞ్-). మేల్కొను, తెళిప్-(తెళిపి-). మేల్కొలుపు; తు. తిళి. స్పష్టమైన, తిళువళికె, తిళువళిగె. గ్రహణం, బుద్ధి, జ్ఞానం, సెలియుని, సెల్లియుని. స్పష్టమగు, సెలిపుని. శుభ్ర పరచు; త. తెళ్(తెళ్ళ్-, తెట్ట్-). స్పష్టమగు, స్పష్టమయిన బుద్ధిగల, తెట్టు. స్పష్టమయిన, తెట్టువర్. సూక్ష్మదృష్టిగల వ్యక్తులు, తెళ్మై. స్పష్టత, తెళు(తెళిక్). స్పష్టమగు, తెళ్ళు. స్పష్టమగు, ప్రకాశించు, తెళ్ళివై. స్పష్టత, బుద్ధికుశలత, తెళ్ళియర్. తెలివయిన వారు, తెళి(-వ్-,-న్త్-). స్పష్టమగు, తెల్లనగు, ఎరుగు (-ప్ప్-, -త్త్-). స్పష్టపరుచు, తెలియజేయు, దుఃఖాదుల్ని తొలగించు, స్పష్టత, కాంతి, తెళిఞన్. బుద్ధిమంతుడు, తెళివు. స్పష్టత, కాంతి; మ. తెళి. స్పష్టత, కాంతి, తెళియుక, స్పష్టమగు, తెళివు. స్పష్టత, కాంతి, నిరూపణ. తెళియిక్క. స్పష్టపరుచు; కువి. తెల్లలి. మేల్కొల్పు, తెల్హినై. ఎరుకపరుచు, తెల్పినై. అన్వయించు; కో. తెయ్ళ్-/తెళ్చ్-. విడమరచు; తొ. తుళ్య్. స్పష్టమయిన; కొలా. తెల్మ్. తెల్లని, తెలొడి; నా. తెవొడి; కురు. తెల్గ్నా. ఆవిష్కరించు, తిల్తిల్; మా. తెన్గ్-. చెప్పు సంబంధాన్ని తెలియజేయు: బ్రా. తిప్ట్-, తిత్త్-. తెలియు, అర్థం చేసుకొను.

<మూ.ద్రా. *తెళ్-. స్పష్టమగు.

**తెల్నాపులు** రూ.చూ. తెల్లనూగులు. వి.బ.వ. **1.** తెల్ల నువ్వులచెట్టు; **2.** తెల్లగా ఉండే నువ్వులు. **తెల్లఅడవిమొల్ల** రూ.చూ. తెల్లడవిమొల్ల.వి. సువాసనకల తెల్లని పూలు పూసే ఒక తీగ (Jasminum Auriculatum). **తెల్లఅంటిస** రూ. తెల్లంటిస. వి. బంజరు నేలల్లో పెరిగే ఒక మొక్క (Sida Cordifolia). **తెల్లఅలచంద** రూ.చూ. తెల్లలచంద. వి. నాలుగైదు నెలల్లో పండే పప్పు దినుసు (Vigna Catjang, Dolichos Catjang). **తెల్లఅవిసె** రూ.చూ. తెల్లవిసె. వి. ఒకరకం నూనెగింజల చెట్టు (Linam Usitastessemum). **తెల్లఅనగ** రూ.చూ. తెల్లానప. వి. తెల్లరకం సొర. **తెల్లఅనప** రూ.చూ. తెల్లానప. వి. తెల్లరకం సొర. **తెల్లఈశ్వరి** వి. పడమటి కనుమలూ మొ॥ చోట్ల పెరిగే ఒక మొక్క (Bragantia Wallichil). **తెల్లఉడత** వి. లేత బూడిదరంగు గల ఉపశాఖలు కలిగిన ఒక తీగ (Opilia Amentacea). **తెల్లఉన్ని** రూ. తెల్లున్ని. వి. తెలుపురంగు గొర్రెబొచ్చు. **తెల్లఉప్పి** రూ.చూ. తెల్లుప్పి. వి. తినటానికి పనికివచ్చే పళ్ళుకాసే ఒక చెట్టు (Azima Tetracantha). **తెల్లఉలవ** వి. నాలుగు నెలల్లో పండే ఒకరకం పప్పు దినుసు. **తెల్లఉలిమిడి** వి. నదీతీరాల్లో పెంచే ఒక మొక్క (Grataeva Religiosa). **తెల్లఉల్లి** వి. వెల్లుల్లి. **తెల్లఉస్తె** వి. బంగాళదుంప (Solanum Trilobatum). **తెల్లఎలపడం** వి. బియ్యం తెల్లగా ఉండే ఒకరకం. **తెల్లకక్కెత** రూ.చూ. తెల్లకక్కెన. వి. పెద్దపెద్ద ముళ్ళు కలిగి గట్టిగాఉండే తెల్లని బలమైన ఈనెలుకల ఆకులూకల ఒక చెట్టు (Gardenia Turgida). **తెల్లకక్కెన** రూ. తెల్లకక్కెత, తెల్లకొక్కెత. వి. బలమైన ఈనెలుకల ఆకులూ, తెల్లని కలపా. పెద్ద పెద్ద ముళ్ళూ కలిగిన ఒక చెట్టు (Gardenia Turgida). **తెల్లకంచురాయి** వి. అబ్బుగుల్ల, సున్నం చేయటానికి ఉపయోగపడే గుల్ల. **తెల్లకంద** వి. కూరగా ఉపయోగపడే తెల్లగాఉండే ఒక దుంప. **తెల్లకంది** రూ. తెల్లగంది. వి. ఆంధ్రదేశంలో ఎక్కువగా పండించే పప్పు దినుసు (Congopeaor Pigeonpea, Cojamus Indicus). **తెల్లకరక** వి. చర్మాన్ని చదును చేయటానికి ఉపయోగపడే కాయలు కాసే ఒక చెట్టు (Terminalia Pallida). **తెల్లకలిగొట్టు** వి. కాష్ఠపాటలి, వృక్షవిశేషం. **తెల్లకలువ** రూ.చూ. తెల్లకల్వ. వి. కైరవం, తెల్లనికలువ. **తెల్లకల్వ** రూ. తెల్లకలువ, తెల్లగలువ. వి. కైరవం, తెల్లని కలువ. ఆం.భా. 1.164. **తెల్లకాక** వి. **1.** అత్యంతమైనకాక; **2.** ఉచితమైన సమయం. **తెల్లకాకముష్టి** రూ. తెల్లకాకముస్తె. వి. కోతిబీర, మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క (Celtis Wighti!). **తెల్లకాకముస్తె** రూ.చూ. తెల్లకాకముష్టి. వి, కోతిబీర, మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క (Celtis Wightil). **తెల్లకాకర** రూ. తెల్లకాకరి. వి. చెక్కు తెల్లగాఉండే ఒకరకం కాకర. **తెల్లకాకరి** రూ.చూ. తెల్లకాకర. వి. చెక్కు తెల్లగాఉండే ఒకరకం కాకర. **తెల్లకాకి** వి. తెల్లనికాకి, శ్వేతవాయసం. **తెల్లకాంచనము** వి. వృక్షవిశేషం, ఒక జాతికోవిదారం. హంస. 4.11. **తెల్లకాటు** వి. కోరానూలు, చలువచెయ్యని ముడి నూలు. **తెల్లకారింగువ** వి. ఎర్రబిక్కి, మందుల్లో ఉపయోగపడే ఒకరకం జిగురునిచ్చే చెట్టు (Gardenia Lucida). **తెల్లకాల్పు** రూ. తెల్లగాల్పు. వి. **1.** నల్ల కాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్పు; **2.** కాలీకాలని ఇటుక. **తెల్లకుట్టు** వి. కమ్మినేతలో అందానికి కుట్టిన తెల్లపోగు. **తెల్లకుట్టుతీయు** స.క్రి. కమ్మినేతలో అందానికి కుట్టిన తెల్లపోగు తీయు. **తెల్లకుసుమ** వి. ఒకరకం వడ్లు. **తెల్లకొక్కెత** రూ.చూ. తెల్లకక్కెన. వి. బలమైన ఈనెలుకల ఆకులూ, తెల్లని కర్రా కలిగిన ఒక చిన్నచెట్టు (Cardenia Turgida). **తెల్లకొక్కెర** వి. **1.** బలాకం, తెల్లకొంగ; **2.** ఆకులు తెల్లబడి ఎండిపోయే ఒకరకం వరి తెగులు. **తెల్లకొర్ర** వి. గింజలు తెల్లగాఉండే ఒకరకం కొర్ర. **తెల్లకోకబత్తు(డు** వి. ఒక జాతి భిక్షుకుడు, తెల్లని బట్టలు కట్టుకునే భక్తుడు. హంస. 3.29. **తెల్లకోడినేల** వి. తెలుపురంగుగల నేల. **తెల్లకోరింద** వి. దక్కను, పడమటి కనుమలూ కడప జిల్లాలోని కొండల మీద పెరిగే ఒక తీగ (Acacia Intsia). **తెల్లగగ్గెర** వి. అర్జకం, వృక్షవిశేషం. **తెల్లగంకి (-కంకి)** వి. కంకి తెల్లబడి గింజ పొల్లుగా అయ్యే ఒకరకం వరితెగులు. **తెల్లగచ్చ** వి. పచ్చనిపూలు పూసే ముళ్ళు కలిగిన ఒక చెట్టు. దీని గింజల్ని ఔషధాల్లో ఉపయోగిస్తారు (Caesalpinia Bonducella). **తెల్లగడ** వి. గోదావరి తీరంలోని అడవుల్లోనూ పడమటికనుమల్లోనూ పెరిగే ఒక చెట్టు (Dispyros Sylvatica). **తెల్లగడ్డ** వి.

నాలుగైదు నెలల్లో ఒడుపుకు వచ్చే ఉల్లిజాతికి చెందిన పైరు, వెల్లుల్లి (Allium Sativem). తెల్లగడ్డకొప్పది విణ. చిన్నకొప్పుగలస్త్రీ. తెల్లగంది రూ.చూ. తెల్లకంది. వి. ఆంధ్రదేశంలో ఎక్కువగా పండించే పప్పు దినుసు (Cajanus Indicus). తెల్లగన్నేరు వి. శ్వేతకరవీరం. తెల్లగన్నేర్లు వి.బ.వ. ఒకరకం మెట్టవడ్లు. తెల్లగరువు వి. తెల్లరాతి గులకనేల. తెల్లగరుసు వి. తెల్లరాతి గులకనేల. తెల్లగటి వి. శ్వేతగరుత్తు, హంస. పాంచాలీ. 1.3. తెల్లగటిక వి. శతవీర్య, వృక్షవిశేషం. తెల్లగలిజేరు వి. దీర్ఘపత్రం, శ్వేతపునర్నవ, వృక్షవిశేషం. తెల్లగలువ (-కలువ) రూ.చూ. తెల్లకల్వ. వి. తెల్లనికలువ, కైరవం. తెల్లగాత రూ. తెల్లగాద. వి. గాతజాతికి చెందిన ముళ్ళచెట్టు (Dio:pyros Kanjilali). తెల్లగాద రూ.చూ. తెల్లగాత. వి. గాతజాతికి చెందిన ముళ్ళచెట్టు (Diospyros Kanjilalı). తెల్లగాల్పు (-కాల్పు) రూ.చూ. తెల్లకాల్పు. వి. నల్ల కాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్పు. తెల్లగినిగడ్డలు వి.బ.వ. పులిదుంపలు, కరువు కాలంలో ఆహారంగా ఉపయోగపడే ఒకరకం దుంపలు (Discorea Hispida). తెల్లగినియ వి. సునాభం, వృక్షవిశేషం. తెల్లగిలు అ.క్రి. 1. తొలగు, తూలు, చలించు. అష్టమ.క. 2.72 పు. 13 పం.; 2. తెల్లబడు. తెల్లగిసె రూ.చూ. తెల్లవిసె. వి. ముతంగి, వృక్షవిశేషం. < తెల్ల[1] + అగిసె. తెల్లగుగ్గిలము వి. రాత్రిప్రదేశాల్లో పెరిగే ఒక పెద్ద చెట్టు (Boswelia Serrata). తెల్లగుబ్బలి వి. కైలాసపర్వతం. వేంక.ఆం. 77. తెల్లగుమ్మ వి. పెద్దపెద్ద ముళ్ళుకలిగి గట్టిగా ఉండే తెల్లనికలపా, బలమైన ఈనెలు ఆకులూ కల ఒకచెట్టు (Gardenia turgida). తెల్లగుముడు రూ.చూ. తెల్లగుమ్ముడు. వి. ఉత్తరసర్కారులూ, దక్కను, నీలగిరుల్లో పెరిగే ఒకపెద్ద తీగ (Vitis lanceolaria). తెల్లగుమ్మడి రూ.చూ. తెల్లగుమ్ముడు. వి. ఉత్తరసర్కారులూ, దక్కనూ, నీలగిరుల్లో పెరిగే ఒకపెద్దతీగ. తెల్లగుమ్ముడు రూ. తెల్లగుముడు, తెల్లగుమ్మడి. వి. ఉత్తరసర్కారులూ. దక్కనూ, నీలగిరుల్లో పెరిగే ఒక పెద్దతీగ (Vitis lanceolaria). తెల్లగురిగింజ వి. శ్వేతపాకి, వృక్షవిశేషం. తెల్లగురిజ వి. మధుశ్రవ, వృక్షవిశేషం. తెల్లగుబ్బమెక్కు స.క్రి. కల్లుతాగు. < తెల్ల[1] + గుబ్బము + ఎక్కు. తెల్లగులాబి వి. తెల్లనిపూలుపూసే ఒకరకం గులాబి మొక్క (Rosa indica). తెల్లగుళ్ళంచు వి. రంగులో నేసిన భాగాలకు మధ్య తెలుపులో సందు (-గుండు) వదలి నేసినఅంచు. తెల్లగెంటెన వి. అశ్వఖుర, ఓషధీ విశేషం. హంస. 4.10. తెల్లగెనుసు వి. ఒకజాతి దుంప, తెల్లచిరగడం. హంస. 4.131. తెల్లగేసరి (-కేసరి) వి. బియ్యం తెల్లగా ఉండే ఒకరకం వడ్లు. తెల్లగొంగడి వి. తెలుపుఉన్నిలో నేసిన గొంగడి. తెల్లగొఱ్ర వి. బాటల పక్కనా, బంజరుల్లోనూ పెరిగే ఒకమొక్క (Sida ordifolia). తెల్లగొఱ్రె వి. తెలుపురంగుబొచ్చుగల గొఱ్రె. తెల్లగొలుకులు వి.బ.వ. తెల్లటి కనురెప్పలు. < తెల్ల + కొలికి + -లు. తెల్లగోసు వి. ఏడునుంచి పన్నెండడుగుల ఎత్తుపెరిగే పుల్లటి ఆకు కూర. తెల్లగోంగూర వి. కాడలు తెల్లగా ఉండే గోంగూర. తెల్లగోధుమ వి. గింజలు తెల్లగా ఉండే ఒకరకం ఆహారధాన్యం. తెల్లగోరంట వి. సైరేయకం, వృక్షవిశేషం. తెల్లచంద్ర వి. తెల్లని పూలుపూసే ఒక అందమైన చెట్టు (Acacia sura). తెల్లచందనము వి. సువాసనకలిగిన కఱ్ఱనిచ్చే ఒకచెట్టు. మంచిగందపు చెట్టు (Santalum album). తెల్లచవుడు రూ. తెల్లజవుడు. వి. జిగురుగా తెలుపుగాఉండి ఇసక కర కలిసిన చవుడు. తెల్లచాయ రూ. తెల్లసాయ. వి. వెల్ల, తెలుపురంగు. తెల్లచిక్కుడు వి. గింజలు తెల్లగా ఉండే ఒకరకం చిక్కుడు. తెల్లచిత్త వి. తెల్లటిచుక్కలు పడి ఆకులు ఎండిపోయే ఒకతెగులు. తెల్లచిందుగ వి. వ్యవసాయపు పనిముట్లకూ ఇళ్ళనిర్మాణానికి పనికివచ్చే కలపనిచ్చే ఒకచెట్టు (Albizzia Procera). తెల్లచిలగడ వి. తెల్లటితొక్క ఉండే గెనుసుగడ్డ. తెల్లచీకి వి. పొదగాపెరిగే ఒకముళ్ళ మొక్క (Ptelobium indicum). తెల్లచీడ వి. తమలపాకుల మీద, వరిఆకుల మీద పడే చిన్న తెల్లపురుగు. తెల్లచీర వి. తెలుపురంగు నూలుతో నేసిన చీర. తెల్లచెక్కు వి. గట్టితెల్లనేల. తెల్లచెక్కునేల వి. గట్టితెల్లనేల. తెల్లచెన్నంగులు వి.బ.వ. ఒకవిధమైన చెన్నంగిధాన్యం. హంస. 4 128. తెల్లచెరుకు రూ.చూ. తెల్లచెఱకు. వి. చెరకులో ఒకరకం (Saccharum officinarum). తెల్లచెఱకు రూ. తెల్లచెరుకు. వి. తేజనకం, ఇక్షువిశేషం. తెల్లజక్కి వి. ఉచ్చైశ్శ్రవం. సాంబ. దేవ. 17. తెల్లజనము రూ. తెల్లజనుము. వి. వృత్తపర్ణి, వృక్షవిశేషం (Crotaicaria genus). తెల్లజనుము రూ. చూ. తెల్లజనము. వి. వృత్తపర్ణి (Crotalania genus). తెల్లజవుడు (-చవుడు) రూ.చూ. తెల్లచవుడు. వి. జిగురుగా తెల్లగా ఉండి ఇసక కర కలిసిన చవుడు. తెల్లజాన వి. సన్నని ఆకులు కలిగిన ఒక అడవి మొక్క (Grewia hirsuta). తెల్లజామ వి. తెల్లనిగుంజు కలిగిన కాయలుకాసే ఒకరకం జామచెట్టు (Psidium guava). తెల్లజిగి వి. ఒకరకం పేనువల్ల జొన్నకు పట్టే బంక తెగులు. తెల్లజిలకఱ్ఱ వి. అజాజి, జీరకం. తెల్లజిల్లెడు రూ. తెల్లజిల్లేడు. వి. అలర్కం (Coalotropis gigantea). తెల్లజిల్లేడు రూ.చూ. తెల్లజిల్లెడు. వి. అలర్కం (Coalotropis gigantea). తెల్లజుమికి వి. బాటలపక్క పెరిగే ఒక మొక్క (Passiflora foetida). తెల్లజురటరాగి వి. ఎన్ను తెల్లగాఉండే ఒకరకం రాగి. తెల్లజువి[1]. వి. పాల్దతం (Paldatam Ehretia laevis). తెల్లజువి[2] వి. బూడిద రంగు కొమ్మలూ, ముళ్ళూ, నూగూఉన్న ఆకులు కలిగిన ఒకచిన్న చెట్టు (Ehretia Aspera). తెల్లజువ్వి వి. పెళుసుగా ఉండే కాండం కలిగి తెల్లపూలు పూసే ఒకచెట్టు (Ehretia laevis). తెల్లజేమ వి. కాయలుతెల్లగా ఉండే జామచెట్టు. తెల్లజొన్న రూ. తెజ్జొన్న వి. గింజతెల్లగానూ, ఎన్ను ముద్దగానూ ఉండే ఒకరకం జొన్న. తెల్లదంగుబ్రాలు (-ప్రాలు) వి.బ.వ. తెల్లగాదంచిన బియ్యం. తెల్లడవిమొల్ల రూ. తెల్ల అడవిమొల్ల. వి. సువాసననిచ్చే తెల్లపూలు పూసే ఒకతీగ (Jasminum aucicula-

tum). తెల్లడాలుమెకము రూ. తెల్లడాల్మెకము. వి. సింహం. అచ్చ. రా. యు. 285. వ్య. తెల్లటికాంతిగల మృగం. తెల్లడాల్మెకపుగద్దియ వి. సింహాసనం. అచ్చ. రా. యు. 588. తెల్లడాల్మెకము రూ. చూ. తెల్లడాలుమెకము. వి. సింహం. తెల్లంటిస రూ.చూ. తెల్లఅంటిస. వి. బంజరు భూముల్లోనూ, బాటలపక్కనా పెరిగే ఒకమొక్క (Sida cordifolia). తెల్లతగరము వి. ఒకరకం లోహం. తెల్లతమిదె వి. నీటివసరున్న భూముల్లో పండే ఒకరకం ఆహార ధాన్యం (Elcusine coraccana, cynosurus coracanus). తెల్లతంబ రూ.చూ. తెల్లతమ్మ. వి. చెట్టుగాపెరిగి పచ్చి ఎరువుగా ఉపయోగపడే ఒకరకం తంబ. (Canavalia ensiformis). తెల్లతమ్మ రూ. తెల్లతంబ. వి. చెట్టుగాపెరిగి పచ్చి ఎరువుగా ఉపయోగపడే ఒకరకం తమ్మ (Canavalia ensiformis). తెల్లతమ్మి రూ.చూ. తెల్లదమ్మి. వి. తెల్లనిపద్మం, పుండరీకం. తెల్లతిప్పతీగె వి. పచ్చని పూలుపూసే ఒకతీగ. తెల్లతుమ్మ రూ.చూ. తెల్లదుమ్మ. వి. తెలితుమ్మ, విట్టదిరం (Acacia leucophloea). తెల్లతువ్వ రూ. తెల్లదుబ్బ. వి. తెల్లరంగుతువ్వనేల. తెల్లతువ్వనేల రూ. తెల్లదుబ్బనేల. వి. తెల్లరంగుతువ్వనేల. తెల్లతూమ వి. ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే ముతకనార నిచ్చే బెండు కలిగిన ఒకమొక్క (Acacia leucophloea). తెల్లతెగడ వి. త్రివృత, ఒకరకం తెగడ, వృక్షవిశేషం (Ipomoea Turpethum). తెల్లతెగులు రూ. తెల్లదెగులు. వి. వరి, జొన్న, మిరప మొ. వాటి తెగులు (mildew). తెల్లతెల్లన విణ. తెల్లగాఉన్న. మను. 3.28. వి. మిక్కిలితెలుపు. తెల్లతేజి వి. ఉచ్చైః శ్రవం. ఆం. భా. 1.56. తెల్లతొళసి వి. కటుపత్రం. తెల్లతోటకూర రూ. తెల్లదోటకూర. వి. తోటకూర రకాల్లో ఎక్కువ కూరదినుసుగా ఉపయోగించే రకం. తెల్లదంగ్గుబ్రాలు వి.బ.వ. తెల్లగా దంచినబియ్యం. ద.హిం. శా. సంపు. 4. శా.సం. 1021. తెల్లదమ్మి(-తమ్మి) రూ. తెల్లతమ్మి. వి. తెల్లనిపద్మం, పుండరీకం. ఆం.భా. 1.164. తెల్లదాటెన వి. అశ్వఖురం. గుర్రపుడెక్క. తెల్లదామర (-తామర) వి. తెల్లని తామర, పుండరీకం. తెల్లదింటెన వి. తోటల్లోనూ, దళ్ళమీద పెంచబడే అందమైనతీగ (Colitoria Ternatea). తెల్లదిరిసన రూ. తెల్లదిరిసనము. వి. గృహాది నిర్మాణాలకూ, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకచెట్టు (Albizzia Procera). తెల్లదిరిసనము రూ.చూ. తెల్లదిరిసన. వి. గృహాది నిర్మాణాలకూ, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకచెట్టు (Albizzia procera). తెల్లదీవి వి. శ్వేతద్వీపం. ఉ.రా. 5.185. తెల్లదుబ్బ రూ.చూ. తెల్లతువ్వ. వి. తెల్లరంగు తువ్వనేల. తెల్లదుబ్బనేల రూ.చూ. తెల్లతువ్వనేల. వి. తెల్లరంగుతువ్వనేల. తెల్లదుంప వి. 1. చిలకడదుంప, గెనుసుగడ్డ; 2. కంద. తెల్లదుమ్మ(-తుమ్మ) రూ. తెల్లతుమ్మ. వి. వెలితుమ్మ, విట్టదిరం. హంస. 4.9. తెల్లదురదగొండి వి. దళ్ళమీదా, పొదలమీదా అల్లుకొనే సన్ననితీగ (Mucuna Pruriens). తెల్లదూదర వి. ఆకుమీద తెల్లటిబూజుపట్టే ఒక వరితెగులు. తెల్లదెసలు రూ.చూ. తెల్లతెగులు. వి. వరి, జొన్న. మిరప మొ. వాటి తెగులు. తెల్లదోటకూర రూ.చూ. తెల్లతోటకూర. వి. తోటకూరరకాల్లో ఎక్కువ కూరదినుసుగా ఉపయోగపడే రకం. తెల్లన రూ. తెలన. విణ. ధవళం, తెల్లని. ఆము. 6.12 ; వి. శుక్లవర్ణం, తెలుపు. ఆం.భా. 1.108. తెల్లనకనల్లనక అవ్య. ఒకరిని ఎన్నక, ఇతరులను విమర్శించక. < తెల్ల[1] + అనక + నల్ల + అనక. తెల్లనగిర వి. తెల్లనక్కెరచెట్టు. హంస. 4.11. తెల్లనరికగొంగడి రూ. తెల్లనర్కగొంగడి. వి. తెల్లరంగుముదుగు ఉన్నితో నేసిన గొంగడి. తెల్లనర్కగొంగడి రూ.చూ. తెల్లనరిక గొంగడి. వి. తెల్లరంగు ముదుగు ఉన్నితో నేసిన గొంగడి. తెల్లనాకు రూ.చూ. తెలనాకు. వి. లేత తమలపాకు. శుక. 2.434. < తెల్లన + ఆకు. తెల్లనాపరాయి వి. ఎర్రమొరంరాయి. తెల్లనార వి. మత్స్య విశేషం. తెల్లనికండ్లు వి.బ.వ. కాంతివంతమైన కళ్ళు. తెల్లనిగట్టు వి. రజతగిరి, కైలాసపర్వతం. మను. 4.16. తెల్లనితల్లి వి. తెల్లని శరీరచ్ఛాయ కలిగినతల్లి, సరస్వతీ దేవి. సిం. ద్వా. 1.2. తెల్లనిదొర వి. 1. తెల్లనిశరీర కాంతిగల దేవుడు, శివుడు. విజయ. 1.50 ; 2. బలరాముడు. తెల్లనిపిట్ట వి. హంస. తెల్లనిమయిదంట రూ.చూ. తెల్లనిమైదంట. వి. బలరాముడు. తెల్లనిమైదంట రూ. తెల్లనిమయిదంట, తెల్లమైదంట. వి. బలరాముడు. ఆం.నా.సం. దేవ. 29. తెల్లనివా(డు విణ. శ్వేతముఖుడు. తెల్లనీరుల్లి వి. తెల్లనినీరుల్లిగడ్డ, పలాండువు. తెల్లనీలాంబరి వి. తోటల్లో పెంచబడి నీలంరంగూ, ఎర్రనీ, తెల్లనీ పూలుపూసే ఒకమొక్క (Barleria Cristata). తెల్లనుము వి. అలచంద మాదిరిగా ఉండే ఒకరకం పప్పుదినుసు. తెల్లనూగులు రూ. తెల్నూవులు, తెల్లనూలు. వి.బ.వ. 1. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజలచెట్టు (Sesamum Indicum) ; 2. తెల్లగాఉండే నువ్వులు. తెల్లనూలు రూ.చూ. తెల్లనూగులు. వి.బ.వ. 1. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజలచెట్టు (Sesamum Indicum) ; 2. తెల్లగాఉండే నువ్వులు. తెల్లనేల వి. తెల్లడాలుగా ఉన్న నేల. తెల్లనేలగుమ్ముడు వి. విదారి, వృక్షవిశేషం తెల్లనేలపరికి వి. కొండలమీద సుమారు ఆరడుగుల ఎత్తుపెరిగి నీలంతోకూడిన ఎరుపు రంగు పూలుపూసే ఒకమొక్క (Desmodiccum Latifolium). తెల్లనేలములక వి. చిన్నికొండలమీదా, బంజరు భూముల్లోనూ, బాటలపక్కనాపెరిగే ఒకమొక్క. (Solanum Xanthocarpum). తెల్ల(దనము(-తనము) వి. తెలుపు, ధావళ్యం. తెల్లపచరు వి. అడవుల్లో పెరిగి ఇంధనంగా ఉపయోగపడే ఒకచెట్టు (Dalbergia Paniculata). తెల్లపచ్చజొన్న వి. ఒకరకంజొన్న. తెల్లపట్టెలగొంగడి వి. నలుపులో, తెల్లచారలుపడేట్టు నేసిన గొంగడి. తెల్లపడు అ.క్రి. తెల్లనగు, ధవళమగు. తెల్లపత్తి వి. తెల్లరంగు పత్తి. తెల్లపరింగ వి. కొండలమీద పెరిగి తినటానికి పనికివచ్చే పళ్ళుకాసే ఒకచెట్టు (Rabus Lasiocarpus).

తెల్లపాడు వి. తెల్లమట్టి కలిసిన పాటినేల. తెల్లపాడునేల వి. తెల్లమన్ను కలిసిన పాటినేల. తెల్లపాపట రూ.చూ. తెల్లపాపిడి. వి. కొండల్లో పెరిగే అందమైన తెల్లనిపూలు పూసే ఒకచిన్నచెట్టు (Pavetta Indica). తెల్లపాపిడి రూ. తెల్లపాపట. వి. అందమైన తెల్లనిపూలు పూసే ఒకచిన్నచెట్టు. (Pavetta indica). తెల్లపాల రూ.చూ. తెలపాల. వి. చెక్కడంపనికి ఉపయోగపడే కలపనిచ్చే పచ్చనిపూలుపూసే ఒకరకం పాలచెట్టు (Wrightia Tinctoria). తెల్లపాలపుజొన్న వి. ఒకరకంజొన్న. తెల్ల పాలవడ్లు వి.బ.వ. ఒకరకం ధాన్యం. తెల్లపిప్పిలి వి. ఉత్తరసర్కారులూ, దక్కను పడమటి కనుమల్లోని తూర్పు భాగంలోనూ పెరిగి తెల్లని పూలుపూసే ఒక తీగ (Symphoretma Involucratum). తెల్లపిసుని వి. లేతబూడిదరంగు కొమ్మలు కలిగి తెల్లపూలు పూసి నల్లగా మారే లేత ఎరుపుతోకూడిన నీలంరంగు పళ్ళు కాసే ఒకచెట్టు (Ehretia Leavis). తెల్లపుచ్చు[1] వి. గుత్తులు గుత్తులుగా పూలుపూసే (నూగు కలిగిన) ఒకచెట్టు (Wendlandia Tinctoria). తెల్లపుచ్చు[2] వి. వాసన కలిగిన తెల్లపూలు పూసేచెట్టు (Wendlandia exserta). తెల్లపుటము వి. కుష్ఠం. తెల్లపుండి వి. తెల్లగోంగూర. తెల్లపుని రూ.చూ. తెల్లపున్కి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు (Givotia Rottleriformis). తెల్లపున్కి రూ. తెల్లపుని, తెల్లపురికి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు (Givotia Rottleriformis). తెల్లపురికి రూ.చూ. తెల్లపున్కి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు (Givotia Rottleriformis). తెల్లపురుగు వి. వంకాయ మొ. వాటిలో పడే తెల్లటి పురుగులు. తెల్లపురుగుడు[1] రూ.చూ. తెల్లపులుగుడు. వి. కొమ్మలకు ముళ్ళు కలిగి తెల్లని పళ్ళుకాసే ఒక చెట్టు (Fluggea Leucopyrus). తెల్లపురుగుడు[2] వి. వ్యవసాయపు పనిముట్లకు ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు. (Fluggea Microcarpa). తెల్లపులికి[1] వి. పెట్టెలూ, ఆట వస్తువులు మొ॥ వాటిని తయారుచేయటానికి ఉపయోగపడే మెత్తటి కలపనిచ్చే ఒక చెట్టు (Gyrocarpus Jacquini). తెల్లపులికి[2] రూ.చూ. తెల్లపొలికి. వి. బొమ్మలూ, ఆటవస్తువులు మొ॥ వాటికి పనికివచ్చే కలప కలిగి చమురు నిచ్చే గింజలుకాసే ఒకచెట్టు (Givotia Rottleriformis). తెల్లపులిసరు వి. తెల్లపురుగుడు, తెల్లపళ్ళుకాసే ఒక మొక్క (Fluggea Leucopyrus). తెల్లపులుగుడు రూ. తెలపులుకుడు, తెల్లపురుగుడు[1]. వి. తెల్లపురుగుడు, తెల్లపళ్ళ చెట్టు (Fluggea Leucopyrus). తెల్లపులుసీరు వి. తెల్లని పళ్ళుకాసే ఒక చెట్టు (Fluggea Leucopyrus). తెల్లపూత వి. సున్నపు నీటితో గోడమీద పూసిన పూత. తెల్లపూతపత్తి వి. ఒకరకం పత్తి (Cotton Gossypium) తెల్లపూలి వి. పూలి జాతికి చెందిన చెట్టు (Fluggea Microcarpa). తెల్లపెండలం వి. ఒకరకం పెండలం. తెల్లపొచ్చె వి. అబ్బుగుల్ల. సున్నంతయారీకి ఉపయోగించే గుల్ల. తెల్లపొట్ల వి. తెల్లచారల కాయలుండే పొట్ల. తెల్లపొడ వి. 1. పొగాకు, రాగి, జొన్న మొ॥ పైర్ల ఆకుమీద తెల్లటి పొడ లేర్పడే తెగులు; 2. నలుపు, ఎరుపుల తెల్లమచ్చ. తెల్లపొణకు రూ.చూ. తెల్లపొలికి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు. తెల్లపులికి (Givotia Rottleriformis). తెల్లపొణుకు రూ.చూ. తెల్లపొలికి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు. (Givotia Rottleriformis). తెల్లపొనికి రూ.చూ. తెల్లపొలికి. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు. (Givotia Rottleriformis). తెల్లపొరక రూ.చూ. తెల్లపొలికి. వి. తెల్లపులికి, ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు (Givotia Rottleriformis). తెల్లపొలికి రూ. తెల్లపులికి[2], తెల్లపొణకు, తెల్లపొణుకు, తెల్లపొనికి, తెల్లపొరక. వి. ఆటవస్తువుల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు (Givotia Rottleriformis). తెల్లపోతు వి. బూడిద రంగు ఎనుబోతు. తెల్లపోలు వి. పెండ్లిలో చాకలివాడు బియ్యంతో రాసేది, బగ్గపుపోలు. తెల్లబంక వి. జొన్న ఆకుమీద పేనుపడి తెల్ల బంక ఏర్పడే తెగులు. తెల్లబంక మట్టి వి. ఇటుకలు, కుండలు చేయటానికి ఉపయోగపడే మంచి మట్టి. తెల్లబట్ట వి. సుఖరోగవిశేషం, గనేరియా. తెల్లబట్టకట్టు అ.క్రి. నర్సిన కుండల్ని నీడలో ఆరబెట్టినప్పుడు కొంత తెల్లబడు. తెల్లబరింక రూ.చూ. తెల్లబరినిక. వి. కొండజువ్వి చెట్టు, ఇతర వృక్షాలమీద పెరిగి వాటిని చంపే ఒక చెట్టు (Ficus Gibbosa). తెల్లబరినిక రూ. తెల్లబరింక, తెల్లబ్రంకి. వి. కొండజువ్విచెట్టు. ఇతర వృక్షాలమీద పెరిగి వాటిని చంపే ఒక చెట్టు (Ficus Gibbosa). తెల్లబ్రంకి రూ.చూ. తెల్లబరినిక. వి. కొండజువ్విచెట్టు, ఇతర వృక్షాలమీద పెరిగి వాటిని చంపే చెట్టు (Ficus Gibbosa). తెల్లబల్లి[1] వి. తెలుపురంగున్న బల్లి. తెల్లబల్లి[2] వి. ఉత్తరసర్కారుల్లో కొండలమీద పెరిగే ఒక చిన్న మొక్క లేక తీగ (Bridelia Tomentosa). తెల్లబావన వి. మంచి తెలుపురంగు. తెల్లబాయి వి. తెల్లగడ్డ. ఉల్లిజాతికి చెందిన ఒక పైరు, వెల్లులి. (Alliccum Satillium). తెల్లబుడమలు వి.బ.వ. ఒకరకం వడ్లు తెల్లబుడరి వి. పడమటికనుమల్లో పెరిగే ఒక చెట్టు (Vitis Glauca). తెల్లబూరగ వి. దూదినిచ్చే ఒక చెట్టు (Eriodendron Anfractuousum). తెల్లబెండ వి. దక్కనులోనూ కోస్తాలోనూ పెరిగే ఒక మొక్క (Abutilon Crispum). తెల్లబొద్దు వి. రెమ్మకు రెండేసి ఆకులుండే తెల్లటి కలుపు మొక్క. తెల్లబొంతు వి. తెల్లరాతి పొర కలిసినమట్టి. తెల్లబొంబాయి వి. బొంబాయినుంచి తెచ్చిన ఒకరకం జొన్న. తెల్లబొమ్మడి వి. జొన్న ఆకుల మీద ఏర్పడే తెల్లచీడ. తెల్లబోరవ వి. తెల్లగడ్డ. తెల్లమంగ వి. మందుల్లో ఉపయోగపడే జిగురునిచ్చే ఒక చెట్టు (Gardenia Lucida). తెల్లమట్టి వి. చవిటి మట్టిలాగా తెల్లగా ఉండే మట్టి. తెల్లమడ వి. అరుదుగా ఇంధనంగా ఉపయోగపడే కరపనిచ్చే ఒక చెట్టు. తెల్లమదు రూ.

తెల్లమద్ది, తెల్లమద్దె. వి. గట్టిగా ఉండే కలపనిచ్చే ఒకరకం మద్దిచెట్టు (Terminalia Arjuna). తెల్లమద్ది రూ.చూ. తెల్లమదు. వి. గట్టిగా ఉండే కలపనిచ్చే ఒకరకం మద్దిచెట్టు (Terminalia Arjuna). తెల్లమద్దె రూ.చూ. తెల్లమదు. వి. గట్టిగా ఉండే కలపనిచ్చే ఒకరకం మద్దిచెట్టు (Terminalia Arjuna). తెల్లమన్ను వి. చవిటి మట్టి లాగా తెల్లగా ఉండే మట్టి. తెల్లమల్లిజొన్న వి. ఒకరకం జొన్న. తెల్లమసక వి. తెల్లమన్ను కలిసిన రేగడినేల. తెల్లమసర వి. తెల్లమన్ను కలిసిన రేగడినేల. తెల్లమానికము వి. వజ్రం. హీరం. యయా. 1.5. తెల్లమాను వి. ఒకరకం ఎరుపురంగు తయారు చేయటానికి ఉపయోగపడే సిందూరం పూలుపూసే ఒక చెట్టు (Wood Fordia floribunda). తెల్లమాయిపట్టిచీర వి. నల్లపడుగులో చిన్న తెల్ల పోగులు దూర్చి నేసిన చీర. తెల్లమిరప వి. ఒకరకం మిరప. తెల్లముక్కింపురాయి వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. తెల్లముచ్చెలు వి.బ.వ. ఒకరకం వడ్లు. తెల్లమునగ వి. కూరలకుపయోగపడే పొడుగుపాటి కాయలుకాసే ఒక చెట్టు. తెల్లములక వి. శ్వేతబృహతి, వృక్షవిశేషం. (Solanum Indicum). తెల్లమై వి. కపిలవన్నె, నలుపు కలిసిన తెలుపు. తెల్లమైదంట రూ.చూ. తెల్లనిమైదంట. వి. బలరాముడు. తెల్లమొకరం వి. తెల్లతొక్క ఉండే గెనుసు. తెల్లమొతుకు రూ. తెల్లమొత్కు. వి. బళ్ళు మొ. వాటి తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకచెట్టు (Ougeinia dalbergioides). తెల్లమొత్కు రూ.చూ. తెల్లమొతుకు. వి. బళ్ళు మొ. వాటి తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకచెట్టు. తెల్లమొదవు వి. కామధేనువు. సాంబ. దేవ. 29. తెల్లమొరం వి. 1. ఎర్రకంచురాయి ; 2. తెల్లరంగు మొరసనేల. తెల్లమొరస రూ. తెల్లమొర్స. వి. తెల్లరంగు మొరసనేల. తెల్లమొరసరాయి రూ. తెల్లమొర్సరాయి. వి. గాజు, సబ్బు, కాగితం, రంగులు మొ. వాటి తయారీలో ఉపయోగపడే ఒకరకం రాయి. తెల్లమొర్స రూ.చూ. తెల్లమొరస. వి. తెల్లరంగు మొరసనేల. తెల్లమొర్సరాయి రూ.చూ. తెల్లమొరసరాయి. వి. గాజు, సబ్బు, కాగితం, రంగులు మొ. వాటి తయారీలో ఉపయోగపడే ఒకరకం రాయి. తెల్లమోదుగ వి. ఒకరకం మోదుగ చెట్టు (Butea frondosa). తెల్లఁబడు (-పడు) అ.క్రి. వెలవెల పోవు. సిం. ద్వా. 2.103. తెల్లఁబాఱు (-పాఱు) రూ. తెలవాఱు. తెలాఱు, తెల్లవారు², తెల్లవాఱు. అ.క్రి. 1. తెల్లనగు, తెల్లబడు. శృం. నై. 8.167 ; 2. భయాదులచే వివర్ణమగు. వరాహ. 3.5 ; 3. పాలిపోవు. తెల్లఁబోవు (-పోవు) అ.క్రి. పాలిపోవు, నిర్విణ్ణుడగు. తెల్లంబ్రాలు (-ప్రాలు) రూ. తెల్లఁబ్రాలు. వి.బ.వ. తెల్లగాదంచిన బియ్యం. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1001. క్రీ. శ. 1150. తెల్లఁబ్రాలు రూ.చూ. తెల్లంబ్రాలు. వి.బ.వ. తెల్లగాదంచిన బియ్యం. తెల్లమ్రాను వి. కల్పవృక్షం. ఆం. భా. 1.59. తెల్లయీదాల వి. కాకపల్ల. ఎక్కువగావ్యాపించే ఒకతీగ (Tylophora arthmatica). తెల్లయిరుగుడు (-ఇరుగుడు) రూ.చూ. తెల్లయిఱుగుడు. వి. శ్వేతపత్రం, ఒకరకం ఇరుగుడు చెట్టు.

తెల్లయిఱుగుడు (-ఇఱుగుడు) రూ. తెల్లయిరుగుడు. వి. శ్వేతపత్రం, ఒకరకం ఇరుగుడుచెట్టు. తెల్లయుప్పి (-ఉప్పి) రూ.చూ. తెల్లుప్పి. వి. మౌక్తికఫలం, వృక్షవిశేషం. తెల్లయురగపిల్ల(వేల్పదె వి. కోడిడేగ. తెల్లయేనుఁగు(-ఏనుఁగు) వి. వెల్లఏనుగు, ఐరావతం. ఆం. నా. సం. దేవ. 17. తెల్లరంగు వి. వర్ణపట్టికలోని మూలవర్ణాల మొత్తపురంగు. తెల్లరాగిడి వి. తెల్లమట్టి కలిసిన రాగిడినేల. తెల్లరాయి రూ. తెల్రాయి. వి. 1. ఎర్రకంచురాయి ; 2. తెల్లరంగు గలరాయి ; 3. సున్నపు మష్టురాయి ; 4. ముగ్గువేసుకోడానికి పనికివచ్చే తెల్లగా మెత్తగా ఉండేరాయి ; 5. ఇళ్ళ కట్టుబడికి ఉపయోగించే రాయి. తెల్లరేగడి రూ. తెల్లరేవడి. వి. తెల్లమన్ను కలిసినరేగడి నేల. తెల్లరేవడి రూ.చూ. తెల్లరేగడి. వి. తెల్లమన్ను కలిసిన రేగడినేల. తెల్లరేషం వి. తెలుపువన్నె పట్టు. హిం. రేషమ్. పట్టు. < తెల్ల + హిం. రేషమ్. తెల్లరోగం వి. సజ్జ, రాగి మొ. వాటితెగులు. తెల్లలచంద రూ. తెల్లఅలచంద. వి. నాలుగైదు నెలల్లో పండే పప్పుదినుసు (Vigna cotjang Dolichos catjang). తెల్లలతిక రూ.చూ. తెల్లలత్తిక. వి. వరి, జొన్న మొ. వాటి ఆకులకూ, కాడకూ తెల్లటి బంకపట్టే తెగులు. తెల్లలత్తిక రూ. తెల్లలతిక. వి. వరి, జొన్న వాటిఆకులకు తెల్లటి జిగట బంకపట్టే తెగులు. తెల్లలొద్దుగ రూ.చూ. తెల్లలొద్దుగు. వి. తెల్లని పూలుపూసే ఇంధనంగా ఉపయోగపడే ఒక చెట్టు (Symplocos spicata). తెల్లలొద్దుగు రూ. తెల్లలొద్దుగ, వి. జీర్ణ వృతం, ఒక రకం లొద్దుగు చెట్టు. తెల్లవంకాయ వి. గుండ్రంగా, తెల్లగా ఉండే వంకాయ. తెల్ల వంకెలు రూ. తెల్లొంకెలు. వి.బ.వ. ఒకరకంవడ్లు. తెల్లవట్టివేరు వి. లామజ్జకం. తెల్లవడల వి. బండి మురుదుడు తీగ. (Calycopteris floribunda). తెల్లవడ్లు రూ. తెల్లొడ్లు. వి.బ.వ. ఒకరకం మెట్టవడ్లు. తెల్లవస వి. హైమవతి, వృక్షవిశేషం. తెల్లవాఁకుడు వి. శ్వేతకంటకారిక. వృక్షవిశేషం (Solanum xanthocarpum). తెల్లవారగట్ల రూ.చూ. తెల్లవారిగట్ల. అవ్య. వేకువజామున. తెల్లవారిగట్ల చూ. తెల్లవాఱు. రూ. తెల్లవారగట్ల, తెల్లారగట్ల. అవ్య. ఉదయాన. తెల్లవారు¹. విణ. బ.వ. విదేశీయులు. తెల్లవారు² రూ.చూ. తెల్లఁబాఱు. అ.క్రి. ఉదయమగు ; 2. వ్యర్థమగు. తెల్లవారుచుక్క రూ. తెల్లారిచుక్క, తెల్లారుచుక్క, తెల్లారెచుక్క. వి. కుందేటిచుక్క, పొద్దుపొడిచేముందు తూర్పున కనిపించే కాంతివంతమైన నక్షత్రం. తెల్లవార్చు రూ.చూ. తెల్లవాఱుచు. స.క్రి. 1. తెల్లవారజేయు ; 2. నాశనంచేయు. తెల్లవారులూ చూ. తెల్లవాఱు. అవ్య. రాత్రిఅంతా. తెల్లవారించు స.క్రి. తెల్లవారచేయు, ఉదయంకాజేయు. తెల్లవార్లులు చూ. తెల్లవాఱు. అవ్య. తెల్లవారేటంతవరకు, తెల్లవార్లు. తెల్లవాఱు (-పాఱు) రూ.చూ. తెల్లఁబాఱు. అ. క్రి. 1. భయాదులచే వివర్ణమగు, పాలిపోవు. విక్ర. 3.102 ; 2. తెల్లపడు, తెల్లనగు. దశా. 3.103 ; 3. ఉదయమగు, వేగు. సీలా. 3.46 ; 4. నిస్సారమగు, చెడిపోవు. తెల్లవాఱుకడ వి. తెల్లవారేసమయం. తెల్లవాఱుచు రూ. తెల్లవార్చు స.క్రి. తెల్లవారజేయు, ఉదయంకాజేయు. తెల్లవాలు

రూ.చూ. తెల్లావలు. వి.బ.వ. వె[్రిఆవాలు. తెల్లవావిలి వి. శ్వేతసురస, వృక్షవిశేషం (Vitex trifolia). తెల్లవిరుగుడు వి. ఎ[్రపచరుచెట్టు (Dalbergia lanceolaria). తెల్లవిసె రూ. తెల్లఅవిసె, తెల్లగిసె. వి. ఒకరకం నూనెగింజల చెట్టు (Linum usitatissemam). <తెల్ల+అవిసె. తెల్లవెంపలి వి. శ్వేతపుంఖం (Indiofara Wightil). తెల్లవెంబడి వి. ఆకులు తెల్లబడిపోయే తెగులు. తెల్లవేగిస వి. ఎక్కువ కొమ్మలు కలిగి నీడలో పెరిగే చెట్టు (Bridelia montana). తెల్లసన్న వి. ఒక రకం వడ్లు. తెల్లసల్లబుర్త రూ. తెల్లసాలబర్త. వి. గోదావరి జిల్లాలో పెరిగే ఒకమొక్క (Hibiscas hirtus). తెల్లసవరము వి. తెల్లనిచామరం, వింజామర. అప్ప. 5.11. తెల్లసొపర వి. వ్యవసాయపరికరాల తయారీకి, గృహాది నిర్మాణాలకి పనికివచ్చే కలపనిచ్చే ఒకచెట్టు (Albizria Procera). తెల్లసాయ (-చాయ) రూ. చూ. తెల్లచాయ. వి. వెల్ల, తెలుపురంగు. తెల్లసాలబర్త రూ.చూ. తెల్లసల్లబుర్త. వి. గోదావరి జిల్లాలో పెరిగే ఒకమొక్క (Hibisca hirtus). తెల్లసిక్కి వి. కడప జిల్లాలోని కొండలమీద అణ్ణామలై కొండలమీద పెరిగే ఒకమొక్క (Acacia Intsia). తెల్లసుగంధీపాల వి. మందుల్లో ఉపయోగించే ఒకతీగ (Hemides indicus). తెల్లసుద్ద వి. 1. తెల్లరంగు సుద్దనేల ; 2. జేగురుసుద్ద, ఇటుకల కుండల తయారీకి ఉపయోగపడే ఒకరకం మట్టి. తెల్లసున్నం వి. తెల్లగాఉండే సున్నం. తెల్లసెత్త (-చెత్త) వి. ఒకరకం కలుపు మొక్క. తెల్లసెనగ వి. మెట్టలో పండే తెల్లరకం పప్పు దినుసు (Chick pea) (cicer artitinum). తెల్లసెల్ల (-చెల్ల) రూ.చూ. తెల్లసెల్లా. వి. తెల్లరంగునూలు పెట్టి నేసిన కండువా. తెల్లసెల్లా (-చెల్లా) రూ. తెల్లసెల్ల. వి. తెల్లరంగు నూలు పెట్టినేసిన కండువా. తెల్లసొర వి. పెరళ్ళలో ఇంటిమీదికి అల్లిపెట్టి పెంచేతీగ మొక్క (Cottle ground). తెల్లసోపర వి. తెల్ల చిందుగ, వ్యవసాయపు పనిముట్లకూ, గృహోపకరణాలకి ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు (Albizzia Procera). తెల్లాకు వి. సాధారణమైన తమలపాకు, కమ్మేరాకు. <తెల్ల[1]+ఆకు. తెల్లాడిబావుటా వి. [్రిటిషు [్రభుత్వం. తెల్లవాడు అంటే ఆంగ్లేయుడు. అతడి బావుటా ధ్వజం. ఆంగ్లేయ [్రభుత్వమని అర్థం. తెల్లానగ రూ.చూ. తెల్లానప. వి. తెల్లరకం సొర. తెల్లానప రూ. తెల్లఆనగ, తెల్లఆనప, తెల్లానగ. వి. తెల్లరకం సొర. తెల్లారగట్ల రూ.చూ. తెల్లవారిగట్ల. అవ్య. వేకువజామున, ఉదయాన. తెల్లారిచుక్క రూ.చూ. తెల్లవారుచుక్క. వి. కుందేటిచుక్క, పొద్దు పొడిచేముందు తూర్పున కనిపించే కాంతిమంతమైన నక్షత్రం. తెల్లారుచుక్క రూ.చూ. తెల్లవారుచుక్క. వి. కుందేటిచుక్క. తెల్లారెచుక్క రూ.చూ. తెల్లవారుచుక్క. వి. కుందేటిచుక్క, పొద్దు పొడిచేముందు తూర్పున కనిపించే కాంతిమంతమైన నక్షత్రం. తెల్లావలు రూ. తెల్లవాలు. వి.బ.వ. తెల్లనిఆవాలు, సిద్ధార్థం. <తెల్ల[1]+ఆవ+-లు. తెల్లున్ని రూ.చూ. తెల్లఉన్ని. వి. తెలుపురంగు గొ[్రె బొచ్చు. <తెల్ల[1]+ఉన్ని. తెల్లుప్పి రూ. తెల్లఉప్పి, తెల్లయుప్పి. వి. ఒక రకం చెట్టు, మౌక్తికఫలం. హంస. 4.11. <తెల్ల[1]+ఉప్పి (Azima Tetracantha). తెల్లుమ్మెత రూ.చూ. తెల్లుమ్మెత్త. వి. విషపూరితమైన ఒక మొక్క (Datura Stramonium). తెల్లుమ్మెత్త రూ. తెల్లుమ్మెత. వి. తోటల్లోనూ, బంజరుభూముల్లోనూ బాటల పక్కనా పెరిగే ఒక మొక్క (Datura Fastuosa). తెల్లులవ వి. నాలుగు నెలల్లో పండే ఒకరకం పప్పు దినుసు. తెల్లులిమెర వి. ఇంధనంగా ఉపయోగపడే ముళ్ళచెట్టు (Diospyros Chloroxylon). తెల్లుల్లి రూ.చూ. తెల్లఉల్లి. వి. తెల్లటి పొరలుండే ఉల్లి, వెల్లుల్లి. <తెల్ల[1]+ఉల్లి. తెల్లుల్లిగడ్డ వి. తెల్లటి పొరలుండే నీరుల్లి. <తెల్ల[1]+ఉల్లిగడ్డ. తెల్లుసిరిక వి. చిన్నచిన్న రెమ్మలుండే ఒక మొక్క (Sauropus Quadrangularis). తెల్లూద వి. తెల్లటి ఎన్నులు గల ఊబగడ్డి (Heteropgon Species). <తెల్ల[1]+ఊద. తెల్లూబ వి. తెల్లటి ఎన్నులుగల ఊబగడ్డి (Heteropgon Species). <తెల్ల[1]+ఊబ. తెల్లొంకెలు రూ.చూ. తెల్లవంకెలు. వి.బ.వ. ఒకరకం వడ్లు. తెల్లొడ్లు రూ.చూ. తెల్లవడ్లు. వి.బ.వ. ఒకరకం మెట్టవడ్లు.

తెల్ల[2] వి. ఒకరకం చెట్టు (Morinda Umbellata).

త. తిల్లై. వృక్షవిశేషం.

తెల్లగుమ్మర్లు రూ.చూ. తెలకుమ్మర్లు. వి.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ.

తెల్లటి రూ.చూ. తెల్లంటి. వి. 1. భోగ్యపదార్థం : 2. బహుమానం, కట్నం.

తెల్లటియగు (-అగు) అ.[ి. తెలియు. భాస్క.రా.యు. 384. తెల్లట్లుసెప్పు (-చెప్పు) అ.[ి. కట్నాలు చదివించు. పండి.చ. 5. 358 పు.

తెల్లట్లుసెప్పు చూ. తెల్లటి.

తెల్లంటి రూ. తెల్లటి. వి. బహుమానం, పారితోషికం, సత్కారం. ఉ.హరి. 4.28.

క. తెల్లటి, తెల్లటు, తెళ్ళట్టు, తెల్లంటి. బహుమానం. <క. తెల్లంటి.

తెల్లమి రూ.చూ. తెల్లము. విణ. 1. స్పష్టమైన, విశదమైన. భార.భీష్మ. 2.20 ; 2. నిస్సంశయమైన, యథార్థమైన. మను. 4.91.

తెల్లమియగు (-అగు) అ.[ి. బయటపడు. తాళ్ల.సం. 3.119.

తెల్లము చూ. తెలియు. రూ. తెల్లమి. [ి.విణ. 1. స్పష్టంగా. భార.ఆది. 5.249 ; 2. నిస్సందేహంగా. విష్ణుపు. 2.239 ; 3. తేటగా ; విణ. 1. నిస్సందేహమైన. భార.ఉద్యో. 1.165 ; 2. స్పష్టమైన, విశదమైన.

త. తెళ్ళుమ్. స్పష్టత, పాండిత్యం, తెళివై. స్పష్టత.

తెల్లాకు చూ. తెల్ల[1].

తెల్లాడిబావుటా చూ. తెల్ల[1].

తెల్లానగ చూ. తెల్ల[1].

తెల్లానప చూ. తెల్ల[1].

తెల్లారగట్ల చూ. తెల్ల[1].

దోగాడు. నలచ. 2.46. తొంగిదో(గు అ.క్రి. వంగుతూ దోగాడు. కాళ. 3.193. తొంగియుండు (-ఉండు) రూ.చూ. తొంగుండు అ.క్రి. శయనించు. చమ. 3.52. తొంగిళ్లు రూ. చూ. తొంగొడ్లు. వి.బ.వ. 1. పొత్తులు. మెత్తని సన్నని పాత గుడ్డలు. బసవ. 3.334 ; 2. బట్టపింజెలు. బసవ. 3.341. తొంగిళ్లుగా క్రి.విశ.క్రు. బొట్లుబొట్లుగా. ద్వి.భాగ. 3.664. తొంగుండు రూ. తొంగియుండు. అ.క్రి. శయనించు. పరుండు. కాళ. 4.52. < తొంగు + ఉండు. తొంగైన విశ. బక్కపలచని, సన్నగిల్లిన. < తొంగు + ఐ. తొంగొడ్లు రూ. తొంగళ్లు, తొంగిళ్లు. వి.బ.వ. వేలాడేకుచ్చులు. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 1081. క్రీ.శ. 1132. తొంగొను అ.క్రి. పడుకొను. <తొంగు + కొను.

తొంగైన చూ. తొంగు.

తొంగొడ్లు చూ. తొంగు.

తొంగొను చూ. తొంగు.

తొచ్చియము రూ.చూ. తొచ్చెము. విశ. హీనమైన ; వి. తుచ్ఛవచనం.

తొచ్చెము రూ. తొచ్చియము. వి. తుచ్ఛవచనం. రామాభ్యు. 5.199 ; విశ. హీనమైన.

సం. తుచ్ఛ-. హీనమైన, నీచమైన ; ప్రా. తుచ్ఛ-, చుచ్ఛ-. క్షుద్రం, అల్పం, హీనం ; అ. మా. తుచ్ఛ- ; క. తుచ్ఛ. హీనమైన, నీచమైన ; తు. తుచ్ఛ.

<ప్రా. తుచ్ఛ-.

తొచ్చెముచేయు స.క్రి. హీనపరచు, తక్కువచేయు. పాండు. 2.153.

తొటతొట రూ.చూ. దొడ దొడ. వి. నీరు పువ్వులు పళ్ళు మొదలైనవి పడటంలో వచ్చే ధ్వనికి అనుకరణం. వరాహ. 10.125.

తొటదొప్ప విశ. అధికం, పెల్లు. సీతా రా. 3.103.

తొటుకుతొటుక్కు వి. గుండెలు అదరటంలో అయ్యేధ్వనికి అనుకరణం. పాంచాలీ. 2.42.

తొట్ట[1] చూ. తొట్టి[1]. విశ. స్థూలమైన. శృం. నై. 7.46.

తొట్టగిల(బడు అ.క్రి. 1. తత్తరపడు, తొట్రుపడు. పాండు. 4.165 ; 2. అతిశయించు. <తొట్టగిలు + -అ[7] + పడు. తొట్టగిలు రూ. చూ. తొట్టగిల్లు. అ. క్రి. అతిశయించు. తొట్టగిల్లు రూ. తొట్టగిలు. అ.క్రి. అతిశయించు. భాగ. 10 ఉ. 455. తొట్టపెదవులు వి.బ.వ. లావుగాఉండేపెదవులు.

తొట్ట[2] చూ. తుంట[2]. విశ. తుంటరి, దుష్టుడు, దుష్ట, దుష్టం, తుచ్ఛుడు, తుచ్ఛురాలు. పండి. చ. 1 43.

సం. దుష్ట-. చెడ్డ, దుర్మార్గమైన ; ప్రా. దుట్ఠ- ; పై.పా. తుట్ఠ ;

క. దుట్ట. దుష్టం, పాపయుక్తం ; త. తొట్టామ్.

<ప్రా. దుట్ఠ-.

తొట్టరి రూ.చూ. తూ(టరి. వి. దుష్టుడు, దుష్టురాలు. పండి.చ. 1.43 పు.

తొట్టి[1] రూ. తొట్టియ, తొట్టియల, తొట్టిల, తొట్టె, తొట్టెల, తొట్ల[1], తొట్లె. వి. 1. నోరు వెడల్పుగా అడుగు సన్నంగా ఉన్న గంప వంటి పాత్రం. జైమిని భా. 4.133 : 2. నీరు నిలవటానికి కట్టిన కుండు. ఆము. 6.8 ; 3. చెట్టు తొ్ర. ఆం.భా. 2.38 ; 4. గంజితొట్టి, గోలెం, నీళ్ళ తొట్టి ; 5. కొయ్యతో చేసిన పెట్టె ; 6. మోట బొక్కెన కుమ్మరించిన నీళ్ళుపోయే దారి లేక కాలవ ; 7. బండితోలే మనిషి కూర్చోడానికి పరం నుంచి కాడి వరకు అల్లిన అల్లకం.

క. తొట్టి. తొట్టి, నీళ్ళపాత్ర ; తు తొట్టి. చేద, నీళ్ళ తొట్టి ; త. తొట్టి. నీళ్ళతొట్టి, జలాశయం.

తొట్టికట్టు వి. 1. లోగిలి. యయా. 4.73 ; 2. రాజ ప్రాసాదంలోని అంతరువు ; 3. పెద్ద భవనాల్లో మధ్య వదలిన పై కప్పులేని భాగం. తొట్టికట్టె వి. 1. తొట్టి అల్లకానికి ఆధారంగా చట్రం నుంచి పీటవరకు రెండు వైపులా నిలిపిన పొడుగాటి కర్ర ; 2. మరమగ్గం బొమ్మకు నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. తొట్టికదురు వి. వాటకుండ కింద ఎత్తు కోసం కుదురుగా పెట్టుకొనే తొట్టి. తొట్టికర్ర రూ. తొట్టిగర్ర. వి. చంకపట్టె. తొట్టిగడ రూ. తొట్టిగెడ. వి. తొట్టి అల్లడానికి ఆధారంగా చట్రం నుంచి తొట్టిపీటవరకు రెండువైపులా నిలిపిన పొడుగాటి కర్ర. తొట్టిగర్ర(-కర్ర) రూ.చూ. తొట్టికర్ర. వి. 1. తొట్టి అల్లకానికి ఆధారంగా చట్రంనుంచి తొట్టిపీటవరకు రెండు వైపులా నిలిపిన పొడుగాటి కర్ర ; 2. చంకపట్టె. తొట్టిగర్ర కట్టె వి. తొట్టి అల్లకానికి ఆధారంగా చట్రం నుంచి తొట్టి పీట వరకు రెండు వైపులా నిలిపిన పొడుగాటి కర్ర. తొట్టిగాడి వి. మరమగ్గం సొరుగులో నాడెనిలిచే సందు. తొట్టిగిల(బడు అ.క్రి. కూలబడు. పాండు. 4.165. తొట్టిగిలు అ.క్రి. వెల్లకిలబడు. తొట్టిగెడ రూ.చూ. తొట్టిగడ. వి. తొట్టి అల్లకానికి ఆధారంగా చట్రం నుంచి తొట్టిపీటవరకు రెండువైపులా నిలిచిన పొడుగాటి కర్ర. తొట్టిగొలుసుతాడు వి. తొట్టికి అల్లిన తాడు. తొట్టిచెక్క వి. 1. మరమగ్గం సొరుగుకు చివర, నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క ; 2. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క ; 3. మరమగ్గం చట్రంలో, పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు. తొట్టితాడు వి. తొట్టికి అల్లిన తాడు. తొట్టినోరు వి. తొట్టివంటి నోరు. హంస. 1.61. తొట్టిపలకలు వి.బ.వ. మరమగ్గం చట్రంలో, పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు. తొట్టిపీట వి. తొట్టికర్రలు దూర్చే కొయ్య (లేక ఇనప) పీట. తొట్టిబడితె వి. తొట్టి అల్లకం కోసం బండి చట్రం నుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర. తొట్టిబండ వి. మోటబావి లోపలివైపున నూది మోకుల మీద అడ్డంగా వేసిన బండ లేక చాప రాయి. తొట్టిబండి వి. ఎడ్లబండి. తొట్టిబల్ల వి. బండితోలే మనిషి కూర్చోడానికి నొగ మీద అమర్చిన చెక్క. తొట్టిబాన వి. నోరు, అంచు వెడల్పుగా ఉండే పెద్ద మట్టిపాత్ర. తొట్టిబారు వి. తొట్టి అల్లకం కోసం బండి చట్రం నుంచి తొట్టిపీటవరకు ఉన్న పొడుగాటి కర్ర. తొట్టిబిళ్ల వి. తొట్టికర్రలు దూర్చే కొయ్య (లేక ఇనప) పీట. తొట్టిబొండ వి. తొట్టికర్రలు దూర్చే

కొయ్య (లేక ఇనప) పీట. **తొట్టిబొమ్మ** వి. మరమగ్గం సొరుగుచివర, నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **తొట్టిమంచము** వి. ఊయెల మంచం. ఉద్భటా. 3.54. **తొట్టిమూత** వి. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి, బిగించిన కొయ్యచెక్క. **తొట్టిలు** అ.క్రి. వెలికిలు. సారంగ. 3.29. **తొట్టేతం** వి. మెరక పొలాలకు నీళ్ళుతోడే తాటిదోనె. <తొట్టి[1] + ఏతము.

**తొట్టి**[2] రూ.చూ. తెట్టు[1]. వి. **1**. తొడుసు, సంబంధం. సిం. ద్వా. 5.274 ; **2**. తెట్టువ. ఆం.భా. 1.157.

**తొట్టికొను** చూ. తొట్టు[1].

**తొట్టించు** చూ. తొట్టు[1].

**తొట్టితొంపరలాడు** చూ. తొట్టు[1].

**తొట్టియ** రూ.చూ. తొట్టి[1]. వి. నేసేవాడు నూలు కండె ఉంచుకొనే నాడె.

**తొట్టియల** రూ.చూ. తొట్టి[1]. వి. ఊయల. కళా. 5.2.

**తొట్టిల** రూ.చూ. తొట్టి[1]. వి. తొట్ల. వను. 3.

**తొట్టు**[1] అ.క్రి. **1**. వ్యాపించు, ప్రసరించు. నిర్వ.రా. 6.55 ; **2**. మునుగు. భార.అరణ్య. 4.238 ; **3**. ప్రవహించు, పారు. భార.అరణ్య. 5.421 ; **4**. స్రవించు, కారు. వరాహ. 2.54 ; **5**. ఎగదట్టు. వరాహ. 11.48 ; **6**. నిండు, నిండి ఉండు. పారి. 4.66 ; స.క్రి. అవలంబించు, పట్టుకొను, పూను, వహించు. మార్క. 8.139 ; వి. చెరువు కింది పొలం. ఆం.భా. 1.163.

క. తొట్టు. నీటిబిందువు, తటుకు. ద్రవబిందువు, తటుక్కనె, తొటుక్కనె. నీటి బిందువులలో ; తు. తటుకు. నీటి బిందువు ; త. చొట్టు. బిందువులుగా పడు, చినుకులు పడు, నీటి బిందువు ; కో. చొట్-(చొట్య్-). కారు, చినుకులు పడు, చొట్, చొట్ల్. నీటి బిందువు ; తొ. స్విట్. ద్రవాలు స్రవించు ; గోం. చోడ్-చోడ్ (సడ్). చినుకులుగా వానపడు ; కుఇ. స్డొహ్ప. జారీ అగు ; పర్జి. చోడ్. స్రవించు ; బ్రా. చుట్. నీటి బిందువు, చుట్టింగ్. ముంచు.

<మూ.ద్రా. *చొట్-.

**తొట్టికొను** అ.క్రి. **1**. వ్యాపించు. రామాభ్యు. 2.92 ; **2**. ఎక్కువగు. ఉ.రా. 5.113 ; **3**. తేరు, ఉబుకు. విజయ. 1.126. **తొట్టించు** రూ. తొట్లించు. స.క్రి. స్రవింపజేయు. అష్టమ. క. 67 పు. 19 పం. **తొట్టితొంపరలాడు** స.క్రి. ఛిన్నాభిన్నం చేయు. వర.రా.బాల. 19 పు. 16 పం. **తొట్టుగాడి** వి. నీళ్ళు లోతుగా ఉండే చెరువు లోపలి భాగం. **తొట్టుతొట్టున** అవ్య.ద్రు. చుక్కలు మొ॥నవి రాలడంలో వచ్చే ధ్వనికి అనుకరణం. బహుళా. 3.3. **తొట్టున** అవ్య.ద్రు. **1**. పడటంలో వచ్చే ధ్వనికి అనుకరణం. పాంచాలీ. 2.71 ; **2**. అకస్మికంగా. శుక. 3.261. **తొట్టుబల్ల** వి. చెక్కకు రెండువైపులా బొంగులు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం. **తొట్లించు** రూ.చూ. తొట్టించు. స.క్రి. స్రవింపజేయు.

**తొట్టు**[2] స.క్రి. **1**. మొదలుచేసికొను, మొదలుకొను. భార.ఆది. 1.14 ; **2**. ఎదిరించు, మార్కొను. భాస్క.రా.అరణ్య 2.72, బహుళా. 2.27 ; **3**. తొక్కు ; **4**. ముట్టుకొను, స్పృశించు ; అ.క్రి. **1**. వాలు, పడిపోవు. భాస్క.రా.యు. 1494 ; **2**. నాటు, గుచ్చుకొను. భాస్క.రా.యు. 2213 ; **3**. చేరు, కూడుకొను. వరాహ. 10.62 ; **4**. కలుగు, పుట్టు. పి.శకు. 3.105 ; వి. మల్లబంధ విశేషం. హంస. 1.206.

క. తుడు, తొడు (తొట్ట్-). కలియు, ధరించు, తొడకు, తొడంకు, తొడగు. ప్రారంభించు ; తు. తొట్టుని. కౌగలించుకొను, గట్టిగాపట్టుకొను, తొడగున. ప్రారంభించు, తొడగెలు. ప్రారంభించటం ; త. తొటు (తొటువ్-, తొట్ట్). ధరించు, ప్రారంభించు, తొట్టు. ముట్టుకోవటం, ప్రారంభించు, తొటుక్కు, తుటుక్కు. ప్రారంభించు ; మ. తొటుక. ప్రారంభించు, తొటుక్క. పని ప్రారంభించు, తొట్టుక. దగ్గరకు చేర్చు, పని ప్రారంభించు ; కో. తడ్వ్ (తొడ్డ్-). చుట్టూచేతులుంచు ; కుఇ. తోడ్డ. ప్రారంభించు, ప్రయత్నించు, ప్రారంభం, ప్రయత్నం ; మాల్తో. తొడ్గె. పనికి సిద్ధంగాఉండు ; బ్రా. ద్యురింగ్, ద్యురేంగింగ్. సాహసించు.

<మూ.ద్రా. *తొట్-.

**తొట్టుకొను** స.క్రి. **1**. ఒకదానికొకటి రాసుకొను. కు.సం. 11.127 ; **2**. ఆక్రమించుకొను. ఉ.హరి. 3.37 ; అ.క్రి. **1**. అధికమగు, ఎక్కువగు. ఉ.రా. 5.113 ; **2**. వ్యాపించు. రామాభ్యు. 2.92.

**తొట్టు**[3] వి. **1**. తాపీ పిడిమీది రేకుచుట్ట ; **2**. నీటి ఆనిక ; **3**. చెక్కపెట్టెకు రెండువైపుల బొంగులు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం ; స.క్రి. ధరించు.

క. తుడు, తొడు (తొట్ట్-). దుస్తులు మొ॥వాటిని ధరించు, తుడిసు, తుడియిసు, తొడసు, తొడిసు. వేరేదాన్ని ధరించు ; తు. తొడిగె. దుస్తు, వస్త్రాలు, ఆభరణాలు ; కువి. తుర్హనై. ధరించు ; కొలా. తొడ్ (తొట్ట్-). చొక్కా ధరించు, తొడ్. జోళ్ళు ధరించు ; నా. తొడ్ (తొట్ట్-). చొక్కా ధరించు ; గ. తొడ్గ్. దుస్తులు ధరించు, తుట్ట్. ధరించు.

**తొట్టు**[4] రూ.చూ. తెట్టు[1]. వి. తెట్టువ. ఆం.భా. 1.157.

**తొట్టు**[5] చూ. తోడు. వి. సంబంధం, తొడుసు. సిం.ద్వా. 5.274.

**తొట్టుపడు** రూ.చూ. తొట్రుపడు. అ.క్రి. తడబడు. భార. శాంతి. 5.565.

**తొట్టువ** రూ.చూ. తెట్టు[1]. వి. **1**. సమూహం. కళా. 8.110 ; **2**. తెట్టె, నీటిలో గాలి కొక పక్క చేరిన తృణాదుల సమూహం ; **3**. స్థానం.

**తొట్టె** రూ.చూ. తొట్టి[1]. వి. **1**. తొట్టియ, ఉయ్యాల. చెన్నబసవ. 5.388 ; **2**. నేతపనివారి నాడె ; **3**. బండితోలేమనిషి కూర్చోటానికి వీలుగా పరంనుంచి కాడివరకు ఉన్న తాడుఅల్లకం ; **4**. గంజి మొ॥ వేసే పెద్దపాత్ర ; **5**. కొయ్యతో చేసిన పెట్టె ; **6**. మోట బొక్కెన కుమ్మరించిన నీళ్ళు పోయే దారి లేక కాలువ.

తొట్లబడ్డ వి. చట్రానికి బిగించిన చెక్కపట్టె. తొట్లమట్టి రూ. తొట్లుమట్టి. వి. తొట్లు, పొయ్యలు చేయడానికి వాడే వడ్లపొట్టు, మసి కలిపి మురగబెట్టిన మట్టి. తొట్లుమట్టి రూ. చూ. తొట్లమట్టి. వి. తొట్లు, పొయ్యలు చేయడానికి వాడే వడ్లపొట్టు, మసి కలిపి మురగబెట్టిన మట్టి.

తొట్టిల రూ.చూ. తొట్టి[1]. వి. ఉయ్యాల, డోల. వసు. 3.27.

తొట్టేతం చూ. తొట్టి[1].

తొట్ర రూ.చూ. తొఱ. వి. తొఱ్ర.

తొట్రకోరె వి. ఒకరకం చెట్టు.

తొట్రగిల్లు చూ. తొట్రు[1].

తొట్రించు చూ. తొట్రు[1].

తొట్రిలఁబడు చూ. తొట్రు[1].

తొట్రిలు చూ. తొట్రు[1].

తొట్రిల్లు చూ. తొట్రు[1].

తొట్రు[1] చూ. తొడరు. వి. 1. స్ఖలనం. ఆం.భా. 1.143; 2. సంభ్రమం.

తొట్రగిల్లు రూ.చూ. తొట్రిలు. అ.క్రి. 1. తొట్రుపడు, తడబడు. ఆం.భా. 1.143; 2. వ్యాపించు; 3. భేదిల్లు. తొట్రించు స.క్రి. తొట్రిలచేయు, తడబడచేయు. సారంగ. 1.92. తొట్రిలఁబడు అ.క్రి. తొట్రుపడు, సంభ్రమించు. భార.విరా. 2.104. తొట్రిలు రూ. తొట్రగిల్లు, తొట్రిల్లు. అ.క్రి. 1. తొట్రుపడు, తడబడు. భార.విరా. 4.80; 2. వ్యాపించు. విజయ. 2.46; 3. భేదిల్లు. తొట్రిల్లు రూ.చూ. తొట్రిలు. అ.క్రి. 1. భేదిల్లు. మార్క. 1.46; 2. తొట్రుపడు, తడబడు. హరి.పూ. 5.246, భార.ఆరణ్య. 7.219; 3. వ్యాపించు. తొట్రుకొను అ.క్రి. 1. తొట్రుపడు, తడబడు. పండి.చ. పురా. 112 పు.; 2. కలిసి ఉండు. పి.శకు. 2.135. తొట్రుకొల్పు స.క్రి. తడబడచేయు. భాగ. 9.706. తొట్రుపడు రూ. తొట్టుపడు, తొట్రువడు. అ.క్రి. తడబడు, బాధపడు. భార.విరా. 4.51. తొట్రుపాటు వి. తడబాటు, తొందర. భార.విరా. 2.106. తొట్రులుపడు అ.క్రి. తడబడు. దశకు. 4.99, పండి.చ. 5.522 పు. 13 పం. తొట్రువడు (-పడు) రూ.చూ. తొట్రుపడు. అ.క్రి. తడబడు, బాధపడు. భార. శాంతి. 5.564.

తొట్రు[2] రూ.చూ. తొఱ. వి. 1. చిన్నకంప. అష్టమ.క. 1.44. 23 పం.; 2. తొఱ్ర, కోటరం. ఆం.భా. 2.38.

తొట్ల[1] రూ.చూ. తొట్టి[1]. వి. ఉయ్యాల, బిడ్డలు పడుకొనే ఉయ్యాలతొట్టి. విప్ర. 1.75.

తొట్ల[2] వి. ఒకరకం చెట్టు, ఓషధీవిశేషం (Cappatis Grandflora).

తొట్లబడ్డ చూ. తొట్టె.

తొట్లమట్టి చూ. తొట్టె.

తొట్లించు చూ. తొట్టు[1].

తొట్లియ రూ.చూ. తొట్టి[1]. వి. ఉయ్యాల. కళా. 5.2.

తొట్లుమట్టి చూ. తొట్టె.

తొట్లె రూ.చూ. తొట్టి[1]. వి. ఉయ్యాల. రాజవా. 2.19.

తొట్లెలేస్కం వి. చిన్నబిడ్డను మొదటిసారిగా, ఇరవై ఒకటవ రోజున ఉయ్యాల్లో వేయటం.

తొడ రూ. తొడె. వి. 1. గజ్జకు మోకాలికి నడిమిభాగం, ఊరువు. భార.ఆది. 1.53; 2. చిన్నకొణతలికి చుట్టిన నూలు; 3. చిన్నకత్తెరలో వంపుతిరిగిన భాగం.

క. తొడె. తొడ; కొడ. తొడె; తు. తుడె; త. తొడై, తుడై, తొడై; మ. తుట; తొ. త్వడ్; కువి. తున్తు; కొలా. దుట్ (దుట్ల్-).

తొడకొడుకు వి. 1. వైశ్యుడు, కోమటి. వేంక.ఆం.మాన. 25; 2. విష్ణువు తొడనుంచి పుట్టినవాడు. తొడగదురు (-కదురు) వి. ఒకరకం ఉన్ని కదురు. తొడగరిబొంత వి. గొంగడినేతలో పడుగు తడపటానికి, అంబలిలో ముంచిన గొంగడిగుడ్డ. తొడజెఱ్ఱి వి. తొడ (జెబ్బ) మీద పొడుగ్గా ఉండేనుడి. తొడతాడు వి. రెండునొగల బండి నొగలకు పరం ముందు భాగం కలిపికట్టే తాడు. తొడతొక్కిడి రూ.చూ. తొడత్రొక్కుడు. వి. 1. ఇరుకు; 2. అధికం; 3. చీకటి తప్పు పని, వ్య. తొడదగ్గరపని; 4. జనసమ్మర్దం. తొడత్రొక్కుడు రూ. తొడతొక్కిడి. వి. మిక్కిలి సమ్మర్దం. తొడదట్టు స.క్రి. కయ్యానికి పిలుచు, కుస్తీపట్టినప్పుడు వస్తాదులు తొడలు చరచటంపై వచ్చిన పలుకుబడి. తొడపాము వి. స్త్రీలకు తొడపై ఏర్పడిన ఉబ్బిన నరం లేక మచ్చ. తొడపాయసము రూ. తొడపాశము, తొడపాసెము. వి. తొడను బొటన చూపుడు వేళ్ళతో నొక్కటం, సొంటిపిక్క, పరిహాసానికి పాసెమని ఊరిస్తూ పిల్లల్ని తొడనలపటం. తొడపాయసముపెట్టు స.క్రి. తొడనులుము. తొడపారం విణ. హీనమయిన. తొడపాశము రూ.చూ. తొడపాయసము. వి. 1. తొడను బొటన, చూపుడు వేళ్ళతో నొక్కటం, సొంటిపిక్క; 2. తొడతొక్కిడి, చీకటితప్పు. తొడపాసెము రూ.చూ. తొడపాయసము. వి. పరిహాసానికి పాసెమని ఊరిస్తూ పిల్లల్ని తొడనలపటం. తొడపుట్టువు వి. వైశ్యుడు, ఊరుజుడు. తొడబెల్లము వి. తొడగిల్లటం. తొడబెల్లముపెట్టు స.క్రి. తొడగిల్లు, తొడపాసెం పెట్టు. తొడరాయి వి. కొమిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు పొచ్చుకు వచ్చినరాయి. తొడలప్పళించు స.క్రి. తొడలుతట్టు. < తొడ + -లు + అప్పళించు. తొడలు వి.బ.వ. నఖక్షత స్థానాలు, కళాస్థానాలు. తొడలువడిపెట్టు స.క్రి. తొడపాసెం పెట్టు. హంస. 3.141. తొడలేనివానిసైఁదోడు వి. గరుడుడు, అనూరుని తమ్ముడు. సాంబ. దేవ. 15. తొడసంబంధం వి. కామ సంబంధం. తొడసోకు అ.క్రి. సంభోగ సౌఖ్యమెరుగు. శుక. 2.64. తొడారిగడ్డ వి. తొడమీద లేచే వ్రణం.

తొడం చూ. తొండము. విణ. కొంచెం, కొద్ది; వి. 1. దొంగ గొడ్డుకు మెడలో కట్టేగంట; 2. మోటబొక్కెన అడుగున కట్టిన తోలుగొట్ట లేక తిత్తి.

తొడకు వి. పశువులకు వచ్చే వాతరోగ విశేషం. నవనాథ. 1.41 పు. 5పం.

తొడకోలు రూ.చూ. తొడగోలు. వి. సారెమీదున్న మట్టి ముద్దను కోలుపట్టిన తర్వాత గుండు కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం.

**తొడగబట్టు** చూ. తొడుగు[1].

**తొడగు** రూ.చూ. తొడుగు[1]. వి. నగ, ఆభరణం.

**తొడగోలు (-కోలు)** రూ. తొడకోలు, తొనుగ్గోలు. వి. సారెమీదున్న మట్టిముద్దను కోలు పట్టిన తర్వాత గుండుగా కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం.

**తొడఁకు** రూ.చూ. తొలఁకు[1]. అ.క్రి. **1.** తొనకు (నీరు మొ.) ఒలుకు. చంద్రాంగ. 1.57 ; **2.** నోరుజారు.

**తొడఁగు** రూ. తొణఁగు. స.క్రి. **1.** ప్రారంభించు, ఉపక్రమించు, పూను. భార. ఆది. 1.20 ; **2.** అభ్యసించు, కరచు. భార. అను. 4.208 ; అ.క్రి. **1.** ప్రారంభంచేయు, మొదలుపెట్టు. భార. ఆది. 5.116 ; **2.** యత్నించు, పూనుకొను. కు. సం. 6.167, భార. శాంతి. 6.550 ; **3.** మొదలుకొను. భార.విరా. 1.6.

క. తొడకు, తొడగు. లగ్నమగు, ప్రారంభించు, తొడంకు. ప్రారంభమగు, మొదలుపెట్టు. తొడవు. ప్రారంభం ; తు. తొడగుని. ప్రారంభమగు, యత్నించు, రాయు ; త. తొటు (తొటువ్-, తొట్ట్). ప్రారంభమగు, తొటప్పు. ప్రారంభించు, తొళై. తుడుచు, దుమ్ముతుడుచు, తుటు. బట్టలు మొ. వాటిని ఉతుకు ; మ. తుటురుక, తొటుక, తొట్టుక. ప్రారంభించు, తుటజ్జిక. ప్రారంభింపజేయు, తుటక్కమ్. మొదలు ; కుఇ. తోండా. ప్రారంభించు, ప్రారంభం.

<మూ. ద్రా. *తుట్-.

**తొడఁగూడుఁబోతు** వి. ఒకవిధమైన శివమతస్థుడు. బసవ. పు. 134పు. 14పం.

**తొడప** వి. **1.** త్వక్కు. ఆం. భా. 2.131 ; **2.** బండికల్లు మొదలైనవాని మొనకు వేసే ఇనపకట్టు ; **3.** రాట్నం నిలువులకు ఆకు రాపిడి తగలకుండా మధ్య వేసిన కొయ్య బిళ్ళ ; **4.** బళ్ళు మొ. వాటి చక్రానికి అంటుకొన్న బురద.

**తొడపబల్ల** వి. ఉడతతోలు బిగించిన పైచెక్క.

**తొడపటము** రూ.చూ. తొరపసము. వి. **1.** కర్రలకు కన్నాలు పెట్టే పనిముట్టు, పిడిసాన ; **2.** పెక్కుమంది ఉండి వివరం తెలియని దొమ్మి ; **3.** తొత్తడం.

**తొడయు** స.క్రి. **1.** (కడిగేటప్పుడు) పాము, తోము. కు. సం. 7.78 ; **2.** తుడుచు. భార. విరా. 5.386 ; **3.** నిమురు, తడవు, స్పృశించు. భార. స్త్రీ. 2.74 ; **4.** కడుగు, ప్రక్షాళనం చేయు. శృం. నై. 6.140 ; **5.** నశింపచేయు. కాశీ. 6.176 ; అ.క్రి. నశించు.

క. తొడె. పులుము, తుడుచు, తొలగించు, చెరిపివేయు ; తు. తొడెపుని, తుడెపుని. పులుము ; త. తొడై. తుడుచు, తుళై. తుడిచివేయు, తుడుచు, తొలగించు, నాశంచేయు, తుటు. బట్టలు ఉతుకు ; మ. తుటెక్క. తుడుచు ; కుఇ. తుహ్పా. తోసివేయు.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *తుట్/*తొట్.

**తొడరాడు** చూ. తొడరు.

**తొడరిక** చూ. తొడరు.

**తొడరు** అ.క్రి. **1.** తొట్రుపడు. భార. ఆది. 6.161 ; **2.** ఎదిరించు, మార్కొను, ప్రతిఘటించు. భార. సభా. 1.123 ; **3.** కలుగు, సంభవించు. భార. ఉద్యో. 2.43 ; **4.** ఉద్యమించు, పూను. భార. భీష్మ. 1.60 ; **5.** సక్తమగు, లగ్నమగు. భార. శాంతి. 4.310 ; **6.** అదుపులోకి తీసుకొను ; స.క్రి. **1.** ఎదిరించు. భార. విరా. 1.74 ; **2.** (రతియందు) పొందు, కూడు. భార. విరా. 2.238, సారంగ. 2.241 ; **3.** అవలంబించు. భార. శాంతి. 5.600 ; **4.** ప్రాప్తించు, పొందు. హరి. ఉ. 9.189 ; **5.** పట్టుకొను. భాగ. 8.714 ; **6.** ధిక్కరించు, మించు. పారి. 4.28 ; **7.** పూను, ధరించు, విష్ణుపు. 4.61 ; **8.** అనుసరించు. కువచ. 1.80 ; **9.** చేరు.

క. తొడర్. కలిసికొను, ఎదిరించు, తోటి. పోరాటం, తొడర్. తొ్డు, తొండర్. సంబంధించి ఉండు, కట్టివేయబడు, తొడర్చు. బంధించు ; తు. తొడరు. ఆటంకం; తొటర్ (-వ్-,-న్త్-). నిరాటంకంగా కొనసాగించు, ఎదుర్కొను, తొటర్చ్చి, తొటర్చు, తొటర్వు. సంబంధం, స్నేహం, తొటర్న్తోర్. స్నేహితులు, తొటల్, తుటర్. గొలుసు, తుటర్ (వ్ - , - న్త్ -). ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు అనుసరించు ; మ. తుటరుక. కొనసాగించు, సంబంధం కలిగిఉండు, తుటర్, తుటల్. గొలుసు, తీగ, ఒడ్డాణం, తుటర్చ్చ. స్నేహం ; కో. తొట్. కుండను లేదా గంపను పట్టుకొనటానికి ఉపయోగించేది ; గోం. తోడ్హానా. నిద్రించు, సంభోగించు ; గ. తొరు. తాడు, తొ్రు ; కుర. తొడ్సాగ్నా. కాలితో మెల్లగా స్పృశించు ; బ్రా. తోనింగ్ (తోర్-, తో-). పట్టుకొను, ఉంచు, అదుపులో పెట్టు.

<మూ.ద్రా. *తొట్-.

**తొడరాడు** స.క్రి. ధిక్కరించు, అతిశయించు, మించు. కు.సం. 12.203. <తొడరు + ఆడు. **తొడరిక** వి. అనుకరణం. **తొడరుచు** అ.క్రి. యత్నించు. భార. విరా. 1.127. **తొడరువు** వి. యత్నం. భార. శల్య. 1.349 ; విఇ. మొదటి. ద్వి. భాగ. 7 స్కం.

**తొడవ** రూ.చూ. తొడుగు[1]. వి. ఆభరణం. కు.సం. 10.115.

**తొడవసము** వి. త్వక్కు, బెరడు. ఆం.పదా.నర. 70.

**తొడవిల్లు** చూ. తొడుగు. వి. బాణాన్ని సంధించిన విల్లు.

**తొడవు** రూ.చూ. తొడుగు[1]. వి. **1.** ఆభరణం. కు.సం. **4.115**; **2.** వెదపెట్టిన తరువాత గింజలు పూడిపోవటానికి తోలే కంప.

**తొడారిగడ్డ** చూ. తొడ.

**తొడి[1]** చూ. తొడు.

**తొడిఁబడు** రూ. తోడబడు. అ.క్రి. **1.** తొట్రుపడు. కు.సం. 8.16 ; **2.** చిందు, చెదరు. విజ్ఞా. ఆచా. 78 ; **3.** చలించు. భాస్క.రా. అయోధ్యా. 89 ; **4.** (ఇటునటు) పర్వు, వ్యాపించు. నార. పంచ. 3.184 ; **5.** తొందరపడు. కళా. 3.252 ; **6.** శీఘ్రంగాపోవు. ఇందు. 4.67.

**తొడి[2]** వి. సంభ్రమం, త్వర. కు.సం. 12.46, పండి.చ. 3.232 ; విఇ. తడబడేది. భార.విరా. 1.17.

త. తొటిప్పు.

**తొడికలు** చూ. తొడుకు¹. స.క్రి. **1**. దొంగిలించు. బసవ. 4.499 ; **2**. ఒడిసిపట్టుకొను. జైమినిభా. 4.133.

క. తుడి. దొంగిలించు.

**తొడికించు** చూ. తొడుకు.

**తొడికిపట్టు** చూ. తొడుకు.

**తొడికిలు** చూ. తొడుకు.

**తొడికొను** రూ.చూ. తోడ్కొను. స.క్రి. పిలుచుకొను, వెంట తీసికొను.

**తొడిగికొను** చూ. తొడుగు¹.

**తొడిగించు** చూ. తొడుగు¹.

**తొడితెచ్చు** రూ.చూ. తోడితెచ్చు. స.క్రి. వెంటతీసికొనివచ్చు. ఉ.హరి. 1.55.

**తొడితొడి** అవ్య.ద్రు. వెనువెంటనే. పండి.చ. 5.253 వ.

**తొడిపూసికట్టు** చూ. తొడు.

**తొడిమ** రూ. తుడిమి, తొడిమె, తొడ్మె. వి. **1**. ఆకు, పూవ మొ. వాటి తలలో ఉండే కాడ, వృంతం ; **2**. నీళ్ళు లోపలికి పోయటానికి కూజాకుపెట్టిన ముఖభాగం.

క. తొట్టు, తొడంబె. పండు, కాయ, ఆకు మొ. కాడ ; తు. తొట్టు ; మ. తొత్తు. పత్రవృంతం, పూలగుత్తి.

**తొడిమిపార** చూ. తొడిమ. వి. గూటం పార.

**తొడిమె** రూ.చూ. తొడిమ. ఆకు పూవు మొ. వాటి కాడ.

**తొడియు** చూ. తొడుగు². స.క్రి. బాణాదులు గుచ్చుకొను, నాటు. శివత. సా. 188.

క. తుడిసు, తుడియిను, తొడసు, తొడిసు. వేరే దాన్ని ధరించు.

**తొడివికట్టు** చూ. తొడువు¹.

**తొడివెంద** వి. ఫలవృక్ష విశేషం. కాళ. 6.69.

**తొడు** రూ.చూ. తొడుగు¹. స.క్రి. **1**. (భూషణం, కవచం, చెప్పులు మొ.) ధరించు. భార. ఆది. 8.174 ; **2**. (బాణం) సంధించు, కూర్చు. కు.సం. 2.60 ; **3**. ముట్టుకొను ; వి. పట్ట. ఆం.భా. 2.37.

**తొడి¹** వి. **1**. భూషణం. భార. ఆది. 7.166, రుక్మా. 4.117 ; **2**. కర్ర మొ. వాటికి వేసే ఉంగరం, పొన్ను ; **3**. కొడవలి, గుద్దలి, తాపీ మొ. వాటి పిడికి పలుగు బిగింపుకోసం వేసిన ఇనపకట్టు ; **4**. పట్టునూలు చిలప.

త. తొంటి. మురుగు, ఉంగరం. **తొడిపూసికట్టు** స.క్రి. వస్త్ర భూషణ, మాల్యాదుల ననుభవించు, తొడుగు, పూయు, కట్టు, అనటం. **తొడుకొను¹** స.క్రి. తొడుగుకొను, ధరించు. శివత. సా. 191.

**తొడుకపోవు** రూ.చూ. తొడుకొనిపోవు. స.క్రి. తోడుకొనిపోవు. కాశ. 4.51.

**తొడుకు** స.క్రి. **1**. అను, తాగు. కాశీ. 4.18 ; **2**. గ్రహించు, పట్టుకొను. పాండు. 5.181 ; అ.క్రి. తెగు, సాహసించు. గౌ. హరి. ఉ. 2352 వం. ; వి. **1**. వృషభం. వరాహ. 5.118 ; **2**. దొంగమేత. భోజ. 6.34 ; **3**. ఆవు. పాండు. 3.38 ; **4**. పశువులు, ఆవు గేదె మొదలైనవి. ఆం.భా. 2.261 ; **5**. చక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలిపైపునా లోపునా వేసిన ఇనపకట్టు.

క. తుడుకు, తుడికు, తుడుంకు. శీఘ్రంగా పట్టుకొను, కొడ. తొడు (తొట్ట్-). అనుభవించు ; తు. తొట్టుని, తొట్టోణుని. కౌగలించు ; త. తొటు (తొట్ట్-). పట్టుకొను ; మ. తొటుక. స్పృశించు ; కో. తొట్. పట్టుకొను. తొడ్వ్- (తొడ్డ్-). చుట్టూ చేతులువేయు ; తొ. త్విట్. పట్టుకొను ; పర్జి. టొడ్-(టొట్ట్-). స్పృశించు ; కురు. తొడ్సగ్- (తుడ్సగ్య-). కాలితోతాకు ; బ్రా. తొర్-, తొన్-. పట్టుకొను.

<మూ.ద్రా. *తొట్.

**తొడికించు** స.క్రి. పట్టుకొనేటట్లుచేయు. బసవ. 6.423 వం. <తొడుకు + -ఇంచు³. **తొడికిపట్టు** రూ.చూ. తొడ్కిపట్టు. స.క్రి. ఒడిసిపట్టు. శృం.నై. 2.15. **తొడికిలు** స.క్రి. ఒడిసి పట్టుకొను, లాగుకొను. జైమినిభా. 4.133 ; **2**. దొంగి లించు ; **3**. స్వాధీనంచేసుకొను ; క. తుడి. దొంగిలించు. **తొడుకులు** వి.బ.వ. దార్లో ఏర్పడ్డ ఎగుడు దిగుడులు. **తొడుకుసామి** వి. శివుడు. వేంక. ఆం. దేవ. 5. **తొడుకు సాహిణిమామ** వి. హిమాద్రి. వేంక. ఆం. 77.

**తొడుకొనిపోవు** చూ. తొడుకొను².

**తొడుకొను²** రూ.చూ. తోడ్కొను. స.క్రి. తీసికొను, వెంటపెట్టు కొను. విక్ర. 8.35.

**తొడుకొనిపోవు** రూ. తొడుకపోవు. స.క్రి. తోడ్కొని పోవు, పిలుచుకొనిపోవు. బసవ. 6.163.

**తొడుగలు(-కలు)** రూ.చూ. తొడుగల్లు. వి. ముళ్ళకంపమోపు.

**తొడుగలలగు** అ.క్రి. **1**. చిక్కుపోవు. మను. 3.131 ; **2**. ముండ్లకంపలగు.

**తొడుగల్లు(-కల్లు)** చూ. తోడు. రూ. తొడుగలు. వి. కంటకాది భారం. ఆం.భా. 2.38.

**తొడుగు¹** రూ. తొడగు, తొడవ, తొడవు, తొడు, తొడువు¹, తొడ్గు¹, తొడ్వు¹. స.క్రి. **1**. (భూషణం, కవచం, చెప్పులు మొ॥)ధరించు. భార.ఆది. 1.95 ; **2**. (భూషణాలు మొ॥) ధరింపచేయు. శృం.నై. 6.22 ; వి. **1**. కవచం. జైమిని భా. 2.78 ; **2**. ఆభరణం. వీర.వి. 3.147 ; **3**. చర్మం, పైపొర ; **4**. స్వామివారికి అలంకరించే తొడవులు ;

క. తుడు, తొడు(తొట్ట్-). ధరించు, తుడిగె, తొడిగె. ఆభరణం, వస్త్రవిశేషం, తుడిసు, తుడియిసు, తొడుసు, తొడిసు. వేరేదాన్ని ధరించు ; కొడ. తొడు (తొట్ట్-). అనుభవించు ; తు. తొడిగె. దుస్తు ; త. తొటు (తొటువ్-, తొట్ట్-). (ఉంగరం, బట్టలు మొ॥) తొడుగు కొను, (తొటుప్ప్-, తొటుత్త్-). (బట్టలు మొ॥) ధరించు, తొటుక్క-(తొటుక్కి-). ధరించు, తొడుగు, తటు (తుట్ట్-) ; కో. తొడ్వ్. చేతులతో చుట్టుకొను ; కువి. తుర్హ్నై. ధరించు ; పర్జి. టొడ్-(టొట్ట్-). స్పృశించు ; మ. తుటర్, తుటల్. ఒడ్డాణం, తొటల్. స్పృశించటం, గొలుసు, తొటుక. స్పృశించు ; కో. తొడ్వ్. చేతులతో చుట్టుకొను ; కువి. తుర్హ్నై. ధరించు ; పర్జి. తొడ్ (టొట్ట్-). స్పృశించు ; కొలా. తొడ్(తొట్ట్-). ధరించు,

తొడ. అండె; నాయి. తొడ్-(తొట్ట్-). (పొక్కాను) ధరించు; గ. తొడ్గ్ తుట్ట్. (వస్త్రాల్ని) ధరించు; కురు. తొడ్గ్‌స్. కాలితో మెల్లగా స్పృశించు; బ్రా. తొర్-, తొన్. పట్టుకొను.

< మూ.ద్రా. *తొట్-/*తుట్-.

**తొడగబట్టు** స.క్రి. సారె కఱ్ఱ వేసిన తర్వాత మట్టి ముద్దను సన్నగ చేత్తో పైకి తొడుగు లాగా తీర్చు. **తొడిగికొను** రూ. తొడుగుకొను. స.క్రి. ధరించు. విక్ర. 2.12. **తొడిగించు** స.క్రి. ధరించేటట్లు చేయు. **తొడుగుకొను** రూ.చూ. తొడిగికొను. స.క్రి. ధరించు. **తొడుగునోము** వి. కార్తీక పౌర్ణమినాడు చేసే కేదారేశ్వర వ్రతం.

**తొడుగు**[2] రూ. తొడుపు[2], తొడ్గు[2], తొడ్వు[2]. స.క్రి. **1.** (వింటిబాణం) సంధించు, కూర్చు. భార.ఆది. 5.234, కు.సం. 12.98; **2.** ప్రయోగించు. భార.భీష్మ. 3.125; వి. **1.** గాసెన, విండ్లు మొ॥ వాటి కప్పు; **2.** బాణం.

క. తుడు, తొడు(తొట్ట్-). వింటికి బాణాన్ని సంధించు, తొడచు. వింటికి బాణం ఉన్నట్లు అను సంధించు; మ. తొడుక్క. బాణాన్ని సంధించు, తుట. శరసంధానం.

**తొడుగు**[3] రూ. తొడుపు[2]. వి. **1.** ముళ్ళకంపమోపు. మను. 4.54; **2.** కంపకలిపి కట్టిన పెద్ద మోపు, వెదపెట్టిన తరువాత గింజలు పూడిపోవటానికి తోలే కంప; **3.** మూతి పెంకులను ఒకదానిలో ఒకటి దూర్చి ఉంచే వరస; అ.క్రి. అంకురించు.

**తొడుచు** స.క్రి. పంటెకుగాని, డబ్బాకు గాని నూలు చుట్టు.

**తొడుపు**[1] స.క్రి. ధరింపజేయు. కు.సం. 4.115; వి. **1.** ఒకానొక కత్తి. హంస. 2.75; **2.** గదాదండం మొ॥ వాటికి వేసే ఇనుము మొ॥ వాటి కడియం, పొన్ను. ఆం. భా. 2.202; **3.** కవచం; **4.** చెప్పింది మళ్ళీ చెప్పటం; **5.** ఎద్దు కొమ్ముల కొనన తొడిగే అలంకారం.

కొలా. తొడ. కడియం.

**తొడుపుకత్తి** రూ.చూ. తొడుపుఁగత్తి. వి. ఒకరకమైన కత్తి. శశా. 5.21. **తొడుపుఁగత్తి(-కత్తి)** రూ. తొడుపుకత్తి. వి. చేతికి తగిలించు కొనే ఇనప తొడుగుకల కత్తి. వైజ. 4.67.

**తొడుపు**[2] రూ.చూ. తొడుగు[2]. స.క్రి. **1.** (వింటికి బాణం) సంధించు, కూర్చు; **2.** ప్రయోగించు.

**తొడువు**[1] రూ.చూ. తొడుగు[1]. స.క్రి. (భూషణాలు, చెప్పులు మొ॥) ధరించు. భార. సభా. 2.121.

**తొడివికట్టు** స.క్రి. వస్త్రాభరణాదుల్ని ధరించు. కాశ. 6.69.

**తొడువు**[2] రూ.చూ. తొడుగు[3]. వి. ముళ్ళ కంప మోపు. అష్టమ.క. 1.44 పు. 23 పం.

**తొడుసు** వి. **1.** బాధ, చిక్కు. భార.శాంతి. 5.395, జైమిని భా. 2.109; **2.** దోషం, వినుగు. వేంక.పంచ. 4.113; **3.** సంబంధం. మను. 5.61; **4.** చెప్పులకు కాళ్ళకు అంటుకొన్న బంకమట్టి.

**తొడుసుమాలు** అ.క్రి. ఆటంకం తొలగు. శుక. 3.146.

**తొడె** రూ.చూ. తొడ. వి. **1.** చిన్నకొణతలికి చుట్టిన నూలు, పాటినూలు చిలప; **2.** ఉన్ని కత్తెరలో వంపు తిరిగిన భాగం.

**తొడెకొణతలి** వి. ఒకరకం రాటి.

**తొడ్కిపట్టు** రూ. తొడికిపట్టు. స.క్రి. ఒడిసిపట్టు. కు.సం. 10.431.

**తొడ్గు**[1] రూ.చూ. తొడుగు[1]. స.క్రి. **1.** (భూషణం, కవచం, చెప్పులు మొ॥) ధరించు. భార.ఆది. 1.115; **2.** (భూషణాలు మొ॥) ధరింపచేయు; అ.క్రి. అంకురించు; వి. **1.** కవచం; **2.** ఆభరణం; **3.** చర్మం, పైపొర.

**తొడ్గు**[2] రూ.చూ. తొడుగు[2]. స.క్రి. **1.** ప్రయోగించు. భార. భీష్మ. 1.254; **2.** వింటికి బాణం సంధించు, కూర్చు. పల్నా. 37 పు; వి. **1.** గాసెన, విండ్లు మొ॥ వాటి కప్పు; **2.** బాణం.

**తొడ్మె** రూ.చూ. తొడిమ. వి. మేడపైన పట్టుకోటానికి బిగించిన అడ్డపుల్ల.

**తొడ్వు**[1] రూ.చూ. తొడుగు[1]. స.క్రి. (దుస్తు) ధరించు.

**తొడ్వు**[2] రూ.చూ. తొడుగు[2]. **1.** (బాణాన్ని) సంధించు; **2.** ప్రయోగించు.

**తొడ్వు**[3] రూ.చూ. తొడుపు[3]. వి. ముండ్లకంప మోపు.

**తొణిఁకిలు** చూ. తొణఁకు.

**తొణఁకు** రూ.చూ. తొలఁకు. అ.క్రి. తొణికిలు, చిందు.

**తొణిఁకిలు** అ.క్రి. తొడికిలు, చిందు.

**తొణఁగు** రూ.చూ. తొడఁగు. అ.క్రి. **1.** ప్రారంభంచేయు, మొదలుపెట్టు. శృం.నై. 1.18; **2.** మొదలుకొను; **3.** యత్నించు, పూనుకొను; స.క్రి. **1.** ప్రారంభించు, ఉపక్రమించు, పూను; **2.** అభ్యసించు, కరచు.

**తొణుకు** రూ.చూ. తొలఁకు. వి. గొల్లవాళ్ళ పెళ్ళి నిశ్చితార్థాల్లో జరిపే ఆచారం; అ.క్రి. చిందు.

**తొణుకునీళ్లచిప్ప** వి. చేతులు కడుక్కోడానికి వాడే చెవులుండే చిన్న మట్టిపాత్ర. **తొణుకురెక్క** వి. తిరిగే రెక్క.

**తొంట**[1] వి. **1.** త్వక్కు, వృక్షచర్మం, చెట్టుపట్ట. ఆం.భా. 2.37; **2.** వామి మొదలు. ఆం.భా. 2.77; **3.** కనవు వెంటి.

**తొంటజొన్న** వి. నిప్పు ముట్టించిన కనవువెంటి.

**తొంట**[2] రూ. తొంటి[2]. విశ. లోపంతో కూడిన.

**తొంటకాలు** వి ఈచపోయిన కాలు. **తొంటచెయ్యి** రూ.చూ. తొంటచేయి. వి. ఈచపోయిన చెయ్యి. **తొంటచెయ్యిచూపు** స.క్రి. లేదను. **తొంటచేతివాఁడు** విశ. ఈచపోయిన చేయి కలవాడు. ఆం.భా. 2.121. **తొంటచేయి** రూ. తొంటచెయ్యి. వి. ఈచపోయిన చేయి. అష్టమ.క. 5.243 పు. 20 పం.

**తొంటి**[1] వి. గరికలో ఒకరకం (Panicum Repens).

**తొంటికట్ట** వి. సన్నటి గడ్డిమోపు.

**తొంటి**[2] రూ.చూ. తొంట[2]. విశ. కుంటి.

**తొంటికాళ్లు** వి.బ.వ. మోకాళ్ళ దగ్గర రాసుకొని తగిలే వంకరకాళ్ళు.

**తొంటి**[3] రూ. తొంటెము. వి. తుంటి, తొడయొక్క కీలు.

**తొంటెము** రూ.చూ. తొంటి[3]. విణ. కురచ.

**తొండ** వి. **1.** సరటం, కృకలాసం, ఒక జాతి సరీసృపం. భార.అను. 2.418 ; **2.** దాసుడు, భక్తుడు. ద్వి.పరమ. 3.212 పు. 5 పం.

క. *డొణ్ణె, తొండె, తొణ్ణె.* ఊసరవెల్లి.

**తొండఉల్లంకి** వి. నల్లని తోక ఉన్న నేల నెమలి. **తొండగిరి** రూ. తొండెగెరి. వి. తోకమీద పొడుగ్గా ఉండే నుడి. **తొండముక్కిడి** వి. పచ్చనిపూలు పూసే, గట్టి కలప నిచ్చే ఒక చెట్టు (Sahrebebera Swietenieides). **తొండముక్కువడు (-పడు)** అ.క్రి. పండబారు. కాశీ. 3.23. **తొండముక్కువారు** అ.క్రి. కంకి కొనగింజలు ముదురు. **తొండరూపురిక్క** వి. పుష్యమీనక్షత్రం, తొండ ఆకారంలో ఉండే నక్షత్రం. **తొండరోగం** వి. తోక వెంట్రుకలు రాలిపోయే రోగం. **తొండలుగుడ్లువెట్టునేల** వి. సారహీనమైన నేల. **తొండలువిడిపించు** స.క్రి. తొందర పెట్టు. **తొండ్లందుత్త** వి. పొడుగుమూతి పెట్టి తొట్టిమాదిరి చేసి పెండ్లిలోవాడే మట్టిపాత్ర.

**తొండకాయ** రూ.చూ. దొండకాయ. వి. **1.** పొదగా పెరిగి విరివిగా కాపుకాసే ఒక తీగపైరు ; **2.** కూర వండుకొనే ఒకరకం కాయ (Coccinia Indica).

**తొండంతాడు** చూ. తొండము.

**తొండపుతాడు** చూ. తొండము.

**తొండపుదోమ** చూ. తొండము.

**తొండపు(గ్రాడు** చూ. తొండము.

**తొండపుమోకు** చూ. తొండము.

**తొండమలం** చూ. తొండము.

**తొండము** రూ. తొండాం, తొండెం, సుండ, సుండు, సొండెం. వి. **1.** గజహస్తం. నిర్వ.రా. 10.29 ; **2.** మోటగూన తోక, మోటగూనలోని నీరు సూటిగా బోదెలో పడటానికి అడుగున కుట్టిన ఏనుగు తొండం లాంటి తోలుగొట్టం ; **3.** నీటిని సులభంగా తోడటానికి వాడే చక్రం ; **4.** పంకాను కొలిమి తిత్తిని కలిపే గుడ్డసంచి.

సం. *తుండ-, శుండా.* తొండం ; ప్రా. *తుండ-, తొండ-* ; శౌ. *తొండ* ; అ.మా. *సొండా* ; మా. *తుండ* ; పా. *తుండ, సొండా, సొండీ* ; అప. *తుండ, తొండ.*

క. *తొండలు, తొండ్లు, తొండ్ల, సుండలు, సుండిల్, సుండిల, సొండలు, సొండిలు, సొండ్లు, చుండ* ; కొడ. *దుండ* ; తు. *సుండిలు, సొండిలు, దొండ* ; త. *తుంటుమ్, తొంబై, తొంటలమ్* ; మ. *చంటు* ; కో. *దుండ్* ; గోం. *తొడ్డీ.* మొగం ; పర్జీ. *చొండ్.* ముఖం, ముక్కు, *చొండ్.* గజహస్తం, *జొండం, జొండొం* ; బ్రా. *సుంట్.*

<ప్రా. తొండ-.

**తొండంతాడు** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. మోట బొక్కెన తొండానికి కట్టే తాడు. **తొండపుతాడు** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. మోటబొక్కెన తొండానికి కట్టే తాడు. **తొంటపుదోమ** వి. నిడుపుముక్కు కల ఒకజాతి పెద్దదోమ, ఘోటిక, ఏనికదోమ. **తొండపు(గ్రాడు (-గ్రాడు)** రూ. తొండంతాడు, తొండపుతాడు, తొండాపితాడు, తొండాపు(గ్రాడు, తొండెంతాడు, తొండెపుతాడు, సుండుతాడు, సొండుతాడు, సొండెపుతాడు. వి. మోటగూన తోకకు కట్టే తాడు. **తొండపుమోకు** రూ. తొండంమోకు, తొండాంమోకు. వి. మోట బొక్కెన తొండానికి కట్టిన తాడు. **తొండమలం** వి. ఒకరకం కలుపుమొక్క. < తొండము + అలం. **తొండముచివర** వి. అంగురి, హస్తం. **తొండంమోకు** రూ.చూ. తొండపుమోకు. వి. మోటబొక్కెన తొండానికి కట్టిన తాడు.

**తొండంమోకు** చూ. తొండము.

**తొండరడిప్పొడి** వి. పన్నెండుమంది ఆళ్వారుల్లో ఒకడు, విప్రనారాయణుడు. వైజ. 1.75.

త. *తొంటరటిప్పొటి.* భక్తాంఘ్రిరేణువు, విప్రనారాయణుడు.

<త. తొంటరటిప్పొటి.

**తొండరడిప్పొడియాళువారలు** వి.బ.వ. పండ్రెండు ఆళ్వారుల్లోనివారు, విప్రనారాయణులు. వైజ. 4.135. త. *తొంటరటిప్పొటి అల్వార్.* విప్రనారాయణుడు. <త. తొంటరటిప్పొటి ఆళ్వార్.

**తొండాం** రూ.చూ. తొండము. వి. మోట బొక్కెననుండి నీళ్ల పారించటానికి అడుగున కట్టిన తోలుగొట్టం లేక తిత్తి.

**తొండాపితాడు** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. మోట బొక్కెన తొండానికి కట్టే తాడు. **తొండాంమోకు** రూ.చూ. తొండపుమోకు. వి. మోటబొక్కెన తొండానికి కట్టిన తాడు.

**తొండాకర్ర** చూ. తొండము. వి. తోట నిచ్చెన పడిపోకుండా మోపుగా నిలిచిఉండే సుమారు 6 అడుగుల పొడుగున్న గట్టి కొయ్య.

**తొండాడు** స.క్రి. త్వరపరచు.

**తొండాపితాడు** చూ. తొండాం.

**తొండాపు(గ్రాడు (-గ్రాడు)** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. తొండపుతాడు.

**తొండి** రూ.చూ. దొండి. వి. రంధ్రం, తూటు.

**తొండు**[1] వి. **1.** తృణవిశేషం. హంస. 5.47 ; **2.** వరిగడ్డిని లావుగా పెట్టిన పొడవు మోపు.

**తొండు**[2] విణ. ప్రాలుమాలిన, సోమరి. ఆం.భా. 3.6.

**తొండుమెండుగా** క్రి.విణ.ద్రు. ముడుచుకొని పెద్దపాటు బడు. **తొండొరు** విణ. పాలుమాలిన, సోమరి. ఆం.భా. 3.6. **తొండొరుతనము** వి. తొండుతనం, సోమరితనం.

**తొండెం** రూ.చూ. తొండము. వి. మోటబొక్కెననుండి నీళ్ళు బయటకు పారించటానికి అడుగున కట్టిన తోలుగొట్టం లేక తిత్తి.

**తొండెంతాడు** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. మోట బొక్కెన తొండానికి కట్టే తాడు. **తొండెపుతాడు** రూ.చూ. తొండపు(గ్రాడు. వి. మోటబొక్కెన తొండానికి కట్టే తాడు.

**తొండెగెరి** రూ.చూ. తొండగిరి. వి. తోకమీద పొడుగ్గా ఉండే నుడి.

**తొండెపుతాడు** చూ. తొండెం.

**తొండొరు** చూ. తొండు[2].
**తొండొరుతనము** చూ. తొండు[2].
**తొండ్లందుత్త** చూ. తొండ.
**తొండ్లి** వి. వృక్షవిశేషం, ఒకరకం చెట్టు. హంస. 4.11.
**తొత్తటము** చూ. తొత్తు.
**తొత్తడము** చూ. తొత్తు.
**తొత్తడి** చూ. తొత్తు.
**తొత్తడిజల్లు** చూ. తొత్తు.
**తొత్తడిపొల్లు** చూ. తొత్తు.
**తొత్తడిరాసి** చూ. తొత్తు.
**తొత్తుటికము** చూ. తొత్తు.
**తొత్తు** వి. **1**. వేశ్య, లంజె. కాశీ. 2.49 ; **2**. దాసి, బానిస, క్రీడా. 68.

క. తుఱిల్. పని, సేవ, తొఱత్, తొత్తు. దాసి ; తు. తొత్తు. దాసీమనిషి, తొళిలు. వ్యాపారం ; త. తొఴిల్. నటన, పని, వ్యాపారం, పిలవటం. ఆజ్ఞ, పనివానితనం, తొఴిఇ. బానిసస్త్రీ, తొఴుక్కన్. బానిసీడు, తొఴుత్తై. బానిసస్త్రీ, వేశ్య, తొఴుమ్బన్. బానిస, తొఴుమ్పి. బానిసస్త్రీ, తొఴువర్. సేవకులు, తొంటు, తొత్తన్, తొత్తు. బానిస ; పో.చూ.క. దుడి.

**తొత్తటము** రూ. తొత్తడము. వి. భేదం తెలియని కూడిక, తొడపటం. **తొత్తడము** రూ.చూ. తొత్తటము. వి. మోసం. **తొత్తడి** వి. **1**. దాసి. బసవ. 4.292 ; **2**. కళ్ళంలో మెదగినగడ్డి. **తొత్తడిజల్లు** వి. నలిగిన గడ్డినుసి. **తొత్తడిపొల్లు** వి. కళ్ళంలో ధాన్యంతో కలిసి ఉన్న కంకిపొట్టు. **తొత్తడి రాసి** వి. తూర్పారపట్టిన గింజలు. **తొత్తుటికము** వి. తొత్తుతనం. **తొత్తుకొడుకు** వి. **1**. బానిస. కళా. 7.42 ; **2**. లంజకొడుకు. **తొత్తుపడుచు** వి. దాసి. శుక. 1.149. **తొత్తులమారి** వి. లంజెల ఇళ్ళకిపోయే స్వభావం కలవాడు. నిరంకు. 2.48.

**తొన[1]** రూ.చూ. తొల[1]. వి. **1**. పనసపండు మొ. వాటి తొన ; **2**. కడుపుమీది మడుపు.
**తొన[2]** విశ. రక్షకం. పల్నా. 114, జైమిని భా. 1.105.

కొడ. తొణె. వ్యక్తిగత సహాయం ; త. తుణై. రక్షణ, తోడు, మిత్రుడు ; మ. తొణ. రక్షణ, చెలికాడు, సహాయం.

**తొనఁకు** రూ.చూ. తొలఁకు[1]. వి. తొట్రుపాటు. భార. కర్ణ. 1.110 ; అ.క్రి. **1**. (నీరు మొ.) చెదరు, చిందు, పొంగు. వసు. 3.150 ; **2**. ఒప్పు, అని. 2.76.

**తొనికిసలాడు** రూ. చూ. తొన్కిసలాడు. అ.క్రి. చలించు, తొలకు.

**తొనికి** రూ.చూ. తునికి. వి. చెమ్మగా ఉండే కొండ లోయల్లో రమారమి 30-40 అడుగుల ఎత్తున పెరిగే చెట్టు.
**తొనికిసలాడు** చూ. తొనఁకు.
**తొనిక్కట్టు** వి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన పని ముట్టు.
**తొనుకుడుబాన** చూ. తొనఁకు. రూ.చూ. తొలుకుడుబాన. వి. పెళ్ళి సాంగెంలో బంగారం వస్తువు వేసి వధూవరులు ఒకేసారి చేతులుపెట్టి తీసేందుకు వాడే మట్టి పాత్ర.
**తొనుగ్గోలు** రూ.చూ. తొడగోలు. వి. సారెమీద కోలుపట్టిన తర్వాత గుండుగా కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం.
**తొన్కిసలాడు** రూ. తొనికిసలాడు. అ.క్రి. చలించు. తొలకు. చెన్న. బసవ. 3.38.
**తొంద** రూ. తొందు. విశ. బొజ్జకలవాడు, తుందిలుడు. ఆం.భా. 2.120.

సం. తుందీ, తుంద-. బొజ్జ, కడుపు ; ప్రా. తుందిల-, తుందిల్ల-. లంబోదరుడు, దుంద-. బొజ్జ. తు. తొందె. పెద్ద.

<ప్రా. తుంద-.

**తొందర** రూ. తంద, తందర[2], వి. **1**. మిక్కిలి సంభ్రమం ; **2**. సంభ్రమం ; **3**. బాధ, కష్టం.

క. తొందరె, తొందరు, తొంద్రె. కష్టం, విసుగు, బాధ ; తు. తొందరె ; త. తొందరై, తొంతరువు, తొంతరై. కష్టం, విసుగు ; మ. తొంతరమ్. విసుగు ; కో. తొందర్వ్ (తొందర్ త్-), తొందర్మ్ (తొందర్ త్-). తొందర.

**తొందరచేయు** స.క్రి. బాధించు. అని. 5.6. త. తొంతరి(-ప్ప్-,-త్త్-). బాధపెట్టు, విసిగించు. **తొందరపడు** అ.క్రి. సంభ్రమించు. **తొందరపాటు** వి. తొందరపడటం. **తొందరమాట** వి. కుచ్చెమాట.

**తొందళము** చూ. సందడి. వి. రెండుమూడు దినుసుల కూరలు చేసిన దప్పలం.
**తొందు** రూ.చూ. తొంద. విశ. బొజ్జకలవాడు, తుందిలుడు. ఆం.భా. 2.120.
**తొన్ని** వి. శ్వేత కుష్ఠం, బొల్లి.
**తొన్నిగ్ర(-క్ర)** రూ.చూ. తన్నుగ్ర. వి. మోటబావి ఊద్ది మీద కొమిరె (నిలువుగుంజ) కు పోటీపెట్టిన ఏటవాలు కొయ్య.
**తొన్నుండు** రూ.చూ. తెన్నుండు. అ.క్రి. శయనించు. వేంక. ఆం. మాన. 47.
**తొన్నూరు** వి. తొమ్మిదినూర్లు, తొమ్మిదివందలు.

త. తొణ్ణూరు. తొంబై, తొళ్ళాయిరమ్. తొమ్మిది వందలు.

<మూ.ద్రా. *తొళ్ + *నూత్.

**తొపారము** రూ. తోపారము. వి. దేగకనుమరుపు, దేగల ముఖానికి కట్టే తోలుగంత. భాను. 2 ఆ.
**తొపిక** వి. ముడతలు పడిన మేని చర్మం.
**తొప్ప** విశ. **1**. ఎరుపు రంగుకల, ఎర్రని. కు.సం. 3.62 ; **2**. అధికం, మిక్కిలి ; క్రి. విశ. ద్రు. అధికంగా, మిక్కిలి.

క. తొప్పనె. అధికంగా.

**తొప్పఁగఁదోఁగు(తోఁగు)** రూ.చూ. తొప్పఁదోఁగు. అ.క్రి. మిక్కిలి మునుగు, మిగులమునుగు. హరి.పూ. 6.97. **తొప్పఁగఁదోఁచు(-తోఁచు)** రూ.చూ. తొప్పఁదోఁచు. అ.క్రి. మిక్కిలి తోగచేయు. భోజరా. 3.85. **తొప్పనఁదోఁగు (-తోఁగు)** రూ.చూ. తొప్పఁదోఁగు. అ.క్రి. మునుగు. బసవ.

2.168. తొప్పఁదొరుగు(-తొరుగు) అ.క్రి. మిక్కిలి తొరుగు. పి.శకు. 3.223. తొప్పఁదోఁగు(-తోఁగు) రూ. తొప్పఁగఁదోఁగు, తొప్పనఁదోఁగు. అ.క్రి. మిక్కిలిగా మునుగు, మిగుల మునుగు. కు.సం. 11.206. క. తొప్పనె. అధికంగా. తొప్పఁదోఁచు(-తోఁచు) రూ. తొప్పఁగఁదోఁచు. అ.క్రి. మిక్కిలి తోఁగచేయు. హరి. ఉ. 2.46. తొప్పలు దోరలు వి.బ.వ. కోటానుకోట్లు. కాశీ. 2.49.

తొప్పర వి. తృణవిశేషం. ప్రబంధ. 201.

తొప్పళ వి. సంక్షోభం, కలత.

త. తొప్పళై. దుస్థితి.

తొప్పళఁబెట్టు(-పెట్టు) స.క్రి. బాధించు. నిర్వ.రా. 5.88.

తొప్పటిలఁబడు చూ. తొప్పళు.

తొప్పటిలఁబండు చూ. తొప్పళు.

తొప్పటిలు చూ. తొప్పళు.

తొప్పటిల్లు చూ. తొప్పళు.

తొప్పళు అ.క్రి. ఒరుగు.

తొప్పటిలఁబడు అ.క్రి. తట్టు విరగబడు. <తొప్పటిలు +-అ[7]+పడు. తొప్పటిలఁబండు అ.క్రి. తట్టు విరగ పండు, పక్కకు ఒరిగేటట్లు పండు. అం.భా. 3.101. < తొప్పటిలు + -అ[7] + పండు. తొప్పటిలు రూ. తొప్పటిల్లు. అ.క్రి. ఒరుగు. తొప్పటిల్లు రూ.చూ. తొప్పటిలు. అ.క్రి. ఒరుగు.

తొప్పలాడు స.క్రి. కలచు, క్షోభింపచేయు. పి.శకు. 2.12.

తొప్పి రూ.చూ. టొప్పి. వి. 1. టోపి ; 2. శిశ్నాగ్రచర్మం ; 3. శిశ్నం చివరి చర్మం లోపల ఉండే ఎర్రని కండ.

తొప్పె వి. చేతులతో నోరు బాదుకొనటంలో వచ్చే ధ్వనికి అనుకరణం. ఉ.హరి. 4.302. ధ్వన్యను.

తొప్పె చూ. టొప్పి, తొప్పి. వి. శిశ్నాగ్రచర్మం.

తొబక విఙ. విత్తులు రాలిన ; వి. 1. (పీత మొ॥వాటి) గుల్ల ; 2. కాయలపై తోలు, తొక్క.

తొంపు వి. సాకు.

తొంబ[1] చూ. తొంబది. వి. 1. గుంపు, మూక ; 2. అరిణిగా ఏర్పడ్డ కాలవ.

తొంబ[2] రూ.,చూ. తమ్మ[1]. వి. 1. పది పదిహేను అంగుళాల పొడవున బద్దగా ఉండే కాయలు గుత్తులు గుత్తులుగా కాసే ఒకరకం మొక్క ; 2. నమిలిన తాంబూలం (Cana Valia).

తొంబగిలు అ.క్రి. గుంపుకూడు. అప్ప. 4.252.

తొంబంద్రు చూ. తొంబది.

తొంబది రూ. తొంబై. సర్వ. తొమ్మిదిపదులు. భార.ఆది. 1.43.

క. తొమ్బతు, తొమ్భత్తు. తొంబై ; కొడ. తొమ్బది. తొంబై ; తు. సొణ్బ ; త. తొళ్ళాయిరమ్. తొమ్మి దొందలు, తొణ్ణూఱు. తొంబై, తొణ్ణు. తొమ్మిది ; మ. తొళ్ళాయిరమ్. తొమ్మిదొందలు. తొణ్ణూఱు. తొంబై ; గోం. తొమిది, తుమిదీ. తొమ్మిది, తొంబై. తొంబై ; కొలా. తొద్దీ, తొద్ది. తొమ్మిది, తొమాతెర్. తొమ్మిది మంది.

<మూ.ద్రా. *తొళ్‌పత్.

తొంబంద్రు సర్వ.బ.వ.బౌ. తొంబదిమంది (తొంబదికి మహన్మహత్యర్థక రూపం). తొంబదినూఱు యా.చూ. తొంబనూఱు[2]. సర్వ.బౌ. తొంబది నూరులు, తొమ్మిది వేలు. తొంబదిపాళ్లు వి.బ.వ. చాలావరకు. తొంబనూఱు[2] రూ. తొంబదినూఱు, తొంబన్నూఱు, తొమ్మనూఱు[2], తొమ్మన్నూఱు[2]. సర్వ.బౌ. తొమ్మిదివేలు. తొంబన్నూఱు రూ.చూ. తొంబనూఱు[2]. సర్వ.బౌ. తొమ్మిదివేలు.

తొంబనూఱు[1] చూ. తొమ్మిది.

తొంబనూఱు[2] చూ. తొంబది.

తొంబన్నూఱు చూ. తొంబది.

తొంబందుము రూ. చూ. తొమ్మందుము. వి. తొమ్మిది తూములు, ఒక ధాన్యపు కొలత.

తొమ్భ రూ.చూ. తొమ్మిది. సర్వ. తొమ్మిది. క్రీ.శ. 1006 చేబ్రోలు, తెనాలి తా॥ గుంటూరు జిల్లా.

తొంభనూటనల్వ్వాది సర్వ.బౌ. తొమ్మిది వందల నలభై. క్రీ.శ. 1018.

తొంభై రూ.చూ. తొంబది. సర్వ. తొమ్మిది పదులు.

తొమ్మంద్రు చూ. తొమ్మిది.

తొమ్మనూఱు[1] చూ. తొమ్మిది.

తొమ్మనూఱు[2] రూ.చూ. తొంబనూఱు[2]. సర్వ. బౌ. తొమ్మిది వేలు.

తొమ్మందుము రూ. తొంబందుము. వి. తొమ్మిదితూములు, ఒక ధాన్యపుకొలత. ఆం.భా. 2.271. <తొమ్మిది+తూము.

తొమ్మన్నూఱు[1] చూ. తొమ్మిది.

తొమ్మన్నూఱు[2] రూ.చూ. తొంబనూఱు[2]. సర్వ.బౌ తొమ్మిదివేలు.

తొమ్మరము వి. రాజకుమారులు తమ సేవకులకోసం ఏర్పరచిన పేర్లు మొదలైనవి రాసిన సూచీ పత్రం.

తొమ్మాడు చూ. దొమ్మ. వి. నాశం.

తొమ్మాడుచేయు స.క్రి. పాడుచేయు.

తొమ్మిదవ అష్టకము చూ. తొమ్మిది.

తొమ్మిది రూ. తొమ్భ, తొంభ. సర్వ.బౌ. తొమ్మిది. భార.ఆది. 1.35.

క. ఒంబత్తు, ఒంభత్తు; కొడ. ఒయ్‌య్‌బదీ; తు. ఒర్ంబ ; త. తొంబు, ఒన్‌పతు, ఒన్‌పాన్ ; మ. ఒంపతు ; గోం. ఉన్మా, తొమిది, తుమిదీ, తుమిది, తొంబ్ ; కొలా. తొద్దీ, తొద్ది.

<మూ.ద్రా. *తొళ్+పది.

తొంబనూఱు[1] సర్వ.బౌ. తొమ్మిది వందలు. భీమ. 6.68. తొమ్మంద్రు సర్వ.బ.వ.బౌ. తొమ్మిదిమంది. భార. ఆది. 3.71. కొలా. తొమాతెర్. తొమ్మిదిమంది. తొమ్మనూఱు[1] రూ.చూ. తొమ్మన్నూఱు[1]. సర్వ.బౌ. తొమ్మిది వందలు. నిర్వ.రా. 8.84. త. తొళ్ళాయిరమ్ ; మ. తొళ్ళాయిరమ్. తొమ్మన్నూఱు[1] రూ. తొమ్మనూఱు[1]. సర్వ. తొమ్మదివందలు. భార.ఆది. 1.49. తొమ్మిదవఅష్టకము వి. బూతుల పంచాంగం, తిట్లకు దిగటం, వేదాల్లో 8 అష్టకాలు ఉన్నాయి, తొమ్మిదో అష్టకం అంటే తిట్లు అని అర్థం.

తొయ్యలి రూ. తొయ్యెలి, తోయలి. వి. స్త్రీ. శృం.నై. 1.83.

త. తైయల్. స్త్రీ ; మ. తైయల్. అందమైన స్త్రీ.

**తొయ్యెలి** రూ.చూ. తొయ్యలి. వి. స్త్రీ, ఆడుది. అహల్యా. 2.90.

**తొర** వి. **1**. వేగిరపాటు. విష్ణుపు. 3 ; **2**. ఆపద, ఇడుము. ద్వి.గౌ. హరి. 4.108.

సం. త్వర, త్వరా. వేగం ; ప్రా. తుఅర. వేగిరపడు, తువర. తొందరపాటు ; శౌ. తువర ; అ.మాగ. తురిఅ, తురియు. తొందరపాటుగా ; మా. తువల ; అప. తరు. వేగంగా ;

క. తొరిత, తొరే.

<సం. త్వరా-.

**తొరపడు** అ.క్రి. వేగిరపడు. విష్ణు.ఉ. 4 ఆ.

**తొరం** రూ.చూ. తరం. వి. దున్నినప్పుడు మెదగని గడ్డలు, గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టలు.

**తొరక** రూ.చూ. తరక[1]. వి. పాలు మొ॥ చల్లారిన తరువాత దానిమీద ఏర్పడిన మీగడ పొర.

**తొరఁగించు** చూ. తొరఁగు[2].

**తొరఁగు[1]** రూ.చూ. తొఱఁగు[1]. స.క్రి. విడుచు. భార.ద్రోణ. 2.323.

**తొరఁగు[2]** రూ. తొరుఁగు, తొఱఁగు[2]. అ.క్రి. **1.** (పుష్పాదులు) రాలు. భార.ఆది. 2.79 ; **2**. పడు. భార.ఆది. 2.211 ; **3**. కారు, స్రవించు. భార.ఆది. 4.104 ; **4**. ప్రవహించు, పారు. భార.అరణ్య. 3.236 ; **5**. కురియు, వర్షించు. చిత్రభా. 2.24 ; **6.** లోబడు, వశమగు. కుచే. 3.19.

క. సురి (<*చొరి). ప్రవహించు, వర్షించు, పోయు, సోర్. కారు ; తు. సోరుని, తోరుని. కారు, సొర్తె, తోరు. కారటం ; త. చోరి. వర్షించు, ఆకులలాగ రాలు, చుర. ప్రవహించు, బయటికిపోవు ; మ. చొరియుక. ప్రవహించు, చురక్క. (పాలు) స్రవించు ; కో. చొర్వ్- (చొర్ద్-). పొదుగునుంచి పాలు స్రవించు, జోర్-. (కన్నీరు మొ॥) కారు ; తొ. త్వర్- (త్వర్థ్-). పాలు చేపటానికి సిద్ధమగు ; గోం. తోర్. పాత్రలోకి నీళ్ళు పోయు ; కుయి. తోడ. ప్రవహించు, స్రవించు ; కువి. త్డోఖ్. పడవేయు, తొర్గ్. పడు ; పర్జి. చోడ్. కారు, చోర్ప్- (చోర్-). అన్నంనీరు ఆవిరగు ; గ. చోర్. నీళ్ళు మొ॥ వాటిని పోయు ; కురు. చర్ఖ్. కారు స్రవించు ; మాల్తో. చుర్గ్ ; బ్రా. (తుమ్ప్). నీటిచుక్క చ్చ్ర్. ప్రవహించు.

<మూ.ద్రా. *చోర్/*తోర్-, *చొర్ -వ్-/తొర్ -వ్-

**తొరఁగించు** స.క్రి. **1**. పడగొట్టు. భాస్క.రా.అరణ్య. 1.224 ; **2**. కురిసేటట్లుచేయు, వర్షింపచేయు. భాస్క రా. యు. 526 ; **3**. వైచు. భాగ. 10 ఉ. 553. <తొరఁగు[2]+-ఇంచు[3].

**తొరపడము** రూ. తొడపటము, తొరపణము. వి. వడ్రంగి బెజ్జాలు చేసే సాధనం.

సం. తర్పణ-. సమిధ.

**తొరపణము** రూ.చూ. తొరపడము. వి. వడ్రంగి బెజ్జాలు కోసే సాధనం.

**తొరపు** చూ. తొరఁగు[2]. స.క్రి. వేణ్ణీళ్ళను చల్లార్చు.

**తొరలనాడు** చూ. తొరలు[3].

**తొరలించు** చూ. తొరలు.[2]

**తొరలివచ్చు** చూ. తొరలు[2].

**తొరలు[1]** అ.క్రి. మార్కొను, ఎదుర్కొను, తొడరు. బ.న.వ. 2.375 పం.

**తొరలు[2]** రూ.చూ. దొరలు[1]. అ.క్రి. కలుగు. ద్వి. భాగ. 8 సం.

**తొరలివచ్చు** అ.క్రి. కలుగు, పుట్టు. నీతి.శ. 87.

**తొరలు[3]** చూ. దొరయు. అ.క్రి. **1**. కలియు, చేరు ; **2**. మారు, వేరు రూపమగు.

**తొరలనాడు** స.క్రి. స్థాపించు. <తొరలు[3]+-అ[7]+ ఆడు. **తొరలించు** రూ. తొర్లించు. స.క్రి. వేన్నీళ్ళు. (చన్నీళ్ళు చేర్చి) చల్లార్చు. < తొరులు[3] + -ఇంచు[3]. **తొరలుచు** రూ.చూ. తొరల్చు. స.క్రి. మార్చు, బదిలించు. **తొరల్చు** రూ. తొరలుచు. స.క్రి. మార్చు. ఆము. 4.218. **తొర్లించు** రూ.చూ. తొరలించు. స.క్రి. వేన్నీళ్ళు (చన్నీళ్ళు చేర్చి) చల్లార్చు.

**తొరల్చు** చూ. తొరలు[3].

**తొరిగొ్ర్రు (-కొఱ్ఱు)** వి. పొగ, మిరప, వేరుసెనగ మొ॥ చేలలో తొలే చిన్న గొర్రు.

**తొరితొరి** అవ్య.క్రి.విశే.ద్రు. లెస్సగా, బాగుగా.

**తొరుఁగు** రూ.చూ. తొరఁగు[2]. అ.క్రి. **1**. జారు, గళితమగు. కు.సం. 8.60 ; **2**. పడు. రాలు. భార.శాంతి. 1.263 ; **3**. కురియు. రాఘవ. 1.68 ; **4**. ప్రవహించు, స్రవించు. దశా. 2.200 ; స.క్రి. విడుచు, త్యజించు. భార.శల్య. 2.399 ; వి. చెట్లకింద రాలి ఎండిన ఆకులు.

**తొరుపు** రూ. తొలుపు. స.క్రి. **1**. తొర్లించు, వేన్నీళ్ళకు (చన్నీళ్ళు) చేర్చి చల్లార్చు. రసిక. 1.71 ; **2.** పెరుగు మొ॥ వాటిలో నీళ్ళు కలుపు.

**తొ్రర** రూ.చూ. తొఱ. వి. **1**. నష్టం ; **2**. రాళ్ళ వరసలకు మధ్య ఉన్న ఖాళీ.

**తొ్రరి** రూ.చూ. తొఱ. వి. దోసెపలక తిప్పటానికి పల్లెకట్టె దూర్చే దోసెగాడి.

**తొ్రరివెలగ** రూ.చూ. తొఱ్ఱివెలగ. వి. లేత పసుపురంగు గల గట్టిగా ఉండే కలప నిచ్చే, ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Limonia Acidessima).

**తొర్లించు** చూ. తొరలు[3].

**తొర్లుగట్టె** చూ. తొఱ్ఱు.

**తొర్లుగోవి** చూ. తొఱ్ఱు.

**తొర్లుఁబూఁట (-పూఁట)** వి. పూటలలోనే ఒక విధమైంది. తాళ్ల. సం. 10.142.

**తొఱ** రూ. తొ్రట, తొ్రర, తొ్రరి, తొఱట, తొఱటము, తొఱ్ఱ, తొఱ్ఱి, తొలట. వి. **1**. (కర్రకు ఉండే) రంధ్రం, బోలు. కాశీ. 5.205 ; **2**. కోటరం, చెట్లలో ఏర్పడే పెద్ద రంధ్రం. భోజరా. 4.17.

క. తొఱలు, తొఱలె. రంధ్రం, తొఱ, డొఱ. రంధ్రం, బోలు.

తొఱతేనె రూ.చూ. తొఱ్ఱతేనియ. వి. చెట్టు తొఱ్ఱలో పట్టిన తేనెపట్టులోని తేనె, తొఱ్ఱతేనె.

తొఱఁగించు చూ. తొఱఁగు[1].

తొఱఁగు[1] రూ. తొరఁగు[1], తొఱవు. స.క్రి. విడుచు, త్యజించు. భార.అరణ్య. 2.208 ; వి. విడిపడటం. ఉ.హరి. 4.308.

క. తొఱె. విసర్జించు, విడుచు, తొఱవి. విడనాడటం ; తు. తొరెపుని. విడనాడు, తొరెలు. త్యజించటం ; త. తుఱ. ఐహికసుఖాల్ని విడుచు, త్యజించు, వదలు ; కుయి. తుప్పా (<*తుస్ప్-) వదలు, త్యజించు.

<మూ.ద.ద్రా. *తుఱ్.

తొఱఁగించు స.క్రి. విడుచు, త్యజించు. ఆము. 5.81. <తొఱఁగు[1]+-ఇంచు[3]. తొఱఁగుపోవు అ.క్రి. పశువులు తప్పించుకొనిపోవు. విజ్ఞా.ప్రా. 13. తొఱఁగుపోవు (-పోవు) అ.క్రి. పశువులు తప్పించుకొనిపోవు. భార.విరా. 1.278.

తొఱఁగు[2] రూ.చూ. తొరఁగు[2]. అ.క్రి. స్రవించు, కారు. పండి. చ. 4.293.

తొఱట రూ.చూ. తొఱ. వి. తొఱ్ఱ, కోటరం. వేంక.పంచ. 3.228.

తొఱటలువాఱు (-పాఱు) అ.క్రి. రంధ్రాలుపడు. జైమిని భా. 7.101.

తొఱటము రూ.చూ. తొఱ. వి. తొఱ్ఱ, కోటరం. కేయూ. 2.101.

తొఱద్రొక్కు (-త్రొక్కు) రూ.చూ. తొఱుద్రొక్కు. వి. గట్టి తొక్కుడు.

తొఱవు రూ.చూ. తొఱఁగు[1]. స.క్రి. విడుచు.

తొఱుద్రొక్కు (-త్రొక్కు) రూ. తొఱద్రొక్కు. వి. గట్టి తొక్కుడు. ఉ.హరి. 4.29.

క. తురు. పరుగెత్తటం ; త. తొఱు. సంఘం.

తొఱ్ఱ రూ.చూ. తొఱ. వి. 1. వృక్షవిశేషం. హంస. 4.9 ; 2. కోటరం, చెట్టులో ఉండే పెద్ద రంధ్రం. ఆం.భా. 2.38.

తొఱ్ఱకొప్పు వి. తొఱ్ఱవంటి కొప్పు, వదులు కొప్పు. వైజ. 3.70. తొఱ్ఱతేనియ రూ. తొఱతేనె. వి. చెట్టు తొఱ్ఱలో పట్టిన తేనెపట్టులోని తేనె, తొఱ్ఱతేనె. కాళ. 3.68. తొఱ్ఱపిట్ట వి. వడ్రంగిపిట్ట. తొఱ్ఱబులుఁగు (-పులుఁగు) వి. తొఱ్ఱలో ఉండే పక్షి, గుడ్లగూబ. నీతి. శ. 65. తొఱ్ఱవెలగ రూ. తొఱ్ఱివెలగ. వి. లేత పసుపు రంగు కలిగి గట్టిగా ఉండే కలపనిచ్చే ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Limonia acidissima).

తొఱ్ఱి రూ.చూ. తొఱ. వి. 1. రంధ్రం. వేమ. 2.34 ; 2. ముందర పళ్ళులేని నోరు.

తొఱ్ఱియక్కరము(-అక్కరము) వి. పళ్ళులేని నోటితో పలికే అక్షరం. ఆము. 6.62. తొఱ్ఱివాఁడు విణ. పళ్ళూడి పోయినవాడు, పతితదంతుడు. ఆం.భా. 2.121.

తొఱ్ఱు వి. 1. ఆవు. గంగిరెడ్డిపల్లి శాసనం. క్రీ.శ. 9 – 10 శతాబ్దాలు : 2. పశువు (ఆవు, దున్న మొ.) భార. విరా. 3.132.

క. తుఱు. ఆవు, తొఱు, తుఱుపు, తురుపు, తుఱు, తుఱుకాఱ. ఆవులమంద, తురువళ్, తుఱువాళ్. ఆవుల మంద ; త. తొఱు, తొఱువు. ఆవులమంద.

తొర్లుగట్టె(-కట్టె) వి. గొల్లవాడిదగ్గరఉండే పొడవైన వెదురుకర్ర. హంస. 2.75. తొర్లుగోవి(-క్రోవి) వి. గొల్లవాడి దగ్గరఉండే పొడవైన వెదురుకర్ర. వేంక. పంచ. 1.588. తొఱ్ఱుపట్టు వి. ఆవులశాల, గొల్లపల్లె. భార. ఆది. 8.210.

తొల[1] రూ. తొన[1]. వి. పనసపండు మొ. వాటి తొన. శృం.నై. 6.68.

క. తొళె. విడిముక్క లేక భాగం, నారింజ, పనస, ప్రత్తి మొ. పళ్ళలోని ఒకభాగం; త. చుళై. పనస మొ. వాటితొన ; మ. చుళ. పొర, వరుస ; కో. తొయ్ల్. పనసతొన ; కువి. తోల.

తొలతేనె వి. తొరతేనె, పుట్టతేనె. హంస. 2.182.

తొల[2] వి. ప్రకాశం, కాంతి. వీర. వి. 1.167.

తొల[3] రూ.చూ. డొల. వి. కాడిమానులోని రంధ్రం, చూరు కుట్టుబద్ద మొనదగ్గరిచిల్లి.

తొలగాన వి. బట్టలుంచడానికి వేలాడగట్టిన దండెం.

తొలగుంజ వి. మగ్గంమీద, నేతబద్ద చుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం.

తొలకరి రూ.చూ. తొలుకారు. విణ. వర్షసంబంధమైన. హర. 4.46.

తొలకరిగ్గులుగువ్వ(-కల్గుగువ్వ) వి. హంస. వేంక. అం. 97. తొలకరిచోడి వి. తొలకరిలోపండే సస్య విశేషం. తొలకరించు చూ. తొలుకు. రూ. తొలుకరించు. అ.క్రి. 1. కురియు, వర్షించు. శివరా. 1.61 ; 2. ఉద్భవించు, పుట్టు. విక్ర. 8.82 ; 3. చిమ్ము, చల్లు. ఇందు. 5.83 ; 4. అతిశయించు. హంస. 2.21. తొలకరిదొర వి. ఇంద్రుడు. తొలకరిదొరబిడ్డ వి. అర్జునుడు, ఇంద్రుని కొడుకు. విజయ. 2.98. తొలకరిపెసలు వి.బ.వ. దేశమంతటా విస్తారంగా పండించే ఒకరకం పప్పుదినుసు (Phaseolus mungo). తొలకరిమించు వి. వర్షాకాలపు మెరుపు. ఉ.రా. 6. 117. తొలకరిమెఱుపు రూ. తొలుకరి మెఱుపు. వి. 1. మల్లయుద్ధగతి విశేషం. ప్రబంధ. 78 ; 2. తొలుకారులోని మెరుపు, వర్షాకాలపు మెరుపు. తొలకరివాన రూ. తొల్కరివాన. వి. ఎండాకాలం తరవాత ఆరంభమయ్యే వాన. తొలకరిసూడు వి. వర్షాకాలానికి శత్రువు, హంస.

తొలకారు రూ.చూ. తొలుకారు. వి వర్షాకాలం, వర్షర్తువు. క్రీడా. 217.

తొలకు చూ. తొలఁకు[1], తొల్లి[2]. వి. ఉపరంధ్రం, జంతువుల వెనక కాలి మొదటిభాగానికీ, పక్కకూ నడిమిదోటు. బసవ. 7.39. పం.

తొలంగుబావ చూ. తొలఁగు.

తొలఁకఁబాఱు చూ. తొలఁకు[1].

తొలఁకాడు చూ. తొలఁకు[1].

తొలఁకించు చూ. తొలఁకు[1].

తొలఁకియాడు చూ. తొలఁకు[1].

తొలఁకు[1] రూ. తలఁకు[2], తొడఁకు, తొణఁకు, తొణుకు, తొనఁకు, తొలుకు[1]. అ.క్రి. 1. చెదరు, చిందు. కు.సం. 2.102 ;

**2**. అతిశయించు. భార.విరా. 5.210 ; **3**. పైకి ఉబుకు. విక్ర. 2.57 ; **4**. ఉద్భవించు, పారి. 1.56 ; **5**. పొర్లు. పారి. 5.57 ; **6**. వ్యాపించు, ప్రసరించు. కళా. 3.121 ; **7**. ప్రకాశించు, ఒప్పు. కళా. 4.105 ; **8**. చలించు. ప్రభా. 2.41 ; వి. **1**. అల, తరంగ. ఆము. 4.146 ; **2**. చలనం. విష్ణుపు. 7.165.

క. తళకు, తుళికు, తుళుకు, తుళుంకు. తుణుకు. కలతపొందు, చలించు, తుణుకు ; కొడ. తుళి. నీటిబిందువు ; త. తుళంకు (తుళంకి-.) అటు ఇటు కదలు, తుళక్కు (తుళక్కి). తుళక్కమ్. కదపటం, భయం, కలత ; త. తుళుమ్పు (తుళుమ్పి-). కలతనొందు, తుళుప్పటు, తులంకు (తునంకి-), తులుంకు (తులుంకి-), తులుక్కు (తులుక్కి-), తుళి (-ప్పి-,-త్తి-). పడు, కన్నీరుకారు ; మ. తులఙ్ఙుక. వణకుతూకదలు, తుళక్కమ్. కదలటం, తుళుమ్పుక. చలించు, తులయుక. కదల్చబడు, తుళ్ళి, తుళి (నీటి) బిందువు, తుళిక్క. ప్రవహించు ; తొద. త్విళ్గ్ ఒడ్- (ఒథొ-). రాళ్ళపై నది ప్రవహించు, (బంది) ఎగిరిపడు, త్విళ్గ్ ఫిస్-(ఫిస్య-). రాళ్ళపై నది ప్రవహించు, తొళ్శ్. చిలకరించు ; కుయి. ల్లొన్గ (ల్లొన్గి). (అటు ఇటు) ఊగు ; పర్జి. తొల్క్. ఒలికిపోవు, తొల్కిప్ (తొల్కిత్-), (తొల్పిప్-(తొల్పిత్-), తొల్ప్. (కుండనుంచి) ఒలికి పోవు ; మాల్తో. తున్డ్ ; పో.చూ.కురు. తున్డ్, తున్డ్.

< మూ.ద్రా. *తుళ్-/*తుణ్-

**తొలఁకఁబాఱు** అ.క్రి. చిందు. శ్రీరం.మా. 10.32. < తొలఁకు + -అ[7] + పాఱు. **తొలఁకాడు** రూ. తులఁకాడు, తొలఁకియాడు. అ.క్రి. **1**. ప్రకాశించు. కు.సం. 8.9 ; **2**. అతిశయించు. నిర్వ.రా. 7.132 ; **3**. తొణికిసలాడు. భాగ. 4.307 ; **4**. ఒలుకు. విక్ర. 6.27. < తొలఁకు + ఆడు. క. తుణుకు, తుళకు, తుళీకు, తుళుంకు. కదలు, సంచలించు ; త. తుళంకు, తుళక్కు ; మ. తుళఙ్ఙుక. **తొలఁకించు** స.క్రి. తొలకచేయు, అతిశయింపచేయు. శృం.నై. 8.46. < తొలఁకు + -ఇంచు[3]. **తొలఁకియాడు (-ఆడు)** రూ.చూ. తొలఁకాడు. అ.క్రి. **1**. చిందు ; **2**. చలించు ; **3**. అతిశయించు.

**తొలఁకు[2]** అ.క్రి. **1**. ప్రకాశించు. వరాహ. 4.8 ; **2**. ప్రకటమగు. దశా. 2.296.

క. తొళగు. ప్రకాశించు, తొళపు. ప్రకాశం, కాంతి ; త. తుళుంకు. ప్రకాశించు, ప్రకాశమగు, తుళుంపు ; మ. తుళక్కమ్, తుళక్కుక. ప్రకాశమగు.

**తొలఁగఁద్రోయు** చూ. తొలఁగు.

**తొలఁగఁబాఱు** చూ. తొలఁగు.

**తొలఁగఁబెట్టు** చూ. తొలఁగు.

**తొలఁగవైచు** చూ. తొలఁగు.

**తొలఁగించు** చూ. తొలఁగు.

**తొలఁగింపు** చూ. తొలఁగు.

**తొలఁగు** రూ. తొలుగు[1]. అ.క్రి. **1**. ఒత్తగిల్లు. భార.ఆది. 4.122 ; **2**. మాను, తప్పు. భార.ఆది. 4.270 ; **3**. పోవు, నశించు. భార.ఆది. 4.271 ; **4**. అపసరిల్లు, తప్పుకొను. భార.ఆది. 7.113 ; **5**. ఓసరిల్లు, పక్కకు పోవు. కు.సం. 11.125 ; **6**. మరలు, నివర్తిల్లు. భార. ఉద్యో. 4.203 ; **7**. దూరమగు, చెడు. భార.శాంతి. 1.4 ; **8**. వెడలు. విప్ర. 3.78 ; స.క్రి. **1**. విడుచు. హరి.ఉ. 4.58 ; **2**. నశింపజేయు, పోగొట్టు. దశా. 2.63.

క. తొలగు, తొలంగు. అవతలకివెళ్ళు, తప్పుకొను, తొలగిసు ; తు. తొలగుని. తప్పుకొను, తెలవుని, తెలావుని. అవతలకివెళ్ళు, తొల్గుని ; త. తొలై (తొలైన్-, తొలైన్త్-). నశించు, చచ్చు, (తొలైప్పి-, తొలైత్త్). నాశనంచేయు, చంపు, తొలైచ్చ (తొలైచ్చి-). చంపు, నాశనంచేయు, తొలైపు. నశించు, తొలైవు. నాశనం, తులై (తులైవ్-, తులైన్త్-). నశించు, (తులైప్-, తులైత్-) ; మ. తులయుక. చచ్చు. తులచ్చల్. నశించు, తులెక్క. ముగించు ; కో. తొల్గ్- (తొల్గ్య-). అప్పునుంచి విముక్తిచేయు, తొల్క్ (తొల్క్య-) ; తొ. త్వల్- (త్వలొ-), త్వల్ఫ్ (త్వల్త్-). త్వల్క్ (త్వల్క్య).

మూ.ద.ద్రా. *తొల్- అ-.

< మూ.ద్రా. *తొల్.

**తొలంగుబావ** రూ. తొలఁగుబావ. వి. ఎదురుగా నిల్చో కూడనివాడు, శత్రువు. పారి. 2.41. **తొలఁగఁద్రోయు** స.క్రి. **1**. పోగొట్టు. భార.అను. 5.320 ; **2**. పరిహరించు, పారవేయు. శృం.నై. 6.127 ; **3**. తొలగించు. పాండు. 2.50 ; **4**. దాటవేయు. < తొలఁగు + -అ[7] + త్రోయు. **తొలఁగఁబాఱు** అ.క్రి. ఓసరిల్లు, పక్కకుపోవు. భార.ద్రోణ. 4.202. < తొలఁగు + -అ[7] + పాఱు. **తొలఁగఁబెట్టు** స.క్రి. దూరంగాఉంచు, పరిహసించు. భార. శాంతి. 4.243. < తొలఁగు + -అ[7] + పెట్టు. **తొలఁగవైచు** స.క్రి. తొలగద్రోయు, పోగొట్టు. భార.విరా. 1.238. **తొఁలగించు** స.క్రి. **1**. తొలగేటట్లుచేయు, పోగొట్టు. పల్నా. 11 ; **2**. విసర్జించు, విడుచు. కళా. 2.33. < తొలఁగు + -ఇంచు[3]. **తొలఁగింపు** వి. తొలగించటం. **తొలఁగుడు** వి. తొలగటం, అపసరణం. ఆం.భా. 2.224. **తొలఁగుడుకన్ను** రూ.చూ. తొలుగుడుకన్ను. వి. స్వస్థానం నుంచి తొలగిన కన్ను. పండి.చ 4.273 పు. **తొలఁగుడుపడు** అ.క్రి. పక్కకు తొలగు. భాగ. 8.38. **తొలఁగుబావ** రూ.చూ. తొలంగుబావ. వి. దాయ, శత్రువు. ప్రభా. 4.123. **తొలతొలఁడను** అ.క్రి. తొలగుడు, తొలగుడుఅను. పండి.చ. 5. పు. 289.

**తొలఁచు** చూ. తొలఁగు. స.క్రి. **1**. కడుగు, ప్రక్షాళనంచేయు. భార.శాంతి. 3.197 ; **2**. తోము, రుద్దు. భోజ. 3.180 ; **3**. తొలగించు, పోగొట్టు. నశింపచేయు. చంద్రికా. 1.99 ; **4**. కడిగి పవిత్రంచేయు. వాల్మీ. 2.3 ; అ.క్రి. మజ్జనం చేయు, స్నానంచేయు. హంస. 4.208.

క. తొళె, తొళి. కడుగు, తొలగించు, తొళసు, తొళయిసు ; పో.చూ. త. తులక్కు. శుభ్రంచేయు ; మ. తులక్కుక. తోము, మెరుగుపెట్టు ; కో. తొళ్గ్ ; గోం. తుడూప్స్తానా ; పో.చూ. బ్రా. సిల్గ్.

< మూ.ద్రా. *తుళ్.

**తొలట** రూ.చూ. తొఅ. వి. తొరట, తొ్రర. కేయూ. 4.74.

**తొలతొల(డను** చూ. తొలఁగు.

**తొలముకర్ర** వి. పంటెలు వేలాడదీసే పొడుగాటి కర్ర.

**తొలసి** రూ. తులచి, తులిశ, తులిసి, తులిసె, తుల్సి, తొలిసి. వి. తులసిచెట్టు. జైమినిభా. 7.197.

సం. తులసీ. హిందువులకు పవిత్రమైన మొక్క : ప్రా. తులసీ. లతా విశేషం ; దే.ప్రా. తురసీ, తురసలతా, తులసీ ; అ. మాగ. తులసీ ; పా. తులసి ;

క. తొళచి, తొళచె, తొళంచె, తొళసి ; తు. తులచి, తులసి, తుళసి ; త. తుళవు, తూఌాయ్.

< సం. తులసీ.

**తొలసితొట్టి** వి. తులసిచెట్టు నాటిన తొట్టి.

**తొలి**[1] రూ.చూ. తొల్లి[1]. వి.జొ. మున్ను, పూర్వం. కు.సం. 11.28 ; విణ. మొదటి ; వి. తొక్కుడుబిళ్ళ ఆట గడుల్లో మొదటి గడి.

**తొలికట్టు** రూ.చూ. తెలుకట్టు. వి. మొదటికట్టు, మొదట ఉంచే న్యాసం. **తొలికడరాయ(డు** వి. తూర్పుదిక్కుకు ప్రభువు, దేవేంద్రుడు. అచ్చ.రా.ఆరణ్య. 126. **తొలికలుపు** వి. నారుమడిలో మొట్టమొదట తీసే కలుపు. **తొలికూటమి** వి. మొదటి కలయిక, ప్రథమసమాగమం. కృ.శకు. 3.50. **తొలికొత్త** విణ. సరికొత్త. హర. 4.95. **తొలికోడి** వి. వేకువజామున కూతవేసే తొలికోడి. **తొలికోడికూ(తప్రొద్దు** వి. ఉషఃకాలం, వేకువజాము. శుక. 3.138. **తొలిగట్టు** వి. పూర్వాద్రి, ఉదయపర్వతం. ఉ.రా. 4.252. **తొలిగాబు** వి. నారుమడిలో మొట్టమొదట తీసే కలుపు. **తొలిగొండ (-కొండ)** వి. ఉదయపర్వతం. చంద్రాంగ. 2.45. **తొలిగొప్వ** వి. మిరప, వంగతోటల్లో మొదటసారిగా కలుపు మొక్కలు మొ॥ వాటి తవ్వకం. **తొలిచదువులు** రూ.చూ. తొల్చదువులు. వి.బ.వ. పూర్వవిద్యలు, వేదాలు. ఉ.రా. 3.92. **తొలిచాలు** వి. మూడోసారి దున్నిన చాలు. **తొలిచూలావు** వి. మొదటిసారి గర్భం ధరించిన ఆవు. < తొలిచూలు + ఆవు. **తొలిచూలు** రూ. చూ. తొలుచూలు. వి. ప్రథమసంతతి, మొదటిబిడ్డ. అచ్చ.రా.బాల. 216. **తొలిజాతియొడయ(డు (-ఒడయు(డు)** వి. బ్రహ్మ. వేంక.ఆం.దేవ. 6. **తొలిజాతివారు** విణ.బ.వ. బ్రాహ్మణులు. సాంబ.మాన. 2. **తొలిజేజే** వి. పూర్వదేవుడు, రాక్షసుడు. ఉ.రా. 3.227. **తొలితొలుత** రూ.చూ. తొలుదొల్త. అవ్య. ద్రు. మొట్టమొదట. **తొలిదిక్కు** వి. తూర్పు. పండి.చ. 1.58. **తొలిదుక్కి** వి. ముందటిఅరక. ఆం.భా. 2.233. **తొలిదెసఱే(డు** వి. ఇంద్రుడు. అచ్చ.భా. 3.38. **తొలిదేవర** వి. **1**. బ్రహ్మదేవుడు. ఉ.రా. 2.200 ; **2**. పూర్వదేవుడు, రాక్షసుడు. అచ్చ.రా.కిష్కిం. 83. **తొలినా(డు** వి. పూర్వదినం. కువ.చ. 2.55. **తొలినుడి** వి. మొదటిమాట. ఆము. 2.19. **తొలినెల** వి. చైత్రమాసం. అచ్చ.రా. బాల. 84. **తొలినేలదాల్పు (-తాల్పు)** వి. ఉదయపర్వతం. ఉ.రా. 4.160. **తొలిపక్క** వి. గూన చివరి వెడల్పాటి భాగం. **తొలిపన్నగము** వి. ఆదిశేషుడు. దశా. 1.58. **తొలిపలుకు(గొనలు (-కొనలు)** వి.బ.వ. వేదాంతాలు, ఉపనిషత్తులు. అచ్చ.రా.ఆరణ్య. 112. **తొలిపలుకులు** రూ.చూ. తొలుపలుకులు. వి.బ.వ. వేదాలు. **తొలిపాలు** వి. మొదటిసారి. **తొలిపుట్టువు** వి. పూర్వజన్మం ఉ.రా. 4.94. **తొలిపెద్ద** వి. తొల్లిటి పెద్దవాడు. ఉ.రా. 1.80. **తొలిపోటు** వి. మొదటిదెబ్బ. జైమిని భా 2.65. **తొలిమబ్బు** వి. తొలకరి మేఘం. అచ్చ.రా.యు. 518. **తొలిమల** వి. పూర్వాద్రి, తూర్పుకొండ. కకుత్స. 5.66. **తొలిముట్టు** వి. దారం ఏకటానికి, మొదటి ఏకుకు అంటించే కదురుపోగు. **తొలిముద్ద** వి. మొదటి ఆహుతి. భార. ఉద్యో. 4.208. **తొలియిక్క(-ఇక్క)** వి. పూర్వనివాస స్థలం. ఉ.రా. 4.158. **తొలివారము** వి. ఆదివారం. **తొలివేలుపు** రూ. తొలివేల్పు, తొలువేలుపు, తొలువేల్పు, తొల్వేలుప, తొల్వేల్పు. వి. **1**. పూర్వదేవుడు, రాక్షసుడు. ఉ.హరి. 2.144 ; **2**. ఆదిదేవుడు, విష్ణువు. **తొలివేల్పు** రూ.చూ. తొలివేలుపు. వి. **1**. ఆదిదేవుడు, విష్ణువు. ఉ.రా. 2.214 ; **2**. పూర్వదేవుడు, రాక్షసుడు. సాంబ. దేవ. 16. **తొలివేల్పు(గొమ్మ(-కొమ్మ)** వి. పూర్వదేవస్త్రీ, రాక్షసస్త్రీ. అచ్చ. రా. బాల. 111. **తొలివేల్పుపగతురు** వి. బ. వ. దేవతలు. సాంబ. దేవ. 18.

**తొలి**[2] రూ. తులి, తొలిక[1], తొల్ల, తొల్లి[2], తొల్లు, తొళ. తొళి, దుల, దొల. వి. **1**. రంధ్రం. భాగ. 5.281 ; **2**. తొ్రర. సాంబ. స్థా, 59 ; **3**. విత్తనగోలు. లక్ష్మీ. 3.79 ; **4**. బండికంటి నడిమితూము ; **5**. నాగటిపణత, కాడి మొ. వాటిలో తొలచిన రంధ్రం ; **6**. గుద్దలి, గొడ్డలి మొదలైన పనిముట్లకు కర్రదూర్చే కన్నం.

క. తొళె, తొళ్ళె, టొళ్ళె, టొళ్ళు, తొళ్ళు, తొలి. రంధ్రం ; తు. తొలువె, తొళు, తొళ్ళె, టొళ్ళు, డొళ్ళు ; త. తొళ్కు. గొయ్యి, గుంట, తొళ్కల్. రంధ్రం, తొళై. రంధ్రం, గుంట, తుళై, తుళవై. రంధ్రం, తొణ్డై. రంధ్రం, తొళ్. రంధ్రం చేయు ; మ. తొళ్ళ, తుళ. రంధ్రం ; కో. తొయ్ళ్, తొళ్. రంధ్రం.

< క. తొళె.

**తొలివెలగ** వి. తొ్రరవెలగ లేతపసుపు రంగుగల గట్టి కలపనిచ్చే ముళ్ళుగల ఒకచెట్టు (Limonia acidissima).

**తొలిక**[1] రూ.చూ. తొలి[2]. వి. రంధ్రం. కవిక. 2.192.

**తొలిక**[2] రూ.చూ. తొల్లిక[1]. వి. రాతిని చెక్కటానికి గుంటలు కొట్టడానికి పనికివచ్చే శంకు ఆకారంలో ఉన్న ఉక్కు పరికరం.

**తొలికె** చూ. తొలి[2]. రూ.చూ. తొల్లిక[1]. వి. దాదాపు అడుగున్నర పొడుగు కొయ్యకు చివర రేకుపార అమర్చిన తవ్వ పనిముట్టు.

**తొలిపించు** చూ. తొలుచు.

**తొలిసి** రూ.చూ. తొలసి. వి. ఉత్తర సర్కారుల్లోని కొండల మీద పెరిగే తెల్లనిపూలు పూసే ఒకచెట్టు (Colebrookia

oppositifolia).

**తొలు** రూ.చూ. తొల్లి[1]. విణ (వృత్తిలో శబ్దంలో అంత్యవర్ణం లోపించగా మిగిలిన రూపం). కు.నం. 2.102. ఉదా. తొలుఁబలుకులు.

**తొలుకడ** వి. పూర్వదిక్కు, తూర్పుదెస. అచ్చ.రా. 18. **తొలుకబ్బము** వి. ఆదికావ్యం, రామాయణం. సమీర. 7.79. **తొలుకరి** రూ.చూ. తొలుకారు. వి. వర్షరుతువు, వానకారు. విక్ర. 8.15. **తొలుకరించు** రూ.చూ. తొలకరించు. అ.క్రి. కురియు, వర్షించు. చంద్రాంగ. 3.62. **తొలుకరిమెఱుపు** రూ.చూ. తొలకరిమెఱుపు. వి. తొలికారు మెరుపు, తొలకరి మెరుపు. **తొలుకారు** చూ. కాఱు[6]. రూ. తొలకరి, తొలకారు, తొలుకరి, తొలుకాఱు, తొల్కరి, తొల్కారు. వి. వర్షరుతువు, వానకారు. కు.నం. 11.138. క. తుళకు. చిందు. .తుళుకు. చల్లు, కొడ. తుళి. ద్రవబిందువు; త. తుళి (తుళిప్-,-త్త్-). వర్షం, తుళ్ళి. చినుకు, తుళ్ళమ్. చిన్న నీటిబిందువు; మ. తుళి. బిందువు, తుళిక్క. కారు, తుళ్ళి. బిందువు; తొ. తొళ్య- (తొళ్-). చిలక రించు, తుళ్య, బిందువు; పర్జి. తొళ్య- (తొళ్-). చిలకరించు, తుళ్య. బిందువు; పర్జి. తొల్క్. చిలక రించు, తొల్కిప్ (తొల్కిత్-), తొల్పిప్- (తొల్పిత్). తొల్ప్). **తొలుకాఱు** రూ.చూ. తొలుకారు. వి. వర్షరుతువు, వానకారు. శివరా. 3.31. **తొలుకుడుపు** వి. అన్నప్రాశనం. **తొలుకొను** అ.క్రి. మొదలుకొను, ప్రారంభించు. కు.నం. 8.184. **తొలుకోడి** వి. తెల్లవారుజామున మొదట కూసే కోడి. బసవ. 4.168. **తొలుగట్టు** వి. తూర్పుకొండ, ఉదయ పర్వతం. వసు. 6.6. **తొలుగోలము(-కొలము)** వి. బ్రాహ్మణ కులం. పాండు. 4.266. **తొలుగౌరు** వి. ఐరావతం. చంద్రికా. 2.9. **తొలుచదువులు** రూ.చూ. తొల్చదువులు. వి.బ.వ. వేదాలు. **తొలుచూలు** రూ. తొలిచూలు, తొల్చూలు. వి. మొదటిబిడ్డ. భార. స్త్రీ. 2.86. **తొలుచెక్క** వి. మాను మొ. వాని మీది పలుచని తెల్లభాగం. ఆము. 2.3. **తొలుజాతివాడు** విణ. విప్రుడు. **తొలుతాఁకు** వి. మొదటి యుద్ధం. భార. భీష్మ. 1.242. **తొలుతొలుత** రూ.చూ. తొలుదొల్త. క్రి.విణ. ఔ. అనొ. మొట్టమొదట. **తొలుదీవి** వి. జంబూద్వీపం. వసు. 1.94. **తొలుదెస** ఆం.భా. 1.71. **తొలుదొలుత** రూ.చూ. తొలుదొల్త. వి. ద్రు. ఔ. అనొ. మొట్టమొదట. వసు. 3.49. **తొలుదొల్త** రూ. తొలితొలుత, తొలుతొలుత. అవ్య. ఔ. అనొ. మొట్టమొదట. మను. 1.37. **తొలునాఁడు** రూ. తొల్నాఁడు. వి. ముందు రోజు, గతదినం. భార. భీష్మ. 1.303. **తొలునీటిరిక్క** వి. పూర్వాషాఢ నక్షత్రం. **తొలుపక్కము** వి. పూర్వపక్షం, శుక్ల పక్షం. **తొలుపట్టి** రూ. తొల్పట్టి. వి. మొదటిబిడ్డ. భార. కర్ణ. 3.233. **తొలుపంది** రూ.చూ. తొల్పంది. వి. ఆది వరాహం. **తొలుపలుకులు** రూ. తొలిపలుకులు, తొలుఁబలుకులు, తొలుఁబల్కులు. వి.బ.వ. వేదాలు. కు.నం. 3.14. **తొలుపాటికయ్యము** వి. ప్రథమయుద్ధం. పి.శకు. 3.225. **తొలుపుట్టువు** రూ.చూ. తొల్పుట్టువు. వి. పూర్వజన్మం. భార. అను. 1.274. **తొలుప్రాఁకు** వి. తీగ అల్లుకోటానికి ఉంచే కొయ్య మొ.నవి మొదటి ఆశ్రమం, ఉపఘ్నం. భార.శాంతి. 4.293. **తొలుబాము** రూ. తొల్బాము. వి. పూర్వజన్మం. భార.స్త్రీ. 2.55. **తొలుబొట్టెఁడు** రూ.చూ. తొల్బొట్టెఁడు. వి. పెద్దబిడ్డ. **తొలుమాపు** వి. సాయంకాలం. కాశీ. 3.22. **తొలుమామ** వి. మొదటిభార్య తండ్రి. భీమ. 3.36. **తొలుమినుకులకడలు** వి.బ.వ. ఉపనిషత్తులు. యయా. 331. **తొలుమినుకులు** వి.బ.వ. వేదాలు. ఆం.నా.సం.దేవ. 41. **తొలుముద్ద** వి. మొదటి ముద్ద, ప్రథమ కబళం. భార. ఉద్యో. 4.207. **తొలుముద్దగొను(-కొను)** స.క్రి. మొదటనే బలి తీసుకొను. భార. ఉద్యో. 4.208. **తొలుముద్దయగు (-అగు)** అ.క్రి. ప్రథమ కబళమగు. భార. ద్రోణ.3.39. **తొలుమేను** రూ. తొల్మేను. వి. పూర్వదేహం, పూర్వజన్మం. భార. అరణ్య. 2.114. **తొలుమొగులు** వి. వర్షిస్తున్న మేఘం, ఘనాఘనం. అచ్చ.రా.యు. 64. **తొలుఁబలుకులు** రూ.చూ. తొలుపలుకులు. వి.బ.వ. వేదాలు. దశా. 5.115. **తొలుఁబల్కులు** రూ.చూ. తొలుపలుకులు. వి.బ.వ. వేదాలు. పారి. 3.28. **తొలురిక్క** వి. అశ్వినీ నక్షత్రం. **తొలురిక్కనెల** వి. ఆశ్వయుజమాసం. **తొలువేలుపు** రూ.చూ. తొలివేల్పు, వి. 1 పూర్వదేవుడు, రాక్షసుడు. మను. 5.47; 2. బ్రహ్మ, సురజ్యేష్ఠుడు. **తొలువేల్పు** రూ.చూ. తొలివేలుపు. వి. పూర్వదేవుడు, రాక్షసుడు. **తొలువేల్పురా** వి. రాక్షసరాజు. ఉ.రా. 2.42. **తొలుసంజ** వి. ప్రాతస్సంధ్య. కాశీ. 1.129. **తొలుసమర్త** వి. ప్రథమర్తువు, మొదటి ముట్టు. క్రీడా. 80. **తొల్కరి** రూ.చూ. తొలుకారు. వి. వర్షరుతువు, వానకారు. శృం.నై. 6.121. **తొల్కరించు** రూ.చూ. తొలకరించు. అ.క్రి. కురియు, వర్షించు. శివధ. 1.6. **తొల్కరివాన** రూ.చూ. తొలకరివాన. వి. ఎండాకాలం తరవాత ఆరంభ మయ్యే వాన. **తొల్కారు** రూ.చూ. తొలుకారు. వి. వర్షర్తువు. **తొల్చదువులు** రూ. తొలిచదువులు, తొలు చదువులు. వి.బ.వ. వేదాలు. పాండు. 2.32 **తొల్చూలు** రూ.చూ. తొలుచూలు. వి. మొదటి బిడ్డ. కాశీ. 4.7. **తొల్జంగమయ్య** వి. శివుడు. **తొల్నాఁడు** రూ.చూ. తొలునాఁడు. వి. పూర్వదివసం, గతదినం. బసవ. 6.645. **తొల్పట్టి** రూ.చూ. తొలుపట్టి. వి. మొదటిబిడ్డ. భార. శల్య. 1.194. **తొల్పంది** రూ. తొలుపంది. వి. ఆదివరాహం. అచ్చ.రా. బాల. 46. **తొల్పుట్టువు** రూ. తొలుపుట్టువు. వి. పూర్వ జన్మం. భార. స్త్రీ. 2.24. **తొల్బాము** రూ.చూ. తొలు బాము. వి. పూర్వజన్మం. భార. అను. 5.97. **తొల్బొట్టెఁడు** రూ. తొలుబొట్టెఁడు. వి. పెద్ద బిడ్డ. అచ్చ.రా.యు. 1.61. **తొల్మేను** రూ.చూ. తొలుమేను. వి. పూర్వజన్మం, పూర్వ దేహం. భార.అను. 5.99. **తొల్వేలుపు** రూ.చూ. తొలి వేలుపు. వి. పూర్వ దేవుడు, రాక్షసుడు. అచ్చ.రా.బాల. 63. **తొల్వేల్పు** రూ.చూ. తొలివేలుపు. వి. పూర్వ దేవుడు, రాక్షసుడు. అచ్చ.రా.యు. 54.

**తొలుకాడు** చూ. తొలుకు[1].

**తొలుకు**[1] రూ.చూ. తొలఁకు[1]. అ.క్రి. 1. అతిశయించు. ఉ.రా. 2.95; 2. వర్షించు, చిలకరించు; 3. పొర్లిపారు.

**తొలుకాడు** రూ.చూ. తొల్కాడు. అ.క్రి. పొంగు,

అతిశయించు, వ్యాపించు. కాశీ. 2.28. **తొలుకుడుచిప్ప** వి. సంగటి ముద్దలు చేసేటప్పుడు నీళ్ళద్దుకోడానికి చేతులు కడుక్కోడానికి వాడే వెడల్పు మూతిగల చిన్న మట్టిపాత్ర. **తొలుకుడుతొట్టి** వి. సంగటి ముద్దలు చేసేటపుడు నీళ్ళద్దుకోడానికి చేతులు కడుక్కునే దానికి వాడే వెడల్పు మూతి గల చిన్న మట్టిపాత్ర. **తొలుకుడుబాన** రూ. తొనుకుడుబాన. వి. పెళ్ళి సాంగెంలో బంగారం వస్తువు వేసి వధూవరులు ఒకేసారి చేతులు పెట్టి తీసేందుకు వాడే మట్టిపాత్ర.

**తొలుకు**[2] రూ.చూ. తొల్లిక[1]. వి. తొల్లికకు వేసిన రేకుపార.

**తొలుగు**[1] రూ.చూ. తొలఁగు. అ.క్రి. పక్కకు తప్పుకొను. పల్నా. 25.

**తొలుగుడుకన్ను** రూ. తొలఁగుడుకన్ను. వి. గుడ్డు తొలగిపోయిన కన్ను. పండి. చ. 4. పు. 108.

**తొలుగు**[2] రూ.చూ. తలుగు. వి. **1**. పలుపు, పశువుల మెడకు వేసి గుంజకు కట్టే తాడు; **2**. మోకు; **3**. దండెపైనుంచి వేలాడదీసిన పొడుగాటి కర్ర.

**తొలుగ్గోలు** రూ.చూ. తొనుగ్గోలు. వి. సారెమీద కోలు పట్టిన తర్వాత గుండుగ కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం. < తొలుగు[2] + కోలు.

**తొలుగ్గోలు** చూ. తొలుగు[2].

**తొలుచు** రూ. తొల్చు. స.క్రి. **1**. రంధ్రం కలదానినిగా చేయు, బోలుగా చేయు. భార.విరా. 3.162; **2**. ఖండించు. ఉ. హరి. 1.148; **3**. నాటు. ఆం.భా. 3.122; **4**. శిక్షించు.

క. తొళె, తొళ్ళె. రంధ్రం, ఖాళీ ప్రదేశం, జొళ్ళు. ఖాళీ; తు. తొళు. ఖాళీ, తొల్పుని. నాటు, గుచ్చు. తొలువె. రంధ్రం; త. తొళై. రంధ్రం చేయు, రంధ్రం, తుళై. రంధ్రంచేయు, తొళ్కల్, తొళ్లై; మ. తుళెక్క. బోలుచేయు, తుళయుక. బోలుచేయబడు; కో. తొయ్ళ్ (తొళ్చ్-). రంధ్రంచేయు; తొ. తుళ్య్(తుళ్చ్-). చెట్టు లేక రాయిలో రంధ్రం చేయు; గోం. తుల్ల్. బోలు చేయబడు, తుల్హుత్. బోలుచేయు; కుయి. ఙ్రుప్క. రంధ్రంచేయు; కువి. తూత్. బోలుచేయు; మాల్తో. తుగ్న, తుగ్ను. వెదురులోని బోలు, గొట్టం, సొరంగం; పో.చూ. త. తొటు.

<మూ.ద్రా. *తొళ్-.

**తొలిపించు** స.క్రి. **1**. రాతిలోగాని చెక్కలోగాని పల్లం చేయించు; **2**. కడిగించు.

**తొలుత** రూ. తొల్త. వి. బొ. అనొ. మున్ను, మొదటి కాలం. భార.విరా. 4.129; విణ. ముందుది, పూర్వపుది. భార. ఉద్యో. 3.117.

**తొలుతపట్టి** వి. ప్రథమ సంతానం, మొదటి బిడ్డ. భార. విరా. 5.326.

**తొలుపు** రూ.చూ. తొరుపు. స.క్రి. తొల్లించు, వేడినీళ్ళను చన్నీళ్ళు చేర్చి చల్లార్చు.

**తొల్కరి** చూ. తొలు.

**తొల్కరించు** చూ. తొలు.

**తొల్కరివాన** చూ. తొలు.

**తొల్కాడు** రూ. తొలుకాడు. అ.క్రి. పొంగు, అతిశయించు, వ్యాపించు. పండి.చ. 2.106.

**తొల్కారు** చూ. తొలు.

**తొల్కులు** వి.బ.వ. స్త్రీ పొట్టపై గల ముడుతలు.

**తొల్చదువులు** చూ. తొలు.

**తొల్చు** రూ.చూ. తొలుచు. స.క్రి. **1**. రంధ్రం కల దానినిగా చేయు, బోలుగా చేయు. ఉ.రా. 3.323; **2**. ఖండించు: **3**. నాటు.

**తొల్చూలు** చూ. తొలు.

**తొల్జంగమయ్య** చూ. తొలు.

**తొల్త** రూ.చూ. తొలుత. వి.బొ.అనొ. మున్ను, మొదటి కాలం. భార.ఉద్యో. 1.72; విణ. ముందుది, పూర్వపుది. హరి. పూ. 1.3.

**తొల్తకలుపు** రూ. తొల్తకల్పు. వి. నారుమడిలో మొట్ట మొదట తీసే కలుపు. **తొల్తకల్పు** రూ.చూ. తొల్తకలుపు. వి నారుమడిలో మొదటిసారిగా తీసే కలుపు. **తొల్తచూలు** వి. మొదటి బిడ్డ. భార. శాంతి. 1.7.

**తొల్నాఁడు** చూ. తొలు.

**తొల్పంది** చూ. తొలు.

**తొల్పుట్టువు** చూ. తొలు.

**తొల్పాము** చూ. తొలు.

**తొల్పొట్టెఁడు** చూ. తొలు.

**తొల్మేను** చూ. తొలు.

**తొల్ల** రూ.చూ. తొలి[2]. వి. **1**. నాగటిపణత, కాడిమాను మొ॥ వాటి రంధ్రం; **2**. చూరుకుట్టు బద్ద మొన దగ్గరి చిల్లి; **3**. రాతిలోగాని, కొయ్యలోగాని తొలిచిన రంధ్రం.

**తొల్లకుంటమన్ను** వి. కుండలు తెల్లగా కాలడానికుపయోగించే ఒకరకం మన్ను. **తొల్లపింజెర** వి. ఒకరకం డాబీ (నేతలో డిజైన్లు రావటానికి అమర్చే యంత్రం).

**తొల్లి**[1] రూ. తొలి[1], తొలు. వి.బొ. పూర్వం, మునుపు. భార. ఆది. 1.31. దాక్షారామ శాసనం. క్రీ.శ. 1065; విణ. ముందటిది. భార.ఆది. 5.230.

త. తొల్. పూర్వం, తొల్లై. పూర్వకాలం, తొన్మ, తొన్మై; కువి. తొల్లిఎ, ముందు; పర్జి. తొల్లి. రేపు; కొలా. తొల్లి. రేపు, ఉదయం; నాయి. తొల్లి. రేపు; ఒల్లా. తొన్డుం, తొన్డునుం, తొండున్. రేపు.

**తొల్లింటికత** వి. పురావృత్తం, సమాచారం. **తొల్లింటిది** విణ. పూర్వకాల సంబంధమైన.

**తొల్లి**[2] రూ.చూ. తొలి[2]. వి. రాతిలోగాని కొయ్యలోగాని తొలిచిన రంధ్రం. నార.పంచ. 2.144.

**తొల్లిక**[1] చూ. తొలి[2]. రూ. తొలిక[2], తొలికె, తొలుకు[2], తొళికె. వి. తవ్వటానికి ఉపయోగించే చిన్న ఇనపసాధనం. కాశ. 4.122. క. తొళ్ళె. రంధ్రం; త. తొళ్. రంధ్రం చేయు, తొళ్ళై. రంధ్రం; మ. తొళ్ళ. **తొల్లివెలమ** వి. లేత పసుపురంగుగల గట్టి కలప నిచ్చే ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Limonia Acidissima).

**తొల్లిక**[2] రూ. తొళ్ళిక. వి. ఒకరకం చేప. హంస. 4.187.

**తొల్లించు** రూ.చూ. తొరలించు. స.క్రి. వేన్నీళ్ళు చల్లార్చు.

**తొల్లు** రూ.చూ. తొలి[2]. వి. రాతిలోగాని కొయ్యలోగాని

తొలిచిన రంధ్రం.

**తొల్లుగడ** చూ. తొలుచు. వి. అతుకు, సమిష్టిగా ఉన్న కలుపు.

**తొల్వేలుపు** చూ. తొలు.

**తొల్వేల్పు** చూ. తొలు.

**తొళ** రూ.చూ. తొలి[2]. వి. బొద్దుకొయ్యకు చేసిన బెజ్జం.

**తొళక** రూ. తొళిక. విణ. మిక్కిలి పలచనిది.

త. తొళుకు. పదులుగాకట్టు.

**తొళి** రూ.చూ. తొలి[2]. వి. 1. నాగటిపణత, కాడి మొదలగు వాటిలో తొలిచిన రంధ్రం; 2. గుద్దలి, గొడ్డలి, సెలగ పార మొదలైన పనిముట్లు పారకుగాని, పలుగుకుగాని కఱ్ఱ దూర్చే కన్నం.

**తొళిక** రూ.చూ. తొళక. విణ. మిక్కిలి పలచనిది.

**తొళికె** రూ.చూ. తొల్లిక[1]. వి. దాదాపు అడుగున్నర పొడుగు కొయ్యకు చివర రేకు పార అమర్చిన తవ్వు పనిముట్టు.

**తొళ్ల** వి. గుజ్జులేని తొక్కు.

**తొళ్ళిక** రూ.చూ. తొల్లిక[2]. వి. ఒకరకం చేప.

**తొవ** రూ.చూ. తొగ[1]. వి. కలువ. కు.సం. 5.38.

**తొవకంటి** వి. కలువకంటి స్త్రీ. చంద్రికా. 2.98, చంద్రాంగ. 3.113. **తొవరాయఁడు** వి. చంద్రుడు. చంద్రికా. 2.77. **తొవతేకు** వి. కలువ (పువ్వు) రేకు. నిర్వ.రా. 8.62. **తొవఱేఁడు** వి. చంద్రుడు. రఘు. 1 ఆ. 17 పు. 53 పం. **తొవలరాయిడికాఁడు** వి. సూర్యుడు, కలువలను బాధించేవాడు. ఆం. నా. సం. దేవ. 10. **తొవలసూడు** వి. కలువలకు విరోధి, సూర్యుడు. నీలా. 1.34. **తొవవిందు** వి. కుముదబాంధవుడు, చంద్రుడు. కకుత్థ్స. 3.105. **తొవసామి** వి. చంద్రుడు. చంద్రికా. 5.114.

**తొవర[1]** రూ. తొగర[1]. విణ. ఒగరుకలది, వెగటురుచికలది. కు.సం. 5.162; వి. ఒగరు.

క. తువర, తొగరి, తొగఋ, తొవర, తొవఋ, పగరు; తు. చొగరు; త. తువర్. వగరు, వగరుగా ఉండే పదార్థం;

పో.చూ. సం. తుబర-, తువర. వగరుగల, వగరు.

**తొవర[2]** రూ.చూ. తొగరు. వి. రంగునూలుబిట్టె.

**తొవరరాటి** రూ. తొవ్రరాటి. వి. ఒకరకం చిన్నరాటి.

**తొవ్రరాటి** రూ.చూ. తొవరరాటి. వి. ఒకరకం చిన్నరాటి.

**తొవరి** రూ.చూ. తొగరి[1]. వి. 1. కందిచెట్టు; 2. అడవికంది తీగ; 3. సురాష్ట్రదేశపు మన్ను.

**తొవరిమ్రాను** వి. తువరిక, తొగరు. ఆం.భా. 2.62.

**తొవరు** రూ.చూ. తొగరు[2]. వి. ఎరుపు. సాంబ.స్థా. 60; విణ. రక్తవర్ణం కలది, ఎఱ్ఱనిది. అచ్చ.రా.యు. 323.

**తొవ్రరాటి** చూ. తొవర[2].

**తొవిఁటపెద్దు** వి. ఆంబోతు.

**తొవ్వ** రూ.చూ. త్రోవ. వి. ముఖ్యమైనమార్గం, విశాలమైన బాట.

**తొవ్వకం** చూ. తొవ్వు[1].

**తొవ్వకుండ** చూ. తవ్వ. వి. తవ్వుడు బియ్యం ఉడికే మట్టి పాత్ర.

**తొవ్వాటం** చూ. తొవ్వు[1].

**తొవ్వు[1]** రూ.చూ. త్రవ్వు. స.క్రి. తవ్వు.

**తొవ్వకం** రూ.చూ. తవ్వకము. వి. మిరప, జొన్న మొ॥ తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమి గుల్లగా ఉండటానికి పారతో తవ్వటం. **తొవ్వాటం** వి. మిరప, జొన్న మొ॥ తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమి గుల్లగా ఉండటానికి పారతో తవ్వటం.

**తొవ్వు[2]** రూ.చూ. దువ్వ. వి. పెంకు తయారీకి వాడే ఎరుపు నలుపు రంగు కలిగిన జిగటమట్టి.

**తొసల** వి. వెడల్పు మూతిఉన్న గిన్నె.

హిం.ఉ. తస్‌లా. గిన్నెకంటె పెద్దగానూ లోతుగానూ ఉన్న ఒకరకం పాత్ర; పార. తశ్త్.

< ఉ. తస్‌లా.

**తొస్తు** రూ.చూ. తస్తు. వి. మట్టితో చేసిన లోతైన పాత్ర.

**తొస్తుకంటం** వి. గుండ్రంగా వెనుకకు తిరిగి ఉండే అంచు. సం. కంఠ-. మెడ. < తొస్తు + సం. కంఠ- + -ము.

**తొస్స** రూ.చూ. తొస్సె. వి. ఉచ్చారణలోపం.

**తొస్సి** రూ.చూ. తొస్సె. వి. ఉచ్చారణలోపం.

**తొస్సు** చూ. తొస్సె. వి. వెడల్పుగూడబాన.

**తొస్సె** రూ. తొస్స, తొస్సి. విణ. పళ్ళులేని, బోసి.

**తొస్సెదుబ్బ** వి. గరుపు కలిసిన తువ్వ.

**తో** రూ.చూ. దువ్వ. వి. పెంకు తయారీకి వాడే ఎరుపు నలుపు రంగు కలిగిన జిగటమట్టి.

**-తో** రూ.చూ. -తోడన్. ప్రత్య.ద్రు. 1. సహార్థకం, కూడ అనే అర్థాన్నిస్తుంది. పండరంగుని అద్దంకి శాసనం. క్రీ.శ. 848, భార.ఆది. 2.3; 2. ఇది 'తోడ' వలె ప్రకృతితో కూడక ప్రత్యేకంగా కూడా ప్రయోగించబడుతుంది: (క). కూడు. తోడుత, సహార్థకం. భార.సభా. 2.158; (చ.) దేశకాలాల్లో అవ్యవహితంగా, వెంబడి, వెనువెంట అనే అర్థాల్లో ప్రయుక్తం. భార.భీష్మ. 1.238; 3. చేత, చే, కరణార్థకం. భార.ఆది. 3.5; 4. వలన (ఇది నియమ పూర్వక విద్యా స్వీకారంలో గురువాచక పదాలకు అనుప్రయుక్త మవుతుంది.). భార.ఆది. 4.168; 5. వెంటనే. కు.సం. 4.113; 6. 'పైని, మీద' అనే అర్థాన్ని ఇస్తుంది. భార.విరా. 2.18; 7. (సంస్కృతంలో అవ్యయీభావసమాసంలో యథా శబ్దంవలె) 'కొలదిని, అనుసరించి,' అనే అర్థాన్ని ఇస్తుంది. భార.శాంతి. 5.139; 8. 'మాటలాడు' అనే అర్థాన్నిచ్చే ధాతువులు అముఖ్య కర్మలకి అనుప్రయుక్త మవుతుంది. భాగ. 9.521; 9. షష్ఠ్యర్థంలో 'కి, కు' లకి మారుగా ప్రయోగించబడుతుంది.

**తోఁబుట్టినది (-పుట్టినది)** రూ.చూ. తోడఁబుట్టినది. విణ. సహోదరి, అక్క లేదా చెల్లెలు. ఆం. భా. 2.113. **తోఁబుట్టినవాఁడు (-పుట్టినవాఁడు)** రూ. తోడఁబుట్టిన వాఁడు. విణ. సోదరుడు. భార. ఆది. 6.196. **తోఁబుట్టు (-పుట్టు)** రూ.చూ. తోడఁబుట్టువు. వి. 1. సోదరి. భీమ. 5.120; 2. సోదరుడు. **తోఁబుట్టుగు (-పుట్టుగు)** రూ.చూ. తోడఁబుట్టువు. వి. 1. సోదరుడు. జైమినిభా. 7.134; 2.

సోదరి. తోఁబుట్టువు (-పుట్టువు) రూ.చూ. తోడఁబుట్టువు. వి. **1**. సోదరి. ఆము. 2.67 ; **2**. సోదరుడు.

**తోక** రూ.చూ. తోఁక. వి. **1**. ఒకవైపు కోసుగా ఉండే టట్లు మలచబడిన రాతి మొన దేరిన భాగం, **2**. గడ్డపార మొన ; **3**. చెలకపార తూమువైపున్న కట్టె మొదలు ; **4**. చేలో ఒక మూల కోసుగాఉన్న భాగం ; **5**. నవారు మగ్గం అడ్డపీటకు కింద బిగించిన పొడుగుపట్టె ; **6**. చెలక పార తూము వైపున్న కట్టె మొదలు ; **7**. నడవా, సింహ ద్వారానికి ముందు అరుగుల మధ్యగా ఉన్న నడిచేదారి.

**తోకకీలు** వి. తలుపురెక్కలు పడనల మీద తిరిగే టట్లు చేసే ఇనప బద్దీ. **తోకకోయు** స.క్రి. **1**. పనినుంచి తీసివేయు ; **2**. నష్టపరుచు. **తోకగుంజ** రూ.చూ. తోఁక గుంజ. వి. **1**. ఊడ్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతినగూటం ; **2**. నాలికకొయ్య, మగ్గంమీద దోనెకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన రంధ్రం గల కొయ్య. **తోకగురుజు** రూ.చూ. తోకగొడిసె. వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డుకృశించి పోవటం. **తోకగూటం** రూ. తొగ్గూటం, తోగ్గూటం. వి. ఊడ్తైను నిలబెట్టి తాడుతో బిగించిటానికి నేలలో పాతిన ఇనపగూటం. **తోకగొడిసె** రూ. తోకగురుజు, తోకగొలుసు, తోగ్గుడిసి, తోగ్గుడిసె. వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించి పోవటం. **తోకగొలుసు** రూ.చూ. తోకగొడిసె. వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించిపోవటం. **తోకచుక్క** వి. తోకతో వచ్చే నక్షత్రం. **తోకచెరుగు** వి. తోపు (బండిమీద వేసిన చొప్ప) మొ. బిగించే మోకు. **తోకజాడించు** అ.క్రి. పారిపోవు. **తోకజెర్రి** వి. తోకమీద జెర్రి మాదిరి పొడుగ్గా ఉండే సుడి. **తోకజొన్న** వి. బొంతు (పొట్ట) కొనదేరి ముళ్ళుగా ఉండే ఒక రకం జొన్న. **తోకతలవరి** వి. సన్నగా పొడుగ్గా ఉన్న ఒకరకం చేప. **తోకతాడు** వి. మోటబొక్కెన తొండానికి కట్టినతాడు. **తోకతాపీ** వి. కొయ్యతో చేసిన తాపీ. **తోకతెగకోయు** అ.క్రి. **1**. అవమానించు ; **2**. శాస్తి చేసి పంపించు. **తోకతెగిననక్క** వి. అవమానపడి లేదా నష్టపడి తనకేదో లాభమని వ్యాఖ్యానించే జిత్తులమారి. **తోకతెవులు** వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించి పోయే జబ్బు. **తోకతొటారము** వి. ఎడతెగని ఒకే ఒక వరుస. **తోకత్రెంచుకొనిపారిపోవు** అ.క్రి. ముందు వెనక చూడక పరిగెత్తు. **తోకదూలం** వి. గుజ్జు కొమెర మీది చిన్న దూలం. **తోకనాగలి** వి. నాగలి తలకు రంధ్రం గొట్టి దానిలో మేడిదూర్చి కట్టిన మెట్టనాగలి. **తోకపక్క** వి. గూనచివరి సన్నటి భాగం. **తోకపట్టి** రూ. తోకపట్టె. వి. రాట్నం అడ్డపట్టె. **తోకపట్టె** రూ.చూ. తోకపట్టి. వి. రాట్నం అడ్డపట్టె. **తోకపడస** వి. కిందిపొడుగాటి కాడగలపిడస. **తోకపీకు** అ.క్రి. పిరికితనంతో పరుగెత్తిపోవు. **తోకపీకుళ్లు** వి.బ.వ. ప్లేగు మొదలైన అంటురోగాలు. **తోకపీకు** అ.క్రి. పారిపోవు. **తోకపెంకు** వి. ముందువైపు వెడల్పుకన్న వెనక వైపు వెడల్పు తక్కువగా తీర్చి చేసినట్టి పెంకు. **తోకపేను** వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించి పోయే జబ్బు. **తోకబట్టీ** వి. చుట్టూ పొయ్యలుండే ఇటికబట్టీ. **తోకబండి** వి. రెండు నొగలబండి. **తోకబుడుమ** వి. మెట్టవడ్లలో ఒకరకం. **తోకబొమ్మ** వి. రాట్నం పీటకు ఎడమ వైపున కదురు బిగించే నిలువు కొయ్య. **తోకమట్ట** వి. తోకకింద నాగు పడిగె మాదిరి ఉండేసుడి. **తోకముడచు** అ.క్రి. పారిపోవు. **తోకమాద** వి. తోకచివర ఏర్పడే పుట్టరణం. **తోకమిరియము** వి. మందుల్లో వాడే చలవ మిరియాలుకాసే ఒకతీగ (Piper cubeba). **తోకముడుచు** అ.క్రి. పారిపోవు. **తోకమేడి** వి. సోగ అమర్చ కుండానే పట్టుకోటానికి వీలుగా చివర వంపు తిరిగిన మేడి. **తోకమొండి** వి. తోకమొదట పైన ఉండే సుడి. **తోకమొల** వి. ఊడ్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం. **తోకరాయి** వి. **1**. ఊడ్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలోపాతిన గూటం ; **2**. కోపురాయి. **తోకరౌతు** వి. కాపురాయి. **తోకర్ర** వి. మిడిగూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డు రాకుండా, తగిలించటానికి పాతిన గూటం. **తోకవడ్లు** రూ. తోకొడ్లు. వి.బ.వ. చెన్నంగులనే పేరుగల ముళ్ళవడ్లు. **తోకసద్ద** వి. ఒకరకం సజ్జ. **తోకసన్నం** వి. రెండోపంటకు వేసే ఒకరకం వడ్లు. **తోకసుడి** వి. తోకమీద జెర్రిమాదిరిగా పొడుగ్గా ఉండే సుడి. **తోకసొంగ** వి. పొగపీల్చే మట్టిగొట్టం. **తోకాకు** వి. సన్నగా పొడుగ్గా ఉండే పొగాకు. < తోక + ఆకు. **తోకాడించు** స.క్రి. చిలిపిచేష్టలు చేయు. < తోక + ఆడించు. **తోకెత్తు** అ.క్రి. **1**. పారిపోవు ; **2**. ఎదిరించు. < తోక + ఎత్తు. **తోకొడ్లు** రూ.చూ. తోకవడ్లు. వి.బ.వ. చెన్నంగులనే పేరుగల ముళ్ళవడ్లు. **తోకొయ్య** వి. మిడి గూటానికి వేసిన నేతమోకు, పడుక్కు అడ్డు రాకుండా, తగిలించటానికి పాతిన గూటం. < తోక + కొయ్య. **తోగ్గుడిసి** రూ.చూ. తోకగొడసె. వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించి పోవటం. **తోగ్గుడిసె** రూ.చూ. తోకగొడిసె. వి. తోకచివర వెంట్రుకలు రాలి గొడ్డు కృశించి పోవటం. **తోగ్గూటం** రూ.చూ. తోకగూటం. వి ఊడ్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన ఇనప గూటం.

**తోకం** రూ.చూ. తవ్వకము. వి. మిరప, జొన్న మొ. తోటల్లో గడ్డిగాదం పోవటానికి, భూమిగుల్లగా ఉండటానికి పారతో తవ్వటం.

**తోకనము** వి. వందనమాలిక, వృక్షవిశేషం.

**తోకాకు** చూ. తోక.

**తోకాడించు** చూ. తోక.

**తోకుగుండు** రూ.చూ. తూఁగుగుండు. వి. తాపీ పనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం.

**తోకెత్తు** చూ. తోక.

**తోకొడ్లు** చూ. తోక.

**తోకొను** చూ. తోడు[1].

**తోకొయ్య** చూ. తోక.

**తోకోజి** వి. రాగిపనివాడు.

**తోగు[1]** చూ. తోఁగు. వి. కొండలనుంచి నిరంతరం పారేవాగు.

**తోగు[2]** స.క్రి. తొలచటం.

**తోగ్గుడిసి** చూ. తోక.

తోగ్గడిసె చూ. తోఁక.
తోగ్గాటం చూ. తోఁక.
తోంకప్రువ్వులు వి.బ.వ. తోకపురుగులు, నెల్లూరి శాసనాలు. ఉదయగిరి శాసనం. క్రీ.శ. 1252. < తోంక(> తోఁక) + పుర్వులు.
తోఁక రూ. తొంక, తోక. వి. పశుపక్ష్యాదుల పుచ్ఛం, వాలం. భార. ఆది. 8.274.

క. తోకె. తోక, వేలాడేది ; తు. తోకె, తోకెలు. ఏట వాలు ; త. తోకై. తోక, పైటచెంగు మొ. ; మ. తోక. వేలాడేది, తోక ; గోం. తోకార్, తొకా, తోకొర్ ; కొం. తోక ; పర్జి. తోక ; కొలా. తొకె ; నా. తోక ; పో.చూ.క. సోగె.

తోఁకకచ్ఛడము వి. తోకలాగ వేలాడే కొసగల గోచి. పండి.చ. 5.344. తోఁకకప్ప వి. తోకఉన్నకప్ప. తోఁకకోసి సున్నముపెట్టు అ.క్రి. శాస్తిచేయు, ఉద్వాసన చెప్పు. తోఁక గుంజ రూ. తోకగుంజ. వి. అదోకగా ఏర్పడిన స్తంభం. తోఁకచాలు వి. తోకలాగ ఉండే నాగటిచాలు. తోఁకచిచ్చు వి. 1. తోకలాగ దీర్ఘంగా వ్యాపించి ఉండే నిప్పు. మను. 1.37 ; 2. నిప్పులు తగిలించిన పిడకల వరస. తోఁక చుక్క వి. జ్వాలామయమైన తోకఉన్న చుక్క, ధూమ కేతువు. ఉ.హరి. 1.153. తోఁకద్రొక్కిన మహాహి (-త్రొక్కినమహాహి) వి. కోపోద్రిక్తుడైనవాఁడు. చెన్న బసవ. 5.133. తోఁకద్రొక్కు(-త్రొక్కు) స.క్రి. పరాభ వించు. రంగా.చ. 1.144. తోఁకపీఁకుడు వి. తోకపీకు తున్నట్లు వెనక్కులాగటం, వెనుదీయటం. తోఁకపీఁకుడు గాఁడు వి. వ్యవహారం తెమలనీయకుండా చిక్కులుపెట్టే వాడు. తోఁకపీఁకుడువ్యవహారము వి. ఎప్పటికి తెమలక చిక్కులు పెడుతుండే విషయం. తోఁకపురుగు రూ.చూ. తోఁకపుర్వు. వి. తోకఉన్న పురుగు. తోఁకపురువు రూ.చూ. తోఁకపుర్వు. వి. తోకఉన్న క్రిమివిశేషం. తోఁకపుర్వు రూ. తోఁకపురుగు, తోఁకపురువు. వి. తోకగల క్రిమివిశేషం. హరి. ఉ. 6.145. తోఁకమిరియము రూ. తోఁకమిరెము. వి. తోకవంటి ముల్లుగల మిరియం, చలువ మిరియం. తోఁక మిరెము రూ.చూ. తోఁకమిరియము. వి. తోకవంటిముల్లు గల మిరియం, చలువ మిరియం. తోఁకముడుచు అ.క్రి. వెనుకకు తగ్గు.
తోఁగఁదోఁచు చూ. తోఁగు.
తోఁగించు చూ. తోఁగు.
తోఁగు రూ. దోఁగు[1]. అ.క్రి. 1. తడియు, ఆర్ద్రమగు. భార. విరా. 2.156 ; 2. మునుగు, స్నానంచేయు. భార. అను. 4.242 ; 3. మిశ్రమగు, కూడు, కలియు. శృం.నై. 2.51 ; 4. స్రవించు, కారు. దశా. 4.47.

క. తుయ్, తొయ్, తొయ్య. తడియు, చెమ్మగిలు, తొయిసు, తొయ్యిసు, తోయిసు, తడియు, నీటిలో తడుపు, తొయ్యువికె. తడపు, తో, తోయు. తడియు, మునుగు, తోకుళి. మునుగు ; తు. తొఇపుని, తొయిపుని, తోయిపుని. ఉతుకు ; త. తోయ్ (తోయ్వ్-, తోయ్న్త్-). స్నానంచేయు, నీటమునుగు, (తోయ్ప్-, తోయ్-త్త్). మునుగు, తువై ; మ. తోయుక, మునుగు తడియు, తోయ్త్తుక, తువెక్క ; కో. తొయ్-/తొట్ (తొచ్-). బట్టలు శుభ్రంచేయు, తోయ్- (తోచ్-) ; తొ. త్వియ్- (త్విచ్-). బట్టలు శుభ్రంచేయు, త్వియ్- (త్విచ్-). గోం. సూ-సూ. బట్టలయొక్క కొద్ది చెమ్మ ; కుఇ. జోగ. బట్టలు శుభ్రంచేయు, దోప(దోత్-). నీళ్ళ లోకి దుముకు ; కువి. జూ(జూత్త్-) తడియు ; మాల్తో. డుంగ్. మునుగు ; బ్రా. చోస్థ్. రుద్దటం ద్వారా శుభ్రం చేయు ; పో.చూ.త. తువై./పో.చూ.సం. తోయ. నీరు.

< మూ.ద్రా. *తోయ్/*తో- < *దోయ్-/*దో-.

తోఁగఁదోఁచు అ.క్రి. ప్రత్యక్షమగు. కళత్త్వ. 2.56. < తోఁగు + -అ[7] + తోఁచు. తోఁగించు స.క్రి. ముంచు. రామాభ్యు. 7.170. < తోఁగు + -ఇంచు[3].
తోచిడులు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146.
తోజు రూ.చూ. తోడు[1]. వి. 1. సహాయం, తోడ్పాటు ; 2. తేలిక.
తోఁచ చూ. తోటి. వి. మాలవాడు, చండాలుడు. ఆం.భా. 2.289.
తోఁచిగాఁడు రూ. తోనికాఁడు, తోనిగాఁడు. వి. శ్యేనవిశేషం, ఒకజాతి డేగ, మను. 4.58.
తోఁచు[1] అ.క్రి. 1. నేత్రగోచరమగు, కనబడు, అగపడు. భార. ఆది. 2.200 ; 2. (గ్రహనక్షత్రాదులు) ఉదయించు, పొడుచు. భార. ఆది. 5.207 ; 3. గోచరమగు. కు.సం. 6.77 ; 4. వచ్చు. భార. ఉద్యో. 3.362 ; 5. (మనస్సును) కట్టు, స్ఫురించు, జ్ఞప్తికి వచ్చు. భార. భీష్మ. 3.156 ; 6. ప్రకటితమగు, బయలుపడు. భార. ద్రోణ. 4.289 ; 7. పుట్టు, అవతరించు, కలుగు. భార. ద్రోణ. 5.128 ; 8. మనోగోచరమగు, మనస్సుకు పొడగట్టు. భార. శాంతి. 3.52 ; 9. శ్రవణగోచరమగు. వినపడు. శృం.నై. 2.58 ; 10. (దేవతాదులు) ప్రత్యక్షమగు, సాక్షాత్కరించు. ఆము. 4.11.

క. తోఱ్ (తోఱ్జ్-), తోఱు (తోఱి-). కనపడు, గోచరమగు, తొఱిసు. కనపడు, తోఱిసువికె. కనబరచ టం, తోఱు. కనబరుచు, తోచు. కనపడు ; తు. తోజుని, సోజుని. కనపడు, తోజావుని, ప్రదర్శించు, తొరికె, తొరిగె, సోరికె. సాక్షాత్కారం, ప్రదర్శన ; త. తోన్ఱు (తోన్ఱి-), తోఱ్ఱు (తోఱ్ఱి-). కనపడు ; మ. తోన్నుక. కనపడు, మొలుచు, తోన్నల్. ఊహాశక్తి, సూచన ; కో. తొర్- (తొర్య్-). గోచరమగు, తొగ్ (తొగ్య్-). సహజజ్ఞానం కలుగు (వ్యక్తులకి) ; తొ. త్విల్- (త్విద్-) త్విత్- (త్యిత్య్-). ముందు చూపు, దూరదృష్టి, త్విఱ్- (త్విఱ్య్-). గోచరమగు ; గోం. తొహానా. కనపడు ; కొం. తోఱ్ఞా ; కుఇ. తోన్జ (తోన్జి-), తోమ్ప(తోమ్పి-). కనపడు, తోస్ప(తోస్త్-) ; కువి. తొన్జఐయలి. కనపడు, తోన్జ్. కనపడు. తోస్పలి, తోస్స. ప్రదర్శించు, తోన్జినై. అగపడు, తుహ్నై. కన పడుచున్న ; పర్జి. తోన్డ్. కనపడు, టోటిప్- (టోటిత్-). ప్రదర్శించు. (పో.చూ.త. చుట్టు) ; కొలా. తొత్, తొత్త్,

తొద్, తొతొతొ, తోత్. లేకపోవు; నా. తోత్, తోది. తోయి. లేకపోవు; గ. తొన్డ్. కనపడు, తోట్ప్; (తోత్-). ప్రదర్శించు ; ఒల్లా. తోన్డ్.

మూ.ద.ద్రా., మూ.మ.ద్రా. *తోన్త్.

< ప్రా. తెలుగు. *తోన్చ్.

**తోతెంచు**[2] అ.క్రి. **1.** నేత్రగోచరమగు, కనపడు. భార. ఆది. 6.211 ; **2.** (గ్రహాదులు) ఉదయించు, పొడుచు. భార. విరా. 1.12; **3.** వచ్చు. భార. భీష్మ. 3.142; **4.** పుట్టు, కలుగు. భార. శాంతి. 5.627 ; **5.** (దేవతాదులు) ప్రత్యక్షమగు, సాక్షాత్కరించు. భార.ఆరణ్య. 4.226 ; **6.** శ్రవణగోచరమగు, వినపడు. రాజవా. 2.168. < తోఁచు[1] + ఎంచు[2]. **తోఁపడఁగు** అ.క్రి. రూపరు, నశించు. భార.శాంతి. 4.266. < తోఁపు[1] + అడఁగు. **తోఁపిక** వి. తోచటం. క. తోఱికె. కనిపించటం, తోఱు. కనిపించటం, చూపించటం, తోఱువికె, తోర్కె, తోర్పు, తోర్పె. కనిపించటం ; తు. తోరికె, తోరిగె, సోరికె. కనిపించటం, ప్రదర్శనం ; త. తోఱ్ఱమ్. కనపడటం, ప్రత్యక్షమవటం. **తోఁపించు** స.క్రి. తోపచేయు, గోచరింపచేయు. నీతి. 36. < తోఁచు[1] + -ఇంచు[3]. **తోఁపు**[1] వి. **1.** పొడకట్టటం, వ్యక్తమవటం. భార.అను. 1.312 ; **2.** పుట్టుక, జననం. భార.అను. 4.184 ; **3.** తలపు, సంకల్పం. భార.అశ్వ. 1.202.

**తోఁచు**[2] చూ. తోఁగు. స.క్రి. **1.** ముంచు, స్నానంచేయించు. కాశీ. 3.87. హరి.ఉ. 3.144 ; **2.** కలుపు, మిశ్రంచేయు. హర. 4.84 ; **3.** తడుపు, సిక్తంచేయు. ఆము. 5.114.

**తోట** చూ. తోఁడు. రూ. తోణ్ట, తోంట, తోఁట. వి. తోపు. రామేశ్వరం (స్తంభం). క్రీ.శ. 625-650.

క. తోటు, తోంటు. తోట ; తు. తోట ; కొడ. తొట ; త. తోటు, తోట్టమ్ ; మ. తొటి, తొట్టమ్ ; తొ. త్వీట్శ్ (త్వీడ్-) ; కుఇ. టుట ; కువి. తొంత ; గ. తోంటు.

**తోటకంది** వి. తోటల్లో పెంచే ఒకరకం కంది. **తోటకాయ** వి. తోటల్లో పెంచిన దసలి పురుగుల గూళ్ళు. **తోటకొఱ్ఱ** వి. తోటల్లో పెంచే ఒకరకం కొఱ్ర. **తోటగున్నమామిడి** వి. ఒకరకం మామిడి. **తోటదూలగొండి** వి. దడులమీద, పొదలమీద అల్లుకొనే, దురదపెట్టే ఆకులు కలిగిన ఒక తీగ (Mucuna Pruriens). **తోటనిచ్చెన** రూ. తోటిచ్చెన. వి. చెరుకుతోటల్లో గడలపై ఆకులను ముడి వేయడానికి ప్రత్యేకించి వాడే ఒకరకం నిచ్చెన. **తోట పరువుకువచ్చు** అ.క్రి. కాయలు ముదరజొచ్చు. **తోటవోయిన కన్ను (-పోయినకన్ను)** వి. తొఱ్ఱపోయినకన్ను. పండి.చ. 2. 4.108. **తోటాకు** వి. కాడలుగా పెరిగే ఆకుకూర, తోటకూర. < తోట + ఆకు. **తోటిచ్చెన** రూ.చూ. తోటనిచ్చెన. వి. చెరుకుతోటల్లో గడలపై ఆకులుముడి వేయడానికి ప్రత్యేకించి వాడే ఒకరకం నిచ్చెన.

**తోటముంత** వి. మహమ్మదీయుల మసీదులలోనికి ప్రవేశించడానికి ముందు కాళ్ళు చేతులు కడుక్కోడానికి వాడే మట్టి పాత్ర.

**తోటాకు** చూ. తోట.

**తోటి**[1] వి. చండాలుడు, మాలవాడు. జైమినిభా. 8.61.

క. తోటి. పాకీవాడు, పీధులూడ్చేవాడు ; తు. తోటి ; త. తోట్టి ; మ. తోట్టి. ఊడ్చేవాడు ; పర్జి. తోటల్, తోట. కూలిపనివాడు.

**తోటిది** రూ.చూ. తోటీఁడి. విణ. పాకీపనిచేసే స్త్రీ. **తోటి వాఁడు** రూ. తోటీఁడు. విణ. పాకీపనివాడు. **తోటీడు** రూ. చూ. తోటివాఁడు. వి. తోటిపనిచేసేవాడు. **తోటీది** రూ. తోటిది. విణ. దొడ్లు శుభ్రంచేసేది. త. తోట్టిచ్చి. తోట్టిమై. పాకీస్త్రీ ; మ. తోట్టిచ్చి.

**తోటి**[2] చూ. తోడు[1]. వి. **1.** శుభం, మేలు. సిం.ద్వా. 10.101 ; **2** వినోదం, వేడుక.

**తోటికోడలు** చూ. తోడు[1].

**తోటిచ్చెన** చూ. తోట.

**తోటిమాన్యం** చూ. తోడు[1].

**తోటివారు** చూ. తోడు[1].

**తోటీడు** చూ. తోటి[1].

**తోటీది** చూ. తోటి[1].

**తోట్నం** వి. నేతలో నిలువుకు వాడటానికి అనుపోసిన నూలు.

**తోట్నంపోయు** స.క్రి. పడుగునూలు అనుపోయు, పడుగు నూలు జంత్రం మీద వినురు.

**తోడ** చూ. తోడు[1].

**తోడకం** చూ. తోడు[2].

**తోడంగ** రూ.చూ. తోడెంగ. వి. మాగాణిలో పెరిగే కలుపు మొక్క.

**తోడచారి** చూ. తోడు[1].

**తోడంటు** చూ. తోడు[1].

**తోడబడు** రూ.చూ. తొడిఁబడు. అ.క్రి. తొట్రుపడు. భార. శాంతి. 4.420.

**తోడఁబుట్టినది** చూ. తోడు[1].

**తోడఁబుట్టినవాఁడు** చూ. తోడు[1].

**తోడఁబుట్టు** చూ. తోడు[1].

**తోడఁబుట్టుగు** చూ. తోడు[1].

**తోడఁబుట్టువు** చూ. తోడు[1].

**తోడఁబెండ్లికూఁతురు** చూ. తోడు[1].

**తోడఁబెండ్లికొడుకు** చూ. తోడు[1].

**తోడల్లుఁడు** చూ. తోడు[1].

**తోడా** వి. **1.** బిరుదుగా చేతికిగాని, కాలికిగాని తొడిగే భూషా విశేషం. కవిచా.సీ. 7 ; **2.** కాలికి పెట్టుకొనే వెండి నగ.

మరా. తోడా. హస్తభూషా విశేషం, పాదభూష ; హిం. తోడా. హస్తభూషా విశేషం.

< మరా. తోడా.

**తోడి** చూ. తోడు[1]. వి. **1.** సోదరుడు. భార.శాంతి. 5.405 . **2.** ముప్పైరెండు నపుంసక రాగాల్లో ఒకటి. హంస. 124 ; విణ. తోడన్ అనేదాని వృత్తిలోని రూపం. ఉదా. : తోడి కోడలు, తోడియల్లుడు, తోడివాడు.

**తోడిక** చూ. తోడు[1].

**తోడికొను** చూ. తోడు[1].

**తోడికోడలు** చూ. తోడు[1].
**తోడింగబట్టి** చూ. తోడు[1].
**తోడిచూలు** చూ. తోడు[1].
**తోడిజోడగు** చూ. తోడు[1].
**తోడిజోడు** చూ. తోడు[1].
**తోడిడు** చూ. తోడు[1].
**తోడితెచ్చు** చూ. తోడు[1].
**తోడితెప్పించు** చూ. తోడు[1].
**తోడిది** చూ. తోడు[1].
**తోడిదొంగ** చూ. తోడు[1].
**తోడిదొంగలగు** చూ. తోడు[1]
**తోడినీడ** చూ. తోడు[1].
**తోడింద** రూ.చూ. తోడువింద. వి. కొమ్మలు దడి కట్టడానికి ఉపయోగపడే, ముళ్ళు కలిగిన ఒకచెట్టు (Scutia India).
**తోడిపెట్టు** చూ. తోడు[1].
**తోడిపెండ్లాము** చూ. తోడు[1].
**తోడిపొత్తు** చూ. తోడు[1].
**తోడిమ్రుచ్చులు** చూ. తోడు[1].
**తోడియల్లు(డు** చూ. తోడు[1].
**తోడిరువాలు** చూ. తోడు[1].
**తోడివా(డు** చూ. తోడు[1].

**తోడు**[1] రూ. తోజు, దోడు. విశ. 1. సహాయుడు. భార.ఆది. 1.25 ; 2 సహాయురాలు. భాగ. 9.184 ; 3. సమానం, సాటి. శుక. 2.196 ; 4. సహాయం ; క్రి. విశ. ప్రు. సహాయంగా. భార.ఆది. 4.180 ; వి.బొ. 1. సహాయం. భార.ఆది. 5.234 ; దాక్షారామ శాసనం. క్రీ.శ. 1038 ; 2. తోబుట్టువు, సోదరుడు, సోదరి. భాస్క.రా.యు. 1.602 ; వి. 1. ఆన, ఒట్టు. హరి.ఉ. 8.49, భాగ. 10.774 ; 2. చేమిరి, తోడంటు. ఆం.భా. 2.249.

త. తోఴన్. స్నేహితుడు, తోఴి, తోఴిచ్చి. చెలికత్తె. తోఴమై. స్నేహం ; మ. తోఴన్. స్నేహితుడు, తోఴి, ఆప్తస్నేహితుడు, తోఴమ్, తోఴమ. స్నేహం ; గోం. తొడ్, తొర్. తో. సహాయం, తొరతామానవల్. భాగస్తుడు ; కొండ. తొడన్. చిన్నతమ్ముడు ; కుఇ. తోడె. స్నేహితుడు, స్నేహం, తోడు. స్నేహం, తోడెన్జ, తోడెన్జు. స్నేహితుడు ; కువి. తొఞొసి. స్నేహితుడు ; ప. తొలెట్, తొలెడ్. సోదరుడు, తమ్ముడు ; కొలా. తొరెన్. తమ్ముడు, తొర్న్దల్. చెల్లెలు ; నా. తోరెన్. సోదరుడు, తోర్న్దల్. సోదరి ; గ. తొడాన్. తమ్ముడు, తోన్డ్. బంధువు, తోన్డ్న్డ్. సోదరుడు, తోన్డుద్. సోదరి. పో.చూ. త. తుణై. తోడు, సహాయం.

< మూ.మ.ద్రా. *తోట్ ; మూ.ద.ద్రా. *తోట్.

**తోకొను** రూ.చూ. తోడ్కొను. స.క్రి. వెంటగొను, కూడగొను. భార. అరణ్య. 3.220. **తోటికోడలు** రూ.చూ. తోడికోడలు. వి. మగని సోదరుని భార్య. **తోటిమాన్యం** వి. చెరువు నీరు పొలాలకు పంపకం చేసే వాడికి ఇచ్చిన భూమి. **తోటివారు** విశ.బ వ. 1. సహాయకులు, తోడుగా ఉండేవాళ్ళు ; 2. సాటివాళ్ళు, సమానమైన వాళ్ళు. **తోడ** రూ.చూ. తోఁన్. ప్రత్య.ప్రు. తృతీయా విభక్తి ప్రత్యయం. 1. కూడు, తోడుత, సహార్థకం. భార ఆది. 1.9. కురుబల కోట శాసనం. క్రీ.శ. 842–892 ; 2. సహార్థకం. ఈ అర్థంలో ఇది కొన్ని ప్రయోగాల్లో సముచ్చయ పూర్వకమై వ్యవహితంగా కన్పిస్తోంది. భార.ఆది. 4.216 ; 3. నియమ పూర్వక విద్యా స్వీకారంలో గురువాచక శబ్దాలకు అను ప్రయుక్తం. భార.ఆది. 5.121 ; 4. 'మీద' అనే అర్థాన్నిస్తుంది. కు.సం. 2.58 ; 5. దేశ కాలాల్లో, అవ్యవహితంగా, వెనువెంట, శీఘ్రంగా. భాస్క రా.యు. 810 ; 6. వలన, ఉండి, అపాదాన పంచమ్యర్థకం. కవిక. 2.60. **తోడచారి** వి. ఉపగాయకుడు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 80. సం. చారిన్. చరించేవాడు. < తోడు[1] + -అ + సం. చారిన్. **తోడంటు** వి. చేమిరి, కాగిన పాలు పెరుగుగా మారటానికి కలిపే మజ్జిగ. సిం.ద్వా. 1.26. < తోడు[1] + అంటు. **తోడ(బుట్టినది(-పుట్టినది)** రూ. తోఁబుట్టినది. వి. సోదరి, భగిని. ఆం.భా. 2.113. **తోడ(బుట్టినవా(డు (-పుట్టినవా(డు)** రూ.చూ. తోఁబుట్టినవాఁడు. విశ. సోదరుడు. భాగ. 10 పూ. 1777. **తోడ(బుట్టు(పుట్టు)** రూ.చూ. తోడఁబుట్టువు. వి. సోదరి, భగిని. రాజవా. 3.8. **తోడ(బుట్టుగు(-పుట్టుగు)** రూ.చూ. తోడఁబుట్టువు. వి. సోదరి. యయా. 3.107. **తోడ(బుట్టువు** రూ. తోడఁబుట్టు, తోడఁబుట్టుగు, తోఁబుట్టు, తోఁబుట్టుగు, తోఁబుట్టువు. వి. సోదరి, భగిని, సహజ. భార.భీష్మ. 3.107. **తోడ(బెండ్లికూ(తురు(-పెండ్లికూ(తురు)** వి. తోటిపెళ్ళికూతురు, పెళ్ళికూతురుకు తోడుగా చేయబడే చిన్నపెళ్ళికూతురు. లాళ్ళ. సం. 13.55. **తోడ(బెండ్లికొడుకు(-పెండ్లికొడుకు)** వి. పెళ్ళికొడుకు సాయంగా ఉండే చిన్నపెళ్ళికొడుకు. **తోడల్లు(డు** రూ.చూ. తోడియల్లుఁడు. వి. భార్యకు అక్క లేక చెల్లెలి భర్త, జగిలెడు. < తోడు[1] + అల్లుఁడు. **తోడిక** వి. జంటైనది. ఉద్భటా. 2.174, **తోడికొను** రూ.చూ. తోడ్కొను. స.క్రి. తోడ్కొను. **తోడికోడలు** రూ. తోటికోడలు. వి. మగని సోదరుని భార్య, యాత. శృం.నై. 7.9. **తోడింగబట్టి** వి. సుమారు అయిదారువేల ఇటికలను ఒక్కసారి కాల్చే బట్టి. **తోడిచూలు** వి. తోబుట్టువు. భాగ. 10.1592. **తోడిజోడగు** అ.క్రి. సమానమగు. కాశీ. 2.70. < తోడిజోడు + అగు. **తోడిజోడు** విశ. సమానుడైన, జతకాడైన. కాశీ. 4.79. **తోడిడు** స.క్రి. సేద్యపు పనుల్లో మనుషులతోగాని, పశువులతోగాని ఒకరికి ఒకరు సహాయం చేసుకొను ; అ.క్రి. ఎదురుపోవు. < తోడు[1] + ఇడు. **తోడితెచ్చు** రూ.చూ. తోడ్తెచ్చు. స.క్రి. 1. వెంటగొని తెచ్చు, కొనివచ్చు. భార.విరా. 4.68 ; 2. బంధించి తెచ్చు. విజ్ఞా. ప్రా. 99. **తోడితెప్పించు** స.క్రి. వెంటగొని వచ్చేటట్లుచేయు, రప్పించు. భాగ. 10 ఉ. 96. < తోడితెచ్చు + -ఇంచు[3]. **తోడిది** విశ. 1. జోలి, ప్రసక్తి. భార. ఆది. 3.148 ; 2. సంబంధించిన. గాడియా శాసనం. క్రీ.శ. 1097 ; 3. సమమైనది. భార.విరా. 2.338 ; 4. అవినాభావ సంబంధం కలది, ఎల్లప్పుడు కూడా ఉండేది. భార.ద్రోణ. 2.143 ; 5. ఒకదానికి అనుగుణంగా

ఉండేది, ఒకదాన్ని బట్టి వచ్చేది. భార.శాంతి. 5.396 ; 6. విడవకుండా ఒకదాని వెంట వచ్చేది. భార.అను. 5.230. **తోడిదొంగ** వి. సహతస్కరుడు, ఇతరులతో కూడి దొంగతనం చేసేవాడు. ప్రభా. 5.81. **తోడిదొంగలగు** అ.క్రి. తప్పుడు పనిలో భాగస్వాములగు. <తోడి దొంగ + -లు + అగు. **తోడినీడ** రూ. తోడునీడ. వి. 1. అంటిపెట్టుకొని వదలకుండా ఉండేది. సహచరురాలు, సహచరుడు, సహచరం. కు.సం. 5.123 ; 2. సహాయం, రక్షకం. యయా. 3.151 ; 3. ఈడు, సాటి, సమానం ; వి. వస్తువుతో కూడి ఉండే ఛాయ. భార.భీష్మ. 2.262. **తోడిపెండ్లాము** వి. ఏరాలు, సవతాలు, సవతి. **తోడిపొత్తు** వి. సహపానం, మైత్రి. భార.ఆది. 2.21. **తోడిమ్రుచ్చులు** వి.బ.వ. తోడుదొంగలు. భాస్క. రా. యు. 313. **తోడియల్లుఁడు(-అల్లుడు)** రూ. తోడల్లుఁడు. వి. భార్యకు అక్క లేక చెల్లెలి భర్త, జగిలెడు. ఆం.నా.శే. 47. **తోడిరువాలు** వి. ఇరవాలు తరువాత దున్నే చాలు. <తోడు[1] + ఇరువాలు. **తోడివాఁడు** విణ. 1. కూడా ఉండే వాడు. శృం.నై. 3.67 ; 2. తుల్యుడు, సమానుడు. కాశీ. 4.91. **తోడుకొను** రూ.చూ. తోడ్కొను. స.క్రి. 1. కూడా గొను, వెంట బెట్టుకొను. భార.ఆది. 8.198 ; 2. పిలుచు కొను. రుక్మా.చ. 3.188 ; 3. ఎక్కువ బాధ పొందు ; అ.క్రి. పేరుకొను, గడ్డకట్టు. **తోడుచల్ల** వి. చేమిరి పెట్టే మజ్జిగ, తోడుమజ్జిగ. **తోడుజోడు** వి. సహచరుడు, మిత్రం. భీమ. 1.31. **తోడుత** రూ. తోడ్త. ప్రత్య.ద్రు. తృతీయా విభక్తి ప్రత్యయం, తోడ. భార.విరా. 1.118 ; క్రి.విణ. ద్రు. వెంబడి, వెంట. చంద్రాంగ. 4.171. **తోడుతో** రూ.చూ తోడ్తో. క్రి.విణ.ద్రు. 1. వెంబడి, వెనువెంట, శీఘ్రంగా భార.భీష్మ. 3.103 ; 2. మొదట, తొల్త. **తోడుతోడ** రూ. తోడ్తోడ. క్రి.విణ.ద్రు. 1. క్రమక్రమంగా, వరుసగా. భార.విరా. 2.319 ; 2. వెనువెంట, శీఘ్రంగా. భార.శల్య. 1.212. **తోడుతోడుత** క్రి.విణ.ద్రు. వెను వెంటనే, అతి శీఘ్రంగా. భార.భీష్మ. 2.117. **తోడుదొంగ** వి. ఒక దొంగతో ఉండే మరొక దొంగ. రాధా. 1.94. **తోడుదోన** వి. సహాయుడు. తొనదాల్పు, సహాయుడు. భార. ఉద్యో. 3.450. **తోడుదోనయగు (-అగు)** అ.క్రి. తోడునీడగు. జైమిని భా. 4.105. **తోడునీడ** రూ.చూ. తోడినీడ. వి. వస్తువుతో కూడిఉండే ఛాయ. భార. ఉద్యో. 3.182 ; విణ. 1. ఈడు, సాటి, సమానం. శివరా. 4.14 ; 2. అంటిపెట్టుకొని వదలకుండా ఉండేది, సహచరురాలు, సహచరుడు, సహచరం. వరాహ. 1.39 ; 3. సహాయం, రక్షకం. కళా. 8.234. **తోడుపట్ట** వి. త్వక్కు, చర్మం. **తోడుపడు** రూ. తోడువడు, తోడ్పడు. అ.క్రి. సహాయమగు, సాయపడు. భార. భీష్మ. 2.37. **తోడుపాటు** రూ.చూ. తోడ్పాటు. వి. 1. తోడుపడటం, సహాయపడటం, సహాయం. భార. ద్రోణ. 4.270 ; 2. అండ. భార. శల్య. 1.258. **తోడుపాయసము** వి. అనుకుగా వండిన పరమాన్నం. **తోడుపెట్టు** రూ. తోడువెట్టు. స.క్రి. 1. సహాయంగా ఇచ్చు, తోడుగా చేయు. పి. శకు. 5.73 ; 2. చేమిరిపెట్టు. **తోడుఁబాలు (-పాలు)** వి. 1. పాలుపితికే టప్పుడు ముందు పాలముంతలో పోసి ఉంచే నీళ్ళు ; 2. జున్నుచేయటానికి ముర్రుపాలకు చేర్చేమామూలు పాలు. **తోడుఁబోతు (-పోతు)** వి. తోడుదొంగ. **తోడుఁబోతుచేయు** స.క్రి. మంత్రాలు ద్వారా ఎదుటి వాళ్ళకి కీడుచేయు. **తోడుఁబోవు (-పోవు)** రూ.చూ. తోడువోవు. అ.క్రి. సమాన మగు. వేంక. పంచ. 4.516. **తోడులేనివాఁడు** విణ. అసహా యుడు. **తోడువచ్చు** అ.క్రి. సహాయంగావచ్చు, సాయపడు. భాస్క. రా. అరణ్య. 2.21. **తోడువడు (-పడు)** రూ.చూ. తోడుపడు. అ.క్రి. సహాయమగు, సాయపడు. భార. ద్రోణ. 4.106. **తోడువెట్టు (-పెట్టు)** రూ.చూ. తోడుపెట్టు. స.క్రి. 1. సహాయంగా ఇచ్చు, తోడుగా చేయు ; 2. చేమిరిపెట్టు. **తోడువోవు (-పోవు)** రూ. తోడుఁబోవు. అ.క్రి. 1. తోడుగా వెళ్ళు, సాయపడు. వేంక. పంచ. 1.471 ; 2. సమాన మగు, సరిఅగు. ఉ. రా. 4.63. **తోడుసూపు (-చూపు)** అ.క్రి. సాయంపడు, సహాయమగు. భార. ఉద్యో. 1.220 ; స.క్రి. వ్యాపింప చేయు. శృం. నై. 8.18. **తోడెంగ** రూ. తూనంగి, తోడంగ. వి. మాగాణిలో పెరిగే కలుపుమొక్క. **తోడెనమారు** వి. ఇరవాలు తరవాత దున్నిన చాలు. <తోడు[1] + ఎనమాలు. **తోడ్కొను** రూ. తొడికొను, తొడు కొను[2], తోకొను, తోడికొను, తోడుకొను. స.క్రి. కూడుగొను, వెంటపెట్టుకొను. భార. ఆది. 1.65 ; అ.క్రి. పేరుకొను, గడ్డకట్టు. **తోడ్త** రూ.చూ. తోడుత. క్రి. విణ. ద్రు. వెంబడి, వెంట. చంద్రికా. 1.104 ; ప్రత్య. ద్రు. తృతీయావిభక్తి ప్రత్యయం, తోడ. **తోడ్తెచ్చు** రూ. తోడితెచ్చు, తోతెచ్చు, తోతెంచు[1]. స.క్రి. కూడాతెచ్చు. వెంటబెట్టుకొనివచ్చు. కు.సం. 5.130. **తోడ్తో** రూ. తోడుతో. క్రి. విణ. ద్రు. 1. వెంబడి, వెనువెంట, శీఘ్రంగా. భార.ఆది. 4.151 ; 2. మొదట, తొల్త. **తోడ్తోడ** రూ. చూ. తోడు తోడ ; క్రి. విణ. ద్రు. 1. వెనువెంట, శీఘ్రంగా. విజయ. 1.129 ; 2. క్రమక్రమంగా, వరుసగా. **తోడ్పడు** రూ.చూ. తోడుపడు. అ. క్రి. సహాయమగు, సాయపడు. **తోడ్పాటు** రూ. తోడుపాటు, తోపాటు. వి. తోడుపడటం, సాయపడటం, సహాయం. భార. ఉద్యో. 2.289. **తోడ్పాటుమేకొను** అ.క్రి. సహాయం చేయు. రం. రా. బాల. వు. 20పం. 7. **తోతెచ్చు** రూ. చూ. తోడ్తెచ్చు. స.క్రి. 1. వెంటకొనివచ్చు, కొనివచ్చు. రం. రా. కిష్కిం ; 2. తీసుకొని వచ్చు. ఉద్భటా. 2.216. **తోతెంచు[1]** రూ.చూ. తోడ్తెచ్చు. స.క్రి. వెంటగొనివచ్చు. శృం. నై. 5.101. **తోపాటు** రూ.చూ. తోడ్పాటు. క్రి. విణ. సహార్థకం, తోడుత, సాయం. బ్రహ్మో. 2.290 ; అవ్య. 1. వలె ; 2. కూడ.

**తోడు[2]** రూ.చూ. తోఁడు. స.క్రి. 1. నూయి మొ. వాటినుంచి నీళ్ళు మొ. పైకితీయు. భీమ. 4.24 ; 2. స్నానానికి నీళ్ళు సిద్ధంచేయు ; 3. పట్టెకుగాని డబ్బాకు గాని నూలుచుట్టు.

**తోడకం** వి. తవ్వకం. **తోడిపెట్టు** స.క్రి. లాభం కలుగ జేయు. **తోడుకూలి** వి. ఆసుపోసేందుకు ఇచ్చేకూలి. **తోడుగోల (-కోల)** వి. పట్టుదారం, పట్టెకు చుట్టటానికి

చిలప తగిలించే కఱ్ఱ. **తోఁడుగ్గోలు** రూ.చూ. తొడగోలు. వి. సారెమీఁదున్న మట్టిముద్దను కోలుపట్టిన తర్వాత గుండుగ కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం. **తోఁడుచేట** వి. కళ్ళంలో రైతుకు తోడుగా కాపలి కాచిన మాదిగ వాడికి మామూలుగా ఇచ్చే చేటెడుగింజలు. **తోఁడుడుపట్టె** వి. పంటెకు నూలు చుట్టటానికి, చేత్తోతిప్పే కాముకు ఊనికగా తొడమీఁద పట్టుకొనేకఱ్ఱ. **తోఁడుతపిల** రూ.చూ. తోడు తపెల. వి. నీళ్ళుపోసుకోడానికి వాడేచిన్న పాత్ర. **తోఁడుతపెల** రూ. తోడుతపిల. వి. నీళ్ళుపోసుకొనే లోటావంటి పాత్ర. **తోఁడుపుల్ల** రూ. తోడుబుల్ల. వి. అను పోసేగొట్టం. **తోఁడుబుడ్డి** వి. తోడుకు వాడే మజ్జిగను పెట్టు కోడానికి వాడే చిన్నమట్టి బుడిగె. **తోఁడుబుల్ల** రూ.చూ. తోడుపుల్ల. వి. అనుపోసే గొట్టం. **తోఁడుబోతు** రూ.చూ. తోఁడుఁబోతు. వి. క్షుద్రోపాసనలతో, పంపుచేసి మనుష్యుల్ని చంపేవాడు. **తోఁడుఁబోతు** రూ. తోడుబోతు. వి. క్షుద్రోపాసనలతో పంపుచేసి మనుష్యుల్ని చంపేవాడు. **తోఁడువాయ** వి. అనుపోసిన తరవాత, సరిచెయ్యటానికి ఊడ్తెలకు తగిలించిన పట్టుపడుగు.

**తోఁడువింద** రూ. తోడింద. వి. కొమ్మలు దళ్ళుకట్టడానికి ఉపయోగపడే ముళ్ళు కలిగిన ఒకచెట్టు (Scutia indica).

**తోఁడెంగ** చూ. తోడు[1].

**తోఁడెనమారు** చూ. తోడు[1].

**తోఁడెము**[1] వి. గానరూపంలోని నాందీస్తుతి, మంగళగాన విశేషం. మల్లుపు. 4.63.

త. తోడయమ్.

**తోఁడెము**[2] రూ. తోలెము, తోళెము. విణ. స్వల్పమైన. ఆం. భా. 3.16 ; వి. కొంచెం, లేశం.

అప. థోఅడ, థోట. కొంచెం ; బెం. ఒ. హిం. పం. థోడా ; గు. థోడూ ; నే. థోర ; సిం. థోరో.

**తోఁడ్కొను** చూ. తోడు[1].

**తోఁడ్త** చూ. తోడు[1].

**తోఁడ్తెచ్చు** చూ. తోడు[1].

**తోఁడ్తో** చూ. తోడు[1].

**తోఁడ్తోడ** చూ. తోడు[1].

**తోఁడ్పడు** చూ. తోడు[1].

**తోఁడ్పాటు** చూ. తోడు[1].

**తోఁడ్పాటుమేకొను** చూ. తోడు[1].

**తోణఁగి** వి. తృణవిశేషం. ప్రబంధ. 200.

**తోణము** వి. చాపకర్షణ బలసాధనం. ఆం. భా. 2.212.

**తోంట** రూ.చూ. తోట. వి. తోట. విప్పర్లశాసనం. క్రీ.శ. 641.

**తోంటకొఱడి** వి. తోటకోరడి, తోటచుట్టు ఆవరణగా వేసిన మట్టిగోడ. ద. హిం.శా. సంపు. 4. శా.సం. 1114. **తోంటగాదము** వి. మెట్ట, మెరకస్థానం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1303. **తోంటజీతము** వి. తోట కాపున్నందుకు ఇచ్చే జీతం లేక కూలి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 534, క్రీ.శ. 1324. **తోంటనూయి** వి. తోటబావి. కందుకూరు శాసనం. నం. 22. క్రీ.శ. 1237. **తోంటపట్టు** వి. తోటభూమి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1188. క్రీ.శ. 1250. **తోంటపరీక్ష** వి. తోటపై అధికారి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 975. క్రీ.శ. 1288, **తోంటపళ్లు** వి. తోటభూమి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1248. క్రీ.శ. 1112. **తోంటబంటు** వి. తోటమాలి. ద.హిం. శా. సంపు. 5 శా.సం. 34. క్రీ.శ. 1434. **తోంటబసువు** (-పసువు) వి. తోటమాలి. ద.హిం.శా. సంపు. 6 శా.సం: 972. క్రీ.శ. 1383. **తోంటవాండు** రూ.చూ. తోఁటవాఁడు. విణ. తోటపనిచేసేవాడు. నెల్లూరి శాసనాలు. రాపూర్ శాసనం. శా.సం. 47. క్రీ.శ. 1311. **తోంటసుంకము** వి. తోటభూమిపై విధింపబడేపన్ను. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 530. క్రీ.శ. 1320. **తోంటోత్సవము** వి. వనమహోత్సవం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1245. క్రీ.శ. 1263. < తోంట + ఉత్సవము.

**తోణ్ట** రూ.చూ. తోట. వి. తోట. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1016. క్రీ.శ. 1087.

**తోంటోత్సవము** చూ. తోంట.

**తోఁట** రూ.చూ. తోట. వి. **1.** ఉపవనం, పెంపుడువనం. భీమ. 1.95 ; **2.** ఉద్యానవనం. విక్ర. 5.8 ; **3.** గృహారామం, నిష్కుటం, ఇంటిని చేరిఉండే తోట. కళా. 2.47 ; **4.** తపోవనం, ఆశ్రమం. యయా. 2.50 ; **5.** ఎక్కువగా బావినీరు మొ. వాటితో సాగుచేసే నేల.

**తోఁటకాఁపు** వి. తోటమాలి, వనపాలకుడు. **తోఁటకూర** రూ. తోటకూర. వి. ఒకజాతి కూరమొక్క, మారిషం. పి.శకు. 4.48 (Amorantus). **తోఁటగొల్లఁడు** వి. వనపాలకుడు, తోటమాలి. పి.శకు. 3.3. **తోఁటపాల** వి. ఆరామ జీవని, తోటలో పనిచేసి బతికే స్త్రీ. **తోఁటపోఁక** వి. ఒకజాతి పోక, భూ పూగం. **తోఁటమాలి** వి. తోటకాచేవాడు, వనపాలకుడు. **తోఁటమాలియ** రూ.చూ. తోమాలె. వి. ఆకులు పువ్వులు కూర్చి కట్టిన దండ, వనమాల. **తోఁటమాలె** రూ.చూ. తోమాలె. వి. ఆకులు పువ్వులు కూర్చి కట్టిన దండ, వనమాల. **తోఁటమొల్ల** వి. కుందం. త.తోట్టముల్లై. తోటమొల్ల. **తోఁటవాడు** రూ. తోంటవాఁడు. విణ. తోటమాలి, తోటకాచేవాడు, వనపాలకుడు. భార. శాంతి. 2.300.

క. తోటగాఱ, తోటిగ, తోణ్టిగ ; త. తోట్టక్కారన్ ; మ. తోట్టక్కారన్. **తోఁటీఁడు** వి. తోటకాచేవాఁడు, వనపాలకుడు. క. తోటగాఱ, తోటిగ, తోణ్టిగ ; త. తోట్టక్కారణ్ ; మ. తోట్టక్కారన్.

**తోఁటా** వి. ఒకరకం మందు సామాను.

హిం. తోటా. తుపాకిగుండు.

**తోఁటీఁడు** చూ. తోఁట.

**తోఁడి** చూ. తోఁడు.

**తోఁడు** రూ. తోడు[2]. స.క్రి. **1.** ఉత్పాటనంచేయు, పెరుకు. భీమ. 6.99 ; **2.** (వడికిన నూలు) పంటెకఱ్ఱ మొ. వాటికి చుట్టు. హంస. 2.22 ; **3.** ఉద్ధరణంచేయు, (నీళ్ళు) పైకి తీయు, చేదు ; **4.** బలాత్కారంగా అపహరించు ; **5.** అన్నం మొ. వాటిని వేరే పాత్రలోకి గరిటెతో ఉంచు.

క. తోడు. నీళ్ళు మొ. తోడు, తవ్వు ; తు. తోడుని. తవ్వు, తోళు. కన్నం, కాళీగాఉన్న, తొల్గుని. లాగు ;

త. తోంటు. తప్పు, తోళ్, తోళ్ళు. తొలుచు, తప్పు, తొలగించు ; మ. తోండుక. పక్కకిలాగు, తొళ్ళి. రంధ్రం ; తొ. త్వీర్. వేళ్ళతో తప్పు ; పర్జి. తోడ్. నీళ్ళు తోడు ; కొలా. తోడ్-(తోజ్-). గొయ్యితవ్వు ; గ. తోండ్. తోడు ; పో.చూ. కుఇ. తుట. తోట.

మూ.ద.ద్రా., మూ.మ.ద్రా. *తోణ్-ట్-<*తోళ్-న్ట్- లేదా. *తొళ్-/*తోణ్- +ట్.

తోఁడి వి. చేదేకుండ. తోఁడుకొను అ.క్రి. చుట్టుకొను, బాధపొందు. తోఁడుడు వి. తోడటం, నూలు వెలిచి చుట్ట టం, తంతునిస్సరణం. ఆం.భా. 2.296. తోఁడు పడుగు వి. పడుగుకోసం అనుమానికి తోడిననూలు. శుక. 2.423. తోఁడుఁబోఁతు(-పోతు) రూ. తోడుబోతు. వి. 1. దయ్యాలపోతు. పంపుచేసేవాడు, అభిచారికుడు, అభి చారకురాలు. నీతి. 49, చంద్రాంగ. 5.104 ; 2. తోడు పోతుతనం, దయ్యాలపెట్టటం, పంపుచేయటం, అభిచార క్రియ.

**తోఁడెలు** రూ.చూ. తోఁడేలు. వి.జా. అడవికుక్క, ఈహా మృగం. మను. 4.50.

**తోఁడేటికడుపుమేటి** చూ. తోఁడేలు.

**తోఁడేలు** రూ. తోఁడెలు. వి.జా. అడవికుక్క, ఈహామృగం. భార. శాంతి. 3.423.

క. తోళ. తోడేలు ; తు. తోళు ; త. తోణ్డాన్, తోండాన్. అడవికుక్క, ఈహామృగం ; బ్రా. తోల. నక్క.

తోఁడేటికడుపుమేటి వి. వృకోదరుడు, భీముడు; తోఁడేలు పురుగు వి. మొదళ్ళలో చేరి వేరుసెనగకాయలు తినే ఒక రకం పురుగు (Aphanus Sordiolus). తోఁడేళ్లకొంగ వి. పెద్దరుప్పి.

**తోఁడేళ్లకొంగ** చూ. తోఁడేలు.

**తోతమామిడి** వి. ఒకరకంమామిడి.

**తోతావరిమామిడి** వి. ఒకరకం మామిడి.

**తోతెచ్చు** చూ. తోడు[1].

**తోతెంచు[1]** చూ. తోడు[1].

**తోతెంచు[2]** చూ. తోఁచు[1].

**తోదు** వి. 1. వరస ; 2. ఒద్దిక.

క. తోదు. సమానం ; త. తోతు. సంబంధం. వీలు.

తోదుకత్తెర వి. కంసాలి కత్తెరల్లో ఒకటి. తోదుబెట్టు (-పెట్టు) స.క్రి. లోహాలు కరగటంలో సహాయకారిగా ఇంకొక వస్తువును చేర్చు.

**తోదోపాడు** చూ. తోయు.

**తోదోపు** చూ. తోయు.

**తోదోపులాడు** చూ. తోయు.

**తోనికాఁడు** రూ.చూ. తోఁచిగాఁడు. వి. మగడేగ. ఆం.భా. 2.90.

**తోనిగాఁడు** రూ.చూ. తోఁచిగాఁడు. వి. శ్యేన విశేషం.

**తోపఖానా** రూ.చూ. తోపుఖానా. వి. తుపాకులుండేచోటు.

**తోపడ** చూ. తోఁపు[1]. వి. కర్రపనివాని చిత్రిక.

**తోపరా** వి. ఉలవలసంచి, గుర్రాలకు పెట్టే ఉలవలసంచి.

**తోపాటు** చూ. తోడు[1].

**తోపారము** రూ.చూ. తొపారము. వి. 1. డేగకనుమరువు, డేగల ముఖానికి కట్టే తోలుగంత. ఆం.భా. 2.90 ; 2. ఇంటి పైభాగం.

**తోపి** రూ.చూ. టొప్పి. వి. టోపి, కుళ్ళాయి.

**తోపు[1]** వి. 1. పూర్వం ప్రయోగించే మారణాస్త్రం ; 2. నీళ్ళు కట్టి, సేద్యం చేసి పెంచనవసరం లేని చెట్ల గుంపు.

హిం.ఉ. తోప్. ఫిరంగి.

<ఉ. తోప్.

**తోపు[2]** చూ. తోయు.

**తోపుకమ్మి** రూ. టోపుకమ్మి. వి. 1. చీరమధ్యలో పెట్టిన రంగు ; 2. అద్దుకొనలో నేసిన కమ్మి.

**తోపుకొంగు** రూ. టోపుకొంగు. వి. నేతపడుగు పేకదారం ఏరంగులో ఉంటే ఆరంగులో నేసిన చీరకొంగు.

**తోపుఖానా** రూ. తోపఖానా. వి. తుపాకులుండే చోటు.

మరా. తోప్(ఖానా), తోప్ఖానా. తుపాకులుండే చోటు ; ఉ. తోప్ఖానా ; పార. తోప్ఖానహ్.

<ఉ. తోప్ఖానా.

**తోపుటంగి** చూ. తోయు.

**తోపుడు** చూ. తోయు.

**తోపుడుకర్రాలు** చూ. తోయు.

**తోపుతిరునాళ్లు** చూ. తోపు[2]. వి. వనమహోత్సవం. నెల్లూరి శాసనాలు ఉదయగిరి శాసనం. శా.సం. 24. క్రీ.శ. 1586.

**తోపుతోపగు** చూ. తోయు.

**తోపుదాన్** వి. పిట్టగోడలోని డిజైనుకంత.

**తోపుమడి** చూ. తోఁపు2. వి. తోటభూమి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1076. క్రీ.శ. 1205.

**తోపురం** చూ. తోయు.

**తోపులాట** చూ. తోయు.

**తోపెల** వి. చేపలు పట్టే వల.

<తోపు + వల.

తోపెలగొట్టు(-కొట్టు) అ.క్రి. నష్టపడు.

**తోమ్** అవ్య. ఒకానొక రాగ భాగం ('తధ కిణతోమ్').

**తోమకము** చూ. తోము.

**తోమకాలు** చూ. తోము.

**తోమగరిక** వి. ఒకరకం గడ్డి (Agrostis Lenacissina).

**తోమడపెద్దు** చూ. తోము.

**తోమాల** రూ.చూ. తోమాలె. వి. ఆకులు, పువ్వులు కలిపికట్టిన దండ. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 7. క్రీ.శ. 1388.

తోమాలసేవ వి. వేంకటేశ్వరస్వామికి శుక్రవారం రోజు చేసే అలంకరణ.

**తోమాలిక** చూ. తోంట. రూ.చూ. తోమాలె. వి. వనమాల. ఆకులు, పువ్వులు కూర్చికట్టిన దండ. వైజ. 2.141.

**తోమాలియ** రూ.చూ. తోమాలె. వి. వనమాల. ఆకులు, పువ్వులు కూర్చిన దండ. పాండు. 2.20.

**తోమాలె** రూ. తోఁటమాలియ, తోఁటమాలె, తోమాల, తోమాలిక, తోమాలియ. వి. 1. వనమాల. శృం.నై. 8.112 ; 2. మాలిక. ఆం.భా. 2.163.

క. తోమాలె. పూలదండ; త. తోమాలై. ఆకులు, పూలున్న దండ.

< త. తోమాలై.

**తోమించు** చూ. తోము.

**తోమివదలిపెట్టు** చూ. తోము.

**తోము** చూ. తోఁగు. రూ. త్రోము. స.క్రి. **1**. మురికి పోయే టట్టు రుద్దు, నిర్మలం చేయు. హర. 2.122; **2**. బాధించు; **3**. కాకాపట్టు; **4**. తయారు చేయు; **5**. (మూసను) కట్టు; **6**. గంజివడ గట్టటానికి గుడ్డలో పోసి రుద్దు.

గ. దోమ్.

< *తోయ్-మ్పు-.

**తోమకము** వి. తోమటం, రుద్దటం. ఆము. 4.35. **తోమకాలు** వి.బ.వ. సర్వి సుమారుగా అరపెట్టి నునుపు చేయడానికి సిద్ధంగా ఉన్న పాత్రలు. **తోమడపెద్దు(-ఎద్దు)** వి. ఆబోతు. **తోమించు** స.క్రి. తోమచేయు. < తోము + -ఇంచు[3]. **తోమివదలిపెట్టు** స.క్రి. విసుగెత్తించి వదలు. **తోముడు** వి. **1**. తోమటం, మార్జనం. ఆం.భా. 2.160; **2**. ఊరకే బలవంతం చేయటం; **3**. కాకా.

**తోఁప** వి. **1**. చిక్కగా కాచిన అంబలి, సంకటి. కాశీ. 7.185, ఆం.భా. 2.256; **2**. ఉడకబెట్టిన పిండి; **3**. అట్ల తద్దెనాడు అట్లలో నంజుకోడానికి బెల్లంతో చేసే తీపి పదార్థం.

**తోఁపరేగఁగొట్టు** స.క్రి. నలగ్గొట్టు. < తోఁప + రేఁగు + -అ[7] + కొట్టు.

**తోఁపడఁగు** చూ. తోఁచు[1].

**తోఁపిక** చూ. తోఁచు[1].

**తోఁపించు** చూ. తోఁచు[1].

**తోఁపు[1]** చూ. తోఁచు[1].

**తోఁపు[2]** చూ. తోఁట. వి. **1**. ఉపవనం, పెంపుడు తోట, తోట. విజ్ఞా. ఆచా. 36; **2**. గుబురుగా ఉండే చెట్ల గుంపు. బసవ. 62. 1. పం.

క. తోఁపు, తోపు. తోట; తు. తోపు; త. తోప్పు; మ. తోప్పు.

**తోఁపు[3]** విణ. ఎఱ్ఱని, ముదురు ఎరుపు కల. కు.సం. 6.84; వి. **1**. ఎరుపు, రక్తిమ, ఎఱ్ఱ రంగు. క్రీడా. 46; **2**. ఎఱ్ఱ బట్ట. ప్రబంధ. 605.

తు. తోపు. ఎరుపు, ఎఱ్ఱరంగుబట్ట; త. తోయ్పు. ఎఱ్ఱదనం, ఎఱ్ఱకన్ను, తోయ్పు; పో.చూ. త. తుకిర్.

**తోఁపురంగు** వి. నలుపు వన్నె కలిసిన ఎరుపురంగు.

**తోఁపు[4]** వి. నల్లతుమ్మచెక్క. వేంక.ఆం.నానా. 115, ఆం.భా. 3.55.

**తోఁపు[5]** వి. బూరెలు మొ॥ వాటి మూతపిండి.

త. తోయ్ప్పాన్, రొట్టెలు మొ॥ వాటిని తయారు చేయటాని కుపయోగించే కలిపిన పిండి.

**తోఁపు[6]** వి. చీమిడి. ఆం.భా. 2.126.

**తోఁబుట్టినది** చూ. తోన్.

**తోఁబుట్టినవాఁడు** చూ. తోన్.

**తోఁబుట్టు** చూ. తోన్.

**తోఁబుట్టుగు** చూ. తోన్.

**తోఁబుట్టువు** చూ. తోన్.

**తోయగాఁడు** చూ. తోయము.

**తోయమగు** చూ. తోయము.

**తోయము** వి. **1**. దినుసు, జాతి. అరిణనాబాదు శాసనం. క్రీ.శ. 1263; **2**. తెగ, గుంపు, పక్షం. బసవ. 7.534; **3**. పరివారం, పరిజనం. హర. 6.121; **4**. సమయం. తరి. భాగ. 1.459; **5**. విధం, చందం, రీతి. భాగ. 2.78; **6**. ఆప్తవర్గం (బంధువులు, మిత్రులు). భాగ. 10 పూ. 815; **7**. మారు, తడవ, పర్యాయం. భాగ. 10 ఉ. 86.

త. తోయ్. కలియు, పోలు.

**తోయగాఁడు(-కాడు)** వి. విధంకలవాడు. భాగ. 10. పూ. 192. **తోయమగు** అ.క్రి. సంఘీభవించు, ఏకమగు. కాశీ. 7.78. < తోయము + అగు. **తోయమువారు** విణ.బ.వ. స్నేహితులు, జతగా ఉండేవారు.

**తోయలి** రూ.చూ. తొయ్యలి. వి. స్త్రీ, ఆడది. విక్ర. 6.67.

**తోయు** రూ.చూ. త్రోయు. స.క్రి. **1**. గెంటు, నెట్టు; **2**. పడవేయు, కూల్చు; **3**. ఉల్లంఘించు, అతిక్రమించు; **4**. త్యజించు, విడుచు, పరిహరించు; **5**. (చీపురు మొ. వానితో) తుడిచిపారవేయు, పారవేయు; **6**. కడపు, దాటించు, జరుపు; **7**. తొలగించు, పోగొట్టు. **8**. కొట్టు, చేయు మొ. ధాతువుల వలె కొన్ని ధాతువుల తుమ్మున్నంత రూపంలో కూడి ఆయా క్రియల ప్రేరణార్థమిస్తుంది.

**తోదోపాడు** స.క్రి. **1**. మిక్కిలి ఒకరి నొకరు తోసుకొను, చొచ్చు. రామరా. 423; **2**. పరస్పరం తోసుకొను. **తోదోపు** రూ.చూ. త్రోద్రోపు. వి. ఎక్కువగా తోయటం. శశా. 5.19. **తోదోపులాడు** రూ.చూ. త్రోద్రోపులాడు. స.క్రి. **1**. మిక్కిలిగా ఒకరి నొకరు తోసుకొను. ద్వి. పరమ. 3.166పు; **2**. చొచ్చు, ప్రవేశించు. శశా. 2.88. **తోపు[2]** రూ.చూ. త్రోపు. వి. మిక్కిలి ఒకరి నొకరు తోసుకొనటం; స.క్రి. తోపడాతో చెక్కను నున్నబరచు. **తోపుటంగి** వి. ఒకరకమైన రవికె. క్రీడా. పు. 93. < తోపు[2] + అంగి. **తోపుడు** రూ.చూ. త్రోపుడు. వి. **1**. ఒక మొత్తంలోనుంచి కొంత తీసివేయటం; **2**. ఒకరినొకరు నెట్టుకోవటం. **తోపుడుకొఱ్ఱాయి** వి. ఆములోమంటను ఎగదోయటానికి నాలుగైదు అడుగుల పొడవు గల పంగలకఱ్ఱ. **తోపుతోపగు** అ.క్రి. డస్సిపోవు. **తోపురం** వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **తోపులాట** వి. జనసమూహంలో ఒకరి నొకరు తోసుకోవటం. < తోపు + -లు + ఆట. **తోసినపార** వి. గడ్డి మొదలైనవి చెక్కడానికి వాడే ఒకరకం పార. **తోసిరాజను** స.క్రి. **1**. తిరస్కరించు. విజయ. 1.103; **2**. చదరంగంలో బంటును రాజుపైకి తోసి రాజుకు ప్రమాదం ఏర్పడిందని తెలుపు. < తోసిరాజు + అను. **తోసిరాజు** వి. **1**. తొలగ దగినరాజు; **2**. లక్ష్యం చేయక పోవటం. **తోసివేయు** స.క్రి. **1**. తీసివేయు; **2**. కొట్టివేయు.

**తోయులు** చూ. తోయము. వి.బ.వ. పరివారజనం. HAS. 19.82.

**తోరణం** చూ. దోరణము. వి. **1.** పొగాకు కోసి ఆరబెట్టటానికి తాడుకు గుచ్చికట్టిన దండ ; **2.** ఆకులతోకాని పూలతోకాని కట్టి దర్వాజాకు వేలాడ దీసేదండ.

సం. తోరణ-. మంగళార్థం గుమ్మాలకు కట్టే మామిడాకు మొ. వాటిదండ,

<సం. తోరణ- + ము (అర్థవిపరి.).

**తోరణంపట్టె** రూ.చూ. దోర్నప్పట్టె. వి. మోటబావి కొమిరెలమీద ఉన్న అడ్డపట్టె.

**తోరణకట్టు** స.క్రి. **1.** వశపరచుకొను, స్వాధీనం చేసికొను. క్రీడా. 287 ; **2.** వరుసకట్టు. మను. 3.88 ; అ.క్రి. **1.** పిక్కటిల్లు, అతిశయించు. హరిశ్చ. 3.68 ; **2.** అలుము కొను. దశా. 1.110.

సం. తోరణ-. మంగళార్థం గుమ్మాలకు కట్టే మామిడాకు మొ. వాటిదండ.

<సం. తోరణ- + కట్టు.

**తోరణకట్టుకొను** అ.క్రి. పాదుకొను, నెలకొను. దశా. 1.119

**తోరనము** రూ.చూ. దోరణము. వి. **1.** ఆకులతోకాని పూలతోకాని కట్టి దర్వాజాకు వేలాడ దీసేదండ ; **2.** పొగాకు కోసి ఆరబెట్టటానికి తాడుకు గుచ్చి కట్టిన దండ.

**తోరమల్లి** చూ. తోరము[1]. రూ. తోరమల్లె. వి. ఒకవిధమైన తెల్లని మణి, కృతక వజ్రం.

**తోరమల్లె** రూ.చూ. తోరమల్లి. వి. ఒకవిధమైన తెల్లనిమణి, కృతకవజ్రం.

**తోరము**[1] విశ. **1.** స్థూలమైన. లావైన. కు. సం. 3.24 ; **2.** అధికమైన, ఎక్కువైన. కు. సం. 4.90 ; **3.** దట్టమైన, సాంద్రమైన. కు. సం. 8.67 ; **4.** బలం కల, ఎదిరింపరాని. భార. భీష్మ. 1.140 ; **5.** పొడవైన. భార. కర్ణ. 3.38 ; **6.** గొప్పదైన, పెద్దదైన. హరి. పూ. 3.7 ; **7.** చక్కని, సుందరమైన. శ్రీనాథుని చాటువు. యయా. 4.14.

సం. స్థూల-, స్థూర-. దట్టం, సాంద్రం, బరువైన, పెద్ద, బలంగల ; ప్రా. దోర-, థోర-. గొప్ప, పెద్దది, ధుల్ల- ధూల- ; దే. ప్రా. ధోర ; శౌ. ధూల ; అ.మా. జై.మహా. ధుల్ల ; పా. ధుల్ల, ధూల.

క. తూళ, తోర. లావుది, పెద్దది, గొప్పతనం, గొప్ప మనిషి, తోరిత్తు, తోరిద, పెద్దమనిషి ; తు. తోర. సాంద్రత, లావు, గొప్పది, పెద్దది, తోర, స్థూలం, లావైన ; త. తూలమ్.

<ప్రా. థోర-.

**తోరముగా** క్రి. విశ. ద్రు. చక్కగా, సరిగా.

**తోరము**[2] రూ. డోరము. వి. వ్రతసూత్రం. మను. 3.88.

సం. దోర- ; ప్రా. దోరీ, దోర-. రజ్జుభేదం ; గ. తొ్రు. త్రాడు, దారం.

<ప్రా. దోర-.

**తోరహత్తము** వి. మల్లబంధ విశేషం. భార. విరా. 2.15.

**తోరహత్తించు** చూ. తోరహత్తు.

**తోరహత్తు** విశ. సమృద్ధమైన, పుష్కలమైన. నవనాథ. 2ఆ. 77పు. 13పం.

**తోరహత్తించు** స.క్రి. నిండుగావించు, సమృద్ధిగా ఇచ్చు. పాండు. 2.28. <తోరహత్తు + - ఇంచు[3].

**తోరెము** రూ.చూ. దోరెము. వి. డేగను కట్టేతాడు.

**తోర్పు** స.క్రి. కలుపు.

**తోలకం** చూ. తోలు[1].

**తోలాడు** చూ. తోలు[1].

**తోలించు** చూ. తోలు[1].

**తోలితొప్పఱబెట్టు** చూ. తోలు[1].

**తోలితొప్పఱలబెట్టు** చూ. తోలు[1].

**తోలితొప్పఱలాడు** చూ. తోలు[1].

**తోలితొప్పఱవెట్టు** చూ. తోలు[1].

**తోలిబొమ్మ** చూ. తోలు[2].

**తోలు**[1] చూ. తొలఁగు. రూ. త్రోలు. స.క్రి. **1.** తరుము, పలాయితునిగా చేయు, వెడలగొట్టు. కు. సం. 2.65 ; **2.** (పశువుల్ని) ముందుకు నడిపించుకొనిపోవు. కు. సం. 11.42 ; **3.** ప్రసరించు. నె. శా. శా. సం. 84, కందుకూరు శాసనం. క్రీ. శ. 1294 ; **4.** చంపు. భార. ఉద్యో. 4.208 ; **5.** (రథతురగాదుల్ని) నడిపించు. భార. భీష్మ. 2.250 ; **6.** విరియగొట్టు, పోగొట్టు. భాస్క. రా. సుందర. 380 ; **7.** వెంబడించు, వెన్నాడు. భీమ. 5.68 ; **8.** ఇది కొట్టు ధాతువు వలె కొన్ని తుమున్నర్థకాలకు అనుప్రయుక్తమై ప్రేరణార్థం ఇస్తుంది. విక్ర. 4.223 ; **9.** పీచు.

క. సోల్. ఓడించు ; తు. సోపుని. ఓడించు, సోల. ఓడగొట్టు ; త. తోల్ (తోఱ్-). ఓడించు, లొంగు, తొలై. ఓడించు, తుర (తురప్ప్-, తురన్త్-). ఏనుగువలె నడిపించుకొనిపోవు, తురత్తు (తురత్తి). అవతలకి నడిపించు, తరప్పు. నడిపించు ; మ. తురత్తుక. అవతలకి నడిపించు, తోల్క. ఓడించు ; కుఇ. ట్రోప (ట్రోత్-). వేళ్ళతో నొక్కి ముందుకు తోయు ; పర్జి. తుర్కిప్(తుర్కిత్-). నెట్టు ; గ. తురుస్కెయ్. లోపలికినెట్టు.

**తోలకం** వి. బండిలో వేసి చేర్చే వస్తువు. **తోలాడు** స.క్రి. తోలు, తరుము. పి.శకు. 2.15. <తోలు[1] + ఆడు. **తోలించు** స.క్రి. తోలుచు. <తోలు[1] + - ఇంచు[3]. **తోలితొప్పఱబెట్టు(-పెట్టు)** రూ. తోలితొప్పఱవెట్టు. స.క్రి. తరిమి బాధపెట్టు, మిక్కిలి బాధించు. నిర్వ. రా. 5.88. **తోలితొప్పఱలబెట్టు(-పెట్టు)** స.క్రి. తరిమి బాధపెట్టు, మిక్కిలి బాధించు. నృసింహ. 2.74. **తోలితొప్పఱలాడు** స.క్రి. తరిమి బాధపెట్టు. పి.శకు. 2.12. **తోలితొప్పరవెట్టు(-పెట్టు)** రూ.చూ. తోలితొప్పఱబెట్టు. స.క్రి. తరుము, తన్ని తగులవేయు. నృసింహ. 2.74. **తోలుచు** రూ. తోల్చు. స.క్రి. తోలించు, తోలచేయు. రుక్మాం.చ. 2.16. **తోలుపు** వి. విద్రావణం, పారదోలటం, పరాజయం, ఓటమి. ఉ.హరి. 1.61. **తోల్చు** రూ.చూ. తోలుచు. స.క్రి. తోలేట్లు చేయు. **తోల్పులువడు(-పడు)** స.క్రి. దెబ్బలు, తిట్లుతిను.

**తోలు**[2] రూ. తోలుక. వి.బొ. అనా. **1.** జంతువుల చర్మం, త్వక్కు. భార. ఆది. 5.175 ; **2.** చర్మం. కు.సం. 2.78 ; **3.** (వృక్షాదుల) త్వక్కు, పట్ట. కు.సం. 5.139 ; **4.** పాము కూసం, నిర్మోకం. భార. శాంతి. 4.358 ;

**5**. మగ్గంలో ఉడతకింద వేలాడే తోలుచుట్ట.

క. తొగలు, తొల్, తోలు, తొగల్. తొషల్. చర్మం, పండుతొక్క ; కొడ. తొలి. చర్మం, తొలి (తొలిప్-, తొలిచ్-). తోలు ఒలుచు ; తు. తుగలు, తొలికె. చర్మం ; త. తోల్. చర్మం, తొలి (తొలిప్ప్-, తొలిత్త్-). ఊక, చర్మం, తొక్కు. చర్మం ; మ. తోల్. చర్మం, తొలిక్క, తోలు, తొలి. చర్మం, తుకల్. పండు తోలు, తొక్కు. చర్మం ; కో. తొల్. చర్మం ; తొ. త్విజ్ ; గోం. తోల్ ; కొండ. తోల్ ; కువి. తోలూ, తోలు ; పర్జి. తోల్ ; కొలా. తోల్ ; నా. తోల్ ; గ. తొల్. పండుతొక్క ; ఒల్లా. తొల్. చర్మం.

<మూ.ద్రా. తోల్.

**తోలిబొమ్మ** వి. తోలుతో చేసినబొమ్మ. తాళ్ల. సం. 5.189. **తోలుకాయ** వి. అలచంద, కంది మొ. వాటిగింజ పట్టనికాయ. **తోలుకాళ్లు** వి.బ.వ. చచ్చుకాళ్లు. **తోలుకొమ్ము** వి. మొదలు సడలి వేలాడే కొమ్ము. **తోలుగుడ్డు** వి. గుల్ల తయారు కావటానికి కొంత ముందుగా పెట్టబడిన మెత్తని గుడ్డు. **తోలుంగరం** వి. మరమగ్గంలో, ఉడతకింద వేలాడే తోలుచుట్టు. <తోలు[2]+ఉంగరము. **తోలుచిట్టి** వి. మర మగ్గంలో ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు. **తోలుతప్పటములు** వి.బ.వ. తోలువాద్యాలు. పండి.చ. 1.3. 703 పు. **తోలుతిత్తి** రూ. తోల్తిత్తి. వి. మరమగ్గం ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు. **తోలుతీయకనే తొనలు మింగేవాడు** వి. సర్వభక్షకుడు. **తోలుతొండము** వి. కపిలబాన నుంచి నీళ్ళు వెడలివచ్చే తొండంలాగుండేపైపు. **తోలుదాలుపు (-తాలుపు)** రూ. తోలుదాల్పు. వి. కృత్తివాసుడు. శివుడు. అం.నా.సం. దేవ. 6, అచ్చ.రా.బాల. 176. **తోలుదాల్పు(-తాల్పు)** రూ.చూ. తోలుదాలుపు. వి. కృత్తి. వాసుడు, శివుడు. అచ్చ.రా.బాల. 177. **తోలుదిండు** వి. తోలుతో చేసిన కదురు దిండు. **తోలుదోఁగు** అ.క్రి. తోలు తీయు. **తోలునిచ్చెన** వి. తోలుతో చేసిన నిచ్చెన, చోరసాధన విశేషం. ప్రబంధ. 759. **తోలుఁదిత్తి(-తిత్తి)** వి. తోలుసంచి. తాళ్ల. సం. 9.14. **తోలుబొంత** వి. తోలుతో చేసిన బొంత. **తోలుబొమ్మలఇనాం** వి. తోలుబొమ్మలాట ఆడించే వారికిచ్చే డబ్బు. **తోలువాద్యము** వి. తోలుతో చేసిన వాద్యం. **తోలువాయిదము** వి. చర్మవాద్యం, డోలు మొ. ఆనద్ధం. **తోలుసెయ్యి(-చెయ్యి)** వి. నీచమైన చెయ్యి. **తోలూడ్చు** స.క్రి. తోలుతీయు, తోలుఒలుచు. <తోలు[2]+ఊడ్చు. **తోల్తిత్తి** రూ.చూ. తోలుతిత్తి. వి. మరమగ్గం ఉడతకు కింద వేలాడే తోలుచుట్టు. <తోలు[2]+తిత్తి.

**తోలుక** రూ.చూ. తోలు[2]. వి. చర్మం, చెట్లపట్ట. ఆం.భా. 2.37.

**తోలుంకర్ర** చూ. తోలు[2]. వి. బట్టలు ఆరవేయడానికి వేసిన దండెంకర్ర.

**తోలువెలగ** వి. తొర్రివెలగ, లేతపసుపు రంగుకల గట్టి కలప నిచ్చే ముళ్ళుగల ఒకచెట్టు (Limonia acidissima).

**తోలూడ్చు** చూ. తోలు[2].

**తోలెము** రూ.చూ. తోడెము[2]. విణ. కొంచెం.

**తోల్చు** చూ. తోలు[1].

**తోల్తిత్తి** చూ. తోలు[2].

**తోళ్ళగడ్డలు** వి.బ.వ. ఒకరకం దుంపలు, పిల్లిగడ్డలు (Asparagus racemosus).

**తోల్పులువడు** చూ. తోలు[1].

**-తోళన్** చూ. తోడు[1]. రూ. -తో, తోడ, తోఁ. ప్రత్య.ద్రు. తోడ, తో. తృతీయావిభక్తిప్రత్యయం. శా.సం. 42. E.I. క్రీ.శ. 600-700.

**తోళెము** రూ.చూ. తోడెము[2]. విణ. తక్కువ.

**తోవ[1]** రూ. తొగ, తొవ. వి. **1**. కలువ. కు.సం. 5.137 ; **2**. కొణిగ, వలభి. ఆం.భా. 2.21.

త. తొకై. గుంపు, సంఘం, పశువులమంద, గుత్తి, మొత్తం. సమూసం.

**తోవ[2]** రూ.చూ. త్రోవ. వి. ముఖ్యమైన మార్గం.

**తోవకము** వి. ఒకానొక వృత్తం.

**తోవు** రూ.చూ. త్రవ్వు. స.క్రి. తవ్వు.

**తోశెఖానా** రూ. తోషేఖానా. వి. ఆహారద్రవ్యాలు ఉండేచోటు.

హిం. తోశాఖానా. ఆహారద్రవ్యాలు నిలవవుంచేచోటు ; మరా. తోశఖానా ; ఉ. తోశాఖానా. ఆహారద్రవ్యాలుండే చోటు ; పార. తోశహ్‌ఖానహ్.

<ఉ. తోశాఖానా.

**తోషఘ** రూ.చూ. తోషా. వి. పాథేయం, మార్గమధ్యంలో తినటానికి యాత్రికులు వెంట తీసుకొనివెళ్ళే తినుబండారం.

**తోషా** రూ. తోషఘ. వి. మార్గమధ్యంలో తినటానికి యాత్రికులు వెంట తీసుకొనివెళ్ళే తినుబండారం, పాథేయం.

హిం. తోశా. పాథేయం ; ఉ. తోశా ; పార. తోశహ్. ఏర్పాట్లు, దారిబత్తెం.

<ఉ. తోశా.

**తోషేఖానా** రూ.చూ. తోశెఖానా. వి. ఆహారపదార్థాలుండే చోటు.

**తోసము** వి. సంతోషం. సాంబ. మాన. 23.

సం. తోష- ; ప్రా. తోస-. ఆనందం, సంతోషం ; అశో. ప్రా. తోస ; అ.మా. తోస ; పా. తోసనం, తోసిత ; నే. మరా. తోఖ్.

<ప్రా. తోస-.

**తోసినపార** చూ. తోయు.

**తోసిరాజను** చూ. తోయు.

**తోసిరాజు** చూ. తోయు.

**తోసివేయు** చూ. తోయు.

**తోసేదాను** చూ. తోస్తానము. వి. కూజాలలో ఒకరకం.

**తోస్తానము** వి. **1**. తుపాకీ తూటాలు ఉంచుకొనే తోలుసంచి, తోలుపొరల తిత్తి, అరలుగల తోలుసంచి. ప్రబంధ. 605.

హిం. తోశ్‌దాన్. ప్రయాణం చేసేటప్పుడు పదార్థాలను తీసుకు పోడానికి ఉపయోగించే సంచి ; మ. తోస్తాన, తోసాన. సైనికులు తూటాలు ఉంచుకొనేసంచి ; ఉ. తోశ్‌దాన్, తోశాదాన్. సిపాయిలు తూటాలు ఉంచుకో డానికి ఉపయోగించే చర్మపేటిక, ప్రయాణంలో ఉపయో

గించే సంచి. ; పార. తొశాదాన్. చిన్నసంచి, ఆహార పదార్థాలుంచుకొనే సంచి.

< ఉ. తోశ్‌దాన్.

**తోస్సు** రూ.చూ. తస్తు. వి. మట్టితో చేసిన లోతైనపాత్ర.

**తోటి** రూ.చూ. తోశన్. ప్రత్య. తో. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1087.

**తౌ** రూ.చూ. తగు. అ.క్రి. **1**. యుక్తమగు, అర్హమగు ; **2**. ఒప్పు. పొసగు.

**తౌగోల** రూ.చూ. తవుగోల. వి. పార.

**తౌటిపాము** రూ.చూ. తవుటిపాము. వి. ములుగుచేప, పాపమీను.

**తౌడు**[1] రూ.చూ. **తవుడు**[1]. వి. ఔ. బియ్యంమీది మెత్తని పొట్టు. కండనం.

**తౌడు**[2] రూ.చూ. తడము. స.క్రి. **1**. నిమురు ; **2**. రక్షించు.

**తౌలఁబడు** చూ. తౌలు.

**తౌలు** రూ.చూ. తవులు. అ.క్రి. పోవు, వెంబడించిపోవు. రాఘవ. **3**.42.

**తౌలఁబడు** రూ.చూ. తవులఁబడు. అ.క్రి. **1**. చిక్కు ; **2**. వెంబడించి పోవు. **తౌలుకొను** రూ.చూ. తగుల్కొను. అ.క్రి. ; స.క్రి. తగులుకొను యొక్క రూపాంతరం. జైమిని భా. 8.114. **తౌలుకొలుపు** రూ.చూ. తవులుకొలుపు. స.క్రి. **1**. తగులుకొన చేయు; **2**. రగులుకొల్పు. **తౌలుకొల్పు** రూ.చూ. తవులుకొలుపు. స.క్రి. **1**. తగులుకొనచేయు ; **2**. రగులుకొల్పు. **తౌలుకోలు** రూ.చూ. తగులుకోలు. వి. తగులుకోటం. **తౌలుగొండి** రూ.చూ. తవులుగొండి. వి. విటీవిటులను తగులుకొనే వాడు, విటీవిటులను తగులుకొనేది. **తౌలుచు** రూ.చూ. తగులుచు. స.క్రి. **1**. కూర్చు, లగ్నంచేయు ; **2**. నిప్పు అంటించు. **తౌలుదల** (-తల) రూ. చూ. తవులదల. వి. తగలటం. **తౌలుపడు** రూ.చూ. తగుల్పడు. అ.క్రి. **1**. సక్తమగు ; **2**. చిక్కుకొను. **తౌలుపఱుచు** రూ.చూ. తగులుపఱుచు. స.క్రి. **1**. సక్తంచేయు ; **2**. ఏర్పరచు ; **3**. కూర్చు. **తౌలుపాటు** రూ.చూ. తగులుపాటు. వి. **1**. వ్యయం ; **2**. తగులబడటం. **తౌలుబడి** రూ. చూ. తగులుబడి. వి. వ్యయం.

**త్యాగ** రూ.చూ. త్యాగా. వి. కత్తి, ఖడ్గం. ఖడ్గ. 51.

**త్యాగధ్వజమెత్తించు** స.క్రి. ఎవరైనా వచ్చి ఏమడిగినా నేనిస్తాననటానికి గుర్తుగా జండా ఎత్తించు. శుక. 3.88.

సం. త్యాగ-. ఈవి, దానం, ధ్వజ-. జండా.

< సం. త్యాగధ్వజ- + -ము + ఎత్తించు.

**త్యాగా** రూ. త్యాగ. వి. ఖడ్గం. ఖడ్గ. 13.

హిం. తేగ్, తేగా. కత్తి. ఖడ్గం ; మరా. తేగా, తేఘా ; ఉ. తేగ్, తేగా ; పార. తేగ్. కత్తి, చిన్నకత్తి.

< ఉ. తేగ్.

**త్యాగిగద్యలు** వి.బ.వ. గుడివాడను పాలించిన త్యాగి (సాగి) వారు అనే రాజుల మొహరుకల నాణేలు. ద. హిం. శా. సంపు. **4**. శా. సం. 920. క్రీ.శ. 1136.

< సం. త్యాగిన్. దాత, ఈవి కలవాడు.

**త్యాగిమాడలు** వి.బ.వ. త్యాగిరాజులు ముద్రించిన నాణేలు ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1166. క్రీ.శ. 1198.

సం. త్యాగిన్. దాత, ఈవి కలవాడు.

**త్రచ్చన** చూ. త్రచ్చు.

**త్రచ్చు** రూ. తరుచు[1], తర్చు[1]. స.క్రి. **1**. చిలుకు, మథించు. భార. ఆది. 2.8, కు. సం. 8.135 ; **2**. నరుకు, ఖండించు. భార. శాంతి. 4.179 ; **3**. తరిమినబట్టు, సానబెట్టు. హరి. పూ. 1.188 ; **4**. (నిప్పుపుట్టటానికి కాష్ఠాదుల్ని) రాచు ; ఒరపెట్టు. మను. 4.60 ; **5**. మేయు. వాల్మీ. 1.34.

క. తఱి. నెమ్మదిగా తాకు ; తు. తరెపుని. సానపట్టు, ఒరయు ; కో. తర్వ్ (తర్న్.). గరుకు ఉపరిభాగం మీద తోము ; కువి. దాహెనై. జాడతీయు, దహ్. అన్వేషించు ; పర్జి. తెరీప్ (తెరిత్). చిలుకు ; కురు. దన్‌జ్నా. ఊహించు ; పెంగో. దాస్ (దాస్త్.) వెదకు, అన్వేషించు ; దాస్క ; మండ. దాహ్. వెదకు, అన్వేషించు ; గోం తర్చ్. గీరు, గోకు.

పో. చూ. సం. తక్ష్. చెక్కు ; ప్రా. తచ్ఛ్.

మూ. ద. ద్రా., మూ. ద. ద్రా. *తర్.

**త్రచ్చన** వి. **1**. చిలకటం, **2**. చెక్కటం, తరిమిన పట్టటం.

**త్రట్టు** రూ.చూ. తట్టు[1]. వి. కొట్టినప్పుడు దద్దురు లాగ శరీరం మీద ఏర్పడే చిహ్నం. బసవ. 6.512పం.

**త్రంపి** రూ.చూ. తంపి. వి. దాలి (నీళ్ళు మొ. వానిని కాచటానికి పేర్చిన పిడకల పోగు.) మను. 4.60, కృ. శకు. 1.30.

**త్రంపివెట్టు** (-పెట్టు) రూ. తంపిపెట్టు. స.క్రి. **1**. మంటవేయటానికి ముందు పుడకలు పెట్టు. ఉ. హరి. 4.86 ; **2**. తగపుపెట్టు.

**త్రమ్మ** విణ. వ్యర్థమైన. రాఘవ. 1.46 ; వి. **1**. దుమ్ము, ధూళి ; స.క్రి. ధూళితో మాపు, దుమ్ముచేయు.

క. తఱిమ్బు. పొడిఇసుక.

**త్రవు** రూ.చూ. త్రవ్వు. స.క్రి. భూమ్యాదుల్ని చీరు. మార్క. 6.107.

**త్రవుకోల** రూ.చూ. తవుగోల. వి. గుద్దలి, కుద్దాలం.

**త్రవ్వ** రూ.చూ. తవ్వ[1]. వి. రెండుసోలల పరిమాణం గల ఒకకొలత. ఆం. భా. 2.270.

**త్రవ్వటము** చూ. త్రవ్వు.

**త్రవ్వటములువెట్టు** చూ. త్రవ్వు.

**త్రవ్వటించు** చూ. త్రవ్వు.

**త్రవ్వితండమగు** చూ. త్రవ్వు.

**త్రవ్వితండములు** చూ. త్రవ్వు.

**త్రవ్వితండంబులగు** చూ. త్రవ్వు.

**త్రవ్వితండలు** చూ. త్రవ్వు.

**త్రవ్వితలకెత్తు** చూ. త్రవ్వు.

**త్రవ్వు** రూ. తవు[1], తవ్వు, తొవ్వు, **తోవు**, త్రవు, దొవ్వు. స.క్రి. **1**. కోరాడు, (భూమ్యాదుల్ని) చీరు. భార. సభా. 2.183 ; **2**. (వెనుకటి సంగతుల్ని) ఎత్తిచెప్పు. భార. ఉద్యో. 3.191 ; **3**. కొత్తగాచేయు. భార. స్త్రీ. 2.162 ; **4**. పొందు, సంపాదించు. భార. స్త్రీ. 2.162 ; **5**. ఉన్మూలించు, పెల్లగించు, పెల్లగించు. కేయూ. 4.21 ; **6**. ఖననం

చేయు, గొచ్చు. హరి.ఉ. 1.83 ; 7. ప్రస్తావించు, ప్రసంగించు. హరి.ఉ. 4.109 ; 8. బయటపెట్టు, ప్రకటించు. పరమ. 5.222.

త. తొరువు ; గోం. తడ్. తవ్వు, త్ర్. పెల్లగించు ; పడానా. పందులవలె తవ్వు లేక బయటకు గీరు, త్రానా. పైకి పెకలించు ; కుఇ. తొద (తొడి-). బయటకి తవ్వు ; కొలా. తవ్వ్. తవ్వు ; నా. తవ్వ్. తవ్వు ; కురు. చడ్- (చడ్డ్-). పెల్లగించు, నాశనం చేయు.

<మూ.ద్రా. *చట్-/*తట్-.

**త్రవ్వటము** వి. తవ్వటం, గొచ్చటం. **త్రవ్వటములువెట్టు (-పెట్టు)** స.క్రి. తవ్వి పాడులుచేయు. కళా. 4.79. **త్రవ్వటించు** స.క్రి. తవ్వు, గొచ్చు. < త్రవ్వట- + -ఇంచు[3]. **త్రవ్వితండమగు** అ.క్రి. అధికమగు, సమృద్ధంగా ఉండు. క్రీడా. 256, పాండు. 4.203. <త్రవ్వితండము + అగు. **త్రవ్వితండములు** రూ. త్రవ్వితండలు. వి.బ.వ. అసంఖ్యాకాలు, అపరిమితమైన (వస్త్వాది సంపదలు). భార.అశ్వ. 4.200. **త్రవ్వితండంబులగు** అ.క్రి. ఎక్కతొక్క, లెక్కకు మిక్కిలిఅగు. కాశీ. 2.50. < త్రవ్వితండంబులు + అగు. **త్రవ్వితండలు** రూ.చూ. త్రవ్వితండములు. వి.బ.వ. అసంఖ్యాకం, అపరిమితం. **త్రవ్వితలకెత్తు** స.క్రి. ఒరగబెట్టు, లాభం కలుగజేయు. <త్రవ్వు + -ఇ[13] + తల + -కున్ + ఎత్తు. **త్రవ్వకోల** రూ.చూ. తవుగోల. వి. గుద్దలి, కుద్దాలం.

**త్రస్తరి** వి. 1. పరిహాసం. మను. 6.9, 2. కందు. ఆము. 2.75 ; 3. వెనుకభాగం. కృ.శకు. 2.57 ; 4. కింది భాగం.

సం. త్రస్త-. భయపడిన.

<సం. త్రస్త + -అరి.

**త్రస్తరించు** స.క్రి. 1. అభిఘరించు. హర. 6.117 ; 2. ఏవగించు, రోయు. రుక్మా.చ. 5.55 ; 3. కింది పరుచు, అధఃకరించు. పి.శకు. 3.93 ; అ.క్రి. 1. పరిహాసమాడు, మేలమాడు, భాగ. 10 ఉ. 1253 ; 2. కమ్ముకొను, వ్యాపించు. మను. 6.31. **త్రస్తరులాడు** స.క్రి. పరిహాసాలాడు. శుక. 2.443. <త్రస్తరి + -లు + ఆడు. **త్రస్తరులుచేయు** రూ.చూ. త్రస్తరులుసేయు. స.క్రి. పరిహాసంచేయు. **త్రస్తరులుసేయు (-చేయు)** రూ. త్రస్తరులుచేయు స.క్రి. పరిహాసంచేయు. జైమినిభా. 3.51. **త్రస్తరులొనర్చు** స.క్రి. పరిహాసంచేయు. ధర్మ. 1.17. <త్రస్తరి + -లు + ఒనర్చు.

**త్రస్తరులాడు** చూ. త్రస్తరి.

**త్రస్తరులుచేయు** చూ. త్రస్తరి.

**త్రస్తరులుసేయు** చూ. త్రస్తరి.

**త్రస్తరులొనర్చు** చూ. త్రస్తరి.

**త్రస్స** వి. వేదాధ్యయనం చేసేటపుడు నోటినుంచి రాలే తుంపర, బ్రహ్మబిందువు. వేదశాస్త్రవాదంలో నోటినుంచి రాలే తుంపర. చంద్రాంగ. 4.36, ఆం.భా. 2.175.

సం. త్రప్సా. గడ్డకట్టిన శ్లేష్మం, కళ్ళె.

< సం. త్రప్సా.

**త్రస్సు** రూ.చూ. తస్సు[1]. వి. ముక్కోణం ఆకారంలో కొయ్యతోకాని ఇనపబద్దెలతోకాని నిర్మించిన చట్రం.

**త్రాగఁగలుగు** చూ. త్రాగు.

**త్రాగించు** చూ. త్రాగు.

**త్రాగు** రూ.చూ. త్రావు[1]. స.క్రి. 1. పానంచేయు. కు.సం. 2.36, శృం.నై. 2.81 ; 2. పీల్చు. తెనాలి రామకృష్ణుని చాటువు.

**త్రాగఁగలుగు** రూ. తాగకలుగు. అ.క్రి. కూడుగుడ్డకు కొదవ లేకుండాఉండు. < త్రాగు + -అ[7] + కలుగు. **త్రాగించు** రూ.చూ. త్రావించు. స.క్రి. క్రోలించు, తాగచేయు. <త్రాగు + -ఇంచు[3]. **త్రాగుడు** రూ. త్రావుడు. వి. 1. పానం, తాగటం. ఆము. 2.59 ; 2. మద్యపానం. **త్రాగుతలపోసికొను** స.క్రి. తనివితీరా అనుభవించు. విజయ. 3.53. **త్రాగుఁబోతు (-పోతు)** రూ. తాగుఁబోతు. వి. కల్లు, సారా, బ్రాంది మొదలైన పానీయాల నెప్పుడూ త్రాగేవాడు.

**త్రాఁచు** రూ. తాచు[2]. వి. పడగకల ఒక జాతి క్రూరసర్పం, నాగుపాము. భార.స్త్రీ. 2.61.

త. అరవు, అరవమ్, అర, అరా. పాము ; మ. అరవు, అరవమ్. పాము ; గోం. తరాష్, తరస్, తరాస్, తార్స్, తరస్. పాము ; కొండ. సరస్. పాము ; కుఇ. స్రాసు (బహు. స్రాస్క). పాము ; కువి. రాచూ (బహు. రాస్క). పాము, రాచు. పాము ; పో.చూ. త. చరి/పో.చూ. ప్రా. సరాహయ.

<మూ.ద్రా. *తరచ్.

**త్రాఁచుకూన** వి. తాచుపాముపిల్ల. రాజవా. 4.119.

**త్రాఁచుపాము** వి. ఒకజాతి విషసర్పం. ఆము. 4.199.

**త్రాటికుక్కలు** చూ. త్రాడు.

**త్రాటిగట్టుబోయ** చూ. త్రాడు.

**త్రాటిమహిమ** చూ. త్రాడు.

**త్రాటిమాల** చూ. త్రాడు.

**త్రాడు** రూ. తాటు, తాడు[2], తాండు. వి.బొ. 1. రజ్జువు. పాశం. కు.సం. 2.37, భార.కర్ణ. 3.273 ; 2. మంగళసూత్రం, పుస్తెబొందు. కాశీ. 7.60, కేయూ. 2.23 ; 3. దారం, తంతువు. విక్ర. 2.72 ; 4. కిరణం, రశ్మి. అచ్చ.రా. అయోధ్యా. 42 ; 5. యజ్ఞోపవీతం, జందెం, బసవ. 7.772.

త. చరడు. మెలిపెట్టినతాడు, బంగారం, వెండి, పత్తి, తాడు ; మ. చరటు. తాడు, దారం ; కో. చర్డ్. దగ్గరగా అమరిన నునుపైన మెడపట్టీ ; కోలా. తడ్. తాడు ; నా. తాడ్. తాడు.

**త్రాటికుక్కలు** వి.బ.వ. జందెం వేసుకున్న కుక్కల లాంటివారనే (బ్రాహ్మణులు) నిందార్థం. పండి.చ. 2.136 ప. **త్రాటిగట్టుబోయ (-కట్టుబోయ)** వి. బ్రాహ్మణ వేషాన్ని వేసిన కిరాతుడు. పాండు. 3.68. **త్రాటిమహిమ** వి. మంగళసూత్ర ప్రభావం. శుక. 2.84. **త్రాటిమాల** వి. జందెం ధరించిన మాలడు. బసవ. 7.41 పం. **త్రాడు**

త్రాలుపు రూ.చూ. త్రాడుదాలుపు. వి. పాశి, వరుణుడు. త్రాడుతెంచు స.క్రి. మిక్కిలి బాధపెట్టు. త్రాడుదాలుపు రూ. త్రాడుతాలుపు. వి. పాశధరుడు, వరుణుడు. అచ్చ.రా. అయోధ్యా. 13. త్రాడుపడు రూ.చూ. త్రాడువడు. అ.క్రి. కృశించు, దారమగు. త్రాడుపాఱు రూ.చూ. త్రాడువాఱు. అ.క్రి. గట్టిపడు, ఎక్కువగు. త్రాడులేక బొంగరములేకుండు అ.క్రి. ఏమీలేకుండు, నిరాధారంగాఉండు. త్రాడువడు (-పడు) రూ. త్రాడుపడు. అ.క్రి. 1. త్రాడగు, రజ్జుత్వం పొందు. భీమ. 4.107 ; 2. నిస్సత్త్వమగు. భీమ. 4.107. త్రాడువాఱు(-పాఱు) రూ. త్రాడుపాఱు. అ.క్రి. 1. పురికొను ; 2. ధైర్యమొందు. త్రాడువెట్టు (-పెట్టు) అ.క్రి. పశువులు మొదలైనవాటికి తాడు మెడకికట్టు. బసవ. 146 పు. త్రాడువోయు(-పోయు) అ.క్రి. మెడకు తాడుకట్టు. హరి. పూ. 2.40.

త్రాణ వి. 1. గౌరవం, మర్యాద. శృం.నై. 7.88 : 2. బలం. శక్తి. ఆము. 4.269 ; 3. జాగరూకత, మెలకువ. సుద. 5.144.

సం. త్రాణ-. కాపాడబడింది, రక్షించేది, రక్షణ సాధనం, రక్షణం.

<సం. త్రాణ- (అర్థవిపరి.).

త్రావించు చూ. త్రావు.

త్రావు రూ. తాగు, తావు², త్రాగు. స.క్రి. 1. పానంచేయు. భార.ఆది. 1.77 ; 2 కబళించు, మింగు, భక్షించు, తిను. పారి. 4.76 ; 3. పీల్చు. శ్రీనాథుని చాటువు 1.127.

త. ఆర్. తిను, తాగు. ఆర్వు. తినటం, తాగటం ; పర్జి. తార్. మింగు ; ఒల్లా. తార్గ్. మింగు, సర్క్. తాగు ; పో.చూ. మాల్తో. సార్కెయ్. పీల్చు.

<మూ.ద్రా. *చార్-/*తార్-.

త్రావించు రూ. త్రాగించు. స.క్రి. క్రోలించు, తాగచేయు. భార.ఆది. 3.114. త్రావుడు రూ.చూ. త్రాగుడు. వి. పానం, తాగటం. పాండు. 3.19.

త్రాసు రూ. తరాజు, తరాసు¹, తాసు¹. వి. తూచే సాధనం, తుల. భార.శాంతి. 2.375.

హిం. ఉ.పార. తరాజూ. తక్కెడ, తుల.

<ఉ. తరాజూ.

త్రాసునతూచినట్లు అవ్య. చక్కనగంగా. ఉ.హరి. 1.176. త్రాసునఁబెట్టు (-పెట్టు) స.క్రి. తూచు, సమానం చేయు. భార.శల్య. 1.176. త్రాసునాయము వి. తూనిక వల్ల వచ్చే లాభం. ఈపూరి శాసనం. క్రీ.శ. 1278.

త్రికూటము వి. మూడు గర్భగృహాలుగల దేవాలయం. తె.శా.సం. 2. ఇ.శా. 3.

సం. త్రికూట-. లంకలోని ఒక పర్వతం, మూడు శిఖరాలు కలది ; ప్రా. తికూడ-.

<సం. త్రికూట- (అర్థవిపరి.).

త్రికోణము వి. ఆడుగురి, స్త్రీమర్మావయవం. చంద్రరే. 2.53.

సం. త్రికోణ-. మూడుకోణాలు గలది.

<సం. త్రికోణ- (అర్థవిపరి.).

త్రిక్క¹ రూ.చూ. తిక్క. వి. ఉన్మాదం, పిచ్చి. ఆం.భా. 1.136.

త్రిక్కతెవులు వి. గోరోగ విశేషం, ఆవులకు వచ్చే ఒక రోగం.

త్రిక్క² చూ. త్రిక్కు¹.

త్రిక్కటి రూ.చూ. టికటి. వి. 1. (బల్లలు, పలకలు మొ॥ ఉంచటానికి అనువుగా) మూడు కర్రలతో చేసిన చట్రం. క్రీడా. 125 ; 2. ఆయుధ విశేషం.

త్రిక్కు¹ రూ.చూ. తక్కు¹. అ.క్రి. 1. విఁగులు, శేషించు. కు.సం. 11.171, భార.శాంతి. 3.276 ; 2. చిక్కుపెట్టు, బాధించు ; వి. చిక్కు, బాధ. భాస్క.రా.యు. 266.

త్రిక్కు² రూ.చూ. తక్క. అవ్య.ద్రు. వినార్థకం. భార.అను. 3.32, ఆం.భా. 3.69.

త్రిక్కు² చూ. తిరుగు. స.క్రి. మెలితిప్పు. అ.క్రి. తిరుగు.

క. తిరి. చుట్టుతిరుగు, తిరికె. భిక్షకోసం అన్వేషిస్తూ తిరుగు, తిరిగు, తిరగు, తిరుగు. తిరుగు, చుట్టు తిరుగు, తిరిగిసు, తిరగిసు. తిరుగు, మెలి, తిరిగి. మరల, తిరిచు. తీగలాగ మెలితిప్పు, తిరువు. స్క్రూ, తాళం, తలలాగాతిరుగు, తిరుహు. చుట్టు తిరుగు, తిరగణి, తిరగణె, తిరుగణి, తిరుగణె, తిరుగుణి. తిరగటం, తిరప. భిక్ష కోసం తిరగటం ; కొడ. తిర్-(తిరి-). చుట్టుతిరుగు, తిరిగ్-(తిరిగి-). తిరుగు, తిరిక్-(తిరికి-). తిరుగు ; తు. తిర్ంగుని. తిరుగు, తిర్ంగావుని. తిరుగు, తిర్ంగాటు. ఊరక తిరగటం ; త. తిరి(తిరివ్-, తిరిన్త్-). తిరుగు, చుట్టివచ్చు, (తిరిప్ప్-, తిరిత్త్-). తిరుగు, మార్పుచెందు, తిరికై. విచ్చలవిడిగా సంచరించటం, తిరిపు. మార్పు, తిరియ. మరల, తిరివు. మార్పు, తిరుకు(తిరుకి-). మెలితిప్పు, తిరుక్కు. మెలి ; మ. తిరి. తిరుగు, తిరియుక. చుట్టుతిరుగు, తిరివు. తిరుగుట, తిరియే, తిరికే. మరల, తిరిక్క. చుట్టుతిరుగు, తిరిచ్చల్. తిరుగుట, తిరుక్కు. మడిచికుట్టిన అంచు, తిరుక్కుక. బట్టల్ని మెలిపెట్టి చుట్టు ; కోట. తిర్య్-(తిర్చ్-), తిర్చ్-(తిర్చ్-). తిర్గ్-(తిర్గ్య్-). తిరుగు, తిర్క్-(తిర్క్య్-). తిరుగు, తిర్క్-(తిర్క్య్-). తిరుగు, తిర్క్. వెళ్ళిరావటం, తిర్గన్. చక్రం ; తొ. తిర్య్-(తిర్చ్-). మెలి, తిర్చ్-(తిర్చ్-). తర్జుమాచేయు, తిర్య్. మరల, తిర్క్-(తిర్క్య్). తిరుగు, తిర్క్. రోడ్డుమలుపు ; గోం. తిరీతానా. గుండ్రంగా తిరుగు, తిరుహ్తానా. ఇటునటు తిరుగు ; పర్జి. తిర్క్. మెలికలు తిరిగిపోవు ; కొలా. తిర్గ్-(తిరిక్త్). తిరుగు, తిర్గిప్-(తిర్గిఫ్త్-). మెలి ; నా. తిర్గ్. తిరుగు ? ; కురు. తీర్నా. ? బ్రా. చిర్రేన్గినగ్.

<మూ.ద్రా. *తిర్-*క్.

త్రిగుణీపాలకలన చూ. త్రిగుణీపాలు.

త్రిగుణీపాలు వి. ఇగుర కాచిన పాలు, మూడు వంతులలో ఒక వంతు అయ్యే వరకు మరగించిన పాలు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 966. క్రీ.శ. 1421.

సం. త్రిగుణీ-. మూడురెట్లుకలది.

<సం. త్రిగుణి- + పాలు.

**త్రిగుణిపాలకలస** వి. మూడువ వంతు అయ్యేటట్లుగా కాచిన పాలు గల కలశం. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 872. క్రీ.శ. 1399. సం. కలశ-. కుండ.

**త్రిపాఠి** వి. వేదంలో సంహితను పద క్రమంలో పఠించేవాడు. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1301.

సం. *త్రిపాఠిన్*. వేదంలో పదక్రమ సంహితా రూప గ్రంథాలు పఠించే వాడు; హిం. *త్రిపాఠీ*.

<సం. త్రిపాఠిన్.

**త్రిపుదలు** వి.బ.వ. వాద్యవిశేషం. కు.సం. 2.100.

సం. *త్రిపుట*-. ఏడు అక్షరాల కాలం కల ఒకరకం తాళం.

<సం. త్రిపుట- + -లు.

**త్రిప్పట** చూ. త్రిప్పు.

**త్రిప్పటపుబల్ల** చూ. త్రిప్పు.

**త్రిప్పటము** చూ. త్రిప్పు.

**త్రిప్పరి** చూ. త్రిప్పు.

**త్రిప్పికొను** చూ. త్రిప్పు.

**త్రిప్పియాడు** చూ. త్రిప్పు.

**త్రిప్పు** చూ. తిరుగు. రూ. తిప్పు, తింపు. వి. **1**. సుడి, జలావర్తనం. కు.సం. 5.513 ; **2**. బాధ, కష్టం, శ్రమ, చిక్కు. భార.విరా. 2.52 ; **3**. వియోగం. భార. శల్య. 1.36 ; **4**. తిరుగుడు పరచటం, తిరుగుడు. భార. శాంతి. 5.326 ; **5**. సాచీకరణం, పక్కకు తిప్పటం. శుక. 2.433 ; స.క్రి. **1**. తిరుగచేయు. కు.సం. 12.30 ; **2**. అడ్డుపెట్టు. నెల్లూరి శాసనాలు. ఒంగోలు. క్రీ.శ. 1297 సం ; **3**. విసరు, వీచు. శృం.నై. 2.140 ; **4**. మరల్చు, నివృత్తంచేయు, పోగొట్టు. విక్ర. 5.182 ; **5**. పక్కకు తిరుగచేయు, సాచీకరించు. ఆము. 1.59 ; **6**. కదల్చు, చలింపచేయు. గంధ. 138 ; **7**. సంచరింపచేయు, పర్యటనం చేయించు. శుక. 3.577.

క. *తిరుపు, తిరిపు, తిరిహు*. *తిరవు, తిరివు*, *తిరుమ్పు*. చుట్టుపట్ల తిరుగు, తిరుగు, *తిరువు*. క్షణ భంగురమైన అనుభూతి (లేక) స్థితి, *తిరువు*. శ్రూక, తాళం, తలలాగ తిరుగు, *తిరుహు*. చుట్టుతిరుగు, *తరగణి, తిరగణె*. తిరగటం, *తిరప*. భిక్షకోసం తిరగటం ; తు. *తిర్పుని*. గిరగిర చుట్టుతిరుగు ; త. *తిరి* (*తిరివ్-, తిరిన్త్-*). తిరుగు, చుట్టివచ్చు, (*తిరిప్పు-, తిరిత్త్-*). తిరుగు, మార్పు చెందు, *తిరుమ్పు* (*తిరుమ్పి-*). తిరుగు, వెనుతిరుగు, *తిరుప్పు* (*తిరుప్పి-*). వెనక్కుమరల్చు, తిరుగు, *తిరుప్పమ్*. తిరగటం, *తిరుప్పి*. మరచీలలు తిప్పే సాధనం, *తిరుము* (*తిరుమి-*). తిరుగు ; మ. *తిరి*. తిరుగు, *తిరిప్పు*. తిరగటం. *తిరుమ్పుక*. చుట్టుతిరుగు, *తిరిప్పుక*. పిండు ; గోం. *తిరీతానా*. గుండ్రంగా తిరుగు, *తిరుహ్తానా*. ఇటునటు తిరుగు ; కుఇ. *తిహ్పా* (*తిహ్త్-*). వెనక్కు తిరుగు, *త్రెహ్పా* (*త్రెహ్త్-*). తిప్పు, *త్రెస్స* (*త్రెస్త్-*). చుట్టు తీసుకొనిపోవు, *త్రేబ* (*త్రేత్-*). చుట్టుతిరుగు, *తెర్పు* (*తెర్త్-*). మెలి ; పర్జి. *తిర్క్*. మెలికలు తిరిగిపోవు ; కొలా. *తిప్* (*తిప్త్-*). తిరుగు ; నా. *తిర్గ్*. తిరుగు, *తిప్పు*. తిరుగు ; ? కురు. *తీర్నా* ; ? బ్రా. *చిర్రేగ్నిన్గ్*.

<మూ.ద్రా. *తిర్ + -ప్.

**త్రిప్పట** రూ. తిప్పట, త్రిప్పటము, త్రిప్పాట. వి. **1**. పర్యటనం, సంచారం, తిమ్మట. రామాభ్యు. 6.64 ; **2**. తిప్పుడు, తిరుగుడు. రాజ.చ. 2.47. **త్రిప్పటపుబల్ల** వి. బాలాక్రీడా విశేషం. వరాహ. 5.38. **త్రిప్పటము** రూ.చూ. త్రిప్పట. వి. **1**. తిప్పుడు, తిరుగుడు ; **2**. పర్యటనం, సంచారం, తిమ్మట. **త్రిప్పరి** వి. త్రిమ్మరి, తిరిగే స్వభావం కలవాడు. త. *తరిబవన్*. తిరిగేవాడు. **త్రిప్పికొను** రూ. త్రిప్పుకొను. అ.క్రి. కలగు, క్షోభపడు. భార. ద్రోణ. 2.230. **త్రిప్పియాడు (ఆడు-)** స.క్రి. త్రిప్పు. భార. శల్య. 1.317. **త్రిప్పుకొను** రూ.చూ. త్రిప్పికొను. అ.క్రి. శ్రమనొందు. హరి. ఉ. 2.24. **త్రిప్పుకొలుపు** రూ. త్రిప్పుకొల్పు. స.క్రి. **1**. నివృత్తంచేయు, మరల్చు, పోగొట్టు. భార.అను. 1.48 ; **2**. కలతపెట్టు, క్షోభపెట్టు. **త్రిప్పుకొల్పు** రూ.చూ. త్రిప్పుకొలుపు. స.క్రి. **1**. కలతపెట్టు, క్షోభపెట్టు. మార్క. 3.88 ; **2**. నివృత్తంచేయు, మరల్చు, పోగొట్టు. దశకు. 10.157. **త్రిప్పుట** రూ. చూ. త్రిప్పట. వి. **1**. తిరగటం; **2**. శ్రమ. **త్రిప్పుడు** వి. తిప్పటం. కకుత్స్థ. 4.93. **త్రిప్పుడుగొను(-కొను)** అ.క్రి. పరిభ్రమించు, తిరుగు. శేషధ. 4.209. **త్రిప్పుడుత్రాడు** వి. పక్షుల్నిపట్టే ఒకానొక వేటసాధనం, తిరుగుడుతాడు. ద్వి.నల. 3.123. **త్రిప్పుడుపుడుక** వి. రాట్నాన్ని తిప్పటానికి సాధనంగా ఉండే పుల్ల, రాట్నంలో ఒక అవయవం. శుక. 2.419. **త్రిప్పుక్రాడు** వి. తరితాడు, తిరుగులాడు, తిరుగు, కవ్వంతాడు. **త్రిప్పులబెట్టు** స.క్రి. తిప్పలుపెట్టు, కష్టపెట్టు. <తిప్పు + -లు + -అ[7] + పెట్టు. కు.సం. 5.34. **త్రిప్పులాడు** అ.క్రి. **1**. తిరుగులాడు, తిరుగు. హంస. 5.243 ; **2**. వగలుపోవు. <త్రిప్పు + -లు + ఆడు. **త్రిప్పులువెట్టు(-పెట్టు)** అ.క్రి. చిక్కులుపెట్టు. రుక్మాం.చ. 3.96. **త్రిప్పుళ్లు** వి.బ.వ. తిరగటాలు, బాలక్రీడ.

**త్రిమ్మట** చూ. త్రిమ్మరు.

**త్రిమ్మటకాఁడు** చూ. త్రిమ్మరు.

**త్రిమ్మరి** చూ. త్రిమ్మరు.

**త్రిమ్మరీఁడు** చూ. త్రిమ్మరు.

**త్రిమ్మరు** చూ. తిరుగు. రూ. తిమ్మరు, త్రిమ్మరు. అ.క్రి. **1**. సంచరించు, తిరుగు, పర్యటించు. భార. ఆది. 1.106, కు.సం. 7.36 ; **2**. మెలగు, ప్రవర్తించు. భార. విరా. 1.272 ; **3**. వర్తించు, ఉండు. కావ్యా. చూ. 1.100 ; స.క్రి. చుట్టివచ్చు, వలగొను. భార. ఆది. 2.114.

క. *తిరుమ్పు*. (చుట్టుపట్ల) తిరుగు ; త. *తిరుము* (*తిరుమి-*). తిరుగు ; మ. *తిరుమ్పుక*. చుట్టుతిరుగు ; కుఇ. *త్రెహ్పా* (*త్రెహ్త్-*). తిప్పు, *త్రేబ* (*త్రేల్-*). చుట్టుతిరుగు ; కువి. *తీపలి*. చుట్టుతిరుగు.

**త్రిమ్మట** వి. **1**. తిప్పట, పర్యటనం, తిరుగుడు, పరి

వర్తనం. భార. విరా. 3.95 ; 2. పరివర్తనం జరగటం. హరి. ఉ. 9.62 ; 3. విపత్తు, ఆపద. వేంక. పంచ. 1.92 ; 4. కాయకష్టం. కళా. 4.109 ; 5. నడవడి, ప్రవర్తనం. చెన్నబసవ. 3.374. **త్రిమ్మటకాఁడు** వి. తిమ్మరి, మిక్కిలి తిరిగేవాడు. భార. ఉద్యో. 4.263. **త్రిమ్మరి** రూ. డిమ్మరి, తిమ్మరి, ద్రిమ్మరి. వి. 1. మిక్కిలి తిరిగేవాడు, తిమ్మరీడు, దుష్టుడు. ప్రబోధ. 4.25 ; 2. (యథేష్టంగా) ప్రవర్తించేవాడు ప్రవర్తించేది, తిరుగుబోతు. విప్ర. 4.59. **త్రిమ్మరీఁడు** రూ. తిమ్మరీఁడు. ద్రిమ్మరీఁడు. వి, తిమ్మరి, తిరుగుబోతు. వసు. 3.138, పాండు. 4.171.

**త్రిమ్మఱు** రూ.చూ. త్రిమ్మఱు. అ.క్రి. సంచరించు. తిరుగు. కాశీ. 7.177.

**త్రివటించు** స.క్రి. మూడుభాగాలుగా చేయు. కు.సం. 5.118.

సం. త్రి- మూడు, పుటు-.

<త్రిపుట + - ఇంచు[3].

**త్రుక్కు**[1] వి. తుళ్ళు, గర్వం. పాండు. 5.107.

**త్రుక్కు**[2] రూ.చూ. తుక్కు. వి. తుప్పు, చిలుం, లోహమలం. ఆం.భా. 2.280.

**త్రుంగు** రూ. తుంగు, ద్రుంగు. అ.క్రి. 1. తునకలగు, ఖండాలగు. భార. ద్రోణ. 5.339 ; 2. చచ్చు, నశించు. భాస్క.రా.అయోధ్యా. 209 ; 3. ముగియు, సమాప్తముగు. భాగ. 6.318 ; 4. పడు, రాలు. పె. శకు. 1.240.

త. నొఱుంగు, తుణి (తుణివ్- తుణిన్ఱ్-). నరుకు, (తుణిప్ప్-, తుణిన్ఱ్-). నరికివేయు, ? తురువు (తురువి-), ? తురువల్ ; మ. తురక్క. పాతిపెట్టు, లోలోపల నాశనంచేయు ; మాల్తో. తుర్గ్ర్. పగులు ; పో.చూ.త. తుణ్డమ్.

**త్రుంగుట** వి. 1. సావు. ఆం.భా. 2.225 ; 2. నిర్మలం, విణ. 1. నునుపుగల ; 2. వంకరలేని. **త్రుంగుడు** వి. 1. నాశం. ఆం.భా. 1.98 ; 2. ప్రళయం. **త్రుంగుడువడు (-పడు)** అ.క్రి. 1. నశించు, పోవు. మార్క. 2.340. 2. చల్లారు, శాంతించు. భాగ. 9.581 ; **త్రుంచు** రూ. తుంచు. స.క్రి. 1. నరకు, ఖండించు, ముక్కలుచేయు. భార. ఆది. 6.218 ; 2. వధించు, చంపు, నశింపచేయు. కు.సం. 11.115, భార. స్వర్గా. 1.7 ; 3. ఉత్తరించు, చించు. ఉ. హరి. 4.115 ; 4. విభజించు. భాగ. 1.83 ; 5. భగ్నంచేయు, పోగొట్టు. జైమినిభా. 7.61. **త్రుంచుట** వి. హింస. ఆం.భా. 2.224.

**త్రుంచు** చూ. త్రుంగు.

**త్రుంచుట** చూ. త్రుంగు.

**త్రుట్టియ** రూ.చూ. తుట్టె[2]. వి. సమూహం, గుంపు.

**త్రుట్టె** రూ.చూ. తుట్టె[2]. వి. సమూహం, గుంపు, పోగు. ఆము. 6.19.

**త్రుట్టెలుగట్టు (-కట్టు)** అ.క్రి. 1. గుమిగూడు, చుట్టు వారుకొను. పాండు. 5.249 ; 2. చుట్టలు చుట్టుకొను ; 3. ఉండలుకట్టు.

**త్రుప్పు** చూ. తుక్కు[2]. రూ.చూ. తుప్పు[1]. వి. 1. లేమి, దారిద్ర్యం. జైమినిభా. 1.45 ; 2. అయోమలం, ఇనపకిట్టం, కాలుష్యం, మాలిన్యం. పల్నా. 77, మను. 2.11.

**త్రుప్పుడు**[2] రూ. తుప్పుడు[2]. వి. 1. నిస్సారపదార్థం. భార. విరా. 5.239 ; 2. మాలిన్యం. మను. 4.37. **త్రుప్పుడుల్చు** స.క్రి. ఉపయోగంలోకి తెచ్చు. **త్రుప్పువట్టు (-పట్టు)** అ.క్రి. ఉపయోగంలో లేకపోవు. రుక్మా.చ. 2.47.

**త్రుప్పుడు**[1] రూ. తుప్పడ, తుప్పు[3], తుప్పుడు[1]. వి. 1. తిర్యగ్రోమం, పక్షి ఈక. జైమినిభా. 1.45 ; 2. పక్షి ఈకలు, గొర్రెబొచ్చు, సారెపెట్టెలో కలిపే వెంట్రుకలు ; 3. నార మొదలగువాటి తుక్కు.

క. తిప్పుటె, తుపట, తుప్పటె, తప్పుఱ, తుప్పుఱు, తుబటె. ఉన్ని, పక్షుల కాలిమీది బొచ్చు ; తు. సూవి. ఈక ; గోం. తోర్ (తోరె). పెద్దఈక ; ముండ. తూకు. ఈక.

**త్రుంపు** చూ. త్రుంచు. రూ. తుంప, తుంపు[1], త్రుంపుడు. వి. 1. ఖండం, ముక్క. జైమినిభా. 5.192 ; 2. శ్రేష్ఠవస్తువు. అచ్చ.రా.అరణ్య. 90.

**త్రుంపుడు** రూ.చూ. త్రుంపు. వి. ఖండం, తునక.

**త్రుమ్మికి** రూ.చూ. తుమికి. వి. తిందుకం, ఒకానొక చెట్టు.

**త్రుమ్ము** రూ.చూ. దుమ్ము[1]. వి. దుమ్ము, దూళి. ఆం.భా. 2.220.

**త్రుళ్లగించు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లగింత** చూ. త్రుళ్లు.

**త్రుళ్లగింతలుపెట్టు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లగింతలువెట్టు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లడఁచు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లాట** చూ. త్రుళ్లు.

**త్రుళ్లాడు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లించు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లింత** చూ. త్రుళ్లు.

**తుళ్లిపడు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లియాడు** చూ. త్రుళ్లు.

**త్రుళ్లు** రూ. తుళ్లు. అ.క్రి. 1. ఉప్పొంగు, సంతోషించు. కు.సం. 8.149 ; 2. విజృంభించు. భార.ద్రోణ. 2.45 ; 3. గర్వించు, మదించు, మత్తతతో ప్రవర్తించు ; 4. (ఉల్లాసాదులచే) గంతులువేయు, ఎగిరిపడు ; వి. 1. గర్వం, మదం. భార.ఉద్యో. 2.45 ; 2. ఎగిరిపడటం. ఎగిసిపాటు. నీలా. 3.28.

క. తుళ్లు. దొర్లు, దుముకు ; కొడ. తుళ్ళ్ (తుళ్లి-). చిన్నదుముకులువేయు ; తు. తుళ్లు, తుళ్లుని, తుల్లుని. దొర్లు, దుముకు ; త. తుళ్లు (తుళ్లి). దుముకు, ఉల్లాసంతో గంతులువేయు, తుళ్లల్. ఉల్లాసంతో గెంతటం ; పో.చూ. తుటి. మోటుగాఉండు, తుటిప్పు. గర్వం ; మ. తుళ్లుక. దుముకులాడు, తుళ్లల్. దుమకటం, తుళ్లిక్క.

మూ.ద.ద్రా. *తుళ్.

**త్రుళ్లగించు** అ.క్రి. తుళ్ళు, ఎగిరిపడు. వరాహ. 9.139.

**త్రుళ్లగింత** రూ. త్రుళ్లింత, త్రుళ్లమింత. వి. **1**. ఎగసిపాటు, మిడిసిపాటు. విక్ర. 4.226 ; **2**. గంతు. **త్రుళ్లగింతలుపెట్టు** రూ.చూ. త్రుళ్లగింతలువెట్టు. అ.క్రి. ఎగురు. **త్రుళ్లగింతలువెట్టు (-పెట్టు)** రూ. త్రుళ్లగింతలుపెట్టు. అ.క్రి. **1**. వ్యాపించు. విక్ర. 8.38 ; **2**. దుముకు. భోజ. 5.19. **త్రుళ్లడఁచు** అ.క్రి. పొగరణచు. భార.భీష్మ. 3.231. <త్రుళ్ల+అడఁచు. **త్రుళ్లాట** వి. క్రీడ, ఆట. ఆం.భా. 1.140. <త్రుళు+ఆట. **త్రుళ్లాడు** రూ.చూ. త్రుళ్లియాడు. అ.క్రి. **1**. చిందులుతొక్కు, నర్తనంచేయు. క్రీడా. 129 ; **2**. ఎగిరిపడు, ఎగిసిపడు. <త్రుళ్ల+ఆడు. **త్రుళ్లించు** రూ.చూ. తుళ్లించు. స.క్రి. ఎగిసిపడజేయు. <త్రుళ్ల+-ఇంచు[3]. **త్రుళ్లింత** రూ.చూ. త్రుళ్లగింత. వి. **1**. గంతు. కళా. 4.96 ; **2**. గర్వం. **త్రుళ్లిపడు** రూ. తుళ్ళిపడు. అ.క్రి. **1**. (కోప భయ గర్వాదులచే) ఎగిరిపడు, మండిపడు. భార. శల్య. 2.371 ; **2**. ఉలికిపడు. ఉ.హరిశ్చ. 3.38 ; **3**. మిక్కిలికదలు. శుక. 3.30. **త్రుళ్లియాడు (-ఆడు)** రూ. త్రుళ్లాడు. అ.క్రి. **1**. ఎగిరిపడు, ఎగిసిపడు. హరి.ఉ. 6.58 ; **2**. చిందులుతొక్కు, నర్తనం చేయు. **త్రుళ్లపిండి** వి. స్ఫోటకం కనిపించినప్పుడు పోలేరమ్మని ఉద్దేశించి కొట్టే పిండి. **త్రుళ్లపోతు** రూ.చూ. త్రుళ్లఁబోతు. వి. పొగరుబోతు. **త్రుళ్లమింత** రూ. చూ. త్రుళ్లగింత. వి. **1**. ఎగిసిపాటు, మిడిసిపాటు. విక్ర. 8.39; **2**. గంతు. **త్రుళ్లఁబోతు(-పోతు)** రూ. త్రుళ్లపోతు. వి. తుళ్ళే స్వభావం కలవాడు, మిడిసిపడేవాడు, గర్వశీలుడు, పొగరుబోతు. ఉ.హరి. 3.17.

**త్రుస్సు** వి. నీళ్ళు చిమ్మేటప్పుడు వచ్చే ధ్వనికి అనుకరణం (ధ్వన్యను.). భీమ. 5.116.

**త్రెక్కు** చూ. టెక్కు. అ.క్రి. మదించు.

**త్రెక్కొట్టు** చూ. త్రెగు.

**త్రెక్కొను** చూ. త్రెగు.

**త్రెక్కోలు** చూ. త్రెగు.

**త్రెక్కోలుకొను** చూ. త్రెగు.

**త్రెక్కోలుగొను** చూ. త్రెగు.

**త్రెగఁజూచు** చూ. త్రెగు.

**త్రెగు** రూ.చూ. తెగు. అ.క్రి. **1**. ఖండితమగు, భిన్నమగు, విదారితమగు ; **2**. చచ్చు, మరణించు ; **3**. అంతరించు, పోవు, నశించు ; **4**. ముగియు, సమాప్తమగు, పూర్ణమగు ; **5**. ఆగు, విరమించు ; **6**. పరివృత్తమగు, వినిమయం నొందు, మారు ; **7**. సాహసించు, తెంపుతో ప్రవర్తించు ; **8**. తీర్పబడు, పరిష్కరింపబడు, నిర్ణీతమగు ; **9**. సాధ్యమగు ; **10**. విభక్తమగు, (గణితంలో) శేషం లేకుండా భాగించబడు.

**త్రెక్కొట్టు** రూ.చూ. తెగఁగొట్టు. అ.క్రి. ఎగదట్టు. రామాభ్యు. 8.3. **త్రెక్కొను** స.క్రి. **1**. దోచుకొను. కు.సం. 7.36 ; **2**. పూను, తాల్చు, వహించు. కు.సం. 11.644 ; **3**. కలచు, క్షోభపడు. నిర్వ.రా. 5.122 ; **4**. తాగు, పానంచేయు. భార.విరా. 5.58 ; **5**. చంపు. భార.భీష్మ. 3.307 ; **6**. పోగొట్టు, నశింపచేయు. మార్క. 1.248 ; **7**. మింగు, కబళించు. మార్క. 6.164 ; **8**. చెరచు, పాడుచేయు. భార. అరణ్య. 6.192 ; అ.క్రి. **1**. శేషించు, మిగులు. భార. భీష్మ. 1.184 ; **2**. కలగు, క్షోభపడు. భాస్క. రా. యు. 1758 ; **3**. అతిశయించు, విజృంభించు. చిత్రభా. 6.6. **త్రెక్కోలు** వి. తెక్కొనటం, చంపటం. **త్రెక్కోలుకొను** రూ.చూ. త్రెక్కోలుగొను. స.క్రి. చంపు. విప్ర. 6. **త్రెక్కోలుగొను** రూ. త్రెక్కోలుకొను. అ.క్రి. హింసించు, చంపు. విష్ణుపు. 6.315. **త్రెగఁజూచు** రూ.చూ. తెగఁజూచు. స.క్రి. చంపు. భాగ. 10పూ. 1570. <త్రెగు+-అ[7]+చూచు.

**త్రెంచికొను** చూ. త్రెంచు.

**త్రెంచు** చూ. త్రెగు. రూ.చూ. తెంచు. స.క్రి. **1**. విడిచిపెట్టు, వదలుకొను. కు. సం. 12.216 ; **2**. ఖండించు, నరుకు. భార. శాంతి. 2.172 ; **3**. తుంచు, చంపు. ఉ. హరి. 2.172.

**త్రెంచికొను** స.క్రి. ఖండించు, నరుకు. భాగ. 9.478.

**త్రెడ్డు** రూ.చూ. తెడ్డు[1]. వి. **1**. దర్వి, కొయ్యగరిటె, గరిటె. భీమ. 2.115 ; **2**. పడవనడిపే సాధనం, అరిత్రం, కేనిపాతకం. శివరా. 1.6.

**త్రెంపు**[1] రూ.చూ. తెంపు[1]. వి. తెంపు, సాహసం, తెగువ. భాగ. 5. 1.70.

**త్రెంపు**[2] రూ. తెంపు[2]. స.క్రి. **1**. ఖండించు. కాశీ. 3.152 ; **2**. కోయు, నరుకు. వి. **1**. తెగటం ; **2**. తెంచటం.

క. తిఱి. వేగమైన గతితో తోసివేయు ; త. తెఱి. తెఱిప్పి-, తెఱిత్తు-. ఖండన, పగలగొట్టు, తెంచు ; మ. తెఱిక్క. తెంచివేయు.

**త్రెయ్యు** చూ. తెగు. అ.క్రి. తెగు, ఖండితమగు. భార. ఆది. 2.24.

క. తిఱి. (<*తెఱి). తెగు ; తు. తెర్పుని. వేరు చేయు ; త. తెఱి. పగులు, తెఱు. చిదగగొట్టు, తెఱల్. చెడగొట్టు ; మ. తెఱిక్క. ముక్కలుగా ఎగురు.

**త్రెళ్లనేయు** చూ. త్రెళ్లు.

**త్రెళ్లించు** చూ. త్రెళ్లు.

**త్రెళ్లు** చూ. త్రెయ్యు. రూ. తెల్లు. అ.క్రి. **1**. పడు, రాలు, కూలు. భార.ఆది. 1.126 ; **2** విరుగు, ఖండితమగు. కు.సం. 11.131 ; **3**. చచ్చు.

పో. చూ. త. తెఱల్. నాశనంచేయు.

**త్రెళ్లనేయు** స.క్రి. పడగొట్టు, చావగొట్టు. నిరంకు. 1.20. <త్రెళ్లు + -అ[7] + ఏయు[1]. **త్రెళ్లించు** స.క్రి. **1**. పడద్రోయు, కూల్చు. శ్రీరం. మా. 5.37 ; **2**. చంపు. అచ్చ. రా. బాల. 112. <త్రెళ్లు+- ఇంచు[3].

**త్రెవ్వ** క్రి. విశ. ద్రు. పూర్ణంగా. పాండు. 5.305.

**త్రెవ్వన** వి. చక్కన, సౌందర్యం.

**త్రెవ్వఁజూచు** చూ. త్రెవ్వు.

**త్రెవ్వనీఁదు** చూ. త్రెవ్వు.

**త్రెవ్వఁబాఱు** చూ. త్రెవ్వు.

**త్రెవ్వు** చూ. తెగు. అ.క్రి. **1**. తెగు, ఖండితమగు, తునియు. కు. సం. 11. 121 ; **2**. విచ్ఛిన్నమగు, విడిపోవు. పండి.

చ. 4.304వ ; 3. అంతమగు, నశించు. పాండు. 5.112.

త్రెవ్వఁజూచు స.క్రి. విడుచు. కు. సం. 11.56. <త్రెవ్వు +- అ[7] + చూచు. త్రెవ్వనీఁదు అ.క్రి. ఆవలి గట్టుకుదాటు. పాండు. 5.305. < త్రెవ్వు +- అ[7] + ఈఁదు[1]. త్రెవ్వఁబాఱు అ.క్రి. ఖండితమగు. కు.సం. 12.73. <త్రెవ్వు+- అ[7] + పాఱు.

**త్రేసుడు** రూ.చూ. త్రేవుడు. వి. దొంగ, లాల. హరి. పూ. 6.43.

**త్రేజరి** వి. దనాగారం, ద్రవ్యసంబంధమైన.

**త్రేఁచు** రూ. తేఁచు, తేనుచు, త్రేనుచు, త్రేన్చు. అ.క్రి. ఉద్గారించు, తృప్తిగా తిని కంఠంనుంచి చప్పుడుతో వాయువు విడుచు, తేపువిడుచు. భార. అరణ్య. 2.345.

క. తేగు, తేకు. తేపు, తేగువికె. తేపటం ; కొడ. తెకిలి. తేపు ; తు. తేగు. తేపు, తేకుc (తేక్కి-). తేపు ; త. తేక్కమ్. తేపు, తేకుc (తేక్కి). తేపు, తేక్కటు, తేక్కఱ్. తేపు, తెకిట్టు. వాంతి వచ్చేలా అనిపించటం ; మ. తేకుక్కక. తేపు, తేక్కమ్. వాంతి వచ్చేట్టు ఉండటం, తేకిట్టు. తేపటం, తికట్టుక. తేపు, తేట్టుక. తేపు ; కో. తెక్ల్. తేపు ; తొ. తొక్ (తొక్య్-). తేపు ; గోం. దేర్, అజీర్తి వల్ల వచ్చే తేపు ; కుఇ. తేపc (<తేక్-వ్-, తేక్త్-). వాంతఅగు ; కువి. ద్రెబలి. తేపు, ద్రెబ్. తేపు ; కొలా. డేర్గ్, డేర్క్, డెర్కా. తేపు.

**త్రేఁపు** రూ. తేనుపు, తేణుపు, తేన్పు, తేపు, తేఁపు, త్రేనుపు, త్రేన్పు. వి. ఉద్గారం, తేన్చటం. కాశీ. 4.237.

**త్రేటగట్లు** వి.బ.వ. కుమ్మరివాడు కుండలపై చెక్కే అలంకార విశేషం. హంస. 5.13.

**త్రేణి** విణ. సుందరమైన, చక్కని. కు. సం. 7.7.

**త్రేణు** చూ. త్రేపు. అ.క్రి. బయలుదేరు, వెడలివచ్చు.

**త్రేది** వి. మూడువేదాలు తెలిసినవాడు, బ్రాహ్మణులలో ఒక పట్టపు పేరు. బసవ. 512వ.

సం. త్రివేదిన్. మూడువేదాలు ఎరిగినవాడు.

<సం. త్రివేదిన్.

**త్రేనుచు** రూ.చూ. త్రేఁచు. అ.క్రి. ఉద్గారించు, తృప్తిగాతిని కంఠంనుంచి చప్పుడుతో వాయువు విడుచు, తేపువిడుచు.

**త్రేనుపు** రూ.చూ. త్రేఁపు. వి. ఉద్గారం, తేన్చటం. **త్రేన్చు** రూ.చూ. త్రేఁచు. అ.క్రి. ఉద్గారించు, తృప్తిగా తిని కంఠంనుంచి చప్పుడుతో వాయువు విడుచు, తేపు విడుపు. బసవ. 7.683. **త్రేన్పు** రూ.చూ. త్రేఁపు. వి. ఉద్గారం, తేన్చటం. పల్నా. 119.

**త్రేనుపు** చూ. త్రేనుచు

**త్రేన్చు** చూ. త్రేనుచు.

**త్రేన్పు** చూ. త్రేనుచు.

**త్రేఁపు** చూ. త్రేఁచు.

**త్రేవుడు** రూ. తేగుడు, త్రేగుడు. వి. దొంగ, లాల. దశకు. 6.159.

**త్రొక్కట** చూ. త్రొక్కు.

**త్రొక్కటపడు** చూ. త్రొక్కు.

**త్రొక్కటపాటు** చూ. త్రొక్కు.

**త్రొక్కటము** చూ. త్రొక్కు.

**త్రొక్కటలాడు** చూ. త్రొక్కు.

**త్రొక్కడ** చూ. త్రొక్కు.

**త్రొక్కడపడు** చూ. త్రొక్కు.

**త్రొక్కిళ్లు** చూ. త్రొక్కు.

**త్రొక్కు** రూ. తొక్కు, తొగ్గు. వి. 1. తొక్కటం, (కాలితో) అదమటం. భార. ఆది. 2.104 ; 2. తొక్కటం, ఒత్తుడు. భార. కర్ణ. 1.31 ; అ.క్రి. 1. నడచు, ప్రవర్తించు. భార. ఆది. 5.54 ; 2. అడుగుపెట్టు. ఆము. 5.147 ; స.క్రి. 1. (అణిగేటట్లు కాలితో) అదుము, అణచు. భార. విరా. 5.206 ; 2. మెట్టు. హరి. పూ. 6.5 ; 3. సందర్శించు. కాశీ. 2.83 ; 4. ప్రసరించు, వ్యాపించు. కకుత్థ. 4.103 ; 5. (నీరు మొ॥ పోసి) దంచు, (మట్టినీరు మొ॥ పోసి కాళ్ళతో) మట్టు. హంస. 1.195.

క. తుళి. తొక్కు, తుళిసు, తు. తొర్పుని. తన్ను, తొక్కు, తొర్పు. తాపు; మ. తొఴిక్క. కాలితోతన్ను, బడితతో బాదు, తొఴియుక. వాల్చు, (ఆకులు, పళ్ళు) పడిపోవు ; కో. తొళ్- (తొళ్య్-). ఒకమనిషి మంచిలక్షణాల్ని తక్కువపరచు ; కుఇ. డుడ (డుడి-). తొక్కు, ద్రొజు, డుడ, ద్రొజుఇన్బ ; పో. చూ. త. ఉఴక్కు. అడుక్కు. తొక్కు.

<మూ. ద్రా. *టొట్-, *తొట్.

**త్రొక్కట** రూ.చూ. తొక్కట. వి. 1. ఆపద. అచ్చ.రా. పీఠి. 1.24 ; 2. తొట్రుపాటు. అచ్చ. రా. సుందర. 6.71. **త్రొక్కటపడు** రూ.చూ. తొక్కటపడు. అ.క్రి. తొట్రుపడు, బాధపడు. **త్రొక్కటపాటు** రూ.చూ. తొక్కటపాటు. వి. తొట్రుపాటు, బాధ. **త్రొక్కటము** రూ.చూ. తొక్కట. వి. ఒత్తుడు, సమ్మర్దం. శేషధ; 3. **త్రొక్కటలాడు** అ.క్రి. తొట్రుపడు, బాధపడు. ద్వి.సార. చ. 2.72. పు. 5పం. **త్రొక్కడ** రూ. చూ. తొక్కట. వి. 1. తొట్రుపాటు ; 2. ఆపద. **త్రొక్కడపడు** రూ.చూ. తొక్కటపడు. అ.క్రి. తొట్రుపడు, బాధపడు. బహుళా. 1.110. **త్రొక్కిళ్లు** వి.బ.వ. బాలికా క్రీడా విశేషం, తొక్కుడుబిళ్ళ. **త్రొక్కుడు** రూ చూ. తొక్కుడు. వి. 1. తొక్కటం, మట్టటం. వరాహ. 4.23 ; 2. ఒత్తుడు, సంఘట్టన. పారి. 2.52 ; 3. సమ్మర్దం. రామాభ్యు. 1.47 ; 4. పశుమృగాలరతం. ఆం.భా. 2.178 ; 5. పక్షిరతం ; విణ. తొక్కబడేది. **త్రొక్కుడుగమ్మి** (-క్రమ్మి) రూ.చూ. తొక్కుడుఁగమ్మి. వి. 1. గడప కిందిపలక, శిల ; 2. గడప. **త్రొక్కుడుపట్టె** వి. తొక్కుడు కమ్మి. **త్రొక్కుడుపడు** రూ.చూ. తొక్కుడుపడు. అ.క్రి. జనసమ్మర్దంలో ఒకరికాళ్ళొకరు తొక్కుకొను. పారి. 2.53. **త్రొక్కుడుపలక** వి. 1. నూలు వడికే వాడు కాలికింద తొక్కిపెట్టే రాట్నం పలక. శుక. 2.420. ఉ. హరిశ్చ. 4.24 ; 2. రాళ్ళపనివాని కాళ్ళకింది పలక. **త్రొక్కుడుపాటు** వి. ఒత్తుడు, రాయిడి. విజయ. 3.7. **త్రొక్కుడుబిల్ల** రూ. త్రొక్కుడుబిళ్ల. వి. బాలక్రీడా విశేషం. **త్రొక్కుడుబిళ్ల** రూ. చూ. త్రొక్కుడుబిల్ల. వి. బాలక్రీడ. **త్రొక్కుడుబొమ్మ** వి. నూలువడికే రాట్నంలో తొక్కేసాధనం. శుక. 2.420.

**త్రొక్కుడువడు (-పడు)** రూ. త్రొక్కుడుపడు. అ.క్రి. **1**. ఒత్తువడు, రాపిడిచెందు. హరి. ఉ. 120 ; **2** తొట్రుపడు. పారి. 2.52 ; **3**. అదుముడుపడు. కవిక. 2.134. **త్రొక్కుత్రొక్కాడు** అ.క్రి. తొక్కిడిపడు. రాజగో. 1.51. < త్రొక్కు + త్రొక్కు + ఆడు. **త్రొక్కులాడు** అ.క్రి. **1**. తొట్రుపడు, కలవరపడు. శివధ. 4.54 ; **2**. పెనగొను. శుక. 2.253. < త్రొక్కు + -లు + ఆడు. **త్రొక్కువడు (-పడు)** అ.క్రి. తొక్కుడువడు, కాలి అదుముడు పొందు. హరి.పూ. 6.129.

**త్రొండి** విణ. **1**. కుంగిన. కు.సం. 6.37 ; **2**. లోతయిన.

**త్రోచినడచు** చూ. త్రోచు.

**త్రోచిపుచ్చు** చూ. త్రోచు.

**త్రోచు** చూ. త్రోయు. స.క్రి. **1**. పడవేయు. భార.ఆది. 6.249 ; **2**. తోసివేయు. నిర్వ.రా. 6.70. ద.హిం.శా.సంపు. 10 శా.సం. 563. క్రీ.శ. 1390 ; **3**. ఊదు, నొక్కు. నిర్వ. రా. 4.66 ; **4**. విడుచు, త్యజించు. నిర్వ.రా. 10.131 ; **5**. గెంటు, నెట్టు. భార.ఉద్యో. 3.60 ; **6**. ఇది 'కొట్టు, చేయు' మొ॥ ధాతువుల వలె కొన్ని క్రియల తుమున్నంత రూపాలతో కూడి ఆ యా క్రియల ప్రేరణార్థాన్నిస్తుంది. భార.భీష్మ. 3.81 ; **7**. తీసివేయు, తొలగించు. భార. అను. 5.225 ; **8**. చంపు, నశింపచేయు, పోగొట్టు. ఉ.హరి. 2.180 ; **9**. అతిక్రమించు, ఉల్లంఘించు. భాగ. 9.545 ; **10**. నిరాకరించు, నిరసించు. వరాహ. 6.125 ; **11**. దాటు, మీరు, కడచిపోవు. పాండు. 5.15 ; **12**. వెడలగొట్టు. విష్ణుపు. 5.163 ; **13**. జరుపు, కడపు, వెళ్ళించు. నీలా. 2.42 ; అ.క్రి. **1**. అతిశయించు, ప్రబలమగు, మించు. భార.ద్రోణ. 2.55 ; **2**. ముసురు, కవియు, కమ్ము. భాస్క.రా.యు. 657 ; **3**. ఉబుకు, ఉద్గతమగు, స్రవించు. ఉ.హరి. 3.63 ; **4**. నడచు, వడికలుగు. విక్ర. 5.196.

త. తుర (తురప్ప్-, తురస్త్-). ఏనుగుని తోలినట్టు తోలు, నెట్టు, చెదరగొట్టు, తురత్తు (తురత్తి-). అవతలకి నెట్టు, బయటకు తరుము, తురప్పు. తోలటం, తొలగించటం, తరమటం ; మ. తురత్తుక. అవతలకి నెట్టు ; కుఇ. త్రోప (త్రోత్-). వేళ్ళతో ఒకదాన్ని ముందుకు తోయు, పర్జి. తుర్కిప్- (తుర్కిత్-). తోయు, నెట్టు ; గ. తురుస్ కెయ్. లోపలికి తోయు, నెట్టు.

మూ.ద.ద్రా. *తొర.

మూ.ద్రా. *తుర/తొర.

**త్రోచినడచు** అ.క్రి. కలసిమెలసి వెళ్ళు. భార.ఉద్యో. 2.222. **త్రోచిపుచ్చు** అ.క్రి. నిరాకరించు, ఉపేక్షించు. భార.ఉద్యో. 4.302.

**త్రోద్రోపు** చూ. త్రోపు.

**త్రోద్రోపులాడు** చూ. త్రోపు.

**త్రోపడు** చూ. త్రోపు.

**త్రోపనంగొఱవి** చూ. త్రోపు.

**త్రోపరి** చూ. త్రోపు.

**త్రోపాటు** చూ. త్రోపు.

**త్రోపాడు** చూ. త్రోపు.

**త్రోపించు** చూ. త్రోపు.

**త్రోపు** చూ. త్రోయు. రూ. తోపు[2]. వి. **1**. పడతోయటం, కూల్చటం. కు.సం. 4.105 ; **2**. పోరు, యుద్ధం. భార. ఉద్యో. 2.46 ; **3**. గెంటేశక్తి, శక్తి. భార.శాంతి. 5.578 ; **4**. నిషేధం. భార.అశ్వ. 2.6 ; **5**. నిరాకరణం, త్యజనం. హరి.పూ. 5.240 ; **6**. తోయటం, గెంటటం. మను. 4.18 ; **7**. తిరస్కారం.

త. తుఱువ్వు.

**త్రోద్రోపు** రూ.చూ. తోదోపు. వి. మిక్కుటమైనతోపు, సమ్మర్దం, రారాపు. లక్ష్మీ వి. 5.98. < త్రోపు + త్రోపు. **త్రోద్రోపులాడు** రూ. తోదోపులాడు. స.క్రి. మిక్కిలితోయు. రామాభ్యు. 4.154 ; అ.క్రి. స.క్రి. **1**. పెనుగులాడు, ఒకవాని కొకటి రాచుకొను. పద్మ. 9.123 ; **2**. అతిశయించు. ద్వి.సార.చ. 1.22 పు. 7 పం. <త్రోద్రోపు + -లు + ఆడు. **త్రోపడు** రూ.చూ. త్రోపుపడు. అ.క్రి. తోయబడు, గెంటబడు, తొలగింపబడు. ఉ.హరి. 4.189. **త్రోపనంగొఱవి (-కొఱవి)** విణ. ఉభయభ్రష్టుడు, ఉభయభ్రష్టురాలు. ఉ.హరి. 5.161. **త్రోపరి** వి. తోసేవాడు. అచ్చ.రా. సుందర. 119. <త్రోపు + -అరి. **త్రోపాటు** వి. తోపడటం. **త్రోపాడు** స.క్రి. **1**. తోయు, గెంటు. భార.విరా. 2.343 ; **2**. వెన్నాడు, వెంబడించు. ఆము. 5.40 ; **3**. రాచుకొను. సారంగ. 3.44 ; అ.క్రి. పెనుగులాడు, మార్లాడు. నిర్వ.రా. 10.45. **త్రోపించు** స.క్రి. **1**. తోయించు, గెంటించు. భార.ఆది. 5.171 ; **2**. (జలాదులలో) పడతోయు. <త్రోపు + -ఇంచు[3]. **త్రోపుగుదియ** వి. గుదికర్ర. సిం.ద్వా. 4.228. **త్రోపుఘంట** వి. ఘంటాభేదం, గుడిలో వేలాడదీసే గంట. ద.హిం.శా.సంపు. 32. క్రీ.శ. 1353. **త్రోపుచేయు** రూ. త్రోపుసేయు. స.క్రి. నిరాకరించు, నిరసించు. భార.ఉద్యో. 4.378. **త్రోపుడు** రూ. తోపుడు. వి. **1**. తోపు, క్షేపణం. ఆం.భా. 2.301 ; **2**. చిత్రిక, వడ్రంగి సాధన విశేషం. **త్రోపుడుపెట్టు** స.క్రి. చిత్రికతో నునుపుచేయు. **త్రోపుడువల** వి. జాలభేదం, ఒకవిధమైన వల. హంస. 4.185. **త్రోపుత్రొక్కిళ్ళవాఱు(-పాఱు)** రూ. తోపుద్రొక్కిళ్ళవాఱు. అ.క్రి. తోపిడివల్ల ఒకరికాళ్ళొకరు తొక్కుకొనేవిధంగా పరిగెత్తుతూపోవు. పండి.చ. 2 పు. 362. **త్రోపుత్రోపాడు** స.క్రి. (పరస్పరం) సమ్మర్దంలో మిక్కిలి తోయు, గెంటు, రాచుకొను. మను. 5.71. **త్రోపుద్రొక్కిళ్లు(-త్రొక్కిళ్లు)** వి.బ.వ. తోపాటలు, తోసుకోవటాలు. **త్రోపుద్రొక్కిళ్లవాఱు (-పాఱు)** రూ.చూ. తోపుత్రొక్కిళ్లవాఱు. అ.క్రి. తోపాడు, తోసుకొను. పండి.చ. 5.762 పు. 9 పం. **త్రోపులాడు** స.క్రి. గెంటుకొను, తీసికొను. భార. సౌప్తి. 1.202. సిం. ద్వా. 8.79. <త్రోపు + -లు + ఆడు. **త్రోపువడు (-పడు)** రూ. త్రోపడు, త్రోవడు. అ.క్రి. **1**. తోయబడు, గెంటబడు, తొలగించబడు. భార.శాంతి. 5.372 ; **2**. నిరసించబడు, నిరాకృతమగు. భార.అను. 2.270. **త్రోపుసేయు(-చేయు)** రూ. చూ. త్రోపుచేయు. స.క్రి. నిరాకరించు, నిరసించు. భార. అశ్వ. 1.43. **త్రోవడు** రూ.చూ. త్రోపుపడు. అ.క్రి.

శేషించు, మిగులు. మల్హా. 1.85. < త్రోసు + పడు.

త్రోము రూ.చూ. తోము. స.క్రి. మురికి పోయేటట్టు రుద్దు. భోజ. 3.224.

త్రోముడు వి. రుద్దుడు.

త్రోయించు చూ. త్రోయు.

త్రోయు చూ. త్రోచు. రూ. తోయు. స.క్రి. 1. ఉల్లంఘించు. అతిక్రమించు. భార.విరా. 5.196 ; 2. తోయు. భార. ద్రోణ. 2.18 ; 3. గెంటు, నెట్టు. ఉ.హరి. 3.32 ; 4. 'కొట్టు, చేయు' మొ॥ ధాతువుల్లాగా కొన్ని ధాతువుల తుమున్నంత రూపాలతో కూడి, ఆ యా క్రియల ప్రేరణార్థాన్ని ఇస్తుంది. శృం.నై. 1.82 ; 5. కడపు, దాటించు, జరుపు. భాగ. 2.24 ; 6. నిరసించు. కళా. 6.153 ; 7. త్యజించు, విడుచు, పరిహరించు. ఆము. 1.16 ; 8. (చీపురు మొ॥ వాటితో) తుడిచిపారవేయు, పారవేయు. ఆము. 2.11 ; 9. పడవేయు, కూల్చు. ఆము. 6.27 ; 10. తొలగించు, పోగొట్టు. కుచే. 1.51.

త్రోయించు స.క్రి. తోయచేయు. భార.శల్య. 2.78. < త్రోయు + -ఇంచు[3]. త్రోసిరాజుచేయు స.క్రి. కాదను. త్రోసివేయు స.క్రి. 1. తిరస్కరించు. కాశీ. 6.219 ; 2. కేసు కొట్టివేయు.

త్రోలు రూ.చూ. తోలు[1]. స.క్రి. 1. తరుము, వెన్నాడి పరుగెత్తచేయు. సిం.ద్వా. 1.261 ; 2. సంహరించు, చంపు. వరాహ. 1.52 ; 3. ఇది 'కొట్టు' ధాతువులాగా కొన్ని తుమున్నంత రూపాలకు అనుప్రయుక్తమై ప్రేరణార్థాన్ని ఇస్తుంది. కళా. 6.106.

త్రోలుట వి. 1. యుద్ధంనుంచి పారిపోవటం. ఆం.భా. 2 220 ; 2. పశువులు మొ. వానిని నడిపించటం.

త్రోవ చూ. త్రోచు. రూ. తొవ్వ, తోవ[2], దోవ. వి. 1. మార్గం, దారి, పద్ధతి. కు.సం. 10.172, E. 1.5.139-142. క్రీ.శ. 945-70 ; 2. ఉపాయం, సాధనం, వెరవు, విధం, రీతి. ఉ.హరి. 5.21 ; 3. గతి, దిక్కు, అవస్థ. భీమ. 3.5 ; 4. జోలి, సంబంధం. భాగ. 6.191.

త్రోవదప్పు(-తప్పు) అ.క్రి. అపమార్గంలో నడచు. త్రోవనడచుట వి. అష్టకష్టాలలో ఒకటి. త్రోవపెట్టు రూ.చూ. త్రోవవెట్టు. అ.క్రి. దారిచూపు. కకుత్స. 2.53. త్రోవఁబట్టు (-పట్టు) అ.క్రి. వెళ్ళిపోవు. శక. 2.428. త్రోవరి వి. 1. బాటసారి, తోవనడిచేవాడు. సాంబ. దేవ. 18 ; 2. మార్గం తెలిసినవాడు. < త్రోవ + -అరి[4]. త్రోవలాఁచు స.క్రి. అడ్డగించు. పాండు. 3.104. < త్రోవ + -లు + అఁచు[2]. త్రోవలుగాచు(-కాచు) అ.క్రి. పొంచియుండు. కాశ. 4.52. త్రోవలో ముండ్లువేయు అ.క్రి. ఆదారిని మూసివేయు. వర. రా. కిష్కిం.పు. 414. 12 పం. త్రోవవెట్టు(-పెట్టు) రూ. త్రోవపెట్టు. అ.క్రి. దారిచూపు. ఆము. 5.117.

త్రోవడు చూ. త్రోపు.

త్రోసిరాజుచేయు చూ. త్రోయు.

తోసివేయు చూ. త్రోయు.

# థ

థేంక్స్ వి.బ.వ. కృతజ్ఞతలు.
ఇం. *Thanks*. కృతజ్ఞతలు.
< ఇం. Thanks.

థోడీ విశ. కొంచెం, స్వల్పం. కవిచౌ. సీ. 9.
హిం.ఉ. *థోడా*, *థోడీ*. స్వల్పమైన, తక్కువైన.
< ఉ. థోడీ.

# ద

ద దంత్యనాదస్పర్శం, అల్పప్రాణం. ఆధునికోచ్చారణంలో ఇది దంతమూలీయం. ఈ అక్షరం మూలద్రావిడ భాషలో లేదు.
< మూ.ద్రా. *త.

దక్క చూ. దక్కు. వి. కాపుదల.

దక్కఁగొను చూ. దక్కు[1].

దక్కనీ వి. దక్షిణానికి సంబంధించిన.
సం. *దక్షిణ-*. దక్షిణదిక్కు ; ప్రా. *దక్ఖిణ-* ; హిం. *దఖిన్*, *దఖ్ఖిన్*. దక్షిణ హిందూదేశం ; మరా. *దఖ్ఖిన్*. దక్షిణ హిందూదేశం ; ఉ. *దకన్*. నైజాంరాజ్యం.
< ప్రా. దక్ఖిణ-.

దక్కించు చూ. దక్కు[1].

<ప్రా. జంత్ర-.

**దంతలూటి** వి. పన్నుచుట్టూ లేచే పుండు.

సం. దంత-. పన్ను ; హిం. ఉ. లూట్, లూటి. బలవంతంగా లాగుకోవటం, లూటీ.

<సం. దంత- + హిం. లూటి.

**దంతసిరితోపుట్టు** అ.క్రి. ఆగర్భ శ్రీమంతుడగు.

సం. దంత-. పన్ను.

**దంతి**[1] రూ.చూ. దంతె[1]. వి. **1**. భవంతులలో మిద్దెలాదటానికి అడ్డంగా పరచిన కొయ్యమాను, దూలంమీద అడ్డంగా గాని దూలానికి బయలుగా గాని గోడలమీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కనవాసం ; **2**. పైరులో గడ్డి, గాదం, కలుపు మొ॥నవి పోవటానికి తోలేపరికరం ; **3**. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోటానికి ఉపయోగించే కొయ్య పరికరం.

**దంతి**[2] రూ.చూ. దంతె[3]. వి. ముళ్ళు కల్గి కలపనిచ్చే చెట్టు (Gymnosporia Montana).

**దంతిని** రూ.చూ. దంతె[1]. వి. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోవటానికి ఉపయోగించే కొయ్యపరికరం.

**దంతియ**[1] రూ.చూ. దంతె[1]. వి. **1**. స్తంభంమీది పీట. రాజవా. 5.85 ; **2**. ఇళ్ళకు వేసే కమ్మి, మిద్దెఇంటికి అడ్డంగా వేసేపట్టె. దశా. 4.49 ; **3**. కృషిసాధన విశేషం, నేల చదును చేసే అచ్చుకట్టు. ఆం. భా. 2.233 ; **4**. అంతరం ; **5** మదత ; **6**. భూమిపొర.

**దంతియ**[2] రూ.చూ. దంతె[2]. వి. నేపాళం. ఆం. భా. 2.68.

**దంతిరితాడు** వి. ఆకులతాడు, రాట్నం ఆకులకు చుట్టిన తాడు.

**దంతులు** వి.బ.వ. మూడు చిన్నచిన్న గుంటకల చేరిక (మూడు గుంటకలు ఒక కాడికే కట్టబడి ఒకజత ఎడ్లు చేతనే లాగబడతాయి).

**దంతె**[1] రూ. దంచె, దంతి[1], దంతిని, దంతియ[1], దంతెన, దంతెనము. వి. **1**. ఇళ్ళకు వేసే కమ్మి, మిద్దె ఇంటికి అడ్డంగా వేసే పట్టె. దశా. 4.49 ; **2**. కృషిసాధన విశేషం, నేల చదును చేసే అచ్చుకట్టు. ఆం. భా. 2.233 ; **3**. స్తంభం మీది పీట ; **4**. ఆము తీసేటపుడు మసిని కిందికి తీయటానికి ఉపయోగించే కొయ్య పరికరం.

సం. దంతక-. పన్ను, దంతిన్. దంతాలు కలది; ప్రా. దంతయ; అమా. దంతాలి. ఎండినగడ్డి, కసవు మొ॥ పోగు చేయటానికుపకరించే పనిముట్టు ;

క. జంతె. మిద్దెఇంటికి అడ్డంగా దూలం మీద వేసే పట్టె.

<ప్రా. దంతయ.

**దంతెక్ర్ర** వి. దంతెకున్న పొడుగాటి కామ. **దంతెగుంటక** వి. పాపటం, పైరులో కలుపుతీసే రెండుమూడు పలుగుల గుంటక. **దంతెపొలి** వి. **1**. రాసిచుట్టూ దంతెతో పొలిచుట్టటం ; **2**. దంతెతోలేముందు దాన్ని పూజించి చేసే ఏటబలి. **దంతెసోగ** వి. పాపటం, పైరులో గడ్డి, గాదం, కలుపు మొదలైనవి పోవటానికి తోలే పరికరం.

**దంతె**[2] రూ. దంతియ[2], డెంతె. వి. **1**. జాంబవతీ వృక్షం, నేపాళం. ఆం. భా. 2.68 ; **2**. ఒకరకం కంచె మొక్క (Clitoria Ternatea).

సం. దంతికా. నేపాళవృక్షం ; ప్రా. దంతియా ; అ.మా. దంతియా ;

క. దంతి.

<ప్రా. దంతియా.

**దంతె**[3] రూ. దంతి[2]. వి. ముళ్ళుకల్గి కలపనిచ్చే చెట్టు (Gymnosporia Montana).

**దంతెన** రూ.చూ. దంతె[1]. వి. పొలాన్ని చిన్నచిన్న మళ్ళుగా చేసుకోవటానికి ఉపయోగించే కొయ్యపరికరం.

**దంతెనము** రూ.చూ. దంతె[1]. వి. పెద్దదూలం. విష్ణుపు. 78.

**దంతెర** రూ.చూ. దంతర. వి. పెద్దపడుగులు ఒకేసారి పోసే ఒకరకం ఆను.

**దంతెరగుండు** వి. గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె. **దంతెరదిండు** రూ.చూ. జంత్రం దిండు. వి. గొంగడి నేసే మగ్గం జంత్రానికి కింద బిగించిన కొయ్య చెక్క.

**దంత్రంపుల్ల** చూ. జంత్రము. వి. అచ్చుకట్టేటపుడు వడిదారం చుట్టేకొయ్య.

**దంత్రంబల్ల** చూ. జంత్రము. రూ. దంతనం బల్ల. వి. అచ్చుకట్టే జంత్రానికి నిలువు పుల్లలు బిగించిన కిందపీట.

**దండడి** వి. **1**. సాంద్రత, ఆధిక్యం. భార. విరా. 2.60 ; **2**. సమ్మర్దం, రాయిడి. హరి. పూ. 7.170 ; **3**. సంకులరణం, దొమ్మి. ఆం. భా. 2.222 ; క్రి. విశ. ద్రు. **1**. దట్టంగా. కు. సం. 1.119 : **2**. అధికంగా. భార. విరా. 5.107 ; **3**. శీఘ్రంగా. పల్నా. 89 ; విశ. సాంద్రం, తరచైనది. భార. ఆరణ్య. 4.169.

ప్రా. ధంధోలియ-. ఘూర్ణితమగు, అలజడిపొందు ; మరా, ధాందల్-. కవిత, అలజడి, సంక్షోభం ; సిం. ధాంధిల్ ;

క. దందతె, దందలె, దాందలె. అలజడి.

<ప్రా. ధంధోలియ-.

**దండడించు** అ.క్రి. **1**. అధికమగు, సాంద్రమగు. భార. ఆరణ్య. 7.28 ; **2**. కలగు. అహల్యా. 5.122. **దండడిపడు** అ.క్రి. సాంద్రమగు, రాయిడిపడు, కలతపొందు. అహల్యా. 3.8. **దండడిమూఁక** వి. అల్లరిమూక. **దండడివెట్టు** (-పెట్టు) స.క్రి. సమ్మర్దం కలిగించు. భార. విరా. 4.184.

**దందన** రూ.చూ. దందనము. వి. మాయ, జాలం.

**దందనకత్తియ** రూ. దందనకత్తె. వి. మాయచేసే స్త్రీ. **దందనకత్తె** రూ.చూ. దందనకత్తియ. వి. మాయచేసే స్త్రీ. **దందనకాఁడు** వి. మాయకాడు. **దందనసేయు** (-చేయు) అ.క్రి. మాయచేయు, మోసగించు. చంద్రరే. 1.60.

**దందనము** రూ. దందన. వి. మాయ, జాలం.

సం. దంధన-. శాశ్వతంకానిది.

<సం. దంధన-.

**దందసిల్లు** రూ. దండసిలు, దండసిల్లు. అ.క్రి. **1**. ఇరుక్కొను. శృం.నై. 3.149 ; **2**. అదుముపడు, అణగు.

**దండా** వి. వ్యాపారం.

సం. ద్వంద్వ-. జంట ; ప్రా. దందా.

<ప్రా. దండా (అర్థవిపరి.).

**దండెడ** రూ. జంజెడ, దండెడ. వి. 1. మోటబొక్కెన లాగే మోకు ; 2. తలేటిమోకు, నాగలినుంచి తలేటికాడికి కట్టే మోకు.

**దంధన్న** వి. తెలివిలేనివాడు.

**దంధమా** వి. గోనెల్లో ఇసుక లేక ధూళి నింపి శత్రుసైన్యాలు ముట్టడించినపుడు చేసే సంరక్షణోపాయం. రంగా.చ. 3.61.

హిం.ఉ. *దమ్‌దమా*. కోటబురుజు, పరిఖ ; మరా. *దధ్మమా, దధ్మయా*-. ఎత్తుచేయబడిన సమతలప్రదేశం ; పార. *దమ్‌దమా*. ఆటంకం, కలవరం.

< ఉ. దమ్‌దమా.

**దంధమాలు** వి.బ.వ. పిరంగులవారు. రంగా.చ. 3.77.

**దన్నాసరి** వి. పులుపు తక్కువగాఉండే మేలురకం గోంగూర, దనాసరి గోంగూర.

**దన్ను** రూ.చూ. తన్ను. వి. 1. సహాయం, ఆసరా, బలం ; 2. బట్టీగోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ ; 3. నిలుపుచోటు ; 4. జేపుబల్లకాలు ; 5. మిద్దె మీదికి పొడుచుకొని వచ్చిన కర్ర ; 6. తీగెలు పైకి పాకటానికి అండగా పెట్టిన పుల్లలు, అల్లుడు.

**దన్నుగర్ర (-కట్టె)** వి. పంచ దగ్గరి కప్పు జారకుండా గోడకుగాని, అరుగుకుగాని పోటీగా పెట్టిన కర్ర. **దన్ను దారు** వి. సమర్థించేవాడు. పార. *-దార్*. కలవాడు అని అర్థం ఇచ్చే ఒక ప్రత్యయం. < దన్ను + పార. -దార్.

**దపిక** వి. మెతుకులు కలిసిన కూటిగంజి.

**దఫ్తధారు** వి. చిన్నపదాతిదళంపై అధికారి. ద.హిం.శా.సంపు. 7. శా.సం. 558. క్రీ.శ. 1934.

హిం.ఉ. *దఫాదార్*. సేనలోని దళాధికారి ; మరా. *దఫేదార్*. పదాతిదళాధికారి ; పార. *దఫేదార్* ; ఒ. *దఫాదార్*. పదాతిదళాధికారి, కూలీల మేస్త్రి.

< ఉ. దఫాదార్.

**దప్ప** వి. మందం, లావు, చిక్కదనం.

**దప్పడపుకుండలు** చూ. దప్పడము.

**దప్పడము** రూ.చూ. దప్పళము. వి. 1. కూరగాయముక్కలు ఎక్కువగావేసి పలచగా చేసిన పులుసు ; 2. ఎక్కువ ; 3. పిండి కలిపి చేసే పులుసు.

**దప్పడపుకుండలు** రూ.చూ. దప్పలంకుండలు. వి.బ.వ. నల్లగుండలు, పెళ్ళికి ఒక రోజు ముందుగా మేళతాళాలతో వెళ్ళి తెచ్చే మట్టి వంటపాత్రలు.

**దప్పము** విశ. దట్టమైన. భాను. 3.40.

క. *దప్ప, దొప్ప*. సాంద్రం, లావు, ముతకదనం, *దప్పనె, దప్పన్న, దపానె, దొప్పానె*. సాంద్రం, లావు, ముతక ; కొడ. *దప్మ్*. లావు, దళసరి, *దబర, దబళ్*. శరీరపు లావు ; తు. *దప్పము*. దట్టం, దగ్గరగా నేసిన, దళసరి.

**దప్పర** రూ.చూ. దప్పఱ. విశ. కరకు, మోటైన. బసవ. 3.1119 పం.

**దప్పఱ** రూ. దప్పర. విశ. కరకు, మోటైన. బసవ. 3.97.

క. *దప్పనె*. మోటైన.

**దప్పలంకుండలు** చూ. దప్పళము. హు. దప్పడపుకుండలు. వి.బ.వ. పెళ్ళికి ఒకరోజు ముందుగా మేళతాళాలతో వెళ్ళి తెచ్చే మట్టిపాత్రలు.

**దప్పళము** రూ. దప్పడము. వి. 1. రెండు మూడు కాయ దినుసులు చేర్చి పలచగా చేసిన పులుసు. పార్వ. 5.178 ; 2. ఎక్కువ ; 3. పిండి కలిపి చేసే పులుసు.

త. *తప్పళమి*. కాయగూరల ముక్కలతో ఉడికించిన చింతపండు పులుసు.

< త. తప్పళమ్.

**దప్పా** వి. మొట్టికాయ, టొంగా.

సం. దర్ప-. గర్వం ; ప్రా. దప్ప- : హిం. దప్ప.

**దప్పి** రూ.చూ. డప్పి. వి. 1. గ్లాని, శ్రమ, బడలిక. భార. ఆది. 8.247, భార.ఆరణ్య. 7.464 ; 2 నీరువట్టు, పిపాస, దాహం. భార.భీష్మ. 2.378, శృం.నై. 2.81.

**దప్పికి ఎండమావులు దాగ దగ్గరబోవు** అ.క్రి. వ్యర్థ ప్రయాసపడు. శాళ్ల.నం. 6 50. **దప్పికిచ్చు** అ.క్రి. దాహం పోవటానికై నీరు మొదలైనవిచ్చు. కువ. చ. 2.150. **దప్పికిదిక్కు** వి. మంచినీళ్ళిచ్చే దిక్కు. **దప్పికొను** రూ.చూ. దప్పిగొను. అ.క్రి. పిపాసితుడగు. **దప్పిగొను (-కొను)** రూ. డప్పికొను, డప్పిగొను, దప్పికొను. అ.క్రి. పిపాసితుడగు, నీరువట్టుగలవాడగు. శృం.నై. 4.52. **దప్పితీరు** అ.క్రి. తనివితీరు. పాండు. 3.72. **దప్పిదీర్చుకొను (-తీర్చుకొను)** అ.క్రి. 1. శ్రమతీర్చుకొను. భాస్క. రా.యు. 853 ; 2. దాహం తీర్చుకొను. **దప్పిదేరనగు** అ.క్రి. 1. సంతృప్తిచెందు. ఉ.హరి. 2.16 ; 2. దప్పి తీర్చుకొను.

**దప్పిక** చూ. దయ్యు, డప్పి. వి. దాహం, పిపాస.

పర్జి. *అండ్*. ఆకలగు లేదా దాహంవేయు ; కొలా. *ఆడ్త్*. దాహమగు ; నా. *అడ్*. దాహం, దాహమగు ; గ. *అండ్*. ఆకలగు ; ఒలా. *అండ్*. ఆకలగు లేదా దాహంవేయు.

**దఫా** వి. తడవ, పర్యాయం.

హిం.ఉ. *దఫా*. పర్యాయం : మరా. *దఫా*. పర్యాయం ; పార. *దఫ్అత్, దవ్అహ్*. పర్యాయం ; అర. *దఫ్అహ్*. ఒకపర్యాయం.

< ఉ. దఫా.

**దఫ్తరు** వి. కచ్చేరి, కార్యాలయం.

హిం. *దఫ్తర్*. కార్యాలయం ; మరా. *దఫ్తర్*. జ్ఞాపిక, కార్యాలయం ; పార.ఉ. *దఫ్తర్*. కార్యాలయం ; పార. *దఫ్తర్*. పుస్తకం, రికార్డు ; అర. *దఫ్తర్*. పుస్తకం, రిజిస్టరు.

< ఉ. దఫ్తర్.

**దబకాయించు** స.క్రి. 1. అదుము ; 2. గదమాయించు ; 3. బుకాయించు.

హిం. *దబ్‌కానా*. దాచటం.

< హిం. దబ్‌కా(నా) + -ఇంచు$^3$.

**దబదబ** వి. తలుపుకొట్టటం, మొత్తడం మొ॥ వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం.

క. *తపక్కనె*. హఠాత్తుగా, *తప్పనె, తెప్ప*. వేగంగా,

హఠాత్తుగా, ఒకేసారి, దవ్, దోప్. బరువైన వస్తువులు పడినప్పు డయ్యే చప్పుడు, దబక్కు. మనుషులుగాని, మూటలుగాని పడినప్పుడయ్యే చప్పుడు ; తు. దబక్క. హఠాత్తుగా, దబదబ. గుండె కొట్టుకునే చప్పుడు ; త. తపుక్క్-ఎనల్. పడటంలో అయిన వేగాన్ని తెలియ చేసే శబ్దం. దొబక్న్, దొపక్న్, ఫెళఫెళమని పడి నప్పుడయ్యే శబ్దం.

దబదబబాదు స.క్రి. కొట్టు.

**దబర** రూ.చూ. డబ్బర. వి. 1. గిన్నె ; 2. చట్టి, వంటకు వాడే మట్టిపాత్ర ; 3. కిందా పైనా ఒకే కొలత కలిగిన లోహపాత్ర.

**దబరకము** రూ. దామరకము. వి. ఉన్నట్లుండి నొప్పిపట్టి మోకాలు వంగక పోవడం.

**దబరా** రూ.చూ. డబ్బర. వి. వెడల్పైన గిన్నె, బొగిణి.

దబరాసట్టి(-చట్టి) వి. పొడుగ్గాఉండే చిన్న మట్టిపాత్ర.

**దబరిగి** రూ.చూ. దబరిగె. వి. బేసిన్, ఇత్తడితో తయారు చేసిన పాత్ర.

**దబరిగిన్నె** చూ. దబర. రూ. దవిరిగిన్నె. వి. పచ్చడికి వాడే మట్టి పాత్ర.

**దబరిగె** రూ. దబరిగి. వి. బేసిన్, ఇత్తడితో తయారుచేసిన పాత్ర.

**దబలచీర** వి. పట్టెలు పట్టెలుగా నేసిన ఒకరకం చీర, మాల పిల్లచీర.

**దబాటివాన** చూ. దబాటు.

**దబాటు** రూ.చూ. డబ్బాటు. అవ్య. అకస్మాత్తుగా.

దబాటివాన రూ.చూ. దబ్బాటువాన. వి. పెద్దపెట్టున వచ్చి కొద్దిసేపట్లో నిలచిపోయేవాన.

**దబాడీ** వి. ధైర్యంగల ఆడది.

హిం. ఢబీలా. చురుకైన.

**దబాదిబ** వి. తలుపు మొదలైనవి తట్టటం, పరిగెత్తటం, బాదటం, మొత్తటం మొదలైనవాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**దబాయించు** రూ. డబాయించు. స.క్రి. 1. అదుము ; 2. గద మాయించు ; 3. బుకాయించు ; 4. నెట్టు ; 5. ఎదురు తన్ను ; 6. బెదిరించు.

హిం. దబానా. అణచు.

<హిం. దబా(నా) + - ఇంచు³.

**దబారా** రూ.చూ. డబ్బర. వి. 1. కిందాపైన ఒకేకొలత కలిగిన లోహపాత్ర ; 2. గిన్నె.

**దబాలున** అవ్య. ద్రు. ఒక్కమారుగా. దబుక్కున. ధ్వన్యను.

**దబుక్కున** అవ్య. ద్రు. ఒక్కమారుగా. ధ్వన్యను.

**దబేనా** వి. 1. కుప్ప, పోగు ; 2. కూడబెట్టిన ధనం.

హిం. డబ్. జేబు, రూపాయల సంచి.

**దబ్బ¹** వి. ఒకరకం నారింజ. నీలా. 2.46 (Citrus Medica).

దబ్బకాయ వి. ఒకరకం కాయ. దబ్బగూడు వి. బాదం గూడు, అండాకారంగాఉన్న గూడు. దబ్బచిక్కుడు వి. గింజ బద్దగా ఉండే ఒకరకం చిక్కుడు. దబ్బనిమ్మకాయ వి. కరిణికాయ.

**దబ్బ²** వి. కుశ. హర. 7.12.

సం. దర్భ-. కుశ ; ప్రా. దబ్భ- ; మరా. ధాభణ్.

<ప్రా. దబ్భ-.

దబ్బపాన్పు వి. దర్భశయ్య. పాంచాలి. 3.23. దబ్బ యుంగరము(-ఉంగరము) వి. పవిత్రపు ముడిలా బంగారంతో చేసిన ఉంగరం. పరమ. వి. 4.207. దబ్బవ్రేలు వి. పవి త్రపు వేలు, అనామిక. హరి.ఉ. 10.233. దబ్బసంబెళ వి. దర్భలతో చేసిన సజ్జవంటి పాత్ర, దబ్బసంచి.

**దబ్బ³** వి. 1. వెదురుబద్ద, వేత్రం. సానంద. 2.24 ; 2. తాడుకట్టిన వింటిబద్ద ; 3. రాటికి కిందాపైనా కట్టిన వెదురు బద్ద ; 4. పంటెకాయచుట్టూ వంచి కట్టిన వెదురుబద్ద ; 5. పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం ; 6. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డపట్టె ; 7. అచ్చు అతికేటప్పుడు అచ్చు కర్రలకు ఆధారంగా నిల బెట్టిన పుల్ల ; 8. మరమగ్గం బొమ్మకు నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర ; 9. పెండెబద్ద, పెండెకట్టులో వాడే చీల్చిన వెదురు ; 10. కావడికి వేసే వెదురుబద్ద ; 11. మెరుగుపెట్టవలసిన రాతిని యంత్రంలో బిగించే టప్పుడు దానిపక్కన పెట్టే కొయ్యముక్క ; 12. వాట తయారీలో సమ దళసరిని మన్ను లేపడానికి ఉపయో గించే వంకరగా ఉండే పల్చని వెదురుకొయ్య ; 13. కొడ తం, ఒంటిపలుగు దంతెకు నొగల బదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్రముక్క ; 14. అడ్డపట్టె, బండిచక్రంలోని అడ్డపట్టె ; 15. పలుకు, ముక్క ; 16. పచ్చి తాటికమ్మ ; 17. చదరపువైపు ; 18. ఇనపగంప.

క. డబ్బె. డెబ్బె, దబ్బె, దెబ్బె. వెదురుబద్ద, దబ్బణ, దబ్బళ ; తు. దబ్బు. పగులు, దబ్బె, డెబ్బె, దబ్బణ. వెదురుముక్క ; త. తప్పై.

దబ్బకట్టు అ.క్రి. గడ్డకట్టు. దబ్బకట్టె వి. దిమ్మనదుక్క, దిమ్మిన అడుగునఉండే కొయ్యదుంప. దబ్బకంటం వి. బద్దంచు, బానలు, అంబలిదాకలు మొ. వాటికి వెడల్పుగా బద్దలాగ సాఫీగాపెట్టే ఒక అంచు. దబ్బకమాను వి. చేటార్చి, కిటికీలమీద, గుమ్మాలమీద, వేసే అర్ధచంద్రా కారపు ఆర్చి. దబ్బచిడి వి. పాత్ర పక్కల్లో దబ్బతోవేసే గీతల అలంకరణ. దబ్బంచు రూ.చూ. బద్దంచు. వి. బానలూ అంబలి దాకలు మొ. వాటికి వెడల్పుగా బద్దలుగా సాఫీగా పెట్టే ఒక అంచు. <దబ్బ³ + అంచు. దబ్బటిక రూ.చూ. బద్దటిక. వి. బద్దమాదిరి అంచు ఉండే చిన్న మట్టిపాత్ర. <దబ్బ³ + అటిక. దబ్బంటు వి. రాయబార కుండ, సారాబట్టీలో గూనలోని ఊట సారాగా దిగటానికి వీలుగా నేలమీద పెట్టిన పాత్ర. <దబ్బ³ + అంటు. దబ్బతలుపు వి. వెదురు తలుపు. దబ్బదోనుగ వి. మగ్గం మీద నేతగుడ్డచుట్టే ఒకరకం దోనె. దబ్బనిచ్చెన రూ. బద్దనిచ్చెన. వి. గడలకు మారుచెక్కలు వాడి తయారు చేసిన నిచ్చెన. దబ్బపట్టు రూ.చూ. బద్దపట్టు. స.క్రి. సారె మీది వాటను వెదురుబద్దతో పూర్తి ఆకారం వచ్చేటట్లు చేయు. దబ్బపంటె వి. చెలకపంటె, డబ్బా ఆకారంలో

ఉండే ఒకరకం కొయ్యపంటె. దబ్బమిటుకుళ్ళు వి.బ.వ. పెసల మాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం. దబ్బరాకు వి. వెడల్పుగా బద్దలాగా మిట్టనట్టికి పెట్టిన అంచు. దబ్బల బుడ్డి వి. డబ్బా ఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంటె. దబ్బల్తలుపు వి. జజ్జవతలుపు, వెదురుబద్దల్తో అల్లిన తలుపు. దబ్బవా(డు విణ. మేదరవాడు. దబ్బసిడి రూ. డబ్బసిడి. వి. కర్రలతో కట్టిన మెట్టు. దబ్బార్చి వి. చేటార్చి, కిటికీల మీద, గుమ్మాలమీద వేసే అర్ధచంద్రాకారపు ఆర్చి. దబ్బేయు రూ.చూ. బద్దేయు. స.క్రి. వెదురుబద్దతో వాటను నునుపుపట్టు.

దబ్బ[4] రూ.చూ. దవ్వ. వి. 1. జొన్న, సజ్జ, రాగి మొ. పైరు మొక్కలకాడ; 2. ఇంటికప్పుకు పనికివచ్చే తృణ విశేషం (Erogrostis Cynosuroides).

దబ్బకట్టు వి. జొన్న, సజ్జ, రాగి మొ. పైరుమొక్కల కాడ కట్టు. దబ్బగోగడ వి. కాడలు దబ్బలాగా ఉండే గోగడ (Chrysopogon Species). దబ్బతుంగ వి. వరిచేలల్లో మొలిచే సన్నకాడగల తుంగ (Cyperus Iria).

దబ్బ[5] రూ.చూ. దొమ్మ. వి. పశువులకి వచ్చే ఒకరకం ఊపిరితిత్తుల జబ్బు.

దబ్బట రూ. దబ్బటి. విణ. అనుకైన, పలచనైన; వి. అణుకు, సంకటి.

దబ్బటవాన రూ.చూ. దబ్బాటువాన. వి. పెద్దపెట్టున వచ్చి కొద్దిసేపట్లో నిలిచిపోయే వాన.

దబ్బటి రూ.చూ. దబ్బట. విణ. అనుకు, పలుచనైన.

దబ్బడము రూ.చూ. దిబ్బడము. వి. మూకుడు.

దబ్బడించు స.క్రి. 1. మూకుడితో మూయు; 2. చేతులతో చరచు.

దబ్బడించు చూ. దబ్బడము.

దబ్బణం రూ.చూ. దబ్బనము. వి. పెద్దసూది, గోనెలుకుట్టే సూది.

దబ్బనము రూ. దబ్బణం, దబ్బలము, దబ్బళం, దబ్లం. వి. పెద్దసూది, గోనెలుకుట్టే సూది. ఆం.భా. 2.297.

దబ్బరికం రూ. దబ్బలకం, దబ్బుడకం. వి. ముందరి కాళ్ళకి వచ్చే కీళ్ళ వాపు వ్యాధి.

దబ్బఱ రూ. దబ్బఱ, దబ్బసి. విణ. 1. భయంకరమైన. కు.సం. 6.37; 2. మోసగాడు. కవిజనా. 1.4; 3. అసత్యమైన, కల్ల; 4. కృతకం, తెచ్చిపెట్టిన; వి. 1. విలాసం. బసవ. 3.97; 2. విపత్తు. రం.రా.యు.; 3. బొంకు, అసత్యం. ప్రబోధ. 2.32, పల్నా. 2.50 వు; 4. తప్పు. చంద్రాంగ. 4.132; 5. మోసం. అచ్చ.రా. బాల. 173; 6. నిందావాక్యం. దశా. 9.125.

క. తప్పల్. తప్పు చేయటం, తప్పిపోవటం; త. తప్పల్. తప్పు, నేరం, తప్పఱై. అబద్ధం, అసత్యం; మ. తప్పల్. తప్పు, దండుగు.

దబ్బఱకత్తియ రూ. దబ్బరకత్తె. వి. దబ్బర లాడే స్త్రీ.

దబ్బఱకత్తె రూ.చూ. డబ్బఱకత్తియ. వి. అబద్ధాలాడే స్త్రీ.

దబ్బఱకా(డు వి. 1. విలాసవంతుడు. ప్రబంధ. 691; 2. దబ్బరలాడేవాడు, అసత్యమాడేవాడు. శుక. 2.299; 3. మోసగాడు. శుక. 3.37. దబ్బఱయాట(-ఆట) వి. విలాసక్రీడ. హరి.ఉ. 7.197. దబ్బఱి వి. దబ్బరకాడు, దబ్బరకత్తె.

దబ్బఱి చూ. దబ్బఱ.

దబ్బలకం రూ.చూ. దబ్బరికం. వి. ముందరికాళ్ళకి వచ్చే కీళ్ళ వాపువ్యాధి.

దబ్బలము రూ.చూ. దబ్బనము. వి. 1. గోనెలు మొదలైనవి కుట్టే పెద్దసూది; 2. బెంతికదురు, అచ్చుకట్టేటపుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల; 3. పేటవడికి కింద వేలాడగట్టిన బరువు.

దబ్బళం రూ.చూ. దబ్బనము. వి. సారెముల్లు, వాటల్ని కోయడానికి సారెసూదికంటె లావుగా ఉండే ఇనప కమ్మి.

దబ్బసి రూ.చూ. దబ్బఱ. వి. 1. అసత్యంమాట, అబద్ధం; 2. మోసం.

దబ్బాటు రూ.చూ. డబ్బాటు. వి. ఆకస్మికత, హఠాత్సంభవం, యాదృచ్ఛికం; విణ. హఠాత్తుగా సంభవించిన, ఆకస్మిక మైన; క్రి.విణ. ఆకస్మికంగా, హఠాత్తుగా.

దబ్బాటుపోన రూ.చూ. దబ్బాటువాన. వి. పెద్ద పెట్టున వచ్చి కొద్దిసేపట్లో నిలిచిపోయే వాన. దబ్బాటువాన రూ. డబ్బాటువాన, దబాటివాన, దబ్బటవాన, దబ్బాటు పోన, దిబాటవాన, దెబ్బటోన. వి. పెద్దపెట్టున వచ్చి కొద్దిసేపట్లో నిలిచి పోయే వాన.

దబ్బార్చి చూ. దబ్బ[3].

దబ్బిచిప్ప వి. తాటిచెట్టు బద్దచేసేటపుడు ఉపయోగించే సాధనం.

దబ్బిడ చూ. దబ్బడము. వి. రాయబారంకుండ, సారాబట్టీలో గూనలోని ఊట సారాగా దిగటానికి వీలుగా కింద భూమి మీద పెట్టిన మట్టిపాత్ర.

దబ్బిడికుండ చూ. దబ్బిడ. వి. రాయబారంకుండ, సారా బట్టీలో గూనలోని ఊటసారాదిగటానికి వీలుగా నేలమీద పెట్టిన మట్టిపాత్ర.

దబ్బిరి రూ. దబ్బిలి. విణ. నిలకడలేని, స్థిమితం లేని.

దబ్బిలి రూ.చూ. దబ్బిరి. వి. 1. అల్లరి; 2. అబద్ధాలకోరు; 3. దుర్మార్గుడు, పోకిరి.

దబ్బిలితనము వి. దుర్మార్గం, పోకిరీతనము. దబ్బిలి పదము వి. బాధకలిగించేమాట. దబ్బిలిపిడత చూ. దబ్బిడ. వి. తలంటి పిడత, అడుగున గుబ్బపెట్టి పాత్ర మూలకి బిర్రుగాపట్టేటట్లు చేసిన మూతతో కూడిన పిడత.

దబ్బు[1] చూ. తప్పు. స.క్రి. 1. చెప్పు. సారంగ. 1.71; 2. బొంకు. సారంగ. 3.208; వి. 1. మాట. సారంగ. 1.71; 2. బొంకు. సారంగ. 3.208; 3. దబ్బడం, మూకుడు, మూత; 4. మోసం.

తు. డబ్బు. అబద్ధం, పొగడుకోవటం; త. తప్పఱు. అబద్ధం, మోసం, తప్పల్. దోషం, నేరం; మ. త్రప. అబద్ధం, తప్పల్. తప్పిదం; కుఇ. దప. అబద్ధం.

దబ్బుకొను స.క్రి. పట్టుకొను. దబ్బుడు వి. మూత, దబ్బడం. దబ్బుపెట్టు(-పెట్టు) స.క్రి. మూయు. ధిల్లా. 1.

**దబ్బు**[2] స.క్రి. తోగు, గుంటచేయు, నేలను తొలుచు.

**దబ్బుజంబు** వి. చిత్తడినేలల్లో పది అడుగుల ఎత్తు పెరిగే చెట్టు (Typha Angustata).

**దబ్బుడకం** రూ.చూ. దబ్బరికం. వి. ముందరికాళ్ళకి వచ్చే కీళ్ళ వాపువ్యాధి.

**దబ్బున** క్రి.విణ.ద్రు. శీఘ్రంగా. నీలా. 3.62.

క. తపక్కనె. శీఘ్రంగా, ఒకేసారి, *దప్*, *దొప్*. బరువైనవస్తువులు కిందపడినప్పుడు, చిన్నగా లెంపకాయ కొట్టినప్పుడు అయ్యేచప్పుడు; తు. *దబక్క*. హఠాత్తుగా, *దబదబ*. గుండె కొట్టుకునే చప్పుడు; త. *దబర్ు*. దబ్ అనే శబ్దం, *దొబర్‌దబర్ ఇన్(-ఇష్)*. గింజుకునేటప్పుడైన శబ్దం.

**దబ్బర** రూ.చూ. డబ్బర. వి. **1** గిన్నె. రుక్మిణీప. 3.72; **2.** కిందాపైన ఒకే కొలత కలిగిన లోహపాత్ర; **3.** చట్టి, వంటకువాడే చిన్న మట్టిపాత్ర.

హిం. *డబ్‌రా*. కుండ, నీళ్ళకుండ.

<హిం. డబ్‌రా.

**దబ్బేయు** చూ. దబ్బ[3].

**దబ్లం** రూ.చూ. దబ్బనము. వి. లావుగా పొడుగ్గా ఉండే సూది.

**దమదమా** వి. బురుజు.

హిం.ఉ.పార. *దమ్‌దమా*. బురుజు.

<ఉ. దమ్‌దమా.

**దమయంతి** వి. ముదురు ఆకుపచ్చ రంగు.

సం. *దమయంతీ*. నలుని భార్య.

<సం. దమయంతీ (అర్థవిపరి.).

**దమయంతిచీర** వి. ఒకరకం ఆకుపచ్చచీర. **దమయంతిపచ్చ** వి. ఒకరకం ముదురు ఆకుపచ్చ. **దమయంతిపాపిడిచీర** వి. మూడు కడ్డీల పోగులు వాటి మధ్య గీరలు పడేటట్లు నేసిన గడిచీర.

**దమాయించు** రూ. దవాయించు, ధమాయించు. స.క్రి. అద్దలించు, కొయ్యసాధనాలతో మెల్లగా కొట్టు, బాదు.

<హిం. ధమా(నా) + -ఇంచు[3].

**దంపకము** చూ. దంచు. రూ.చూ. డంపకము. వి. వడ్లు దంచటం.

**దంపక్రరు** చూ. దమ్ము[1].

**దంపకఱ్ఱ** చూ. దమ్ము[1].

**దంపగొట్టెలు** చూ. దమ్ము[1].

**దంపతితాంబూలాలు** వి.బ.వ. పెళ్ళిలో తొట్లకట్టి పాన్పు సమయంలో నూతన వధూవరుల చేత పెళ్ళికి వచ్చిన దంపతులకు టెంకాయతో పాటు ఇచ్చే తాంబూలాలు, వాటిని జంటగానే తీసుకొని నూతన వధూవరుల్ని సంతాన ప్రాప్తి కోసం వారు దీవిస్తారు.

**దంపదుక్కి** చూ. దమ్ము[1].

**దంపనాగలి** చూ. దమ్ము[1].

**దంపనేల** చూ. దమ్ము[1].

**దంపర** వి. గుంపినిచెట్టు, కలపనిచ్చే ఒకరకం చెట్టు (Odina Wodier).

**దంపరేవడి** చూ. దమ్ము[1].

**దంపిల్లియాడు** చూ. దంపిల్లు.

**దంపిల్లు** అ.క్రి. చెలగాటమాడు.

**దంపిల్లియాడు (-అడు)** అ.క్రి. చెలగాటమాడు. మల్హా. 1.58.

**దంపు** చూ. దంచు. స.క్రి. నలగగొట్టు. భాగ. 6.370.

**దంపుటిల్లు** వి. దంచేఇల్లు. **దంపుడు** వి. **1.** భవంతి ముందు రోలుఉంచే ప్రదేశం; **2.** మైకాగనులలో సరకు సాలు ననుసరించి పక్కన ఏర్పడే మెత్తటిసాలు; **3.** నలగ్గొట్ట బడింది; విణ. నలిగిన. **దంపుడుపాట** వి. రోకటి పాట, దంపుతూ పాడేపాట. **దంపుడు బియ్యము** వి. దంచినబియ్యం. **దంపుడువూక (-ఊక)** వి. తవుడు. **దంపుటోలు** వి. దంచటానికుపయోగించే రోలు. చెన్న బసవ. 2.204. **దంపుళ్ళది** వి. వడ్లుదంచిన కూలితో జీవించే స్త్రీ.

**దమ్మ**[1] రూ.చూ. దొమ్మ. వి. పశువులకు వచ్చే ఒకరోగం.

**దమ్మ**[2] రూ. దమ్మము[1]. వి. నాలుగు కాసుల నాణెం. E.I. సంపు. 6. శా. సం. 22. క్రీ. శ. 1520.

సం. *ద్రమ్మ-*. ఒకనాణెం, నిష్కంలో పదహారో వంతు; ప్రా. *దమ్మ-*. ఒకానొక బంగారు నాణెం; నే. ఫురా. *దామ్*.

<ప్రా. దమ్మ-.

**దమ్మచ్చు** వి. ఇనపగుదియ.

సం. *ధర్మ-*. ధర్మం; ప్రా. *ధమ్మ-*. సదాచారం, పుణ్యం.

<ప్రా. ధమ్మ- + అచ్చు[1].

**దమ్మడుచిక్కు** అ.క్రి. (చేతికి) లొంగు, వశమగు. విప్ర. 3.9.

**దమ్మఁడు** రూ. దమ్ముఁడు. వి. ధార్మికుడు, కపటంలేనివాడు. విప్ర. 3.9, హరిశ్చ. 4.101.

సం. *ధార్మిక-*. ధర్మంకలవాడు, *ధర్మ-*. న్యాయం; ప్రా. *ధమ్మిఅ-*. ఆచారపరుడు, *ధమ్మ-*. న్యాయం, పుణ్యం; అప. అ.మా. *ధమ్మిఅ*. ధార్మికుడు.

<ప్రా. ధమ్మ-.

**దమ్మదార** వి. యుద్ధసమయంలో వీరుల మరణానికి సంకేతంగా ఊదేబాకా. క్రీడా. 54.

సం. *ధర్మ-*. ధర్మం, *ధారా*. నీటిచాలు. కత్తివాదర; ప్రా. *దమ్మ-*. ధర్మం, *ధార-*. ధరించటం.

<ప్రా. దమ్మ- + ప్రా. ధార-.

**దమ్మబడివీసాము** చూ. దమ్మ[2]. వి. ప్రతిదమ్మ విలువకొక వీసాం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 505. క్రీ.శ. 1318.

**దమ్మము**[1] రూ.చూ. దమ్మ[2]. వి. కాకణీచతుష్టయం. నాలుగు కాసుల నాణెం. ఆం. భా. 2.274.

**దమ్మము**[2] వి. **1.** ధర్మం. కువ. చ. 2.114; **2.** పుణ్యం.

సం. *ధర్మ-*. న్యాయం, పుణ్యం; ప్రా. *ధమ్మ-*; అప. అ.మా. జైమహా. పా. మా. *ధమ్మ-*. పుణ్యం, సదాచారం, శుభకర్మ;

క. తు. *ధమ్మ*; కుఇ. *దొర్మ*. దానం, ధార్మికత.

<ప్రా. ధమ్మ-.

**దమ్మరాజు** వి. ధార్మికుడైన రాజు, ధార్మికుడు. కువ. చ. 2.114.

సం. *ధర్మరాజ-*. ధర్మరాజు, ధర్మంకలవాడు ; ప్రా. *ధమ్మ-*. న్యాయం, ధర్మం.

<ప్రా. ధమ్మ- + సం. రాజన్.

**దమ్మస్** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిచేయటానికి, కంకర వేసిన తర్వాత చదరం చేయటానికి మొద్దుతో దంచటం, దిమ్మెసవేయటం.

**దమ్మసు** రూ.చూ. దిమ్మిస. వి. చాటుబల్ల, నేలను గట్టిపరచడానికి వాడేకొయ్య లేక ఇనపపరికరం.

**దమ్మస్తు** రూ.చూ. దిమ్మిస. వి. గచ్చు మొ॥ వాటిని గట్టి పరచేది.

**దమ్మిడి**[1] వి. అయిదుకాసుల నాణెం (రెండు కాసుల నాణెం అని కొందరు), అణాలో పన్నెండోవంతు.

సం. *ద్రమ్మ-*. ఒకబంగారు నాణెం, నిష్కంలో పదహారో వంతు ; ప్రా. *దమ్మ-* ; మరా. *దమడీ*. ఒక నాణెం ; హిం. *దమడీ*. పైసాలో ఎనిమిదో భాగం ;

క. *దమడి, దమ్మిడి* .

<మరా. దమడీ.

**దమ్మిడికికొరకాకుండు** అ.క్రి. పనికిరాకపోవు. **దమ్మిడి పుట్టకపోవు** చూ. దమ్మిడి. అ.క్రి. ఏమాత్రం పరపతిలేకపోవు.

**దమ్మిడి**[2] వి. గంజాంనుంచి గోదావరివరకు అడవుల్లో పెరిగే మొక్క (Desmodium Triquentrum).

**దమ్మిస్సట్టి** చూ. దిమ్మిస. వి. అరపడి లేక పడిబియ్యం ఉడికే మట్టిపాత్ర, ఒకప్పుడు దమ్మిడీకి వాడే చిన్నమట్టిపాత్ర.

**దమ్మిస్సట్లరాయి** చూ. దిమ్మిస. వి. మధ్యరకం పాత్రల్ని సర్సటానికి వాడే చిన్నరాయి.

**దమ్ము**[1] వి. 1. అడుసు, పంకం ; 2. పొలం నీరుపెట్టి దున్నడం ; 3. తడపటం.

క. *దమ్ము*. వ్యవసాయం.

**దంపక్రు** రూ.చూ. దంపకఱ్ఱు, వి. తడినేలల్లో ఉపయోగించే నాగలి. **దంపకఱ్ఱు** రూ. దంపక్రు. వి. దంపనాగలి. **దంపగొట్టెలు** వి.బ.వ. నీటిముంపుడుకు ఆగే ఒకరకం వడ్లు. **దంపదుక్కి** వి. నీళ్ళుపెట్టి దున్నిన మాగాణిపొలం. **దంపనా(గలి** రూ. దమ్మునాగలి. వి. దమ్ముచేయటానికి ఉపయోగించేనాగలి. **దంపనేల** వి. మెట్టనేల. **దంపరేవడి** వి. బంకరేగడి, నలుపు తెలుపు రంగులో ఉండేమాగాణిచేలోని రేగడి. **దమ్ముకొను** అ. క్రి. 1. అడునగు, పంకిలమగు, బురదగు ; 2. తేమపైకి ఎక్కు. **దమ్ముగొణవ** రూ. దమ్ముగొనవ. వి. బురదనాగలి, మాగాణినేలల్లో ఉపయోగించే అరిగిపోయిన మెట్టనాగలి. **దమ్ముగొనవ** రూ.చూ. దమ్ముగొణవ. వి. బురదనాగలి, మాగాణి నేలల్లో ఉపయోగించే అరిగిపోయిన మెట్టనాగలి. **దమ్ముచాలు** వి. మాగాణికి నీళ్ళుపెట్టి మొదటిసారి దున్నటం. **దమ్ముచేయు** స.క్రి. 1. పొలానికి వేయటానికి ముందు తడుప ; 2. తడిపి చేనుదుక్కి చేయు. **దమ్మునాగలి** రూ.చూ. దంపనాగలి. వి. బురదనాగలి, దమ్ముచెయ్యటానికి మాగాణి నేలల్లో దున్నే నాగలి. **దమ్ముపూజ** వి. మాగాణిలో పైరు మొలకెత్తేటప్పుడు ఏట బలితో చేసే పూజ.

**దమ్ము**[2] వి. 1. క్షణం. పద్మ. యు. 202 ; శక్తి, ధైర్యం ; 3. శాపం ; 4. చుట్ట మొ॥ వాటిని కాలుస్తూ ఒకసారి పీల్చుకోవటం ; 5. కల్లుఒకసారి తాగటం.

హిం. *దమ్*. శ్వాసం, ఊపిరి ; ఉ. *దమ్*. క్షణం, శ్వాసం ; పార. *దమ్*. శ్వాసం, గాలి, క్షణం, గంట.

<ఉ. దమ్.

**దమ్ముకొను** అ.క్రి. బిగియు, గట్టిపడు. **దమ్ముపట్టు** స.క్రి. గట్టిగా ఊపిరి బిగపట్టు, పొగపీల్చు. **దమ్ములాగు** స.క్రి. పొగపీల్చు.

**దమ్ము**[3] రూ.చూ. దొమ్మ. వి. పశువుల ఊపిరితిత్తులకి వచ్చే ఒకరకం వ్యాధి.

**దమ్ము(డు** రూ.చూ. దమ్మ(డు. వి. అజ్ఞుడు, తెలివిలేనివాడు. ఆం.భా. 3.12.

**దమ్మువులు** వి.బ.వ. ధర్మాలు. అద్దంకి శాసనం, క్రీ.శ. 848.

సం. *ధర్మ-*. న్యాయం ; ప్రా. *ధమ్మ-* ; అ.మా. *ధర్మ-, ధరమ-* ; అప. *ధర్మ*.

త.మ. *తరుమమ్*.

<ప్రా. ధమ్మ-వు + -లు.

**దయసేయు (-చేయు)** స.క్రి. 1. ఇచ్చు. భార.ఆది. 4.60 ; 2. ఇప్పించు. కు.సం. 2.61 ; 3. దానంచేయు. నె.శా. కందుకూరు శాసనం. 67 ; 4. అందించు ; అ.క్రి. 1. వచ్చు ; 2. పోవు.

సం. *దయా-*. కరుణ.

<సం. దయా + చేయు.

**దయావెసను** వి. దయావ్యసనుడు. మాచర్ల శాసనం. క్రీ.శ. 641.

సం. పా. ప్రా. *దయా*. కరుణ ; సం. *వ్యసన-*. చెడ్డలవాటు ; పా. *వ్యసన*. దురదృష్టం.

<సం. దయావ్యసన-.

**దయిలువారు** అ.క్రి. అతిశయించు. యయా. 1.66.

**దయివాఱు** రూ.చూ. దైవాఱు. అ.క్రి. 1. ఊడేరు. మను. 3.29 ; 2. పొంగిపొరలు, నిండు. వసు. 6.99 ; 3. అతిశయించు. విజయ. 1.63.

**దయ్యపలం** చూ. దయ్యము.

**దయ్యపుతట్టుకాయ** చూ. దయ్యము.

**దయ్యపుతాడి** చూ. దయ్యము.

**దయ్యపుమబ్బు** చూ. దయ్యము.

**దయ్యపుసోకుడు** చూ. దయ్యము.

**దయ్యము** వి. 1. దేవుడు. భార.విరా. 4.59 ; 2. విధి, అదృష్టం. భార.ఉద్యో. 3.67 ; 3. పిశాచం. శృం.నై. 2.122 ; 4. వేలుప, దేవత (ఈ అర్థంలో బహువచన రూపంలో ఉంటుంది.). యయా. 1.12 ; 5. బ్రహ్మ.

సం. *దేవ-*. దైవం ; ప్రా. *దఇవ-*. దైవం, భాగ్యం, అదృష్టం, ప్రారబ్ధం, *దఇవ్వ, దెవ్వ* ; శౌ.మా. *దెవ్వ* ; పా. *దేవ, దెఇవ్వ*.

క. తైయ, దైయ. రాక్షసుడు, దెవ్వ, దెవ్వ. రాక్షసుడు ; తు. దెయ్య, దైయ, దెవ్వ. పిశాచం, దైవ, దెయివ ; త. తెయ్‌వమ్. దేవత్వం ; మ. తెయ్యం, దెయివం ; బ్రా. దేన్. రాక్షసుడు, భూతం.

<ప్రా. దఇవ-.

దయ్యపలం వి. ఒకరకం కలుపుమొక్క. దయ్యపుతట్టు కాయ వి. లోపల కొబ్బరిలేని కొబ్బరికాయ. దయ్యపుతాడి వి. ఏడాది పొడుగునా గెలలు వేసి పిందెపాటుతోనే రాల్చి వేసే తాడిచెట్టు. దయ్యపుమబ్బు రూ. దెయ్యపొంబ్బు. వి. పెద్దగా కొండలాగా ఆవరించిన నల్లమబ్బు. దయ్యపుసోకుడు వి. గాలిసోకటం. దయ్యముతోడి జాగరము వి. అనుక్షణం ప్రమాదంతో కూడినపని. దయ్యంమట్ట వి. కలబంద, నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పు గల దళసరి మట్టల్లాంటి ఆకులూ, అంచుల్లో వాడి ముళ్ళూ ఉండే ఒక కంచెమొక్క. దయ్యాలపోతు వి. మంత్రగాడు.

దయ్యంమట్ట చూ. దయ్యము.

దయ్యాలపోతు చూ. దయ్యము.

దయ్యు రూ.చూ. డయ్యు. అ.క్రి. 1. అలయు, శ్రమపొందు, కృశించు. క్రీడా. 230 ; 2. బలహీనమగు. భాగ. 10.267.

దర[1] అవ్య. స్వయంగా. ద.హిం.శా.సం. 10. శా.సం. 759. క్రీ.శ. 1633.

పార. దర్. స్వయంగా.

దర[2] రూ. ధర. వి. వెల, మూల్యం. ఆం.భా. 2.267.

సం. ధరా, ధారణ-. ధరించేది, పోషించేది ; హిం. ఉ. దర్. వెల ;

క. దర. వెల ; తు. దర. వెల ; కువి. ధర.

<హిం. దర్.

దర[3] వి. సమీపం. ద.హిం.శా. 10.

ఉ. దర్. సమీపం ; పార. దర్. సమీపం.

<పార. దర్.

దర[4] వి. బౌద్ధచైత్యాగారద్వారం. L.L. 1225.

సం. ద్వార-, ద్వార్. తలుపు, ద్వారం, మార్గం ; హిం. ఉ.పార. దర్. తలుపు.

<ఉ. దర్.

దరకాస్తు రూ.చూ. దరఖాస్తు. వి. నివేదనపత్రం.

దరఖాస్తు రూ. దరకాస్తు, దర్ఖాస్తు. వి. విన్నపం, వారంట్, దరఖాస్తు, నివేదనపత్రం.

హిం. దర్‌ఖాస్త్. ప్రార్థనాపత్రం ; మరా. దర్‌ఖాస్త్. వినతిపత్రం ; ఉ. దర్‌ఖ్వాస్త్. నివేదనపత్రం ; పార. దర్‌ఖ్వాస్త్. ప్రార్థనాపత్రం ; అర. దర్‌ఖాస్త్. నివేదనపత్రం.

<ఉ. దర్‌ఖ్వాస్త్.

దరగం రూ. దరగా. వి. కమిదితోలు, సర్నేటపుడు కుమ్మరి కూర్చోడానికి కింద వేసుకొనే గొర్రెతోలు.

దరగమెత్తురాయి వి. కమిదిరాయి, కుండల్ని సర్నేటపుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి కమిదపై బరువుగా ఆపుగా పెట్టే రాయి.

దరగమెత్తురాయి చూ. దరగం.

దరగయ్య వి. ఒక గ్రామదేవత.

సం. దుర్గా. చండీదేవి, పార్వతి.

దరగా రూ.చూ. దరగం. వి. కమిదితోలు, సర్నేటప్పుడు కుమ్మరి కూర్చోటానికి కిందవేసుకొనే గొర్రెతోలు.

దరగుజురు వి. వంచన చేయటం.

హిం. దర్‌గుజర్. ప్రత్యేకం, వంచన ; ఉ. దర్‌గుజర్. క్షమ ; పార. దర్‌గుజర్. కలవరం లేవదీయటం.

<ఉ. దర్‌గుజర్.

దరణము రూ.చూ. దరణము. వి. ఎనిమిదిడబ్బుల నాణెం.

దరదరకలు వి.బ వ. నిగ్గులు. లక్ష్మీవి. 2.6.

దరబారు రూ.చూ. దర్బారు. వి. కొలువుకూటం, సభాస్థలి.

దరబేషు రూ.చూ. దరిబేసి. వి. 1. సాధువు ; 2. బిచ్చగాడు ; 3. పకీరు.

దరమము వి. ధనుస్సు. ప్రబంధ. 160.

సం. ధర్మ-. విల్లు, ధనువు.

<సం. ధర్మ-.

దరములు వి.బ.వ. ఒడ్లు. కు.సం. 6.106.

సం. దర-. శంఖం.

దరవాజా రూ.చూ. దర్వాజా. వి. ద్వారబంధం.

దరవీడు స.క్రి. చలింపజేయు. కకుత్థ్స. 4.9.

దరవు వి. భక్ష్యవిశేషం. ప్రభులిం. 4.150.

దరవేషు రూ.చూ. దరిబేసి. వి. 1. సాధువు; 2. పకీరు ; 3. బిచ్చగాడు.

దరసక వి. ద్వారశాఖ. ద్వారబంధం నిడుపుకమ్మి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 498. క్రీ.శ. 1309.

దరసన రూ.చూ. దరసినము. వి. వ్యవసాయ పరికరాల తయారీకి గృహాది నిర్మాణాలకి పనికివచ్చే కలపనిచ్చే ఒక చెట్టు (Albezzia Lebbeck).

దరసనము రూ.చూ. దరసినము. వి. వ్యవసాయ పరికరాల తయారీకి, గృహాది నిర్మాణాలకూ పనికివచ్చే కలపనిచ్చే ఒకచెట్టు (Albezzia Lebbeck).

దరసినము రూ. దరసన. దరసనము. వి. వ్యవసాయ పరికరాల తయారీకి, గృహాది నిర్మాణాలకూ పనికివచ్చే కలపనిచ్చే ఒక చెట్టు (Albezzia Lebbeck).

దరాబస్తు రూ.చూ. దరోబస్తు. క్రి.విణ. అంతా.

దరాయించు స.క్రి. నష్టపరచు. విశ్వే.శ. 44.

హిం. దర్‌నా. నష్టపరచు ; ఉ. దర్‌నా. నష్టపరచు.

<హిం. దర్(నా)+-ఇంచు[3].

దరాలు వి. చలించటం, ప్రకాశించటం మొ॥ వాటికి అనుకరణం. కువ.చ. 3.32.

హిం.ఉ. దరార్, దరారా. పగలటం వల్ల అయ్యే దాని గుర్తు, దరార్‌నా. పగలటం.

<ఉ. దరార్.

దరావత్తు రూ.చూ. ధరావత్తు. వి. 1. మూలం, అప్పుకు ముందిచ్చిన సొమ్ము ; 2. డిపోజిట్టు.

దరి[1] వి. 1. సానువు, చరియ. భార. సభా. 2.183 ;

2. గట్టు, తీరం. ఒడ్డు. కు.సం. 9.76, భార.అను. 5.61 ; 3. హద్దు, మేర, అంతం. హరి.పూ. 2.152, పల్నా. 78 పు. ; 4. సమీపం. కాశీ. 2.34 ; 5. దిక్కు, శరణం. హంస. 2.125 ; 6. ఆర్చీకి పక్కనున్న రాతి పేర్పు.

సం. దరి-, దరీ. గుహ.

<సం. దరి- (అర్థవిపరి.).

**దరిగా** క్రి.విణ. ద్రు.దగ్గరగా. **దరిచేరు** రూ.చూ. దరిఁజేరు. అ.క్రి. దగ్గరకువచ్చు, ఒడ్డుకువచ్చు. **దరిఁజేరు** రూ. దరిచేరు. అ.క్రి. 1. ఒడ్డుచేరు. పారి. 2.100 ; 2. బయట పడు. నిరంకు. 2.105. **దరితేలిన** విణ. కడతేరిన, చివరకుచేరిన. **దరిదాపు** వి. 1. హద్దు, మేర. ప్రభా. 2.111 ; 2. ఆశ్రయం. ఆధారం. ఉ.రా. 5.71 ; 3. సమీపం. దశా. 4.122. **దరిదాపులేని** విణ. అంతూ పొంతూ లేని. వరాహ. 2.52 ; ప్రభా. 2.111. **దరియెత్తు** (-ఎత్తు[1]) అ.క్రి. నిండిపారు. కూలంకషమగు. భార.శాంతి. 3.24. **దరివానం** రూ. దరోనం. వి. వెనుకగ్రనుంచి అడ్డనరం మీదికి వేసే వానం. **దరివేద** వి. దగ్గరిపొలం.

**దరి²** రూ.చూ. దడి. వి. చాటుకోసం నిలిపిన తడిక లేదా పల్లల్తో కట్టిన అడ్డు.

**దరి³** రూ. దరీ. వి. నీలంరంగు పూలుపూసే పెద్ద తీగ (Pueraria Fuberosa).

**దరికొను** అ.క్రి. 1. మండు, జ్వలించు. కు.సం. 5.86 ; 2. సంభవించు, కలుగు. కు.సం. 5.170 ; 3. రగులుకొను. నిర్వ.రా. 6.110 ; 4. అంటుకొను (అడవి మొ॥ వాటిలో నిప్పు). భార. భీష్మ. 1.294 ; 5. దగ్ధమగు, కాలు. శృం.నై. 1.108 ; స.క్రి. దహించు, కాల్చు. హరి.పూ. 4.115. **దరికొలుపు** రూ.చూ. దరికొల్పు. స.క్రి. 1. రగులు కొల్పు, ముట్టించు. భార.ఆది. 6.143 ; 2. కాల్చు, దహించు. ఉ.హరి. 3.156; 3. సంభవింపజేయు, కలిగించు. **దరికొల్పు** రూ. దరికొలుపు. స.క్రి. 1. రగులుకొల్పు. భార.ఆది. 3.14. భార.విరా. 2.270 ; 2. సంభవింప జేయు, కలిగించు. హరి.ఉ. 9.77 ; 3. కాల్చు. దహించు. భీమ. 4.60.

**దరికొలుపు** చూ. దరికొను.

**దరికొల్పు** చూ. దరికొను.

**దరిజీ** రూ.చూ. దర్జీ. వి. కుట్టపు వాడు, కుట్టుపని వాడు.

**దరిద్రగొట్టు** వి. నిర్భాగ్యుడు, ఒకరకమైన తిట్టు.

సం. దరిద్ర-. నిర్భాగ్యుడైన.

<సం. దరిద్ర- + -గొట్టు.

**దరిద్రనారాయణుడు** వి. దరిద్రుడు.

సం. దరిద్ర-. డబ్బులేని వాడు, నారాయణ-. విష్ణువు.

<సం. దరిద్రనారాయణ-(అర్థవిపరి.).

**దరిబేసి** రూ. దరబేసు, దరవేసు, దరివేసు. వి. 1. దీనుడు, దైన్యం కలవాడు, దేవురుగొట్టు, పిసినిగొట్టు. జైమిని భా. 5.196 ; 2. పిసినిగొట్టు. వేణు.శ. 34 ; 3. పకీరు, బికారి. ఛందో. 4.31 ; 4. ఒక తిట్టు.

హిం.ఉ.పార. దర్ వేశ్. పకీరు, సాధువు ; మరా. దరవేస.

<ఉ. దర్ వేశ్.

**దరిమిల** రూ.చూ. దరిమిలా. క్రి.విణ. తర్వాత.

**దరిమిలా** రూ. దరిమిల. క్రి.విణ. తర్వాత.

**దరిమిలాఇనాం** వి. చాకలి, మంగలి మొ॥ గ్రామ వృత్తుల వారికిచ్చే పారితోషికం.

**దరియాప్తీ** రూ.చూ. దర్యాప్తు. వి. విచారణ.

**దరియాప్తు** రూ.చూ. దర్యాప్తు. వి. విచారణ.

**దరివేసు** రూ.చూ. దరిబేసి. వి. 1. బిచ్చగాడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 743. క్రీ.శ. 1530 ; 2. పకీరు, బికారి.

**దరిశనము** రూ. దరిసెనము, దరుసెనము, దర్సెనము, దిరిశనము. వి. 1. రాజాదుల దర్శనార్థం ఇచ్చేకానుక. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 499. క్రీ.శ. 1311 ; 2. చూడటం.

సం. దర్శన-. చూడటం ; ప్రా. దరిసణ- ; జై. మహా. దరిసేది ; అశో. ప్రా. దశణ ; శౌ. దంస ; మా. దంశ ; పా. దస్సన ; నాగర. అప. దరస ; అవంతి. దరిసేది, దర్శియతి ; గిర్నార్. దసక, కావిచి, ధావి, ద్రశన ;

క. దరిసణ, దరిసన, దరుసన.

<ప్రా. దరిసణ-.

**దరిసించు** స.క్రి. 1. చూచు. భాగ. 10 ఉ. 115 ; 2. కాను కగా ఇచ్చు. భల్లా. 2 ; 3. కోపాదులతో ఉచితంగా ఇచ్చు.

సం. దృశ్, దర్శ ; ప్రా. దరిసేఇ.

**దరిసెనము** రూ.చూ. దరిశనము. వి. 1. రాజాదుల్ని చూడ డానికి వెళ్ళేటప్పుడు తీసుకొనివెళ్ళి ఇచ్చేకానుక. వీర.వి. 1.196 ; 2. చూడటం.

**దరీ** రూ.చూ. దరి³. వి. నీలంరంగు పూలుపూసే పెద్ద తీగ (Pueraria Tuberosa).

**దరీజ** రూ.చూ. దర్జీ. వి. కుట్టుపనివాడు.

**దరుజు** రూ.చూ. దర్జు. వి. 1. మారువాటం, గోడకట్టేటప్పుడు రాళ్ళమధ్య వచ్చే సందు ; 2. గచ్చు పూతతో రాళ్ళను కలపటం.

**దరుజుబల్ల** వి. రీపరు, ఇంటి కప్పు వేయడంలో వాడే పలచని చెక్క.

**దరుపులు** రూ. దాపులు. వి.బ.వ. ఆములో కాలేకుండలకు దెబ్బ తగలకుండా మొగదాల పొయ్యిలదగ్గర గోడ పొడవునా ఆపుగా పెట్టిన ఓటికుండలు.

**దరుబారు** రూ.చూ. దర్బారు. వి. కొలువుకూటం.

**దరుమము** వి. న్యాయం. ద.హిం.శా. సంపు. శా.సం. 3.19.

సం. ధర్మ-. న్యాయం, ఆచారం ; ప్రా. ధరమ- ; అశో. ధర్మ ; అ.మా. ధర్మ ; పై. ధరమ ; అప. ధర్మ ; త. మ. తరుమమ్.

<పా. ధరమ-.

**దరువాజా** రూ.చూ. దర్వాజా. వి. ద్వారబంధం.

**దరువు** వి. 1. గీత విశేషం, ధ్రువ. వరాహ. 9.145 ; 2. తాళం ; 3. శరీరంలోని కండరాలు మొదలైనవాటి బలం ;

**4.** కొట్టటం; **5.** అలబడివాళ్ళు వేసే చిందు; **6.** చులకనగా ప్రవర్తించటం; **7.** చమత్కృతి; **8.** పాట.

సం. ధ్రువా. గీతివిశేషం;

క. దరుఫు. ప్రదర్శనారంభంలో ఒక పాట; త. తరు. ధ్రువ.

<సం. ధ్రువా.

**దరువుకడవ** వి. గటంకుండ, భజన్లకి బుర్రకథలకీ ఘట వాయిద్యంగా వాయించడానికి వాడే కుండ. **దరువుచేయు** అ.క్రి. కొట్టు, తాళంవేయు. **దరువులు** వి.బ.వ. కూరగాయ పాదుల తీగలు అల్లుకోడానికి పక్కన నిల్పిన పుల్లలు, అల్లుళ్ళు. **దరువులువెట్టు(-పెట్టు)** స.క్రి. గీతికలు పాడు. ద్వి.పరమ. వి. 8.566. **దరువువేయు** అ.క్రి. తాళంవేయు; స.క్రి. తన్ను.

**దరుసు** వి. ఎల్ల.

సం. *దర్శ-*. కనబడటం; ప్రా. *దరస-, దరిస-*. చూపించటం, చెప్పటం.

**దరుసెనము** రూ.చూ. దరిశనము. వి. కానుక.

**దరెపి** వి. గట్టిగాఉండే కలపనిచ్చే చెట్టు (Careya Arborea).

**దరేఖానా** అవ్య. **1.** దిక్కులేని; **2.** అంతులేని; **3.** లెక్కలేని.

హిం. ఉ. *దరేఖానా*. అనేక ద్వారాలున్న ఇల్లు; పార. *దర్ ఖానా*.

<ఉ. దరీఖానా.

**దరేఖానాపద్దు** వి. ఎందుకో తెలియనిది. హిం.ఉ. *ఫర్ద్*. పద్దు. **దరేఖానాసంసారం** వి. దుబారా ఖర్చుచేసే సంసారం.

**దరోబస్తు** రూ. దరాబస్తు, దెరోబస్తు. క్రి.విశే. అంతా, పూర్తిగా. నె.శా. 2 సంపు. శా.సం. 48. క్రి.శ. 1651.

ఉ. *దర్ బస్త్*. పూర్తిగా; పార. *దర్ బస్త్, దర్ బస్తా*. పూర్తిగా, సంపూర్ణంగా.

<ఉ. దర్‌బస్త్.

**దరోసం** రూ.చూ. దరివాసం. వి. పెనుగర్రనుంచి అడ్డసరం మీదికి వేసే వాసం.

**దర్ఖాస్తు** రూ.చూ. దరఖాస్తు. వి. విన్నపం.

**దర్గాఇనాం** వి. ముస్లిం సమాధి స్థలానికిచ్చిన పారితోషికం.

హిం.ఉ. *దర్గా, దర్ గాహ్*. గోరీ, *ఇనామ్*. బహుమతి.

<ఉ. దర్‌గాహ్ + ఉ. ఇనామ్.

**దర్గామాన్యం** వి. ముస్లిం సమాధులకు 'ఉరుసు' (ఉత్సవం) చేయటానికి ఇచ్చిన పారితోషికం.

హిం.ఉ. *దర్ గా, దర్ గాహ్*. ముస్లిం సమాధి.

<ఉ. దర్‌గాహ్ + మాన్యము.

**దర్గు** వి. తెల్లమొటుకుచెట్టు (Ougeinia Dalbergioides).

**దర్జా** వి. **1.** మెట్టు, పైక్రమం; **2.** బడాయి, గొప్పదనం; **3.** హోదా, స్థితి.

బెం. ఒ. హిం. ఉ. *దర్జా*. తరగతి, హోదా.

<ఉ. దర్జా.

**దర్జీ** రూ. దరిజీ, దరీజ. వి. కుట్టుపనివాడు.

బెం.ఒ. హిం.ఉ.పార. *దర్ జీ*. బట్టలుకుట్టేవాడు.

<ఉ. దర్‌జీ.

**దర్జు** రూ. దరుజు, దర్దు. వి. మారువాటం, గోడకట్టేటప్పుడు రాళ్ళమధ్య వచ్చే సందు.

హిం.ఉ. *దరజ్, దరాజ్, దర్జ్*, ఏదైనా వస్తువు పడటంవల్ల పగిలిన కారణంగా ఏర్పడ్డ ఖాళీప్రదేశం.

<ఉ. దర్జ్.

**దర్జుకొను** స.క్రి. రాళ్ళమధ్యనున్న సందుల్ని అతుకు, కలుపు. **దర్జుతొక్కుడు** వి. నాట్టాటు, గోడరాళ్ళ ఒక వరసలో ఉండి తూకం సరిపోయేటట్లు కట్టటం. **దర్జుబద్ద** వి. రీపరు, ఇంటికప్పు వేయడంలో వాడే పలచని చెక్క.

**దర్దు** రూ.చూ. దర్జు. వి. మారువాటం, గోడకట్టేటప్పుడు రాళ్ళ మధ్య వచ్చే సందు.

**దర్బారంచు** చూ. దర్బారు.

**దర్బారు** రూ. దరబారు, దరుబారు. వి. **1.** రాజసభ. అడిదం సూరకవి చాటువు; **2.** కచ్చేరి, కొలువుకూటం, సభ; **3.** దర్బారు అనేరాగం.

హిం. *దర్ బార్*. రాజసభ; మరా. *దర్ బార్*. రాజసభ, కచేరి, సభ; ఉ. *దర్ బార్*. రాజసభ, మున్యాశ్రమం; పార. *దర్ బార్*. ఇల్లు, వాసస్థానం, రాజసభ.

<ఉ. దర్‌బార్.

**దర్బారంచు** వి. ఒకరకం అంచు. **దర్బారువయిలేటు** వి. వంగపువ్వురంగు. ఇం. *Violet*. బచ్చలిపండు రంగు.

**దర్భపోటు** వి. దర్భపోటుగలది, శ్రాద్ధాలలో భోక్తలు తినే ఆహారం. ఆము. 6.69.

సం. *దర్భ-*. కుశం.

<సం. దర్భ- + పోటు.

**దర్భపోటుతిను** స.క్రి. బ్రాహ్మణార్థంచేయు. ఆము. 7.5.

**దర్భముండ్లు** వి.బ.వ. బాధాకరాలు, కటువైనవి. సిం.ద్వా. 1.32.

సం. *దర్భ-*. కుశం.

<సం. దర్భ- + ముల్లు + -లు.

**దర్మపిడత** వి. ఉండి, పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే పైన నాణెం పట్టే రంధ్రంగల గుండ్రని చిన్నమట్టిబుడ్డి.

సం. *ధర్మ-*. న్యాయం, ఆచారం.

<సం. ధర్మ- + పిడత.

**దర్యాప్తు** రూ.చూ. దర్యాఫ్తి. వి. విచారణ.

**దర్యాప్తుచేయు** స.క్రి. విచారణ జరుపు.

**దర్యాఫ్తి** రూ. దరియాఫ్తి, దరియాప్తు, దర్యాప్తు. వి. విచారణ.

హిం. *దర్ యాఫ్త్*. పరిశోధన; ఉ. *దర్ యాఫ్త్*. అన్వేషణం; అర. *దర్ యాఫ్తన్*. తెలిసికొనటం.

<ఉ. దర్‌యాఫ్త్.

**దర్వాజా** రూ. దరవాజా, దరువాజా, దర్వాజీ, దర్వాజు. వి. ద్వారబంధం.

బెం.ఒ.హిం.ఉ. *దర్ వాజా*. ద్వారం; పార. *దర్*

వాజ్, దర్ వాజహ్. ద్వారం.
<ఉ. దర్వాజా.

దర్వాజీ రూ.చూ. దర్వాజా. వి. ద్వారబంధం, తలుపును తగిలించే చట్రం.

దర్వాజు రూ.చూ. దర్వాజా. వి. ద్వారబంధం, తలుపును తగిలించే చట్రం.

దర్శనము వి. 1. కానుక. హర. 6.15, కాశీ. 4.99 ; 2. దేవుడిగుడికి వెళ్ళి చూడటం, (గొప్పవ్యక్తుల్ని) చూడటం.
సం. దర్శన-. దృష్టి, చూడటం.
<సం. దర్శన- (అర్థవిపరి.).

దర్శింపు వి. 1. పత్రింపు, కట్టుబడిలో క్రమంగా తగ్గించే తగ్గింపు ; 2. కట్టుబడిలో క్రమంగా పెంచే పెంపు.

దర్సన వి. వ్యవసాయ పరికరాల తయారీకి గృహాది నిర్మాణాలకు ఉపయోగపడే కలప నిచ్చే ఒకరకం చెట్టు (Albezzia Lebbeck).

దర్సెనము రూ.చూ. దరిశనము. వి. 1. కానుక. కాశీ. 4.99 ; 2. లంచం.

దలము రూ. దళము¹. వి. 1. ఆధిక్యం, గొప్పతనం. కు.నం. 10.43 ; 2. లావు, మందం ; 3. చిక్కదనం ; విణ. అధికం, దట్టం. భాస్క.రా.యు. 2254.
సం. దృఢ-. గట్టి ; ప్రా. దఢ- ; క. దళ ; తు. దళ ; త. తళమ్.
<ప్రా. దఢ-.
దలముకొను రూ. దళకొను, దళముకొను¹. అ.క్రి. అధికమగు. నిర్వ.రా. 6.55.

దలసరి రూ.చూ. దళసరి. వి. మందం, లావు, చిక్కదనం.

దలసరు రూ.చూ. దళసరి. వి. మందం, లావు. చిక్కదనం.

దలారి రూ. దడారి, దలాలి, దళారి. వి. తరగరి, వ్యాపారంలో మధ్యవర్తిగా వ్యవహరించేవాడు.
హిం.ఉ. దలాలీ. వ్యాపారంలో మధ్యవర్తిగా వ్యవహరించేవాడు.
<ఉ. దలాలీ.

దలాలి రూ.చూ. దలారి. వి. తరగరి.

దలిమము రూ.చూ. దడిమము². విణ. సన్నని. యయా. 4.19.

దల్లాలు వి. మోసగాడు.
హిం.ఉ. దలాల్. వస్తువుల్ని ఇచ్చి పుచ్చుకోవటంలో మధ్యవర్తిత్వం నెరపేవాడు.
<ఉ. దలాల్.

దల్లు రూ.చూ. జల్లు¹. వి. వాన, వర్షాదులధార. కవిక. 3.160 ; స.క్రి. చిలకరించు, చల్లు.

దళకొను చూ. దళము¹.

దళగట్టు స.క్రి. పొసంగం లేకుండా సరిచేయు.

దళగించు చూ. దళము¹.

దళచరంపంబె చూ. దళసరి. వి. గుమ్మటంలాంటి ఒక పనిముట్టు.

దళమిచ్చు చూ. దళము¹.

దళగ్రామము వి. శివారుగ్రామం.
సం. దళ-. సేన, గ్రామ-. ఊరు.
<సం. దళగ్రామ-.

దళము¹ రూ.చూ. దలము. వి. 1. నిబిడం, సాంద్రం, దట్టం. భార.విరా. 5.133 ; 2. ఆధిక్యం. విజ్ఞా. 55 ; 3. చిక్కనిది (మజ్జిగ మొ॥). రం.రా.ఉ. 43 ; 4. అధికం, హెచ్చయినది. మను. 5.51 ; 5. పూర్ణం, సమృద్ధం. ఆము. 3.11 ; 6. పాత్ర కిందిభాగం ; 7. మూడాకుల తులసిరెమ్మ.
దళకొను రూ.చూ. దలముకొను. అ.క్రి. అధికమగు. విక్ర. 5.5. దళగించు అ.క్రి. దళంకొను, దట్టమగు. దళమిచ్చు స.క్రి. పలచని సన్నని వస్తువులకు మరింత బలాన్నివ్వటానికి మరొక లేపనంతో దళసరిచేయు. కు.నం. 10.38. దళముకొను¹ రూ.చూ. దలముకొను. అ.క్రి. 1. అధికమగు. భార.అను. 2.283 ; 2. బలంకలదగు. దళముకొలుపు రూ.చూ. దళముకొల్పు. స.క్రి. 1. దట్టంచేయు, సాంద్రంగాజేయు. విక్ర. 4.223 ; 2. పూరించు, నిండించు. పరమ.వి. 3.34 ; 3. అధికంచేయు, పెంచు, హెచ్చించు. ఉ.రా. 5.154. దళముకొల్పు రూ. దళముకొలుపు. స.క్రి. 1. అధికంచేయు, పెంచు, హెచ్చించు. భార.ఉద్యో. 2.114 ; 2. దట్టంచేయు, సాంద్రంచేయు ; 3. పూరించు, నిండించు. దళమెక్కు అ.క్రి. 1. అధికమగు. నిర్వ.రా. 6.89 ; 2. దళసరికలుగు. దశకు. 9.9.
<దళము¹ + ఎక్కు.

దళము² వి. 1. సమూహం. శృం.నై. 7.63 ; 2. లాదినమిద్దె కప్పుమీద నీరు ఉరవకుండా ఉంచటానికి వేసే చదరపు బిళ్ళల వరస.
సం. దళ. సేన.
<సం. దళ- (అర్థవిపరి.).
దళముకొను² అ.క్రి. గుంపుకూడు. ఉ.రా. 4.156.

దళమెక్కు చూ. దళము¹.

దళవరి¹ వి. ధాన్యవిశేషం.
సం. దళ-. పత్రం.
<సం. దళ- + వరి.

దళవరి² చూ. తలవరి. వి. సేనానాయకుడు.
సం. దళ-. సేన.

దళవాయి రూ. దళ్వాయి. వి. 1. సేనానాయకుడు. జైమిని భా. 8.16, వరాహ. 6.80 ; 2. సుంకరికి సహాయుడైన ఉద్యోగి. ద.హిం.శా.సం. 4. శా.సం. 997.
సం. దలపతిః, దలవాహిన్ ; ప్రా. దలవఈ. సేనాపతి ;
క.మ.తు. దళవాయి ; కొడ. దళబాయ్ ; తు. దళవాడ. సేన.
<ప్రా. దలవఈ.

దళసంచు వి. దళంజాతి.

దళసరి రూ. దలసరి, దలసరు. వి. గొప్పతనం, మహత్త్వం. భాగ. 10.649 ; విణ. 1. మందంగల, పలుచనకాని. చమ. 1.67 ; 2. తరచు.

దళారి రూ.చూ. దలారి. వి. తరగరి.

దళారున అవ్య.ౖద్రు.హఠాత్తుగా. కువ.చ. 2.91.
దళి రూ.చూ. దాలి. వి. గుంట.
దళుకు వి. భయం.
దళ్ళచీర వి. గళ్ళచీర. వి. అంచుల మధ్య భాగంలో రంగు పోగులు పెట్టి గడులు గడులుగా నేసినచీర.
దళ్వాయి రూ.చూ. దళవాయి. వి. దళవాయి, సైనికుడు.
దవ[1] రూ.చూ. దవ్వ[1]. వి. 1. ఇక్షుగ్రం. ఆం. భా. 2.75; 2. దుమ్ము; 3. మానినడిం భాగం, గెలవేసిన అరటిచెట్టు లోపలి భాగం, దూట.
దవ[2] రూ.చూ. దవ్వ[3]. వి. ఈదరగాలి.
దవగాలి వి. దుమారం, ఎర్రదుమ్ముతో బలంగా వీచే గాలి. దవముసురు వి. జడివాన.
దవకలు వి.బ.వ. పనిచేయకుండా సోమరిగా తిరగటం.
దవగము వి. ఎండాకు.
దవడ రూ.చూ. దౌడ. వి. 1. చెక్కిలి; 2. చెక్కిలి లోపలి భాగం; 3. కాపుబద్ద, పన్నెకట్టు బడిలో ఈనెపుల్లల వరనకు చివర బిగించిన వెడల్పు బద్ద; 4. మూనకర్రలకు పక్క బిగించిన చెక్కముక్క; 5. పై అంచున రెండు వైపులా మేకు బందీ చేసిన చెక్కలు; 6. కర్రకు చివర రెండు వైపులా కొయ్య ముక్కలను బిగించి తయారుచేసిన పంగ.
దవడచెక్క వి. పానువు పట్టెకు పక్కన బిగించిన పొరగుచెక్క. దవడరాయి వి. గేడిబండ, మోటుబావి దోనెకు రెండు వైపులా నిలబెట్టిన బండ. దవడలునొక్కుకొను స.క్రి. నోరునొక్కుకొను. దవడశుద్ధిచేయు స.క్రి. దవడలు వాయించు, లెంపకాయలు కొట్టు.
దవతి రూ. దౌటి. వి. సిరాబుడ్డి, మషీపాత్రం. హంస. 1.141.
హిం. ఉ. పార. అర. దవాత్. సిరాబుడ్డి.
<ఉ. దవాత్.
దవదారి రూ. దవాదరి. వి. కర్ణాటక, చెంగల్పట్టు పడమటి కనుమల్లో కొండల మీద 4 అడుగులు ఎత్తుపెరిగే మొక్క (Breynia Patens).
దవనపున్నమ చూ. దవనము. వి. చైత్రమాసపూర్ణిమ, చైత్ర శుద్ధపౌర్ణమి నాడు దేవుడి విగ్రహాలపై దవన పత్రాలతో పూజించటం ఆచారం. అందువల్ల దవన పున్నమ అని దీనికి పేరు. పండి. చ. 1.1పు. 360, క్రీడా. పు. 65, ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1373. క్రీ.శ. 1275.
క. దవనదహుణ్ణిమె;
సం. దమన-. సువాసనగల మొక్క.
దవనము వి. సువాసనగల 5 నుంచి 6 అడుగులు పెరిగే మూలికా విశేషం. కు. సం. 6.13. ఉ. రా. 3.201 (Artemisia Vulgaris).
సం. దమన-, దమనక-, దామన-. వాసనఉన్న ఒకరకం మొక్క; ప్రా. దమణక-, దమణగ-, దమణయ-, దవణయ-; అ.మా. దమణగ;
క. జవన, దవన; త. తవనక; తు. దవనక.
<ప్రా. దవణయ-.
దవనవనము వి. దవనం పెంచబడిన తోట. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1442. క్రీ.శ. 1142.

దవనవనము చూ. దవనము.
దవంత్రి వి. అగడ్త, కందకం.
దవర రూ.చూ. దోర[1]. వి. కాయపండబారిన దశ, గింజలు ముదిరీ ముదరని స్థితి.
దవరకువచ్చు అ.క్రి. కాయ పండబారినదశకి వచ్చు.
దవలిమపూర్ణము చూ. దవన పున్నమ. వి. చైత్రశుద్ధ పూర్ణిమ. ద. హిం. శా. సంపు. 10. శా.సం. 182. క్రీ. శ. 1172.
దవళము వి. గీతి విశేషం, స్త్రీలు పాడే ఒక పాట. యయా. 4.101.
సం. ధవళ-, ధవల-. ఒకానొక రాగం, ధవలిత-. విజయం, అదృష్టం. ప్రా. ధవళ-. ఛందోవిశేషం; మరా. ధవళ, ధవళ, ధవళే. పాట;
క. ధవళ. శుభం.
<ప్రా. ధవల-.
దవసం రూ.చూ. దొగసం. వి. ఆరుబయట దాపిన పడుగు కిందికి దిగబడకుండా అక్కడక్కడ ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.
దవసము వి. ధాన్యం. ఆం. భా. 2.239.
సం. యవస-; ప్రా. జవస-. గడ్డి, తృణం, గోధుమలు మొ॥ ధాన్యం;
క. దవస, తవస. ధాన్యం, గింజలు; త. తవచమ్; తు. దవస. మహనూలు, ధాన్యం వగైరా.
<ప్రా. జవస-.
దవాదరి రూ.చూ. దవదారి. వి. కర్ణాటక చెంగల్పట్టు మొ, కోట్ల కొండల మీద 4 అడుగుల ఎత్తు పెరిగే ఒకరకం మొక్క (Breynia Patens).
దవిరిగిన్నె రూ.చూ. దబరిగిన్నె. వి. పచ్చడికి వాడే మట్టి పాత్ర.
దవిరించు స.క్రి. తినబెట్టు.
దవిలి రూ. దవిలి, దవ్వి. వి. కల్లుగీసే వాళ్ళు కల్లుమాను ఎక్కేటపుడు వెనక కట్టుకొనే పొడవైన మట్టిపాత్ర.
హిం. డేహరీ, ఢహరీ. మట్టిపాత్ర.
దవు రూ.చూ. దవ్వు. వి. దూరం. కు. సం. 2.88.
దవుదవ్వులన క్రి. విశ. ౖద్రు. దూర దూరంగా. ప్రభా. 2.12.
దవుడ రూ.చూ. దౌడ. వి. 1. కాలువ. ఆం. భా. 2.143; 2. చెక్కిలి, బుగ్గ.
దవుడాయించు స.క్రి. పరిగెత్తించు.
హిం. ఉ. దౌడ్నా. పరిగెత్తటం, దౌడానా. పరిగెత్తించటం.
<ఉ. దౌడా (నా) + - ఇంచు[3].
దవుడు రూ.చూ. దౌడు. వి. అశ్వాదుల ప్లుతం, పరుగు.
దవుడుతీయు అ.క్రి. పరుగెత్తు.
దవును వి. కాలు, ధాన్యపు పొల్లు.
సం. ధవళ-. తెల్లని; హిం. ధవ్‌ని.
దవురాకు చూ. దవురు[1].
దవురు[1] రూ. చూ. దౌరు[2]. వి. ఎత్తుగా ఉన్న బావిగోడ.
దవురుగోడ వి. బావిబొడ్డు. దవురాకు వి. మేతకి

నరివడే ఎత్తు పెరిగిన పైరు.

హి. ఉ. దౌర్. దూరం.

<దవురు[1]+అకు.

**దవురు²** రూ.చూ. దౌరు[1]. వి. **1.** కాంతికల హారం; **2.** కాంతి.

**దవులత** రూ.చూ. దౌలత్తు. వి. భాగ్యం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 751.

**దౌవులతు** రూ.చూ. దౌలత్తు. వి. అధికారం.

**దవులత్తు** రూ.చూ. దౌలత్తు. వి. అధికారం.

**దవ్లత్తు** రూ. చూ. దౌలత్తు. వి. అధికారం.

**దవ్వ[1]** రూ. దబ్బ[4], దవ[1]. వి. **1.** జొన్న, సజ్జ, రాగి మొ॥ పైరుమొక్కల కాడ; **2.** చెరుకు చివరి భాగం; **3.** మాని నడిమి మెత్తనిభాగం; **4.** గెలవేసిన అరటిచెట్టు లోపలి భాగం.

**దవ్వ²** వి. దూరం. కు. సం. 8.148.

సం. దవీయస్. బహుదూరం; ప్రా. దవీఅ.

<ప్రా. దవీఅ.

**దవ్వ³** రూ. దవ². వి. దుమ్ము.

**దవ్వగు** చూ. దవ్వు.

**దవ్వి** రూ.చూ. దవిలి. వి. కల్లుగీసే వాళ్ళు కల్లుమాను ఎక్కేటపుడు వెనక కట్టుకొనే పొడవుగా ఉండే మట్టిపాత్ర.

**దవ్వు** రూ. దవు, దౌ, దౌవు. విశ. **1.** దూరం, దగ్గరకానిది (దేశకాలాదులు). భార.ఆది. 4.68; **2.** దూరస్థం, దూరంలో ఉన్నది. భార.ఆది. 7.25; వి. దూరప్రదేశం. కు.సం. 5.2;

కొడ. దవ్వ, దౌతాన్. దూరం; మ. ధావ్. దూరం.

**దవ్వగు** అ.క్రి. దూరమగు. భార.విరా. 2.286. <దవ్వు+అగు. **దవ్వుగ** క్రి.విశ.ద్రు. దూరంగా. భార. ఆది. 1.5. **దవ్వుచుట్టరికము** వి. దూరపు చుట్టరికం. తాళ్ల. సం. 5.249. **దవ్వుదవ్వులు** రూ.చూ. దౌదవ్వులు. వి.బ.వ. మిక్కిలి దూరం. **దవ్వుపడు** అ.క్రి. దూరస్థమగు. **దవ్వుపఱచు** స.క్రి.దూరస్థునిగా చేయు. హరి.ఉ. 2.134.

**దశబందము** రూ. దసవందం. వి. పంటపై పదోవంతు పన్ను విధించి ఇచ్చిన మాన్యం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 903. క్రీ.శ. 1378.

సం. దశ-. పది, బంధ-. కట్టు; ఒ. దసుంధ. పదో భాగం; హిం. దశౌంధ్. పదోవంతు; గు. దసుంద్. పదోవంతు; మరా. దసుంవ్, దసొంద్. పదోవంతు.

<సం. దశబంధ- (అర్థవిపరి.).

**దశమంతుడు** వి. అదృష్టవంతుడు.

సం. దశావంత-. స్థితిమంతుడు.

**దశములు** వి.బ.వ. ధాన్యం మొ॥ పరిమాణ విశేషం. ఈపూరు శాసనం. క్రీ.శ. 1278.

సం. దశ-. పది.

**దశావతారం** వి. **1.** పట్టెలు పట్టెలుగా నేసిన గళ్ళచీర; **2.** నాలుగయిదు రంగుల పట్టెలు నిలువు అడ్డం వచ్చేట్టు నేసిన గళ్ళచీర; **3.** ఒక బొందుకు ఒక పట్టె విడిచి పెట్టి పట్టెకు ఒక్కొక్కరంగు పెట్టి నేసిన చీర.

సం. దశావతార-. విష్ణువు యొక్క పది అవతారాలు.

<సం. దశావతార- (అర్థవిపరి.).

**దశావదిశ** వి. మల్లవిద్యా విశేషం. మల్లు. 3.69.

**దస** సర్వ. పది. E.I. సంపు. 34. శా.సం. 210.

సం. దశన్-. పది; ప్రా. దస-.

<ప్రా. దస-.

**దసమహాబల** వి. పది మహాబలాలు కలవాడు. E.I. సంపు. 20.1 B.

**దసకతు** రూ.చూ. దస్తుఖత్తు. వి. చేవ్రాలు.

**దసకత్తు** రూ.చూ. దస్తుఖత్తు. వి. చేవ్రాలు.

**దసనా** వి. కరకుదనం. సాంబో. 1.182.

సం. దశన-. కొరికేది, దంతం, కాటు; ప్రా. దసణ-. దంతం.

<సం. దశన.

**దసమీ** వి. దశమి. E.I. సంపు. 9. శా.సం. 7.

సం. దశమి. తిథివిశేషం; ప్రా. దసమి.

<ప్రా. దసమీ.

**దసరా** వి. **1.** ఆశ్వయుజ శుద్ధప్రతిపత్తు మొదలు విజయదశమి వరకుగల రోజులు; **2.** ఒక పండుగ.

సం. దశహరా-. దుర్గాపూజావ్రతకాలం; ఒ. దసహరా. దశమదినం; హిం. దశ్‌హరా. విజయ దశమి; గు. దసరా; మరా. దశాహరా, దశ్‌హర్. విజయదశమి.

<మరా. దశాహరా.

**దసరాబోడి** వి. నాలుగైదు నెలల్లో పండే ఒకరకం ఆహార ధాన్యం. **దసరాపుట్టకొక్కు** వి. దసరా రోజుల్లో పుట్టే పెద్ద రకం పుట్టగొడుగు.

**దసళాడ్లు** చూ. దాసరి. వి.బ.వ. దాసరులు, దేవాలయ పరిచారకులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 740.

**దసలి** రూ.చూ. దసిలి. వి. **1.** ముదురుగోధుమరంగులో ఉండే ఒకరకం పట్టు; **2.** ఒక విధమైన పట్టుతో నేసిన వస్త్రం.

**దసలికాయ** రూ. డసిరికాయ. వి. దసలిపురుగు ముక్కు రంధ్రాల నుంచి వచ్చే దారంతో తనచుట్టూ అల్లుకొన్న గూడు. **దసలికోల** వి. దసలిదారం ఏరటానికి ఎక్కించిన కర్ర. **దసలిగుడ్లు** వి.బ.వ. ఒకరకం పట్టు ఉత్పత్తి చేసే పురుగులు పెట్టే గుడ్లు. **దసలిగుళ్ళి** వి. నూరు దసలి కాయలు వడికి తీసిన దారం. **దసలిగువ్వ** వి. పట్టుదారం ఉత్పత్తి చేసే పురుగు. **దసలిపట్టు** వి. ఒకరకం పట్టు. **దసలిపని** వి. దసలిపట్టుదారం తియ్యటం. **దసలిపిల్ల** వి. దసలి తయారు చేసే పురుగులు పెట్టిన గుడ్లలోనుంచి వచ్చిన చిన్న పురుగు. **దసలిపురుగు** వి. ఒకరకం పట్టు దారం ఉత్పత్తి చేసే పురుగు.

**దసలుపడు** చూ. దసులు. రూ. దసూలుపడు. స.క్రి. కలియు.

**దసవందం** రూ.చూ. దశబందము. వి. పంటపై పదోవంతు పన్ను విధించి ఇచ్చిన మాన్యం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 769. క్రీ.శ. 1691.

**దసవందంకాపులు** వి.బ.వ. పంటపై పదోవంతు పన్ను విధించి ఇచ్చిన మాన్యాన్ని అనుభవించే వ్యవసాయ

దారులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 769. క్రీ.శ. 1691.
**దసపోడు** అ.క్రి. కనిపించు.
సం. దృశ్. కన్పించు.
**దసాటాలు** వి.బ.వ. తిట్లు.
సం. దశా. స్థితి.
**దసి** వి. బద్దె పోగుల్లో అనివెంబడి దూర్చిన దారం.
సం. దశా. వత్తి.
దసికఱ్ఱ వి. అచ్చుదగ్గర పడుగులో దూర్చిన జోడాకఱ్ఱవంటి కఱ్ఱ. దసిదారం వి. పూదారం, బద్దెపోగుల్లో అనివెంబడి దూర్చిన దారం. దసిదారంఎక్కించు అ.క్రి. బద్దెపోగుల్లో అనివెంబడి దారందూర్చు. దసిపెట్టు అ.క్రి. బట్టచివర బద్దె వదలు. దసిపోము అ.క్రి. బద్దెపోగులు అనివెంబడి దారం దూర్చు. దసిబద్ద వి. బద్దెగుచ్చు కఱ్ఱ, అచ్చు అతికిన తర్వాత బద్దెపోగులు చెదరకుండా దూర్చిన బద్ద. దసిబద్ది రూ.చూ. దసిబద్దె. వి. బట్ట చివర బెత్తెడు నేసిన నట్ను పోగులు. దసిబద్దె రూ. దసిబద్ది. వి. బట్టచివర బెత్తెడు నేసిన నట్ను పోగులు. దసేరు అ.క్రి. అచ్చు బద్దెలోపూదారం వెంబడి పోగులు ఏరు. <దసి+ఏరు.
**దసిరికాయ** రూ.చూ. దసలికాయ. వి. దసలి పురుగు గూడు.
**దసిలి** రూ. దసలి, దసిలీ. వి. **1**. ఒకరకమైన పట్టుతోనేసిన బట్ట. ఆము. 2.75 ; **2**. ఒకరకమైన పట్టు. ప్రబంధ. 78 ; **3**. నెరియ ; **4**. వదులుగా ఉండటం ; **5**. ఎక్కువ.
**దసిలిపోవు** చూ. దసులు.
**దసిలీ** రూ.చూ. దసిలి. వి. **1**. ఒకవిధమైనపట్టు. కళా. 2.15 ; **2**. ఒకవిధమైన పట్టుతో నేసిన వస్త్రం ; **3**. వదులు.
**దసులు** అ.క్రి. **1**. బలహీనమగు ; **2**. చిక్కిపోవు ; **3**. పాతబడు.
దసిలిపోవు అ.క్రి. **1**. ముదుసలిఅగు ; **2**. ఎండచేత గాని, పనిఒత్తిడి చేతగాని ముఖంవాడు.
**దసువంది** వి. గుద్దులాడటానికి జెట్టీలను కూర్చేవాడు. అం. బా. 2.208, ప్రబంధ. 83.
**దసూలగు** అ.క్రి. ఒకరికి మరొకరు దారిలో కనిపించు.
**దసూలుపడు** రూ.చూ. దసలుపడు. అ.క్రి. ఒకరికి మరొకరు దారిలో కనిపించు.
**దసెన** రూ.చూ. దసెనా. వి. ఆయుధ విశేషం.
**దసెనా** రూ. దసెన. వి. ఆయుధ విశేషం. కువ.చ. 5.34.
హిం. దస్‌నా. వ్యాపించటం, వ్యాప్తి చెందించటం.
**దసేరు** చూ. దసి.
**దస్కం** వి. **1**. పదిరూపాయలు ; **2**. పది.
సం. దశక-. పది.
<సం. దశక-.
**దస్కతు** రూ.చూ. దస్తుఖత్తు. వి. సంతకం.
**దస్కత్తు** రూ.చూ. దస్తుఖత్తు. వి. వ్రేవాలు.
**దస్కిపోవు** అ.క్రి. ఇరులు, పగిలి మెత్తటి పొడిగామారు.
**దస్ఖతు** రూ.చూ. దస్తుఖత్తు. వి. సంతకం.
**దస్ఖత్తు** రూ.చూ. దస్తుఖత్తు. వి. సంతకం.
**దస్తఅయివజు** రూ.చూ. దస్తావేజు. వి. లిఖితపూర్వకమైన వ్యవస్థా పత్రం.
**దస్తకర్ణి** రూ.చూ. తస్‌కర్ణి. వి. తస్‌కర్ణి, ఒకటిన్నర అంగుళం పొడవుండే చిన్న కరిణి.
**దస్తరము** రూ. దస్త్రము. వి. **1**. కాగితాల్ని కట్టే వస్త్ర విశేషం. హంస. 2.30 ; **2**. కాగితాలకట్ట. ఆనంద. పీఠి. 58.
హిం. దస్తర్‌ఖాన్. అన్నం మూటకట్టుకొనే వస్త్రం ; ఉ. దస్తార్. తలపాగ, దస్తర్‌ఖాన్. అన్నం మూటకట్టుకొనే వస్త్రం ; పార. దస్తార్. రుమాలు, జేబురుమాలు, వస్త్రం.
<ఉ. దస్తార్.
దస్తరము విప్పు స.క్రి. కట్ట విప్పు.
**దస్తరంపస్తరం** చూ. దస్తరము. వి. ఆస్తి.
**దస్తా** వి. ఇరవైనాలుగు కాగితాల మడత. బే.ప. 59.
హిం. ఉ. పార. దస్తా. ఇరవైనాలుగు లేక ఇరవైఅయిదు కాగితాల సమూహం ; మరా. దస్తా. ఇరవైనాలుగు కాగితాలు.
<ఉ. దస్తా.
దస్తాగిన్ని రూ.చూ. దస్తాగిన్నె. వి. కూరగుత్తి, నాలుగు రకాల కూరలు వేసుకొని ఒకేసారి వడ్డించడానికి వీలుగా చేసిన మట్టిపాత్ర. దస్తాగిన్నె రూ. దత్తాగిన్ని, దత్తాగిన్నె, దస్తాగిన్ని. వి. ఒకరకం ఇత్తడి గిన్నె. దస్తాదాక వి. కూరగుత్తి, నాలుగురకాల కూరలు ఒకేసారి వడ్డించటానికి వీలుగా చేసిన మట్టిపాత్ర.
**దస్తావయజు** రూ.చూ. దస్తావేజు. వి. లిఖితపూర్వకమైన వ్యవస్థా పత్రం.
**దస్తావీజు** రూ.చూ. దస్తావేజు. వి. లిఖితపూర్వకమైన వ్యవస్థా పత్రం.
**దస్తావేజి** రూ.చూ. దస్తావేజు. వి. లిఖితపూర్వకమైన వ్యవస్థా పత్రం.
**దస్తావేజు** రూ. దస్తఅయివజు, దస్తావయజు, దస్తావీజు, దస్తావేజి. వి. ఒడంబడిక పత్రం, సాధక పత్రం, ఓచరు.
హిం. దస్తావేజ్. పత్రం, దస్తవిజ్ ; మరా. దస్త్ (ఐవజ్). పన్ను, హస్తం, డాక్యుమెంటు ; ఉ. దస్తావేజ్. వ్యవస్థా పత్రం ; పార. దస్తఅవేజ్. రసీదు.
<ఉ. దస్తావేజ్.
**దస్తీ** వి. జేబురుమాలు.
హిం. ఉ. దస్తీ. చేతిరుమాలు.
<ఉ. దస్తీ.
**దస్తు** వి. పోగుచేసిన సొమ్ము, వసూలుచేసిన సొమ్ము. రంగా. చ. 1.141.
హిం. దస్త్. చేయి ; మరా. దస్త. పన్ను, హక్కు పత్రం ; ఉ. దస్. చేయి ; పార. దస్. కరనిర్ధారణం, రాజన్యగ్రహణం.
<మరా. దస్త.
**దస్తుఖత్తు** రూ. దసకతు, దసకత్తు, దస్కతు, దస్కత్తు, దస్ఖతు, దస్ఖత్తు. వి. వ్రేవాలు.
హిం.ఉ.పార. దస్‌ఖత్. వ్రేవాలు ; అర. దస్త్ (ఖత్). వ్రాత పుస్తకం.

< ఉ. దస్త్ ఖత్.

**దస్తుగహ** రూ. దస్తుగాహ. వి. సామర్థ్యం, అధికారం, పాండిత్యం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 759. క్రీ.శ. 1663.

ఉ. *దస్త్గహ్, దస్త్గాహ్.* సామర్థ్యం, శక్తి; పార. *దస్త్గాహ.* కార్యాలయం, ఐశ్వర్యం, పాండిత్యం, జ్ఞానం.

< ఉ. దస్త్గాహ్.

**దస్తుగాహ** రూ.చూ. దస్తుగహ. వి. సామర్థ్యం, పాండిత్యం.

**దస్తురుమాలు** వి. **1**. ఎఱ్ఱవన్నెలో చిన్న చదరపుగళ్ళు పెట్టి నేసిన ఒకరకం బట్ట; **2**. నాలుగయిదు మూరలు నేసిన ఒకరకం బట్ట.

హిం. ఉ. *దస్త్.* చేయి; హిం. ఉ. పార. *రుమాల్, రూమాల్.* చేతిగుడ్డ.

< ఉ. దస్త్ + ఉ. రుమాల్.

**దస్తువందకులు** వి.బ.వ. దసవందకులు, దసవందకావులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 771. క్రీ.శ. 1692.

**దస్తూరి** వి. **1**. వ్రాత, చేవ్రాలు. కృష్ణ. 3.107. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 919. క్రీ.శ. 1750; **2**. నియమం.

హిం.ఉ. *దస్తూరీ.* ఆచారసంబంధమైన, కమిషను; మరా. *దస్తూర, దస్తూరీ.* కొన్న వస్తువులమీద వేసే పన్ను; పార. *దస్తూర.* ఆచారం, కమీషను.

< ఉ. దస్తూరీ.

**దస్త్రము** రూ.చూ. దస్తరము. వి. కాగితాలమూట.

**దస్సాలా** వి. **1**. గడచిన పదిసంవత్సరాలు; **2**. పదిసంవత్సరాల కొకపర్యాయం.

ఉ. *దస్ + సాల్.* పదిసంవత్సరాలు.

< ఉ. దస్ + సాల్.

**దహిత** వి. పుత్రిక, కుమార్తె. E.I. సంపు. 27. శా.సం. 1.

సం. *దుహితృ.* కుమార్తె; ప్రా. *దహిఅ.*

< సం. దుహితృ.

**దా-**[1] రూ.చూ. డా-. విశే. దాపలయొక్క లుప్తశేషరూపం, ఎడమ, సవ్యం (**నర్కారు జిల్లాల్లో వాడుక**).

దావలచేయి వి.బౌ. ఎడమచేయి, వామహస్తం. భార. ఉద్యో. 3.114.

**దా**[2] అ.క్రి. వచ్చు ధాతువుయొక్క మధ్యమపురుషైకవచనమైన 'రా' శబ్ద రూపాంతరం.

**దాక**[1] రూ. దాకె. వి. మూతివెడల్పుగల చిన్నకుండ, అటిక.

సం. *ధాక-.* ఆధారం.

< సం. ధాక-.

**దాకంచు** వి. వెడల్పుగా పొడవుగా బద్దవాటంగా ఉండే అంచు. < దాక[1] + అంచు. **దాకతొట్టి** వి. అలంకారానికి నారుపోసి వేలాడగట్టే చిన్నమట్టితొట్టి. **దాకనోరు** వి. పెద్ద నోరు. **దాకపడత్రలాయి** వి. పిడతల్ని సర్సే రాయి. **దాకరాయ** రూ.చూ. దాకరాయి. వి. కూరదాకలు సర్సేటపుడు ఉపయోగించే రాయి. **దాకరాయి** రూ. దాకరాయ. వి. కూరదాకలు సర్సేటపుడు ఉపయోగించే రాయి. **దాకలరాయి** రూ.చూ. దాకత్రలాయి. వి. కూరదాకలు సర్సేటపుడు ఉపయోగించే రాయి. **దాకత్రలాయి** రూ. దాకలరాయి. వి. కూరదాకలు సర్సేటపుడు ఉపయోగించే రాయి. **దాకసట్టి (-చట్టి)** రూ. డాకసట్టి. వి. **1**. మూతి, అడుగు ఒకే వెడల్పుఉండే మట్టిపాత్ర; **2**. తాలింపుసట్టి.

**దాక**[2] వి. **1**. ఒకానొక తీగ. ఆం.భా. 2.57; **2**. ద్రాక్ష. రసిక. 4.35.

సం. *ద్రాక్షా.* ఒక పండు; ప్రా. *దక్ఖ, దక్ఖా*; అ.మా. *దాఖ*; మరా. *దరాఖ్, ద్రాఖ్, ద్రాక*; కుఇ. *ద్రక*; కువి. *ద్రక్క.*

< ప్రా. దక్ఖా.

**దాకలి** రూ. డాకలి, డాకల్లు[2], దాగలి, దాగిలి[2]. వి.బౌ. **1**. సమీపం. ద్వి.భాగ. 10 స్కం.; **2**. అగసాలి మొ॥ వారు లోహాల్ని సాగగొట్టటానికి ఆధారంగా ఉంచుకొనే ఇనప దిమ్మ. వసు. 2.32.

క. *అడె, అడ, అడి.* అగసాలి మొ॥ వాళ్ళు లోహాల్ని సాగగొట్టడానికి ఆధారంగా ఉంచుకొనే ఇనపదిమ్మ, ఆధారం, *అడగల్లు, అడిగల్లు, అడెగల్.* దాగలి; తు. *అట్టె.* దాపు, దిమ్మ; త. *అట్టె.* దాపు, తేలికైన ఆధారం, *అట్టెకల్.* కంసాలివాని దాగలి; మ. *అటుక్కల్లు.* కంసాలివాని దాగలి; కో. *అడ్గల్.* చిన్నదాగలి.

**దాకల్లు** చూ. దాపు. రూ. డాకలు, డాకల్లు[1]. వి. బండి కంటి కదకమ్మి. < దాపు + కల్లు[2].

**దాకిపీట** రూ.చూ. దాకెపీట. వి. **1**. ఉన్ని వడికేటప్పుడు కదురు తిప్పే బోకికి ఆధారంగా పెట్టిన మట్టు; **2**. ఉన్ని వడికేటప్పుడు ఆడవాళ్ళు కూర్చోటానికి వేసిన పీట.

**దాకె** రూ.చూ. దాక[1]. వి. ఒకరకం మట్టిపాత్ర.

**దాకెపీట** రూ. దాకిపీట. వి. **1**. ఉన్ని వడికేటప్పుడు, కదురు తిప్పే బోకికి ఆధారంగా పెట్టిన మట్టు; **2**. ఉన్ని వడికేటప్పుడు ఆడవాళ్ళు కూర్చోటానికి వేసిన పీట.

**దాకొను** చూ. దాపు. అ.క్రి. **1**. ప్రయత్నించు. తాళ్ల.సం. 10.104; **2**. సమీపించు. అచ్చ.రా. అయోధ్యా. 8, రామాభ్యు. 5.282; **3**. ఆవరించు. పరమ. 1.36; స.క్రి. ఎక్కు, అధిరోహించు. పాండు. 2.192.

< దాపు + కొను.

**దాకొలుపు** చూ. దాపు. స.క్రి. చేర్చు. ప్రభా. 5 155.

< దాపు + -కొలుపు.

**ద్రాక్షాదీగె** వి. ద్రాక్షాతీగె ఆకారంలో, అంచులో నేసిన డిజైను.

సం. *ద్రాక్షా-.* ఒకరకం పండ్లు కాసే తీగె.

< సం. ద్రాక్షా + తీగె.

**దాక్షిణి** వి. పళ్ళు నల్లగా అవటానికి వాడే పొడి, దాసాన పొడి.

**దాఖల్** రూ.చూ. దాఖలు. వి. కాకితం ఇచ్చి ఇచ్చినట్లు పుస్తకంలో రాసుకొనటం.

**దాఖల** రూ.చూ. దాఖలు. వి. నిదర్శనం, రుజువు.

**దాఖలా** రూ.చూ. దాఖలు. వి. రుజువు.

**దాఖలు** రూ. దాఖల్, దాఖల, దాఖలా. వి. సమర్పణం.

మరా. *దాఖల్.* చేరటం, ప్రవేశం; ఉ. *దాఖిల్.* ప్రవేశం, సమర్పణం; పార. *దాఖిల్.* ప్రవేశం, సమర్పణం; అర. *దాఖిల్.* హస్తాంతరణం, సమర్పించటం.

< ఉ. దాఖిల్.

**దాఖలుచేయు** స.క్రి. హాజరుపరచు.

**దాగలి** రూ.చూ. దాకలి. వి. కంసాలులు మొ॥వారు లోహాల్ని సాగగొట్టటానికి ఆధారంగా పెట్టుకొనే ఇనపదిమ్మ.

**దాగిడ** రూ. చూ. దాఁగర. వి. వస్తువుల్ని ఆరబోయటానికుపయోగించే పెద్ద వెదురుపుల్లల అల్లకం.

**దాగినబద్ద** చూ. దాఁగు. వి. మరమగ్గం కట్టుబడిలో ఎడమవైపు బద్ద.

**దాగిరి** రూ.చూ. దాఁగరి. వి. అంచుగల వెడల్పైన పెద్ద వెదురుజల్లెడ.

**దాగిలి**[1] వి. బంతిలో మొదటి ఎద్దు.

**దాగిలి**[2] రూ.చూ. దాకలి. వి. ఇనపబద్దీలను సాగగొట్టడానికి కింద ఆపుగా పెట్టిన రాతి దిమ్మ.

**దాగు** వి. పెద్దకండెల బేలు.

హిం. ధాగా. దారం.

**దాగుంచి** రూ.చూ. దాగుంచె. వి. నరి చేసేటప్పుడు, పడుగు ఆరే పదునులో ఉండగా నందు నందుకూ అనుతూ దువ్వే కుంచె.

**దాగుంచె** రూ. దాగుంచి. వి. నరి చేసేటప్పుడు, పడుగు ఆరే పదునులో ఉండగా నందు నందుకూ అనుతూ దువ్వే కుంచె.

**దాగుంచెవేయు** స.క్రి. నరి ఆరే పదునులో ఉండగా నందు నందుకూ అనుతూ కుంచెతో దువ్వు.

**దాగోడి** వి. పాలకుండపై మూతగా పెట్టే మూకుడు.

**దాఁక** రూ. దనుక. అవ్య.ద్రు. వరకు, పర్యంతం. భార.ఆది. 6.156.

**దాఁకొను** చూ. దాఁగు.

**దాఁకొలుపు** చూ. దాఁగు.

**దాఁగనమ్రుచ్చిళ్లు** చూ. దాఁగు.

**దాఁగనమ్రుచ్చులు** చూ. దాఁగు.

**దాఁగఁబోయినఁ దలారియిల్లగు** చూ. దాఁగు.

**దాఁగర** రూ. తగార, తగారి, తగారు, దాగిడ, దాగిరి. వి. వరుగులు మొ॥ వాటిని ఎండబెట్టే తట్ట, ప్రసేవకం. ఉ. హరి. 4.54.

**దాఁగరంతముఖమగు** అ.క్రి. 1. ముఖమింతవెడల్పగు; 2. అధికసంతోషంకలుగు. **దాఁగరలో వెలగకాయవలె** అవ్య. కదలక మెదలక.

**దాఁగిలిబూచులాడు** చూ. దాఁగు.

**దాఁగిలిముచ్చిములు** చూ. దాఁగు.

**దాఁగిలిమూఁతలు** చూ. దాఁగు.

**దాఁగిలిమ్రుచ్చులాడు** చూ. దాఁగు.

**దాఁగిలిమ్రుచ్చులు** చూ. దాఁగు.

**దాఁగిలు** చూ. దాఁగు.

**దాఁగిళ్లమూగిళ్లు** చూ. దాఁగు.

**దాఁగు** రూ.చూ. డాఁగు. అ.క్రి. తిరోహితమగు, మరుగుపడి ఉండు. భార. ఉద్యో. 1 244, ఆము. 5.155.

**దాఁకొను** రూ. డాఁకొను, డాఁగికొను, దాఁగుకొను. అ.క్రి. 1. మాయమగు, తిరోహితమగు. యయా. 2.37; 2. మరుగుపడు <దాఁగు+కొను. **దాఁకొలుపు** స.క్రి. మాయంచేయు, తిరోహితమొనర్చు. **దాఁగనమ్రుచ్చిళ్లు** యా.చూ. డాఁగిలిమ్రుచ్చులు. వి.బ.వ. దాగుడుమూతలు. బాలక్రీడా విశేషం. **దాఁగనమ్రుచ్చులు** వి.బ.వ. దాగుడుమూతలు. బాలక్రీడా విశేషం. **దాఁగఁబోయినఁదలారియిల్లగు** అ.క్రి. ఎక్కడికి పోకూడదో అక్కడికే పోయినప్పుడు ఉపయోగించే పలుకుబడి. దశా.మత్స్య. 41. **దాఁగిలిబూచులాడు** అ.క్రి. దాగుడు మూతలాడు. **దాఁగిలిముచ్చిములు** వి.బ.వ. దాగిలిమూతలు. తాళ్ల. సం. 5.270. **దాఁగిలిమూఁతలు** యా.చూ. డాఁగుడుమూఁతలు. వి.బ.వ. బాల్య క్రీడా విశేషం. హంస. 3.146. **దాఁగిలిమ్రుచ్చులాడు** అ.క్రి. ఒకసారి కనిపిస్తూ మరొకసారి కనిపించక ఉండు. నిరంకు. 4.89. **దాఁగిలిమ్రుచ్చులు** రూ.చూ. డాఁగిలిమ్రుచ్చులు. వి.బ.వ. దాగుడుమూతలు, పిల్లలాడే ఒక ఆట. విష్ణుపు. 7.202. **దాఁగిలు** అ.క్రి. తిరోహితమగు, మరుగుపడు. విష్ణుపు. 4.243. **దాఁగిళ్లమూగిళ్లు** వి.బ.వ. దాగుడుమూతలు. **దాఁగుకొను** రూ.చూ. దాఁకొను. అ.క్రి. 1. మాయమగు; 2. మరుగుపడు. **దాఁగుడుమూతలాట** వి. బాల్యక్రీడ. పండి. చ. 1.2.460. **దాఁగుడుమూతలాడు** అ.క్రి. 1. చిక్కకతప్పించుకొనుచుండు; 2. దాగుడుమూతలనే ఆటఆడు. **దాఁగుడుమూఁతలు** రూ.చూ. డాఁగుడుమూఁతలు. వి.బ.వ. దాగుడుమూతలు, పిల్లలాడే ఒకఆట. **దాఁగురించు** రూ.చూ. డాఁగురించు. స.క్రి. 1. దాచు; 2. వచించు. **దాఁగురింత** యా.చూ. డాఁగురింత. వి. 1. దాగుడుమూతలాట. అచ్చ. బా. 1.1; 2. వంచన, మోసం; 3. దాగటం; 4. మరుగుపడటం, దాచటం. **దాఁగురుమూఁతలు** రూ.చూ. డాఁగురుమూఁతలు. వి.బ.వ. పిల్లలాడే ఒకఆట. **దాఁగురుమ్రుచ్చులు** చూ. డాఁగిలిమ్రుచ్చులు. వి.బ.వ. దాగుడుమూతలు. వరాహ. 12.45. **దాఁపన** వి. దాచటం, గోపనం. భార. కర్ణ. 2.26. **దాఁపరము** వి. దొంగిలించటం. **దాఁపరముఁజేయు (-చేయు)** స.క్రి. మరుగుపరుచు. కాళిందీ. 6.28. **దాఁపరి** వి. దాపరీడు, వంచకుడు. చంపూ రా. 3.74. **దాఁపరించు** స.క్రి. దొంగిలించు, అపహరించు. హరి. ఉ. 5.226. **దాఁపరీఁడు** రూ. డాఁపరీడు. వి. 1. దొంగ. భాగ. 10పూ. 1249; 2. వంచకుడు. **దాఁపటికము** రూ. దాపరికం. వి. గోపనం. **దాఁపించు** స.క్రి. దాపేటట్లుచేయు. పరమ. వి. 3.55. **దాఁపు** వి. దాచటం, దాపరం. మృత్యు. 2.45. **దాఁపుడు** విణ. దాచుకొనబడే. పార్వ. 5.217. వి. దాచటం, గోపనం. **దాఁపురము** వి. 1. నిధి, నిక్షేపం. కు. సం. 8.185; 2. దాచుకొనటం, భద్రపరచటం, సంచయం చేయటం. వేంక. పంచ. 2.110; 3. గోపనం, మరుగు పరచటం. కళా. 5.47: 4. గోపనస్థానం, దాచుకొనేచోటు. రామాభ్యు. 1.153; 5. రహస్యం. కకుత్స్థ. 1.221; 6. దాచినసొమ్ము. సారంగ. 2.85; విణ. గుప్తం, దాచబడిన. పి. శకు. 2.167.

**దాచిని** రూ.చూ. దాల్చిని. వి. దాల్చిని, మసాలా దినుసుల్లో ఒకటి.

దాచెన రూ.చూ. దాల్చిని. వి. దంతరోగాలు పోవడానికి ఉపయోగించే నల్లటి పొడి.

దాజపండాబ్రాహ్మణులు వి.బ.వ. సామవేదులు, చండప్రచండులనే నామాంతరం ఉంది. వీరు గోభిల, ద్రాహ్యాయణ సూత్రాలకు చెందినవారు. కొందరిపుడు కృష్ణయజుర్వేదం అవలంబిస్తున్నారు.

దాంచె వి. గునపంలోని పదును లేనికొన.

దాఁచు రూ. డాఁచు. స.క్రి. 1. భద్రపరచు, పదిలపరచు. భార. అది. 7.141; 2. మరుగుపరచు, కనపడకుండా చేయు. భార. విరా. 5.351, వరాహ. 9.45; 3. నిక్షేపంగా ఉంచు. యయా. 4.35.

దాపుడుకోక వి. దాచిఉంచి పండుగల్లో కట్టుకొనే కోక. దాపుడుచీర వి. పెళ్ళికూతురు, దాచుకొని అప్పుడప్పుడు కట్టుకొనే చీర. దాపుడుబట్ట వి. దాచుకొని, అప్పుడప్పుడు కట్టుకొనేబట్ట.

దాట చూ. దాఁటు. వి. వాయిదావేయటం.

దాటదోనె వి. దోనె మలుపు తరవాత ఉన్నభాగం.

దాటీ వి. శక్తి.

సం. ధాటీ. దండయాత్ర, దాడి.

<సం. దాటీ (అర్థవిపరి.).

దాడి[1]. వి. దండయాత్ర, శత్రువుల్ని జయించడానికి దండెత్తిపోవటం. నిర్వ. రా. 3.9, భార. విరా. 3.127; 2. ఔద్ధత్యం, ఉరుటు. చంద్రికా. 4.63; 3. 9 లేదా 11 లేదా 12 పావులతో ఇద్దరాడే ఆట.

సం. ధాటీ. దండయాత్ర, దాడి; ప్రా. ధాడీ. సైన్యం, ఆక్రమణ, దండయాత్ర;

క. దాడి; తు. దాడి. అపాయం.

<ప్రా. దాడీ.

దాడికాఁడు వి. 1. దండెత్తేవాడు. కేయూ. 4.27; 2. వేగులవాడు. నృసింహ. 2.60. దాడిగొను(-కొను) అ.క్రి. ఒకదాని వెంబడి ఒకటివచ్చు. అప్ప. 4.236వ. దాడిచేయు అ.క్రి. దండెత్తు, యుద్ధయాత్రచేయు. దాడిపఱచు అ.క్రి. పరుగెత్తు, పారిపోవు. దాడిపోవు రూ.చూ. దాడివోవు. అ.క్రి. దండెత్తు. రం. రా. యు. 289వ. 20పం. దాడియాడు (-అడు) స.క్రి. ముట్టడించు, మార్కొను. ద్వి. భాగ. 7స్కం. దాడియాగు (-ఈగు) స.క్రి. మార్కొను. దాడివచ్చు అ.క్రి. దండెత్తివచ్చు, దాడివెడలివచ్చు. వరాహ. 11.12. దాడివెట్టు (-పెట్టు) అ.క్రి. దండువెట్టు, దండెత్తు. భార. కర్ణ. 3.356. దాడివోవు (-పోవు) రూ. దాడిపోవు. అ.క్రి. దండెత్తు. భార. ఉద్యో. 2.111.

దాడి[2] వి. 1. మీసం; 2. గడ్డం.

సం. దంష్ట్రా, దాడక-. పన్ను, దంతం; హిం. దాడీ. గడ్డం, మీసం.

<హిం. దాడీ.

దాడిగచెట్టు వి. ఒకరకం చెట్టు (Nauclea Cordifolia).

దాడినిమ్మ రూ. చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు. యయా. 4.7 (Punica Granatum).

దాడిమ రూ.చూ. దాలిమి. వి. దాడిమం. చంద్రికా. 4.63 (Punica Granatum).

దాడింబ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు. ఆం.భా. 2.50 (Punica Granatum).

దాడిమ్మ రూ.చూ. దాలిమి, ఒకానొక ఫలవృక్షం, దానిమ్మచెట్టు. పల్నా 71వ. (Punica Granatum).

దాడుగ వి. కంబచెట్టు (Adina Cordifolia).

దాణ రూ.చూ. దాణా. వి. గుర్రం మొ. వాటికి పెట్టే ఉలవలు మొ॥ ఆహారం. హంస. 5.41.

దాణము రూ. చూ. దాణా. వి. సుంకం, శుల్కం.

దాణా రూ. దాణ, దాణము, దాన, దానా. వి. పశువులకు పెట్టే ఉలవలు మొదలైన ఆహారం. వసువ్యా. 3.112.

సం. ధాన్య. ధాన్యం; ప్రా. ధాణా; హిం. దానా. ధాన్యం గింజ; మరా. దాణా. ధాన్యం; ఉ. దానా. ధాన్యం, ధాన్యంగింజ; పార. దానా. ధాన్యం, పండులోని గింజ, ధాన్యంగింజ.

<ప్రా. ధాణా.

దాణిమ్మ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మ, ఒకరకం చిన్న పెఱను చెట్టు (Punica Granatum).

దాణుధోడ వి. మల్ల విద్యావిశేషం. హంస. 1.206.

దాఁటకట్టు చూ. దాఁటు[1].

దాఁటడుగుపఱువడి చూ. దాఁటు[1].

దాఁటడుగుమొన చూ. దాఁటు[1].

దాఁటనగు చూ. దాఁటు[1].

దాఁటఁదోలు చూ. దాఁటు[1].

దాఁటరి చూ. దాఁటు[1].

దాఁటవేయు చూ. దాఁటు[1].

దాఁటవేసిపోవు చూ. దాఁటు[1].

దాఁటవేసుకుపోవు చూ. దాఁటు[1].

దాఁటించు చూ. దాఁటు[1].

దాఁటించువాఁడు చూ. దాఁటు[1].

దాఁటింపు చూ. దాఁటు[1].

దాఁటు[1] అ.క్రి. 1. కాలంగడుచు, అతిక్రమించు. భార.ఆది. 4.271; 2. లంఘించు, ఉరుకు. నిర్వ.రా. 6.85; 3. ఎగురు. నిర్వ.రా. 8.59, పారి. 2.10; 4. ప్లుతగతి విశేషంతో (గుర్రం) నడుచు. దశా. 2.60; స.క్రి. 1. లంఘించు. నిర్వ.రా. 7.132; 2. ఉల్లంఘించు, మీరు. రం.రా. అయోధ్యా. 97 వ. 7 పం.; 3. అతిక్రమించు, కడచు. శృం.నై. 2.35; 4. తరించు. భర్తృనీతి; 4; వి. 1. లంఘనం, ఉరుకు. హరి.ఉ. 7.182; 2. అశ్వగతి భేదం. ఆం.భా. 2.198; 3. చిన్నకాలువను దాటటానికి అడ్డంగా వేసినమాను; 4. పశువుల సంగమం; 5. దిష్టిదిగదుడుపు పెంకు.

క. దాణ్టు, దాటు. ఉరుకు, ఎగురు, మీరు, కడచు. తాగు, గెంతు, దాటు, దాటిసు, దాణ్టిసు. వెళ్ళేటట్లు చేయు; తు. దాణ్టుని. దాటు, రేవుదాటు; త. తాణ్టు (తాణ్టి-). గెంతు, ఉరుకు, దాండు, తాణ్టువమ్. గెంతడం, ఉరకడం; మ. తాణ్టుక. గెంతు, దాటు, తాట్టుక. అతిక్రమించు, చాటుక. దూకు, చాట్టమ్.

దూకు, గెంతు ; కో. ద.ట్-(ద.ట్య్-). దాటు (పర్వతం, నది మొ॥) ; తొ. తొ.ట్-(తొ.ట్య్-). దాటు (సరిహద్దు) ; గోం. డై. దూకు ; కొలా. ద.ట్.(దట్త్-). ద.టిప్-(ద.టిప్త్-). దాటేటట్లుచేయు ; కురు. చాటఖ్. అంగలు వేస్తూనడచు, దాటు. చూ. సం. తాణ్డవ-. నృత్యవిశేషం.

<మూ.ద్రా. *చాస్తు-/ చాట్-> *తాణ్ట్-/ *తాట్-.

**దాఁటకట్ట** వి. చేపలకు వేసిన కొడమదిగుదాల, ఎగిరిన చేప పడునట్లు, కొడమకు ఆనించి కట్టిన గుడ్డ లేక వల. **దాఁటడుగుపరువడి** వి. 1. పన్నెండు పరవళ్ళలో ఒకటి. ప్రబంధ. 78 ; 2. పధ్నాలుగు పరవళ్ళలో ఒకటి. హంస. 1.206. **దాఁటడుగుమొన** వి. మల్లవిద్యావిశేషం, పన్నెండు మొనల్లో ఒకటి. ప్రబంధ. 78, హంస. 1.206. **దాఁటనగు** స.క్రి. అతిక్రమించు. భాస్క.రా.బాల. 321. **దాఁటఁదోలు (-తోలు[1])** స.క్రి. పశువుల్ని దొంగతనంగా తోలుకొని పోవు. **దాఁటరి** వి. కప్ప. సాంబ. తిర్య. 83. <దాఁటు[1] + -అరి. **దాఁటవేయు** స.క్రి. 1. రహస్యంగా వస్తువుని వేరొక చోటికి చేర్చి దొంగిలించు ; 2. మోసగించు ; 3. సమయం తప్పించు ; 4. జవాబుచెప్పక వేరే ప్రస్తావనలోనికి దించు ; 5. ఏదైనా ఆశపశువుని సంగమింపజేయు ; 6. తప్పించుకొను. **దాఁటవేసిపోవు** స.క్రి. వదలిపెట్టి పోవు. **దాఁటవేసుకుపోవు** స.క్రి. పశువులను దొంగతనంగా తోలుకొని పోవు. **దాఁటించు** స.క్రి. దాటజేయు, ఎగిరించు. కాశీ. 1.53. <దాఁటు[1] + -ఇంచు[3]. **దాఁటించువాఁడు** విఙ. ఉత్తారకుడు. **దాఁటింపు** స.క్రి. 1. కాటేరి (స్త్రీలకు మైల స్రవించు వ్యాధి) మొ॥ వ్యాధులు గలవారిని, పూజచేసి ఉంచిన వస్తువు మీదగా దాటిపోవునట్లుగా చేయు ; 2. గరిగెను దాటించు. **దాఁటుకట్టు** అ.క్రి. గుంపుకూడు. నార. పంచ. 2.194. **దాఁటుకొను** అ.క్రి. 1. ఉరుకు. శృం.నై. 2.46 ; 2. లంఘించు, ఎగురు. కాశీ. 1.112 ; 3 చని పోవు. **దాఁటుడుదీయు(-తీయు)** రూ.చూ. దాఁటుతీయు. స.క్రి. పుళ్ళు మొ. వ్యాధులు గల వారిపై నుంచి క్రిందికి మంత్రించిన వస్తువును తిప్పితీయు. **దాఁటుడువల** వి. ఒక రకం వల. హంస. 4.185. **దాఁటుతీయు** రూ. దాఁటుడు తీయు. స.క్రి. పీడానివారణార్థమై ఏదైనా దిగతుడుచు. **దాఁటుపరువడి** వి. మల్లవిద్యల్లో ఒక పరువడి. **దాఁటురాయి** రూ.చూ. దాఁట్రాయి. వి. 1. మగపిల్లలాడే ఒక ఆట ; 2. గోడల కట్టుబడికి పనికివచ్చే ఒకరాయి. **దాఁటులు** వి.బ.వ. 1. పేరేలు, పరుగులు ; 2. వెంట్రుకల కత్తిరింపులో ఏర్పడే ఎగుడు దిగుడు చారలు. **దాఁటుపడు (-పడు)** అ.క్రి. 1. గుంపుకూడు. హరి.పూ. 68 ; 2. దూరమగు. పి.శకు. 3.88. **దాఁట్రాయి** రూ. దాఁటురాయి. వి. క్రీడావిశేషం. హంస. 3.147. **దాఁట్లమారి** వి. వ్యభిచారిణి. శుక. 3.124. **దాఁట్లుదాఁట్లుగా** క్రి.విణ. ద్రు. అందు కొంత, ఇందు కొంతగా, అరకొరగా.

**దాఁటు[2]** వి. సమూహం, గుంపు, మంద. వరాహ. 8.16.

సం. దండ-. సేన, సమూహం.

**దాఁట్రాయి** చూ. దాఁటు[1].

**దాఁట్లమారి** చూ. దాఁటు[1].

**దాఁట్లుదాఁట్లుగా** చూ. దాఁటు[1].

**దాత** వి. ఆముపడుగులో నిలువుగా పేర్చిన కుండలపై అడ్డంగా కుడివైపుకుగాని, ఎడమ వైపుకు గాని వాలుగా పేర్చిన కుండ.

సం. ధాతృ. ధరించేది, ధరించేవాడు.

**దాతకట్టు** స.క్రి. ఆములో నిలువుకు పేర్చిన కుండలపై అడ్డంగా కుడివైపుకుగాని ఎడమవైపుకుగాని వాలుగా కుండలను పేర్చు. **దాతపెట్టు** స.క్రి. నడిమికి పేర్చిన కుండలపైన అడ్డంగా కుడివైపుకుగాని ఎడమవైపుకుగాని వాలుగా కుండల్ని పేర్చు. **దాతర** చూ. దాతవ. వి. పాత్రలు తీర్చడానికి సారె పలక మీద లింగాకారంగా పెట్టిన మట్టి ముద్ద. **దాతరపట్టు** స.క్రి. పలక మీది మట్టిని కుండ రూపు రావడానికి మీదికి పొడవుగా లోపల బోలుగా వచ్చేటట్లు లేపు. **దాతలాము** వి. మూడుగాని నాల్గుగాని దాతలు కట్టిన ఆము. < దాత + - లు + ఆము. **దాతలుకట్టు** స.క్రి. ఆములో నిలువుకు పేర్చిన కుండలపై అడ్డంగా కుడివైపుకు గాని ఎడమవైపుకుగాని వాలుగా కుండల్ని పేర్చు.

**దాతవ** చూ. దాతర. వి. పాత్రలు తీర్చటానికి సారెపలక మీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద.

**దాతికట్టు** చూ. దాయ.

**దాతిమాను** చూ. దాయు.

**దాతిరి** రూ. దాత్రి, దాస్తిరి. వి. రాతిని చదునుచేసే పని ముట్టు.

**దాతు** వి. గైరికాది ధాతువు.

సం. ధాతు-. గైరికాది ధాతువు; ప్రా. ధాఉ- ;

తు. ధాతు. ధాతువు.

<సం. ధాతు-.

**దాతుబొట్టు** వి. గైరికాది ధాతువుతో చేసిన తిలకం. సిం. ద్వా. 8.9.

**దాత్రి** రూ.చూ. దాతిరి. వి. రాతిని చదునుచేసే పనిముట్టు.

**దాదాపు** చూ. దాపు[2].

**దాది** రూ. దాదిలి. వి. పెంచినతల్లి, ఉపమాత. భార. ఆది. 4.234.

సం. ధాత్రీ. ఉపమాత, పెంపుడుతల్లి ; ప్రా. ధాఈ, ధత్తీ ; ధల్తీ, ధావి- ; శౌ. ధాఈ ; అ.మా. ధాఈ, దాది ; పా. ధాతీ ; బెం. దాది. అవ్వ ; గు. దాదీ. వృద్ధస్త్రీ ; మరా. ధాయానే, దాఇ, దాది. వృద్ధురాలైన స్త్రీ.

క. దాది, దాయి ; త. దాది, తాతి ; మ. తాచ్చి, తాయి. దాది ; గోం. దఇ. తల్లి ; బ్రా. దాఈ. దాది.

<సం. ధాత్రీ-.

**దాదిలి** రూ. చూ. దాది. వి. దాది, ఉపమాత. కసుత్స. 3.14.

**దాదుంగ** చూ. దాయి[2]. వి. దాతికర్ర, చెక్కెకర్రకు ఊతగా కింద ఉంచుకునే బల్ల మొదలైనవి.

**దాన** రూ.చూ. దాణా. వి. పశువులకు పెట్టే ఉలవలు మొదలైన ఆహారం.

**-దాన** ప్రత్య. మహతీ వాచక సంబోధనలో వచ్చే ప్రత్యయం.

దానపుకొత్తలు వి.బ.వ. 1. నదీతీరాల్లో సంకల్పం చెప్పి సంపాదించిన డబ్బు; 2. కల్లు అమ్మి సంపాదించిన డబ్బు.

సం. దాన-. దానం.

<సం. దాన- + ము + కొత్త + -లు.

దానరాసులు వి.బ.వ. కార్తీకమాసంలో మంచుకుపండే ధాన్యం.

సం. ధాన్యరాశి-. ధాన్యంపోగు.

<సం. ధాన్యరాశి + -లు.

దానవాలం వి. పిల్లలు ఆటల్లోవాడే దేవతాకారపు మట్టి ప్రతిమ.

దానా రూ.చూ. దాణా. వి. పశువులకు ఉడకబెట్టి పెట్టే ఉలవలు మొ. ఆహారం.

దానాగోలెం వి. పశువులకు దానా పెట్టడానికి అడుగు వెడల్పుగా ఉండే మట్టితొట్టి.

దానాదీనా అవ్య. మొత్తంమీద.

<అది + -అ[7] + ఇది + -అ[7].

దానిమ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మ (Punica Granatum).

దానింబ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మ. కృష్ణ. 4.105. సాంబ. స్థా. 57.

దానిమ్మ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు (Punica Granatum). సాంబ. స్థా. 57.

దానిమ్మరెక్క రూ.చూ. దానిమ్మరేకు. వి. ఒకరకం ఎరుపురంగు. దానిమ్మరేకు రూ. దానిమ్మరెక్క. వి. ఒకరకపు ఎరుపురంగు.

దానె వి. 1. నరిచేసేటప్పుడు, ఉన్ని పడుగు ముందువైపు దూర్చిన లావాటి కర్ర; 2. ఉన్ని పడుగు నరిచేసేటప్పుడు అని పోగుల్లో దూర్చిన మర్రి ఊడ.

దానెకట్టె వి. నరిచేసేటప్పుడు, ఉన్నిపడుగు ముందువైపు దూర్చిన లావాటి కర్ర. దానెరాయి వి. నరిచేసేటప్పుడు, ఉన్నిపడుగులో చివర ఎక్కించిన కర్ర (దానె) బిగింపు కోసం, నేలలో పాతిన రాయి.

దాన్నెంగాది వి. ధాన్యం నిల్వకు ఉపయోగించే పెద్ద ఒర.

సం. ధాన్య-. ధాన్యం.

<సం. ధాన్య- + గాది.

దాన్యంకాగు వి. గింజలు నిల్వచేయడానికి వాడే పెద్ద మట్టి పాత్ర.

సం. ధాన్య-. ధాన్యం.

<సం. ధాన్య- + కాగు.

దాప చూ. దాపు[2]. వి. ఆరుబయట పడుగు చాపటానికి నిలబెట్టే కొయ్య పనిముట్టు.

దాపకర్ర రూ.చూ. దాపుకర్ర. వి. 1. నిచ్చెన. రామలిం. శ.55; 2. మరమగ్గం బొమ్మకు నిలుపుపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర.

దాపటికాలబొమ్మ చూ. దాపల.

దాపటిపాయ చూ. దాపల.

దాపటెద్దు చూ. దాపల.

దాపతాడు వి. మోటబొక్కెన తొండానికి కట్టిన తాడు.

దాపన చూ. దాఁచు. వి. దాచటం.

దాపరము చూ. దాపు[2].

దాపరించు చూ. దాపు[2].

దాపల రూ. డాపల. వి.ఔ. ఎడమవైపు. కు. సం. 11.102.

దాపటికాలబొమ్మ వి. ఎడమకాలికి కట్టినబొమ్మ. ఉ.హరి. 4.137. దాపటిపాయ వి. అచ్చుగుది పాయల్లో ఎడమవైపుది. దాపటెద్దు వి. బంతిలో మొదటిఎద్దు. < దాపల + ఎద్దు. దాపలికుండ వి. పొంత, పొయ్యికి ఒకపక్కన నీళ్ళు కాగడానికి పెట్టే మట్టిపాత్ర. దాపలించు రూ.చూ. డాపలించు. స.క్రి. ఎడమవైపుగా ఉంచు. భార. శల్య. 2.267.

దాపలికుండ చూ. దాపల.

దాపలించు చూ. దాపల.

దాపించు చూ. దాపు[2].

దాపినీ రూ.చూ. జాపిని. వి. పాలకుండలమీద పెట్టే మట్టిమూత.

దాపిరికం చూ. దాఁచు. రూ.చూ. దాఁపరికము. వి. విషయాన్ని దాచి పెట్టడం.

దాపు[1] చూ. దాఁగు. వి. చాటు.

దాపు[2] చూ. దాయు. రూ.చూ. డాపు. వి. 1. అవలంబం. ఉత్త. హరి.పూ. 4.16; 2. ఆధారం, అండ, శరణం. శృం.నై. 4.31; 3. సమీపం, చేరువ. కాశీ. 1.45; 4. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద(లు); 5. అంచులో మొదటి భాగం; 6. కమ్మికి రెండువైపులా ఒకటి, రెండు కొలుకులు వరసగా పెట్టి నేసిన నేత; 7. బట్టిగోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్న గోడ; 8. ఆములో పెంకు కాల్చడానికి ఏర్పరచిన సందు.

మ. అటుక (అట్టు). దగ్గరకు; కో. అడ్- (అట్-). (ఏదో ఒకటి) జరుగు; కుఇ. అడ (అడి). కలియు, మరొకరితో కలిసివెళ్ళు; మాల్తో. అడ్గె, అట్గి. దగ్గర, సమీపం, ఆటిపటి. పొరుగు.

దాదాపు వి. 1. మిక్కిలి సమీపం; 2. సుమారు. దాపరము రూ.చూ. దాపురము. వి. ప్రాప్తి. దాపరించు స.క్రి. ప్రాప్తింపజేయు, లభింపజేయు, చేకూరజేయు. అప్ప. 4.333; అ.క్రి. ప్రాప్తించు. దాపించు స.క్రి. సమీపించు. దాపుకమ్మి వి. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య. దాపుకర్ర రూ. దాపకర్ర. వి. నిచ్చెన, ఎత్తుగా ఉన్న వస్తువుల్ని, తావుల్ని అందుకోడానికి పనికివచ్చే పరికరం, దాపుకుండ రూ.చూ. దాపుడుకుండ. వి. 1. పెంకాములోపలి గూనలు కాకకు బయటికి రాకుండా అడ్డుపడటానికి చుట్టూ కుదురు గోడలో పెట్టిన కుండ; 2. పొయ్యికి ఒక పక్కన నీళ్ళు కాగడానికి పెట్టే మట్టికుండ. దాపుకొను అ.క్రి. 1. సమీపించు. రామాభ్యు. 5.182; 2. ఆవరించు. కపియు. పరమ.వి. 1.36; 3. కలియు. ద్వి.సార. చ. 2.82 ప. 10 పం. స.క్రి. 1. అధిరోహించు, ఎక్కు. పాండు. 2.192; 2. ఆశ్రయించు, అండకొను. కవిక. 3.205; 3. చేరు, పొందు. దాశ. 26. దాపుకొయ్య వి. మిడిగూటానికి వేసిన నేత మోసు పడుక్కు అడ్డు రాకుండా తగిలించటానికి పాతిన గూటం. దాపుచెక్క వి. మరమగ్గం నొరుగుకు చివర, నాడె బయటికిపోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. దాపుడుకుండ రూ. దాపుకుండ.

దాబుకుండ. వి. **1.** ఆము కాలే కుండలకు దెబ్బతగలకుండా మొగదాల పొయ్యిల దగ్గర గోడ పొడవునా ఆపుగా పెట్టిన పనికిరాని కుండ ; **2.** పొయ్యికి పక్కన నీళ్ళు కాగడానికి పెట్టిన కుండ. **దాపుడుముక్క** వి. మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **దాపుదండగు** అ.క్రి. తోడునీడగు. తాళ్ల.సం. 7.243. **దాపుదాను** రూ.చూ. తాపుదాను. వి. చిన్నకిటికీ. **దాపున** క్రి. విశ.ద్రు. దగ్గర. **దాపుమూపులు** వి.బ.వ. దాచటం. **దాపురమగు** అ.క్రి. ప్రాప్తమగు, దాపరించు. సారంగ. 2.145. **దాపురము** రూ. డాపురము, దాపరము. వి. ప్రాప్తి. ద్వి.హరిశ్చ.ఉ. 1201 పం. **దాపులు** రూ. దరుపులు. వి.బ.వ. ఆములో కాలే కుండలకు దెబ్బ తగల కుండా ఆపుగా పెట్టిన పనికిరాని కుండలు. **దాపులుగట్టు** (-**కట్టు**) స.క్రి. కుండలు దెబ్బతినకుండా అడ్డుపడడానికి ఆము లోపల చుట్టూ ఓటికుండల్ని దాపుగా పేర్చు. **దాపులుపెట్టు** స.క్రి. ఆము లోపలి కుండలు దెబ్బతినకుండా ఉండడానికి, కాక బయటికి రాకుండా అడ్డుపడడానికి ఆము లోపల చుట్టూ ఓటికుండల్ని దాపుగా పేర్చు. **దాపెట్టు** స.క్రి. పోటీపెట్టు. **దాప్పొయ్యి** వి. ఒకవైపు మట్టిపాత్రను దాపుగా పెట్టే పొయ్యి.

**దాపుడుకోక** చూ. దాఁచు.

**దాపుడుచీర** చూ. దాఁచు.

**దాపుడుబట్ట** చూ. దాఁచు.

**దాపె** వి. కొట్టం కట్టుబడిలో మధ్య వేసే నిలువు గుంజ.

**దాపెట్టు** చూ. దాపు².

**దాప్పొయ్యి** చూ. దాపు².

**దాబ** రూ.చూ. డాబా¹. వి. ఇటిక కప్పుగల ఇల్లు.

**దాబారు** రూ. దావారు. వి. మోట తొండం చివర రెండు వైపులా రంధ్రాలు వేసి దూర్చే తాడు.

**దాబు**¹ చూ. డాపు. వి. ఆములో కాలే కుండలకు దెబ్బ తగల కుండా ఆపుగా పెట్టిన పనికిరాని కుండ.

**దాబుకుండ** రూ.చూ. దాపుడుకుండ. వి. ఆములో కాలే కుండలకు దెబ్బ తగలకుండా మొగదాల పొయ్యిల దగ్గర గోడ పొడవునా ఆపుగా పెట్టిన పనికిరాని కుండ.

**దాబు**² వి. భయం.

హిం. దాబ్. అణచటం, శాసనం, భయం.

<హిం. దాబ్.

**దామ** వి. ఉన్ని కదురు పుల్ల.

సం. దామన్. తాడు, దారం.

<సం. దామన్ (అర్థవిపరి.).

**దామమొలికి** రూ. దామ్మొలికి. వి. ఉన్ని కదురు ఊచకు కింద బిగించిన మేకు. **దామ్మొలికి** రూ.చూ. దామమొలికి. వి. ఉన్ని కదురు ఊచకు కింద బిగించిన మేకు.

**దామంచెర్లబండ** వి. దామంచెర్ల ప్రాంతంనుంచి వచ్చే చలవ రాయి (Marble).

**దామడి** వి. తుమ్మిచెట్టు (Diospyros Melanoxylon).

**దామర** రూ. దామెర. వి. **1.** ఉరితాడు. వసు. 4.132 ; **2.** గుండ్రంగాఉండే కుష్ఠురోగం ; **3.** పశువులకు చిట్టుపోసి పెట్టే బుట్ట.

సం. దామన్, దామనీ. పలుపుతాడు.

**దామరకము** రూ.చూ. దబరకము. వి. ఉన్నట్టుండి నొప్పిపట్టి మోకాలు వంగకపోవడం.

**దామాషా** వి. సరియైన పంపకమైన భాగం, భాగం.

హిం. దామాసాహ్. నిష్పత్తినిబట్టి సరిగా పంచు కోవటం.

<హిం. దామాసాహ్.

**దామిడి** చూ. దవ్వు. వి. చాలదూరం.

**దామినపాము** చూ. దామెన. వి. ఒకరకం పాము.

**దామెన** వి. **1.** పెక్కుపలుపులుగల పెద్దతాడు. భార.విరా. 1.275 ; **2.** తాడు ; **3.** కన్నెపిల్లలు వేసుకొనే పమిట.

సం. దామనీ, దామన్. కాలితాడు, దామెన ; ప్రా. దామణ-, దామణీ, దావణ. పెక్కుపలుపులుగల పెద్ద తాడు ;

క. డాణి, డావణి, దావణి, దావు ; త. తాంపు.

<ప్రా. దామణ-.

**దామెనకట్టుకట్టు** స.క్రి. బందెవేయు. తాళ్ల.సం. 6.59. **దామెనకొయ్య** వి. దామెన కట్టే స్థంభం. హరి.పూ. 5.206. **దామెనత్రాడు** వి. పెక్కుపలుపులుగల పెద్దతాడు. హరి.ఉ. 4.235. **దామెనపగ్గము** వి. పెక్కుపలుపులుగల పెద్దతాడు. **దామెనమోసు** వి. పెక్కుపలుపులుగల పెద్దతాడు. చెన్న బసవ. 2.292. **దామెనవేఁట** వి. ఒకరకం వేట, అక్కడక్కడ దామెనలు పెట్టి చేసే వేట. సిం.ద్వా. 8.22. **దామెనసుడి** వి. గంగడోలుకు రెండువైపులా ఉండే సుడి.

**దామెర** రూ.చూ. దామర. వి. **1.** మండలాకార కుష్ఠువ్యాధి; **2.** ద్వారబంధంమీద చెక్కిన తామరపువ్వు.

**దామెరాకు** (<**తామరాకు**) వి. తులసికోట పైఅంచున అందానికి కట్టబడిన ఆకువంటి నిర్మాణం.

**దామెరాకు** చూ. దామెర-.

**దామోదరుడు** వి. అప్రయోజకుడు.

సం. దామోదర-. కృష్ణుడు, దండ పొట్టపై కలవాడు, దరిద్రదామోదర-. దరిద్రుడైన దామోదరుడు. దరిద్ర శబ్దం లేకున్నా ఆ అర్థాన్ని దామోదర శబ్దం ఒక్కటే ఇస్తుంది.

<సం. దామోదర-(అర్థవిపరి.).

**దాంబరు** వి. కొయ్యకు చెదలు పట్టకుండాను, డాబాకప్పు కురవకుండా పూసే నల్లటి చిక్కనిద్రవం.

**దాంబరుకట్టె** వి. వెదురు, నిర్మాణద్రవ్యంగా సర్వ సాధారణంగా వాడుకలో ఉన్న తృణవిశేషం.

**దాఁపన** చూ. దాఁగు.

**దాఁపరము** చూ. దాఁగు.

**దాఁపరముఁజేయు** చూ. దాఁగు.

**దాఁపరి** చూ. దాఁగు.

**దాఁపరించు** చూ. దాఁగు.

**దాఁపరీఁడు** చూ. దాఁగు.

**దాఁపటికము** చూ. దాఁగు.

**దాఁపించు** చూ. దాఁగు.

**దా(పు** చూ. దా(గు.
**దా(పుడు** చూ. దా(గు.
**దా(పురము** చూ. దా(గు.
**దామ్మొలికి** చూ. దాము.
**దాయ** వి. **1.** శత్రువు. కు.సం. 11.92 ; **2.** జ్ఞాతి, సగోత్రుడు. భార. అను. 3.199.

సం. దాయాద-. జ్ఞాతిసంబంధమైన ; ప్రా. దాయాద- ;

క. దాయ, దాయాది, దాయగ ; మ. తాయాతి.

<ప్రా. దాయాద-.

**దాయవఱుచు** స.క్రి. కష్టపెట్టు, బాధించు. భార.విరా. 2.312.
**దాయకర్ర** రూ.చూ. దాయికర్ర. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగుకిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.
**దాయగర్ర(-కఱ్ఱ)** రూ.చూ. దాయికర్ర. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.
**దాయ(గట్టు** చూ. దాయు.
**దాయజగదలమాడ** వి. ఒకరకం మాడ. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1093.
**దాయన** చూ. దాపల. వి. **1.** 'బంతి'లో మొదటి ఎద్దు ; **2.** మేటెద్దు ; కళ్ళం మధ్య పాతిన గుంజకు కట్టిన ఎద్దు.
**దాయను** స.క్రి. రమ్మను. హంస. 1.243.

<వచ్చు+-అ[7]+అను.

**దాయపడు** చూ. దాయము.
**దాయమాడు** చూ. దాయము.
**దాయము** రూ. దోయము. వి. **1.** జూదం, గవ్వలాట మొ. వాటిలో పందెం. పండి. చ. 2.125 పు. ; **2.** విపత్తు, ఇడుము, ఆపద.ద్వి. హరిశ్చ. 595 పం.

త. తాయమ్. గవ్వలాట.

**దాయపడు** అ.క్రి. కష్టపడు. **దాయమాడు** స.క్రి. దాయాలను ఆడు, పాచికలాడు. పండి.చ. 1.2 పు. 368.

**దాయి**[1] చూ. దాయు.
**దాయి**[2] చూ. దాయు. రూ. డాయి. వి. దాకలి, నిషూతిక, చెక్కె కర్ర కింద ఊతగా ఉంచుకునే ఇనపదిమ్మ. పండి. చ. 2.96 పు.

**దాయికట్టె** వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు. **దాయికర్ర** రూ. దాయకర్ర, దాయగర్ర. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

**దాయి**[3] వి. పిల్లలకు పాలిచ్చి పెంచే స్త్రీ. దశా. 9.206.

సం. ధాత్రీ. పెంపుడు తల్లి. ప్రా. ధాఈ.

<ప్రా. ధాఈ.

**దాయించు** చూ. దాయు.
**దాయు** రూ.చూ. డాయు. స.క్రి. **1.** చేరు, సమీపించు. కు.సం. 7.155 ; **2.** ఆము. పడుగులో పాత్రల్ని అమర్చు ; అ. క్రి. **1.** అంటు, లగ్నమగు. శృం. నై. 8.61 ; **2.** కలుగు, పుట్టు. అచ్చ.రా.బాల. 6 పు. 13 పం.

**దాతికఱ్ఱ** వి. దాదుంగ, చెక్కె కర్రకు కింద ఊతగా ఉంచే బల్ల మొ. **దాతిమాను** వి. కర్రపనివాడు ఉపయోగించే బల్ల, చాకలి ఉపయోగించే రాయి. **దాయ(గట్టు(-కట్టు)** స.క్రి. **1.** బందంవేయు ; **2.** పశువుల్ని ఒకదానితో మరొక దానిని కట్టు. < దాయు + -అ[7] + కట్టు. **దాయి**[1] వి.ఔ. సమీపం. సారంగ. 2.86. **దాయించు** రూ.చూ. డాయించు. స.క్రి. **1.** పొందించు ; **2.** సోకించు, కదియ జేయు. <దాయు+-ఇంచు[3].

**దార**[1] రూ. దారు. వి. **1.** క్రమం, విధం. ఉ.హరి. 3.124 ; **2.** ధారా పూర్వకంగా ఇవ్వబడిన దానం. కాశీ. 7.187 ; **3.** నీరు మొ॥ వాటిధార, నీటిజాలు. పారి. 4.16 ; **4.** కవిత్వాదుల ధార, అవిచ్ఛిన్నగతి. సమీర. 1.15 ; **5.** కత్తి అంచు ; **6.** మట్టిగోడ నిర్మాణంలోని దశలను గుర్తించే గీత.

సం. ధారా. నీటిధార ; ప్రా. ధారా. జలధార, ప్రవాహం, అశ్వగతి విశేషం, వర్షం, కత్తి అంచు ; పా. ధారా ;

క.తు. దారె ; త. తారై ; మ. ధార.

<ప్రా. ధారా.

**దారకడవ** వి. శవాన్ని దహనం చేసేటప్పుడు వాడే మట్టిపాత్ర. **దారకర్ర** రూ. దారగర్ర. వి. సారాయి బట్టీలో కప్పు కుండకి రంధ్రం పెట్టి బిగించే మట్టిగొట్టం. **దారకాసు** వి. ఒకరకం అంచుడిజైను. **దారకొమ్ము** వి. చమురుపోసే పసరపు కొమ్ము. **దారగర్ర(-కఱ్ఱ)** రూ.చూ. దారకర్ర. వి. సారాయి బట్టీలో కప్పుకుండకి రంధ్రం పెట్టి బిగించే మట్టిగొట్టం. **దారపోతముంత** వి. పాలధార పోయ డానికి అరివేణికుండలతో ఇచ్చే చిన్న మట్టిపాత్ర. **దారపోతబుడిగె** వి. పాలుధార పోయడానికి అరివేణి కుండలతో ఇచ్చే చిన్న మట్టిపాత్ర. **దారపోయు** రూ.చూ. దారవోయు స.క్రి. **1.** అర్పించు. వేమ. 1.403 ; **2.** దానం చేయు. **దారబోయు(-పోయు)** యా.చూ. దారవోయు. స.క్రి. పోగొట్టుకొను. **దారవో(త** వి. ధార పోయటం. దశా. 1.69. **దారవోయు(-పోయు)** రూ.చూ. దారపోయు, దారబోయు. స.క్రి. **1.** అర్పించు, పెట్టు. కాశీ. 7.186 ; **2.** (ఇవ్వటానికి) సంకల్పించు. భాగ. 10.113 ; **3.** వివాహార్థమిచ్చు, పెండ్లిచేయు. శశా. 5.136 ; **4.** దానంచేయు.

**దార**[2] వి. కాహళి, బాకా. ప్రబంధ. 637, కువ.చ. 2.115.
**దారం** రూ.చూ. దారము[1]. వి. **1.** రాట్నం ఆకుల తాడును, కదురును కలిపే గట్టిదారం ; **2.** రాటి ఆకులు పైపీ కిందవీ కలిపి కట్టిన దారం ; **3.** అడ్డగుమ్మి ఆకులు కలిపి కట్టిన దారం ; **4.** డబ్బారాట్నం చక్రాన్నీ గంటాన్నీ కలిపే గట్టి దారం ; **5.** ఊడ్తెను నిలబెట్టి, కిందిగూటానికి బిగించే తాడు ; **6.** దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్ల (పన్ను)కు కట్టిన తాడు ; **7.** మగ్గం ఉడతకు పైన కట్టిన దారం ; **8.** నూలుతాడు ; **9.** గోడలు తిన్నగా ఉన్నవో లేవో సరిచూడడానికి బేల్దారులు వాడే తాడు.

దారంగట్టు స.క్రి. కొలతప్రకారం నమూనాలు గీయు. దారంపట్టు స.క్రి. కొలతపట్టు.

దారక వి. ఒకరకం కలుపుమొక్క.

సం. దారక-. బాలుడు, కుమారుడు.

దారకం వి. 1. మజ్జిగలో అన్నం పిసికి, అన్నం తీసివేసి, జ్వరం తగ్గిన తరువాత తాగించేది ; 2. కొఱ్ఱ అంబల్ని చిక్కగా కలిపిన గంజి ; 3. ఆహారం.

సం. ధారక-. పోషించేది.

<సం. ధారక- (అర్థవిపరి.).

దారణ వి. 1. ధాన్యాదుల వెల. కేయూ. 2.10; 2. క్రయం, కొనటం. ఆం.భా. 2.267.

సం. ధారణ-. ధరించేది, పోషించేది, ధారణా. ధరించటం, అప్పపడటం ; ప్రా. ధారణ ;

క. దారణె, దారణ, దారెణె, దార్ణె. బజారు వెల ; త. తారణై ; తు. దారెణె.

<ప్రా. ధారణ-.

దారణకొమ్ము వి. ధాన్యాదుల వెలను తెలియజేసే చంద్రుని శృంగం. కాశ. 3.149.

దారణం వి. సాహసం.

సం. ధారణ-. ధరించేది.

<సం. ధారణ-.

దారపుకండె చూ. దారము[1].

దారపుబండి చూ. దారము[1].

దారప్పతల్లి వి. గ్రామదేవత.

దారబందం చూ. దారము[1].

దారబందంపట్టె చూ. దారబందము.

దారబందము రూ. దారబందరం, దారబందిరం, దారబంద్రం, దారమందిరం, దారమంద్రాం, దాలబందలం, దాలబందిరం, దాలబంద్రం, దాలమందరం, దాలమందిరం, దాలమంద్రం, దాలమంద్రాం, దాలిబందరం, దోరబందరం, ద్వారబందరం. వి. ద్వారబంధం. ఉ.హరి. 1.53.

సం. ద్వారబంధ-. ద్వారానికి అమర్చిన చట్రం ; క. ద్వారబంధ.

<సం. ద్వారబంధ-.

దారబందంపట్టె వి. దర్వాజా చట్రపు పైకమ్మి. దారబందంమెలిక వి. పన్నె కట్టుబడిలో దండెలమధ్య బిగించిన ఈనెకు దారంతో వేసిన ముడి.

దారబందంమెలిక చూ. దారబందము.

దారబందరం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దారబందిరం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దారబంద్రం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దారమందిరం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దారమంద్రాం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దారము[1] రూ. దారం. వి. 1. తాడు, చేతాడు. భార.అను. 4.118, పండి.చ. 5.344 పు. ; 2. నులితాడు, సూత్రం. ఆం.భా. 2.295.

చూ. సం. ధారా, దవరక-, దోరక. తాడు, దోరికా, డోర(క) ; ప్రా. ధారా, దవరయ ;

క. దార. దారం, తీగ ; తు. దార ; త. తార్, తారమ్. నూలిదారం, చేకుదారం, కొబ్బరితాడు ; తొద. తొ.ర్మ్. ఒకేవరస ఉన్న పూసలహారం, దండకి పెట్టుకునే నగకువేలాడే ఒక దారం.

<ప్రా. ధారా.

దారపుకండె వి. దారం చుట్టబెట్టిన పుల్ల. దారపుబండి వి. 1. గంటానికి బిగించిన రీలుదారపుబండి ; 2. బరువు కట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగలక ; 3. మిషను వడిదారం (అచ్చువడికట్టేది) చుట్టిన కొయ్యగిలక. దారబందం వి. పడుగుదువ్వే కుంచె పిడికి వేసిన తాడుమెలిక. దారముకట్టు స.క్రి. పెళ్ళి చేసుకొను. దారమేయు స.క్రి. కొలత ప్రకారం నమూనాలు గీయు.

దారము[2] వి. కాకణీ చతుష్టయం, నాలుగు కానుల పరిమితిగల నాణెం. ఆం.భా. 2.274.

దారము[3] వి. ద్వారం, వాకిలి.

సం. ద్వార- ; ప్రా. దార-.

<ప్రా. దార-.

దారశాఖలు వి.బ.వ. ద్వారంయొక్క పక్కస్తంభం.

దారము[4] వి. చౌర్యం.

దారమేయు చూ. దారము[1].

దారశాఖలు చూ. దారము[3].

దారి[1] వి. 1. మార్గం, తోవ. కు.సం. 9.76 ; 2. విధం, రీతి, పద్ధతి. పల్నా. 98 పు. నె.శా. రేపూర్. 3. క్రీ.శ. 1289 ; 3. స్థానం, చోటు. ఇందు. 4.7 ; 4. సూత్రధారుడు. ఆం.భా. 2.287 ; 5. పార్శ్వం, పక్క, వైపు. చంపూరా. 2.55 ; 6. కత్తిఅంచు, వాదర ; 7. కప్పుమీది నీరు కిందికి కారడానికి వీలుగా అమర్చిన పొడవైన గొట్టం.

క. దారి. త్రోవ, మార్గం, రోడ్డు ; తు. దారి ; త. అతర్, తారి. దారి, రోడ్డు, మార్గం, తారై. దారి, మార్గం ; కో. అ.ద.ఱి. మార్గం.

<మూ. ద్రా. *అతర్.

దారికట్టు వి. మార్గాన్ని నిరోధించే మూలిక. శుక. 1.14 ; స.క్రి. తోవను అడ్డగించు. దారికాఁడు వి. దారిలో సహాయంగా వచ్చేవాడు. పండి. చ. 5.367. దారికాయు అ.క్రి. ఎదురు చూచు. దారికిఁదెచ్చు (-తెచ్చు) స.క్రి. అలవరచు, అలవాటు చేయు. కువ. చ. 4.68. దారికివచ్చు అ.క్రి. వశమగు, లొంగు. కువ. చ. 4.51. దారికొట్టు అ.క్రి. దారిలోఆపి దోచుకొను. దారిగుమ్మడి వి. నీలం పూలు కల్గి వేళ్ళకు దుంపలుండే మొక్క (Pueraria Tuberosa). దారిజరుగు అ.క్రి. నడకలో గాని, పరుగులో గాని దూరాన్ని త్వరగా అధిగమించు. దారితల వి. ప్రయాణంలో దారి నడుమ తగిలే చోటు. దారితెన్ను వి. మంచి చెడ్డ. దారిదొంగ వి. ఎడతోపకారి. దారిపట్టు

అ.క్రి. వెళ్ళిపోవు. **దారిపడు** అ.క్రి. దారికివచ్చు. వర. రా. ఆరణ్య. పు. 207 పం. 24. **దారిపన్ను** వి. శిస్తు. **దారిబడి** వి. తోడు, కావలి, మార్గంలో సహాయం వచ్చేవారు. **దారి మళ్ళించు** స.క్రి. మంచి దారికి తిప్పు. **దారిలో(బడు (-పడు)** అ.క్రి. మంచితోవకు వచ్చు. **దారులుకాయు** రూ. దార్లుకాయు స.క్రి. **1.** మంచికి గాని, చెడ్డకుగాని, ఒకవ్యక్తిని కలుసుకోటానికి అతడుపోయే తోవల్లో కనిపెట్టుకొని ఉండు ; **2.** బందెపోటు చేయు ; **3.** దొంగతనం చేయు. **దార్లుకాయు** రూ.చూ. దారులుకాయు. స.క్రి. **1.** మంచికిగాని, చెడ్డకుగాని, ఒక వ్యక్తిని కలుసుకోటానికి అతడుపోయే తోవల్లో కనిపెట్టుకొని ఉండు ; **2.** బందిపోటుచేయు ; **3.** దొంగతనం చేయు.

**దారి**[2] వి. ధరించే వాడు, జడదారి, ఋషి. వసు. 2.78.

నం. ధారిన్-.ధరించేవాడు; ప్రా. ధారి ; మహా.ధాలి.

<ప్రా. ధారి.

**-దారి**[3] ప్రత్య. కలవాడనే అర్థం ఇచ్చే పారసీక ప్రత్యయం. వ్యవసాయదారుడు అన్నప్పుడు ఈ ప్రత్యయం సంస్కృత వ్యవసాయ పదంపై ప్రయోగించ బడుతోంది.

హిం. -దార్. కలవాడనే అర్థం ఇచ్చే ప్రత్యయం ; ఉ. -దార్. ఇది హిందీలోని 'వాలా' వంటి ప్రత్యయం ; పార. -దార్. కలవాడు.

<ఉ. -దార్.

**దారు** రూ.చూ. దార[1]. వి. **1.** కొడవలి మొ॥ వాటి పదును ; **2.** పొయ్యికి కట్టెలు పెట్టడానికి ముందు భాగంలో పెట్టిన సందు ; **3.** కొండలు గేరులాగ ఎత్తుగా వచ్చిన భాగం.

**దారుకపాలు** రూ.చూ. దారుగపాలు. వి. మల్లవిద్యా విశేషం, పద్నాలుగు విసురుల్లో ఒకటి. మల్లు. 3.69.

నం. ధారా. అశ్వగతివిశేషం.

**దారుఖానా** వి. రాజభవనం, న్యాయాలయం. విశ్వే. శ.

ఉ. దర్ ఖానా. రాజభవనం ; పార. దర్ ఖానా. రాజభవనం, న్యాయస్థానం.

<ఉ. దర్ఖానా.

**దారుగపాలు** రూ. దారుకపాలు. వి. మల్లవిద్యా విశేషం, పద్నాలుగు విసురుల్లో ఒకటి. ప్రబంధ. 78.

**దారుతుంక** వి. పంచ దించడానికి గుర్రపు కొయ్యల మీద వేసిన అడ్డవానం.

**దారుధాణు** వి. మల్ల విద్యా విశేషం, పద్నాలుగు విసురుల్లో ఒకటి. ప్రబంధ. 78.

నం. ధారా. అశ్వగతి విశేషం.

**దారున** క్రి. విశే. ద్రు. **1.** శీఘ్రంగా. పి. శకు. 2.189 ; **2.** ఆకస్మికంగా, హఠాత్తుగా. మను. 4.42.

**దారుబోతు** వి. వ్యర్థుడు.

హిం. ఉ. పార. దారూ. మద్యం, కల్లు.

<ఉ. దారూ + -పోతు.

**దారులుకాయు** చూ. దారి[1].

**దారుస్థాపన** వి. శంకుస్థాపన, గృహనిర్మాణానికి ముమ్మందు కట్టిన వేదికలో శంకుకర్రను మంత్రపూర్వకంగా పాతటం.

నం. దారుస్థాపన-. కర్రను పాతటం.

<నం. దారుస్థాపన- (అర్థవిపరి.).

**దారేకుడిక** చూ. దార[1]. వి. పాల ధార పోయడానికి అరవేణి కుండలతో ఇచ్చే చిన్నమట్టిపాత్ర.

**దారోగా** వి. **1.** సైన్యాధికారి ; **2.** పై అధికారి ; **3.** పర్యవేక్షకుడు.

హిం.ఉ. దారోగా. నిరీక్షకుడు, కార్యాలయం యొక్క ప్రధానాధికారి ; రక్షకభటాధికారి ; పార. దారోగహ్. కార్యాలయంలోని ప్రధానాధికారి.

<ఉ. దారోగా.

**దార్లుకాయు** చూ. దారి[1].

**దాలం** రూ.చూ. డాలం. వి. మిద్దెపరుపు కట్టెమీద వేసేమట్టి.

**దాలంపెండె** వి. వాసాలమీద అడ్డంగా పరచిన పలచటి బద్ద.

**దాలబందలం** రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

**దాలబందిరం** రూ.చూ. దారబందము. వి. దర్వాజా. తలుపును తగిలించే చట్రం.

**దాలబంద్రం** రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

**దాలమందరం** రూ.చూ. దారబందము. వి. ద్వారబంధం.

**దాలమందిరం** రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

**దాలమంద్రం** రూ.చూ. దారబందము. వి. ద్వారానికి అమర్చిన కొయ్య.

**దాలమంద్రాం** రూ.చూ. దారబందము. వి. దర్వాజా. తలుపును తగిలించే చట్రం.

**దాలవపన్ను** వి. పన్నె కట్టుబడిలో, ఈనె పుల్లలవరసకు చివర బిగించిన వెడల్పు బద్ద.

**దాలవాలు** రూ.చూ. దాళవాలు. వి.బ.వ. రెండోపంటకు వేసే ముతకరకం వరి.

**దాలి** రూ. దళి, దాళి. వి. **1.** అగ్నిగుండం, నిప్పులగుంట, పిడకలు పేర్చి చేసే నిప్పులగుంట. శృం. నై. 2.118, వేంక. పంచ. 4.455 ; **2.** కుండలు కాల్చటానికి నిర్మించిన కట్టడం ; **3.** గుంట.

నం. స్థాలీ-. మట్టిపెనం ; ప్రా. థాలి, థాలిఅ, థాలీ-. పాకపాత్రం ; అ.మా. థాలీ ;

క. తాళి, తాళె. పిడకలపోగు, దాళి.

<ప్రా. థాలి.

**దాలిగుంట** రూ.చూ. దాలిగుంత. వి. దాలివేయటానికి ఉపయోగించే గుంట. **దాలిగుంటలో కుక్కఅగు** అ.క్రి. తాత్కాలికంగా సత్ప్రవర్తనకు ప్రతిజ్ఞ తీసుకుని వెంటవెంటనే మరిచిపోతూఉండు. **దాలిగుంత** రూ. దాలిగుంట. వి. దాలివేయటానికి ఉపయోగించే గుంట. శుక. 2.408. **దాలితో(క** వి. నీళ్ళు మొ. కాచటానికి ఆదోకగా అమర్చిన పిడకలపోగు. శుక. 2.335. **దాలిపెట్టు** స.క్రి. ఆములో కారకుండా విడిగా చెత్త వేసి కుండలు మొ. వాటిని కాల్చు.

**దాలిందాగలిరాయి** చూ. దాలి. వి. కూరదాకలు సర్సడానికి వాడే రాయి.

దాలిబందరం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

దాలిబూద వి. సిందూరం రంగుపూలు పూసే చిన్నచెట్టు (Sterculia Populifolia).

దాలిమి రూ. దాడినిమ్మ, దాడిమ, దాడింబ, దాడిమ్మ, దాణిమ్మ, దానింబ, దానిమ్మ, దాలిమ్మ, దాలునిమ్మ, దాళిమ్మ. వి. దానిమ్మ. కు.సం. 3.74 (Punica Granatum).

సం. దాడిమ-, దాడింబ-. దానిమ్మ ; ప్రా. దాడిమ-, దాడిమా, దాలిమ- ; శౌ. దాడిమ ;

క. డాడిమ, డారిమ, డాలిమ, డాళింబ, దాడిమ, దాడిమి, దాడింబ, దాడింబె, దాలిమ, దాళింబ, దాళింబర ; తు. దారింబ, దాతింబి ; కువి. దాలింబ.

<ప్రా. దాడిమ-.

దాలిమ్మ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు (Punica Granatum).

దాలునిమ్మ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు (Punica Granatum).

దాల్చిని రూ. దాచిని, దాచెన. వి. సుగంధ ద్రవ్య విశేషం, లవంగపు పట్ట (Ceylon cinnamon, Indian cinnamon).

హిం. దాల్ చీనీ. ఒకరకం సుగంధ ద్రవ్యం.

<హిం. దాల్చీనీ.

దాళ రూ.చూ. దాళా. వి. పడియొక్క హెచ్చుతక్కువ.

దాళవర్లు చూ. దాళువాలు. వి.బ.వ. రెండోపంటకు వేసే ముతకరకం వరి.

దాళవా రూ.చూ. దాళ్వా. వి. శరదృతువు మొదలు నీటి ఆధారంమీద పండే రెండో పంట.

దాళవాలు రూ. దాలవాలు. వి.బ.వ. రెండోపంటకు వేసే ముతకరకం వరి.

డాళా రూ. దాళ. వి. 1. తక్కెడలోని హెచ్చుతగ్గు ; 2. నెయ్యి నూనె మొ॥వాటిని తీసే పాత్రలనుగాని, వాటిని ఉంచిన పాత్రల్నిగాని సరియెత్తు రాళ్ళను దడతట్టలో వుంచి తూచడం.

డాళాలు వి.బ.వ. మల్లబంధాల్లో ఒకటి.

దాళి రూ.చూ. దాలి. వి. ధాన్యాన్ని ఉడకపెట్టే మంట.

దాళిపొయ్యి రూ.చూ. దాళిపొయ్యి. వి. బొగ్గులపొయ్యి.

దాళించిరి చూ. దాలిమి. వి. దాడిమ, దానిమ్మ.

దాళిమ్మ రూ.చూ. దాలిమి. వి. దానిమ్మచెట్టు (Punica Granatum).

దాళీకుడు రూ.చూ. తాళీకుఁడు. విణ. కార్యసాధకుడైన, పూనిన పనిని నిర్వహించేవాడు.

దాళు[1] వి. వర్ణలేశం. ద్వి. భాగ. 10 స్కం.

దాళు[2] వి. 1. పదును ; 2. కీడు.

దాళువ వి. దౌడ.

సం. తాలు-. కాకుదం.

<సం. తాలు-.

దాళువా రూ.చూ. దాళ్వా. వి. 1. శాల్యంకురం; 2. సస్య విశేషం, శరదృతువు మొ. నీటి ఆధారంతో పండే పల్లపు పంట.

దాళువాలు రూ. దాళ్వాలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128, ప్రబంధ. 112.

దాళువాళించు అ.క్రి. ఒప్పు, ప్రకాశించు. పి.శకు. 1.86.

దాళెపొయ్యి చూ. దాలి. రూ. దాళిపొయ్యి. వి. బొగ్గులపొయ్యి.

దాళ్వ రూ. దాళవా, దాళువా. వి. 1. శాల్యంకురం. దశా. 8.13 ; 2. శరదృతువు మొదలుకొని నీటి ఆసరాతో పండే పల్లపుపంట.

దాళ్వాపంట వి. శరదృతువు మొదలుకొని నీటి ఆసరాతో పండే పల్లపుపంట. దాళ్వాలు రూ.చూ. దాళువాలు. వి.బ.వ. ధాన్యవిశేషం.

దావ[1] రూ.చూ. దావా. వి. తగవు. పి.శకు. 3.63. గౌ. హరి. పూ. 88 పు. 1876. పం.

దావ[2] చూ. డాబా. వి. ఇటిక కప్పు గల ఇల్లు.

దావతిబడు(-పడు) అ.క్రి. అత్యాసక్తి చెందు. తాళ్ల. సం. 6.49.

దావంతము వి. 1. దుఃఖం. ద్వి.సార.చ. 1.34 పు. 4 పం. ; 2. ఆత్రం.

త. తావంతం. దుఃఖం, దయ, నరకం.

దావపోవు అ.క్రి. కంది, మినుము, పెసర, ఉలవ మొ. వాటి కాయల్లో గింజపట్టకపోవు.

దావబట్టు(-పట్టు) అ.క్రి. పైరులకు తెగులు తగులు.

దావరడంగి రూ.చూ. డావరడంగి. వి. దేవతాళం, వృక్ష విశేషం.

దావరము రూ.చూ. దావా. వి. చౌర్యం, దొంగతనం. ఆం.భా. 2.297.

దావరి రూ. దావరీఁడు. వి. వీరుడు. షో.చ. 5ఆ.

త. తావరి. యుద్ధం.

దావరీఁడు రూ.చూ. దావరి. వి. వీరుడు. అచ్చ.భా. 4.74 పు.

దావళి వి. మడికట్టుకొనే కంబళ వస్త్రం. ఇందు. 2.115.

క. డావళి.

దావా రూ. దావ[1], దావరము. వి. 1. చౌర్యం. ఆం.భా. 2.297 ; 2. తగవు, వ్యాజ్యం ; 3. ఫిర్యాదు.

హిం. దావా. హక్కు, వ్యాజ్యం ; మరా. దావా. వ్యాజ్యం; ఉ. దావా. వాదం, హక్కు, వ్యాజ్యం ; పార. దావ్. అభియోగం ; రావలసిన దానిని కోరటం, దవి. వ్యాజ్యం ; అర. దవా. వ్యాజ్యం, నిందారోపణం.

<ఉ. దావా <అర. దవా.

దావావేయు అ.క్రి. వ్యాజ్యంవేయు.

దావాదారుడు వి. దావా చేసేవాడు.

హిం.ఉ. దావాదార్. దావాచేసేవాడు.

<ఉ. దావాదార్.

దావారు రూ.చూ. దాబారు. వి. మోటతొండం చివర రెండువైపులా రంధ్రాలు వేసి దూర్చేతాడు.

దావిడి చూ. దేవిడి. వి. పావురాల్ని పెంచే చోటు.

దాశ రూ.చూ. దాస. వి. సిమెంటు దూలం.

దాషత్తు వి. లక్ష్యం. పద్మ. యు. 146.

మరా. దాస్త. రక్షణం, నిగా, సేవ; ఉ. దాశ్త్. రక్షించటం. కాపుగల; పార. దాశ్త్. బాగారక్షించు, లక్ష్యంచేయు, సేవ, బహుమతి.

<ఉ. దాశ్త్.

**దార్ఢ్యీకముచేయు** అ.క్రి. జులుంచేయు.

సం. ధార్ష్ట్య-. పొగరుబోతుతనం.

**దాస** రూ. దాశ, దాసా. వి. **1.** దూలానికీ మొగరానికి మధ్య నున్న కొయ్యవాసం; **2.** దర్వాజా మీది చెక్క గోడ.

హిం. దాసా. గొడుగుబల్ల.

<హిం. దాసా.

దాసచెక్క వి. ఉత్తరాసి మీద పరిచిన చెక్క. దాసబండ వి. దర్వాజా ఉత్తరాసి మీద పరిచే బండ. దాసబల్ల వి. దాస కింది కొయ్యపట్టి. దాసరాయి వి. దర్వాజా ఉత్తరాసి మీద పరిచే బండ.

**దాసకాఁడు** వి. సేవకుడు, దాసుడు. మల్హ. 3.10.

సం. దాస-. సేవకుడు.

<సం. దాస + -కాఁడు (స్వార్థంలో).

**దాసంగం** చూ. దాసము. వి. ఉత్సవాదుల్లోనూ, పెళ్ళి పేరంటాలలోనూ భక్తులకు, బంధువులకు ఆశ్రితులకు, పంక్తి భోజనం పెట్టే వైష్ణవ సంప్రదాయం.

**దాసనచెక్క** చూ. దాసనము.

**దాసనము** రూ. దాసని[1], దాసాన, దాసానము, దాసాని[2]. వి. **1.** జపాపుష్పం, దిరిసెనపువ్వు. ఉ.హరి. 2.24; **2.** జపావృక్షం, దిరిసెనచెట్టు. భీమ. 2 29 (Hibiscus Rosasinensis).

క. దాసవాళ.

దాసనచెక్క వి. జపావృక్షం యొక్క తొక్క, దీన్ని ఔషధాల్లో ఉపయోగిస్తారు.

**దాసని**[1] రూ.చూ. దాసనము. వి. దిరిసెనపువ్వు (Hibiscus Rosasinensis).

**దాసని**[2] వి. ఎర్రకాడ కలిగిన చిన్నపొద (Rhus Mysolensis).

**దాసమయ్య** చూ. దాసము.

**దాసము** వి. సేవ, కొలువు.

సం. దాస్య-. సేవ; ప్రా. దాస-. నౌకరు, కింకరుడు.

దాసమయ్య వి. దాసుడు, సేవకుడు. ఆము. **4.43.** <దాసము + అయ్య.

**దాసరయ్య** చూ. దాసరి.

**దాసరి** రూ. దాహరి. వి. **1.** బిచ్చగాడు. ఆము. **4.7**; **2.** విష్ణుభక్తుడు. ప్రబంధ. 788; **3.** ఆంజనేయ పురుగు, నామాల పురుగు.

సం. దాసేర-, దాస్యకారిన్. చేపలవాడు; ప్రా. దాసఅర- దాసఅరి;

క. దాసరి; తు. త. తావన్, తావరి, దాసయ్యే.

<ప్రా. దాసఅరి.

దాసరయ్య వి. **1.** తాబేలు, దాసరిగాడు. నారపంచ. 2.212; **2.** విష్ణుభక్తుడు. వైజ. 2.117; **3.** ముని. అచ్చ. రా. అయోధ్యా. 116. దాసరికొండి వి. అంకెన తగిలించే ఇనపకొండి. దాసరికొయ్య వి. దాసరికోరచేప, ఒకరకం చేప. హంస. 4.187. దాసరికోఅచేప వి. ఒకరకం చేప. దాసరిగాఁడు(-కాఁడు) వి. **1.** తాబేలు; **2.** మెట్టతాబేలు. దాసరితాబేలు వి. ఒకరకం తాబేలు. దాసరితీగ వి. పొదల మీద చిన్న చెట్ల మీద పాకే తీగె (Cocculusrillosus). దాసరిది విణ. వైష్ణవ మతావలంబి అయిన శూద్ర స్త్రీ. శ్రీ. శృం. 39. దాసరిపాము వి. ఒకరకం పాము. దాసరిపిట్ట వి. నామాలపిట్ట. దాసరిపురుగు వి. ఆంజనేయ పురుగు. నామాల పురుగు. దాసరిబుట్ట వి. భిక్షమెత్తుకునే బుట్ట. వైజ. 3.94. దాసరిబుడ వి. ఒకరకం కలుపు మొక్క. దాసరిబుడతాడు వి. ఒకరకం కలుపు మొక్క. దాసరిబుడమ వి. దోస జాతికి చెందిన తీగెపైరు (Cucumis). దాసరిమల రూ. దాసరిమొల. వి. నేతపడుగులో చివర విడదీసిన పాయ, మలగర్రకు చుట్టి, వేసిన మెలిక. దాసరిమొల రూ.చూ. దాసరిమల. వి. నేతపడుగులో చివర విడదీసిన పాయ, మలగర్రకు చుట్టి, వేసిన మెలిక. **దాసరెన్ను** రూ. దాసరేణి. వి. మొక్కజొన్న పైరులో కండెనెత్తిపై మొలిచే పీచుకు మూలమైన ఎన్ను. <దాసరి + ఎన్ను. దాసరెన్నువెళ్ళు అ.క్రి. మొక్కజొన్న పైరులో కండెనెత్తిపై మొలిచే పీచుకు మూలమైన ఎన్ను వచ్చు. దాసరేణి రూ.చూ. దాసరెన్ను. వి. మొక్కజొన్న.

**దాసరెన్ను** చూ. దాసరి.

**దాసరెన్నువెళ్ళు** చూ. దాసరి.

**దాసరేణి** చూ. దాసరి.

**దాసా** రూ.చూ. దాస. వి. దర్వాజా ఉత్తరాసి మీద పరిచే బండ.

**దాసాన** రూ.చూ. దాసనము. వి. జపావృక్షం (Hibiscus Rosasinensis).

**దాసానము** రూ.చూ. దాసనము. వి. జపావృక్షం, ఒకరకం చెట్టు. 4.11 (Hibiscus Rosasinensis).

**దాసాని**[1] రూ. దాసినం, దాసెన. వి. **1.** దేశవిశేషం, ఒకదేశం. రాజవా. 2.46; **2.** దంతరోగాలు పోవటానికి ఉపయోగించే నల్లటి పొడి.

దాసానిపటాని వి. దాసాని దేశపు గుర్రం. దాసానిపొడి వి. పళ్ళ(దంతాల)కు వేసుకొనే నల్లపొడి, కప్పు.

**దాసాని**[2] రూ.చూ. దాసనము. వి. జపావృక్షం (Hibiscus Rosasinensis).

**దాసికత్తె** వి. పరిచారిక, దాసి జాతి స్త్రీ. మల్హ. 3.10.

సం. దాసీ. సేవకురాలు.

<సం. దాసీ + -కత్తియ.

**దాసినం** రూ.చూ. దాసాని[1]. వి. **1.** దంతరోగాలు పోవటానికి ఉపయోగించే నల్లటి పొడి; **2.** కప్పు.

**దాసినబుడ్డి** చూ. దాసాని. వి. పళ్ళుతోముకొనే దాసినంపెట్టుకోడానికి వాడే చిన్న మట్టిపాత్ర.

**దాసినవేయు** అ.క్రి. వేశ్యకు కన్నరికపు తంతుచేయు.

**దాసూరిపట్టు** వి. దాసూరిగ్రామానికి చెందిన పట్టు (ఒకరకం పట్టు). ద.హిం.శా. సంపు. 7. శా. సం. 734. క్రీ.శ. 1228.

దాసెన రూ.చూ. దాసాని[1]. వి. దంతరోగాలు పోవడానికి ఉపయోగించే నల్లటి పొడి.
దాష్టికము వి. అధికారంలోని దిట్టతనం. రంగా. చ. 2.231.
సం. దార్ష్ట్య-. పొగరుబోతుతనం ;
క. ధార్ష్టిక. దృఢత్వం.
< సం. దార్ష్ట్య-.
దాస్తిరి రూ.చూ. దాతిరి. వి. రాతిని చదును చేసే పనిముట్టు.
దాహందుత్త చూ. దాహము.
దాహమిచ్చు చూ. దాహము.
దాహము వి. 1. దప్పిక. జైమిని భా. 9.233 ; 2. సిరు.
సం. దాహ-. కాల్చటం;
త. తాకమ్. దప్పి.
< సం. దాహ- (అర్థవిపరి).
దాహందుత్త వి. నీళ్ళు తాగడానికి ఉపయోగించే మట్టి పాత్ర. దాహమిచ్చు స.క్రి. దాహశాంతికోసం నీళ్ళు మొదలైన విచ్చు. సానంద. 5.13. < దాహము + ఇచ్చు. దాహముగొను (-కొను) అ.క్రి. దప్పికొను. శివలీలా.
దాహరి రూ.చూ. దాసరి. వి. 1. విష్ణుభక్తుడు. ఆము. 6.31 ; 2. విష్ణుభక్తుడైన ఒకజాతి శూద్రుడు. ఆం.భా. 2.285.
ది రూ.చూ. దీ. అవ్య. పొట్టేళ్ళను పోట్లాటకు ప్రేరేపించటానికి అనే మాట. క్రీడా. 228.
దిక్కమొకము రూ.చూ. దిక్కామొగము. వి. కాందిశీకుడు. భయాదులవల్ల ఎటుబడితే అటు పారిపోయేవాడు. సమీర. 2.134.
దిక్కమొగమగు చూ. దిక్కమొగము.
దిక్కమొగము రూ.చూ. దిక్కామొగము. వి. కాందిశీకుడు, భయం మొ॥ వాటివల్ల ఎటుబడితే అటు పారిపోయేవాడు. విజయ. 3.157.
దిక్కమొగమగు రూ. దిక్కామొగమగు. అ.క్రి. 1. దిగ్భ్రమచెందు ; 2. దిక్కులుపట్టు.
దిక్కామొకము రూ.చూ. దిక్కామొగము. వి. కాందిశీకుడు, భయం మొ॥ వాటివల్ల ఎటుపడితే అటు పారిపోయేవాడు. పారి. 5.37.
దిక్కామొగమగు చూ. దిక్కామొగము.
దిక్కామొగము రూ. దిక్కమొకము, దిక్కమొగము, దిక్కామొకము. వి. కాందిశీకుడు, భయం మొ॥ వాటివల్ల ఎటుబడితే అటు పారిపోయేవాడు. శివరా. 4.83.
దిక్కామొగమగు రూ.చూ. దిక్కమొగమగు. అ.క్రి. 1. పారిపోవు ; 2. కాందిశీకుడగు.
దిక్కు వి. 1. పక్షం. భార.ఉద్యో. 3.362 ; 2. రక్షకుడు, శరణం. భార.స్త్రీ. 1.46 ; 3. పుత్రాది ఆధారం. భార.స్త్రీ. 2.35 ; 4. ఎడ, విషయం. భార.శాంతి. 2.359 ; 5. వైపు. హరి.పూ. 3.124, హర. 2.15 ; 6. నెలవు, స్థానం. భాగ. 6.339.
సం. దిక్. దిశ, మార్గం. రీతి, పద్ధతి.
< సం. దిక్ (అర్థవిపరి.).
దిక్కుగానకుండు (-కానకుండు) అ.క్రి. దిక్కుతోచకుండు, దిగ్భ్రాంతిచెందు. దిక్కుదెస వి. అండాదండా, అండాఅపు. పండి.చ. 2.4 పు. 65 పం. దిక్కున్నచోటు వి. రక్షణ ఉన్నచోటు, ఇష్టమైనచోటు. < దిక్కు + ఉన్నచోటు. దిక్కుబిళ్లలు వి.బ.వ. ఒకరకమైన పిల్లల ఆట. దిక్కుమాలినతనము వి. 1. ఎక్కటి, ఒంటరిపాటు, ఏకాంతం ; 2. అసహాయత. దిక్కుమాలినంత విశ. 1. పనికిరాని ; 2. అధికమైన. దిక్కుమాలినపీనుఁగు వి. 1. దిక్కులేని శవం. భార.అశ్వ. 1.46 ; 2. ఒక తిట్టు. దిక్కుమాలు అ.క్రి. 1. గతిలేకుండు. భార.ఆశ్ర. 2.162 ; 2. దిక్కులేనిదగు. వీర.వి. 2.125 ; 3. రక్షణలేనిదగు. భాగ. 8.71. దిక్కుమొక్కు వి. అండదండలు. దిక్కులపాలఁజల్లు స.క్రి. తిరస్కరించి పారవేయు, లెక్కించకపోవు. దిక్కులుచూచు రూ.చూ. దిక్కులుసూచు. అ.క్రి. దిగ్భ్రాంతుడగు. సుగ్రీవ. పు. 23. దిక్కులుపాలఁజూచు (-చూచు) స.క్రి. నిస్సహాయస్థితిలో చూచు. శుక. 2.276. దిక్కులుపిక్కటిల్లు అ.క్రి. దిక్కులునిండు. హంస. 3.29. దిక్కులుసూచు (-చూచు) రూ. దిక్కులుచూచు. అ.క్రి. ఏమీ తోచక అటూ ఇటూ చూచు. భార.ద్రోణ. 1.17. దిక్కెడసినరీతి వి. దిక్కులేని విధం, నిరాధారం. హంస. 4.236. < దిక్కు + ఎడసిన రీతి. దిక్కోమొగమగు అ.క్రి. 1. దిక్కుకు ఒకరు పారిపోవు ; 2. కాందిశీకుడగు. < దిక్కు + ఒక + మొగము + అగు.
దిక్కెడసినరీతి చూ. దిక్కు.
దిక్కోమొగమగు చూ. దిక్కు.
దిగ వి. జూదమాడటానికి ఉపయోగించే పాచికల మీది ముద్రా విశేషం. సిం.ద్వా. 10.88.
దిగఁగాఱు చూ. దిగు.
దిగఁగొట్టు చూ. దిగు.
దిగజారు చూ. దిగు.
దిగజార్చు చూ. దిగు.
దిగజాఱు చూ. దిగు.
దిగఁజూచు చూ. దిగు.
దిగఁజెమటపట్టు చూ. దిగు.
దిగతీయు చూ. దిగు.
దిగదలకొర్రాల చూ. దిగు.
దిగదాఁటు చూ. దిగు.
దిగదాల చూ. దిగు.
దిగదిగ వి. 1. నిక్కించటంలో అయ్యే అనుకరణం. నవనాథ. 1.50 పు. 15 పం. ; 2. విసరటం, మెరపటం మొ॥ వాటిలో అయ్యే అనుకరణం. మను. 4.60 ; క్రి.విశ. శీఘ్రంగా. భీమ. 2.122, ఆము. 6.94.
దిగద్రొబ్బు చూ. దిగు.
దిగనాడు చూ. దిగు.
దిగనాఱు చూ. దిగు.
దిగనాలకచ్చి చూ. దిగు.
దిగనులుకు చూ. దిగు.
దిగనూఁదు చూ. దిగు.
దిగఁదన్ను చూ. దిగు.
దిగఁదాఁచు చూ. దిగు.

దిగ(దీయు చూ. దిగు.
దిగ(దుడుచు చూ. దిగు.
దిగ(దుడుపు చూ. దిగు.
దిగ(దుడ్చు చూ. దిగు.
దిగ(ద్రావు చూ. దిగు.
దిగ(ద్రొక్కు చూ. దిగు.
దిగ(ద్రోచు చూ. దిగు.
దిగబడి చూ. దిగు.
దిగబడు చూ. దిగు.
దిగబారి చూ. దిగు.
దిగమలకచ్చి చూ. దిగు.
దిగమోపు చూ. దిగు.
దిగమ్రింగు చూ. దిగు.
దిగంబడు చూ. దిగు.
దిగ(బట్టు చూ. దిగు.
దిగ(బడిపోవు చూ. దిగు.
దిగ(బడు చూ. దిగు.
దిగ(బాటు చూ. దిగు.
దిగ(బాఱమ్రింగు చూ. దిగు.
దిగ(బాఱు చూ. దిగు.
దిగ(బెట్టు చూ. దిగు.
దిగ(బో(త చూ. దిగు.
దిగ(బో(తలోకివచ్చు చూ. దిగు.
దిగరో(జు చూ. దిగు.
దిగవిడుచు చూ. దిగు.
దిగవేయు చూ. దిగు.
దిగవైచు చూ. దిగు.
దిగవైచుకొను చూ. దిగు.
దిగసన చూ. దిగు.
దిగా రూ.చూ. దుగ[2]. సర్వ. రెండు.
దిగాలు చూ. దిగులు. వి. వ్యాకులత.

దిగాలుపడు రూ.చూ. దిగాల్పడు. అ.క్రి. వ్యాకులపడు, చిన్నబోవు. దిగాల్పడు రూ. దిగాలుపడు. అ.క్రి. వ్యాకులపడు, చిన్నబోవు. చెన్న బసవ. 3.149.

దిగాల్పడు చూ. దిగులు.
దిగించు చూ. దిగు.
దిగిపించు చూ. దిగు.
దిగియ రూ.చూ. డిగ్గియ. వి. నడబావి.
దిగిరికొను చూ. దిగు.

దిగు రూ.చూ. డిగ్గు. అ.క్రి. **1**. పైనుంచి కిందికి వచ్చు. అవరోహించు. భార. భీష్మ. 2.331 ; **2**. తగ్గు. రం. రా. ఉ. 122పు. 25పం. ; **3**. కిందికి వేలాడు. హర. 6.119 ; **4**. దిగబడు, జారు. భాగ. 10పూ. 62 ; **5**. వేరే చోటు నుంచి వచ్చు. మను. 1.37 ; **6**. (చెట్టుకు పిందెలు) కలుగు. ఆము. 4.274 ; **7**. ప్రవేశించు. చొచ్చు. ఆము. 5.21 ; **8**. వ్యయమగు. మల్హ. 2.175 ; **9**. ప్రయాణంలో దారిలో ఆగు ; **10**. గుచ్చుకొను ; **11**. పనిప్రారంభించు ; స.క్రి. అవరోహించు, అవతరణంచేయు.

దిగ(గాఱు అ.క్రి. క్రమంగా కృశించు, దిగనాఱు. శుక. 3.520. <దిగు+-అ[7]+కాఱు. దిగ(గొట్టు స.క్రి. కిందికి పడగొట్టు. <దిగు+-అ[7]+కొట్టు[1]. దిగజారు రూ.చూ. డిగ్గజాఱు. అ.క్రి. **1**. స్ఫోటకం మొ॥నవి పోసి తగ్గు ; **2**. చతికిలబడు ; **3**. నీచానికి ఒడిగట్టు. దిగజార్చు స.క్రి. దిగవిడుచు, కిందికి జార్చు. దిగజాఱు రూ.చూ. డిగ్గజాఱు. అ.క్రి. **1**. స్రవించు, కారు. వరాహ. 11.48 ; **2**. కుంగు, దిగబడు. వాశి. రా. 1.76 ; **3**. చ్యుతమగు, కిందికి జారు. మను. 3.84 ; **4**. పోవు. రాఘవ. 2.6 ; **5**. పైనుంచి కిందికిపడు. దశా. 2.12 ; **6**. స్ఫోటకం వచ్చి తగ్గిపోవు. దిగ(జూచు స.క్రి. తక్కువగా చూచు. సేతు. 1.8పు. <దిగు+-అ[7]+చూచు. దిగ(జెమటపట్టు అ.క్రి. ఒళ్ళంతా చెమటలు కారిపోవు. సారంగ. 3.162. <దిగు+-అ[7]+ చెమటపట్టు. దిగతీయు రూ.చూ. దిగ(దీయు. స.క్రి. కిందికిలాగు. దిగదలకోర్తాల రూ.చూ. దిగుదలకోర్తల. వి. అనుపోయిన పడుగులో చివరి అనిపడ్డ భాగం. దిగదా(టు అ.క్రి. దిగు. భార. అశ్వ. 3.105. దిగదాల వి. నరిచేసేటప్పుడు పడుగులో, కుంచే చేరే చివరివైపు. దిగద్రొబ్బు స.క్రి. కిందికి తోయు, గెంటు. భాగ. 7.184. దిగనాడు రూ.చూ. దిగ్గనాడు. స.క్రి. విడచు, విసర్జించు. <దిగు+-అ[7]+ఆడు. దిగనాఱు అ.క్రి. క్రమంగా కృశించు, క్షీణించు. <దిగు+-అ[7]+ఆఱు. దిగనాలకచ్చి వి. నరిచేసినపడుగులో చివరి అనిపోగులు. దిగనుఱుకు రూ.చూ. డిగ్గనుఱుకు. అ.క్రి. దిగువకు దుముకు, కిందికిదూకు. <దిగు +-అ[7] + ఉఱుకు. దిగనూ(దు స.క్రి. బంగారం మొ॥ వాటిల్లో కేడిపోయేటట్లు కాచు. <దిగు+-అ[7]+ఊ(దు. దిగ(దన్ను స.క్రి. దిగవిడుచు. వేంక. పంచ. 4.309. <దిగు+-అ[7]+తన్ను. దిగ(దా(చు స.క్రి. విడుచు, దిగవిడుచు. శృం. నై. 3.295. <దిగు +-అ[7] + తా(చు. దిగ(దీయు రూ. దిగతీయు. స.క్రి. **1**. దిగదుడుచు ; **2**. తగ్గించు, మానిపించు. <దిగు+-అ[7]+తీయు. దిగ(దుడుచు రూ. దిగ(దుడ్చు. స.క్రి. దృష్టిదోషం పోవటానికి ఉప్పు మొ॥ వాటినిచుట్టూ తిప్పు. బసవ. 6.150. <దిగు +-అ[7] + తుడుచు. దిగ(దుడుపు స.క్రి. **1**. దోషపరిహారం కోసం ఉప్పు, మిరపకాయ మొ॥ వాటిని చుట్టూ తిప్పటం; **2**. ఎందుకు పనికిరాని పని; **3**. అన్నిటిలోనూ ఒకరి కంటె తక్కువ కావటం. <దిగు +-అ[7]+తుడుపు. దిగ(దుడ్చు రూ.చూ. దిగి(దుడుచు. స.క్రి. దృష్టి దోషం పోవటానికి ఉప్పు మొ॥ వాటిని చుట్టూ తిప్పు. బసవ. 6.177పం. <దిగు+-అ[7]+తుడ్చు. దిగ(ద్రావు రూ. డిగ(ద్రావు, డిగ్గ(ద్రావు. స.క్రి. **1**. పరిత్యజించు. విడుచు. నిర్వ.రా. 9.78; **2**. హరించుకొను. భార. ద్రోణ. 5.305 ; **3**. దిగు. హరి. పూ. 7.194. <దిగు+-అ[7]+త్రావు. దిగ(ద్రొక్కు స.క్రి. అప్పులో కొంత వడ్డీని తీసివేయు. < దిగు+-అ[7] + త్రొక్కు. దిగ(ద్రోచు స.క్రి. విడుచు. భార. భీష్మ. 3.63. <దిగు + -అ[7]+త్రోచు. దిగబడి రూ.చూ. దిగుబడి. వి. ఉత్పత్తి. దిగబడు రూ.చూ. దిగ(బడు. అ.క్రి. **1**. ఆముకాల్వులో

మట్టి, మసి బాగా కప్పకపోయినా, వర్షంవచ్చినా ఆము కుంగిపోవు ; **2**. కుంగిపోవు ; **3**. మిగిలిపోవు ; **4**. నిలిచి పోవు ; **5**. వచ్చు. **దిగబారి** రూ.చూ. దిగుడుబారి. వి. మోటలాగుతూ దిగవకు నడిచే ఏటవాలుదారి. **దిగమలకచ్చి** వి. సరిచేసిన పడుగులో చివరి అనిపోగులు. **దిగమోపు** స.క్రి. దిగదుడుచు. భోజ. 5.150. **దిగమ్రింగు** స.క్రి. **1**. నమలకుండా గొంతుదిగేటట్లుమింగు. దశా. 2.372 ; **2**. అపహరించు. **దిగంబడు** రూ.చూ. దిగఁబడు. అ.క్రి. **1**. తగ్గు. నృసింహ. 5.52. పాండు. 4.177; **2**. వెనుకపడు. < దిగు + -అ$^{7}$ + పడు. **దిగఁబట్టు** స.క్రి. కిందికిలాగు. దిగు + -అ$^{7}$ + పట్టు. **దిగఁబడిపోవు** అ.క్రి. వెనకబడిపోవు. < దిగు + -అ$^{7}$ + పడు + -ఇ$^{13}$ + పోవు. **దిగఁబడు** రూ. దిగబడు, దిగంబడు. అ.క్రి. **1**. బురద మొ॥ వాటిలో కూరుకొను, గుచ్చుకొను. భార. ద్రోణ. 1.280 ; **2**. పోవు, నశించు. భార. ద్రోణ 4.135 ; **3**. జారు. భార. కర్ణ. 3.66 ; **4**. అడగు, కుంగు. భాస్క. రా. అరణ్య. 1.84 ; **5**. ఉండిపోవు, నిలుచు. ఆము. 5.29 ; **6**. తగ్గు. పాండు. 4.177. < దిగు + -అ$^{7}$ + పడు. **దిగఁబాటు** వి. శేషం, మిగులు. < దిగు + -అ$^{7}$ + పాటు. **దిగఁబాఱమ్రింగు** స.క్రి. గొంతుదిగేటట్లుగా మింగు, దిగమిఁగు. గౌ. హరి. పూ. 1759పం. < దిగు + -అ$^{7}$ + పాఱు + -అ$^{7}$ + మ్రింగు. **దిగఁబాఱు** అ.క్రి. **1**. మీదినుంచి కిందికి జారు, దిగజారు. భార. ఉద్యో. 3.191 ; **2**. క్షీణించు, తగ్గు. కవిక. 4.68 ; **3**. దిగు. < దిగు + -అ$^{7}$ + పాఱు. **దిగఁబెట్టు** స.క్రి. **1**. విడుచు ; **2**. మిగుల్చు. < దిగు + -అ$^{7}$ + పెట్టు. **దిగఁబ్రోఁత** వి. కిందికి వ్యాపించడం. < దిగు + -అ$^{7}$ + ప్రోఁత. **దిగఁబ్రోఁతలోకివచ్చు** అ.క్రి. వెనుకకుమరలు. **దిగరోఁజు** వి. కుట్టూపిరి. **దిగవిడుచు** రూ.చూ. డిగ్గవిడుచు. స.క్రి. పరిత్యజించు. భార. ఉద్యో. 2.95. **దిగవేయు** స.క్రి. **1**. ఎక్కువగా సొమ్ములు పెట్టుకొను ; **2**. కిందకి పడవేయు. **దిగవైచు** స.క్రి. **1**. పడవేయు. కేయూ. 3.70 ; **2**. విడుచు. శుక. 2.11. **దిగవైచుకొను** స.క్రి. తాల్చు, ధరించు. **దిగసన** క్రి.విశ.ద్రు. దిగువగా. సింహ.శ. 119 ; విశ. తక్కువ. **దిగించు** స.క్రి. వ్యవధి తక్కువచేయు. < దిగు + -ఇంచు$^{3}$. **దిగిపించు** స.క్రి. దిగచేయు, దింపు. దశకు. 10.59. < దిగు + -పు + -ఇంచు$^{3}$. **దిగిరికొను** అ.క్రి. కుంగిపోవు. **దిగుగరతాడు** (-కఱ్ఱతాడు) వి. దిగుడుకఱ్రకు కట్టినతాడు. **దిగుచు** స.క్రి. దిగిజేయు, గుచ్చు, దించు. విజ్ఞా. ప్రా. 96. **దిగుజాతి** వి. తక్కువజాతి, నిమ్నజాతి. ఆము. 4.277. **దిగుడు$^{1}$** రూ.చూ. డిగ్గుడు. విశ. **1**. తక్కువైన, హీనమైన. ఆము. 6.60 ; **2**. పల్లమైన. **దిగుడుకరుకు** వి. ఆకులతో చూరునుంచి కప్పే వరస. **దిగుడుకఱ్ర** వి. దింపులో వెళ్ళే బండి వేగాన్ని తగ్గించటంకోసం చక్రాలకు ఆనేటట్టు వెనకపరంకింద అమర్చిన కఱ్ర. **దిగుడుదలకమ్మి** (-తలకమ్మి) వి. మరాసుమీదికి పడుగుతోడేటప్పుడు కింది కోల్తల పోగులు చుట్టుకొన్న మేకుల పట్టె. **దిగుడుదలకొయ్య** (-తలకొయ్య) రూ.చూ. దిగుదలకొయ్య. వి. నేత బయలులో చివర పాతిన కొయ్య. **దిగుడుదలకోల** (-తలకోల) వి. మరాసు మీదికి పడుగుతోడేటప్పుడు కిందివైపు మేకుల కమ్మికి చుట్టుకొన్న పోగులు. **దిగుడుదలజోడా** (-తలజోడా) వి. పడుగు చుట్టేటప్పుడు, చివర కోల్తలలో ఎక్కించిన రెండు కఱ్రలు. **దిగుడుదలనేఁత** (-తలనేత) వి. బట్టచివరి భాగంలో నేసిన నేత. **దిగుడుబారి** రూ. దిగబారి, దిగుబారి. వి. ఎద్దులు మోటలాగుతూ దిగువకు నడిచే ఏటవాలుదారి. **దిగుడుబావి** వి. వాపి. దిగి నీరుతెచ్చుకోడానికి వీలుగా కట్టిన మెట్లుగల నుయ్యి. **దిగుడుబోవు** (-పోవు) అ.క్రి. అన్నం మొదలైనవి గొంతులోకి దిగు. **దిగుడుమెట్టు** వి. కిందివైపుకు బాగా వాలి ఉండే మెట్టు. **దిగుదల** (-తల) వి. కిందభాగం. **దిగుదలకఱ్ర** వి. పడుగులో, రెండో చివర దూర్చిన పడుగేరుకఱ్ర. **దిగుదలకొయ్య** (-తలకొయ్య) రూ. దిగుడుదలకొయ్య. వి. నేతబయలులో చివరపాతిన కొయ్య. **దిగుదలకోర్తల** రూ. దిగదలకోర్తాల. వి. అనుపోసిన పడుగులో చివరి అనిపడ్డ భాగం. **దిగుదలమేకు** (-తలమేకు) వి. నేతబయలులో చివరపాతిన కొయ్య. **దిగుదారిమూనె** వి. గానుగల్లో చివరన కింద నిల్చిపోయిన చమురు. **దిగుదిగుదిక్కొనునాట** వి. ఒకరకమైన బాలక్రీడ. పండి.చ. 1.2. పు. 460. **దిగుబడి** రూ. దిగబడి. వి. **1**. వడ్లు దంచగా తేలిన బియ్యం ; **2**. పంటరాబడి ; **3**. ఉత్పత్తి (output). **దిగుబద్ద** వి. పన్నెకట్టుబడిలో, ఈనెపుల్లల వరనకు చివర బిగించిన వెడల్పుబద్ద. **దిగుబారి** రూ.చూ. దిగుడుబారి. వి. మోటలాగుతూ దిగువకునడిచే ఏటవాలుదారి. **దిగుభాగము** వి. కిందిభాగం. **దిగుమతి** వి. ఓడ మొ. వాటి నుంచి సరుకుల్ని రేవులోకి దింపటం. **దిగుమతిచేయు** స.క్రి. పరదేశంనుంచి సరుకులు మొ. వాటిని తెచ్చు. **దిగుమల** వి. అనుపోసిన పోగులలో చివరి అనిపడ్డ భాగం. **దిగుమాల** వి. పొద్దుకుంకేవేళ. హిం.ఉ. మాల్. వస్తువు. **దిగుముడి** వి. వదులుగంటు. **దిగుమోటు** వి. నీరు పెడితే ఎక్కువగా దిగబడే నల్లపొలం. **దిగువ** రూ. డిగువ. విశ. కింది. భార. శల్య. 2.295 ; వి. కింది భాగం. భార. శల్య. 2.305. **దిగువకోర్తల** రూ.చూ. దిగువకోల్తల. వి. అనుపోసిన పడుగులో చివరి అనిపడ్డభాగం. **దిగువకోల్తల** రూ. దిగువకోర్తల, దిగువకోల్తాలు. వి. అనుపోసిన పడుగులో చివరి అనిపడ్డభాగం. **దిగువకోల్తాలు** రూ.చూ. దిగువకోల్తల. వి. అనుపోసిన పడుగులో చివరి అనిపడ్డ భాగం. **దిగువగోడ** వి. బాల్కనీ, గోడమీదినుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు. **దిగువచెరగు** వి. చీరకట్టుకొనేటప్పుడు లోపలకు వచ్చే అడ్డకొన. **దిగువరికివచ్చు** అ.క్రి. క్షీణించు. **దిగువలోకము** వి. సప్త పాతాళాల్లో ఒకటి. నిర్వ. రా. 6.71. **దిగువాటు** వి. దిగువ, కిందివైపు. సారంగ 1.124. **దిగువాయి** విశ. న్యూనమైన, తక్కువైన. వేమ. 3.126. **దిగువాయిగాఁజూచు** (-చూచు) స.క్రి. తక్కువగా చూచు. వేమ. 3.126. **దిగువాఱు** (-పాఱు) అ.క్రి. **1**. నిండి ప్రవహించు. కేయూ. 2.13 ; **2**. జారు, కారు, ప్రవహించు. కాశీ. 5.167 ; **3**. నిండు. కువ.చ. 2.108 ; **4**. మీదినుండి కిందికిపడు. అని. 1.101. **దిగువుదబ్బ** (-బద్ద) వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద

బిగింపుచేసిన వెదురుబద్ద. దిగ్గమ్మినేత వి. చీరలోకట్టు చెరుగునేత. < దిగు + కమ్మినేత. దిగ్గొయ్య వి. 1. నేత బయలులో చివర పాతిన కొయ్య ; 2. మగ్గంమీద, నేత బట్ట చుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా, ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం. < దిగు + కొయ్య.

**దిగుడు**[2] రూ.చూ. దీగూడు. వి. దీపం పెట్టుకొనే గూడు.

**దిగునేత** రూ.చూ. దీనేత. వి. రాత్రివేళ దీపం పెట్టుకొని నేసే నేత.

**దిగులు** వి. 1. అధైర్యం. నిర్వ.రా. 5.33 ; 2. దుఃఖం, విచారం. నిర్వ. రా. 9.17 ; 3. భయం. భార. ద్రోణ. 1.308 ; 4. గుండెఅదరు, దడ. భార. శాంతి. 6.444. క. దిగలు, దిగిల్, దిగిలు, దిగలు, దిగులు, ధిగిల్. భయం, భీతావహం ; తు. దిగిలు. భయం, చేత గాని తనం ; త. తికిం, తికిల్. భయం ; కో. దిగిల్. ఇన్-. తప్పుపనిచేసి భయపడు.

**దిగులుకొను** రూ.చూ. దిగుల్కొను. అ.క్రి. దిగులు పడు, భయపడు. కువ.చ. 3.83. **దిగులుగొను(-కొను)** రూ.చూ. దిగుల్కొను. అ.క్రి. దిగులుపడు. హంస. 5.186. **దిగులుపడు** రూ. దిగుల్పడు. అ.క్రి. భయపడు. వరాహ. 2.127. **దిగులుపఱచు** స.క్రి. 1. దిగులుపడేట్లు చేయు ; 2. భయపెట్టు. **దిగులుపాటు** వి. భయం. **దిగులుయదారు** వి. చీకు చింత. **దిగులుసొచ్చు(-చొచ్చు)** అ.క్రి. దిగులు కలుగు. భార. శాంతి. 6.444. **దిగుల్కొను** రూ. దిగులుకొను, దిగులుగొను. అ.క్రి. దిగులుపడు, భయపడు. కువ.చ. 2.150. **దిగుల్పడు** రూ.చూ. దిగులు పడు. అ.క్రి. భయపడు. శుక. 1.360.

**దిగుల్కొను** చూ. దిగులు.

**దిగుల్పడు** చూ. దిగులు.

**దిగూడు** రూ.చూ. దీగూడు. వి. గోడలో దీపం పెట్టడానికి చేసిన చిన్న గూడు.

**దిగ్గదాఁటు** చూ. దిగ్గు[1].

**దిగ్గన** చూ. దిగ్గు[2].

**దిగ్గనాడు** చూ. దిగ్గు[1].

**దిగ్గనాధీరుడు** వి. అసలైన ధీరుడు.

సం. దిగ్గవధీర-. దిశలలో గొప్ప ధీరుడైనవాడు.

< సం. దిగ్గనధీర-.

**దిగ్గమ్మినేత** చూ. దిగు.

**దిగ్గాఱు** చూ. దిగ్గు[1].

**దిగ్గియ** రూ.చూ. డిగ్గియ. వి. నడబావి. ఆము. 5.122.

**దిగ్గు**[1] రూ.చూ. డిగ్గు. అ.క్రి. మీదినుండి కిందికి వచ్చు, అవరోహించు. కు.సం. 3.24.

**దిగ్గదాఁటు** రూ.చూ. డిగ్గదాఁటు. అ.క్రి. దిగువకు దుముకు, కిందికిదాటు. **దిగ్గనాడు** రూ. డిగనాడు, డిగ్గనాడు, దిగనాడు. స.క్రి. విడుచు. కవిక. 4.178. < దిగ్గు[1] + -అ[7] + ఆడు. **దిగ్గాఱు** అ.క్రి. కృశించు. పార్వ. 3.59. < దిగ్గు[1] + ఆఱు[1]. **దిగ్గుడు** రూ.చూ. డిగ్గుడు. విశే. న్యూనమైన, తక్కువైన. నరస. 3.130. **దిగ్గుడుకుదిగ్గుడు** వి. చాలతక్కువది. బాల్ల.సం. 8.201. **దిగ్గోరు** రూ. దిగ్గోలు. వి. కోసే పైరుకు ముందుపైరు. < దిగ్గు + కోరు[3] **దిగ్గోలు** రూ.చూ. దిగ్గోరు. వి. కోసే పైరుకి ముందుపైరు.

**దిగ్గు**[2] వి. భయంవల్ల గుండె అదరటానికి అనుకరణం. నిర్వ. రా. 3.30.

**దిగ్గన** రూ. దిగ్గున. క్రి.విశే.ద్రు. తటాలున. నిర్వ.రా. 3.108. క. దిక్కనె, దిగ్గనె. హఠాత్తుగా, వేగంగా ; తు. దిక్క వేగంగా, త్వరగా. **దిగ్గున** రూ.చూ. దిగ్గన. క్రి.విశే.ద్రు. తటాలున. విక్ర. 1.126. **దిగ్గనలేచు** అ.క్రి. ఉన్నట్టుండిలేచు. శుక. 1.293. **దిగ్గురను** అ.క్రి. భయంతో హృదయం దిగ్గుమను. శ్రీనాథుని చాటువు. < దిగ్గు[2] + అను.

**దిగ్గొయ్య** చూ. దిగు.

**దిగ్గోరు** చూ. దిగ్గు[1].

**దిగ్గోలు** చూ. దిగ్గు[1].

**దిగ్డం** వి. దిట్టం, బలం.

**దింకలు** వి.బ.వ. మల్లబంధ విశేషాలు.

**దిచ్చన** రూ.చూ. దచ్చినం. వి. ఉత్తరానికి ఎదురుగా ఉన్న దిక్కు, దక్షిణదిక్కు.

**దిచ్చరి** చూ. దిచ్చు.

**దిచ్చరించు** చూ. దిచ్చు.

**దిచ్చిన** రూ.చూ. దచ్చినం. వి. ఉత్తరానికి ఎదురుగా ఉన్న దిక్కు.

**దిచ్చు** వి. 1. జూదరి. సిం.ద్వా. 10.84 ; 2. మాయలాడు. సిం.ద్వా. 10.159.

**దిచ్చరి** వి. 1. వ్యభిచారిణి. వేంక.పంచ. 1.596 ; 2. మాయలాడి. వేంక.పంచ. 1.608. సం. దిక్చారిణీ. దిశలందు సంచరించేది. **దిచ్చరించు** అ.క్రి. బయల్పడు, పైకివ్యాపించు. క్రీడా. 95. సం. దిక్. దిక్కు, చర్. చరించు. **దిచ్చుమొగమగు** అ.క్రి. అదృశ్యమగు. **దిచ్చుమొగము** వి. అదృశ్యం.

**దిచ్చెగొట్టు (-కొట్టు[1])** స.క్రి. నొసలుతో తాకించు.

**దించిదిగువఁబెట్టు** చూ. దించు.

**దించు** రూ.చూ. డించు. స.క్రి. 1. అవరోహింపజేయు, కిందికి రానిచ్చు. భార.ఆది. 7.275 ; 2. తగ్గించు, దిగజేయు. భాస్క రా.యు. 2207 ; 3. భ్రష్టంచేయు, చెడగొట్టు. శుక. 2.24.

**దించిదిగువఁబెట్టు (-పెట్టు)** స.క్రి. 1. చచ్చినవాళ్ళని మంచంమీదినుంచి కింద పడుకోబెట్టు ; 2. చావబోయే వాళ్ళను మంచంమీదనుంచి కింద పడుకోబెట్టు. **దించుకొను** స.క్రి. 1. చెడగొట్టుకొను, భ్రష్టపరచుకొను. భాగ. 9.378 ; 2. గర్భపాతం చేసుకొను ; అ.క్రి. స్ఫోటకం బొబ్బలు అణిగిపోవు.

**దిట** రూ.చూ. దిట్టము. వి. 1. ధైర్యం. కాశీ. 5.267 ; 2. శక్తి, ధైర్యం. భాగ. 3.698.

**దిటదప్పు (-తప్పు)** రూ. దిటవుతప్పు. స.క్రి. సుస్థితిని కోలుపోవు. వర.రా.బాల.పు. 201. పం. 17. **దిటదేఱు (-తేఱు)** అ.క్రి. సమర్థమగు, గడితేరు. సీమం. 4.4.

**దిటమరి** చూ. దిటము.

**దిటము** రూ.చూ. దిట్టము. వి. **1**. ధైర్యం. శుక. 2.278 ; **2**. దార్ఢ్యం, శక్తి. శుక. 2.334 ; **3**. అతిశయం. దశా. 2.337 ; విణ. **1**. స్ఫుటం, స్పష్టమైన. సారంగ. 2.230 ; **2**. దృఢమైన. రసిక. 6.123 ; **3**. ధ్రువం, నిశ్చితమైన. ఉ.హరిశ్చ. 4.86.

దిటమరి వి. నాయకుడు, ప్రౌఢుడు. < దిటము + -అరి. దిటవరి చూ. దిటవు.

**దిటవు** రూ.చూ. దిట్టము. వి. దార్ఢ్యం ; విణ. దృఢమైన.

దిటవరి వి. ధైర్యశాలి. ఆనంద.పీఠి. 59. < దిటవు + -అరి. **దిటవుతప్పు** రూ.చూ. దిటదప్పు. స.క్రి. సుస్థితిని కోల్పోవు.

**దిటికుంబం** వి. దిష్టి తగలకుండా గడ్డివాముల, ఇళ్ళమీద పెట్టే కుండ.

సం. దృష్టికుంభ-. దృష్టి తగలకుండా ఉంచే కుండ ; ప్రా. దిట్ఠికుంభ-.

< ప్రా. దిట్ఠికుంభ-.

**దిట్ట** రూ. చూ. దిట్టము. వి. **1**. చతురుడు, నేర్పరి. భాస్క.రా.అరణ్య. 1.144 ; **2**. ధీరురాలు. ఉ.హరి. 1.56 ; **3**. ధైర్యం. కాశీ. 4.60 ; **4**. శక్తిగలవాడు, సమర్థుడు. పారి. 1.49 ; **5**. ధృష్టుడు, ఉద్ధతుడు, ఎదిరించే స్వభావం కలవాడు. శుక. 3.18 ; **6**. శ్రేష్ఠుడు. వేమ. 3.120 ; **7**. ధీరుడు, ధైర్యం కలవాడు. రసిక. 3.56.

దిట్టఁడు వి. **1**. ధీరుడు, ధైర్యశాలి. నిర్వ.రా. 4.33 ; **2**. ధృష్టుడు, ఉద్ధతుడు, ఎదిరించే స్వభావం కలవాడు. వేంక.మా. 4.260. **దిట్టతనము** వి. **1**. ధైర్యం. భార. భీష్మ. 1.159 ; **2**. శక్తి, సామర్థ్యం. శృం.నై. 7.160. అచ్చ.రా.సుందర. 164 ; **3**. చాతుర్యం, నేర్పు. కాశీ. 1.76 ; **4**. మహిమ, గొప్పతనం. రాజవా. 1.28. **దిట్టపడు** అ.క్రి. అలముకొను. అష్టమ.క. 1.25 పు. 15 పం. **దిట్టపఱుచు** స.క్రి. **1**. సమకూర్చు. ఆనంద. పీఠి. 106 ; **2**. దృఢపరచు. ఆనంద.పీఠి. 106. దిట్టరి వి. దృఢమైనవాడు, ధీరుడు. < దిట్ట + -అరి. దిట్టాడు అ.క్రి. అతిశయించు. ఉ.హరి. 5.21. < దిట్ట + ఆడు.

**దిట్టము** రూ. దిట, దిటము, దిటవు, దిట్ట. వి. **1**. ధైర్యం. భార. విరా. 4.77 ; **2**. నిర్ణయం, నిశ్చయం. ఆం.భా. 1.103 ; విణ. **1**. స్థిరమైన, శాశ్వతమైన. భోగినీ ; **2**. నిర్ణీతమైన, నిశ్చితమైన. శివద. 5.83.

సం. దృఢ-. బలమైన, ధృష్ట-. ప్రగల్భుడు, నిర్దయుడు, గర్వి ; ప్రా. దిట్ఠ- ; అ.మా. దిట్ఠ ;
క. దిట, దిట్టు, దిట్టు ; తు. దిట, దిట్ట.
< ప్రా. దిట్ఠ-.

**దిట్టాడు** చూ. దిట్ట.

**దిట్టికుండ** రూ.చూ. దిష్టికుండ. వి. దిష్టితగలకుండా పొలంలో నిలబెట్టే ఒకరకం కుండ.

**దిడిగి** చూ. దిడ్డి. వి. గొర్రెపిల్లల్ని, మేకపిల్లల్ని మూయడానికి ఉపయోగించే వెదురు బద్దల పెద్దజల్ల.

**దిడ్డి** రూ.దిడ్డీ. వి. **1**. పాలకీ మొదలైన వాటి ద్వారం. పి.శకు. 3.244 ; **2**. చిన్న ద్వారం. యయా. 5.151; **3**. కిటికీ.

క. జిడ్డి, దిడ్డి, దిడ్డె. దిడ్డితోవ, దిడ్డితలుపు ; త. తిట్టి. కిటికి ;

పో.చూ. మరా. దిండీ, దీడ్, దేడీ. దిడ్డితలుపు.

**దిడ్డికంత** రూ.చూ. దిడ్డిగంత. వి. **1**. ఇంటివెనకఉన్న ద్వారం ; **2**. ఇరుకుదారి. **దిడ్డిగంత** రూ. దిడ్డికంత. వి. దిడ్డికన్నం. వేణు. శ. 55. **దిడ్డిగూడు** వి. పొగగొట్టం, పొగ బయటికి పోయేదారి. **దిడ్డింజం** వి. పిల్లకాయలు చేసే అల్లరి. హిం.ఉ. జోమ్. ఉత్సాహం, ఆవేశం. **దిడ్డితలుపు** వి. ఇంటి పెరడుకి వెనకనున్న చిన్న తలుపు. **దిడ్డిదర్వాజా** రూ. దిడ్డెదర్వాజా. వి. ఇంటి వెనుకనున్న ద్వారం. **దిడ్డివాకిలి** వి, ఇంటివెనుక ఉన్న చిన్న ద్వారం. రం.రా. యు. 303 పు. 25 పం. క. దిడ్డిబాకలు. ఇంటి వెనుక వాకిలి ; త. తిట్టివాయిల్. **దిడ్డివైచు** స.క్రి. పల్లకీల వంటి వాని వాకిటి కడ్డంగా పరదావేయు. పరమ. వి. 2.38, కళా. 8.29.

**దిడ్డీ** రూ.చూ. దిడ్డి. వి. **1**. కిటికీ ; **2**. దొడ్డిద్వారం.

**దిడ్డెదర్వాజా** రూ.చూ. దిడ్డిదర్వాజా. వి. ఇంటి వెనక ఉన్న ద్వారం.

**దింటెన** వి. గిరికర్ణి, ఒక చెట్టు. కాళ. 3.110.

త. తింటు (Chitoria Ternatea).

**దిండడ** చూ. దిండు.

**దిండి** రూ.చూ. ద్రిండు. వి. రాట్నం బొమ్మ చెవుల మధ్య ఉండే కదురు భాగం.

**దిండిగం** చూ. దిండు.

**దిండిగెంబుట్టి** చూ. దిండు.

**దిండిడ** చూ. దిండు.

**దిండీఁడు** చూ. దిండు.

**దిండు** రూ.చూ. ద్రిండు. వి. **1**. కచ్ఛభేదం, కుచ్చెల. హరి. పూ. 5.9 ; **2**. దట్టి. హరి.పూ. 6.179, హర. 5.56 ; **3**. చుట్ట. శుక. 2.32 ; **4**. నూలు వడికే రాట్నం కదురుకు నూలు మొ. వాటిలో ఏర్పరిచే పిడి. శుక. 2.419 ; **5**. తలగడ. ప్రబంధ. 605 ; **6**. ఆధిక్యం, అతిశయం. ద్వి.సార.చ. 1.3 పు. 2 పం. ; **7**. భిత్తి, గోడ.అచ్చ.బా. 2.29 పు ; **8**. దీపం. చంపూ రా. 7.27 ; **9**. మెరుగు బిళ్ళ మొ. అంటించే రాళ్ళపనివాని సాన తిరుగుడు కొయ్య ; **10**. చిన్న చిరుగుల కట్ట ; **11**. పచ్చికమోపు ; **12**. బండికి మధ్య అమర్చే కొయ్య మొద్దు ; **13**. మోపు ; **14**. పళ్ళు బిగించిన అడ్డుకఱ్ఱ ; **15**. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; **16**. చిలపలో ఏడో వంతు నూలు ; **17**. అచ్చులో నేసిన రెండు డిజైన్ల మధ్య భాగం ; **18**. ఒకరంగు అంచులో, వేరే రంగువి అయిదారు పోగులు పెట్టి నేసిన డిజైను ; **19**. మడిలో పెళ్ళలు నలగటానికి తోలే కొయ్య మొద్దు ; **20**. మట్టిగోడ కట్టడంలో తడవకు మూరెడెత్తున నిర్మించే గోడ భాగం ; **21**. దీగూడునుంచి కిందికి అలంకారం కోసం అమర్చిన పొడుగాటి మట్టి కట్ట ; **22**. గోడ దిమ్మల మీదకట్టిన చిన్న దిమ్మ ; **23**. నీటిబట్టీలోని ఇటిక వరస ; **24**. గానిగకట్టె

తిరగడానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్య దుంప; **25.** కప్పు ఎగరకుండా దాని మీదవేసే కట్ట; **26.** పొరలు పొరలుగా ఉన్న బండరాళ్ళలోని కొన్ని పొరల సమూహం.

**దిండడ** రూ. దిండీడ. వి. నాగలికి అడ్డుగా వేసే కర్ర. అం.భా. 2.233. <దిండు+అడ్డ. **దిండిగం** వి. కన్య మొదట ఈడేరినపుడు పరిచే బట్ట. **దిండిగెంబుట్టి** వి. బొట్టు పెట్టుకొనే బుట్ట. **దిండీడ** రూ.చూ. దిండడ. వి. అడ్డంగా అమర్చిన దారువు, నాగలికడ్డంగా వేసిన కర్ర. **దిండీఁడు** వి. కాసెకట్టిన వాడు. <దిండు+-ఈఁడు. **దిండుగొట్టు** (-కొట్టు[1]) స.క్రి. మడిలోని పెళ్ళల్ని కొయ్య మొద్దుతో నలగగొట్టు. **దిండుపడు** అ.క్రి. సొమ్మసిల్లు, మూర్ఛపోవు. **దిండుపింజెర** వి. బోట్లపింజెర, ఒకరకం డాబీ. **దిండుమాను** వి. బండి ఇరుసుమీద వేసే అడ్డపట్టె. **దిండుమానుచీల** వి. బండిడొలుపును పోలుగర్రకు కలిపే మేకు. **దిండుసోగ** వి. గొర్రు, గుంటక మొ. వాటి దిండు మీద అమర్చిన మేడి.

**దిద్దకంపెట్టు** చూ. దిద్దు[1].

**దిద్ది** రూ. దిద్దు[2], దిద్దె. వి. చక్రానికి ఇరుసుదూర్చే రంధ్రానికి లోపలా బయటా వేసిన ఇనపకట్టు.

దిద్దికంత వి. గోడలో పెట్టిన రంధ్రం.

**దిద్దికంబిల్ల** చూ. దిద్దు[1].

**దిద్దికంబిళ్ళ** చూ. దిద్దు[1].

**దిద్దించు** చూ. దిద్దు[1].

**దిద్దితీర్చు** చూ. దిద్దు[1].

**దిద్దినయట్టులుండు** చూ. దిద్దు[1].

**దిద్దు[1]** స.క్రి. **1**. చేయు. రం.రా.బాల. 10పు. 3 పం; **2**. విభూతి, తిలకం మొ. పెట్టుకొను. క్రీడా.పీఠి. 52; **3**. సవరించు. చా.మం. 1.134; **4**. చక్కబరచు, చక్కజేయు. ఆము. 4.35; **5**. తవ్వు. పారి. 1.71; **6**. (విద్య మొ. వాటిలో) తీర్చు, శిక్షించు. కళా. 2.35; **7**. (ఉపాయం) పన్ను. కళా. 3.56; **8**. ధరించు. కళా. 5.113; **9**. మార్చు. రాఘవ. పీఠి. 5; **10**. నియమించు, నియోగించు. వైజ. 2.110; **11**. (అప్పు) తీర్చు. వైజ. 4.16; **12**. రాసి ఇచ్చిన అక్షరాల మీద మరల రాయు. హంస. 3.142; **13**. పడుగు చాపినపుడు పోగులు చిక్కులేకుండా సర్దు. నీలా. 1.60.

క. తిద్దు, తిర్దు. చక్కబరచు, చక్కజేయు, సవరించు, (అప్పు) తీర్చు; కొడ. తిద్-(తిద్ది-). శుభ్రపరచు; తిప్పి. శుభ్రంచేయు (మీసాలు); తు. తిద్దుని, సిద్దుని. చక్కబరచు, మెరుగుపరుచు, మరమ్మత్తు చేయు; త. తిరుత్తు. బాగుచేయు, మరమ్మత్తుచేయు, చక్కబరచు; తిరుంతు(తిరుంతి). చక్కబరచు, మెరుగుపరుచు, సంస్కరించు (విద్య మొ॥ వాటిల్లో), శిక్షించు, తీర్చు, తిత్తు. సవరించు; మ. తిరుత్తుక. బాగుచేయు, తుడిచివేయు, లేకుండా చేయు, సరిచేయు; తిరుత్తమ్. సరి అయిన; కువి. దిద్. మార్చు, దిదినై, తిప్పు.

మూ.ద.ద్రా. * తిర్-ఉత్.

<మూ.ద్రా. *తిక్-.

**దిద్దకంపెట్టు** స.క్రి. అచ్చుకట్టిన తరవాత, అచ్చుకర్ర మీది వడిదారం మెలిక (పూస)లు కొమ్ము బిళ్ళతో రుద్దుతూ చదును చేయు. **దిద్దకంబిల్ల** రూ.చూ. దిద్దకంబిళ్ళ. వి. అచ్చుకర్రకు కట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి పై మెలికల మీద రుద్దే దుప్పికొమ్ము. **దిద్దకంబిళ్ళ** రూ. దిద్దకంబిల్ల. వి. అచ్చుకర్రకు గట్టిన వడిదారం బిర్రుగా ఉండటానికి, పైమెలిక (-పూస) లమీద రుద్దేదుప్పి కొమ్ము. **దిద్దించు** స.క్రి. **1**. తప్పులు సరిచేయు; **2**. పిల్లలచేత వరవడిలో రాయించు. <దిద్దు[1]+- ఇంచు[3]. **దిద్దితీర్చు** స.క్రి. అందంగా తీర్చు, సరిచేయు, చక్కజేయు. పారి. 1.71. **దిద్దినయట్టులుండు** స.క్రి. తీర్చిదిద్దినట్లుండు. హంస. 3 24. **దిద్దుకత్తి** వి. పన్నెదండల మధ్య బిగించిన పుల్లల వరస చదునుచేసే కత్తి. **దిద్దుకంబడి** వి. మంచం మీద, పక్కవేసుకొనే గొంగడి. **దిద్దుకర్ర** వి. అచ్చు కట్టేటప్పుడు, కర్రలకు కట్టిన వడిదారాలు సరిచూసుకోటానికి, వాటి మెలికల్లో మార్చిన కర్ర. **దిద్దుకొను** రూ. తిద్దుకొను. స.క్రి. చక్కబరచుకొను. కళా. 3.188. **దిద్దుగడ** (-కడ) వి. దిద్దుపాటు, అనుశాసనం. అచ్చ. భా. 1.41. **దిద్దుచివ్వ** వి. అచ్చుకట్టిన తరువాత, వడులు సరిచేసే సన్నటిపుల్ల. **దిద్దుడు** వి. దిద్దుగడ. దిద్దుపాటు. **దిద్దుడుబద్ద** వి. వాట తయారీలో సమదళసరిని మన్ను లేపటానికి ఉపయోగించే వంకరగా ఉండే పల్చని వెదురుకొయ్య. **దిద్దుడుబిళ్ళ** రూ. దిద్దుబిళ్ళ. వి. **1**. అచ్చుకర్రకు కట్టిన వడి దారం; **2**. బిర్రుగా ఉండటానికి పైమెలికల మీద రుద్దే దుప్పికొమ్ము. **దిద్దుడురాయి** వి. కట్టుబడికిగాని, నేలపై పరచడానికి గాని, స్తంభాలు నిలపడానికి గాని వాడే చెక్కిన లేక మలిచినరాయి. **దిద్దుపాటు** రూ. దిద్దుబాటు. వి. **1**. సవరించటం **2**. శిక్షించటం. **దిద్దుబడి** వి. **1**. సవరించటం; **2**. శిక్షించటం. **దిద్దుబాటు** (-పాటు) రూ.చూ. దిద్దుపాటు. వి. **1**. సవరించటం; **2**. శిక్షించటం. **దిద్దుబిళ్ళ** రూ.చూ. దిద్దుడుబిళ్ళ. వి. అచ్చుకర్రకు కట్టినవడి దారం బిర్రుగా ఉండటానికి పైమెలికల మీద రుద్దే దుప్పికొమ్ము. **దిద్దువడు** (-పడు) అ.క్రి. శిక్షణ పొందు. వాల్మీ. 3.37.

**దిద్దు[2]** రూ.చూ. దిద్ది. వి. చక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలుపల లోపల వేసిన ఇనపకట్టు.

**దిద్దె** రూ.చూ. దిద్ది. వి. చక్రంకుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చేరంధ్రానికి వెలివైపునా, లోవైపునా వేసిన ఇనపకట్టు.

**దిద్ధిమికిధిమికి** వి. శబ్దాను కరణం. ధ్వన్యను.

**దినం** వి. ఎవరైనా మరణించిన తర్వాత అశౌచపు చివరి రోజునచేసే అంత్యకర్మ.

సం. దిన-. రోజు.

<సం. దిన- (అర్థవిపరి.).

**దినంశాల్తీలు** వి.బ.వ. పెద్దకర్మ రోజున వాడే పిండం కుండ, అస్తికల ముంత, ప్రమిద మొ॥ మట్టిపాత్రలు. **దినంపిడత** వి. చనిపోయిన మూడోరోజు పిండం వండడా

నికి వాడే మట్టిపాత్ర.

దినకత్తిరి రూ.చూ. దినకర్తరి. వి. వైశాఖంలో వచ్చే ఒక కార్తె.

దినకర్తరి రూ. దినకత్తిరి. వి. వైశాఖమాసం (మేనెల మొదటి భాగం) లో వచ్చేకార్తె.
  సం. దిన-. రోజు.

దినకార్యం వి. శ్రాద్ధం.
  సం. దినకార్య-. రోజులోపని.
  <సం. దినకార్య- (అర్థవిపరి.).

దినకొత్తలు వి.బ.వ. నిత్యనూతనాలు. తాళ్ల. సం. 11.11.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+క్రొత్తలు. (మిశ్రన.).

దినకోరు రూ.చూ. దినగోరు. వి. 1. రోజుకూలి. ఆం. భా. 3.32 ; 2. దినభాగం, రోజుకొక్కని వంతు.

దినగోరు (-కారు³) రూ. దినకోరు. మిశ్ర. వి. 1. దినభాగం, రోజుకొక్కనివంతు. శృం. నై. 7.81 ; 2. రోజుకూలి.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+కోరు³. (మిశ్రన.).

దినగోల వి. దినబత్తెం.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+కోల (మిశ్రన.).

దినచల్వలు వి.బ.వ. దినదినానికొకటి చొప్పున ఉపయోగించే చలవ చేసే వస్త్రాలు. విజయ. 2.144.
  <సం. దిన-+చల్వలు (మిశ్రన.).

దినప్రతి వి. ప్రతిదినం. ద.హిం. కా. సంపు. 5. కా. సం. 1151. క్రీ.శ. 1305.
  సం. దిన-. రోజు, ప్రతి. ఉపసర్గ.
  <సం. ప్రతిదిన-.

దినబత్తెము వి. ప్రతిరోజూ ఇచ్చేబత్తెం. హరిశ్చ. 4.192.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+బత్తెము (మిశ్రన.).

దినమార్గ వి 1. డేనుజాతివారి మాతృభూమి ; 2. డేనుజాతి.
  బెం. దినెమార్, పో. దినమార్కా. డెన్మార్కు, దినమార్కీష. డేనులు ; స్పా. దీనమార్కా. డెన్మార్కు ; ఫ్రెం. దెన్ మార్.
  <పో. దినమార్కా.

దినరోజు వి. ఏరోజు చేసినపనికి ఆరోజున ఇచ్చేకూలి, రోజుకూలి. రాజవా. 5.32.
  సం. దిన-. రోజు ; ఉ. రోజ్. దినం.
  <సం. దిన-+ఉ. రోజ్ (మిశ్రన.).

దినవహి వి. జమాఖర్చు. హంస. 1.142.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+వహి. (మిశ్రన.).

దినవారము వి. ఉత్తరక్రియలు, శ్రాద్ధాదికర్మ.
  సం. దిన-. రోజు, వార-. సమూహం, ఏడురోజుల్లో ఒకరోజు.
  <సం. దినవార- (అర్థవిపరి.).

దినవెచ్చము వి. ప్రతిరోజు జరిగే ఖర్చు. క్రీడా. 49. శ్రీనాథుని చాటువు.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+వెచ్చము (మిశ్రన.).

దినసంతలెక్కు అ.క్రి. ఎక్కువగు, సమృద్ధమగు. తాళ్ల. సం. 8.170.
  సం దిన-. రోజు.
  <సం. దిన-+సంత+-లు+ ఎక్కు.

దినసరి వి. ఒకరకం సరి. విష్ణు పు. 3ఆ.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+ సరి (మిశ్రన.).

దినసరులు వి.బ.వ. 1. దినచర్య. దైనందినకార్యక్రమం. ఇందు. 2.209 ; 2. ఉత్తరం. కృష్ణరా. 3.104 ; 3. ప్రతిదినకార్యక్రమం రాసేపుస్తకం. రఘునా. 11పు.
  సం. దినచర్యా. రోజూచేసేపని.
  <సం. దినచర్యా.

దినారి వి. పైడి, బంగారం, వరహా, దీనారం. నార.పంచ. 1.50.
  సం. దీనార-. బంగారునాణెం ; ప్రా. దీణార-.
  <ప్రా. దీణార-.

దినాలు వి.బ.వ. అంత్యక్రియలు.
  సం. దిన-. రోజు.
  <సం. దిన-+-ము+-లు. (అర్థవిపరి.).

దినుసు రూ.చూ. దినుస్సు. విణ. సమమైన, తుల్యమైన. ఇందు. 2.157 ; వి. 1. సాటి. విజయ. 1.35 ; 2. ధాన్యం. హంస. 2.226 ; 3. రకం, జాతి. హంస. 4.128 ; 4. వస్తువు ; 5. చెయివాసి ; 6. క్రమం, పద్ధతి ; 7. విత్తనం.
  దినుసుఏర్చు స.క్రి. ఉన్నవాటిలో మంచివాటిని ఎన్నుకొను. రాజగో. 4.75. దినుసుగడ్డలు వి.బ.వ. దుంపలు. దినుసుమీఱు అ.క్రి. సాటిలేనిదగు, నిరుపమానమగు. అచ్చ.రా.బాల. 6. దినుసులు వి.బ.వ. అపరాలు. హంస. 2.229. దినుసువచ్చు అ.క్రి. సాటివచ్చు. విజయ. 1.35.

దినుస్సు రూ. జింసు, జినస్సు, జిన్సు, దినుసు. వి. 1. వస్తువు. కళా. 6.85 ; 2. విధం, ప్రకారం, రీతి ; 3. రకం, జాతి.
  హిం. జినిస్, జింస్. విధం, వలె, వస్తువు, సామాను, ధాన్యం, దినుసు. వస్తువు ; మరా. జిన్నిస్. పదార్థం, వస్తువు ; ఉ. జిన్స్. వస్తువు, పదార్థం, ధాన్యం, జాతి ; పార. జిన్స్. రకం, విధం, వస్తువులు, పదార్థాలు, ధాన్యం, పంట ; అర. జిన్స్. పదార్థం ;
  క. దినుసు ; త. తిణిసు.
  <ఉ. జిన్స్.

దిందిం రూ.చూ. దిమిదిమి. వి. మృదంగరవం. ధ్వన్యను.

దిందిగెం వి. నల్లరేగడినేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క.

దిందిమ్ము రూ.చూ. దిమిదిమి. వి. భేరీ మృదంగాది వాద్య ధ్వని విశేషం. ప్రబంధ. 788. ధ్వన్యను.

దిందిమ్మను అ.క్రి. నిర్జనంగా ఉండి దిగులుగొలుపు. ధ్వన్యను.

దిందుపడు అ.క్రి. కిందపడు. తాళ్ల.సం. 9.56.

దిన్న చూ. తిన్నె. వి. మెట్టనేల.

దిన్ను రూ.చూ. తన్ను. వి. బట్టీ గోడలు పక్కలకు వాలి పోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ.

దిన్నె[1] రూ.చూ. తిన్నె. వి. 1. ఎత్తుగాఉన్నదిమ్మ; 2. బావి చుట్టూ కట్టిన పొట్టిగోడ.

దిన్నెకంది వి. మెట్టలో పండే పప్పుదినుసు. దిన్నె గుంటక వి. విత్తనం వెయ్యకముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక. దిన్నెనేల వి. వర్షాధారంతో పండే నేల.

దిన్నె[2] రూ.చూ. జిన్న[1]. వి. ఒకరకం చెట్టు. అచ్చ.రా.యు. 332.

దిప్ప రూ.చూ. డిప్ప. వి. రాటిపై బద్దలను బిగించి మధ్య బోర్లించి కట్టిన చిప్ప.

దిప్పకాయ రూ. డిప్పకాయ, తిప్పకాయ, దిబ్బకాయ. విణ. కొంటెవాడు. ద్వి.పరమ.వి. 3,243 పు. 13 పం.; వి. అల్లరిచేసే కుఱ్ఱవాడు. దిప్పతీయు రూ. చూ. డిప్పతీయు. స.క్రి. కుండల తయారీలో పైన మందం తక్కువగా కింద లావుగా ఉండేటట్లు తీర్చు.

దిబాటవాన రూ.చూ. దబ్బాటువాన. వి. పెద్దపెట్టున వచ్చి కొద్దిసేపట్లో నిలిచిపోయే వాన.

దిబిడీ చూ. దిబ్బ. వి. లావుగాఉన్న మనిషి.

దిబ్బ వి. 1. ఉన్నతభూమి, ఎత్తైనప్రదేశం. భార.అను. 1.229; 2. మట్టి మొ॥ వాటి కుప్ప. పల్నా. 3 పు.; 3. ద్వీపం. కవిరాజ. 4.63; 4. పర్వతం, కొండ. హంస. 3.20; 5. హస్తినఖం, దుర్గద్వారంవద్ద వాటంగా ఏర్పరచిన మట్టిదిబ్బ. ఆం.భా. 2.21; 6. రాటి తిరగటానికి రాటి శూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు; 7. గాదె లాగా ఉండే పొడుగైన బుట్ట.

క. తిప్పె. కుప్ప, కొండ, దిబ్బ, దిబ్బు. ఎత్తైన ప్రదేశం, దిబ్బ, కొండ; తు. తిప్పె. గుప్ప, గుట్ట, కొండ; త. తిప్పై. దిబ్బ, ఎత్తుగా చేసిన స్థలం; కో. తిప్. చెత్తకుప్ప; కుఇ. దెప. ఎత్తైనభూమి; కువి. దెబ్బె. కొండ; పర్జి. డిప్ప. కుప్ప, దిబ్బ. కొండ; మాల్తో. తుబె. చెత్తకుప్ప;

సం. ద్వీప-. దీవి; ప్రా. దీవ-.

దిబ్బచూపు రూ. దిబ్బనూపు. అ.క్రి. దిబ్బగా ఏర్పడు. కాశీ. 3.23. దిబ్బటంపారు వి. పక్క పక్కల నున్న వరండాలు ఒక మూలన కలియటం. దిబ్బతీర్థమగు అ.క్రి. ఒకచోట గుంటగా నీరు నిలుచు. విప్ర. 2.14. <దిబ్బ+తీర్థము+అగు. దిబ్బముండ వి. లావుగాఉన్న స్త్రీ, ఒక తిట్టు. దిబ్బరొట్టె వి. మినపప్పు బియ్యం పిండితో చేసిన లావుగాఉన్న రొట్టె. దిబ్బలి వి. ఊబి, వాన కురిస్తే బురబుర పొంగి దిగబడే చవిటినేల. దిబ్బలువెట్టు (-పెట్టు) స.క్రి. కుప్పలుపోయు. శాశ్వ. 1.64. దిబ్బవేసియుండు (-ఉండు) స.క్రి. చెవులు మూసికొనిపోవు. దిబ్బనూపు (-చూపు) రూ.చూ. దిబ్బచూపు. అ.క్రి. దిబ్బగా ఏర్పడు.

దిబ్బకాయ రూ.చూ. దిప్పకాయ. వి. గడుసరి.

దిబ్బడ వి. శైత్యాదికంవల్ల ముక్కులోనూ, చెవుల్లోనూ కలిగే బాధ.

దిబ్బడఎత్తు అ.క్రి. శీతంతో చెవులు దిమ్ముపడు. దిబ్బడ వేయు అ.క్రి. శైత్యాదికంచేత ముక్కులోనూ చెవుల్లోనూ ఒకవిధమైన బాధ కలుగు.

దిబ్బడము చూ. దబ్బడము. వి. మూకుడు.

క. దిబ్బణ. కర్రమూత లేదా బిరడా; తు. దిమ్మె. కప్పు, బిరడ, కన్నం మూసే బిరడా.

దిబ్బణం వి. ఎదుర్కోలు సన్నాహం.

దిబ్బియము రూ. దిబ్బెము. వి. దీపం.

సం. దీప-. దీపం, దివ్య-. దేవతాసంబంధి; ప్రా దిబ్బ. దివ్యం, దివ్య. దేవతాసంబంధి, మనోహరం ప్రధానం.

దిబ్బిళించు స.క్రి. పాత్రల్ని నేలపై మూతి ఆనేట్లు బోర్లించు.

దిబ్బు[1] చూ. దిబ్బడము. వి. చెవి వినపడకపోవటం.

దిబ్బు[2] వి. చరచటం మొ॥ వానిలో అయ్యే ధ్వనికి అనుకరణం

దిబ్బున క్రి.విణ.ద్రు. దిబాలున.

దిబ్బె వి. 1. చక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనప కట్టు; 2. రాట్నం రెండు చక్రాలనూ (ఆకుల్ని) వేరుచేసే కొయ్య.

దిబ్బెము రూ.చూ. దిబ్బియము. వి. దీపం.

దిబ్బెమెత్తు అ.క్రి. దీపమెత్తి ప్రమాణంచేయు. పాండు. 1.33. <దిబ్బెము+ఎత్తు. దిబ్బెంమూకట రూ.చూ. దబ్బెం మూకుడు. వి. నెయ్యిపోసి అఖండదీపం పెట్టడానికి వాడే మూకుడు. దిబ్బెంమూకుడు రూ. దిబ్బెంమూకట. వి. నెయ్యి పోసి అఖండ దీపం పెట్టటానికి వాడే మూకుడు.

దిబ్బెమెత్తు చూ. దిబ్బెము.

దిబ్బెంమూకట చూ. దిబ్బెము.

దిబ్బెంమూకుడు చూ. దిబ్బెము.

దిమము రూ.చూ. దీమము. వి. ఆశచూపి వంచించటం, ఎర చూపి వలలో వేసుకోవటం.

దిమాకిదీయు చూ. దిమాకు. స.క్రి. గర్వమణచు.

దిమాకు వి. 1. గర్వం. విశ్వే. శ.; 2. బలం; 3. ధైర్యం; 4. అధికారం.

హిం. మరా. ఉ. దిమాగ్. గర్వం; పార. దిమాగ్, దమాగ్. గర్వం, కోరిక; అర. దిమాగ్. అభిమానం. <ఉ. డిమాగ్.

దిమికిట వి. తుడుము. మొ. వాటి వాద్యాలధ్వనికి అనుకరణం. క్రీడా. 226.

దిమిదిమి రూ. దిందిం, దిందిమ్మి. వి. మద్దెలమోతకు అనుకరణం. రం.రా. కిష్కిం, 219 పు. 17పం.

క. దిమ్. మువ్వలమోత శబ్దానికి అనుకరణం, దిమి. వేగంగా నృత్యం చేసేటప్పుడయ్యే పాదాల చప్పుడు; తు. దమిదిమి. వేగంగా నృత్యంచేయటం; త. తిమి-తిమి. నృత్యం చేసేటప్పుడు సమయాన్ని సూచించే అనుకరణ శబ్దం.

దిమిశ రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమిశా** రూ.చూ. దిమ్మిస. వి. **1.** గూనలోపల అడుగేసేటప్పుడు, చెయ్యి అందకున్నప్పుడు మోపుచేసుకొని సరచడానికి రాయికి బదులు ఉపయోగించడానికి మట్టితోగాని కర్రతోగాని చేసిన దిమ్మ ; **2.** నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమిశి** రూ.చూ. దిమ్మిస. వి. సమ్మెటకింది మూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్య భాగంలో పొట్టలావుగా కూజా మాదిరి ఉండే మట్టిపాత్ర.

**దిమిస** రూ.చూ. దిమ్మిస. వి. నేల చదునుచేసే పనిముట్టు.

**దిమిసీ** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమిసు** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిముకు** వి. మద్దెలమోత. ధ్వన్యను. ఆం.భా. 1.121.

**దింపు** రూ.చూ. డింపు. స.క్రి. **1.** పీడు, విడుచు. ఉద్భటా. 1.38 ; **2.** అణచు, పోగొట్టు. ఉ.రా. 6.24 ; **3.** కిందపెట్టు ; వి. **1.** వేలటం, లంబనం ; **2.** చెట్లనుంచి కాయలు మొ. కిందికి తేవటం.

**దింపుడచ్చు** వి. ఇటికనుచేసే దిమ్మ లేక పెట్టె. < దింపుడు + అచ్చు[1]. **దింపుడు** వి. దించడానికి వీలైనంత పరిమాణం. **దింపుడుకళ్ళమాశ** వి. నిరాశస్థితిలో చేసే చివరి ప్రయత్నం. **దింపుడుకళ్లము** వి. శవాన్ని శ్మశానానికి మోసుకుపోయేటప్పుడు మార్గమధ్యంలో శవాన్ని దించే చోటు. **దింపుడుకళ్లు** వి.బ.వ. కిందికి చూస్తున్న కళ్ళు. **దింపుడుచెక్క** వి. అచ్చుకింది కొయ్యపలక. **దింపుడులొట్టి** వి. కల్లు దించుకోడానికి మూతి సన్నగాఉండే మట్టికడవ. **దింపులకు(దెచ్చు(-తెచ్చు)** స.క్రి. తిరస్కరించు. చంపూ రా. 3.98. **దింపులువోవు(-పోవు)** అ.క్రి. వేలాడు. కాశీ. 4.18.

**దిమ్మ[1]** రూ. తిమ్మె, దిమ్మి, దిమ్ము[3], దిమ్మె. వి. **1.** రాశి, పోగు. కాశీ. 7.246 ; **2.** దిబ్బ. రసిక. 5.38 ; **3.** స్తంభం, మంచంకోడు మొ. వాటికింద ఉంచే కొయ్య లేక రాయి మొ. వాటి ముక్క ; **4.** బంగారం మొ. వాటిని పైన ఉంచి సాగగొట్టటానికి ఉపయోగించే ఇనపముక్క ; **5.** మట్టి, ఇటిక మొ. వాటితో కట్టే స్తంభం ; **6.** పత్తి రాట్నం కిందిపేట ; **7.** రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట ; **8.** రాటె తిరగటానికి, రాటనూలానికున్న కొయ్యమొద్దు ; **9.** మరాను ఇరుసును మోసే పొడుగు కొయ్య(లు) ; **10.** డాబీ దిండుకు చేసిన బొడిపె(లు) ; **11.** రాతితో కట్టిన స్తంభం ; **12.** దిమ్మిస అడుగున ఉండే కొయ్యదూలం ; **13.** గానిగెకట్టె తిరగడానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప ; **14.** ఓడ కాగులోని అడుగుభాగం.

క. దిమ్మి. ఎత్తైన ప్రదేశం, దిబ్బ ; పర్జి. దెమ్మ.

**దిమ్మకట్టు** వి. ఆములో కుండల్ని ఎత్తుగా ఒకదానిపై ఒకటి వరసగా పేర్చడం. **దిమ్మతాపీ** వి. దిమ్మెసలాగా కొట్టడానికి పనికివచ్చే ఒకరకం తాపీ. **దిమ్మబల్ల** వి. వాటను సాగగొట్టి అడుగుకు మూసేటపుడు వాడే సలప. **దిమ్మేయు** అ.క్రి. రాటను మొదటిసారి దళసరి సలపతో గట్టిగా కొడుతూ అడుగుమూయు. < దిమ్మ[1] + వేయు.

**దిమ్మ[2]** వి. **1.** వికారం. రం.రా.యు. 517 పు. 11 పం. ; **2** దిగ్భ్రమ.

క. దిమ్ము. వికారం, దిగ్భ్రమ.

**దిమ్మగొను(-కొను)** అ.క్రి. పొరపడు, భ్రాంతినొందు. రాధికా. 3.45. **దిమ్మతిరుగు** రూ. దిమ్మదిరుగు. అ.క్రి. **1.** చెడతిరుగు. నృసింహ. 2 ; **2.** తలతిరుగు. వరాహ. 12.64. **దిమ్మదిరుగు** రూ.చూ. దిమ్మతిరుగు. అ.క్రి. స్పృహతప్పు, వివశతనొందు. రామాభ్యు. 8.120. **దిమ్మపడు** అ.క్రి. **1**. మొద్దువారు. ద్వి.భాగ. 2.29 ; **2.** వివశుడగు ; **3.** స్తంభించు. **దిమ్మరీ(డు(దిమ్మరి- + ఈ(డు)** వి. మత్తుకలవాడు. శశా. 1.108.

**దిమ్మరుచు** చూ. దిమ్ము[1].

**దిమ్మరి** చూ. దిమ్ము[1].

**దిమ్మరించు** స.క్రి. ఎక్కువగా పోయు, పైనుంచిపోయు.

**దిమ్మస** రూ.చూ. దిమ్మిస. వి. కంకర మొ. వాటిని గట్టించటానికి ఉపయోగించే సాధనం.

**దిమ్మసకట్టె** రూ.చూ. దిమ్మెసకట్టె. వి. దిమ్మిసదుక్కను పట్టిఉండే పొడుగాటి కొయ్య.

**దిమ్మసు** రూ.చూ. దిమ్మిస. వి. నేల చదునుచేసే సాధనం.

**దిమ్మి** రూ.చూ. దిమ్మ[1]. వి. రాతితోకట్టిన స్తంభం.

**దిమ్మిక** రూ.చూ. డిమ్కి. వి. కిందమూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్యభాగంలో పొట్ట లావుగా కూజామాదిరి ఉండే మట్టిపాత్ర.

**దిమ్మిగుంచు** స.క్రి. నొక్కు.

**దిమ్మిశ** రూ.చూ. దిమ్మిస. వి. **1.** గుమ్మెటకింది మూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్యభాగంలో పొట్ట లావుగా కూజామాదిరి ఉండే మట్టిపాత్ర ; **2.** నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమ్మిశా** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమ్మిశి** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమ్మిస** రూ. దమ్మస్, దమ్మసు, దమ్మస్తు, దిమిశ, దిమిశా, దిమిశి, దిమిన, దిమిసీ, దిమిసు, దిమ్మస, దిమ్మసు, దిమ్మిశ, దిమ్మిశా, దిమ్మిశి, దిమ్మిసె, దిమ్మీస్, దిమ్మీన, దిమ్మీసు, దిమ్మెచ, దిమ్మెట, దిమ్మెశ, దిమ్మెస, దిమ్మెసె, దిమ్సి, దొమ్మసు, ధమ్మస. వి. **1.** నేలచదును ; **2.** నేలచదును చేసే సాధనం.

ఒ. దిమ్సా. నేలను చదునుచేసే పనిముట్టు.

< ఒ. దిమ్సా.

**దిమ్మిసకుండ** వి. కింది మూత వెడల్పుగా పై మూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే మట్టిపాత్ర. **దిమ్మిసదుక్క** రూ. దిమ్మెస దుక్క. వి. దిమ్మిస అడుగున ఉండే కొయ్యదుంప. **దిమ్మిసపీట** వి. దిమ్మిస అడుగున ఉండే కొయ్యదుంప.

**దిమ్మిసె** రూ.చూ. దిమ్మిస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమ్మిస్** రూ.చూ. దిమ్మిస. వి. కంకర మొ. వాటిని గట్టించ

టానికుపయోగించే సాధనం.

**దిమ్మాస** రూ.చూ. దిమ్మెస. వి. గుమ్మెట కింది మూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజామాదిరి ఉండే మట్టిపాత్ర.

**దిమ్మాసు** రూ.చూ. దిమ్మెస. వి. నేలను గట్టి పరచడానికి వాడే పరికరం.

**దిమ్ము**[1] వి. **1**. సమూహం, గుంపు. భాస్క.రా.అరణ్య. 1.205 ; **2**. మదం. వరాహ. 7.81 ; **3**. తల మొ॥ వాటికి కలిగే బాధా విశేషం. ఇందు. 3.12 ; **4**. జడత్వం, మాంద్యం. సీతా.వి. 3.105.

క. దిమ్ము ; త. తిమ్మె.

**దిమ్ముడుచు** అ.క్రి. చెవులు దిమ్ముపట్టు, దిబ్బడవేయు. సానంద. 2.25 ప.దశా. 2.53. <దిమ్ము[1]+అడుచు.

**దిమ్మరి** విణ. **1**. మత్తుకలవాడు. శుక. 2 ; **2**. భ్రమకల వాడు, భ్రమకలది ; **3**. మత్తుకలది. <దిమ్ము[1]+-అరి.

**దిమ్ముగొను(-కొను)** అ.క్రి. బాధపడు. రాధికా. 2.20.

**దిమ్ముపట్టు** రూ.చూ. దిమ్మువట్టు. అ.క్రి. **1**. మత్తు కలుగు ; **2**. బాధగొను. **దిమ్ముపడు** రూ.చూ. దిమ్మువడు. అ.క్రి. డిందుపడు. ఆం.భా. 3.116. **దిమ్ము వట్టు(-పట్టు)** రూ. దిమ్ముపట్టు. అ.క్రి. **1**. బాధగొను. విష్ణుపు. 7.182 ; **2**. మత్తు కలుగు. **దిమ్మువడు** రూ. దిమ్ముపడు. అ.క్రి. డిందుపడు. ఆం.భా. 3.116. దిమ్మెత్తు స.క్రి. జడత్వమందు, బాధనొందు. సా వి. 2.101. <దిమ్ము[1]+ఎత్తు[1].

**దిమ్ము**[2] వి. **1**. పెద్ద వస్తువు భూమి మొ॥వాటి మీద పడినపుడు కలిగేధ్వనికి అనుకరణం. సిం.ద్వా. 11.23 ; **2**. గొప్ప ధ్వనికి అనుకరణం. వైజ. 1.123.

దిమ్మెత్తిపోవు అ.క్రి. చెవులు మొదలైనవి క్షోభపడు. <దిమ్ము[2]+ఎత్తిపోవు. దిమ్మెత్తుపడు అ.క్రి. చెవుడుపడు. <దిమ్ము[2]+ఎత్తుపడు.

**దిమ్ము**[3] రూ.చూ. దిమ్మ[1]. వి. కొయ్య బిరడా.

**దిమ్మె** రూ.చూ. దిమ్మ[1]. వి. **1**. మద్దెల అంచు. ప్రభు. 2.26 పు. 17 పం. ; **2**. రాళ్ళు మొ. వాటి చిన్న మిట్ట, కుప్ప. నీలా. 2.32 ; **3**. తామరదుద్దు ; **4**. కొయ్య బిరడా ; **5**. చెవికమ్మలు, ముక్కుపుడకలు వీటి వెనక భాగాల్లో బిగించే మరచీల ; **6**. గోడల్లో దారబందం బిగించడానికి ఏర్పరచిన లావుభాగం ; **7**. గోడలో, బటువుకోసం అక్కడక్కడ కట్టిన దళసరి భాగం ; **8**. ఎత్తుగా ఉండేది ; **9**. గుడ్డలకు రంగులతో చిత్రాలు ఒత్తే దిమ్మెలు ; **10**. స్తంభంలా రాళ్ళతో పేర్చేది ; **11**. గానిగకట్టె తిరగడానికి ఆధారంగా నాట బడిన లావాటి కొయ్యదుంప ; **12**. బట్టిగోడలు పక్కలకు వాలిపోకుండా పోటిగా కట్టిన చిన్నగోడ ; **13**. మట్టిపొయ్యి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టి ఉబ్బు.

దిమ్మెకట్టు వి. పక్కకొమ్మలు వేసి మొక్క గుబురుగా వచ్చే స్థితి. దిమ్మెరాయి వి. రాతి దిమ్మల కట్టుబడిలో పనికి వచ్చే (లేక వాడబడిన) రాయి.

**దిమ్మెచ** రూ.చూ. దిమ్మెస. వి. నేలను గట్టి పరచడానికి వాడే పరికరం.

**దిమ్మెట** రూ.చూ. దిమ్మెస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దిమ్మెత్తిపోవు** చూ. దిమ్ము[2].

**దిమ్మెత్తు** చూ. దిమ్ము[1].

**దిమ్మెత్తుపడు** చూ. దిమ్ము[2].

**దిమ్మెళ** రూ.చూ. దిమ్మెస. వి. నేలను గట్టి పరచడానికి వాడే పరికరం.

**దిమ్మెస** రూ.చూ. దిమ్మెస. వి. **1**. కాసె వాని సాధనం, రాతిపని వాని పనిముట్టు, నేలను గట్టిపరిచే సాధనం ; **2**. రాటి తిరగటానికి రాటి శూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు.

దిమ్మెసకట్టె రూ. దిమ్మసకట్టె. వి. దిమ్మెసదుక్కను పట్టి ఉండే పొడుగాటి కొయ్య. దిమ్మెసగర్ర(-కర్ర) వి. దిమ్మెస దుక్కను పట్టి ఉండే పొడగాటి కొయ్య. దిమ్మెసగొట్టం వి. రాటి ఆకులు బిగించిన వెదురుగొట్టం. దిమ్మెసదుక్క రూ.చూ. దిమ్మెసదుక్క. వి. దిమ్మెస అడుగున ఉండే కొయ్యదుంప. దిమ్మెసపరుపు వి. రెండిటికలను గోడున, వాటికడ్డంగా ఒకటి పేర్చటం. దిమ్మెసపుల్ల వి. దిమ్మెస దుక్కను పట్టి ఉండే పొడుగాటి కొయ్య.

**దిమ్మేయు** చూ. దిమ్ము[1].

**దిమ్సి** రూ.చూ. దిమ్మెస. వి. నేలను గట్టిపరచడానికి వాడే పరికరం.

**దియగూడు** రూ.చూ. దీగూడు. వి. దివ్వెగూడు.

**దియ్యగూడు** రూ.చూ. దీగూడు. వి. దీపం పెట్టుకొనే గూడు.

**దియ్యసొడ్డు** చూ. దీవియ. చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దియ్యస్తంభం** చూ. దీవియ. రూ.చూ. దీస్తంబం. వి. దీపం బుడ్డి పెట్టుకొనే కొయ్య స్టాండు.

**దియ్యారాధన** చూ. దీవియ, దీపారాదన. వి. దీపారాధన.

**దియ్యనేత** చూ. దీవియ. రూ.చూ. దీనేత. వి. రాత్రివేళ దీపం పెట్టుకొని నేసే నేత.

**దియ్యె** రూ.చూ. దీవియ. వి. దివ్వె.

**దిరంగు** వి. విలంబనం.

మరా. *దిరంగ్*. విలంబనం, ఆలస్యం ; పార. *దిరంగ్*. విలంబనం.

<మరా. దిరంగ్.

**దిరడ్డీ** వి. కిటికీ కింది భాగం.

**దిరదిర** రూ. దిర్దిర. వి. తిరగటంలో ధ్వనికి అనుకరణం. ఉ.రా. 6.235.

దిరదిరతిరుగు రూ.చూ. దిర్దిర తిరుగు. అ.క్రి. వేగంగా తిరుగు. ఉ.రా. 6.235.

**దిరిశనము** రూ.చూ. దరిశనము. వి. కానుక. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1269.

**దిరిసన** రూ.చూ. దిరిసెము. వి. శిరీషం (Albizzia Lebbek).

**దిరిసనము** రూ.చూ. దిరిసెము. వి. శిరీషం (Albizzia Lebbek).

**దిరిసము** రూ.చూ. దిరిసెము. వి. శిరీషం (Albizzia Lebbek).

**దిరిసెన** రూ.చూ. దిరిసెము వి. 30–40 అడుగుల ఎత్తు పెరిగే పెద్ద చెట్టు (Albizzia Lebbek.)

**దిరిసెనము** రూ.చూ. దిరిసెము. వి. శిరీషం, ఒక చెట్టు. చంద్రభా. 5.85, హంస. 4.11 (Albizzia Lebbek).

**దిరిసెము** రూ. దిరిశనము, దిరిసన, దిరిసనము, దిరిసము, దిరిసెన, దిరిసెనము, దిర్శెన, దిర్సెన, దురిసెను, దూసెన, దెరసనము, దెర్శిన. వి. శిరీషం, ఒక చెట్టు. కాశీ. 5.305, పి.శకు. 2.38 (Albizzia Lebbek).

సం. శిరీష-. దిరిసెనపుచెట్టు ; ప్రా. సిరిస-, సిరీస- ; పా. సిరీస ;

క. సిరసల, సిరిస, సిర్సల.

<ప్రా. సిరిస-.

**దిర్దిర** రూ.చూ. దిరదిర. వి. తిరగటంలో ఉయ్యే ధ్వనికి అనుకరణం.

**దిర్దిరదిరుగు (-తిరుగు)** రూ. దిరదిర తిరుగు. అ.క్రి. గిరగిరతిరుగు. భార.ఆది. 4.38.

**దిర్శెన** చూ. దిరిసెము. వి. శిరీషం, దిరిసెనవృక్షం.

**దిర్సెన** రూ.చూ. దిరిసెము. వి. పొట్టిగా బొద్దుగా ఉండే బోదెతో బూడిదరంగులో ఉండే బెరడుతో సువాసనగల పూలతో రమారమి 30–40 అడుగుల ఎత్తు పెరగే చెట్టు.

**దిలాస** రూ.చూ దిలాసా. వి. విలాసం.

**దిలాసా** రూ. దిలాస. వి. హెచ్చరిక, ధైర్యం, నిబ్బరం, ప్రోత్సాహం.

హిం.ఉ. దిలాసా. ప్రోత్సాహం ; పార. దిలాసా.

<ఉ. దిలాసా.

**దిల్‌పసంద్** వి. ఎక్కువ తీపిగల ఒకరకం మామిడిపండు.

హిం. దిల్. హృదయం, హిం. పసంద్. ఇష్టం.

<హిం. దిల్‌పసంద్.

**దిల్ల** రూ.చూ. డిల్లము. వి. అధైర్యం, పిరికితనం ; విణ. నిస్సత్త్వమైన, బలహీనమైన.

**దిల్లపడు (-వడు)** అ.క్రి. శోకాదులచే దేహం బలహీనమగు. భాస్క.రా.అరణ్య. 2.256.

**దిల్లము** రూ.చూ. డిల్లము. వి. అధైర్యం, పిరికితనం ; విణ. నిస్సత్త్వమైన, బలహీనమైన.

**దిల్లీఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం. ఉ. దిల్లీఖానీ. ఢిల్లీ సర్దారు.

**దివటి** రూ.చూ. దివ్వటీ. వి. కాగడా.

**దివటీ** రూ.చూ. దివ్వటీ. వి. కరదీపిక, ఇనపకడ్డీకి గుడ్డలు చుట్టి వెలిగించే దీపం. ఆం.భా. 2.165.

**దివదండి** రూ.చూ. దివ్వదండి. వి. ప్రమిదెలు పెట్టుకోడానికి జానెడెత్తుగా ఉండే మట్టిదిమ్మ.

**దివసపడి** వి. ప్రతిదినం ఏర్పాటుచేయబడ్డ నైవేద్యం. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1038.

సం. దివస. రోజు.

<సం. దివస + పడి.

**దివసము** రూ. దేవసం. వి. తద్దినం.

సం. దివస-. రోజు.

<సం. దివస-. (అర్థవిపరి.).

**దివసాడ** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దివసాలు** వి.బ.వ. అపరకర్మలు.

సం. దివస-. రోజు.

<సం. దివస- + -ము + -లు (అర్థవిపరి.).

**దివసోడా** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దివాణపుఅమ్మవారు** చూ. దివాణము.

**దివాణపువారు** చూ. దివాణము.

**దివాణము** రూ. దివాణ్యం. వి. 1. రాజభవనం. హర. 5.9 ; 2. సభాస్థానం. ఆము. 2.88 ; 3. న్యాయస్థానం, ప్రభుత్వం. ద.హిం.శా.సం. 754. క్రీ.శ. 1602 ; 4. సచివాలయం.

సం. దేవాయన-. గుడి ; ప్రా. దేవాణ- ; హిం. దీవాన్. సచివాలయం, దీవానేఆమ్ ; ఉ. దీవానేఆమ్. దర్బారు జరిగే స్థానం ; పార. దివాన్. అమాత్యుడు, అమాత్యులుండే ప్రదేశం ; మరా. దివాణ- ;

క. దివాణ.

<మరా. దివాణ-.

**దివాణపుఅమ్మవారు** వి.బ.వ. ప్రభుత్వంవాళ్ళు వేయించే అమ్మవారు, టీకాలు. **దివాణపువారు** విణ.బ.వ. రాజు కొలువుకూటంలోనివారు, రాజభృత్యులు. శుక. 2.406.

**దివాణ్యం** రూ.చూ. దివాణము. వి. రాజదర్బారు, సభాస్థానం.

ద.హిం.శా.సంపు. 4. శా.సం. 711.

**దివాన్** రూ.చూ. దివాను. వి. జమీందార్ల పాడుపాలు మొ॥ వారివద్ద వ్యవహారాల్ని చూసే ఉద్యోగి.

**దివానిగిరి** వి. మంత్రిపదవి.

ఉ.పార. దీవాన్‌గిరి.

<ఉ. దీవాన్‌గిరి.

**దివానిబంధము** వి. దివియనిబంధం. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 1090. క్రీ.శ. 1388.

సం. దీప-. దీపం, నిబంధ-. ఏర్పాటు ; ప్రా. దీవ-.

<ప్రా. దీవ- + సం. నిబంధ-.

**దివానీ** రూ.చూ. దివాను. వి. మంత్రి, వజీరు. విశ్వే.శ.

**దివాను** రూ. దివాన్, దివానీ, దివానుడు. వి. రాజోద్యోగి, మంత్రి, వజీరు. రా.చ. ; పద్మ.యు. 40.

హిం. దీవాన్. మంత్రి, వజీరు, ప్రధానుడు ; మరా. దివాణ. ప్రధానమంత్రి ; ఉ. దీవాన్. మంత్రి, వజీరు ; పార. దీవాన్. రాజాస్థానం, న్యాయాలయం ; అర. దైవాన్.

<ఉ. దీవాన్.

**దివానుఖానా** రూ.చూ. దివాన్‌ఖానా. వి. సచివాలయం.

**దివాను(డు** రూ.చూ. దివాను. వి. మంత్రి, వజీరు. పద్మ.యు. 16.59.

**దివాన్‌ఖానా** రూ. దివానుఖానా. వి. సచివాలయం.

హిం.ఉ.పార. దీవాన్‌ఖానా. సచివాలయం.

<ఉ. దీవాన్‌ఖానా.

**దివాలా** వి. వ్యవహారం చెడి కలిగే నష్టం.

బెం. దేవులియ ; హిం. ఉ. దివాలా ; మరా. దివాళేం. దివాలా.

< ఉ. దివాలా.

దివాలాకోరు వి. దివాలా తీసినవాడు. **దివాలాతీయు** అ.క్రి. వ్యవహారంలో వచ్చిన నష్టంతో ధనమంతా పోగొట్టుకొని చేసిన అప్పులు తీర్చలేకపోవు.

**దివి**[1] రూ.చూ. దీవియ. వి. దీపం. ద్రాక్షారామ శాసనం, రామచంద్రపురం తా॥, తూ॥గో॥ జిల్లా. క్రీ.శ. 1092.

**దివిగూడు** రూ.చూ. దివెగూఁడు. వి. దెవ్వెగూడు. **దివిదారికొమ్ము** రూ.చూ. దివెదారికొమ్ము. వి రెండు ఇర్రి కొమ్ములు జతచేసి ఏర్పరచిన ఆయుధ విశేషం, సింగోట. ఆం.భా. 2.206. **దివిదార్కొమ్ము** రూ.చూ. దివెదారికొమ్ము. వి. రెండు ఇర్రికొమ్ములు జతచేసి ఎర్పరచిన ఆయుధ విశేషం, సింగోట.

**దివి**[2] వి. స్వర్గం.

సం. ద్యు-. స్వర్గం, దివి. స్వర్గంలో ; ప్రా. దివ్వ-. దేవసంబంధమైన, దివ-. స్వర్గం.

< ప్రా. దివ-.

దివివెలయాలు వి. దేవవేశ్య. చంపూ రా. 2.74.

**దివిటి** రూ.చూ. దివ్వటి. వి. కరదీపం, ఆకాశదీపం. ఆం. భా. 2.165.

**దివిటీ** రూ.చూ. దివ్వటీ. వి. కరదీపిక. సాంబ. తిర్య. 26.

దివిటీగావెలుగు అ.క్రి. ఎక్కువగా ప్రకాశించు. దివిటీ లేకుండవెలుగు అ.క్రి. అతి పటాటోపంతో వెలుగు.

**దివియ** రూ.చూ. దీవియ. వి. దీపం. నిర్వ. రా. 6.39.

దివియకంబము రూ.చూ. దివ్వెకంబము. వి. దీపస్తంభం. భీమ. 3.62. **దివియకాపు** వి. దీపం వెలిగించటానికి నెయ్యి సమకూర్చి ఇవ్వడానికి నియమింపబడ్డ శూద్రుడు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 162. క్రీ. శ. 1148. **దివియకోల** రూ.చూ. దివ్యకోల. వి. దివిటీ. విష్ణుపు. 7.165. **దివియ నిబంధము** వి. దివియ నిబంధం. ద. హిం. శా సంపు. 6. శా. సం. 858. క్రీ. శ. 1362. **దివియలవాఁడు** విఐ. దీపం పట్టుకొన్నవాడు. సారంగ. 3.27.

**దివు** రూ.చూ. డిగ్గు. అ.క్రి. కిందికి వచ్చు. రాఘవ. 2.99.

దివుదీపులాడు అ.క్రి. వెనుకంజవేయు. పండి. చ. 1. 1ప. 178. < దివు + తీపు + -లు + ఆడు.

**దివె** రూ.చూ. దీవియ. వి. దివిటీ. ఆం. భా. 2.164.

దివెకంబము రూ.చూ. దివ్వెకంబము. వి. దీపస్తంభం. శుక. 4.22. **దివెగూఁడు** రూ. దివిగూడు. వి. దీపపు గూడు. బహుళా. 5.129. **దివెదారికొమ్ము** రూ. దివిదారి కొమ్ము, దివిదార్కొమ్ము. వి. దానర్ల దీపస్తంభం, భజన మొ॥ వాటిలో అనేక దీపాలుంచే స్తంభం. ఆము. 6.6. దివెపంజులు వి.బ.వ. దివిటీలు. తాళ్ల. సం. 10.166.

**దివెల** రూ. దివ్వెల. వి. దీపావళి అమావాస్య. దీపాలపండుగ. చెన్నబసవ. 3.161.

సం. దీపావలి-, దీపాలి. ఒకపండుగ, దీపాలవరస ; ప్రా. దివాలి, దీపావలి ; బెం. దిఉయాలి ; ఒ. దిఆలి ; హిం. పం. దివాలి ; సిం. డిఆరీ ; గు. దివాళీ ; క. దివాళి, దీపగిళె ; త. దీవల, దీవళి, దీపాళి ; ఒల్లా. దియాలి,

< ప్రా. దివాలీ.

దివెలపండువ వి. దీపావళిపండుగ.

**దివ్య** రూ.చూ. దీవియ. వి. దీపం. ద. హిం. శా. 1170, ద్రాక్షారామం, రామచంద్రపురం తా॥ తూ.గో. జిల్లా. క్రీ. శ. 1170.

దివ్యఎత్తుబ్రహ్మడు వి. దీపారాధన చేసే బ్రాహ్మణుడు. **దివ్యకోల** రూ. దివియకోల, దివ్వియకోల, దివ్వెకోల. వి. దివిటీ. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1190. క్రీ.శ. 1349. **దివ్యకోలనిబంధము** వి. దివిటీని పట్టుకోడానికి చేయబడ్డ జీవిత ఏర్పాటు. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 768. క్రీ.శ. 1391. **దివ్యటీండు** వి. దివిటీనిపట్టుకొనే వాడు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 740. **దివ్య పాలము** వి. దేవుడి దీపారాధనకు అయ్యే వ్యయాన్ని సమకూర్చటానికి ఇచ్చిన భూమి. ద. హిం. శా. సం. శా. సం. 10.364. క్రీ. శ. 1259. **దివ్యలమైగాపు కొండికాఁడులు** వి.బ.వ. దేవాలయంలోని దివిటీలను. దీపాల్ని శుభ్రపరచి, జాగ్రత్త పరచే సేవకులు. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 1214. క్రీ. శ. 1309. **దివ్యారుపుఁబురువు** రూ. చూ. దివ్యాఱుపుఁబ్రువ్వు. వి. **1**. దీపం ఆర్పేపురుగు ; **2**. దీపం ఆర్పడానికి ఉపయోగించే దొంగల పనిముట్టు. **దివ్యార్పుఁ బురువు** రూ.చూ. దివ్యాఱుపుఁబ్రువ్వు. వి. **1**. దీపం ఆర్పడానికి ఉపయోగించే దొంగల పనిముట్టు. ప్రబంధ. 759 ; 2. దీపం ఆర్పే పురుగు. < దివ్య + ఆర్పు + పురువు. **దివ్యార్పుఁబ్రువ్వులక్రోవి** వి. దీపాల్ని ఆర్పే పురుగుల్నుంచే గొట్టం. **దివ్యాఱుపుఁబురువు** రూ.చూ. దివ్యాఱుపుఁబ్రువ్వు. వి. **1**. దీపం ఆర్పేపురుగు. భార. అను. 4.119 ; **2**. దీపం ఆర్పడానికి ఉపయోగించే దొంగల పనిముట్టు. < దివ్య + ఆరుపు + పురువు. **దివ్యాఱుపుఁబ్రువ్వు** రూ. దివ్యారుపుఁ బురువు, దివ్యార్పుఁబురువు, దివ్యాఱుపుఁబురువు. వి. **1**. దీపం ఆర్పేపురుగు. భార. అను. 4.119 ; **2**. దీపం ఆర్పడానికి ఉపయోగించే దొంగల పనిముట్టు.

**దివ్యదార** వి. క్షీరాభిషేకం. నె. శా. కనిగిరి. 24. క్రీ.శ. 1268.

సం. దివ్య. దేవతాసంబంధమయిన, దారా. ధార.

< సం. దివ్యధారా.

**దివ్యాధార** వి. తైలస్నానం. నె. శా. దరిసిశాసనాలు. 33. క్రీ.శ. 1370.

సం. దివ్య-. దేవతాసంబంధమయిన, ధారా. ధార.

< సం. దివ్యదారా (అర్థవిపరి.).

**దివ్యపున్నమ** వి. శ్రావణపున్నమ. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 775. క్రీ.శ. 1364.

సం. దివ్య-. దేవసంబంధమైన, ఇంపైన.

< సం. దివ్య- + పున్నమ (మిశ్ర.స.).

**దివ్యవిమానం** వి. గర్భగుడి, తిరుపతి దేవస్థాన శాసనం. సంపు. 6. శా. సం. 135.

సం. దివ్యవిమాన-. దైవసంబంధి విమానం.

< సం. దివ్యవిమాన- (అర్థవిపరి.).

**దివ్యారుపు(బురుపు** చూ. దివ్య.
**దివ్యార్పు(బురుపు** చూ. దివ్య.
**దివ్యార్పు(బ్రువ్వుల(క్రోవి** చూ. దివ్య.
**దివ్యాఋపు(బురుపు** చూ. దివ్య.
**దివ్యాఋపు(బ్రువ్వ** చూ. దివ్య.
**దివ్వ** రూ.చూ. దీవియ. వి. దీపం.

**దివ్వదండి** రూ. దివదండి, దివ్వెదండి. వి. ప్రమిదెలు పెట్టుకోడానికి జానెడెత్తుగా ఉండే మట్టిదిమ్మె. **దివ్వసాడా** రూ. చూ. దీసోడా. వి. దీపస్తంబం. **దివ్వసోడా** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంబం.

**దివ్వటి** రూ. చూ. దివ్వటీ. వి. కరదీపిక, ఇనపకడ్డీకి గుడ్డలు చుట్టి వెలిగించే దీపం. ఉ. రా. 6.44.

**దివ్వటీ** రూ. దివటి, దివటీ, దివిటి, దివిటీ, దివ్వటి, దివ్విటి, దివ్విటీ, దివ్వెటి, దివ్వెటీ, దీటి, దీవటి, దీవటీ, దీవిటి. వి. కరదీపిక, ఇనపకడ్డీకి గుడ్డలు చుట్టి వెలిగించే దీపం. కృష్ణ. రా. 4.116.

సం. *దీపవర్తి*. కాగడా, దివిటీ; ప్రా. *దీవట్టి*, *దీవఆ*; పం. *దిఉటా*; బెం. *దిఉటీ*; ఒ. *దిహుటీ*; హిం. *దివటు*; పం. *దిఅటీ*; గు. *దివేటు*;

క. *దేవటి*. కాగడా; తు. *జీటిగె*, *దీటిగె*, *దేవఔ*; కువి. *దివిడి*.

<ప్రా. దీవట్టి.

**దివ్వటీకిదీపమగు** అ.క్రి. దిగదుడుపగు. **దివ్వటీ(డు** వి. దీపం పటుకొనేవాడు. బసవ. 2.466. **దివ్వటీలవా(డు** విణ. దివ్వెలవాడు. చెన్నబసవ. 5.4.

**దివ్వలు** వి.బ.వ. దసరాకు చేసే ఉత్సవం.
**దివ్విటి** రూ.చూ. దివ్వటీ. వి. దీపం.
**దివ్విటీ** రూ.చూ. దివ్వటీ. వి. దీపం. చెన్న. వి. 5.12
**దివ్వియ** రూ.చూ. దీవియ. వి. దీపం. అం.భా. 2.164.

**దివ్వియకంబము** రూ.చూ. దివ్వెకంబము. వి. దీపస్తంభం. విక్ర. 6.40. **దివ్వియకోల** రూ.చూ. దివ్యకోల. వి. కాష్ఠదీపిక. అం.భా. 2.165.

**దివ్వె** రూ.చూ. దీవియ. వి. దీపం. భార. విరా. 3.4.

**దివ్వెకదుపులు** వి.బ.వ. గొర్రెలమంద. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 527. క్రీ.శ. 1829. **దివ్వెకంబము** రూ. దివియకంబము, దివెకంబము, దివ్వియకంబము, దివ్వెగంబం, దీవికంబము, దీవియకంబము. వి. దీపస్తంభం. విక్ర. 6.38. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 451. క్రీ.శ. 1280. **దివ్వెకోల** రూ.చూ. దివ్యకోల. వి. దివిటీ. గా. హరి. ఉ. 1667. పం. **దివ్వెగంబం** రూ.చూ. దివ్వెకంబము. వి. ప్రమిద పట్టుకోడానికి చేసినట్టి ఎత్తైన మట్టిదిమ్మ. **దివ్వెగావము** వి. దీపారాధన నిమిత్తం నూనెకొరకు ఇచ్చిన గానుగ. ద.హిం. శా.సంపు. 10. శా.సం. 527 క్రీ.శ. 1329. **దివ్వెచమురు** వి. స్నేహం. సాంబ. మాన. 47. **దివ్వెదండి** రూ.చూ. దివ్వదండి. వి. ప్రమిదలు పెట్టుకోడానికి జానెడెత్తుగా ఉండే మట్టిదిమ్మె. **దివ్వెనకోల** వి. కాష్ఠదీపిక. ఆం.భా. 2.165. **దివ్వెయార్పు** వి. మిడత, దీపాల్ని ఆర్పేది. **దివ్వెయెత్తు(-ఎత్తు)** స.క్రి. 1. దీపంపెట్టు. తాళ్ల. సం. 189; 2. కాపురం నిలబెట్టు. **దివ్వెలపండుగ** వి. దీపావళి. చెన్న. వి. 3.115. **దివ్వెలమాసం** రూ.చూ. దివ్వెలయమాస. వి. దీపావళి. **దివ్వెలయమాస(-అమాస)** రూ. దివ్వెలమాసం. వి. దీపావళి అమావాస్య. చెన్నబసవ. 3.144. **దివ్వెలవా(డు** విణ. దివ్వటీలవాడు. చెన్నబసవ. 5.6. **దివ్వెలెత్తు** స.క్రి. దీపాలు పెట్టు. శుక. 2.561. <దెవ్వె + - లు + ఎత్తు[1]. **దివ్వెసుడి** వి. గోడలో దీపంపెట్టేగూడు, దీపస్తంభం.

**దివ్వెటి** రూ.చూ. దివ్వటీ. వి. దివిటీ. సాంబ. తిర్య. 26.
**దివ్వెటీ** రూ.చూ. దివ్వటీ. వి. కరదీపిక. దశా. 7.1.251.
**దివ్వెల** రూ.చూ. దివెల. వి. దీపావళి అమావాస్య, దీపాల పండుగ. చెన్న బసవ. 3.163.
**దిశంచు** రూ.చూ. దిసంచు. వి. పెద చీల్చకుండా లోపల పిళి ఉంటూ మందంగా కడెంలాగా పాత్రలకు పెట్టేఅంచు.
**దిశవంటి** వి. మూతి కొద్దిగాఉండి పూజలులేని గుండ్రటి మట్టి పాత్ర.

సం. *దిశా*. దిక్కు.

**దిశమూకుడు** రూ.చూ. దిశెమూకుడు. వి. ఒకరకం మట్టి పాత్ర.
**దిశాపట్టము** క్రి.విణ. దిక్కులకు పారేటట్లుగా, చెల్లాచెదరయ్యేటట్లుగా. ఉ.హరి. 1.91.

క. *దిశాపటు*. పారిపోవటం.

**దిశాపట్టముగాఏగు** అ.క్రి. దిక్కులుపట్టిపోవు. కాందిశీకుడగు. ఉ.హరి. 1.97. **దిశాపట్టంబుగావించు** స.క్రి. దిక్కులుపట్టించు (అనగా తరిమివేయు). ఉ.హరి. 1.91.

**దిశాపట్టంబుగావించు** చూ. దిశాపట్టము.
**దిశికుండ** వి. గుండ్రంగా ఉండే సాదా మట్టిపాత్ర.

సం. *దిశా*. దిక్కు.

<సం. దిశా + కుండ.

**దిశిచిప్ప** రూ. దిశిసిప్ప. వి. గుండ్రంగా అంచుబోడిగా ఉండే మట్టిచిప్ప.

సం. *దిశా*. దిక్కు.

<సం. దిశా + చిప్ప.

**దిశిపిడత** వి. వెలపల భాగం అంచు రెండుగా చీల్చి మూడు ఉండే సాదా మట్టిపాత్ర.

సం. *దిశా*. దిక్కు.

<సం. దిశా + పిడత.

**దిశిమూకుడు** రూ.చూ. దిశెమూకుడు. వి. ఒకరకం మట్టిపాత్ర.
**దిశిసిప్ప(-చిప్ప)** రూ.చూ. దిశిచిప్ప. వి. గుండ్రంగా అంచు బోడిగాఉండే మట్టిచిప్ప.
**దిశెమూకుడు** రూ. దిశమూకుడు, దిశిమూకుడు, దిసమూకుడు. వి. చుట్టూ సాదాగా అంచు చదరంగాఉండి పాత్రలపై మూతపెట్టుకోడానికి వాడే మట్టిపాత్ర.
**దిష్టి** రూ.చూ. దిస్టి. వి. చెడుచూపు.

**దిష్టికడవ** రూ. జిట్టికడవ. వి. దిష్టితీయడానికి వాడే మట్టిపాత్ర. **దిష్టికండ్లు** వి.బ.వ. చెడుకళ్ళు, దృష్టిదోషం తగిలేది. **దిష్టికుండ** రూ. జిష్టికుండ, దిట్టికుండ, దిస్టికుండ, దిస్తికుండ, దుష్టికుండ. వి. పంటకు దిష్టితగలకుండా ఉండ

టానికి సున్నపుబొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ. దిష్టికొట్టు రూ. దిస్టికొట్టు. అ.క్రి. దృష్టిదోషం తగులు. దిష్టితీయు రూ. దిష్టిదీయు, దిస్టితీయు. స.క్రి. దృష్టిదోషం తొలగటానికి మిరపకాయలు మొదలైనవి దిగదుడుచు. దిష్టిదీయు రూ.చూ. దిష్టితీయు. స.క్రి. దిష్టిదోషానికి ఎర్రనీళ్ళు దిగదుడిచేయు. దిష్టిపిడత రూ.చూ. దిస్టిపిడుత. వి. దృష్టితగలకుండ ఉండడానికి తోటల్లోగాని, ఇండ్లముందుగాని పెట్టే వికారపుబొమ్మ. దిష్టిపిడతలు వి.బ.వ. నిష్ప్రయోజకులు, దృష్టిదోషం తగలకుండా ఉండటానికి పెట్టే పిడత అని వాచ్యార్థం. దిష్టిబొచ్చె వి. దిష్టితీయడానికి వాడే మట్టిపాత్ర. దిష్టిబొమ్మ రూ. జిష్టిబొమ్మ, దిసిబొమ్మ. వి. దృష్టిదోషం తగలకుండా పెట్టే బొమ్మ.

దిస రూ.చూ. దెన[1]. వి. దిక్కు.

దిసంచు చూ. దెన. రూ. దిశంచు. వి. పెడచీల్చకుండా లోపల పిశిఉంటూ మందంగా కడెంలాగ పాత్రలకు పెట్టే అంచు.

దిసటికె వి. పూజలు పెట్టకుండ అంచు చీల్చిఉండే సాదా మట్టిపాత్ర.

దిసంతడుచు చూ. దిసంతు.

దిసంతు వి. అపవాదం, నింద. ఆం.భా. 1.115.

ప్రా. *దీసంత*. అవలోకించు ; అ.మా. *దీసంతి* ; మా. *దీశంతో* ; శౌ. *దీసంత*.

దిసంతడుచు స.క్రి. నిందించు. పరమ. వి. 3.271. దిసంతుకొట్టు స.క్రి. నిదించు. కళా. 6.106. దిసంతులడుచు స.క్రి. నిందించు. విజయ. 2.16. దిసంతులుగొట్టు (-కొట్టు[1])అ.క్రి. దూషించు, కేరింతలుకొట్టు. మను.3.109.

దిసమూకుడు రూ.చూ. దిశెమూకుడు. వి. చిల్లులులేక మట్టితో చేయబడ్డ మూత.

దిసమొల రూ. దిస్సమొల, దెనమొల. విణ. నగ్నమైన, దిగంబరమైన. భీమ. 3.120 ; వి. వస్త్రవిహీనమైన మొల.

దిసమొలవాఁడు రూ.చూ. దిస్సమొలవాఁడు. విణ. వస్త్రవిహీనమైన మొలగలవాడు, దిగంబరుడు. దిసమొలవేల్పు రూ.చూ. దిస్సమొల వేల్పు. వి. **1**. కాలభైరవుడు. కవిరాజ. 2.82 ; **2**. శివుడు.

దిసాయించు చూ. దిసించు. స.క్రి. లెక్కబెట్టు.

హిం. *దిస్‌నా*. కనిపించు, *దిసానా*. చూపు.

< హిం. దిసా(నా) + - ఇంచు[3].

దిసాల వి. రెండువైపులా గదులుండి 'L' ఆకారంలో ఉండే ఇల్లు.

సం. ద్విశాలా. రెండు చావడులు.

< సం. ద్విశాలా.

దిసాల వి. రెండువైపులా గదులుండి 'L' ఆకారంలో ఉండే ఇల్లు.

సం. ద్విశాలా. రెండు చావడులు.

< సం. ద్విశాలా.

దిసించు అ.క్రి. కనపడు, గోచరమగు. సారంగ. 2.38 ; స.క్రి. **1**. మీరు, మించు. ముకుంద. 1.29 వ. 2పం ; **2**. దృష్టిని ఆకర్షించు.

సం. *దృశ్*. కనపడు ; ప్రా. *దిస్స*. కనపడు.

< ప్రా. దిస్స- + -ఇంచు[3].

దిస్టి రూ. జిస్టి, దిష్టి. వి. **1**. దృష్టి, చూపు. సాంబ. మాన. 15 ; **2**. దృష్టిదోషం, కినరు.

సం. *దృష్టి*. చూపు ; ప్రా. *దిట్ఠి*- ; కుమా. *దీఠ్*, *దీఠ్*. చూపు, అనూయా దృష్టి ; నే. *డిఠ్*. చూపు ; అ. *దిఠక్*, *డిఠక్* ; హిం. *దీఠ్*, *దీఠీ* ;

క. *దిష్ఠి*.

దిస్టికుండ రూ.చూ. దిష్టికుండ. వి. పొలాల్లో, వచ్చిపోయే వాళ్ళు, దిస్టి సోకకుండా సున్నం పూసి పైన నల్లటి మసి చుక్కలు పెట్టిన ఓటికుండ. దిస్టికొట్టు రూ.చూ. దిష్టికొట్టు. అ.క్రి. దృష్టిదోషం కలుగజేయు. దిస్టితీయు రూ.చూ. దిష్టితీయు. స.క్రి. దృష్టిదోషం పోవటానికి మిరపకాయలు మొ. దిగదుడుచు. దిస్టిపిడుత రూ. దిష్టిపిడత. వి. సస్యాదులకు దృష్టిదోషం తగలకుండా ఉండటానికి సున్నపు బొట్టు పెట్టిన పిడత. దిస్టిబొమ్మ రూ.చూ. దిష్టిబొమ్మ. వి. సస్యాదులకు దృష్టిదోషం తగలకుండా ఉండటానికి గడ్డి మొ. వాటితో మనిషి ఆకారంగా చేసి వేలాడ దీసిన బొమ్మ.

దిస్తికుండ రూ.చూ. దిష్టికుండ. వి. దిష్టి తగలకుండా పొలంలో నిలబెట్టే ఒకరకం కుండ.

దిస్స రూ.చూ. దెన[1]. వి. దిక్కు.

దిస్సపోవు అ.క్రి. వ్యర్థమగు. దిస్సమొల రూ.చూ. దిసమొల. విణ. నగ్నమైన. కాశీ. 2.38 ; వి. వస్త్రవిహీనమైన మొల. ఘటికా. 1.128. సం. *దృశ్య*-. దిశా ; ప్రా. *దిస్స*, *దిస్సా* ; అ.మా. *దిస్స*. కనిపించెడి. చూ. *దిదిస్స*. చూడ యోగ్యమైంది. < ప్రా. దిస్సా. దిస్సమొలదేవుఁడు వి. ఈశ్వరుడు. ధరా.ప. 2.55. దిస్సమొలయ్యవారు విణ. బ.వ. కాలభైరవుడు. సుద. 3.167. దిస్సమొలవాఁడు రూ. దిసమొలవాఁడు. విణ. బట్టలు లేని మొల కలవాడు. పాండు. 1.213. దిస్సమొలవేల్పు రూ. దిసమొలవేల్పు, దెసమొలవేల్పు. వి. **1**. శివుడు, కాశీ. 2.38 , **2**. వస్త్రవిహీనమైన మొల కలవాడు, కాలభైరవుడు. రామాభ్యు 2.21.

దిస్సు వి. నవ్వటం, పాము బుసకొట్టడం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. క్రీడా. 78.

దిస్సువారఁగనవ్వు అ.క్రి. తుస్సుమని నవ్వు, దెసలు పారగా నవ్వు.

దీ రూ. డీ, డి. అవ్య. **1**. పందెగాళ్ళు పొట్టేళ్ళని పోట్లాటకై ప్రేరించే మాట. క్రీడా. 228 ; **2**. ఎద్దును అదిలించడానికి వాడే మాట.

దీకు రూ. డీకు. వి. **1**. ప్రేరణ, పురికొల్పటం. భార. విరా. 5.91 ; **2**. చిక్కు, కష్టం. భాగ. 6.421. త. తింకు. చిక్కు, దురదృష్టం, తప్పు. దీకొను రూ. డీకొను. అ.క్రి. ఉత్సహించు, పూనుకొను, సిద్ధపడు. భార. విరా. 5.91 ; స.క్రి. చేయపూను. భాస్క.రా.ఆరణ్య. 2.14 ; అ.క్రి. స.క్రి. **1**. ఎదిరించు, మార్కొను. భాగ. 6.275, కాశీ. 6.233 ; **2**. (పొట్టేళ్ళ పోరిలో) ఒకదానినొకటి తాకు. ప్రబంధ. 86. దీకొలుపు రూ. డీకొలుపు,

డీకొల్పు, దీకొల్పు. స.క్రి. 1. ఎదుర్కొనేటట్టుచేయు, కవియచేయు. భాస్కరా.యు. 683 ; 2. పురికొల్పు, ప్రేరేపించు. దీకొల్పు రూ.చూ. డీకొలుపు. స.క్రి. 1. ఎదుర్కొనేటట్టుచేయు, కవియచేయు. దశా. 4.184 ; 2. పురికొలుపు, ప్రేరేపించు. హంస. 2.170. దీకోలు రూ. డీకోలు. వి. డీకొనటం.

దీక్షగడిచీర వి. 1. నలుపు, కెంపురంగుల మధ్య రేలపువ్వు రంగు గీరపడేటట్టు అడ్డం, నిలువు నేసిన చీర ; 2. ఆరు కొలుకులకు ఒక కొలికి రంగు పోగులు వచ్చేట్టు నేసిన గళ్ళచీర.

దీగూడు రూ. దిగుడు², దిగూడు, దియగూడు, దియ్యగూడు, దీగోడు వి. దీపం పెట్టుకొనే గూడు.

నం. దీప-. దీపం ; ప్రా. దీవ-.

<నం. దీప- + గూడు.

దీగోడు రూ.చూ. దీగూడు. వి. దీపం పెట్టుకొనే గూడు.

దీటి రూ.చూ. దివ్వటి. వి. దివిటీ.

దీటు రూ. తీడు, తేడు. స.క్రి. 1. సరిచేయు, సవరించు, చక్కబరచు, ఆకర్షించు. నృసింహ. 2.86 ; 2. కరుచు (కోపాదుల చేత పెదవి మొ. పళ్ళతో) కొరుకు. (ఈ అర్థంలో ఇది ఔడు, 'రదము,' 'కోఱ' మొ. పదాలతో కలిసే కనబడుతోంది). భాస్క.రా. సుందర. 344, రం.రా. యు. 330 పు. 25. పం ; 3. ఊపు, చలింపజేయు. ఉ.హరిశ్చ. 2.128 ; విశ. 1. సరైన, సమానమైన. ఇందు. 6.136 ; 2. అర్హమైన, తగిన. ఇందు. 2.157 ; వి. విధం, రీతి. రసిక. 6.100 ; క్రి.విశ. తిన్నగా, సూటిగా. నీలా. 3.64.

క. దీటు. సమానమైన, తగిన, అర్హమైన, తీడు. నొక్కు, లాగు, పొడుంలాగ వేళ్ళతో నలుపు ; కొడ. తీట్ (తీటి). పాము ; తు. తీడుని. రుద్దు, నొక్కు, చింటుని, తింటుని, సింటుని ; త. తీట్టు(తీట్టి). పదునుపెట్టు, పాము, తీఱ్ఱు. రాయు, పదునుపెట్టు ; కో. తి-ట్ (తిచ్). రంగువేయు, పాము (ద్రవం) ; కొలా. దాసినదిత్. పళ్ళు, నూనెదిత్. నూనెరాయు ; నా. ధీట్. తుడుచు.

మూ.ద.ద్రా. *తీంట్/*తీట్ట్.

దీటుకట్టు అ.క్రి. నిండు. శృం.నై. 6.29. దీటుకొను అ.క్రి. 1. నిండు. కు.సం. 11.110 ; 2. ఒప్పు. పండి.చ. 1.17 ; 3. కలుగు, పుట్టు. నిర్వ.రా. 2.22 ; 4. వ్యాపించు. భార.ద్రోణ. 1.132 ; 5. అతిశయించు. జైమినిభా. 5.86 ; స.క్రి. సరిచేసికొను. రామాభ్యు. 5.199. దీటుకొలుపు రూ. దీటుకొల్పు. స.క్రి. 1. పరగ జేయు. భార.ఉద్యో. 4.229 ; 2. దీటుకొనుజేయు, నిండుకొనజేయు, వ్యాపింపజేయు. నృసింహ. 1.75, భీమ. 4.193 ; 3. పుట్టించు, కలిగించు. ఆము. 4.35. దీటుకొల్పు రూ.చూ. దీటుకొలుపు. స.క్రి. అతిశయింపచేయు. భార. భీష్మ. 3.248. దీటుపడు స.క్రి. పోలు. దీటువచ్చు స.క్రి. పోలు. రామరా. 196 ; అ.క్రి. సమమగు. ఉ.రా. 4.156.

దీను వి. మనోజ్ఞత, చక్కదనం.

దీనుమిగులు అ.క్రి. ఒప్పు. పాండు 2.144.

దీనేత రూ. దిగునేత, దియ్యనేత. వి. రాత్రివేళ దీపం పెట్టుకొని నేసే నేత.

నం. దీప-. దీపం ; ప్రా. దీవ-.

<నం. దీప- + నేత.

దీపంఇనాం వి. దేవాలయంలో దీపం పెట్టే వారికిచ్చే ఇనాం.

నం. దీప-. దీపం ; ఉ. ఇనామ్. బహుమతి.

<నం. దీప- + ఉ. ఇనామ్.

దీపకంభములు వి.బ.వ. దీపస్తంభాలు. పండి.చ. 1.1 పు. 199.

నం. దీప-. దీపం, స్తంభ-. స్తంభం ; ప్రా. ఖంభ-.

<నం. దీప- + కంబము + -లు (మిశ్రస.).

దీపకలిశం వి. సాంబ్రాణి పొగవేయడానికి వాడే మట్టిపాత్ర.

నం. దీప. దీపం, కలశ-. కుండ, పాత్ర.

<నం. దీపకలశ-.

దీపగంబము (-కంబము) రూ.చూ. దీపగంభము. వి. దీపస్తంభం. బసవ. 1.123.

దీపగంభము రూ. దీపగంబము. వి. దీపస్తంభం. ద. హిం. కా. సం. 5.139. క్రి.శ. 1207.

నం. దీప-. దీపం, స్తంభ-. స్తంభం ; ప్రా. ఖంభ-.

<నం. దీప- + ప్రా. ఖంభ- + ము.

దీపంకంచుడు వి. మూకుడు లాగ ఉండే కంచుడు.

నం. దీప-. దీపం.

దీపంగూడు వి. దీపం పెట్టుకొనే గూడు.

నం. దీప-. దీపం.

నం. దీప- + -ము + గూడు.

దీపదండము వి. దీపస్తంభం. ద. హిం. కా. సంపు. 10. కా. సం. 560. క్రి.శ. 1283.

నం. దీప-. దీపం, దండ-.

<నం. దీప- + సం. దండ- + ము.

దీపంత రూ.చూ. దీపప్రమిద. వి. దీపం వెలిగించే మట్టిపళ్ళెం.

దీపంతె రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్న మట్టి పళ్ళెం.

దీపంనిలుపు స.క్రి. ఆపదలో ఆదుకొని కుటుంబాన్ని నిలుపు.

నం. దీప-. దీపం.

<నం. దీప- + -ము + నిలుపు.

దీపప్రమిద రూ. దీపంత, దీపంతె, దీపప్రమిదె, దీపమిదె, దీపం పంతె, దీపయిద, దీపాంతి, దీపాంతె, దీపాందె, దీప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్నమట్టి పళ్ళెం.

నం. దీప-. దీపం.

<నం. దీప- + ప్రమిద. (మిశ్ర.స.)

దీపప్రమిదె రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

దీపమిదె రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్నమట్టి పళ్ళెం.

దీపముకొండెక్కు అ.క్రి. దీపం ఆరిపోవు.

నం. దీప-. దీపం.

<నం. దీప- + -ము + కొండ + ఎక్కు.

**దీపముఘనముచేయు** స.క్రి. దీపమార్పు.
సం. దీప-. దీపం. ఘన-. గొప్ప.
<సం. దీప-+-ము+-ఘన-+ము+చేయు.

**దీపముపెద్దచేయు** స.క్రి. దీపమార్పు.
సం. దీప-. దీపం.
<సం. దీప-.+-ము+పెద్దచేయు.

**దీపమెత్తు** స.క్రి. దీపంపెట్టు. ఉ. హరి. 2.144.
సం. దీప-. దీపం.
<సం. దీప-+-ము+ఎత్తు.

**దీపంపంతె** రూ.చూ. దీపప్రమిద. వి. దీపం పెట్టేగూడు.

**దీపంపెట్టు** స.క్రి. ఇల్లునిలుపు.
సం. దీప-. దీపం.
<సం. దీప-+-ము+పెట్టు.

**దీపంబుడ్డి** వి. తాంబ్రేలు రేకుతో చేసిన బుడ్డిలో వెలిగించిన దీపం.
సం. దీప-. దీపం.
<సం. దీప-+-ము+బుడ్డి.

**దీపయిద** రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

**దీపాంతాంచు** చూ. దీపాంతి.

**దీపాంతి** రూ.చూ. దీపప్రమిద. వి. ప్రమిదె.
**దీపాంతాంచు** వి. దీపంప్రమిద ఆకారంలో పాత్రలకు పెట్టిన అంచు. <దీపాంతి+అంచు[3].

**దీపాంతె** రూ.చూ. దీపప్రమిద వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్నమట్టి పళ్ళెం.

**దీపాందె** రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసివత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్న మట్టి పళ్ళెం.

**దీపారజన** రూ.చూ. దీపారాదన. వి. దీపారాధన.

**దీపారాజన** రూ.చూ. దీపారాదన. వి. దీపారాధన.
**దీపారాజనమూకుడు** వి. దీపారాధనకు వాడే రెండంచుల మట్టిమూకుడు.

**దీపారాజ్జం** రూ.చూ. దీపారాదన. వి. దీపారాధన.

**దీపారాజ్యం** రూ.చూ. దీపారాదన. వి. దీపారాధన.

**దీపారాదన** రూ. దీపారజన, దీపారాజన, దీపారాజ్జం, దీపారాజ్యం. వి. దీపారాధన.
సం. దీపారాధన-. దీపాలచే పూజించటం.
<సం. దీపారాధన-.
**దీపారాదన కంచుడు** వి. దీపారాధనకు వాడే రెండంచుల మట్టిమూకుడు. **దీపారాదనకుండ** వి. కార్తీకం, పుష్య మాసాల్లో ధ్వజస్తంభానికి దీపం పెట్టి కట్టేకుండ.

**దీపారతి** వి. దీపం పెట్టే పళ్ళెం. ద. హిం. కా. సంపు. 10. కా. సం. 215.
సం. దీప-. దీపం.
<సం. దీప-+ఆరతి (మిశ్రస.).

**దీపాలమాస** వి. దీపావళి పండుగ.
సం. దీప-. దీపం.
<సం. దీప-+-ము+-లు+-అ+అమాస.
**దీపాలమాసబుడ్డి** వి. చిచ్చుబుడ్డి, బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగ పొడుగ్గా అడుగున రంధ్రపెట్టి చేసిన మట్టి బుడ్డి.

**దీపాల్‌నాగమ్మ** వి. మొక్కుబడి ఉండే వాళ్ళు కన్యకల (ఏడుగురు అక్కదేవతలు) కు ముందుపెట్టే మట్టిబొమ్మ.

**దీపురము** విశ. ప్రకాశించేది. హంస. 5.93.
సం. ద్రీప-. దీపించేది ; ప్రా. దిప్ప-. తేజస్వి.
<సం. దీప్ర-.

**దీపెపుమూకుడు** వి. జాతర్లలో వాడే సన్నని మూకటి.
సం. దీప-. దివ్వె.
<సం. దీప-+-ము+మూకుడు.

**దీప్రమిద** రూ.చూ. దీపప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం వెలిగించడానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

**దీబూసి** వి. బోసితనం.

**దీబెగడ్డ** వి. పెడగడ్డి కలిపి పోసిన ఎరుపుకుప్ప.
సం. ద్వీప-. దీవి ; ప్రా. దీవ-.

**దీమము** రూ. దిమము, దీము. వి. 1. పశుపక్ష్యాదుల్ని వశం చేసుకోడానికేర్పరచిన పశుపక్ష్యాదికం. కు.సం. 5.23 ; 2. బోనులో ఎరగా ఉంచిన పదార్థం. విక్ర. 1.79 ; 3. ఎర ఉంచిన బోను. పి.శకు. 1.116 ; 4. గృహం. ఆం.భా. 2.13.
సం. దీపక-. పక్షిమృగాదుల్ని పట్టుకోడానికి వేటకాడు పెంచిన పక్షి, మృగం లోనైనది ; ప్రా. దీవఓ. దీపింప చేసేది.
<ప్రా. దీవఓ.
**దీమములొడ్డు** అ.క్రి. పక్షిమృగాదుల్ని వశపరచుకోడానికై వేటగాళ్ళు పక్షిమృగాలు, ఎరలు, బోనులు, వలలు మొదలైనవి పన్ను. <దీమము+-లు+ఒడ్డు[1].

**దీమసము** యా. దీవసము. వి. 1. ఉపాయం, నేర్పు. భార. విరా. 2.91 ; 2. ధైర్యం. హరి. ఉ. 3.97 ; 3. పూనిక, యత్నం. విక్ర. 2.182 ; 4. (పనుల్లో) ఉత్సాహం, కార్యోద్యోగం. ఉ.రా. 1.201.
సం. ధీవశ-. బుద్ధికి వశమైనది ; ప్రా. ధీవస-; క. దీవస. ధైర్యం.
<ప్రా. ధీవస-.
**దీమసముగైకొను(-కైకొను)** అ.క్రి. ధైర్యం వహించు. వర.రా.యు.పు. 5 పం. 17.

**దీము** రూ.చూ. దీమము. వి. 1. పశుపక్ష్యాదుల్ని వశం చేసుకోడానికి ఏర్పరచిన పశుపక్ష్యాదికం. కు.సం. 6.17 ; 2. ఆకర్షకం, ఎర. శృం.నై. 3.92 ; 3. స్థానం, నెలవు. శ్రీరం. మూ. 3.130 ; 4. మత్స్యగ్రహణ సాధన విశేషం. హంస. 4.184 ; 5. గృహం. ఆం.భా. 2.13.
**దీముకొను** అ.క్రి. నెలకొను. **దీముకొలుపు** రూ.చూ. దీముకొల్పు. స.క్రి. నెలకొలుపు. **దీముకొల్పు** రూ. దీముకొలుపు. స.క్రి. నెలకొల్పు. రంగా. చ. 1.31.

**దీల** చూ. దీలు.

**దీలపోవు** చూ. దీలు.

**దీలు** రూ.చూ. డీలు[1]. అ.క్రి. 1. డిల్లపడు, బలహీనమగు, యయా. 5.115 ; 2. ఊడు, ఊడిపడు. కువ.చ. 2.146 ;

విణ. డిల్లం, బలహీనమైన.

దీల వి. డిల్లపడటం, సత్వహీనమవటం. **దీలపోవు** అ.క్రి. డిల్లపడు, సత్వహీనమగు. భార. ఆది. 8.205. **దీలుపడు** రూ.చూ. డీలుపడు. అ.క్రి. బలహీనమగు, దుర్బలమగు, కృశించు. భీమ. 4.109. **దీలుపాటు** వి. దౌర్బల్యం. శృం.నై. 7.52.

**దీవటి** రూ.చూ. దివ్వటీ. వి. కరదీపిక. దశా. 7.2.173.

**దీవటీ** రూ.చూ. దివ్వటీ. వి. కరదీపిక. ఆం.భా. 2.165.

**దీవణం** వి. ప్రకాశం.

సం. దీపన-. ఉద్దీపకం; ప్రా. దీవణా. ప్రకాశం; అ.మా. దీవణ-, దీవణా.

<ప్రా. దీవణా.

**దీవన** చూ. దీవించు. రూ. దీవెన. వి. ఆశీర్వాదం, ఆశీర్వచనం. భార. ఆది. 4.17.

సం. దీపన-. రగుల్కొల్పేది, ప్రేరేపించేది, ప్రకాశింపచేయటం; ప్రా. దీపణ-. ప్రకాశనం.

<ప్రా. దీవణ-.

**దీవన(బ్రాలు(-బ్రాలు)** రూ. దీవెన(బ్రాలు. వి.బ.వ. ఆశీర్వచనాక్షతలు. పారి. 2.36. **దీవనలిచ్చు** స.క్రి. ఆశీర్వదించు. రుక్మా. 4.7. <దీవన + -లు + ఇచ్చు.

**దీవసము** రూ.చూ. దీమసము. వి. 1. ఆలోచన, అభిప్రాయం. భార. విరా. 3.137; వి. ఉపాయం. దశకు. 6.127.

**దీవి**[1] వి. 1. నీటినడిమి దిబ్బ, ద్వీపం, స్థానం. భార. ద్రోణ. 1.26; 2. లంక, రావణుని పట్నం. అచ్చ.రా.యు. 4.37.

సం. ద్వీపః; ప్రా. దీవ-. దీవి; అ.మా. దీవ-; పా. దీప;

క. దీప, దీవి; తు. దీవి, దుద్ర; మ. తీవు, దీవు; గోం. దివు; కువి. తామ.

<ప్రా. దీవ-.

**దీవిచక్కెర** వి. జావా మొ. ఇతరద్వీపాలనుంచి వచ్చే పంచదార. వేంక. పంచ. 3.134. **దీవిపుట్టువు** వి. ద్వైపాయనుడు, వ్యాసుడు. అచ్చ. భార. 3.36. **దీవిరాయ(డు** వి. లంకేశుడు, రావణుడు. అచ్చ.రా.యు. 415, 433. **దీవిఱేడు** వి. లంకానాయకుడు, రావణుడు. అచ్చ.రా. సుందర. 116.

**దీవి**[2] వి. 1. కాంక్ష, కోరిక, ఇష్టం, చూడాలనే బలమైన కోరిక; 2. మనసు.

ప్రా. దీవ-, దీవఅ, దీవిఅ. దీపం, దీవిఅ. ప్రకాశితమైన, జ్వలించిన.

<ప్రా. తీవిఅ.

**దీవికంబము** రూ.చూ. దివ్వెకంబము. వి. దీపస్తంభం.

**దీవించు** అ.క్రి. కోరు. భార. ఆది. 1.94; స.క్రి. ఆశీర్వదించు. భార. ఆది. 2.65.

ప్రా. దీవ. ప్రకాశింపచేయు.

<ప్రా. దీవ + - ఇంచు[3].

**దీవిటి** రూ.చూ. దివ్వటీ. వి. కాగడా.

**దీవిడి** రూ.చూ. డిమిడి. వి. మట్టికైన మూయటానికి వాడే మట్టిమూత.

**దీవియ** వి. దియ్యె, దివి[1], దివియ, దివె, దివ్య, దివ్వ, దివ్వియ, దవ్వె, దీవె. వి. దీపం, కరదీపిక. కు.సం. 8.44. దీర్ఘాసి శాసనం. గంజాంజిల్లా. క్రీ.శ. 1075 – 76. భార. భీష్మ. 2.342.

సం. దీపికా. దీపం; ప్రా. దీవిఆ, దీఅ, దీవ్వ. దీవఅ, దీవగ, దీవీ; శౌ. దీవ; అ.మా. దీవ, దీవగ, దీవిఅ, దీవియా; పా. దీవ; అప. దీవఅ, దీవియ;

క. దీవ, దివిగె; తు. దీవిగె; మ. దీవ; కువి. దివా; కొండ. దొవా.

<ప్రా. దీవిఆ.

**దీవియకంబము** రూ.చూ. దివ్వెకంబము. వి. దీపస్తంభం. విక్ర. 6 141.

**దీవె** రూ.చూ. దీవియ. వి. దీపం. ఆం. భా. 2.164.

**దీవెలవా(డు** విణ. దీపం పట్టేవాడు. మను. 5.44.

**దీవెసుడి** వి. దీపముంచే సాధన విశేషం. విప్ర. 5.16.

**దీవెన** రూ.చూ. దీవన. వి. ఆశీర్వాదం. శృం. నై. 3.107.

**దీవెనకోల** వి. నమస్కారం. హంస. 4.213. **దీవెనకోలు** వి. నమస్కార విశేషం. హంస. 4.213. **దీవెన(బ్రాలు (-బ్రాలు)** రూ.చూ. దీవన(బ్రాలు. వి.బ.వ. మంత్రాక్షతలు.

**దీసుడు** రూ.చూ. దీసోడా. వి. దీపాన్ని ఉంచడానికి ఆధారమైంది, దీపస్తంభం.

**దీసూడు** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దీసెమ్మె** రూ.చూ. దీసెమ్మె. వి. మగ్గం దగ్గర పెట్టుకొనే దీపం.

**దీసెమ్మె** రూ. దీసెమ్మ. వి. దీపస్తంభం.

సం. దీప-. దీపం.

<సం. దీప- + సెమ్మె.

**దీసేడు** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దీసోడా** రూ. దియ్యసొడ్డు, దివసాడ, దివసోడా, దివ్వసాడా, దివ్వసోడా, దీసుడు, దీసూడు, దీసేడు, దీసోడు. వి. దీపస్తంభం.

సం. దీప-. దీపం, శుండికా. ఆహారపానీయాల్ని ఇచ్చేఇల్లు; ప్రా. దీవ-. సోడిఅ, సోండియా. కొయ్యపాత్ర విశేషం.

**దీసోడు** రూ.చూ. దీసోడా. వి. దీపస్తంభం.

**దీస్తంబం** రూ. దియ్యస్తంబం. వి. దీపంబుడ్డి పెట్టుకొనే కొయ్యస్టాండు.

**దీస్తగుండు** వి. దూది ఏకేటప్పుడు కమానునరం కొట్టేకొడిత.

**-దు**[1] అప. నీ, నా, తన అనే అర్థాల్నిచ్చే శబ్దాలకు షష్ఠీసమాసంలో ఉత్తరపదం పరమయ్యేటప్పుడు వైకల్పికంగా వచ్చే ఆగమం. భార. ఆది. 6.54. అకారం మొదట షష్ఠ్యర్థకమై మూలద్రావిడంలో ఉండి ఉండవచ్చు. దీనికి 'కు' చేరటం తమిళం తెలుగుల్లో కనిపిస్తోంది.

**-దు**[2] అప. వ్యతిరేకార్థంలో అమహత్తు కర్తగా కల ధాతువులకు వచ్చే ప్రథమ పురుషైక వచన ప్రత్యయం. అము.

1.63.

త. అతు.

<-అ^-+మూ. ద్రా. *అళ్-.

దు- అప. తద్ధర్మాద్యర్థంలో దుగాగమం వస్తుంది.

మూ. ద్రా. *-త్-/-*త్త్-.

దుక రూ. తుగ, దుగ[1], దొగ. విశ. యువ. ఎఱ్ఱగుడిపాడుశిలా శాసనం. క్రీ.శ. 575.

సం. యువ-. చిన్న; ప్రా. జువ-.

<ప్రా. జువ.

దుకరాజు రూ. తుగరాజు. వి. యువరాజు. ఎఱ్ఱగుడిపాడు శాసనం. క్రీ. శ. 575. సం. యువరాజ-. యువరాజు, రాజన్. రాజు; ప్రా. జువరాఅ-; సిం. యువరద్. రాజప్రతినిధి. <ప్రా. జువ+సం. రాజన్.

దుకణం రూ. చూ. దుకాణము. వి. సరకులమ్మే కొట్టు.

దుకనం రూ.చూ. దుకాణము. వి. సరకులమ్మే కొట్టు.

దుకాణదారు వి. అంగడి యజమాని.

హిం. ఉ. దుకాన్‌దార్. అంగడియజమాని; మరా. దుకాణ; పార. -దార్. కలవాడనే అర్థానిచ్చే పారసీ ప్రత్యయం.

<మరా. దుకాణ+పార.-దార్.

దుకాణము రూ. దుకణం, దుకనం, దుకానం. వి. ఆపణం, అంగడి. శ్రీనాథుని చాటువు.

హిం. ఉ. దూకాన్. వస్తువిక్రయశాల; మరా. దుకాణ, దుకాన. కొట్టు; పార. దుకాన్, దుక్కాన్; అర. దుక్కాన్. కొట్టు;

క. దుకాను; తు. దుకాను.

<మరా. దుకాణ-.

దుకాణముకట్టిపెట్టు అ.క్రి. పనిముగించు.

దుకానం రూ.చూ. దుకాణము. వి. సరకులమ్మే కొట్టు.

దుక్క రూ. దొక్క. వి. 1. కొయ్యమొద్దు, దుంగ; 2. ఊడ్తె గూటాన్ని నేలలో దిగగొట్టే పెద్దసుత్తి; 3. దొంగగొడ్డు మెడకు కట్టే బరువుకొయ్య; 4. లావుపాటి చెట్టు మొదలు; 5. ఆముదాల్పులో వాడే కఱ్ఱముక్క లేక తుండు.

దుక్కకాము రూ. దొక్కాము. వి. దుక్క (ఊడ్తె గూటాన్ని నేలలోకి దిగగొట్టే పెద్దసుత్తి) పిడి. దుక్కతన్ను అ.క్రి. కండపుష్టిచేయు. దుక్కబలియు అ.క్రి. బాగాబలియు, లావగు. దుక్కమైపాళి వి. ముతకరకం వడ్లు.

దుక్కసిల్లు అ.క్రి. దుఃఖించు.

సం. దుఃఖ-. విచారం.

<సం. దుఃఖ-+-ఇల్లు.

దుక్కాల చూ. దుక్కి.

దుక్కి వి. 1. నాగటిచాలు. విష్ణుపు. 4.183; 2. దున్నటం, కృషి. హంస. 5.35; 3. దుక్కి దునగటానికి తగిన వర్షం; 4. దున్నిన పొలం; 5. అరపదును; 6. సంవత్సరం.

క. ఉటిసు, ఉటిమి, ఉటియు. దున్నేట్లుచేయు; కొడ. ఉళ్ (ఉప్ప్-ఉట్ట్). దున్ను; తు. ఊడుని, హూడుని, దాపుని, అడపుని; త. ఉఴు (-వ్-, -త్-). దున్ను, తప్పు, పెల్లు, తున్ను (తుణ్ణి). దున్ను, ఉఱత్తి, ఉఱవు. దుక్కి; మ. ఉఴుక, ఉఴవు, ఉఴమ. దుక్కి; కో. ఉగ్ (ఉడ్త్). దున్ను, ఉక్ల్. దున్నటం; తొ. ఉఫ్ఫ్. దున్ను; గోం. ఉఆనా; కొం. ఉ; కుఇ. ఊవ (ఊట్); కువి. ఉయాలి, లూనామ్. మన్ను; పర్జీ. ఉళ్. దున్ను, దుక్కి. దున్నటం; కొలా. ఉర్-(ఉర్ట్-). దున్ను; నా. ఉర్; గ. ఉడ్. దున్ను; కురు. ఉఇనా, ఉయా. (ఉస్సా), ఉగ్గా. దాగలి; మాల్తో. ఉసె. మట్టిని తిరగవేయు.

దుక్కాల రూ.చూ. దుక్కికోల. వి. దున్నేటప్పుడు తోలే ముల్లుకఱ్ర. దుక్కికి(బి)దనగు అ.క్రి. వానతో నేలనాని సేద్యానికి అనువగు. విజయ. 1.44. దుక్కికైదువు వి. నాగలి, హలం. ముకుంద. 1.34పు. 1పం. దుక్కికోల రూ. దుక్కాల. దుక్కేల. వి. దున్నేటప్పుడు ఎడ్లను తోలే ముల్లుకఱ్ర. దుక్కిచాలు వి. నాగలితో దున్నగా ఏర్పడిన రేఖ. రాజవా. 1.54. దుక్కిచాలుపైరు వి. చాళ్ళపొడుగునా తలెత్తిన పైరు. దుక్కిచినుకులు వి.బ.వ. దున్నటానికి వీలైనంత వాన. దుక్కిటిగడ్డ వి. నాగటితో దున్నిన రెండు చాళ్ళమధ్య కలవని భాగం. దుక్కిటినాగలి రూ. దుక్కినాగెల. వి. మెట్టనాగలి, మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. దుక్కిటెద్దు రూ.చూ. దుక్కెద్దు. వి. దున్నటానికి ఉపయోగించే ఎద్దు. వేంక.పంచ. 1.577. <దుక్కి+ఎద్దు. దుక్కిదుక్కి వి. పిల్లలు ఆడి రేగగొట్టే దుమ్ము. దుక్కినాగెల రూ.చూ. దుక్కిటినాగలి. వి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. దుక్కిపూజు వి. సాగుపనిముట్టుకు కట్టే కాడి. దుక్కిపొలము వి. దున్నిన పొలం. దుక్కిపోతు వి. దున్నే పోతు. దుక్కిమడక వి. మెట్టదుక్కికి ఉపయోగించే నాగలి. దుక్కిముచ్చు వి. కర్షకుడు, రైతు. ఉ.హరిశ్చ. 4.15. దుక్కియెనుపోతు (-ఎనుపోతు) వి. దున్నటాని కుపయోగించే దున్నపోతు. శుక. 3.409. దుక్కివాన వి. దున్నటానికి తగినంతగా నేల పదునయ్యే వాన. దుక్కివాలు వి. హలం, నాగలి. నీలా. 2.41. దుక్కివాలుతాలుపు రూ.చూ. దుక్కివాలుదాలుపు. వి. బలరాముడు. దుక్కివాలుదాలుపు (-తాలుపు) రూ. దుక్కివాలుతాలుపు. వి. హలాయుధుడు, బలరాముడు. ఆం.నా. సం.దేవ. 29. దుక్కులగొడ్డు వి. మునలిగొడ్డు. దుక్కెద్దు రూ. దుక్కిటెద్దు. వి. దున్నటానికి ఉపయోగించే ఎద్దు. భోజ. 2.16. <దుక్కి+ఎద్దు. దుక్కేల రూ.చూ. దుక్కికోల. వి. దున్నేటప్పుడు ఎడ్లను తోలే ముల్లుకఱ్ర.

దుక్కులగొడ్డు చూ. దుక్కి.

దుక్కెద్దు చూ. దుక్కి.

దుక్కేల చూ. దుక్కి.

దుగ[1] రూ.చూ. దుక. విశ. యువ. ఇందుకూరు శాసనం. క్రీ.శ. 600-625.

దుగ[2] రూ. దిగా, దుగం, దుగా, దువ. సర్వ. రెండు. కళా. 3.131, ఆం.భా. 2.305.

సం. ద్వికః-, ద్వౌ-. రెండు, యుగళం; ప్రా. దుక-, దుగ-, దువ-; దే.ప్రా. దువఅ; శౌ. దువే; అ.మా.

దుఅ, దుగ, దుయ, దుయఅ, దుయగ ; పా. దుక ; అప. దుఇ ;

క. దుగ, దుగె.

< ప్రా. దుగ-.

**దుగతిగ** సర్వ. ఆరు. సం. ద్వికత్రిక-. ఆరు. **దుగతికమొగములజెట్టితో(బుట్టు** వి. షణ్ముఖుని సోదరుడు, విఘ్నేశ్వరుడు. అచ్చ.రా.బాల. 7. **దుగదచ్చియను(-అను)** అ.క్రి. కయ్యానికి కాలుదువ్వు. **దుగదున్నకం** వి. ఇరవాలు, రెండోసారి అడ్డంగా దున్నటం. **దుగమొగములపులు(గు** రూ.చూ. దుగమొగములపుల్గు. వి. గండభేరుండం. అచ్చ. రా.అరణ్య. 77. **దుగమొగములపుల్గు** రూ. దుగమొగములపులు(గు. వి. రెండు మొఖాలుగల పక్షి, గండభేరుండం. అచ్చ.రా.అయోధ్యా. 77. **దుగమొగములవేల్పు** వి. అగ్ని దేవుడు. అచ్చ.రా.యు. 279. **దుగమోముదుండగీ(డు** వి. అగ్ని, రెండు ముఖాలు కలవాడు. ఆం.భా. 2.173. **దుగమోములయ్య** వి. అగ్నిదేవుడు, రెండు ముఖాలు కలవాడు. ఆం.భా. 1.47. **దుగరవిక** వి. జంటరవిక. **దుగ్గాణి** రూ.చూ. దుగ్గాని. వి. **1.** డబ్బు, నాలుగు దమ్మిడీలు; **2.** రెండు డబ్బులు ; **3.** రెండు దమ్మిడీలు. **దుగ్గాని** రూ. దుగ్గాణి. వి. **1** రెండు దమ్మిడీలు. నె.శా. కందుకూరు. 18. క్రీ.శ. 1408 ; **2.** ఒకరకం బంగారు నాణెం. ఆం.భా. 2.279. **దుగ్గోరంచు** వి. రెండు గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. < దుగ[2] + గీర + అంచు.

**దుగం** రూ.చూ. దుగ[2]. వి. **1.** ఇరవాలు, రెండోసారి దున్నటం; **2.** మాగాణిలో మడి చుట్టూ వేసిన మట్టికట్ట.

**దుగలము** రూ. దుగులము. వి. రెండు బేడలు, వరహాలో పదహారోవంతు. ఆం.భా. 2.273.

సం. ద్వికలా. రెండు భాగాలు, యుగల-. జంట ; ప్రా. దుగుఅ-, జుగల-. జోడు, జంట.

< ప్రా. దుగుల-.

**దుగసం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయట, ఊడ్తెలకు బాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దుగా** రూ.చూ. దుగ[2]. సర్వ. రెండు. నిరంకు. 2.22.

**దుగానా** వి. రెండు దండ ప్రణామాలు, నమస్కారం. సాంబో. 2.103.

ఉ. దుగానా. నమాజుకు సంబంధించిన సాంకేతిక పదం.

< ఉ. దుగానా.

**దుగిను(డు** వి. బ్రహ్మ. ఆం.భా. 1.39.

సం. ద్రుహిణ-. బ్రహ్మ ; ప్రా. దుహిణ-.

< ప్రా. దుహిణ-.

**దుగుణము** విణ. రెండురెట్లుగల, రెండింతలైన. ఉ.హరి. 3.122.

సం. ద్విగుణ-. రెండింతలైన ; ప్రా. దిగుణ, దుఉణ-, దిగుణ-, దిఉణ, దుగగొ- ; మా. దిఉణ ; శౌ. దిఉణ ; అ.మా. దుగుణ, దిఉణ ; పా. దిగుణ ; అప. దుగుణ, దుగుణియ. ద్విగుణితం, దూణ. ద్విగుణం ;

క. దుగుణ, దుగుణి ; కువి. దీగూన.

< ప్రా. దుగుణ-.

**దుగుద** వి. ఆందోళన.

సం. దుగ్ధ-. పిదుకబడిన, నింపబడిన.

< సం. దుగ్ధ-.

**దుగులము** రూ.చూ. దుగలము. వి. రెండు బేడలు, వరహాలో పదహారోభాగం.

**దుగ్గ** రూ. దుగ్గి[1]. వి. పార్వతి, శక్తి. యయా. 2.3.

సం. దుర్గా ; ప్రా. దుగ్గా. పార్వతి ; అ.మా. దుగ్గా ; చూ.పై. తుకాౣ ; బెం. దుగ్గీ ;

క. దుగ్గె.

< ప్రా. దుగ్గా.

**దుగ్గతండ్రి** వి. హిమాద్రి. వేంక.ఆం. 77.

**దుగ్గంబు** వి. కోట. అద్దంకి శాసనం. క్రీ.శ. 848.

సం. దుర్గ-. కోట ; ప్రా. దుగ్గ-. కోట.

< ప్రా. దుగ్గ-.

**దుగ్గాణి** చూ. దుగ[2].

**దుగ్గాని** చూ. దుగ[2].

**దుగ్గి[1]** రూ.చూ. దుగ్గ. వి. పార్వతి, శక్తి.

**దుగ్గికన్నయ్య** వి. హిమాద్రి.

**దుగ్గి[2]** వి. పిడకలతో పేర్చిన దాలి.

ప్రా. దుగ్గ-. దుర్గమస్థానం, దుఃఖం.

**దుగ్గు** చూ. తుక్కు. రూ. దుంకు. వి. **1.** చూర్ణశాకం, తొక్కు. ఆం.భా. 2.248 ; **2.** కొట్టంలో పశువుల కాళ్ళ కింద నలిగిన గడ్డి ; **3.** ఎండిన లేక కుళ్ళిన గడ్డి ; **4.** ఆము పడుగులో పోసే చెట్ల బెరడు కర్ర నుసి మొ॥వి. విణ. రూపం చెడిన.

**దుగ్గుపురుగు** వి. **1.** ఆముదపుపురుగు, చిన్న నల్లటి పురుగు ; **2.** ఆముదపు తెగులు. **దుగ్గుసెత్త (-చెత్త)** వి. ఆము పడుగులో పరిచే చెత్త.

**దుగ్గోరంచు** చూ. దుగ[2].

**దుంక** రూ.చూ. దుంకము. వి. **1.** రంధ్రం ; **2.** కుమ్మరి ఆములో గాలి పోవటానికి పక్క భాగంలో ఏర్పరచిన సందులు.

**దుంకమూగట** వి నగభాగం వరకు రంధ్రాలుండి గంజి వార్చుకు వాడే రెండంచులతో ఉండే మట్టిమూకుడు.

**దుంకము** రూ. దుంక, దుంకి. వి. రంధ్రం.ఆం.భా. 1.145.

**దుంకి** రూ.చూ. దుంకము. వి. రంధ్రం.

**దుంకు** రూ.చూ. దుగ్గు. వి. కళ్ళంలో నూర్చిన ధాన్యంతో కలిపిఉన్న నుసి.

**దుంగ** వి. పొడవైన దూలం, మానిమొద్దు. ఆం.భా. 2.38.

సం. తుంగ-. ఎత్తైన, పొడవైన ; ప్రా. తుంగ-.

< ప్రా. తుంగ-.

**దుఃఖితములు** వి.బ.వ. పాపాలు. HAS. 1356. క్రీ.శ. 1170.

సం. దుఃఖిత-. దుఃఖించిన.

< సం. దుఃఖిత- + -ము + -లు (అర్థవిపరి.).

**దుట్టుగు** రూ.చూ. జుట్టుపు. వి. అజశృంగి, జుట్టుగుచెట్టు.

**దుట్టుపు** రూ.చూ. జుట్టుపు. వి. అజశృంగి, జుట్టుగుచెట్టు. ఆం.భా. 2.61.

**దుట్టుపు** రూ.చూ. జుట్టుపు. వి. అజశృంగి, జుట్టుగుచెట్టు. ఆం.భా. 2.61.

**దుడదుడ** రూ.చూ. దొడదొడ. వి. మంచం మొ॥ వాటిని వేగంగా ఎక్కటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. క్రీడా. 30.

**దుడిదుడి** రూ. దొడిదొడి. వి. ఏనుగులు మొ॥ జంతువులు వేగంగా నడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. రం. రా.అరణ్య. 163 పు. 20 పం.

**దుడీ** వి. పంట కోసి కట్టిన కట్టల్ని ఒక వరసలో పేర్చి వేసిన కుప్ప.

ప్రా. జుడిఅ. తమలో తాము కలిసిన.

**దుడీఎత్తు** స.క్రి. పంట కోసి కట్టిన కట్టల్ని ఒక వరసలో కుప్పగా వేయు.

**దుడుం** వి. నిర్బంధం.

హిం.ఉ. జుల్మ్. అత్యాచారం, అన్యాయం.

<ఉ. జుల్మ్.

**దుడుకడుచు** చూ. దుడుకు.

**దుడుకఁడు** చూ. దుడుకు. వి. బాలుడు, పిల్లవాడు. భాగ. 7.253.

**దుడుకు** వి. **1**. ఔద్ధత్యం. భాగ. 10 పూ. 289 ; **2**. దుష్కార్యం, చెడ్డపని. భాగ. 10 పూ. 1212 ; **3**. దౌష్ట్యం. విష్ణుపు. 7.9 ; **4**. తొందర, వేగం. అచ్చ.రా. అయోధ్యా. 90 ; విణ. **1**. వేగవంతమైన, సత్వరమైన. శుక. 3.499 ; **2**. దుష్టుడైన, దుష్టమైన. అచ్చ.రా. సుందర. 164.

క. *దుడి*. కురుపులా ఎక్కువగా బాధపడు ; తు. *దుడుకు*. తొందర, గొప్పతనం, అన్యాయం ; త. *తుటి* (*-ప్పు-, -ట్టి-*). ఒణుకు, కొట్టుకొను, అదరు, ఆందోళన, ఎక్కువగా బాధపడు, *తుటితుటి* (*-ప్పు-, -ట్టి-*). ఎక్కువ కంగారుపడు, *తుటుక్కు*. దుడుకుతనం ; మ. *తుటిక్క*. ఒణుకు, ఉద్రుతంగా ఒణకు.

**దుడుకడుచు** అ.క్రి. మునుగు. భాగ. 10 పూ. 546. <దుడుకు+అడుచు. **దుడుకుచేయు** అ.క్రి. త్వరపడు. హంస. 3.84. **దుడుకుతనము** వి. దుష్టప్రవర్తన, చెడు నడత. తు. *దుడుకుతన*. కంగారు, దుడుకుతనం. **దుడుకునడక** వి. దుష్టప్రవర్తన, చెడునడత. ఇందు. 4.38. **దుడుకుమెకము** వి. దుష్టజంతువు. పె.శకు. 1.104.

**దుందుడుకు** రూ. తుందుడు, తుందుడుకు. వి. **1**. కష్టం. ఆపద. వరాహ. 6.3 ; **2**. ఔద్ధత్యం, గర్వం. నిరంకు. 4.80 ; **3**. మిక్కిలిదుడుకు, మిక్కిలితొట్రుపాటు. కకుత్థ. 4.58 ; **4**. మిక్కిలితొందర. హంస. 5.138.

**దుడ్డు**[1] వి. **1**. రెండు దుగ్గానుల ఎత్తుగల రాగి నాణెం. శుక. 3.117 ; **2**. దుగ్గాని ; **3**. ద్రవ్యం, డబ్బు.

క. *దుడ్డు*. రాగినాణెం ; తు. *దుడ్డు*. నాలుగుపైసల రాగినాణెం ; త. *తుట్టు*. రాగినాణెం ; మ. *తుట్టు*. రాగినాణెం, ½ పైసా.

మరా. *దుడ్డు*. ఒక నాణెం.

**దుడ్లబుడ్డి** వి. పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టిబుడ్డి. **దుడ్లుబుజ్జిగ** వి. పిల్లలు డబ్బు దాచిపెట్టడానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టి బుడ్డి.

**దుడ్డు**[2] రూ. దడ్డు, దొడ్డు[1], ద్రుడ్డు. వి. **1**. దృఢమైన కర్ర, లావుకర్ర. హర. 7.17 ; **2**. మోటుకాడు. భోజ. 3.83 ; **3**. గద. ఆం.నా.శే. 17 ; **4**. ముద్గరం, ఇనపగుది. ఆం.భా. 2.216 ; **5**. చేతికర్ర చివరి మడి ; **6**. దూది ఏకేటప్పుడు కమాను నరం కొట్టే కొయ్య బడితె ; **7**. తొట్టెలో రంగులు కలిపే కర్ర ; **8**. దొంగ గొడ్డు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య ; విణ. లావయిన, స్థూలమైన.

క. *దుడ్డు* ; త. *తుట్టుత్తడి* ;

సం. *దండ-*. కర్ర.

**దుడ్డుకంకర** రూ.చూ. దొడ్డుకంకర. వి. పెద్దరాతిముక్క.

**దుడ్డుకర్ర** రూ.చూ. దుడ్డుఁగఱ్ఱ. వి. లావుపాటి కర్ర.

**దుడ్డుకోల** రూ.చూ. దుడ్డుఁగోల. వి. లావైన కర్ర.

**దుడ్డుఁగఱ్ఱ (-కఱ్ఱ)** రూ. దుడ్డుకర్ర. వి. లావుకర్ర. క. *దొడ్డె*. త. *తుట్టు-క్కట్టై, తుట్టు-త్తటి*. దుడ్డుకర్ర.

**దుడ్డుఁగోల (-కోల)** రూ. దుడ్డుకోల. వి. లావైనకర్ర, స్థూలదండం. **దుడ్డుమంగ** వి. ఒకరకం చెట్టు. హంస. 4.9. **దుడ్డువైఖరి** క్రి.విణ.ద్రు. **1**. దుడ్డుకర్రవలె. శుక. 2.102 ; **2**. దిట్టంగా.

**దుడ్డె** వి. **1**. బాలకుడు. కుచే. 2.91 ; **2**. విటుడు ; **3**. విటి ; **4**. ఆవు, గేదె మొ॥ వాటి పిల్ల.

సం. *ధూర్త-*. మోసగాడు, జూదరి, పీడించేవాడు. *దుష్ట-*. చెడ్డవాడు ; ప్రా. *దుట్ఠ-*. చెడ్డవాడు, దోషి.

<ప్రా. *దుట్ఠ-*.

**దుడ్డెకాఁడు** రూ. దుడ్డెగాడు. వి. విటుడు. హంస. 5.160. **దుడ్డెగాఁడు (-కాఁడు)** రూ.చూ. దుడ్డెకాఁడు. వి. యౌవనవంతుడు. **దుడ్డెతనము** వి. **1**. విటీత్వం. హంస. 4.138 ; **2**. ధూర్తత్వం.

**దుడ్లబుడ్డి** చూ. దుడ్డు[1].

**దుడ్లుబుజ్జిగ** చూ. దుడ్డు[1].

**దుణుపు** వి. జ్వరం, ఊష్ణం.

ప్రా. *దుణ్ణి*. అ. పీడితమయిన, దుఃఖితమైన.

<ప్రా. దుణ్ణిఅ.

**దుండ** వి. అంచులో నేసిన కడ్డి.

**దుండకంటు** వి. పాత్రల మూతికి కింద మూడులాగాపెట్టి పైన కడియం చుట్టినట్లు చేసిన అంచు.

**దుండకము** వి. శోణకం, పెనుమాను.

**దుండగము** వి. **1**. కీడు, ఆపద. జైమినిభా. 1.92 ; **2**. దుష్టకృత్యం, చెడుపని. వరాహ. 6.75 ; **3**. దౌష్ట్యం, దురాగ్రత. వరాహ. 10.15 ; **4**. ధూర్తకృత్యం. విష్ణుపు. 7.140 ; **5**. అపరాధం, తప్పు. గౌ. హరి. పూ. 1190పం ; **6**. ధౌర్త్యం. వసు. 4.33.

సం. *దుండక-*. దుష్టచిత్తుడు, *దుండుక-*; త.

తుండరిక్కం.

**దుండగాయ** వి. దుండగీడు. **దుండగాయతనము** వి. దౌష్ట్యం. **దుండగించు** అ.క్రి. అల్లరిచేయు. **దుండగీఁడు** వి. దుష్టుడు. పి. శకు. 3.58. **దుండగుఁడు** వి. దుష్టుడు. **దుండటికము** వి. అపరాధం, తప్పు. చంద్రాంగ. 5.63.

**దుండగాయ** చూ. దుండగము.

**దుండగాయతనము** చూ. దుండగము.

**దుండగించు** చూ. దుండగము.

**దుండగీఁడు** చూ. దుండగము.

**దుండగుఁడు** చూ. దుండగము.

**దుండటికము** చూ. దుండగము.

**దుండి**[1] విణ. స్థూలమైన, లావైన.

సం. తుందిల-. గొప్ప, అధికమయిన ; ప్రా. తుందిల-, తుందిల్ల-. పెద్దపొట్టకల.

**దుండి**[2] వి. **1**. కాంత, ప్రేయసి. సారంగ. 2.152 ; **2**. ఆడది, స్త్రీ. చంపూరా. 2.74 ; **3**. దొరసాని.

**దుండికము** రూ.చూ. దుండుగ. వి. శ్యోనాకం, ఒకరకం చెట్టు. ఆం. భా. 2.49.

**దుండిగ** రూ. చూ. దుండుగ. వి. దుండెపాకు, నల్లరేగడి నేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క (Jatropha glandulifera).

**దుండిగము** రూ.చూ. దుండుగ. వి. శ్యోనాకం, ఒకరకం చెట్టు. ఆం. పదా. అచర. 77.

**దుండిపాకు** వి. నల్లరేగడినేలలో తుప్పగా పెరిగే కలుపుమొక్క.

**దుండిలము** రూ.చూ. దుందిలము. వి. దుండికం, శ్యోనాకం, ఒకరకం చెట్టు.

**దుండు** చూ. దిండు. వి. రాట్నం బొమ్మచెవుల మధ్య ఉండే కదురుభాగం ; విణ. లావుగాఉన్న.

**దుండుకుండ** వి. గుండ్రంగా ఉండే మట్టిపాత్ర. **దుండుపాము** వి. పాములా ఉండే చేప. **దుండుబలి** విణ. సోమరి. ఆం. భా. 3.6. **దుండుబలితనము** వి. చండితనం.

**దుండుగ** రూ. దుండికము, దుండిగ, దుండిగము, దుందుకము. వి. శ్యోనాకం, ఒకరకం చెట్టు. ఆము. 6.13 (Jatropha glandulifera).

సం. *డుండుక-*. ఒకరకం చెట్టు ;

క. *దుండిగు, దుండిగె*. బ్రెజిల్ దేశం నుంచి తెచ్చిన ఒకచెట్టు.

**దుండ్లంచు** చూ. దుండు. వి. గీరలు గీరలుగా నేసిన అంచు.

**దుతరఫ్ఫీ** విణ. రెండుపక్కల ఉన్న.

హిం. ఉ. *దుతర్ఫ్*. ఇరువంకలకు సంబంధించిన.

<ఉ. దుతర్ఫ్తీ.

**దుత్త**[1] వి. **1**. పాలకుండ. వేమన. 2.97 ; **2** చిన్నమూతి గల చిన్నకుండ. హంస. 5.11 ; **3**. చేపలు పట్టే వలకు వెనక కట్టడానికి వెదురుపుల్లలతో తయారు చేసిన సాధనం.

త. తూత్తై. మట్టితో చేసిన చిన్నకుండ ; మ. తూత. పాలకుండ, కప్పు ; కొలా. *దుత్త*. మట్టికుండ.

**దుత్తంచు** వి. పాత్రలమూతికి కింద మూడు లాగపెట్టి పైన కడియం చుట్టినట్లు చేసినఅంచు. < దుత్త[1]+- అంచు[3]. **దుత్తపాడు** వి. శూన్యం. **దుత్తబుడ్డి** వి. వెన్న వేసుకోడానికి వాడే చిన్నమట్టి పాత్ర. **దుత్తరాయి** వి. దుత్తలను సర్దేరాయి. **దుత్తలరాయి** రూ.చూ. దుత్త్రలాయి. వి. దుత్తలను సర్దేరాయి. **దుత్త్రలాయి** రూ. దుత్తలరాయి. వి. దుత్తలను సర్దేరాయి.

**దుత్త**[2] చూ. జుట్ట. వి. చాపబడిన బొటనవేలుకు చూపుడు వేలుకు గలమధ్య దూరం, ప్రదేశం. వరాహ. 4.86.

**దుత్తలు** వి.బ.వ. ఎద్దుల్ని బండికి పూన్చేటపుడు వాటి మెడలకు కట్టే బారెడు తాళ్ళు.

**దుత్తాయి** వి. చిన్నచొక్కా. ఆం. భా. 2.156.

**దుత్తారివలువ** వి. ఒకరకమైన వస్త్రం.

క. *దుత్తారి*. డిజైన్లు అల్లిన వస్త్రం ; త. *తుత్తారి*. ఒక విధమైన వస్త్రం.

**దుత్తిక** చూ. జుత్తిగ. వి. పట్టెడ, గొడ్లమెడలకు అందానికిగాని వాటికాడికి పూన్చడానికి గాని కట్టేతాడు లేక తోలు.

**దుత్తూరము** వి. కపటం. ఆం. నా. సం. మాన. 69.

సం. *దుస్తర-*. దాటశక్యంకానిది, *దుత్తూర-*. ఉమ్మెత్త; ప్రా. *దుత్తూర-*. దాటవీలుకానిది.

<సం. దుత్తూర- (అర్థవిపరి.).

**దుత్తె** వి. తాళం.

**దుర్దగు** వి. ఉత్తర సర్కారు జిల్లాలోని పర్వత ప్రాంతాలలో పెరిగే చెట్టు (Cherry Nutmeg, Uvaria Cerasoides).

**దుద్దు**[1] వి. **1**. మూలస్థానం. పండి. చ. 5.313 ; **2**. చెవికమ్మ. క్రీడా. 101 ; **3**. తాటాకు జాబు మీది చెంద్రిక. హంస. 4.30 ; **4**. తామర పువ్వులోని దిమ్మె, కర్ణిక. ఆం. భా. 1.166 ; విణ. ముదుక, దళమైన.

క. దుద్దు. దోస లేదా గుమ్మడి కాయలో విత్తనాలున్న భాగం ; త. తుత్తురు. తామరపూదుద్దు ఆకారంలో ఉన్న ఆభరణం, తుత్తుక్కమ్మల్. స్త్రీలు పెట్టుకొనే చెవి ఆభరణం.

**దుద్దుకంబడి** రూ. దుద్దు కంబళి, దుద్దు గంబడి. వి. దళసరి కంబళి. వేంక. పంచ. 4.456. త. *తుత్తుక్కంపళి*. దళసరిగా ఉన్నకంబళి. **దుద్దుకంబళి** రూ.చూ. దుద్దుకంబడి. వి. ఒకరకం దట్టపు చేతకంబలి. **దుద్దుగంబడి (-కంబడి)** రూ.చూ. దుద్దుకంబడి. వి. దళసరి కంబళి. **దుద్దుగొంగడి** రూ. దుద్దుగొంగళి. వి. దళసరి కంబళి. వేంక. పంచ. 3.247. **దుద్దుగొంగళి** రూ.చూ. దుద్దుగొంగడి. వి. దళసరి కంబళి. **దుద్దెక్కు** అ.క్రి. అతిశయించు, దళమగు. బసవ. 1.586 పం. <దుద్దు[1]+ఎక్కు.

**దుద్దు**[2] వి. **1**. అసత్యం. ఆం. భా. 1.119 ; **2**. మోసం ; **3**. మత్తు.

త. తుత్తు. అబద్ధం, దోషం, మోసం.

**దుద్దుగలుపు (-కలుపు)** స.క్రి. ఒకకార్యాన్ని మధ్యలో వదలివేయు. **దుద్దువెట్టు (-పెట్టు)** స.క్రి. మోసపుచ్చు, కనుమొరుగు. సారంగ. 2.114.

**దుద్దెక్కు** చూ. దుద్దు[1].

**దునియా** రూ. దునె, దునే. వి. ప్రపంచం.

హిం. దునియాఁ. జగం; ఉ. దునియా. జగత్తు, ప్రపంచ ప్రజలు; పార. దునియా. ప్రపంచం, ప్రజలు; అర. దునియా. ప్రపంచం.

< ఉ. దునియా.

దునీఁడు చూ. దునె.

దుసు రూ.చూ. దున్ను. స.క్రి. దుక్కిచేయు, కృషిచేయు. భార. ఆరణ్య. 5.57.

దునుకు వి. 1. భయం. భార. కర్ణ. 1.110; 2. కంపం. వణుకు. ఉ.హరి. 5.224.

త. తునుక్కు. భయం.

దునె రూ.చూ. దునియా. వి. రాజ్యం.

దునీఁడు వి. ప్రభువు, రాజు. కృష్ణ. రా. 2.121. < దునె + -ఈఁడు.

దునెదారి రూ. దునేదారి. వి. 1. ప్రభువు. సారంగ. 3.157; 2. శూరుడు. చంద్రాంగ. 4.86.

ఉ. దునియాదార్. గృహస్థుడు; పార. దున్యాదార్. ప్రపంచ పరిజ్ఞానంగల.

< ఉ. దునియాదార్ (అర్థవిపరి.).

దునెసరి చూ. దునియా, దునెదారి. వి. శూరుడు.

దునే రూ.చూ. దునియా. వి. రాజ్యం.

దునేదారి రూ.చూ. దునెదారి. వి. 1. అల్పసేనాపతి. ప్రబంధ. 210; 2. కత్తి పట్టిన శూరుడు.

దున్కం చూ. దున్ను.

దుంత వి. దున్న, మహిషం. రామలిం. శ. 35.

దుంతబాబావజీరుఁడు వి. యముడు. నీలా. 2.41. దుంతరవుతు రూ.చూ. దుంతరౌతు. వి. యముడు. దుంతరౌతు రూ. దుంతరవుతు. వి. యముడు, భోజను. 1.25. దుంతవయాళికాఁడు వి. యముడు. కృష్ణ రా. 3.31. దుంతహుమాయివజీరుఁడు వి. యముడు అచ్చ.రా.ఆరణ్య. 105.

దుందారం వి. ఎర్రదుమ్ముతో బలంగా వీచేగాలి.

హిం. ధూమ్. పొగ, గడబిడ; పార. -దార్. కలిగిన అనే అర్థాన్నిచ్చే పరప్రత్యయం.

దుందిలము రూ. దుండిలము. వి. దుండికం, ఒకరకం చెట్టు. సిం. ద్వా. 8.37.

దుందుకము రూ.చూ. దుండుగ. వి. దుండిగం, వృక్షవిశేషం.

దుందుడుకు చూ. దుడుకు.

దుందుము వి. చక్రాకారపు దివిటీ, కాష్ఠదీపిక. కళా. 8.10.

దుందురు రూ.చూ. జుంజురు. వి. దివ్వియకోల, కాష్ఠదీపిక. ఆం.భా. 2.165.

దుందుఱు రూ.చూ. జుంజుఱు. వి. జుంజురుకట్ట.

దున్న చూ. దున్ను. వి. మహిషం. దున్నపోతు. మను. 4.39. పొలం దున్నేది కాబట్టి దున్న అని మహిషానికి పేరు వచ్చి ఉంటుంది.

దున్నకిచ్చ వి. చిన్నదున్న. దున్నకుర్ర వి. చిన్నదున్న. దున్నంగి[1] వి. పాలువిడిచిన లేతదున్న, చిన్నదున్న. దున్నదుడ్డె వి. దూడగాఉన్న దున్న. దున్నపోతు వి. మహిషం. శ్రీనాథుని చాటువు. 1.131. దున్నపోతుమీద వాన కురిసినట్లు అవ్య. ఏమాత్రం లెక్కలేనట్లు. దున్నలాఉండు అ.క్రి. మోటుగా లావుగాఉండు. దున్నవయాళికాఁడు వి. మహిష వాహనుడు, యముడు. సారంగ. 2.114. దున్నవలె కష్టపడు అ.క్రి. బాగా శ్రమించు.

దున్నకం చూ. దున్ను.

దున్నంగి[2] వి. ఒకరకం అడవిచెట్టు.

దున్నించు చూ. దున్ను.

దున్ను రూ. దును. స.క్రి. దుక్కిచేయు, కృషిచేయు. భార. ఆరణ్య. 1.235.

క. ఉఴ్(త్) దున్ను; తు. ఉడుని. దున్ను; త. ఉఴు(-వ్-, -ట్-). దున్ను. తవ్వు; మ. ఉఴుక, దున్ను; కో. ఉఴ్ (ఉడ్తె). దున్ను; గోం. ఉడ్. తవ్వు, ఉడన, ఉడాన, ఉడానా. దున్ను; కుఇ. డూవ. (డూత్); కువి. ఝని. తవ్వు; పర్జి. ఉడ్. తవ్వు; కొలా. ఉర్ (ఉర్ప్-). తవ్వు, ఉర్; కురు. ఉయినా, ఉయ్‌నా (ఉస్సస్). దున్ను; మాల్తో. ఉసె. మన్ను పెల్లగించు; పో.చూ. త. ఉషఫ్ (ఉషత్). దున్ను.

పో.చూ. దుక్కి.

దున్కం రూ.చూ. దున్నకం. వి. నాగలి, గొర్రు, గుంటక మొదలైన వాటితో భూమిని వదులు చెయ్యటం. దున్నకం రూ. దున్కం. వి. నాగలి, గొర్రు, గుంటక మొదలైన వాటితో భూమిని వదులు చెయ్యటం. దున్నించు స.క్రి. దున్నజేయు. ఉ.రా. 3.130. < దున్ను + -ఇంచు[3]. దున్నుపదును వి. దున్నటానికి వీలైనంత తడి.

దున్నె వి. గానిగకట్టె తిరగడానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప.

దున్నెప్రజలు చూ. దున్ను. వి.బ.వ. దుక్కినిచేసి జీవించేవారు, కర్షకులు. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 533. క్రీ.శ. 1323.

దుపటము రూ.చూ. దుప్పటము. వి. దుప్పటి. లక్ష్మీవి. 5.36.

దుప్పటము రూ. దుపటము, దుప్పటి, దుప్పటీ, దువ్వటము. వి. 1. కోక, చీర. హర. 2.42; 2. ఉత్తరీయం. వరాహ. 4.46; 3. తుడుచుకొనేబట్ట. వరాహ. 4.124; 4. కవచం. సాంబ. మాన. 45.

సం. ద్విపటీ, ద్విపటు-. దుప్పటి; ప్రా. దుప్పటు-, దుప్పటి; పా. దుపట్టు;

క. దుప్పటి, దుపటు, దుపటి, దుప్పటు, దుప్పట్టు. దుప్పటి; తు. దుప్పటి; దుప్పడె; త. తుప్పట్టా.

< ప్రా. దుప్పట్ట-.

దుప్పటి రూ.చూ. దుప్పటము. వి. 1. ఉత్తరీయం. శివరా. 3.25; 2. విలువగల సన్నపాటి వెడల్పు వస్త్రం. వరాహ. 6.114; 3. కప్పుకొనే ముతకబట్ట, నిచోళం. ఆము. 4.35; 4. పక్కమీద పరిచే బట్ట. శుక. 4.22.

దుప్పటికప్పు అ.క్రి. చచ్చు. దుప్పటిపంచాయితి వి. ఇద్దరి తగాదాని పెద్దలు కలిసి అక్రమమైన తీర్పు చెప్పడం. దుప్పటిపఱచు అ.క్రి. కొంగుపరచు, రతికి సిద్ధమగు.

దుప్పటీ రూ.చూ. దుప్పటము. వి. 1. విలువగల సన్నపాటి వెడల్పు వస్త్రం. ఉ.రా. 6.20; 2. పక్కమీద పరిచే

ముతకబట్ట.

**దుప్పి**[1] వి. **1.** పృషతం, మచ్చలున్న లేడి. భార. ఆరణ్య. 3 89 ; **2.** రామం, పెద్ద దుప్పి. ఆం.భా. 2.85.

క. దుప్పి. కొమ్మల్లాగ కొమ్ములుండి, మచ్చలున్న లేడి ; తు. ఉరె, ఉలె. లేడి ; త. ఉఙ్రై. దుప్పి ; మ. ఉఅ-మాన్. ఒకరకం లేడి ; గోం. డుప్పల్ ; కొం. డుపి. ఒకరకం లేడి ; పర్జి. ఉడ్పి. మచ్చలున్న లేడి ; కొలా. డుప్పి.

**దుప్పికిపాడమాసినట్లు** అవ్య. తిట్లూ, తిమ్ములూ లెక్క లేకపోయినట్లు. **దుప్పితోకలు** వి.బ.వ. వడ్లలో ఒకరకం.

**దుప్పి**[2] వి. ఉపవాసం.

**దుప్పిభోజనముచేయు** అ.క్రి. పస్తుండు. దుప్పి ఆకలిగా ఉన్నప్పుడు తన శిశ్నాన్ని తానే చీకుతుంది. దీన్ని బట్టి పస్తుండు అనే అర్థం వస్తుంది.

**దుప్పంనేత** రూ.చూ. దూప్పాయనేత. వి. రేలనేత, పడుగుకు ఒకరంగు, పేకకు మరొకరంగు నూలుపెట్టి నేసిన (గట్టి) నేత.

**దుబరకా** వి. చినిగిన నంచులకు వేసే అస్తరు నంచి.

**దుబార** రూ.చూ. దుబారా. వి. చెక్కడప్పనిలో లోతుగా ఉండే భాగం.

**దుబారా** రూ. దుబార, దూబరా, దూబఆ. వి. రెండుసార్లు ; విణ. **1.** వ్యర్థమైన ; **2.** అమితమైన.

హిం. దుబారా, దోబారా. రెండుసార్లు.

<హిం. దుబారా.

**దుబారామనిషి** వి. వ్యర్థమైన ఖర్చులు చేసే మనిషి.

**దుబారు** వి. లావుపాటి ఇసుక గుళ్ళు.

**దుబాసి** రూ.చూ. తుపాసి. వి. రెండు భాషలు వచ్చిన వాడు, భాషాంతరం చేసే వాడు.

**దుబాసితనము** వి. భాషాంతరం చేసే ఉద్యోగం. ఆనంద. పీఠి. 76.

**దుబాసికు(డు** వి. **1.** ఒక భాషనుంచి ఇంకో భాషలోకి తర్జుమా చేసే వాడు. రంగా.చ. 2.116 ; **2.** రెండు భాషలు వచ్చిన వ్యక్తి.

సం. ద్విభాషిక-. రెండు భాషలు కలవాడు.

**దుబాసీ** రూ.చూ. తుపాసి. వి. రెండు భాషలు వచ్చినవాడు, తర్జుమా చేసేవాడు. రంగా.చ. 2.61.

**దుబ్బ**[1] వి. **1.** కూజా, పాత్రవిశేషం. హంస. **75** ; **2.** ఆడగురి. సాంబ. మాన. 19.

క. దుబ్బి. మట్టికుండ, లావైన స్త్రీ.

**దుబ్బ**[2] రూ.చూ. దువ్వ. వి. **1.** దమ్ము ; **2.** ఎరుపునలుపు కలిగిన జిగటమట్టి.

**దుబ్బగచ్చు** వి. మెరుగు తక్కువగా ఉన్న గచ్చు. **దుబ్బచవుడు** రూ.చూ. తువ్వచవుడు. వి. ఇసక కలిసిన చవిటినేల. **దుబ్బచెంగల** రూ.చూ. దుబ్బచెంగలి. వి. మాగాణిలో ఎక్కువగా మొలిచి పాకి పెరిగే కలుపు మొక్క. **దుబ్బచెంగలి** రూ. దుబ్బచెంగల. దుబ్బచెంగాలి. వి. మాగాణిలో ఎక్కువగా మొలిచి పాకిపెరిగే కలుపు మొక్క (Iseilema laxum). **దుబ్బచెంగాలి** రూ.చూ. దుబ్బచెంగలి. వి. మాగాణిలో ఎక్కువగా మొలిచి పాకి పెరిగే కలుపు మొక్క. **దుబ్బచేయు** స.క్రి. చెక్కపట్టకుండా మట్టి పూయు. **దుబ్బజొన్న** వి. లావాటి గింజగల జొన్న. **దుబ్బతువ్వ** వి. లావుపాటి ఇసకరేణువులుగల నేల. **దుబ్బదొమ్మ** వి. పశువులకు వచ్చే ఒకరకం గుండె జబ్బు. **దుబ్బనాగలి** వి. తువ్వనేలలు దున్నే నాగలి. **దుబ్బనేల** రూ.చూ. తువ్వనేల. వి. దుమ్ము ఇసకతో కలిసి ఉండే నేల. **దుబ్బమన్ను** వి. ఎత్తుగా దిబ్బల్లాగ ఉన్నచోట దొరికే నల్లమన్ను. **దుబ్బవడ్లు** రూ. దుబ్బొడ్లు. వి.బ.వ. లావుగింజ గల ఒకరకం వడ్లు. **దుబ్బసెలక(-చెలక)** వి. తువ్వనేల. **దుబ్బొడ్లు** రూ.చూ. దుబ్బవడ్లు. వి.బ.వ. లావుగింజకల ఒకరకం వడ్లు.

**దుబ్బ**[3] విణ. లావైన.

క. దుబ్బ. లావైన మనుష్యుడు.

**దుబ్బసన్నం** రూ.చూ. దుబ్బుసన్నం. వి. ఒకరకం వడ్లు.

**దుబ్బి** రూ.చూ. దువ్వ. వి. ఎరుపు, నలుపు కలిగిన జిగట మట్టి.

**దుబ్బిగడ్డ** వి. భూమిలో పాతిన రాతి దిమ్మ.

**దుబ్బు** వి. **1.** తృణమూలం, గడ్డి మొదలు. శివధ. 5.9 ; **2.** చిన్న గడ్డికట్ట ; **3.** ఏపు, అతిశయం ; **4.** తుప్ప.

క. దిబ్బ, దిబ్బు. దిబ్బ, గుట్ట.

**దుబ్బుగడ్డి** వి. గరిక, లోతుగా పాతుకొన్న వేళ్ళుగల కలుపు మొక్క (Agrostis lineoris). **దుబ్బుచేయు** అ.క్రి. పంటచేలలో మొక్కలు బాగా పిలకలేర్పడి బలంగా విస్తరించు. **దుబ్బుసన్నం** రూ. దుబ్బసన్నం. వి. ఒకరకం వడ్లు.

**దుబ్బున** అవ్య. ద్రు. పుటుక్కున.

**దుబ్బురు** రూ.చూ. తువ్వర. వి. తుప్పర, పల్చగాపడే సన్న చినుకుల వాన.

**దుబ్బొడ్లు** చూ. దుబ్బ[2].

**దుమగతికేతు** వి. ధూమకేతువు, అరిష్ట సూచకమైన నక్షత్ర విశేషం, తోకచుక్క. ఆం.భా. 1.98.

సం. ధూమకేతు-. తోకచుక్క, ధూమగతికేతు- ; అ.మా. ధూమకేఉ.

<సం. దూమగతికేతు-.

**దుమదుమ** వి. తడిసినప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. భాగ. 9.322 ; విణ. కలిసిన, మేళవించిన. నిరంకు. 2.29, కోపదృష్టి.

క. దుమ-గుట్టు. దువందులాడు (ముఖం).

**దుమదుమగా(దడియు** అ.క్రి. చిత్తుగాతడియు. కళా. 3.74. **దుమదుమలాడు** అ.క్రి. కోపాదుల వలన చిరచిర లాడు. <దుమదుమ+-లు+ఆడు.

**దుమా** వి. రాయటం, చేయటం, పరిగెత్తటం మొదలైన వాటిలో అయిన ధ్వనికి అనుకరణం.

**దుమాదూళి** వి. అధికమైన దుమ్ము. సారంగ. 1.107.

క. దుమ. ధ్వనిని సూచించే శబ్దం ;

సం. ధూళి-. దుమ్ము.

**దుమారము** రూ. తుమారం, దుమ్మరము. వి. **1.** దుమ్ము. మను. 3.49 ; **2.** పెంధూళి, పెద్ద దుమ్ము. వసు. 2 28.

సం. దుర్మారుతి-. చెడుగాలి ; ప్రా. దుమ్మారయ. దుమ్మాదాయ.

<ప్రా. దుమ్మారయ.

**దుమారముచేయు** స.క్రి. వమ్ము చేయు. వర.రా.యు. 20 పు. 12 పం.

**దుమాలు** వి. సమూలం. ద్వి.భాగ. 9 స్కం.

మరా. దుమాలా, దుంబాలా. లోపలిభాగం ; పార. దుంబాలా.

**దుమికించు** చూ. దుముకు.

**దుమికియాడు** చూ. దుముకు.

**దుము** రూ.చూ. దుమ్ము[1]. వి. ధూళి, పరాగం.

**దుముకు** రూ. దూఁకు. అ.క్రి. **1**. పడు. పల్నా. పు. 100 ; **2**. ఉరుకు, గెంతు. పల్నా. పు. 113 ; **3**. ఉట్టిపడు, ఉట్టు. ఉ. హరిశ్చ. 4.24 ; వి. **1**. గంతు, ఉరుకు. వేంక. పంచ. 1.618 ; **2**. మల్లవిద్యావిశేషం. ప్రబంధ. 784.

క. దుమకు, దుమికు. పైనుండిగెంతు. దిణుక్క. గంతు. దుమ్, ధుమ్. పైనుంచి శరీరం హటాత్తుగా పడినప్పుడైన చప్పుడు ; తు. దుముకుని. పైనుంచి గెంతు, దుముకు.

**దుమికించు** రూ. దూఁకించు. స.క్రి. గుర్రం మొ॥ వాటిని ఉరికిస్తూనడిపించు. దశా. 2.19. <దుముకు + -ఇంచు[3]. **దుమికియాడు (-ఆడు)** అ.క్రి. గుర్రం వల్గితమనే గతితో పోవు. ఉ. హరిశ్చ. 3.131. **దుముకుకర్ర** వి. నాగకింద ఆపుగా పెట్టిన కర్ర. **దుముకులాడు** అ.క్రి. గంతులువేయు, ఉరుకులు వేయు. <దుముకు + -లు + ఆడు.

**దుముక్కు** వి. ఉరకటంలో అయిన ధ్వనికి అనుకరణం. రామాభ్యు. 8.143.

**దుముదారు[1]** వి. ముందరి సైన్యానికి కాపుగా వెనక ఉండే సేనానాయకుడు, సేన మొదలైనవి. మను. 3.74 ; విణ. ఒక్కుమ్మడి, సంకులం.

హిం. దుమ్‌దార్. తోకకలది ; మరా. దుమ్‌దారీ. అంతం, చివర ; ఉ. దుమ్‌దార్. తోకకలది ; పార. దుమ్‌దార్. తోకకలిగి ఉండటం, వెనకరావటం.

<ఉ. దుమ్‌దార్.

**దుముదారుదొర** వి. **1**. సేనానాయకుడు. మను. 3.45 ; **2**. రాజుకు వెనక కాపుదలకోసం ఉండే సేనానాయకుడు.

**దుముదారు[2]** వి. గుర్రం మొ॥ వాటి గతివిశేషం. ఉ. హరిశ్చ. 3.131.

**దుముదుము** చూ. దుముకు. వి. దుముకు ఆమ్రేడితరూపం, రామాభ్యు. 6.199.

**దుముదుములాడు** అ.క్రి. దుమ్ములురేగు, నిప్పులురేగు. <దుముదుము + - లు + ఆడు.

**దుమ్కి** రూ.చూ. డిమ్కీ. వి. కిందిమూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్య భాగంలో పొట్టలావుగా కూజామాదిరి ఉండే మట్టిపాత్ర.

**దుంప** వి. **1**. వేరు, మూలం. కు. సం. 9.155 ; **2**. మూలం, కందం. క్రీడా. 221 ; **3**. గెనుసుగడ్డ ; **4**. నాగటి గొడగ, కూటకం ; **5**. ఏడి కోలదూర్చే కొయ్యమొద్దు ; **6**. ఉపయోగం తీరిన నాగలి ; **7**. నాగలి చేయించటానికి తెచ్చిన కొయ్యమొద్దు ; **8**. గుద్దలి ; **9**. కోడిపిటలబండి (ఒకరకం బండి) కి ఉన్న రెండో అడ్డమొద్దు ; **10**. నీరు పెట్టి దున్నిన దుక్కి ; **11**. దున్నేనాగలి.

క. దుంప. మూలం.

**దుంపకుదంకొట్టు** స.క్రి. వాటకు అడుగు మూసిన తర్వాత ఒకవరస పెద్దగా కుదం సలపతో కొట్టు. **దుంపకూర** వి. కూరవండుకోటానికి పనికివచ్చే కూర. **దుంపకొమ్ము** వి. లావుగా పొట్టిగా బోడిగాఉండే కొమ్ము. **దుంపకొయ్య** వి. వేరుపురుగు పడి ఎండిపోయే వరి తెగులు. **దుంపచెక్కముల్లు** వి. దుంపచెక్కకు బిగించిన చేపదౌడ, పత్తినించి గింజలు వేరుచేసే పనిముట్టు. **దుంపతీయు** అ.క్రి. **1**. గడ్డ పెల్లగించు ; **2**. కొంపతీయు ; **3**. సమూలం పెల్లగించు ; **4**. మాంసం ఛేదించు. **దుంపతుత్తరి** వి. బెండలో ఒకరకం. **దుంపతెగ** వి. ఒకతిట్టు. **దుంపతెగులు** రూ. దుంపుతెగులు. దొంపుతెగులు. వి. ఒకరకం వరి తెగులు (Root Weevil). **దుంపతెంచు** స.క్రి. ఎక్కువగా కష్టపెట్టు. **దుంపతెంపు** చూ. దుంపతీయు. స.క్రి. ఎక్కువగా కష్టపెట్టు, **దుంపదుక్కి** వి. నీళ్ళుపెట్టి దున్నిన మాగాణి పొలం. **దుంపదుత్తరి** వి. బెండలో ఒకరకం. **దుంపనక్క** వి. మనసులోని విషయం చెప్పకుండా తీక్ష్ణంగా మొహం పెట్టడం. **దుంపనాగలి** వి. బురదనాగలి. **దుంపనాగులు** వి.బ.వ. ఒకజాతి పాములు. సిం. ద్వా. 8.100. **దుంపనాశనం** వి. సమూలంగా నాశనం కావటం. సం. నాశ-, నాశన-. చేటు, నశించటం. <దుంప + సం. నాశన- + -ము. **దుంపబచ్చలి** వి. ఊపోదక, మట్టుబచ్చలి. ఆం. భా. 2.72. **దుంపమినుగు** రూ.చూ. దుంపమినుము. వి. ఒకరకం పప్పుదినుసు. **దుంపమినుము** రూ. దుంపమినుగు, దుంపమినువు, దుంపమిన్ము. వి. అక్కిడి పైరుగా వేసే ఒకరకం పప్పు దినుసు. **దుంపమినువు** రూ.చూ. దుంపమినుము. వి. ఒకరకం పప్పుదినుసు. **దుంపమిన్ము** రూ.చూ. దుంపమినుము. వి. అక్కిడి పైరుగా వేసే ఒకరకం పప్పుదినుసు (Black gram), **దుంపరాష్టకము** రూ.చూ. దుంపరాష్టము వి. రాస్నావిశేషం. ఒకానొక మందు దినుసు. **దుంపరాష్టము** రూ. దుంపరాష్టకము. వి. రాస్నావిశేషం, ఒకరకం మందు దుంప. క. దుంపరాస్మె. ఒకరకం దుంప. **దుంపరేవడి** వి. మాగాణి చేలోని రేగడి. **దుంపలబడి** వి. క్రమశిక్షణ లేనిబడి. **దుంపశుద్ధిగపోవు** అ.క్రి. సర్వనాశనమగు. శుద్ధి-. పరిశుభ్రత, స్వచ్ఛత, పవిత్రత. <దుంప + సం. శుద్ధి + అగు + -అ[7] + పోవు. **దుంపసందు** వి. మందబొక్క, ఏడికోల దూర్చటానికి పణతలో కొట్టిన రంధ్రం.

**దుంపతెగులు** చూ. దుంప. రూ. చూ. దుంపతెగులు. వి. ఒకరకం వరి తెగులు.

**దుంబాలా** రూ.చూ. దుంబాలు. వి. ఖండగుత్త. సె. శా. సంపు. 2.

**దుంబాలు** రూ. దుంబాలా. వి. **1**. పన్ను లేక ఈనాముగా

ఇచ్చిన భూమి. నె. శా. కందుకూరు శా. క్రీ.శ. 1651; **2.** సమాప్తం; **3.** నాశం.

మరా. దుమాలా. దుంబాలా-. ఆధారం, వెనకభాగం; ఉ. దుమ్బాలా-. వెనక భాగం, చూక్కాను; పార. దుమ్బాల్. తోక. వీపు.

<ఉ. దుమ్బాల్.

**దుంబొడి** చూ. దుమ్ము[1].

**దుమ్మరమాడు** చూ. దుమ్మరము.

**దుమ్మరము** రూ.చూ. దుమారము. వి. దుమ్ము. సువంశా. 2.126.

**దుమ్మరమాడు** అ.క్రి. ధూళి చల్లుకొను. కృ. శకు. 2.162. <దుమ్మరము + ఆడు.

**దుమ్మాడు** చూ. దుమ్ము[1].

**దుమ్ము[1]** రూ. తుమ్ము, దుము, దుమ్మురు. వి. ధూళి, పరాగం. మను. 1.42.

క. దుంబు, దంబు. ధూళి; త. తుంపు, తంపు. ధూళి; కువి. దుమ్ము, ధూంబు; కొలా. దుబ్బ. చిన్న ధూళి మేఘం.

సం. ధూమ-. పొగ; ప్రా. ధుమ్మ-, ధూమ-; అ. మా. ధుమ్మ. పొగ; పా. ధూమ.

**దుంబొడి** వి. మెంతి, జీలకర్ర మొ॥ చేర్చిచేసిన మెత్తని కూరపిండి. రాజవా. 2.101. **దుమ్మాడు** అ.క్రి. ధూళి చల్లుకొను. కృ. శకు. 2.162. <దుమ్ము[1] + ఆడు. **దుమ్ముగా** క్రి. విశ. ద్రు. కావలసినన్ని. **దుమ్ముగుంటక** వి. విత్తనం వెయ్యకముందు మొలిచినగడ్డి పోవటానికి మెట్టలో తోలేగుంటక. **దుమ్ముచేయు** స. క్రి. ధూళిచేయు. **దుమ్ముతూరుపెత్తిపోయు** స.క్రి. నిందించు. **దుమ్ముతూరుపెత్తు** స.క్రి. చెడతిట్టు, దూషించు. శుక. 2.63. **దుమ్ముధూళి** వి. పిండిపిండి. భార. భీష్మ. 2.211. **దుమ్ముపావనం** వి. తొలకరికి ముందు పొలంలో గుంటకతో దున్నటం, మొదటి సాగు. **దుమ్మురేఁగకొట్టు** స.క్రి. విపరీతంగా కొట్టు. **దుమ్మురేఁచు** స.క్రి. కోరాడు. ఆం.భా. 3.132. **దుమ్మూదొడసరం** వి. ఎగిరిపోయిన పొల్లూ, పొట్టూ మొ. నవి. **దుమ్మెత్తిపోయు** స.క్రి. మిక్కిలిగా తిట్టు. <దుమ్ము[1] + ఎత్తిపోయు.

**దుమ్ము[2]** వి. ఎమ్ము, ఎముక. అచ్చ. రా. యు. 135.

**దుమ్ములగుండు** రూ.చూ. దుమ్ములగొండి. వి. ఒకానొక మృగం. **దుమ్ములగొండి** రూ. దుమ్ములగుండు, దుమ్ములగొండు. వి. మృగవిశేషం, కొర్నవగుండు. **దుమ్ములగొండు** రూ.చూ. దుమ్ములగొండి. వి. ఒకానొక మృగం. **దుమ్ముల పండుగ** వి. కణుగు పండుగ.

**దుమ్మురు** రూ.చూ. దుమ్ము[1]. వి. ధూళి.

**దుమ్మూదొడసరం** చూ. దుమ్ము[1].

**దుమ్మెత్తిపోయు** చూ. దుమ్ము[1].

**దుయు** రూ.చూ. దుయ్యు. స.క్రి. దూయు.

**దుయుముడి** రూ.చూ. దూయుముడి. వి. సులభంగా ఊడదీయడానికి వేసేముడి, జారుముడి. చంద్రభా. 2.35.

**దుయ్యఁబట్టు** చూ. దుయ్యు.

**దుయ్యఁబట్టుకొను** చూ. దుయ్యు.

**దుయ్యానసారంచు** చూ. దుయ్యు. వి. తెల్లదారం, రంగుదారం. ఒక్కొక్క కొలికి చొప్పున వరసగాపెట్టి, నిలువుగా గీరలు పడేట్టు నేసిన అంచు.

**దుయ్యు** రూ.చూ. దుయ్యు. స.క్రి. **1.** తెంచు. హరి. పూ. 5.219; **2.** ఒరనుంచి కత్తి మొ. తీయు, లాగు. సారంగ. 2.235; అ.క్రి. **1.** వెడలు. భోజ. 7.94; **2.** బాణం మొ. రంధ్రం చేసికొనిపోవు. అము. 5.115.

**దుయ్యఁబట్టు** స.క్రి. **1.** బాధపెట్టు; **2.** పదేపదే ఇబ్బందిపడు. <దుయ్యు + -అ[7] + పట్టు. **దుయ్యఁబట్టుకొను** స.క్రి. సమాధానం చెప్పమని నిర్బంధించు. <దుయ్యు + -అ[7] + పట్టుకొను. **దుయ్యుముడి** రూ.చూ. దూయుముడి. వి. సులభంగా ఊడదీయటానికి వేసే ముడి, జారుముడి.

**దుయ్యేదుగుజ్జు** వి. రెండు కొయ్యలతో నిలిపిన గుజ్జు.

సం. ద్వేక-. రెండు; ప్రా. దు.

<దు + ఏరు[1] + గుజ్జు.

**దురంగి** రూ.చూ. దురంగీ. వి. రెండు రంగులు కలిసిన రంగు. శశా. 4.202.

**దురంగినేత** వి. పడుగుకి ఒకరంగు, పేకకు మరొక రంగు నూలు పెట్టి నేసిన (గట్టి) నేత. **దురంగిరుమాలు** వి. ఒకరకం తలపాగ.

**దురంగీ** రూ. దురంగి. వి.బ.వ. రెండురంగులుగల వస్త్రాలు. హంస. 5.360.

హిం. దోరంగీ. రెండు రంగులు గలది; ఉ. దోరంగీ.

<హిం. దోరంగీ.

**దురంగీచీర** వి. నిలువు పోగులు ఒకరంగువి, పేక పోగులు మరొకరంగువి నేసిన రెండురంగుల కలనేత చీర.

**దురటిల్లు** రూ.చూ. దురపిల్లు అ.క్రి. **1.** శోకించు, దుఃఖించు. కు.సం. 8.146; **2.** పరితపించు. రాఘవ. 4.238.

**దురద** వి. **1.** జిల, కండూతి. ఆం.భా. 2.129; **2.** కనరు.

క. తుఱి. దురద, పగుళ్ళు, దురదవేసేట్లనిపించు, కోరిక, తుఱిత, తుఱు. దురద; తు. తొజ్జ. దురద; త. కొఱి (-చ్-,-ట్ప్). దురదవేయు; మ. కొఱి. దురద, కొఱియుక. ఎవరికి వారు గోక్కాను; కో. తొష్ (తొర్క్). దురదవేయు; తొ. ట్వాల్తై; గోం. సోహితానా, చొహ్నా;

సం. ద్రదు-. దురద.

**దురదకంద** వి. సారవంతమైన ఒదులు నేలల్లో సాగుచేసి పెంచేదుంపపైరు, కనరుకంద. (Amorphalius campanulatus). **దురదగొండి** వి. కండూర, దూలగొండి. ఆం.భా. 2.54 (Sragical involucrata). **దురదగొండి ఆకు** వి. దూలగొండి, శరీరానికి తగిలితే దురదపెట్టే ఆకు. **దురదగోవెల** వి. కండూర, దూలగొండి. ఆం.భా. 2.54. **దురదపెట్టు** స.క్రి. దురదకలిగించు; అ.క్రి. దురదకలదగు. **దురదవేయు** అ.క్రి. దురద కలదగు.

**దురదుర** క్రి.విశ.ద్రు. శీఘ్రంగా. భాగ. 10 పూ. 1142; వి. వేగంగా వెళ్ళడంలో అనుకరణం.

**దురదురనఁజొచ్చు(-చొచ్చు)** అ.క్రి. వేగంగా ప్రవేశించు.

సారంగ. 3.35.

**దురంతము** వి. చెడ్డపని.

నం. దురంత-. అంతంలేనిది.

<నం. దురంత- (అర్థవిపరి.).

**దురపిలు** రూ.చూ. దురపిల్లు. అ.క్రి. **1.** శోకించు, దుఃఖించు. ప్రభా. 5.173 ; **2.** పరితపించు. వాసిష్ఠ. 1 123.

**దురపిల్లు** రూ. దురటిల్లు, దురపిలు. అ.క్రి. **1.** పరితపించు. కు.సం. 5.155 ; **2.** శోకించు, దుఃఖించు. కు.సం. 6.159 ; **3.** కలగు, కలతపొందు. జైమినిభా. 6.55 ; **వి.** వ్యథ, దుఃఖం. ఆం.భా. 1.150.

**దురము**[1] వి. యుద్ధం. కు.సం. 10.139.

నం. ఉదర-. ఊక కోతగా చంపటం.

<నం. ఉదర-.

**దురము**[2] వి. **1.** నృత్త గీత వాద్యాల్లో వేగం. ప్రబంధ. 108 ; **2.** వేగం. శశా. 3.110.

నం. త్వరా. వేగం.

దురమెక్కు అ.క్రి. విజృంభించు, చెలరేగు. శశా. 3.112.

<దురము[2] + ఎక్కు.

**దురమెక్కు** చూ. దురము[2].

**దురస్తు** వి. బాగు, మరమ్మతు.

హిం. దురుస్త్. మంచిదశలో ఉన్న, ఉచితమయిన, యదార్థమయిన ; ఉ. దురుస్త్ ;

త. తురస్త్. పరిశుద్ధత.

<ఉ. దురుస్త్.

దురస్తుచేయు స.క్రి. బాగుచేయు, మరమ్మతుచేయు.

**దురా** రూ.చూ. దురాయి. వి. ఆజ్ఞ.

దురాపెట్టు(-పెట్టు) స.క్రి. శాసించు. శశా. 3.48.

**దురాతము** వి. ఒరిగేదిండు.

**దురాయి** రూ. దురా, దురాయీ. వి. **1.** ఆజ్ఞ. శాసనం. కృష్ణ రా. 1.2 ; **2.** ఒట్టు ; **3.** రాయిలాగ గట్టిపడి పోయినది.

మరా. దురాహీ. నిషేధాజ్ఞ, రాజుపేర వెళ్ళే నిషేధాజ్ఞ.

**దురాయిత్రాడు** వి. ఆజ్ఞచేసేతాడు, దాటి రాకూడదని హద్దుపెట్టేతాడు. ఇందు. 5.19. దురాయిపెట్టు స.క్రి. తప్పు చేసిన కుమ్మరిని దండించు. **దురాయిమోకు** వి. బండికాడి నుంచి పోలుగర్ర కిందుగా దొలుపు వరకు అమర్చినతాడు.

**దురాయీ** రూ.చూ. దురాయి. వి. ఆజ్ఞ.

**దురాస** వి. దురాశ.

నం. దురాశా. చెడ్డకోరిక.

<నం. దురాశా.

**దురితము** వి. **1.** కష్టం. దశకు. 2.76 ; **2.** ఆపద.

నం. దురిత. పాపం.

<నం. దురిత- (అర్థవిపరి.).

**దురిసిపోవు** అ.క్రి. కట్టె మొదలగునవి చెదలెక్కిపోవు.

**దురిసెన** రూ.చూ. దిరిసెము. వి. 30-40 అడుగుల ఎత్తు పెరిగే ఒక పెద్దచెట్టు.

**దురీన** క్రి. విణ. ద్రు. తటాలున. యమా. 3.71.

నం. త్వరా. వేగం.

**దురుడు** వి. నక్షత్రం.

నం. ధ్రువ-. ఒకనక్షత్రం.

<నం. ధ్రువ-.

**దురువదములు** చూ. దురుసు.

**దురుమండచుక్క** వి. ధ్రువనక్షత్రం.

నం. ధ్రువమండల-. ధ్రువ నక్షత్రమండలం.

< నం. ధ్రువమండల- + చుక్క.

**దురువరము** వి. నీచజాతి. కువ. చ. 1.40.

నం. దుర్. చెడ్డ.

**దురువు** రూ.చూ. దొరువు. వి. ఉద్ది, మోటబావి, కుంట మొ॥ వాటినుంచి నీళ్ళుతోడి పోసేవైపు ఎత్తుగా కట్టిన కట్ట.

**దురుసు** విణ. **1.** అభేద్యమైనగట్టి. ఉ. రా. 6.198 ; **2.** హెచ్చైన, అధికమైన. ఇందు. 2.5 ; **3.** నడలని. దశా. 8.378 ; **వి.** **1.** కాఠిన్యం. విష్ణుపు. 2ఆ ; **2.** విధం. ప్రబంధ. 788 ; **3.** వేగం, తొందర. దశా. 7.1.

త. తురుచు. వేగం, నిశ్చయం, పట్టుదల.

**దురుపదములు** వి.బ.వ. త్వరగా వేసే పాదవిన్యాసాలు. దశా. 7.1.

**దురెండు** అ.క్రి. **1.** పూర్తిగా ఎండిపోవు ; **2.** ఎండీ ఎండకుండు.

నం. దుర్-. చెడ్డ.

<నం. దుర్- + ఎండు.

**దుర్తిరంగు** వి. దుర్తిరంగు చెక్కలతో తయారుచేసిన ఎరుపు రంగు.

**దుర్ధ** వి. తనకు లభించలేదనే బాధ.

నం. దుర్ధీ. చెడ్డబుద్ధికలవాడు.

<నం. దుర్ధీ.

**దుర్బిని** రూ.చూ. దుర్బిణి. వి. **1.** నేలమట్టం సరిచూడటానికి 'టిటి' లాగ ఉపయోగపడే తాపీపనివాళ్ళ పరికరం ; **2.** దూరంగా ఉన్న దానిని చూపేయంత్రం.

**దుర్బిణి** రూ. దుర్బిని. వి. **1.** నేల మట్టం సరి చూడడాని 'టిటి' లాగా ఉపయోగపడే తాపీపని వాళ్ళ పరికరం, **2.** దూరంగాఉన్న దానిని చూపే యంత్రం

మరా. దుర్బిణ-. సూక్ష్మదర్శిని ; పార. దూర్బీన్, దూర్బాన్. చూచు.

<మరా. దుర్బిణ-.

**దుల** రూ.చూ. తొలి[2]. వి. రాతిలోగాని కొయ్యలో గాని తొలిచిన రంధ్రం.

**దుల(గొట్టు** చూ. దులు.

**దులదుల** వి. **1.** వెళ్ళటం మొ॥ వాటిలో శీఘ్రతకు అనుకరణం. హంస. 1.138 ; **2.** పొడి.

**దులదులనగు** అ.క్రి. పొడిఅగు. కాశ. 3.68. **దులదుల వచ్చు** అ.క్రి. త్వరగావచ్చు. రాధికా. 2.107 ధ్వన్యను.

**దులపసన్నం** వి. వడ్లలో ఒకరకం.

**దులపుకావ** వి. స్వాధీనం, వశం. నె. కా. దర్శి. క్రీ.శ. 1429.

**దులాబి** వి. దూబరతిండి.

త. తులాసి. దూబరాచేసే, విపరీతమైన అనవసరమైన ఖర్చుచేసే.

**దులిపివదలిపెట్టు** చూ. దులుపు.

**దులిపివేయు** చూ. దులుపు.

**దులు** రూ.చూ. డుల్లు. అ.క్రి. రాలు, పడు.

**దులగొట్టు** చూ. డుల్లు. స.క్రి. దులుపు, రాల్చు. **దులుచు** రూ.చూ. డులుచు. స.క్రి. రాల్చు, రాలజేయు.

**దులుపు** చూ. డుల్లు. స.క్రి. 1. మేల్కొనజేయు. పి. శకు. 2.115; 2. రాల్చు, పడజేయు. భోజ. 6.185; 3. జాడించు, విదిలించు. శేషధ. 2.53; 4. నిందావాక్యాలు పలుకు.

క. డులుపు. రాల్చు, దులుపు. ధూళి పోవడానికై కదల్చు; కుఇ. డోప (డోట్). కిందపడు, నిద్రించు, పడవేయు; కువి. యాలినై. నిద్రించు; కొలా. డొల్ (డొల్ట్). కిందపడు, రాలు, పడు.

**దులిపివదలిపెట్టు** స.క్రి. తిట్టు. **దులిపివేయు** స.క్రి. జాడించు, నిందావాక్యాలు పలుకు.

**దులుము** స.క్రి. సంఘటించు, కూర్చు.

**దుల్లకోల** చూ. దుల్లు.

**దుల్లగుంజ** చూ. దుల్లు.

**దుల్లగొట్టు** చూ. దుల్లు.

**దుల్లడీలదండ** వి. ఆరు పలకల (పార్శ్వములు) గండ్లుగల బంగారు పూసలతో ఒకపేటకంటె ఒకపేట పెద్దదిగా చేసిన హారం.

సం. ద్వి. రెండు; ప్రా. దు.

<ప్రా. దు+లడీలదండ.

**దుల్లు** రూ.చూ. డుల్లు. అ. క్రి. 1. రాలు, పడు; 2. ఏకే ముందు దూదిని చీపురు పుల్లలతో విదిలించి దుమ్ము దులుపు; 3. నూలుపెట్టెవిప్పి పిడులన్నీ విదిలించు.

**దుల్లకోల** చూ. దుల్లు. వి. రంగు అద్దిననూలులడీలు గుంజకు తగిలించి పిండేకర్ర. **దుల్లగుంజ** చూ. దుల్లు. వి. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట. **దుల్లగొట్టు** స.క్రి. 1. నూలువిదిలించు; 2. పూర్తిచేయు. **దుల్లుకర్ర** వి. పత్తిలో తుక్కూదూగరా రాలగొట్టే కట్టె.

**దుళ్ళగొట్టు** చూ. డుల్లు. స.క్రి. 1. కిందపడేలాగ చెల్లకాయలు మొదలైన వాటిని కొట్టు; 2. నరిచేనేటప్పుడు పడుగును చేత్తోతట్టు; 3. నూలు మొ॥ వాటిని విదిల్చి పట్టువిడగొట్టు.

**దుళ్ళవేయు** చూ. డుల్లు. స.క్రి. రంగు అద్దిన నూలులడీలు, పిడుపు కర్రతో దులుపు.

**దువ** రూ.చూ. దుగ². వి. రెండు. మల్లియపూడి శాసనం. క్రీ.శ. 945-46.

**దువాడ** వి. తాపీలోని పలచటి లోహభాగం.

మరా. దుమాలా. వెనకభాగం.

<మరా. దుమాలా.

**దువాడించు** రూ.చూ. దువాళించు. అ.క్రి. 1. అశ్వాదులు ప్లుతగతితో నడుచు. అష్టమ. క. 1.51. పు. 7పం; 2. ప్రసరించు; స.క్రి. 1. గుర్రం మొ॥ వాటిని ఏకధాటిగా పరిగెత్తించు; 2. వ్యాపింపచేయు.

**దువాబు** వి. రెండునదుల మధ్య ఉండే క్షేత్రం.

హిం. ఉ. దుతిబ్. దుఆబా. రెండునదుల మధ్య నుండే క్షేత్రం; పార. దుఆబహ్.

<ఉ. దుఆబ్.

**దువారము** రూ. దారము³, దువ్వారము, దోరము. వి. వాకిలి, ద్వారం. రసిక. 6.189.

సం. ద్వార-. వాకిలి; ప్రా. దుఆర, దువార-, దుఆర-, దార-, దోరవార-; జై.మహా. దువారం; శౌ. దువారం; అ.మా. దువారం. ద్వారం, దువార. కిటికీ; మా. దాలం, దుఆలం, దువాలం; పా. దారం, ద్వారం; అప. దుఆరం, దారం;

క. దర, దార, దొర; తు. దోర; గోం. దుఇర్; కుఇ. దార; కువి. దార, దువేరి; పర్జి. దువార్.

<ప్రా. దువార-.

**దువాళము** రూ.చూ. దువాళి. వి. వేగం అంతటా సమంగా ఉండే అశ్వధార, ప్లుతం. నిరంకు. 2.19.

**దువాళి** రూ. దువాళము, దువ్వాళి. వి. 1. అశ్వధారా విశేషం, అశ్వప్లుతం. వరాహ. 5.90; 2. పరుగు, గంతు. వేంక. పంచ. 3.50; 3. పల్లకీ బోయీలు పలికే మాటల్లో ఒకటి. ప్రబంధ. 605.

సం. ధ్రువకాల-. స్థిరగతి; ప్రా. ధువాల-.

<ప్రా. ధువాల-.

**దువాళిగా(గ)దోలు(-తోలు¹)** స.క్రి. గుర్రాలు మొ॥ వాటిని ప్లుతగతితో నడిపించు. కువ.చ. 3.111. **దువాళిచేయు** రూ. దువాళిసేయు. అ.క్రి. 1. విజృంభించు. క్రీడా. 45; 2. పరిగెత్తు; స.క్రి. పరిగెత్తించు, తరుము. క్రీడా. 47. **దువాళించు** రూ. దువాడించు. అ.క్రి. 1. వేగాన్ని పొందు. పి.శకు. 2.127; 2. ప్రసరించు. హంస. 1.67; స.క్రి. 1. (అశ్వాదుల్ని) ప్లుతగతి విశేషంతో నడుపు; 2. ప్రసరింపచేయు, వ్యాపింపచేయు. వసు. 5.94. **దువాళి(దోలు(-తోలు¹)** స.క్రి. అశ్వాదుల్ని ప్లుతగతితో నడిపించు. చంద్రాంగ. 1.70. **దువాళిసేయు(-చేయు)** రూ.చూ. దువాళిచేయు. స.క్రి. పరుగెత్తించు, తరుము. క్రీడా. 48.

**దువురు** వి. నిగురు కాలి బొగ్గులు తెల్లగా కావడం.

**దువెనకొమ్ము** రూ.చూ. దువ్వెనకొమ్ము. వి. వెనక్కు సాపుగా పెరిగినకొమ్ము.

**దువేరి** వి. రెండువైపులా గదులుండి "L" ఆకారంలో ఉండే ఇల్లు.

సం. ద్వార్, ద్వార-. వాకిలి; ప్రా. దుఆర-, దువార; హిం. దువార్.

<ప్రా. దువార-.

**దువ్వ** రూ. తువ, తువ్వ, తువ్వు¹, తూవ, తొవ్వ², తో. దుబ్బ², దుబ్బి. వి. 1. పరాగం. చంద్రాంగ. 4.80; 2. కణం, పలుకు. పార్వ. 2.5. 3. దుమ్ము, ధూళి. ఆం.భా. 2.220;

గోం. దుబ, దుబా, దుము, దుముల్, దుమ్ము; కువి. ద్యూమ్బు.

**దువ్వకుంచె** రూ.చూ. దువ్వుకుంచె. వి. నరిచేనేటప్పుడు పడుగు ఆరే పదునులో ఉండగా నందు నందుకూ అవుతూ

దువ్వే కుంచె.

**దువ్వటము** రూ.చూ. దుప్పటము. వి. విలువగల సన్నని వస్త్రం. ద్వి.భాగ. 1 స్కం.

**దువ్వటిల్లు** రూ.చూ. దూపిల్లు. అ.క్రి. దప్పిగొను.

**దువ్వంట** చూ. దుగ². వి. దుగలం, రెండు బేడలు, వరహాలో పదహారో వంతు. ద్వి.భాగ. 10 స్కం.

**దువ్వనపల్లు** చూ. దువ్వెన. వి. కుండలు వానేటపుడు అంచు దగ్గర గీతలు గీయడానికి ఉపయోగించే దువ్వెన పల్లు.

**దువ్వబుడ్డి** వి. పెరుగుతోడు పెట్టుకొనే చిన్న ముంత.

త. తువ్వై. ద్రవపదార్థం.

<త. తువ్వై + బుడ్డి.

**దువ్వలువ** రూ.చూ. దువ్వలువు. వి. 1. విలువగల సన్నని వస్త్రం. శృం.నై. 6.22 ; 2. వస్త్రం. పారి. 2.12.

**దువ్వలువముడుచు** స.క్రి. బట్టకట్టు. హర. 4.90.

**దువ్వలువు** రూ. దువ్వలువ, దువ్వల్వ, దూవలువ, దూవల్వ. వి. సన్నని వస్త్రం. కు.సం. 8.59.

<దువ + వలువు.

**దువ్వల్వ** రూ.చూ. దువ్వలువు. వి. ఖరీదైన సన్నని వస్త్రం.

**దువ్వాటము** విణ. డోలాందోళితం, ఇటుఅటు పాలు పోనిది.

<దువ + వాటము.

**దువ్వాని** చూ. దువ్వు².

**దువ్వానిపుల్ల** చూ. దువ్వు².

**దువ్వారము** రూ.చూ. దువారము. వి. ద్వారం, తలుపు.

**దువ్వాళి** రూ.చూ. దువాళి. వి. పరుగు. ప్రభు. 5.143 ప. 10 పం.

**దువ్వి** రూ.చూ. దువ్వు¹. వి. 1. పెద్దపులి ; 2. చిరతపులి.

**దువ్వు¹** రూ. దువ్వి. 1. చిరతపులి. భార.శాంతి. 3.92 ; 2. పెద్దపులి, వ్యాఘ్రం.

త. ఉఴువై. పులి ; గోం. డూ, డూఅల్, దుహల్ ; ప. దూ ; కొలా. దువ, డు. చిరతపులి ; గ. దుక్కా. నక్క ;

సం. ద్వీపిన్‌-. పులి, చిరుత.

**దువ్వునుచూచినక్కయొడలుగాల్చికొను** స.క్రి. పులిని చూచి నక్క వాతలువేసికొను. ఉ.హరి. 4.165.

**దువ్వు²** స.క్రి. 1. (తల చిక్కుతీయు, చక్కజేయు. కు సం. 6.52 ; 2. వాత్సల్యంతో స్పృశించు, నిమురు. భాగ. 10 పూ. 358 ; 3. బుజ్జగించు.

త. ఉఴు. (జుత్తు) చక్కజేయు, సరిదిద్దు, దువ్వు ; కు.ఇ. డూస. రుద్దు, చదునుచేయు ; కువి. టూస్. తల దువ్వు (ఇతరుల జుట్టు), టూచ. దువ్వెన ; పర్జి. ఉడ్. దువ్వు ; గ. ఉతవ్. దువ్వు.

<మూ.ద్రా. *ఉట్-.

**దువ్వాని** రూ.చూ. దువ్వెన. వి. దువ్వెన. **దువ్వానిపుల్ల** వి. కుండ వానేటపుడు అంచుదగ్గర గీతలుగీయడానికి ఉపయోగించే దువ్వెనపల్లు. **దువ్వుకుంచె** రూ. దువ్వకుంచె. వి. నరిచేసేటప్పుడు, పడుగు ఆరుపదునులో ఉండగా, సందు (= రెండుకచ్చుల మధ్యభాగం) సందుకూ ఆవుకూ దువ్వేకుంచె. **దువ్వుకొను** స.క్రి. మంచిమాటలతో వలలో వేసుకొను. **దువ్వెన** రూ. దువ్వాని, దూబానె, దూవాని. వి. దువ్వటానికి ఉపయోగించే సాధనం, కంకతిక. మను. 3.2. తు. దూబిన. దువ్వెన. **దువ్వెనకొమ్ము** రూ దువ్వెన కొమ్ము. వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము. **దువ్వెనంచు** వి. తెల్లదారం, రంగుదారం ఒక్కొక్క కొలికి చొప్పున వరసగా పెట్టి, నిలువుగా గీరలుపడేట్టు నేసిన అంచు.

**దువ్వెన** చూ. దువ్వు².

**దువ్వెనకొమ్ము** చూ. దువ్వు².

**దువ్వెనంచు** చూ. దువ్వు².

**దువ్వెర** రూ.చూ. దూబిడి. వి. కొణతలిదిమ్మ.

**దువ్వేనచెక్క** చూ. దువ్వెన. వి. కుండలు వానేటపుడు గీతలు గీయడానికి వాడే దువ్వెన.

**దుశాక** వి. తలుపుల కునులు అరిగిపోకుండా నేలలో బిగించిన ఇనపబద్ది.

సం. ద్వి-. రెండు, శాఖా. కొమ్మ ; ప్రా. దు. రెండు.

**దుశాలు** వి. ఒళ్ళు తుడుచుకోటానికిగాని, కండువా మాదిరిగా భుజం మీద వేసుకోటానికి గాని నేసిన బట్ట.

సం. ద్వి-. రెండు ; ప్రా. దు.

<ప్రా. దు + శాలు.

**దుష్టికుండ** రూ.చూ. దిష్టికుండ. వి. దిష్టి తగలకుండా పొలంలో నిలబెట్టే ఒకరకం కుండ.

**దుసర** రూ.చూ. దుస్సర. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క.

**దుసరులు** వి.బ.వ. అతిశయం.

సం. దుఃస్వర- కఠిన కంఠధ్వని ; ప్రా. దుస్సర-.

**దుసరులువాఱు(-పాఱు)** రూ. దుసురులువారు. అ.క్రి. క్రేళ్ళురుకు. నవనాథ. 1.47 ప. 1 పం.

**దుసల** రూ. దూసడ. వి. పారుడురోగం.

**దుసార** రూ.చూ. దుస్సర. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క.

**దుసి** రూ. దూసి. వి. బూడిద, వస్తువులు కాలగా మిగిలిన పొడి.

**దుసికిపోవు** చూ. దుసుకు.

**దుసికిలఁబడు** చూ. దుసుకు.

**దుసికిలఁబాఱు** చూ. దుసుకు.

**దుసికిలు** చూ. దుసుకు.

**దుసికిల్లు** చూ. దుసుకు.

**దుసుకు** అ.క్రి. జారు. ముకుంద. 3.243.

క. డొసక, దొసక. జారు, మట్టిలోకాలు జారినపుడు కలిగే శబ్దం ; కురు. తుసుగ్నా. అల్లినదారాలు విప్పు, గట్టిగా కట్టిన దానిని వదులుచేయు.

**దుసికిపోవు** అ.క్రి. జారిపోవు, దిగజారు. **దుసికిలఁబడు** అ.క్రి. జారు. బహుళా. 4.32. <దుసికిలు + -అ⁷ + పడు. **దుసికిలఁబాఱు** అ.క్రి, జారు. శుక. 2.413. <దుసికిలు + -అ⁷ + పాఱు. **దుసికిలు** రూ. దుసికిల్లు. అ.క్రి. 1. జారు. ఆము. 2.65 ; 2. తప్పుకొను, తొలగు. రామాభ్యు. 7.20. **దుసుకిల్లు** రూ.చూ. దుసికిలు. అ.క్రి. 1. జారు ; 2. తప్పు కొను, తొలగు.

**దుసుమను** వి. శత్రువు.

హిం.ఉ.పార. దుశ్మన్. శత్రువు.

<ఉ. దుశ్మన్.

**దుసురులువారు(-పాఱు)** రూ.చూ. దుసరులువాఱు. అ.క్రి. అతిశయించు.

**దుసెళ్ళిపోవు** అ.క్రి. దూసుకుపోవు.

**దుసే** రూ.చూ. దుస్సర. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క.

**దుసేర** రూ.చూ. దుస్సర. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క.

**దుస్తు** వి. **1**. వస్త్రం, బట్ట. శ్రీనాథుని చాటువు. 1.128 ; **2**. అందం ; విణ. అధికమైన. చంద్రాంగ. 3.79.

క. దుస్తు. వస్త్రం.

**దుస్తురుమాలు** వి. గీరలుగల చిన్న రంగురుమాలు. **దుస్తులుతీయు** స.క్రి. ముడతలుతీయు. **దుస్తులుపోవు** అ.క్రి. చీరెలు ఉతకగానే నేత మంచిదిగాక దూర దూరమగు.

**దుస్తులు** వి.బ.వ. అతిసారం.

హిం.ఉ. దస్త్. విరోచనం.

<ఉ. దస్త్ + -లు.

**దుస్రా** విణ. రెండవ. వాసిరెడ్డి రామబాబుపై చెప్పిన చాటువు.

హిం. దూస్రా. రెండవ ; ఉ. ద్యూస్రా.

<హిం. దూస్రా.

**దుస్సబీకు** చూ. దుస్సు[2].

**దుస్సర** రూ. దుసర, దుసార, దుసే, దుసేర, దూసర. వి. **1**. వత్సాదనివృక్షం. హంస. 4.132 ; **2**. సుదర్శనలత.

**దుస్సేసుఁడు** వి. దుర్యోధనుని తమ్ముడు, దుశ్శాసనుడు. భార. అరణ్య. 1.139.

సం. దుశ్శాసన-. దుర్యోధనుని తమ్ముడు ; ప్రా. దుస్సాసణ, దూసాసణ, దుస్సాసన ; మా. దుశ్శాశణ ;

త. తుచ్చాతనన్.

<ప్రా. దుస్సాసన-.

**దుస్సిపోవు** చూ. దుస్సు[2].

**దుస్సు[1]** వి. పశువులు పుర్రుగా పారినది.

హిం.ఉ. దస్త్. విరోచనం.

<ఉ. దస్త్.

**దుస్సు[2]** స.క్రి. **1**. తీసివేయు ; **2**. దూయు.

**దుస్సబీకు(-పీకు)** స.క్రి. పడుగులో దూర్చిన లాకలు ఊడదీయు. **దుస్సిపోవు** రూ.చూ. దూసిపోవు. స.క్రి. **1**. కూరు ; **2**. తీసివేయు. **దుస్సుముడి** వి. జారుముడి. **దుస్సుముడివేయు** స.క్రి. జారుముడివేయు. **దుస్సుపోవు** అ.క్రి. తుస్సుమనిపోవు. భార. శాంతి. 4.399.

**దుహిలీ** వి. హస్తాభరణ విశేషం. నవనాథ. 163 పు. 19 పం.

మరా. దుహేలీ, దుహేరా, దుహేరీ. జంట ; పార. దువాల, దువాలక్. తోలుపట్టీ, చిన్నపట్టీ.

**దూకదూము** వి. ఒకరకం చేప (Calbichrons birnaculatus).

**దూకపెయ్య** వి. పాలు విడవని పెయ్య.

**దూకీ** రూ.చూ. డూకీ. వి. కొయ్యముక్క.

**దూగ** చూ. దుగ. వి. పచ్చీసు మున్నగు ఆటల్లో రెండుచిత్తుల పందెం.

**దూగరరాసి** చూ. దూగలు[2]. రూ. దూగ్రరాసి. వి. తూర్పారపొయ్యకముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యంరాసి.

**దూగ్రరాసి** రూ.చూ. దూగరరాసి. వి. తూర్పారపొయ్యకముందు పొట్టుతో కలిసిఉన్న ధాన్యంరాసి.

**దూగలు[1]** వి. కరదూపం.

<దూపము + కలు.

**దూగలు[2]** రూ. దూగళి, దూగళ, దూవర[1]. వి. ధాన్యంలో ఉండే ధూళి.

క. దూళ్ (ఉ). ధూళి, పొడి ; దూళు, ధూళు. ధూళి ; త. తూకళ్. ధూళి, ధూళికణం, తుప్పు, తూల్. ధూళి, పొడి ; మ. తూళ్, ధూళి. ధూళీ ; కొం. దూలి ; కుఇ. దూలి ; కువి. దూలి ; పర్జి. దూల్, ధూళి ; కొలా. తుక్ ; గ. దూలి ; కురు. ధూలి.

పో.చూ.సం. ధూళి-. దుమ్ము.

**దూగళి** రూ.చూ. దూగలు[2]. వి. వడ్లు, అరికెలు మొ. వాటి గింజల పొట్టు.

**దూగళ** రూ.చూ. దూగలు[2]. వి. ధాన్యంలో ఉండే ధూళి.

**దూగిలాట** చూ. దూఁకు. వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

**దూగొమ్ము(-కొమ్ము)** వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము.

**దూఁకలి** వి.బొ. బాధ. భీమ. 2.124.

సం. దుఃఖ-. క్లేశం, ఖేదం, పీడ ; ప్రా. దుక్ఖ ; అప. అ.మా., జై.మహా., జై.శౌ., పా., మా. దుక్ఖ-.

<ప్రా. దుక్ఖ-.

**దూఁకించు** చూ. దూఁకు.

**దూఁకు** రూ.చూ. దుముకు. అ.క్రి. **1**. దుముకు, ఉరుకు. అని. 4.32 ; **2**. గంతువేయు.

క. దుముకు, దుమికు. మీదనుండి కిందకిదుముకు, డొక్కు. గంతు, దుమికుక్కు, దుమ్మికుక్కు. ధుమ్. 'ధం, అనే శబ్దంతో దుముకు ; త. దుముకుని. కిందకు గంతు, వేగంగా కిందకి దిగు.

**దూఁకించు** రూ.చూ. దుముకించు. స.క్రి. దూకేటట్లు చేయు. <దూఁకు + -ఇంచు[3]. **దూఁకుడు** వి. **1**. వల్గితం. అశ్వగతి విశేషం. ఆం.భా. 2.198 ; **2**. వేగం, త్వర ; **3**. తొందరపాటు ; **4**. కిందికి వాలుగా ఉండే దారి ; విణ. ఎగుడు దిగుడు. **దూఁకుడుజిల్ల** రూ. దూజిల్ల. వి. మోటమోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్యముక్క.

**దూఁకొను** చూ. దూఁటు.

**దూచి** వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146.

సం. దూష్య-. డేరా, వస్త్రం ; ప్రా. దూస-. గుడ్డ.

**దూజారుకొమ్ము** వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము.

**దూజిల్ల** రూ.చూ. దూఁకుడు జిల్ల. వి. మోట మోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్యముక్క.

**దూటం** రూ.చూ. దూఁట. వి. తొలికలుపు, నారుమడిలో

తీసే కలుపు.

**దూడ** చూ. దుడ్డె. వి. **1.** పశుజాతి శిశువు, లేగ, క్రేపు. నార.పంచ. 5.11 ; **2.** ఇది నిందలో చిన్నపిల్లలకు ప్రయుక్తమవుతుంది. కువ.చ. 2.26.

**దూడనరం** వి. ఏకుబద్ద కొనలకు కట్టిన జంతునరం. **దూడపాల** వి. గోపిక, సుగంధిపాల, వృక్షవిశేషం. ఆం. భా. 2.57. **దూడపెయ్య** వి. లేతఆవుదూడ. **దూడలగొట్టిగాఁడు** వి. ఒకరకమైన పక్షి, బెగ్గరుకొంగ, పినికాళ్ళ కొంగ (Leptoptilus Dubius). **దూడలపండుగ** వి. పశువుల పండుగ. **దూడలపోలిగాఁడు** వి. ఒకరకం గద్ద. **దూడలు** వి.బ.వ. పశువులు. వరాహ. 8.81.

**దూడుగ** వి. ఒకరకం చెట్టు (Uvariya Cerasoides).

**దూంద్రు** వి. ధాన్యాన్ని కొలిచేటపుడు రేగే దుమ్ము, దువ్వు.

**దూఁట** రూ. దూటం. వి. అరటిఊచ, గెలవేసిన అరటిచెట్టు లోపలిభాగం, దవ్వ.

**దూఁటకొట్టించు** స.క్రి. తొలికలుపుతీయు.

**దూఁటిపుచ్చు** చూ. దూఁటు.

**దూఁటు** స.క్రి. **1.** లంఘించు, దాటు, దుముకు. కు.సం. 11.119 ; **2.** పిల్లలు పాలు తాగేటప్పుడు తల్లుల రొమ్మును మూతితో పొడుచు. భాగ. 10.289 ; **3.** దూడ పాలు తాగేటప్పుడు ముట్టెతో తల్లి పొదుగును పొడుచు. భాగ. 10.788 ; **4.** పొడుచు, కుమ్ము, ముక్కుతో పొడుచు. వరాహ. 3.41 ; అ.క్రి. **1.** పారిపోవు, పోవు. విప్ర. 5.62 ; **2.** చొచ్చు, ప్రవేశించు. దా.శ. 33 ; వి. పొడుపు. శుక. 2.342.

క. *దూణ్ణు, దూడు*. ఒంటికాలితో గెంతు, *దూడు*. తోయు, విసరివేయు ; కొడ. *దుద్ (దండి)*. అవతలకి తోయు ; తు. *దూడుని*. తోయు, త్యజించు ; త. *తూణ్ణు (తూణ్ణి)*. విసరు, పైకి పంపించు ; మ. *కుణ్ణుక*. అడ్డీగా ఉన్న బాణంతో కొట్టు, చేపలు పట్టు ; కో. *తుణ్ణ్ (తుణ్ణి)*. పనిచేసేటట్లు బలాత్కరించు.

**దూఁకొను** స.క్రి. **1.** స్వీకరించు. భాస్క. రా. బాల. 322 ; **2.** ప్రాపించు. హరి.ఉ. 6.10 ; **3.** పొందు. భాగ. 3.529 ; **4.** ఆస్వాదించు, తాగు. యయా. 4.48 ; **5.** ఆవరించు. కాళిందీ. 5.130 ; అ.క్రి. **1.** తలచు, భావించు. భాగ. 3.531 ; **2.** అతిశయించు. భాగ. 4.904 ; **3.** కలుగు, జనించు. ఉద్భటా. 2.153 ; **4.** లోనికిచొచ్చు. హంస. 4.40. **దూఁటిపుచ్చు** స.క్రి. తిరస్కరించు. పి.శకు. 2.140. **దూఁటుకొను** అ.క్రి. ఎగురు. భార.ఆరణ్య. 4.384.

**దూత** చూ. దూయు. వి. **1**. నేలబట్టీలో పొట్టు నింపడానికి కట్టే గోడ ; **2.** ఇటిక బట్టీ పొయ్యలను కప్పుతూ కలప కనబడకుండా పేర్చిన ఇటిక ; **3.** పెంకు ఆము మధ్యలోని పొయ్యి ; **4.** కొబ్బరాకునేత.

**దూతడుకర్ణి** వి. డిజైన్ పనికి వాడే చిన్నకరిణి. **దూతయిటిక (-ఇటిక)** రూ. దూతిటిక, దూతిటుక. వి. కాలీకాలని తెలపరి ఇటిక. **దూతిటిక** రూ.చూ. దూతయిటిక. వి. కాలీకాలని తెలపరి ఇటిక. <దూత + ఇటిక. **దూతిటుక** రూ.చూ. దూతయిటిక. వి. కాలీకాలని తెలపరి ఇటిక. <దూత + ఇటుక.

**దూతిటిక** చూ. దూత.

**దూతిటుక** చూ. దూత.

**దూదర** వి. తుపాను.

హిం. *దోధారా*. రెండువైపుల నీటిధార లేదా పరద కలది.

**దూదరతెగులు** వి. వరి, రాగి, సజ్జ, వేరుసెనగ మొ॥ పైర్ల తెగులు.

**దూది** వి. గింజ తీసిన పత్తి, తూలం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 560. క్రీ.శ. 1342. పి.శకు. 3.194.

క. *దూది*. బాగుచేసిన పత్తి, నిప్పు చేసుకోవటానికి ఉపయోగించే బూరుగుదూది పత్తి ; కో. *దూది*. బూరుగు దూదిచెట్టు ; గోం. *దుది్న*. పక్షుల కిందిభాగం ; ఒరయాన్. *తూతి* ;

సం. *తూది-, తూదక-*. పత్తిచెట్టు.

**దూదిగుల్ల** వి. గింజనుంచి వేరుచేసిన దూది వేసుకొనే బుట్ట. **దూదిచుట్ట** వి. **1**. ఏకు ; **2**. దూదికట్ట. **దూదిదబ్బ** వి. ఒక జాతి దబ్బ, తొక్క దళసరిగా ఉండే దబ్బచెట్టు (Citrus Medica). **దూదినిమ్మ** వి. కోలగాఉండి ఊరగాయకు మాత్రమే ఉపయోగపడే నిమ్మకాయ. **దూదిపంగ** వి. ఉన్ని వేసుకొనే గంప. <దూది + గంప. **దూదిపింజె** వి. దారం తీయడానికి వీలుగా ఉండేట్లు చక్కగా చేసిన దూదిముద్ద. **దూదిప్రోవు** వి. ఇంద్రతూలం, గ్రీష్మహాసం. **దూదిభోగం** వి. వడ్లలో ఒకరకం. **దూదిమడుఁగు** రూ. దూదిమణుఁగు. వి. భక్ష్యవిశేషం. శ్రీరం.మా. 6.110. **దూదిమణుఁగు** రూ.చూ. దూదిమడుఁగు. వి. భక్ష్యవిశేషం. **దూదిమూట** వి. కంటలం, కంట్లం, కంటాళం. **దూదెర** వి. సస్యాల్ని నాశనంచేసే చిన్నపురుగు. <దూది + ఎర. **దూదేకు** వి. తురకలలో ఒక జాతి, ఆ జాతివాడు. ఆం.భా. 2.214. <దూది + ఏకు. **దూదేకులపలక** వి. దూదేకే కొయ్యపనిముట్టు. **దూదేకులపిట్ట** వి. పెద్దకిరీటిగాడు. **దూదేకులమాన్యం** వి. దూది ఏకేవారి కిచ్చిన మాన్యం. **దూదేకులవాఁడు** విశ. పెంజారి. **దూదేకులవాళ్ళు** విశ.బ.వ. దూదిఏకే మహమ్మదీయులు.

**దూదిపేడా** వి. కోవాబిళ్ల, పాలు పంచదార కలిపి చేసే ఒక భక్ష్యం.

హిం. *దూధ్*. పాలు, *పేడా*. కోవా.

<హిం. దూధ్‌పేడా.

**దూదెర** చూ. దూది.

**దూదేకు** చూ. దూది.

**దూదేకులపలక** చూ. దూది.

**దూదేకులపిట్ట** చూ. దూది.

**దూదేకులమాన్యం** చూ. దూది.

**దూదేకులవాఁడు** చూ. దూది.

**దూదేకులవాళ్ళు** చూ. దూది.

**దూనసరులు** వి.బ.వ. వడ్లలో ఒకరకం.

**దూప** వి. **1.** శ్రమ, అలసట, తాపం. హరి.ఉ. 5.161 ; **2.**

పిపాస, దప్పి. కుత్థ్స. 4.51.

దూపకుచెప్పు అ.క్రి. కల్లుకు పైన లిచ్చు. దూపగుబుడ్డి వి. పొలాల్లో పనిచేసే రైతులకు గంజి తీసుకుపోవటానికి వాడే మట్టిపాత్ర. <దూప+అగు+బుడ్డి. దూపటించు అ.క్రి. దప్పిగొను. దూపటిలు రూ.చూ. దూపిల్లు. అ.క్రి. 1. అలయు, శ్రమపడు. భీమ. 2.101 ; 2. దగగొను, దప్పిగొను. నవనాథ. 3.208. దూపటిల్లు రూ.చూ. దూపిల్లు. అ.క్రి. 1. దప్పిగొను. కాశీ. 2.138 ; 2. పరితపించు. దూపట్టు అ.క్రి. అలయు, శ్రమపడు. పి. శకు. 1.123. <దూప+పట్టు. దూపించు[1] అ.క్రి. 1. శ్రమనొందు, అలయు. ఆము. 4.198 ; 2. దగగొను, దప్పిగొను. <దూప +-ఇంచు[3]. దూపిడు స.క్రి. అలయించు, శ్రమపెట్టు. రం. రా. యు. 355పు. 8పం. <దూప+ఇడు. దూపిలు రూ. చూ. దూపిల్లు. అ.క్రి. 1. దప్పిగొను, దగగొను. కాశీ. 2.81 ; 2. పరితపించు. దూపిల్లు రూ. దువ్వటిల్లు, దూపటిలు, దూపటిల్లు, దూపిలు. అ.క్రి. 1. పరితపించు. భీమ. 2.33 ; 2. దప్పినొందు.

దూపకుడక చూ. దూపము.

దూపకుండ చూ. దూపము.

దూపడ రూ.చూ. దూపిడి. వి. ఒకరకం మొక్క.

దూపము వి. సుగంధ ద్రవ్యం (వాసనగల పొగ). భీమ. 2.45.

నం. ధూప-. పొగ ; ప్రా. అ. మా. ధూప- ; పా. ధూప ;

క. దూప ; తు. దూప ; కువి. దూప.

<ప్రా. ధూప-.

దూపకుడక వి. సాంబ్రాణి పొగవేయడానికి వాడే మట్టిపాత్ర. దూపకుండ రూ. దోపకుండ. వి. పొయ్యికి ఒక పక్కన నీళ్ళు కాగడానికి పెట్టే మట్టికుండ. దూపరాసి వి. సాంబ్రాణి పొగ వేయడానికి వాడేమట్టిపాత్ర. దూపహారతి రూ.చూ. దూపాతి. వి. సాంబ్రాణి పొగవేయడానికి వాడే మట్టిపాత్ర. దూపాతి రూ. దూపహారతి, దూపార్తి. వి. దీపార్తి, దీపప్రమిద. నె. శా. కావలి. 8. క్రీ.శ. 1188. <దూప+ఆరతి. దూపార్తి రూ.చూ. దూపాతి. వి. దూపం వేసే పాదం పెట్టిన తట్ట, దూపం వేసే పాత్ర విశేషం. దూపించు[2] అ.క్రి. దూపంవేయు. నవనాథ. 2.74. 4పం. <దూపము+-ఇంచు[3].

దూపరాసి రూ. దూపము.

దూపహారతి చూ. దూపము.

దూపాతి చూ. దూపము.

దూపార్తి చూ. దూపము.

దూపించు[1] చూ. దూప.

దూపించు[2]. చూ. దూపము.

దూపిడి రూ. దూపడ, దోపిడి. వి. ఒకరకం మొక్క (Vaterica indica).

దూపిడు చూ. దూప.

దూపిరి చూ. దూయు.

దూపిరిక్రి చూ. దూయు.

దూపిరిదుక్కి చూ. దూయు.

దూపిరిదుంగ చూ. దూయు.

దూపిలు చూ. దూప.

దూపిల్లు చూ. దూప.

దూపుకొను చూ. దూప. అ.క్రి. అలయు, శ్రమనొందు.

దూపుడుచిల్ల రూ. దూపుడుజిల్ల. వి. మోటతోలేటపుడు మోకుకు ఎద్దుల మీది కాడికి మధ్య కొలికిఉంచేకర్ర.

దూపుడుజిల్ల రూ.చూ. దూపుడు చిల్ల. వి. మోటమోకు కొన వారెనలో దూర్చి తగిలించే కొయ్య ముక్క.

దూపుడుబల్ల వి. పీచును ఈనెలుగా తీసి శుభ్రపరచడానికి వాడే సాధనం.

దూపె వి. 1. ఆడుగురి, స్త్రీ మర్మావయవం ; 2. అవలక్షణం.

దూప్చాన్‌చీర రూ.చూ. దూప్చాయ్ చీర. వి. రెండురంగులు కల కలనేత చీర.

దూప్చాన్‌నేత రూ.చూ. దూప్చాయనేత. వి. కలనేత.

దూప్చాయనేత రూ. దుప్సంనేత, దూప్చాన్‌నేత, దూప్సంనేత, దూప్సాయ నేత, దూప్చాయినేత, దూబ్చానేత. వి. కలనేత, పడుగుకు ఒకరంగు, పేకకు మరొకరంగు నూలు పెట్టి నేసిన (గట్టి) నేత.

హిం. ధూఫ్‌చాహ్. అనేకరంగులు గల వస్త్రం.

<హిం. దూప్‌చాహ్ + నేత.

దూప్చాయిచీర రూ.చూ. దూప్చాయ్‌చీర. వి. నిలువుపోగులు ఒకరంగువి, పేక పోగులు మరొకరంగువి, పెట్టినేసిన రెండురంగుల కలనేత చీర.

దూప్చాయ్‌చీర రూ. దూప్చాచీర, దూప్చాన్‌చీర, దూప్చాయిచీర, దూప్చావ్‌చీర, దూప్సంచీర, దూప్సాన్‌చీర, ధూప్ చావ్ చీర. వి. నిలువుపోగులు ఒకరంగువి, పేకపోగులు మరొకరంగువి, పెట్టినేసిన రెండురంగుల కలనేత చీర.

హిం. ధూప్‌ఛాహ్. అనేకరంగులు కల వస్త్రం.

<హిం. ధూప్‌చాహ్ + చీర.

దూప్చావ్‌చీర రూ.చూ. దూప్చాయ్‌చీర. వి. రెండురంగులు కల కలనేత చీర.

దూప్సంచీర రూ.చూ. దూప్చాయ్‌చీర. వి. నిలువుపోగులు ఒకరంగువి, పేకపోగులు ఒకరంగువి, పెట్టినేసిన రెండు రంగుల కలనేత చీర.

దూప్సంనేత రూ.చూ. దూప్చాయనేత. వి. కలనేత.

దూప్సాన్‌చీర రూ.చూ. దూప్చాయ్ చీర. వి. రెండురంగులు కల కలనేత చీర.

దూప్సాయనేత రూ.చూ. దూప్చాయనేత. వి. కలనేత, పడుగుకు ఒక రంగు, పేకకు మరొకరంగు నూలు పెట్టినేసిన నేత.

దూప్చాయినేత రూ.చూ. దూప్చాయనేత. వి. కలనేత.

దూబ[1] వి. దిబ్బ, ఎత్తైన ప్రదేశం. కు. సం. 5.148.

దూబ[2] విశ. 1. అధముడు, అధమురాలు. ఉ. రా. 3.325 ; 2. లజ్జితుడు, లజ్జితురాలు. ఆడిదం సూరకవి చాటువు ; వి. 1. పండుడు, నపుంసకుడు. ఆం. భా. 2.117 ; 2. అవలక్షణం. ఆం. భా. 3.45 ; 3. భగం, ఆడుగురి. ఆం. భా. 3.45.

ప్రా. ధూభ-. దుఃఖితమగు, దుబ్బి. అశుభం, అసుందరం.

**దూబ³** వి. తూము. E. I. సంపు. 4.శా. సం. 33. క్రీ.శ. 1202.

**దూబకొమ్ము** వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము.

**దూబఖంట** వి. దేవుడికి ధూపంవేసేటప్పుడు వాయించేగంట.

సం. ధూప-. పొగ, ఘంటా. గంట.

<సం. ధూపఘంటా.

**దూబన (-వన)** వి. వెనక్కు వాలుగా పెరిగిన కొమ్ము.

**దూబర** రూ.చూ. తువ్వర. వి. తుప్పర. పలచగాపడే సన్నని చినుకుల వాన.

**దూబరతిండి** రూ.చూ. దూబఱదిండి. వి. 1. వితరణ లేని ఆహార వ్యయం; 2. దుర్వ్యయం.

**దూబరదుక్క** చూ. దుబారా. వి. మగ్గం మోకు నేలకు తగలకుండా పెడకోలకూ మామిడి గూటానికీ మధ్య ఎత్తుపెట్టే కొయ్య.

**దూబరా** రూ.చూ. దుబారా. విశే. వ్యర్థమైన.

**దూబఱ** రూ.చూ. దుబారా. విశే. నిష్ఫలం, పనికిమాలిన.

**దూబఱదిండి (-తిండి)** రూ. దూబరతిండి. వి. 1. తేరతిండికాడు, అశ్రమంగా లభించే కూడులిని జీవించేవాడు. భీమ. 3.212; 2. దుష్టుడు, దుష్టురాలు. హంస. 5.113.

**దూబానె** రూ.చూ. దువ్వెన. వి. దువ్వెన.

**దూబిరి** రూ.చూ. దూఁబిడి. వి. 1. కొణతలిదిమ్మ; 2. రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట; 3. అడ్డగుమ్మి కింది పీట.

**దూబిరితుండు** వి. రాటి సూలానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **దూబిరిదుక్క** రూ. చూ. దూపిరిదుక్క. వి. రాటితిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. **దూబిరిదుంగ** రూ.చూ. దూపిరిదుంగ. వి. రాటితిరగటానికి రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు.

**దూబు** చూ. దువ్వు. స.క్రి. సరిచేసేటప్పుడు చిక్కుపడ్డ పోగులను దువ్వు.

**దూబెనకొమ్ము** రూ. దూబొనకొమ్ము. వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము. **దూబొనకొమ్ము** రూ.చూ. దూబెనకొమ్ము. వి. వెనక్కు సాపుగా పెరిగిన కొమ్ము.

**దూబురి** రూ.చూ. దూఁబిడి. వి. 1. రాట్నం నిలువులు బిగించిన అడుగు పీట; 2. అడ్డకట్టె; 3. కొణతలి దిమ్మ.

**దూబూచి** చూ. దూయు.

**దూబెనకొమ్ము** చూ. దూబు.

**దూబొనకొమ్ము** చూ. దూబు.

**దూప్చానేత** రూ.చూ. దూప్చాయనేత. వి. కలనేత.

**దూమధార** వి. పొగమంచు, గూడమంచు.

సం. ధూమ-. పొగ, ధారా. పైనుంచి పడే నీరు మొ॥ వాటి చాలు.

<సం. ధూమ- + సం. ధారా-.

**దూమర** రూ.చూ. తువ్వర. వి. పలచగాపడే సన్నచినుకుల వాన.

**దూము** వి. కలరా.

హిం. ధూమ్. ఉల్కాపాతం, కడుపులోని జబ్బు; మరా. ధూమ్. గందరగోళం.

<హిం. ధూమ్.

**దూముగంగ** వి. కలరాదేవత.

**దూముడి** చూ. దూయు.

**దూముడివేయు** చూ. దూయు.

**దూఁబిడి** చూ. దూయు.

**దూమ్ముడి** చూ. దూయు.

**దూయఁబట్టు** చూ. దూయు.

**దూయించు** చూ. దూయు.

**దూయు** రూ.చూ. డుయ్యు. స.క్రి. 1. (ఒరనుండి కత్తి) లాగు పైకితీయు. పల్నా. 77 పు; 2. (చింత మొ॥ చెట్ల అరులను) గుప్పిట పట్టుతో ఒక్కసారిగా కోయు. నిరంకు. 2.103; 3. (అప్పు అధికంగా) తీసుకొను, చేయు. శేషధ. 4; 4. పుచ్చుకొను, లాక్కొను, బలవంతంగా తీసుకొను. శుక. 2.362; 5. కోడి మొ॥ కాళ్ళతో చెదరగొట్టు; అ.క్రి. 1. చిల్లిపడు. భాగ. 5.265; 2. వెడలు, రాసుకొనిపోవు. భాను. 3.86; 3. బొచ్చు, తటాకించు. ఆం.భా 3.122; 4. వెళ్ళు. రుక్మిణీప. 5.111.

**దూపిరి** రూ.చూ. దూఁబిడి. వి. 1. రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట; 2. అడ్డగుమ్మి కింది పీట; 3. కొణతలి దిమ్మ. **దూపిరిక్ఱ** వి. తాళ్ళరాటి తిరగటానికి ఆధారంగా దూపిరికి దిగగొట్టిన కొయ్యగూటం. **దూపిరిదుక్క** రూ. దూబిరిదుక్క. వి. రాటి తిరగటానికి, రాటి సూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. **దూపిరిదుంగ** రూ. దూబిరిదుంగ. వి. రాటి తిరగటానికి, రాటిసూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. **దూబూచి** రూ. దోబూచి. వి. 1. చిన్నపిల్లల్ని ఆడించటంలో అనే మాటకు అనుకరణం. సారంగ. 1.49; 2. బాలక్రీడా విశేషం. చంద్రాంగ. 1.42. **దూముడి** రూ.చూ. దూయుముడి. వి. జారుముడి. ఉ.హరిశ్చ. 3.34. **దూముడివేయు** స.క్రి. దువ్వుముడివేయు. పల్నా. పు. 72. **దూఁబిడి** రూ. దువ్వెర, దూపిరి, దూబిరి, దూబురి. వి. నూలుతోడేటప్పుడు చీడు తగిలించడానికి నిలిపే పీఠం అమర్చిన కొయ్య. **దూమ్ముడి** రూ.చూ. దూయుముడి. వి. వదులుగా వేసే ముడి. **దూయఁబట్టు** స.క్రి. తిట్టు. <దూయు + -అ⁷ + పట్టు. **దూయించు** స.క్రి. దగ్గరకు చేర్చు. <దూయు + -ఇంచు³. **దూయుతీఁగ** చూ. దుస్సర. వి. సుదర్శనలత. ఆం.భా. 2.65. **దూయుముడి** రూ. దుయుముడి, దుయ్యుముడి. దూముడి, దూమ్ముడి. వి. జారుముడి. రామాభ్యు. 7.7.

**దూర** వి. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు.

హిం.ఉ.పార. దూల్.

**దూరనగోలలు(-కోలలు)** వి.బ.వ. బాలక్రీడా విశేషం.

**దూరమగు** అ.క్రి. మైత్రిని కోల్పోవు.

సం. దూర. దవ్వు.

<సం. దూర- + -ము + అగు (అర్థవిపరి.).

**దూరాబారం** రూ.చూ. దూరాభారం. వి. ఎక్కువ దూరం.

**దూరాభారం** రూ. దూరాబారం. వి. చాలా దూరం.
సం. దూర-. దవ్వు, భార-. బరువు.

**దూరు** రూ.చూ. తూఱు. స.క్రి. ప్రవేశించు, చొచ్చు.
**దూరుతాడు** వి. కాడినిపోలుగ్గరకు కలిపి కట్టే తాడు.

**దూరుపుకట్టె** వి. గోసినొగ, కోడిపీటల బండి (ఒకరకం బండి)కి డొంకిపట్టె నుంచి కాడి వరకు ఉన్న నొగ.
సం. దూర-. దవ్వు.

**దూరుబారు** వి. ఒకానొక పావురం.
సం. దూర-. దవ్వు.
<సం. దూర- + పాఱు.

**దుర్చు** రూ.చూ. తూర్చు. స.క్రి. చెక్కు.

**దూర్వాసుఁడు** వి. 1. దుర్వాసోమహర్షి; 2. కోపంకలవాడు.
సం. దుర్వాసస్. ఒక మహర్షి.
<సం. దుర్వాసస్.

**దూఱగు** చూ. దూఱు.

**దూఱనాడు** చూ. దూఱు.

**దూఱు** వి. నింద, అపకీర్తి, తిట్టు. కు.సం. 4.28; స.క్రి. నిందించు, తిట్టు, దూషించు. భార.విరా. 2.146.
క. దూఱు. నిందించు, తిట్టు; తు. దూరుని. నిందించు, ఆక్షేపించు, మందలించు; త. తూఱు. అపవాదు, చెడ్డపేరు తెచ్చు, తూఱ్ఱు. చెడ్డపేరు తెచ్చు, అపనింద, అసత్యమైన నింద; మ. తూఱ్ఱుక. తిట్టు, నిందించు.
<మూ.ద.ద్రా. *తూఱ్- *తూ + ఱ్.
**దూఱగు** అ.క్రి. నింద్యమగు. దశకు. 3.140. <దూఱు- + అగు. **దూఱనాడు** స.క్రి. నిందించు, దూషించు, తిట్టు. మను. 6.82. < దూఱు + -అ[7] + ఆడు. **దూఱుచెప్పు** అ. క్రి. తగవుపెట్టు. చంద్రాంగ. 3.27. **దూఱుచేయు** అ.క్రి. తగవు పెట్టు. మల్హ. 1.41. **దూఱుదంకములు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. విప్ర. 4.19. **దూఱుదుంకెనలు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. విక్ర. 8.101. **దూఱువడు(-పడు)** అ.క్రి. నిందించబడు. భార. విరా. 2.182. **దూఱెక్కు** అ.క్రి. నిందపొందు, అపకీర్తినొందు. భార. ఉద్యో. 3.13. <దూఱు + ఎక్కు.

**దూఱెక్కు** చూ. దూఱు.

**దూల** వి. 1. కండూతి, దురద, నవ. ఆం.భా. 2.129; 2. వస్తువులు కాలగా మిగిలిన పొడి.
క. దూలె. దురద, ఇచ్ఛ, కోరిక; కుఇ. దులకర్డ్రి, దులదామ, దూలగొండి చెట్టు.
**దూలకన** వి. రెండునొగల బండికి నొగలను కలిపికొట్టిన చీల. **దూలకన్ను** వి. నవలు (దురదలు) పెట్టే కన్ను. పండి.చ. ద్వితీ. 4.108 పు. **దూలకొండి** రూ.చూ. దూలగొండి. వి. దురదగొండి. **దూలగనెం** వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. **దూలగుండ** రూ.చూ. దులగొండి. వి. దురదగొండి. **దూలగొండి** రూ. దులకొండి, దులగుండ. వి. కండూర, దురదగొండి. ఆం.భా. 2.54. **దూలగొను(-కొను)** అ.క్రి. దురదపెట్టు. **దూలగొమ్ము(-కొమ్ము)** వి. కొమ్ములను పురుగు తొలవటం. **దూలగోవెల** వి. దురదగొండి, కండూర. హంస. 4.10. **దూలపోతు** వి. 1. పామనుడు, గజ్జికలవాడు. ఆం.భా. 2.122; 2. ఎప్పుడూ దూలకలవాడు. **దూలపోవు** అ.క్రి. దురదపెట్టు. కాశీ. 2.138.
**దూలాలు** వి. వ్యభిచారిణి. వేమ. 3.247. <దూల + ఆలు.

**దూలంరాయి** చూ. దూలము.

**దూలచీల** చూ. తూఱు. వి. బండినొగలకు తగిలించటానికి కొట్టిన మేకు.

**దూలపిల్లు** చూ. దూలము.

**దూలపుక్కర** చూ. దూలము.

**దూలపుచీల** చూ. దూలము.

**దూలపుపట్టె** చూ. దూలము.

**దూలపురాయి** చూ. దూలము.

**దూలము** రూ.దూలాం. వి. 1. ఇంటిగోడలపై అడ్డంగా వేసే పెద్ద కఱ్ఱ. భార.సభా. 1.11; 2. తనాభి, దశా. 4.49; 3. బట్టీపొయ్యిమీద అడ్డంగా ఉంచిన రాయి; 4. గిలకను బిగించడానికి వీలుగా బావిమీద వేసిన అడ్డుకొయ్య.
క. దూల. దూలం; తు. దూల; త. తూలమ్; మ. తులాం, తూన;
సం. స్థూల- లావైన; ప్రా. థూల-
**దూలంరాయి** వి. గోడ కట్టుబడిలో అంచులవైపు వుంచిన పెద్దఇటిక. **దూలపిల్లు** రూ. దూలాపిల్లు. వి. దూలాలు దంతులు వేసి కట్టిన ఇల్లు. < దూలము + ఇల్లు. **దూలపుక్కర** వి. ఏతపు బొక్కెన చెవికట్లగుండా దూర్చే కఱ్ర. <దూలము + కఱ్ర. **దూలపుచీల** వి. జంటనొగలను కాడి ముందు కలపడానికి బిగించిన ఇనపమేకు. <దూలము + చీల. **దూలపుపట్టె** వి. ద్వారబంధపు పట్టె. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 569. క్రీ.శ. 1397. <దూలము + పట్టె. **దూలపురాయి** రూ. దూలాపురాయి. వి. 1. దూలంపైభాగాన కప్పుకు దిగువన పరిచే రాయి; 2. ధాన్యం బాచుకొనే గరిసెకింద ఎత్తుకోసం పెట్టేరాయి. < దూలము + రాయి. **దూలావిల్లు** వి. దూలాలు దంతులు వేసి కట్టినఇల్లు. <దూలము + -లు + -అ + ఇల్లు.

**దూలాం** రూ.చూ. దూలము. వి. ఇంటి కప్పును మోసే ముఖ్యమైన ఆధారం.
**దూలాంగూడు** వి. దూలం పెట్టేందుకు గోడలో తొలిచిన రంధ్రం. **దూలాలిల్లు** రూ.చూ. దూలపిల్లు. వి. దూలాలు దంతులువేసి కట్టిన ఇల్లు. **దూలాపురాయి** రూ.చూ. దూలపురాయి. వి. దూలంగా వాడే పెద్ద పొడుగాటి రాయి.

**దూలాపిల్లు** చూ. దూలాం.

**దూలాపురాయి** చూ. దూలాం.

**దూలాలిల్లు** చూ. దూలము.

**దూలాలు** చూ. దూల.

**దూలి** రూ.చూ. దూళి. వి. ధూళి, ఆం. పదా. చర. 51.

**దూళి** రూ. దూలి, వి. 1. రేణువు. కు.సం. 11.20; 2. దుమ్ము, పొల్లు.
సం. ధూళి- దుమ్ము; ప్రా. ధూలి, ధూలరజం; అ.మా. ధూలి, ధూలియా, ధూలీ;
క. దూళ, దూళి, దూళు. దుమ్ము; తు. దూళి,

దూళు ; మ. తూళి, తూళ్ళి ; కుఇ. దూలి.

<ప్రా. ధూలీ.

**దూళిబద్ద** వి. కొయ్యకప్పుకు వాడే పలచని చెక్క.

**దూవర**[1] రూ.చూ. దూగఱ[2]. వి. ధూళి.

**దూవర**[2] రూ.చూ. తువ్వర. వి. తుప్పర, పలచగా పడే సన్న చినుకుల వాన.

**దూవలువ** రూ.చూ. దువ్వలువ. వి. 1. నిచోళం ; 2. విలువ కల సన్నని వస్త్రం.

**దూవల్వ** రూ.చూ. దువ్వలువ. వి. 1. నిచోళం ; 2. విలువ కల సన్నని వస్త్రం.

**దూవాని** రూ.చూ. దువ్వెన. వి. దువ్వెన.

**దూషించు** స.క్రి. విడుచు, త్యజించు. భార. ఆది. 5.111.

నం. దూష్. నిందించు.

<నం. దూష్+-ఇంచు[3] (అర్థవిపరి.).

**దూసం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయట, ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దూసడ** రూ.చూ. దుసల. వి. పొరుడురోగం.

**దూసర** రూ.చూ. దుస్సర. వి. 1. సుదర్శన లత. అం.భా. 2.65 ; 2. పత్సాదని (Cocculus Villosus).

**దూసరతెవులు** వి. అవిసెకు వచ్చే ఒకరకం తెగులు.

**దూసరి**[1] వి. తృణ విశేషం, ఒక దినుసు వడ్లు.

**దూసరిధాన్యం** వి. ఒకరకం ధాన్యం. **దూసరిబియ్యము** వి. ఆడవిలో పండే ధాన్యవిశేషం. పి.శకు. 3.12. **దూసరివడ్లు** రూ.చూ. దూసరొడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు. **దూసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. **దూసరొడ్లు** రూ. దూసరివడ్లు. వి.బ.వ. ధాన్యవిశేషం. కుచే. 1.34. <దూసరి[1] + వడ్లు.

**దూసరి**[2] వి. అపవాదం.

నం. దుస్స్వర-. చెడ్డస్వరం ; ప్రా. దుస్సర-, దూసర- కుత్సిత కంఠం.

**దూసరికాఁడు** వి. అపవాదం వేసేవాడు. వేమ. 3.206.

**దూసరితీగ** చూ. దూసర. వి. ఒకరకం చెట్టు (Menispermum hirsutum).

**దూసరొడ్లు** చూ. దూసరి[1].

**దూసలు** వి.బ.వ. ధాన్యవిశేషం, నాసిరకం వడ్లు. ప్రబంధ. 112.

నం. దూషక-, దూష్య-. నిందించబడ్డ ; ప్రా. దూసఅ, ధూసగ.

<ప్రా. దూసఅ.

**దూసి** రూ.చూ. దుసి. వి. వస్తువులు కాలగా మిగిలిన పొడి.

**దూసిపోవు** రూ. దుస్సిపోవు. స.క్రి. 1. కూరు ; 2. తీసివేయు.

**దూసెన** రూ.చూ. దిరిసెము. వి. 30-40 అడుగుల ఎత్తు పెరిగే పెద్దచెట్టు (Albizzia Lebbek).

**దృష్టి** వి. చెడుచూపు.

నం. దృష్టి-. చూపు.

<నం. దృష్టి- (అర్థవిపరి.).

**దృష్టిదోషం** వి. చెడుచూపు.

నం. దృష్టిదోష-. చూపుయొక్క దోషం.

<నం. దృష్టి- (అర్థవిపరి.).

**దెంకువచ్చు** చూ. దెంగు.

**దెంగ** వి. భూమి పరిమితి విశేషం. ద.హిం.శా. 1303.

**దెంగు** చూ.దేఁగు. వి. 1. సంభోగం. క్రీడా.పీఠి. 53 వ. ; 2. తిట్టు ; 3. బెదిరించటం ; స.క్రి. సంభోగించు, రమించు. నె.శా. నెల్లూరు. 5. క్రీ.శ. 1653, చంద్రరే. 2.49.

క. దెంగు. సంభోగం, తెక్కె. కౌగిలించుకోవటం ; కొలా. దెంగ్. సంభోగం ; గోం. డంగ్. నిక్కు ;

పో.చూ. నెపా. డిజ్, డెజ్.ఆవు యోని, (స్త్రీ పురుషుల) ఆననద్వారం.

**దెంకువచ్చు** స.క్రి. తీసుకొనివచ్చు. <దెంగు+కొను +వచ్చు. **దెంగులు** వి.బ.వ. తిట్లు. **దెంగులుదెంగులు** వి.బ.వ. చెడ్డచిరాకు. **దెంగులుపెట్టు** స.క్రి. తిట్టు.

**దెంచనము** రూ.చూ. దంచనము. వి. కోటలు మొ॥ వాటిని బద్దలుకొట్టడానికి ఉపయోగించే ఆయుధ విశేషం. భార. విరా. 3.168.

**దెంచిక** వి. దూలం మీద అడ్డంగా ఉంచే ఇంటిభాగం. చంద్రికా. 2.23.

**దెత్తి** రూ.చూ. తెత్తి. వి. భూతం, రాక్షసి.

**దెనదరి** వి. అడవిగోరింట (Erythroxylon Monogynum).

**దెంతె** రూ.చూ. దంతె[2]. వి. 1. ఒక అడవిచెట్టు ; 2. భవంతుల్లో మిద్దె లాదటానికి అడ్డంగా పరిచిన కొయ్య మాను.

**దెందము** రూ.చూ. డెందము. వి. హృదయం, మనస్సు. దశా. 2.29.

**దెందర** చూ. జాంద్ర. వి. దేవాంగులు.

**దెపగుప** వి. బాణాలు తాకటంలోని ధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 6.106.

**దెప్పము** వి. 1. బాణాదుల కెదుట నిలిపిన కృత్రిమ లక్ష్యం, కూటలక్ష్యం. షో.చ. 8.45 ; 2. లక్ష్యం. భోజ. 7.70.

నం. దీప-. ప్రకాశింపచేసేది, దివ్వె ; ప్రా. దెప్ప, దిప్ప- ; అప. దిప్ప. దీపకం.

<ప్రా. దెప్ప-.

**దెప్పర** రూ.చూ. దెప్పరము. వి. 1. అశుభం ; 2. అశక్యం.

**దెప్పరించు** స.క్రి. ఆపద పొందించు, సంహరించు. చెన్నబసవ. 5.142. <దెప్పర+-ఇంచు[3]. **దెప్పరిలు** రూ. దెప్పరిల్లు. అ.క్రి. బాధపొందు, కష్టంపొందు. భాగ. 10 ఉ. 1003. **దెప్పరిల్లు** రూ.చూ. దెప్పరిలు. అ.క్రి. కష్టంపొందు, బాధపొందు.

**దెప్పరము** చూ. దెప్ప. రూ. డెప్పరము, దెప్పర. వి. 1. దుష్టవచనం. భార.సభా. 2.255 ; 2. ఆపద. భాస్క.రా. ఆరణ్య. 2.71 ; 3. అతిశయం, ఆధిక్యం. పాండు. 3.72 ; 4. విధం, రీతి, ప్రకారం. ప్రబంధ. 788 ; విశే. 1. విషమమైన. భార.భీష్మ. 1.190 ; 2. అధికమైన. గొప్పదైన. హర. 1.21 ; 3. ఆపత్కరమైన, కష్టదాయకమైన. హర. 2.51.

**దెప్పటికము** రూ.చూ. డెప్పటికము. వి. బాధ, కష్టం.

నిర్వ.రా 10.29.
దెప్పరించు చూ. దెప్పర.
దెప్పరిలు చూ. దెప్పర.
దెప్పరిల్లు చూ. దెప్పర.
దెప్పతికము చూ. దెప్పరము.
దెప్పిచెప్పు చూ. దెప్పు.
దెప్పిపలుకు చూ. దెప్పు.
దెప్పిపొడుచు చూ. దెప్పు.
దెప్పు రూ. డెప్పు. స.క్రి. 1. ఎత్తిపొడుచు. భార.అను. 3.181 ; 2. దూరు, నిందించు. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 58, రామాభ్యు. 6.136 ; 3. చేసిన ఉపకారాన్ని చాలాసార్లు చెప్పు ; వి. నింద, ఎత్తిపొడుపు.
క. ఇటి, వినీతుడగు, ఇటిపు. అవమానపరుచు ; కురు. డెగ్- (డెగ్‌చ్-). అవినయంగా మాట్లాడు.
< *తెప్ప్ < ఎటప్ప్-.
దెప్పిచెప్పు అ.క్రి. ఎత్తిపొడుచు, ఉటంకించి పలుకు. ప్రబంధ. 788. దెప్పిపలుకు స.క్రి. ఎత్తిపొడుచు. కాశీ. 4.215. దెప్పిపొడుచు స.క్రి. ఎత్తిపొడుచు. దెప్పుడు రూ. దెప్పుడు. వి. దెప్పటం ; విశ. దెప్పే.
దెబ్బ వి. 1. అడుపు, పెట్టు, వేటు. శివరా. 4.8 ; 2. గాయం, గంటు ; 3. దెబ్బలాంటిది, నష్టం ; 4 కష్టం ; 5. దెబ్బకొట్టేటంతకాలం, అల్పకాలం ; 6. శాపు.
క. డబ్బె, డెబ్బె, దబ్బె, దెబ్బె. దెబ్బ, పైబడటం ; తు. దబ్బు. బీట, పగులు ; త. తప్పై. దెబ్బ ; కువి. తప్. కొట్టు, చంపు.
దెబ్బకుదెబ్బతీయు అ.క్రి. ఎదుటివానితో సరిసమానంగా పోరాడు. దెబ్బకు దెయ్యము వెఱచు అ.క్రి. దెబ్బకు దయ్యం భయపడు. దెబ్బకు దేవేంద్రలోకము అగపడు అ.క్రి. దెబ్బ వేసినపుడు ప్రాణం పోయినంత అగు. దెబ్బగొను (-కొను) అ.క్రి. కొట్టు, అడచు. శివరా. 4.81. దెబ్బతిను అ.క్రి. 1. నష్టపడు ; 2. దెబ్బపడు. దెబ్బతీయు రూ.చూ. దెబ్బదీయు. అ.క్రి. శాస్తిచేయు. దెబ్బదీయు (-తీయు) రూ. దెబ్బతీయు. స.క్రి. 1. స్త్రీలను పొందు, కూడు. తెనాలి రామలింగని చాటువు ; 2. కొట్టు, అడచు. ఇందు. 2.50 ; 3. సంహరించు. విజయ. 1.10. దెబ్బలముచ్చు వి. దెబ్బలు తినడానికి అలవాటుపడినవాడు. దెబ్బలసుడి వి. పశువుల వీపున ఉండే సుడి. దెబ్బలాడు అ.క్రి. 1. పోరు, యుద్ధం చేయు. సింహ.శ. 33 ; 2. కలహించు, తగవులాడు. < దెబ్బ + -లు + ఆడు. దెబ్బలుకొట్టు స.క్రి. కొట్టు.
దెబ్బటోన రూ.చూ. దబ్బాటువాన. వి. పెద్దవాన.
దెబ్బనరులు రూ.చూ. దెబ్బనలు. వి.బ.వ. ధాన్యవిశేషం.
దెబ్బనలు రూ. దెబ్బనరులు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.
దెబ్బాటు చూ. దబ్బాటు. వి. బలిష్ఠమైనవాన.
దెబ్బు వి. శీఘ్రం, మృత్యు. 2.72.
దెయ్యష్టాబ్బు రూ.చూ. దయ్యపుమబ్బు. వి. పెద్దగా కొండలాగా ఆవరించిన నల్లమబ్బు.
దెరసనము రూ.చూ. దిరిసెము. వి. శిరీషం (Albizzia Lebbek).
దెరోబస్తు రూ.చూ. దరోబస్తు. క్రి. విశ. అంతా.
దెర్శిన రూ.చూ. దిరిసెము. వి. శిరీషం.
దెవనపర్వము వి. దవనపర్వం, దవనపూర్ణిమ, చైత్రమాసంలో వచ్చే పున్నమి. ద.హిం.శా.సం. 10. శా.సం. 343. క్రీ.శ. 1254.
దెవసంరాత వి. వెధవరాత.
దెవసము వి. రోజు. ద.హిం.శా.సం. 5. శా.సం. 74.
సం. దివస-. రోజు, దినం.
< సం. దివస-.
దెశాహి రూ.చూ. దేసహి. వి. మండలాధికారి.
దెస[1] రూ. దిన, దిస్స. వి. 1. వంక, వైపు, పార్శ్వం. భార. ఆది. 4.92 ; 2. దిక్కు. భార.ఆది. 7.172 ; 3. గతి, శరణం, ఆశ్రయం. కు.సం. 5.80 ; 4. సప్తమీ విభక్త్యర్థకం. కు. సం. 6.97 ; 5. చోటు, ప్రదేశం. కు. సం. 10.158 ; 6. పంచమీ విభక్త్యర్థకం. భార. విరా. 2.108 ; 7. పక్షం, తెగ. భార. భీష్మ. 3.31 ; 8. దగ్గర, సమీపం. విష్ణుపు. 4.112.
సం. దిశా ; ప్రా. దిసా, దిసి, దిసీ ; జై. మహా. దిసా ; జై. శౌ. దిసి ; శౌ. దిసా ; అ. మా. దిసా దిసి ; మా. దిశా ; పా. దిసా ; అప. దిహ ;
క. దెసె, దసె ; త. తిచై.
< ప్రా. దిసా-.
దెసకట్టు వి. చోరసాధన విశేషం. వేంక. పంచ. 3.199. దెసకట్టుకట్టు అ.క్రి. దిగ్బంధనం చేయు. పర. రా. కిష్కిం. పు. 455. పం. 15. దెసచెడు అ.క్రి. దిక్కుమాలు. భార. ఆది. 2.25. దెసదిక్కు వి. దిక్కు, ఎడుగడ, ఆశ్రయం. బసవ. 5.127. దెసమొగము అ.క్రి. అభిముఖుడగు. ద్విప. జగ. 184. < దెస + మొగము + అగు. దెసమొల రూ.చూ. దిసమొల. వి. గుడ్డలు లేనిమొల. దెసలదొరలు వి.బ.వ. దిక్పాలురు. దశా. 1.238.
దెస[2] వి. 1. దురవస్థ, కష్టదశ. భార. విరా. 1.182 ; 2. అవస్థ, స్థితి. భార. విరా. 2.104 ; 3. విధం, రీతి. రం. రా. అరణ్య. 186పు. 26పం.
సం. దశా. స్థితి, అవస్థ ; ప్రా. దసా ; అశో. దస ; అ.మా. దసా ;
క. దసె, దెసె ; తు. దెసె. స్థితి, అదృష్టం.
< ప్రా. దసా.
దెసపడు అ.క్రి. దురవస్థపొందు. వేంక. పంచ. 3.375.
దెసం వి. దేశం, E. I. 32.1.
సం. దేశ-. దేశం ; ప్రా. దేస-.
< ప్రా. దేస-.
దెసక పి. ధర్మబోధకుడు. ఎ. ఇం. 10. I.C.
సం. దేశిక-. ఆచార్యుడు, గురువు ; ప్రా. దేసిఅ-.
< సం. దేశిక-.
దే వి. గుర్రం మొ. వాటిని తోలటంలో అయ్యేధ్వనికి అనుకరణం. యయా. 2.27.
దేకి వి. శ్రీకృష్ణుని తల్లి, దేవకి.

నం. దేవకీ. శ్రీకృష్ణుని తల్లిపేరు ; ప్రా. అ.మా. దేవఈ.

<నం. దేవకీ.

**దేకిచకుండ** రూ.చూ. డేకినకుండ. వి. మూతివెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగాఉండి రాగి అండా కారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర.

**దేకిచా** రూ.చూ. డేకిసా. వి. పెద్దవంటపాత్ర.

**దేకిస** రూ.చూ. డేకిసా. వి. డేగిస.

**దేకిసపార** రూ.చూ. డేకిసపార. వి. గడ్డి మొ॥ వాటిని చెక్కటానికి వాడే ఒకరకం పార, బొరిగె.

**దేకీసపార** రూ.చూ. డేకిసపార. వి. గడ్డిమొదలైనవి చెక్క డానికి వాడే ఒకరకం పార.

**దేఖీలు** అవ్య. కూడ.

మరా. దేఖీ, నుంచి, కంటె.

<మరా. దేఖీ.

**దేగీచ** రూ.చూ. డేకిసా. వి. పలావు, బిర్యానీలు వండే మూతి వెడల్పు రాగిపాత్ర.

**దేగులలంబు** రూ. దేవడుము, దేవళము, దేవుళము. వి. దేవాల యం. బుడమనారాయణపాడు శిలాశాసనం (పొదిలి) క్రీ.శ. 7వ శతాబ్ది.

నం. దేవకుల-. అల్పముఖంగల గుడి ; ప్రా. దేఉలం. దేవమందిరం, దేఉలిఅ. చిన్నగుడి ; జై. మహా. దేఉల, దేవఉల, దేఉలు ; శౌ. దేఉలం, దేవఉలం ; అ.మా. ద్దేఉలం, దేబఉలం ; మా. దేఉలం ; అప. దేవల ;

క. దేగల, దేగుల. దేవళం. దేగులిగ. అర్చకుడు ; తు. దేల.

<ప్రా. దేవుల-.

**దేఁకు** రూ.చూ. డేఁకు. అ.క్రి. పిర్రలతో జరుగు.

**దేఁగు** చూ.దెంగు. అ.క్రి. రతిక్రీడ చేయు, సంభోగించు.

క. ఇడి. కలియు, దగ్గరగా చేరు. ఒకరితో ఒకరు కలియు, గుంపు ; త. ఇణై. ఆంతరంగిక స్నేహం, సున్నితమైన భావముండు (ప్రేమలోలా), కలియు (భార్యాభర్తల్లా) ; కో. ఇజ్ (ఇజై). సంభోగించు ; కొలా. (దెంగ్-). రతి క్రీడలో కలియు.

**దేంగ్రడ** రూ.చూ. జాంగ్రడ. వి. చేనేత వల్ల జీవించే ఒకజాతి వారు, దేవాంగ జాతి. ఆం. భా. 2.283.

**దేంగ్రడవాఁడు** రూ. జేంగ్రడవాఁడు. విణ. దేవాంగి.

**దేనము** వి. ధ్యానం. వేమ. 1.88.

నం. ధ్యాన-. పరమాత్మను గూర్చిన చింతన, చింత ; ప్రా. ఝాణం. చింత, విచారం ; శౌ. ఝాణం ; పా. ఝానం, ఝానిక ; అప. ఝాణా ;

క. జాన ; తు. జాన.

<నం. ధ్యాన-.

**దేవద్రోగుబు** వి.బ.వ. దేవుణ్ణి మోసగించిన వాళ్ళు. చిలంకూరు శాసనం. క్రీ.శ. 739.

నం. దేవద్రోహిన్. భగవంతునికి ద్రోహం చేసిన వాడు.

<నం. దేవద్రోహిన్ + -లు.

**దేపరవ** వి. తాత్సారం, ఏమరుపాటు.

హిం. ఉ. పర్‌వా. ధ్యానం, దృష్టి, ఆసరా.

**దేపిరిగొట్టు** రూ.చూ. దేవురుగొట్టు. వి. కక్కుర్తిమనిషి.

**దేబరించు** రూ.చూ. దేవురించు. అ.క్రి. 1. నేలమీదపడిపొర్లు ; 2. నీచప్రవర్తనతో సంతోషించు.

**దేబిరిగొట్టు** రూ.చూ. దేవురుగొట్టు. వి. దేబిరించేవాడు.

**దేబిరింపు** రూ.చూ. దేవురింపు. వి. బతిమాలడం.

**దేబె** రూ.చూ. ద్రాబ. విణ. వికృతమైన, ద్వి. సార. చ. 2.69పు. 5పం ; వి. మూర్ఖుడు, అధముడు. వేణుశ. 51.

**దేభ్యం** రూ.చూ. తేభ్యం. వి. వట్టి అప్రయోజకుడు.

**దేముడిచీర** వి. దేవతల పేరు చెప్పి పెట్టేచీర.

నం. దేవ-. దేవుడు, చీర-. వస్త్రం.

**దేమ్మ** వి. దేవుడు.

నం. దేవ-. దేవుడు.

<నం. దేవ- + అమ్మ.

**దేరిజ** రూ.చూ. డేరా. వి. ఒకవిధమైన గుడారం. కువ. చ. 2.84.

**దేరిజము** రూ.చూ. డేరా. వి. ఒకవిధమైన గుడారం. కృష్ణరా. 3.36.

**దేరిజా** రూ.చూ. డేరా. వి. గుడారం.

**దేరీజా** రూ.చూ. డేరా. వి. డేరా. భాను. 4.54.

**దేరీజ** రూ.చూ. డేరా. వి. డేరా.

**దేల** చూ. డీలు. వి. నీరసం, నిస్సత్తువ.

**దేవకిచీర** వి. ఒకరకం లేతగులాబి రంగుచీర.

నం. దేవకీ. కృష్ణునితల్లి.

<నం. దేవకీ + చీర.

**దేవగన్నేరు(అంచు)** వి. ఒకరకం (చీర) అంచు.

నం. దేవ-. దేవుడు.

<నం. దేవ- + గన్నేరు. (మిశ్రన.).

**దేవగుమ్మడి** వి. పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగపైరు. (Cucurbita Maxima).

నం. దేవ-. దేవుడు.

<నం. దేవ- + గుమ్మడి (మిశ్రన.).

**దేవడీ** రూ.చూ. దేవిడీ. పెంకు కప్పుగల సర్కారు కార్యాలయం.

**దేవడుము** రూ.చూ. దేగులలంబు. వి. దేవళం, దేవాలయం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 743. క్రీ.శ. 1530.

**దేవడ్లు** వి.బ.వ. దేవుళ్లు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 334. క్రీ.శ. 1284.

నం. దేవ-. దేవుడు.

<నం. దేవ- + -డు + -లు.

**దేవండ్లకుండ** రూ. దేవన్లకుండ. వి. 1. శ్రావణమాసంలో గొల్లలు పొంగళ్లు పెట్టడానికి వాడే మట్టికుండ ; 2. గవ్వలు, నాగుబాము, పుట్ట, చంద్రుడు, సూర్యుడు మొ. బొమ్మల్ని చుట్టూ పెట్టిన కుండ.

నం. దేవ-. దేవుడు.

**దేవతలపుట్టము** వి. మడిబట్ట. శుక. 2.335.

సం. దేవతా. వేల్పు ; పుట్టు-. బట్ట.

<సం. దేవతా + -లు + -అ + సం. పుట్ట- + -ము.

**దేవతాఇనాం** వి. దేవాలయాల పోషణకు, దేవతల అంగరంగ భోగాలకు ఇచ్చే ఇనాం.

సం. దేవతా. దేవుడు, వేల్పు ; ఉ. ఇనామ్.

<సం. దేవతా + ఉ. ఇనామ్ (మిశ్రన.).

**దేవతాడి** వి. దేవతల తాడిచెట్టు. ఆం.భా. 2.51.

సం. దేవతాళ-. వృక్షవిశేషం. దేవ-. వేల్పు ; తాళ-. తాడిచెట్టు.

<సం. దేవ- + తాడి (మిశ్రన.).

**దేవతాపులుసు** వి. జైళ్ళలో 'సి' తరగతి ఖైదీలకు పోసే పులుసు.

సం. దేవతా. దేవుడు, వేల్పు.

<సం. దేవతా + పులుసు (మిశ్రన.).

**దేవతార్చన** వి. దేవతార్చన బ్రాహ్మణుడు, ఇంటిలో దేవతార్చన చేయటానికి నియుక్తుడైన బ్రాహ్మణుడు. ద.హిం.శా.సంపు.10. శా.సం. 235. క్రీ.శ. 1106.

సం. దేవతార్చన-. దైవపూజ.

<సం. దేవతార్చన- (అర్థవిపరి.).

**దేవతార్చనకూటము** వి. మడపలి, దేవాలయంలోని వంటశాల ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1102. క్రీ.శ. 1150.

సం. దేవతార్చన-. దైవపూజ, కూట-. ఇల్లు.

<సం. దేవతార్చన కూట- (అర్థవిపరి.).

**దేవదని** రూ. దేవదాని, దేవదారి. వి. అడవిగోరింట. ముదురు గోధుమరంగు బెరడు ఎరుపు కలిసిన గోధుమవన్నె కర్రకల చెట్టు (Erythroxylon Monogynum).

**దేవదాని** రూ.చూ. దేవదని. వి. అడవి గోరింట.

**దేవదాయం** రూ.చూ. దేవాదయము. వి. దేవుని రాబడి.

**దేవదార** రూ.చూ. దేవదారి[1]. వి. దేవదారు చెట్టు.

**దేవదారి[1]** రూ. దేవదార. వి. దేవదారుచెట్టు. ఆం.భా. 2.48. (Cedrus Deodara).

సం. దేవదారు-. ఒకానొక చెట్టు ;

క. దేవదారు.

<సం. దేవదారు.

**దేవదారి[2]** రూ.చూ. దేవదని. వి. అడవి గోరింట.

**దేవదాసి** వి. వేశ్య.

సం. దేవదాసీ-. దేవుడిదగ్గర పనిచేసే స్త్రీ.

<సం. దేవదాసీ.

**దేవనగలు** వి.బ.వ. సువాసనకల పూలుపూసేచెట్టు (Plumeria Acutifolia).

**దేవన్లకుండ** రూ.చూ. దేవండ్లకుండ. వి. 1. శ్రావణమాసంలో గొల్లలు పొంగళ్ళు పెట్టడానికి వాడే మట్టికుండ ; 2. గవ్వలు, నాగుబాము, పుట్ట, చంద్రుడు, సూర్యుడు మొ. బొమ్మల్ని చుట్టూ పెట్టిన కుండ.

**దేవమణి** వి. గంగడోలుకు రెండువైపులా ఉండే సుడి.

సం. దేవమణి-. చింతామణి.

<సం. దేవమణి- (అర్థవిపరి.).

**దేవమానికం** రూ. దేవుమాను. వి. గంగడోలుకు రెండువైపులా ఉండే సుడి.

సం. దేవ-. దేవతాసంబంధమైన, మాణిక్య-. ఒక రత్నం.

<సం. దేవమాణిక్య-.

**దేవమూల** వి. తూర్పు ఉత్తరాల మధ్యమూల, ఈశాన్యం.

సం. దేవ-. దేవతా సంబంధమైన.

<సం. దేవ- + మూల (మిశ్రన.).

**దేవయ్య** వి. 1. మూర్ఖుడు ; 2. అప్రయోజకుడు.

సం. దేవ-. దేవుడు.

<సం. దేవ- + అయ్య.

**దేవర** వి. 1. దేవుడు. పర్లాకిమిడి ముఖలింగ శాసనం. క్రీ.శ. 8వ శతాబ్దం ; 2. ప్రభువు, రాజు. భార. విరా. 3.89 ; 3. 'నీవు' అని అర్థమిస్తుంది. భార. ఉద్యో. 2.3 ; విశ. శ్రేష్ఠుడైన. కాశీ. 1.42.

సం. దేవ-. దేవుడు ; ప్రా. దేవ్వ, దేవ- ;

క. దేవర. ప్రభువు ; త. తేవర్. దేవతలు.

<ప్రా. దేవ్వ-.

**దేవరఎద్దు** వి. వెంకటేశ్వరుని పేర అచ్చువేసిన ఆబోతు. **దేవరగంగమ్మ** వి. ముత్యాలమ్మ మొదలైన దేవతల జాతర. **దేవరగుడి** వి. దేవాలయం. అచ్చరా. సుందర. 8. **దేవరగురిగి** వి. అమ్మవారి గుడిలోపల పూజించి 4 గాజులు, గవ్వలు, పసుపుకొమ్ము, తాంబూలం, నూది, పైసలు మొ.వి వేసిపెట్టే గురిగి. **దేవరగురుగులు** వి.బ.వ. దేవరకుండలో పెట్టడానికి వాడే చిన్న బుడిగలు. **దేవరజిట్ట** వి. తిప్పతీగ, పసుపురంగు పూలుండే తీగ (Tinospora Cordifolia). **దేవరతలారి** వి. దేవాలయ రక్షకుడు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 207. క్రీ.శ. 1109. **దేవరదోసిళ్ళు** వి.బ.వ. కళ్ళంలో గింజలు కొలిచేటప్పుడు దేవుడిపేర ముందుగా తీసే కొన్ని దోసిళ్ళ గింజలు. **దేవరపోతు** వి. క్షుద్రదేవతలకు బలిఇవ్వడానికి వదలిన దున్నపోతు. **దేవరబసివి** వి. దేవరసాని. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 702. క్రీ.శ. 1518. **దేవరబాన** వి. ఉత్సవాలలో వాడే మట్టిబాన. **దేవరమిద్దె** వి. దేవతాగృహం, దేవునిగది. హంస. 1.151. **దేవరయిల్లు** (-ఇల్లు) రూ. దేవరిల్లు. వి. దేవతాగృహం, దేవునిగది. శుక. 2.432. **దేవరవడుగులు** వి.బ.వ. దేవరభృత్యులు. ద.హిం.శా. సంపు. 10, శా.సం.7. క్రీ.శ. 1112. **దేవరవారలు** విశ. బ.వ. ప్రభువు. విజయ. 1.140. **దేవరవారు** విశ.బ.వ. ప్రభువు. **దేవరసరుగు** వి. ఒకరకం పారుడురోగం. **దేవరిల్లు** రూ.చూ. దేవరయిల్లు. వి. దేవతాగృహం. <దేవర + ఇల్లు. **దేవళ్లగుడి** వి. దేవాలయం. ప్రబంధ. 645. **దేవళ్ల పెట్టె** వి. దేవతార్చనపుపెట్టె, దేవతావిగ్రహాలుంచే పెట్టె. శుక. 3.50. **దేవళ్లు** వి.బ.వ. దేవతలు, శ్రీనాథుని చాటువు. సం. దేవ-. దేవుడు. <సం.దేవ- + -డు + లు.

**దేవరాయఁడు** వి. ఉత్తమదేవుడు. ద్వి.పరమ.వి. 1.36.

సం. దేవ-. దేవుడు, దేవరాజ-. ఇంద్రుడు, ఉత్తమ దేవుడు.

<సం. దేవ- + రాయఁడు (మిశ్రన.).

**దేవరి** రూ.చూ. దేవేరి. వి. దేవి, అమ్మవారు. నె.శా. దర్శి

శాసనం 17.

**దేవరికము** వి. దేవతార్చన వృత్తి. ద. హిం. శా.సంపు. 10. శా.సం. 309. క్రీ.శ. 1246.

సం. దేవ-. దేవుడు.

<సం. దేవ-+-ఇకము.

**దేవరిల్లు** చూ. దేవర.

**దేవల** చూ. దివ్వె. వి. దివ్వెల, దీపావళి పండుగ.

**దేవల్ఇనాం** వి. దేవాలయాల పోషణకు దేవతల అంగరంగ భోగాలకు ఇచ్చే ఇనాం.

సం. దేవ-. దేవుడు.

**దేవళము** రూ.చూ. దేగులలంబు. వి. కోవెల, గుడి. జాహ్నపీ. 1.62.

**దేవళ్లగుడి** చూ. దేవర.

**దేవళ్లపెట్టె** చూ. దేవర.

**దేవళ్లు** చూ. దేవర.

**దేవసం** రూ.చూ. దివసము. వి. తద్దినం.

**దేవసము** వి. దేవభాగం. ద్వి.పరమ.వి. 197 పు.

సం. దేవస్వ-. దేవతల కర్పించిన సొమ్ము, దేవ ధనం ; ప్రా. దేవస్స-.

<ప్రా. దేవస్స-.

**దేవసుడి** వి. గంగడోలుకి రెండువైపులా ఉండే సుడి, దేవమణి.

సం. దేవ-. దేవుడు.

<సం. దేవ-+సుడి (మిశ్రస.).

**దేవసెమ్మెళము** వి. దీపపుసెమ్మె. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 98. క్రీ.శ. 1131.

సం. దేవ-. దేవుడు.

**దేవాంగి**[1] వి. బట్టలు నేసి జీవించే ఒకజాతివాడు.

**దేవాంగులు** వి.బ.వ. నేతపని చేసేవాళ్ళలో ఒక తెగ.

**దేవాంగి**[2] వి. ఒక జాతి కోతి.

సం. దేవాంగిన్. దేవతాశరీరం కలది.

<సం. దేవాంగిన్ (అర్థవిపరి.).

**దేవాంగులు** చూ. దేవాంగి[1].

**దేవాదయము** రూ. దేవదాయం, దేవాదాయం. వి. దేవుని రాబడి. నె.శా. రాపూరు శాసనం 34. క్రీ.శ. 1638.

సం. దేవాదాయ-. దేవునికి సంబంధించిన రాబడి.

<సం. దేవాదాయ-.

**దేవాదాయం** రూ.చూ. దేవాదయము. వి. దేవస్థానాలకు ఇచ్చిన మాన్యం.

**దేవాదేవేషంచేయు** చూ. దేవాదేవేషు.

**దేవాదేవేషు** వి. దెబ్బలాట. ఒక ఇంటికి పెద్దల్లుడు చిన్నల్లుడు పండుగకు రాగా రాత్రి పెద్దల్లుడికి బయట పక్క వేసి చిన్నల్లుడికి లోపల పక్క వేశారట. రాత్రి బయటికి పోయే టప్పుడు పాంకోళ్ళతో చిన్నల్లుడు తన షడ్డకుని తొక్కి 'క్షమధ్వం' అన్నాడట. ఇట్లా అనేక పర్యాయాలు జరుగగా వేదపండితుడైన పెద్దల్లుడు 'దేవాదేవేషు శ్రయధ్వం, ప్రథమా ద్వితీయేషు శ్రయధ్వం' అనే మంత్రాన్ని చదువుతూ 'ధ్వం' అని వచ్చినప్పుడు శాస్త్రపండితుడైన తన తోడల్లుడిని కొట్టాడుట. దీన్నిబట్టి 'దేవాదేవేషు' అంటే దెబ్బలాట అనే అర్థం వైదిక పరిభాషగా వచ్చింది. మంత్రాన్ని బట్టి కాక కథను బట్టి వచ్చిన సంకేతమిది.

<సం. దేవాదేవేషు (అర్థవిపరి.).

**దేవాదేవేషంచేయు** స.క్రి. తన్ను. <సం. దేవాదేవేషు + చేయు.

**దేవాంతకుడు** వి. అసాధ్యుడు.

సం. దేవాంతక-. దేవతల్ని అంతం చేసేవాడు.

<సం. దేవాంతక- (అర్థవిపరి.).

**దేవాయుధములు** వి.బ.వ. శాపనార్థాలు, దేవతలు గీర్వాణులు కాబట్టి వారి ఆయుధాలు వాక్కులు. ఆము. 7.13.

సం. దేవాయుధ-. దేవతల ఆయుధాలు.

<సం. దేవాయుధ-+-ము+లు.

**దేవారాయికొంగ** వి. కొంగల్లో ఒకరకం.

సం. దేవ-. దేవుడు.

**దేవారు** చూ. దేవర. వి. గణాచారి.

త. తేవర్. దేవుడు.

**దేవికొనివచ్చు** చూ. దేవు[1].

**దేవిడీ** రూ. దేవడీ. వి. **1.** కోట వాకిలి, రాజనగరు ; **2.** పెంకు కప్పుగల సర్కారు కార్యాలయం.

సం. దేహలీ ; ఇంటిగడప ; మరా. దేవడీ.

<మరా. దేవడీ.

**దేవిడీమన్నా** వి. కోట వాకిలికి రాకూడదనే ఉత్తరువు.

**దేవిలి** వి. దేవలకుడు, పూజారి. ద.హిం.శా. 1384.

సం. దేవలక-, దేవకులిక-. పూజారి ; ప్రా. దేఉలిఅ. దేవస్థాన పాలకుడు ; జై. మహా. దేవులియా ; అ.మా. దేఉలిఅ. అర్చకుడు ;

క. దేగులిగ, దేవడి, దేవడిగ, దేవుడిగ, దేవుళిగ ; తు. దేవడికి, దేవడిగె ; మ. దేవడియాల్.

<ప్రా. దేఉలిఅ.

**దేవు**[1] చూ. చేఁదు. స.క్రి. **1.** సంగ్రహించు, దొంగిలించు. బసవ. 5 పు. 345 పం. ; **2.** కలచు. బసవ. 5 పు. 392 పం. ; **3.** నీళ్ళు పాలు మొ॥ వాటిలోనుంచి తడిమి తీయు. హరి.పూ. 5.204 ; **4.** తడుము. కాశ. 3.97 ; **5.** వెదకు ; **6.** కడుపులో తిప్పు ; **7.** మట్టిని గుంటనుంచి పైకితోడు ; **8.** తొట్టెలో రంగునీళ్ళు పోసి, నూలు లడీలకు రంగు పట్టేట్టు కలియదిప్పు.

క. తేకు, తేగు. జంకు, తేకు. కడుపులో తిప్పు, ఎగపీల్చు ; తు. తేగు, తేగుని. జంకు, తేపుని. చేదతో నీరు పారవేయు (పంటలు పండించడానికి) ; త. తెక్కమ్. తేన్పు ; మ. తెక్కుక. జంకు, తేవుక, తేకుక. నూతి నుంచి నీరుతీయు, తేండు, తేటు. వెదకు ; కో. తె.క్ల్. జంకు ; తొ. తొ.క్. జంకు, తొడ్క. వెదకు ; కుఇ. తేప్క. వాంతిచేయు.

<మూ.ద.ద్రా. తే-వ్-/తే-క్-/*తే-న్ట్-/*-తేట్ట్-.

**దేవికొనివచ్చు** స.క్రి. కడదాకా ఉన్నవన్నీ చేతితో ఊడ్చుకొనివచ్చు. బసవ. 5.135 పు. **దేవుకొను** స.క్రి. **1.** తడువుకొను ; **2.** వెదుకుకొను ; **3.** (దొరికినంత) ఆత్రంగా పోగుచేసుకొను. **దేవుతొట్టె** వి. రంగునీళ్ళలో.

నూలు లడీలువేసి కలిపే పాత్ర. **దేవులాట** వి. 1. దీనంగా అర్థించటం ; 2. వెదకులాట.

**దేవు²** వి. బిరుదవాచకం.

సం. దేవ-. దేవుడు ; ఒ. దేవు ;
మ. దేవ్.
<ఒ. దేవ.

**దేవుడు** వి. చంద్రుడు.

సం. దేవ-. దేవుడు.
<సం. దేవ- + -డు- (అర్థవిపరి.).

**దేవుమాను** రూ.చూ. దేవమానికం. వి. గంగడోలుకు రెండు వైపులా ఉండే సుడి.

**దేవురించు** చూ. దేవురు.

**దేవురింపు** చూ. దేవురు.

**దేవురు** వి. దైన్యం. వేంక. పంచ. 4.395.

**దేవురించు** రూ. దేబరించు. అ.క్రి. దైన్యపడు, దీనత్వంపొందు. హరిశ్చ. 4.103. **దేవురింపు** రూ. దేబిరింపు, వి. 1. పరిదేవనం ; విలపించటం, ఆం.భా. 1.116 ; 2. దేవురించటం, దీనుడవటం. **దేవురుగొట్టు** రూ. దేబిరిగొట్టు, దేబిరిగొట్టు. వి. దేబె, దీనుడు. **దేవులాడు** స.క్రి. 1. వెదకులాడు, పెనగులాడు ; 2. బతిమాలు. <దేవురు + ఆడు. **దేవుళ్లాడు** అ.క్రి. 1. చింతించు, విచారించు ; 2. కాలం గడుపు. <దేవురు + -లు + ఆడు.

**దేవులాడు** చూ. దేవురు.

**దేవుళము** రూ.చూ. దేగులలంబు. వి. దేవాలయం. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 702. క్రీ.శ. 1518.

**దేవుళ్లాడు** చూ. దేవురు.

**దేవెరి** రూ.చూ. దేవేరి. వి. మహిషి, రాజుభార్య. అచ్చ.రా. యు. 64.

**దేవేరి** రూ. దేవరి, దేవెరి. వి. 1. భార్య. హర. 7.113 ; 2. మహిషి, రాజుభార్య. కాశీ. 6.192.

సం. దేవీ. దేవతాస్త్రీ, దుర్గాదేవి, రాణి ; ప్రా. దేవీ.

**దేవేరిపట్టము** వి. మహిషీత్వం, పట్టపురాణితనం. వరాహ. 11.54.

**దేశకాయమిర్చి** వి. ఒకరకం పండిన పండు మిరపకాయలు.

**దేశపాండె** రూ.చూ. దేశపాండ్యా. వి. బిరుదువాచకం.

**దేశపాండ్యా** రూ. దేశపాండె. వి. బిరుదువాచకం.

సం. పండిత-. పండితుడు ; ప్రా. పండియ ; దేశపాండా. దేశీయ పండితుడు ; మరా. దేశపాండా.
<మరా. దేశపాండా.

**దేశముఖి** రూ.చూ. దేశముఖు. వి. బిరుదువాచకం.

**దేశముఖు** రూ. దేశముఖి, దేశ్‌ముఖ్. వి. దేశంలో ముఖ్యుడు. నవాబుల పరిపాలనా కాలంలో కొన్ని గ్రామాలకు అధికారి. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 772.

సం. దేశముఖ్య. దేశంలో ముఖ్యుడు ; మరా. దేశ్‌ముఖ్. దేశంలో ప్రధానుడు.
<మరా. దేశ్‌ముఖ్.

**దేశవాల చక్రకేళి** వి. ఒకరకం దేశవాళీ అరటిచెట్టు (Dioscorea Purpurea).

**దేశవాలిపెండలము** రూ. దేశవాళీ పెండలము. వి. భూమి పై భాగంలో తమలపాకు తీగవంటి తీగ కలిగి భూమిలోపల 4 వీశల వరకు బరువు ఉండే ఒకరకం దుంప (Dioscorea Purpurea).

**దేశవాలీ** రూ. దేశవాళి. విశ. దేశీయమైన.

**దేశవాలీసంత్ర** వి. ఒకరకం కమలాపళ్ళు. మరా. సంత్ర. కమలాపళ్ళు.

**దేశవాళి** రూ. దేశవాలీ, దేశవాళీ. విశ. స్వదేశ సంబంధమయిన, దేశీయమైన.

హిం. దేస్‌వాల్. దేశీయమైన.
<హిం. దేస్‌వాల్.

**దేశవాళిగంటి** రూ.చూ. దేశవాళిగంటె. వి. మెట్టభూముల్లో పండించే ఒకరకం ఆహారధాన్యం. **దేశవాళిగంటె** రూ. దేశవాళిగంటి. వి. మెట్టభూముల్లో పండించే ఒకరకం ఆహార ధాన్యం (Penisetum Typhoideum). **దేశవాళిమిర్చి** వి. ఒకరకం ఎండిన పండు మిరపకాయలు.

**దేశవాళీ** రూ.చూ. దేశవాళి. విశ. దేశీయమైన.

**దేశవాళీగోగు** వి. గోంగూర. **దేశవాళీచీని** వి. నారింజ భేదం (Limonia Trifliata). **దేశవాళీపత్తి** వి. నాటు పత్తి. **దేశవాళీపెంకు** వి. మామూలుగా ఇళ్ళు కప్పడానికి వాడే చిన్న పెంకు. **దేశవాళీసన్నం** వి. వడ్లలో ఒకరకం. **దేశవాళీపెండలము** రూ.చూ. దేశవాలి పెండలము. వి. భూమి పైభాగంలో తీగలోపల 4 వీశెలవరకు బరువు ఉండే ఒకరకం దుంప (Dioscorea Purpurea).

**దేశస్థులు** వి.బ.వ. కుమ్మర్లలో గుండయ్య తెగవాళ్ళు.

సం. దేశస్థ-. దేశంలో ఉన్నవాడు.
<సం. దేశస్థ- + లు (అర్థవిపరి.).

**దేశాకుండ** రూ.చూ. దేగిసకుండ. వి. మూతివెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అండా ఆకారంలో నిలువుగా ఉండే మట్టిపాత్ర.

**దేశాటి** చూ. దేసహి. వి. గ్రామనాయకుడు, అధికారం ద్యోతకమయ్యే పదం. నెల్లూరి శాసనాలు, ఉదయగిరి శాసనం. శాసం. 14. క్రీ.శ. 1236.

**దేశాయి** రూ.చూ. దేసహి. వి. 1. ప్రధాన కరగ్రాహి, మండలాధికారి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 83. క్రీ.శ. 1782 ; 2. బిరుదువాచకం.

**దేశాయా** రూ.చూ. దేసహి. వి. అధికారి, జిల్లా అధికారి.

**దేశాలివిద్యలు** చూ. దేశవాలీ. వి.బ.వ. దొంగవేషాలు. గో.హరి.ఉ. 876 పం.

**దేశావా** రూ.చూ. దేసహి. వి. మండలాధికారి.

**దేశాహి** రూ.చూ. దేసహి. వి. ప్రధాన కరగ్రాహి, మండలాధికారి.

మరా. దేశాయి. మండలాధికారి.

**దేశాహీ** రూ.చూ. దేసహి. వి. అధికారి, జిల్లాఅధికారి. నె.శా. 2 సం. ధను. 1.38.

**దేశి** వి. 1. దేశభాషా కవిత్వం. కు.సం. 1.28 ; 2. అచ్చ తెలుగు శబ్దాలతో కూడిన ఆంధ్ర భాష. కావ్యా. చూ.

9.17 ; **3**. నాట్యవిశేషం. శ్రీరం. మా. 4.162.

సం. దేశిన్. దేశంకలవాడు, సంగీత విశేషం. దేశీ. సంగీత విశేషం.

<సం. దేశిన్ (అర్థవిపరి.).

**దేశ్‌ముఖ్** రూ.చూ. దేశముఖు, వి. మండల కరగ్రాహి, జమీందారు. ద.హిం.శా.సంపు. 10. శా.సం.772. క్రీ.శ. 1696.

**దేష్ట** వి. మార్గశిరమాసం (డిసెంబరు మొదటి భాగంలో) వచ్చే కార్తె.

సం. జ్యేష్ఠ-. తెలుగు నెలల్లో మూడోనెల.

<సం. జ్యేష్ఠ-.

**దేసటి** చూ. దేసహి. వి. ప్రధానకరగ్రాహి, మండలాధికారి. ద.హిం.శా.సంపు.6. శా.సం.83. క్రీ.శ. 1782.

**దేసము** వి. వైరం, పగ, ద్వేషం. సాంబ. మాన. 31.

సం. ద్వేష-. పగ, విరోధం ; ప్రా. దేస-. శత్రుత్వం, వఇస్స-. అప్రీతికరం, దేసి. ద్వేషించువాడు ; అ.మా. దేస, వేస ; మా. దేష్య-. కోపం ; పా. దేస్స, దేస్సియ. ద్వేషం, దేస్సిన్. ద్వేషి ; అప. దేస, వేస.

<ప్రా. దేస-.

**దేసరాయి** వి. సారెమొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్న రాయి.

**దేసహి** రూ. దెశాహి, దేశాయి, దేశాయీ, దేశావా, దేశాహి, దేశాహీ. వి. ప్రధానకరద్రాహి, మండలాధికారి. నె.శా. కావలి. 8. క్రీ.శ. 1188.

సం. దేశాధిప-. దేశాధిపతి ; ప్రా. దేసాహివ- ; మరా. దేశాయి. మండలాధికారి.

<మరా. దేశాయి.

**దేసి** విశ. **1**. మనోహరమైన, అందమైన. కు.సం. 6.52 : **2**. బాగుగా. కు.సం. 6.79.

సం. దేశిన్. దేశసంబంధి ; ప్రా. దేసీఅ, దేస-. జనపదం, దేసీ. భాషావిశేషం ; అ.మా. దేశీ. జనపద సంబంధి ; ప్రా. దేస. దేశం ;

క. దేసి ; కొడ. దేజ.

<ప్రా. దేసిఅ.

**దేసితల్లిపండుగ** వి. దసరా రోజుల్లో దేవాంగులు చేసుకొనే పండుగ. **దేసిమార్గములు** వి.బ.వ. కవిత్వాభేదాలు, సాహితీ సంప్రదాయాలు. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 103. క్రీ.శ. 1145. **దేసియాభరణ (-అభరణ)** వి. దేసి వ్యాపారస్థులకు అభరణంవంటివాడు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 710. క్రీ.శ. 1188. **దేసిరట్టడ్లు** వి.బ.వ. గ్రామస్థులగు ప్రధానవ్యాపారులు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 665. క్రీ.శ. 1105.

**దేసిక** వి. సంగీత భేదాల్లో ఒకటి. హర. 3.62.

సం. దేశిక-. దేశీయమయినది ; ప్రా. దేసీఅ ; పా. దేసక.

<సం. దేశిక-.

**దేసెం** వి. దేశం. పుల్లగంటివారిపల్లి శాసనం, మదనపల్లి. క్రీ.శ. 10వ శతాబ్ది.

సం. దేశ-. దేశం ; ప్రా. దేస-.

<ప్రా. దేస-.

**దేహపుపొరుపు** వి. ఉపవీతం.

సం. దేహ-. శరీరం.

<సం. దేహ- + పొరుపు.

**దేహబాధ** వి. **1**. మలవిసర్జనానికి వెళ్ళటం ; **2**. శరీరాయాసం.

సం. దేహబాధా. శరీరబాధ.

<సం. దేహబాధా (అర్థవిపరి.).

**దేహయాత్ర** వి. **1**. భుజించడం. హర. 4.18 ; **2**. జీవిక.

సం. దేహయాత్రా. జీవనోపాయం.

<సం. దేహయాత్రా (అర్థవిపరి.).

**దేహయాత్రనడుపు** స.క్రి. భుజించు. హర. 7.112.

**దేహశుద్ధి** వి. తన్నటం.

సం. దేహశుద్ధి-. శరీరపారిశుద్ధ్యం.

<సం. దేహశుద్ధి- (అర్థవిపరి.).

**దేహాతిపెంకు** వి. మామూలుగా ఇళ్ళు కప్పడానికి వాడే చిన్న పెంకు.

హిం.ఉ.పార. దేహాత్. గ్రామం, పల్లెటూరు, దేహాతీ. గ్రామసంబంధమైన.

<ఉ. దేహాతీ + పెంకు.

**దైత** వి. ఆడది.

సం. దయితా. ప్రియురాలు, భార్య.

<సం. దయితా.

**దైలువాఱు** రూ.చూ. దైవాఱు. అ.క్రి. అతిశయించు, అధికమగు. ఘటికా. 2.190.

**దైవాఱించు** చూ. దైవాఱు.

**దైవాఱు** రూ. దయివాఱు, దైలువాఱు. అ.క్రి. **1**. పొంగి పొరలు, పొరలు. హర. 2.23 ; **2**. అతిశయించు, అధికమగు. హర. 2.31 ; **3**. ఒప్పు. చంద్రికా. 3.106.

**దైవాఱించు** అ.క్రి. పొంగి పొరిలేటట్లుచేయు. భాస్క.రా. యు. 2336. <దైవాఱు + -ఇంచు[3].

**దొక్క** రూ.చూ. దుక్క. వి. **1**. కొయ్యమొద్దు, దుంగ ; **2**. ఈతగూటాన్ని నేలలో దిగగొట్టే పెద్దసుత్తి ; **3**. దొంగ గొడ్డు మెడకు కట్టే బరువు కొయ్య ; **4**. లావుపాటి చెట్టు మొదలు ; **5**. ఆము కాల్వులో వాడే కర్రముక్క లేక తుండు.

**దొక్కాము** రూ.చూ. దుక్కకాము. వి. దుక్కను నేలలో దిగగొట్టే పెద్దసుత్తిపిడి.

**దొక్కాము** చూ. దొక్క.

**దొక్కిసెం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయట, ఈతెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దొక్సెం** రూ.చూ. దొగసం, వి. ఆరుబయట, ఈతెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

**దొగ** రూ.చూ. దుక. విశ. యువ. లక్ష్మీపుర శాసనం. దివి తాలూకా. క్రీ.శ. 675.

**దొగరాచపన్ను** వి. యువరాజు పోషణ భృతికై రైతు చెల్లించే పన్ను. E. I. 30.46. **దొగరాజు** వి. యువరాజు.

**దొగసం** రూ. డొక్కసం, డొగసం, డొగ్గసం, దవసం, దుగసం, దూసం, దొక్కెసం, దొక్సెం, దొగ్గసం, దొగ్గిసం. వి. ఆరుబయట చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

**దొగిచింకర్ర** రూ. దోచింకర్ర. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దొగ్గలాకు** చూ. దొగ్గలి.

**దొగ్గలి** వి. రక్తభాష్పం, ఒకమొక్క, తోటకూరజాతికి చెందిన కూరాకు మొక్క. ఆము. 6.13.

దొగ్గలాకు వి. ఏటా మొలిచి పెరిగే కలుపుమొక్క (Amarantus Polygamus). < దొగ్గలి + ఆకు.

**దొగ్గసం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయట ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

**దొగ్గాడు** రూ.చూ. దోఁగియాడు. అ.క్రి. పాకు.

**దొగ్గిసం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయట చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్యపనిముట్టు.

**దొగ్గుడు** వి. వ్యాపనం.

దొగ్గుడుకొను అ.క్రి. వ్యాపించు. అచ్చ.భా. 5.86.
దొగ్గుడుబండి వి. ఆకుల్లేని కర్ర చక్రాల బండి.

**దొంక** చూ. దుంకు. వి. 1. నేతగుడ్డచుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి ; 2. గోడలో పెట్టిన రంధ్రం.

**దొంకారి** వి. మొదల ముళ్ళుకల పెద్ద పొద (Mallotus Repandus).

**దొంకు** రూ.చూ. డొంకు[1]. అ.క్రి. 1. అణగు, క్షీణించు ; 2. (ఒకదానికంటె ఒకటి) తగ్గు, కుదించు ; 3. ఇంకు, ఎండు; 4. దాగు ; 5. సంకోచించు, వెనుదీయు, కొంకు ; వి. టొంకు. వక్రత, వంకర ; విణ. 1. వక్రం, వంకరైన ; 2. తిన్నగారానిది, అవ్యక్తమధురం (మాట).

దొంకుడుకోలు వి. సారెమీద కోలుపట్టిన తర్వాత గుండుగ కావలసిన సైజులో లోపల బోలుగా ఉండేటట్లు చేసిన ఆకారం. దొంకెన రూ.చూ. డొంకెన. వి. ఆయుధ విశేషం. గౌ. హరి. పూ. 134పం.

**దొంకెన** చూ. దొంకు.

**దొంగ** రూ. డొంగ[1]. వి. 1. చోరుడు. మను. 3.84, పారి. 1.49 ; 2. అరటిపువ్వు లోపల ఉండేగట్టికాడ, విణ. వంచకం, మోసపుచ్చే.

క. *దొంగు, డొంగు*. దాచిన, పారిపోవు ; త. *తొంకన్*. దొంగ ; *తొంకి* ; మ. *తొజ్జన్*. సిగ్గుమాలిన మోసగాడు ; గోం. *దొంగా*. దొంగ ; కువి. *దొంగ*. దొంగ ; పర్జి. *దొంగ్*. దొంగు ; కొలా. *దొంగ్లి*. రహస్యం, రహస్యపుపని, *డొంగ*. దొంగ.

దొంగకట్ట వి. కళ్ళంలో గింజలు దొంగల్నుంచి రక్షించిన మాదిగకిచ్చే గింజలున్న వరిగడ్డి వగైరా. దొంగకత్తియ వి. కుట్టని, తార్పుకత్తె. దొంగకుండలు వి.బ.వ. పల్లెల్లో బీదలు ఇళ్ళల్లో వరసగా ఉంచుకొనే పెద్దకుండలు. దొంగకుఁదేలుకుట్టినట్టు అవ్య. చడీచప్పుడూ లేకుండా. కళా. 2.79. దొంగకూడు వి. దొంగచాటుతిండి. విప్ర. 5.41. దొంగకొయ్య వి. మగ్గంగుంటలో, పావు చెక్కల బిగింపుకు పాతిన కొయ్య. దొంగగూడు వి. చెక్కతో సహాగోడలో బిగించిన పెట్టివంటి గూడు. దొంగగెడ్డ వి. ఆకస్మాత్తుగా పొంగివచ్చే గెడ్డ. దొంగగొడ్డు వి. దొంగమేత మేసే జంతువు. దొంగచీల వి. ఆద్దాన బండి పరాన్ని దోనె మొద్దుకు బిగించే చీల. దొంగచుక్క వి. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. దొంగచేట వి. దొంగల్నుంచి కళ్ళంగా పాడినందుకు వాడికిచ్చే చేటెడు గింజలు. దొంగతనము వి. చోరత్వం. చౌర్యం, దొంగిలించటం. దశా. 1.272. దొంగతల్లియేడువభయము వి. దొంగతల్లికి కొడుకుపట్టుబడతాడని ఏడవటానికి కూడా (కారణాంతరాలవల్ల) భయం అనేటప్పటి సామెత. దొంగతాడు వి. కాడినిపోలుగర్రకు కలిపికట్టే తాడు. దొంగతూము వి. సైఫన్. దొంగతొత్తులు వి.బ.వ. 1. బాలిక్రాకీడ ; 2. దొంగబుద్ధి ఉన్నవారు. దొంగతో కొలువు వి. అపాయకరం. దొంగదోపు వి. దేవతల తిరునాళ్ళ వేడుకకి చేసే నాల్గవనాటి ఉత్సవం. దొంగనిద్ర వి. ఇతరుల్ని మోసపుచ్చటానికై నిద్రపోతున్నట్లు నటించడం. దొంగనుదేలుకుట్టినట్లు అవ్య. తప్పుచేసినప్పుడు మాట్లాడకుండే టప్పటిపలుకుబడి. దొంగనేల వి. 1. మోసంచేసి అపహరించిన నేల ; 2. మోసగించేనేల, ఊబి ప్రదేశం. అనగా పైకి బాగుగా కనిపించి లోపల బురదతో ఉంటుంది. కొన్ని చోట్లమనుషులు, పశువులు సైతం అందులో నామరూపాలు కనిపించక దిగబడిపోతారు. దొంగపడినయాలునెలలకుఁగుక్కమొఱిఁగినట్లు అవ్య. పనిని వెంటనే చేయక ఆలస్యంచేసేటప్పుడు వ్యవహరించే పలుకుబడి. దొంగపని వి. చోరకృత్యం, దొంగతనం. వేంక. పంచ. 4.240. దొంగపాలు వి. దొంగభాగం. దొంగపిప్పికర్ర వి. గానుగలో నలిగిన చెరుకును పెద్ద కణెములమధ్యకు మళ్ళించే సాధనం. దొంగపొదుగు వి. పైభాగం చిన్నదిగా ఉండి, చన్నులు పొడుగ్గా ఉండే పొదుగు. దొంగపోటు పొడుచు స.క్రి. వెనకపోటుపొడుచు. దొంగప్రొద్దు వి. దొంగలు దొంగిలించటానికి అనుకూలమైన సమయం, అర్ధరాత్రి. దొంగబీగము వి. మారుతాళం. దొంగబూచి బూటకం వి. బెదిరింపులు. దొంగభక్తి వి. ఇతరుల్ని మోసపుచ్చటానికి భక్తిఉన్నట్లు నటించడం. దొంగమాట వి. అబద్ధం, కల్పితం. దొంగమాద రూ. దొంగమాదు. వి. గొంతుమీదివాపు. దొంగమాదు రూ.చూ. దొంగమాద. వి. గొంతుమీదివాపు. దొంగమార్కెట్టు వి. నల్లబజారు. దొంగమేఁత వి. పసరం తప్పించుకొనిపోయి పొలాల్లో మేసేమేత. దొంగమేపు వి. ఇతరుల పొలాల్లో దొంగతనంగా పశువుల్ని మేపటం, లంపు. ఆం. భా. 3.35. దొంగయిసుక (-ఇసుక) వి. కిందిలోతు తెలియకుండా మీదవ్యాపించి ఉండే ఇసక. దొంగయూబి (-ఊబి) వి. కిందిలోతు తెలియకుండా మీద వ్యాపించి ఉండేబురద. దొంగరాడు వి. దొంగిలించే వాడు, దొంగ. దొంగరేయి వి. దొంగలు దొంగిలించటానికి అనుకూలమైన సమయం, అర్ధరాత్రి. దొంగరోగము వి. దొంగలా దాగుండి స్పష్టంగా తెలియనిరోగం. దొంగర్కము రూ. దొంగటికము. వి. దొంగతనం, చౌర్యం. కాశీ. శ. 111.

**దొంగతికము** రూ.చూ. దొంగర్కము. వి. దొంగతనం. చౌర్యం. వి|ప. 5.18. **దొంగలదోలు** (-|**తోలు**) స.|కి. పార|దోలు. **దొంగలపట్టిమంచం** వి. సప్తర్షి నక్ష|త్రమండలం. **దొంగలవైరి** వి. వేటకుక్క. ఇందు. 2.59. **దొంగలుదోచిన కొంప** వి. శూన్యంగా, పాడుగా, ఛిన్నా భిన్నంగా ఉండే గృహం. **దొంగలుదోల** అవ్య. దేనినైనా నిరసిస్తూ మాట్లాడు తున్నప్పుడు 'పాడుగాను' అన్నట్లు అనేమాట. **దొంగ వాకిటనేమంచంవేయు** స.|కి. ఎవరివల్ల భయమో వారి దగ్గరనే ఉండి ఆబాధను తప్పించుకొను. **దొంగవెదవ** వి. ఒకతిట్టు. **దొంగసొమ్ము** వి. దొంగతనంగా తెచ్చిన సొమ్ము. వి|ప. 5.35. **దొంగాటకం** వి. దొంగతనాలు తరచుగా జరుగు తుండడం. **దొంగెత్తువేయు** స.|కి. దొంగయుక్తి పన్ను. <దొంగ + ఎత్తువేయు. **దొంగోడ** వి. జలాంతర్గామి. <దొంగ + ఓడ.

**దొంగాటకం** చూ. దొంగ.

**దొంగిలించు** చూ. దొంగు.

**దొంగిలు** చూ. దొంగు.

**దొంగిళ్లు** వి.బ.వ. ఒకవిధమైన కంటిజబ్బు.

**దొంగు** చూ. డొంగు. స.|కి. అపహరించు, |ముచ్చిలు. అ.|కి. మరుగుపడు.

త. ఒటుంకు, టొంకు, డాఁగు, దాఁగు, మరుగుపడు.

**దొంగిలించు** స.|కి. **1.** అపహరించు. పి. శకు. 1.5; **2.** |ముచ్చిలు. **దొంగిలు** స.|కి. **1.** వంచించు, మోసగించు. పాండు. 5.107; **2.** దొంగిలించు, అపహరించు. చం|ద్రాంగ. 4.138.

**దొంగెత్తువేయు** చూ. దొంగ.

**దొంగోడ** చూ. దొంగ.

**దొటదొట** రూ.చూ. దొడదొడ. వి. (నిప్పులు మొ॥) రాలటంలో అయ్యేధ్వనికి అనుకరణం. సానంద. 2.51, ద్వి. నల. 2.638.

**దొడ** రూ. దొడ్డ, దొడ్డి, దొడ్డు². విశ. పెద్ద; మాలెపాడు, శాసనం. కమలాపురం తా॥ |కీ. శ. 971.

క. దొడ్డ. పెద్ద, లావైన, దట్టం, ముఖ్యమైన; తు. దొడ్డ. పెద్ద, దొడ్డస్తిగె. గొప్పతనం, అధికారం, ధనం; త. తొట్టు. పెద్ద; కో. దొడ్. పెద్ద, గొప్ప; పర్జి. దోఱ. పెద్ద, లావు; కొలా. దూ. పెద్ద, గొప్ప; నా. దోఱ. పెద్ద, అందరికంటె పెద్ద, దోహన్. పెద్ద.

**దొడదొడ** రూ. తొటతొట, దుడదుడ, దొటదొట. వి. (నీరు మొ.) కారటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. రం. రా.యు. 375 పు. 2 పం; విశ. దొడదొడ అనే ధ్వని కల. |కీడా. **54**; రామాభ్యు. 7.243.

**దొడవ** వి. నీచుడు. షో.చ. 7.90.

త. తొటుప్పై. కొండీడు.

**దొడిదొడి** రూ.చూ. దుడిదుడి. వి. **1.** జనులు వేగంగా నడవ టంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 10.81; **2.** (పిడుగు మొ.) పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. సిం. ద్వా. 10.45.

**దొడుసులు** చూ. తొడుసు. విశ.బ.వ. మొదలైన.

**దొడ్డ** రూ.చూ. దొడ. విశ. **1.** పెద్ద. కు.సం. 4.101; **2.** పృథువు, గొప్పది, అధికం. భార. భీష్మ. 2.49; **3.** |శ్రేష్ఠమైన. ఉ.హరి. 3.57; **4.** మనోహరమైన. చంపూ. రా. 3.105, |కీడా. **54**; **5.** |శ్రేష్ఠుడైన. వరాహ. 5.79; **6.** దుష్కరం, చేయరాని. పాండు. 5.212; **7.** మహిమ కల. ఉ.రా. 5.211; **8.** కష్టం. ఉ.రా. 3.81; **9.** మంచి; **10.** చెడు; వి. దొడ్డమ్మ, తల్లికి అక్క.

దొడ్డకంకర రూ.చూ. దొడ్డుకంకర. వి. పెద్ద రాతి ముక్క. **దొడ్డకప్పు** వి. రెండురెండు పెంకులను వెల్లకిల పెట్టి నేసే పెంకు కప్పు. **దొడ్డకొంచెము** విశ. ఎక్కువ తక్కువ. చి|త్రభా. 4.120. **దొడ్డకొంచెములెక్కించు** అ.|కి. ముందు వెనుకలుచూచు. హంస. 1.101. **దొడ్డతనము** వి. గొప్పతనం. వరాహ. 6.10. **దొడ్డపని** వి. ఘనకార్యం. పాండు. 5.212. **దొడ్డమ్మ** వి. పెత్తల్లి, పెద్దమ్మ. <దొడ్డ + అమ్మ. **దొడ్డయ** రూ. దొడ్డయ్య. వి. పెత్తం|డి, దొడ్డమ్మ భర్త. కాశీ. 1.1. <దొడ్డ + అయ. **దొడ్డయడవి** (-**అడవి**) వి. పెద్ద అడవి. **దొడ్డయెద్దు** (-**ఎద్దు**) వి. గొప్పఎద్దు. **దొడ్డయ్య** రూ.చూ. దొడ్డయ. వి. పెదతం|డి, దొడ్డమ్మభర్త. <దొడ్డ + అయ్య. **దొడ్డవయస్సు** వి. |ప్రౌఢవయస్సు. భీమ. 2.46. **దొడ్డవాడు** విశ. **1.** ఘనుడు; **2.** మంచివాడు. **దొడ్డసన్నం** వి. వడ్లలో ఒకరకం. **దొడ్డసేయు** (-**చేయు**) స.|కి. పెద్దచేయు. శృం.నై. 7.119.

**దొడ్డి** రూ. దొడ్డు³. వి. **1.** పశువులు మేసే బీడు. హరి. పూ. 5.142; **2.** పసులకొట్టం, పసులసాల. హరి.పూ. 6.25; **3.** పెరడు. ఆము. 4.245; **4.** ఇల్లు; **5.** పోత పోయవలసిన సిమెంటు మొదలైనవాటికి ఆకారమిచ్చే విడి భాగాల కలయిక; **6.** నాలుగు కొయ్యలతో బిగించబడిన దర్వాజా; **7.** పూరింటి నట్టిల్లు, మధ్యభాగం; **8.** ని|ట్రాడు లేని ఇంటి మధ్యగది; **9.** కొన్నిచోట్ల, రాట్నానికి గంటం అమర్చే కొయ్య చ|టం; **10.** ఒకరకం చ|టం అను; **11.** జాకార్డు డాబీ కట్టుబడిలో అడ్డపలక బిగించిన కొయ్య చ|టం; **12.** డాబీనేతలో డిజైన్లు రావటానికి, మరమగ్గం పైన అమర్చే యం|త్రం; **13.** మరుగుదొడ్డి; **14.** మలం.

క. తొట్టి. చుట్టూ నలుచదరపు స్థలం ఉండి మధ్యన ఉన్న కట్టడం, చుట్టూ ఉన్నస్థలం, దొడ్డీ. పశువులకొట్టం; త. తొట్టి. కంచె, స్థలం, చుట్టూ కంచెవేసి క|రలు అమ్మే స్థలం, కు|గ్రామం;

సం. |దోణి, |దోణీ. దొన్నె, పసులు మేసే భూమి.

**దొడ్డిఅడ్డ** వి. జాకార్డు డాబీకట్టుబడిలో దారాలు తిప్పే పలక. **దొడ్డికట్టగు** అ.|కి. పశువులు మొదలైనవి. గుంపుగా చేరు, మందవేయు. ఆము. 4.117. **దొడ్డికట్టు** వి. నడుమ బయలుచుట్టూ కట్టడాలుగల ఇల్లు, చుట్టుకొలారం. భాస్క. రా. ఆరణ్య. 2.51. త. తొట్టికట్టు. ఇంటినడిమి చతుర|స |ప్రదేశం. **దొడ్డికట్టుపట్టి** వి. ఇంటి చ|టానికి ఆధా రంగా గుంజలమీద వేసే లాటిపట్టె. **దొడ్డికడ్డీ** వి. గుజ్జుల మీద బిగించే అడ్డక|ర. **దొడ్డిక|ర** వి. కోతిపుల్లలుగాని, గిల కలుగాని వేలాడదియ్యటానికి మగ్గానికి పైన దారాలు కట్టిన క|ర. **దొడ్డికాళ్లవాఁడు** విశ. పంగటి కాళ్ళవాడు,

ప్రజ్ఞుడు. ఆం.భా. 2.122. **దొడ్డికాళ్లు** వి.బ.వ. పంగటి కాళ్ళు, ఎడంగా ఉన్న కాళ్ళు. హరిశ్చ. 4.168. **దొడ్డికిపోవు** అ.క్రి. చెంబట్టుకుపోవు, మలవిసర్జనకు వెళ్ళు. **దొడ్డికివెళ్ళు** అ.క్రి. మలవిసర్జనకు పోవు. **దొడ్డికూడు** వి. కార్యంపట్ల బీదసాదలకు సమూహంగా, పశువులదొడ్డి శుభ్రంచేసి బంతులు బంతులుగా కూర్చుండబెట్టి అన్నదానం చేయడం. **దొడ్డికొను** అ.క్రి. నెలవుకొను, నిండు. శేష. 4.20. **దొడ్డిగ అగు** అ.క్రి. లావుగా అగు. **దొడ్డిగుమ్మం** వి. ఇంటి వెనుకనున్న ద్వారం. **దొడ్డిగోడ** వి. 1. దొడ్డివైపునగాని పొలాల్లోగాని ఒకేవైపున (హద్దుగా) కట్టిన చిన్నగోడ; 2. ప్రహరీగోడ. **దొడ్డిచట్రం** వి. 1. అంచులో డిజైను పడేట్టు వజానేత నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన కొయ్యపనిముట్టు; 2. డాబీదిండుకు బిగించిన కొయ్య చట్రం. **దొడ్డిచుక్కలు** వి.బ.వ. శతభిషా నక్షత్రం, దగ్గర దగ్గరగా ఉండే నూరు చుక్కలగుంపు. **దొడ్డిజల్లి** వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో లావుదారాలు దూర్చిన ఈనెల చట్రం. **దొడ్డితాళ్ళు** వి.బ.వ. వజానేతకోసం అమర్చిన దొడ్డిలో, నడిమిజల్లినుంచి ఏటవాలుగాగాని, పక్కజల్లినుంచి నిటారుగాగాని వేలాడే లావు దారాలు. **దొడ్డిదర్వాజా** వి. దొడ్డివెనుకఉన్న ద్వారం. **దొడ్డిద్రోవనుపోవు(-త్రోవనుపోవు)** అ.క్రి. దొంగచాటుగా వ్యవహరించు. **దొడ్డిదోషం** వి. ఎదురెదురుగా దొడ్లు ఉండట మనే (జ్యోతిశ్శాస్త్ర సంబంధిఐన) తప్పు. **దొడ్డినిలువు** వి. దొడ్డి బల్లకు వేసిన నిలువుకొయ్య. **దొడ్డినేత** వి. ఒకరకం డిజైను నేత. **దొడ్డిపట్టి** వి. గుజ్జులమీద బిగించే అడ్డకర్ర. **దొడ్డిపట్టు** వి. గోష్ఠ స్థానం, పశువుల సాల. నీలా. 2.43. **దొడ్డిబద్ద** వి. దూలాలకు అడ్డంగా ఇంటిచట్రంలో భాగంగా వేసే వాసం. **దొడ్డిబల్ల** వి. దొడ్డికింద పీట, అంచుల్లో డిజైన్లు పడేట్టు వజానేత నెయ్యటానికి మగ్గానికిపైన అమర్చిన కొయ్య పనిముట్టు. **దొడ్డిబెట్టిన వేల్పుగిడ్డి** వి. అందు బాటులో ఉండి అన్ని కోరికలు తీర్చేది. మను. 1.66. పెరట్లో ఉంచిన కామధేనువు అన్ని కోరికల్ని ఏవిధంగా తీరుస్తుందో అదేరీతిని అన్ని వాంఛల్ని తీర్చేవాడు లేదా తీర్చేది. **దొడ్డియెల్లవ(-ఎల్లవ)** వి. వెనుగర్రనుంచి ఇంటి చట్రం మీదికి పరిచిన కడ్డీ. **దొడ్డిరాట్నం** వి. డబ్బాలకు నూలు తోడేరాట్నం. **దొడ్డివల** వి. వేటకుపయోగించే ఒక విధమైన వల, జాలవిశేషం. మను. 4.37. **దొడ్డివాకిలి** వి. పెరటిద్వారం. **దొడ్డివేల్పు** వి. ఇలవేల్పు, కులదైవం. ప్రబంధ. 160. **దొడ్డిసంభావన** వి. 1. సంస్థానాల్లో రాజులు పండితులకు, కవులకు సంభావనలు ఇచ్చేవారు. అంత చదువురాని ఇతరుల్ని దొడ్డిలోకి పొమ్మని, వాకిట కూర్చొని ఒకరు సంచిలో వచ్చినన్ని రూకలు ఇస్తూ ఒక్కొక్కరినే బయటికి పంపించివేయడం; 2. శుభకార్యాల్లో బ్రాహ్మణుల్ని దొడ్లోఉంచి సామూహికంగా ఇచ్చే సంభావన. **దొడ్డిసుడి** వి. 1. వీపుమీద ఉండే సుడి; 2. మూపురం పక్కభాగంలో ముందుకు ఉన్న సుడి.

**దొడ్డు**[1] రూ.చూ. దుడ్డు[2]. విశే. లావయిన; వి. కర్ర.

**దొడ్డు**[2] రూ.చూ. దొడ. విశే. 1. అధికమైన, పెద్దదైన. భాగ. 10 పూ. 558; 2. శ్రేష్ఠులైన. భాగ. 10 ఉ. 224; 3. దుష్కరమైన, అసాధ్యమైన. జైమినిభా. 7.85; 4. కష్టమైన. ప్రబోధ. 2.67; 5. శ్రేష్ఠమైన, ప్రశస్తమైన. ఉ.రా. 8.81; వి. 1. ఆధిక్యం. నార.పంచ. 1.465; 2. మాలిన్యం, మురికి. వేమ. 1.279.

**దొడ్డుకంకర** రూ. దుడ్డుకంకర, దొడ్డకంకర. వి. పెద్ద రాతిముక్క. **దొడ్డుకర్ణి** వి. పెద్దసైజు కరిణి. **దొడ్డుకట్టు** వి. పెద్దచార. పండి.చ. 1.45 పు. **దొడ్డుకట్టులచీర** వి. పెద్ద కమ్ములచీర. పండి.చ. 1.45. **దొడ్డుకొంచెములు** వి.బ.వ. హెచ్చులొచ్చులు. సానంద. 2.34 పు. **దొడ్డుజల్లెడ** వి. ముదురుజల్లెడ. **దొడ్డుతాపి** వి. కట్టుబడిలోవాడే మందపాటి రేకుగల కొంచెం పెద్దసైజు తాపి. **దొడ్డునూలు** వి. ముతక నూలు, పోగు మందంగా ఉండే నూలు. **దొడ్డుపరుపు** వి. దూలంపరుపు. **దొడ్డురాయి** వి. పెద్దసైజు రాయి. **దొడ్డువడ్లు** వి.బ.వ. ముతకరకం వడ్లు. **దొడ్డువాఱు (-పాఱు)** అ.క్రి. అధికమగు. **దొడ్డువాసం** రూ. దోడోసం. వి. లావుపాటి వాసం. **దొడ్డుశ్క** వి. పెద్దకణాలుఉండే ఇసక. < దొడ్డు[2] + ఉసుక. **దొడ్డుసున్నం** వి. ఒకపాలు సున్నానికి, మూడు పాళ్ళు ఇసుక కలిపి గానుగాడిన సున్నం.

**దొడ్డు**[3] రూ.చూ. దొడ్డి. వి. 1. స్నానంచేసే దొడ్డి; 2. కూనలో మూతి వచ్చేచోట ఉన్న వంపు.

**దొణిగిపోవు** చూ. తొలఁకు[1]. అ.క్రి. జారిపోవు.

**దొంటు** రూ.చూ. దంటు. వి. తోటకూర (Amarantus Gangeticus).

**దొంటురాయి** వి. సాధారణంగా పునాదులు నింపడానికి వాడబడే చెక్కనిరాయి.

**దొండ**[1] వి. దండ, పూలమాల. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 796. క్రీ.శ. 1430.

క. *దండె*. పూలమాల; త. *తంటిహై*;

సం. *దండ*-.

**దొండవనమాల** వి. పుష్పమాల. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 734. క్రీ.శ. 1379.

**దొండ**[2] వి. బింబిక, ఒక దినుసు తీగ. ప్రభా. 1.15.

సం. *తుండీ*. దొండ; ప్రా. *తుండీర*; ఒ. *కుందిరి*; మరా. *తడు, తెడు*;

క. *తొండీ, తొండె, దొండె*. ఒకరకం దొండ; త. *తొండై*. దొండపాదు.

< సం. తుండీ.

**దొండకాయ** రూ. తొండకాయ. వి. 1. పొరగ పెరిగి విరివిగా కాపుకాసే ఒక తీగ; 2. కూర వండుకొనే ఒక రకం కాయ. **దొండచీడ** వి. ఆకుతోటల్లో పడే తెగులు. **దొండపట్టి** వి. తురకలు కట్టుకోటానికి నేసిన గళ్ళలుంగీలో రంగులుగాని తెలుపులోగాని జేనెడు వెడల్పు అడ్డంగా నేసిన పట్టి. **దొండపండు** వి. బింబఫలం. కాశ. 3.69. **దొండముక్కువడు (-పడు)** అ.క్రి. దొండపండులా గింజల కొనతెర్రబడు. శివరా. 4.19.

**దొండి** రూ. తొండి. వి. 1. చిల్లు, రంధ్రం. ఆం.భా. 1.145; 2. భగం, ఆడుగురి. వేణు.శ. 24.

క. తొళె. కన్నం, తవ్విన రంధ్రం; తు. తొలువె. రంధ్రం, తొళు. రంధ్రం; త. తొళ (తొట్ట్-తొట్ట్-). తొలుచు, ఆయుధంతో తొలచు, తొంటి. రంధ్రం; మ. తొళ్ల. రంధ్రం, ద్వారం; కో. తొయల్. పొడుచు, దూర్చు; తొ. తుయ్ళి, తయ్ళ్క్. రాతికిగాని, చెట్టుకు గాని రంధ్రంచేయు; గోం. తుల్లానా. రంధ్రం తొలచబడు.

చూ. తొళ్ల-ఆయిరమ్.

దొండిపోవు (-పోవు) అ.క్రి. చిల్లుపడు, తూటుపడు. బిల్హ. 2.64.

**దొండు** వి. ఒకవిధమైన చేప, మత్స్యవిశేషం. హంస. 4.187.

**దొణ్ణి** రూ.చూ. దొణ్ణె. వి. దొంగగొడ్డుకు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య.

**దొణ్ణె** రూ. దొణ్ణి. వి. దొంగగొడ్డుకు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య.

క. దొణ్ణె, డొణ్ణె, డొణి. దుడ్డుకర్ర; కొడ. దొణ్ణె. దుడ్డుకర్ర; తు. దొణ్ణె, డొణ్ణె; కో. దొణ్.

< క. దొణ్ణె.

**దొత్త** విణ. వేలాడేటటువంటి.

**దొత్తు** స.క్రి. తన్ను. అష్టమ.క. 5.223 వు. 2 పం.

**దొత్రె** రూ.చూ. జతికె. వి. **1.** దుత్త; **2.** ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలు లేక నారపట్టా, పలుపు.

**దొద్ద** వి. కొల్ల, దోపిడి. పండి.చ. 2.114 వు.

దొద్దకత్తె వి. కొల్లగొట్టేది. దొద్దకాఁడు వి. కొల్లగొట్టేవాడు. ఉ.హరి. 3.34. దొద్దగొను (-కొను) స.క్రి. కొల్లగొను, దోచు. భార.మౌసల. 188. దొద్దయిచ్చు (-ఇచ్చు) స.క్రి. కొల్లగాఇచ్చు, అంతాఇచ్చు. ఆము. 6.69. దొద్దలాడు స.క్రి. కొల్లగొట్టు, కొల్లలాడు. కేయూ. 4.18. < దొద్ద + -లు > ఆడు. దొద్దలుగొను (-కొను) స.క్రి. కొల్లగొను, దోచు. పండి.చ. 2.97 వు. దొద్దలువుచ్చు (-పుచ్చు) స.క్రి. కొల్లపుచ్చు. సిం.ద్వా. 1.5. దొద్దలుపోవు (-పోవు) అ.క్రి. కొల్లపోవు. దొద్దలుసేయు (-చేయు) స.క్రి. కొల్లగాఇచ్చు, అంతాయిచ్చు. సిం.ద్వా. 3.96. దొద్దపోవు (-పోవు) అ.క్రి. కొల్లపోవు.

**దొద్దు** రూ.చూ. దొందు[2]. వి. స్థూలకాయుడు. ఆం.భా. 2.120.

**దొన**[1] వి. అమ్ములపొది, తూణీరం. కు.సం. 3.47.

సం. తూణ-. అమ్ములపొది; ప్రా. తోణ-, తుణ-; అ.మా. తూణ, తోణ;

క. దొణె.

< ప్రా. తోణ-.

**దొన**[2] రూ. దోని. వి. **1.** కొండమీది గుంట, నీటితో కూడిన కొండమీది పల్లం. భార.విరా. 3.82; **2.** మడుగు. కవిరాజ. 5.180. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 320. క్రీ.శ. 1248; **3.** ఈంద్రవాడు కత్తులుంచుకొనే పొది, తోలుసంచి. సురా. 58; **4.** చెరువు. ద్వి.సార.చ. 1.29 వు. 10 పం.; **5.** ఆరులో కర్రు బిగించటానికి తీసిన గాడి.

సం. ద్రోణీ-. దొన్నె, ద్రోణ-. జలాశయం; ప్రా. దోనీ, దోణ-;

క. దొణె, ధొణె. రాళ్ళలో ఉన్న సహజమైన (నీటి గుంట) చెరువు, గొయ్యి, కన్నం; త. కుణై. కొండమీది గుంట లేదా నీటిబుగ్గ, చునె, చునైవు.

< ప్రా. దోణ-.

దొనకట్ట వి. జొన్నకంకు లుంచడానికి కట్టే కట్ట (అంచ). దొనయుప్పు (-ఉప్పు) వి. సంభరిదేశంలో 'రుమ' అనే గనిలో కట్టెలవల్ల కలిగే ఉప్పు, రొమకం, చవుటిఉప్పు.

**దొనకు** వి. కీడు.

**దొనదొన** వి. ఈగలు ముసరటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 9.79.

త. తొణతొణ. దీర్ఘసంభాషణచే కలవరపరచు.

దొనదొనమను అ.క్రి. దొనదొన అని కూయు. < దొన దొన + అను.

**దొని** వి. ధ్వని.

సం. ధ్వని-. శబ్దం, చప్పుడు; ప్రా. ఝుణి, దణి; అ. మా. ధణి; శౌ. ధుణి; అప. ఝుణి;

క. దని;

తు. దణి, ధని.

< సం. ధ్వని-.

**దొనిగర్ర** (-కర్ర) వి. పైనకత్తిగాని చిన్నకర్రవుల్లగాని కట్టిన పెద్దకర్ర.

**దొనుకు** వి. **1.** దుఃఖం; **2.** విచారం.

**దొనుగ** రూ.చూ. దోని. వి. బండిచక్రంలోని అడ్డపట్టి.

**దొనుపు** రూ.చూ. డొలుపు. వి. ఆరులోకర్రు బిగించటానికి తీసిన గాడి.

**దొనె** రూ.చూ. దోని. వి. మట్టితో చేసిన లోతైన పాత్ర.

**దొంతర** రూ.చూ. దొంతి[1]. వి. **1.** పరంపర, వరస. విజయ. 1.48; **2.** ఒకదానిపై ఒకటిగా ఉంచిన వస్తువులవరస. విజయ. 2.152; **3.** ముక్కోణం ఆకారంలో ఉండే పొగ గూడుల వరస.

దొంతరగొను (-కొను) అ.క్రి. దొంతులగు, సాంద్రమగు, దట్టంగావ్యాపించు. దొంతరజల్లిబొంత వి. రెండుబొంతలు కలిపి ఒకటిగా చేసిన బొంత. దొంతరపువ్వు వి. సహస్రారం. పాండు. 4.74. యోగశాస్త్రం ప్రకారం, శరీరంలో ఉన్నాయని చెప్పబడే షట్చక్రాల్లో నడినెత్తిన ఉండేది సహస్రారం. దొంతరపొత్తు వి. ఎక్కువమంది (సుమారు పది మంది దాకా) కలిసి చేసే ఉమ్మడిసాగు. దొంతర మల్లెపేటు వి. అంచులో వరసగా పువ్వులు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. దొంతరముద్దు వి. చుంబన భేదం. ఆం. భా. 2.180. దొంతరలుగొను (-కొను) అ.క్రి. దొంతులగు, సాంద్రమగు, దట్టంగా వ్యాపించు. ఉ.రా. 4.163. దొంతర వళులు వి.బ.వ. అంబెలు. దొంతరవిడెము వి. దొంతరగా ఆకులువేసి కట్టిన తాంబూలం. దొంతరసుడి వి. నొసటి మీద వరసగా ఉండే (మూడు) సుళ్ళు. దొంతరాకు వి. ఒకరకం కలుపు మొక్క. < దొంతర + ఆకు. దొంతరేయు స.క్రి. కుండల్ని ఒకదానిమీద ఒకటి పేర్చు. < దొంతర + వేయు. దొంతర్లేయు స.క్రి. కుండల్ని ఒకదానిమీద ఒకటి పేర్చు. < దొంతర + -లు + వేయు.

**దొంతరాకు** చూ. దొంతర.

**దొంతరేయు** చూ. దొంతర.

**దొంతర్లేయు** చూ. దొంతర.

**దొంతలరుగు** చూ. దొంతి. వి. పొయ్యికి పక్కన ఎత్తుతక్కువగా కట్టిన చిన్న అరుగు.

**దొంతసరం** చూ. దొంతి. వి. చదరపు పెంకును వరసగా అంటించి పైనపూత పూయడం.

**దొంతారి** వి. గులాబిరంగు పూలుపూసే ముళ్ళు ఎక్కువగా ఉండే పెద్దపొద (Mimosa Rubicaulis).

**దొంతి**[1] రూ. దొంతర, దొన్ని. వి. **1**. ఒకదానిపై ఒకటిగా ఉంచిన వస్తువుల వరస, ఎత్తువరస. కు. సం. 1.29; **2**. పరంపర. నృసింహ. **4.141**; **3**. పొయ్యికి పక్కన ఎత్తుతక్కువగా కట్టిన చిన్నఅరుగు; **4**. మధ్యలో నీళ్ళుపోసి గచ్చును గట్టిపరచటానికి వీలుగా మట్టితో కట్టినకట్ట; **5**. పెంకులపేర్పువరస; **6**. పెంకులకుప్ప; **7**. కుండలు ఒకదానిపై ఒకటి పేర్చిన వరస; విశ. ఒకదానిపై ఒకటిగా ఉన్న, దొంతరైన. ఉ. హరి. 5.70; **2**. అధికమైన. జైమినిభా. 1.69.

త. తొంతి. కలిసిఉండు.

**దొంతికలు** వి.బ.వ. వరసగా ఒకదాని మీద ఒకటిగా పేర్చిన కుండలు. **దొంతికుండ** వి. కుండలపేర్పు వరసలోని కుండ. **దొంతిగనిడు** స.క్రి. వస్తువులు మొ॥ వాటిని ఒకదానిమీద ఒకటిపెట్టు. **దొంతిపెంకు** వి. ఇల్లుకప్పడానికి వాడే మామూలు పెంకు. **దొంతిపెట్టు** స.క్రి. కుండల్ని ఒకదానిమీద ఒకటిపేర్చు. **దొంతిబాన** వి. ధాన్యంపోసి దొంతిగా పేర్చిన బాన. **దొంతిబెట్టినకుండలు** వి.బ.వ. వరసగా పేర్చినవి. శాల్ల. సం. 6.133. **దొంతిమన్నెవిభాళు(డు** వి. ఒకానొక బిరుదు. వాసిష్ఠ. 1.10. **దొంతివర** వి. వడ్లు నిల్వ చేసుకోడానికి ఇళ్ళల్లో దొంతిగా పేర్చిన ఒర. **దొంతుసురుగులు** వి.బ.వ. పిల్లలు గుజ్జనగూళ్ళు వండుకోడానికి చేసిఇచ్చే చిన్న చిన్న మట్టిపాత్రలు. **దొంతులద్ర** వి. సరుకులు పెట్టుకొనే గది. <దొంతి+-లు+-అ+అర. **దొంతులువేయు** స. క్రి. కుండల్ని ఒకదాని మీదొకటి దొంతిగాపేర్చు.

**దొంతి**[2] వి. 3నుంచి 6అడుగులు పెరిగే ఎక్కువ ఆకులు కల లావుపాటి చెట్టు (Baliospermum axillare).

**దొంతి**[3] వి. ఓకు చెట్ల ఆకులవంటి ఆకులు కల ఒకరకంచెట్టు (Ficus quercifolia).

**దొంతుసురుగులు** చూ. దొంతి.

**దొంతులద్ర** చూ. దొంతి.

**దొంతులువేయు** చూ. దొంతి.

**దొంద** రూ.చూ. దొందు[2]. వి. స్థూలకాయుడు. ఆం. భా. 2.120.

**దొందడి** చూ. దొందు[1].

**దొందడించు** చూ. దొందు[1].

**దొందము** వి. ద్వంద్వరోగం, వాతపిత్తశ్లేష్మాల్లో ఏరెండింటి వల్లనైనా వచ్చిన రోగం. ఆం. భా. 2.125.

సం. ద్వంద్వ-. ఒకానొకరోగం; ప్రా. దొంద-. <ప్రా. దొంద-.

**దొందు**[1] వి. జత.

సం. ద్వంద్వ-. జంట, రెండు; ప్రా. దొంద-, దంద-; అ. మా. దంద-;

తు. దొందు. జంట, జత.

<ప్రా. దొంద-.

**దొందడి** వి. **1**. సంఘర్షణ, రాయిడి. భార. ద్రోణ. **4.129**; **2**. త్వర, వేగం. భాగ. 9.26; **3**. జనసమూహం; **4**. గుంపు; విశ. సంకులమైన. హరి. ఉ. 8.196. క. దొందడి, దొందణ, దొందణి. జనసమూహం, గుంపు. <దొందు[1]+దడి. **దొందడించు** అ.క్రి. కలియు. హరి. పూ. 9.139. <దొందడి+-ఇంచు[3]. **దొందుకుదొందు** వి. సరికిసరి. **దొంబులిగొట్టు** వి. పిరికి, భీరువు. ఆం. భా. 2.221. రెండుపులుల్ని కొట్టేవాడు అని శబ్దార్థం. వ్యతిరేకలక్షణచే ఉక్తార్థం.

**దొందు**[2] రూ. దొద్దు, దొంద. వి. దొంద, స్థూలకాయుడు. ఆం. భా. 2.120.

సం. తుందీ, తుంద-, తుందిల-; ప్రా. తుంద-. పొట్ట, తుందిల-, తుందిల్ల-. స్థూలకాయుడు. తోంద-. బానకడుపు;

క. తొంది. బానకడుపు; త. ఉంతి, తొండి. బొద్దు; మ. తొంది.

<ప్రా. తుంద-.

**దొందుమేను** వి. మిక్కిలి స్థూలమైన శరీరం. ప్రబంధ. 788.

**దొన్ని** రూ.చూ. దొంతి[1]. వి. మధ్యలో నీళ్ళుపోసి గచ్చును గట్టి పరచడానికి వీలుగా మట్టితో కట్టినకట్ట.

**దొన్నియ** రూ. దొన్నె. వి. **1**. దొప్ప. ఘటికా. 2.15; **2**. ఆకుతో కుట్టిన గిన్ని.

సం. ద్రోణికా, ద్రోణీ. దొప్ప; ప్రా. దోణిఅ, దోణీ; పా. దోణీ;

క. దొన్నె, జొన్నె. ఆకుతో చేసిన దొన్నె; త. తొన్నై. అరటి లేదా ఇతర ఆకులతో చేసిన (కప్పు) దొన్నె; మ. దొన్న. బ్రాహ్మణులు మిరియాలనీరు తాగటానికి ఆకులతోచేసిన దొన్నె; కుఇ. దొనొ. ఆకుతో చేసిన దొన్నె; కువి. దున్నో, దొన్నె.

<ప్రా. దోణిఆ.

**దొన్నె** రూ.చూ. దొన్నియ. వి. దొన్నె, పత్త్ర చషకం. ఆం.భా. 2.44.

**దొప్ప** రూ.చూ. డొప్ప. వి. **1**. ఆకులు మొదలైనవాటితో కుట్టిన దొన్నె, పత్త్ర చషకం. ఆము. 1.76; **2**. కూనలోపలి వంపుగాఉన్న భాగం; **3**. ఆకుతో గిన్నెగా కుట్టిన దొన్నె; **4**. ముసలివాడు; **5**. మరమగ్గం సొరుగుకు చివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య చెక్క.

**దొప్పకారు** వి. మధ్య దొల్లగలిగి వంపు వస్తువులను పట్టుకోనిచ్చే పట్టుకారు. **దొప్పకొయ్య** వి. అచ్చుపోసిన పచ్చి పెంకును వంచే సాధనం. **దొప్పడ్డె** వి. పెద్దసైజు

అడ్డీ. <దొప్ప+పడ్డె. దొప్పపెంకు వి. ఇంటి వెన్నుగాడి మీద పరిచే పెంకు. దొప్పలపూడికుసుమ వి. వడ్లలో ఒక రకం. దొప్పల(బోవు అ.క్రి. ఉబ్బు, ముడతలుపడు, ముడుచుకొని పోవు, చుట్టుకొనిపోవు. <దొప్ప+-లు+-అ[7]+పోవు. దొప్పలుగట్టు(-కట్టు) అ.క్రి. ముడుగులుకట్టు. వేంక. పంచ. 1.233. దొప్పలుదోరలు వి.బ.వ. కావలసినంత సమృద్ధి. కాశీ. 2.49.

దొప్పి రూ.చూ. దొప్ప. వి. ఆకుతో గిన్నెగా కుట్టిన దొన్నె.

దొప్పు వి. పడటం, కొట్టటం. మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. పండి.చ. 1.39 పు.

క. దొప్పు.

దొప్పుదొప్పు వి. నోరు అడిచికోవటంలో అయ్యే ధ్వనికి అనుకరణ. ఉ.హరి. 4.302.

దొబ్బ[1] వి. 1. మాంసఖండం, మాంసంతునక. మను. 4.42; 2. గడ్డకట్టిన రక్తం. యయా. 4.223; 3. పిండం.

త. తొప్పై. ముందుకు వచ్చిన కడుపు, కడుపు పార్శ్వ భాగం; పర్జి. దొర్ప; కొలా. దొబ్బ, తిత్తు. ఊపిరి.

దొబ్బ[2] రూ.చూ. దొమ్మ. వి. ఊపిరితిత్తుల జబ్బు.

దొబ్బగఅగు అ.క్రి. లావుగాఅగు. దొబ్బలగొట్టు వి. అదిరేగుండె.

దొబ్బడబండి వి. ఆకుల్లేని కర్రచక్రాల బండి.

దొబ్బించుకొను చూ. దొబ్బు.

దొబ్బు రూ.చూ. ద్రొబ్బు. స.క్రి. 1. అపహరించు, దొంగిలించు; 2. రమించు, సంభోగించు; 3. పడతోయు; 4. తిట్టు; 5. వెళ్ళిపోవు; అ.క్రి. కుదురు; వి. తిట్టు.

దొబ్బించుకొను అ.క్రి. సంభోగించు, రమించు. దొబ్బుడాయి వి. 1. గర్వం; 2. పెంకితనం. దొబ్బుడుకట్టె వి. 1. ఆములో మంటను ఎగదోయడానికి వాడే పంగలకర్ర; 2. నేతనేసేటపుడు పడుగుచుట్టిన గుంద్రని ఎదురుదోనె చక్రాన్ని తోసేకర్ర. దొబ్బుడుచెక్క వి. లక్ష్మిపట్టిమీద దూర్చే చెక్క. దొబ్బుడుపటవ వి. తాటిచెట్టుకి లొట్టిలోని కల్లును వంచుకోడానికి వాడే మట్టిపాత్ర. దొబ్బుతెగులు వి. మూర్ఖం పట్టుదలగల వాని స్వభావం. దొబ్బులాట వి. ఆలింగనం. <దొబ్బు+-లు+ఆట. దొబ్బులు వి.బ.వ. 1. నిందారోపణలు; తిట్లు; 2. తిట్లు. దొబ్బులుపెట్టు అ.క్రి. నిందించు.

దొమదొమ వి. పెద్దగా అయినరొద. ధ్వన్యను.

దొంపు వి. 1. చేను, మళ్ళవరస. కృ.శకు. 3.33; 2. వేరు పురుగు కొరకటం వల్ల మోవులెండటం.

దొంపుకాల్వ వి. మాగాణి పొలంలోని నీరుతెచ్చే మొదటి కాలవ. దొంపుతెగులు రూ.చూ. దుంపతెగులు. వి. ఒకరకం వరితెగులు.

దొంబర రూ.చూ. దొంబరి. వి. దొమ్మర.

దొంబరి రూ. దొంబర, దొమ్మర, దొమ్మరి. వి. దొమ్మరవాడు, లఘువిద్యవాడు. వరాహ. 11.29.

సం. డోంబ-. తక్కువజాతివాడు. డోమ-. హీనజాతి వాడు, డమ-; డుంబ-. ఒక సంకీర్ణజాతి; ప్రా. డోంబ-, డుంబ-. మ్లేచ్ఛజాతి విశేషం, డోమ-. చండాలుడు. డోవ-. ఒక అనార్యజాతి;

క. దొంబయ్. గడకట్టి చేసేనాట్యం, దొంబ, దొంబరు. దొంబరగత్తి, దొమ్మరిది, దొంబరాట. దొమ్మరపని; తు. దొంబె, దొమ్మరె. దొమ్మరవాడు; త. తొంపయ్. గడకట్టి చేసే నాట్యం; మ. డోంబర్. దొమ్మర్లు; కుఇ. డొంబ. ఒకజాతి దొంబరి. డొమల. దొమ్మరిది; బ్రా. డోమ్. డోంబ.

<ప్రా. దొంబ-+మూ.ద్రా*-ర్.

దొంబులిగొట్టు చూ. దొండు[1].

దొమ్మ రూ. జొమ్మ, జొమ్ము, దబ్బ[5], దమ్మ[1], దమ్ము[3], దొబ్బ[2]. వి. 1. పశురోగ విశేషం, పశువులకు ఊపిరితిత్తుల్లో వచ్చే రోగం; 2. ధైర్యం; 3. గుండె.

హిం.ఉ. దమ్. ఊపిరి.

<ఉ. దమ్.

దొమ్మకుట్టు వి. దొమ్మవల్ల కడుపుబ్బు. దొమ్మగలవా(డు (-కలవా(డు) విణ. ధైర్యం గలవాడు. దొమ్మడోలు వి. అశ్వగంధ వృక్షం, పెన్నేరు. ఆం.భా. 2.63. దొమ్మదారి వి. అశ్వగంధి, పెన్నేరు. హయగంధి (Physalis flexuosa). దొమ్మనెరిడి వి. దొమ్మలో ఒకరకం. దొమ్మపొగరు వి. గుండెపొగరు, కండకావరం. దొమ్మబలం వి. ధైర్యం. దొమ్మముసర వి. దొమ్మలో రక్తం పారుకొనే జబ్బు. దొమ్మలుకొట్టుకొను అ.క్రి. విపరీతంగా ఏడ్చు. దొమ్మలుపగులు అ.క్రి. బాగా దెబ్బలు తగులు. దొమ్మలేనివా(డు విణ. పిరికివాడు. దొమ్మశల రూ.చూ. దొమ్మసెల. వి. కండకావరం. దొమ్మసెల రూ. దొమ్మశల. వి. దొమ్మలో గుండె పట్టుక పోవటం.

దొమ్మర రూ.చూ. దొంబరి. వి. గడికట్టియాడి జీవనం చేసే జాతి.

దొమ్మరవా(డు విణ. దొమ్మర జాతివాడు. దొమ్మరవానిడోలు వి. గయ్యాళిగంప. హంస. 2.14.

దొమ్మరము చూ. దొమ్మర. వి. కలగాపులగం కావటం, అంతా కలిసిపోయి ఏది ఏమిటో తెలియకపోవటం.

త. తొమ్పరమ్. అనేకులకు సిద్ధం చేయబడిన వంట, రాజభవనాల్లో ఉండే పెద్దబల్ల.

దొమ్మరి రూ.చూ. దొంబరి. వి. దొమ్మరవాడు, లఘువిద్యవాడు. ఆం.భా. 2.287, ప్రబంధ. 788.

దొమ్మరికొమ్మ వి. దొమ్మరిసాని. చెన్న బసవ. 2.303. దొమ్మరిడోలు వి. అనేకుల్ని మార్చిమార్చి సంభోగింపజేసే వ్యభిచారిణి. దొమ్మరిసంసారం వి. తిరుగుడుసంసారం. దొమ్మరీ(డు వి. దొమ్మరి. వేము. 2.241.

దొమ్మరీ(డు చూ. దొమ్మరి.

దొమ్మసు రూ.చూ. దిమ్మిస. వి. చాటుబల్ల, నేలను గట్టిపరచడానికి వాడే కొయ్య లేక ఇనప పరికరం.

దొమ్మి వి. 1. అందరూ కలియబడిచేసే యుద్ధం, సంకుల యుద్ధం. శృం.నై. 5.16; 2. యుద్ధం, జగడం. ఆము. 5.9; 3. సమ్మర్దం, రాయిడి. పరమ.వి. 4.107, సమీర. 3.19; 4. సమూహం, గుంపు. కువ.చ. 3.29; విణ. సంకులమైన. కవిక. 4.166.

క. దొంబి, దొంబె, డొంబి, డొంబు. గుంపు, సమూహం, అస్తవ్యస్తంగా, అల్లరిమూక, జగడం, దొంబిగార. తిరుగుబాటుదారు; తు. దొంబి, డొంబి, జొంబె. సమూహం, గుంపు, తిరుగుబాటు, అలజడి ;

సం. తుముల-. సంకులమైన, దొమ్మియుద్ధం.

దొమ్మికయ్యము వి. దొమ్మిజగడము, తుములయుద్ధం, సంకులసమరం. జైమినిభా. 1.92. దొమ్మిగూడు (-కూడు²) అ.క్రి. గుంపగు, కలియు. నీలా. 3.37. దొమ్మిచేయు అ.క్రి. 1. దౌర్జన్యంగా ఒకరిమీదపడు. హర. 6.95 ; 2. దౌర్జన్యంచేయు. వర. రా. యు. 533పు. 11 పం. దొమ్మిజగడము వి. అందరూ కలియబడిచేసే యుద్ధం, సంకులసమరం. ఉ.హరిశ్చ. 4.98. దొమ్మిపూజ వి. అందరూ ఒకేసారి కలిసిచేసే పూజ. తాళ్ల.సం. 17.600. దొమ్మియుద్ధము వి. సంకులసమరం. సం. యుద్ధ-. పోరు. దొమ్మిరేఁగు అ.క్రి. అందరూ ఒకేసారి పైనబడు. ప్రబోధ. 5.96. దొమ్ములాడు అ.క్రి. 1. పెనుగులాడు. నరస. 3.118 ; 2. దొమ్మియుద్ధం చేయు. <దొమ్మి+-లు+ ఆడు.

దొమ్ములాడు చూ. దొమ్మి.

దొయి రూ.చూ. దోయి. వి. జంట, యుగ్మం. అచ్చ.రా. సుందర. 173.

దొయ్య వి. వరిమడి.

దొర వి. 1. దేశాధిపతి, రాజు. భార.ఆది. 5.41 ; 2. సమానత్వం. కు.సం. 6.9 ; 3. సాదృశ్యం, సామ్యం. కు.సం. 6.66 ; 4. సామంతరాజు. భార.విరా. 3.191 ; 5. సేనాధిపతి, మొనగాడు, నాయకుడు. భార.ఉద్యో. 3.42 ; 6. విధం. ప్రకారం. భార.ఉద్యో. 2.331 ; 7. ఆంగ్లేయుడు ; విశ. 1. (వయోవిద్యాదులచే) పెద్దవాడు. భార.విరా. 3.122 ; 2. సాటియైనవాడు. భార.కర్ణ. 3.29.

సం. ధుర్య-, ధౌరేయ-. భారం వహించేవాడు, ధురీణుడు ; ప్రా. ధోరయ- ; పా. ధోరేయ- ;

క. దొరె. ప్రభువు ; కొడ. దొరె ; తు. దొరె ; త. తురై ; మ. తుర ; పర్జి. దొర.

<ప్రా. ధోరయ-.

దొరజొన్న వి. విదేశాలనుంచి తెచ్చి వేసిన ఒకరకం జొన్న. దొరతనంఇనాం వి. గవర్నమెంటుకు సహాయపడ్డ వారికి ఇచ్చే ఇనాం. దొరతనము వి. ప్రభుత్వం. దొరతనము వారు విశ.బ.వ. ప్రభుత్వంవారు (బ్రిటిషు ప్రభుత్వాన్ని గురించి వాడుకలో ఉన్న పదం). దొరపొగాకు వి. ప్రధానంగా సిగరెట్లకు ఉపయోగించే నాణ్యమైన పొగాకు. దొరపోతు వి. ప్రభువు. రాజవా. 5.32. దొరయ్య వి. ప్రభువు. ఇందు. 2.49. దొరవచ్చు అ.క్రి. సాటివచ్చు. భీమ. 1.107. కాశీ. 5.288. దొరవాఁడు విశ. రాజ సంబంధి. కు.సం. 11.92. దొరసాని వి. రాజ్ఞి, రాణి. శశా. 3.112. ఆం.భా. 107. దొరసానిపిక్కలు వి.బ.వ. ఒకరకం ముతకవడ్లు. దొరసానిపిర్రలు వి.బ.వ. ఒకరకం ముతకవడ్లు. దొరాదొర వి. పెద్దదొర వి. ఆనంద.పీఠి. 73, రాధికా. 1.32.

దొరకించు చూ. దొరకు.

దొరకించుకొను చూ. దొరకు.

దొరకు రూ. దొరుకు. అ.క్రి. 1. లభించు, చిక్కు. భార. ఆరణ్య. 3.70 ; 2. సంభవించు, కలుగు. భాస్క.రా.యు. 2086 ; 3. శక్యమగు, వీలగు. భాగ. 10 పూ. 1593 ; 4. గృహీతమగు, పట్టుపడు. ఆం.భా. 3.115.

క. దొరకు, దొరె. వచ్చు, దగ్గరకువచ్చు, సమానమగు, సరిపోవు, తగు. దొరకిసు. జరుగునట్లుచేయు, పొందు ; తు. దొరకుని, దొరంకుని. లభించు, దొరకు ; గోం. దొర్కిటోర్. అతడు దొరికాడు.

దొరకించు స.క్రి. 1. లభించేటట్లుచేయు, చిక్కేటట్లు చేయు. నార.పంచ. 2.101 ; 2. కలగచేయు, సంభవింప చేయు. కృ.శకు. 2.12. <దొరకు+-ఇంచు³. దొరకించుకొను స.క్రి. చిక్కేటట్లు చేసుకొను, పట్టుకొను. అచ్చ.రా. యు. 403. దొరకుపడు రూ. దొరకువడు. అ.క్రి. లభించు, చిక్కు. వేంక.పంచ. 3.133. దొరకువడు (-పడు) రూ. చూ. దొరకుపడు. అ.క్రి. చిక్కుకొను. దొరకుసన్నాసి వి. నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయే దొంగ. విజయ. 3.161. దొరకొను అ.క్రి. 1. చెల్లు, శక్యమగు. భార.ఆది. 4.188 ; 2. సిద్ధించు. నెరవేరు. భార.ఆది. 6.137 ; 3. సంభవించు, కలుగు. భార.సభా. 2.133 ; 4. పొందు. కు.సం. 6.77 ; 5. లభించు, చిక్కు. భార. విరా. 4.77 ; 6. స్ఫురించు, తోచు. భార.ఉద్యో. 4.86 ; 7. శక్తమగు, సమర్థమగు. భార.మహా. 73. దొరకొల్పు స.క్రి. 1. దొరకొనచేయు. భార.శాంతి. 3.177 ; 2. లభింపచేయు. దశకు. 7.94. దొరకోలు వి. లభించటం, చిక్కటం, సంభవించటం. భార.ద్రోణ. 3.185. దొరకోలు సన్నాసి వి. నమ్మించి మోసపుచ్చే దొంగ. ప్రబంధ. 794. దొరఁకొను అ.క్రి. 1. యత్నించు, పూను. భార. విరా. 2.60. 2. సిద్ధపడు, యత్నించు. భార.శాంతి. 3.205 ; స.క్రి. ఉపక్రమించు, ప్రారంభించు. భార. ఉద్యో .3.240.

దొరకొను చూ. దొరకు.

దొరకొల్పు చూ. దొరకు.

దొరకోలు చూ. దొరకు.

దొరకోలుసన్నాసి చూ. దొరకు.

దొరగడము చూ. కడలు. వి. గొప్పఅల.

దొరఁకొను చూ. దొరకు.

దొరపు చూ. దొరయు.

దొరయఁగనిచ్చు చూ. దొరయు.

దొరయించు చూ. దొరయు.

దొరయు అ.క్రి. 1. సాటిఅగు, సమానమగు. భార.కర్ణ. 1.251 : 2. తగులు, అంటుకొను. మార్క. 1.251 ; 3. శోభిల్లు, ప్రకాశించు. రం.రా.బాల. 3 పు. 15 పం. ; 4. తగు, యుక్తమగు. శృం.నై. 5.132 ; 5. చిక్కుకొను, సక్తమగు. వాశి. రా. 1.119 ; 6. ప్రవర్తిల్లు, జరుగు. విక్ర. 1.180 ; 7. కలుగు, జనించు. ఉ. రా. 1.272 ; 8. ఉండు, వర్తిల్లు. హంస. 2.108 ; స.క్రి.

**1.** పోలు. భార. అను. **4.285**; **2.** స్పృశించు, తాకు. ఉ. రా. 1.1 : **3.** చేరు, సమీపించు. శుక. 1.249.

క. దొరె. పోలు. సమీపించు, తగు, యుక్తమగు, పో. చూ. కురు. ధురుర్. తగు, ఏకకాలంలో జరుగు, ఆకస్మికంగా సంభవమగు, పడు, కలుపు.

**దొరపు** స.క్రి. **1.** ఉంచు. చంద్రికా. **4.107**; **2.** కలగచేయు. చంద్రికా. **5.104.** **దొరయఁగనిచ్చు** స.క్రి. చేరనిచ్చు. వసు. 3.138. < దొరయు + -అ[7] + అగు + -అ[7] + ఇచ్చు. **దొరయించు** స.క్రి. **1.** కలిగించు. వసు. **3.46**; **2.** ఉంచు. చంపూ రా. 4.86. < దొరయు + -ఇంచు[3].

**దొరలకయుండు** చూ. దొరలు[1].

**దొరలంగనాడు** చూ. దొరలు[1].

**దొరలనాడు** చూ. దొరలు[1].

**దొరలించు** చూ. దొరలు[2].

**దొరలు[1]** రూ. తొరలు[2], దొర్లు[1]. అ.క్రి. **1.** అతిశయించు. పల్నా. పు. 36 ; **2.** రాలు, పడు. మను. 5.40 : **3.** పరిభ్రమించు, తిరుగు. కవిక. 5.116 ; **4.** కలుగు, సంభవించు. మొల్ల. బాల. 20 : **5.** యత్నించు ; స.క్రి. అనుభవించు. అనిశ. ర. విజ్ఞా. వ్యవ. 24.

క. సురళి, సురుళి, సురుళె. చుట్టు ; కొడ. తుర్. పైకిచుట్టబడు ; తు. తుర్పు. పైకి ముడిగా చుట్టబడిన స్త్రీల జుట్టు ; త. చురి. పరిభ్రమించు, దొర్లు, తిరుగు. గుండ్రంగా తిరుగు ; కుఇ. డ్రొంగ. దొర్లు, డ్రొవ్క, దొర్లు, తొర్గ, మెలికలుతిరుగు, దొర్లు ; మ. కురియిల్ గుండ్రంగా ఉన్నబుట్ట; కో. కుర్డ్- కుర్డ్. చుట్లుగా పడి ఉండు (పాము, తాడు) ; తొ. తుట్- (తు. టై) పైకి చుట్టు, పైకికట్టు ; గోం. సురుండానా. చుట్టూతిరుగు ; కుఇ. డ్రొంగ (డ్రొంగి). చుట్టు, చుట్టుకొను ; పర్జి. సిర్డ్. తిరగబడు, సిర్డిప్ (సిర్డిట్-), తిరగబడేట్టు చేయు ; కురు. కూర్నా. నడుంచుట్టూ చీరకట్టుకొను ; మాల్తో. కుఌ్గె. పైకిచుట్టు ; బ్రా. కూరింగ్. పైకిచుట్టు, శుభ్రంగా తుడుచు.

**దొరలకయుండు (-ఉండు)** అ.క్రి. ఊరుకొను, ఉదాసీనుడగు. విజ్ఞా. వ్యవ. 46. **దొరలంగనాడు** రూ. దొరలనాడు. స.క్రి. తిరస్కరించు, నిరాకరించు. ఆము 1.12. < దొరలు[1] + -అ[7] + అగు + -అ[7] + ఆడు. **దొరలనాడు.** రూ.చూ. దొరలంగనాడు. స.క్రి. తిరస్కరించు, నిరాకరించు. < దొరలు + -అ[7] + ఆడు.

**దొరలు[2]** రూ. తొరలు[3]. అ.క్రి. కలియు, కూడు. కాశీ. 7.85.

**దొరలించు** స.క్రి. కలుపు. శుక. 2.382. < దొరలు[2] + -ఇంచు[3]. **దొరల్చు** స.క్రి. **1.** కలుపు. వేంక. పంచ. **4.241**; **2.** ఒకదానికి మారుగా తీసుకొను. మార్చు. ఆము. 4.218. < దొరలు[2] + -చు.

**దొరల్చు** చూ. దొరలు[2].

**దొరవి** రూ.చూ. దొరువు. వి. దొరువు, కొలను. జైమినిభా. 5.97.

**దొరసెము** వి. నిరుటికి వెనుక సంవత్సరం, పూర్వతర వత్సరం, ముందటేడు. క్రీడా. 289.

**దొరాదొర** చూ. దొర.

**దొరికట్ట** వి. ఎరువు, కంకులుతోలే బండిజల్ల తెరచిఉన్న వైపు అడ్డం పెట్టిన తడిక లేక చొప్పకట్టలు.

**దొరింపు** చూ. దొరలించు. వి. అనుకూల్యం.

**దొరుకు** రూ.చూ. దొరకు. అ.క్రి. లభించు.

**దొరుగండి** చూ. దొరువు.

**దొరుడుపోటు** వి. జెర్రిపోటు, కాలిగుత్తివాయటం.

**దొరువు** రూ. దురువు, దొరవి, దొర్వు. వి. **1.** చెరువు, కొలను. వరాహ. **4.147**; **2.** దొరవి నడబావి, ఒకవిధమైన చెలమ. హంస. 4.210 ; **3.** ఉద్ది, మోటబావి, కుంట మొ॥ వాటినుంచి నీళ్ళు తోడిపోసే వైపు ఎత్తుగా కట్టిన కట్ట ; **4.** ఏడె, ఏరువు, కంకులు తోలేబండి జల్లతెరచి ఉన్న వైపు అడ్డం పెట్టిన తడిక లేక చొప్పకట్టలు ; **5.** పడుగులో పైపోగులకూ కింది పోగులకూ మధ్య వెలితి, అని లేని భాగం ; **6.** పొలం మధ్య పశువుల నీటికి తవ్విన గుంట ; **7.** బావికి కపిల తోడే చోట కట్టిన కట్టడం.

త. తురవు. పంటలు పండించడానికి పనికి వచ్చే పెద్ద చెరువు.

**దొరుగండి** వి. నిండినప్పుడు నీళ్ళు బయటికి పోవటానికి ఏర్పరచిన దొరువు తూము. హరి. పూ. 6.5. **దొరువుపట్టెడ** వి. ఎద్దుముడ్డికి తగిలించే పట్టిక, గంతఎద్దుల తోకకింద తగిలించే పట్టెడ.

**దొర్లు[1]** రూ.చూ. దొరలు[1]. అ.క్రి. **1.** పరిభ్రమించు, తిరుగు. ఆము. 2.30 ; **2.** కలుగు, సంభవించు ; **3** యత్నించు.

**దొర్లుడుపుచ్చకాయ** వి. ఏకపక్షానికి అంటిపెట్టుకొని ఉండక సమయానుకూలంగా పక్షాలు మార్చేవాడు,

**దొర్లు[2]** రూ.చూ. డొల్లు[1]. అ.క్రి. **1.** చచ్చు ; **2.** తెగిపడు.

**దొర్వు** రూ.చూ. దొరువు. వి. **1.** చెరువు, కొలను ; **2.** దొరవి, నడబావి ; **3.** ఒకవిధమైన చెలమ.

**దొఱకుపడు** చూ. దొఱయు. రూ. దొరకుపడు, దొరకువడు. అ.క్రి. లభించు, చిక్కు. కు. సం. 2 29.

**దొఱట** రూ.చూ. దొఱ్ఱట. వి. కోటరం, రంధ్రం.

**దొఱయు** చూ. దొరకు. స.క్రి. **1.** పొందు, కూడు, రమించు. విజ్ఞా. ఆచా. 139 ; **2.** పొందు, ప్రాప్తించు. హరి. పూ. 6.88 ; అ.క్రి. **1.** కలియు, కూడు. విజయ. 1.155.

**దొఱ్ఱట** రూ. దొఱట. వి. కోటరం, రంధ్రం.

**దొల** చూ. తొలుచు. రూ.చూ. తొలి[2]. వి. **1.** బండికుండకు ఆకులు దూర్చడానికి పీలుగా అమర్చబడిన రంధ్రం; **2.** కాడి మొ॥ వాటిలో తొలిచిన రంధ్రం.

త. తొలి. బెరడు, చర్మం.

**దొలగుంజ** రూ.చూ. తొలగుంజ. వి. మగ్గంమీద, నేతబట్టచుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా, ఎడమపక్కనేలలో పాతిన కొయ్యగూటం. **దొలగొయ్య (-కొయ్య)** రూ. డొలకొయ్య. వి. మగ్గంమీద నేతబట్ట చుట్టేకొయ్య (= దోనె)కు ఆధారంగా ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్యగూటం. **దొలమిట్ట** వి. తొవరరాటి పొడుగు బద్దలను పై వైపు బిగించిన అడ్డబద్ద. **దొలసెక్క (-చెక్క)** వి. మరవాసంలో

తగిలించే రంధ్రంగల వాసం.

**దొలక** రూ.చూ. దొలుక. వి. డొలక, గుమ్మటం లాంటి పనిముట్టు.

**దొలకకడ్డీ** వి. రాటితిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు.

**దొలాలు** చూ. దూలము. వి.బ.వ. ప్రహరీగా నాటిన ముళ్ళ కంచెలోని కూచాలు.

**దొలి** రూ.చూ. తొలి[2]. వి. రాతిలోగాని కొయ్యలోగాని తొలిచిన రంధ్రం.

**దొలిబద్ద** వి. తుండేటి బల్లకు ఎలక చూరుకు కాయ వాసాలు నాటి వాటిపై బిగించే బద్ద.

**దొలుక** రూ. డొలక, డొల్క, దొలక, దొల్క. వి. అంతస్సార హీనమైన కాయ మొదలైన పదార్థం, లోపల సారంలేని వస్తువు. కవిక. 2.193.

**దొలుచు** చూ. డొల్లు. రూ. డొలుచు, డొల్చు, దొల్చు. స.క్రి. **1**. దొరలించు, దొరలచేయు. భార. సభా. 2.147 ; **2**. రంధ్రంచేయు, భేదించు.

**దొలుపు** రూ.చూ. డొలుపు. స.క్రి. దొర్లించు, దొర్లచేయు. శ్రీరం. మా. 6.87 ; వి. **1**. ఇరుసు పెట్టటానికి ఉపయోగ పడేటట్లు దొలిచి చేసిన దారుమయ శకటావయవం ; **2**. బండి చట్రంలోని అడ్డపట్టి ; **3**. ఉలితో పెట్టిన రంధ్రం ; **4**. మాగాణిలో చదును చెయ్యటానికి ఉపయోగించే మొద్దు.

**దొలుపుగమ్మి(-కమ్మి)** వి. ఇరుసుపై దొలుపుకర్ర.

**దొలుము** రూ.చూ. డొలుపు. వి. ఉలితో పెట్టిన రంధ్రం.

**దొల్క** రూ.చూ. దొలుక. వి. డొలక, గుమ్మటంలాంటి పనిముట్టు.

**దొల్చు** రూ.చూ. దొలుచు. స.క్రి. **1**. దొరలించు, దొరలచేయు. భార.సభా. 2.176 ; **2**. రంధ్రంచేయు, భేదించు. హరి.పూ. 8.67.

**దొల్పు** రూ.చూ. డొలుపు. స.క్రి. దొర్లించు, దొర్లచేయు; వి. ఇరుసు పెట్టడానికి ఉపయోగపడేటట్లు దొలిచి చేసిన దారుమయ శకటావయవం.

**దొల్ల** చూ. జల్ల. వి. ఎరువు, ధాన్యం మొ.వి తోలటానికి బండి మీద వేసే (వెదురు, ఈత) వేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం.

**దొల్లు** రూ.చూ. డొల్లు[1]. అ.క్రి. దొర్లు.

**దొల్లుపుచ్చకాయ** వి. పిల్లల ఆటల్లో కొంతసేపొక పక్షాన, మరికొంతసేపొక పక్షాన ఉండేవాడు. పుచ్చకాయ దొల్లినట్లు దొల్లేవాడు. **దొల్లుబండి** వి. **1**. శకటాసురుడు. అష్టమ. క. 1.28 పు, 23 పం. ; **2**. దొర్లేబండి.

**దొళ్ళదోపుగ** చూ. దొళ్ళు.

**దొళ్ళు** రూ.చూ. డొల్లు[1]. అ.క్రి. దొర్లు.

**దొళ్ళదోపుగ** క్రి.విశ.ద్రు. కొల్లగా.

**దొవసం** రూ.చూ. దొగసం. వి. ఆరుబయటకు ఊడ్తెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దొవ్వు** రూ.చూ. ద్రవ్వు. స.క్రి. నేలను తొలుచు.

**దొసఁగు** రూ. దొసవు. వి. **1**. కష్టం, పీడ, బాధ. నిర్వ.రా, 5.106, భార. ఉద్యో. 4.55 ; **2**. (కావ్య) దోషం, తప్పు. భార. విరా. 1.95 ; **3**. ఆపద, చిక్కు. భాగ. 8.316 ; **4**. సంబంధం, సాంగత్యం. రుక్మా.చ. 4.102 ; **5**. కీడు, అపకారం ; గౌ. హరి.ఉ. 446 పం. ; **6**. విఘ్నం. అచ్చ.రా. పీఠి. 7 ; **7**. పాపం. ఆం.భా. 1.98.

సం. దోష-. తప్పు, పాపం ; ప్రా. దోస.

< ప్రా. దోస-.

**దొసఁగుమాలు** అ.క్రి. కష్టంపోవు. నిర్వ.రా. 10.12.

**దొసఁగులఁబెట్టు** స.క్రి. పీడించు, బాధించు. ఉ.రా. 4.298.

< దొసఁగు + -లు + -అ[7] + పెట్టు.

**దొసవు** రూ.చూ. దొసఁగు. వి. **1**. ఆపద, చిక్కు ; **2**. కష్టం, పీడ, బాధ ; **3**. కీడు, అపకారం ; **4**. విఘ్నం ; **5**. (కావ్య) దోషం, తప్పు ; **6**. పాపం ; **7**. సంబంధం, సాంగత్యం.

**దొసి** వి. కట్టె.

**దో** సర్వ. రెండు.

హిం. ఉ. దో. రెండు ; మరా. దో, దోం. రెండు.

< హిం. దో.

**దోకడబార(-పాఱ)** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. చెక్కుడు పార.

**దోకరబార** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. చెక్కుడుపార.

**దోకా** వి. మోసం.

హిం. దోఖా. మోసం.

< హిం. దోఖా.

**దోకి** చూ. డొక్కు[2]. వి. నీళ్ళుతోడటానికి కొబ్బరిచిప్పతోకాని ఇత్తడితోకాని తయారుచేసే గరిటె.

**దోకోరి** వి. అంచులో నేసిన రెండు గీరలు.

హిం. దో. రెండు, కోర్. బట్ట అంచు.

< హిం. దో + హిం. కోర్.

**దోక్కొనిపోవు** చూ. దోఁకు[2].

**దోగు** చూ. డోఁకు[2], దోఁగు[2]. స.క్రి. నేలను తొలుచు.

**దోఁకారి** చూ. దోఁకు[2].

**దోఁకిన** చూ. దోఁకు[2].

**దోఁకు[1]** రూ.చూ. డొంకు. అ.క్రి. ఇంకు, అడగు. పి.శకు. 3.219.

**దోఁకు[2]** రూ.చూ. డోఁకు[2]. స.క్రి. **1**. నేలను ఎదురుగా చెక్కు; **2**. గోళీల ఆటలో మోచేత్తో గోళితోయు ; వి. దోకుడుగుడి.

**దోక్కొనిపోవు** స.క్రి. గీసుకొనడంవల్ల శరీరంపై తోలు లేచిపోవు. < దోఁకు[2] + కొనిపోవు. **దోఁకారి** వి. వెడల్పైన అలుగున్న ఉల్లారివంటి కలుపు పనిముట్టు. **దోఁకిన** వి. దోకటం, చెక్కటం. **దోఁకుడు** వి. దోకిన, దోకటం ; విశ. చెక్కటానికి ఉపయోగించే. **దోఁకుడుకొడవలి** వి. గడ్డికోయటానికి, పైరులో కలుపు తీయటానికి పనికొచ్చే కొడవలి. **దోఁకుడుగొర్రాయి** వి. ఆములో మంటను ఎగదోయడానికి నాలుగైదు అడుగుల పొడవుతోఉన్న పంగలకర్ర. **దోఁకుడుపార** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. గడ్డి మొదలైనవి చెక్కడానికి వాడే ఒకరకం పరికరం. **దోఁకుడుపాఱ** రూ. దోకడబార, దోకరబార, దోఁకుడుపార, దోఁకుడుబార[2], దోఁకు

పార¹, దోఁకులుపార, దోఁకులుబార. వి. దోకునట్టిపార, చెక్కుడుపార. ఆం.భా. 2.230. త. తోణ్ణుపాఱై. చెక్కుపార. **దోఁకుడుబార¹(-పాఱ)** రూ. దోఁకుపార². వి. బాలక్రీడా విశేషం, గూఢమణి. **దోఁకుడుబార²(-పాఱ)** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. గడ్డిచెక్కేపార. **దోఁకుడులిక్కి** వి. ఒక రకం లిక్కి. **దోఁకుపార¹** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. గడ్డి మొదలైనవి చెక్కడానికి వాడే ఒకరకం పరికరం. **దోఁకుపార²** రూ.చూ. దోఁకుడుబార¹. వి. బాలక్రీడా విశేషం. **దోఁకులుపార** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. చెక్కుడుపార. **దొఁకులుబార(-పాఱ)** రూ.చూ. దోఁకుడుపాఱ. వి. చెక్కుడు పార.

**దోఁకు³** రూ.చూ. డోఁకు¹. అ.క్రి. వాంతిచేయు.

**దోఁగాడు** చూ. దోఁగు².

**దోఁగిపోవు** చూ. దోఁగు².

**దోఁగియాడు** చూ. దోఁగు².

**దోఁగు¹** రూ.చూ. తోఁగు. అ.క్రి. తడియు.

**దోఁగు²** రూ.చూ. డొంగు, దోగు. అ.క్రి. పాకు. శివరా. 4.83.

తు. డొగురి. కాళ్లు చేతులతోపాకు లేదా కూచుని పాకు; డొగ, డొగె. రంధ్రం చేయు.

**దోఁగాడు** రూ.చూ. డొంగియాడు. అ.క్రి. బిడ్డ నేలపై చేతులుమోపి మోకాళ్ళతో నడుచు. పాకు. ద్వి. పరమ. వి. 5.377. **దోఁగిపోవు** అ.క్రి. ఒరసికొనిపోవు. తాళ్ల.సం. 6.165. **దోగియాఁడు(-ఆడు)** రూ.చూ. డొంగియాడు. అ.క్రి. బిడ్డ నేలమీద చేతులాన్చి మోకాళ్ళతో నడచు. చంద్రాంగ. 2.4.

**దోఁగు³** రూ. డోఁగు¹. అ.క్రి. చర్మం ఊడు. రామాభ్యు. 8.137; స.క్రి. మేనితోలు ఒల్చు.

**దోఁగు⁴** అ.క్రి. 1. కన్నంవేయు; 2. దొచ్చు.

క. దోగె.

**దోఁగురు** వి. చౌర్యం, దొంగతనం. ఆం.భా. 2.298. క. దోచు. దోచుకొను. దొంగతనం చేయు.

**దోచింక్ర** రూ.చూ. దొగిచింక్ర. వి. ఆరుబయట ఊడ్లెలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

**దోచు** చూ. దోఁగు³. స.క్రి. 1. పూయు; 2. గీకు.

**దోఁచిగాఁడు** చూ. దోఁచు.

**దోఁచిపెట్టు** చూ. దోఁచు.

**దోఁచు** చూ. దోఁగు⁴. స.క్రి. 1. కొల్లగొను, కొల్లగొట్టు. హరి. పూ. 2.17; 2. బలాత్కారంగా లాగు. ఉ.హరి. 1.102; 3. బలాత్కారంగా తీసికొనిపోవు. భాస్క.రా. కిష్కిం. 107; 4. దొంగిలించు. కాశి. 4.66; 5. మోసంచే గ్రహించు. కళా. 1.18; 6. అపహరించు.

క. దోచు. దొంగిలించు; కువి. తుహ్, తుహ, తూహ్. దొంగిలించు.

**దోఁచిగాఁడు** వి. ఒకరకం పిట్ట. **దోఁచిపెట్టు** స.క్రి. మొత్తం అంతా పెట్టు, ఉన్నదంతా పెట్టు. **దోఁచుకొను** స.క్రి. 1. మోసంచే గ్రహించు, అపహరించు. భార. శాంతి. 3.257; 2. దొంగిలించు. కాశీ. 4.64. **దోఁపడము** వి. దోచుకోవటం. **దోఁపరి** వి. 1. దొంగ. ఆం.భా. 2.291; 2. కొల్లగాడు. **దోఁపిడి** రూ. దోఁపిడీ. వి. 1. దోచుకొనటం, అపహరించటం; 2. కొల్ల. **దోఁపిడికాఁడు** వి. 1. దొంగ; 2. కొల్లగాడు. **దోఁపిడియాటలు(-ఆటలు)** వి.బ.వ. బాలక్రీడా విశేషం. ప్రబంధ. 613. **డోఁపిడీ** రూ.చూ. దోఁపిడి. వి. దొంగతనం. **దోయిడి** విణ. రిక్తమయిన, శూన్యమయిన. జైమిని భా. 2.15.

**దోటీ** చూ. దోఁటి. వి. గాదెకాలు.

**దోటె** రూ.చూ. దోఁటి. వి. నరిచేయటానికి ఉన్ని పడుగు చాపినప్పుడు, నరితాడు బిగింపుకు వేసిన వంకర కట్టె.

**దోడితపేల** వి. నిలువుగా చేసినట్టి చిన్న మట్టిపాత్ర.

**దోడు** రూ.చూ. తోడు¹. వి. సహాయం.

**దోడోనం** రూ.చూ. దొడ్డువానం. వి. లావుపాటి వానం.

**దోణము** రూ.చూ. ద్రోణము. వి. 1. భుజాలకి బలం రావడానికై తిప్పే జెట్టివాడి ఉపకరణ విశేషం; 2. మానుసుకరంగా చీల్చడానికి అక్కడక్కడ చెక్కిన కొయ్య మేకుల్ని దిగ్గొట్టే ఉపకరణ విశేషం.

**దోణాము** రూ.చూ. ద్రోణము. వి. 1. భుజానికి బలం రావడానికై తిప్పే జెట్టివాని ఉపకరణ విశేషం; 2. మానుసుకరంగా చీల్చడానికి అక్కడక్కడ చెక్కిన కొయ్య మేకుల్ని దిగగొట్టే ఉపకరణ విశేషం.

**దోణి** రూ.చూ. దోని. వి. 1. వాననీరు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే వలయాకారపు గొట్టం; 2. మిద్దెటింట్ల మీది వర్షంనీరు కిందికి పోవడానికి పెట్టే మట్టిగొట్టం.

**దోండిగ** వి. గాడిదర్వాజాలో అమర్చే చెక్క తలుపు.

**దోఁటముముక్కర** చూ. దోఁటి.

**దోఁటమ్ము** చూ. దోఁటి.

**దోఁటి** రూ. దోటె. వి. 1. డొంకెన, అందని పళ్ళు మొ॥ వాటిని కోయడానికుపయోగించే వంకర బిల్ల దోపిన కోల. పారి. 4.16; 2. నరిచేయటానికి ఉన్నిపడుగు చాపినప్పుడు నరితాడు బిగింపుకు వేసిన వంకర కట్టె.

క. తోటి. పువ్వుల్ని, కాయల్ని, పళ్ళని కోయటానికి ఉపయోగించే కొక్కెం; తు. దొంటి; త. తోట్టి. అంకుశం, శత్రువుల్ని పారదోలే తీక్ష్ణ సాధన విశేషం; మ. తోట్టి. అంకుశం, పళ్ళనుకోసే కొక్కెం; పర్జి. టోటల్. వెదురు చీపుర్లు.

**దోఁటముముక్కర** రూ.చూ. దోఁటి ముక్కర. వి. దోఁటి లాంటి ముంగర. < దోఁటి + అమ్ము + ముక్కర. **దోఁటమ్ము** వి. దోటివలె వంపైన అలుగుగల బాణం, కర్ణికరం. < దోఁటి + అమ్ము. **దోఁటికట్టె** రూ. ధోటికట్టె. వి. 1. ఉన్ని మగ్గం చివర వేసిన వంకర కర్ర; 2. కంపల్ని కోసి లాగటానికి కొనలో కత్తిని అమర్చిన పొడుగాటి కర్ర. **దోఁటిముక్కర** రూ. దోఁటము ముక్కర. వి. దోటి వంటి ముంగర, డొంకెన వలె వంపైన నాసాభరణం.

**దోఁటు** స.క్రి. ఇచ్చు. తాళ్ల. సం. 14.141.

**దోతి** రూ. ధోతి. వి. దోవతి. చంద్రభా. 2.114.

హిం.ఉ. ధోతీ. అధోవస్త్రం, ధోవతి.

< ఉ. ధోతీ.

దోతుల్నాపు(-చాపు) రూ.చూ. ధోతులుచాపు. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట.

**దోతుల్నాపు** చూ. దోతి.

**దోతెరిఫ్** వి. జులుం.

**దోదసి** వి. పక్షంలో వచ్చే పన్నెండో తిథి, ద్వాదశి. రా.వా. 185.

నం. ద్వాదశీ. పక్షంలో పన్నెండో తిథి; ప్రా. దాదసీ, దోదసీ, దువాలస; అశోక. దువాళస, ధౌవి; జై.మహా. దువాలస; అ.మా. దువాలస; అప. దోవాలస. పన్నెండు;

క. దోదసి.

<ప్రా. దోదసి.

**దోదుమి** రూ.చూ. దోదుమ్మి. వి. **1.** రెండంచుల కత్తి. ఉ.రా. 3.456 ; **2.** ఖడ్గ విశేషం, ఖడ్గం.

**దోదుము** రూ.చూ. దోదుమ్మి. వి. **1.** ఖడ్గవిశేషం, ఖడ్గం; **2.** రెండంచుల కత్తి.

**దోదుముదారి** రూ.చూ. దోదుమ్మిదారి. వి. ఖడ్గవిశేషం, ఖడ్గం. చంద్రాంగ. 3.117.

**దోదుమ్మి** రూ. దోదుమి, దోదుము, దోదుమ్ము. విణ. రెండంచులు కల. ఘటికా. 2.25 ; వి. **1.** రెండంచుల కత్తి; **2.** కత్తి.

ఉ. దుదమ్. రెండంచులకత్తి; పార. దుదమ్. రెండంచులుకల.

<ఉ. దుదమ్.

**దోదుమ్మిదారి** రూ. దోదుముదారి. వి. ఖడ్గవిశేషం, ఖడ్గం. కువ.చ. 1.39.

**దోదుమ్ము** రూ.చూ. దోదుమ్మి. వి. ఖడ్గవిశేషం, ఖడ్గం. రఘునా. 12.

**దోనక్కాన** రూ.చూ. దోనుగకాన. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల.

**దోనక్కొయ్య** రూ.చూ. దోనుగకొయ్య. వి. **1.** మగ్గం మీద నేతబట్ట చుట్టే దోనెకు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; **2.** ఉన్నిమగ్గం దోనుగ (పలక) తిప్పటానికి చిల్లిలో దూర్చిన కట్టె.

**దోనగ్గాడి** రూ.చూ. దోనుగగాడి. వి. **1.** నేతగుడ్డ చుట్టేదోనెకు ఒకవైపున బద్దె చువ్వ బిగించటానికిచేసిన గాడి; **2.** ఉన్ని మగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు.

**దోనచ్చు** చూ. దోని.

**దోనమ్ము** చూ. దోని.

**దోని** రూ. డోణి, డోని, డోనె, దొన, దొనుగ, దొనె, దోణి, దోనగ, దోనిగ, దోనిగె, దోనియ, దోను[1], దోనుగ, దోనుగు, దోనె, దోనెగ, దోన్గ, దోన్గు. వి. **1.** నీరు పారడానికి ఏర్పరచిన కాలవ. పారి. 3.38 ; **2.** అరిణ, ఎత్తుడు నీరు పోయడానికై తొలిచిన కాలువ మొదట ఉంచే తాటిమాను మొ॥ నవి, ద్రోణి. హంస. 1.192 ; **3.** దొన, నీరు నిలవడానికి ఏర్పరచిన పల్లం. రసిక. 2.71 ; **4.** ఆరులో క్రరు బిగించటానికి తీసిన గాడి ; **5.** బండి ఇరుసు మీద వేసే అడ్డమొద్దు ; **6.** వాననీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే మట్టిగొట్టం ; **7.** స్నానం చేసిన నీళ్ళుపోయే దారి ; **8.** కప్పుమీది నీరు కిందికి కారటానికి అమర్చిన పొడుగాటి క్రోవి.

సం. ద్రోణీ. దొప్ప ; ప్రా. దోణీ, దోనీ. పడవ నీటి తొట్టె ; పా. దోణీ.

<ప్రా. దోణీ.

**దోనచ్చు** వి. గోనె పెంకు చేసే కొయ్యదిమ్మ. <దోని + అచ్చు[1]. **దోనమ్ము** రూ. దోనిఅమ్ము. వి. అల్పశరం, చిన్నబాణం. ఆం.భా. 2.213. <దోని + అమ్ము. **దోని అమ్ము** రూ.చూ. దోనమ్ము. వి. చిన్నవిల్లు. **దోనికమ్మ** వి. పెంకుటింటి వెనుగాడి. **దోనికఱ్ఱ** వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. **దోనికొయ్య** రూ.చూ. దోనెకొయ్య. వి. అచ్చుపోసిన పెంకును వంచే సాధనం. **దోనిగుది** రూ.చూ. దోనెగుది. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనిచిల్ల** రూ.చూ. దోనెచిల్ల. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె తిప్పే కఱ్ఱ. **దోనితొట్టి** వి. పొకగా పొడవుగా రెండంగుళాల ఎత్తుతో పందులకు నీళ్ళు పెట్టే తొట్టి. **దోనిపలక** రూ.చూ. దోనెపలక. వి. **1.** మగ్గంమీద నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు; **2.** అచ్చుపోసిన పెంకును వంచే సాధనం. **దోనిపలుపు** రూ.చూ. దోనెపలుపు. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనిపుటక** వి. ఉన్నిమగ్గం దోనుగ గాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల. **దోనిపుల్ల** రూ.చూ. దోనెపుల్ల. వి. దోనె గాడిలో బద్ద చువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనిపూస** రూ.చూ. దోనెపూస. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనిపెంకచ్చు** రూ.చూ. దోనె పెంకచ్చు. వి. దోనెపెంకు చేసే కొయ్యదిమ్మ. <దోని పెంకు + అచ్చు. **దోనిపెంకు** రూ.చూ. దోనెపెంకు. వి. వెన్నుగాడికి వాడే పెద్దసైజు పెంకు. **దోనిపొట్ట** రూ.చూ. దోనెపొట్ట. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనిపొన్ను** వి. ఆరులో కఱ్ఱు బిగించటానికి తీసిన గాడి. **దోనిపొల్లు** వి. ఆరులో కఱ్ఱు బిగించటానికి తీసిన గాడి. **దోనిమగ్గం** రూ.చూ. దోనెమగ్గం. వి. మగ్గంమీద చాపిన పడుగులో చివరిభాగం చుట్టటానికి ఎదురుగా రోకలివంటి కొయ్య అమర్చిన మగ్గం. **దోనిముల్లు** రూ.చూ. దోనెముల్లు. వి. దోనె గాడిలో బద్దె చువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనిమొద్దు** రూ.చూ. దోనెమొద్దు. వి. **1.** బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు ; **2.** మోట నీరుపోయే దోనిమాను. **దోనిమోకు** వి. బండి కాడినుంచి నొగల కిందగా డొలుపువరకు అమర్చిన తాడు. **దోనిరేకు** వి. అచ్చుపోసిన పచ్చిపెంకును వంచే సాధనం. **దోనివిల్లు** వి. చిన్నవిల్లు, అరిటెవలె ఉండే విల్లు. పారి. 4.38. **దోనిసిల్ల (-చిల్ల)** రూ.చూ. దోనెచిల్ల. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె తిప్పే కఱ్ఱ. **దోనిసివ** రూ.చూ. దోనెచివ్వ. వి. నేతబద్దలో దూర్చిన పొడుగుపాటి చువ్వ. **దోనేకు** వి. వెడల్పుగా ఉండే పొగచెట్టు ఆకు. <దోని + ఆకు.

**దోనిగ** రూ.చూ. దోని. వి. **1.** బండి ఇరుసుమీద వేసే అడ్డ మొద్దు ; **2.** మగ్గంమీద నేసిన బట్ట చుట్టే కొయ్యదూలం.

**దోనిగగాడి** రూ.చూ. దోనుగగాడి. వి. ఉన్నిమగ్గం దోనుకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనిగగాల** వి. ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనిగగుది** రూ.చూ. దోనెగుది. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనిగపన్ను** రూ.చూ. దోనెపన్ను. వి. ఉన్నిమగ్గం దోనుగగాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల. **దోనిగబద్దె** రూ. దోనుగబద్దె. వి. అచ్చుతుక్కోడానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి, చివర జానెడు పొడుగు దారాలు వదలినగుడ్డ. **దోనిగములికి** వి. ఉన్నిమగ్గం దోనుగగాడిలో చువ్వ బిగించటానికి పెట్టిన కొయ్యపుల్ల. **దోనిగమొద్దు** రూ.చూ. దోనెమొద్దు. వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు.

**దోనిగె** రూ.చూ. దోని. వి. మగ్గంమీద నేసిన బట్ట చుట్టే కొయ్యదూలం.

**దోనిగెగాడి** రూ.చూ. దోనుగగాడి. వి. నేతగుడ్డ చుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య. **దోనిగెగుది** రూ.చూ. దోనెగుది. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనిగెతొలి** రూ.చూ. దోనెతొలి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనిగెపంటె** వి. దోనెగాడిలో బిగించిన కఱ్ఱ. **దోనిగెపన్ను** రూ.చూ. దోనెపన్ను. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనిగెపుల్ల** రూ.చూ. దోనెపుల్ల. వి. దోనెగాడిలో బదచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనిగెసివర (-చివర)** రూ. చూ. దోనెసివర. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగం (బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం.

**దోనియ** రూ.చూ. దోని. వి. **1.** పడవ ; **2.** చిన్నపడవ ; **3.** జలకడిగేవాని సాధనం ; **4.** సాలెవాడు చాపుచుట్టే మాను.

**దోను**[1] రూ.చూ. దోని. వి. **1.** బండి ఇరుసుమీద వేసే అడ్డ మొద్దు ; **2.** ఇంటి కప్పుమీది దూలము.

**దోనుకఱ్ఱ** రూ. దోనుగర. వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. **దోనుగర (-కఱ్ఱ)** రూ.చూ దోనుకఱ్ఱ. వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. **దోనుపెంకు** రూ.చూ. దోనెపెంకు. వి. ఇంటి వెన్నుగాడిమీద పరిచే పెంకు.

**దోను**[2] వి. గొడ్లపాకలోని అటక.

**దోనిపాక** వి. పొడుగాటి గొడ్లపాక.

**దోనుక్కూనం** చూ. దోనుగ.

**దోనుక్కోల** చూ. దోనుగ.

**దోనుగ** రూ.చూ. దోని. వి. **1.** బండి చట్రంలోని అడ్డపట్టి ; **2.** మగ్గంమీద నేసిన బట్ట చుట్టే కొయ్యదూలం.

**దోనుక్కూనం** రూ.చూ. దోనుగకూనం వి. బొద్దుకొయ్య బెజ్జంలో దూర్చే దోనె చివరిభాగం. **దోనుక్కోల** రూ.చూ. దోనుగకోల. వి. దోనె గాడిలో బిగించే పొడుగాటి వెదురు బద్ద. **దోనుగఅడ్డు** వి. దోనెగాడిలో, బద్దె చువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనుగకట్టె** వి. దోనెకు నేత బట్ట చుట్టటానికి, దోనె (పలక) తిప్పే కఱ్ఱ. **దోనుగకలప** రూ.చూ. దోనెపలక. వి. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు. **దోనుగకాన** రూ. దోనక్కాన. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనుగకూనం** రూ. దోనుక్కూనం. వి. బొద్దు గొయ్య బెజ్జంలో దూర్చే దోనె చివరిభాగం. **దోనుగకొయ్య** రూ. దోనక్కొయ్య. వి. **1.** మగ్గంమీద నేతబట్ట చుట్టే దోనెకు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం ; **2.** ఉన్నిమగ్గం దోనుగ (పలక) తిప్పటానికి చిల్లిలో దూర్చిన కట్టె. **దోనుగకోల** రూ. దోనుక్కోల. వి. దోనె గాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద. **దోనుగగాడి** రూ. దోనగ్గాడి, దోనిగగాడి, దోనిగెగాడి, దోనుగగాడెం, దోనుగు గాడి, దోనుగ్గాడి, దోనుగ్గాడీ, దోనుగ్గాడె. వి. **1.** నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి ; **2.** ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనుగగాడెం** రూ.చూ. దోనుగగాడి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనుగగాల** వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒక వైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనుగగుంజ** రూ. దోనుగ్గుంజ. వి. **1.** దోనె (=నేతగుడ్డ చుట్టే కొయ్య దూలం)కు ఆధారంగా నేలలో పాతిన కొయ్యగూటం ; **2.** దోనెకు ఆధారంగా పాతిన కొయ్యలలో ఎడమువైపుది. **దోనుగగుది** రూ.చూ. దోనెగుది. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనుగచివ్వ** రూ.చూ. దోనెచివ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగులోని బద్దెలో దూర్చే పొడుగాటి బెత్తం. **దోనుగతొలి** రూ.చూ. దోనెతొలి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనుగతొల్ల** రూ.చూ. దోనెతొలి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనుగపన్ను** రూ.చూ. దోనెపన్ను. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనుగపలక** రూ.చూ. దోనెపలక. వి. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనె లోనివైపు. **దోనుగపొట్ట** రూ.చూ. దోనెపొట్ట. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దె చువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనుగబద్దె** రూ.చూ. దోనిగబద్దె. వి. అచ్చుతుక్కోటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జానెడు పొడుగు దారాలు వదలిన గుడ్డ. **దోనుగముల్లు** రూ.చూ. దోనెముల్లు. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనుగసివర (-చివర)** రూ.చూ. దోనెసివర. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (బద్దె) లో దూర్చిన పొడుగాటి చువ్వ.

**దోనుగు** రూ.చూ. దోని. వి. బండి ఇరుసుమీద వేసే అడ్డ మొద్దు.

**దోనుగుగాడి** రూ.చూ. దోనుగగాడి. వి. **1.** నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి ; **2.** ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనుగ్గాడి** రూ.చూ. దోనుగగాడి. వి. **1.** నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి

చేసిన గాడి ; **2**. ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనుగ్గాడీ** రూ.చూ. దోనుగగాడి. వి. **1**. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి ; **2**. ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనుగ్గాడె** రూ.చూ. దోనుగగాడి. వి. **1**. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపు బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి ; **2**. ఉన్నిమగ్గం దోనుగకు సులిగె బిగించటానికి తొలిచిన సందు. **దోనుగ్గుంజ** రూ.చూ. దోనుగగుంజ. వి. **1**. దోనెకు ఆధారంగా నేలలో పాతిన కొయ్యగూటం ; **2**. దోనెకు ఆధారంగా పాతిన కొయ్యలలో ఎడమవైపుది.

**దోనుగ్గాడి** చూ. దోనుగు.

**దోనుగ్గాడీ** చూ. దోనుగు.

**దోనుగ్గాడె** చూ. దోనుగు.

**దోనుగ్గుంజ** చూ. దోనుగు.

**దోనె** రూ.చూ. దోని. వి. **1**. నేతనేసేవాడు చాపుచుట్టేమాను. హంస. 2.11 ; **2**. చిన్నపడవ, ద్రోణి. ఆం.భా. 1.153 ; **3**. జలకడిగేవాని సాధనం ; **4**. వాననీళ్ళు పోవటానికి ఇంటి కప్పుకు పెట్టే మట్టిగొట్టం ; **5**. కూన లోపల వంపుగా ఉన్న భాగం ; **6**. బెల్లం పోగుపోసే పెద్దపెనం ; **7**. అరటాకుతో కుట్టిన దొప్ప ; **8**. నీళ్ళు పారించటానికి అర్ధవలయాకారంలో నిర్మించబడ్డ పొడవు సాధనం ; **9**. నీళ్ళతొట్టి ; **10**. డొలుపుమీదున్న పరానికి గట్టితనం కోసం అమర్చిన వంపుమొద్దు ; **11**. మట్టితో చేసిన లోతైన పాత్ర ; **12**. మోట బొక్కెన కుమ్మరించిన నీళ్ళు పోయే దారి లేక కాలవ ; **13**. బండి ఇరుసుమీద వేసే అడ్డ మొద్దు.

**దోనెకొయ్య** రూ. దోనికొయ్య. వి. అచ్చు పోసిన పెంకును వంచే సాధనం. **దోనెగ్రమొద్దు (-కఱ్ఱమొద్దు)** వి. డొలుపుమీదున్న పరానికి గట్టితనం కోసం పైన అమర్చిన వంపుమొద్దు. **దోనెగుది** రూ. దోనిగగుది, దోనిగుది, దోనిగెగుది, దోనుగగుది. వి. దోనె గాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టిన తాడు. **దోనెచిల్ల** రూ. దోనిచిల్ల, దోనిసిల్ల, దోనెసిల్ల, దోన్చిల్ల. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె తిప్పే కఱ్ఱ. **దోనెచివ** రూ.చూ. దోనెచివ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి చువ్వ. **దోనెచివ్వ** రూ. దోనిసివ, దోనుగచివ్వ, దోనెచివ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (= బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం. **దోనెడొగ్గు** అ.క్రి. కిందికి మోకరించుకొను. వసు. 5.6. **దోనెడొల** రూ.చూ. దోనెతొలి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనెతట్టు** వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనెతిప్పు** స.క్రి. నేసిన బట్ట చుట్టటానికి దోనె (పలక) తిప్పు. **దోనెతిప్పుడునేత** వి. దోనె తిప్పుకోటానికి (= పలక వెయ్యటానికి) సరిపడేబంత నేసిన నేత. **దోనెతొలి** రూ. దోనిగెతొలి, దోనుగతొలి, దోనుగతొల్ల, దోనెడొల, దోనెతొల్లు, దోనెదొల. వి. నేత గుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనెతొల్లు** రూ.చూ. దోనెతొలి. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనెత్తు** స.క్రి. సారె పలక మీది మట్టిని కుండ రూపు రావడానికి మీదికి పొడవుగా లోపల బోలుగా వచ్చేటట్లు లేపు. **దోనెదొల** రూ.చూ. దోనెతొలి. వి. నేత గుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనెనాగలి** వి. ఒకరకం మెట్ట నాగలి. **దోనెపన్ను** రూ. దోనిగపన్ను, దోనిగెపన్ను, దోనుగపన్ను. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనెపలక** రూ. దోనిపలక, దోనుగకలప, దోనుగపలక. వి. **1**. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు ; **2**. అచ్చు పోసిన పచ్చిపెంకును వంచే సాధనం. **దోనెపలుపు** రూ. దోనిపలుపు. వి. దోని గాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. **దోనెపల్లె** వి. ఆరులో కఱ్ఱు బిగించటానికి తీసిన గాడి. **దోనెపాయ** వి. నీళ్ళు తూమువైపుకు త్వరగా పారడానికి వీలుగా ఏర్పాటుచేసిన ఎక్కువ వాటం. **దోనెపుల్ల** రూ. దోనిగెపుల్ల, దోనిపుల్ల. వి. దోనిగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనెపూస** రూ. దోనిపూస. వి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనెపెంకచ్చు** రూ. దోనిపెంకచ్చు. వి. దోనెపెంకు చేసే కొయ్యదిమ్మ. <దోనెపెంకు + అచ్చు. **దోనెపెంకు** రూ. దోనిపెంకు, దోనుపెంకు. వి. ఇంటి వెన్ను గాడిమీద పరిచే పెంకు. **దోనెపొట్ట** రూ. దోనిపొట్ట, దోనుగపొట్ట. వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున బద్దెచువ్వ బిగించటానికి చేసిన గాడి. **దోనెబండ** వి. **1**. మోటబావి దోనెఅర (లోతట్టు)కు అడుగున వేసిన బండ ; **2**. ఏతంతో తోడిన నీళ్లపోయే మొదటి కాలవ. **దోనెబెజ్జం** వి. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి. **దోనెమగ్గం** రూ. దోనిమగ్గం. వి. మగ్గంమీద చాపిన పడుగులో చివరిభాగం చుట్టటానికి ఎదురుగా రోకలివంటి కొయ్య అమర్చిన మగ్గం. **దోనెముల్లు** రూ. దోనిముల్లు, దోనుగముల్లు. వి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనెమూకులు** వి.బ.వ. వెన్నుగాడికి వాడే పెద్దసైజు పెంకులు. **దోనెమేకు** వి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల. **దోనెమొద్దు** రూ. దోనిగమొద్దు, దోనిమొద్దు. వి. **1**. బండికి రెండు చక్రాల మధ్య అడ్డంగా అమర్చిన మొద్దు ; **2**. అచ్చుపోసిన పెంకు వంచే సాధనం ; **3**. మగ్గంమీద నేసినబట్ట చుట్టే కొయ్యదూలం. **దోనెసిల్ల(-చిల్ల)** రూ.చూ. దోనెచిల్ల. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పేకఱ్ఱ. **దోనెసివర** రూ. దోనిగెసివర, దోనుగసివర. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (= బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం. **దోనెసూక** వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం (= బద్దె)లో దూర్చిన పొడుగాటి బెత్తం. **దోన్చిల్ల** రూ.చూ. దోనెచిల్ల. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పేకఱ్ఱ. **దోన్నొగబండి** వి. రెండు అడ్డలున్న రెండునొగల బండి. <దోనె + నొగ + బండి.

**దోనెగ** రూ.చూ. దోని. వి. మగ్గంమీద, నేసినబట్ట చుట్టే కొయ్యదూలం.

**దోనేకు** చూ. దోని.
**దోన్గ** రూ.చూ. దోని. వి. బండిఇరుసుమీద వేసే అడ్డమొద్దు.
**దోన్గు** రూ.చూ. దోని. వి. బండిఇరుసుమీద వేసే అడ్డమొద్దు.
**దోన్చిల్ల** చూ. దోనె.
**దోన్నగబండి** చూ. దోనె.
**దోపకుండ** రూ.చూ. దూపకుండ. వి. పొయ్యికి ఒకపక్కన నీళ్లు కాగడానికి పెట్టే మట్టికుండ.
**దోపలుహోష్యా** వి. రెండుకొనల్లోను, జేనెడు వరకు ఒకరంగు, మధ్య ఒకరంగు వచ్చేట్టు నేసిన జంపఖానా.
హిం. ఉ. దో. రెండు.
**దోపిడి** రూ.చూ. దూపిడి. వి. ఒకరకం మొక్క (Vaterica indica).
**దోపిడిగడి** చూ. దోఁపు. రూ.చూ. దోపుడుగడి. వి. తలుపు చెక్కలను మూస్తూ గోడల్లోని కంతల్లోకి దూర్చబడే రోకలి వంటి పెద్దగడియ.
**దోపు** వి. దేవుడికి చేసే ఒక ఉత్సవం.
ఉ. తోహ్ఫా. కానుక;
త. తోప్పు. బహుమానం.
<ఉ. తోహ్ఫా.
**దోపుచూరు** చూ. దోఁపు. వి. అరుగులమీద జల్లుపడకుండా తాటాకులతో ముందుకు పెంచికట్టిన చూరు.
**దోపుడుకట్టె** చూ. దోఁపు. వి. కోడిపీటల బండి (ఒకరకం బండి) కి డొంకిపట్టెనుంచి కాడి వరకున్న నొగ.
**దోపుడుగడి** చూ. దోఁపు. రూ. దోపిడిగడి. వి. తలుపుచెక్కలను మూస్తూ గోడల్లోని కంతల్లోకి దూర్చబడే రోకలివంటి పెద్ద గడియ.
**దోపుడుచెక్క** చూ. దోఁపు. వి. **1**. గాడి దర్వాజాలో అమర్చే చెక్కతలుపు; **2**. వడ్లబోరెం దర్వాజాకు బిగించిన చెక్క.
**దోబరి** వి. అజీర్ణ విరేచనాలు.
హిం. దోబారా. రెండుసార్లు.
**దోబూచి** రూ.చూ. దూబూచి. వి. **1**. చిన్నపిల్లల్ని ఆడించటంలో అనే మాటకు అనుకరణం; **2**. బాలక్రీడా విశేషం.
**దోమ** వి. **1**. మశకం. భార. విరా. 1.139; **2**. వరి, జొన్న మొ. ఎన్నులమీదచేరి సుంకు తినే నల్లటి చిన్న పురుగు (Colacoris lengustatus).
క. దోమె. దోమ; కువి. దోమె. గుడ్డితేనెటీగ; కొలా. దోమె;
సం. ద్వ్యముఖా. జలగ, ద్వ్యముఖా. ఒకానొక క్రిమి రోగం; ప్రా. దోముహ-. రెండుముఖాలు కలది.
**దోమకొటు** వి. **1**. దోమలు కరవటం; **2**. వరి, జొన్న మొ. పంటలకు దోమలవల్ల వచ్చే తెగులు. **దోమకాలుగడ్డి** వి. ఏటా మొలిచి పెరిగే కలుపుమొక్క. **దోమతెర** వి. దోమలు లోనికిపోకుండా మంచం నాలుగు వైపులాకట్టే గుడ్డ. నె.శా. ఒంగోలు. 78. క్రీ.శ. 1353. త. తొయ్‌తరా. దోమతెర. **దోమనాకు** అ.క్రి. దోమతెగులు సోకు. **దోమపట్టు** అ.క్రి. దోమతెగులుసోకు. **దోమముసురు** రూ. దోమ్ముసురు. వి. చాలా దోమలువచ్చి కంకిమీద వాలటం. **దోమసన్నం** వి. సన్నరకం ధాన్యం. **దోమాడు** అ.క్రి. దోమతెగులుసోకు. <దోమ+ఆడు. **దోమారు** అ.క్రి. దోమతెగులుసోకు. <దోమ+-ఆరు. **దోమ్మసురు** రూ.చూ. దోమముసురు. వి. చాలా దోమలువచ్చి కంకిమీద వాలటం.
**దోమడి** వి.ఔ. వివాహ విందుభోజనం. తాళ్ళ. సం. **4.43**.
**దోమాడకరణము** వి. పడితే వదలనివాడు. దోమాడ అనే ఊరి లోని కరణం. ఇతడు తగాదాలు పెట్టటానికి ప్రసిద్ధుడు. తాను చనిపోయినప్పుడు తన శవాన్ని ముస్లింల గోరీలపక్క దహనం చేయమన్నాడట. అపుడు హిందువులు ముసల్మానులు ఆ శవదహన నిమిత్తం కొట్టుకు చచ్చారట.
**దోమాడు** చూ. దోమ.
**దోమారు** చూ. దోమ.
**దోము** వి. **1**. కడుపువాపు, ఉదరశోష. ఆం.భా. 2.126; **2**. (ఆహారం దేహానికి పట్టక పిల్లలు, పశువులు మొ.) పారు కోవటం.
**దోముబారు(-పాఱు)** వి. మొద్దుబారు.
**దోఁపడము** చూ. దోఁచు.
**దోఁపరి** చూ. దోఁచు.
**దోఁపిడి** చూ. దోఁచు.
**దోఁపిడికాఁడు** చూ. దోఁచు.
**దోఁపిడియాటలు** చూ. దోఁచు.
**దోఁపిడీ** చూ. దోఁచు.
**దోఁపు** చూ. దోఁగు[4], దోచు. స.క్రి. దొప్పించు, దొనుపు (పువ్వులు మొ॥ తల, మున్నగు వాటిల్లో పెట్టుకొను). పల్నా. పు. 110.; వి. **1**. కొల్ల, దోపిడి. ఆము. 6.77; **2**. పూర్ణానకం, ఉత్సవాల్లో సర్వస్వం ఇవ్వడం. వైజ. 1.129.
కుఇ. దోప (-దోత్). లోపలపెట్టు, దోపు, ప్రవేశపెట్టు, ముంచు, మునుగు; పో. చూ. కురు. జొబ్. దూర్చు, తోయు, (లోపలికి) కూరు, కుక్కు.
**దోఁపుకాఁడు** వి. **1**. దొంగ; **2**. కొల్లగాడు. **దోఁపుచూరు** వి. అంతశ్ఛది (అరుగు మొ॥ వాటికి జల్లుకొట్టకుండా ఉండటానికి తాటాకులు మొ॥ చెరివి పెంచినచూరు). ఆం. భా. 2.21. **దోఁపుడు** వి. **1**. దోచటం; **2**. కొల్ల. **దోఁపుడుకాఁడు** వి. **1**. దొంగ; **2**. కొల్లగాడు. **దోఁపుడుపడు** రూ.చూ. దోఁపువడు. అ.క్రి. కొల్లగొట్టబడు. **దోఁపుపడు**. రూ.చూ. దోఁపువడు. అ.క్రి. కొల్లనొందు, దొంగిలింప బడు. **దోఁపుఁబోవు** రూ.చూ. దోఁపువోవు. అ.క్రి. దొంగిలించు, ముచ్చిలించు. **దోఁపువడు (-పడు)** రూ. దోఁపుడుపడు, దోఁపుపడు. అ.క్రి. కొల్లగొట్టబడు. సిం. నార. 48. **దోఁపువోవు (-పోవు)** రూ. దోఁపుఁబోఁవు. అ.క్రి. నులివడు. ఆం. భా. 3.116.
**దోమ్మసురు** చూ. దోమ.
**దోయము** రూ.చూ. దాయము. వి. బాలికా క్రీడావిశేషం. ఇందు. 2.143.
**దోయి** రూ. దొయి. వి. **1**. జత, జోడు. కు. సం. 5.109; **2**. సాటి, సామ్యం. విజయ. 3.14; విణ. సహాయం, తోడు.
సం. ద్వయీ. జంట, రెండు; ప్రా. దోఇ, దో, దఈ; అశోక. ప్రా. దుని; జై. మహా. దో; శౌ. దువే;

అమా. దుదో. రెండు, రెండుసార్లు ; మా. దువే ; అప, దుఇ, దుఈ ;

క. దు, దో ; మ. దోయం ; కుఇ. దుఇ ; బ్రా. దు, దో ; చెంచు, దుయి.

<ప్రా. దోఇ-.

**దోయికట్టు** అ.క్రి. రెండుభాగాలగు. హరి. పూ. 7.92. **దోయించు** స.క్రి. మోగించు. <దోయి + -ఇంచు[3]. **దోయిలి** రూ. దోసిలి. వి. ఔ. **1**. దోసిలి, అంజలి. భార. స్త్రీ. 2.8 ; **2**. నతివిశేషం. భాస్క. రా. యు. 540, **దోయిలించు** రూ. దోసిలించు స.క్రి. **1**. దోసిటపట్టు, దోసిలితో గ్రహించు. హరి. పూ. 5.74 ; శృం. నై. 6.102 ; **2**. (చేతులను) చేర్చు, అంజలిగా కూర్చు. భాగ. 6.418. <దోయిలి + - ఇంచు[3]. **దోయిలితీర్చు** అ.క్రి. నమస్కరించు. హంస. 4.213.

**దోయిడి** చూ. దోచు.

**దోయింత్రం** వి. దిక్సూచి.

నం. యంత్ర-. మర.

**దోర**[1] రూ. దవర. వి. **1**. ఉత్పంక్తి, దొంతర. మార్క. పీఠి. 5 ; **2**. పండబారినకాయ. నవనాథ. 5.202. ; **3**. రాశి ; **4**. కోసినగడ్డిమోపులు కలిపి కళ్ళం దగ్గర వేసిన కుప్ప ; **5**. నీళ్ళు, మట్టి కలిసీ కలియకుండా ఉన్నస్థితి; విఇ. ఎఱ్ఱబారిన. రం. రా. ఉ. 93పు. 26పం.

క. తొగరు. ఎఱ్ఱరంగు ; త. తుకిర్. ఎఱ్ఱపగడం, తువర్. పగడం, ఎఱ్ఱరంగు, (-తువప్ప్-, తువట్ట్-). ఎఱ్ఱగాఉండు, తువరి. పట్టు, పత్తిచెట్ల పువ్వు, తుప్పు. ఎఱ్ఱపగడం, తోరై. పాలిపోయిన ఎఱ్ఱరంగు ; తె. తొగరు. ఎఱ్ఱరంగు ; పో. చూ. త. తోమ్ఫు.

**దోరకలుపు** వి. నాట్లువేసిన తరవాత తీసే మొదటి కలుపు. **దోరకాగినపాలు** వి. బాగా కాగినపాలు. **దోరగాయ (-కాయ)** వి. బాగాపండినకాయ. భాగ. 8.447. **దోరగించు** స.క్రి. దోరగిల్లజేయు. **దోరగిలపెట్టు** స.క్రి. శ్రద్ధగా పెట్టు. **దోరగిలఁబాఱు** అ.క్రి. దోరగిలు. కాశీ. 3.23. <దోరగిలు + -అ[7] + పాఱు. **దోరగిలు** రూ. దోరగిల్లు. అ.క్రి. ఎఱ్ఱబారు, పండబారు. వరాహ. 7.49. **దోరగిల్లు** రూ.చూ. దోరగిలు. అ.క్రి. ఎఱ్ఱబారు, పండబారు. **దోరగొఱ్ఱెలు** వి.బ.వ. ఎఱ్ఱనిగొఱ్ఱెలు. **దోరగోఁగు** వి. గోంగూరలో ఒక రకం. **దోరచీర** వి. ఒకరకం గోధుమ వన్నె చీర. **దోరజాల** వి. లేతఎరుపు చార. **దోరపడు** అ.క్రి. కాయపండబారు. **దోరపండు** వి. పండబారిన కాయ. హరి. పూ. 6.82. **దోరపదును** వి. ఒకమోస్తరుగా సాగు నేల తడపటం. **దోరపయె** రూ.చూ. దోరపయ్యె. వి. లేతఎరుపు తెలుపులు కలిసినరంగు. **దోరపయ్యె** రూ. దోరపయె. వి. లేతఎరుపు తెలుపుల కలయికరంగు. **దోరపుల్ల** రూ. దోరబుల్ల. వి. లేతపుల్లరంగు. **దోరబట్ట** వి. లేతఎరుపు మచ్చ. **దోరబుల్ల (-పుల్ల)** రూ.చూ. దోరపుల్ల. వి. లేతపుల్లరంగు. **దోరమైల** వి. లేతఎరుపులో కలిసినమలుపు. **దోరరంగు** వి. ఒకరకం గోధుమరంగు. **దోరవాఱు (-పాఱు)** అ.క్రి. ఎఱ్ఱబారు, ఎఱ్ఱపడు. అష్టమ. క. 5.248. 7పం. **దోరెఱ్ఱ (-ఎఱ్ఱ)** వి. లేతఎరుపు.

**దోర**[2] విఇ. ఒరిగినది.

త. ఉతిరల్. అవనతమగు.

**దోరగలు** రూ.చూ. దోరగల్లు. విఇ. ఒడ్డగెడవైనది, ఒక పక్క కిందికొరిగి మరొకపక్క పైకి లేచిన, తారుమారైన ; వి. **1**. ఒడ్డగెడవు. తారుమారు ; **2**. ఒరగినరాయి. **దోరగలువడు (-పడు)** రూ. దోరగల్లుపడు. అ.క్రి. ఒడ్డగెడవగు, తారుమారగు. కాశీ. 1.133. **దోరగల్లు (-కల్లు)** రూ. దోరగలు. విఇ. ఒకపక్క కిందికొరగి మరొకపక్క పైకి లేచినది. హరి. పూ. 5.172; వి. తారుమారు. శుక. 3.119. **దోరగల్లువడు (-పడు)** రూ.చూ. దోరగలువడు. అ.క్రి. ఒడ్డగెడవగు. పి. శకు. 3.286. **దోరపాక** వి. ఒరపాక. ఆం. భా. 2.16.

**దోరణ** రూ.చూ. దోరణము. వి. వాకిలి మొదలైన ప్రదేశాలలో కట్టే మామిడాకులు మొదలైనవి గుచ్చిన దండ.

**దోరణపుఁగమ్మి** చూ. దోరణము.

**దోరణపుఁబట్టె** చూ. దోరణము.

**దోరణపుసాటిరిక్క** చూ. దోరణము.

**దోరణము** రూ. తోరణము, దోరణ, దోర్ణం, దోర్నం. వి. **1**. మంగళార్థం ద్వారాలకి కట్టే మామిడాకులు మొ॥ వాటిదండ, తోరణం. యయా. 4.154.80 ; **2**. బహిర్ద్వారం. ఆం. భా. 2.21.

సం. తోరణ-. మంగళార్థం ద్వారాలకు కట్టేమామిడాకుల దండ ; ప్రా. తోరణ- ;

క. తోరణవు ; తు. చోరణ, తోరణ.

<ప్రా. తోరణ-.

**దోరణపుఁగమ్మి (-కమ్మి)** వి. తోరణం కట్టేకమ్మిద్వారం మీదిఅడ్డకమ్మి. **దోరణపుఁబట్టె (-పట్టె)** వి. కపిలెబిల్లకింది అడ్డపట్టె. **దోరణపుసాటిరిక్క** వి. అనురాధా నక్షత్రం.

**దోరనపట్టె** రూ.చూ. దోర్నప్పట్టె. వి. మోటబావి కొమిరెల మీద ఉన్న అడ్డపట్టె.

**దోరనప్పట్టె** రూ.చూ. దోర్నప్పట్టె. వి. మోటబావి కొమిరెల మీద ఉన్న అడ్డపట్టె.

**దోరబందరం** రూ.చూ. దారబంధము. వి. దర్వాజా, తలుపును తగిలించే చట్రం.

**దోరము** రూ.చూ. దువారము. వి. ద్వారం.

**దోరంపట్టె** వి. ద్వారబంధపు నిలువు కమ్మి. **దోరంపోటు** వి. ద్వారాలు ఒకదాని కొకటి ఎదురెదురుగా ఉండక పోవడమనే తప్పు.

**దోరంపట్టె** చూ. దోరము.

**దోరంపోటు** చూ. దోరము.

**దోరవ** వి. కయ్యల (చేల) నిడుపు వరస.

**దోరాగుంటక** రూ.చూ. దౌరగుంటక. వి. పైరులోని గడ్డి తీసే పనిముట్టు.

**దోరించు** చూ. దోరు[1].

**దోరీ** రూ.చూ. డోరీ. వి. నారకు పురి బెట్టిగాని, పేనిగాని తయారు చేసిన లావుపాటి నులక.

**దోరు**[1] చూ. దొక్కు. అ.క్రి. **1**. చచ్చు. వేంక. పంచ.

4.580 ; 2. (తల మొ॥) తిరుగు ; 3. వాలు.

పో.చూ. క. జోల్. (తల కిందుములుగా) వేలాడు, వాలు, నేలవైపువరుగు, వంగు ; త. చోర్. పడు, చచ్చు.

దోరించు స.క్రి. ఇటూ అటూ కదుపు. శివరా. 1.56. <దోరు¹+-ఇంచు³. దోరుగాలం(-కాలం) వి. పొయ్యే (చచ్చే) కాలం. దోరుచు రూ.చూ. దోర్చు. స.క్రి. 1. చంపు ; 2. వాల్చు. దోర్చు రూ. దోరుచు. స.క్రి. 1. పడగొట్టు, పడదోయు. కు.సం. 1.29 ; 2. (తల) తిప్పు, ఇటూ అటూ కదల్చు. భార. స్త్రీ. 1.89 ; 3. నీళ్ళు చేరలతో ఊడ్చి తీసుకొను ; 4. చేలలతో చెరుగు.

దోరు² వి. రేగు, తుమ్మ మొ॥ ముళ్ళకంపలతో పెట్టే అడ్డు.

దోరుపెట్టు అ.క్రి. రేగు, తుమ్మ మొ॥ ముళ్ళకంపలతో పెట్టే అడ్డు.

దోరువ రూ.చూ. దోరువా. వి. పక్షివిశేషం.

దోరువా రూ. దోరువ. వి. పక్షివిశేషం. రసిక. 1.67.

దోరె రూ.చూ. డోరెము. వి. సిమెంటు పెంకులోని దోనె వంటి భాగం.

దోరెం రూ.చూ. డోరెము. వి. 1. పచ్చిటుకల కుప్ప ; 2. ఇటుకను, తాపనను, వెడల్పు మీద నిలబెట్టిన పేర్పు.

దోరెము రూ. తోరెము. వి. డేగలకు కట్టే తాడు. మను. 4.28.

సం. దోరక- ; ప్రా. దోరఅ. ; అ.మా. దోర. ;
క. దోర, దోరె ; తు. దోర్. తాడు ; మ. తోర.

<ప్రా. దోరఅ.

దోర్రె చూ. దోర¹.

దోర్చు చూ. దోరు¹.

దోర్ణం రూ.చూ. దోరణము. వి. ఆకులతో గాని, పూలతోగాని కట్టిన దర్వాజాకు వేలాడ దీసే దండ.

దోర్ణపుపట్టె రూ.చూ. దోర్నప్పట్టె. వి. కపిలె (మోట) గిలక బిగించిన అడ్డ దూలం.

దోర్ణపుపట్టె చూ. దోర్ణం.

దోర్నం రూ.చూ. దోరణము. వి. 1. ఆకులతోగాని, పూలతో గాని కట్టిన దర్వాజాకు వేలాడ దీసే దండ ; 2. మోటబావి కామిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె.

దోర్నపట్టె రూ.చూ. దోర్నప్పట్టె. వి. కొమరుగొయ్యల మీద అడ్డంగా వేసే పట్టె. దోర్నపుకడవ వి. పొయ్యికి ఒక పక్కన నీళ్ళు కాగడానికి పెట్టే మట్టిపాత్ర. దోర్నప్పట్టె రూ. తోరణంపట్టె, తోర్నప్పట్టె, దోరనపట్టె, దోరనప్పట్టె, దోర్ణపుపట్టె, దోర్నపట్టె. వి. మోటబావి కామిరె (నిలువు గుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె. దోర్నప్పలక వి. మోట బావి కామిరె (నిలువుగుంజ)ల మీద ఉన్న అడ్డపట్టె.

దోర్నపట్టె చూ. దోర్నం.

దోర్నపుకడవ చూ. దోర్నం.

దోర్నప్పట్టె చూ. దోర్నం.

దోర్నప్పలక చూ. దోర్నం.

దోర్నాలు వి.బ.వ జోతేల జోడింపు మీద పేర్చే రెండు గోతేలు.

దోర్యము రూ.చూ. డోర్యా. వి. వస్త్రాలు మొ॥ వాటిపై ఉన్న చార.

దోర్యా రూ.చూ. డోర్యా. వి. వస్త్రాలు మొ॥ వాటిపై ఉన్న చార.

దోలు వి. వెనక పంచ.

దోవ రూ.చూ. త్రోవ. వి. మార్గం, దారి.

దోవతి రూ. ధోవతి. వి. మగవాళ్ళు కట్టే బట్ట. హర. 7.12.

స. ధౌత-. కడగబడినది, తెల్లగా చేయబడినది, శుద్ధి చేయటం, కడగటం ; ప్రా. ధోవతి. ఉదుకు, శుభ్ర మొనర్చు, ధోతి. ఉతికిన ;
క. దోతర, దోవతి, దోవర్తి ; పర్షి. ధోతి ; ఒర. ధోతి.

<ప్రా. ధోవతి.

దోవతిజోడ రూ.చూ. ధోవతిజోడా. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట. దోవతులజోడా వి. మగవాళ్ళు కట్టుకొనేరెండు పంచెల నేతబట్ట.

దోవతులజోడ చూ. దోవతి.

దోవి వి. ఎర్రని బట్ట. రాజవా. 5.79.

దోశ రూ.చూ. దోసియ. వి. బియ్యం, మినపప్పు కలిపి రుబ్బిన పిండితో చేసే అట్టు.

దోశెపడి చూ. దోసియ. వి. బియ్యం, మినపప్పు కలిపి రుబ్బిన పిండితో పెనంపై కాల్చే అట్టు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556.

దోస రూ. దోసర. వి. కర్కటి, ఉర్వారువు. కాశీ. 3.23. (Cucumis Sativus).

దోసకాయ వి. ఒకరకం తినే కాయ. హర. 2.64. దోసకాయకమాను వి. గుండ్రంగా ఉండే ఆర్చి. దోసతోట వి. దోసపాదుల చేను.

దోసం రూ.చూ. దొగసం. వి. ఆరుబయట ఊతైలకు చాపిన పడుగు కిందికి దిగబడకుండా ఎత్తుపెట్టే కొయ్య పనిముట్టు.

దోసకారి చూ. దోసము.

దోసమయ్య వి. నేతపని చేసే దేవాంగుల వంశానికి మూల పురుషుడు, దేవల మహర్షి.

దోసము వి. 1. నేరం, అపరాధం. కొరవి శాసనం, క్రీ.శ. 892–922 ; 2. కీడు, హాని. భార.సభా. 2.173 ; 3. దోషం. కు.సం. 1.29 ; 4. పాపం. భార.శాంతి. 3.505 ; 5. కొరత, లోపం. దశా. 2.353.

సం. దోష-. తప్పు, అపరాధం ; ప్రా. దోస-. తప్పు, దుఃస్థితి. కొరత.
క. దోస. ; తు. దోస. ; త. తోచమ్, తోటయ్, తోమ్ ; మ. తోఅం, తోట్టం ; కుఇ. దొసా ; ఒర. దోఖ్, దోస్. ; బ్రా. డో.

<ప్రా. దోస-.

దోసకారి వి. ధోసం చేసేవాడు, దుష్టుడు. శృం.నై. 7.130. దోసములుకట్టు అ.క్రి. తప్పులంట గట్టు. కళా. 7.234.

దోసర రూ.చూ. దోస. వి. ఒకరకం పాదు పేరు.

దోసి విశ. పాపాత్ముడు. భాగ. 6.182.

సం. దోషిన్-. అపరాధి ; ప్రా. దోసి.

<ప్రా. దోసి.

**దోసిడు** చూ. దోసిలి.
**దోసియ** రూ. దోశ, దోసె. వి. భక్ష్య విశేషం, అట్టు. కాశీ. 7.186.
క. దోసె. బియ్యం మినపప్పుతో చేసే అట్టు; కొడ. దోసె; తు. దోసె; త. తోచై; మ. దోశ.
**దోసిలి** రూ.చూ. దోయిలి. వి. 1. అంజలి. విక్ర. 6.69; 2. నతివిశేషం. ఇందు. 3.87.
**దోసిడు** రూ.చూ. దోసెడు. విణ. దోసిట్లో పట్టినన్ని. **దోసిలించు** రూ.చూ. దోయిలించు. స.క్రి. 1. చేర్చు, అంజలిగాకూర్చు. తాల్ల.సం. 14.292; 2. దోసిలిపట్టు, దోసిలితో గ్రహించు. <దోసిలి+ఇంచు[3]. **దోసిలిప్రాల ముద్దుగుమ్మ** వి. భార్య. శుక. 2.503. వ్యు. తలంబ్రాలు పోసిన ప్రేయసి. **దోసెడు** రూ. దోసిడు. విణ. అంజలి పరిమాణం. శ్రీనాథుని చాటువు. 1.126.
**దోసుడుకట్టె** చూ. త్రోయు. వి. ఆములో మంటను ఎగదోయడానికి వాడే నాలుగైదు అడుగుల పొడవుగల పంగలకర్ర.
**దోసుడుకొర్రాయి** చూ. త్రోయు. వి. ఆములో మంటను ఎగదోయడానికి వాడే నాలుగైదు అడుగుల పొడవుగల పంగలకర్ర.
**దోసె** రూ.చూ. దోసియ. వి. భక్ష్యవిశేషం, అట్టు. భీమ. 1.60.
**దోసెమూకెటి** వి. దోసెల పెనంపైన మూతకు వాడే మట్టిమూకుడు. **దోసెలపెనము** వి. దోసెలు పోయడానికి వాడే పళ్ళెం ఆకారంలోని మట్టిపాత్ర. **దోసెలుపోయు** అ.క్రి. దోసెలనుచేయు.
**దోసెడు** చూ. దోసిలి.
**దోస్తి** వి. సఖ్యం, స్నేహం, ఎక్కువ పరిచయం. ప్రబంధ. 788.
హిం.ఉ.పార.మరా. దోస్తీ. మిత్రత, స్నేహం.
<ఉ. దోస్తీ.
**దోస్యము** చూ. జోస్యము. వి. ప్రసంగం. శుక. 2.438.
**దోహత్తనారాయణుడు** వి. ద్విబాహునారాయణుడు. శృం.నై. 1.32.
నం. ద్వి. రెండు, హస్త-. చేయి, నారాయణ-. విష్ణువు; ప్రా. దో. రెండు, హత్థ-. చేయి.
<ప్రా. దో+ప్రా. హత్థ-+సం. నారాయణ-+-డు.
**దోహరి** వి. చండాలుడు. కాశీ. 7.242.
సం. ధ్రువాకారిన్. బృందగానం చేసేవాడు; ప్రా. ధువాఅర. పాఠకుడు; బెం. దోహర్, దౌడ.
**దౌ** రూ.చూ. దవ్వు. వి. దూరప్రదేశం. ఆము. 4.158; క్రి.విణ. దూరంగా. రామాభ్యు. 5.163; విణ. దూరమైన.
**దౌదవ్వగు** అ.క్రి. దూరమగు. శివరా. 2.17. <దౌ+దవ్వు+అగు. **దౌదవ్వులు** రూ. దవ్వుదవ్వులు. వి.బ.వ. మిక్కిలిదూరం. భార.విరా. 5.172, భీమ. 2.79. **దౌదౌవు** వి. సుదూరప్రదేశం. జైమినిభా. 2.51.
**దౌగుల్బాజీ** రూ.చూ. దగలుబాజి. వి. 1. మోసగాడు; 2. దొంగ.
**దౌటి** రూ.చూ. దవతి. వి. సిరాబుడ్డి.
**దౌడ** రూ. దవడ, దవుడ. వి. 1. చెక్కిలి, చెంప. భార.శాంతి. 3.195; 2. చెక్కిలి లోపలిభాగం. హరి.ఉ. 9.225.
నం. దంష్ట్రా. కోర; ప్రా. దాఢా;
క. దవడు, దవడె, దవిడె, దవుడె, దాడె, దావడె. కోర, దౌడఎముక; తు. దవడె, దవుడ, దాడె; త. తవడై, తాడై; మ. తాట, తావట.
<ప్రా. దాఢా.
**దౌడపండ్లురాలగొట్టు** స.క్రి. 1. తన్ను; 2. శిక్షించు; 3. చెంపలో ఉన్న పళ్ళను కొట్టి పడగొట్టు. **దౌడపల్లు** వి.బ.వ. పార్శ్వదంతాలు.
**దౌడు** రూ. దవుడు. వి. 1. పరుగు; 2. జోడన, అశ్వగతి విశేషం; 3. దండయాత్ర.
నం. ధోర్. పరుగు, శీఘ్రం; హిం. దౌడ్. పరుగు; మరా. దవడణె. పరుగెత్తు, దవడ్. పరుగు; ఉ. దౌడ్. పరుగు.
<హిం. దౌడ్.
**దౌరగుంటక** రూ. దోరాగుంటక, దౌలాగుంటక. వి. పైరులో గడ్డితీసే గుంటక.
**దౌరాకు** వి. పశువుల మేతకు సరిపడేఅంత ఎత్తు పెరిగిన పైరు.
**దౌరు[1]** రూ. దవురు[2]. వి. 1. కాంతిగల హారం. రాజవా. 2.47; 2. కాంతి. రాజవా. 5.35.
ప్రా. దవర-, దవరియా. రజ్జువు, చిన్నతాడు.
**దౌరు[2]** రూ. దవురు[1]. వి. ఎత్తుగాఉన్న బావిగోడ.
హిం.ఉ. దౌర్. భ్రమణం.
<ఉ. దౌర్.
**దౌర్భాగ్యదామోదరుడు** వి. నిర్భాగ్యుడు.
నం. దౌర్భాగ్య-. దురదృష్టవంతమయిన, దామోదర-. కృష్ణుడు, దామం (దండ) ఉదరంపై ఉన్నవాడు.
<సం. దౌర్భాగ్యదామోదర- (అర్థవిపరి.).
**దౌలతు** రూ.చూ. దౌలత్తు. వి. 1. పాలన; 2. అధికారం.
**దౌలత్తు** రూ. దవులత, దవులతు, దవులత్తు, దవ్లత్తు, దౌలతు. వి. అదృష్టం, ధనం, భాగ్యం. అడిదము సూరకవి చాటువు.
హిం. దౌలత్. ధనం; మరా. దౌలత. సంపద; ఉ. దౌలత్. ధనం, భాగ్యం; పార. దౌలత్. ఐశ్వర్యం; అర. దౌలత్. సంపద.
<ఉ. దౌలత్.
**దౌలాగుంటక** రూ.చూ. దౌరగుంటక. వి. పైరులో గడ్డి తీసే గుంటక.
**దౌల్బాజీ** రూ.చూ. దగలుబాజి. వి. 1. మోసగాడు; 2. దొంగ.
**దౌవు** రూ.చూ. దవ్వు. విణ. దూరం.
**ద్రబ్బ** రూ.చూ. బ్రద్ద. వి. బద్ద, శకలం. కువ.చ. 1.31. (వర్ణవ్యత్యయం).
**ద్రబ్బెడ** వి. 1. భక్ష్యవిశేషం. కాశీ. 7.185; 2. అడుగంటి మాడిన అన్నం. భాగ. 5.1.128.
**ద్రాక్షకుండ** వి. ద్రాక్షపళ్ళ రవాణాకు వాడే గుండ్రటి కుండ.
నం. ద్రాక్షా. ఒకరకం పండు.
<సం. ద్రాక్షా+కుండ.

**ద్రాక్షగుత్తెంచు** వి. ద్రాక్షపళ్ళగుత్తి డిజైను నేసిన అంచు.

సం. ద్రాక్షా. ఒకరకం పండు.

<సం. ద్రాక్షా+గుత్తి+అంచు[3].

**ద్రాప** వి. కవిత్వ దోషాల్లో ఒకటి. పండి.చ. 1.6 పు.

సం. ద్రాప-. అడుసు, బురద.

<సం. ద్రాప- (అర్థవిపరి.).

**ద్రాపి** వి. కక్కుర్తిమనిషి.

సం. ద్రాప-. మూర్ఖుడు.

<సం. ద్రాప-.

**ద్రాబ** రూ. దేబె. వి. **1**. మూర్ఖుడు, అధముడు. నార.పంచ. **3.21** ; **2**. చేతకానివాడు. ఆము. 4.248 ; **3**. సారం లేని మాట. ఆం.భా. 1.117 ; విణ. **1**. అసారం ; **2**. అసారుడు ; **3**. అధముడు ; **4**. అధమం.

సం. ద్రాప-. మూర్ఖుడు.

<సం. ద్రాప-.

**ద్రావిడప్రాణాయామము** వి. నూటిగా చెప్పనప్పుడుపయోగించే మాట. అరవలు ప్రాణాయామం చేసేటప్పుడు కుడిచేతిని తల చుట్టూ తిప్పి ముక్కును పట్టుకొంటారు. దీన్నిబట్టి తెలుగులో ఈ నుడికారం ఏర్పడింది.

సం. ద్రావిడ-. అరవలు, ప్రాణాయామ-. ధ్యానం.

<సం. ద్రావిడ ప్రాణాయామ- (అర్థవిపరి.).

**ద్రిఢము** వి. స్థిరం, శాశ్వతం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 151. క్రీ.శ. 1161.

సం. దృఢ-. గట్టి ; ప్రా. దఢ-, దిఢ-, దిడ్ఢ-.

<సం. దృఢ-.

**ద్రిండు** రూ. దిండి, దిండు. వి. **1**. దట్టీ. భార. విరా. 1.211 ; **2**. చుట్టచుట్టిన వస్తువు. భాగ. 8.183 ; **3**. కుచ్చెల.

క. దిండు. కుప్ప, గుండ్రంగాఉన్న కుప్ప లేదా ముక్క, గుండ్రంగా ఉన్న పెద్దరాయి, కర్రలు లేదా గడ్డిమోపు, బట్టలమూట. దిండా. గుండ్రని బండరాయి ; త. తింటు. అర్ధ వృత్తాకారపు దిండు, ఇటుకలతో కట్టిన గోడ పునాది ; పో.చూ. మరా. దీడ్. బట్టలమూట.

**ద్రిమ్మరి** రూ.చూ. త్రిమ్మరి. వి. తిరిగేవాడు.

**ద్రిమ్మరించు** స.క్రి. కడవలతో కుమ్మరించు. మృత్యు. 2.72. **ద్రిమ్మరీఁడు** రూ.చూ త్రిమ్మరీఁడు. వి. తిరుగుబోతు.

**ద్రిమ్మరీఁడు** చూ. ద్రిమ్మరి.

**ద్రుగ్గాదేవి** వి. దుర్గాదేవి. నె.శా. ఒంగోలు. 75. క్రీ.శ. 1280.

సం. దుర్గాదేవీ. పార్వతీదేవి.

<సం. దుర్గాదేవీ.

**ద్రుంగు** రూ.చూ. త్రుంగు. అ.క్రి. **1**. చచ్చు ; **2**. తునకలగు ; **3**. నశించు.

**ద్రుడ్డు** రూ.చూ. దుడ్డు[2]. వి. ముగ్గురం. అచ్చ.రా.యు. 227.

**ద్రుతప్రకృతికము** చూ. ద్రుతము. వి. ద్రుతం అంతంలోఉన్న పదం.

సం. ద్రుత-. వేగం, పారిపోయేది, కరిగినది, ప్రకృతిక-. ప్రకృతిగా కలది.

<సం. ద్రుతప్రకృతిక- (అర్థవిపరి.).

**ద్రుతము** వి. ప్రత్యయాత్మకంగా లేదా ఆగమాత్మకంగా లేదా అవ్యయాత్మకంగా ఉన్న నువర్ణం ద్రుతం.

సం. ద్రుత-. వడికలది, కరిగిపోయేది, పారిపోయేది.

<సం. ద్రుత- (అర్థవిపరి.).

**ద్రొంచిమ్రాను** వి. వృక్షవిశేషం. E.I. 5.10. క్రీ.శ. 1102.

**ద్రొబ్బించు** చూ. ద్రొబ్బు.

**ద్రొబ్బిలు** చూ. ద్రొబ్బు.

**ద్రొబ్బు** రూ. దొబ్బు. స.క్రి. **1**. తోయు, గెంటు. భాస్క.రా. బాల. 6.76 ; శివరా. 367 ; **2**. వెళ్ళగొట్టు. భాగ. 10పూ. 1288 ; వి. తోయటం, తోపు. హంస. 1.52 ; **3**. పడగొట్టు, పడదోయు. భాగ. 10 ఉ. 398.

క. డొబ్బు, దొబ్బు. గెంటు, నెట్టు, తోయు ; తు. దొబ్బుని. గెంటు, నెట్టు, తోయు.

**ద్రొబ్బించు** స.క్రి. పడదోయు. ఘటికా. 3.14.< ద్రొబ్బు+-ఇంచు[3]. **ద్రొబ్బిలు** స.క్రి. పగలగొట్టు. రం.రా. యు. **ద్రొబ్బుడుపటము** వి. చేపల్నిపట్టే సాధనాల్లో ఒకటి. హంస. 4.184. **ద్రొబ్బులాడు** అ.క్రి. తోచుకొను. హంస. 2.22.<ద్రొబ్బు+-లు+ఆడు.

**ద్రోగుళ్ళు** వి.బ.వ. ద్రోహులు, చిలంకూరు శాసనం. క్రీ.శ. 739.

సం. ద్రోహిన్. హానికరమైన, ప్రా. దోహి. అసూయ గల.

<సం. ద్రోహిన్+-లు.

**ద్రోఁచువాఁడు** చూ. దోఁచు. విణ. దోపిడీకాడు.

**ద్రోణము** రూ. దోణము, దోణాము, ద్రోణాము. వి. **1**. భుజాలకు బలం రావటానికి తిప్పే మల్లుర సాధనం. మను. 4.111 ; **2**. చాపకర్షణ బలసాధనం. ఆం.భా. 2.212 ; **3**. తాడిచెట్టు మొ. వాటిని చీల్చటానికి అక్కడ కొట్టిన చీలల్ని దిగగొట్టే సాధనం.

సం. ద్రూణ-. బాణం, విల్లు, తేలు ;

క. దోణవు.

<సం. ద్రూణ-.

**ద్రోణాము** రూ.చూ. ద్రోణము. వి. **1**. భుజాలకు బలం రావటానికి తిప్పే మల్లుర సాధనం ; **2**. చాప కర్షణ బలసాధనం ; **3**. తాడిచెట్టు మొ. వాటిని చీల్చటానికి అక్కడ కొట్టిన చీలల్ని దిగగొట్టే సాధనం.

**ద్రోణాముఖము** వి. నాలుగువందల గ్రామాలకు రాజధాని. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 136. క్రీ.శ. 1149.

సం. ద్రోణముఖ-. నాలుగువందల గ్రామాల్లో మనోహరమైన, ముఖ్యమైన గ్రామం.

<సం. ద్రోణముఖ-.

**ద్రోపది** రూ.చూ. ద్రోవది. వి. ద్రుపదపుత్రి, పాండవపత్ని. ఆం.భా. 2.105.

**ద్రోవది** రూ. ద్రోపది. వి. **1**. ద్రౌపది, పాండవుల భార్య. భార. ఆది. 3.15 ; **2**. ఒకరకం ముదురు పచ్చరంగు.

సం. ద్రౌపదీ. (ద్రుపదుని కూతురు, పాండవ పత్ని) ; ప్రా. ద్రౌవది, ద్రోవఈ ; అ.మా. దోవఈ, దోవతీ ; మా. దోవదీ ; అప. దోవఇ.

<ద్రా. ద్రౌవది-.

ద్రౌపతి రూ.చూ. ద్రౌపది. వి. ఒకరకం ముదురు పచ్చరంగు.

ద్రౌపది రూ. ద్రౌపతి. వి. ఒకరకం ముదురు పచ్చరంగు.

సం. ద్రౌపదీ. ద్రుపదుని కూతురు, పాండవపత్ని ; ప్రా. దొవది, దోవఈ ; అ.మా. దోవఈ, దోవతి, మా. దోవదీ ; అప. దోవఇ.

<సం. ద్రౌపదీ- (అర్థవిపరి.).

ద్రౌపదిచీర వి. ఒకరకం ముదురు పచ్చరంగు చీర.

ద్రౌపదీస్వయంవరములు వి.బ.వ. వస్త్ర విశేషం. ఆం.భా. 3.206.

సం. ద్రౌపదీస్వయంవర-. ద్రుపద పుత్రికయొక్క స్వయంవరం.

<సం. ద్రౌపదీస్వయంవర- + -ము + -లు.

ద్వాదసులు వి.బ.వ. దేవుడికి ప్రతి ద్వాదశి తిథినాడు కావించే కైంకర్యాలు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 981, క్రీ.శ. 1518.

సం. ద్వాదశి. పక్షంలో పన్నెండో తిథి.

<సం. ద్వాదశీ + -లు. (అర్థవిపరి.).

ద్వారబందరం రూ.చూ. దారబందము. వి. దర్వాజా, తలుపులు తగిలించే చట్రం.

ద్వావరసేయు(-చేయు) చూ. దేవర. స.క్రి. దేవరకుపెట్టు.



ధ వి. దంతమూలీయ నాదస్పర్శ వర్ణం, మహాప్రాణం. ద్రావిడ భాషల్లో మహా ప్రాణవర్ణాలు లేవు. మహా ప్రాణమైన ఈ వర్ణంతో కూడిన పదాలు అన్యభాషా సంబంధివి కాని ధ్వన్యనుకరణ సంబంధివికాని స్వతంత్ర పరివర్తనీయత (Free Variation) వలన ఏర్పడినవి కాని ఐఉంటాయి.

ధగడమియ్యా చూ. ధగిడి. రూ.చూ. దగిడిమియ్యా. వి. అసాధ్యుడు.

ఉ. మియా. ఇష్టుడు.

ధగధగ వి. ప్రకాశించటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. భాగ. 8.265 ; విశ. ధగధగ అనే కాంతిగల. మను. 4.117.

సం. దహదహ్ ; ప్రా. ధగధగ ; అప. ధగధగ ; మరా. ధగధగణే. మండు ;

క. ధగధగ. తీవ్రంగామండటం.

ధగధగద్ధగలు వి.బ.వ. ధగధగమని మెరిసేకాంతులు. దశా. 1.206. ధగధగమను అ.క్రి. మెరయు. <ధగధగ + అను. ధగధగలాడు అ.క్రి. మెరయు. <ధగధగ + -లు + ఆడు.

ధగిడి రూ.చూ. ధగిడీ. వి. 1. నీచపురుషుడు, దుష్టపురుషుడు. హంస. 5.113 ; 2. నీచస్త్రీ.

ధగిడిమియ్యా రూ. ధగడమియ్యా. వి. అడ్డంగా కూర్చోటం.

ధగిడీ రూ. ధగిడి. వి. 1. నీచపురుషుడు, దుష్టపురుషుడు. అహల్యా. 1.95 ; 2. నీచస్త్రీ.

హిం. ధగ్‌డా. రంకుమగడు ; ఉ. ధగడ్ ; మరా. ధగడ్. విటుడు.

<మరా. ధగడ్.

ధగిడీకొడుకు వి. ఒకతిట్టు.

ధట్టించు రూ.చూ. దట్టించు. అ.క్రి. యత్నించు.

ధట్టు(డు రూ.చూ. దట్టు(డు. వి. శూరుడు.

ధడియం వి. రెండువీసెలు.

ధణధణంధణ వి. శంఖం భేరి మొ॥ వాటి ధ్వనులకు అనుకరణం. దశా. 2.55.

ధణంతెగిరిపోవు అ.క్రి. 1. తట్టుకోలేకపోవు ; 2. అద్భుతంగా ఉండు.

ధణంధణ వి. శంఖం, భేరి మొ॥ వాటి ధ్వనులకు అనుకరణ. దశా. 2.162.

ధణి రూ.చూ దణి. వి. సేనాపతి, ప్రభువు.

ధనంజ్యోతి రూ. దనంజ్యోతి. వి. సప్తర్షి మండలంలో వశిష్ఠుడి దగ్గర కనబడీ కనపడకుండా ఉండే చిన్న చుక్క.

సం. ధనమ్. డబ్బు, సంపద, జ్యోతిస్. నక్షత్రం.

<సం. ధనంజ్యోతిస్ (అర్థవిపరి.).

ధనరు వి. 1. ప్రభావం ; 2. రేఖ.

ధనసుడి వి. మూపురం మీద ఉండే సుడి.

సం. ధన-. డబ్బు.

<సం. ధన- + సుడి (మిశ్రమ.).

ధనాసరి[1] వి. ఒకానొక రాగం.

సం. ధన్యాశీ-. ఒకరాగం, స్త్రీ.

<సం. ధనాశ్రీ-.

ధనాసరి[2] వి. గోగులలో ఒకరకం.

ధని వి. కూలికి ముగ్గాలు నేయించేవాడు.

క. ధణి.

ధనియాలజాతి వి. ఒకానొకకులం.

ధనియాలు రూ.చూ. దనియాలు. వి.బ.వ. నల్లనేలల్లో సాగుచేసి పెంచేపైరు (Coriandum Sativum).

ధనుర్మాసఉండ వి. పేలాలు, కొబ్బరి, పంచదార పాకం పెట్టి గట్టిగా తయారుచేసే ఉండ.

ధనుర్వాయి వి. ఒకరకం వాతరోగం.

సం. ధనుర్వాయు-. ధనుర్వాతం, వాతరోగం.

<సం. ధనుర్వాయు-.

**ధనుష్‌పింజన్** వి. దూదివికేకొయ్య పనిముట్టు.

సం. ధనుస్: విల్లు.

<సం. ధనుస్ + పింజెన్.

**ధనేలవడ్లు** చూ. ధనియాలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**ధంధంధణ** వి. భేరీధ్వనికి అనుకరణం. ద. హిం. శా. సంపు. 4. శా. నం. 232.

**ధమామి** రూ.చూ. ధమామి[1]. వి. వాద్యవిశేషం, పెద్దనగారా. ప్రబంధ. 788.

**ధమాయించు** రూ.చూ. దమాయించు. స.క్రి. 1. అదలించు ; 2. కొయ్య సాధనాలతో మెల్లగాకొట్టు, బాదు.

**ధమ్మస** రూ.చూ. దిమ్మిస. వి. చాటుబల్ల, నేలనుగట్టి పరచడానికి వాడే కొయ్య లేక ఇనప పరికరం.

ధమ్మసపలక వి. దిమ్మిస అడుగున ఉండే కొయ్య దుంప.

**ధర** రూ.చూ. దర[2]. వి. మూల్యం.

ధరపలుకు అ.క్రి. హెచ్చు ధరవచ్చు.

**ధరణము** రూ. దరణము. వి. విలువ. ద. హిం. శా. సంపు. 6. శా. నం. 897. క్రీ.శ. 1278.

సం. ధరణ-. ధరించేది, ధరించటం, 48 యవలఎత్తు.

<సం. ధరణ- (అర్థవిపరి.).

**ధరావతు** వి. 1. మూలం, అప్పుకు ముందిచ్చిన సొమ్ము ; 2. ఎన్నికలలో అభ్యర్థులు కట్టే డిపోజిట్టు.

ఉ. దరావత్. మూలధనం.

<ఉ. దరావత్.

**ధరు** వి. తివాసీపడుగులో, కిందిపోగులకు పై పోగులకు క్రాస్ (×) మాదిరిగా వచ్చినభాగం.

**ధర్నా** వి. చుట్టు ముట్టటం.

హిం. ఉ. దరానా. చొచ్చుకొనిపోవు.

<హిం. దరానా.

**ధర్మకవిలె** వి. ధర్మాల పుస్తకంలోని దానాల్ని అనుభవించేవాడు. బసవ. 4.1022పం.

సం. ధర్మ-. న్యాయం.

<సం. ధర్మ- + కవిలె (మిశ్రస.).

**ధర్మగాడి** వి. పశువులు నీరుతాగడానికి రాతితో కట్టినగాడి తొట్టి. H. A. S. 1941. క్రీ. శ. 1280.

సం. ధర్మ. న్యాయం.

<సం. ధర్మ- + గాడి[1].

**ధర్మదార** రూ.చూ. ధర్మపుదార. వి. యుద్ధం పూర్తిఅయినదని సూచించడానికి ఊదేబాకా. దశా. 7. 1,154.

ధర్మదారవట్టించు (-పట్టించు) స.క్రి. యుద్ధం నిలిపే సూచనగా శంఖంపూరించు. క్రీడా. 54.

**ధర్మనిర్వహణోద్యోగము** వి. ధర్మాన్ని నెరవేర్చే ప్రయత్నం. మూడవ విజయాదిత్యుని ధర్మవరం శాసనం.

సం. ధర్మనిర్వహణ-. న్యాయం నెరవేర్చటం, ఉద్యోగ-. ప్రయత్నం.

<సం. ధర్మనిర్వహణ + సం. ఉద్యోగ- + -ము.

**ధర్మపన్నాలుచెప్పు** స.క్రి. నీతులుచెప్పు.

సం. ధర్మ-. న్యాయం.

<సం. ధర్మ- + పన్నము + -లు + చెప్పు.

**ధర్మపిండం** వి. తిరిపెపుతిండి.

సం. ధర్మ. న్యాయం, పిండ-. ముద్ద.

<సం. ధర్మ- + సం. పిండ- + ము. (అర్థవిపరి.).

**ధర్మపుదార** రూ. ధర్మదార. వి. యుద్ధం పూర్తిఅయినదని సూచించడానికి ఊదే బాకా. ఆము. 5 150.

సం. ధర్మ-. న్యాయం.

<సం. ధర్మ- + దార[2].

**ధర్మరాజు** వి. 1. ఉత్తముడు ; 2. న్యాయంగా సంచరించే మనిషి.

సం. ధర్మరాజ-. పాండురాజు పెద్దకొడుకు.

<సం. ధర్మరాజ- (అర్థవిపరి.).

**ధర్మసత్రం** వి. ఉచితంగా భోజన వసతి కల్పించే చోటు.

సం. ధర్మసత్ర-. ధర్మార్థం ఏర్పడ్డ గృహం.

<సం. ధర్మసత్ర- (అర్థవిపరి.).

**ధర్మాదాయం** వి. సత్రాలకు, మఠాలకు ఇచ్చిన మాన్యం.

సం. ధర్మదాయ-. ధర్మార్థ మిచ్చే ఈవి. కొందరు సంస్కృతంలోని ఆదాయ శబ్దానికి రాబడి అనే అర్థాన్ని మనసులో ఉంచుకొని 'ధర్మదాయ' శబ్దాన్ని మార్చి 'ధర్మాదాయం'గా ఏర్పరచి ఉంటారు.

**ధర్మిచెట్టు** వి. దసలి (పట్టు) పురుగులకు ఆహారంగా పనికొచ్చే ఒకరకం చెట్టు.

సం. ధర్మిన్. ధర్మయుక్తమైన, ధర్మబద్ధమయిన.

<సం. దర్మిన్ + చెట్టు.

**ధళ** వి. 1. కాంతికి అనుకరణం. గౌ.హరి.పూ. 2143 పం. ; 2. ప్రకాశం ; 3. కాంతి. మను. 5.84.

ధళధళలు వి.బ.వ. ప్రకాశం, తళుకులు.

**ధళుధళుక్కు** వి. 1. మెరుపు మొ॥ వాటి కాంతి విశేషం. పాండు. 4.21 ; 2. మెరుపు మెరవటానికి అనుకరణం. చంద్రాంగ. 4.201.

**ధవళసంకులవారు** విణ.బ.వ. పంచమహావాద్యకారుల్లో ఒకరు, వ్యు. తెల్లటి శంఖం కలవారు. ద.హిం. శా. సంపు. 10. శా.నం. 422. క్రీ.శ. 1269.

సం. ధవళ-. తెల్లని, తెలుపు, శంఖ-. శంఖం.

**ధాగా** వి. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టే పురిదారం.

హిం. ధాగా. దారం ; మరా. ధాగా ; గు. ధాగో.

<మరా. ధాగా.

**ధాణు** వి. మల్లవిద్యలోని పద్నాలుగు విసురుల్లో ఒకటి. మల్లు పు. 3.69, హంస. 1.206.

ధాణుకపాలు వి. మల్లవిద్యలోని విసురుల్లో ఒకటి.

ధాణుధాక వి. మల్లవిద్యలో పద్నాలుగు విసురుల్లో ఒకటి.

ధాణుధారు వి. మల్లవిద్యలోని పద్నాలుగు విసురుల్లో ఒకటి. హంస. 1.206. ధాణుధోడ వి. నాట్యంలో ఒక విన్యాసం.

**ధాతుకప్పడము** స.క్రి. గైరికాది ధాతువులతో కప్పటం. పండి. చ. 1 పు. 375 పం.

సం. ధాతు-. గైరికాది ధాతువు.

<సం. ధాతు- + కప్పడము (అర్థవిపరి.).

**ధాంధూంచేయు** అ.క్రి. జబర్దస్తీచేయు. ధాంధూం ధ్వన్యనుకరణ

శబ్దాలు.

**ధాన్నెపుసుడి** రూ.చూ. ధాన్యపుసుడి. వి. మూపుమీద ఉండే సుడి.

**ధాన్యం** వి. తిండిగింజలు, వడ్లు.

సం. ధాన్య-. గోధుమ, పెసలు, వడ్లు మొదలైనవి.

<సం. ధాన్య- (అర్థవిపరి.).

**ధాన్యంవర** వి. గింజల నిల్వకు వాడే పెద్దగాదె. **ధాన్యంకొట్టు** వి. ధాన్యం దాచుకునే గది. **ధాన్యపుసుడి** రూ. ధాన్నెపుసుడి. వి. మూపుమీద ఉండే సుడి.

**ధాన్యపుసుడి** చూ. ధాన్యం.

**ధామ** వి. ఇటుకతో రాళ్ళతో కట్టిగాని, కొయ్యతో చేసిగాని, నిటారుగా నిలిపి పైనున్న వస్తువులకు ఆధారంగా వాడబడే సన్నటి పొడుగాటి నిర్మాణం.

సం. ధామన్. ఇల్లు, స్థానం.

<సం. ధామన్ (అర్థవిపరి.).

**ధారాళము** వి. పుష్కలం. ప్రభా. 2.78, సు.శ. 1.

సం. ధారాళ-. ధారకలది.

<సం. ధారాళ- (అర్థవిపరి.).

**ధారు** వి. మల్లవిద్యల్లోని పద్నాలుగు విసురుల్లో ఒకటి. హంస. 1.206.

సం. ధార-. ధరించేది.

<సం. ధార-.

**ధారుధాణ** రూ.చూ. ధారుధాణు. వి. మల్లవిద్య విసురుల్లో ఒకటి. **ధారుధాణు** రూ. ధారుధాణ. వి. మల్ల విద్యలోని పద్నాలుగు విసురుల్లో ఒకటి. హంస. 1.206.

**ధాలు** రూ.చూ. డాలు[1]. వి. **1**. కేడం, ఒడ్డనం. చంద్రభా. 1.127 ; **2**. టెక్కెం, జెండా.

**ధాళి** వి. పెద్దపళ్ళెం.

సం. స్థాలీ. మట్టిపాత్ర ; ప్రా. థాలీ, థాలియా ; పా. థాలీ. పళ్ళెం, పాత్ర ; నే.అ. థాలి ; బెం. థాలి ; ఒ. థాల-, థాలి-, థాలిఆ ; హిం. థాలీ.

<ప్రా. థాలీ.

**ధావళి** వి. వస్త్రవిశేషం. హంస. 1.157.

హిం.ఉ. ధావలీ. తెల్లవస్త్రం.

<హిం. ధావలీ.

**ధిగధిగ** రూ.చూ. ధిగద్ధిగ. వి. కస్తూరి బొట్టు మొ॥ వాటి కాంతి విశేషానికి అనుకరణం. చమ. 3.43, శ్రీరం.మా. 4.69.

**ధిగద్ధిగ** రూ. ధిగధిగ. వి. కస్తురి బొట్టు మొ॥ వాటి కాంతి విశేషానికి అనుకరణం. వసు. 5.3.

**ధిగుల్లు** వి. గుండె అదరటానికి అనుకరణం.

క. డిగల్, డిగిల్, డిగిలు, డిగులు, ధిగిల్. భయం, సంక్షోభం.

**ధిగుల్లుమను** అ.క్రి. గుభేలను. చెన్నబసవ. 1.123. <ధిగుల్లు + అను. **ధిగుల్లురను** అ.క్రి. గుభేలను. చెన్న బసవ. 2.302. <ధిగుల్లు + అను.

**ధిందిం** రూ. ధిందిమి, ధిమిధిమి, ధిమింధిమి. వి. వాద్య విశేషానికి అనుకరణం. సిం.ద్వా. 1.129.

క. డిమ్. గణగణ ధ్వనికి ధ్వన్యనుకరణం ; తు. డిమిడిమి. వేగంగా నాట్యం చేయటం ; త. తిమితిమి. నృత్యంలో సమయాన్ని సరిగా ఉంచటానికి వాడే పదం, తిమితిమిఎణాల్. ధ్వన్యనుకరణం, సంగీతంలోగాని, నృత్యంలోగాని సమయం సరిగా చూసుకోడానికి వాడే పదాలు.

**ధిందింధిక్కధిమిక్క** వి. తాళధ్వని, మద్దెల మొ॥ వాటి ధ్వనికి అనుకరణం.

**ధిందిమి** రూ.చూ. ధిందిం. వి. ధ్వన్యనుకరణం.

**ధిమికీకుండ** రూ.చూ. డిమికీకుండ. వి. కిందిమూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే ఒకరకం వాద్యం.

**ధిమిధిమి** రూ.చూ. ధిందిం. వి. భేరి మొ. వాటి ధ్వనికి అను కరణం. ఆము. 4.35.

**ధిమింధిమి** రూ.చూ. ధిందిం. వి. గణగణధ్వని, నృత్యంలో పదవిన్యాసం సరిగా ఉండటానికి ఉపయోగించే పదాలు.

**ధిమ్మనిమ్రోయు** చూ. ధిమ్ము.

**ధిమ్మను** చూ. ధిమ్ము.

**ధిమ్ము** వి. **1.** మద్దెల ధ్వనికి అనుకరణం. కువ.చ. 2.109 ; **2**. ఫిరంగుల ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788.

**ధిమ్మనిమ్రోయు** అ.క్రి. గట్టిగామ్రోగు. <ధిమ్ము + -అను + -ఇ[13] + మ్రోయు. **ధిమ్మను** అ.క్రి. గట్టిగామోగు. విష్ణుపు. 1.74. <ధిమ్ము + అను.

**ధిస్సనపడగయెత్తు** (-ఎత్తు[1]) అ.క్రి. వేగంగా పడగఎత్తు. కళా. 4.202.

**ధుమధుమ** వి. కోపం. ధ్వన్యను.

**ధుమధుమలాడు** అ.క్రి. కోపించు. <ధుమధుమ + -లు + ఆడు.

**ధుమర్** వి. లేతనీలంవన్నె.

సం. ధూమ్రయ-. పొగ వన్నెకలది, నలుపు ఎరుపు కలిసిన వన్నె.

<సం. ధూమ్రమ-.

**ధూకళి** వి. నృత్య విశేషం. బసవ. 3.62.

**ధూతడకాఎగరగొట్టడం** చూ. తడాకా ఎగురగొట్టు. వి. పెద్దగా అరుపులతో అల్లరిచెయ్యడం. ధూంధ్వన్యనుకరణశబ్దం.

**ధూత్తరికే** వి. **1**. చీదరింపు ; **2**. అదలింపు.

సం. ధూర్త-. మోసగాడు, శఠుడు.

**ధూపటము** వి. పొగరంగు బట్ట. కు.సం. 4.15.

సం. ధూమ-. పొగు, పట-. బట్ట.

<సం. ధూమపట-.

**ధూపార** విణ. ధూపార్హమైన, పొగవేయదగిన. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1073.

సం. ధూపార్హ-. పొగవేయతగిన.

<సం. ధూపార్హ-.

**ధూపారతి** వి. ధూపానికి ఉపయోగించే పాత్ర. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 215.

సం. ధూప-. పొగ.

<సం. ధూప-. + ఆరతి (మిశ్రస.).

**ధూపావసరము** వి. ధూపసేవ, కొలువు. ద.హిం.శా.సంపు. 5.

శా.సం. 129. క్రీ.శ. 1422.

సం. ధూప-. పౌగ, అవసర-. సమయం.

<సం. ధూపావసర- (అర్థవిపరి.).

**ధూప్‌చాయ్** వి. పడుగుపేకలకు వేర్వేరు వన్నెల నూలు వాడి నేయటం.

హిం. ధూప్‌ఛాహ్. అనేక రంగులుగల.

<హిం. ధూప్‌ఛాహ్.

**ధూప్‌చావ్‌చీర** రూ.చూ. దూప్చాయ్ చీర. వి. నిలువుపోగులు ఒకరంగువి, పేకపోగులు ఒకరంగువి పెట్టి నేసిన రెండు రంగుల కలనేత చీర.

**ధూము** వి. ఆందోళనం. రంగా.చ. 3.203.

హిం.ఉ. ధూమ్. అలజడి, ఉపద్రవం.

<హిం. ధూమ్.

**ధే** వి. గుర్రం మొ. జంతువుల్ని తోలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. జైమినిభా. 4.77.

**ధోటి** వి. సరిచేయటానికి ఉన్నిపడుగు చాపినప్పుడు, సరితాడు బిగింపుకు వేసిన వంకర కట్టె.

**ధోటికట్టె** రూ.చూ. దోఁటికట్టె. వి. **1**. ఉన్నిమగ్గం చివర వేసిన వంకర కర్ర; **2**. కంపల్ని కోసి లాగటానికి కొనలో కత్తిని అమర్చిన పొడుగాటి కర్ర.

**ధోతి** రూ.చూ. దోవతి. వి. మగవాళ్ళు కట్టుకొనే బట్ట.

**ధోతులచాపు** రూ. ధోతుల్చాపు. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట.

**ధోతులచాపు** చూ. ధోతి.

**ధోవతి** రూ.చూ. దోవతి. వి. మగవాళ్ళు కట్టుకొనే బట్ట.

**ధోవతిజోడా** రూ. దోవతిజోడ. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండుపంచెల నేతబట్ట. **ధోవతులజోడా** రూ. దోవతులజోడా. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట.

**ధోవతులజోడా** చూ. ధోవతి.

**ధ్వజాయం** వి. సంసారుల ఇంటి కొలత.

సం. ధ్వజ. తూర్పున ఉండే గృహం.

# న

**-న్**[1] రూ. -ని[1]. -ను[1]. ప్రత్య. ద్రు. ద్వితీయా విభక్తి ప్రత్యయం. **1**. తృతీయార్థంలో ద్వితీయ. భార. ఆది. 1.3; **2**. ద్వితీయార్థంలో. భార.ఆది. 1.7; **3**. సప్తమ్యర్థంలో. భార. ఆది. 1.17; **4**. (షష్టివర్ణకం పరమయినప్పుడు) హేత్వర్థకంలో. భార. ఆది. 2.58; **5**. షష్ఠ్యర్థంలో. జైమినిభా. 7.19.

<మూ.ద్రా. *(అ)న్.

**-న్**[2] రూ. -ను[2]. ప్రత్య. ద్రు. తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనం. భార. ఆది. 1.5.

<మూ.ద్రా. *-ఉమ్.

**-న్**[3] రూ. ని[2]. -ను[3]. ప్రత్య. ద్రు. ఉత్తమ పురుషైక వచన ప్రత్యయం. భార. ఆది. 1.10. నేను శబ్దంలోని ఆద్యక్షరం లోపించి ప్రత్యయంగా ఏర్పడి ఉంటుంది.

**-న్**[4] రూ.చూ. ఉను. ప్రత్య. ద్రు. సముచ్చయార్థకం.

**-న్**[5] రూ. -ను[5]. ప్రత్య. ద్రు. తుమర్థభావలక్షణార్థాల్లో వచ్చే ప్రత్యయం. భార. ఆది. 4.80.

<మూ.ద్రా. *-అ. తెలుగులోని నకారం మూ.ద్రా. *-అకు తర్వాత చేరింది.

**-న్**[6] ప్రత్య. ద్రు. ప్రథమాంతాలైన అస్మద్విశేషణాలకు ప్రాయికంగా వచ్చే అంతాగమం. భార. ఆది. 1.94. నేను శబ్దంలోని ఆద్యక్షరం లోపించి అంతాగమంగా ఏర్పడి ఉంటుంది.

**న**[1] వి. అల్పప్రాణ నాద దంత్యాను నాసికం. ఆధునికోచ్చారణంలో దంతమూలీయోచ్చారణం కలిగి ఉంది. ఇది పదమధ్యంలో తకారంతోకాని దకారంతోకాని సంశ్లిష్టతను పొందినప్పుడు దంత్యోచ్చారణను కలిగిఉండి దంతమూలీయనకారానికి సవర్ణంగా ఉంది.

<మూ.ద్రా.న్.

**న**[2] వి. తూమెడు (భూమి) అనటానికి గుర్తు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 1227.

**-న**[1] అప. **1**. ఉదంతాలకు ఋకారాంతాలకు ఏకత్వంలో కు, కై, కయి ప్రత్యయాలు పరమైనప్పుడు వచ్చే ఆగమం. భార. ఆది. 1.19; **2**. షష్ఠీసప్తమీ తత్పురుషల్లో ఉదంత జడవాచకాలకు వచ్చే ఆగమం. భార.ఆది. 2.174; **3**. కంటె, అందు వర్ణకాలూ, ద్వితీయైక వచనం పరమైనపుడు ఉదంత జడవాచకాలకు వచ్చే ఆగమం. భార.ఆది. 4.93.

**-న**[2] ప్రత్య. గుణవాచకాలైన నల్ల, ఎర్ర మొదలైన శబ్దాలకు భావార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం.

**-న**[3] ప్రత్య. కొన్ని ధాతువుల మీద వచ్చే కృత్ప్రత్యయం.

**నకచికిని** వి. క్షుపకృతువు, లతావిశేషం (Sentipeda Orbiculeris).

**నకనక** విజ. **1**. కలతపొందిన, వ్యాకులపడిన. భాగ. 6.275; **2**. మందమైన. ప్రబోధ. 5.59; **3**. కృశించిన. సన్నని. కవిక. 6.84; **4**. బడలిన, అలసిన. రాజవా. 3.114; వి. **1**. అలయిక, బడలిక. రామాభ్యు. 3.90; **2**. కృశత్వం. కార్శ్యం; **3**. ఆకలితో ఉన్నప్పుడు కడుపులో కలిగే బాధకు అనుకరణం, ధ్వన్యను.

**నకనక కుడుచు** అ.క్రి. కృశించు. కళా. 4.105.

**నకనకపడు** రూ.చూ. నకనక(బడు. అ.క్రి. ఆకలితో బాధపడు. **నకనక(బడు(-పడు)** రూ. నకనకపడు. అ.క్రి. ఆకలిచే బాధపడువాడు. కృశించు. భార. శాంతి. 3.506. **నకనకలాడు** అ.క్రి. 1. కృశించు. అష్టమ. క. 1.43. ప. 2. పం. ; 2. ఆకలిచే బాధపడు. <నకనక + -లు + ఆడు. **నకనకలు** వి.బ.వ. కార్శ్యం, సొటసొట. మను. 3.28. **నకనకలుగుడుచు(-కుడుచు)** అ.క్రి. నలుగు, అలయు. కళా. 4.86.

**నకనారాయణ** వి. చిన్న ఆకులూ పసుపుకలిసిన ఎరుపురంగు పూలూ ఉన్న తెల్లని చిన్న మొక్క (Indigoferra Wightill).

**నకరనర్రలు** వి. ఒకరకం కలుపుమొక్క (Poa Ciliata).

**నకరపురుషుడు** చూ. నకరము[1].

**నకరపువాడ** చూ. నకరము[1].

**నకరము**[1] రూ. నగరము. వి. వర్తక సంఘం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 115. క్రీ.శ. 1144.

సం. నగర-. పట్టణం.

<సం. నగర-.

**నకరపురుషుడు** వి. వర్తకగణ నాయకుడు. ద.హిం.శా. సంపు. 6. శా.నం. 136. క్రీ.శ. 1419. **నకరపువాడ** వి. వర్తక సంఘం కాపురం ఉన్న నగర ప్రాంతం. ద.హిం.శా. సంపు. 5. శా.నం. 1005. క్రీ.శ. 1102.

**నకరము**[2] వి. దేవాలయం. ద.హిం.శా. సంపు. 5. శా.నం. 1083. క్రీ.శ. 1108.

సం. నగర-. పట్టణం.

**నకరానవీడు** చూ. నకరము[2]. వి. నగరు, దేవాలయం. ద.హిం.శా. సంపు. 5. శా.నం. 1245. క్రీ.శ. 1293.

**నకరు** వి. తెలియనిది, అజ్ఞాతం.

ఉ. నకిరా. అజ్ఞాతం ; పార. నకిరహ్. తెలియకుండ ; అర. నకిరహ్. అపరిచయం.

<ఉ. నకిరా.

**నకలు** వి. ఒకదానిని చూసి రాసినది, అనుకరణం.

హిం. నకల్. అనుకరణం, నక్‌ల్. మరా. నకల్. నక్కల. అనుకరణం ; ఉ. నకల్. ప్రతిలిపి, అనుకరణం. నకీల్ ; పార. నక్‌ల్. భాషాంతరీకరించటం, నకీల్ ; అర. నక్‌ల్. అనుకరణం.

<ఉ. నకల్.

**నకషా** వి. నమూనా.

హిం. ఉ. నకశ్, నక్ష్, నక్శా. చిత్రం. ప్రతిరూపం.

<ఉ. నక్శా.

**నకాముకా** చూ. నఖముఖములు. క్రి.విశ. ముందూ వెనకా.

**నకాముకాల** అవ్య. అన్ని వైపులా.

**నకారసుడిగాడు** వి. 1. నియోగి. నిరననగా కొన్ని వర్గాల్లో అనే మాట, నియోగికి సంకేతం ; 2. నకారగుడి 'ని' అనే అక్షరం.

**నకారప్రయోగముచేయు** అ.క్రి. లేదను.

సం. న. లేదు.

**నకాశీ** రూ.చూ. నకాసీ. విశ. నగిషీపని చేయబడిన.

**నకాష్** వి. రంగుపని చేసేవాడు.

హిం. ఉ. నకాశ్‌నా, నకాస్‌నా. క్రి. రాయి. మొ॥ వాటిని తీసుకొని పని చేయటం, నకాశీ, నకాసీ, నగిషీ పని.

<ఉ. నకాశ్.

**నకాసి** రూ.చూ. నకాసీ. విశ. నగిషీపని చేయబడిన. హంస. 1.69.

**నకాసీ** రూ. నకాశీ, నకాసి, నకిషీ, నక్శా, నక్షీ, నఖాసి, నగాసు, నగిషీ, నగ్ష, నవిషీ. విశ. నగిషీపని చేయబడిన. సత్య. సాం. 4.9 ; వి. చెక్కడపుపని.

హిం. నక్‌శా. నమూనా ; మరా. నకాశా. ; ఉ. నక్‌శా. ఆకృతి, విధం, స్థితి, నమూనా, నక్ష్. నగిషీ చేయబడ్డ వస్తువు ; పార. నక్‌ష్. చిత్రలేఖనం, నక్‌షా,

<ఉ. నక్ష్.

**నకిరె** రూ.చూ. నఖరె. వి. కాయలేర్పడటానికి ముందు పూచే పూలు.

**నకిలీ** రూ. నకీలు. విశ. 1. కపటంతో కూడిన ; 2. కలుషమైన ; వి. అనుకరణం, ప్రత్యంతరం.

హిం.ఉ. నక్‌లీ. కృత్రిమంగా చేయబడ్డ.

<ఉ. నక్‌లీ.

**నకిలీకాల్పు** వి. కుండలు కాలీకాలని స్థితి.

**నకిషీ** రూ.చూ. నకాసీ. వి. చెక్కడపుపని. ఇందు. 6.126.

**నకీపు** రూ.చూ. నకీబు. వి. చోపుదారుడు. వేత్రధరుడు. పరమ. వి. 3 ఆ.

**నకీబు** రూ. నకీపు. వి. వేత్రధరుడు, చోపుదారుడు. వరాహ. 9.112.

హిం. నకీబ్. చారణుడు ; ఉ. నకీబ్. ; పార. నకీబ్. బిరుదు గద్యలు చదివి దర్శనార్థులను ప్రభువుకు పరిచయంచేసేవాడు ; అర. నకీబ్. చోపుదారు, చారణుడు.

<ఉ. నకీబ్.

**నకీలు** రూ.చూ. నకిలీ. వి. అనుకరణం, ప్రత్యంతరం.

**నకెర** రూ.చూ. నక్కెర[1]. వి. రక్తోర్వారువు, ఎర్రదోస.

**నకెరకేసరి** వి. ముళ్ళులేని ఒకరకం కంచెమొక్క (Cordia Obliqua).

**నక్క** చూ. నక్కు. వి. 1. జంబుకం, ఒక జంతువు. భార. సభా. 2.181 ; 2. మోసగాడు, జిత్తులమారి ; విశ. చిన్న.

క. నరి, నక్కె. నక్క ; కొడ. నరి. ; తు. నరి. ; త. నరి. నక్క, పులి, నరిప్పు. నక్కలక్షణాలు, నక్కన్. నక్క ; మ. నరి. నక్క, పులి ; కో. న్రయ్. నక్క ; తొ. నరి. ; కువి. నక్క, నక్ప. ; కొలా. నక్క.

**నక్కకుద్రాక్షపండ్లుపుల్లన** వి. దొరకని వస్తువులు చేదనే పలుకుబడి. **నక్కకొమ్ము** వి. ఒకవిధమైన మూలిక. మను. 4.14. **నక్కకోర** వి. ఒకవిధమైన గడ్డి (Panicum Glaucum). **నక్కగన్నవా(డెల్లవేటకా(డు** వి. నక్కను చూచినవాడు వేటకాడు కాడు అనేటప్పటి పలుకుబడి. శుక. 1.266. **నక్కచార** వి. నక్కమాదిరి మసరరంగు చార.

**నక్కచిక్కులమారి** వి. 1. దుష్టులాలు. చెన్న బసవ. 2.24 ; 2. నక్కచిక్కులుకలవాడు, దుష్టుడు. **నక్కజిత్తులు** వి.బ.వ.

మోసాలు. నక్కటక్కులు వి.బ.వ. మోసాలు, నక్క జిత్తులు. పాండు. 3.48. నక్కతోఁక వి. 1. నక్కతోకలాగ ఉండే గడ్డి, క్రోష్టవిన్న. హంస. 5.44 (Ecbolium Linnaemum); 2. నక్కయొక్క తోక. ప్రబంధ. 200. నక్కతోఁకకసవు వి. సింహపుచ్ఛి, నక్కతోకపొన్న. ఆం.భా. 2.55. నక్కతోఁకగడ్డి రూ. నక్కతోఁగ్గడ్డి. వి. పశువుల మేతకు పనికివచ్చే గడ్డి (Setaria Pallidifuscor), (Setaria Glauca). నక్కతోఁకత్రొక్కివచ్చు అ.క్రి. కలసివచ్చు. నక్కతోఁకపొన్న వి. నేలపొన్న. ఆం.భా. 2.55 (Urarialagopoides). నక్కతోఁకబియ్యము వి. ఒకరకం ధాన్యం. నక్కతోఁగ్గడ్డి రూ.చూ. నక్కతోఁకగడ్డి. వి. పశువుల మేతకు పనికివచ్చే గడ్డి. నక్కదోస వి. చిన్న దోస. ఆం.భా. 2.71. నక్కదోసకాయ వి. చిన్నదోసకాయ. నక్కనడుముత్రొక్కు అ.క్రి. అదృష్టం కలుగు. నక్కనరం రూ.చూ. నక్కనరము. వి. రోడ్లపక్కను బంజరునేలల్లోను 3 అడుగుల ఎత్తు గుబురుగా పెరిగే ఒకరకం కలుపుమొక్క (Indian Squill, Sulla Indica). నక్కనరము రూ. నక్కనరం. వి. ఒక దినుసు వేరు. నక్కనారు వి. గులాబి రంగు పూలూ, సూదిగా ఉండే కాయలూ ఉండి మూడు అడుగులు పెరిగే గట్టి చిన్నమొక్క. నక్కనుతొక్కివచ్చు అ.క్రి. అదృష్టం కలుగు. నక్కనుద్రొక్కి వచ్చినవాఁడు విణ. అప్రయత్నంగా ఎక్కువ లాభం పొందినవాడు. నక్కనుద్రొక్కు (-త్రొక్కు) అ.క్రి. అదృష్టంవచ్చు. నక్క నెత్తురుతెగులు వి. ఆకులు ఎర్రబడే వరితెగులు. నక్కనేరెడు వి. కాకినేరెడు. నక్కనేరేడికంప వి. చెమ్మనేలల్లో పొదగా పెరిగే కలుపుమొక్క (Ardisia Humilis). నక్కనేరేడు వి. కక్రేగు, అడవుల్లోనూ కొండల్లోనూ చిన్న ఆకుల్తో పెరిగే మొక్క (Flacourtia Ramontchi). నక్కనైచ్యం వి. జిత్తులమారితనం. నక్కనోట్లోదుమ్ముకొట్టు అ.క్రి. చచ్చేంతపనై బతికి బయటపడు. నక్కపల్లము వి. దొంగ నేల, దొంగఇసుక. నక్కపిట్ట వి. ఒకరకం అడవిచెట్టు. నక్కపుట్టచెట్టు వి. ఎర్రగన్నేరు పూలరంగు గల రెండడుగుల ఎత్తువరకు పెరిగే ఓషధీవిశేషం (Justica Procumbens). నక్కపులి వి. చిరుతపులి. నక్కపూటిక వి. ఎర్ర చెక్కు నేలల్లో బాగా పెరిగే కలుపుమొక్క (Andropogon Monticola). నక్కపెంటాకు వి. చెట్టు మొదళ్ళ బుడిపెలుండి నేలను అంటుకొని పెరిగే కలుపుమొక్క. <నక్క పెంటి + ఆకు. నక్కపోతు వి. మగనక్క. భార.కర్ణ. 2.35. నక్కబొక్కలు వి.బ.వ. తప్పులు. నక్కముదిరి వరడయినట్లు అవ్య. బాగా విషయం ముదిరిపోవు. నక్క మూతులు చూ. నల్లమోతులు. వి.బ.వ. గోదావరి తీరాల్లో పండే ముక్కు నల్లగాఉండే సన్నరకం వడ్లు. నక్కమైల వి. మసరరంగు పొడ. నక్కమొక్కజొన్న వి. పెద్దకండె వేసే మొక్కజొన్న. నక్కమోరు వి. 1. కుదరని కంత. రామలిం. శ. 73; 2. మూత్రావయవం వాపు. నక్కఁబగ్గానంబట్టినయట్లు అవ్య. గట్టిగా బంధించినట్లు. ఉ.హరి. 4.65. నక్కయెక్కడ నాకలోకమెక్కడ అవ్య. అలభ్యమైన వస్తువును ఆశించటం. నక్కరి వి. ఒకరకం గడ్డి. నక్కరేఁగు రూ.చూ. నక్కరేను. వి. ఒకరకం రేగు. నక్కరేణ వి. గజనిమ్మ. ఆం.భా. 2.45. నక్కరేని వి. ముళ్ళుండే ఒక చెట్టు (Canthium Didymum). నక్కరేను రూ. నక్కరేఁగు. వి. ముదురు బూడిదరంగు కలిగిన బెరడు కలిగిన పెద్దచెట్టు. దీని కర్ర ఇల్లు కట్టుకోవటానికీ, పడవల తయారీకి ఉపయోగపడుతుంది (Artocorpus Lakoaha). నక్కరేలకాయ తినునట్లు అవ్య. మంచిది కాదని తెలిసినా మానకున్నట్లు, నక్క రేలకాయల్ని తిని కడుపునొప్పి పొంది ఇక రేలకాయల్ని తినకూడదని నిర్ణయించుకొని కడుపునొప్పి తగ్గగానే మళ్ళీ వాటినే తింటుంది. నక్కరోజుకోడె వి. రొప్పుతూ నడిచే కోడె. నక్కలవాళ్లు విణ.బ.వ. ఊరూర తిరిగి బ్రతికే ఒకజాతి. నక్కవగురు రూ. నక్కొగురు. వి. ఒకరకం ఊపిరితిత్తుల జబ్బు. నక్కవినయము వి. కపట వినయం. నక్కవిరిగి వి. శేలుభేదం. క్షుద్రశేలువు. ఆం.భా. 2.45. నక్కవెంపలి వి. పచ్చని పువ్వులూ పదునుగా ఉండి గట్టిగా ఉన్న కాయలూ పదునుగాఉండే ఆకులూ గల గట్టిమొక్క (Stylosanthas Mucronata). నక్కేఋ వి. ఒకానొకచెట్టు. <నక్క + ఏఋ. నక్కొగురు రూ.చూ. నక్కవగురు. వి. ఒకరకం ఊపిరి తిత్తుల జబ్బు.

నక్కకట్టె చూ. నక్కు[1]. వి. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగా పెట్టిన కొయ్య.

నక్కగూటం చూ. నక్కు[1]. వి. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగ(ల) కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం.

నక్కచీల చూ. నక్కు[1]. వి. అద్దూన బండి పరాన్ని దోని మొద్దుకు బిగించే చీల.

నక్కనరేగు వి. కక్రేగు, అడవుల్లోనూ కొండల్లోనూ చిన్న ఆకులతో పెరిగే మొక్క (Flacourtia Ramontchi).

నక్కని వి. ముళ్ళుండే ఒక చెట్టు (Canthium Didymum).

నక్క (లు) చూ. నక్కు[1]. వి. బండిదొలుపు కింద నొగ(ల)ను బిగించిన కర్ర (లు).

నక్కపిడతలు రూ.చూ. లక్కపిడతలు. వి.బ.వ. చిన్నపిల్లలాడుకోడానికి చిన్నసైజులో చేసే రకరకాల మట్టి కొయ్య మొ॥ వాటితో చేసిన పాత్రలు.

నక్కసురాయి చూ. నక్కు వి. పూజలువేసిన సైస్కూజా.

నక్కాగడము వి. ఎర్రని కలప కలిగి ఎర్రని తినేపళ్ళు కాసే ఒక చెట్టు (Antidesma Menasa).

నక్కిని వి. ముళ్ళుండే ఒక చెట్టు (Canthium Didymum).

నక్కిర చెట్టు వి. కర్పుదారం, ఒకపెద్దచెట్టు (Cordia Angustifolia).

నక్కిరి[1] రూ. నక్కెర[3], నక్కెరు[1]. వి. తెల్లనిపూలు కలిగి అనేక రకాలుగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Cordia Myra).

నక్కిరి[2] వి. కోడిగుడ్డు ఆకారంలోఉన్న ఆకులూ ముదురు నారింజరంగు ఎరుపు కలిసిన రంగుగల తినే పళ్ళూ, పసుపు కలిసిన ఎరుపురంగున్న పట్ట కలిగి ముళ్ళున్న పెద్దపొద (Timenia Americana).

**నక్కిరి**[3] వి. ముళ్ళుండే ఒకచెట్టు (Canthium Didymum).

**నక్కిళ్లపూజచేయు** చూ. నక్కు.

**నక్కిళ్లు** చూ. నక్కు.

**నక్కిళ్లుఎఱగగొట్టు** చూ. నక్కు.

**నక్కిళ్లుకఱచు** చూ. నక్కు.

**నక్కిళ్లువడు** చూ. నక్కు.

**నక్కిళ్లువడు** చూ. నక్కు,

**నక్కీఅంచు** చూ. నకాసీ. వి. చీరచివర నేసే ఒకరకం అంచు.

**నక్కు** వి. **1.** బంగారాన్ని ఖండించగా మధ్యలో కనపడేనిగ్గు. బసవ. **4.364.** పం. ; **2.** బంగారం బిళ్ళ, బంగారం ముక్క బసవ. 5.303పం ; **3.** క్ర్ర మొ॥ వాటి అతుకు ; **4.** నాగటికఱ్ఱు ; **5.** రాతిని చెక్కటానికి గుంటలు కొట్టటానికి పనికివచ్చే శంక్వాకారపు ఉక్కు పరికరం ; **6.** చెక్క బిగింపుకు వాడే చిన్నకొయ్యమేకు ; **7.** పెద్దరాతిబండల నుంచి పొరలు పొరలుగా రాతిపలకల్ని వేరుచేయటానికి కొలత ప్రకారం పగలగొట్టటానికి గుర్తుగా గీచినగీత ; **8.** పిసినిగొట్టు ; అ.క్రి. **1.** దాగు. సిం. ద్వా. 11.51 ; **2.** ఒదుగు ; స.క్రి. దాచు.

క. *నక్కు*. ఒదుగు, దాగు ; త. *నఱుక్కు* (*నఱుక్కి-*). జారిపోవు, తప్పించుకొను, *నఱువు* (*నఱువి-*). ఇటు అటుతోయు, దాచు ; కొలా. *నడి-* (*నడిత్-*). దాచు, *నడస్- నర్స్-*. దాగు.

**నక్కిళ్లపూజచేయు** స.క్రి. తన్ను ; **నక్కిళ్లు** వి.బ.వ. అంకిళ్లు. పక్కపళ్లకీళ్ళు, దౌడకీళ్ళు, త. *నక్కల్*. <నక్కు+కీలు+-లు. **నక్కిళ్లుఎఱగగొట్టు** స.క్రి. చితక తన్ను, **నక్కిళ్లుకఱచు** అ.క్రి. నోరుముడుచుకొనిపోవు వర. రా. యు. పు. 305. పం. 9. **నక్కిళ్లువడు** రూ. నక్కిళ్లువడు. అ.క్రి. **1.** నిరుత్తరుడగు. భార. అను. 5.345 ; **2.** దౌడకీళ్ళు కదలకుండు. **నక్కిళ్లుపడు** (-వడు) రూ.చూ. నక్కిళ్లుపడు. అ.క్రి. **1.** దౌడకీళ్ళు కదలకుండు. బసవ 6పు. 975పం. ; **2.** నిరుత్తరుడగు, **నక్కురాయి** వి. రాతితో కట్టిన ఆర్చీ మధ్యలో బలంకోసం బిగించిన పెద్దరాయి. **నక్కురాతు** వి. రాతితో కట్టిన ఆర్చీ మధ్యలో బలంకోసంబిగించిన పెద్దరాయి.

**నక్కె** రూ.చూ. నక్కెర[2]. వి. కంది.

**నక్కెన** వి. ముళ్ళుండే ఒకరకం చెట్టు. (Canthium umbellatum).

**నక్కెర**[1] రూ. నకెర. వి. ఎఱ్ఱదోన.

**నక్కెర**[2] రూ. నక్కె. వి. కంది, తొగరి.

**నక్కెర**[3] రూ.చూ. నక్కిరి[1]. వి. అనేకవిధాలుగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Cordia Myxa).

**నక్కేర** రూ. నక్కేరు[2], నగరి[1]. వి. కోడిగుడ్డు ఆకారంలో ఉన్న ఆకులూ, ముదురు నారింజరంగు, ఎరుపు కలిసిన రంగుకల తినేపళ్ళు, పసుపు కలిసిన ఎరుపు రంగున్న బెరడు కలిగి ముళ్ళున్నచెట్టు (Ximenia americana).

**నక్కేరు**[1] రూ.చూ. నక్కిరి[1]. వి. అక్కడక్కడ తోటల్లో పెంచే పళ్ళ చెట్టు (Cordia Myxa).

**నక్కేరు**[2] రూ.చూ. నక్కేర. వి. కోడిగుడ్డు ఆకారంలో ఉన్న ఆకులూ, ముదురు నారింజరంగు, ఎరుపు కలిసిన రంగుకల తినేపళ్ళు, పసుపు కలిసిన ఎరుపురంగున్న బెరడు కలిగి ముళ్ళున్న చెట్టు. (Ximena americana).

**నక్కొఱు** చూ. నక్క.

**నక్కొగురు** చూ. నక్క.

**నక్శా** రూ.చూ. నకాసీ. వి. కట్టుబడి. చెక్కడం పనుల అకారాన్ని సూచించే రేఖాచిత్రం.

**నక్షగూడు** చూ. నకాసీ. వి. అలంకరణ సామగ్రిని పెట్టుకొనే గూడు.

**నక్షత్రకుఁడు** వి. ప్రజల్ని అప్పుగురించి బాధించేవాడు.

నం. *నక్షత్రక-*. విశ్వామిత్రుని శిష్యుడు.

<నం. నక్షత్రక- (అర్థవిపరి.).

**నక్షత్రపుపేటు** రూ. నక్షత్రపేటు, నక్షత్రప్పేటు. వి. అంచుల్లో నక్షత్రపుచుక్క మాదిరిగా నేసిన డిజైను.

నం. *నక్షత్ర-*. తార, చుక్క.

<నం. నక్షత్ర-+-పు+పేటు.

**నక్షత్రపేటు** రూ.చూ. నక్షత్రపుపేటు. వి. అంచుల్లో నక్షత్రపు చుక్క మాదిరిగా నేసిన డిజైను.

**నక్షత్రప్పేటు** రూ.చూ. నక్షత్రపుపేటు. వి. అంచుల్లో నక్షత్రపు చుక్కగా నేసిన డిజైను.

**నక్షత్రమాట** వి. పాచికలతో ఆడే ఒకరకం ఆట.

నం. *నక్షత్ర-*. చుక్క.

<నం. నక్షత్ర-+-ము+ఆట.

**నక్షత్రాలవంకీ** వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

నం. *నక్షత్ర-*. చుక్క.

<నం. నక్షత్ర-+-ము+-లు+-అ+వంకీ.

**నక్షత్రాలు** రూ. నచ్చంత్రాలు. వి.బ.వ. పిచ్చికలు. పొన్నకాయలాగ గుండ్రంగా ఉండే చిన్నరకం బిచ్చుబుడ్లు.

నం. *నక్షత్ర-*. చుక్క.

<నం. నక్షత్ర-+-ము+-లు (అర్థవిపరి.).

**నక్షీ** రూ.చూ. నకాసీ. వి. చెక్కడపుపని. హంస. 3.181.

**నక్షీఅంచు** వి. నగిషీ ఉండే అంచు.

**నఖముఖములు** వి.బ.వ. అన్నిదిక్కులు.

నం. *నఖముఖ-*. గోళ్ళకొనలు.

<నం. నఖముఖ-+-ము+-లు.

**నఖరె** రూ. నకిరె. వి. కాయలేర్పడటానికి ముందు పూచేపూలు.

**నఖాసి** రూ.చూ. నకాసీ. విణ. నగిషీపని చేయబడినది. హంస. 4.109.

**నగ**[1] వి. **1.** బంగారు, వెండి మొ॥ పరిమితి విశేషం. ద.హిం. శా. సంపు. **4.** శా.సం. 765. క్రీ.శ. 1267 ; **2.** భూషణం. నృసింహ. 71 ; **3.** లోహపాత్ర ; **4.** పొగాకు, దూది మొ॥ వాటి కంట్లపుమూట ; **5.** సిద్దెలజోడు ; **6.** అంగీ ; **7.** ఎద్దుమీది బరువు.

క. *నగ*. భూషణం ; కొడ.తు. *నగ* ; త. *నకై*; మ. *నక్*.

**నగనట్రా** రూ. నగానట్ర. వి. సొమ్ములు. **నగనాణెము** వి. సొత్తులు. పార్వ. 5.92 ;

**నగలచప్పుడు** వి. వస్తువులమోత. **నగలు**[1] వి.బ.వ. గుళ్ళు, మండపాలు మొ॥ కట్టడాలకు తీర్చినరాళ్ళు. **నగానట్ర** రూ.చూ. నగనట్రా. వి. నగలు నాణ్యాలు.

**నగ**[2] రూ.చూ. నొగ. వి. **1**. నాగటికాడినీ పణతనీ కలిపే పొడుగు కఱ్ఱ; **2**. బండి డొలుపులో అమర్చిన లావుపాటి పలకలకొయ్య; **3**. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొదలైనవి కదలకుండా నిలపటానికి రెండు కఱ్ఱల్ని పైవైపున కట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు; **4**. గొఱ్ఱు, గుంటక మొ॥ వాటి దిండుకు బిగించి కాడిమీద మోసే పొడుగు కొయ్య.

**నగచీల** రూ. నొగచీల. వి. పణతలో దూర్చిన ఏడికోల ఊడకుండా చివరకొట్టే కొయ్య మేకు. **నగచుట్ట** వి. మగ్గం మీద నేతనేసి దోనెకు చుట్టిన బట్ట. **నగతాడు** వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి, పుల్లకు కట్టిన తాడు. **నగదోని** రూ.చూ. నగదోనె. వి. మగ్గం మీద నేసిన బట్ట చుట్టే కొయ్యదూలం. **నగదోనె** రూ. నగదోని. వి. మగ్గం మీద, నేసినబట్టచుట్టే కొయ్యదూలం. **నగమాను** వి. **1**. ఒంటినొగ బండికి డొలుపుకు అమర్చిన పొడుగాటి కొయ్య; **2**. బండి డొలుపులో అమర్చిన లావుపాటి పలకల కొయ్య. **నగలు**[2] రూ.చూ. నొగలు. వి.బ.వ. గొఱ్ఱుగుంటక మొ. వాటి దిండుకు బిగించి కాడిమీద మోసే పొడుగు కొయ్యలు.

**నగడ** వి. కొమ్ములకు అలంకారానికి తొడిగే కాకిబంగారపు రేకు.

**నగదు** వి. **1**. పైకం; **2**. చేతివెల, రొక్కం.

హిం. *నకద్*. నాణేల రూపంలో ఉన్న సొమ్ము. మరా. *నగద్*. సిద్ధంగా ఉన్న సొమ్ము; ఉ. *నకద్*. వెండి, బంగారునాణెం, రూపాయలు, పైసలు; పార. *నక్ద్*. ధనం; అర. *నక్ద్*. ధనం రూపంలో లెక్కించటం.

< ఉ. నకద్.

**నగరము** రూ.చూ. నకరము[1]. వి. వర్తక సంఘం.

**నగరమువారు** విణ.బ.వ. వర్తకసంఘంవారు. నె.శా. కందుకూరు. 25. క్రీ.శ. 1320.

**నగరసుకుండ** రూ.చూ. నగారాకుండ. వి. నగరా వాద్యానికి ఉపయోగపడే కుండ.

**నగరసుంకము** చూ. నకరము[2]. వి. దేవాలయానికి చెందే సుంకం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 419. క్రీ.శ. 1267.

**నగరాలు** చూ. నగరు. వి.బ.వ. **1**. పౌరులు. వేంక. పంచ. 1.711; **2**. ఆంధ్రదేశంలోని శూద్రులలో ఒక తెగవారు.

**నగరి**[1] రూ.చూ. నక్కెర. వి. కోడిగుడ్డు ఆకారంలో ఉన్న ఆకులూ ముదురు నారింజరంగు ఎరుపు కలిసిన రంగు కల తినేపళ్ళూ పసుపు కలిసిన ఎరుపురంగు బెరడు కలిగి ముళ్ళున్న పెద్ద పొద (Ximenia Americana).

**నగరి**[2] వి. వాసనకల తెల్లపూలూ నారింజరంగు గింజలున్న ఎఱ్ఱని పళ్ళూ తిన్నగా ఉండే ముళ్ళు కల పొద (Randia Malabarica).

**నగరిఅధికారి** చూ. నగరు.

**నగరికట్నము** చూ. నగరు.

**నగరికమతాలు** చూ. నగరు.

**నగరినాయంకులు** చూ. నగరు.

**నగరిపాలు** చూ. నగరు.

**నగరివారు** చూ. నగరు.

**నగరు** రూ. నవరు. వి.ఔ. **1**. అంతఃపురం. కు.సం. 4.22; **2**. సభాగృహం, కొలువుకూటం. భార.విరా. 5.315; **3**. రాజభవనం. రం.రా. అయోధ్యా. 128 పు. 16 పం.; **4**. గుడి, దేవగృహం. హర. 2.22.

తు. *నగఋ*, *నగరు*; త. *నకర్*. ఇల్లు, భవనం, రాజభవనం, దేవాలయం, నగరం; మ. *నకర్*. నగరం, పట్టణం.

పో.చూ. సం. *నగర-*. పట్టణం.

< మూ.ద్రా. *నకర్.

**నగరిఅధికారి** వి. స్థానపతి, దేవాలయ అధికారి. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 529. క్రీ.శ. 1320. **నగరికట్నము** వి. నగరివారికి చెల్లించే కానుక. నె.శా. ఒంగోలు. 132. క్రీ.శ. 1393. **నగరికమతాలు** వి.బ.వ. ప్రభుత్వంకావించిన కమ్మతం. నె.శా. నెల్లూరు. 124. క్రీ.శ. 1502. **నగరినాయంకులు** వి.బ.వ. రాజభవన రక్షకులు. నె.శా. పొదిలి. 6. క్రీ.శ. 1312. **నగరిపాలు** వి. ప్రభుత్వంపాలు. ద.హిం.శా. సంపు. 4, శా.సం. 810. క్రీ.శ. 1559. **నగరివారు** విణ.బ.వ. ప్రభువువారు. వేంక. పంచ. 4.511.

**నగరుతీగె** వి. పెద్ద ఆకులూ కాయలూ తెల్లని పూలూ కలిగి పాకే పెద్ద పొద (Millettia Racemosa).

**నగరుత్తు** వి. కుంకుమచెట్టు (Mallotus Philippinensis).

**నగవరి** చూ. నగవు.

**నగవు** చూ. నగు. వి. **1**. నవ్వు, హాసం. నిర్వ.రా. 4.92; **2**. వింత, ఆశ్చర్యం. కేయూ. 3.258; **3**. నర్మవచనం, పరియాచకం. భాస్క.రా. అరణ్య. 1.146; విణ. హాస్యాస్పదమైన, పరిహాస పాత్రమైన. కళా. 6.75.

**నగవరి** వి. **1**. పరిహాసకుడు. భాగ. 10 పూ. 293; **2**. నవ్వుకలవాడు. < నగవు + -అరి. **నగవుటీగి** వి. పరిహాసానికి ఇచ్చిన ధనం. విజ్ఞా. ప్రా. 28. < నగవు + ఈగి. **నగవుపట్టు** అ.క్రి. నవ్వులపాలగు. రాధా. 3.48. **నగవులాడు** అ.క్రి. నవ్వు. చంద్రాంగ. 2.6. < నగవు + లు + ఆడు.

**నగానట్ర** చూ. నగ[1].

**నగార** రూ.చూ. నగారా. వి. పెద్ద ఢంకా.

**నగారకుండ** రూ.చూ. నగారాకుండ. వి. నగారా వాద్యానికి ఉపయోగపడే కుండ.

**నగారా** రూ. నగార. వి. **1**. పెద్ద ఢంకా. రంగా.చ. 1.156; **2**. ఒక విధమైన చర్మవాద్యం.

ఒ. *నగార*; హిం.ఉ. *నగారా*. ఢంకా; గు. *నగారుం*; మరా. *నగారా*. నౌబత్తు, ఢంకా; పార. *నగారా*. ఢంకా; అర. *నకారా*. ఢంకా.

< ఉ. నగారా.

**నగారాకుండ** రూ. నగరనుకుండ, నగారకుండ, నగారికుండ, నగారుకుండ. వి. నగారా వాద్యానికి ఉపయోగపడే కుండ. **నగారాపుడి** వి. పౌరకనుడి స్థానంలో ఉండే జంట సుడి.

**నగారికుండ** రూ.చూ. నగారాకుండ. వి. నగారా వాద్యానికి ఉపయోగపడే కుండ.

**నగారుకుండ** రూ.చూ. నగారాకుండ. వి. నగారావాద్యానికి ఉపయోగపడే కుండ.

**నగాసు** రూ.చూ. నకాసీ. వి. చిత్రం.

**నగించు** చూ. నగు.

**నగిపించు** చూ. నగు.

**నగింపు** చూ. నగు.

**నగియించు** చూ. నగు.

**నగీర** వి. నక్కెర, వృక్షవిశేషం.

**నగిరికటకంబాజా** చూ. నగారా. వి. ప్రశస్తమైనబాజా.

**నగిరిగిత్త** వి. మైసూరురాష్ట్రపు పొట్టిగాఉన్న ఎద్దు.

**నగిషీ** రూ.చూ. నకాసీ. విశే. చెక్కడంపని చేయబడ్డది ; వి. **1**. చెక్కడంపని ; **2**. అంచులో డైమను గళ్లమాదిరిగా రెండు మూడు వరుసలలో నేసిన డిజైను.

**నగిషీచేయు** స.క్రి. మట్టిపాత్రలకు అలంకారంగా పూజలు చేయు. **నగిషీరాయి** వి. సానరాయి.

**నగు** రూ. నవు, నవ్వు, నౌ. స.క్రి. **1**. అపహసించు. గేలి చేయు. భార. ఆది. 1.37 ; **2**. తిరస్కరించు. కాశి. **6.126** ; అ.క్రి. **1**. నవ్వు, హసించు. భార.ఆది. **2.31** ; **2**. ఆనందించు. ఆము. **4.135**.

క. *నగు, నగె.* నవ్వు ; తు. *నకెరుని.* వెకిలిగానవ్వు, ముసిముసిగానవ్వు ; త. *నకు.* నవ్వు ; బ్రా. *ఖఖ్.* నవ్వు.

< మూ.ద్రా. నవ్-/ నకె- వ్-.

**నగించు** రూ.చూ. నవ్వించు. స.క్రి. **1**. నవ్వించు. హరి. పూ. 8.134 ; **2**. అపహసింపజేయు, ఎగతాళిచేయించు. వేంక. పంచ. 1.18 ; **3**. సంతసింపజేయు. వాల్మీ. 1.7. < నగు + -ఇంచు[3]. **నగిపించు** రూ.చూ. నగుపించు. స.క్రి. నవ్వించు. భార. శాంతి. 6.217. **నగింపు** వి. నవ్వించటం. భీమ. 4.60. **నగియించు** రూ చూ. నవ్వించు. స.క్రి. **1**. నవ్వించు ; **2**. సంతసింపజేయు ; **3**. అపహసింపజేయు, ఎగతాళి చేయించు. **నగుపించు** రూ. నగిపించు. స.క్రి. నవ్వించు. భార. విరా. 4.39. **నగుముద్దుమోము** వి. నవ్వుతో కలకలలాడే ముఖం. భార. 9.732. **నగుమొగము** వి. నవ్వుతో కలకలలాడే ముఖం. భార. ఉద్యో. **4.358**. **నగుమోము** వి. నవ్వుతో కలకలలాడే ముఖం. నిర్వ.రా. 8.59. **నగు(బాటు(-పాటు)** రూ. నవ్వు(బాటు. విశే. అపహాస్యకరమైన, ఎగతాళి చేయదగిన. నిర్వ.రా. 10.11 ; వి. **1**. అపహాసం, అపహాస్యత. భార. కల్యా. 2.68 ; **2**. దూరం. భార. ఆరణ్య. 6.30. **నగు(బాటుతెచ్చు** అ.క్రి. **1**. అవమానంతెచ్చు. ఉ.హరి. 1.64 ; **2**. అపహాస్య పాత్రత కలిగించు. ఉ.హరి. 2.96. **నగు(బాటుపెండ్లికి నా(డే నాగవల్లి** వి. హాస్యాస్పద కార్యం. **నగు(బాటువచ్చు** అ.క్రి. పరిహాస పాత్రమగు. నిరంకు. 2.52. **నగు(బాట్లపని** వి. హాస్యాస్పద కార్యం. **నగుసేయు(-చేయు)** స.క్రి. అపహసించు. కాళిందీ. 6.77.

**నగుడు** రూ. నవుడు. వి. ఎద్దుగిట్ట అరక్కుండా ఉండటానికి వేసే ఇనపబిళ్ళ.

**నగ్గు** అ.క్రి. నలినలిఅగు, ముక్కముక్కలగు, చూర్ణమగు. బసవ. **1.209** ; వి. తక్కువదనం.

క. *నెగ్గు.* ముక్కలుముక్కలగు, నాశనమగు ; తు. *నర్గుని.* ముక్కలుముక్కలగు, నుగ్గగు, పొడగు ; త. *నె(రి.* బద్దలగు, నుగ్గగు, *నరుకు.* చూర్ణమగు, పగులగొట్టు, ముక్కలుచేయు ; మ. *నెరియుక.* చూర్ణమగు, ముక్కలగు, *నెరిక్కు.* పగులగొట్టు, బద్దలుచేయు ; కో. *నగ్.* గంటుపడునట్లుచేయు.

**నగ్ష** రూ.చూ. నకాసీ. వి. **1**. విధానం, రూపం, పద్ధతి ; **2**. చెక్కమీదవేసే సున్నితమైన అలంకారం.

**నంకి** వి. చుట్టు గుడిసెల కప్పుకింది చట్రానికి పోతు, పెంటి వాసాలను తగిలించే పద్ధతి.

**నంకిరోదు** అ.క్రి. జంకు.

**నంకు** వి. పరిహాసం, నవ్వులాట. నృసింహ. 2.84 ; స.క్రి. నేలను కోరాడు.

త. *నంకు.*

**నంగ** విశే. సాహసపు పనిచేసి తెలియనట్లుండే స్వభావంకల.

సం. *నగ్న.* రజస్వలకాని పడుచు ; ప్రా. *ణగ్గ-.* వస్త్ర రహిత.

క. *నంగనాచి.* చతురురాలు ; మ. *నజ్ఞ.* పెళ్ళి కాని బాపనపడుచు.

< ప్రా. ణగ్గ-.

**నంగనాచి** వి. **1**. చతురురాలు. మను. 3.28 ; **2**. సాహసపు పనిచేసి ఏమీ తెలియనట్లుండే స్త్రీ. శుక. **1.47** ; **3**. పడ్లచిలక. క. *నంగనాచి* ; **నంగనాచిటుంగబుఙ్జ** వి. ఎత్తిపొడుపుగా అనేమాట. **నంగనాచితనము** వి. చతురత్వం. **నంగనాచి వంగముల్లు** వి. నంగనాచి. **నంగనాసికోళ్లు** వి.బ.వ. ఏమీఎరగనికోళ్ళు.

**నంగి** చూ. నంగు.

**నంగిమాట** చూ. నంగు.

**నంగిరి** చూ. నంగు. వి. వెకిలితనం.

**నంగిరిపింగిరిగాడు** వి. వెకిలిగా ప్రవర్తించేవాడు. **నంగిరోదుతూమాట్లాడు** స.క్రి. నంగినంగిగా మాట్లాడు.

**నంగిరోదుతూమాట్లాడు** చూ. నంగిరి.

**నంగు** అ.క్రి. ముక్కుతో మాటలాడు.

త. *నంగు.*

**నంగి** విశే. **1**. ముక్కుతో పలకబడే ; **2**. స్పష్టంకాని. **నంగిమాట** వి. ముక్కుతో మాటాడినమాట.

**నచ్చచెప్పు** చూ. నచ్చు[1].

**నచ్చతొట్టి** చూ. నకాసీ. వి. పూలమొక్కలు పెంచడానికి వాడే నగిషీతొట్టి.

**నచ్చంత్రాలు** రూ.చూ. నక్షత్రాలు. వి.బ.వ. పిచ్చికలు, పొన్నకాయలాగ గుండ్రంగా ఉండే చిన్నరకం చిచ్చుబుడ్లు.

**నచ్చాపనచ్చలు** వి.బ.వ. లక్షోపలక్షలు.

సం. లక్షోపలక్ష-. అసంఖ్యాకమైన.

<సం. లక్షోపలక్ష- + -లు.

నచ్చిక చూ. నచ్చు[1].

నచ్చికము చూ. నచ్చు[3].

నచ్చికలుబుచ్చికలుచేయు చూ. నచ్చు[1].

నచ్చికొట్టు చూ. నచ్చు[3]. వి. ఒకరకం మందు (Coccolus Indicus).

నచ్చిగ చూ. నచ్చు[1].

నచ్చినవాఁడు చూ. నచ్చు[1].

నచ్చు[1] స.క్రి. నమ్ము. కు. సం. 12.15. అ.క్రి. 1. నమ్మకం కలుగు, విశ్వాసయుక్తమగు. నిర్వ. రా. 7.65 ; 2. హిత మగు, ఆప్తమగు, రుచించు. భీమ. 1.31 ; 3. సక్తమగు, లగ్నమగు. భాగ. 10పూ. 1702.

క. నచ్చు, నర్చు, నెచ్చు. నమ్ము, కోరు, ప్రేమ, నమ్మకం, కోరిక, కాంక్ష. త. నచ్చు (నచ్చి). కోరు, కాంక్షించు, ఇష్టపడు, ప్రేమించు, (-ప్-, -న్ద్-). ప్రేమించు, కోరు. నత్తు (నత్తి). కోరు. ఆశ్యాసపడు, ప్రేమ ; కో. నచ్ (నబ్-). గొప్పగా ఇష్టపడు, కోరు, నచ్ల్. ఒకవ్యక్తి అంటే ఉండే కోరిక.

<మూ. ద్రా. *నయ్-చ్చ్-*నయ్-/*నెయ్.

నచ్చచెప్పు స.క్రి. నచ్చేటట్లుచెప్పు. నచ్చిక రూ. నచ్చిగ. వి. నమ్మిక. వసు. 3.119. క. నచ్చికె, నచ్చిగె ; త. నచ్చు. నచ్చికలు బుచ్చికలుచేయు స.క్రి. మాటలతో బేలుపుచ్చు. చంద్రాంగ. 3.45. నచ్చిగ రూ.చూ. నచ్చిక. వి. నమ్మిక. నచ్చినవాఁడు విశే. ఆప్తుడు. ఆం. భా. 2.187.

నచ్చు[2] రూ.చూ. నొచ్చు. స.క్రి. బాధించు. వరాహ. 2.48 ; వి. బాధ.

నచ్చుకాఁడు వి. 1. అలసుడు, మందుడు ; 2. బాధకుడు, పీడించేవాడు ; 3. నచ్చుమనిషి ; త. నచువల్. హింసపెట్టేవాడు. నచ్చుకుప్ప వి. నచ్చుగొట్టు, బాధకుడు. నచ్చుగొట్టు వి. బాధించే స్వభావం కలవాడు. నచ్చుపెట్టు స.క్రి. తొందరపెట్టు, బాధించు.

నచ్చు[3] వి. మాంద్యం, అలస్యం. చంద్రరే. 1.71.

త. నచ్చు. ఆలస్యంచేయు, ఆలస్యం.

నచ్చికము రూ. అచ్చికము. వి. కొరత, లోపం. విజయ. 1.67. త. నచ్చిక. నచ్చుపని వి. చిదుగుపని. నచ్చు మనిషి వి. ఏదీ నిశ్చింతగా తేల్చుకోలేని మనిషి.

నచ్చౌకం వి. నాలుగు భుజాలూ సమాన పరిణామంలో ఉన్న చతురస్రం.

<నలు + చౌకము.

నజరానా రూ. నజరాని. వి. రాజులకిచ్చే కానుక.

హిం. ఉ. నజ్‌రానా. కానుక ; పార. నజ్‌రానహ్. కానుక.

<ఉ. నజ్‌రానా.

నజరాని రూ.చూ. నజరానా. వి. కానుక.

నజరు రూ. నద్దరు. వి. 1. కానుక. రంగా. చ. 2.84 ; 2. సౌందర్యం ; 3. నమ్మకం.

హిం. ఉ. నజర్. దృష్టి. కానుక ; మరా. నజర్. కానుక ; పార. నజర్ ; అర. నజర్గ్, నజర్.

<ఉ. నజర్.

నజరుకడ్డీ వి. పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క.

నజరుబందీ వి. దృష్టి పథం.

హిం. ఉ. నజర్‌బందీ. దృక్పథం ; పార. నజర్. బందీ.

<ఉ. నజర్‌బందీ.

నజీబు విశే. మంచి. మల్హణ. 2.48 ; వి. కులీనుడు.

హిం. ఉ. నజీబ్. కులీనుడు, ఉత్తమకులుడు ; మరా. నజీబ్. సైన్యంలో ఒకభాగం ; పార. నజీబ్, నజీబత్, నజీబా. మంచి ; అర. నజీబ్. సర్దారు.

<ఉ. నజీబ్.

నజుగుజులుచేయు చూ. నజ్జుగుజ్జు స.క్రి. మోటుగాతోయు.

నజ్జు రూ. నఙుజు, నుజ్జు. వి. నలి, చిన్నముక్క, అల్పఖండం. మను. 3.38 ; విశే. 1. మిక్కిలి నలిగిన. సమీర. 3 247 ; 2. తలబరువు ; 3. మెతక, మెత్తన.

క. నజుగు. ముద్దగాచేయు, నొక్కు, మెత్తగాచేయు, నజ్జు. ముద్దగాఉన్న స్థితి ; తు. నసీయుని. అదీనంచేయు, లొంగు, అణగు. నెసపుని. కిందికిఅణచు, గట్టిగాబిగించు ; త. నచి (-వ్-,-న్ద్-). ముక్క ముక్కలుగాచేయు, (-ప్ప్-,-త్-). నొక్కు, నలుపు, పిండు. నచియల్. నొక్క బడినది లేక నలగగొట్టబడినది. నచివ్వ్. నలగగొట్టు, నష్టం, గాయం. నచుక్కు (నచుక్క-). నొక్కు, పిండు, ముక్కలుచేయు, పాడుచేయు, నై (-వ్-,-న్ద్-). నలగ గొట్టబడిన, నశించిన ; కుఇ. నస (నసి-). నొక్కు, ముక్కలుచేయు ; నహి, నహికి. పాడైనది, నశించినది.

నజ్జగఁజేయు (-చేయు) స.క్రి. ముద్దగాచేయు. మను. 3.38. నజ్జుచేయు రూ.చూ. నజ్జుసేయు. స.క్రి. 1. కలత పొందించు. సారంగ. 1.101 ; 2. నలగగొట్టు, ముక్క ముక్కలు చేయు. నజ్జనజ్జగాఁజేయు (-చేయు) స.క్రి. చిన్న చిన్న ముక్కలుగాచేయు. నజ్జనజ్జలగు అ.క్రి. నుగ్గునుగ్గగు, ముద్దముద్దగు. కవిక. 4.181. <నజ్జు + నజ్జు + -లు + అగు. నజ్జుసేయు (-చేయు) రూ. నజ్జుచేయు. స.క్రి. నలగ గొట్టు, ముక్క ముక్కలుచేయు. మార్క. 8.104.

నంచు రూ.చూ. నంజు[1]. స.క్రి. కూరలు మొ॥ వ్యంజనాలు తిను ; వి. కూరలు మొ॥ వ్యంజనాలు.

నంచుకొను రూ.చూ. నంజికొను. స.క్రి. కూరలు మొ॥ వ్యంజనాలు తిను. బహుళా. 4.50.

నంజ[1] రూ.చూ. నంజు[1]. వి. నంజుకొనే వస్తువు. ఉపదంశం. పారి. 2.52.

నంజ[2] రూ.చూ. నంజె. వి. మాగాణి భూమి.

త. నంచై.

నంజనేల వి. తడినేల.

నంజ[3] రూ.చూ. లంజియ. వి. వ్యభిచారిణి, రంకుటాలు.

నంజికొను చూ. నంజు[1].

నంజిలి చూ. నంజు[1]. వి. సంకోచం.

నంజిలిపడు అ.క్రి. సంకోచపడు. కుచే. 1.108.

నంజు[1] రూ. నంచు. నంజ[1]. స.క్రి. 1. కూరలు మొ॥ వాటిని నంజుకొను. భార. అను. 2.378 ; 2. భక్షించు. భాగ. 10ఉ 883 ; వి. కూరపచ్చడి మొ॥ వ్యంజనం. క్రీడా. 167.

క. నఞ్జు, నఞ్చు. నంజుడు, ఆహారంతో నంజు కోడానికి ఉపయోగించే ఊరగాయ ; కొలా. నెన్జెన్. మాంసం, కూరగాయలు ; నాన్జూడ్, నాఞ్జుళ్. మాంసం ; నాయి. నెన్జుడ్, నెన్జెన్. ఏదైనా ఆహార పదార్థం వేసి కాచిన చారు.

నంజికొను రూ. నంచుకొను, నంజుకొను. స.క్రి. 1. తిను, భక్షించు. భార. కర్ణ. 2.109 ; 2. కూరలు మొ॥ వ్యంజనాలు తిను. ఘటికా. 2.146 ; 3. ఆస్వాదించు. క. నంజు. నంజుకొను రూ.చూ. నంజికొను. స.క్రి. 1. కూరలు మొ॥ వ్యంజనాలు తిను. కాళ. 4.93 ; 2. ఆస్వాదించు ; 3. తిను, భక్షించు. నంజుడు వి. 1. మాంసం. భార. ఆరణ్య. 2.197 ; 2. వ్యంజనం, పచ్చడి ; 3. కూర. నంజుడుతిండి రూ.చూ. నంజుడు దిండి. వి. రాక్షసుడు. నంజుడుదిండి(-తిండి) రూ. నంజుడుతిండి. వి. 1. రాక్షసుడు. అచ్చ.రా.బాల. 154 ; 2. మాంసం తినేవాడు. నంజుడుముక్క వి. మాంసపు ముక్క. నంజుడుమేపరి వి. రాక్షసుడు. అచ్చ.రా.యు. 372. నంజుడ్లు వి.బ.వ. పచ్చళ్ళు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1323. క్రీ.శ. 1115.

నంజు[2] వి. 1. విషం. మను. 5.50 ; 2. శరీరం నీరు పట్టటం, నీరుజబ్బు.

క.త. నంజు. విషం.

నంజువాఱు(-పాఱు) అ.క్రి. నీరుపట్టు, ఉబ్బు.

నంజె రూ.చూ. నంజ[2]. వి. కాలవ, చెరువు మొ॥ వాటి నీటితో సాగుచేసే నేల.

నటంగు వి. వెనుగాడిని మోసే పెద్ద గుజ్జు.

సం. నట-. దుండిగవృక్షం.

నటనమిగులు అ.క్రి. విలసిల్లు, అధికంగా ఉండు. కాశీ. 2.50.

నం. నటన-. అభినయించటం, కపట ప్రవర్తన, నాట్యం.

<నం. నటన- + మిగులు.

నటపలిక వి. తల రుద్దేటప్పటి సంస్కార విశేషం. రాజవా. 5.53.

నటవాలు రూ. నట్వాలు. వి. అశ్వగతి విశేషం.

సం. నట-. నర్తించేది.

నట్ట[1] వి. పాచిక, సారె, జూదంలోకాయ. భోజ. 7.130.

నట్ట[2] విశ. మధ్యనున్న.

తు. నట్టు. మధ్య ; త. నట్టు-నటు. సరిగా మధ్య భాగం ; కో. నటు-నడ్వ్.

<మూ.ద్రా. నట్ట్.

నట్టకనడిరేయి రూ.చూ. నట్టకనడురేయి. వి. అర్ధరాత్రి. నట్టకనడుము వి. సరినడుము. నట్టకనడురేయి రూ. నట్టక నడిరేయి. వి. సరిఅయిన అర్ధరాత్రి. వేంక. పంచ. 1.259. నట్టకోఁతి వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

నట్టడవి వి. అరణ్య మధ్యభాగం. భాగ. 10 పూ. 1054. నట్టనడితెరువు వి. మార్గమధ్యం, మధ్యేమార్గం. ఉ.రా. 3.22. నట్టనడు విశ. మధ్యనున్న. కాశీ. 7.155. నట్టనడుము వి.ఔ. నడుము యొక్క సరయిన మధ్యభాగం. భీమ. 4.110. క. నట్టు-నడు సరిగా మధ్యభాగం ; తు. నట్టు. మధ్య ; త. నట్టు-నటు. సరిగా మధ్యభాగం ; కో. నటు-నడ్వ్. సరిగా మధ్యభాగం, నడికె.ర్. కోతగ్రామంలో మూడు భాగాల్లో మధ్యభాగం. నట్టనడురే రూ.చూ. నట్టనడురేయి. వి. సరిఅయిన అర్ధరాత్రి. క్రీడా. 60. నట్టనడురేయి రూ. నట్టనడురే. వి. సరిఅయిన అర్ధరాత్రి. కాశీ. 6.58. నట్టపిప్పి వి. వరి, జొన్న మొ॥ పైర్ల తెగులు. నట్టింటదేవళ్లపెట్టు స.క్రి. దేవపూజలుచేయు. <నట్టిల్లు + -అ[7] + దేవళ్లపెట్టు. నట్టింటిపగవాఁడు విశ. హితశత్రువు. విజయ. 3.46. <నట్టిల్లు + -ఇ[6] + -పగ వాఁడు. నట్టింటిశత్రువు వి. 1. సమీప శత్రువు. పి.శకు. 4.167 ; 2. గృహ మధ్యంలోని శత్రువు. నిత్యశత్రువు. సం. శత్రు-. విరోధి. <నట్టిల్లు + -ఇ[6]- + సం. శత్రు- నట్టిల్లు వి.ఔ. 1. గర్భగృహం. భీమ. 5.88 ; 2. గృహ మధ్య భాగం. ఆము. 4.91 ; 3. ఇంటి మధ్యగది. <నట్ట[2] + ఇల్లు. నట్టెండ వి. తీక్షణంగా కాసినఎండ. పి.శకు. 2.112. <నట్ట[2] + ఎండ. నట్టేటఁద్రోయు స.క్రి. పరిత్యజించు, విడుచు. దశా. 1.132. నట్టేటముంచు స.క్రి. ఒక వ్యవహారంలో దించి అందులో చిక్కులు ఎక్కువయి నప్పుడు వదిలివేయు. పల్నా.వ. 111. <నట్టేఱు + -అ[7] + ముంచు. నట్టేటికెదురీఁదు అ.క్రి. మిక్కిలి కష్టం పొందు. వరాహ. 2.53. <నట్టేఱు + -ఇ[6]- + -కు + ఎదురు + ఈఁదు. నట్టేఱు వి.ఔ. ఏటిమధ్యం, నదీమధ్యం. శృం.నై. 7.151. <నట్ట[2] + ఏఱు.

నట్టతెగులు చూ. నాటు. వి. ఆరిక, వరి మొ॥ వాటి తెగులు.

నట్టవ రూ.చూ. నట్టువుడు. వి. నట్టువకాడు, వేశ్యాది జనాలకి నాట్యం నేర్పేవాడు. ద.హిం.శా. సంపు. 5. శా. సం. 1225. క్రీ.శ. 1349.

నట్టాడు చూ. నట్టు[3].

నట్టారికె వి. ఒకరకం ఆహారధాన్యం (Paspalum Frumentaceum).

నట్టి చూ. నట్ట[2]. వి. గర్భగృహం.

నట్టించు చూ. నట్టు[3].

నట్టింటదేవళ్లపెట్టు చూ. నట్ట[2].

నట్టింటిపగవాఁడు చూ. నట్ట[2].

నట్టింటిశత్రువు చూ. నట్ట[2].

నట్టిల్లు చూ. నట్ట[2].

నట్టు[1] అ.క్రి. అడ్డు, ఆగు ; వి. 1. ఆలస్యం ; 2. ఆటంకం, అడ్డు ; 3. పంచుకున్న నేలలో ఒక భాగం ; 4. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టికట్ట ; 5. పొలంలో పడ్డ వాననీళ్ళతో మన్నుకొట్టుకు పోకుండా అడ్డుగా పోసిన కట్ట.

నట్టుకొట్టు అ.క్రి. 1. సంకోచించు, సందేహించు. వెనుదీయు. కళా. 7.170 ; 2. ఆలస్యం చేయు ; స.క్రి.

అడ్డుకొను, నిరోధించు. రాజవా. 3.121. నట్టుచెందు అ.క్రి. ఎండిపోవు. నట్టుపడు అ.క్రి. నిరుద్ధమగు, అడ్డుపడు. నట్టుపఱుచు స.క్రి. అడ్డుకొను, నిరోధించు. కృ.శకు. 2.74.

నట్టు$^{2}$ వి. 1. స్థానం, ప్రదేశం. భీమ. 3.19 ; 2. దేశం, విలాతి. భోజ, 2.5 ; 3 పొలం, క్షేత్రం. చంద్రభా. 9.103 ; 4. నివాసస్థానం, గృహం, జాహ్న. 1.35 ; 5. గృహప్రదేశం, ఇంటిపట్టు. ఆం.భా. 3.45.

క. నడు(నట్ట్), నెడు(నెట్ట్). గట్టిగా అతికించు, పాతు, ప్రవేశించు, గుచ్చుకొనిపోవు, నడిసు, నెడిసు. నేలలో నిలబడేటట్లు చేయు, పాతు, ప్రవేశపెట్టు, నడె. గట్టిగా, స్థిరంగా, నెడిగె. నేలలో పాతబడిన స్తంభం లేక రాట, నెడె. స్థిరంగా ఉంచబడిన, పాతబడిన ; కొడ. నడి- (నడిప్-, నట్స్-). పాతు (రాట, మొక్క). న.టి. నారు వేరొకచోట నాటడం ; త. నడియుని. పాతవలసినది, నారు వేరొకచోట పాతడం, నడ్పుని, నెడ్పుని, నెడిపిన. పాతు, నట్టి. పాతడం, వేరొకచోట నారు పాతడం ; త. నటు (నటువ్-, నట్ట్-). నరి చేయు (స్తంభం, రాట మొ॥నవి) పాతు. స్థలం, స్థాపించు (కీర్తి), నటల్. పాతడం, నటవు, నటవై. నారు వేరొకచోట నాటడం, నాట్టమ్. స్థాపించడం ; మ. నటుక. అతుకు, పాతు, ప్రవేశించు, పొడుచు, నటువిక్క, నటివిక్క. పాతడం, నారు పాతడం, నటు, నటువల్. నటల్. పాతడం, నారు నాటడం, నటిచ్చల్, నటిల్. నారు నాటడం, నట్టి. నారుమడి ; కో. నడ్- (నట్-). నేలలో పాతడం, నారు నాటడం, న.టి. నాటడానికి సిద్ధంగాఉన్న వరి, రాగి నారు.

< మూ.ద్రా. *నట్.

నట్టుక వి. అటక. నట్టుకొను రూ.చూ. నెట్టుకొను. అ.క్రి. నివసించు, నెలకొను. హర. 3.15.

నట్టు$^{3}$ రూ.చూ. నట్టువుడు. వి. 1. నర్తకుడు, నటుడు ప్రభా. 1.107 ; 2. నాట్యం ; 3. నాట్యోపాధ్యాయత్వం, నాట్యం నేర్పటం.

నట్టాడు అ.క్రి. 1. నర్తించు, నాట్యంచేయు. భాగ. 9.608 ; 2. చలించు ; 3. తోచక తిరుగు. < నట్టు$^{3}$ + ఆడు. నట్టించు అ.క్రి. నటించు, క్రీడించు, ఆడు. ఉ.హరి. 4.256. < నట్టు$^{3}$ + -ఇంచు$^{3}$. నట్టుద్రొక్కు (-త్రొక్కు) రూ.చూ. నట్టువద్రొక్కు. అ.క్రి. నాట్యమాడు. నట్టుపులు(గు వి. నాట్యంచేసే పక్షి, నెమిలి. నట్టువా(డు విశ. నట్టువుడు, నటుడు. విజ్ఞా.ప్రా. 116. నట్టుసేయు (-చేయు) అ.క్రి. 1. పెంపొందించు. నిరంకు. 1.45 ; 2. నాట్యోపాధ్యాయత్వంచేయు.

నట్టు$^{4}$ వి. 1. గరికలాగ నిస్సారమవటం, శుష్కించటం. ధర్మ. 2.76 ; 2. తృణవిశేషం, దూర్వ, గరికగడ్డి ; 3. వికృతి, మార్పు : 4. సస్యరోగవిశేషం ; 5. మట్టిశుప్ప.

క. నట్టు. విస్తరించుకున్న రకరకాల గడ్డివేళ్ళు.

నట్టులుదున్ను స.క్రి. భూమిలోని నట్టూ అదీ బాగా దున్ను. చంద్రభా. 9.103. నట్టువడు (-పడు) అ.క్రి. వికృతిపొందు. ఉ.హరి. 3.135.

నట్టు$^{5}$ వి. 1. మరమేకులు బిగించటానికి పనికివచ్చే సాధనం ; 2. మగ్గం కుమ్ములాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల ; 3. ఇనపశీల.

ఇం. *Nut*. సీల.

< ఇం. Nut.

నట్టుగుద్దలి వి.బా. ఒకవైపే పొడుగాటి పలుగున్న గుద్దలి.

నట్టుగు(డు రూ.చూ. నట్టువుడు. వి. నాట్యం నేర్పేవాడు, నాట్యోపాధ్యాయుడు.

నట్టువ రూ.చూ. నట్టువుడు. వి. 1. నటి. కాశ. 4.181 ; 2. నాట్యం. యయా. 4.13 ; 3. నాట్యం నేర్పేవాడు, నాట్యోపాధ్యాయుడు. ప్రబంధ. 48 ; 4. నటుడు. శుక. 3.20.

నట్టువకా(డు వి. ఆటకాడు, నర్తకుడు. హంస. 5.134. నట్టువచావడి వి. నాట్యశాల. నట్టువద్రొక్కు (-త్రొక్కు) రూ. నట్టుద్రొక్కు. అ.క్రి. నాట్యంచేయు, చలించు. జాహ్న. 1.146. నట్టువపక్కి వి. నట్టుపులుగు, నాట్యం చేసే పక్షి, నెమిలి, మయూరం. అచ్చ.రా.యు. 588. నట్టువపిట్ట వి. నాట్యంచేసే పక్షి, నెమలి. రసిక. 3.94. నట్టువపులు(గు రూ.చూ. నట్టువపుల్గు. వి. నెమలి, నర్తనప్రియం. నట్టువపుల్గు రూ. నట్టువపులు(గు. వి. నాట్యం చేసే పక్షి. అచ్చ.రా.అరణ్య. 85. నట్టువముట్టుకా(డు వి. నాట్య పరికరాలు కలవాడు. పాంచాలీ. 1.39. నట్టువ్రద్దొక్కు అ.క్రి. నాట్యంచేయు, చలించు. సింహ.శ. 15. < నట్టువ + -లు + త్రొక్కు. నట్టువొజ్జ వి. నాట్యోపాధ్యాయుడు, నృత్యం నేర్పేవాడు. భార.విరా. 1.242. < నట్టువ + ఒజ్జ. నట్టువోజు వి. నాట్యోపాధ్యాయుడు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 663. < నట్టువ + ఓజు.

నట్టువము నాట్యం. వి. నాట్యం.

సం. నాట్య, నర్త ; ప్రా. నట్ట, ణట్టం. నాట్యం, ణట్టుఅ. నాట్యం చేసేవాడు, ణట్టుగ, ణట్టార, ణట్టియా. నర్తకి, ణట్టి. నటజాతి ; అ.మా. ణట్టుగ, ణట్టుయ. నర్తకుడు, ణట్టియా. నటి, నర్తకి ; పా. నచ్చ. నృత్యం, అప. నృత్యం ;

క. నటువ, నట్టువ. నటుడు, నర్తకుడు, నట్టువొజ్జ. త. నట్టువమ్ ; మ. నట్టుల, నట్టువన్, నట్టువుడు ; బ్రా. నాట్.

< ప్రా. ణట్టఅ.

నట్టువాలు వి. బాలక్రీడ.

నట్టువుడు రూ. నట్టు$^{3}$, నట్టుగు(డు, నట్టువ, నట్టువు(డు. వి. నాట్యకర్త. ద.హిం.శా.సం. 5. శా.సంపు. 1188. క్రీ.శ. 1250.

సం. నట-. నటుడు.

క. నట్టువ ; తు. నట్టువన్ ; త. నట్టు.

< సం. నట-.

నట్టువు(డు రూ.చూ. నట్టువుడు. వి. నటుడు, నాట్యంచేసేవాడు. ఉ.హరి. 4.256.

నట్టువొజ్జ చూ. నట్టువ.
నట్టువోజు చూ. నట్టువ.
నట్టె చూ. నట్టువ. వి. సంతోషంతో చేసే నాట్యం. చంద్రాంగ. 3.45.
నట్టెండ చూ. నట్ట[2].
నట్టెము వి. భిక్షాపాత్రం. ద్వి.పరమ.వి. 2.82.
నట్టేటఁద్రోయు చూ. నట్ట[2].
నట్టేటముంచు చూ. నట్ట[2].
నట్టేటికెదురీఁదు చూ. నట్ట[2].
నట్టేఱు చూ. నట్ట[2].
నట్లతెగులు చూ. నట్టతెగులు. వి. ఆరిక, వరి మొ॥ వాటితెగులు.
నట్లొట్లు వి.బ.వ. 1. జలధార మొ॥ నిరంతరంగా పడి ఉడిగిన తర్వాత అక్కడ నిలిచి పడే బొట్టు. మను. 3.111 ; 2. చూరునుంచి పడిన నీటిబొట్లు. ఆం.భా. 1.75.
నట్వాలు రూ. చూ. నటవాలు. వి. అశ్వగతి విశేషం.
నడ రూ. నడక, నడత, నడతి, నడిత, నడ్తి. వి. 1. నడక, గమనం. భార. ఆది. 2.156; 2. అశ్వగతి విశేషం. భాస్క.రా. బాల. 30 ; విణ. నడచే (ది).

క. నడె (నడద్). నడచు, క్రమంగా అడుగులువేస్తూ నడవడం, నడగె. నడక, నడతె ; కొడ. నడ-. (నడప్-, నడన్ద్-.). నడచు ; తు. నడపుని. నడచు, నడపావుని. నడిచేట్టు చేయు, నడె. నడక, నటు (-ప్ప -, -న్త్ -). నడచు, జరుగు ; త. నటుక్కై. నడక, ప్రవర్తన, నటుప్పు. వెళ్ళటం, రావటం, నటై. నడక, కదలిక ; మ. నటుక్క. నడచు, ముందుకువెళ్లు, ప్రవర్తించు, కృతకృత్యత నొందు, నటుత్త. నడక, నటుప్పు. నడవడం, నటు. నడక, నటుక. నడవడం ; కో. నడ్వ. (నఙ్-). నడచు, అగు, తొ. నడ్. అడుగు, నడిచేపద్ధతి ; కొం. నా. దాటు ; కుఇ. డ్రాప (డ్రాత్). పైకి అడుగువేయు, పొంగు, అడుగు, నిశ్చలనం, దడి ; కొలా. అడ్గ్ (అడక్-) నడచు ; నాయ. అడ్గ్. నడచు.
<మూ.ద్రా.*నట్

నడకొండ రూ. నడగొండ. వి. నడకగలకొండ. భార. భీష్మ. 1.130. నడకొలఁకు వి. దిగుడుబావి. యయా. 3.57. నడగఁడు వి. 1. అశ్వవిశేషం, ఒక జాతిగుర్రం. పి.శకు. 2.8 ; 2. గుర్రం. సాంబ. తిర్య. 71. నడగొట్టు (-కొట్టు[1]). అ.క్రి. నిలుచు. భీమ. 2.157. నడగొండ(-కొండ) రూ.చూ. నడకొండ. వి. నడకగల కొండ. మను. 4.47. నడగోట(-కోట) వి. నడకగల కోట. ప్రభా. 1.64. నడజోదు వి. పదాతి, కాల్బంటు. ఉ.హరి. 4.229. నడతాడి వి. నడకగలతాడి. ప్రబోధ. 3.20. నడతీవ వి. నడకగల తీగ. హర. 3.69, నడతెగు అ.క్రి. నడక తెగినదగు, క్రాంతమగు, డయ్యు. పి.శకు. 2.8. నడతెంచు అ.క్రి. 1. వచ్చు. కు.సం. 8.67 ; 2. పోవు. భార.భీష్మ. 1.114 ; 3. తిరుగు. భార. భీష్మ. 2.33. నడత్రోవ వి. నడక కుపయోగించే మార్గం. చంద్రాంగ. 1.56. నడదివియ రూ. నడదీవియ. వి. కరదీపిక, దీపిక, కాగడా. భార. విరా. 5.320. నడదీఁగె(-తీగె) వి. నడకగలతీగె. రం.రా.ఉ. 110. ఉ. 10. పం. నడదీవియ రూ.చూ. నడదివియ. వి. కరదీపిక, దివిటీ, కాగడా. శృం.నై. 6.80. నడనిచ్చు స.క్రి. నడవనిచ్చు. కళత్త్వ. 5.10. నడపందిరి వి. నడకగల పందిరి. ప్రయాణ సమయంలో రాజులు మొ. వారి ఉపచారం కోసం పరిచారకులు మోసుకొనిపోయే పందిరి. బసవ. 2.162 పం. నడపీనుఁగు వి. నడిచేశవం. భార. శాంతి. 1.49. నడబందాలువేయు అ.క్రి. పోనీకుండా అరికట్టు, బందాలువేయు. నడబావి వి. నడిచిపోవటానికి మెట్లు ఏర్పరచిన బావి, దిగుడుబావి. దీర్ఘిక. పను. 1.66. నడమంత్రపుకల్మి వి. మధ్యవచ్చిన సంపద. విజయ. 1.99. నడమంత్రపుసిరి వి. మధ్యవచ్చిన సంపద. నడమంత్రము వి. మధ్య వచ్చినది. రాధా. 5.100. నడమామిడి వి. నడకగల మామిడిచెట్టు. భార. భీష్మ. 3.223. నడయాడు (-ఆడు) అ.క్రి. 1. విహరించు. కు.సం. 10.56 ; 2. నడచు, సంచరించు. దశకు. 8.85 ; 3. వీచు, వీతెంచు. సమీర. 2.93 ; 4. ఉండు, నివసించు. శుక. 3.502. నడయూట(-ఊట) వి. గతి, నడుపు. 'నడలింగమూర్తి వి. నడకగల లింగం, చరలింగం. కాళ. 1 35. నడవడి[1] రూ. నడపడిక, నడువడి. వి. 1. ప్రవర్తనం, నడవడిక. నిర్వ. రా. 10.149 ; 2. ధర్మం, న్యాయం. భార. శాంతి. 2.257 ; 3. గమనం. నడక. పె.శకు. 1.43 ; 4. జీవిక, వృత్తి. ఆం.భా. 2.228. నడవడిక రూ.చూ. నడవడి వి, ప్రవర్తన. నడవడి. త. నటువటిక్కై. నడవడికాఁడు వి. ప్రవర్తనకలవాడు. ప్రబంధ. 634.
నడక రూ.చూ. నడ. వి. 1. గమనం. భీమ. 4.46 ; 2. ప్రవర్తనం. రామాభ్యు. 6.161 ; 3. వృత్తి, జీవనోపాయం. ఆం.భా. 2.228.
నడచియాడు చూ. నడచు.
నడచు రూ. నడుచు, నడ్చు. అ.క్రి. 1. నిర్వహించు. బుడమ నారాయలపాడు. క్రీ.శ. 650 ; 2. గమనం చేయు, చరించు. కు.సం. 6.30 ; 3. (గ్రానం) గడచు. నెరవేరు, సిద్ధించు. భార. ఉద్యో. 2.45 ; 4. జరుగు. భార. ఉద్యో. 3.326 ; 5. పోవు. వెడలు. భార. ఉద్యో. 4.244 ; 6. ప్రవర్తించు, నడచుకొను. నె.శా. కందుకూరు 83. క్రీ.శ. 1526, 7. నిశ్చయపరచు. నె.శా. కందుకూరు. 83. క్రీ.శ. 1526. 8. చెల్లు. HAS 13.39 ; 9. ప్రవర్తించు. కాశీ. 2.50 ; 10. ఉండు. రాఘవ. 4.71 ; 11. కవియు. రాఘవ. 4.216.

క. నడె, నడి. నడచు, నెరవేరు, సిద్ధించు, చెలామణి అగు. చెల్లు ; తు. నడపుని. నడచు, ప్రవర్తించు ; త. నటు. నడచు, పోవు, ప్రవర్తించు, జరుగు. నటుత్తు. నడిపించు ; మ. నటుక్క. నడచు, నెరవేరు, సిద్ధించు ; ప్రవర్తించు ; కో. నడ్వ. నడచు, ముందుకుపోవు. జరుగు, తొ. నడ్. నడచు, నడ్తె. నిర్వహించు, నడ్జె. నడిపించు ; కుఇ. డ్రాప (డ్రాత్-.) ముందడుగువేయు, పొర్లు ; కొలా. ఉడ్గె. నడచు ; నా. అర్గ్. నడచు ; బ్రా. న్కర్. పరుగెత్తు.
<మూ.ద్రా. *నట్-.

**నడచియాడు(-ఆడు)** అ.క్రి. ప్రవర్తించు, ఉండు. కాశీ. 2.50.

**నడత** రూ.చూ. నడ. వి. నడవడి, ప్రవర్తనం. నరస. 1.70.

**నడతి** రూ.చూ. నడ. వి. నడవడి, ప్రవర్తనం.

**నడపాడు** చూ. నడపు.

**నడపాడుప్రాయము** చూ. నడపు.

**నడిపించు** చూ. నడపు.

**నడపు** చూ. నడచు. రూ.చూ. నడుపు. స.క్రి. **1**. ఆచరించు. భార. ఆది. 2.176 ; **2**. పోషించు. భార. ఆది. 8.305 ; **3**. నియమాన్ని పాటించు. కు.సం. 4.24 ; **4**. ప్రవర్తింపజేయు. భార. విరా. 1.193 ; **5**. జరుపు. భార. శాంతి. 1.84 ; **6**. ఇచ్చు. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 633. క్రీ.శ. 1262 ; **7**. పొందు. హరి.ఉ. 2.178 ; **8**. నెరవేర్చు. శివరా. 1.111 ; **9**. గమనింపజేయు. విక్ర. 5.84 ; **10**. సమకూర్చు. కళా. 6.81 ; వి. గమనం, నడక. కు.సం. 8.12.

**నడపాడు** రూ. నడుపాడు. అ.క్రి. నడచు. సంచరించు. కు.సం. 3.14. < నడపు + ఆడు. **నడపాడు ప్రాయము** వి. కాళ్ళువచ్చి తిరుగు ప్రాయం. పండి.చ.ద్వితీ. 4.164 ప. **నడపించు** రూ. నడిపించు. స.క్రి. **1**. గమనింపజేయు, చరింపజేయు. నిర్వ.రా. 1.79 ; **2**. ప్రవర్తిల్లజేయు. కాశీ. 6.31. < నడపు + -ఇంచు[3]. **నడపుకొను** రూ.చూ. నడుపుకొను. స.క్రి. పోషించుకొను. విప్ర. 4.65. **నడపుట** వి. ఉత్తేజం.

**నడమ అడ్డపట్టె** రూ.చూ. నడుమ అడ్డపట్టె. వి. మరమగ్గం చట్రంలో మేరువు పలకకు కిందకాని నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర.

**నడమపట్టెకారు** చూ. నడుము. వి. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళను మధ్యఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి.

**నడమరేవు** రూ.చూ. నడిమిరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

**నడము** వి. గుడిసెల గోడలుగా ఉపయోగపడే చెట్టు (Saccharum Arundinaceum).

**నడవ** రూ. నడవడి, నడవా, నడువ. వి. **1**. సేతువు. భాస్క. రా.యు. 252 ; **2**. సోపానం, మెట్టు. కవిక. 4.113 ; **3**. మార్గం. ఆం. భా. 2.8 ; **4**. అళిందం, తలవాకిటికి నడిమి వాకిటికి నడిమిచోటు ; **5**. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవటానికి విడిచినదారి.

క. నడవ. అళిందం ; త. నటవై. మార్గం, మెట్టు, నడై. అళిందం.

**నడవడి**[2] రూ.చూ. నడవ. వి. **1** సింహద్వారానికి ముందున్న అరుగుల మధ్యగాఉన్న నడిచేదారి ; **2**. సింహద్వారానికి దానికి ఎదురుగా ఉన్న వాకిలికీ మధ్యఉన్న నడిచేదారి ; **3**. బట్టీదగ్గర నడవడానికి బాగుచేసిన చోటు.

**నడవా** రూ.చూ. నడవ. వి. **1**. సింహద్వారానికి ముందున్న అరుగులమధ్యగా ఉన్న నడిచేదారి ; **2**. సింహద్వారానికి దానికి ఎదురుగా ఉన్న వాకిలికీ మధ్యఉన్న నడిచేదారి ; **3**. బట్టీదగ్గర నడవడానికి బాగుచేసిన చోటు.

**నడి** రూ.చూ. నడుము. వి. **1**. నడుముకి వృత్తిలో కలిగే నడిమి అనే రూపంలో మీది వర్ణం లోపించగా మిగిలినది ; **2**. మధ్యం ; **3**. తాటికమ్మనుంచి తీసిన తడప, పేనిన నార ; **4**. నడుము.

**నడికచ్చు** వి. చుట్టింటి లంకెవాసాలను తగిలించే పీట, తామర్లపీట. **నడికట్టు** వి. కాసె, దట్టీ, నడుముకట్టు. పల్నా. పు.17. **నడికట్టుతాడు**[1] వి. ఊడ్తెఅడ్డపట్టెకు మధ్య వేసిన తాడు. **నడికట్టుతాడు**[2] వి. ఏనుగు మొ॥ వాటి నడుముకు కట్టే తాడు. కళా. 8.86. **నడికలను** వి. యుద్ధరంగంయొక్క మధ్యభాగం. పల్నా. పు. 90. **నడికాలపుమనిషి** వి. మధ్యవయసు మనిషి. **నడికిడితాడు** రూ.చూ. నడికెడితాడు. వి. ఊడ్తెఅడ్డపట్టెకు మధ్యవేసినతాడు. **నడికింతాడు** రూ.చూ. నడికెడితాడు. వి. ఊడ్తెఅడ్డపట్టెకు మధ్యవేసిన తాడు. **నడికిరే** రూ.చూ. నడ్కిరేయి. వి. అర్ధరాత్రి. భార. ఆరణ్య. 7.322. **నడికిరేయి** రూ.చూ. నడ్కిరేయి. వి. అర్ధరాత్రి. భార. భీష్మ. 3.182. **నడికుప్ప** వి. ఇంటి కప్పు మీది నడిమి స్థానం. **నడికురుబిల్ల** రూ.చూ. నడికురుబిళ్ల. వి. పంటెఆకులు బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. **నడికురుబిళ్ల** రూ. నడికురుబిల్ల. వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. **నడికెడితాడు** రూ. నడికిడితాడు, నడికింతాడు, నటికెడుతాడు, నడికెనతాడు, నడిగిడితాడు, నలికిడితాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్యవేసిన తాడు. **నడికెడుతాడు** రూ.చూ. నడికెడితాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసినతాడు. **నడికెనతాడు** రూ. చూ. నడికెడితాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్యవేసిన తాడు. **నడికొప్పు** వి. ఇంటి పైనున్న మధ్యభాగం, మొగడు. **నడికొల్లగాడు** రూ. నడిమికొల్లగాడు. వి. హక్కు లేకుండా మధ్యలో వచ్చి ఆక్రమించుకొనేవాడు. **నడిగండి** వి. యోని, ఆడుగురి. వేము. శ. 20. **నడిగారు(-కారు)** వి. మధ్యవయస్కుడు. **నడిగాల** వి. నట్టనడుమ. **నడిగాలు** వి. ఇంటిమధ్య గది. **నడిగిడితాడు** రూ.చూ. నడికెడితాడు. వి. ఊడ్తెఅడ్డపట్టెకు మధ్య వేసిన తాడు. **నడిగోడ** రూ. నడిమిగోడ. వి. ఇంటిలోపల రెండు గదుల మధ్యకట్టిన గోడ. **నడిచీల** వి. బండి డొలుపుకింద కొట్టినమేకు. **నడిజాముచుక్క** వి. బృహస్పతి పేరుతో ఉండే నక్షత్రం. **నడిజాల** వి. నట్టనడుమ. **నడితరం** వి. మధ్యనుంచి ఆరంభించే వరస. **నడితరము** వి. నడివంక, మధ్యభాగం. నె. శా. ఆత్మకూరు. 45. **నడితల** వి. శిరస్సు మధ్యభాగం. హరి. ఉ. 2.61. **నడిదోల** వి. నట్టనడుమ. **నడినెత్తి** వి. మాడపట్టు. **నడినెత్తినకన్నులువచ్చు** అ.క్రి. పొగరెక్కు. **నడిపట్టె** రూ.చూ. నడిమిపట్టె. వి. **1**. తలుపురెక్క మీద అడ్డంగా బిగించే కొయ్యబద్ద ; **2**. మరమగ్గం చట్రంలో మేరువు పలకకు కిందుగా నిలువు పట్టెలు బిగించిన మధ్యకర్ర. **నడిపందిరి** వి. ఇంటిమధ్యగది. **నడిపి** విణ. మధ్య ఉన్న. **నడిపికంది** వి. పప్పుదినుసుగా పనికివచ్చే కందిలో ఒకరకం. **నడిపివడ్లు** వి.బ.వ. రెండువంగడాల కలయిక వల్ల ఏర్పడ్డ రకం. **నడిపివాఁడు** విణ. **1**. నడిమి వయసువాడు ; **2**. ముగ్గురు అయిదుగురు మొదలైన (బేసి)

సోదరుల్లో నడిమి వాడు. నడిపెట్ల విణ. మధ్యలో ఉన్న. నడిపెండె వి. మరమగ్గం చట్రంలో మేరువు పలకకు కిందగా నిలువు పట్టెలు బిగించిన మధ్య కఱ్ఱ. నడిపోలు వి. నట్టనడుమ. నడిప్రాఁత విణ. బాగాపాత. పండి. చ. 2పు. 315 పం. నడిప్రొద్దు వి. మధ్యాహ్నం. రామాభ్యు. 1.133. నడిమద్దె రూ.చూ. నడిమద్య. వి. నట్టనడుమ. నడిమద్య రూ. నడిమద్దె, నడిమిద్ది. వి. నట్టనడుమ. నడిమిద్ది రూ.చూ. నడిమద్య. వి. నట్టనడుమ. నడిమిన్ను వి. ఆకాశమధ్యం. ప్రభా. 2.30. నడిమోరు రూ.చూ. నడుంవారు. వి. ఎద్దులకు నడుంచుట్టూ వేసే తోలుపట్టీ. నడిరాతిరి రూ.చూ. నడిరాత్రి. వి. అర్థరాత్రి, నిశీథం. ఆం.భా. 1.84. నడిరాత్రి రూ. నడిరాతిరి. వి. అర్ధరాత్రి. పల్నా. పు. 9. నడిరేయి వి. నడికిరేయి, అర్ధరాత్రం. భార. సౌప్తి. 2.3. నడివంక వి. మధ్యభాగం. యయా. 2.36. నడివీథి వి. వీథియొక్క మధ్యభాగం. హర. 5.55. నడివీథికెక్కు అ.క్రి. అందరి ఎదుటపడు. నడివీథిగుండమ్మ వి. జాతర్ల లోను, పండగల్లోను పూజకు మట్టితో కుమ్మరి తయారు చేసిన గంగమ్మ ప్రతిమ. నడివీథిపెసర వి. అందరికీ లభ్యమయ్యేది. తాళ్ల. సం. 11.3. నడివీథిసాసనమ్మ వి. పండగల్లో పూజకు మట్టితో కుమ్మరి తయారుచేసిన శక్తిబొమ్మ. నడివీపు వి. వీపుయొక్క మధ్యభాగం. కళా. 8.85. నడిప్రేలు వి. నడిమిప్రేలు ఆం. భా. 2.139.

**నడింవారు** చూ. నడిమి.

**నడిగుందిపాయ** చూ. నడిమి.

**నడిఁకించు** చూ. నడుఁకు.

**నడితి** రూ.చూ. నడ. వి. ప్రవర్తన.

క. నడతె. నడత : త. నడత్తై. సౌభాగ్యం : మ. నటుత్త.

**నడిపించు** చూ. నడుపు.

**నడిమంటు** చూ. నడిమి.

**నడిమంటుకచ్చి** చూ. నడిమి.

**నడిమి** రూ.చూ. నడుము. విణ. మధ్య ఉన్న ; వి. మధ్య భాగం.

**నడింవారు** రూ.చూ. నడుంవారు. వి. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ. **నడింగుదిపాయ** రూ.చూ. నడిమిగుదిపాయ. వి. అచ్చు వడుల్లో అచ్చు కఱ్ఱ చివరి గుదులు రెంటికీ మధ్యభాగం. **నడిమంటు** వి. నేతపడుగులో సగభాగంలోని గుర్తు. **నడిమంటుకచ్చి** వి. సరిచేసే పడుగులో, ఊత్తై దగ్గర ఉన్న అని పోగులు. **నడిమికట్టు** వి. నడుముకు కట్టుకొనే కట్టు. హర. 2.93. **నడిమికుల్ల** వి. చుట్టుభవంతికి మధ్య కప్పునుంచి నీరు పడేందుకు వీలుగా ఏర్పరచిన ఖాళీ. **నడిమికొమిరి** వి. వెన్నుగాడినిమోసే కొమర. **నడిమికొయ్య** వి. మధ్య ఆనుపీట కొయ్య. **నడిమికొల్లగాడు** రూ.చూ. నడికొల్లగాడు. వి. హక్కులేకుండా మధ్యలో ఆక్రమించుకొనేవాడు. **నడిమిగుదిపాయ** రూ. నడింగుదిపాయ. వి. అచ్చుపడుల్లో అచ్చుకఱ్ఱ చివరిగుదులు రెంటికీ మధ్యభాగం. **నడిమిగుండు** వి. దండె దగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారం కట్టి దండె అవతలకు వేలాడ దీసిన (గుండ్రటి) రాయి. **నడిమిగోడ** రూ.చూ. నడిగోడ. వి. ఇంటి లోపల రెండు గదుల మధ్యన కట్టిన గోడ. **నడిమిచెక్క** వి. తికిటీ నిలువులను కలిపే అడ్డుకఱ్ఱ. **నడిమిచోటు** వి మధ్యనున్న స్థలం. **నడిమిజల్లి** వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో అడ్డదారాలు దూర్చిన ఈనెల చట్రం. **నడిమిదిన్నె(-తిన్నె)** వి. ద్వీపం. లంక. **నడిమిదొడ్డి** వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి, మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో, అడ్డదారాలు దూర్చిన ఈనెల చట్రం. **నడిమినేత** రూ. నడుమునేత. వి. నేతలో రెండు అంచులకు మధ్యభాగం. **నడిమిపట్టె** రూ. నడిపట్టె. నడుమపట్టె. వి. మరమగ్గం చట్రంలో, మేరువు పలకకు కిందగా నిలువు పట్టెలు బిగించిన మధ్యకఱ్ఱ. **నడిమిపాయ** రూ. నడింపాయ, నడుంపాయ. వి. అచ్చు పడుల్లో, అచ్చుకఱ్ఱ చివరి గుదులు రెంటికీ చివరి భాగం. **నడిమిపాయకఱ్ఱ** రూ. నడింపాయకఱ్ఱ. వి. మరమగ్గంలో పూను కఱ్ఱల్ని ఎడంగా ఉండటానికి పెట్టిన కఱ్ఱ. **నడిమిపాయతాడు** రూ. నడింపాయతాడు. వి. అచ్చుపడుల్లో, నడిమిపాయ దగ్గర అచ్చుకఱ్ఱకు కట్టిన దారం. **నడిమిబిగు** రూ. నడింబిగు. వి. ఊత్తై అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు. **నడిమిరాయి** వి. **1**. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళను మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి ; **2**. బావిగోడల మీద అడ్డంగా వేసిన పొడుగాటి బండ రాయి. **నడిమిరేవు** రూ. నడుమరేగు. వి. ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు. **నడిమివాయి** వి. మగ్గం మీద చాపిన పడుగులో, నడిమి పాయకు ఎడమ భాగం. **నడిమిలోకము** వి. భూలోకం. శృం.నై. 3.8. **నడిమిల్లు** వి. ఇంటి మధ్యగది. <నడిమి + ఇల్లు. **నడిమివాఁడు** విణ. మధ్యముడు. హరి.పూ. 2.40. **నడిమివాసాం** వి. పెండెకట్టులో కిందాపైనా ఉన్న బద్దల మధ్య ఉన్న వాసం. **నడిమిసూల** వి. నాడెలో పేక దారం కండెగుచ్చే ఇనప పుల్ల. **నడిమీసు** వి. కోడిపిటల బండి (ఒకరకం బండి)కి డొంకిపట్టెనుంచి కాడివరకున్న నొగ. <నడిమి + ఈసు. **నడిమెంటికఱ్ఱ** వి. పడుగులో కింది కొల్తలకు దూర్చే కఱ్ఱ. <నడిమి + వెంటికఱ్ఱ. **నడింపట్టె** వి. కోడిపిటల బండి (ఒకరకం బండి)కి ఉన్న రెండో దిండు. **నడింపాయ** రూ.చూ. నడిమిపాయ. వి. అచ్చు వడుల్లో అచ్చుకఱ్ఱ చివరిగుదులు రెంటికీ చివరి భాగం. **నడింపాయకఱ్ఱ** రూ.చూ. నడిమిపాయకఱ్ఱ. వి. మర మగ్గంలో పూనకఱ్ఱల్ని ఎడంగా ఉండటానికి పెట్టిన కఱ్ఱ. **నడింపాయతాడు** రూ.చూ. నడిమిపాయతాడు. వి. అచ్చు వడుల్లో నడింపాయ దగ్గర అచ్చుకఱ్ఱకు కట్టిన దారం. **నడింబిగు** రూ.చూ. నడిమిబిగు. వి. ఊత్తై అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.

**నడిమీసు** చూ. నడిమి.

**నడిమెంటికఱ్ఱ** చూ. నడిమి.

**నడింపట్టె** చూ. నడిమి.

**నడింపాయ** చూ. నడిమి.

**నడింపాయకఱ్ఱ** చూ. నడిమి.

**నడింపాయతాడు** చూ. నడిమి.

**నడింబిగు** చూ. నడిమి.

**నడిఁకించు** చూ. నడుఁకు.

**నడు** రూ.చూ. నడుము. వి. వృత్తిలో నడుము శబ్దానికి మీది వర్ణాలు లోపించగా మిగిలిన రూపం. ఉదా. నడునెత్తి, నడుముక్కు.

**నడుకొన** వి. **1**. నడిమి ప్రదేశం. భార.విరా. **4.84** ; **2**. మధ్యభాగం. భాస్క.రా.యు. 1004. **నడుగడ్డ** వి. ద్వీపం, నలుదిక్కుల జలం కల భూభాగం. హరి.పూ. 8.37. క. *నడుగడ్డ*. **నడుగలను(-కలను)** వి. యుద్ధ భూమి మధ్యభాగం. **నడుగాలు(-కాలు)** వి. గుఱ్ఱాలకు శరీర లాఘవంకోసం వెనక కాళ్ళకు ముందు కాళ్ళకు కట్టే సాధనం. వరాహ. 4.114. **నడుగుంట** వి. తలనడిమి పల్లం, బ్రహ్మరంధ్రం. చంద్రాంగ. **2.3**. **నడుచక్కి** వి. మధ్యప్రదేశం. హర. 1.3. **నడుచొచ్చు** రూ.చూ. నడుసొచ్చు. అ.క్రి. నడుమ ప్రవేశించు, మధ్యభాగం చేరు. **నడుజాము** వి. అర్ధరాత్రం. గౌ.హరి. **475** పం. **నడుతల** రూ.చూ. నడుదల. వి. నడినెత్తి. మార్క. 3.348, **నడుదల** రూ. నడుతల. వి. నడినెత్తి. భార. స్త్రీ. 1.98. **నడుదిన్నె(-తిన్నె)** రూ. నడుదీనె. వి. ద్వీపం. **నడుదీనె** రూ.చూ. నడుదిన్నె. వి. ద్వీపం. **నడుదీవి** వి. మధ్య ద్వీపం. వైజ. 1.102. **నడుదెస** వి. మధ్యప్రదేశం. వరాహ. 10.135. **నడునట్టు** వి. మధ్యస్థానం. భీమ. 3.19. **నడునీరు** వి. నీటి మధ్యభాగం, జలమధ్యం. భార. ద్రోణ. 1.26. **నడునెత్తి** రూ. నడ్నెత్తి. వి. తల యొక్క మధ్యభాగం. రం.రా.సుందర. **263** పు. **23**. పం. **నడుపట్టు** వి. నడిమితావు, మధ్యప్రదేశం. శృం.నై. 8.16. **నడుభూమి** వి. మధ్యభాగంలో ఉన్న భూమి. హరి.ఉ. 8.40. **నడుముక్కు** వి. ముక్కు యొక్క మధ్యభాగం. వరాహ. 9.79. **నడుబ్రాయపుది(-ప్రాయపుది)** విణ. ప్రౌఢ. **నడురవలి** వి. మధ్యమధ్య చేసే ధ్వని. **నడురా** వి. నడిరేయి. **నడురాతిరి** వి. అర్ధరాత్రి, రాత్రి యొక్క మధ్యభాగం. వాశి.రా. **2.177**. **నడురే** రూ.చూ. నడురేయి. వి. అర్ధరాత్రి. హరి.పూ. **5.118**. **నడురేయి** రూ. నడురే. వి. అర్ధరాత్రి. భార.ఆది. 7.40. **నడులేత** విణ. మిక్కిలి లేత, ముదురుకాని. పండి. చ. **2.127** పు. **నడువానకాలము** వి. వానకాలంయొక్క మధ్యం. భార. ద్రోణ. **1.231**. **నడువీథి** వి.ఘంటాపథం, మార్గం. **నడువీపు** వి. వీపుయొక్క మధ్యభాగం. వరాహ. **8.147**. **నడుసొచ్చు (-చొచ్చు)** రూ. నడుచొచ్చు. అ.క్రి. నడుమ ప్రవేశించు, మధ్యభాగం చేరు. రం.రా. కిష్కిం. **211** పు. 20 పం.

**నడుంవారు** చూ. నడుము.

**నడుంవిఱుగు** చూ. నడుము. అ.క్రి. శ్రమించు, పని ఎక్కువగా ఉండనటం.

**నడుకొను** చూ. నడుఁకు.

**నడుంగల** చూ. నడుము.

**నడుఁకఁబడు** చూ. నడుఁకు.

**నడుఁకు** రూ.చూ. నడుఁగు. అ.క్రి. **1**. భయపడు, జంకు, వెనుదీయు భార.భీష్మ. 2.237 ; **2**. చలించు. రం.రా. ఉ. 72 పు. 7 పం. ; **3**. నమ్రుడగు. హరి.ఉ. 6.190 ; **4**. ఒదుగు, సంకుచితావయవుడగు. శృం.నై. 1.102 ; **5**. వడకు. వేంక.పంచ. 1.7 ; **6**. ఆపదపొందు, ఇక్కట్లు పడు. విష్ణుపు. **5.168** ; **7**. నశించు ; వి. **1**. చలనం, కంపం ; **2**. భయం.

**నడిఁకించు** స.క్రి. వడకించు. భార.ద్రోణ. **4.7**. < నడుఁకు + -ఇంచు$^{3}$. **నడుకొను** అ.క్రి. కంపించు. భార. విరా. **4.84**. **నడుఁకఁబడు** అ.క్రి. నశించు. ఘటికా· 2.65. < నడుఁకు + -అ$^{7}$ + పడు. **నడుఁకొత్తు** అ.క్రి. నిర్భయుడగు. జైమినిభా. 2.41. < నడుఁకు + ఒత్తు.

**నడుఁకొత్తు** చూ. నడుఁకు.

**నడుఁగు** రూ. నడుఁకు. అ.క్రి. **1**. చలించు, వడకు, కంపించు. భార.ఆది. 2.156 ; **2**. భయపడు, జంకు, వెనుదీయు ; **3**. నమ్రుడగు ; **4**. ఒదుగు ; **5**. వడకు ; **6**. ఆపద పొందు ; **7**. నశించు.

క. *నడుగు, నడగు*. ఒణకు, చలించు, కదలు, *నడుగు, నడుగువికె, నడక*. వణకడం, చలించడం ; తు. *నడుంగుణి, నడుగుని* ; త. *నటుఙ్కు (నటుఙ్కి)*. కదుపు, ఒణకు, భయంతో వణకు, బావుందని తల ఊపు, *నఙుఙ్కల్*. భయం, కదులు, తల వణకు (భయంతో) ఒణకు, *నటుక్కు (నటుక్కి-)*. ఒణకు, కదులు, చలించు, *నటునటుఙ్కు*. విపరీతంగా ఒణకు· ఎక్కువగా ఒణకు, *నటలై*. వణకడం, కదలడం ; మ· *నడుఙ్ఙుక*. వణుకు, *నటుక్కుక, నటుక్కమ్, నటుఙ్ఙల్*. వణకడం ; కో. *నడ్గ్ (నడ్గి-)*. ఒణుకు, కదలు (పెద్దవయసువల్ల). *నడ్గ్ల్, నడ్క్ల్*. వణకడం ; తో. *నొడ్క్స (నొడ్క్స)*. ఒణకు.

**నడుచు** రూ.చూ. నడచు. అ.క్రి. **1**. గమనంచేయు, సంచరించు. భార.విరా. 4.50 ; **2** పుట్టు, కలుగు. దశకు. 5.26 ; **3**. వెడలు, పోవు. భీమ. 2 101 ; **4**. జరుగు, ప్రవర్తిల్లు. భీమ. 3.105 ; **5**. ప్రవర్తించు, నడచుకొను. ఆము. 6.31 ; **6**. అందు, చేరు. కుప.చ. 4.101 ; **7**. ఉండు. శుక. 3.502 ; **8**. అనుభవింపబడు, భుక్తమగు. ఉ.హరిశ్చ. 1.66 ; **9**. సరిపడు, అనుకూలమగు.

**నడుచుతఱి** వి. వర్తమానకాలం. **నడుచుమర్యాదలు** వి.బ.వ. పెళ్ళిళ్ళలో కట్నం కాక ఇతర కానుకలు లాంఛనాలు వగైరా.

**నడుదింపు** వి. మాంసవిశేషం. మార్క. 2.115.

**నడునడు** వి. నడవటంలో అయ్యే అనుకరణం. భార.ఆది. 5.21.

**నడుందబ్బ** చూ. నడుము.

**నడుపాడు** చూ. నడుపు.

**నడుపు** రూ. నడపు. వి. **1**. అధికారి, నిర్వాహకుడు. అహదనకర శాసనం. క్రీ.శ. 847 ; **2**. గమనం, నడక. ఉ.హరి. 1.57 ; స.క్రి. **1**. ఆచరించు, చేయు. భార.

ఆరణ్య. 1.256 ; 2. సాగించు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 90. క్రీ.శ. 1241 ; 3. రథం మొ॥ నడిపించు, తోలు. భార.ద్రోణ. 1.199 ; 4. ప్రవర్తింపజేయు. విజ్ఞా.ప్రా. 38 ; 5. పోషించు. ఆము. 4.233 ; 6. నిర్వర్తించు, నెరవేర్చు. నె.శా. కంచుకూరు 80. శ. 1564 ; 7. జరుపు, జరిగించు. నె.శా. కనిగిరి. 1. క్రీ.శ. 1653 ; 8. సారెవిూద వాట తయారుచేసేటప్పుడు వాట బద్దతో పై మట్టిని నునుపుగా చేయు.

**నడిపించు** రూ.చూ. నడపించు. స.క్రి. 1. గమనింపజేయు. భార.ఉద్యో. 1.317 ; 2. జరుపు, జరిగించు. కువ.చ. 2.104 ; 3. రథం మొ॥ కడపు, తోలు. ఉ.రా. 4.334 ; 4. తాడు మొ॥ వాటితో గట్టిగా కట్టు. <నడుపు + -ఇంచు[3]. **నడుపాడు** రూ.చూ. నడపాడు. అ.క్రి. నడుచు, సంచరించు. కు.సం. 12.220. <నడుపు + ఆడు. **నడుపుకొను** రూ.చూ. నడపుకొను. స.క్రి. పోషించు. కళా. 5.215. **నడుపుకొయ్య** వి. బండిపరం జారకుండా ఇరుసు మీద అడ్డం పెట్టిన కొయ్య.

**నడుమఅడ్డపట్టె** రూ. నడమఅడ్డపట్టె. వి. మరమగ్గం చట్రంలో మెరువు పలకకు కిందగా నిలువు పట్టెలు బిగించిన మధ్య కర్ర.

**నడుమంతరము** చూ. నడుము.

**నడుమంత్రము** చూ. నడుము.

**నడుమపట్టె** రూ.చూ. నడిమిపట్టె. వి. మరమగ్గం చట్రంలో మేరువులకు కిందిగా నిలువు పట్టెలు బిగించిన మధ్య కర్ర.

**నడుమఁబెట్టినపూరిగాలు** వి. వాడికీ వీడికీ అసలు పడదు అనటం.

**నడుమరేగు** రూ.చూ. నడిమిరేవు. వి. ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

**నడుము** రూ. నడి, నడిమి, నడు, నడ్మ, నడ్మ. వి.బౌ. 1. మధ్యకాలం. భార.ఆది. 2.209 ; 2. మధ్యప్రదేశం. అంతరం. భార.ఆది. 6.74 ; 3. మధ్యం, కౌను. భార. ఆరణ్య. 3.103 ; 4. మధ్యభాగం. కు.సం. 2.69 ; 5. మధ్యనున్నవాడు, మధ్యనుండినది. భార. అను. 2.365.

క. నడు, నడువు, నడ, నడవు, నడి. మధ్య, నడుమ, నడుము, నట్టు. నట్టె. మధ్యకు సంబంధించిన, మధ్య. నడువె, నడవె, నడివె. నట్టనడుమ, సరిగా మధ్యభాగం, రెంటినడుమ. భేదం ; కొడ. నడు. మధ్య ; తు. నడు. మధ్య, నడును, నడుతర. మధ్యభాగం, తగుమాత్రం, నడుపులు. నడుము ; త. నటు, నటువు. మధ్య, నడుము, సమానం, నటువణ్. మధ్యలో ; మ. నటు. మధ్య, నడుము. సమానం ; కో. నడ్వ. మధ్య ; తొ. నొడ్ఫ. (నొడ్త్-). మధ్య ; గోం. నడ్తుమ్. మధ్య, రెంటిమధ్య, నడూమ్. మధ్య, నడీ-మ-ర్యాల్. నడుము ; పర్జి. నడుబ్. మధ్య, నడ్బల్. మధ్యభాగంలో ; కోలా. నడుమ్. మధ్య ; నా. నడుమ్. నడ్మత్. మధ్య భాగంలో.

**నడుంవారు** రూ. నడింవారు, నడిమోరు, నడుమోర. వి. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ. **నడుంగల** విఠ. మధ్య ఉన్న. **నడుందబ్బ** వి. చేత్తోపట్టుకొని లాగటానికి వీలుగా దంతెకు వేసిన కర్ర. **నడుమంతరము** రూ.చూ. నడుమంత్రము. వి. నడుము, అవలగ్నం. అని. 3.100 ; విఠ. మధ్యకాలంలో కలిగిన. అని. 3.100. **నడుమంత్రము** రూ. నడుమంతరము. విఠ. మధ్యకాలం కలిగిన. విష్ణుపు. 7.156. వి. 1. మధ్యకాలం ఉ.రా. 2.8 ; 2. కౌను. **నడుముకట్టు** అ.క్రి. 1. సిద్ధపడు ; 2. సంభోగం త్యజించు. **నడుముకట్టుకొను** అ.క్రి. సిద్ధపడు. **నడుముకొను** అ.క్రి. సన్నద్ధమగు. భాస్క.రా.యు. 1843. **నడుముదాఁకు(-తాఁకు)** స.క్రి. ఎదుర్కొను, ఎదిరించు. విజయ. 2.106. **నడుమునేత** రూ.చూ. నడిమినేత వి. నేతలో రెండు అంచులకూ మధ్యభాగం. **నడుముఁద్రొక్కు(-త్రొక్కు)** అ.క్రి. నడుములు విరగగొట్టు. కకుత్స. 3.65. **నడుముపట్టు** అ.క్రి. నడుంపిసుకు, హంస. 3.200. **నడుము పట్టుకొని నిల్చు** అ.క్రి. సిద్ధపడి నిలబడు. కాశ. 3 193. **నడుము పట్టుకొను** అ.క్రి. సిద్ధపడు. **నడుము బిగించు** అ.క్రి. ఏదైనా పనికి సిద్ధపడు. **నడుములు నిలవకుండు** అ.క్రి. విపరీతమైన శ్రమ కలుగు. **నడుములు విఱుగు** అ.క్రి. కుప్పకూలిపోవు. వర.రా. బాల. ప. 79. పం. 15. **నడుమువంచు** స.క్రి. శ్రమకోర్చు. **నడుమువాల్చు** అ.క్రి. విశ్రాంతి తీసుకొను. **నడుము విఱుగఁగొట్టు(-కొట్టు)** స.క్రి. బాగా శిక్షించు. **నడుమువిఱుగు** అ.క్రి. 1. దుఃఖాది వార్తలను వినటంవల్ల వివశమగు ; 2. అలసిపోవు. **నడుమోర** రూ.చూ. నడుంవారు. వి. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ. **నడుంపాయ** రూ.చూ. నడిమిపాయ. వి. అచ్చుపడుల్లో అచ్చుకర్ర. చివరి గుదులు రెంటికీ చివరిభాగం.

**నడుమోర** చూ. నడుము.

**నడుంపాయ** చూ. నడుము.

**నడువ** రూ.చూ. నడవ. వి. తలవాకిటికిని నడిమి వాకిటికిని నడిమిజోటు.

**నడువడి** రూ.చూ. నడవడి[1]. వి. ప్రవర్తన.

**నడ్కిరేయి** రూ. నడికిరే, నడికిరేయి. వి. అర్ధరాత్రం. భార. ఆది. 7.39.

**నడ్చు** రూ.చూ. నడచు. వి. 1. చరించు, ఒకచోటనుంచి ఇంకో చోటికి కదలు ; 2. ప్రవర్తించు.

**నడ్డ** వి. పత్తి రాట్నం కోలకు పెట్టిన గంటు.

**నడ్డకోల** వి. పత్తిరాట్నం నిలువుల మధ్య రూళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె.

**నడ్డి** చూ. నడుము. వి. 1. నడుము. వేంక. పంచ. 4.570 ; 2. పూర్వకాయం వెనక్కి వంగిఉండటం ; విఠ. చప్పట.

**నడ్డిగుంట** వి. కుకుందరం, నడ్డికింది గుంట. **నడ్డిపూస** వి. నడ్డియొక్కకీలు. **నడ్డిబడె** వి. కోసిన అనుములు, ఉలవ, పెసర, కంది మొ. వాటి కుప్పలు కొట్టి గింజలు రాల్చటానికి ఉపయోగించే మొద్దుకర్ర. <నడ్డి + బడితె. **నడ్డిముక్కు** వి. చప్పిడిముక్కు. **నడ్డిముక్కు గలాఁడు** విఠ. చప్పి ముక్కున్నవాడు. **నడ్డిముక్కువాఁడు** విఠ. అవటీటుడు, చప్పిడిముక్కు గలవాడు. ఆం.భా. 2.121. **నడ్డివిఱుగఁ**

జేయు స.క్రి. అతిభారంచేయు. శుక. 3.403. < నడ్డి + విఱుగు + -అ[7] + చేయు. **నడ్డివిఱుగ(దన్ను(-తన్ను)** స.క్రి. నడ్డివిరగ వడ్డించు, చావదన్ను.

**నడ్డేకు(-ఆకు)** చూ. నడ్డి. వి. పొగాకు, పదిహేడో శతాబ్దంలో (1605) పోర్చుగీసువారు మనదేశంలో ప్రవేశపెట్టిన వర్తకపు పైరులో ఒకరకం. (Nicotiana tabacum).

**నడ్తి** రూ.చూ. నడ. వి. ప్రవర్తన.

**నడ్నెత్తి** రూ.చూ. నడునెత్తి. వి. తలయొక్క మధ్యభాగం. అష్టమ. క. 1.24. పు. 19. పం.

**నడ్మ** రూ.చూ. నడుము. వి. 1. మధ్యకాలం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 707. క్రీ.శ. 1153 ; 2. మధ్యభాగం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 597. క్రీ.శ. 1247.

**నడ్ము** రూ.చూ. నడుము. వి. ఔ. 1. మధ్యం. కాను. కు.సం. 11.145 ; 2. మధ్యభాగం. రం.రా.ఉ. 60 పు 2. పం. ; 3. మధ్యప్రదేశం ; 4. అంతరం ; 5. మధ్యలో ఉన్నవాడు.

**నంటగింజ** వి. జొన్నల్లో తాలుగింజ.

**నంటి** చూ. నంటు.

**నంటికా(డు** చూ. నంటు.

**నంటు** వి. 1. సంపర్కం, తాకుడు. వసు. 2.21 ; 2. స్నేహం. వసు. 4.36 ; 3. బంధువు. వసు. 4.129 ; 4. ఆసక్తి, శ్రద్ధ. సారంగ. 2.200.

క. నణ్టు, నెణ్టు. బాంధవ్యం, స్నేహం ; నణ్ట, నెణ్ట. బంధువు, స్నేహితుడు ; నణ్టతన, నెణ్టతన, నణ్టర్తన, నణ్టస్తికె, నణ్టికె. బంధుత్వం ; నణ్పు, నెణ్పు. స్నేహం, అభిమానం. ప్రేమ, బంధుత్వం. తు. నణ్టు, నణ్టస్తిగె, నెణ్టస్తిగె. బంధుత్వం ; నెణ్టె. బంధువు ; త. నణ్ణు (నణ్ణి-). దగ్గరగావచ్చు, చేరు, కలియు ; నణ్ణునర్. స్నేహితులు ; నణ్పు, నట్పు. ప్రేమ, అభిమానం, స్నేహం, బాంధవ్యం, నణ్పన్. స్నేహితుడు ; నణ్మై, నణి. దగ్గరతనం, నణియాన్. దగ్గరగాఉన్న ; నణుఙ్కు- (నణుఙ్కి-), నణుకు, (నణుకి-). కలియు, దగ్గరకు వచ్చు ; నళ్ (నట్ప్-, నట్ట్-), నళ్లు (నళ్లి-). దగ్గరకు వెళ్లు, కలియు, స్నేహితుడగు, ఇష్టం, స్వీకరించు, నళ్లునర్. స్నేహితులు, జతగాళ్ళు, నట్టార్, నట్టోర్. స్నేహితులు, బంధువులు ; మ. నణ్ణుక, నెణ్ణుక. కృతజ్ఞత, ప్రేమవలన గుర్తుంచుకొను, కో. నణ్య్. ఇతరులు చేసిన సహాయానికి చూపే కృతజ్ఞత. గ. (బల్లా). నన్-, నన్న్-. ప్రవేశించు.

**నంటి** వి. స్నేహం. **నంటికా(డు** రూ.చూ. నంటుకా(డు.వి. స్నేహితుడు. **నంటుకత్తె** వి. ప్రియురాలు. కువ.చ. 2.114. **నంటుకా(డు** రూ. నంటికా(డు. వి. ప్రియుడు, వలపుకాడు. శుక. 3.23.

**నంద్రకాయ** వి. పీత. త. నండు. పీత.

**నత** వి. 1. లత. తీగ ; 2. చెక్కమీద చెక్కనతీగ.

సం. లతా. తీగ.

< సం. లతా.

**నత్త** వి. సీచశంఖంలో ఉండేపురుగు. ఆం. భా. 2.82.

తు. నర్తె. తినేనత్త ; త. నత్తమ్. శేత్తు, నన్తు. నత. శంఖం, నత్తై, నన్తనమ్. నత్త ; నన్తమ్. శంఖం ; మ. నత్త. తినేనత్త, గుల్లఉన్నచేప.

**నత్తగుల్ల** వి. 1. సీచశంఖం. హంస. 4.186 ; 2. నత్త పురుగుపై ఉండే పైపెంకు. **నత్తగుల్లచిడీ** వి. కింద విశాలంగా పైకి పోను పోను సన్నగా సుడితిరిగి ఉండేమెట్టు. **నత్తగుల్ల (కైవారం) మెట్టు** వి. కింద విశాలంగా పైకి పోను పోను సన్నగా సుడి తిరిగి ఉండే మెట్టు. **నత్తగొట్టు (-కొట్టు[1])** వి. ఒకరకం పక్షి. **నత్తచిప్ప** వి. నత్తగుల్ల ఉండేచిప్ప. **నత్తచేపలు** వి.బ.వ. ఒకరకం చిన్న చేపలు (Clupea). **నత్తతెగులు** వి. జొన్న, మొక్క జొన్న మొ॥ వాటి దంటు తొలిచే పురుగు (నత్త) వల్ల ఎన్ను ఎండిపోయే రోగం.

**నత్తడి** చూ. తత్తడి. రూ. అత్తడి. వి. హయం. గుర్రం.

**నత్తాల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు. చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

**నత్తి** చూ. నత్తు[1]. వి. మాటలాడే టప్పుడు మొదటి అక్షరం చాలసార్లు ఉచ్చరించి ఆగి ఆగి కష్టంమీద మాటలాడటం మొదలైన లక్షణాలు గల నాలుక జబ్బు.

**నత్తికినత్తు** విశే. 1. నత్తివానిని చూచి నత్తిగా మాట్లాడు నటువంటి ; 2. వెక్కిరించే. **నత్తివా(డు** విశే. నత్తికలవాడు. లోహలుడు. ఆం. భా. 3.12.

**నత్తివలం** చూ. నత్త[2]. వి. ఒకరకం కలుపుమొక్క.

**నత్తు[1]** చూ. నత్తి. అ.క్రి. తడబడుతూ మాటలాడు.

క. నత్తు, నెత్తు. తడబడుతూమాట్లాడు. నత్తినత్తిగా మాట్లాడు ; తు. నత్తెజ్జె. కొంచెం మూగతనం కలవాడు. మ. నత్తుక. నత్తిగామాట్లాడు.

**నత్తు[2]** వి. ముక్కుపోగు, స్త్రీల నాసాలంకార విశేషం. క్రీడా. పీఠి. 62.

సం. నస్తక. ముక్కుతాడు. నస్తా. ముక్కురంధ్రం; ప్రా. నత్థా. నాసారజ్జువు ; అమా. నత్థా. పశువులముక్కుతాడు ; పా. నత్థు. ముక్కు ;

క. నత్తు, నొత్తు. ముక్కుపోగు ; తు. నత్తు ; త. నత్తు ; మ. నొత్త ; బ్రా. 'త్.

< ప్రా. నత్థా.

**నత్తెము** వి. 1. డేగతో వేటాడేవాడు; 2. చేతికి వేసుకొనేతొడుగు.

**నదరివాకిలి** చూ. నదరు.

**నదరు** రూ.చూ. నజరు. వి. 1. ఎదురు. మల్లువు. 3.53 ; 2. కానుక ; 3. ఇటికబట్టీమీద పెట్టే దిష్టిబొమ్మ ; 4. వడంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండేరేకు బిళ్ళ.

**నదరివాకిలి** వి. ఎదురువాకిలి. **నదరుపట్టె** వి. 1. పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క ; 2. గొడుగు బల్లమీద వేసే లతలు చెక్కినచెక్క. **నదరుముగరం** వి. గోడలో దర్వాజాకు పక్కన కొయ్యస్తంభం. **నదర్‌రాయి** వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతినరాయి. హిం. ఉ. నజర్. దృష్టి.

< ఉ. నజర్ + రాయి.

**నదర్‌రాయి** చూ. నదరు.

**-నన్[1]** ప్రత్య. ద్రు. 1. ఉదంతాలైన జడవాచకాలకు వచ్చే

సప్తమీవిభక్తి ఏకవచనం. భార.ఆది. **4.137** ; **2.** క్రియా విశేషణ వివక్షలో కొన్నిచోట్ల ఉదంతాలకు అనుప్రయుక్త మౌతుంది. భార. ఆది. 5.152 ; **3.** ఉదంత శబ్దాలకు వచ్చే తృతీయా విభక్తి ఏకవచనం. భాస్క రా. యు. 977.

<మూ. మ. ద్రా. -*న్.

**నన్²** ప్రత్య. క్రియలకు చేదాద్యర్థంలో వస్తుంది. (ఇది పరమైనపుడు తుది ఉకారానికి ఇకారం ఆదేశంగా వస్తుంది.) భార. ఉద్యో. 3.21.

<మూ. ద్రా. -*అల్.

**నన** చూ. ననుచు² రూ. అన². వి. **1.** పువ్వు, పుష్పం. కు. సం. **4.104** ; **2.** మొగ్గ, కోరకం. ఆము. 5.113 ; **3.** పల్లవం, చిగురు.

క. ననె. పూమొగ్గ, వికసించని పువ్వు. వికసిస్తున్న పువ్వు. నన్ఫు. వికసనం, త. ననై (-వ్-న్త్-). వికసించు, కనిపించు, మొగ్గ ; కో. నన్. మొగ్గ, వత్తి ; తొ. నన్. చిగురు.

**ననకారు** వి. వసంతకాలం. **ననతేనియ** వి. మకరందం. పూతేనె. నీలా. 1.56. **ననదండ** వి. పుష్పమాల. ఆము. 1.14. **నననీరు** వి. మధువు, పూతేనె. భాను. 2.75. **నన(బోణి (-పోణి)** రూ.చూ. నన(బో(డి. వి. పుష్పంవలె మనోజ్ఞురాలైన స్త్రీ. దశా. 2.55. **నన(బో(డి (-పో(డి)** రూ. నన(బోణి. వి. **1.** పుష్పంలాగ మనోజ్ఞురాలైన స్త్రీ. శుక. 2.75 ; **2.** స్త్రీ. **ననయు** చూ. ననుచు². అ.క్రి. **1.** పూచు ; **2.** చిగిరించు. **ననలవిలుకా(డు** రూ.చూ. ననల విల్కా(డు. వి. మన్మథుడు. **ననలవిల్కా(డు** రూ. ననల విలుకా(డు. వి. మన్మథుడు, పుష్పధన్వుడు. చిత్రభా. 2.107. **ననలెత్తు** అ.క్రి. **1.** మొలకలెత్తు. ఉ.రా. 5.318 ; **2.** పల్లవించు. దశా. 2.248. <నన+-లు+ఎత్తు¹. **ననలొత్తు** అ.క్రి. **1.** కలుగు, పుట్టు. వరాహ. 1.39. ; **2.** మొలకలెత్తు. నిరంకు. 1.8 ; **3.** వ్యాపించు. <నన+-లు+ఒత్తు. **ననవింటిజోదు** వి. పుష్పధన్వుడు, మన్మథుడు. విక్ర. 7.54. **ననవింటిదంట** వి. పుష్పధన్వుడు. మన్మథుడు. దశా, 1.164. **ననవింటిదొర** వి. పుష్పధన్వుడు. మన్మథుడు. మృత్యు. 1.11. **ననవింటిమన్నెవా(డు** వి. మన్మథుడు. ఉ.రా. 4.163. **ననవిలుకా(డు** రూ. నన విల్కా(డు. వి. మన్మథుడు, పుష్పధన్వుడు. శృం.నై. 2.78. **ననవిలుకానన్న** వి. బహ్మ. వేంక. ఆం. దేవ. 6. **ననవిలుకానిపోరు** వి. లా.అనొ. మదనకదనం, సురతం, మైథునం. హంస. 3.103. **ననవిలుతు(డు** రూ.చూ. ననవిల్తు(డు. వి. మన్మథుడు. **ననవిల్కా(డు** రూ.చూ. ననవిలుకా(డు. వి. మన్మథుడు. **ననవిల్తు(డు** రూ. నన విలుతు(డు. వి. పుష్పధన్వుడు, మన్మథుడు. భీమ. 3.211. **ననసానాగడకెంచవుమాస్టీ(డు** వి. మన్మథుడు. ఉ.హరిశ్చ. 4.114.

**ననుచు¹** అ.క్రి. **1.** అనురాగంపొందు, అనురక్తుడగు. రం.రా. కిష్కిం. 201. పు. 30 పం. ; **2.** అతిశయించు. రం.రా. సుందర. 249 పు. 22 పం. ; **3.** పూచు. శృం.నై. 3.48 ; **4.** ఇష్టపడు. కావ్యా.చూ. 1.135 ; **5.** కలుగు, పుట్టు. పాండు. 1.145 ; **6.** ఇంపగు. స.క్రి. ఇష్టపడు.

త. నణుకు, నణుంకు. అనుషక్తమగు, నళ్, నిళ్లు (నళ్-). స్నేహంచేసుకొను, ఇష్టపడు, అంగీకరించు ; మ. నణ్ణుక. ప్రేమతో జ్ఞప్తియందుంచుకొను.

<మూ.ద్రా. *నణ్-/*నళ్-.

**ననుచు²** అ.క్రి. **1.** చిగుర్చు. యయా. 1.37 ; **2.** వికసించు. కువ.చ. 2.44 ; **3.** మొగ్గవేయు, కోరకించు. ఆం.భా. 2.35 ; **4.** కన్పించు.

క. తనె. మొగ్గ, మొగ్గతొడుగు ; తు. నాదుని. సువాసన వెదజల్లు ; త. ననై. మొగ్గతొడుగు, కనబడు, నాఱ్ఫు. మొగ్గ, సువాసన ; మ. నాఱు. సువాసన ; కో. నార్. కంపుకొట్టు ; మాల్తో. నన్నకి.

<మూ.ద్రా. *నాన్/నాత్- ; *నన్-/*నత్-.

**ననుపు¹** రూ.చూ. నన్పు¹. విశ. **1.** అధికమైన, అతిశయం గల. శృం.నై. 7.161 ; **2.** అనురాగంకల. ప్రబోధ. 2.69 ; వి. **1.** అనురాగం, ప్రేమ. మను. **3.134** ; **2.** జీవనోపాధి. రాజవా. 2.76. ; **3.** ఇంపు, ఒప్పు, ననుపు. శుక. 2.331.

**ననుపుకత్తె** వి. **1.** ప్రియురాలు ; **2.** విటురాలు. **ననుపుకా(డు** రూ. నన్పుకా(డు. వి. విటుడు, వలపుకాడు. మను. 2.73. **ననుపుమిండలు** వి.బ.వ. ప్రియులు. కాశీ. 3.165. **ననుపువడు (-పడు)** అ.క్రి. అనురక్తమగు, ప్రియపడు. కవిక. **4.120**.

**ననుపు²** చూ. ననుచు². రూ. నన్పు². స.క్రి. వికసింపచేయు. దశా. 2.306.

**నను(బాయి** రూ.చూ. నన్బాయి. వి. చక్కగాఉడకని బియ్యం.

**నను(బ్రాయి** చూ. నాను¹. రూ.చూ నన్బాయి. వి. చక్కగా ఉడకని బియ్యం, ఉడికీ ఉడకని బియ్యం.

**నను(బ్రాయిచూపు** అ.క్రి. సరిగా ఉడక్కుండు, నడిమి పలుకగు. సాంబో. 5.295. **నను(బ్రాయివడు** రూ.చూ. నను(బ్రాయివడు. అ.క్రి. నను(బ్రాయిఅగు. **నను(బ్రాయియగు** అ.క్రి. సగమే ఉడుకు. **నను(బ్రాయివడు (-పడు)** రూ. నను(బ్రాయిపడు. అ.క్రి. నను(బ్రాయిఅగు.

**ననువు** చూ. నన్పు¹. వి. **1.** అందం. రం.రా.సుందర. ; **2.** ఒప్పు, ఇంపు, ననుపు. భీమ. 1.113 ; **3.** నర్మవచనం. వైజ. 1.2.

**నంద** వి. ధాన్యం నిలవచేసుకొనే పెద్దబాన లేదా మట్టిపాత్ర.

**నందకప్పు** వి. బుడ్డినంద మీద మూతకువాడే గుండ్రని మట్టిపళ్ళెం. **నందగోడ** వి. పునాది లేకుండా భూమట్టం నుంచి పైకి కట్టుకవచ్చిన గోడ. **నందగోలేం** వి. నంద కింది భాగంలో అడుగులోఉండే మట్టిభాగం. **నందమూత** వి. బుడ్డినందమీద మూతకువాడే గుండ్రని మట్టిపళ్ళెం.

**నందనబిళ్లలు** వి.బ.వ. వరిపిండితో చేసే పిండివంట.

**నందనాబణము** వి. భక్ష్యవిశేషం. ద. హిం. శా. నంపు. 4. శా.నం, 695. క్రీ.శ. 1519.

**నందనామొదలు** వి. మళ్ళీ మొదటికి రావటం.

**నందాదివియ** వి. నందాదీపం, అఖండదీపం. ద.హిం.శా.నంపు.

10. శా.సం. 62. క్రీ.శ. 1106.

త. నంతావిలక్కు. గర్భగుడిలో లేదా రాజభవనంలో ఎప్పుడూ వెలిగే దివ్వె.

**నందావనము** వి. దేవుని పువ్వులతోట. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 66.

త. నంతావనమ్.

**నందికంబము** వి. నంది విగ్రహం చెక్కిన పొలం సరిహద్దు రాయి. ద. హిం. శా. సంపు. 10. శా.సం. 510. క్రీ.శ. 1315.

సం. నందీ. నంది, శివుని వాహనం.

< సం. నందీ + కంబము.

**నందికోడె** వి. నందిలాగా అందంగాఉండే కోడె.

సం. నందీ. శివుని వాహనం.

< సం. నందీ + కోడె.

**నందితూము** వి. కాలమాన విశేషం. ద. హిం. శా. సంపు. 5. శా.సం. 125. క్రీ.శ. 1296.

సం. నందీ. శివుని వాహనం.

< సం. నందీ + తూము.

**నందినిపందిచేయు** స.క్రి. మంచిని చెడుగా, చెడును మంచిగా చెప్పు.

**నందిపడగ** వి. జంగాలు పెట్టుకునే శిరోవేష్టన భేదం. బసవ. 6.168.

సం. నందీ. శివుని వాహనం, నందీశ్వరుడు.

< సం. నందీ + పడగ.

**నన్న** విశ. కురచైన.

హిం. నన్హా. చిన్న.

త. నన్ని. కురచైనది.

**నన్నడుము** వి. మిక్కిలి మధ్యభాగం. కాశీ. 1.132.

**నన్ని** విశ. 1. సుందరమైన; 2. ప్రియమైన.

త. నణ్ణమ్. స్వల్పమైన, నణ్ణో.

**నన్నూఱు** సర్వ. నాలుగు నూర్లు, నలుగు వందలు. భార.సభా. 2.113.

క. నాల్నూఱు, నానూఱు, నన్నూఱు; కొడ. న.ను.రి. నాల్గువందలు; తు. నల్ నూదు, నానూదు, నలునూదు; త. నానూఱు; మ. నానూఱు; కో. నన్.ను.ల్, న.ను.ర్; తొ. నొ.నుఙ్; గోం. నాలున్గ్. నాలుగు; కొం. నాలెర్. నాలుగు; కుఇ. నాల్గి. నాలుగు; పర్జి. నాలు(క్). నాలుగు వస్తువులు; కొలా. న.లిన్. నాలుగు వస్తువులు; నా. నాలన్. నాలుగు వస్తువులు; గ. నల్ గుర్. నాలుగు; కురు. నాఖ్. నాలుగు వస్తువులు.

**నను**[1] రూ. ననుపు[1]. వి. అనురాగం. కు.సం. 9.345; విశ. అనురక్తుడైన. కువ.చ. 2.110.

క. నంటునెంటు. బంధువు, స్నేహితుడు, నణ్ఫు, నెణ్ఫు. స్నేహం, అనురాగం, ప్రేమ; తు. నంటు, నంటుస్తిగె, నెంటుస్తిగె. బంధుత్వం; త. నణ్ణు (నణ్ణో). దగ్గరకు వచ్చు, దగ్గరకు వెళ్ళు, సమీపించు, కలియు, నట్టు. ప్రేమ, అనుబంధం, అభిమానం, నణ్ఫు. ప్రేమ, అనుబంధం; మ. నణ్ణుక, నెణ్ణుక. ప్రేమతో కృతజ్ఞతతో గుర్తుపెట్టుకొను; కో. ననై. సహాయపడినందుకు కృతజ్ఞత చూపు; గ. ఒల్లా. నన్.

**నన్పుకాఁడు** రూ.చూ. ననుపుకాడు. వి. విటుడు, వలపుకాడు. యయా. 1.13.

**నన్పు**[2] రూ.చూ. ననుపు[2]. స.క్రి. వికసింపచేయు.

**నన్బ్రాయి(-ప్రాయి)** చూ. నాను[1]. రూ. నను(బాయి, నను(బ్రాయి. వి. చక్కగా ఉడకని బియ్యం, ఉడికీ ఉడకని బియ్యం. కాశీ. 3.121.

**నపిరీ** రూ.చూ. నఫిరి. వి. వాద్యవిశేషం, ఊది మ్రోగించే వాద్యవిశేషం. రాజవా. 5.61.

**నపీరు** రూ.చూ. నఫిరి. వి. ఊదే వాద్యవిశేషం.

**నప్తాలు** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు.

**నప్ప** రూ. నవ్వ. వి. అబ్బి, శిశువు. ఆం.భా. 2.119.

సం. నప్తృ, నపాత్. కొడుకు, మనుమడు, మనుమరాలు, నప్త్రి; ప్రా. ణత్త, ణత్తిఅ, ణత్తు. దౌహిత్రుడు, పౌత్రుడు, ణత్తిఅ. పౌత్రి, దౌహిత్రి; జై.మహా. నత్తుయ; అ.మా. నత్త, నత్తు, నత్తుఅ, నత్తుఈ; మా. ణత్రికీ; పా. నత్తా.

< సం. నప్తృ.

**నప్పు** స.క్రి. 1. పచ్చీసు మొదలైన ఆటల్లో కాయలు నడిపించు; 2. నరిపోవునట్లుచేయు.

**నఫరాగి** వి. వ్యక్తిత్వం.

హిం.ఉ. నఫర్. నౌకరు, వ్యక్తి, నఫర్ గీ. వ్యక్తిత్వం, సేవ; మరా. నఫర్. వ్యక్తి; పార. నఫర్. వ్యక్తి; అర. నెఫైర్, నఫర్. మూడునుంచి పది వరకు గల వ్యక్తులు.

< ఉ. నఫర్ గీ.

**నఫరు** వి. వ్యక్తి, ఆసామి. హంస. 4.29.

హిం. నఫర్. దాసుడు, వ్యక్తి; మరా. నఫర్. వ్యక్తి; ఉ. నఫర్. నౌకరు, వ్యక్తి; పార. నఫర్. వ్యక్తి, సైనికుడు; అర. నఫర్. వ్యక్తి.

< అర. నఫర్.

**నఫరుగతిగా** క్రి.విశ.(దు. వ్యక్తిగతంగా. **నఫరుగతిలెక్క** వి. ప్రతిఒక్క కొనుగోలుదారు లెక్క.

**నఫరుఖుల్లి** వి. దాన్యం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 762. క్రీ.శ. 1668.

ఉ. నఫర్ కులి, నఫర్. నౌకరు, కులీ. కూలివాడు.

< ఉ. నఫర్ కులీ.

**నఫర్నఫర్** వి. ఒక్కో పనివాడు. ద.హిం.శా. సంపు. 6 శా.సం.771 క్రీ.శ. 1593.

హిం.ఉ. నఫర్. నౌకరు, సేవకుడు.

< ఉ. నఫర్ నఫర్.

**నఫా** వి. 1. లాభం; 2. గిరిజన ప్రాంతాల్లో వ్యవసాయ పెట్టుబడికి 10 కేజీలకు డబ్బు ఇచ్చి, పుచ్చుకున్నప్పుడు 15 కేజీల గింజలు పుచ్చుకునే పద్ధతి.

హిం.ఉ. నఫా. లాభం; మరా. నఫా. లాభం.

< ఉ. నఫా.

**నఫిరి** రూ. నపిరీ, నపీరు, నఫిరీ, నఫీరు. వి. ఒక విధమైన ఊదే వాద్యం. చంద్రభా. 4.28.

హిం.ఉ.పార. నఫిరీ. బాజా, ఒకవిధమైన వాద్యం.

< ఉ. నఫిరీ.

**నఫిరిసేయు(-చేయు)** స.క్రి. బాకా మొదలైనవి ఊది ప్రకటించు.

**నఫిరీ** రూ.చూ. నఫిరి. వి. వాద్య విశేషం, ఊది మోగించే వాద్యవిశేషం. పల్నా. క్రీ.శ. 1650.

**నఫీరు** రూ.చూ. నఫిరి. వి. వాద్యవిశేషం, ఊదిమోగించే వాద్యవిశేషం, హంస, 3.29.

**నబాబు** రూ.చూ. నవాబు. వి. మహమ్మదీయ ప్రభువు. రంగా.చ. 1.118.

**నబీ** రూ. నబ్బి. వి. పైగంబరు, దేవదూత. రంగా.చ. 3.99.

హిం.ఉ.పార. నబీ. పైగంబరు.

< ఉ. నబీ.

**నబోతికానేకుండ** రూ. నముబూట్‌ఖానాకుండ, నహుబూత్‌ఖానాకుండ, నేంబోతికానాకుండ, నౌబోతికానాకుండ. వి. పెద్ద నగారాలాగా ఉండే వాద్యనికివాడే మట్టికుండ.

హిం.ఉ. నౌబత్. వాద్యవిశేషం.

**నబ్బి** రూ.చూ. నబీ. వి. పైగంబరు, దేవదూత. విశ్వే.శ.

**నభ్తీ** వి. లేత ఎరుపు, తెల్ల ఉన్నికి వేసే రంగు.

**నమయించు** స.క్రి. నిర్మించు. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 3.

**నమలఁబెట్టు** చూ. నములు.

**నమలి** రూ.చూ. నమిలి. వి. కేకి, మయూరం. రం.రా.ఉ. 38 పు. 17 పం.

**నమలిఅంచు** రూ.చూ. నెమలిఅంచు. వి. నెమిలి బోర్డరు, నెమలి ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. **నమలికండ్లసాపు** రూ.చూ. నెమలికండ్లచాపు. వి. అంచుల మధ్య నెమలికళ్ళ ఆకారంలో డిజైను నేసిన రెండు పంచెలు. **నమలికన్నుకాల్వ** రూ.చూ. నెమలికన్నుకాల్వ. వి. కాల్వలో నెమలికన్నులమాదిరి ఏర్పడినమచ్చ. **నమలికూజా** రూ.చూ. నెమిలికూజా. వి. నెమిలి మూతి ఆకారంలో ఉండే కూజా.

**నమలిమింగుదామని ఉండు** చూ. నములు.

**నమలు** రూ. నములు, నవులు, నౌలు. స.క్రి. **1.** తినే పదార్థాన్ని నలిగేటట్లుగా పళ్ళతో ముక్కలు చేయు. కు.సం. 4.107 ; **2.** ఆస్వాదించు, అనుభవించు. కు.సం. 6.67 ; **3.** భక్షించు, తిను. కు.సం. 10.170.

క. నమై, నమలు, నెవడు. నములు, నెమరువేయు, తిను ; తు. నంకుని, నంవుని. నములు; త. నెనున్కు. నలగ్గొట్టు, నలుపు.

మూ.ద.ద్రా. *నఁయ్-/ *నెఁయ్-> *నయ్-/ *వెయ్-.

**నమలఁబెట్టు** స.క్రి. **1.** నమలించు. దశకు. 6.125 ; **2.** స్తన్యమొసగు, పాలిచ్చు. < నములు + -అ[7] + పెట్టు. **నమలిమింగుదామనిఉండు** అ.క్రి. అతికోపంగా ఉండు.

**నమాజు** రూ. నిమాజు. వి. మహమ్మదీయుల దైవ ప్రార్థన. సింహ. శ. 8.

హిం.ఉ.పార. నమాజ్. మహమ్మదీయుల దైవ సంబంధి ప్రార్థన ; మరా. నమాజ్, నిమాజ్.

< ఉ. నమాజ్.

**నమాజుగహా** రూ. నమాజుగా, నామాజుగా, నిమాజుగహ, నిమాజుగాహ. వి. మసీదు, ముస్లిముల ప్రార్థన మందిరం.

హిం.ఉ.పార. నమాజ్‌గాహ్. నమాజుచేసే మందిరం. మరా. నమాజ్‌గహా, నిమాజ్‌గహ.

< ఉ. నమాజ్‌గాహ్.

**నమాజుగా** రూ.చూ. నమాజుగహా. వి. మసీదు.

**నమిలి** రూ. నమలి, నమ్మి, నమ్మిలి, నమ్ము[2], నెమలి, నెమిలి, నెమ్మలి, నెమ్మి[1], నెమ్మిలి, నెవిలి. వి. **1.** కేకి, మయూరం. కు.సం. 2.72 ; **2.** నారనిచ్చే ఒకమొక్క.

క. నవల్, నవిల్, నవిలు, నవిల, నవులు, నెమలి. నెమలి ; తు. నెయులు ; త. ఞామలి, నవిరమ్ ; కొలా. నమ్లి, నమ్లి, లమ్లి ; నా. నమ్లి, లమ్లి.

< మూ.ద్రా. ఞమల్.

**నమిలికండ్లంచు** రూ.చూ. నెమిలికండ్లంచు. వి. నెమలి కళ్ళ ఆకారంలో డిజైను నేసిన అంచు. **నమిలికన్నంచు** రూ.చూ. నెమలికన్నంచు. వి. నెమలికన్ను ఆకారంలో డిజైను నేసిన అంచు.

**నముబూట్‌ఖానాకుండ** రూ.చూ. నబోతికానేకుండ. వి. పెద్ద నగారాలాగా ఉండే వాద్యానికి వాడే మట్టికుండ.

**నమురు** వి. ఆము, మదం. శ్రీరం. మా. 1.132.

**నములు** రూ.చూ. నమలు. స.క్రి. నమలు.

**నముళ్లు** వి.బ.వ. మోకాళ్ళవాపు.

**నమూదగు** చూ. నమూదు.

**నమూదు** రూ. నమోజు, నమోదు. విశ. కనుపరచబడినది ; వి. లభించటం.

హిం.ఉ. నమూద్. ప్రకటితం ; మరా. నమోద్ ; పార. నమూద్. నిదర్శనం.

< ఉ. నమూద్.

**నమూదగు** అ.క్రి. రికార్డులోకెక్కు.

**నమూనా** రూ. నమోనా. వి. **1.** రూపం ; **2.** పద్ధతి, మాదిరి.

హిం.ఉ. నమూనా. మాదిరి ;

త. నమూనా. మాదిరి.

< ఉ. నమూనా.

**నమోజు** రూ.చూ. నమూదు. వి. పేరు చేర్చటం.

**నమోదు** రూ.చూ. నమూదు. వి. పేరు చేర్చటం ; విశ. కన్పరచబడిన, వివరించబడిన.

**నమోనచేయు** చూ. నమోనా. స.క్రి. మట్టిలో మసి, ఇసక కలిపి కుమ్మి పాకంచేయు.

**నమోనా** రూ.చూ. నమూనా. వి. మాదిరి.

**నంబరిటెకె** చూ. నంబరు.

**నంబరు** రూ. నెంబరు. వి. సంఖ్య.

ఇం. *Number*. సంఖ్య.

<ఇం. Number.

**నంబరిటెకె** వి. సర్కారు ప్రమాణాల ప్రకారం సరైన కొలతల్లో ఉన్న పెద్ద ఇటిక. <నంబరు + ఇటికె. **నంబరు జల్లెడ** వి. సిమెంటులో కలపదగిన ఇసకను రాళ్ళు మొదలైన వాటినుంచి వేరు చేయటానికి వాడే ఇసకజల్లెడ. **నంబర్ రాయి** రూ. నెంబరు రాయి, నెంబర్ రాయి. వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన సర్వేరాయి. **నంబర్‌రౌతు** వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన సర్వేరాయి. **నంబర్లు** రూ. నెంబర్లు. వి.బ.వ. గింజసన్నరకం నెంబరు వడ్లు.

**నంబర్‌రాయి** చూ. నంబరు.

**నంబర్‌రౌతు** చూ. నంబరు.

**నంబర్లు** చూ. నంబరు.

**నంబి** వి. **1**. విష్ణుపూజకుడు. వైఖానస సూత్రానుసారంగా విష్ణ్వాలయంలో పూజ చేసేవాడు. ద.హిం శా.సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1191 ; **2**. దేవుని భక్తుడు, దాసుడు. హం. 2.6 ; **3**. భగవంతుడు. ఆము. 6.49 ; **4**. శివార్చకుడు, దేవలుడు. శుక. 3.442.

క. నంబి. వైష్ణవభక్తుడు ; త.మ. నంపి. పూజనీయుడు, భక్తుడు.

<త. నంపి.

**నంబికొండయదండనము** వి. సులభం. **నంబిపెరుమాళ్లు** రూ.చూ. నంబెరుమాళ్లు. వి. శ్రీరంగనాయకులు. **నంబెరుమాళ్లు** రూ. నంబిపెరుమాళ్లు. వి. శ్రీరంగనాయకులు. చమ. 1.13.

**నంభెరుమాళ్లు** చూ. నంబి.

**నంబ్యారులు** చూ. నంబి వి.బ.వ. పూజారులు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 902. క్రీ.శ. 1378.

**నమ్మకము** యా.చూ. నమ్మిగ. వి. విశ్వాసం.

**నమ్మకు** వి. ఉప్పు.

హిం.ఉ. నమక్. ఉప్పు.

<ఉ. నమక్.

**నమ్మదుంప** వి. **1**. గొట్టిగడ్డ, కశేరుకంకు. కు.సం. 3.250 ; **2**. మాగాణిలోను, నిలకడ నీటిలోను ఎక్కువగా మొలిచే కలుపుమొక్క (Aponogeton notons, Aponogeton monostachyon).

**నమ్మాళువార్లు** వి.బ.వ. పన్నిద్దరాళ్వార్లలో ఒకడు, ద్రావిడ ప్రబంధకర్త. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556.

**నమ్మి** రూ.చూ. నమిలి. వి. నెమలి. కు.సం. 3.7.

**నమ్మిక** యా.చూ. నమ్మిగ. వి. **1**. విశ్వాసం. హరి.ఉ. 7.188, **2**. నమ్మటానికి ఆధారమైన వాక్యం, ప్రమాణం. శివరా. 3.79.

**నమ్మికకా(పు** వి. నమ్మకంతో కాచేవాడు. పారి. 2.59. **నమ్మికపుట్ట(బలుకు** స.క్రి. **1**. విశ్వాసమేర్పడేటట్లు మాట్లాడు. రాజగో. 2.12 ; **2**. విశ్వాస మేర్పరచు.

**నమ్మిగ** చూ. నమ్ము. రూ. నమ్మకము, నమ్మిక. వి. నమ్మకం, విశ్వాసం. భార. ఉద్యో. 1.315.

క. నంబికె. నమ్మకం ; త. నంపిక్కై ; మ. నంపిక్క.

**నమ్మించిగొంతుకకోయు** చూ. నమ్ము[1].

**నమ్మించు** చూ. నమ్ము[1].

**నమ్మినకా(పు** చూ. నమ్ము[1].

**నమ్మినబంటు** చూ. నమ్ము[1].

**నమ్మినవా(డు** చూ. నమ్ము[1].

**నమ్మినాన(బోసికొను** చూ. నమ్ము[1].

**నమ్మియుండినఫలము** చూ. నమ్ము[1].

**నమ్మిలి** రూ.చూ. నమిలి. వి. నెమిలి, మయూరం.

**నమ్ము[1]** స.క్రి. **1**. విశ్వసించు. భార. ఆది. 4.30 ; **2**. ఆశ్రయించు. దశా. 1.41.

క. నంబు. నమ్ము. విశ్వసించు, నమ్బికె. నమ్బిగె, నెమ్బుగె. నమ్మకం ; కొ. నంబ్ (నంబి-). నమ్ము, నమ్మిక ; తు. నంబుని, నమ్ముని. నమ్ము, విశ్వసించు, నమ్బిగె. భక్తి, విశ్వాసం ; త. నంపు (నంపి-). కోరు, ఆశించు, నమ్ము, విశ్వసించు, నంపిక్కై. నమ్మకం, నమ్పల్. కోరిక, నమ్మకం. నమ్పకమ్. నమ్మకం, నవ్వు (నవ్వి-). ఆతురతలో చూచు. గట్టిగానమ్ము ; మ. నంపుక. నమ్మిక, నంపిక్క ; కో. నంబ (నంబ్య-) నమ్మిక. నంబ్యక్. నమ్మకం ; తొ. నొబ్- (నొబ్య). నమ్మకం, నొబ్క్య. నమ్మకం, ప్రమాణం ; కువి. నామలి. నమ్మడం, నా(మ్మినై. నమ్మడం, నమ్మకం.

**నమ్మించిగొంతుకకోయు** స.క్రి. నమ్మించి మోసంచేయు. వరాహ. 2.186. **నమ్మించు** స.క్రి. విశ్వసింపచేయు. భార. ఆది. 5.56. **నమ్మినకా(పు** వి. విడవకుండా కనిపెట్టుకొని ఉండేవాడు. బంటు. భాస్క. రా. యు. 1303. **నమ్మినబంటు** వి. **1**. ఆప్తుడు. భార. ద్రోణ. 4.178 ; **2**. విశ్వసించినవాడు. **నమ్మినవా(డు** విశ. **1**. ఆప్తుడు. భార. శాంతి. 2.381 ; **2**. విశ్వసించినవాడు. భాగ. 10పూ. 1742. **నమ్మినాన(బోసికొను** (-పోసికొను) అ.క్రి. నమ్మిచెడిపోవు. **నమ్మియుండినఫలము** వి. నమ్ముకొని ఉన్నందుకు ఫలితం. పారి. 1.125. **నమ్మువా(డు** విశ. ఆప్తుడు, స్నేహితుడు.

**నమ్ము[2]** రూ.చూ. నమిలి. వి. నెమలి.

**నయ** రూ.చూ. నయము. వి. అందం, మనోజ్ఞత. ఆము. 6.128.

**నయగారము** విశ. కపటమైన. పారి. 1.125 ; వి. **1**. విలాసం. రామాభ్యు. 2.38 ; **2**. ప్రియవాక్యం. పాండు. 3.43 ; **3**. మనోజ్ఞత. ఒప్పు, అందం. సారంగ. 1.135 ; **4**. అలంకారం. శుక. 1.254 ; **5**. మంచితనం ; **6**. మృదుత్వం. **నయగారి** విశ. మనోహరమైన. అష్టమ. క. 3.129పు. 19పం. **నయగారితనము** వి. మృదువాచాలత. మనోహరంగా మాటలాడటం. చంద్రాంగ. 6.150.

**నయం** రూ. నయనం. వి. పోగుసన్నగా, సున్నితంగా ఉండేనూలు.

**నయంసల్ప** చూ. నయము.

**నయగారంగుండు** వి. సున్నం, సిమెంటు పూతలకు సున్న

బరచడానికి వాడేరాయి.

<నయగారము + గుండు.

**నయంచెక్క** చూ. నయము. వి. కొయ్యతో చేసిన శాపి.

**నయంచేయు** చూ. నయము.

**నయనం** రూ.చూ. నయం. వి. పోగుసన్నగా నున్నితంగా ఉండే నూలు.

**నయనపారువ** రూ.చూ. నయనపు పారువ. వి. మల్లబంధ విశేషం. హంస. 1·206.

**నయనపుపారువ** రూ. నయనపారువ. వి. మల్లబంధవిశేషం. ప్రబంధ. 78.

**నయనారు** రూ. నాయనారు, నైనారు. వి. శివభక్తుడు. పండి. చ. 1.290.

త. నాయనార్. ప్రభువు. దేవుడు, శివుడు ; మ. నాయనార్.

<త. నాయనార్.

**నయము** రూ. నయ. విశ. 1. సుకుమారమైన, మృదువైన. కు. సం. 3.62 ; 2. మేలైన. విష్ణుపు. 2 ; 3. రమ్యమైన, అందమైన. సారంగ. 1·135 ; 4. చౌక. ; 5. నునుపైన, నున్నని ; 6. మంచి ; వి. 1. మనోహరత్వం, పొలుపు, అందం. కు. సం. 7.7 ; 2. ఆసక్తి. నిర్వ. రా. 8.36 ; 3. నేర్పు. పల్నా. పు. 6 ; 4. లాభం. పల్నా. పు. 77 ; 5. స్వాస్థ్యం. పి. శకు. 3.44 ; 6. రీతి, విధం. ఇందు. 2.138 ; 7. మెరిసేపూత.

క. నయ. మెత్తనైన, నునుపైన, నెమ్మదైన, ఆనంద దాయకమైన, చవకైన ; తు. నయ. నెమ్మది, మనోజ్ఞమైన, ఆదరణ, మెత్తని, నసె. మెత్తన, నెమ్మది, నేయిమె. శ్రేష్ఠమైన, నెయి-ములి. మెత్తనిగడ్డి, నెయిపన్ని. మెత్తని రకంగడ్డి, మెత్తనికసవు, నెయ్యోళి. మృదువైన తాటిఆకు ; త. నయ (ప్పి-,-న్తి-). గొప్పగా కోరుకొను, కోరిక, గౌరవం. ప్రేమ, నయప్పి (-ప్పి-, -త్తి-). కోరిక లేక ప్రేమకల్పించు, నయప్పు. అభిమానం, ప్రేమ, కోరిక, నయమ్, నయన్. అభిమానం, కోరిక, ఆనందం, సంతోషం, నయవర్. ప్రేమికులు. స్నేహితులు ; మ. నయమ్. నెమ్మదైన, చవకైన.

**నయంసల్పు** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ, నున్నగ సర్పడానికి వాడే సలప. **నయంచేయు** స.క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నయముచూపు** అ.క్రి. వృద్ధిపొందు. కాశి. 4.23. **నయమెక్కు** అ.క్రి. వృద్ధిపొందు. నవనాథ. 1.11పు. 10పం. <నయము + ఎక్కు. **నయమేయు** స.క్రి. నున్నగింత సలపతో రెండోసారి సాపు చేయు. <నయము + వేయు.

**నయమురాయి** వి. అరవైనెంబరు రాయి (Abrosives).

**నయమెక్కు** చూ. నయము.

**నయమేయు** చూ. నయము.

**నయాపైసగడి** వి. ఒకరకం నేతగడి, నయాపైస ఆకారంలో ఉండే గడి.

హిం. నయాపైసా. కొత్తపైసా రూపాయిలో నూరోవంతు నాణెం.

హిం. నయాపైసా + గడి.

**నయాపైసలపేటు** వి. నయాపైసల వరస మాదిరి డిజైను.

హిం. నయాపైసా. రూపాయిలో నూరోవంతు నాణెం.

<హిం. నయాపైసా + లు + -అ + పేటు.

**నయ్యి** వి. పెంటకుప్ప.

**నర** రూ. నరపు, నరుపు. వి. 1. ముసలితనంవల్ల తెల్లబడిన వెంట్రుక. భార.ఆది. 3.194 ; 2. ముసలితనంవల్ల వెంట్రుకలు తెల్లబడటం. ఆము. 4.270.

క. నరె. వెంట్రుకల తెల్లదనం, నరతి. తెల్లబడ్డ వెంట్రుకలున్న స్త్రీ. నరె. తెల్లబడ్డ వెంట్రుకలు, తెల్లబడు ; కొడ. నెరై. తెల్లన ; తు. నరె. తెల్లదనం, నరయె. తెల్ల జుట్టున్న వ్యక్తి, నరెతి. తెల్లమచ్చలున్న ఆవు, నరెపుని. (జుట్టు) తెల్లగాఅగు ; త. నరై. నెరయు, తెల్లదనం, తెల్లఎద్దు, (-ప్పి-, -త్తి-). జుట్టు నెరియు, పండిపోవు, పంటలు వాడిపోవు ; మ. నర. తెల్లదనం, ముసలితనం, నరెక్క. తెల్లగాపెరుగు, తెల్లబడు. నరప్పిక్క. ముసలితనంవచ్చు ; కో. నర్. తెల్లవెంట్రుకలు ; తొ. నర్. తెల్లన.

**నరవెండ్రుక** వి. నెరసిన వెంట్రుక, ఫలితకేశం. కాశీ. 7.159.

**నరం** రూ.చూ. నార. వి. 1. ఏకుబద్దల కొన(ల)కు కట్టిన జంతునరం ; 2. దూది ఏకటానికి బద్ద (ఏకు విల్లు)కు చుట్టే (ఎద్దు) నరం ; 3. కమాను (దూది ఏకే కొయ్య పనిముట్టు)కు చుట్టే (ఎద్దు) నరం.

**నరంలా** చూ. నరము.

**నరకఁడు** వి. 1. మోటువాడు, మొద్దు. సురా. 59 ; 2. క్రూరుడు, దుష్టుడు. హంస. 3.234.

సం. నారక-. నరకవాసి ; ప్రా. ణారగ, ణారయ.

**నరగ** వి. నరగజం, వాద్యవిశేషం, భేరి. పల్నా.పు. 4.

క. నరకు. మూల్గు, సణగు, నరటు. వణకడం, నరల్, నెరళు. మూల్గు, సణుగు ; కొడ. నెరక్- (నెరకి). సణుగు ; తు. నరకుని, నర్కుని, నరులుని, నర్లుని, నెర్లుని, నరకెలె, నర్గెలె. వణికేవాడు, నరళుని. నిట్టూర్చు, సణగు, గొణుగు, నరటుని. వణుకు ; త. ఞరల్ (ఞరాల్వ్-), (ఞరన్థ్). శబ్ద మగు, శబ్దంచేయు, ఞరల్. శబ్దం, అడుపు. నరల్ (నరల్వ్-, నరన్థ్-). శబ్దంచేయు, గర్జించు, కూనిరాగం తీయు, ఏడ్చు, నరల్వు. శబ్దంచేయడం, గర్జించడం, వేణునాదం, గట్టిగొంతు, నరలై. గర్జించడం (సముద్రం). నరఱ్ఱు (నరఱ్ఱి). శబ్దంచేయు ; మ. ఞరజుక, నరజుక. అరచు, మూల్గు, సణగు, ఞరక్కమ్, నరక్కమ్. మూల్గు, సణుగు ; కురు. నర్యయానా. కూనిరాగంతీయు, దృష్టి మరల్చుకోడానికి గట్టిగా ఏడ్చు లేక నిట్టూర్చు ; మాల్తొ. నిరె. సణగు, నెర్క్వె. సణుగు, మూల్గు ; హిం. నగారా.

**నరగబుడ్డి** వి. చర్మకట్టు వాద్యాలకు ఉపయోగించే మట్టి బుడ్డి.

**నరగజము** చూ. నరగ. వి. వాద్యవిశేషం. రం.రా.యు. ;

ఆం.భా. 1.127.
నరంకొట్టు చూ. నరము.
నరద వి. పగులు, బీట.
నరన వి. ఆకుపచ్చ కలిసిన పసుపురంగు పూలు పూసే కలప నిచ్చే చెట్టు (Premna Tomentora).
నరపమీసము చూ. నరపు.
నరపవాఱు చూ. నరపు.
నరపవెండ్రుకలు చూ. నరపు.
నరపు ఈ.చూ. నర. వి. పలితం, తెల్లబడినది. కకుత్థ. 4.24.
నరపమీసము వి. నరపుకలమీసం. మను. 4.36. నరపవాఱు (-పాఱు) వి. నరాలతో ఏర్పరచిన తాడు. నరపుపట్టిక. హరిశ్చ. 4.213. నరపవెండ్రుకలు వి.బ.వ. తెల్లబడ్డ వెంట్రుకలు. విక్ర. 2.117.
నరమానవుడు వి. మనుష్యమాత్రుడు.
నం. నర-. మనుష్యుడు, మానవ-. మనుష్యుడు.
<నం. నరమానవ- (అర్థవిపరి.).
నరమామిడి[1] వి. ఉత్తర సర్కారుల్లోనూ విశాఖ శ్రీకాకుళం మొ॥ ప్రాంతాల్లోని కొండల్లో పెరిగే చెట్టు (Litsea Polyantha).
నరమామిడి[2] వి. లేతపసుపురంగు బెరడు ముదురురంగు కఱ్ఱ కల కలపనిచ్చే చెట్టు (Alseodaphne Semecarpifolia).
నరమామిడి[3] రూ.చూ. నఱ్రమామిడి. వి. మందుల్లో ఉపయోగ పడే ఒకరకం మామిడి.
నరము వి. నాడి. శార.శల్య. 1.180.
క. నర, నరవు. బలం, శక్తి, రక్తనాళం, ధమని; తు. నర, నరంబు. నాడి, ధమని, రక్తనాళం; త. నరమ్బు. ధమని, రక్తపాత్ర; మ. ఞరంపు, నరమ్బు. ధమని, రక్తపాత్ర; కో. నర్బ్. కండరం, బలం; తొ. నర్బ్. కండరం, నరం; కుయి. డ్రాంబు; కువి. నణమి; పర్జి. నెరుబ్; కొలా. నరం; కురు. నరీ; మాల్తొ. నరు;
నం. నాల-. బోలునరం; ప్రా. నాల-ణ్హారు; జై.మహా. ణ్హారు; అ.మా. ణ్హారుం, ణ్హారుణీ; పా. నహారు.
<ప్రా. ణ్హారుం.
నరంలా అవ్య. నన్నగా. నరంకొట్టు న.క్రి. దూడి ఏకేటప్పుడు కమాను నరం కొట్టు. నరములేనినాలుక వి. మాట నిలకడ లేనితనం. నరంబిగదన్నిమాట్లాడు న.క్రి. పరుషంగా మాట్లాడు.
నరయు రూ. నరియు, నెరియు[2]. అ.క్రి. ముసలితనంవల్ల వెంట్రుకలు తెలుపగు. రం.రా.యు. 292 పు. 30 పం.
క. నర, నెరె. తెల్లబడు (జుట్టు మొ॥); మ. నరెవుని. తెల్లబడు; త. నరై. తెల్లజుట్టుగలవాడగు; మ. నరెక్క. తెల్లబడు; కువి. డాయూ-కంచ్. తెలతెల్లబడు, పండు.
నరవ[1] రూ.చూ. నారవ. వి. 1. కొండతోవ. యయా. 2.40; 2. వాన కురిసి పొలంలో పారే నీటివాగు.
నరవ[2] వి. కుండ.
నరవంజి వి. ఒకరకం చెట్టు.
నరవందు వి. ఓషధీ విశేషం. హంస. 4.10.
నరశాసనము వి. ధర్మకర్తలు. నె.శా. ఒంగోలు 101. క్రీ.శ. 1272.
నం. నరశాసన-. మానవుల శాసనం.
<నం. నరశాసన - (అర్థవిపరి.)
నరసింగము మి. వి. మల్ల విద్యా విశేషం, ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. ఆం.భా. 2.209.
నం. నరసింహ-. నరసింహమూర్తి అయిన విష్ణువు; ప్రా. నరసింఘ-. నరశ్రేష్టుడు.
<ప్రా. నరసింఘ-.
నరసింహమానిక వి. నరసింహస్వామి పేరుతో ఉండే మానిక. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1174. క్రీ.శ. 1151.
నం. నరసింహ-. నరసింహస్వామి.
<నం. నరసింహ + మానిక.
నరాజి రూ. నరాజీ, నారాజి, నారాజీ. వి. కత్తి, ఖడ్గం. ఘటికా. 2.88.
హిం.ఉ. నరాజ్, నారాజ్. కోపం.
నరాజీ రూ.చూ. నరాజి. వి. కత్తి. యయా. 1.57.
నరాళాకమహసత్థుళ్ వి.బ.వ. లోకంలోని వర్తక సంఘం. అహదనకర శాసనం. క్రీ.శ. 847.
నరి వి. మర్యాద, హద్దు. పరమ. వి. 3.112. పు. 6. పం.
నరికగొంగడి రూ. నరిగ్గొంగడి. వి. ఒకరకం ముతకరకం ఉన్నితో నేసిన గొంగడి.
నరికిడితాడు వి. చూ. నరికెనతాడు. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.
నరికింతాడు రూ.చూ. నరికెనతాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.
నరికిందాడు(-తాడు) రూ.చూ. నరికెనతాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.
నరికెన వి. ఊడ్తె అడ్డపట్టెకు బిగించిన ఇనప గొంగడి.
నరికెనతాడు రూ. నరికింతాడు, నరికిందాడు, నరికెంతాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.
నరికెంతాడు రూ.చూ. నరికెనతాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసిన తాడు.
నరిగి వి. గొఱ్ఱెల శరీర వర్ణ విశేషం. ఒకరకం గొఱ్ఱె రంగు.
నరిగెలు వి.బ.వ. ఒకరకం తృణధాన్యం.
నరిగ్గొంగడి రూ.చూ. నరికగొంగడి. వి. ఒకరకం ముతకరకం ఉన్నితో నేసిన గొంగడి.
నరిడి వి. పశువులకు వచ్చే గుండె ఉబ్బరం, రోగవిశేషం. హరి.పూ. 6.45.
నరియకొక్కు చూ. నరియఁడు. వి. సర్పవిశేషం.
నరియఁడు వి. నక్క. ఉ.రా. 6.235.
క. నరి. నక్క, నక్కె. ముసలినక్క; కొడ. నరి. పులి; తు. నరి. నక్క, ముసలినక్క; త. నరి. నక్క, పులి; మ. నరి. నక్క, పులి; కో. నఁయ్. నక్క;

తొ. నర్వ్య ; కువి. నక్క, నచ్క. ముసలినక్క ; కొలా. నక్క.

**నరియాళ్ళు** వి.బ.వ. తెలిక వారు.

**నరియు** రూ.చూ. నరయు. అ.క్రి. ముసలితనం వల్ల వెంట్రుకలు తెల్లబడు. నృసింహ. 4.48.

**నరుకు** రూ.చూ. నఱకు. స.క్రి. 1. ఖండించు. పల్నా.వు. 109 ; 2. కత్రకత్తితో లాదుమీద కొట్టు.

**నరుకుకత్తి** వి. ఒకరకం కత్తి. **నరుకుడురాయి** వి. కట్టుబడికిగాని, నేలపై పరవడానికిగాని, స్తంభాలుగా నిలపడానికిగాని, వాడే చెక్కిన లేక మలచిన రాయి.

**నరుజు** వి. చీమల బారు.

**నరుదకన్ను** వి. పశువులకు వచ్చే ఒకకంటి జబ్బు. నవనాథ. 41 పు. 25 పం.

**నరువు** రూ.చూ. నర. వి. ముసలితనం వల్ల వెంట్రుకలు తెల్లపడటం.

**నరుమగు** చూ. నుఱుము. స.క్రి. నలినలి అగు. తాళ్ల.సం. 12.238.

**నరులు** వి.బ.వ. కాల్బలం, పదాతులు. భార.ద్రోణ. 5.303.

సం. నర-. మనుష్యుడు.

<సం. నర- + -లు(అర్థవిపరి.).

**నరెడ** రూ.చూ. నెరిడె[2]. వి. కడుపులో మేత పొట్టకు పైన ఉండే నెరిడెకు వచ్చే గుండె వాపు జబ్బు.

**నర్కు** రూ.చూ. నఱకు. స.క్రి. 1. ఖండించు. పండి.చ. 2.144. పు. 10 పం ; 2. చంపు, సంహరించు. మల్లు. 2.31.

**నర్మద** రూ. నర్మాద, నర్వాద. వి. మడతబందు, రెక్కలు తెరుచుకోడానికి మూసుకోడానికి వీలుగా కమ్ములకు పట్టి ఉంచే రెండురెక్కల పరికరం.

**నర్మాద** రూ.చూ. నర్మద. వి. మడతబందు.

**నర్మిలి** రూ.చూ. అర్మిలి. వి. ప్రేమ, ప్రీతి. భార. శాంతి. 2.156.

**నర్ర[1]** రూ.చూ. నఱ్ఱి. వి. 1. పెంకెద్దు ; 2. ఒకరకం అడవి జాతి ఎద్దు.

**నర్ర[2]** వి. లేతబూడిదరంగు కలిగి గట్టిగా ఉండే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Litsaea Sebifera).

**నర్రమద్ది** వి. ఉత్తరసర్కారుల్లోనూ విశాఖపట్నం గంజాం మొ. ప్రాంతాల్లోని కొండల్లోనూ పెరిగే ఒకరకం చెట్టు (Litsaea Polyantla).

**నర్రమామిడి** రూ. నరమామిడి[3]. వి. మందులకోసం ఉపయోగించే ఒకరకం మామిడి (Tomex Japonica or Tetranthera Monopetala or Leea Staphylea).

**నర్వా** వి. నీళ్ళకోసం దిగడానికి మెట్లు పెట్టిన బావి.

**నర్వాద** రూ.చూ. నర్మద. వి. మడతబందు, రెక్కలు తెరచుకోడానికి మూసుకోడానికి వీలుగా కమ్ములకు పట్టిఉంచే రెండురెక్కల పరికరం.

**నర్సు** వి. 1. దాది ; 2. ఆసుపత్రిలో దాది పని చేసేవాడు.

ఇం. *Nurse*. రోగులకు సేవచేసే వ్యక్తి, దాది.

<ఇం. Nurse.

**నఱకించు** చూ. నఱకు.

**నఱకు** రూ. నరుకు, నర్కు, నఱుకు. స.క్రి. 1. ఖండించు, తెగగొట్టు. భార.విరా. 5.35 ; 2. చంపు, సంహరించు. భార.ఉద్యో. 4.150 ; 3. తొలగించు, పోగొట్టు. ఉ.హరి. 2.49 ; వి. క్షతం, దెబ్బ.

క. నఱకు, నఱుకు ; త. నఱుక్కు(నఱుక్క). ఖండించు, ముక్కలుచేయు ; మ. నఱుక్కక. ముక్కలు చేయు, కాగితంలా ముక్కలుచేయు ; గోం. నర్కానా. ఖండించు, నర్క్. కత్ర మొ. కోయు ; మాల్తో. నర్క్. గోకు, చీల్చు.

<మూ.ద్రా. *నత్.

**నఱకించు** స. క్రి. తెగగొట్టించు. ఉ. హరి. 3.36. <నఱకు + -ఇంచు[3]. **నఱకుడువడు(-పడు)** రూ.చూ. నఱకువడు. అ.క్రి. ఖండితమగు, తెగు. రం.రా. ఉ. 88. పు. 15 పం. **నఱకువడు(-పడు)** రూ. నఱకుడువడు, నఱుకుడువడు. అ.క్రి. తెగు, ఖండితమగు. ఉ.హరి. 2.56. **నఱకువాడు** విశ. హింసించేవాడు.

**నఱమ** విశ. కృత్రిమమైన, కపటంగల. కు.సం. 7.19.

**నఱిముఱి** వి. విలాసం. రం.రా. ఉ. 300 పు. 26. పం.

**నఱుకాడు** చూ. నఱుకు.

**నఱుకు** రూ.చూ. నఱకు. స.క్రి. 1. చంపు, సంహరించు. భార.ద్రోణ. 1.174 ; 2. ఖండించు. భార.ద్రోణ. 1.289 ; వి. 1. కత్తిదెబ్బ. ఆము. 6.85 ; 2. శస్త్రవిద్యావిశేషం. హంస. 1.206.

**నఱుకాడు** అ.క్రి. శత్రువుల్ని సంహరించు. వేణు. శ. 57. <నఱుకు + ఆడు. **నఱుకుడు** వి. ఖండన. జైమినిభా. 8.119. **నఱుకుడువడు(-పడు)** రూ.చూ. నఱకువడు. అ.క్రి. ఖండితమగు, కోతపడు. ఉ.రా. 4.292. **నఱుకుపరువడి** వి. నరుకు, విసురు. **నఱుకుబియ్యము** వి. నన్రుబాయి, ఉడికీ ఉడకని బియ్యం. **నఱుకులాడు** స.క్రి. ఒకరినొకరు నరుకుకొను. <నఱుకు + -లు + ఆడు. **నఱుకులు** వి.బ.వ. మల్లశాస్త్ర విన్నాణాల్లో ఒకటి.

**నఱుక్కు** చూ. నఱకు. వి. గుండె అదరటానికి అనుకరణం. దిగులుపడటానికి అనుకరణం. ఎంద్రాంగ. 3.25.

**నఱుజు** రూ.చూ. నజ్జు. వి. అల్పత్వం. అచ్చ.రా. అరణ్య. 51 ; విశ. అణువు, చిన్నదైన.

క. నఱుజు, నఱజు, నుఱుజు. కంకర, ఇసుక.

**నఱుమాడు** చూ. నఱుము.

**నఱుము** రూ.చూ. నుఱుము. వి. నలి, పొడి. కు.సం. 11.133 ; స.క్రి. బాధించు, పీడించు. అప్ప. 4.237.

**నఱుమాడు** రూ.చూ. నుఱుమాడు, స.క్రి. పొడిచేయు. భార. భీష్మ. 2.237. <నఱుము + ఆడు.

**నఱువు** రూ.చూ. నుఱుము. వి. పొడి. జైమినిభా. 5.20.

**నఱ్ఱి** రూ. అఱ్ఱి[1], నర్ర[1]. వి. 1. పాలు పితకనీయని ఆవు. భార. విరా. 1.101 ; 2. బండి మొ. వాటికి పూన్చతగిన ఎద్దు. భాగ. 10 పూ. 894 ; 3. పెంకెద్దు. నవనాథ. 1.30 పు. 9 పం.

**నల** రూ.చూ. నల్ల[2]. విశ. నల్లని.

నలమేనిదొర వి. కృష్ణుడు, విష్ణువు. కృష్ణరా. 1.2.

**నలఁక** చూ. నలఁగు.

**నలఁకన** విణ. అల్పం, సూక్ష్మం. కావ్యా. చూ. 3.37.

**నలఁకువ** చూ. నలఁగు.

**నలఁగించు** చూ. నలఁగు.

**నలఁగు** రూ. అలఁగు. అ.క్రి. 1. బాధపడు. నిర్వ.రా. 1.72 ; 2. చెడు, పాడగు. నిర్వ.రా. 6.75 ; 3. శ్రమపడు. భార. విరా. 1.135 ; 4. నశించు. భార. విరా. 1.294 ; 5. పీడితమగు, పీడపొందు. భార. శల్య. 2.185 ; 6. నలి అగు, ముక్కలగు. ఆము. 5.155.

క. నలగు, నలుగు. నలిగిపోవు (కాగితాలు, బట్టల్లాగ), (కూరలు మొ. వాటిలాగ) వడలిపోవు, క్షీణించు, నలగిసు, నలుగిసు, నలగగొట్టు ; తు. నలగుని. వెలయు, తగ్గు, జబ్బు ; త. నలంకు (నలంకి). మూర్ఛపోవు, బాధపడు, గట్టిదనంపోవు, నలి. వ్యర్థమగు, నశించు ; నలివు. శ్రమపడు, బాధపడు.

మూ.ద.ద్రా. *నలంక్/-నల్-ఎక్క్.

<మూ.ద్రా. *నల్-.

నలఁక వి. 1. నలకువ ; 2. రేణువు, చిన్నముక్క. **నలఁకువ** రూ.చూ. అలఁకువ. వి. 1. ఆపద, కష్టం. గౌ. హరి. పూ. 369 పం. ; 2. శ్రమ, బాధ. పాండు. 3.24. **నలఁగించు** స.క్రి. నలగజేయు, పీడించు, బాధించు. రాఘవ. 4.219. < నలఁగు + -ఇంచు[3]. **నలఁగుడు** వి. బాధ, కష్టం. మను. 4.37. **నలఁగుడుపడు** రూ.చూ. నలుఁగుడుపడు. అ.క్రి. శ్రమపడు, బాధపడు. ఉ.రా. 5.221. **నలఁగుడుపెట్టు** రూ.చూ. నలఁగుడుపెట్టు. స.క్రి. శ్రమపెట్టు, బాధపెట్టు. **నలఁగుడువడు(-పడు)** రూ.చూ. నలఁగుడుపడు. అ.క్రి. శ్రమపడు, బాధపడు. **నలఁగుడువెట్టు(-పెట్టు)** రూ. నలఁగుడుపెట్టు. అ.క్రి. శ్రమపెట్టు, బాధపెట్టు. ఉ.రా. 5.287. **నలవడు** అ.క్రి. నలుగుడుపడు. వీర. వి. 4.48 < నలఁగు + పడు.

**నలఁచు** చూ. నలఁగు. స.క్రి. 1. మృదితంచేయు, నలుపు. దశకు. 5.99 ; 2. బాధించు, పీడించు. ఉ.హరి. 5.16 ; 3. మెదుపు, కలగలుపు. పరమ. వి. 1.189 ; 4. నశింపజేయు, చంపు. రాజవా. 3.56 ; 5. శ్రమపెట్టు.

**నలఁత** వి. 1. అలత, అల్పరోగం కలవాడు ; 2. పురాణించిన రోగం ; 3. అల్పరోగం ; 4. అనారోగ్యం.

నలఁతగానుండు అ.క్రి. అస్వస్థగాఉండు.

**నలపాటిరోగం** చూ. నలఁవు. వి. పశువు కృశించే జబ్బు.

**నలబై** రూ.చూ. నభ్భాది. సర్వ. నలువది.

**నలభీమపాకం** వి. ప్రశస్తమైన వంట.

సం. నలభీమపాక-. నలుడు భీముడు తయారుచేసే వంట.

<సం. నలభీమపాక-. (అర్థవిపరి.).

**నలబై** రూ.చూ. నభ్భాది. సర్వ. నాలుగు పదులు.

**నలఁపు** చూ. నలఁచు. రూ. నలుపు[1], నల్పు[2]. స.క్రి. 1. మృదితం చేయు. కు.సం. 5.90 ; 2. బాధించు, పీడించు. రాఘవ. 2.105.

**నలవడు** చూ. నలఁగు.

**నలి** చూ. నలియు. క్రి. విణ. ద్రు. 1. క్రమంగా. భార. ఆది. 8.289 ; 2. బిగ్గరగా. భార. కర్ణ. 1.122 ; 3. అర్హంగా, తగినట్లు. భార. అరణ్య. 7.393 ; 4. నిశ్చలంగా. ద్వి. భాగ. 2.29 ; విణ. 1. అత్యంతం, మిక్కిలి. కు.సం. 1.78 ; 2. అందమైన. కు.సం. 4.93 ; 3. సన్నని. భాగ. 10 ఉ. 4.88 ; వి. 1. ఉత్సాహం. కు.సం. 6.98 ; 2. ప్రేమ, అనురాగం. నిర్వ.రా. 8.73 ; 3. లాఘవం. భార. ద్రోణ. 1.176 ; 4. పొడి, తుమురు. బసవ. 3 పు. 532 పం. ; 5. ఎండుగడ్డి. ఆం.భా. 2.76 ; 6. ఇంచిమంచి, చిరుతిండి. ఆం.భా. 3.45 ; 7. ఒప్పు, అందం. ఆం.భా. 3.45 ; 8. బాధ, పైరులో మొలిచిన గడ్డి, కలుపు ; 9. పొగచెట్టు తల పైని చెండు (పూత) గిల్లిన తరవాత పుట్టే చిగురు.

**నలికండ్లపాము** రూ. నల్లికల్లపాము. వి. నలికీచు, రక్తపుచ్చిక. **నలికిరిపాము** రూ. నలికిలిపాము. వి. నలికిలిపాము. **నలికిలిపాము** రూ.చూ. నలికిరిపాము. వి. నలికిరిపాము. **నలికీఁచు** వి. నలికిలిపాము. **నలిగులి** విణ. 1. బద్ధలైన, బీటలువారిన. భార. భీష్మ. 3.117 ; 2. మిక్కిలి నలిగిన. హరి. పూ. 4.16 ; 3. క్షీణించిన, తగ్గిన. హరి.ఉ. 9.31. **నలిగులియగు(-అగు)** అ.క్రి. నగ్గునూచమగు.. పొడగు. భార. భీష్మ. 3.117. **నలిగొట్టు(-కొట్టు[1])** స.క్రి. పిండిగాకొట్టు. కు.సం. 12.178 ; విణ. సన్నమైన, హీనస్వరంకల. గౌ. హరి. ఉ. 1876 పం. **నలిగొను(-కొను)** అ.క్రి. ఉత్సాహపడు. పండి.చ. 3.176 పు. **నలితిండి** వి. చిరుతిండి. **నలితిండికాఁడు** వి. సోమరి. ఆం.భా. 3.6. **నలితొలిలేని** విణ. బొక్కలులేని. **నలినజ్జుచేయు** స.క్రి. నుగ్గుచేయు. సారంగ. 1.101. **నలినలియగు(-అగు)** అ.క్రి. నలిగిపోవు. **నలిపెట్టు** స.క్రి. బాధపెట్టు, బాధించు. దశకు. 4.82. **నలిపొట్టు** వి. అడవిలో దొరికే పొట్టు లేక సన్నసన్న పేళ్ళు. **నలిబడ** క్రి.విణ. ఎక్కువగా. **నలిబిలి** విణ. కొరకబడిన. కువ.చ. 3.54. **నలిరేఁగు** అ.క్రి. విజృంభించు. భార. ఆది. 6.71. **నలిసట్టా** వి. చిన్నచిన్న కనపు గట్టా. బసవ. 3.65.

**నలికం** వి. 1. రాతిస్తంభాల మట్లను చెక్కేతీరు. చెక్కుడు ; 2. ఆర్చికి పక్కన వచ్చే సొట్టకు వెలుపలి భాగం ; 3. స్తంభానికి పైన దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొనవాలుగా ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తుభాగం ; 4. పెద్దరాతి బండలనుంచి పొరలు పొరలుగా రాతి పలకలను వేరుచేయడానికి కొలత ప్రకారం పగలగొట్టడానికి గుర్తుగా గీసిన గీత.

**నలికము** చూ. నలియు. విణ. 1. సన్నని. కు. సం. 3.294 ; 2. చిన్న. నవనాథ. 1.11పు. 17పం. ; వి. సన్నదనం. తనుత్వం. నవనాథ. 2.103పు. 3పం.

**నలికాయ** చూ. నల్ల[2]. వి. మిరపకాయలకు నల్లటి పేను పడే తెగులు.

**నలికించు** వి. నలికండ్లపాము.

**నలికిడితాడు** రూ.చూ. నడికెడితాడు. వి. ఊడ్తె అడ్డపట్టెకు మధ్య వేసినతాడు.

**నలి(గినల్లేరగు** చూ. నలు(గు.

**నలితం** వి. స్తంభానికి పైన దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొన చదునుగా ఉండేటట్లు, కట్టిన సన్నటి పొడుగాటి ఉబ్బెత్తుభాగం.

**నలియు** చూ. నల(గు. నులియు. అ.క్రి. **1**. చిదుకు. కు. సం. 2.200 ; **2**. బాధపడు. భార. విరా. 2.27 ; **3**. నలుగు. పొడిఅగు. భార. భీష్మ. 2.211 ; **4**. ముక్కలగు. విరుగు. ఉ. హరి. 3.70 ; **5**. మర్దించబడు. ప్రబోధ. 2.72 ; **6**. చచ్చు.

**నలిసిపోవు** అ.క్రి. చనిపోవు, చచ్చు. నీతి. శ. 58.

**నలిసిపోవు** చూ. నలియు.

**నలీనస్త్రా** చూ. నలి.

**నలు** వి. వృత్తిలో హల్లుపరమైతే నాలుగుకాదేశంగా వచ్చే రూపం.

**నలుకాలు** రూ. నలుగాలు, వి. నాలుగుకాళ్ళు, పాద చతుష్టయం. హరి. పూ. 4.135. **నలుగడ (-కడ)** రూ.చూ. నల్గడ. వి. నాలుగు దిక్కులు. భార. ఆది. 8.200. **నలుగడలు (-కడలు)** రూ. నల్గడలు. వి.బ.వ. నాలుగు దిక్కులు. శృం. నై. 8.12. **నలుగంబాలాట** వి. నాలుగు స్తంభాల ఆట, ఆడపిల్లల ఒక ఆట. కళా. 6.202. **నలుగాలిది(-కాలిది)** రూ. నలుగాలియది. వి. నాలుగు కాళ్ళ జంతువు. భార. శాంతి. 1.71. **నలుగాలియది(-కాలియది)** రూ.చూ. నలుగాలిది. వి. నాలుగుకాళ్ళ జంతువు. భార. అశ్వ. 4.181. **నలుగాలు (-కాలు)** రూ.చూ. నలుకాలు. వి. నాలుగు కాళ్ళు. కావ్యా. చూ. 5.30. **నలుగేలు (-కేలు)** వి. నాలుగు చేతులు. పారి. 1.4. **నలుచదరము** రూ. నల్చదరము. వి. చతురం. **నలుజాము** వి. నాలుగుజాములు. **నలుజాములు** వి.బ.వ. నాలుగుజాములు. నీలా. 1.34. **నలుతుము** రూ. నల్తుము, నల్దుము. వి. నాలుగుతూములు. ఆం. భా. 2.271. **నలుదిక్కు** రూ. నల్దిక్కు. వి. నాలుగు దిక్కులు. నిర్వ. రా. 3.21. **నలుదిక్కులు** రూ. నల్దిక్కులు వి. బ. వ. నాలుగుదిక్కులు. భార. విరా. 1.161. **నలుదెస** రూ. నల్దెస. వి. నాలుగుదిక్కులు. నిర్వ. రా. 10.58. **నలుదెసలు** రూ.చూ. నల్దెసలు. వి.బ.వ. నాలుగు దిక్కులు. ఆము. 4.35. **నలుపలము** వి. నాలుగు పలాలు. ఆం. భా. 2.268. **నలుమడి** వి. నాలుగురెట్లు. **నలుమడించు** అ.క్రి. నాలుగంతలగు. నాలుగు రెట్లధికమగు. భార. విరా. 5.341 ; స.క్రి. నాలుగురెట్లుచేయు. **నలుమడించుకొను** స.క్రి. నాలుగురెట్లు చేసుకొను. భార. అను 3.297. **నలుమాఱు** వి. నాలుగు పర్యాయాలు. కావ్యా. చూ. 4.38. **నలుమొగంబులప్రోడ** రూ.చూ. నల్మొగంబుల ప్రోడ. వి. చతుర్ముఖుడు, బ్రహ్మ. **నలుమొగంబులయన్న (-అన్న)** వి. బ్రహ్మ, చతుర్ముఖుడు. ఉ.రా. 5.248. **నలుమొగంబులవేల్పు** వి. చతుర్ముఖుడు, బ్రహ్మ. నీలా. 1.52. **నలుమోమయ్య** వి. చతుర్ముఖుడు, బ్రహ్మ. దశా. 2.66. < నలుమోము + అయ్య. **నలుమోములపాదుసా** వి. బ్రహ్మ. వేంక. ఆం. దేవ. 6. **నలువంక** రూ. నల్వంక. వి. నాలుగుదిక్కులు. వరాహ. 4.116. **నలుసాల** వి. చతుశ్శాల, చుట్టుకొల్లారు. నాలుగిళ్ళభవంతి. ఆం. భా. 2.14. **నల్గడ** రూ. నలుగడ. వి. నాలుగుదిక్కులు. భార. ఆది. 2.91. **నల్గడలు (-కడలు)** రూ.చూ. నలుగడలు. వి.బ.వ. నాలుగుదిక్కులు ద్వి. పరమ. వి. 4.290వ. **నల్చదరము** రూ.చూ. నలుచదరము. వి. నాలుగు భుజాలు సమాన పరిమాణంలో ఉన్న చతురస్రం. **నల్తిగ** వి. ఇరారు. ఆం. పదా. నర. 124. **నల్తుము** రూ.చూ. నలుతుము. వి.బ.వ. నాలుగు తూములు. **నల్దిక్కు**. రూ.చూ. నలుదిక్కు. వి. నాలుగుదిక్కులు. ఉ. హరి. 6.168. **నల్దిక్కులు** రూ.చూ. నలుదిక్కులు. వి.బ.వ. నాలుగు దిక్కులు. శృం. నై. 3.88. **నల్దుము** రూ.చూ. నలుతుము. వి. నాలుగుతూములు. **నల్దెస** రూ.చూ. నలుదెన. వి. నలుగడ, నాలుగుదిక్కులు. భార. విరా. 3.202. **నల్దెసలు** రూ. నలుదెసలు. వి.బ.వ.నాలుగుదిక్కులు. కు. సం. 11.76. **నల్మొగంబులప్రోడ** రూ. నలుమొగంబులప్రోడ. వి. చతుర్ముఖుడు, బ్రహ్మ. నీలా. 1.15. **నల్మోముదేవర** వి. బ్రహ్మ. **నల్వంక** రూ.చూ. నలువంక. వి. నాలుగుదిక్కులు. వరాహ. 10.22.

**నలుకు** చూ. నలియు. వి. ముక్క.

**నలుగంత** విశే. బాగా చిన్నది, రేణువంత.

**నలుగురిచేత(గాదనిపించుకొను** చూ. నలుగురు.

**నలుగురితోనారాయణ** చూ. నలుగురు.

**నలుగురినోట(బడు** చూ. నలుగురు.

**నలుగురినోళ్లలోనాను** చూ. నలుగురు.

**నలుగురిలోకరుగు** చూ. నలుగురు.

**నలుగురిలోతలెత్తుకొనితిరుగు** చూ. నలుగురు.

**నలుగురు** రూ.చూ. నల్వురు. సర్వ. బ.వ. **1**. ఇతరులు, లోకులు. శుక. 3.34 ; **2**. నాలుగుమంది ; **3**. అందరు.

**నలుగురిచేత(గాదనిపించుకొను** స.క్రి. చెడ్డపేరుతెచ్చుకొను. హేమా. పు. 84. **నలుగురితోనారాయణ** వి. అందరూపోయిన దారినే మనమూపోదాం అనేపట్ల ఉపయోగించే పలుకుబడి. **నలుగురినోట(బడు** అ.క్రి. దూషణపాత్రుడగు, చెడ్డపేరు తెచ్చుకొను. వేంక. ఆం. 1.28. **నలుగురినోళ్లలోనాను** అ.క్రి. చెడ్డపేరుతెచ్చుకొను. **నలుగురిలోకరుగు** అ.క్రి. చులకన అగు. **నలుగురిలోతలెత్తుకొనితిరుగు** అ.క్రి. గౌరవంగా బ్రతుకు. **నలుగురుండిన చోటనిల(బెట్టు** స.క్రి. పదుగురిలోపెట్టు. పెద్దమనుష్యుల ముందుంచు. శుక. **4.42**. **నలుగురునాలుగుదారులగు** అ.క్రి. ఛిన్నాభిన్నంగా వెళ్ళిపోవు, ఎవరికివారేఅగు.

**నలు(గిడు** చూ. నలు(గు.

**నలు(గు** చూ. నల(గు. రూ. నల్గు. వి. **1**. తలంటుకొనేటప్పుడు నూనె మొ॥ వాటితో శరీరానికి రాసే పిండి. భార.విరా. 2.221 ; **2**. ఉద్వర్తనం, తలంటుకొనేటప్పుడు నూనె మొ॥ నవి పోవటానికి రాచుకొనే సంస్కార విశేషం. రం. రా.బాల. 74 పు. 26 పం. ; **3**. మైపూత కుపయోగించే కుంకం, చందనం మొ॥ నవి. భీమ. 2.124 ; అ.క్రి. **1**. కృశించు, తగ్గు ; **2**. నలిఅగు.

**నలి(గినల్లేరగు** అ.క్రి. పూర్తిగా చితికిపోవు. **నలు(గిడు**

అ.క్రి. ఉద్వర్తనంచేయు, మురికిపోవటానికి శరీరానికి పిండి రాచి నలుపు. మను. 5.56. <నలుఁగు+ఇడు. **నలుఁగుడు** రూ.చూ. నల్గుఁడు. వి. శ్రమ, బాధ. **నలుఁగుడుపడు** రూ. నలఁగుడుపడు, నలఁగుడువడు. అ.క్రి. బాధపడు. శుక. 3.363. **నలుఁగుపిండి** వి. నలుగు పెట్టుకొనే పిండి. **నలుఁగుపూయు** స.క్రి. నలుగుపిండితో శరీరాన్ని మర్దనచేయు. **నలుఁగుపెట్టు** రూ.చూ. నలుఁగువెట్టు. స.క్రి. **1**. నలుగుపిండితో ఒళ్ళంతా నలుచు. ప్రభా. 4.129 ; **2**. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాసి చుట్టూ గీత గీయు. **నలుఁగులునలుచు** స.క్రి. నలుగుపిండితో ఒళ్ళంతా రుద్దు. బసవ. 3.58. **నలుఁగువెట్టు (-పెట్టు)** రూ. నలుఁగు పెట్టు, నల్గుపెట్టు, నల్గువెట్టు. స.క్రి. కుంకుమ, పసుపు, నలుగుపిండి మొ॥ వాటితో ఉద్వర్తనంచేయు. శృం.నై. 8.96.

**నలుచు** చూ. నలఁగు. రూ. నల్చు. స.క్రి. నలగగొట్టు, మర్దించు. దశా. 7.2.

**నలుపగు** చూ. నలుపు².

**నలుపు¹** రూ.చూ. నలఁపు. స.క్రి. నలుచు, మర్దించు. రాజ.చ. 2.148.

**నలుపు²** చూ. నల్ల. రూ. నల్పు¹. వి. **1**. నీలవర్ణం. భార. అను. 4.8 ; **2**. కళంకం. నిరంకు. 2.57 ; **3**. గొంగడి అంచున నల్లవన్నె ఉన్నితో నేసిన భాగం ; విణ. నల్లని. శృం.నై. 8.184.

త. నల్లమ్. బొగ్గు.

**నలుపగు** వి. కందు. <నలుపు²+అగు. **నలుపుకాల్పు** రూ. నల్పుగాల్పు. వి. **1**. కుండలు మొ॥ వి నల్లగా కాలిన తీరు ; **2**. ఇటిక, పెంకు మొదలైనవి కాలీకాలకుండా ఉండటం. **నలుపుగింటెనదాల్పు** రూ. నలుపుగింటెముదాల్పు. వి. బలరాముడు. వేంక.అం.దేవ. 21. **నలుపుగింటెముదాల్పు** రూ.చూ. నలుపుగింటెనదాల్పు. వి. బలరాముడు. **నలుపుచీర** వి. బొగ్గురంగు చీర. **నలుపుటెఱ్ఱచెఱకు (-ఎఱ్ఱచెఱకు)** వి. ఒకరకం చెరుకు. **నలుపుతొగరు** విణ. ఎరుపు (తొగరు)లో నలుపువన్నె కలిసిన రంగు. **నలుపుదేఱు (-తేఱు)** రూ.చూ. నల్పుదేఱు. అ.క్రి. నల్లనగు. **నలుపుపాఱు** అ.క్రి. నల్లబడు. **నలుపుబండ** రూ. నలుబ్బండ. వి. నార పడుగును కొట్లంతో కొట్టి శుభ్రంచెయ్యటానికి వేసినరాయి. **నలుపుముష్టి** వి. రాత బల్లలు మొ॥ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకంచెట్టు (Bischofia Javanica). **నలుపురాతి** వి. నల్లరంగుగల రాయి. **నలుపులు** వి.బ.వ. మినుములు, పెసలు మొదలైనవి, నల్లగింజలు. **నలుపెక్కు** అ.క్రి. నల్లబడు, నలవారు. వరాహ. 3.3. <నలుపు²+ఎక్కు. **నలుబ్బండ** రూ.చూ. నలుపుబండ. వి. నారపడుగును కొట్లంతో కొట్టి శుభ్రం చెయ్యటానికి వేసిన రాయి.

**నలుపెక్కు** చూ. నలుపు².

**నలుబది** రూ.చూ. నళ్పాది. సర్వ. నాలుగు పదులు.

**నలుబ్బండ** చూ. నలుపు².

**నలుభై** రూ.చూ. నళ్పాది. సర్వ. నాలుగు పదులు.

**నలువ** రూ. నల్వ. వి. బ్రహ్మ, చతుర్ముఖుడు. కు.సం. 9.66. <నలు+వాయి.

**నలువచూలి** వి. నారదుడు. దశా. 4.60. **నలువతమ్ముఁడు** వి. మన్మథుడు. ప్రబంధ. 483. **నలువతూపు** వి. బ్రహ్మాస్త్రం. అచ్చ.రా.యు. 267. **నలువతేజి** వి. హంస. అచ్చ.రా.అరణ్య. 26. **నలువపట్టి** వి. నారదుడు. కాశీ. 1.101. **నలువపాగా** వి. హంసల సమూహం. చంపూరా. 3.8. **నలువప్రోలు** వి. సత్యలోకం. అచ్చ.రా. బాల. 31. **నలువబాబా** వి. హంస. అచ్చ.రా.అయోధ్యా. 20. **నలువరాణి** రూ. నల్వరాణి. వి. సరస్వతి, వాణి. మను. 1.5.

**నలువంద్రు** సర్వ. బ.వ. నలభైకి మహన్మహత్యర్థకరూపం. నలభై మంది. భార. ఆది. 3.63.

**నలువదఱువది** చూ. నలువది.

**నలువది** రూ.చూ. నళ్పాది. సర్వ. ఔ. నాలుగు పదులు.

**నలువదఱువది** సర్వ.ఔ. నూరు. వేంక. అం.దేవ. 14. <నలువది+అఱువది. **నలువదుగురు** వి.బ.వ. నలభై మంది. దశా. 5.104.

**నలువదుగురు** చూ. నలువది.

**నలువందు** చూ. నలువు.

**నలువమరు** చూ. నలువు.

**నలువారు** చూ. నలువు.

**నలువు** రూ. నల్వు. విణ. **1**. చక్కని, ఒప్పుకల. భార.విరా. 1.101 ; **2**. సమర్థమైన, శక్తికల. దశా. 6.119 ; వి. **1**. సౌందర్యం. పండి.చ. 1.60 పు. ; **2**. శక్తి, సామర్థ్యం. రం.రా. ఉ. 76 పు. 23 పం. ; **3**. ప్రేమ, అనురాగం. శృం.నై. 7.172 ; **4**. రీతి, విధం. పాండు. 2.37.

క. నల్. మంచితనం, నల్మె. మంచితనం, గొప్పతనం, నల్ల. మంచి, అందం, నన్ని. నిజం, ప్రేమ, అభిమానం ; కొడ. నల్లె. మంచి ; తు. నలు, నల. మంచి, చవక, నీల్మె. మంచితనం, స్నేహం ; త. నల్ (నఙ్). మంచి ; నల్ల. మంచి ; నల(-ప్పు-న్పు). మంచితనం, అందం, చక్కదనం, సామర్థ్యం, గొప్పతనం ; నలవర్. మంచి, గొప్పవారు, నలఘ్. మంచితనం ; మ. నల్. మంచి, చక్కని, నల్పు. అందమైన, చక్కని, నలమ్, నల్లమ్. మంచితనం, అందం ; కో. నల్వ-య్న్. మంచివాసన వేసే నోరుగలవారు, గొప్పవారు ; తొ. నశ్. నశో. అందం ; గోం. నెలా. మంచి.

**నలువందు** అ.క్రి. నలువమరు, ఒప్పు. రామాభ్యు. 6.128. <నలువు+అందు. **నలువమరు** అ.క్రి. నలువొందు, ఒప్పు. ఉ.హరిశ్చ. 1.60. <నలువు+అమరు. **నలువారు** రూ. నల్వారు. అ.క్రి. ఒప్పు. వాల్మీ. 3.120. <నలువు+-ఆరు. **నలువుమిగులు** అ.క్రి. ఒప్పు. కాశీ. 3.34. **నలువొందు** అ.క్రి. ఒప్పారు, శోభిల్లు. దశా. 1.22, <నలువు+-ఒందు.

**నలువురు** రూ.చూ. నల్వురు. వి. **1**. నాలుగు శబ్దం యొక్క మహన్మహత్యర్థక రూపం, నాలుగు. ఏడువాడలపాలెం శాసనం. క్రీ.శ. 1018 ; **2**. అందరు. ఆము. 5.49.

**నలువొందు** చూ. నలువు.

నలుసు వి. 1. రేణువు. కాన్క.రా.యు. 2419 ; 2. గడ్డి మొ॥ వాటి రేణువు. రసిక. 6.66 ; 3. శుష్కతృణం. ఆం.భా. 2.76.

నల్గడ చూ. నలు.

నల్గడలు చూ. నలు.

నల్గు రూ.చూ. నలుఁగు. వి. 1. తలంటుకొనేటప్పుడు నూనె మొ॥ వాటితో శరీరానికి రాసే పిండి ; 2. ఉద్వర్తనం.

నల్గుఁడు రూ. నలుగుఁడు. వి. శ్రమ. బాధ. వేమ. 1.67. నల్గుపెట్టు రూ.చూ. నలుఁగుపెట్టు. అ.క్రి. పసుపు. కుంకం, నలుగుపిండి మొ॥ వాటిని శరీరానికి రాచి నలుపు. నల్గువెట్టు(-పెట్టు) రూ.చూ. నలుఁగువెట్టు. అ.క్రి. పసుపు, కుంకం, నలుగుపిండి మొ॥ వాటిని శరీరానికి పెట్టి నలుపు. ఇందు. 5.77.

నల్గురు రూ.చూ. నల్వురు. సర్వ. నాల్గుమంది.

నల్చదరము చూ. నలు.

నల్చు రూ.చూ. నలుచు. స.క్రి. నలగగొట్టు.

నల్తిగ చూ. నలు.

నల్తీగ చూ. నల్ల².

నల్తుము చూ. నలు.

నల్దిక్కు చూ. నలు.

నల్దిక్కులు చూ. నలు.

నల్దుము చూ. నలు.

నల్దెస చూ. నలు.

నల్దెసలు చూ. నలు.

నల్నూవులు చూ. నల్ల².

నల్పు¹ రూ.చూ. నలుపు². వి. 1. నీలవర్ణం. కాశీ. 3.89; 2. కళంకం; విణ. నల్లని. విక్ర. 5.47.

నల్పుగాల్పు(-కాల్పు) రూ.చూ. నలుపుకాల్పు. వి. కుండలు మొదలైనవి కాలీకాలకుండా ఉండటం. నల్పుదేఱు (-తేఱు) రూ. నలుపుదేఱు. అ.క్రి. నల్లగా అగు. ఇందు. 2.46.

నల్పు² రూ.చూ. నలఁపు. అ.క్రి. 1. బాధపడు ; 2. చెడు, పాడగు ; 3. శ్రమపడు ; 4. నశించు ; 5. పీడితమగు, పీడపొందు ; 6. నలిఅగు, ముక్కలగు.

నల్బది రూ.చూ. నశ్బది. సర్వ. నలభై.

నల్మొగంబుల్రపోడ చూ. నలు.

నల్మోముదేవర చూ. నలు.

నల్రాయి చూ. నల్ల².

నల్రేగడి చూ. నల్ల².

నల్రౌతు చూ. నల్ల².

నల్ల¹ వి. 1. నెత్తురు, రక్తం. ఆము. 4.193 ; 2. రక్త విశేషం, గట్టిపడిన నెత్తురు. ఆం.భా. 2.132.

నల్లద్రాగుడు(-త్రాగుడు) రూ.చూ. నల్లద్రావుడు. వి. నల్లద్రావుడు, రాక్షసుడు. నల్లద్రావరి వి. రక్తం తాగే వాడు, రాక్షసుడు. నీలా. 1.72. <నల్ల¹+త్రావు+-అరి. నల్లద్రావుడు(-త్రావుడు) రూ. నల్లద్రాగుడు. వి. రాక్షసుడు. నీలా. 1.72. నల్లిక వి. నలికిలిపాము, రక్త పుచ్ఛిక. ఆం.భా. 2.87.

నల్ల² రూ. నల. వి. 1. కళంకం. భార.ఆది. 2.31 ; 2. నలుపు. భార.ఆది. 2.32 ; 3. తప్పు. కాశీ. 7.51 ; 4. బొగ్గు. ప్రబంధ. 44 ; 5. నలుపురంగు ; విణ. నల్లని. భార.ఆది. 2.34.

త. నల్లం. రాక్షసిబొగ్గు, నల్లని, చీకటి ;
సం. నైల్య-. నల్లదనం ; ప్రా. నేల్ల.

నల్తీగ వి. ఇది మెట్ట నేలల్లో పెరిగే చిన్న ఆకుల కలుపుమొక్క. (Derris Scandens). నల్నూవులు రూ.చూ. నల్లనువ్వులు. వి.బ.వ. నువ్వుల్లో ఒకరకం. నల్రాయి రూ.చూ. నల్లరాయి². వి. వన్నెలో నిర్మాణంలో భిన్న లక్షణాలుగల ఖనిజపట్టికలతో ఏర్పడ్డ మిశ్రశిల, గయిరీరాయి (Omeiss). నల్రేగడి రూ.చూ. నల్లరేగడి. వి. ఎక్కువ నలుపురంగులో ఉన్న రేగడి నేల. నల్రౌతు రూ. నల్లరౌతు¹. వి. నల్లరంగు గల రాయి. నల్లఈక వి. బెరడు లేత ఎరుపురంగూ, కర్ర లేత బూడిద రంగులో గట్టిగానూ ఉండి సువాసన కల తెల్లని పూలు పూసే చెట్టు (Randia Uliginosa). నల్లఈస్వర వి. ఒకరకం తీగ (Aristolochia Roxburghiana). నల్లఉడత వి. ముళ్ళుకలిగి లేతపసుపు రంగుగల మెత్తని కలపనిచ్చే ఒకచెట్టు. నల్లఉన్ని వి. నలుపురంగు ఉన్ని. నల్లఉప్పి రూ.చూ. నల్లఉప్పిలి. వి. ఉత్తరసర్కారులూ, హైదరాబాదు, దక్కను, కర్ణాటక మొ. చోట్ల అడవుల్లోనూ, దడులమీద పెరిగే ముళ్ళుకలిగిన ఒకతీగ (Capparis sepiaria). నల్లఉప్పిలి రూ. నల్లఉప్పి. వి. ఉత్తరసర్కారులూ, హైదరాబాదు, దక్కను, కర్ణాటక మొ॥ చోట్ల అడవుల్లోనూ, దడుల మీద పెరిగే ముళ్ళుకలిగిన ఒక తీగ (Capparis sepiaria). నల్లఉమ్మెత రూ.చూ. నల్లఉమ్మెత్త. వి. ఒకరకం ఉమ్మెత్త చెట్టు (Datura fastuosa). నల్లఉమ్మెత్త రూ. నల్లఉమ్మెత. వి. ఒకరకం ఉమ్మెత్త చెట్టు (Datura fastuosa). నల్లఉలిమిడ రూ. చూ. నల్లిఉలిమెర. వి. ఆకుపచ్చ పూలూ, లేతఎరుపురంగు పళ్ళూ కాసే ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Diospyros montana). నల్లఉలిమెద రూ.చూ. నల్లఉలిమెర. వి. ఆకుపచ్చపూలూ, లేత ఎరుపురంగు పళ్ళూ కాసే ముళ్ళు కలిగిన ఒకచెట్టు (Diospyros montana). నల్లఉలిమెర రూ. నల్లఉలిమిడ, నల్లఉలిమెద. వి. ఆకుపచ్చపూలూ, లేతఎరుపురంగు పళ్ళూ కలిగి ముళ్ళుఉండే ఒకచెట్టు (Diospyros montana). నల్లఊడుగ వి. అలంకరణ సామగ్రి తయారీకి, ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు (Alangium Lamarcki). నల్లఎండ్రాస్‌మామిడి వి. ఊరగాయకు వాడే మామిడిలో ఒకరకం. నల్లఎలవడం వి. గింజనల్లగా ఉండే వడ్లరకం. నల్లక వి. అందుగు, నల్లకి. నల్లకంకితెవులు వి. తమలపాకు మొదళ్ళు నల్లగా మారే ఆకుతోట. నల్లకచోరము వి. చోరం, ఒకరకం చెట్టు, నల్లకంచురాయి. వి. దక్షిణభారత దేశంలో లభ్యపడే పేలుడురాయి జాతికి చెందిన నల్లరాయి (Igneous rocks). నల్లకట్టె వి. పత్తి తెగులు (Blackarm disease). నల్లకట్టెపడు అ.క్రి.

పత్తికి ఒకరకం తెగులుపట్టు. నల్లకంద వి. ఒకరకం కంద. నల్లకన్ను వి. చీరకమ్మిలో అందానికి పెట్టిన నల్లపోగు. నల్లకన్నుతీర్చు అ.క్రి. చీరకమ్మిలో అందం కోసం నల్లపోగు పెట్టు. నల్లకరక వి. తోళ్ళను పదును చేయటానికుపయోగ పడే కాయలు కాసే గృహాది నిర్మాణాల కుపయోగించే గట్టి కలపనిచ్చే ఒకచెట్టు (Terminalia chebula). నల్లకవని వి. బూడిదరంగు ఆకులుకలిగి ఎర్రని పూలు పూసే నన్నటి తీగ (Desmodium biarticulatum). నల్లకాకముష్టి వి. చిన్నపూలు పూసే బూడిదరంగు కాండం గల చెట్టు (Diospyros sylvatica). నల్లకాకర రూ. నల్లకాకిరి, నల్లగాకిరి. వి. కాయపొట్టిగానూ, చెక్కుముదురాకు పచ్చగానూ ఉండే ఒకరకం కాకర. నల్లకాకసి రూ. నల్లకాకిన. వి. బెరడు లేతఎరుపు రంగూ, కర్ర లేత బూడిద రంగులో గట్టిగానూ ఉండి సువాసనకల తెల్లనిపూలు పూసే చెట్టు (Randia uliginosa). నల్లకాకిడి వి. లేత ఆకు పచ్చ పూలు పూసే పొదవంటి మొక్క, దీనికర్రను కదుళ్ళు చేయటానికి ఉపయోగిస్తారు (Emony musindicus). నల్లకాకిరి రూ. చూ. నల్లకాకర. వి. కాయపొట్టిగానూ, చెక్కు ముదురుగానూ ఉండే ఒకరకం కాకర. నల్లకాకిస రూ.చూ. నల్లకాకసి. వి. బెరడు లేత ఎరుపురంగూ, కర్ర లేతబూడిద రంగులో గట్టిగానూ ఉండి సువాసనకల తెల్లని పూలు పూసేచెట్టు (Randia uliginosa). నల్లకాంచి వి. ఒకరకం మొక్క. హంస. 4.10. నల్లకాల్పు వి. ఇటిక మొదలైనవి కాలీకాలకుండా ఉండటం. నల్లకావురు వి. (మబ్బుల) నల్లరంగు. నల్లకుమ్మర్లు వి.బ.వ. తెలుగు కుమ్మర్లలో ఒకతెగకు చెందినవారు. నల్లకూజొన్న వి. బొంతు (కంకిపొట్టు) నల్లగా ఉండేకొన్ని రకాలు. నల్లకేసరీకడ్డీచీర వి. ఒకరకం డిజైను నేతచీర. నల్లకొక్కిత వి. ఎర్రని గొట్టం కలిగిన పచ్చని పూలుపూసే ఒక తీగ (Ipomaea obscura). నల్లకొక్కెస వి. బెరడు లేతఎరుపు రంగూ, కర్ర లేతబూడిద రంగులో గట్టిగానూ ఉండి సువాసన కల తెల్లనిపూలు పూసే చెట్టు (Randia uliginosa). నల్లకొర్ర వి. గింజనలుపుగా ఉండేకొర్ర. నల్లకోక వి. బొగ్గురంగు చీర. నల్లగగ్గెర వి. కఠింజరం, వృక్షవిశేషం. నల్లగత వి. కుండలు మొ॥ వి నలుపురంగు వచ్చేటట్లు కాల్చడం. నల్లగరువు వి. నల్లమట్టి, గులకరాళ్ళు కలిసిన నేల. నల్లగఱిక వి. బాలతృణం. నల్లగలిజేరు వి. వర్షకేతువు, వృక్షవిశేషం. నల్లగలువ (-కలువ) రూ.చూ. నల్లగల్వ. వి. ఇందీవరం, నీలోత్పలం. నల్లగల్వ (-కల్వ) రూ. నల్లగలువ. వి. ఇందీవరం, నీలోత్పలం. ఉ. రా. 6.110. నల్లగాకిరి (-కాకిరి) రూ.చూ. నల్లకాకర. వి. కాయపొట్టిగానూ, చెక్కు ముదురు ఆకు పచ్చగానూ ఉండే ఒకరకం కాకర. నల్లగాద వి. చిన్నపూలు పూసే బూడిదరంగు కాండం గల చెట్టు (Diospyros sylvatica). నల్లగాసె వి.నలుపులో తెలుపు కలిసిన రంగు భేదం. నల్లగింటెన వి. నీలపష్టి. హంస. 4.10. నల్లగినియ వి. మానేరు, వృక్షవిశేషం. నల్లగిరి వి. ఒకరకం గడ్డి. నల్లగిసియ వి. ఒకరకం అవిసె. <నల్ల$^{2}$+ అగిసియ. నల్లగుగ్గిలము వి. మద్ది చెట్టులా ఉండే కలపనిచ్చే అడవిలో పెరిగే ఒకచెట్టు (Sholea tumbaggaia). నల్లగుట్టరాయి వి. నల్లరంగుగలరాయి (Gabbro). నల్లగుండు వి. ఎర్రమొరం రాయి, సాంకేతికంగా సున్నపు రాయి. నల్లగుండె వి. యకృత్తు. నల్లగుండెదొమ్మ వి. మూడుగుండెల్లో ఒకటి (నెరిడె, నల్లగుండె) వాయటం వల్లవచ్చే వ్యాధి. నల్లగుమ్మడి వి. గుమ్మడిలో ఒకరకం. నల్లగురిగింజ వి. కృష్ణపాకి. నల్లగురిజ వి. కృష్ణగుంజ. నల్లగురుగింజ వి. మృదువైన పెద్దఆకులుండి, ఎరుపుతో కూడిన పసుపు లేక తెలుపు పూలు పూసే ఒక తీగ (Rhynchosia cyanosperma). నల్లగుఱ్ఱము వి. నీలాశ్వం. నల్లగులివింద వి. ఉత్తర సర్కారులూ, కర్నాటక మొ॥ చోట పెరిగే ఒకతీగ (Cardiospermum halicacabum). నల్లగులిసింద రూ. నల్లగొలిసింద. వి. ఉత్తర సర్కారులూ, కర్ణాటక మొ॥ చోట్ల పెరిగేఒక తీగ. (Cardiospermum halicacabum ). నల్లగూబ వి. కృతమూలకం, వృక్షవిశేషం. నల్లగెనుసు వి. కృష్ణాలువు, ఒకజాతిగెనుసు. నల్లగొంగడి వి. నలుపురంగు ఉన్నితో నేసిన గొంగడి. నల్లగొర్రె వి. నలుపురంగు బొచ్చుగలగొర్రె. నల్లగొలిమిడి వి. నీలదూర్వ. నల్లగొలిసింద రూ.చూ. నల్లగులిసింద. వి. ఉత్తరసర్కారులూ, కర్నాటక మొ॥ చోట్ల పెరిగే ఒకతీగ (Cardiospermum halicacabum). నల్లగోరంట వి. ఆర్తగళం. నల్లగోలగడ్డి వి. ఒకరకం కలుపు మొక్క. నల్లగౌడలు వి.బ.వ. వడ్లలో ఒకరకం, నల్లగ్రుడ్డు వి కనీనిక, కనుగుడ్డులోని నల్లభాగం. నల్లంకోలము వి. సువాసన కల్గిన తెల్లని పూలుపూసే, ఆభరణాలు చేయటానికి, ఇంధనంగానూ ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Alangium Lamarckii). నల్లంగి వి. గృహాది నిర్మాణాలకు, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగ పడే కలపనిచ్చే ఒక చెట్టు (Albizzia Amara). నల్లచంద్ర వి. తోళ్ళను పదునుపెట్టడానికి ఉపయోగపడే బెరడు, లేతపసుపురంగు పూలుకల చెట్టు (Acacia Catechu). నల్లచంద్రకాళిరాస్తా వి. ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు చొప్పున పడుగు, పేక నేసిన చీరలో గీర. నల్లచవుడు రూ. నల్లజవుడు, నల్లనవుడు. వి. రేగడి కలిసిన చవిటినేల. నల్లచిక్కుడు వి. గింజ నల్లగాఉండే చిక్కుడు. నల్లచిత్రమూలము వి. లేతనీలం పూలు పూసే తీగ (Plumbago Capensis). నల్లచిందుగ వి. ఒకరకం చిందుగచెట్టు (Albizzia Julibrissin). నల్లచిరతలతివ్వ వి. తెలుపు, లేతఎరుపు పూలు గుత్తులుగా వేలాడే చిన్న చెట్టు (Derris Scandens). నల్లచీడ రూ. నల్లజీడ. వి. వరి, పొగాకు మొ॥ వాటి తెగులు (Aphis or Hispa). నల్లచీమ వి. మర్కటపిపీలిక. నల్లచెత్త వి. నేలపై పరుచుకు పెరిగే నల్లటి కలుపుమొక్క. నల్లచెంద్రకాలుచీర రూ.చూ. నల్లచెంద్రకాళిచీర. వి. ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు పోగులు చొప్పున పడుగు పేక నేసిన చీర. నల్లచెంద్రకాళిచీర రూ. నల్లచెంద్రకాలుచీర, నల్లచెంద్రికాలు చీర. వి. ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు పోగులు

చొప్పున పడుగు పేక నేసిన చీర. నల్లచెంద్రికాలుచీర రూ.చూ. నల్లచెంద్రకాళిచీర. వి. ఒక కొలికి తెలుపు, ఒక కొలికి నలుపు పోగులు చొప్పున పడుగు పేక నేసిన చీర. నల్లచెన్న(గులు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. నల్లచెఱకు వి. అనిక్షువు, చెరకువలె తియ్యని రసం కలిగిన ఒకజాతి రెల్లు. నల్లచేమ వి. కూరగా వాడే ఒకరకం దుంప పైరు (Colocasia Esculenta). నల్లచేయు స.క్రి. నల్లపరచు. భార.ఆది. 2.34. నల్లచోడి వి. రాగిధాన్యంలో ఒకరకం (Eleusine Coracana, Cynosurus Coracanus). నల్లచ్చికాఁడు వి. పక్షి విశేషం. ఆం.భా. 2.98. <నల్ల+లచ్చనము+-కాఁడు. నల్లజనపరాయి రూ.చూ. నల్లజలపరాయి. వి. ఎర్రకంచురాయి. నల్లజలపరాయి రూ. నల్లజనపరాయి, నల్లజిలపరాయి, నల్లననపురాయి. వి. ఎర్రకంచురాయి (Granite). నల్లజవుడు (-చవుడు) రూ.చూ. నల్లచవుడు. వి. రేగడి కలిసిన చవిటి నేల. నల్లజాన వి. ఉత్తరనర్కారుల్లో అడవుల్లోని పచ్చిక బయళ్ళలో పెరిగే ఒక మొక్క. నల్లజాల వి. మరొక రంగుమీద నల్ల చార. <నల్ల[2]+చార. నల్లజిలపరాయి రూ.చూ. నల్లజలపరాయి. వి. ఎర్రకంచురాయి. నల్లజిల్లేడు[1] వి. దూదినిచ్చే ఒకరకం జిల్లేడుమొక్క (Calotropis Gigantea). నల్లజిల్లేడు[2] వి. మెట్టప్రాంతాల్లో పెరిగే, పాలు కల్గిన చిన్నచెట్టు, దీని బెరడునుండి తీసిన నారను దిళ్ళ తయారీలో ఉపయోగిస్తారు. నల్లజీర (-చీడ) రూ. చూ. నల్లచీడ. వి. వరి, పొగాకు మొ॥ వాటి తెగులు. నల్లజీడి వి. భల్లాతకి, బట్టలు మొ॥ వాటికి గుర్తును వేయటానికి ఉపయోగపడే సిరాను తయారుచేయటానికి వినియోగించే గింజలనిచ్చే ఒక చెట్టు (Senacarpus Anacardium). నల్లజీలకఱ రూ. నల్లజీలకఱ్ఱ. వి. సుషవిక, ఒకరకం జీలకర్ర. ఆం.భా. 2.249 (Nigella Sativa, Nigella Indica). నల్లజీలకఱ్ఱ రూ.చూ. నల్లజీలకఱ. వి. ఒకరకం జీలకర్ర. నల్లజీలుగ వి. పచ్చని చిన్నపూలు పూసే ఒక చెట్టు (Cassia Pumila). నల్లజొరట వి. ఎన్ను నల్లగాఉండే రాగి. నల్లజేమట్టి (-చేమట్టి) వి. నల్ల చేవరంగు మచ్చ. నల్లటిమన్ను రూ.చూ నల్లమన్ను. వి. బాగా నల్లగాఉండే రేగడిమట్టి. నల్లతమిదె రూ. నల్లతైద. వి. రాగిలో ఒకరకం. నల్లతాంబుచీర వి. అంచుల్లో నల్లటి పెద్ద గీరలు పడేట్టు నేసిన చీర. నల్లతీఁగ రూ.చూ. నల్లతీఁగె[1]. వి. నర్వాక్షి. నల్లతీఁగె[1] రూ. నల్లతీఁగ. వి. దళ్ళమీదా పొదలమీదా, చెట్లమీదాపాకే పచ్చనిపూలు పూసే ఒకతీగ, నర్వాక్షి. హంస. 4.10 (Tiliacora Racemosa). నల్లతీఁగె[2] వి. సముద్రతీరపు అడవుల్లోనూ, నదుల ఒడ్డునా పెరిగే గులాబీరంగు పూలు పూసే తీగ (Derrisuliginosa). నల్లతీఁగె[3] వి. కంచెలమీదా, అడవులు మొ॥చోట్లా పెరిగే లేతఆకుపచ్చ పూలు పూసే తీగ (Ichnocarpus Frutescens). నల్లతుంగ వి. తుంగలో నలుపురంగు. నల్లతుమికి వి. కాకతిందుకం, ఒకజాతి తుమికి. నల్లతుమ్మ వి. గృహాది నిర్మాణాల కుపయోగపడే కలపనిచ్చే, బంగారు రంగు పూలు పూసే తెల్లని ముళ్ళు కలిగిన పొట్టితుమ్మచెట్టు (Acacia Arabica). నల్లతూము వి. గృహాది నిర్మాణాల కుపయోగపడే కలపనిచ్చే, బంగారురంగు పూలు పూసే తెల్లని ముళ్ళు కలిగిన చెట్టు (Acacia Arabica). నల్లతెగడ వి. ఓషధీవిశేషం, కాలమేషిక, ఉత్తరనర్కారులు, దక్కను, కర్ణాటక మొ॥ చోట్ల పెరిగే తెల్లని పూలు పూసే బలమైన తీగ (Ipomaea Turpethum). నల్లతెగులు రూ. నల్లదెగులు. వి. ఆకుతోట తెగులు (Phinctus Politus). నల్లతేయాకు వి. నీలగిరి, తిరువాన్కూరు కొండలమీద పెరిగే తేయాకుచెట్టు (Camellia Thea). నల్లతేలు వి. ఎనుపతేలు. నల్లతైద రూ.చూ. నల్లతమిదె. వి. రాగిలో ఒకరకం. నల్లతొగ వి. నల్లకలువ. పి.శకు. 2.80. నల్లతొగరు రూ. నల్లదొగరు. వి. 1. ఎరుపు (తొగరు) లో నలుపువన్నె కలిసిన రంగు ; 2. ముదురు నలుపు (మసిగుబ్బ) రంగు. నల్లతోఁటకూర వి. కాలమారిషం. నల్లదట్టిసబిల్ల వి. చోర సాధనం విశేషం. ప్రబంధ. 759. నల్లదడుగ వి. కలపనిచ్చే చెట్టు (Miliusa Velutina). నల్లదమ్మర వి. కడప, నార్త్ ఆర్కాట్ జిల్లా అడవుల్లో పెరిగే చెట్టు. దీని కలపతో గృహోపకరణ వస్తువులు తయారుచేస్తారు (Shorea Tumbaggaia). నల్లదాసరిగాఁడు వి. తాంబేలు. ఆము. 5.41. నల్లది విణ. 1. నల్లగాఉండే స్త్రీ ; 2. నల్లగాఉండే వస్తువు. నల్లదింటెన వి. నల్లగింటెన. నల్లదింటెనతీగె వి. తోటల్లో పెంచబడే రంగుపూలు పూసే అందమైన తీగ (Clitoria Ternatea). నల్లదిరిసెనము వి. ఇరుగుడుచెట్టు. నల్లదుడ్డుగ వి. ఉత్తర నర్కారుల్లో పెరిగే కలపనిచ్చే చెట్టు (Miliusa Velutina). నల్లదుమ్మ వి. తుమ్మలో ఒక రకం చెట్టు (Acacia Arabica, Mimosa Arabica, Lamarcku). నల్లదెగులు (-తెగులు) రూ. చూ. నల్లతెగులు. వి. తమలపాకు మొదళ్ళు నల్లగా మారే ఆకుతోట తెగులు. నల్లదేవర వి. కరివేల్పు, విష్ణువు. నరస. 5.22. నల్లదొగరు (-తొగరు) రూ.చూ. నల్లతొగరు. వి. 1. ఎరుపులో నలుపువన్నె కలిసిన రంగు ; 2. ముదురునలుపు రంగు. నల్లదోమ వి. ఒకరకం దోమ. నల్లన విణ. నల్లని. దశా. 2.220 ; వి. నలుపురంగు. ఆం.భా. 1.108. నల్లనగు అ.క్రి. నలుపగు. <నల్లన+అగు. నల్లనయ్య వి. 1. కరివేల్పు, విష్ణుమూర్తి. ఇందు. 4.48 ; 2. విష్ణుమూర్తి. నల్లనయ్యరవాలు వి. గరుడుడు. సాంబ. దేవ. 15. నల్లనాగు వి. నల్లతాచు, కృష్ణసర్పం. సిం.ద్వా. 8.100. నల్లనియాఁగ (-ఈఁగ) వి. నల్లగాఉండే ఈగ. నల్లనివాఁడు విణ. నల్లగా ఉండేవాడు. భాగ. 10. పూ. 1010. నల్ల నీలాంబరము వి. నీలిరంగు పూలు పూసే తోటల్లో పెంచబడే అందమైన మొక్క (Daedalacanthusnervosus). నల్లనుము వి. అలచంద మాదిరిగా ఉండే ఒకరకం పప్పు దినుసు (Dolichos Cultratus). <నల్ల+అనుము. నల్లనువ్వులు రూ. నల్నూవులు, నల్లనూగులు, నల్లనూలు, నల్లనూవులు. వి.బ.వ. నువ్వుల్లో ఒకరకం. నల్లనూగులు రూ.చూ. నల్లనువ్వులు. వి. నువ్వుల్లో ఒకరకం. నల్లనూలు రూ.చూ. నల్లనువ్వులు. వి.బ.వ. నువ్వుల్లో ఒకరకం.

నల్లసూవులు రూ.చూ. నల్లనువ్వులు. వి.బ.వ. నువ్వుల్లో ఒకరకం. నల్లనేల వి. నల్లగా ఉండే నేల. నల్లనేలగుమ్ముడు వి. ఎర్రని పూలుఃపూసే ఒక తీగ (Ipomaea Digitata). నల్లనేలపరికి వి. సుమారు నాలుగడుగులు ఎత్తుపెరిగే, తెల్లని పూలుపూసే ఒక మొక్క (Desmodium Gangeticum). నల్లనైదువ వి. పార్వతి. <నల్లన+ఐదువ. నల్లనైదువగేస్తు వి. శివుడు. వేంక. అం.దేవ. 5. నల్లనొచ్చిలి వి. నల్లవావిలి, తోటలకంచెల్లో పెంచబడే, ఆకులు మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క (Justicia Gendarussa). నల్ల(దనము (-తనము) వి. చామనచాయ. నల్ల(ద్రాచు (-త్రాచు) వి. కృష్ణసర్పం. రామాభ్యు. 8.214. నల్లపచ్చనిపొడి వి. భంగాకుపొడి. గా.హరి.ద్వి. 1393. నల్లపజ రూ.చూ. నల్లప్రజ. వి. 1. కిరాత నంఘం, ఆటవిక నంఘం. చంద్రికా. 4.85; 2. కోకిలమూక. చంద్రికా. 4.85. నల్లపడు రూ.చూ. నల్లవడు. అ.క్రి. నల్లనగు. నల్లపని వి. రతి, నంభోగం. రా.గో.శ. 52. నల్లపాపిడి వి. కోస్తాలో పెరిగే ఒక మొక్క (Pavetta Indica). నల్లపాము వి. నల్లతాచు. ప్రభా. 1.63. నల్లపాలిష్‌రాయి వి. మొరంరాయి. నల్లపిచ్చుక వి. కపోతకి. నల్లపిప్పి వి. ఒళ్ళు నల్లకప్పవేసే రోగం. నల్లపిప్పిండతీగె రూ. నల్లపిప్పిండతీగె. వి. తేనెవాసనకల తెల్లని పూలు పూసే అడవిలో పెరిగే ఒక తీగ (Combretum decandrum). నల్లపిప్పిందతీగె రూ.చూ. నల్లపిప్పిండతీగె. వి. తేనెవానన కల తెల్లని పూలుపూసే అడవిలో పెరిగే ఒక తీగ (Combretum decandrum). నల్లపిసినిక వి. గుబురుగా పెరిగే ఎర్రని పండ్లుకాసే ఒక చెట్టు, అల్లిచెట్టు (Maba boxifolia). నల్లపుగడము వి. కంచెల్లోనూ, బంజరుల్లోనూ, ప్రవాహాల పక్కనా పెరిగే ఒక తీగ (Phyllanthus reticulatis). నల్లపుయ్యి వి. ఎక్కువగా ముళ్ళుండే ఒక పెద్ద తీగ (Capparis sepiara). నల్లపురుగు రూ. నల్లబురుగు. వి. వరి, వేరుసెనగ మొ॥ పైర్లకు పట్టే నల్లటి దోమ. నల్లపురుదుడు వి. కంచెల్లోనూ, బంజరుల్లోనూ, ప్రవాహాల పక్కనా పెరిగే ఒక తీగ (Phyllanthus reticulatis). నల్లపులిసె రూ. నల్లపుల్సె. వి. ఒకరకం ఆకెరువు మొక్క. నల్లపులుగుడు వి. కృష్ణకాంభోజి. నల్లపుల్సె రూ.చూ. నల్లపులిసె. వి. ఒకరకం ఆకెరువు మొక్క. నల్లపూలి వి. కంచెల్లోనూ, బంజరుల్లోనూ, ప్రవాహాల పక్కనా పెరిగే ఒక తీగ (Phyllanthus reticulatis). నల్లపూస వి. నల్లని గాజుపూస. రాజవా. 2.69. నల్లపూసగు అ.క్రి. కంటికి కనబడటం అరుదగు. <నల్లపూస+అగు. నల్లపూసాదిగా అవ్య. ద్రు. నల్లపూస మొదలుకొని పూర్తిగా. నిరంకు. 2.106. సం. ఆది. మొదలు. <నల్లపూస+సం. ఆది+అగు+-అ[7]. నల్లపెటగోరంట వి. సీలిరంగు లేక తెలుపురంగు పూలుపూసే మొక్క తోటల్లో పెంచబడుతుంది (Barleria cristata). నల్లపెసర వి. శింబకం. నల్లపెసలు వి.బ.వ. పెసల్లో ఒకరకం (Green gram). నల్లపెసె విశ. నలుపు ఎక్కువగా ఉన్న తెలుపు ఎరుపులు. నల్లపేటికాయ వి. నల్లపేటి పండు, నల్లనిపేడు, తొక్కగల తాటికాయ. పి.శకు. 3.128. నల్లపేటిపండు వి. నల్లపేటి శాటికాయ. వరాహ. 10.128. నల్లపొచ్చె వి. నల్లని పొచ్చె రాళ్ళుగల నేల. నల్లపొట్ల వి. కాయరంగు ముదురుగా పచ్చగా ఉండేరకం. నల్లపొడ విశ. నల్లటిమచ్చ. నల్లపొణకు రూ.చూ. నల్లపొలికి. వి. తణుకుచెట్టు, పెట్టెలు, ఆటవస్తువులు మొ॥ సామగ్రి తయారు చేయటానికి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు (Gyrocarpus Jacquini). నల్లపొలికి రూ. నల్లపొణకు. వి. తణుకుచెట్టు, పెట్టెలు, ఆటవస్తువులు మొ॥ సామగ్రి తయారు చేయటానికి పనికివచ్చే చెట్టు (Gyrocarpus Jacquini). నల్లపొల్లెఱుఁగని విశ. మచ్చలేని. ఉ.హరి. 5.92. <నల్ల[2]+పొల్లు+ఎఱుఁగని. నల్లప్రజ రూ. నల్లపజ. వి. కిరాత సంఘం, ఆటవికజనం. ఆము. 6.76. సం. ప్రజా. జనం. నల్లబట్ట రూ. నల్లమట్టె. వి. నల్లటి మచ్చ. నల్లబడ్డు వి. తెల్లని పూలుపూసే 4.6 అడుగుల ఎత్తుపెరిగే ఒక చిన్న చెట్టు (Flemingia strobilibera). నల్లబంటు రూ.చూ. నల్లవట్టు. వి. వళ్ళు నల్లకప్పవేసే జబ్బు. నల్లబండ[1] వి. ఎర్రరాయి (Calcarous Sedimentary Rock). నల్లబండ[2] వి. పలకరాయి (Sedimentary Rock). నల్లబండిరూమాలు వి. ఒకరకం తలపాగ. నల్లబలుసు రూ. నల్లబల్సు. వి. ఒకరకం బలుసు చెట్టు, ముళ్ళుండే చెట్టు (Canthium Didymum). హంస. 4.11. నల్లబల్ల వి. కాలుతున్న బట్టీపొయ్యిలోని ఊకనులాగడానికి వాడే కడ్డీ. నల్లబల్లి వి. ఎర్రటి పళ్ళుకాసే చిన్న చెట్టు, దీనిపళ్ళుతింటారు. (Antidesma Ghaesembi'a). నల్లబల్లెర వి. ఒకరకం చెట్టు. పి.శకు. 3.225. నల్లబల్సు రూ.చూ. నల్లబలుసు. వి. ముళ్ళుండే చెట్టు (Canthium Didymum). నల్లబాటు(పాటు) రూ.చూ. నల్లవట్టు. వి. ఒళ్ళు నల్లకప్పవేసే జబ్బు. నల్లబుడమ వి. మెట్టవడ్లలో ఒకరకం. నల్లబుడుసర వి. కాకమాచి. నల్లబురుగు(పురుగు) రూ.చూ. నల్లపురుగు. వి. వరి, వేరుసెనగ మొ. పైర్లకు పట్టే నల్లటి దోమ. నల్లబెండ[1] వి. నూగుగల కాడలూ, ఆకులూ, ఊదా పూలుగల ఒక జాతి మొక్క (Urena Sinuata). నల్లబెండ[2] వి. పచ్చనిపూలుపూసే రోడ్డుకిరువైపులా పెరిగే మొక్క (Waltheria Indica). నల్లబెళుకు వి. నల్లని పలకరాళ్ళుగల నేల. నల్లబేరురాయి వి. ఎర్రమొరం రాయి. నల్లబొడ్డ వి. తెల్లపూలుపూసే 4–6 అడుగుల ఎత్తు పెరిగే చెట్టు (Flemingia Strobilifera). నల్లమంగ వి. బెరడు లేత ఎరుపురంగు, కర్ర లేత బూడిదరంగులో గట్టిగా ఉండి సువానసకల తెల్లని పూలుపూసే చెట్టు (Randia Ulginosa). నల్లమచ్చతెగులు వి. ఆకుతోట తెగులు, తమలపాకుల మీద నల్లటి మచ్చలేర్పడి కుళ్ళి రాలిపోయే రోగం. నల్లమట్టి వి. బాగా నల్లగా ఉండే రేగడి. నల్లమట్టు చూ. నల్లవట్టు. వి. ఒళ్ళు నల్లకప్పవేసే జబ్బు. నల్లమట్టె రూ. చూ. నల్లబట్ట. వి. నల్లటిమచ్చ. నల్లమడ రూ. చూ. నల్లమదు[1]. వి. ఇంధనంగా ఉపయోగపడే ఒక చెట్టు (Avicennia Officinalis). నల్లమడుఁగు వి. మిక్కిలి లోతైన మడుగు. నల్లమదు[1] రూ. నల్లమడ. వి. ఇంధనంగా ఉపయోగపడే చెట్టు (Avicennia

Officinalis) **నల్లమదు**[2] రూ. నల్లమద్ది[2]. వి. తనిచెట్టు, గట్టిగా ఉండే కలపనిచ్చే ఒకచెట్టు (Terminalia tomentosa). **నల్లమద్ది**[1] వి. ఎ(్రని పళ్లుకాసే ఒకచెట్టు (Maba buxifolia). **నల్లమద్ది**[2] రూ.చూ. నల్లమదు[2]. వి. తనిచెట్టు, గట్టిగాఉండే కలపనిచ్చే చెట్టు (Terminalia tomentosa). **నల్లమందు**[1] వి. రాళ్ళను పగలగొట్టడానికి వాడే పేలుడు (ద్రవ్యం. **నల్లమందు**[2] వి. అభిని. చం(ద్ర రే. 2.67 (Papaver Somniferum). **నల్లమందు**[3] వి. దళ్ళలోను, తోటల్లోను పెంచబడే పూలుపూసే మొక్క (Pedilanthus tithymaloides). **నల్లమందుపాలు** వి. అభినిపాలు. **నల్లమందుభాయి** వి. నల్లమందు వేసుకోవటానికి అలవాటు పడే వ్యక్తి. హిం. ఉ. భాఈ. సోదరుడు. **నల్లమన్ను** రూ. నల్లటిమన్ను. వి. బాగా నల్లగాఉండే రేగడి. **నల్లమబ్బు** వి. పళ్ళు నల్లకప్పువేసే జబ్బు. **నల్లమట్టి** వి. కర్మజం. **నల్లమల గిత్త** వి. నల్లమల కొండల(పాంతానికి చెందిన ఎద్దు. **నల్లమలుకు** వి. నల్లరంగుగల ఇసకనేల. **నల్లమసక** వి. నలుపురంగు ఎక్కువగా కలిసిన తెల్లనేల లేక ఎ(్రనేల. **నల్లమసర** వి. **1**. నలుపురంగు ఎక్కువగా కలిసిన తెల్ల నేలగాని, ఎ(్రనేలగాని; **2**. నలుపుతో కలిసిన మరొక రంగు. **నల్లమసరలు** వి.బ.వ. ఒకరకం వడ్లు. **నల్లమాను** వి. అడవుల్లో పెరిగే మహావృక్షాల్లో ఇదొకటి (Black wood (Indian) Rose wood). **నల్లమామిడి** వి. మామిడిజాతికి చెందిన ఒకానొకచెట్టు. **నల్లమారి** వి. ఒళ్ళు నల్లకప్పువేసే జబ్బు. **నల్లమినుము** వి. మినుముల్లో ఒకరకం (Black gram). **నల్లముట్టు** వి. ముదరగాలి నల్లబడిన ఇటిక. **నల్లమునుకుడు** వి. దక్కను, కర్ణాటకల్లో పెరిగే గట్టి కలప కలిగిన ఒకచెట్టు (Limonia alata). **నల్లములగ** వి. పచ్చని పళ్ళుకాసే మొక్క (Solanum indicum). **నల్లములుగోరంట** వి. తెలుపు లేక లేతఎరుపు పూలుపూసే రోడ్ల పక్కన పెరిగే మొక్క (Barleria buxifolia). **నల్లముసర** వి. నెత్తురు పారుకానేరోగం. **నల్లముసురు** వి. మేఘాలవల్ల చీకటి అయిననాటి ముసురు. ద్వి.పరమ. వి. 4.290 ప. **నల్లమూ(క** వి. తుమ్మెదలగుంపు. **నల్లమూతులు** రూ. నల్లమోతులు. వి.బ.వ. వడ్లలో ఒకరకం. **నల్లమెటల్** వి. ఇది పొరలు పొరలుగా ఉండే ఒకరకం పేలుడురాయి (Igneous rock) ఇం. *Metal*. ఖనిజం. **నల్లమే(క** వి. చిం బోతు, కామం ఎక్కువగాగల మేక. **నల్లమే(కతప్పు** వి. జార త్వం. (పబోధ. 1.50. **నల్లమేకను బలియిచ్చినను** అవ్య. (దు. ఎంతచేసినా, ఏంచేసినా. **నల్లమైల** వి. నలుపులో తెలుపు. **నల్లమోతులు** రూ.చూ. నల్లమూతులు. వి.బ.వ. వడ్లలో ఒక రకం. **నల్ల(బడు(-పడు)** రూ.చూ. నల్లపడు. అ.(కి. నల్ల నగు. చం(ద్రాంగ. 4.159. **నల్ల(బాఱు(-పాఱు)** అ.(కి. నల్లబడు. వరాహ. 2.115. **నల్లయతివస(-అతివస)** వి. ఒక రకం అదివస. **నల్లయారెలు(-ఆరెలు)** వి.బ.వ. ధాన్యవిశే షం. **నల్లయిరుసుకు(-ఇరుగుడు)** వి. కృష్ణశింశుప. **నల్లయుప్పి (-ఉప్పి)** వి. దుర్ధర్ష. **నల్లయుమ్మెత్త(-ఉమ్మెత్త)** వి. హేమిక. **నల్లయురగ(-ఉరగ)** వి. పుంజు. **నల్లరంగు** విణ. నలుపు, బొగ్గురంగు. **నల్లర(టి** వి. ఒకరకం అరటిచెట్టు, కృష్ణరంభ. < నల్ల[2] + అర(టి (Musa Paradisiaca). **నల్లరాగిడి** రూ.చూ. నల్లరేగడి. వి. బాగా నల్లగాఉండే రేగడి. **నల్లరాగిడిమన్ను** రూ.చూ. నల్లరేగడిమన్ను. వి. బాగా నల్లగా ఉండే రేగడిమట్టి. **నల్లరాతి న(్రాయి** వి. పచ్చ రాతి నారరాయి. **నల్లరాయి**[1] వి. ఎ(్రకంచురాయి. **నల్లరాయి**[2] రూ. న(్లాయి. వి. నల్లగుట్టరాయి. సాంకేతి కంగా 'గే(బో' (Gabbro) అని పిలువబడే కణాలు గల ఒకరకం పేలుడురాయి (Igneous rock). **నల్లరెంగ** వి. గృహాది నిర్మాణాలకు, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Albizzia amara). **నల్లరేగడి** రూ. నల్లరాగిడి, నల్లరేవడ, నల్లరేవడి. వి ఎక్కువ నలుపురంగులోఉన్న రేగడినేల. **నల్లరేగడిమట్టి** రూ. నల్ల రేవడిమట్టి. వి. బాగా నల్లగా ఉండే రేగడిమట్టి. **నల్లరేగడి మన్ను** రూ.నల్లరాగిడిమన్ను. వి.బాగానల్లగాఉండే రేగడి. **నల్ల రేగు** వి.గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయా రీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Albizzia amara). **నల్లరేవడ** రూ.చూ. నల్లరేగడి. వి. ఎక్కువ నలుపురంగులో ఉన్న రేగడినేల. **నల్లరేవడి** రూ.చూ. నల్లరేగడి. వి. ఎక్కువ నలుపురంగులో ఉన్న రేగడినేల. **నల్లరేవడిమట్టి** రూ.చూ. నల్లరేగడిమట్టి. వి. బాగా నల్లగాఉండే రేగడిమట్టి. **నల్లరోజనము** వి. నల్లని జిగురునిచ్చే చెట్టు (Canarium strictum). **నల్లరౌతు**[1] వి. నల్లగుట్టరాయి (Gabbro). **నల్లరౌతు**[2] వి. కండెరాయి. **నల్లఱాతిశ్రీ విమానము** వి. నల్ల సేనం రాతితో నిర్మించబడ్డ గర్భగుడి. ద.హిం శా. సంపు. 6. శా.సం. 142. (కీ శ. 1268. **నల్లఱాయి** వి. నీలమణి. **నల్లలచంద** వి. అలచందఅనే పప్పుదినుసులో ఒకరకం (Vigna catjang, Dolichos catjang). < నల్ల[2] + అలచంద. **నల్లలం** రూ. నల్లాలం. వి. నేలపై పరుచుకు పెరిగే నల్లటి కలుపుమొక్క. **నల్లలి** వి. శివగిరి, నీలగిరి కొండల్లో పెరిగే ఒకరకంచెట్టు (Nothopegia colebrookiana). **నల్లలుదీయు(-తీయు)** అ.(కి. బొగ్గులు మొ. దిగదుడుచు. కువ.చ. 4.217. **నల్లలువిరుచు** స.(కి. పడుగు మీదపెట్టిన, నల్లటి మసిగుర్తులను బట్టి పడుగుమడుపు. **నల్లవంకాయ** వి. సన్నగా నల్లగా పొడుగ్గాఉండే వంకాయ. **నల్లవట్టు(-పట్టు)** రూ. నల్లబంటు, నల్లబాటు, నల్లమట్టు, నల్ల వాటు. వి. ఒళ్ళు నల్లకప్పు వేయటం. **నల్లవడు(-పడు)** రూ. నల్లపడు, నల్ల(బడు. అ.(కి. నల్లనగు. మను. **3.119**. **నల్లవడ్లు** వి.బ.వ. గింజనలుపువడ్లు. **నల్లవలువతాలుపు** రూ.చూ. నల్లవలువదాల్పు. వి. బలరాముడు, కృష్ణాంబర ధారి. **నల్లవలువదాల్పు** రూ. నల్లవలువతాలుపు. వి. నీలాం బరధరుడు, బలరాముడు. రామరా. 213. **నల్లవాటు** రూ.చూ. నల్లవట్టు. వి. ఒళ్ళు నల్లకప్పు వేయటం. **నల్లవాడు** వి. చిన్నచిన్న పరికరాల తయారీకి ఉపయోగపడే కలప నిచ్చే చెట్టు. **నల్లవావిలి**[1] వి. తోటల్లో కంచెల్లో పెంచబడే ఆకులు ఔషధాల్లో ఉపయోగపడే ఒకమొక్క (Justicia gendarussa). **నల్లవావిలి**[2] వి. నీలంరంగు పూలు కలిగి మందుల్లో ఉపయోగపడే మొక్క. (Vitex Negundo). **నల్లవిష్ణు(కాంత** వి. స్థూలపుష్టి. **నల్లవిసె** వి. అవి

సెలో ఒకరకం; <నల్ల² + అవిసె. నల్లవెలుతురు రూ. నల్ల వెలుతురు. వి. ఇంధనంగా ఉపయోగపడే ముళ్ళు కలిగిన కొమ్మలుండే చెట్టు (Dichrostachys Cinerea). నల్లవెలుతురు రూ.చూ. నల్లవెణుతురు. వి. ఇంధనంగా ఉపయోగపడే ముళ్ళు కలిగిన కొమ్మలుండే చెట్టు (Dichrostachys Cinerea). నల్లవెదురు 1. వి. కృష్ణసారం; 2. నల్లగాఉండే వెదురు. నల్లవేల్పు వి. కృష్ణుడు, విష్ణువు. చిత్రభా. 1.4. నల్లసనపురాయి రూ.చూ. నల్లజలపరాయి. వి. ఎర్రకంచురాయి. నల్లసరంగుండు వి. గుంత్రటి గ్రేనైట్ రాయి. నల్లసరపరాయి వి. సారెమెులను దించడానికి గుబ్బి గద్దలో పొదిగినరంధ్రం ఉన్నరాయి. నల్లసవుడు రూ.చూ. నల్ల చవుడు. వి. అక్కడక్కడ చవిటిరంగుగల చవిటినేల. నల్లసుగంధిపాల వి. శాబరి, దళ్ళలోను, బంజరుల్లోనూ పెరిగే ఒకతీగ (Hemidesmus indicus). నల్లసెనగ వి. సెనగలో ఒకరకం. నల్లసేనపుగుండులు వి.బ.వ. గట్టిగా, నల్లగా ఉన్న గుండ్లు. ఉ. హరి. 4.26. నల్లసేనము వి. ఒకరకంరాయి. నల్లసొర వి. సొరలో ఒకరకం. నల్లసోమింత వి. దళ. కట్టటానికుపయోగించే పచ్చనిపూలు పూసే మొక్క. (Sesbania aegyptica). నల్లానప వి. ఆనపలో ఒకరకం. <నల్ల² + ఆనప. నల్లాము వి. కుండలు నల్లగా కాలడానికి అనువైనఆము. <నల్ల² + ఆము. నల్లాముసామిని వి. కుండలు పేర్చి నల్లకాల్చుకు సిద్ధంచేసినట్టి ఆము. నల్లారెడ్డిమామిడి వి. మామిడిలో ఒకరకం. నల్లాలం రూ.చూ. నల్లలం. వి. నేలపైపరుచుకు పెరిగే నల్లటికలుపు మొక్క. నల్లావలు వి.బ.వ. సర్షపం. <నల్ల² + ఆవ + -లు. నల్లిల్లు వి. ఔ. హోమధూమం వల్ల పవిత్రమైన ఇల్లు కలది, అగ్రహారం. భార. సభా. 2.121. త. నల్లార్. పవిత్రమైన. నల్లీనుగు వి. గృహాది నిర్మాణాలకు, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు. (Albizzia amara.) నల్లులవ వి. ఉలవలో ఒకరకం. <నల్ల² + ఉలవ. నల్లూటి వి. చిన్న చిన్న పరికరాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Diospyros Ebenum). నల్లూద వి. ఊదగడ్డిలో నలుపురంగు కలుపు మొక్క (Black variety of echinocheoa). <నల్ల² + ఊద. నల్లూదర వి. ఊదరలో ఒకరకం కలుపుమొక్క. <నల్ల² + ఊదర. నల్లూబ వి. నల్లటి ఎన్నులుగల ఊబగడ్డి (Heteropagon Species). <నల్ల² + ఊబ.

నల్ల³ వి. కుళాయి.

హిం. ఉ. నల్లా. కుళాయి.

<ఉ. నల్లా.

నల్లవొ రూ. నల్లవో. అవ్య. ప్రశంసార్థకం. భార. విరా. 3.99.

త. నల్ల. మంచి.

<త. నల్ల + పో.

నల్లవో(-పో) రూ.చూ. నల్లవొ. అవ్య. ప్రశంసార్థకం. భార. విరా. 5.136.

నల్లానప చూ. నల్ల².

నల్లాన్రసంమామిడి వి. మామిడిలో ఒకరకం.

నల్లాము చూ. నల్ల².

నల్లాముసామిని చూ. నల్ల².

నల్లారెడ్డిమామిడి చూ. నల్ల².

నల్లాలం చూ. నల్ల².

నల్లావలు చూ. నల్ల².

నల్లి¹ వి. మత్కుణం, మంచాలకి పట్టే ఒకచిన్న కీటకం. భార. అను. 5.54.

తు. నల్లు, నల్లు. నల్లి; గోం. నడ్. నల్లి; కొం. నడ్. నల్లి; కువి. నుక్తు. (S) నత్క. నల్లి; గ. నణ్కె (నండ్కె). నల్లి; కురు. నడ్గా; మాల్తొ. నడ్గె.

నల్లిపొడ వి. 1. పికిలిపిట్ట శరీరంలోని రంగు, మచ్చ. ప్రబంధ. 130; 2. వరికి పట్టే పేను తెగులు. నల్లిపొడ రోగం వి. పత్తి తెగులు (Anychuslatus).

నల్లి² వి. పేనని నార.

నల్లిక చూ. నల్ల¹.

నల్లికంగూడు వి. నగిషీపని చేసినగూడు.

నల్లికనరము వి. సన్నని వాడు.

నల్లికళ్లపాము రూ.చూ. నలికండ్లపాము. వి. నలికిరిపాము.

నల్లింద వి. వృక్షవిశేషం, ఒకచెట్టు. పి. శకు. 2.14.

నల్లియ రూ.చూ. నల్లె¹. వి. నాలుగు అంగుళాల పరిమాణం.

నల్లిల్లు చూ. నల్ల².

నల్లీనుగు చూ. నల్ల².

నల్లు వి. చూరు తుట్టుకు వాడే మెలిబెట్టిన ఆకు.

నల్లులవ చూ. నల్ల²

నల్లూటి చూ. నల్ల².

నల్లూద చూ. నల్ల².

నల్లూదర చూ. నల్ల².

నల్లూబ చూ. నల్ల².

నల్లె¹ రూ. నల్లియ. వి. నాలుగు అంగుళాల పరిమాణం. పండి. చ. 5.384వ.

నల్లెంట అవ్య. దాపుల. పండి. చ. ద్వితీ. 5.477.

నల్లె(డు విశ. నాలుగు అంగుళాల పరిమాణం కల. భార. ద్రోణ. 5.317.

నల్లె² వి. మడతబందు.

నల్లెంగ వి. ఒకరకం కలుపుమొక్క.

నల్లెడ రూ.చూ. నెరిడె². వి. గుండెజబ్బు, కడుపులో మేత పొట్టకు పైన ఉండేది. 'నెరిడె' అదివాచి ఊపిరి తిత్తుల కద్దంపడి శ్వాస ఆడక పశువు చనిపోతుంది.

నల్లెరు రూ.చూ. నల్లేరు. వి. వజ్రవల్లి అనేతీగ.

నల్లేంట్ర వి. మామిడిలో ఒకరకం.

నల్లేరు రూ. నల్లెరు. వి. కణుపులు దగ్గర నొక్కుకుపోయిన 4 పలకల కాడ. హంస. 4.10. (Vitis quadrangularis).

నల్లేరుతోనలుగుపెట్టినట్లు అవ్య. హాస్యంగానే ఎత్తిపొడిచి బాధించేపట్ల ఉపయోగించే పలుకుబడి. నల్లేరుపైబండినడక వి. నిరాఘాటం. నల్లేరుపైబండివలె అవ్య. ద్రు. నిరాటంకంగా.

**నల్లొట్టు** వి. నీళ్ళు ఉరవడికి చెరువులో వేసిన మట్టి దిబ్బ.

**నల్వ** రూ.చూ. నలువ. వి. బ్రహ్మ. శివరా. 1.56.

**నల్వకొమరు(డు** వి. బ్రహ్మయొక్క కొడుకు, జాంబవంతుడు. అచ్చ. రా. యు. 585. **నల్వగ్రుడ్డు** వి. బ్రహ్మండం. అచ్చ. రా. అరణ్య. 48. **నల్వజక్క** వి. హంస. వేంక. ఆం. 97. **నల్వరాణి** రూ.చూ. నలువరాణి. వి. నలువరాణి. సరస్వతి.

**నల్వంక** చూ. నలు.

**నల్వది** రూ.చూ. నల్వాది. సర్వ. ఔ. నాలుగుపదులు. ఉరా. 4.302.

**నల్వారు** రూ.చూ. నలువారు. అ.క్రి. ఒప్పు.

**నల్వు** రూ.చూ. నలువు. విణ. 1. చక్కని. ఒప్పుకల. ఇందు. 2.162 ; 2. సమర్థమైన, శక్తికల ; వి. 1. సౌందర్యం ; 2. ప్రేమ. అనురాగం ; 3. శక్తి, సామర్థ్యం ; 4. రీతి, విధం.

**నల్వురు** రూ. నలుగురు. నలువురు. నల్గురు. సర్వ. బ. వ. 1. నాలుగుమంది. అరకట వేములశాసనం. క్రీ. శ. 10. శతాబ్దం ; 2. అందరు.

క. నాల్వర్. నలుగురు పురుషులు ; కొడ. న.నె. నలుగురు పురుషులు ; తు. నల్వెరు ; త. నాల్వర్ ; మ. నాలర్, నాల్వర్, నాలువర్ ; గోం. నల్వర్. నాల్విర్ ; పర్జి. నెల్విర్. నలుగురుపురుషులు, నెలల్. నలుగురుస్త్రీలు ; కొలా. నల్గుర్, నాల్గుర్, నల్లవ్. నలుగురు స్త్రీలు ; నా. నల్గుర్. నలుగురు పురుషులు, నల్గల్. నలుగురు స్త్రీలు.

<మూ. ద్రా. *నల్‌వర్.

**నశితం** వి. స్తంభానికి పైన, దూలానికి కింద నగిషీగాచేసిన కట్టుబడి పనిలోనికొన 'C' ఆకారం ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తుభాగం.

**నళ్వాది** రూ. నలబై, నలభై, నలుబది. నలభై, నలువది, నల్బది, నల్వది. సర్వ. ఔ. నాలుగుపదులు, దొంగల పాని శాసనం. క్రీ.శ. 991.

క. నాల్వత్తు, నల్వత్తు ; కొడ. న. పది ; తునాల్ప ; త. నాఱ్పతు, నాప్పతు ; మ. నాల్పతు ; కో. న.ల్యత్, న.లత్ ; తొ. నల్‌పాథ్.

**నవ[1]** వి. దురద, కండూతి. ఆం. భా. 2.129.

క. నవె. దురద ; తు. నవుఞ్జు. దురద, గొంతునస, నౌలుని. దురదపెట్టు ; త. నమై (-వ్-,-న్త్-,-ప్ప్-, -త్త్-). నముట్టు (నముట్టి-), దురదపెట్టు, నమై, నమైప్పు, నమైచ్చల్. దురదపెట్టడం, దురద.

**నవగొను (-కొను)** అ. క్రి. దురదపెట్టు.

**నవ[2]** విణ. మృదువయిన.

సం. నవ-. కొత్త, లేత. ఇప్పటి.

<సం. నవ- (అర్థవిపరి.).

**నవగోకిరె** వి. గోరుచిక్కుడులో ఒకరకం. **నవగోజ** వి. గొప్పగుడారం. ఆం. భా. 2.159. **నవనవ** వి. మృదుత్వం, కోమలత్వం మొ॥ వాటికి అనుకరణం.

**నవనవమను** అ.క్రి. మృదువగు, కోమలమగు. చమ. 3.108. <నవనవ + అను. **నవనవలాడు** అ.క్రి. నవనవమను, కోమలమగు. మృత్యు. 1.8. <నవనవ + -లు + ఆడు.

**నవకము** చూ. నవ[2]. విణ. 1. మృదులమైన. కోమలమైన. కు. సం. 6.13 ; 2. అందమైన. నిర్వ. రా. 8.32 ; వి. 1. అందం, ఒప్పు. భార. విరా. 2.52 ; 2. అత్యంత మార్దవం. మృదుత్వం. హరి. ఉ. 4.250.

**నవకమెక్కు** అ.క్రి. ఒప్పు, సుందరమగు. భార. విరా. 2.52. <నవకము + ఎక్కు.

**నవకమెక్కు** చూ. నవకము.

**నవటాకు** రూ. నౌటాకు. వి. సేరులో ఎనిమిదోవంతు.

**నవదినుసులు** వి.బ.వ. నవధాన్యాలు, పూజకువాడే తొమ్మిది రకాల గింజలు. ఇవి గోదుమలు, యవలు, కందులు, పెసలు, సెనగలు, బొబ్బర్లు, నువ్వులు, మినుములు, ఉలవలు.

సం. నవ. తొమ్మిది.

<సం. నవ + దినుసులు (మిశ్రస.).

**నవ(త** చూ. నవయు.

**నవబతు** రూ. చూ. నవుబత్తు. వి. చర్మవాద్య విశేషం.

**నవయించు** చూ. నవయు.

**నవయు** అ.క్రి. 1. క్షీణించు. తగ్గు. భార. సభా. 1.38 ; 2. శ్రమపడు, కష్టపడు, భార. అరణ్య. 1.122 ; 3. రోగాదులచే కృశించు, చిక్కు. భార. అరణ్య. 5.330 ; 4. (రోగాదులచే) ఎండిపోవు. వరాహ. 7.52.

క. నమె, నవె. ప్రాముఖ్యం తగ్గిపోవు, బీదగు, నాన్పు). క్షీణించు, తగ్గు, ఎండిపోవు. వ్యర్థమయిన ; తు. నమెయుని. బీదగు ; త. నమై (-ప్ప్-, -త్త్-). విసుగుపడు, నవై (-ప్ప్-, -త్త్-). చంపు, లోపం, శిక్ష ; గోం. నవు. వార్ధక్యంచే వంగిన ; కువి. నబ్గ్. అణచు, కిందికి నొక్కు.

మూ. ద. ద్రా. నామ్- ; నయ్-వ్-/*నవ్-వ్-*నాఁమ్-/ నెఁయ్-.

**నవ(త** వి. 1. కష్టం, శ్రమ. రం. రా. అరణ్య 1.53పు. 23పం. ; 2. క్షయ. ఆం. భా. 2.127. **నవయించు** స.క్రి. కష్టపెట్టు, బాధపెట్టు. కు. సం. 7.41. <నవయు + -ఇంచు[3].

**నవరసు** వి. ఒకవిధమైన బంగారు నాణెం. బహుళా. 5.62.

**నవరస్‌తొగరు** వి. ఆరుద్ర పురుగు రంగు.

**నవరస్‌తొగరు** చూ. నవరసు.

**నవరు** రూ. చూ. నగరు. వి. 1. రాజగృహం. భార. శాంతి. 2.308 ; 2. దేవాలయం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 904. క్రీ.శ. 1291.

**నవల** రూ. నవలా. వి. 1. ఆడుది. విక్ర. 5.73 ; 2. గద్య కథా కావ్యవిశేషం ; 3. మానిసె.

సం. నవలతా. కొత్తతీగ ; ప్రా. ణవలఆ, ణవలయా. ఒకానొకవ్రతం.

<ప్రా. ణవలఆ.

**నవలా** రూ.చూ. నవల. వి. స్త్రీ. రామాభ్యు. 2.101. మను. 2.25.

**నవాతు** వి. ఒకరకం చక్కెర. విజయ. 3.56.

త. నవాతు. తెల్లటి పంచదార.

**నవాబు** రూ. నవ్వాబు, నహాబు, నేబాబు. వి. ప్రభువు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 757. క్రీ. శ. 1541.

హిం. నవాబ్. ముస్లింల బిరుదు; మరా. నబాబ్. ముస్లింసర్దారు; ఉ. నవాబ్, నవ్వాబ్. చక్రవర్తి, ప్రతినిధి; పార. నవ్వాబ్, నౌవాబ్. చక్రవర్తిప్రతినిధి, నవాబు; అర. నవ్వాబ్. చక్రవర్తి ప్రతినిధి.

< ఉ. నవాబ్.

**నవాబుతనము** వి. రాచరికం, మహమ్మదీయరాజత్వం. ఆనంద. పీఠి. 107.

**నవార్** రూ.చూ. నవారు. వి. మంచాలకు నేసే పట్టెడ.

**నవారు** రూ. నవార్, నవ్వారు[1]. వి. చిత్రాలపట్టిక, పట్టెడ, మంచానికి నేసే పట్టెడ. ఆం. భా. 2.164.

హిం. ఉ. నవార్; మరా. నవార్. పట్టిమంచానికి వేసే పట్టెడ; పార. నవార్, నువార్. పటకా.

< ఉ. నవార్.

**నవారుకొయ్య** వి. నవారు నేసే చోట మగ్గానికి ఒక పక్క నేలలో పాతిన గూటం. **నవారుపట్టి** వి. మంచాలకు నేసే పట్టెడ. **నవారుమగ్గం** రూ. నవారుమొగ్గం. వి. మంచం పట్టెడ (= నవారు) నేసే మగ్గం. **నవారుమొగ్గం** రూ.చూ. నవారుమగ్గం. వి. మంచం పట్టెడ నేసేమగ్గం.

**నవాసాగరము** రూ.చూ. నవాసారము. వి. ఒకరకం ఉప్పు.

**నవాసారము** రూ. నవాసాగరము. వి. ఒకరకం ఉప్పు.

సం. నవక్షార-. ఒకరకం ఉప్పు.

< సం. నవక్షార-.

**నవి** వి. 1. తోట మొ॥ వాటి కట్టవకు పెట్టే చిన్నగోడకై దాని పక్కనే తవ్విన కాలవ. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1016. క్రీ. శ. 1087; 2. కరగోడ పెట్టటానికి పొడవుగా తవ్వి ఎత్తిన మట్టిపల్లం.

**నవితి** వి. పన్నెండు సేర్లకొలత.

**నవిలికండ్లదోవతి** రూ.చూ. నెమలికండ్ల ధోవతి. వి. అంచుల మధ్య భాగంలో నెమలి కళ్ళమాదిరి డిజైన్లు నేసినపంచె.

**నవిషీ** రూ.చూ. నకాసీ. వి. మట్టిపాత్రలకు పక్కల్లో పెట్టేహూజ.

**నవిషీఅంచు** వి. చిలకలు పువ్వులు ఆకులు మొ॥ డిజైన్లు పడేట్టు నేసిన (చీర) అంచు. **నవిషీపేటు** రూ. నవిసీపేటు. వి. నేతలో డిజైన్లు రావడానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**నవిసి** వి. వరి తెగులు.

**నవిసీపేటు** రూ.చూ. నవిషీపేటు. వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గం పైన అమర్చేయంత్రం.

**నవు** రూ.చూ. నగు. వి. 1. హాసం, నగవు. ఆం. నా. సం. మాన. 34; 2. పరిహాసం; 3. వింత, ఆశ్చర్యం; స.క్రి. 1. అపహసించు, గేలిచేయు; 2. పోలు; అ.క్రి. 1. హసించు, హాసంచేయు; 2. ఆనందించు, సంతోషించు; 3. అపహసించు, మేలమాడు.

**నవుటాల** రూ.చూ. నవ్వుటాల. వి. 1. పరిహాసం; 2. లీల.

**నవుకరి** రూ.చూ. నౌకరి. వి. కొలువు, సేవ, దాస్యం.

**నవుకరు** రూ.చూ. నౌకరు. వి. సేవకుడు, కొలువుకాడు.

**నవుకు** రూ.చూ. నౌకు. విశ. పల్లంగాఉన్న, నిమ్నమైన. ఆం. భా. 1.158; వి. మొక్రి.

**నవుజు** రూ.చూ. నౌజు. విశ. చాలాలేత.

**నవుడు** రూ.చూ. సగుడు, వి. ఎద్దుగిట్ట అరగకుండా ఉండటానికి వేసే ఇనప బిళ్ళ.

**నవుడుకొట్టు** రూ. నౌడుకొట్టు. అ.క్రి. మిణకరించు. గౌ. హరి. పూ. 216పం.

**నవుబత్తు** రూ. నవబతు, నౌబతు, నౌబత్తు. వి. చర్మవాద్య విశేషం. రంగా. చ. 1.116.

హిం. ఉ. నౌబత్. సన్నాయి.

< ఉ. నౌబత్.

**నవురు** రూ. నౌరు. వి. మృదువైన, మెత్తని; వి. ఏర్పడుతున్న ఎన్ను(లు). ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను.

క. నవురు, నవరు, నవిరు. మెత్తనిది, చక్కనిది, నన్ననిది (గడ్డి, జుట్టు, బట్ట మొ॥ వానివలె).

**నవురుచాలు** వి. మూడోచాలు, మూడోసారి దున్నటం.

క. నవురు.

< క. నవురు. + తె. చాలు.

**నవులు** స.క్రి. 1. పళ్ళతో ముక్కలు చేయు; 2. ఆస్వాదించు; 3. తిను.

**నవ్‌రంగ్** వి. నిలువు, అడ్డం తొమ్మిది రంగులు పెట్టినేసిన ఒక రకం చీర.

హిం. నౌరంగ్. తొమ్మిదిరంగులు.

< హిం. నౌరంగ్.

**నవ్వ** రూ.చూ. నప్ప. వి. శిశువు.

**నవ్వాబు** రూ.చూ. నవాబు. వి. ప్రభువు.

**నవ్వారు[1]** రూ.చూ. నవారు. వి. మంచాలకు నేసేపట్టెడ.

**నవ్వారు[2]** చూ. నవ్వు.

**నవ్వించు** చూ. నవ్వు.

**నవ్వు** రూ.చూ. నగు. అ.క్రి. 1. హసించు, హాసంచేయు. కు. సం. 1.2; 2. అపహసించు, మేలమాడు. భార. ఆశ్ర. 1.170; 3. ఆనందించు, సంతోషించు. ఉ.రా. 2.332; వి. 1. హాసం, నగవు. కు.సం. 4.58; 2. వింత, ఆశ్చర్యం. భార. శాంతి. 3.376; 3. పరిహాసం. భార. శాంతి. 3.438; 4. బాలకుడు. ఆం. భా. 2.119; స.క్రి. 1. అపహసించు, గేలిచేయు. విక్ర. 4.49; 2. పోలు. మను. 6.14.

**నవ్వారు[2]** అ.క్రి. నవ్వుతోఒప్పు. దశా. 2.350. < నవ్వు + ఆరు. **నవ్వించు** రూ. నగించు, నగియించు. స.క్రి. నవ్వచేయు. కు.సం. 2.2. < నవ్వు + -ఇంచు[3]. **నవ్వుకొను** అ.క్రి. నవ్వు. శుక. 2.337. **నవ్వుచేయు** స.క్రి. చిన్నబుచ్చు. పండి. చ. 4.306పు. **నవ్వుటాల** రూ.

నవ్వటాల, నవ్వులాట. వి. 1. పరిహాసం. పరియాచకం. భార. ఉద్యో. 3.61 ; 2. లీల. అలవోక. అధ్యా. రా. అరణ్య. 68పు. <నవ్వులాట (వర్ణవ్యత్యయం). **నవ్వుతాలు** వి. ఎగతాళి. **నవ్వుతూపేలు** రూ. నవ్వుతూబేలు. అ.క్రి. ఖులాసాగా మాట్లాడు. **నవ్వుతూబేలు** రూ.చూ. నవ్వుతూపేలు. స.క్రి. ఖులాసాగా మాట్లాడు. **నవ్వుదేఱు (-తేఱు)** అ.క్రి. నవ్వుతేటపడు. హరి. ఉ. 5.22. **నవ్వునాలుగందాలా నష్టం** వి. అపహాస్యం మంచిది కాదనేపట్ల ఉపయోగించే పలుకుబడి. **నవ్వుపఱుచు** స.క్రి. నవ్వుబాటు కలగజేయు. భార. ఆది. 7.179. **నవ్వు(బాటు (-పాటు)** రూ.చూ. నగు(బాటు. విణ. అపహాస్యకరమైన, నవ్వదగిన. హరి. ఉ. 2.28 ; వి. అపహాస్యత. దూరు. ఉ. హరి. 1.187. **నవ్వుల(దేలించు (-తేలించు)** స.క్రి. వినోదపెట్టు. హంస. 3.102. **నవ్వులపాలగు** అ.క్రి. అపహాస్య పాత్రత చెందు. **నవ్వులబండి** వి. నవ్వేస్వభావం కలది. **నవ్వులబేరమాడు** స.క్రి. పరియాచక మాడు. శుక. 3.199. **నవ్వుల(బెట్టు** స.క్రి. పరిహసించు. రసిక. 4.11. <నవ్వు + -లు + -అ[?] + పెట్టు. **నవ్వులాట** రూ.చూ. నవ్వటాల. వి. పరిహాసం, పరియాచకం. విప్ర. 4.71. <నవ్వు + -లు + ఆట. **నవ్వులుపడు** అ.క్రి. అపహసింపబడు, నవ్వులపాలగు. మొల్ల. బాల. 75. **నవ్వువచ్చు** అ.క్రి. నవ్వుకలుగు. కళా. 5.46. **నవ్వుసేయు (-చేయు)** స.క్రి. అపహసించు, నవ్వులపాలుసేయు. పండి. చ. ద్వితీ. 4.215 పు.

**నశీబు** రూ.చూ. నసీబు. వి. అదృష్టం.

**నష్టసుడి** వి. నెత్తి (నొసట) మీద ఉండే సుడి.

సం. నష్ట-. నష్టం, లోటు.

<సం. నష్ట- + సుడి. (మిశ్రన).

**నస** వి. 1. కామం. వరాహ. 5.97; 2. దురద, కండూతి. ఆం.భా. 2.128 ; 3. ఉపద్రవం.

క. నసె. దురద; త. నసల్. ఉపద్రవం; కొలా. నసమ్. దురదవేయు.

**నసకంద** వి. కంద దుంపలో ఒకరకం. **నసగుమ్మడి** వి. ఉత్తర సర్కారులూ పడమటి కనుములూ మొ. చోట్ల పెరిగే ఒకరకం తీగ (Vitis Pedata). **నసగూ(టితనము** వి. కామోద్రేకం. విప్ర. 4.24. **నసగూ(డు** వి. కామోద్రేకం. నార. పంచ. 3.236. **నసగొట్టు(-కొట్టు[1])** వి. 1. కామోద్రేకం కలవాడు. శుక. 2.479; 2. విటుడు. **నసగొంటు** వి 1. కామోద్రిక్తుడు. బహుళా. 5.108 ; 2. విటుడు. **నసనస** వి. (రక్తం మొ. వాటితో) తడిసిన చర్మం మొ. వాటి ధ్వనికి అనుకరణం. పార్వ. 4.96.

**నసాళానికిఅంటు** అ.క్రి. బాగా తగులు.

సం. నాసా. ముక్కు.

**నసిమిరి** చూ. నస. వి. 1. నీటిలోఉండే ఒక జంతువు. హంస. 4.186 ; 2. దురద, కండూతి.

**నసీబు** రూ. నశీబు. వి. అదృష్టం, నుదుటిరాత.

హిం.ఉ. నసీబ్. అదృష్టం, భాగ్యం.

<ఉ. నసీబ్.

**నసుకు** వి. అసత్యం. ఆం.భా. 1.119 ; విణ. అసత్యమైన.

క. నక్త. జాతీయం ; త. నచ్చు, నచ్చి-. గొణుగు, అసత్యంగా గొణుగు.

**నసుసు** స.క్రి. అస్పష్టంగా చెప్పు ; వి. అస్పష్టంగా చెప్పే మాట.

**నసువు** వి. మొలక.

**నసెము** రూ.చూ. నసేము. వి. 1. ముక్కులో వేసే రసాదులు ; 2. ముక్కుపొడి.

**నసెముచేయు** అ.క్రి. రోగ నివృత్తికోసం ముక్కులో రసాదుల్ని ఉంచు.

**నసేము** రూ. నసెము. వి. ముక్కులో వేయు రసాదులు మొదలైనవి.

సం. నాస్య. నాసారంధ్రం ద్వారా స్వీకరించబడేది ; ప్రా. ణస్సా॰. నాసిక ;

క. నసి, నసె, నేసె. నాసా సంబంధి ; తు. నాసు. నస్యం ; మ. నచ్చియు, నస్సియు ; కుయి. నాసు, నాసొ. నస్యం, ముక్కుపొడి.

<సం. నాస్య-.

**నస్కం** వి. పక్కలు పల్లుగా మధ్య ఎత్తుగా ఉండే కిటికీ తలుపు రెక్కలమీది చెక్కడపుపనిగల భాగం.

**నస్కంతలుపు** వి. అంచులు వాలుగానరికి, మధ్యభాగం చదునుగాఉంచి, తయారుచేసిన చెక్కలను చట్రంలో బిగించిన తలుపు.

**నస్కు** వి. ఇంకా చీకటిగాఉన్న తెల్లవారు జాము.

**నహాబు** రూ.చూ. నవాబు. వి. ప్రభువు.

**నహుబూత్‌ఖానాకుండ** రూ.చూ. నబోతికానేకుండ. వి. పెద్ద నగారాలాగా ఉండే వాద్యానికి వాడే మట్టికుండ.

**నా** చూ. నేను.

**నాక** అవ్య. అనక, (అను ధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థక రూపం). భార. ఆది. 5.203.

<అనక (వర్ణవ్యత్యయం).

**నాకిచ్చు** చూ. నాకు.

**నాకిసాని** వి. వేశ్య.

సం. నాకిన్. దేవత, వేల్పు.

<సం. నాకిన్ + సాని.

**నాకు** స.క్రి. 1. లేహనంచేయు, నాలుకతో రాచిలోగొను. భార.ఆది. 2.123 ; 2. స్పృశించు, తాకు. మను. 6.21.

క. నక్కు, నెక్కు. నాకు ; కొడ. నక్క- (నక్క-). తు. నక్కుని. నాకు ; త. నక్కు (నక్క). నాకు ; మ. నక్కుక. నాకు ; కో. నక్- (నక్కె-). నాకు ; తొ. నొక్ (నొక్తె). నాకు ; గోం. నాక్. నాకు ; కొం. నాక్- ; కుఇ. నాక (నాకి-). నాకు ; కువి. నాకలి, నాక్. నాకు ; పర్జి. నైక్. నాకు ; నా. నాక్ ; గ. నాక్. లెక్క. కుక్కలానాకు ; ఒల్లా. నాక్.

<మూ.ద్రా. నాక్.

**నాకిచ్చు** స.క్రి. అలుకు, రుద్దు, పూయు. <నాకు + ఇచ్చు.

**నాకుము** స.క్రి. అను ధాతువుయొక్క వ్యతిరేక ప్రార్థనాద్యర్థక మధ్యము పురుషైక రూపం, అనకుము. భార. విరా.

5.235.

<అనకుము. (వర్ణవ్యత్యయం).

**నాగ** విశే. **1**. పూజ్యమయిన ; **2**. పెద్ద.

సం. నాగ-. నాగలోకం, పాము, ఏనుగు, ఏనుగువలె స్థూలమైన ; ప్రా. ణాగ, ణాయ.

<సం. నాగ- (అర్థవిపరి.).

**నాగకేసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. సాంబ. మాన. 52. సం. నాగకేసర-. పుష్ప ప్రధానమైనమొక్క. <సం. నాగకేసర- + -లు. **నాగగన్నెరు** రూ. నాగగన్నేరు. వి. పెద్దగన్నేరు, ఒకజాతిగన్నేరు. భల్లా. 3. **నాగగన్నేరు** రూ.చూ. నాగగన్నెరు. వి. ఒకరకంగన్నేరు. **నాగగొలంగ** రూ. నాగగొలుగు. వి. ఒకరకం చెట్టు (Murraya exotica). **నాగగొలుగు** రూ.చూ. నాగగొలంగ. వి. సువాసన పుష్పాలుకలచెట్టు. **నాగచెముడు** రూ. నాగజెముడు. వి. ఒకరకం చెముడు. **నాగజెముడు** రూ.చూ. నాగచెముడు. వి. బొమ్మజెముడు, ఒకజాతి ముళ్ళచెట్టు, నాగదాళి (Opuntia Dillenii). **నాగజెముడుపురుగు** వి. ఆకులకు, కొమ్మలకు పట్టే నల్లటి చిన్నపురుగు (Cochineal insect). **నాగజోడు** వి. ఒకచెవి నగ. సం. నాగ. పాము. <సం. నాగ- + జోడు. (మిశ్రస.) **నాగతాళి** వి. ఒకరకంచెట్టు (Cactus Indicus). **నాగదాడి** రూ.చూ. నాగదాళి. వి. కంచెలకు పాతే నాగజెముడు. **నాగదాళి** రూ. నాగదాడి. వి. నాగజెముడు, చెప్పు అట్టల్లాంటి దళసరి ఆకులు, సూదుల్లాంటి ముళ్ళుగల కంచెమొక్క (Opuntia Dillenii). క. నాగదాళి. **నాగనెరిడె** వి. పశువుల గుండెజబ్బు, గుండె ఆగిపోవటం, పొట్ట ఉబ్బటం, శ్లేష్మం గొంతు కడ్డంపడటం ఈ జబ్బు లక్షణాలు. **నాగనేరెడు** వి. పెద్దనేరేడు, ఒకజాతి నేరేడు. **నాగమల్లి** వి. 1. నాగజెముడు ; 2. నాగజెముడులో పెద్దమాను. **నాగమల్లె**[1] రూ. నాగుమల్లె. వి. ఒకజాతి మల్లె, అష్టపత్రిక. హంస. 4.128. క. నాగమల్లిగె. (Jasminum Arborescens). **నాగమల్లె**[2] వి. తెల్లనిపూలు పూసే అందమైన తీగ (Vallaris Heynei). **నాగమల్లె**[3] వి. సుమారు అయిదడుగుల ఎత్తు పెరిగే తెల్లనిపూలు పూసే ఒక తీగ (Rhinacanthus Communis). **నాగమల్లెలు** వి.బ.వ. ఒకరకం ధాన్యం. **నాగముషిడి** రూ. నాగముసడి[1]. వి. దళ్ళమీదా, పొదల మీదా పెరిగి పచ్చనిపూలు పూసే తీగ (Tiliacora Racemosa). **నాగముష్టి** రూ. నాగముసడి[2]. వి. నున్నని బెరడుకలిగి 1 నుంచి 3 వరకు గింజలుండే కాయలుకాసేతీగ (Strychnos Colubrina). **నాగముసడి**[1] రూ.చూ. నాగముషిడి. వి. దళ్ళమీదా, పొదలమీదా పెరిగి పచ్చని పూలు పూసే తీగ (Tiliacora Racemosa). **నాగముసడి**[2] రూ.చూ. నాగముష్టి. వి. నున్నని బెరడు కలిగి 1 నుంచి 3 వరకు గింజలుండేకాయలుకా సేతీగ (Strychnos Colubrina). **నాగముస్తె** వి. భద్రముస్తకం.

**నాగటిపచ్చారి** వి. పది అడుగుల ఎత్తువరకు పెరిగే ఒకరకం చెట్టు (Breynia Rhamnoidcs).

**నాగటిపాలికాడు** చూ. నాగలి.

**నాగటిపాలు** చూ. నాగలి.

**నాగటిపోత** చూ. నాగలి.

**నాగటిసాయలగడ్డి** చూ. నాగలి.

**నాగటేత** చూ. నాగలి.

**నాగతుమ్మ** చూ.నాగ. వి. ఒకరకం తుమ్మచెట్టు (Acacia Parnesiana).

**నాగదంష్ట్రం** వి. చూరు.

సం. నాగదంష్ట్రా. పాముకోర.

<సం. నాగదంష్ట్రా (అర్థవిపరి ).

**నాగదారితెగులు** వి. వంగతెగులు, ఆకులమీద గుడ్లు పోసినట్లు ఏర్పడే తెగులు.

సం. నాగ-. పాము.

సం. నాగ + దారి + తెగులు (మిశ్రస.).

**నాగదారిపేటు** వి. వంకీ (= పాము మెలిక) మాదిరిగా నేసి వంపుల్లో చుక్కలు పడేట్టు నేసిన అంచు డిజైను.

సం. నాగ-. పాము.

<సం. నాగ- + దారి + పేటు.

**నాగదొండ** వి. నాగబింబం, దుంపనుంచి లేచే ఒకరకం తీగ. ఈ తీగ ఆకుల్లో పామువంటి మచ్చలుంటాయి.

సం. నాగ-. పాము.

<నాగ- + దొండ.

**నాగపల్లేరు** వి. తెల్లనిపూలు పూసే ఒక తీగ (Vanilla Wightiana).

**నాగనాపచారి** వి. లేతఎరుపు లేక లేతనీలంరంగు పూలు పూసే అందమైన మొక్క (Dalbergia Lanccolaria).

**నాగప** రూ. నాగప్ప, నాప[1]. వి. నాగవల్లి, వివాహ సంస్కార విశేషం. ఈ సంస్కార విశేషంలో పామును పూజించేవారు.

సం. నాగ-. పాము.

<సం. నాగ- + అప (మిశ్రస.).

**నాగపడగలదండ** వి. స్త్రీ కంఠభూషా విశేషం. ద్వి.భాగ. 10.

సం. నాగ-. పాము.

**నాగపడగలు** రూ.చూ. నాగపడిగలు. వి.బ.వ. నాగుపడిగపోగులు, నాగుల పడగలు, పాము పడగలా ఉండే కర్ణభూషా విశేషం.

సం. నాగ-. పాము.

<సం. నాగ- + పడగ + -లు. (మిశ్రస.).

**నాగపడిగకోల** వి. నాగబెత్తం, పాము పడగలాంటి పడకల బెత్తం. శుక. 2.425.

సం. నాగ-. పాము.

<సం. నాగ- + పడిగ + కోల (మిశ్రస.).

**నాగపడిగలు** రూ.చూ. నాగపడిగలు. వి బ.వ. చెవికి పెట్టుకొనే ఆభరణాలు.

**నాగపడిగె** రూ. నాగబడిగె. వి. నాగపాశం, నాగబంధం. తోకమట్టకింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి.

సం. నాగ-. పాము.

**నాగపసాని** రూ.చూ. నాగప్పసాని. వి. నాగముసాని.

**నాగపాశం** వి. నాగపడిగె, తోకమట్ట కింద నాగుపాము పడగ

మాదిరి ఉండే సుడి.

సం. నాగపాశ-. పామువలె చుట్టుకొనే అస్త్రవిశేషం.

సం. నాగపాశ- (అర్థవిపరి.)

నాగపాసెం వి. నేతమోకు చుట్టే ఒకరకం (పళ్ళచక్రం కొయ్య) చేతిగూటానికి బిగించిన ఇనపఊచ.

సం. నాగపాశ-. పామువలె చుట్టుకొనే అస్త్ర విశేషం.

<సం. నాగపాశ-.

నాగపూరుచాపు వి. లంబాడి మగవాళ్ళు కట్టుకొనే ఒకరకం పంచెల జత. నాగపూరు మధ్యప్రదేశ్‌లోని ప్రసిద్ధ పట్టణం, దానికి సంబంధించిన పంచెలచాపు.

నాగపూర్‌సంత్ర వి. కమలాపండు, మామూలు నారింజకన్నా పండు చిన్నగా ఉన్న ఒకరకం కమలాఫలం. నాగపూరు మధ్యప్రదేశ్‌లోని ప్రసిద్ధపట్టణం, తత్సంబంధమైన కమలా పండు.

నాగపెంజెర వి. ఒకజాతి పెంజెర, సర్పజాతి విశేషం. సిం.ద్వా. 8.100.

సం. నాగ-. పాము.

<సం. నాగ-+పెంజెర (మిశ్రస.).

నాగపొత్తి వి. కనిపుతీగ (Stemona Minor).

నాగప్ప రూ.చూ. నాగప. వి. నాగవల్లి.

నాగప్పసాని రూ. నాగపసాని. వి. నాకబలి చిరంటి, నాగవల్లి నడిపే ముత్తైదువ. ఆం.భా. 2.108.

నాగప్పలపండగ వి. నాగులచవితి, నాగచతుర్థి.

సం. నాగ-. పాము.

నాగబడిగె రూ.చూ. నాగపడిగె. వి. నాగపాశం, నాగబంధం, తోకమట్ట కింద నాగుపాము పడగమాదిరి ఉండే సుడి.

నాగబద్ద వి. లాక, పడుగులో అని వెంబడి దూర్చిన వెదురు బద్ద.

సం. నాగ-. పాము.

<సం. నాగ-+బద్ద (మిశ్రస.).

నాగబందం రూ.చూ. నాగబంధము. వి. 1. బాసిగం కట్టు, పడుగు దువ్వే కుంచె పిడికి బిగించి వేసిన లాడు మెలిక; 2. మెలివేసుకొన్న పాముల నమూనాలో వేసిన అంచు డిజైను; 3. నాగపడిగె, తోకమట్ట కింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి.

నాగబంధము రూ. నాగబందం. వి. 1. వస్త్ర విశేషం. సిం.ద్వా. 3.206; 2. నాగపడిగె, తోకమట్ట కింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి; 3. కాడికి నాగలికి కలిపిమోకు కట్టటం; 4. బాసిగం కట్టు, పడుగు దువ్వే కుంచె, పిడికి బిగించి వేసిన లాడు మెలిక; 5. మెలివేసుకొన్న పాముల నమూనాలో వేసిన అంచుడిజైను.

సం. నాగబంధ-, సర్పబంధం.

<సం. నాగబంధ- (అర్థవిపరి.).

నాగబంధముచీర వి. అంచులో ఒకరకం డిజైను పడేట్లు నేసిన చీర.

నాగబరి వి. పశువుపొట్ట ఉబ్బి పేడ వెయ్యక పోవటం.

సం. నాగ-. పాము.

<సం. నాగ-+బరి. (మిశ్రస.).

నాగబెత్తము వి. నాగపడికోల, యోగవేత్రం, పొన్ను వేసిన మంత్రపూతమైన చిన్న పేము. వేంక. పంచ. 4.101.

సం. నాగ-. పాము.

<సం. నాగ-+బెత్తము. (మిశ్రస.).

నాగబ్రాహ్మణులు వి.బ.వ. సారస్వతుల్లో ఒక తెగవారు.

నాగమ వి. నాగవల్లి.

సం. నాగ-. పాము.

నాగమసాని వి. నాకబలిచిరంటి, నాగవల్లి నడిపే ముత్తైదువ. వేంక. పంచ. 4.370.

నాగమణిపేటు వి. అంచులో వంకీలు, వంకీలుగా వేసిన ఒకరకం డిజైను.

సం. నాగమణి-. పాము తల మీద ఉన్న మణి.

నాగముక్కట్టె వి. రాత్రుల్లో తెల్లని సువానన కల పూలుపూసే ఒకరకం తీగ (Ipomaea Bona-nox).

నాగముడి వి. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు (మూలనేత) నేసిన భాగం.

సం. నాగ-. పాము.

<సం. నాగ+ముడి. (మిశ్రస.).

నాగమ్మ వి. నిరుపయోగి.

సం. నాగ-. పాము.

<సం. నాగ-+అమ్మ.

నాగర చూ. నాము. వి. ఉంగెడి, కొన్ని రకాల లేత జొన్న మొక్కలు, ఆముదపు ఆకులు తినటం వల్ల వచ్చే జబ్బు.

నాగరమట్ట వి. కలబంద, నాలుగయిదడుగుల పొడుగూ, నాలుగయిదంగుళాల వెడల్పూ గల దళసరి మట్టలవంటి ఆకులూ, వీటి అంచుల్లో వాడి ముళ్ళూ ఉండి నారగా ఉపయోగింపబడే మొక్క. దీన్ని కంచెమొక్కగానూ వేస్తారు (Aloe Barbadensis).

నాగరము[1] వి. స్త్రీ శిరోభూషా విశేషం, స్త్రీలు తలపై ధరించే పాము బొమ్మ చెక్కిన ఆభరణం.

క. నాగరు. నాగరం.

నాగరము[2] విశ. నాజూకైన.

సం. నాగర-. నగర సంబంధమైన.

<సం. నాగర- (అర్థవిపరి.).

నాగరాసికూర రూ. నామెరాసికూర. వి. ఒకరకం ఆకుకూర.

నాగరికము వి. నాజూకైంది, సున్నితమైంది. పండి.చ. ప్రథమ. 3.705 వ.

సం. నాగరిక-. నగర సంబంధమైన.

<సం. నాగరిక- (అర్థవిపరి.).

నాగలమాస వి. నాగప్పల పండగ, నాగచతుర్థి.

సం. నాగ-. పాము.

నాగలసెవలలం వి. ఒకరకం కలుపు మొక్క.

సం. నాగ-. పాము.

నాగలి రూ.చూ. నాఁగలి. వి. 1. దున్నే సాధనం, సెలగ పారను కర్రతో కలిపే ఇనపకాడ; 2. బేలుమడక, చేతి మగ్గం మీద డిజైన్లు నేసేటప్పుడు, పేటు అడపోగులు, ఎత్తిపట్టుకొనే కొయ్య పనిముట్టు.

నాగటిపాలికాడు వి. నాగలిపాలుకు చేసేవాడు. నాగటి పాలు వి. అరకపాలు, ఆసామి, పొలంరైతు తన నాగలితో పాలికి చేసి పంట చెరినగం పంచుకొనే పద్ధతి. నాగటిపోత వి. నాగటేత, నాగలివెంటనే చాళ్ళలో పడేట్టు విత్తనాలు చల్లటం. నాగటిసాయలగడ్డి (-చాయలగడ్డి) వి. ఒకరకం కలుపుమొక్క. నాగటేత వి. నాగటిపోత. నాగలివెంటనే చాళ్ళలో పడేట్టు విత్తనాలు చల్లటం. నాగలిసయ్యి వి. నిట్టాడిపీట, నిట్రాడు చివరనాటిన నాగలిదుంప రూపంలో చెక్కిన పీట. నాగలికోక వి. ఒకరకం నాగులచీర, కమ్మిలో పన్నెండు కొలుకుల ఎర్రపట్టె, ఒక కొలికి తెలుపు, పది కొలుకుల ఎర్రపట్టె పెట్టి, తరువాత 4-5-1-5-15 కొలుకుల చొప్పున తెలుపు ఎరుపు రంగుపోగులు ఒకటి విడిచి ఒకటి వచ్చేట్టు పెట్టి, అంచులకు ఎర్రదారం పెట్టి నేసిన చీర. నాగలిచీర వి. ఒకరకం నాగులచీర, కమ్మిలో పన్నెండు కొలుకుల ఎర్రపట్టె, ఒక కొలికి తెలుపు, పది కొలుకుల ఎర్రపట్టె పెట్టి తరువాత 4-5-1-5-15 కొలుకుల చొప్పున తెలుపు, ఎరుపు రంగు పోగులు ఒకటి విడిచి ఒకటి వచ్చేట్టు పెట్టి, అంచులకు ఎర్రదారం పెట్టి నేసిన చీర. నాగలిపార వి. పికాసిపార, మన్నుతవ్వటానికి, చెట్లు నరకటానికి ఉపయోగించే పనిముట్టు. నాగలిపొత్తు వి. అరకపొత్తు, రైతులు తమతమ అరకలతో ఒకరికొకరు సహకరించుకుంటూ చేసే సేద్యం. నాగలివాసి వి. నిట్టాడి పీట, నిట్రాడు చివరనాటిన నాగలి దుంప రూపంలో చెక్కిన పీట.

నాగవడిగలు రూ. నాగపడగలు, నాగపడిగలు. వి.బ.వ. చెవికి పెట్టుకొనే ఆభరణాలు. రాజవా. 2.44.

నాగవత్తు వి. స్త్రీలు నందిట ధరించే సొమ్ము, వంకీ.

సం. నాగ-. పాము.

నాగవలి రూ.,చూ. నాగవల్లి. వి. పెళ్ళిలో ఆఖరి రోజు చేసే సంస్కార విశేషం. ఇందు. 6.66.

నాగవలినిష్ఠురము వి. పెళ్ళి ఆఖరు రోజున వచ్చిన తగాదాపై ఏర్పడిన పలుకుబడి. విజయ. 3.170.

నాగవల్లి రూ. నాగవలి, నాగవేలి, నాగ్రవేలిమి, నాగేలి². వి. పెళ్ళిలో కడపటినాడు చేసే సంస్కార విశేషం. యయా. 4.114.

సం. నాగబలి-. నాగపూజ, వివాహ సంస్కార విశేషం;

క. నాగవలి. పెళ్ళినాటి ఒక శుభకార్యం; తు. నాగొలె. బ్రాహ్మణ వివాహాల్లో చివరిరోజు శుభకార్యం.

<సం. నాగబలి-.

నాగవల్లిచీర వి. పెళ్ళిలో నాగవల్లికి పెళ్ళికూతురు కట్టుకొనే చీర. కమ్మిలో తీగల మాదిరిగా నేసిన చీర. నాగవల్లిపిడతలు రూ. నాగవిల్లిపిడతలు, నాగిల్లిపిడతలు, నాగెల్లిపిడతలు, నాగేలిపిడతలు, లాగివెల్లిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు. నాగవల్లి ముంతలు రూ. నాగవెల్లిముంతలు, నాగివిల్లిముంతలు, నాగేటిముంతలు, నాగేలిముంతలు. వి.బ.వ. నాగవల్లి పిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు.

నాగవాసపుటలరు(బోడి చూ. నాగవాసము².

నాగవాసమలరు(బోడి చూ. నాగవాసము².

నాగవాసము[1] రూ. నాగానం, నాగోనం. వి. 1. కొంకె, గొళ్లెం తగిలించడానికి పీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనప కొక్కెం. చంద్రభా. 1.91; 2. పక్క బిగువు మీదుగా మూలలకు పోతూ తట్టు బిగువులకు బిగించబడ్డ వానం; 3. గొర్తిచెక్కలకు దండెగాడి పట్టెకు కలిపి కట్టే తాడు లేదా వారు; 4. నీరుకాలు, మోట బొక్కెన పలిగానికి వేసిన అడ్డచువ్వ; 5. తొక్కుడుపట్టీ, రాట్నం అడ్డపట్టె; 6. గిరకపంటె (ఒకరకం రాటి) పుల్లలకు ఆధారంగా మధ్యలో బిగించిన కర్ర; 7. అనుజంగ, అనుపీటలు బిగించిన హొడుగుపట్టె; 8. పూనుగర్ర, పావుచెక్క తొక్కినప్పుడు అమ్ము కర్రను కిందికి లాగే కర్ర; 9. అచ్చు గుదులు తగిలించే వంకర ఊచ; 10. అడ్డదండె, గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పై కట్టె.

సం. లగ్నపాశ-, లగ్నపార్శ్వ-. పక్కన తగిలించ బడింది; ప్రా. లగ్గవాస-.

<ప్రా. లగ్గవాన-.

నాగవాసము² వి. 1. వేశ్యాసమూహం. మను, 2.73; 2. భోగంమేళం. ఆము. 4.34; 3. అంతఃపురజనం.

సం. నగ్నవాస-. నగ్నమైన నివాసంకలవారు; ప్రా. ణగ్గవాస.

<ప్రా. ణగ్గవాన-.

నాగవాసపుటలరు(బోడి రూ.,చూ. నాగవాసమలరు(బోడి. వి. వారాంగన, వేశ్య. ఇందు. 1.157. నాగవాస మలరు(బోడి రూ. నాగవాసపుటలరు(బోడి వి. వారాంగన, వేశ్య. ఇందు. 1.155. <నాగవాసము²+అలరు(బోడి.

నాగవిల్లిపిడతలు రూ.,చూ. నాగవల్లిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లిసాంగేనికి వాడే మట్టిపాత్రలు.

నాగవెల్లిముంతలు రూ.,చూ. నాగవల్లిముంతలు. వి.బ.వ. నాగవల్లిపిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టి పాత్రలు.

నాగవేలి రూ.,చూ. నాగవల్లి. వి. పెళ్ళి తరువాత జరిపే తంతు.

నాగ్రవేలిమి రూ.,చూ. నాగవల్లి. వి. నాగవల్లి. ముకుంద. 3.296.

నాగసర వి. వెదురుచెట్టు (Phragmites Karka).

నాగసరం చూ. నాగవానం. వి. 1. గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పై కట్టె; 2. నాగవాసం, గొళ్ళెం తగిలించ టానికి పీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనపకొక్కెం.

నాగసరము వి. 1. పాములకు ఆనందం కలిగించే స్వరవిశేషం. క్రీడా. 219; 2. పాములవాడూదే బుర్ర. క్రీడా. 224; 3. సన్నాయి. యయా. 4.158.

సం. నాగస్వర-. పాములకు సంతోషం కలిగించే ధ్వని; ప్రా. నాగసర-.

<ప్రా. నాగసర-.

నాగసర్పం వి. నాగపడిగె, తోకముట్టకింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి.

సం. నాగసర్ప-. పాము.

<సం. నాగసర్ప- (అర్థవిపరి.).

నాగసలిపి వి. 1. బొమ్మలో ఒకరకం, ఎగరొప్పు; 2. సల్లని ప్రమాదకరమైన విసర్పి రోగం.

సం. నాగసర్ప-. ఉరగం, పాము.

నాగసౌర వి. అడవుల్లో పెరిగే ఒకరకం కాయ. దీనిలో గుజ్జు తీసి ఎండపెట్టి పాములవాళ్ళు నాగస్వరం చేసుకుంటారు.

సం. నాగ-. పాము.

<సం. నాగ- + సౌర.

నాగస్వరంకడవ వి. మృదంగంలాగ వాయించడానికి ఉపయోగ పడే మట్టి కడవ.

సం. నాగస్వర-. పాములకు ఆనందం కలిగించే ధ్వని, పాములవాడు ఊదే బుర్ర.

<సం. నాగస్వర + -ము + కడవ.

నాగా వి. పనిచేయని రోజు, శూన్యం.

హిం.ఉ. నాగా. కావలసిన కాలంలో కాకపోవటం.

<ఉ. నాగా.

నాగాల్పు (-కాల్పు) రూ. నేగాల్పు. వి. నారకాల్పు. ఆములో కుండలు కాలీకాలని స్థితి.

నాగాసం రూ.చూ. నాగవాసము[1]. వి. 1. తొక్కుడు పట్టె, రాట్నం అడ్డపట్టె; 2. గిరకపంబె (ఒకరకం రాటి) పుల్లలకు ఆధారంగా మధ్యలో బిగించిన కర్ర; 3. అనుజంగ, అనుపిటలు బిగించిన పొడుగుపట్టె; 4. పునుగర్ర, పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర; 5. అచ్చుగుడులు తగిలించే వంకర ఊచ; 6. అడ్డదండె, గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె; 7. కొంకె, గొళ్ళెం తగిలించటానికి వీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనప కొక్కెం; 8. పక్క బిగువు మీదుగా మూలలకు పోతూ తట్టు బిగువులకు బిగించబడ్డ వాసం; 9. గొర్తి చెక్కలకు దండెగాడి పట్టెకు కలిపి కట్టే తాడు లేదా వారు; 10. నీరుకాలు, మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ.

నాగి వి. చెలికత్తె.

సం. నాగిన్. పాము.

నాగిక్క వి. ఒక కంట్లో తెల్లటి మచ్చ.

నాగిని[1] వి. లోకాంతరగతయై దేవతయైన ముత్తైదువు.

సం. నాకినీ-. దేవతాస్త్రీ; ప్రా. ణాగిణీ-. దేవ లోకపుస్త్రీ; ణాగ-. దేవలోకం;

క. నాగిని. సుందరి.

<ప్రా. ణాగిణీ.

నాగిని[2] వి. 1. ఒకజాతి వృక్షం. ఆం.శా. 2.62; 2. గొల్ల జిడ్డు, వృక్షవిశేషం. ఆం.శా. 2.66.

సం. నాగినీ. ఆడపాము.

<సం. నాగినీ (అర్థవిపరి.).

నాగినీఅంచు వి. ఒకరకం అంచు.

సం. నాగినీ. ఆడపాము.

<సం. నాగినీ + అంచు.

నాగిలిచాలు చూ. నాంగలి. వి. నాగలికర్రు.

నాగిల్లిపిడతలు రూ.చూ. నాగవల్లిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు.

నాగివిల్లిముంతలు రూ.చూ. నాగవల్లి ముంతలు. వి.బ.వ. నాగవల్లిపిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టి పాత్రలు.

నాగు[1] రూ.చూ. నాగుపు. వి. పాము. చెన్నబసవ. 3.39.

నాగుపడిగెప్రోగులు వి.బ.వ. నాగపడగలు, పాము పడగ పోలికకల కర్ణాభరణ విశేషం. వేంక. పంచ. 1.614. నాగుబడిగె (-పడిగె) రూ.చూ. నాగపడిగె. వి. నాగపాశం, నాగబంధం, తోకమట్ట కింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి. నాగుబాము (-పాము) వి. నాగపడిగె, తోకమట్ట కింద నాగుపాము పడగ మాదిరి ఉండే సుడి. నాగుబ్రాము (-పాము) వి. నాగం, తాచు. అచ్చ.రా.సుందర. 55. నాగులఅంగోస్త్రం వి. ఎరుపులో తెల్లగళ్ళు పడేట్టు నేసిన అంగవస్త్రం. నాగులగళ్లచీర వి. నాగులచవితికిగాని, సుబ్బా రాయుడు షష్ఠికిగాని, పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళచీర. నాగులచవితి వి. నాగప్పల పండగ, నాగచతుర్థి. నాగులచీర రూ. నాగుల్చీరె, నాగుల్సీరె. వి. నాగులచవితికిగాని, సుబ్బారాయుడు షష్ఠికిగాని, పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళ చీర. నాగులజడ వి. సుడిగాడ్పులతో వచ్చే గాలివాన. నాగులపడగలు చూ. నాగపడిగలు. వి.బ.వ. నాగపడగలు, పాము పడగ పోలిక కల కర్ణాభరణ విశేషం. కువ.చ. 4.202. నాగులపొద్దులు వి. ఒకరకం కమ్మి పెట్టి నేసిన చీరలు. నాగులు వి.బ.వ. 1. నాగుపాములు; 2. చెవి ఆభరణాలు. నాగులుకోక వి. నాగులచవితికిగాని, సుబ్బా రాయుడు షష్ఠికిగాని, పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళచీర. నాగుల్చీరె రూ.చూ. నాగులచీర. వి. నాగులచవితికిగాని, సుబ్బారాయుడుషష్ఠికిగాని, పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళ చీర. నాగుల్సీరె (-చీర) రూ.చూ. నాగులచీర. వి. నాగుల చవితికిగాని, సుబ్బారాయుడు షష్ఠికిగాని, పుట్టమీద కప్పి కట్టుకొనే గళ్ళచీర. నాగుపడిగెప్రోగులు వి.బ.వ. పాము పడగ పోలికఉన్న కర్ణాభరణ విశేషం. వేంక. పంచ. 1.614.

నాగు[2] రూ.చూ. లాగు. స.క్రి. పెరుకు, పైకి లాగు.

నాగుతుండు వి. సున్నపురాయి కాలిందో లేదో కొట్టి చూడటానికి వాడే పొడుగాటి కొయ్యముక్క.

నాగు[3] వి. 4000 అడుగుల ఎత్తు ప్రదేశాల్లో పెరిగే అకుపచ్చ పూలుపూసే చెట్టు (Premna Tomentosa).

నాగుమల్లె రూ.చూ. నాగమల్లె. వి. నాగమల్లిక.

నాగురు[1] రూ.చూ. నావురు. వి. చలికాలంలో పుష్పించే సువాసనగల ఆకులున్న చెట్టు (Premna Tomentosa).

నాగురు[2] వి. తెల్లపూలు పూసే ఒక తీగ (Symphorema Involucratum).

నాగురుబెంకాయ వి. పిరంగిగుండు చెట్టు (Couroupita Guianensis).

నాగులపచ్చారి వి. లేతనీలిరంగు పూలుపూసే అందమైన చెట్టు (Dalbergia Lanceolaria).

నాగులెత్తు రూ.చూ. లాకలెత్తు. స.క్రి. లాకలెత్తు, సరి చేసే టప్పుడు పడుగులో లాకలు లేపు.

**నాగులేరు** రూ.చూ. లాకలేరు. స.క్రి. లాకలేరు, పదుగు చేసే టప్పుడు లాకలమీది పోగులు నర్దు.

**నాగువు** రూ. నాగు¹. వి. పాము. శృం.నై. 7.154.

సం. నాగ-. పాము ; ప్రా. ణాగ-.

< సం. నాగ-.

**నాగూర** వి. పచ్చని పూలు పూసే 3 నుంచి 6 అడుగుల ఎత్తు పెరిగే చెట్టు (Premna Colymbosa).

**నాగూరితెగులు** వి. ఆకు తోట తెగులు, తమలపాకుమీద నల్లటి చుక్కలు ఏర్పడే తెగులు.

**నాగెలు** రూ.చూ. నాఁగలి. వి. **1.** పొలం దున్నే సాధనం. చంద్రాంగ. 4.119 ; **2.** సెలగపారను కర్రతో కలిపే ఇనపకాడ.

**నాగెల్లిపిడతలు** రూ.చూ. నాగవల్లిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లిసాంగేనికి వాడే మట్టిపాత్రలు.

**నాగేటిపచేరి** వి. ఉత్తరసర్కారుల్లో దక్కనులో 10 నుంచి 20 అడుగులు పెరిగే చెట్టు (Breynia Rhamnoides).

**నాగేటిముంతలు** రూ.చూ. నాగవల్లిముంతలు. వి.బ.వ. నాగవల్లి పిడతలు, పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు.

**నాగేరు** రూ.చూ. నాఁగలి. వి. నాగలి.

**నాగేలి¹** రూ.చూ. నాఁగలి. వి. దున్నే సాధనం, సెలగపారను కర్రతో కలిపే ఇనపకాడ.

**నాగేలి²** రూ.చూ. నాగవల్లి. వి. పెళ్ళి తరువాత జరిగే తంతు.

**నాగేలిపిడతలు** రూ.చూ. నాగవల్లిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు. **నాగేలి ముంతలు** రూ.చూ. నాగవల్లిముంతలు. వి.బ.వ. నాగవల్లి పిడతలు, పెండ్లిలో నాగవల్లి సాంగేనికి వాడే మట్టిపాత్రలు.

**నాగేలు** రూ.చూ. నాఁగలి. వి. పొలం దున్నే సాధనం. భార.అను. 5.58.

**నాగోనం** రూ.చూ. నాగవాసము¹. వి. **1.** కొంకె, గొళ్ళెం తగిలించటానికి వీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనప కొక్కెం ; **2.** పక్క బిగువు మీదుగా మూలలకు పోతూ తట్టు బిగువులకు బిగించబడిన వాసం ; **3.** నీరుకాలు, మోట బొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ : **4.** తొక్కుడుపట్టె, రాట్నం అడ్డపట్టె ; **5.** గిరకపంటె, (ఒకరకం రాటి) పుల్లలకు ఆధారంగా మధ్యలో బిగించిన కర్ర ; **6.** ఆనుజంగ, ఆను పీటలు బిగించిన పొడుగుపట్టె ; **7.** హునుగర్ర, పావ చెక్కతొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర ; **8.** అచ్చుగుడులు తగిలించే వంకర ఊచ ; **9.** అడ్డదండె, గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె ; **10.** గొర్తి చెక్కలకు దండెగాడి పట్టెకు కలిపి కట్టేతాడు లేదా వారు.

**నాంకొండి** వి. నొగచీల. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలుదూర్చి వెనకవైపుకొట్టే మేకు.

**నాంగలి** రూ.చూ. నాఁగలి. వి. దున్నేసాధనం, సెలగపారను కర్రతో కలిపే ఇనపకాడ.

**నాఁగటిచాలు** చూ. నాఁగలి.

**నాఁగటిచాలుకూర** చూ. నాఁగలి.

**నాఁగటిచాలుపేరియతివ** చూ. నాఁగలి.

**నాఁగటిచిప్ప** చూ. నాఁగలి.

**నాఁగటిజోదు** చూ. నాఁగలి.

**నాగటిదుంప** చూ. నాఁగలి.

**నాఁగటిపణత** చూ. నాఁగలి.

**నాఁగటియారు** చూ. నాఁగలి.

**నాఁగటివాల్జోదు** చూ. నాఁగలి.

**నాఁగటిసీల** చూ. నాఁగలి.

**నాఁగలి** రూ. నాగలి, నాగెలు, నాగేరు, నాగేలి¹, నాగేలు, నాంగలి, నాఁగెలు, నాఁగేరు, నాఁగేలు. వి. బొ. హలం, దున్నే సాధనం. హరి. ఉ. 1.10.

సం. లాంగల-. నాగలి ; ప్రా. ణంగల, ణలగర, లంగల ; **దేశీ.** ణాంగల-, ణంగర- ; శౌ. లాంగల-, అ.మా. నంగల- ;

క. నేగల్, నేగల, నేగలి, నేగలు, నేగిల్, నేగిల. నాగలి ; **కొడ.** నెల్గ్ ; తు. నాయెరు ; **త.**ఇలాం కలి, ఇణాబ్బల్, నాఞ్చిల్ ; మ. ఞెఞ్జొల్, నేఞ్జల్ ; **తొ.** నేఖల్ ; గోం. నాంగేల్ ; కొలా. నాఁగెలు, నాఁగేలు ; గ. నాంగల్ ; గోండి. నాగల్ ; బ్రా. లంగార్ ; బెం. నాఙ్గల్ ; మరా. నాఁగర్.

< సం. లాంగల-.

**నాఁగటిచాలు** వి. నాగలి చివర ఉండే భాగం. **నాఁగటి చాలుకూర** వి. తరిగొర్ర, లాంగలి. **నాఁగటిచాలుపేరియతివ** వి. సీత, జానకి. రామాభ్యు. 5.189. **నాఁగటిచిప్ప** వి. నాగటి పణత, నాగటి గొడగ. **నాఁగటిజోదు** వి. హలా యుధుడు, బలరాముడు. **నాఁగటిదుంప** వి. నాగటిచిప్ప. **నాఁగటిపణత** వి. నాగటిచిప్ప. **నాఁగటియారు(-ఆరు)** వి. నాగటిచిప్ప. **నాఁగటివాల్జోదు** వి. బలరాముడు. **వేంక.** ఆం. దేవ. 20. **నాఁగటిసీల(-చీల)** వి. ఏడికోల జారకుండ టానికి బిగించిన చీల.

**నాఁగు** వి. గింజలు అప్పుగా ఈ సంవత్సరం తీసుకొని, వచ్చే సంవత్సరం ఒకటికి ఒకటిన్నరగా కొలిచిఇచ్చేది, ధాన్య రూపకమైన వడ్డి. పాంచాలీ. 1.39.

సం. లంఘ్. వినియోగించుకొను ; ప్రా. లంఘ. దాటు, అతిక్రమించు.

**నాఁగురు** రూ.చూ. నావురు. వి. నాగిని, ఒకజాతి వృక్షం. ఆం.భా. 2.62.

**నాఁగెలు** రూ. చూ. నాఁగలి. వి.బొ. నాగలి. చంద్రాంగ 4.119.

**నాఁగేరు** రూ.చూ. నాఁగలి. వి. నాగలి.

**నాఁగేలు** రూ.చూ. నాఁగలి. వి.బొ. నాగలి. భార. అను. 5.58.

**నాచారి** రూ.చూ. నాంచారు. వి. స్త్రీ, దేవత.

**నాచి¹** వి. స్త్రీ. క్రీడా. 129.

త. నాచ్చి. ఆడది, ప్రియురాలు.

< త. నాచ్చి.

**నాచి²** వి. చెడ్డ.

త. నాచ్చు. నాట్యం, నాచ్చెఋ. నింద ; **హిం.ఉ.** నాచ్. నాట్యం.

**నాచుబడు(-పడు)** చూ. నాఁచు¹. అ.క్రి. ఆలస్యమగు.

**నాచుబెట్టు(-పెట్టు)** చూ. నాఁచు¹. స.క్రి. **1.** పిల్లి, పులి మొ.

కోరజీవాలు తమ బాధ్యజంతువులపైదూకు (చంపి తినే జంతువులపై); **2**. ముందు కనిపెట్టుకొని ఉండు, పొంచి ఉండు.

**నాచ్చారు** రూ.చూ. నాంచారు. వి. దేవత. E.I. సంపు 14; శా.సం. 1538. క్రీ.శ. 1400.

**నాజరు** వి. న్యాయస్థానంలో ఉండే ఒక ఉద్యోగి.

ఉ. నాజిర్. నాయకుడు.

<ఉ. నాజిర్.

**నాజుకు** రూ.చూ. నాజూకు. వి. సోకు, చక్కదనం.

**నాజుబారు(-పాఱు)** అ.క్రి. బలహీనమగు.

**నాజూకు** రూ. నాజుకు. విశే. సున్నితమైన, నాణ్యమైన. వి. **1**. సోకు, చక్కదనం; **2**. మృదుత్వం.

హిం. నాజూక్, నాజుక్. కోమలమయిన, మృదువైన; మరా. నాజూక్; ఉ. నాజూక్; పార. నాజుక్. పలచని, సుకుమారం, పరిశుద్ధమైన; అర. నాజిక్. పలచని, కోమలం, స్వచ్ఛం.

<ఉ. నాజూక్.

**నాంచారు** రూ. నాచారి, నాచ్చారు, నాఁచారు. వి. **1**. స్త్రీ, ఆడది. హర. 2.95; **2**. దేవత, అమ్మవారు. శ్రీరం. మా. 10.116.

త. నాచ్చియార్. రాణి, ప్రియురాలు, దేవత.

<త. నాచ్చియార్.

**నాంజిల్ల** వి. పిఱ్ఱబీల, పణతలో దూర్చి ఏడికోలకు చివరకొట్టే కొయ్యమేకు.

**నాఁచారు** రూ.చూ. నాంచారు. వి. స్త్రీ, ఆడది. ప్రబంధ. 232.

**నాఁచికొను** చూ. నాఁచు[1].

**నాఁచికోలు** చూ. నాఁచు[1].

**నాఁచు[1]** స.క్రి. అపహరించు, లాగుకొను. ఆము. 6.78; వి. దొంగ. ఆం. భా. 3.45.

నాఁచికొను రూ. ఆఁచికొను. స.క్రి. **1**. అపహరించు, లాగుకొను. కు.సం. 3.47; **2**. వశపరచుకొను, ఆక్రమించుకొను. నిర్వ. రా. 1.41. **నాఁచికోలు** వి. అపహరించటం. భార. శల్య. 1.49. **నాఁచుగాలి** వి. **1**. ఈదురుగాలి; **2**. తుప్పరతో వీచే చల్లగాలి.

**నాఁచు[2]** రూ. నాచు. వి. **1**. కాడలు లేకుండా పొడుగాటి ఆకులుండి నిలకడ నీటిలో పెరిగే నీటికలుపు మొక్క. శైవాలం. ఉ.రా. 2.53 (Searatophyllum submersum); **2**. వరిపంటకు వచ్చే ఒక తెగులు (Blyxa octandra vallisneria octandra). విశే. సన్నని, స్వల్పమైన.

నాఁచుచీర వి. నాచురంగు చీర. **నాఁచుడు** వి. క్షుద్రజలజంతు విశేషం. నీటిలో ఉండే ఒకానొక చిన్న జంతువు. హంస. 4.189. **నాఁచుఁదీఁగ(-తీఁగ)** రూ. నాఁచుఁదీగె. వి. శైవాలలత. హరి.ఉ. 7.74. **నాఁచుఁదీఁగె(-తీఁగె)** రూ.చూ. నాఁచుఁదీగ. వి. శైవాలలత. శృం.నై. 2.5. **నాఁచుఁద్రాఁచు(-త్రాచు)** వి. నాచులో ఉండే సర్ప విశేషం. ప్రబంధ. 186. **నాఁచుఁబాము(-పాము)** వి. పసిరిక పాము. శా్ల. సం. 9.137. **నాఁచురంగు** రూ. నాసిరంగు, నాసురంగు. వి. పెసర రంగులో ముదురు వన్నె, పాకుడురంగు. **నాఁచువగ** వి. అంతర తామర. **నాఁచువన్నె** వి. నాచురంగు. ప్రబంధ. 272.

**నాటకమాడు** చూ. నాటకము[1].

**నాటకము[1]** వి. **1**. నర్తనం. పాండు. 4.77; **2**. చరిత్ర. ఉ.హరి. 2.70; **3**. కపటోపాయం. పారి. 1.89.

సం. నాటక-. దశరూపకాల్లో ఒకటి.

<సం. నాటక- (అర్థవిపరి.).

నాటకమాడు స.క్రి. **1**. తగువుపెట్టు; **2**. ఇద్దరి మధ్య ద్వేషం కలిగించు; **3**. నటించు; **4**. మాయోపాయం ప్రకటించు. <నాటకము[1] + ఆడు.

**నాటకము[2]** చూ. నాటు[2].

**నాటక్రోటు** వి. మలయానుంచి తేబడిన ఒక అందమయిన మొక్క (Aleurites Moluccana).

**నాటఁజెప్వ** చూ. నాటు[2].

**నాటారు** వి. కల్లుగీసే అరవవాడు, నాడారు.

త.మ. నాట్టార్. తమిళదేశవాసులు, ప్రధానవ్యక్తుల, కొన్ని కులాల బిరుదు పట్ట, దక్షిణ ఆర్కాటు జిల్లాలో వ్యవసాయం చేసి జీవించే వ్యవసాయదారులు.

<త. నాట్టార్.

**నాటించు** చూ. నాటు[2].

**నాటివెడలు** చూ. నాటు[2].

**నాటీరేషం** వి. నాసిరకంగా ఉండే పట్టు.

హిం.ఉ. రేశమ్. పట్టు.

**నాటు[1]** వి. మొరటు, మోటు మనిషి; విశే. దేశీయమైన, స్వదేశానికి సంబంధించిన.

క. నాడు. దేశం; తు.త.మ. నాటు. ప్రదేశం, జిల్లా, భూమి, ప్రపంచం.

నాటుపురము వి. పల్లెటూరు. **నాటుపెంకు** వి. కుమ్మరి పెంకు, మామూలుగా ఇళ్ళు కప్పటానికి వాడే చిన్న పెంకు. **నాటుపొగాకు** వి. ఒకరకం పొగాకు, దేశీయమైన పొగాకు. **నాటుపోటు** వి. నాట్పాటు, గోడరాళ్ల ఒకవరసలో ఉండి తూకం సరిపోయేటట్టు కట్టటం. **నాటుబండి** వి. కొయ్యతో చేసిన చక్రాలు గల బండి. **నాటుబాదము** వి. తోటలో పెంచబడి గట్టి ఎఱ్ఱని కలపనిచ్చే చెట్టు (Terminalia Catappa). **నాటుబీర** వి. కాయలు కూర దినుసుగా ఉపయోగించే ఒకరకం బీర. **నాటుమగ్గం** వి. చేతి మగ్గం, పడుగులో పేక దారపుకండె చేత్తో వేస్తూ నేసే మగ్గం. **నాటుమల్లె** వి. సజ్జతెగులు, వేళ్ళమీద ఒకరకం కలుపు మొక్క పుట్టి పంట పండకుండే జబ్బు. **నాటుమినుము** వి. ఒకరకం మినుము, ఒకరకం పప్పుదినుసు. **నాటుమిరప** వి. ఒకరకం మిరప. **నాటురాయి** వి. ఉత్తరాటు, గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. **నాటులవ** వి. ఒకరకం పప్పుదినుసు. <నాటు[1] + ఉలవ. **నాటువరస** వి. నాట్పాటు, గోడరాళ్ళు ఒకవరసలో ఉండి తూకం సరిపోయేటట్లు కట్టడం. **నాటుసద్ద** వి. ఒకరకం సజ్జ.

**నాటు[2]** రూ.చూ. నాఁటు. వి. **1**. ఉడుచు, ఉనుచు, ఊడ్చు, వరి, మిరప మొ॥ వాటి నారు చాళ్ళలో నాటటం; **2**. ఒని

బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచక్రపు నిలువు పట్టెలకు బిగించిన కఱ్ఱ ; **3.** తనాబీ కొయ్య దూలం ; **4.** గానిగకట్ట ; **5.** తొక్కుడు ముందుకు పొడుచుకొనేటట్లు అమర్చిన పెచ్చురాయి ; **6.** కంత ; **7.** గుర్తు ; **8.** గూడ, పచ్చి ఇటుకల (బట్టీలోని) పేర్పు ; అ.క్రి. గుచ్చుకొను ; స.క్రి. **1.** గుచ్చు ; **2.** విత్తనాలు నాటు ; **3.** ఒత్తు.

**నాటకము**[2] వి. నాట్లు వేయడం, పైరు నాటడం. నాటఁజెప్పు స.క్రి. మనసులో పాతుకొనేట్లు చెప్పు, నచ్చ బలుకు. **నాటించు** రూ. చూ. నాఁటించు. స.క్రి. పాతిపెట్టించు. **నాటివెడలు** అ.క్రి. ఉచ్చు వెలువడు. **నాటుకఱ్ఱ** వి. గడకొయ్య, బండి మీఁది జల్ల కదలకుండా చట్టంలో గుచ్చిన కొయ్య ముక్క. **నాటుకలుపు** వి. నారు నాటుకొన్న తరువాత తీసే మొదటి కలుపు. **నాటుకాయ** వి. అంటు కట్టక విత్తనంతో మొలిచిన చెట్టు కాయ. **నాటుకొను** అ.క్రి. ఏనుకొను, మాగాణిలోగాని, తోటలోగాని నాటిన నారు వేరుబట్టి బతుకు. **నాటుకొయ్య** వి. **1.** నాటు, బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచక్రపు నిలువు పట్టెలకు బిగించిన కఱ్ఱ ; **2.** దడికి పాతే పొడుగాటి కొయ్య ; **3.** డంగుమొద్దు, గానిగకొయ్య తిరగడానికి ఆధారంగా ఉండే దిమ్మ. **నాటుగుంజ** వి. కామిరె, ఏతపు మానుకు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య. **నాటుగూటం** వి. నాటు, బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండి చక్రపు నిలువు పట్టెలకు బిగించిన కఱ్ఱ. **నాటుగోడ** వి. కడగోడ, ఇంటి పక్కగోడ. **నాటుతీరు** రూ.చూ. నాఁటుదీఱు. అ.క్రి. మొక్కలు మొదలైనవి బాగా వర్ధిల్లు, ఎదుగు. **నాటుదుక్కి** వి. మాగాణి నాట్లకు ముందు దున్నటం. **నాటుదూలం** వి. కొమర్లు నాటటానికి నరం మీఁద వేసే దూలం. **నాటునిమ్మ** వి. ఒకరకం నిమ్మ. ఉష్ణప్రాంతాల్లో సారవంతమైన తోటల్లో సాగుచేసి పెంచే పళ్ళ చెట్టు. **నాటుపత్తి** వి. ఒకరకం పత్తి, రేగడనేలలో ఎక్కువగా సాగుచేసి పెంచే రొక్కపుపైరు, దేశవాళీ పత్తి. **నాటువడు(-పడు)** అ.క్రి. దెబ్బతిను. **నాట్నము** వి. నారు మొదలైన వాటిని నాటటం. **నాట్పాటు** వి. ఎసల్దొక్కుడు, గోడరాళ్ళు ఒకవరసలో ఉండి తాఁకం సరిపోయేటట్లు కట్టడం.

**నాట్నము** చూ. నాటు[2].

**నాట్పాటు** చూ. నాటు[2].

**నాట్య** రూ.చూ. నాట్యము. వి. మల్ల విద్యా సంబంధమైన పద్నాల్గు విసురుల్లో ఒకటి. ప్రబంధ. 78.

**నాట్యము** రూ. నాట్య. వి. మల్ల విద్యా సంబంధమైన పద్నాల్గు విసురుల్లో ఒకటి. మల్లుపు. 3.69.

సం. నాట్య-. నృత్తం, లాస్యం, నాటకాది దశరూపకాభినయం.

<సం. నాట్య-(అర్థవిపరి.).

**నాడం**[1] వి. ఫ్లోరింగు, నేలను నున్నబరిచే పని.

**నాడం**[2] రూ.చూ. నాడా. వి. నగుడు, ఎద్దు గిట్టలకు అరక్కుండా వేసిన ఇనపబిళ్ళ.

**నాడము** రూ.చూ. నాడా. వి. గుర్రం గిట్టలకు అడుగున రక్షణ కోసం వేసే ఇనపతొడుగు.

**నాడా** రూ. నాడం[2], నాడము, నాలము, నాళము, లాడం. వి. **1.** నూలు మొదలగువానితో నేసిన పట్టె. మల్లుపు. 4.67 ; **2.** గుర్రం కాళ్ళ గిట్టలకు అడుగున రక్షణకోసం వేసే ఇనప పట్టా ; **3.** లంగాలు, లాగూలు మొదలైనవి కట్టుకోడానికి ఉపయోగించే తాడు.

హిం. నాడా-. నూలుతాడు ; మరా. నాడా, నాడీ. తాడు.

**నాడి**[1] రూ.చూ. నాడె[1]. వి. నేత నేసేటప్పుడు పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్య వేసే దారం కండె అమర్చిన పనిముట్టు.

**నాడికొమ్ము** రూ.చూ. నాడెకొమ్ము. వి. చేతినాడె, పడుగు పై పోగులకు కిందిపోగులకు మధ్యవేసే పేకదారం కండె అమర్చి చేత్తో విసిరే నాడె. **నాడికొమ్ముపుల్ల** రూ. నాడెకొమ్ముపుల్ల. వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడికొన** రూ.చూ. నాడెకొన. వి. నాడెముక్కు, నాడెచివర కొనదేలిన భాగం. **నాడిగుబ్బ** రూ.చూ. నాడెగుబ్బ. వి. ఆణుసు, మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనప పొన్ను. **నాడిదొల (-తొల)** రూ.చూ. నాడెదొల. వి. నాడెగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడిపుల్ల** రూ.చూ. నాడెపుల్ల. వి. **1.** బుసిపుల్ల, చేతినాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల ; **2.** తడికి కట్టటానికి వడిదారం చుట్టే కొయ్యపుల్ల. **నాడిపూస** రూ.చూ. నాడెపూస. వి. పూస, మరనాడెలో కండెపోగు బయటికి రావటానికి బెజ్జంచేసి బిగించిన గాజుపూస. **నాడిబెజ్జం** రూ.చూ. నాడెబెజ్జం. వి. మరమగ్గం నాడెకు, కండెపోగు దూర్చటానికి చేసిన చిల్లి. **నాడిముక్కు** రూ.చూ. నాడెముక్కు. వి. నాడె కొన, నాడె చివర కొనదేలిన భాగం. **నాడిముల్లు** రూ.చూ. నాడెముల్లు. వి. కొమ్ముముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడిమొన** రూ.చూ. నాడెమొన. వి. నాడెముక్కు, నాడె చివర కొనదేలిన భాగం. **నాడిలాగు** రూ.చూ. నాడెలాగు. స.క్రి. కుచ్చులాగు, నాడె ఆడటానికి మరమగ్గం కుచ్చు గుంజు. **నాడివిల్లు** రూ.చూ. నాడెవిల్లు. వి. కమాను, మరనాడె గాడిలో, ముల్లుకు గుచ్చిన కొయ్యకండె ఊఁచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడిరేకు. **నాడిసీల (-చీల)** రూ.చూ. నాడెసీల. వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల;

**నాడి**[2] రూ.చూ. నాఁడు[2]. వి. **1.** ప్రదేశం ; **2.** దేశం.

**నాడు** రూ.చూ. నాఁటు. అ.క్రి. **1.** నాటు, గుచ్చుకొను, ఖండితమగు. కకుత్స. 2.100 ; **2.** దూరు, ప్రవేశించు ; స.క్రి. బాధించు, పీడించు. కకుత్స. 5.123, కువ.చ. 5.4.

**నాడురాయి** వి. కోపురాయి, ఒకవైపు కోసుగా ఉండేటట్లు మలచబడిన మొనదేరిన రాయి.

**నాడె**[1] రూ. నాడి[1], నాడెం, లాడె. వి. నడుమ నూలు కండె నుంచి నేసే సాలెవాని సాధనం, తురి. హంస. 2.11.

సం. నాడి, నాడికా, నాడీ, నాలక, నాలి, నాలిగా, నాలీ. కాడ, నాళం, శరీరమందలి బోలు నరం ; ప్రా.

నాడి, నాడిఅ, నాడె. నాళం.

<ప్రా. నాడిఅ.

**నాడెఆడు** స.క్రి. కొమ్ముఆడు. **నాడెఉంగరం** రూ. నాడెఉంగ్రగ. వి. ఉంగరం, చేతి నాడె గాడిలో బుసిపుల్లకు వేసిన చిన్నచుట్టు. **నాడెఉంగ్రగ** రూ.చూ. నాడె ఉంగరం. వి. ఉంగరం, చేతి నాడె గాడిలో బుసిపుల్లకు వేసిన చిన్న చుట్టు. **నాడెకొండి** వి. కమాను, మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన కొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు. **నాడెకొమ్ము** రూ. నాడికొమ్ము. లాడెకొమ్ము. వి. 1. చేతినాడె, పడుగు పోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చి చేత్తో విసిరే నాడె ; 2. నాడె, నేత నేసేటప్పుడు పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్య నేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు. **నాడెకొమ్ముపుల్ల** రూ.చూ. నాడికొమ్ముపుల్ల. వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడెకొస** రూ. నాడికొస. వి. నాడెముక్కు, నాడె చివర కొనదేలిన భాగం. **నాడెగాడి** రూ. నాడెగాడీ, నాడెగాడెం, నాడెగాలె, లాడెగాడి. వి. కొమ్ముగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెగాడీ** రూ.చూ. నాడెగాడి. వి. కొమ్ముగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెగాడెం** రూ.చూ. నాడెగాడి. వి. కొమ్ముగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెగాలె** రూ.చూ. నాడెగాడి. వి. నాడెగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెగుబ్బ** రూ. నాడిగుబ్బ. వి. ఆణుసు, మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను. **నాడెచిమ్ము** స.క్రి. కొమ్ముచిమ్ము, కొమ్ముఆడు. **నాడెదొల (-తొల)** రూ. నాడిదొల. వి. నాడెగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెదోని** వి. నాడెగాడి, నాడెలో పేకదారం కండె అమర్చే సందు. **నాడెనడచు** స.క్రి. కొమ్మునడచు, కొమ్ముఆడు. **నాడెపుల్ల** రూ. నాడిపుల్ల. వి. బుసిపుల్ల, చేతి నాడె గాడిలో అడ్డంగా బిగించిన పుల్ల. **నాడెపూస** రూ. నాడిపూస. వి. పూస, మరనాడెలో కండెపోగు బయటికి రావటానికి బెజ్జం చేసి బిగించిన గాజుపూస. **నాడెపొన్ను** వి. నాడెగుబ్బ, మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను. **నాడెపోగు** వి. నేతలో అడ్డంగా వచ్చే పోగు. **నాడెపోవు** అ.క్రి. నేత నేసేటప్పుడు పడుగులో నాడె ఒకవైపునుంచి మరోవైపుకు అడ్డంగా వెళ్ళు. **నాడెబెజ్జం** రూ. నాడిబెజ్జం. వి. మరమగ్గం నాడెకు, కండెపోగు దూర్చటానికి చేసిన చిల్లి. **నాడెబొడ్డె** వి. 1. నాడెగుబ్బ, మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను ; 2. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడెముక్కు** రూ. నాడిముక్కు, లాడెముక్కు ; వి. నాడెకొస. నాడెచివర కొనదేలిన భాగం. **నాడెముల్లు** రూ. నాడిముల్లు. వి. కొమ్ముముల్లు నాడెలో పేకదారం కండె గుచ్చేఇనప పుల్ల. **నాడెమొన** రూ. నాడిమొన. వి. నాడెముక్కు, నాడెచివర కొనదేలిన భాగం. **నాడెమొల** వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండెగుచ్చే ఇనపపుల్ల. **నాడెలబుర్ర** వి. నాడెలు వేసుకొనే గొట్టం. **నాడెలసంచి** వి. నాడెలు వేసుకొనే సంచి. **నాడెలాగు** రూ. నాడిలాగు స.క్రి. కుచ్చులాగు, నాడెఆడటానికి మరమగ్గం కుచ్చు గుంజు. **నాడెవిల్లు** రూ. నాడివిల్లు. వి. కమాను మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన కొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు. **నాడెవిసురు** స.క్రి. కొమ్ము విసురు, కొమ్ముఆడు. **నాడెవేయు** రూ. నాడేయు. స.క్రి. పడుగు పోగులకు మధ్యగుండా పేకదారపు కండెలనాడె ఒకవైపు నుంచి మరొకవైపుకు పారేట్టుచేయు, కొమ్ము వేయు. **నాడెసీల (-చీల)** రూ. నాడిసీల. వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడెసులోబు** వి. పానుపు పట్టె, మరమగ్గంలో పన్నె బిగించిన కిందికొయ్య. **నాడెసూది** వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండెగుచ్చే ఇనపపుల్ల. **నాడెసూల** వి. నాడెముల్లు, నాడెలో పేకదారం కండె గుచ్చే ఇనపపుల్ల. **నాడేయు** రూ.చూ. నాడెవేయు. స.క్రి. పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపు కండెలనాడె ఒక వైపునుంచి మరొక వైపుకు పారేట్టు చేయు.

**నాడె**[2] వి. 1. నగుడు, అరక్కుండా ఎద్దుగిట్టలకు వేసిన ఇనప బిళ్ళ ; 2. ఏడె, బండిజిల్ల తెరచిఉన్న వైపు.

**నాడెం** రూ.చూ. నాడె. వి. నేతనేసేటప్పుడు పడుగుపై పోగులకు కింది పోగులకు మధ్యవేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు.

**నాడెకత్తె** చూ. నాడెము[2].

**నాడెకాఁడు** చూ. నాడెము[2].

**నాడెము**[1] రూ.చూ. నాణెము[1]. విణ. మేలైనది, శ్రేష్ఠమైన. అచ్చ. రా. బాల. 28.

**నాడెము**[2] రూ.చూ. నాణెము[2]. వి. 1. గుర్తు ; 2. శుద్ధదీనారం.

**నాడెకత్తె** రూ.చూ. నాణెకత్తె. వి. నాడెంకలది, ధనవంతురాలు. **నాడెకాఁడు** రూ.చూ. నాణెకాఁడు. వి. కోమటి, వైశ్యుడు. సాంబ. మాన. 2 ; విణ. నాడెం కలవాడు, ధనంకలవాడు.

**నాడేయు** చూ. నాడె[1].

**నాణము** వి. మాంసరసం. ఆం. భా. 2.252.

**నాణిమ** చూ. నాఁడు[2]. వి. దేశం.

**నాణియము** రూ.చూ. నాణెము[2]. వి. నాణెం, శుద్ధదీనారం.

**నాణెకత్తె** చూ. నాణెము[2].

**నాణెకాఁడు** చూ. నాణెము[2].

**నాణెగాఁడు** చూ. నాణెము[2].

**నాణెము**[1] రూ. నాడెము[1], నాణ్యము. వి. 1. (వస్తువుల) మంచిచెడ్డలు. ఆము. 4.269 ; 2. శ్రేష్ఠత్వం, మంజులత, మనోహరత్వం. శుక. 1.111 ; 3. నాడెం, నాణ్యం, శుద్ధ దీనారం. (ముద్రింపబడిన రాగి, వెండి బంగారాల బిళ్ళ.) శుక. 1.421 ; 4. ఇచ్చి పుచ్చుకోవటంలో యోగ్యత ; 5. నాగరికత ; 6. మంచివంశం ; 7. పశువులు మొ॥ వాటి సంప్రదాయం ; విణ. 1. శ్రేష్ఠమైన. హర. 2.141 ; 2. మంజులమైన, మనోహరమైన. ఆం. భా. 3.14.

క. నాణ్య. మంచితనం, మేలిమి, సుగుణం, సత్యం, తు. నాణ్య ; త. నాణియ నాణయ. ఋజువర్తనం, గౌరవం, మ. నాణియం, నాణ్యం. సత్ప్రవర్తన.

సం. జ్ఞాన-. జ్ఞానం, బోధ ; ప్రా. ణాణయ, ణాణ. జ్ఞానం, బోధ, చైతన్యం, బుద్ధి, ణాణి. జ్ఞాని.

**నాణెము**[2] రూ. నాడెము[3]. నాణియము, నాఁడెము. వి. **1**. శుద్ధదీనారం. శుక. 1.421 ; ఆం. భా. 2.173 ; **2**. ద్రవ్యం. హంస. 5.216.

సం. నాణక-. ముద్రింపబడిన వెండి, రాగి మొ॥ నవి ; ప్రా. ణాణఅ, ణాణగం. నాణెం ;

క. నాణియ, నాణ్య. నాణెం, ద్రవ్యం, తు. నాణ్య. ద్రవ్యం ; త. నాణియమ్ ; మ. నాణయం, నాఁణియం. నాణ్యం.

< సం. నాణక -.

**నాణెకత్తె** రూ. నాడెకత్తె, నాఁడెకత్తె. వి. నాణెంకలది. **నాణెకాఁడు** రూ. నాడెకాఁడు, నాణెగాఁడు, నాఁడెకాఁడు వి. నాణెంకలవాడు. ఘటికా. 2.176. **నాణెగాఁడు** రూ.చూ. నాణెకాఁడు. వి. నాణెం కలవాడు.

**నాణ్యము** రూ.చూ. నాణెము[1]. వి. **1**. నాణెం ; **2**. ప్రకాశవంతం ; **3**. పరిశుభ్రం ; వి. **1**. విలువగల ; **2**. శ్రేష్ఠమయిన.

**నాంద్రతెవులు** వి. వరితెవులు, మొక్కనిలువునా ఎండిపోయే తెగులు.

**నాఁటంగోలె** చూ. నాఁడు[1].

**నాఁటఁగొలె** చూ. నాఁడు[1].

**నాఁటఁగోలె** చూ. నాఁడు[1].

**నాఁటఁబట్టి** చూ. నాఁడు[1].

**నాఁటించు** చూ. నాఁటు.

**నాఁటిసుత** చూ. నాఁడు[1].

**నాఁటు** రూ. నాటు[2]. నాడు. స.క్రి. **1**. భేదించు, చీల్చు. కు. సం. 4.76 ; భార. విరా. 3.161 ; **2**. గుచ్చు. కు. సం. 5.168 ; **3**. పాతుకొనజేయు. శృం. నై. 4.63 ; **4**. పాతు. భీమ. 5.87 ; **5**. కలిగించు. చంద్రాంగ. 1.77 ; అ.క్రి. **1**. కలుగు, పుట్టు. కు. సం. 10.79 ; **2**. పాదుకొను. స్థిరపడు. భార. ఉద్యో. 2 62 ; **3**. గుచ్చుకొను. భార. ఆరణ్య. 7.133 ; **4**. అంటు, తగులు. విష్ణుపు. 3.138 ; వి. **1**. నాట్నం, మొక్కలు మొదలైనవి పాతటం. భార. ఉద్యో. 4.317 ; **2**. కుదురు, భూమిలోదిగిన పర్వతం మొదలైనవాని అడుగుభాగం. వరాహ. 10.107 ; **3**. రంధ్రం, గండి. చంద్రాంగ. 1.77 ; **4**. క్షతి, దెబ్బ. మృత్యు. 3.91.

క. నడు(నట్ట్-), నెడు (నెట్ట్-). తిన్నగాఉంచు, భూమిలో తిన్నగా నాటు, నాటు, దూర్చు, గుచ్చు, నాటు, నాన్టు. దూరు, గుచ్చు, నాటు, నాఁటు ; కొడ. నాడి (నాడివ్-నట్ట్-). నాటు, విత్తనాలు వేయు ; తు. నడియుని. నాటడం, నడిపిని, నెట్టుని, నెడిపిని, నెడిపుని. నాటు ; త. నాటు (నాటువ్-, నాట్ట్-). నాటు, ఉంచు, నాట్టు (నాట్టి-). స్థాపించు, నాటు (కర్రస్తంభం మొ॥) పాతు ; మ. నాటుక, స్థాపించు, పాతు ; కో. నట్-(నట్-). భూమిలో తిన్నగా స్థాపించు, నాటు.

**నాఁటించు** రూ. నాటించు. స. క్రి. **1**. నాటు, గుచ్చు. భార. ఆరణ్య. 7.132 ; **2**. పాతించు. పారి. 1. 136. < నాటు. + - ఇంచు[3]. **నాఁటుకొను** అ.క్రి. **1**. గుచ్చుకొను. భార. ఉద్యో. 4.407 ; **2**. పాదుకొను, స్థిరపడు. భీమ. 5.157 ; **3**. కలుగు, సంభవించు. వసు. 2.145 ; **4**. పాతుకొను, వేళ్ళుపారు. **నాఁటుకొలుపు** రూ. నాఁటుకొల్పు. స.క్రి. **1**. పుట్టించు, కలిగించు. దశకు. 6.121 ; **2**. అతుక్కొనచేయు, అతికించు. భీమ. 6.59 ; **3**. గుచ్చు, గుచ్చుకొనచేయు. **నాఁటుకొల్పు** రూ.చూ. నాఁటుకొలుపు. స.క్రి. **1**. గుచ్చు, గుచ్చుకొనచేయు ; **2**. అతుక్కొనచేయు, అతికించు ; **3**. పుట్టించు, కలిగించు. **నాఁటుతీఱు** రూ.చూ. నాఁటుదీఱు. అ.క్రి. మొక్క మొదలైనవి పాతుకొని చక్కగా వ్యాపించు. **నాఁటుదీఱు** (-తీఱు) రూ. నాటుతీరు, నాఁటుతీఱు. అ.క్రి. మొక్క మొ. పాతుకొని చక్కగా వ్యాపించు, కు.సం. 12.181. **నాఁటుదేఱు(-తేఱు)** అ.క్రి. జనించు. పుట్టు. కాళిందీ. 1.310. **నాఁటువడు(-పడు)** అ.క్రి. నరుకుడుపడు, తెగు. కు.సం. 4.74.

**నాఁడిక** రూ.చూ. నాఁడు[2]. వి. దేశం. అచ్చ.రా. అయోధ్యా. 110.

**నాఁడు**[1] వి.ఔ. **1**. దినం, దివసం. తేరాల శాసనం. క్రీ.శ. 678, కొరవి శాసనం. క్రీశ. 892, 922, భార. ఆది. 3.13 ; **2**. ఆ దినం. భార. ఆది. 4.70 ; **3**. పక్షంలో, ఎడల. భార. సభా. 2.160 ; **4**. సమయం, కాలం. కాశీ. 1.7 ; **5**. ఆ కాలం, ఆ సమయం. హర. 6.48.

క. నాళ్. రోజు ; కొడ. న.ళె. రేపు, న.ళె.కి. దగ్గరలో, తు. నాళ్. దినం, ఉదయం, సాయంత్రం ; త. నాళ్. రోజు, కాలం, ప్రాతస్సంధ్య, యౌవనం, నూతనత్వం ; మ. నాళ్. దినం, నాఌ్, నాఌ. రేపు ; కో.త. న.ళ్. రోజు, రేపు ; తొ. నొ.ళ్. రోజు ; కొలా. నల్ ; నా. అఌని. ముందుగా.

< మూ.ద్రా. *నాళ్/*నళ్-.

**నాఁటంగోలె(-కోలెన్)** రూ. నాఁటఁగొలె, నాఁటఁగోలె. అవ్య. ద్రు. ఆ సమయం మొదలు. భార. ఆది. 2.122. **నాఁటఁగొలె(-కొలెన్)** రూ.చూ. నాఁటంగోలె. అవ్య. ద్రు. ఆసమయం మొదలు. చంద్రభా. 2.175. **నాఁటఁగోలె (-కోలెన్)** రూ.చూ. నాఁటంగోలె. అవ్య. ద్రు. ఆ సమయం మొదలు. భాస్క.రా. ఆరణ్య. 2.8. **నాఁటఁబట్టి(-పట్టి)** అవ్య. ఆ సమయంనుండి, ఆ సమయం మొదలు. ఆం.నా. సం. మాన. 46. **నాఁటిసుత** అవ్య. ఆసమయంనుంచి, ఆసమయం మొదలు. ఆం.నా.సం.మాన. 46. **నాఁడునాఁడు** రూ. నానాఁడు. అవ్య. **1**. ప్రతిదినం, దినదినం. భార. ఆది. 8.183 ; **2**. క్రమక్రమంగా, కాలక్రమాన. భార. విరా. 1.267. **నానాఁడు** రూ.చూ. నాఁడునాఁడు. అవ్య. ప్రతిదినం. కాశీ. 1.115.

**నాఁడు**[2] రూ. నాడి[2]. నాఁడిక. వి. **1**. దిక్కు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 956. క్రీ.శ. 1333 ; **2**. ప్రదేశం. రం.రా. అయోధ్యా. 123 పు. 10 పం. ; **3**. దేశం. పల్నా. 25 ;

4. జనపదం, గ్రామం, పల్లె. ఆము. 4.285.

క. నాడు. (దున్నే, పాతే) దేశం, జిల్లా, నాడాడి. పల్లెటూరివ్యక్తి; కొడ. న.డ్. జిల్లా, తు. నాడు. జిల్లా, పల్లె, నాడిగె. ఉత్తరకర్ణాటక రాష్ట్రంలో ఉన్న ఒకానొకజాతి; త. నాటు. దేశం, పరిస్థితి, జిల్లా, భూమి, నేల, ప్రపంచం, రాజ్యం; మ. నాటు. దున్నిన నేల; కో. నొ.డ్. దేశం, స్థిరపడిన ప్రదేశం, శ్మశానం; తొ. నొ.డ్. పవిత్ర స్థలం.

<మూ.ద్రా. *నాట్.

నాఁడెకత్తె చూ. నాఁడెము.

నాఁడెకాఁడు చూ. నాఁడెము.

నాఁడెము రూ.చూ. నాణెము². వి. నాణానికి మొదటిరూపం.

నాఁడెకత్తె రూ.చూ. నాణెకత్తె. వి. నాణెంకలది.

నాఁడెకాఁడు రూ.చూ. నాణెకాఁడు. వి. వైశ్యుడు.

నాతనల్ వి. ఒకరకం తువ్వాలు.

నాతము వి. బత్తెం. రాజవా. 2.34.

సం. న్యస్త-. అప్పగించబడినది, ఉంచబడినది; ప్రా. ణత్థ-. స్థాపితం.

<ప్రా. ణత్థ-.

నాతరెట్లసారి వి. నాలుగుచేతుల సారె.

నాతి రూ. నాతుక. వి. స్త్రీ, ఆడది. భార. ఆది. 3.159.

క. నాతి, నాచి. ప్రేయసి, స్త్రీ; త. నాటి, నామ్తి;

సం. నప్త్రీ. దౌహిత్రి, పౌత్రి; ప్రా. ణత్తీ. ణత్తిఆ, ణత్తుఈ. మనుమరాలు; అ.మా. నతఈ, నతుఆ. దౌహిత్రి.

నాతుక రూ.చూ. నాతి. వి. నాతి, స్త్రీ, ఆడది. భోజ. 2.93.

నాదాన్పత్తి వి. ఒకరకం తెల్లపత్తి.

హిం.ఉ. నాదాన్. మూర్ఖమయిన.

నాదారు రూ. నాదూరు. వి. 1. బీద, దరిద్రుడు; 2. చిక్కినవాడు, కృశించినవాడు. కవిచౌ. సీ. 13.

హిం. మరా. ఉ. నాదార్. దరిద్రుడు; పార. నాదార్. దివాళాతీసినవాడు.

<ఉ. నాదార్.

నాదు¹ రూ.చూ. లాదు. స.క్రి. తారసరాతిని అతుకు; వి. అతి స్వల్పం.

నాదుకొయ్య వి. నాలుకొయ్య, పట్టుమగ్గం దోనెను కుడివైపున మోసేకొయ్య. నాదుడు వి. తారసుపని, తారసరాతి కప్పువేయడం. నాదుపెంకు వి. పాలాస్త్రి, నల్చదరంగా పలచగా ఉండే పెంకు. నాదుబెడ్డ వి. తారస, చిన్నసైజు ఇటిక.

నాదు² వి. 1. (గానరూపమైన) ధ్వని. వాశి. రా. 4.144; 2. ధ్వని, చప్పుడు. ఆము. 1.82; స.క్రి. గోధుంపిండిని తడిపి చేతితోరుద్దు.

సం. నాద-. ధ్వని; ప్రా. ణాద-, ణాయ; పా. నాద-.

<సం. నాద-.

నాదుకొను అ.క్రి. ధ్వనిచేయు. నాదుకొల్పు స.క్రి. ఫిరంగులు మొదలైన వానిని పేలించు, ధ్వనింపచేయు. రంగా. చ. 3.53.

నాదూరు రూ.చూ. నాదారు. వి. 1. బీదతనం; 2. నిస్సహాయత.

నాన వి. 1. (తగనిపని చేసినవారికి ఇతర్లను చూసేటప్పుడుగాని, ఇతర్లతో మాట్లాడేటప్పుడుగాని మనసులో కలిగే) సంకోచం. భార. ఆది. 3.137; 2. సిగ్గు, లజ్జ. భార. ఉద్యో. 3.102; 3. అవమానం. భార. ఉద్యో. 4.240; 4. సంకోచం, వెనుదీయటం. భాగ. 10 ఉ. 12; విశ. బలహీనమయిన.

సం. జ్ఞాన-. జ్ఞానం, చైతన్యం, ఎరుక; ప్రా. జాణ-. నాణ-, ణాణ-; శౌ. ణాణం, ణాణీ; అ. మా. నాణం;

క. నాణ్. సిగ్గు, నమ్రత, నాజూకు, సొగసు; కొడ. నఁణ. సిగ్గు, అవమానం; తు. నాణు, నాణం, దిగంబరత్వం, పిర్రలు, నాఁచుని. సిగ్గుపడు; త. నాణ్, నాణమై. సిగ్గు, నమ్రత, అణకువ, నాణు (నాణి-). సిగ్గుపడు, అణకువగాఉండు; మ. నాణమ్. సిగ్గుపడు; కో. న.ణ్. (నణ్ణె-). సిగ్గుపడు, అభిమానపడు; తొ. నొ.ణ్. (నొ.ణ్ణె.). సిగ్గుపడు.

<ప్రా. నాణ-.

నానగండ విశ. సిగ్గుమాలినవాడు, సంకోచంలేనివాడు. పారి. 5.20.

నానపాల వి. ఒకరకం మొక్క (Euphorbia Thymifolia).

నానపాలగడ్డి చూ. నాను¹. రూ. నానబాలగడ్డి. వి. ఎర్రనేలల్లోను వరిపైరులోను ఏటా మొలిచి పెరిగే కలుపు మొక్క (Ericchloa Procera, Eriocloa Ploystachya). నానబాలగడ్డి రూ. చూ. నానపాలగడ్డి. వి. ఎర్రనేలల్లోను, వరిపైరులోను ఏటా మొలిచిపెరిగే కలుపు మొక్క (Eriochloa Procero, Eriochloa Ploystachya).

నానపోయు చూ. నాను¹.

నానబాలగడ్డి చూ. నానపాల.

నానబాలు చూ. నాను¹.

నానబాలుపడు చూ. నాను¹.

నానబియ్యము చూ. నాను¹.

నానబెట్టు చూ. నాను¹.

నానఁబోయు చూ. నాను.

నానఁబ్రాలు¹ చూ. నాను¹.

నానఁబ్రాలు² వి. పచ్చబియ్యం అనే చెట్టు.

నానవాలు చూ. నాను¹.

నానవేయు చూ. నాను¹.

నానవైచు చూ. నాను¹.

నానాగుండ వి. కంతానికి కిందఉన్న పల్లం.

నానాఁడు చూ. నాఁడు¹.

నానాప వి. నాకబలి.

నానాపసాని వి. నాగపసాని.

నానించి ఇనపగుగ్గిళ్లు నమలు చూ. నాను¹.

నానించు చూ. నాను¹.

**నాను**[1] అ.క్రి. **1.** చిరకాలం తడియు, చాలాసేపు తడియు. కు.సం. 3.62 ; **2.** తడియు, ఆర్ద్రమగు. ఆము. 4.126 ; **3.** ఇంకు, ఇగురు. ఇందు. 2.15.

క. ననె, నెవె. తడగు, తడి, నాన్ (నాన్ద్). తడి అగు, నాన్. తడిఅగు, నాను ; కొడ. నెలె- (నెల్వె-, నెలన్ద్-). తడిఅగు ; తు. నణె. తడి, చెమ్మ, తేమ, ననెపిని, ననెపుని, ననెయుని, ననెవుని. తడిఅగు, తడియు ; త. ననాయ్ (-వ్-, -న్త్-). తడగు, నానిన, ననైవు. తడి, చెమ్మ, తేమ. నాన్తు. తడియు ; మ. నాటుక. తడియు, నన. తడి, నేలకు నీరు పారించటం, పంటపొలానికి నీరు పెట్టటం, ననయుక. తడిఅగు ; కో. నాన్. వర్షంలో తడియు, ననవ్- (నన్ద్). మెత్తబడటానికి తడియు ; తొ. నొ.వ్. (నొ.డ్.). వర్షంలో తడియు ; గోం. నాన్దానా. తడియు, తడగు ; కుఇ. నెంజ (నెంజి). చెట్లకి నీరు పెట్టటం ; మాల్తొ. ననై. చలికాలం.

మూ.ద్రా. *నాన్- ; నన్- వ్-.

**నానపోయు** రూ.చూ. నానఁబోయు. స.క్రి. నానబెట్టు, మట్టిగడ్డలు కరగటానికి బట్టలు ఉతకటానికి పప్పులు మొ॥ వాటిలో నీళ్ళు పోసిపెట్టు. **నానబాలు** రూ.చూ. నానఁబ్రాలు. వి. నానవేసిన బియ్యం, వడపప్పు. **నానబాలుపడు** అ.క్రి. అన్నం సరిగా ఉడకక పచ్చిగాఉండు. **నానబియ్యము** వి. నానపెట్టిన కొత్త చేరుడు బియ్యం, లాజం. **నానబెట్టు** స.క్రి. **1.** నానపోయు, నీళ్ళు పోసి మట్టిగడ్డల్ని కరగబెట్టు ; **2.** బట్టలు ఉతకటానికి పప్పులు నానటానికి నీళ్ళు పోసి పెట్టు. **నానఁబోయు** రూ. నానపోయు. స.క్రి. నానబెట్టు. **నానఁబ్రాలు**[1] రూ. నానబాలు, నానవాలు. వి. **1.** భక్ష్య విశేషం. కాశీ. 7.185 ; **2.** నాన బియ్యం. ఆం.భా. 2.253. **నానవాలు** రూ.చూ. నానఁబ్రాలు[1]. వి. నాన బియ్యం, నానవేసి బెల్లం కలిపిన బియ్యం. **నానవేయు** స.క్రి. నీటిలో నానబెట్టు. **నానవైచు** స.క్రి. నీళ్ళలో చిరకాలం తడియబెట్టు, నానబెట్టు. పి.శకు. 4.146. **నానించి ఇనపగుగ్గిళ్లనములు** స.క్రి. అసాధ్యానికై ప్రయత్నించు. తాళ్ల.సం. 6.50. **నానించు** స.క్రి. నాన్చు, నానబెట్టు. <నాను[1] + -ఇంచు[3]. **నానుచు** రూ.చూ. నాన్చు. స.క్రి. **1.** నానచేయు, ఆర్ద్రంచేయు, తడుపు. శేషధ. 4.53 ; **2.** చాలాకాలం కడిచేటట్లు చేయు ; **3.** ఎక్కువగా తడుపు. **నానుడి** రూ. నానొడి. వి. **1.** లోకోక్తి, సామెత. భోజ. 7.83 ; **2.** అందరి నోట్లో నానే వాక్యం, జనశ్రుతి. ఆం.భా. 1.112. < నాను[1] + నుడి. **నానుడు** విణ. తడిసినది. **నానుడుబడు (-పడు)** అ.క్రి. విషయం వగదేగక నిలిచిపోవు. **నానుడుబేరం** వి. ఏదీ తెగనీక పోవటం. **నానుడువాన** వి. విడవకుండా కురిసే పొడిపొడి చినుకుల వర్షం. **నానుపు** రూ.చూ. నాన్పు. స.క్రి. **1.** నానచేయు, తడుపు ; **2.** కొత్తబట్టలు చలవచేయు ; వి. **1.** ఇచ్చకం ; **2.** నానటం. **నానుపుఁగొండ(-కొండ)** వి. హిమవత్పర్వతం. కాశ. 4.124. **నానుపుడు** వి. నాన్చటం. **నానొడి** రూ.చూ. నానుడి. వి. అందరి నోట్లో నానే వాక్యం, జనశ్రుతి. ఆం.భా. 1.112. **నాన్చు** రూ. నానుచు. స.క్రి. **1.** ఎక్కువగా తడుపు. ఆము. 4.129 ; **2.** నానచేయు, ఆర్ద్రంచేయు, తడుపు ; **3.** ఎక్కువగా తడుపు. **నాన్పు** రూ. నానుపు, నాంపు. స.క్రి. **1.** నానచేయు, తడుపు. మార్క. 4.247 ; **2.** కొత్తబట్టలు చలువచేయు ; వి. నానటం. **నాన్పువాన** వి. నేలను నానుడుగా చేసే వానచినుకులు.

**నాను**[2] వి. **1.** స్త్రీ కంఠాభరణ విశేషం. ఆం.భా. 2.148 ; **2.** ఎద్దు మెడకు అలంకారంగా వేసే గొలుసు.

క. నేన్(ఉ). తాడు ; తు. నేణ, నేణు. తాడు, బాణం తీగ ; త. నాఁణ్. తీగ, బాణపు తీగ, తాడు, నాణ్. తీగ, స్త్రీ కంఠాభరణం ; మ. నాఁణ్. బాణంతీగ, తీగ, తాడు ; తొ. నొ.ణ్. మెలితిరిగిన తీగ, బెత్తపు బద్ద ; కుఇ. నోణు, నోలు, నోసు. తీగ, అడవిలో పాకే తీగతో చేసిన తాడు.

**నానుకోళ్లు** వి.బ.వ. స్త్రీ కంఠాభరణ విశేషం. **నానుక్రోవి** వి. నానుచుట్టు, కంఠాభరణ విశేషం. **నానుచుట్ట** రూ.చూ. నానుచుట్టు. వి. కంఠాభరణం. **నానుచుట్టు** రూ. నానుచుట్ట. వి. నానుక్రోవి, కంఠాభరణ విశేషం. శుక. 2.232. **నానుతాడు** వి. మంగళసూత్రం వేసుకోడానికి నులకతాడు లాగ బంగారంతో తయారు చేసిన హారం.

**నానుబోర** వి. మాంసం కల రొమ్ము.

**నానెల్లజొన్న** వి. నాల్గు నెలల్లో కోతకు వచ్చే ఒకరకం జొన్న.
<నాలుగు + నెల + -లు + -అ + జొన్న.

**నానెల్లసన్నం** వి. నాలుగు నెలల్లో పండే ఒకరకం సన్నవడ్లు.
<నాలుగు + నెల + -లు + -అ + సన్నము.

**నానొడి** చూ. నాను[1].

**నాన్చు** చూ. నాను[1].

**నాన్తె** వి. జంతికలు వత్తేటప్పుడు జారే పిండికాడ. చంద్రాంగ. 4.209.

**నాన్న** రూ.చూ. నాయన. వి. **1.** తండ్రి ; **2.** పూజ్యుడు ; **3.** (శూద్రుల్లో) అన్న ; **4.** (శూద్రుల్లో) మేనమామ.

**నాన్పు** చూ. నాను[1].

**నాన్పువాన** చూ. నాను[1].

**నాప**[1] రూ.చూ. నాగప. వి. నాగవల్లి.

**నాపసాని** వి. **1.** నాగవల్లి నడిపే ముత్తైదువ. కళా. 7.83 ; **2.** నంగనాచి ; **3.** పెద్దవాళ్ళలా మాట్లాడే చిన్న పిల్ల ; **4.** ప్రౌఢురాలు.

**నాప**[2] చూ. నాఁపచేను. వి. **1.** అసమర్థుడు ; **2.** షండుడు ; **3.** జొన్నల్లో కొంచెం పలుకున్న గింజ.

**నాపకల్లు** వి. ఋతువుగానిఋతువులో ఉట్టిన కల్లు. **నాపచేను** రూ.చూ. నాఁపచేను. వి. **1.** పైరుకోసిన తర్వాత ఆమోట్లనుంచి పుట్టిన కాడలు ; **2.** లేతపైరుగల చేను. **నాపబండ** వి. ఎర్రరాయి, సున్నపు మట్టురాయి. **నాపబ్రరి** రూ. నాబ్బరి, నాబ్బ్రరి, నాబ్బ్రరె. వి. మెంట బ్రరి, కురచగా సన్నగా ఉన్న పక్క ఎముక(లు). **నాపరాయి** రూ.చూ. నాఁపరాయి. వి. **1.** గుబ్బిరాయి, సారెమొలను దించడానికి గబ్బిగుడ్డలో పొదిగిన రంధ్రాలున్నరాయి ; **2.** ఎర్రరాయి, సున్నపు మట్టురాయి ;

**3**. నుద్దరాయి, జిగురుమట్టి ఘనీభవించి సాగేశక్తిని కోల్పోయిన దశలో ఉన్న మట్టురాయి. **నాపరాయిబట్టీ** వి. నాపరాత్తో కట్టిన బట్టీ. **నాపరాయిసుద్ద** వి. ఎర్ర మొరం రాయి, సాంకేతికంగా సున్నపురాయి. **నాపలు** వి.బ.వ. పనికిరాకుండ పోయిన నాచిధాన్యాలు.

**నాపకుడు** వి. మంగలి.

సం. నాపిత-. మంగలివాడు.

**నాపకుత్తుకదంట** వి. శివుడు. వేంక. అం. దేవ. 5.

**నాపసా** వి. సిపాయిల వీపుమూట.

ఇం. *Knapsack*. వీపు మీద ఉంచుకొనే సరుకుల పెట్టె లేదా సంచి.

< ఇం. Knapsack.

**నాప్టల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు.

**నాప్తల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

**నాప్తాల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

**నాబరఆడు** చూ. నామర, నాము[1]. వి. కొర్ర, వరి మొ॥ వాటిఆకులు తినే మిడత.

**నాబరమోసు** చూ. నామర, నాము[1]. వి. కొర్ర, వరి మొ॥ వాటి ఆకులు తినే మిడత.

**నాబ్బరి** రూ.చూ. నాపబ్రరి. వి. మెంటబ్రరి, కురచగా సన్నగా ఉన్న పక్క ఎముక (లు).

**నాబ్బ్రరి** రూ.చూ. నాపబ్రరి. వి. మెంటబ్రరి, కురచగా సన్నగా ఉన్న పక్క ఎముక (లు).

**నాబ్బ్రరె** రూ.చూ. నాపబ్రరి. వి. మెంటబ్రరి, కురచగా సన్నగా ఉన్న పక్కఎముక (లు).

**నాభజావళి** వి. గీతవిశేషం. నమిార. 6.205.

**నాభితాడు** వి. **1**. బొడ్డుతాడు, నేతబట్టమీద చేదు కర్రలను అడ్డంగా బిరుపెట్టే పొడుగు దారం; **2**. అనుతాడు, ఆర్చీ మొ॥ వాటిని కట్టటానికి బేల్దారులు వాడే తాడు.

సం. నాభి-. బొడ్డు.

< సం. నాభి + -త్రాడు.

**నాభిరౌతు** వి. కుయ్యంరాయి, రాతితో కట్టిన ఆర్చీకి మధ్య భాగంలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

సం. నాభి-. బొడ్డు.

< సం. నాభి- + రౌతు.

**నామ్** రూ.చూ. నాము[1]. వి. ఉంగిడి, కొన్నిరకాల లేత జొన్న మొక్కలు, ఆముదపు ఆకులు తినటంవల్ల వచ్చే జబ్బు.

**నామం** రూ.చూ. నామము[1]. వి. సుద్ద, ముఖ్యంగా గవ్వ ముక్కల నుంచి ఏర్పడ్డ సున్నపురాతి జాతికి చెందిన మట్టిముద్ద.

**నామకానాముకా** క్రి. విశే. పేరుకు.

హిం. ఉ. నామ్. పేరు.

**నామగుంట** చూ. నామము[1].

**నామంకమాను** వి. బాదమార్చి, బాదంకాయ రూపంలో ఉండే ఆర్చి.

**నామజాదు** వి. నామనిర్దేశం, ఒకపనికి వినియోగింప బడటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 751.

హిం. నామ్‌జద్. ప్రసిద్ధమైన, నామనిర్దేశం; ఉ. నామ్‌జద్, నామ్‌జదా. ప్రసిద్ధికెక్కిన, నామాన్ని నిర్దేశించటం; పార. నామ్‌జద్. ఒకపనికి నియోగింప బడటం.

< ఉ. నామ్‌జద్.

**నామతాడు** వి. తాడిచెట్టు (Borassus flabellifer).

**నామదుంప** వి. ఒకరకం నీటిమొక్క (Rumex aponogeton).

సం. నామన్. నీరు.

< సం. నామన్ + దుంప. (మిశ్రన).

**నామపాపట** వి. కోస్తాలో పెరిగే ఒకరకం పాపటచెట్టు (Pavetta indica).

సం. నామన్. పేరు.

**నామమడచు** స.క్రి. పేరుమాపు, చంపు, నశింపచేయు. భార. విరా. 3.213.

సం. నామన్. పేరు.

< సం. నామన్ + అడచు.

**నామమడగు** రూ.చూ. నామమణగు. అ.క్రి. చచ్చు, మరణించు.

< సం. నామన్ + అడగు.

**నామమణగు** రూ. నామమడగు. అ.క్రి. చచ్చు, మరణించు. భాస్క.రా.అరణ్య. 1 263.

సం. నామన్. పేరు.

< సం. నామన్ + అణగు.

**నామము[1]** రూ. నామం. వి. తిలకం, లలాటంపై పెట్టుకొనే బొట్టు. యయా. 4.90.

క. నామ. బొట్టు; త. నామం. వైష్ణవులు పెట్టుకొనే బొట్టు, బొట్టుపెట్టుకోవటానికి ఉపయోగించే సుద్ద.

సం. నామన్. పేరు.

**నామగుంట** వి. గళగర్తం. < నామము[1] + గుంట. **నామముబెట్టు(-పెట్టు)** రూ. నామంపెట్టు. అ.క్రి. ఎగవేయు, ఎగ నామం పెట్టు. **నామంపెట్టు** రూ.చూ. నామముబెట్టు. స.క్రి. **1**. పంగనామం పెట్టు; **2**. మోసంచేయు. **నామాలకేతడు** వి. పక్షివిశేషం. హంస. 3.12. **నామాలుపెట్టు** స.క్రి. మోసగించు, అతిక్రమించు. **నామాలువేయు** అ.క్రి. **1**. మతచిహ్నంగా ఇంకొకరి నుదుటిమీద నామాలు పెట్టు; **2**. మోసగించు.

**నామము[2]** వి. పశువులకు వచ్చే రోగం.

**నామములు** వి.బ.వ. పదాలు.

సం. నామన్. పేరు.

< సం. నామన్ + -ము + లు (అర్థవిపరి.).

**నామంపెట్టు** చూ. నామము[1].

**నామర** రూ.చూ. నాము[1]. వి. **1**. కొర్ర, వరి మొ. వాటి ఆకులు తినే మిడత, ఉంగిడి; **2**. కొన్నిరకాల లేత జొన్న మొక్కలు, ఆముదపాకులు తినటంవల్ల వచ్చే జబ్బు.

**నామరులు** చూ. నాము$^{2}$.

**నామర్దా** వి. **1.** మగతనం లేనివాడు ; **2.** పిరికివాడు; **3.** అప్రతిష్ఠ.

హిం.ఉ. నామర్ద్. నపుంసకుడు.

< ఉ. నామర్ద్.

**నామా** వి. రాతపూర్వకమైనది.

ఉ. పార. నామా. లిఖితపత్రం.

< ఉ. నామా.

**నామాజుగహా** రూ.చూ. నమాజుగహా. వి. మసీదు.

**నామాజుగా** రూ.చూ. నమాజుగహా. వి. మసీదు.

**నామాజూదు** వి. నియామకం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 751. క్రీ.శ. 1592.

ఉ. నామ్‌జద్. పనికోసం ఎవరిపేరైనా నిశ్చయం చేయటం.

< ఉ. నామ్‌జద్.

**నామాలకేత(డు** చూ. నామము$^{1}$.

**నామాలగాడు** వి. ఆముదపు ఆకులు తినే కట్లపురుగు.

సం. నామన్. పేరు.

**నామాలపిల్లి** వి. నుదుటిమీద నాలుగు తిన్నని గీతలుండే ఒక రకం అడవిపిల్లి (Felisrabiginosa).

సం. నామన్. పేరు.

**నామాలపురుగు** వి. దాసరి, ఆముదపు ఆకులు తినే కట్ల పురుగు.

సం. నామన్. పేరు.

**నామాలరాయి** వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి.

సం. నామన్. పేరు.

**నామాలు** వి. పైరు విత్తులు గర్భం చేయటం.

సం. నామన్. పేరు.

**నామాలుపెట్టు** చూ. నామము$^{1}$.

**నామాలువేయు** చూ. నామము$^{1}$.

**నాము$^{1}$** రూ. నాగర, నామ్, నామర. వి. **1.** జొన్న మొ. వాని కొయ్యగాలున చిగురించిన మొలక. బసవ. 5.855 పం.; **2.** గింజలేని వరి మొ. వాని ఎన్ను, వరితెగులు ; **3.** ఉంగిడి, కొన్నిరకాల లేత జొన్నమొక్కలు, ఆముదపు ఆకులు తినటంవల్ల వచ్చే జబ్బు ; **4.** లేతచొప్ప, కొయ్యకాలుకు వేసే చిగురు ; **5.** మోకాటి ఎత్తున పెరిగిన జొన్న ; **6.** అప్పుడే పైకివస్తున్న మొలక ; **7.** అనూయ ; **8.** పొగరు ; **9.** ధాన్యం అప్పుగాఇచ్చి ధాన్యరూపంగా తీసుకొనే వడ్డీ, గిరిజన ప్రాంతాల్లో వ్యవసాయ పెట్టుబడికి ఒకబస్తా గింజలు అప్పుగాఇచ్చి పంటరాగానే రెండుబస్తాలు వసూలు చేసే పద్ధతి.

నాముదిన్నయట్లగు అ.క్రి. నాముతిన్న పశువులాగ అగు. < నాము$^{1}$ + తిన్న + అట్లు + అగు. **నామునాము** వి. **1.** పప్పు నానిన వాసన ; **2.** చెడిన వాసన, కంపు. **నాముపట్టు** వి. వరితెగులు, ఆకుమీద నాము పూసినట్లు తెల్లటి రంగేర్పడటం. **నాముమేయు** అ.క్రి. వెర్రెత్తు. బసవ. 5 పు. 855 పం. **నామువచ్చు** అ.క్రి. జొన్నలేదా జొన్న ఇగుడు మోకాటి ఎత్తున పెరుగు. **నామువారగా** వి. నాము రోగం వచ్చినట్లుగా. తాళ్ల. సం. 9.38. < నాము$^{1}$ + పాలు + -అ$^{7}$ + అగు + -అ$^{7}$. **నాముదాసన** వి. కొత్తవడ్ల నుంచి వచ్చే వాసన. **నామువెళ్లు** అ.క్రి. అప్పుడే పైకి మొలకవచ్చు. **నామువేయు** అ.క్రి. వరికి ఒకరకం తెగులు పట్టు, ఆకుమీద నాముపూసినట్లు తెల్లటి రంగేర్పడు. **నామెక్కు** అ.క్రి. **1.** నెమరు తిరగకుండా ఉండు ; **2.** పశువులు తవుడుగాని, మరేదిగాని, అధికంగా తిన్నందున ఒక విధమైన రోగంవచ్చి నాలుకను కరుచుకొను. < నాము$^{1}$ + ఎక్కు. **నా(పచేను** రూ. నాపచేను. వి.బొ. నాముకల పొలం. బహుళా. 3.60. **నా(పరాయి** రూ. నాపరాయి, నేపరాయి. వి.బొ. నాములా నున్నగా ఉండే రాయి. క్రీడా. 123.

**నాము$^{2}$** వి. వడ్రంగి కత్తి కానుతో కర్రపై సూటిగా తీర్చే రేఖ.

సం. నామన్. పేరు.

< సం. నామన్.

నామరులు వి.బ.వ. పాచికలు. చమ. 1.98. < నాము$^{2}$ + మరులు. **నాముగుండము** వి. కుత్తుకలో ఉండే గుంట. **నాముపేడు** వి. ద్వారబంధంపైన గుర్రాలమీద నిలిచేటట్లు అమర్చిన పట్టె. **నాములుతీయు** స.క్రి. వడ్రంగిబల్ల మొ. వాటిపై గీతలేర్పరచు.

**నాముషీ** రూ.చూ. నామోషీ. వి. అవమానం.

**నామెక్కు** చూ. నాము$^{1}$.

**నామెరాసికూర** రూ.చూ. నాగరాసికూర. వి. ఒకరకం ఆకు కూర.

**నామోషీ** రూ. నాముషీ. వి. అవమానం.

హిం.ఉ. నామూసీ. అప్రతిష్ఠ, చెడ్డపేరు.

< ఉ. నామూసీ.

**నాద్మారీచీర** వి. మూడు రంగుల్లో (నలుపు, ఎరుపు, నీలి) పది కొలుకుల దారంపెట్టి నేసిన చీర.

**నాంపండు** చూ. నామము$^{1}$. వి. విభూతిపండు, నాముసుద్ద ఉండ.

**నాంపు** రూ.చూ. నాన్పు. స.క్రి. ఉక్కబోయు, పులబెట్టు ముక్కు, నానబెట్టు.

**నా(పచేను** చూ. నాము$^{1}$.

**నా(పరాయి** చూ. నాము$^{1}$.

**నాయకపువాళ్లు** చూ. నాయకము.

**నాయకము** వి. **1.** అందం, ఎక్కువ నాజూకుతనం ; **2.** శ్రేష్ఠం.

సం. నాయక-. నాయకుడు, నేత, సేనాధిపతి.

< సం. నాయక- (అర్థవిపరి.).

నాయకపువాళ్లు వి.బ.వ. దసలి (పట్టు) పురుగులను పెంచే ఒకతెగ.

**నాయకంపువారు** వి. బ. వ. నాయంకరం వహించినవారు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1269.

**నాయకాణి** వి. నాయకుని భార్య. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 935. క్రీ.శ. 1297.

**నాయంకరము** రూ. నాయంకలము, నాయ(కరము. వి. **1.** కొంత భూభాగంపై సర్వాధికారంగల స్వామ్యం. ద.హిం.శా.సంపు.

10. శా.సం. 68. క్రీ.శ. 1111; **2.** దానవిక్రయాద్యధికారాలతోటి అనుభవం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 800; **3.** ఆధిపత్యం.

**నాయంకఅము** రూ.చూ. నాయంకరము. వి. కొంత భాగంపై సర్వాధికారం కల స్వామ్యం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 509. క్రీ.శ. 1314.

నాయంకఅవట్లు వి. బ. వ. నాయంకరానికై ఇచ్చిన గ్రామాదులు. ద.హిం.శా.సంపు. 10. శా.సం 563. క్రీ.శ. 1390.

**నాయంకఅవట్లు** చూ. నాయంకరము.

**నాయంకురాలు** చూ. నాయఁకుఁడు.

**నాయఁకరము** రూ.చూ. నాయంకరము. వి. ఆధిపత్యం. పాండు. 2.145.

**నాయఁకవాడి** చూ. నాయఁకుఁడు.

**నాయఁకవాడీ** చూ. నాయఁకుఁడు.

**నాయఁకవాళి** చూ. నాయఁకుఁడు.

**నాయఁకుఁడు** వి. **1.** స్వల్ప సేనకు అధిపతి. భార.ద్రోణ. 2.96; **2.** పన్నెండుమంది భటుల కధిపతి. రం.రా.యు. 291 పు. 22 పం.; **3.** ఉద్యోగి, మణియగాడు. హరి.ఉ. 2.107; **4.** ప్రభువు, ముఖ్యుడు, శ్రేష్ఠుడు. నె.శా. ఉదయపూర్ శాసనం. క్రీ.శ. 1615; **5.** అధిపతి. చంద్రాంగ. 2.38.

సం. నాయక-. నాయకుడు; ప్రా. ణాఅఅ-, ణాఅక్క.

<సం. నాయక-.

నాయంకురాలు వి. శ్రేష్ఠురాలు. ద్వి.భాగ. 1.9 పు.

నాయఁకవాడి రూ.చూ. నాయఁకవాడీ. వి. సేనాధ్యక్షుడు.

నాయఁకవాడీ రూ. నాయఁకవాడి, నాయఁకవాళి. వి. సేనాధ్యక్షుడు. రాజవా. 5.32. నాయఁకవాళి రూ.చూ. నాయఁకవాడీ. వి. సేనాధ్యక్షుడు.

**నాయఁడు** రూ. నాయిండు, నాయుండు, నాహిడు, నీడు, నీఁడు, నేండు, నేఁడు[1]. వి. **1.** శూద్రుల్లో కొందరి పేరు చివర్లో ఉండే బిరుదు. పల్నా.వు. 14; **2.** ప్రియుడు, భర్త. రాధికా. 2.90; **3.** ప్రభువు. ప్రబంధ. 216; విణ. శ్రేష్ఠుడు, గొప్పవాడు. నీలా. 2.54.

సం. నాయక-, నాయ-. నేత, నాయకుడు; ప్రా. ణాయగ. నేత; అ.మా. నాయగ; అప. ణాఅగు, ణాఅక్క;

కొడ. నాయమ్మె. నాయకుడు, నాయర్చి. నాయకురాలు, నాయిర్; తు. నాయరె; త. నాయన్, నాయర్, నాయిర్. భూస్వామి.

<సం. నాయ-.

నాయరాలు రూ. నాయిరాలు. వి. నాయకురాలు. నాయిరాలు రూ.చూ. నాయరాలు. వి. నాయకురాలు.

**నాయన** రూ. నాన్న. వి. **1.** జనకుడు, తండ్రి. ఆం.నా.సం. మాన. 3; **2.** ఇది వాత్సల్య సంబోధనలో సంబోధ్య శబ్దానికి మారుగా ప్రయోగించబడుతుంది.

<నా+అన్న.

**నాయనారు** రూ.చూ. నయనారు. వి. శివభక్తుడు. పండి.చ. 1.290.

**నాయబు** వి. సహాయకుడు.

హిం. నాయబ్. సహాయకుడు; మరా. నాయబ్; ఉ.పార. నాఇబ్; అర. నాఇబ్. ఒకరికి బదులు పని చేసేవాడు.

<ఉ. నాఇబ్.

**నాయము** రూ. నేయము[2]. వి. ధర్మం, పాడి. శృం.నై. 4.59; విణ. న్యాయయుక్తమైన.

సం. న్యాయ-; ప్రా. నాఒ, ణాయ-. న్యాయం; అ.మా. ణాయ. ధర్మం; పా. ఞాయ. అర్థం;

క. నాయ, నేయ. సరైన; తు. నాయ; మ. ఞాయం.

<ప్రా. ణాయ-.

నాయాలువెట్టు అ.క్రి. పంచాయితీ పెట్టు. తాళ్ల.సం. 3.581.

<నాయము+-లు+పెట్టు.

**నాయరాలు** చూ నాయఁడు.

**నాయాకుపొన్న** వి. గులాబి రంగు పూలు పూసే మొక్క (Pseudarthria Viscida).

**నాయాల** వి. ఇది మగవాళ్ళు వరసైన మగవాళ్ళని ఎగతాళిగా అనే తిట్టు.

<నా+ఆలు+-అ.

**నాయాలువెట్టు** చూ. నాయము.

**నాయి** వి. కుక్క. కు.సం. 1.29.

క. నాయి, నాయ్; కొడ. నాయ్. కుక్క; త. నాయ్, నాయి; మ. నాయ్.

<త. నాయి.

**నాయిండు** రూ.చూ. నాయఁడు. వి. శూద్రుల నామాంతంలో ఉండే బిరుదు. దశా. 4.933.

**నాయిరాలు** చూ. నాయఁడు.

**నాయివాడ** వి. పీచువంటి బెరడు కలిగి జిగురు నిచ్చే చెట్టు (Spatholobus Roxburghii).

**నాయుండు** రూ.చూ. నాయఁడు. వి. **1.** శూద్రుల నామాంతంలో ఉండే బిరుదు. దశా. 4.928; **2.** గొప్పవాడు. ద.హిం. శా.సంపు. 5. శా.సం. 79. క్రీ.శ. 1796.

**నార** వి. **1.** వల్కలం, చెట్ల తడపల్తో నేయబడిన వస్త్రం. భార.ఆరణ్య. 2.326; **2.** (జనుము మొ॥వాటి) తడప. భార.ఆరణ్య. 2.329; **3.** చెట్ల పైచర్మం. ఆము. 4.115; **4.** చీల్చిన తాటిమట్ట మొ॥; **5.** కూరమీద పీచు, కడంబం తాడు మొ॥ వానిపీచు; **6.** ఊటినరం, ఏకుబద్దలకొనకు కట్టిన జంతునరం; **7.** ఏకునార, దూదిఏకటానికి బద్దకు కట్టిన నరం; **8.** కృత్రిమపు పట్టు; **9.** మొక్కలనుంచి దొరికే ఈనెలుగా ఉండే పదార్థం; **10.** నారు. పొలంలో నాటటానికి పెంచిన వరి, మిరప మొ॥ వాటి మొలకలు; **11.** మాంసం; **12.** పిసినిగొట్టు.

క. నార్. నార; త. నార్. నార, తాడు; మ. నార్.

నారకట్టు వి. **1.** సారెలోపల పెండెలకు వాడే నార; **2.** గోవకట్టు, తాటితో కట్టిన కట్టు. నారకమ్మి వి. చీర

చెరగులో ఒకరకం కృత్రిమపు పట్టుతో నేసిన కమ్మి. నారకాల్పు వి. ఆములో కుండలు సరిగా కాలని స్థితి. నారగొంజి[1] వి. పొదలపై పెరిగే ఒకరకం తీగ (Croton Klotzschianus). నారగొంజి[2] రూ. నారవంజి. వి. ముళ్ళుకల ఒకరకం తీగ (Cansfera Rheedii). నారచన్ను వి. ఆవు, గేదె మొ॥ వాటికొన దేరిన చన్ను. నారచల్లు స.క్రి. పొలంలో వరి, మిరప మొ॥ వాటి మొలకలు చల్లు. నారచీడ వి. వరితెగులు, ఒకరకం సన్నటి పురుగు పట్టి ఆకు తెల్లబడి పోతుంది (Nymphula Depunctacis). నారచీర వి. నారతో నేసినబట్ట. భార. శాంతి. 4.60. నారజెల్ల వి. మత్స్యభేదం. సిం. ద్వా. 1.240. నారంచు వి. కృత్రిమపు పట్టుపెట్టి నేసిన అంచు. <నార + అంచు[3]. నారతడప వి. నారకట్టు, సారెకు లోపల పెండెకట్టుకు వాడే నార. నారతుప్పి వి. నారకట్టు, సారెకు లోపల పెండెకట్టుకు వాడేనార. నారతెగులు వి. వరితెగులు, ఆకులు ఎఱ్ఱబడి చివళ్ళు చీలిపోయే తెగులు. నారతేగ వి. గోదావరి జిల్లాలో పెరిగే ఒకరకం తీగ (Dioscorea glabra). నారదపుకాయ వి. ఒకరకం దబ్బకాయ. నారదబ్బ వి. 1. ఊరగాయకు మాత్రమే పనికివచ్చే పెద్దనిమ్మకాయ, ఒకరకం దబ్బ (Citrus medica-limonicem); 2. నారకలిగిన దాటికమ్మ. నారదొమ్మ వి. ఒకరకం దొమ్మరోగం, ఇదివచ్చిన గొడ్డు నిదానంగా చస్తుంది. నారనూలు వి. మొక్కల నారతో తీసినదారం. నారపగుళ్లు వి.బ.వ. అగ్గిపగుళ్ళు, కాల్పు కొంచెం ఎక్కువైనా కుండమందం ఎక్కువగాఉన్నా వచ్చేసన్న బీటలు. నారపట్టు వి. నారలో తయారు చేసిన ఒకరకం కృత్రిమపు పట్టు. నారపంటలు వి.బ.వ. పత్తి, గోగు, జనుము, కిత్తనార మొ॥ పంటలు. నారపాచు అ.క్రి. భయాదులచే కట్టుబట్ట తొలగు. కకుత్స. 2.126. నారపీకు స.క్రి. పొలంలో నాటటానికి వరి, మిరప మొ॥ వాటిమొలకలు పీకు. నారపీచు రూ. నారీసు. వి. 1. దయలేనివాడు, కఠినుడు; 2. చాల పట్టుదలతో గోజారు వాడు; 3. లోభి. నారపీనుగ వి. ఎంతకూ అంగీకరించనివాడు. నారపీశి రూ.చూ. నారపీసు. వి. నారకట్టు, సారెపెండె కట్టుకు వాడేనార. నారపీసు రూ. నారపీశి. వి. నారకట్టు, నారెపెండెకట్టుకు వాడేనార. నారపురి వి. నారకట్టు, సారెకు లోపల పెండెకట్టుకు వాడే నార. నారపొట్ట వి. చిరిపొట్ట, ఎన్ను లేర్పడుతున్న దశ. నారపొట్టె వి. నారతాడు. నారపొనకు వి. ఏనుగుల్ని కట్టటానికుపయోగపడే తాళ్ళను తయారుచేయటానికి పనికివచ్చే పీచునిచ్చే చెట్టు (Sterculia villosa). నారపోయు స.క్రి. పొలంలో నాటటానికి వరి, మిరప మొ॥ వాటి మొలకలు పోయు. నారబచ్చలి వి. ఎఱ్ఱనితీగ గులాబి (Vitis setosa). నారబండ వి. నారను కట్టతో నలగగొట్టి శుభ్రంచేయటానికి వేసుకొన్న రాయి; 2. ఎలకచుంచు, గోడమీద చూరుబండ. నారబుడమ వి. ఉత్తర సర్కారులూ, దక్కనూ, మొ॥ ప్రదేశాల్లో పెరిగే చిన్నమొక్క (Grewia salvifolia). నారబొటుకు వి. లేత ఎరుపు రంగుగల గట్టి కలపనిచ్చే చెట్టు (Eriolaena hookeriana). నారమడి వి. నారతో నేసినబట్ట. నారముంగి వి. ఒకరకం కృత్రిమపు పట్టు, నూలు కలిపినేసిన చిన్నగడి. నారరొమ్ము వి. ఆవు, గేదె మొ॥ వాటికొనదేరినచన్ను. నారవంజి రూ. చూ. నారగొంజి[2]. వి. ముళ్ళుకల తీగ. నారవేళ్లు వి.బ.వ. ఏకబీజదళవృక్షాలవేళ్ళు, కొబ్బరి, ఈత, వరి, జొన్న మొ॥ వాటి వేళ్ళు.

నారకురుపు రూ.చూ. నారికురుపు. వి. కాలిలో లేచే బాధాకరమైన వ్రణం.

నారంగి వి. 1. ఒకరకమైన నారింజ. పుల్లటిపండ్లు కాసే చెట్ల జాతికి చెందింది; 2. ఆరంజిరంగు, ఒకరకం ఎరుపు రంగు (Citrus aurantium).

సం. నారంగ, నారింజ.

<సం. నారంగ-.

నారంజి రూ.చూ. నారింజ. వి. 1. ఆరంజి; 2. ఒకరకం ఎరుపురంగు.

నారడుగు చూ. నారు[2].

నారణపక్కి వి. పక్షివిశేషం.

సం. నారాయణపక్షిన్. ఒకరకంపిట్ట.

నారదు(డు వి. తగవులు పెట్టేవాడు.

సం. నారద-. దేవర్షి.

<సం. నారద- (అర్థవిపరి.).

నారళ్ళు వి.బ.వ. ధాన్యభేదం.

నారవ రూ. నరవ[1], నారువ[2], నాల, నాలవ, నాలువ. వి. రెండు పెద్ద మిట్టల నడుమ ఏర్పడిన పల్లపు ప్రదేశం.

హిం. నర్వా, నారా, నాలా. కాలవ.

<హిం. నర్వా.

నారసం వి. మానికవాయి, చెరువునీళ్లు బయటికి పోవటానికున్న తూములో కిందిది.

నారసంమొద్దు వి. చెరువులో కిందితూము మూసే మొద్దు.

నారసము వి. 1. బాణం, శరం. భార. విరా. 5.193; 2. బాణ విశేషం. విక్ర. 4.98; 3. చోరసాధన విశేషం. దశకు. 9.72; 4. ఇనపఊచ.

సం. నారాచ-. ఇనప బాణం; ప్రా. నారాయ-; జైమహా. అ.మా. నారాయం; మా. నారాయ; పా. నారాచ-.

<సం. నారాచ-.

నారాజి రూ.చూ. నరాజి. వి. ఖడ్గం, కత్తి. బహులా. 1.51.

నారాజీ రూ.చూ. నరాజి. వి. ఖడ్గం, కత్తి.

నారాటకాపుళంబు వి. సంగీతమందలి ధ్వని విశేషం. బసవ. 3.930.

క. నారాట. రాగవిశేషం.

నారాటు వి. ఆములో కుండలు అరగొరగా కాలినస్థితి.

నారాయణగూటం వి. వెంటబడి ఉండటం.

నారాయణగొడలు వి.బ.వ. ఒకరకంవడ్లు.

సం. నారాయణ-. విష్ణువు.

నారాయణలు వి.బ.వ. ఒకరకం వడ్లు.

సం. నారాయణ-. విష్ణువు.

**నారి** రూ. నాలి[2]. వి. **1**. వింటి అల్లెతాడు, మౌర్వి. భార. విరా. 4.265 : **2**. నరం.

సం. నాడీ, నాలీ.నాళం, కాడ, రక్తనాళం, నారి కురుపు ; ప్రా. నాళీ, నాడీ, నాలీ ; పా. నాడీ, నాలీ. క. నారి. తొడిమ ; త నారి. మౌర్వి.

< ప్రా. నాళీ.

**నారికాయ** వి. అల్లెతాడు తాకుడువల్ల చేతుల్లో కలిగే కాయ, కిణం. **నారికురుపు** రూ. నారకురుపు. నారి కుఱుపు, నాలికుఱుపు. వి. కాలిలో లేచే బాధాకరమైన వ్రణం. **నారికుఱుపు** రూ.చూ. నారికురుపు. వి. నాడీవ్రణం, నరంమీద వేసే కురుపు. **నారికూజా** వి. చుట్టూ సన్నని నారుపోసి పైన నీళ్ళు నిలవడానికి పీలుగా ఉండే కూజా. **నారిగాడు** వి. బక్కచిక్కిన మనిషి. **నారిపుండు** వి. నారి కురుపు. **నారిపోయు** స.క్రి. ఎక్కుపెట్టు. భాగ. 10.1085.

**నారికడము** రూ.చూ. నాల్కడము. వి. కొబ్బెరచెట్టు, కొబ్బెర కాయ. వసు. 3.149.

**నారికెడము** రూ.చూ. నాల్కడము. వి. కొబ్బెరకాయ. ఆము. 1.54.

**నారికేడము** రూ.చూ. నాల్కడము. వి. కొబ్బరిచెట్టు.

**నారింజ** రూ. నారంజి, నారింజా, నారింజి, నారింజె, నార్లింజ. వి. **1**. నారంగం ; **2**. కిచ్చలి, ఒకజాతి నారింజ (Citrus aurantium). **3**. ఒకరకం ఎరుపురంగు.

సం. నారంగ-. నారింజ ; ప్రా. ణారింగ-.

< ప్రా. ణారింగ-.

**నారింజచెట్టు** వి. నారంగచెట్టు. **నారింజపండు** వి. **1**. ఆరంజి రంగు, ఒకరకం ఎరుపురంగు ; **2**. నారంగం.

**నారింజా** రూ.చూ. నారింజ. వి. **1**. నారంగం ; **2**. కిచ్చలి, ఒకజాతి నారింజ.

**నారింజి** రూ.చూ. నారింజ. వి. ఆరంజి, ఒకరకం ఎరుపురంగు.

**నారింజె** రూ.చూ. నారింజ. వి. పుల్లటి పళ్ళుకాసే చెట్లజాతికి చెందిన చెట్టు (Citrus Maderaspatana).

**నారీసు** రూ.చూ. నారపీచు. వి. వాటదారం. వాటలు కోయడానికి కదురుకు బదులువాడే నూలుదారం.

< నార + పీను.

**నారు**[1] వి. కందెన, నూనెకందిన.

**నారు**[2] రూ.చూ. నాఱు. వి. **1**. విత్తులు చల్లటం ; **2**. పొలంలో నాటటానికి పెంచిన వరి, మిరప మొ. వాటి మొలకలు.

**నారడుగు** వి. నారుపోసిన నలుచదరపు భూభాగం. < నారు[2] + అడుగు. **నారుకయ్య** వి. నారుపోసిన నలుచదరపు భూభాగం, ఆకుమడి. **నారుకుట్టు** స.క్రి. పొలంలో నాటటానికి పెంచిన వరి, మిరప మొ. వాటి మొలకలు కుట్టు. **నారుకొను** అ.క్రి. లోపలనే స్వల్పరూపున నిలిచిపోవు. **నారుగోర్లుచేయు** అ.క్రి. అజాగ్రత్తచేయు. **నారుతొట్టి** వి. గ్లాసుతొట్టి, అలంకారానికి నారుపోసి పైన వేలాడగట్టే చిన్న తొట్టి. **నారుదినము** వి. మంగళవారం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 215. క్రీ.శ. 1200. **నారుదొయ్య** రూ. నేరుదొయ్య. వి. నారుపోసిన నలుచదరపు భూభాగం. **నారునాటు** స.క్రి. పొలంలో నాటటానికి పెంచిన వరి, మిరప మొ. వాటి మొలకలు నాటు. **నారుపాటలు** వి.బ.వ. నారు అనే పంట దేవతమీద పాడుకునే పాటలు. **నారుపోయు** రూ.చూ. నారువోయు. స.క్రి. పంటకోసం ఒత్తుగా వరి, మిరప మొ. వాటి మొలకలుపోయు. కళా. 5.184. **నారుపోసిన చందాన** క్రి.విశ.ద్రు. వరుసలు, వరుసలుగా, ఎక్కువగా. కాశీ. 1.182. **నారుపోసినట్లు** అవ్య. దట్టంగా మొలకలు లేచినట్లు. కళా. 7.223. **నారుమట్టు** వి. నారుపోసిన నలుచదరపు భూభాగం. **నారుమడి** వి. నారుపోసిన నలుచదరపు భూభాగం. **నారుముంత** వి. చెట్లముంత, మొక్కలకు అంట్లు వేయటానికి వాడే చిన్న మట్టిపాత్ర. **నారులు పోసినట్లు** అవ్య. మొలకలు చాలు తీర్చినట్లు. ఉ.హరి. 6.66. **నారువోయు(-పోయు)** రూ. నారుపోయు. స.క్రి. పంటకోసం ఒత్తుగా వరి, మిరప మొ. వాటి మొలకలుపోయు. శివరా. 1.75.

**నారు**[3] అ.క్రి. నిలవఉండు.

**నారుచు** రూ.చూ. నార్చు. స.క్రి. నాడచేయు.

**నారుడు** వి. లేత ఎరుపురంగు కలప కల ఒకరకం చెట్టు (Pterospermum Suberifolium).

**నారువ**[1] వి. వృక్షవిశేషం. హంస. 4.11.

**నారువ**[2] రూ.చూ. నారవ. వి. చిన్నకాలువ.

**నారుసెల** చూ. నారి. వి. నిదానంగా గొడ్డుపచ్చే గుండెజబ్బు.

**నారేపి** రూ. నారేపు. వి. ఏపి, ఒక పెద్దచెట్టు (Hardwickia Binata).

**నారేపు** రూ.చూ. నారేపి. వి. ఏపి, ఒకరకం పెద్దచెట్టు.

**నార్చు** రూ. నారుచు. స.క్రి. నాడచేయు. ఆము. 4.127.

క. *నాడు* (*నట్ట్-*), *నెడు* (*నెట్ట్-*). సరిగ్గా నిలుపు, నాటు, కన్నంపెట్టు, పొడుచు, *నాటు*. పొడుచు, దూరు ; తు. *నడియుని*. మొక్కవేయు లేదా నాటు, *నాటుని*. పనిచేయటం (మందులా) ; త. *నాటు* (*నాటువ్-*, *నట్ట్*). నాటు, స్థలం, *నటల్*. నాటటం, *నాట్టు*. నాటు, నిలుపు ; మ. *నటుక*. నిలుపు, నాటు, దూరు, రంధ్రం చేయు ; కో. *నట్* (*నట్-*). భూమిలో సరిగా నిలుపు లేదా దూర్చు.

**నార్దపాయింటు** వి. దిక్సూచి, దిక్కుల్ని నిర్దేశించే అయస్కాంతపు ముక్కలుగల యంత్రం.

ఇం. *North*. ఉత్తరం, *Point*. బిందువు, సూచించు.

< ఇం. North Point.

**నార్లింజ** రూ.చూ. నారింజ. వి. నారంగం (Citrus Aurantium).

**నార్వాకుతెవులు** చూ. నారు[2]. వి. రాగితెగులు, కంకులు తినే ఒకరకం మిడత (Helopus).

**నార్స** వి. ఉత్తరదిక్కు.

ఇం. *North*. ఉత్తరం.

< ఇం. North.

**నాఱు** రూ. నారు[2], నేరు[2]. వి. **1**. (నాటటానికి విత్తనాలు ప్రత్యేక స్థలంలో ఒత్తుగా చల్లి మొలిపించే) మొలకలు. భార.విరా. 2.52 ; **2**. (మొక్కలు మొలవటానికి చల్లే) విత్తులు.

కొడ. నె.ర్ (నెరువ్-, నెన్ద్-). పైకిలేచు, పైకి కనపడు ; తు. నేజు. వరి మొ॥ మొలకలను నాటడం ; త. నాఱు (నాఱ్). కనబడు, పైకిలేచు, నాఱు (నారి). వచ్చు, పుట్టు, పైకిలేచు ; మ. నాఱునాఞ్ఞమ్. మొదలు, కనపడు ; కో. నట్. నాటడం, నాటడానికి మొలకలు లేచు ; కుఇ. నెజ (నెజ-). భూమిలోంచి పైకి లేచు, మొలకెత్తు.

నాఱునాటు స.క్రి. మొలకలు పాతు. నాఱునాటుట వి. ఊడుపు, ఊడ్పు. నాఱుపోయు రూ.చూ. నాఱువోయు. అ.క్రి. ఆకుపోయు. నాఱువోయు (-పోయు) రూ. నాఱుపోయు. అ.క్రి. నాటటానికై ఒత్తుగా విత్తనాలు చల్లి మొలకలు మొలిపించు.

**నాల** రూ.చూ. నారవ. వి. పంటకాలవ, ఏటినుంచిగాని, పెద్ద కాలవనుంచిగాని తీసిన పంటకాలవ.

**నాలకకొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. తోకగుంజ, మగ్గం మీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన, నేలలో పాతిన కొయ్య.

**నాలకి** రూ.చూ. నాలికి. వి. పల్లకి.

**నాలకొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. 1. నాలికకొయ్య' మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడి పక్కన, నేలలో పాతిన కొయ్య ; 2. నాల్కగొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం.

**నాలము** రూ.చూ. నాడా. వి. గుర్రం గిట్టలకు వేసే ఇనప బిళ్ళ, లాడం.

**నాలవ** రూ.చూ. నారవ. వి. వాన కురిసి పొలంలో పారే నీటి వాగు.

**నాలవకొలము** చూ. నాలుగు.

**నాలవకొలమువా(డు** చూ. నాలుగు.

**నాలవతొలిపలుకు** చూ. నాలుగు.

**నాలవనా(డు** చూ. నాలుగు.

**నాలవపాలు** చూ. నాలుగు.

**నాలవవా(డు** చూ. నాలుగు.

**నాలాయకు** విశ. తగని, లాయకుకాని.

హిం.ఉ. నాలాయక్. తగని.

< ఉ. నాలాయక్.

**నాలి**[1] క్రి.విశ.ద్రు. తేలికగా. ప్రబోధ. 3.38 ; విశ. 1, కుత్సితం, అల్పం. మను. 3.5 ; 2. అసత్యమైనది. కల్లయైనది. మను. 3.28 ; వి. 1. కపటం. పారి. 4.16 ; 2. అల్పకృత్యం, నీచకృత్యం. పాండు. 3.65 ; 3. పరిహాసం, వేళాకోళం. చమ. 2.49.

ప్రా. ణాలి. గ్రస్తం, పడిపోయినది, ణాలిఅ. అజ్ఞానం.

నాలికత్తె వి. మోసకత్తె. తాళ్ల.సం. 13.140. నాలికా(డు వి. మోసగాడు. తాళ్ల.సం. 14.49. నాలికూళలు వి.బ.వ. కుత్సితులు. నాలిగాలి వి. అల్పమైనగాలి, మందమారుతం. వసు. 4.51. నాలితనము వి. 1. కపటం, వంచకకృత్యం, కుత్సితపుపని. రామాభ్యు. 7.47 ; 2. అల్పత్వం, నైచ్యం. రాఘవ. 2.83 ; 3. మాంద్యం. నాలిదైవము వి. పాడు దైవం. మల్ల. 3.128. నాలిదొమ్మ రూ. నాల్దొమ్మ. వి. ఒకరకమైన దొమ్మ, ఇది వచ్చిన పశువు నిదానంగా చస్తుంది. నాలిబూతము వి. కుత్సితుడు, కుత్సితురాలు. ఆం.నా.సం.మాన. 11. నాలిమాటలు వి.బ.వ. కపట వచనాలు. విప్ర. 5.55. నాలిముచ్చు విశ. 1. కుత్సిత మయిన. చంద్రాంగ. 4.59 ; 2. మందమైన. చంద్రాంగ. 4.59 ; వి. దొంగ, కుత్సితుడు. నాలియగు (-అగు) అ.క్రి. నగుబాట్లగు. చమ. 2.49. నాలియాడు (-ఆడు) స.క్రి. బంతులాడు, చెండాడు. ప్రభు. 3.38. నాలియేడ్పులు (-ఏడ్పులు) వి.బ.వ. దొంగ ఏడ్పులు. మను. 3.28. నాల్దొమ్మ రూ.చూ. నాలిదొమ్మ. వి. ఒకరకమైన దొమ్మ, ఇది వచ్చిన పశువు నిదానంగా చనిపోతుంది.

**నాలి**[2] రూ.చూ. నారి. వి. నరం.

నాలికుఱుపు రూ.చూ. నారికుఱుపు. వి. నరం.

**నాలి**[3] రూ. నాలె. వి. 1. నాలికకొయ్య. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య ; 2. ఒకరకంఅడవిచెట్టు.

నాలిబద్ద వి. పలైకట్టె, దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె తిప్పే కర్ర.

**నాలిక** రూ.చూ. నాలుక. వి. 1. జిహ్వ. జైమినిభా. 7.100 ; 2. పడిబిళ్ళ, అచ్చు కట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చుపడులలో బిర్రుపెట్టే కొయ్య చెక్క ; 3. పలైకట్టె, దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనె తిప్పే కర్ర ; 4. నాలికకొయ్య పైభాగం ; 5. పన్ను, దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్య పుల్ల ; 6. పట్టు మగ్గం దోనెను మోసే నాలిక్కొయ్య పైకొన ; 7. స్తంభానికీ పై దూలానికీ కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొన 'క' ఆకారంలో ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తు భాగం ; 8. బట్టీలో ప్రతి అయిదో వరసలోని ఇటికరాతిని ముందుకు వచ్చేటట్లు పేరుస్తారు. దాన్ని ఈ పేరుతో పిలుస్తారు ; 9. పలుగు, దంతె గుజ్జుకు బిగించిన ఇనప పలుగు.

నాలికకొననిలుచు అ.క్రి. నాలుక చివరనుండు. తాళ్ల. సం. 8.57. నాలికకొయ్య రూ. నాలకకొయ్య, నాలకొయ్య, నాలికొయ, నాలికొయ్య, నాలిక్కొయ, నాలిక్కొయ్య, నాలిగ్గొయ్య, నాలుకొయ, నాలుకొయ్య, నాలెకొయ్య, నాలెక్కొయ్య, నాల్కకొయ్య, నాల్కగొయ్య, నాల్కొయ్య, నేలకొయ్య. వి. తోకగుంజ, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య. నాలికగుంజ వి. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతినకొయ్య. నాలికగూటం రూ. నాలిగ్గూటం, నాలిగ్గోటం, నాల్కగూటం, నేలిగ్గూటం. వి. 1. నాలికకొయ్య, మగ్గంమీద నేత గుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా నేలలోపాతిన కొయ్య ; 2. నాలికొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. నాలికచేరు రూ.చూ. నాలికచేఱు. వి. నాలికకింద నల్లగా రెండునరాలు ఉబ్బే పశువుల జబ్బు. నాలికచేఱు రూ. నాలికచేరు, నాలికెసేరు. వి. 1. (పశువుల)

జిహ్వారోగ విశేషం. నవనాథ. **1.30** పొ. 19పం. ; **2.** తృణవిశేషం. **నాలికతొలి.** రూ. నాలికెతొలి. వి. **1.** రంధ్రం, దోనె తిప్పటానికి పల్లెకట్టె దూర్చే దోనెగాడి ; **2.** తొలి, దోనెకు కుడివైపున చివర చేసిన బెజ్జం. **నాలికను ముక్కంటుకొను** స. క్రి. ఒట్టుపెట్టుకొను. తాళ్ల. సం. 3.142. **నాలికపెళ్ళ** వి. కమాను, బట్టీపొయ్యిమీద అడ్డంగా ఉంచిన రాయి. **నాలికబద్ద** రూ. నాల్కెబద్ద. వి. **1.** కోడిపీటలబండి (ఒకరకంబండి) ని తోలే మనిషి కూర్చోటానికి పీలుగా గోసినాగ దగ్గర వేసినచెక్క ; **2.** నాలికను గీసుకొనే బద్ద. **నాలికబల్ల** రూ. నేల్కబల్ల. వి. నాలిక బద్ద. కోడిపీటల బండి (ఒకరకంబండి) ని తోలేమనిషి కూర్చోటానికి పీలుగా గోసినాగ దగ్గర వేసిన చెక్క, అంటిబల్ల. **నాలికమాను** వి. నాలికకొయ్య, మగ్గం మీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా. కుడిపక్కన నేలలో పాతినకొయ్య. **నాలికరొబ్బ** రూ. నాలికిరొబ్బ. వి. దండెచెవి, దండెను మోసే పంగల కొయ్య. **నాలికలు** రూ.చూ. నాలుకలు. వి.బ.వ. **1.** సర్పజిహ్వకలు ; **2.** జ్వాలలు. **నాలికొయ** రూ.చూ. నాలికకొయ్య. వి. **1.** నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగాకుడిపక్కన నేలలో పాతినకొయ్య ; **2.** నాల్కకొయ్య, ఉన్నిమగ్గందోనుగను మోసే కుడివైపు గూటం. **నాలికొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. **1.** తోకగుంజ, మగ్గంమీద నేతగుడ్డచుట్టేకొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలోపాతిన కొయ్య ; **2.** నాల్కగొయ్య. ఉన్నిమగ్గందోనుగను మోసే కుడివైపు గూటం. **నాలిక్కొయ** రూ. చూ. నాలికకొయ్య. వి. తోకగుంజ. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య. **నాలిక్కొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. **1.** నాలికకొయ్య. మగ్గంమీద నేతగుడ్డచుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య ; **2.** నాల్కగొయ్య. ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. **నాలిగ్గూటం** రూ.చూ. నాలికగూటం. వి. **1.** నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా నేలలో పాతిన కొయ్య : **2.** నాలికొయ్య, ఉన్ని మగ్గందోనుగను మోసేకుడివైపు గూటం. **నాలిగ్గొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. తోకగుంజ. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతినకొయ్య. **నాలిగ్గోటం** రూ.చూ. నాలిక గూటం. వి. **1.** నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా నేలలో పాతినకొయ్య ; **2.** నాలికొయ్య. ఉన్ని మగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం.

**నాలికి** రూ. నాలకి, నాల్కి. వి. పల్లకి.

హిం. నాల్‌కీ. పల్లకి.

<హిం. నాల్‌కీ.

**నాలికిరొబ్బ** రూ.చూ. నాలికరొబ్బ. వి. దండెచెవి. దండెను మోసే పంగలకొయ్య.

**నాలికె** రూ.చూ. నాలుక. వి. నాలుక.

**నాలికెతడిక** వి. ఏడె, ఎరువు, కంకులు తోలేబండి జల్ల తెరచి ఉన్నవైపున అడ్డంపెట్టిన తడికలేక చొప్పకట్టలు. **నాలికెతొలి** రూ.చూ. నాలికతొలి. వి. **1.** రంధ్రం, దోనెతిప్పటానికి, పల్లెకట్టె దూర్చే దోనెగాడి ; **2.** తొలి, దోనెకు కుడివైపున చివర చేసిన బెజ్జం. **నాలికెపల్లు** వి. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య. **నాలికెవాయి** వి. మునలవాయి, చెరువునీళ్ళు బయటికి పోవటానికున్న తూముల్లోపైది. **నాలికెసేరు (-చేలు)** రూ.చూ. నాలికచేలు. వి. నాలికకింద నల్లగా రెండు నరాలు ఉబ్బే పశువుల జబ్బు.

**నాలికొయ** చూ. నాలిక.

**నాలికొయ్య** చూ. నాలిక.

**నాలిక్కొయ** చూ. నాలిక.

**నాలిక్కొయ్య** చూ. నాలిక.

**నాలిగూటం** చూ. నాలిక.

**నాలిగ్గొయ్య** చూ. నాలిక.

**నాలిగ్గోటం** చూ. నాలిక.

**నాలీషు** రూ.చూ. నాలీసు. వి. **1.** నామర్దా; **2.** కొండేలు ; **3.** ఫిర్యాదు.

**నాలీసు** రూ. నాలీషు. వి. **1.** ఫిర్యాదు. పద్మ. యు. **47** ; **2.** నామర్దా.

హిం. ఉ. నాలిశ్. ఫిర్యాదు ; పార. అర్తనాదం. అణకువ.

<ఉ. నాలిశ్.

**నాలుక** రూ. నాలిక, నాలికె, నాల్క. వి. **1.** జిహ్వ. భార. ఆది. 2.123 ; **2.** అగ్నిజ్వాల, మంట. భార. ద్రోణ. 5.229 ; **3.** సర్పజిహ్వకలు.

క. నాలగె, నాలిగె. నాలుక ; కొడ. నవు ; తు. నాలాయి ; త. మ. నా, నాక్కు ; తొ. నొ. ఫ్. నాలుక ; పర్జి. నెవ(ద ; కొలా. నల్క ; నా. నాల్క : గ. నాన్ ; ఒల్లా. నాన్ ; బ్రా. దూయీ.

**నాలుకకు(జేర్చు(-చేర్చు)** స.క్రి. మాటలాడు. గౌ. హరి. 1.235పం. **నాలుకకు(దెచ్చు (-తెచ్చు)** స.క్రి. పలుకు,అను. భార. కర్ణ. 2.11. **నాలుకగుంజుకొను** అ.క్రి. అయ్యోపొర పాటు జరిగిందే అని మహాబాధపడు. **నాలుకచేర్లు** వి.బ.వ. పాడిపశువులకి నాలుకకింద్విభాగంలో కలిగేఒకరకమైన వ్యాధి. **నాలుకతడుపు** అ.క్రి. జంకు. ప్రభా. 5.6. **నాలుకతుదనుండు** అ.క్రి. సర్వదా నోట నాట్యమాడు. తాళ్ల.సం. 9.82. **నాలుకక్రుప్పుడుల్‌తీఱ** క్రి.విశ.ద్రు. నాలుక తుప్పు వదలినట్లుగా. వర. రా. బాల. పు. **162**పం. 11. **నాలుకపిడచకట్టుకొనిపోవు** అ. క్రి. ఎక్కువదాహమగు. **నాలుక పీకుకొనిపోవు** అ క్రి. ఎక్కువదాహమగు. **నాలుకపీకుకొను** అ.క్రి. ఎక్కువగా బాధపడు. **నాలుక పెఱుకుకొను** అ.క్రి. మిక్కిలి బాధపడు. ఉ.హరి. 4.303. **నాలుకపై నువ్వుగింజనాను** అ.క్రి. రహస్యం నిలుచు. చిత్రభాను. 5.45. **నాలుకబెల్లము** వి. వాఙ్మాధుర్యం, మాటలతీపి. భార. శాంతి. **3.**268. **నాలుకముల్లు** వి. ప్రధానుడు. ఉ.హరి. 4.102. **నాలుకయాడు (-ఆడు)** రూ.చూ. నాలుకాడు. స.క్రి. పలుకగలుగు. ఉ.హరి. 3.8. **నాలుక యెట్లాడెనో** అవ్య. నోరెట్లాడెనో **నాలుకలు** రూ నాలికలు. వి.బ వ. **1.** జ్వాలలు. భార.

ద్రోణ. 5.229; **2.** సర్ప జిహ్వికలు. భాగ. 4.729. నాలుక వెచ్చన వి. కటుభాషణం. పి. శకు. 2.26. నాలుక వెళ్ళ(బెట్టు అ.క్రి. నిరుత్తరుడగు. <నాలుక + వెళ్లు + -అ⁷ + పెట్టు. నాలుకాడు రూ. నాలుకయాడు. అ.క్రి. నోరాడు. భార. స్త్రీ. 1.175. <నాలుక + ఆడు. నాలుకా తాటిపట్టా రూ. నాల్కా తాటిపట్టా. అవ్య. ఎదుటివాడు అబద్ధమాడి నప్పుడు నిరసనగా అనేమాట. నాలుకొయ రూ.చూ. నాలిక కొయ్య. వి **1**. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య; **2**. నాల్కగొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. నాలుకొయ్య రూ.చూ. నాలికకొయ్య. వి. **1**. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డచుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన, నేలలో పాతిన కొయ్య; **2**. నాల్కగొయ్య. ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం; **3**. నాదుకొయ్య, పట్టుమగ్గం దోనెను కుడివైపున మోసే కొయ్య.

నాలుకాడు చూ. నాలుక.

నాలుకా తాటిపట్టా చూ. నాలుక.

నాలుకొయ చూ. నాలుక.

నాలుకొయ్య చూ. నాలుక.

నాలుకోళ్ళ అచ్చు చూ. నాలుగు.

నాలుగంచులుతీరు చూ. నాలుగు.

నాలుగంటించు చూ. నాలుగు.

నాలుగండ్ల అచ్చు చూ. నాలుగు.

నాలుగణ్ణ అచ్చు చూ. నాలుగు.

నాలుగందాలా చూ. నాలుగు.

నాలుగయిదురోజులు చూ. నాలుగు.

నాలుగవ లగనము చూ. నాలుగు.

నాలుగాకులెక్కువ చదివిన చూ. నాలుగు.

నాలుగిళ్ళ భవంతి చూ. నాలుగు.

నాలుగు రూ చూ. నాల్కు. సర్వ. ఔ. మూడున్నొక్కటి. భార. ఆది. 1.35; విణ. కొంచెం, అల్పం. ఆము. 4.68.

నాలవకొలము వి. చతుర్థకులం, శూద్రజాతి. కువ. చ. 3.96. నాలవకొలమువా(డు విణ. శూద్రుడు. భార. విరా. 1.218. నాలవ తొలిపలుకు వి. అథర్వ వేదం. అచ్చ.రా. యు. 323. నాలవనా(డు వి. నాల్గవనాడు, నాలుగోరోజు. భార. భీష్మ. 2.257. నాలవపాలు విణ. నాల్గోభాగం. భార. విరా. 4.237. నాలవవా(డు విణ. **1**. నాల్గవవాడు, చతుర్థుఁడు. నిర్వ.రా. 7.68; **2**. నాలవతరమువాడు. రం. రా. బాల. 23 పొ. 4 పం.; **3**. శూద్రుడు. ఆం.నా.నం. మాన. 2. నాలుకోళ్ళ అచ్చు రూ.చూ. నాలుగుకోళ్ల అచ్చు. వి. నాలుగు పావుకోడు చెక్కలుగల మగ్గానికి అమర్చినేసే అచ్చు. నాలుగంచులు తీరు అ.క్రి. సమగ్రమైన అంగ సౌష్ఠవ మేర్పడు. నాలుగంటించు స.క్రి. దండించు. తన్ను. <నాలుగు + అంటించు. నాలుగండ్లఅచ్చు రూ. నాలుగణ్ణ అచ్చు. వి. ఒకరకం అచ్చు. నాలుగణ్ణ అచ్చు రూ.చూ. నాలుగండ్ల అచ్చు. వి. ఒకరకం అచ్చు. నాలు గందాలా అవ్య. అన్నివిధాల. నాలుగయిదు రోజులు వి.బ.వ. కొన్నిరోజులు. నాలగవలగనము వి. కర్కాటలగ్నం. అచ్చ. రా.బాల.84. నాలుగాకు లెక్కువ చదివిన విణ. అంతకు మించిన. నాలుగిళ్ళ భవంతి వి. లోగిలిల్లు, మధ్యనున్న ఖాళీ స్థలానికి నాలుగువైపులా గదులున్న ఇల్లు. నాలుగు ఉతుకులు ఉతుకు స.క్రి. దండించు, తన్ను. నాలుగు కంబాలాట వి. బాలక్రీడ. నాలుగుకాయలు కాయు అ.క్రి. సంతానవతి అగు. వేంక. పంచ. 1.56. నాలుగుకాలాలపాటు వి. చిరకాలం. నాలుగుకోళ్ళ అచ్చు రూ. నాలుకోళ్ళ అచ్చు. వి. నాలుగు పావుకోడు చెక్కలుగల మగ్గానికి అమర్చి నేసే అచ్చు. నాలుగు గడియల దూరం వి. నాలుగు గడియల్లో చేరగల దూరం. నాలుగు గీరలంచు రూ. నాలుగ్గీరలంచు వి. నాలుగు గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. నాలుగు గోలల పువ్వంచు రూ. నాలుగ్గోలల పువ్వంచు. వి. ఒకరకం పువ్వులు పడేట్టునేసిన అంచు. నాలుగుచెప్పు స.క్రి. కొండేలు చెప్పు. నాలుగుదు గురిగ వి. కూరలకు వాడే పెద్ద గురిగ. నాలుగు దోవలగు అ.క్రి. చెడిపోవు, చిన్నాభిన్నమగు. <నాలుగు + త్రోవ + -లు + అగు. నాలుగుపారల భవంతి వి. లోగిలిల్లు, మధ్యనున్న ఖాళీస్థలానికి నాలుగువైపులా గదులున్న ఇల్లు. నాలుగుమాటలను స.క్రి. తిట్టు, నిందించు. <నాలుగు + మాట + -లు + అను. నాలుగుమూలలాట వి. బాలక్రీడా విశేషం. దశా. 8.81. < నాలుగు + మూలలు + -అ + ఆట. నాలుగు మెతుకులు వి.బ.వ. అల్పభోజనం. నాలుగురాళ్లు సంపాదించు స.క్రి. ఎంతోకొంతధనం సంపాదించు. నాలుగూ దులుపు స.క్రి. నాలుగు మాటలూ అను. నాలుగూ పెట్టిపంపు స.క్రి. చీకొట్టి పంపించు. నాలుగ్గీరలంచు రూ.చూ. నాలుగుగీరలంచు. వి. నాలుగు గీరలు పడేట్టు నేసిన ఒకరకం అంచు. <నాలుగు + గీరలంచు. నాలుగ్గోలల పువ్వంచు రూ.చూ. నాలుగు గోలల పువ్వంచు. వి. ఒకరకం పువ్వులు పడేట్టు నేసిన అంచు.

నాలుగూదులుపు చూ. నాలుగు.

నాలుగూపెట్టిపంపు చూ. నాలుగు.

నాలుగ్గీరలంచు చూ. నాలుగు.

నాలుగ్గోలలపువ్వంచు చూ. నాలుగు.

నాలువ రూ.చూ. నారవ. వి. చిన్నకాలవ.

నాలుపు రూ.చూ. నాల్కు. సర్వ.ఔ. మూడున్నొకటి. భార. ఆది. 1.115.

నాలె రూ.చూ. నాలి³. వి. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య.

నాలెకొయ్య రూ.చూ. నాలికకొయ్య. వి. **1**. నాలిక కొయ్య. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య; **2**. నాల్కగొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. నాలెక్కొయ్య రూ.చూ. నాలికకొయ్య. వి. తోకగుంజ, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడి పక్కన నేలలో పాతిన కొయ్య. నాలెపొయ్యి వి. జంట పొయ్యి, ఒకే మంటతో రెండు పాత్రలు ఉడకడానికి వీలుగా చేసినట్టి జాయింటు పొయ్యి.

**నాల్క** రూ.చూ. నాలుక. వి. జిహ్వ. మార్క. 3.353.

**నాల్కకు నరములేకుండు** అ.క్రి. మాట నిలకడ లేకుండు. **నాల్కకొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. తోకగుంజ, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడి పక్కన నేలలో పాతిన కొయ్య. **నాల్కగూటం** రూ.చూ. నాలికగూటం. వి. **1**. నాలికకొయ్య, మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా నేలలో పాతిన కొయ్య ; **2**. నాలికొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. **నాల్కగొయ్య (-కొయ్య)** రూ.చూ. నాలికకొయ్య. వి. ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. **నాల్కతడిలేకుండు** అ.క్రి. నోరెండిపోవు. వర.రా.బాల.పు. 79. పం. 14. **నాల్కాతాటిపట్టా** రూ.చూ. నాలుకా తాటి పట్టా. అవ్య. అసత్యం చెప్పినప్పుడు అధిక్షేపిస్తూ అనే మాట. **నాల్కొయ్య** రూ.చూ. నాలికకొయ్య. వి. **1**. నాలికకొయ్య. మగ్గంమీద నేతగుడ్డ చుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య ; **2**. నాల్కగొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. <నాల్క + కొయ్య.

**నాల్కడము** రూ. నారికడము, నారికెడము, నారికేడము, నాల్కణము. వి. కొబ్బరిచెట్టు. హర. 5.46.

సం. నారికేర-, నారికేల-, నారికేళ-. కొబ్బరి కాయ ; ప్రా. నారిఏర-, ణారిఏల- ; పా. నాళికేర ; క. నాడికొర-, నారకేల-, నారికేలి, నారికేర, నారియళి. కొబ్బరి.

<సం. నారికేర-.

**నాల్కణము** రూ.చూ. నాల్కడము. వి. కొబ్బరికాయ. హరి. 5.46.

**నాల్కాతాటిపట్టా** చూ. నాల్క.

**నాల్కి** రూ.చూ. నాలికి. వి. పల్లకి.

**నాల్కు** రూ. నాలుగు, నాలువు, నాల్గు. విణ. నాలుగు. ఎఱ్ఱగుడిపాడు శాసనం. క్రీ.శ. 575-600.

క. నాల్(ఉ), నాల్(ఉ)కు, నాకు, నా. నాలుగు, నాల్వార్. నల్గురు ; కొడ. న.లి. నాలుగు ; తు. నాళు. నాలుగు, నాలనె, నాల్గవది ; త. నాల్, నాలు, నాఙ్కు, నాలుకు. నాలుగు, నాఙ్కామ్. నాల్గవది ; మ. నాల్, నాలు, నాఙ్కు, నాన్. నాలుగు ; కో. నా. న్గ్. నాలుగు, న. న్గ్. ను. ర్. నాలుగు వందలు ; తొ. నొ. న్గ్(న్). నాలుగు ; గోం. నాలుంగ్. నాలుగు, నాల్క్. ఒక్కొక్కరికి నాల్గేసి ; కొం. నాలెర్. నాలుగు, నాల్గి. నాలుగు ; కుయి. నాల్గి. నాలుగు ; పర్జి. నాలు(క్). నాలుగు వస్తువులు ; కొలా. నాలిన్. నాలుగు వస్తువులు ; నా. నాలిన్. నాలుగు వస్తువులు ; గ. నల్గుర్. నాలుగు ; కురు. నాఖ్. నాలుగు వస్తువులు.

<మూ.ద్రా. *నాల్.

**నాల్కొబద్ద** రూ.చూ. నాలికబద్ద. వి. నాలికబద్ద, కోడిపీటల బండి (ఒకరకం బండి) ని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసినొగ దగ్గర వేసిన చెక్క.

**నాల్కొయ్య** చూ. నాల్క.

**నాల్గు** రూ.చూ. నాల్కు. సర్వ.బొ.బ.వ. మూడున్నొకటి. భార.ఆది. 1.52.

**నాల్గుకన్నులవేల్పు** వి. అగ్నిదేవుడు. అచ్చ.రా.బాల. 54. **నాల్గుకమ్మిలసొంచె** వి. తారసరాయి చేసే నాలుగరల అచ్చు. **నాల్గుగంబములయాట(-కంబములయాట)** వి. నాలుగు స్తంభాలాట, బాలికా క్రీడా విశేషం. ఇందు. 2.143. **నాల్గునగలుపెట్టు** స.క్రి. శుభకార్యాలలో ధోవతి, అంగి, రుమాలు, అంగవస్త్రం పెట్టు. **నాల్గుమూల్రౌతు** వి. చౌకం రాయి, నాలుగు వైపులా మలచబడి కట్టుబడిలో వాడబడే రాయి. <నాల్గు + మూల + రౌతు.

**నాల్గొమ్మ** చూ. నాలి[1].

**నాల్నాఁడు** చూ. నాలుగు. వి. **1**. చతుర్థ దివసం, నాలుగో దినం. కాశీ. 2.72 ; **2**. చతుర్థ దివస కృత్యం. నాల్గో దినం చేసే పని (ఋతుస్నానం).

**నాల్నాఁడుచేయు** స.క్రి. ఋతుస్నానం చేయు. వరాహ. 4.61. **నాల్నాళ్లజలకమాడు** స.క్రి. ఋతుస్నానం చేయు.

**నాల్నాళ్లజలకమాడు** చూ. నాల్నాఁడు.

**నాళము** రూ.చూ. నాడా. వి. లాడం, ఎద్దుగిట్టలకు అరక్కుండా వేసిన ఇనపబిళ్ల.

**నాళీలు** వి.బ.వ. భక్ష్య విశేషాలు. యయా. 2.83.

**నావ**[1] వి. ఓడ, కలం. శేయా. 3.194.

సం. నౌ- ఓడ ; ప్రా. నావా ;

క. నావె ; త. నావాయ్.

<ప్రా. నావా.

**నావకన్ను** వి. ఒక చేప పేరు (Kuriteh).

**నావ**[2] వి. పనికిమాలినవాడు.

**నావకంభము** వి. నామస్తంభం. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 605. క్రీ.శ. 1150.

సం. నామన్. పేరు, స్తంభ-. స్తంభం.

**నావకాయపిండివంటలు** వి.బ.వ. అనేక విధాలైన పిండివంటలు.

**నావరు** వి. పశువు కృశించి చచ్చిపోయే ఒక జబ్బు.

**నావి** వి. సస్యరోగ విశేషం.

**నావు** రూ.చూ. లావు. వి. లావు, ఎక్కువ.

**నావుడు** రూ.చూ. అనవుడు. అవ్య.ద్రు. అనిన పిమ్మట. భార. ఆది. 1.156.

**నావురాకులు** చూ. నావురు.

**నావురు** రూ. నాగురు, నాఁగురు. వి. నాగిని, ఒకజాతి వృక్షం. మను. 4.60 (Premna Tomentosa).

**నావురాకులు** వి.బ.వ. పెద్ద ఆకులతోఉన్న ఒకరకం చెట్టు. మను. 4.92.

**నావురుదొమ్మ** వి. నాము తినటంవల్ల వచ్చే ఒకరకమైన వ్యాధి.

**నాస** వి. **1**. బలహీనం ; **2**. కృశించటం.

సం. నాశ-. క్షీణత ; ప్రా. ణాస-.

<సం. నాశ-.

**నాసకురమ** వి. దీర్ఘవ్యాధిగా నిలిచిపోయే కురమవ్యాధి.

**నాసరజంగు** వి. గలిజేరువంటి ఒకానొక నేలచెట్టు.

**నాసరతుంగ** వి. ఒకరకమైన కలుపు మొక్క (Cyperks Species).

నాసరతెవులు వి. తెగపారుకొనే రోగం.

నాసి[1] వి. 1. తక్కువరకం; 2. చచ్చుగింజలు ఎక్కువగా ఉన్న ధాన్యం; 3. కీతరకం, తక్కువది; విశ. నికృష్ట మయిన.

సం. నాశ-. క్షీణత; ప్రా. ణాస. నాశనంచేయు, ణాసో. ధ్వంసం; జై.మహా. నస్సఇ; అ.మా. నాస. నాశం, నాసి. నశించే వ్యక్తి;

క. నాస, నాసి. నాశనంచేసే స్త్రీ.

నాసిఅంబరు వి. ముక్కుపొడుం రంగు. నాసిబల్ల వి. చిన్న నలప, చిన్న పాత్రలు సర్దడానికి ఉపయోగించే నలప. నాసిరకం వి. తగ్గురకం. నాసిరంగు రూ.చూ. నాఁచురంగు. వి. పెసరరంగులో ముదురువన్నె, పాకుడు రంగు. నాసిరిల్లు అ.క్రి. 1. నశించు; 2. కృశించు. నాసిలు అ.క్రి. నవయు, కృశించు, క్షీణించు. జైమినిభా. 5.108.

నాసి[2] వి. పిల్లి, మార్జాలం.

హిం. నాసీ. నాశనంచేసేది.

నాసు రూ.చూ. నాఁచు[2]. వి. 1. కాడలు లేకుండా పొడుగాటి ఆకులుండి నిలకడ నీటిలో పెరిగే నీటి కలుపుమొక్క; 2. పాకుడురంగు (Blyxaoctandra).

నాసురంగు రూ.చూ. నాఁచురంగు. వి. పెసరరంగులో ముదురువన్నె, పాకుడురంగు. నాసులు వి.బ.వ. ఊపిరి తిత్తుల జబ్బు.

నాస్త రూ.చూ. నాస్తా. వి. చల్దిభోజనం, ఫలహారం, ఉదయం తీసుకొనే ఆహారం.

నాస్తా రూ. నాస్త. వి. ఉపాహారం, టిఫిన్.

హిం. ఉ. నాశ్తా. జలపానం, ఉపాహారం.

<ఉ. నాశ్తా.

నాస్తులు చూ. నేస్తుఁడు. వి.బ.వ. స్నేహితులు.

నాహరీగడలు వి.బ.వ. వాద్యవిశేషాలు. ఉ. హరిశ్చ. 4.113.

నాహిడు రూ. చూ. నాయఁడు. వి. నాయుడు, శూద్రుల బిరుదు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 321. క్రీ.శ. 1248.

-ని[1] రూ.చూ. న్[1]. ప్రత్య.ద్రు. ద్వితీయా విభక్తి ప్రత్యయం, ఇకారం తర్వాత ఉన్న -ను సమస్వరత వల్ల -ని[1]గా మారు తుంది.

-ని[2] రూ.చూ. న్[3]. ప్రత్య. ద్రు. భూతార్థకోత్తమ పురుషైక వచన ప్రత్యయం.

-ని[3] ప్రత్య. వ్యతిరేక తృపర్ణకార్థంలో వచ్చే ప్రత్యయం. ఉదా. చేయని కృష్ణుడు, -అనిలోని అకారం వ్యతిరేకం, కాగా నకారం భూతేతరంగాను ఇకారం విశేషణ ప్రత్య యంగాను భావించవచ్చు.

-ని[4] ప్రత్య. గుణవాచకాలైన నల్లాదులకు కర్మధారయసమా సంలో బహుళంగా వచ్చే ఆగమం. ఉదా. నల్లనిగుర్రం. నామవాచకద్యోతకమైన నకారంపై ఇకారం విశేషణ ప్రత్యయంగా చేరుతుంది.

-ని[5] అప. కొన్నిదుమంతశబ్దాలకు ద్వితీయాది విభక్తులు పరమైనపుడు వచ్చేఆగమం. -న్ ద్వితీయా విభక్తికాగా దానికి చేరే ఇకారం ఔపవిభక్తికం.

నికటము విశ. అవిచ్ఛిన్నమైన, ఎడలేని; వి. నిర్బంధం.

సం. నికట-. సామీప్యం, ఆసన్నమయిన;

క. నికట.

<సం. నికట- (అర్థవిపరి.).

నికంటువు రూ.చూ. నికర్తు. వి. 1. ఆచారం; 2. కట్టుబాటు.

నికత్తు రూ.చూ. నికర్తు. వి. 1. ఆచారం; 2. కట్టుబాటు.

నికము రూ.చూ. నిక్కము. క్రి. విశ. యథార్థంగా, సత్యంగా. బసవ. 185పు. 399పం; వి. సత్యం.

నికరము రూ.చూ. నిగరము. విశ. శ్రేష్ఠమైన, సారభూతమైన. రాజవా. 3.11; కువ. చ. 1.41.

నికర్తు రూ. నికంటువు, నికత్తు. వి. 1. ఆచారం; 2. కట్టుబాటు.

సం. నిఘంటు-. కోశం.

నికానికలు వి.బ.వ. తోయటంలోని ధ్వన్యనుకరణం.

నికాబత్తు వి. న్యాయనిర్ణేత, ప్రజానాయకుడు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759.

ఉ. పార. నికాబత్. న్యాయాధిపతి.

<ఉ. నికాబత్.

నికార్సు రూ. నికాలను, నికాలస్తు. విశ. 1. సరి; 2. నిజ మయిన.

హిం. నిఖాలిస్. స్వచ్ఛమైన, విశుద్ధమైన.

నికాలచ్చుగా చూ. నికార్సు. క్రి. విశ. ద్రు. ఖచ్చితంగా.

నికాలను రూ.చూ. నికార్సు. విశ. 1. అప్పటమైన; 2. యోగ్యమైన.

నికాలస్తు రూ.చూ. నికార్సు. విశ. 1. అప్పటమైన; 2. నిజమైన.

నికోబతు వి. కీర్తి. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 759. క్రీ. శ. 1663.

నిక్కచ్చి వి. 1. నిగ్గు, సారం. కుత్స. 2.112; 2. నిర్బం ధం; 3. నిశ్చయం; 4. తేడా లేకుండటం.

నిక్కచ్చిచేయు అ.క్రి. బాకీకి నిర్బంధంచేయు.

నిక్కనీలుగు చూ. నిక్కు.

నిక్కపుజగము చూ. నిక్కము.

నిక్కపుటాలు చూ. నిక్కము.

నిక్కపెట్టు చూ. నిక్కు.

నిక్కపొడుచు చూ. నిక్కు.

నిక్కము రూ. నికము, నిక్కువము. వి. 1. సత్యం. భార. ఆది. 1.101; 2. యథార్థం, వాస్తవం. భార. ఆది. 8.211; 3. సత్యవాక్యం. భార. విరా. 3.100; 4. ధర్మం. భార. శాంతి. 1.45; 5. త్రికాలబాధ్యత, శాశ్వ తత్వం. భార. శాంతి. 2.22; విశ. 1. యథార్థమైన, సత్యమైన. భార. ఆది. 3.72; 2. అన్వర్థమైన, సార్థక మైన. హరి. పూ. 3.123; 3. అసందిగ్ధమైన. కాశీ. 2.124; క్రి. విశ. నిజంగా, నిశ్చయంగా. కు. సం. 3.87.

క. నిక్కువ. నిజం, వాస్తవం.

నిక్కపుజగము వి. సత్యలోకం. అచ్చ. రా. కిష్కిం. 76. నిక్కపుటాలు వి. ధర్మపత్ని. పాణిగృహీత. విజ్ఞా. ప్రా. 107. నిక్కముచేయు స.క్రి. నిశ్చయంచేయు, దృఢపరచు.

వరాహ. 4.164.

నిక్కరుపురుగు చూ. నిక్కుడుపురుగు. వి. ఆముదం ఆకులుతినే పురుగు.

నిక్కల రూ. నిక్కలము. వి. సత్యస్వప్నం, నిజమైనకల. భార. ఆరణ్య. 6.401.

<*నిర్ (నిండు) + కల.

నిక్కలయగు (-అగు) అ.క్రి. నిజమగు. మార్క. 1.263.

నిక్కలము రూ.చూ. నిక్కల. వి. నిక్కం, యాథార్థ్యం, నిజం.

నిక్కపుడు వి. నిష్కాపట్యం, కపటంలేని. ఆం. భా. 1.138.

సం. నిష్కపటు-. కపటంలేనివాడు ; ప్రా. నిక్కవడ-. కపటరహితం.

<ప్రా. నిక్కవడ-.

నిక్కవొడుచు చూ. నిక్కు. అ.క్రి. నిక్కునిలుచు.

నిక్కా వి. వివాహం.

హిం. మరా. ఉ. అర. నికాహ్-. ముస్లింలవివాహరీతి.

<ఉ. నికాహ్.

నిక్కాక వి. మిక్కిలికాక; విణ. నిండు కాకకల.

<*నిర్ (నిండు) + కా(క.

నిక్కిచూచు చూ. నిక్కు.

నిక్కించు చూ. నిక్కు.

నిక్కిడు చూ. నిక్కు.

నిక్కినీల్గీ చూ. నిక్కు.

నిక్కు అ.క్రి. 1. ఉబుకు, ఉబ్బు. భాస్క. రా. సుందర. 174 ; 2. గర్వించు. భాస్క. రా. యు. 1996 ; 3. నిగుడు, పైకిలేచు. హరి. పూ. 6.83 ; 4. అతిశయించు, అధికమగు. ఉ. హరి. 4.204 ; 5. సంతోషించు. శృం. నై. 7.125 ; 6. సాగు, దీర్ఘమగు. భీమ. 4.130 ; 7. వర్ధిల్లు, హెచ్చు. భాగ. 5.278 ; 8. ఉన్నతమగు, ఎత్తగు. మను. 2.86 ; 9. కలుగు, పుట్టు, ఉదయించు. మను. 5.42 ; 10. వ్యాపించు. సారంగ. 2.238 ; 11. ఎదుగు ; వి. 1. అందం, ఒప్పు, విలాసం. భాస్క.రా.యు. 143 ; 2. పొటకరింపు. శుక.చ. 2.30 ; 3. ఉన్నతి, ఔన్నత్యం. యయా. 1.83 ; 4. మొట్టమొదట చేసే కాగు కిందిభాగం ; 5. గర్వం.

క. నిక్కుళిసు. పగలు చూపెట్టు వంగు, నిళ్కు, నిల్కు, నిళకు. పైకి వళ్ళు విరచుకొను, మునివేళ్ళమీద నిలుచు ; త. నీళ్ ; మ. నికళమ్, నిగళమ్. గర్వం, నికళిక్క, నిగళిక్క. వాచు, గర్వాన్ని తెలిపెట్టునడచు, దన్నుకర(.

నిక్కనీలుగు అ.క్రి. గర్వించు. నిక్కపెట్టు అ.క్రి. పైకిలేచు. నిక్కపొడుచు అ.క్రి. 1. పైకిలేచు ; 2. నిటారుగ నిలబడు. నిక్కిచూచు స.క్రి. తేలిచూచు, చక్కగాచూచు. విప్ర. 4.49. నిక్కించు స.క్రి. నిగడజేయు, పైకిలేపు. క్రీడా. 235. <నిక్కు + -ఇంచు[3]. నిక్కిడు అ.క్రి. నిక్కు, పైకిలేచు. శుక. 4.7. <నిక్కు + ఇడు. నిక్కినీల్గీ అవ్య. అలస్యంగా. నిక్కుచు నీల్గుచునుండు అ.క్రి. విజృంభించిఉండు. భార. ద్రోణ. 2.312. నిక్కుచెవినీల(డు వి. ఉచ్చైశ్శ్రవం. విజయ. 3.99. నిక్కుచెవులనీల(డు వి. ఉచ్చైశ్శ్రవం. ఉ.రా. 5.208. నిక్కుడు వి. 1. గర్వం ; 2. విలాసం ; 3. బెక్కు ; 4. అతిశయం; 5. గర్వం ; 6. ఉన్నతి. నిక్కుడుపురుగు వి. ఆముదం ఆకులు తినిపోయే పురుగు. నిక్కునీల్గు వి. గర్వం. నిక్కుపోతు రూ.చూ. నిక్కు(బోతు. వి. గర్వస్వభావం కలవాడు. నిక్కు(బోతు(-పోతు) రూ. నిక్కుపోతు. వి. గర్వస్వభావం కలవాడు. నిక్కులబండి వి. గర్విష్ఠి. నిక్కులా(డి వి. మిటుకులాడి. కాళిందీ. 6.27. నిక్కులించు స.క్రి. నిగడచేసుకొను. ప్రబంధ. 61. నిక్కువీనులజక్కి వి. ఉచ్చైశ్శ్రవం. ఆం.భా. 1.56. నిక్కు వీనుల జక్కి నెక్కు రౌతు వి. ఇంద్రుడు.

నిక్కువము రూ.చూ. నిక్కము. క్రి. విణ. నిజంగా. భార. ఆది. 4.219 ; విణ. 1. అసందిగ్ధమైన, స్పష్టమైన. భార. ఆది. 6.283 ; 2. యథార్థమైన, సత్యమైన. కు.సం. 5.120.

నిక్షేపంలాంటి విణ. చక్కని, అమూల్యమైన.

నిక్షేపంగా అవ్య. హాయిగా, సుఖంగా.

నిక్షేపరాయడు రూ. నిక్షేపరాయుడు. వి. పనికిమాలినవాడు.

నిక్షేపరాయుడు రూ.చూ. నిక్షేపరాయడు. వి. 1. ఎంతటి క్లిష్ట పరిస్థితులలోనైనా బాధ్యత తప్పించుకొని తిరిగే వ్యక్తి ; 2. ఏమీ డబ్బు లేకపోయినా వ్యసన పడకుండా కులాసాగా తిరిగేవాడు.

నిక్షేపించు స.క్రి. 1. దాచు, మరుగుపరచు. భార. ఆది. 1.40 ; 2. పాతు, పూడ్చు. వేంక. పంచ. 1.701.

నిఖా రూ.చూ. నిగా. వి. దీర్ఘదృష్టితో విచారణ చేయటం. రంగా. చ. 2.6.

నిగడడం చూ. నిగుడు. వి. గర్వపడటం.

నిగడ(బొడుచు చూ. నిగుడు.

నిగనిగ రూ. నిగన్నిగ. వి. 1. వెలగడం, మెరవడం, మొ. వాటిలో అయ్యే అనుకరణం. భీమ. 5.8 ; 2. కాంతి విశేషం. మను. 3.9 ; విణ. నిగనిగ అనే కాంతిగల, నిగనిగలాడే. హర. 2.122.

క. నిగ, నిగి, వెలుగు, నిగనిగ, నిగినిగి, ఎక్కువ కాంతివంతంగా, కాంతిగా, నెగళ్. విశదమగు, తేటపడు ; తు. నిగాను. కాంతి, మెరుపు ; త. నికర్ (-ప్పు-, త్తు, నికరి). ప్రకాశించు, కనపడు, కాంతి ; నికజ్ (-ప్పు-, -త్తు-). ప్రకాశించు, నికు-, నికుప్-, ఎనల్. నిగనిగలాడే కాంతి.

నిగనిగని అవ్య. తళతళమనే. పాండు. 2.49. నిగనిగమను అ.క్రి. ధగధగమను. నిగనిగలాడు అ.క్రి. నిగనిగ అని ప్రకాశించు. నీలా. 1.30. నిగనిగలుగులుకు అ.క్రి. మినమినలాడు. హంస. 1.60. నిగారించు అ.క్రి. ప్రకాశించు. నిగారింపు వి. మెరుపు, కాంతి.

నిగనిగన్నిగ చూ. నిగనిగ. వి. కాంతి విశేషం. నరస. 5.113.

నిగన్నిగ రూ.చూ. నిగనిగ. వి. కాంతి విశేషం. కవిరాజ. 5.88.

నిగమగోచరులు వి.బ.వ. వస్త్రవిశేషం. ప్రబంధ. 272.

సం. నిగమగోచర - . భగవంతుడు.

<సం. నిగమగోచర - + - లు (అర్థవిపరి.).

**నిగరము** రూ. నిఁగరము, నిగారము. వి. 1. పెల్లిక, బిల్ల. శృం.నై. 7.154 ; 2. కాంతి విశేషం. ప్రబంధ. 40 ; విశ. 1. శ్రేష్ఠమైన. సారభూతమైన. వేంక. పంచ. 4.241 ; 2. పెద్ద, గొప్ప. రాజవా. 3.124 ; 3. నీచమైన, అల్పమైన. ప్రబంధ. 403.

ఉ. నిగార్. మూర్తి, చిత్రం; పార. నిగార్. చిత్రలేఖనం.

<ఉ. నిగార్.

**నిగా** రూ. నిఖా, నిఘా. వి. దృష్టి, విచారం, లక్ష్యం. ద.హిం. శా. సంపు 10. శా.సం. 765.

హిం. నిగాహ్. దృష్టి; మరా. నిగా, నిఘా. లక్ష్యం; ఉ. నిగాహ్. దృష్టి, పరిశీలనం; పార. నిగాస్. దృష్టి, లక్ష్యం.

<ఉ. నిగాహ్.

**నిగాడు** అవ్య. హీనం.

**నిగాహున్** వి. ఆవారి, తలమనిషి, పెద్దరైతు దగ్గర జీతగాళ్ళ చేత వ్యవసాయం చేయించేవాడు.

**నిగారము** రూ.చూ. నిగరము. వి. 1. మెరుగు, కాంతి విశేషం. మృత్యు. 2.60 ; 2. చిత్రం. నీలా. 1.57 ; విశ. శ్రేష్ఠమైన. అచ్చ.రా. అయోధ్యా. 83.

**నిగారించు** చూ. నిగనిగ.

**నిగారింపు** చూ. నిగనిగ.

**నిగావానులు** వి. కాపలావాడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 765. క్రీ.శ. 1600.

హిం.ఉ. నిగహ్‌బాన్. రక్షకుడు ; పం. నిగాహ్‌బాన్.

**నిగిడికొను** చూ. నిగుడు.

**నిగిడించు** చూ. నిగుడు.

**నిగిడినిమ్మాకుపెరుకు** చూ. నిగుడు.

**నిగితము** రూ. నిగితి. వి. సంగీతంలోని ఒక స్వరస్థాయి. ఠాయాల్లో ఒకటి. బసవ. 3.939. పం.

సం. నిక్త-. శుద్ధంచేయబడిన.

**నిగితి** రూ.చూ. నిగితము. వి. సంగీతంలో ఒక స్వరస్థాయి. బసవ. 3.939 పం.

**నిగుడఁజేయు** చూ. నిగుడు.

**నిగుడము** వి. అశ్వశిక్షా భేదం. ఏ.శకు. 1.112.

**నిగుడారు** చూ. నిగుడు.

**నిగుడించు** చూ. నిగుడు.

**నిగుడు** రూ.చూ. నివుడు. అ.క్రి. 1. ఉద్గతమగు, వెలువడు. భార.విరా. 2.60 ; 2. (యుద్ధాదుల్లో) విజృంభించు. భార.విరా. 5.207 ; 3. చక్కబడు. భార.ఉద్యో. 2.61 ; 4. నిక్కు, పైకిలేచు. భార.ఉద్యో. 2.146 ; 5. వ్యాపించు, ప్రసరించు, పడు. భార.భీష్మ. 1.106 ; 6. (యుద్ధాదుల్లో) కవియు, మార్కొను. భార.భీష్మ. 3.11 ; 7. యత్నించు. భార.మహా. 64 ; 8. (బాణాదులు) పరగు, మీఁదికివచ్చు. భాస్క.రా.అరణ్య. 1.201 ; 9. పరుగెత్తు. భాస్క.రా.అరణ్య. 2.57 ; 10. సాగు, దీర్ఘమగు. శృం.నై. 7.93 ; 11. స్వస్థతపొందు. వరాహ. 12.69 ; 12. కలుగు, పుట్టు. ఆము. 5.76 ; 13. అంతంపొందు, చచ్చు. వసు. 3.119 ; 14. బయలుదేరు. పాండు. 1.137 ; 15. అతిశయించు. పాండు. 2.26 ; 16. ప్రవహించు. పాండు. 5.26 ; 17. ఒప్పు. విప్ర. 2.68.

**నిగడఁబొడుచు** అ.క్రి. పైకి లేచు. <నిగుడు + -అ + పొడుచు. **నిగిడికొను** స.క్రి. తడుముకొను, నిమురుకొను. హర. 2.27. **నిగిడించు** రూ. నిగుడించు, నివిడించు. స.క్రి. 1. సాగజేయు, చాచు. భార.విరా. 3.79 ; 2. వెలువరుచు. భార. విరా. 5.221 ; 3. (బాణాదులు) పరచు, ప్రయోగించు. భార.భీష్మ. 2.98 ; 4. కలిగించు. చంద్రికా. 6.6 ; 5. నిగడజేయు, వ్యాపింపజేయు. **నిగిడి నిమ్మాకుపెరుకు** అ.క్రి. చచ్చు. **నిగుడఁజేయు** స.క్రి. 1. ఏయు. భార.విరా. 5.190 ; 2. వర్ధిల్లజేయు. భార.ఉద్యో. 2.243 ; 3. వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. పారి. 5.52. **నిగుడారు** అ.క్రి. వ్యాపించు. ఉ.హరి. 5.134. **నిగుడించు** రూ.చూ. నిగిడించు. స.క్రి. 1. (బాణాదులు) పరచు, ప్రయోగించు. ఉ.హరి. 4.250 ; 2. వ్యాపింపజేయు. ఆము. 5.157 ; 3. వెలువరుచు ; 4. చాచు ; 5. కలిగించు. **నిగుడుచు** రూ.చూ. నిగుడ్చు. స.క్రి. 1. తూర్చు, పెట్టు. భీమ. 5.110 ; 2. వ్యాపింపచేయు, నిగడచేయు ; 3. వెలువరుచు ; 4. బాణాదులను ప్రయోగించు ; 5. కలిగించు. **నిగుడ్చు** రూ. నిగుడుచు, నివుడుచు, నివుడ్చు. స.క్రి. 1. (బాణాదులను) పడజేయు. ప్రయోగించు. భార.ద్రోణ. 4.304 ; 2. వెలువరుచు, భార. స్త్రీ. 1.175 ; 3. నిగడజేయు, వ్యాపింపజేయు. శృం.నై. 4.22 ; 4. తూర్చు, పెట్టు. ఆము. 6.78 ; 5. కలిగించు. రాఘవ. 3.82. క. నిగుర్, నిగరు. సాచు, పూర్తిగా సాగదీయు, వ్యాపించు, నిగురిసు, నిగరిసు. పూర్తిగా సాగదీయు, నిగరికే. పూర్తిగా సాగదీయబడినది. **నిగుడుదెంచు** అ.క్రి. పుట్టు, కలుగు. రామాభ్యు. 8.207.

**నిగుడ్చు** చూ. నిగుడు.

**నిగుఱు** రూ.చూ. నీఱు. వి. భస్మం, బూడిద. దశా. 3.171.

**నిగుఱుగప్పిననిప్పు** వి. 1. డాంబికంలేని ధీరుడు ; 2. ఉన్నశక్తిని ప్రకటించనివాడు.

**నిగ్గడి** వి. మూర్ఖుడు. బసవ. 1 పు. 234 పం. ; విశ. కఠినమైన. భార.స్త్రీ. 2.47.

క. నిగ్గెడి. నిగ్గుమాలినవాడు ; తు. నిగ్గు, నిగ్గిర. మురికి, రోత, నిగ్గేసు. శుభ్రతలేని వ్యక్తి ; త. నిక్కలమ్.

**నిగ్గదీయు** స.క్రి. కచ్చితంచేయు, నిలబెట్టు.

**నిగ్గారు** చూ. నిగ్గు.

**నిగ్గి** వి. మట్టితో వేసిన మిద్దె, అటక.

**నిగ్గించు** చూ. నిగ్గు.

**నిగ్గు** వి. 1. కాంతి. మను. 2.11 ; 2. జిడ్డు. వసు. 5.79 ; 3. కరణం. ఆం.భా. 1.82 ; 4. సారం ; విశ. తోవుడుపోగా మిగిలిన ; అ.క్రి. నిర్వహిల్లు ; స.క్రి. చుట్టు.

క. నెగళ్. నిర్వహించు, తయారగు, చేయు, వచ్చు, పనికివచ్చు, పూర్తిచేయు, నెగళ్ళు. తీసుకొనేటట్లునేయు,

చేయు, మొదలుపెట్టు, నెగత్తె. పని ; త. నికఴ్ (-వ్-, -న్త్-). జరుగు, సంభవించు, నికఴ్చి. సంఘటన, పరిస్థితి, సమయం, నికఴ్వు. సంఘటన, నికఴ్వు. ప్రస్తుత కాలం, నికత్తు (నికత్తి-). జరుగు, మార్గంచేయు, మాట్లాడు, చెప్పు.

నిగ్గారు అ.క్రి. 1. ఉత్కృష్టకాంతితో నిండు. పండి.చ. 1.47 ఫ. ; 2. సువాసన కలుగు. పండి.చ. 2.154 ఫ. నిగ్గించు స.క్రి. నెరవేర్చు, నిర్వహించు. చంద్రికా. 1.133. నిగ్గుతీయు స.క్రి. నిలదీసి అడుగు. నిగ్గులాడి వి. 1. నిగ్గుకల ఆడది, కాంతికల స్త్రీ. నరస. 5.177 ; 2. ఆడది. నిగ్గులుచల్లు అ.క్రి. కాంతితో వికసించు. తాళ్ల.సం. 1.3. నిగ్గులువాఱు అ.క్రి. ప్రకాశించు. జైమినిభా. 1.110. నిగ్గుల్‌దేఱు అ.క్రి. వన్నెలుతేరు. విప్ర. 1.70.

నిగ్రహించు స.క్రి. తిరస్కరించు, నిరసించు. భార. ఆది. 7.134.

సం. నిగ్రహ-. అడ్డగించటం, పట్టుకోవటం.

<సం. నిగ్రహ- + -ఇంచు[3].

నిఘా రూ.చూ. నిగా. వి. దీర్ఘదృష్టితో విచారణచేయటం. లక్ష.సం. 2.

నిఘావేసుక్కూర్చుండు అ.క్రి. 1. ఊరికే పనులు ఎగవేయు ; 2. కాపుండు.

నిఘామాను వి. పరిశీలకుడు, విచారణకర్త.

ఉ. నిగాహ్‌బాన్. పరిశీలన చేసేవాడు; పార. నిగాహ్‌బాన్. సంరక్షకుడు.

నింకిరి వి. ముఱికి.

నింకిటి రూ.చూ. నింకెఱ. అవ్య. క్రి.విశ. శీఘ్రంగా.

నింకె రూ.చూ. నింకెఱ. అవ్య. క్రి.విశ. శీఘ్రంగా.

నింకెఱ రూ. నింకిటి, నింకె. అవ్య. క్రి.విశ. శీఘ్రంగా.

నింగపురాళ్ళు వి.బ.వ. ఆముకు మొకంముందర ఉండే ఆరురాళ్ళు.

నింగమటికుమ్మరివాళ్ళు చూ. లింగమంతి కుమ్మరివాళ్ళు. వి.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ.

నింగి వి. 1. ఆకాశం. అంతరిక్షం. భార.ఆది. 6.294 ; 2. స్వర్గం.

నింగిచూలి వి. నభస్వంతుడు, గాలి. సాంబ.దేవ. 13. నింగితోరాయు విశ. ఎత్తైన. కాశీ. 3.103. నింగివడు రూ.చూ. నింగిపడు. అ.క్రి. సూర్యుడు మొ॥ అస్తమించు. భాస్క.రా.యు. 24. నింగిమిరి వి. సువర్చల. నింగిముట్టు అ.క్రి. 1. ఆకాశాన్ని తాకు, ఉన్నతమగు. కు.సం. 1.49 ; 2. మిక్కిలి అధికమగు. సీలా. 3.10. నింగిమ్రాను వి. స్వర్భూజం, కల్పవృక్షం. ఉ.హరిశ్చ. 4.99. నింగివడు రూ. నింగిపడు. అ.క్రి. సూర్యుడు మొ॥ వారు అస్తమించు. భార. ద్రోణ. 3 172. నింగిసిగ వి. వ్యోమకేశుడు. శివుడు. రామాభ్యు. 5.19. నింగులునాకు అ.క్రి. ఆకసమంటు.

నింగులునాకు చూ. నింగి.

నిచ్చ అవ్య. 1. సదా, ఎల్లప్పుడు. భార. ఆది. 6.200 ; 2. ప్రత్యహం, ప్రతిదినం. భార. శాంతి. 6.820.

సం. నిత్య- ఎల్లప్పుడు ; ప్రా. నిచ్చ-ణిచ్చ. శౌర్య తం. నిరంతరం ; అ.మా. నిచ్చ నిరంతరం ; పా. లిచ్చ ; అప. ణిచ్చ.

క. నిచ్చ, నిచ్చలుం ; తు. నిచ్చ ; మ. నిచ్చం.

<ప్రా. నిచ్చ-.

నిచ్చఅడ్డెండు వి. నిత్యం రెండు మానికలు. నిచ్చకల్యాణము వి. నిత్య కల్యాణం. తాళ్ల. సం. 12.127. నిచ్చకల్యాణి వి. నిత్యకల్యాణంగా వర్ధిల్లినది. తాళ్ల.సం. 10.24. నిచ్చచావు వి. నిత్యమరణం. భార. శల్య. 1.32. నిచ్చనిచ్చలు అవ్య. 1. ప్రతిదినం ; విజ్ఞా. వ్యవ. 66 ; 2. ఎల్లప్పుడు. శశా. పీఠి. 47. నిచ్చమల్లె వి. ఒకజాతి పూల మొక్క. ఆం.భా. 2.51. సం. నిత్యమల్లికా. నిత్యమల్లి ; ప్రా. నిచ్చమల్లిఆ. <ప్రా. నిచ్చమల్లిఆ. నిచ్చముప్పంద్రుదేశాంత్రులు వి.బ.వ. నిత్యం ముప్పైమంది పరదేశవాసులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 448. క్రీ.శ. 1287.

నిచ్చలు అవ్య. బ.వ. 1. సదా, ఎల్లప్పుడు. నిర్వ.రా. 7.145 ; 2. ప్రత్యహం, ప్రతిదినం. కాశీ. 6.46 ; క్రి.విశ. నిశ్చయంగా. హరి.ఉ. 7.132.

నిచ్చయము వి. నిశ్చయం, నిర్ణయం. భాస్క.రా.యు. 738.

సం. నిశ్చయ- ; దృఢవిచారం ; ప్రా. నిచ్ఛఇ, ణిచ్ఛయ, ణిచ్చియ ; జైమహా. నిచ్చియ. నిచ్చితం ; శౌ. ణిచ్చిద, ణిచ్ఛిద నిశ్చితం ; అ.మా. నిచ్ఛయ. మా. ణిచ్ఛఅ ; పా. నిచ్ఛయ. అప. ణిచ్ఛఅ, ణిచ్ఛఇ, ణిచ్చిఉ ;

క. నిచయ, నిచ్చయ ; తు. నిచ్చయ ; మ. నిచ్చయం, నిచ్ఛయం.

<ప్రా. ణిచ్ఛయ-.

నిచ్చలము[1] విశ. 1. నిష్కపటమైన. వరాహ. 10.83 ; 2. నిశ్చితమైన, యథార్థమైన. ప్రభా. 2.25 ; 3. నిర్మలమైన, నిర్దోషమైన. శశా. 2.18.

సం. నిశ్చల- చలరహితమయిన, నిష్కపటమయిన ; ప్రా. ణిచ్చల-

<ప్రా. ణిచ్చల-.

నిచ్చలము[2] విశ. 1. నిరంతరమైన, ఎడతెగని. రాఘవ. 2.5 ; 2. స్థిరమైన, చలింపని. సీమం. 1.26 ; వి. 1. ధైర్యం. సీలా. 1.42 ; 2. స్థైర్యం. అచ్చ.రా.బాల. 28.

సం. నిశ్చల- స్థిరమయిన, దృఢమయిన ; ప్రా. ణిచ్చల- ; జై.మహా. నిచ్చల ; శౌ. ణిచ్చల ; అ.మా. నిచ్చల ; మా. ణిశ్చల, ణ్పుచ్చ ; పా. నిచ్చల. చలనం లేనిది ; అప. ణిచ్చల. నిశ్చలం ;

క. నిచ్చల, నిచ్చళ ; తు. నిచ్చల ; మ. నిచ్చలం.

<ప్రా. ణిచ్చల-.

నిచ్చాటు వి. నిశ్శబ్దం.

నిచ్చున రూ.చూ. నిచ్చెన. వి. దాపుకఱ్ఱ. ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను అందుకోటానికి పనికివచ్చే పరికరం.

నిచ్చెన రూ. నిచ్చున, నిచ్చెని, నిర్చెన, నుచ్చిన, నుచ్చెన, మిచ్చెన, విచ్చెన. వి. 1. ఆటక మొ. వాటిని ఎక్కటానికి ఉపయోగపడే మెట్లు కలిగిన సాధనం. భార. శాంతి. 5.556 ; 2. దాపుకఱ్ఱ, ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను అందుకోటానికి ఉపయోగించే కఱ్ఱ.

సం. న్రిశ్శ్రేణి- న్రిశ్శ్రయణికా, న్రిశ్శ్రయణీ. నిచ్చెన ; ప్రా. నిస్సేణి, నిసేణి, నీసాణిఅ, నీసాణి ; అ.మా. నిస్సేణి, సేణి ; పా. నిస్సేణి ; అప. ణిసాణిఅ, ణిసాణి ;

క. నిచ్చేణిగె, నిచ్చణికె ; తు. ఎళిoచి, యెణ్చి, యేణి, లెంచి, నిత్తణిగె ; త. ఏణి ; మ. ఏణి. చేణి.

< ప్రా. నిస్సేణి.

నిచ్చెన దివ్వెపంజులు వి.బ.వ. నిచ్చెనవంటి దీపాల వరుసలు. భాసు. 3.9. నిచ్చెనపంజులు వి.బ.వ. నిచ్చెన లాగ ఉండే దీపాల వరుసలు. ప్రబంధ. 74. నిచ్చెనమెట్లు వి.బ.వ. సాదామెట్లు నలుపలకగా ఉండే అరుగుతో వంక లు, వంపులు లేకుండా నిటారుగా కట్టిన మెట్లు.

**నిచ్చెని** రూ.చూ. నిచ్చెన. వి. దాపుకర్ర, ఎత్తుగాఉన్న వస్తువులను, శాఖలను అందుకోటానికి పనికివచ్చే పరికరం.

**నిచ్చెరపోవు** అ.క్రి. నివ్వెరపోవు.

**నిజకత్తెర** వి. వైశాఖమాసంతో వచ్చే కార్తె.

**నిజపట్టు** చూ. నిజము.

**నిజబాయి** చూ. నిజము.

**నిజమరి** చూ. నిజము.

**నిజమరితనము** చూ. నిజము.

**నిజము** వి. **1**. యాథార్థ్యం. సత్యం. భార. ఆరణ్య. 1.362 ; **2**. రీతి, విధం. కు.సం. 8.165 ; **3**. సూనృతం, సత్యవచనం. హరి.ఉ. 3.239 ; విణ. **1**. స్పష్టమైన, అసందిగ్ధమైన. భార. ఉద్యో. 4.171 ; **2**. యథార్థమైన. సత్యమైన. భార. స్త్రీ. 1.164 ; క్రి.విణ. యథార్థంగా, సత్యంగా. భార. ద్రోణ. 1.130.

సం. నిజ-. స్వకీయం ;

క. నిజ ; తు. నిజి ; త. నిచమ్. నిశ్చయం ; మ. నిజమ్.

< సం. నిజ-. (అర్థవిపరి.).

నిజపట్టు స.క్రి. నిజంగా తలచు. భాగ. 10 ఉ. 263. నిజబాయి వి. కట్టుబడి చేసిన బావి. నిజమరి వి. సత్యవంతుడు, నిజంచెప్పేవాడు. భాగ. 9.571. < నిజము + -అరి. నిజమరితనము వి. **1**. పాతివ్రత్యం. భాగ. 9.61 ; **2**. సత్యశీలత. భాగ. 9.401. నిజముచేయు అ.క్రి. ప్రమాణం చేయు, ఒట్టుపెట్టుకొను. ప్రబా. 4.30. నిజముపట్టు స.క్రి. సత్యమని నమ్ము. కాశీ. 6.287.

**నిజవణి** రూ. నిజావళి. వి. సంగీతంలోని ఒక స్వరస్థాయి. బసవ. 71 పు. 10 పం.

సం. నిజవాణీ. సత్యవాక్కు.

< సం. నిజవాణీ.

**నిజాం** రూ.చూ. నిజాము. వి. నవాబు. మహమ్మదీయ ప్రభువు. రంగా.చ. 1.119.

నిజాంగౌడలు చూ. నిజాము. వి.బ.వ. ఒకరకమైన ధాన్యం.

**నిజాము** రూ. నిజాం, నిజాముఁడు. వి. ఒకానొక మహమ్మదీయ ప్రభువు. వసు. 1.46.

హిం. నిజామ్. హైదరాబాదు సుల్తాను ; మరా. నిజామ్. హైదరాబాదు సుల్తాను , ఉ. నిజామ్. వ్యవస్థ క్రమం ; పార. నిజామ్. పరిపాలించు, క్రమం.

< ఉ. నిజామ్.

**నిజాముఁడు** రూ.చూ. నిజాము. వి. మహమ్మదీయ ప్రభువు. వసు. 1.47.

**నిజాయతి** రూ.చూ. నిజాయతీ. విణ. **1**. న్యాయమైన ; **2**. సత్యమైన ; వి. రుజుత్వం.

**నిజాయతీ** రూ. నిజాయతి. వి. రుజుత్వం ; విణ. **1**. న్యాయమయిన, సత్యమైన ; వి. రుజుత్వం.

ఒ. నిజాయతొ. రుజుత్వం ; ఉ. పార. నజాహత్. నిష్కళంకత, జీవిత పవిత్రత.

< ఒ. నిజాయతొ.

**నిజారు** వి. లాగు, ప్యాంటు.

ఉ. నిజార్. పొడుగు డ్రాయరు, ప్యాంటు ;

త. నిచార్. ప్యాంటు.

< ఉ. నిజార్.

**నిజావళి** రూ.చూ. నిజవణి. వి. సంగీతంలోని స్వరస్థాయి భేదం. అష్టమ. క. 2.109 పు. 10 పం.

**నిజోగము** వి. నియోగం.

సం. నియోగ. ఆజ్ఞ ; ప్రా. ణిఓఅ. క్రమం.

< సం. నియోగ-.

**నిజోగి** వి. నియోగి.

సం. నియోగిన్. రాజు మొ. వారిచే ఒకపనిలో నియోగించబడే వాడు, బ్రాహ్మణులలో ఒక తెగ.

< సం. నియోగిన్.

**నించు** చూ. నిండు. రూ. నినుచు. స.క్రి. **1**. వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. భార.ఆది. 2.202 ; **2**. ఉంచు, పెట్టు. భార. సభా. 1.283 ; **3**. ఏయు, ప్రయోగించు. నిర్వ.రా. 6.135 ; **4**. తటాకాదుల్ని జలాదులచే పూర్ణంచేయు, నిండజేయు. భార.విరా. 2.353 ; **5**. నాటు, గుచ్చు. భార. విరా. 3.190 ; **6**. ఊర్పులు నిగిడించు. కేయూ. 3.274 ; **7**. వెలువరచు. శృం.నై. 2.87 ; **8**. పువ్వులు మొ॥ నవి చల్లు. హర. 3.74 ; **9**. వీక్షించు, చూచు. హర. 3.77 ; **10**. పొందు. హర. 4.88 ; **11**. కలిగించు. వసు. 5.120 ; **12**. ఉద్గమింపజేయు, చిప్పిలజేయు. పారి. 4.52 ; **13**. పాతించు. ఇందు. 2.60 ; **14**. పోయు. ఇందు. 6.53 ; **15**. చేర్చు, కలుపు. యయా. 4.40 ; **16**. నెరవేర్చు, సఫలం చేయు. శశా. 4.80 ; **17**. ఆవరించు, ముంచు. చంపూ రా. 4.64.

**నింజిలి** వి. **1**. మనోవ్యథ ; **2**. అనుమానంవల్ల వచ్చిన దిగులు.

**నిటక్కనిలుచు** రూ.చూ. నిట్టకనిలుచు. అ.క్రి. స్తంభంలాగ నిలువుగా నిలుచు. రాజవా. 3.65.

**నిటనిటనగు** అ.క్రి. మత్తు మొ॥ వాటివల్ల కళ్ళుతేలగిలు. పి.శకు. 4.54.

**నిటయెదురు(-వెదురు)** వి. ఎంపుడెదురు, పొడుగాటి వెదురు బొంగు.

**నిటాకు** విణ. నిలువు.

**నిట్ట** రూ. నిట్టు[1], నింట, నెట్ట[2]. విణ. **1**. నిడుపైన, పొడవు

కల, ఉన్నతమైన. కు.సం. 12.121 ; 2. నిక్కిన, నూటిగా పైకి లేచిన. భాగ. 6.468 ; 3. స్థిరమైన, చలింపని. పాండు. 2.9 ; వి. 1. జలపూరం, ప్రవాహం. భార.విరా. 2.130 ; 2. పొంగటం, పోటు. బసవ. 6.809 పం ; 3. స్థానం. గౌ.హరి. పూ. 2203 పం ; 4. స్తంభం. కవిక. 3.116 ; 5. నిక్కు, నిగడటం. పాండు. 3.139 ; 6. కొట్టం కట్టుబడిలో మధ్యవేసే నిలువుగుంజ ; 7. రాటి కట్టుబడిలో ఉన్న ఆకుల్ని బిగించే వెదురు గొట్టం.

క. నెట్టగె, నెట్టాఁన, నెట్టాఁనె, నెట్టన్న. తిన్నగా, నిక్కపొడుచు, సాధారణంగా, స్పష్టంగా. నెట్టి, నట్టి. అందం, సున్నితం ; తు. నెట్టగె. తిన్నన, సరిగా, తిన్నగా, నిడ్ప, నిద్ప. నిట్టు. తిన్నగా, నిక్కపొడుచు కొను ; త. నెట్టుమ్. నిలువుగా ఉండు, నట్టుమ్. నిక్కపొడుచుకోటం ; మ. నిట్ట్-, ఎన. నిలబడి ఉన్నస్థితి. నిలువుగాఉండు, కో. నెఱె.న్, నెఱె.ల్. తిన్నగా (కదలిక, వార్త మొ॥) ; పర్జి. టిట్టు. తిన్నగా.

**నిట్టకనిలుచు** రూ. నిటక్కనిలుచు, నిట్టనిలుచు. అ.క్రి. స్తంభంలాగ నిలబడు, పొడవుగా నిలుచు. రామాభ్యు. 8.132. **నిట్టకనిలువు** రూ.చూ. నిట్టకనిల్వు. వి. సరినిలువు. **నిట్టకనిల్వు** రూ. నిట్టకనిలువు. వి. సరి నిలువు. భాగ. 6.449. **నిట్టక్రమ్ము** రూ.చూ. నిట్టగ్రమ్ము. వి. 1. పైకుబుకు, ఉప్పొంగు ; 2. విజృంభించు. **నిట్టగ్రమ్ము** (-క్రమ్ము) రూ. నిట్టక్రమ్ము. అ.క్రి. 1. పైకుబుకు, ఉప్పొంగు. కు.సం. 11.27 ; 2. విజృంభించు. త. నట్టునల్. **నిట్టతొలఁకు** అ.క్రి. వెల్లివిరియు. భాగ. 8.717. **నిట్టదొట్టు**(-తొట్టు) అ.క్రి. వెల్లివిరియు, ఉప్పొంగు. పద్మ. 9.231. **నిట్టద్రోచు**(-త్రోచు) అ.క్రి. 1. ఉప్పొంగు, పైకుబుకు. కు.సం. 8.118 ; 2. ఉద్ధతమగు, పర్వు. వ్యాపించు. కావ్యా.చూ. 3.39. **నిట్టనిలుచు** రూ.చూ. నిట్టకనిలుచు. అ.క్రి. స్తంభంలాగ నిలువుగా నిలుచు, పొడవుగా నిలుచు. **నిట్టనిలుచుండు** అ.క్రి. స్తంభంలాగా నిలువుగా నిలుచుండు. కాశీ. 1.119. **నిట్టనిలువు** వి. 1. నిట్రం ; 2. నిలుచున్నది, నిలుచున్నట్లే ఉండటం. **నిట్టవంట** వి. నిష్కారణం. **నిట్టపాటలు** వి.బ.వ. అశాశ్వతాలు. పండి.చ.ద్వితీ. 5.418 ప. **నిట్టపొడుచు** రూ. నిట్టవొడుచు. అ.క్రి. 1. వ్యాపించు. నిర్వ.రా. 6.55 ; 2. విజృంభించు ; 3. రోమాంచితమగు ; 4. వెల్లివిరియు, ప్రవహించు. **నిట్టరాట** రూ. నిట్టరాటి, నిట్రాట. వి. 1. కంబం కొట్టం కట్టుబడిలో మధ్యవేసే నిలువుగుంజ ; 2. నిట్టాడి, ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్య స్తంభం. **నిట్టరాటి** రూ.చూ. నిట్టరాట. వి. ఒకరకం నిలువుగుంజ. **నిట్టరాడు** రూ. నిట్టాడి, నిట్టాడు, నిట్టెడు, నిట్టేడు, నిట్రాడి, నిట్రాడు, నిట్రేడు, నెట్రాడి. వి.ఔ. దూలం లేకుండా కట్టే ఇంటికి పాతే స్తంభం. గౌ.హరి.ఉ. 1675. **నిట్టలుద్రోచు**(-త్రోచు) అ.క్రి. ఉప్పొంగు, పైకెగయు. భార. విరా. 1.245. **నిట్టలుద్రోయు** (-త్రోయు) అ.క్రి. అతిశయించు. కేయూ. 4.5. **నిట్టలుపొడుచు** రూ. నిట్టలువొడుచు. అ.క్రి. 1. పైకుబుకు, ఉప్పొంగు. వరాహ. 10.62 ; 2. వెల్లివిరియు, ప్రవహించు ; 3. రోమాంచితమగు ; 4. విజృంభించు ; 5. వ్యాపించు. **నిట్టలువొడుచు** (-పొడుచు) రూ.చూ. నిట్టలు పొడుచు. అ.క్రి. 1. పైకుబుకు, ఉప్పొంగు ; 2. వెల్లివిరియు, ప్రవహించు ; 3. రోమాంచితమగు ; 4. విజృంభించు ; 5. వ్యాపించు. **నిట్టవొడుచు** (-పొడుచు) రూ.చూ. నిట్టపొడుచు. అ.క్రి. 1. వెల్లివిరియు, ప్రవహించు, ఉప్పొంగు. భోజ. 2.101 ; 2. వ్యాపించు. భాను. 3.18 ; 3. విజృంభించు ; 4. రోమాంచితమగు. **నిట్టాడి** రూ.చూ. నిట్టరాడు. వి. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. <నిట్ట+రాడి. **నిట్టాడిపీట** రూ. నిట్టేడుపీట. వి. నాగలివాసి, నిట్రాడు చివర నాటిన నాగలిదుంప రూపంలో చెక్కిన పీట. **నిట్టాడివాసం** వి. గుడిసె మధ్య వేసిన నిట్టాడి. **నిట్టాడు** రూ.చూ. నిట్టరాడు. వి. గుడిసెకు లేదా కొట్టానికి మధ్య పాతిన ఆధార స్తంభం. **నిట్టాయి** రూ.చూ. నిట్రాయి. వి. నిట్టాడి, ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్టారు** చూ. నిట్టాడి. వి. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్టెడు** రూ.చూ. నిట్టరాడు. వి. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్టేడు** రూ.చూ. నిట్టరాడు. వి. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్టేడుపీట** రూ.చూ. నిట్టాడిపీట. వి. నాగలివాసి, నిట్రాడు చివర నాటిన నాగలిదుంప రూపంలో చెక్కిన పీట. **నిట్టేల** వి. నిట్టాడి, ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్రాట** రూ.చూ. నిట్టరాట. వి. కంబం, కొట్టం కట్టుబడిలో మధ్యవేసే నిలువ గుంజ. **నిట్రాడి** రూ.చూ. నిట్టరాడు. వి. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. **నిట్రాడు** రూ.చూ. నిట్టరాడు. వి. 1. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం. వేంక.పంచ. 1.254 ; 2. గుడిసెకు మధ్య నాటిన ఆధారస్తంభం. **నిట్రాయి** రూ. నిట్టాయి. వి. 1. వసారా దించటానికి నడుమ నిలిపిన పెద్దకంబం ; 2. పశువులు రుద్దుకోటానికి పాతిన రాయి ; 3. ఇంటి మధ్య పాతే పొడుగాటి కొయ్యస్తంభం ; 4. పొడుగురాయి. **నిట్రేడు** రూ.చూ. నిట్టరాడు. వి. ఇంటి మధ్య నాటే పొడుగాటి కొయ్యస్తంభం.

**నిట్టలము** చూ. ఇట్టలము. విశ. అధికమైన. నిర్వ.రా. 6.144 ; వి. నిలకడ. ఆం.భా. 3.29.

**నిట్టాడి** చూ. నిట్ట.

**నిట్టాడిపీట** చూ. నిట్ట.

**నిట్టాడివాసం** చూ. నిట్ట.

**నిట్టాడు** చూ. నిట్ట.

**నిట్టాయి** చూ. నిట్ట.

**నిట్టారు** చూ. నిట్ట.

**నిట్టు**[1] రూ.చూ. నిట్ట. వి. 1. తాడవ, పొయ్యికి పొయ్యికి పైభాగంలో మధ్యనుండే పల్చని మట్టిదిమ్మ ; 2. నియతి.

**నిట్టు**[2] రూ. నిట్రు. వి. ఉపవాసం, పస్తు. మార్క. 4.41 ; విశ. శుష్కమైన.

**నిట్టుపవాసము** రూ. నిట్టుపాసము, నిట్రుపాసము. వి. శుష్కోపవాసం. బసవ. 4 ప. 900 పం. సం. ఉపవాస-.

పస్తు. <నిట్టు$^{2}$ + సం. ఉపవాస-. నిట్టుపాసము రూ.చూ. నిట్టుపవాసము. వి. శుష్కోపవాసం. కాశీ. 7.179.

నిట్టుక్కి వి. ఆడపిల్లలాడే ఒక ఆట. హంస. 5.155.

నిట్టూరుచు చూ. నిడు.

నిట్టూరుపు చూ. నిడు.

నిట్టూర్చు చూ. నిడు.

నిట్టూర్పు చూ. నిడు.

నిట్టూర్పులిచ్చు చూ. నిడు.

నిట్టెడు చూ. నిట్ట.

నిట్టెము చూ. నిడు. వి. వెన్నెముక, పొడవుగా ఉండే ఎముక. బసవ. 6.888 పం.

క. నిట్టెల్వు, నెట్టెలువు.

నిట్టేడు చూ. నిట్ట.

నిట్టేడుపీట చూ. నిట్ట.

నిట్టేల చూ. నిట్ట.

నిట్ర రూ.చూ. నిట్రము. వి. నిలువు; విణ. సూటిగా మీదికుండే.

నిట్రపాటు వి. నిలవటం, నిక్కటం. చంద్రాంగ. 2.84. నిట్రపాడు అ.క్రి. నిక్కనిలుచు. నిట్రపాడుచు అ.క్రి. పొడవగు, నిక్కు. ప్రబంధ. 788. నిట్రించు అ.క్రి. అవయవాలు నిక్కపెట్టు, నిక్కించు. బసవ. 5 పు. 474 పం. <నిట్ర + -ఇంచు$^{3}$.

నిట్రము రూ. నిట్ర. వి. 1. గోడ పెట్టినట్లు చక్కగా పైకి లేచినది; 2. నిట్రాయి; 3. నిలువు.

నిట్రాట చూ. నిట్ట.

నిట్రాడి చూ. నిట్ట.

నిట్రాడు చూ. నిట్ట.

నిట్రాయి చూ. నిట్ట.

నిట్రించు చూ. నిట్ర.

నిట్రిల్లు చూ. నిట్రు.

నిట్రు రూ.చూ. నిట్టు$^{2}$. వి. ఉపవాసం. ఆము. 4.50; విణ. శుష్కమైన.

నిట్రిల్లు అ.క్రి. ఉపవాస ముండు. నిట్రుపాసము రూ.చూ. నిట్టుపవాసము. వి. శుష్కోపవాసం. భీమ. 2.100.

నిట్రేడు చూ. నిట్ట.

నిడప చూ. నిడు. వి. బరినంద, నంద తయారీలో అడుగు నంద పైభాగంలో 2 అడుగుల ఎత్తుతో తయారు చేసినట్టి నంద మధ్యభాగం.

నిడపకమ్మి వి. 1. నలువ, ఆకులరాట్నం, ఇరుసు బిగించే నిలువుకొయ్య; 2. తొక్కుడుపట్టె, రాట్నం అడ్డ పట్టె; 3. ఆసుజంగ, ఆసుపీటలు బిగించిన పొడుగు పట్టె; 4. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె; 5. ద్వారబంధపు నిలువు పట్టె. నిడపచెక్క వి. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె.

నిడి చూ. నిడు. విణ. దీర్ఘమైన. వేంక. పంచ. 3.106.

నిడికుడక వి. భక్ష్యం. నిడిగాలి వి. విడవకుండా కొట్టే పడమట గాలి. నిడిగూటం వి. మిడిగూటం, నేతబయలులో చివర పాతిన కొయ్య. నిడిగొట్కం రూ.చూ. నిడిగొట్టకం. వి. మొదటిసారి నిలువుదాళ్ళు దున్నటం. నిడిగొట్టకం రూ. నిడిగొట్కం. వి. మొదటిసారి నిలువుదాళ్ళు దున్నటం. నిడిదండె వి. జంత్రందండె, అచ్చుకట్టే జంత్రానికి నిలువు పల్లలు బిగించిన కిందిపీట. నిడిదండెకొయ్య వి. అచ్చుకట్టే జంత్రం నిలువు కమ్మికి బిగించిన పల్ల. నిడిపట్టె రూ.చూ. నిడుపుపట్టె. వి. 1. ఆసుజంగ, ఆసుపీటలు బిగించిన పొడుగుపట్టె; 2. నిలువుకమ్మి, అచ్చుకట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె; 3. పారు, బండి చట్రంలో నిలువుపట్టె. నిడిపీట వి. 1. తొక్కుడుపట్టె, రాట్నం అడ్డ పట్టె; 2. తొక్కుడుపీట, దబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; 3 ఆసుజంగ, ఆసుపీటలు బిగించిన పొడుగు పట్టె. నిడిపొట్ల రూ. నిడిపొట్లు. వి. ఒకరకం పొడుగాటి పొట్లకాయ. నిడిపొట్లు రూ.చూ. నిడిపొట్ల. వి. ఒకరకం పొడుగాటి పొట్లకాయ. నిడిబద్ద రూ. నిడుపుబద్ద. వి. 1. నిలువుబద్ద, రాటి ఆకులను కలిపే నిలుపుపల్ల; 2. పారు, బండి చట్రంలో నిలువుపట్టె. నిడిబల్ల రూ. నిడుపుబల్ల, నిడుబల్ల, నిడుబ్బల్ల, నిడుపుబల్ల. వి. 1. తొక్కుడుపట్టె, పత్తి పట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చిన పట్టె; 2. నిలువు కమ్మి, అచ్చుకట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె; 3. నిడుపబల్ల, రాట్నం అడ్డపట్టె; 4. ఆసుజంగం, ఆసుపీటలు బిగించిన పొడుగు పట్టె. నిడిరేవు రూ. నిడ్రేవు, నిర్రేవు. వి. వీథిరేవు, ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్ద రేవు. నిడివ్రేలు వి. నడిమివ్రేలు.

నిడివి చూ. నిడు. రూ.చూ. నిడుపు. వి. 1. పొడవు, దైర్ఘ్యం. కేయూ. 3.12; 2. గుర్రపు పరుగు, అశ్వగతి భేదం. ప్రబంధ. 185; విణ. దీర్ఘమయిన.

నిడివిబిళ్ల వి. గిరిడి, పన్నె కట్టేటప్పుడు, దండెలమధ్య బిగించిన పల్లలు ఒకే మట్టంలో ఉండేట్టు కొలత చూసుకోటానికి దండెలమధ్య ఎక్కించిన కొయ్యముక్క.

నిడు విణ. దీర్ఘమైన, పొడవైన. కు.సం. 9.147.

క. నిడు, నిట్టు. పొడుగుచేసే స్థితి, గొప్పతనం, పెద్దతనం, నిడిదు. పొడుగు చేసినట్టి; తు. నిడి. పొడుగు, నిళు. పొడవు, ఎత్తు, నిడుప్పు. పొడవు, నిట్టు-, ఉసురు. నిట్టూర్పు, నెడి. పొడవు, నెటి (-ప్పు-త్-). ఆలస్యం చేయు. త. నెటిల్. పొడవు, దీర్ఘం, నెటుకుక్క. పొడవు (గోడలాగ), నెటుక. పొడవుగా, తెరిపిలేకుండా, నెటుకు (నెటుకి-). పెంచు, పొడవుచేయు, ఆలస్యంచేయు, నెటుప్పమ్. పొడవు, ఎత్తు, నెటుమన్. పొడవుగా ఉన్నది, నెటుమి. పొడవైన స్త్రీ. పొడవైన చెట్టు, నెట్టు-, నెటుమై. చాలాపొడవు, చాలా ఎత్తు, నెట్టుమ్. ఎత్తు, పొడవు, నెట్టాఞ్కు. పొడవుగా, నెట్టాయమ్. సాగదీయబడిన, నెట్టు. పొడవు, దూరం, నెట్టె. పొడవు; మ. నెటుఞ్కన్. పొడవు. నెటుప్పు, నెటుప్పమ్. పొడవు, ఎత్తు, నెటుమ్పు. గర్వం, నెటుమ్పన్. తలబిరుసు, నెటుమన్. పొడవైన మనిషి, నెటుమ, నెటుమానమ్. పొడవు, నెట్టున్.

పొడవు మనిషి, నెట్టాయమ్. నదిలో తిన్నని భాగం, సాగదీసేది, నిటు. పొడుగు, తిన్నన, నిటియోన్. పొడవు మనిషి, నిటుప్పమ్. పొడవు, నిట్టల్, నిట్టజ్-కాల్. మోచిప్ప; కో. నెర్నెరన్. వెనకకు చారబడు; తొ. నొడ్ (నొడ్య్-). పొడుగ్గాఉండు, నొడ్స్- (నొడ్స్య్-). పొడవగు, నొడ్క్- (నొశ్క్య్-). పొడవుచేయు, పెరగనిచ్చు.

<మూ.ద్రా. *నిట్-/*నెట్-.

నిట్టూరుచు రూ. నిట్టూర్చు. అ.క్రి. నిట్టూర్పు విడుచు. క. నిట్టిసు. నిట్టూర్చు. <*నిట్ + ఊరుచు. నిట్టూరుపు రూ.చూ. నిట్టూర్పు. వి. 1. దీర్ఘ నిశ్వాసం. భార. విరా. 2.236; 2. నిశ్వాసం. దశా. 1.269. నిట్టూర్చు రూ.చూ. నిట్టూరుచు. అ.క్రి. నిట్టూర్పు విడుచు. నిట్టూర్పు రూ. నిట్టూరుపు, నిడూర్పు. వి. 1. దీర్ఘ నిశ్వాసం. భార.ఆరణ్య. 2.133; 2. నిశ్వాసం. కు.సం. 5 70. త. నెట్టియిర్ప. నిశ్వాసం. నిట్టూర్పులిచ్చు అ.క్రి. నిశ్వసించు, నిశ్వాసం విడుచు. దశా. 2.360. <*నిట్ + ఊర్పు + -లు + ఇచ్చు. నిడు(గేలు(-కేలు) వి. దీర్ఘ హస్తం, పొడవైనచేయి. భార. ఉద్యో. 3.353. నిడుచట్ట వి. కుప్పసం, అరచట్ట, అంగరఖా, పొడుగు చొక్కా. నిడుచను అ.క్రి. సాగు. భార. ఆది. 7.176. నిడుజడి వి. విడవకుండా కురిసే వాన. హరి. పూ. 7.169. నిడుదాటపోనిచ్చు స.క్రి. ఒకరుచెప్పిన ప్రకారం అంగీకరించి నడచుకొనజేయు. నిడుదాడు(-త్రాడు) రూ.చూ. నిడు(ద్రాడు. వి. కపిలబాన తొండం చివరన కట్టే సన్నపాటి పొడుగు మోకు. నిడు(ద్రాడు(-త్రాడు) రూ. నిడుదాడు. వి.ఔ. పొడుగుతాడు. భార. ఆశ్ర. 1.72. నిడుపట్టె వి. తొక్కుడుపట్టె, రాట్నం అడ్డపట్టె. నిడుబల్ల రూ.చూ. నిడిబల్ల. వి. 1. తొక్కుడుపట్టె, పత్తిపట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చిన పట్టె; 2. నిలుపుకమ్మి, అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగు పట్టె; 3. నిడుపుబల్ల, రాట్నం అడ్డపట్టె; 4. అనుజంగం, అనుపీటలు బిగించిన పొడుగుపట్టె. నిడుబాట వి. పెద్దతోవ. భార. కర్ణ. 2.63. నిడుముసు(గు వి. నిండు ముసుగు. దశా. 4.45. నిడుముస్తె వి. తుంగ. నిడువాలిక విశ. మిక్కిలి దీర్ఘమైన. పారి. 1.99. నిడువాలు విశ. పొడవైన. నిడువెంద్రుక వి నిక్కపొడిచిన వెంట్రుక. నిడువెంద్రుకపెట్టు రూ.చూ. నిడువెంద్రుక వెట్టు. అ.క్రి. భయాదులచే ఒడలు రోమాంచితమగు. నిడువెంద్రుకవెట్టు(-పెట్టు) రూ. నిడువెంద్రుకపెట్టు. అ.క్రి. పులకరించు. భార. భీష్మ. 1.181. నిడువేంద్రము వి. అత్యుష్ణత, మిక్కిలి వేడిమి. ఉ. హరి. 6.78. నిడూర్పు రూ.చూ. నిటూర్పు. వి. దీర్ఘనిశ్వాసం. పె. శకు. 3.57, హంస. 4.165. <నిడు + ఊర్పు.

నిడుచు స.క్రి. గింజలు తీసి పత్తిని వేరుచేయు.

నిడుద చూ. నిడు. విశ. నిడుపైన, దీర్ఘమైన. భార. ఆది. 7.99; వి. దీర్ఘం, ద్విమాత్రస్వరానికి సంజ్ఞ. కవిజనా. 1.13.

నిడుదగనుపు (-కనుపు) వి. పల్లకీ బొంగుకు ఉండే దోషం, కనుపులు ఎడంగా ఉండటం. ప్రబంధ. 605. నిడుదనిదుర వి. దీర్ఘనిద్ర, మరణం. భార. ఆశ్ర. 2.162. నిడుదపయనము వి. దీర్ఘప్రయాణం. ఉ. రా. 7.68. నిడుదవెన్ను వి. సర్పం, దీర్ఘపృష్ఠం. అచ్చ. రా. సుందర. 57.

నిడుపకమ్ములు చూ. నిడుపు.

నిడుప(డు చూ. నిడుపు.

నిడుప(డుపాన్పుతే(డు చూ. నిడుపు.

నిడుపవంగ చూ. నిడుపు.

నిడుపు చూ. నిడు. రూ. నిడివి, నిడువు. వి. 1. ఆయామం. దైర్ఘ్యం, నిడివి. భార. సభా. 1.62; 2. నిలువు. భార. సభా. 1.75; విశ. పొడవైన, దీర్ఘమైన. శృం. నై. 7.155; క్రి. విశ. నిలువుగా. మను. 2.7.

నిడుపకమ్ములు వి.బ.వ. గడపకు రెండుపక్కలాఉండే నిలువుకమ్ములు. నిడుప(డు వి. ధైర్యం కలిగినపాము. రాజవా. 3.11. త. నెటుమన్. పాము, పొడవైనది. నిడుప(డుపాన్పుతే(డు వి. విష్ణువు. నిడుపవంగ వి. కోడిగుడ్డుమొక్క (Solanum Melowgena). నిడుపుకాసె వి. అంగదట్టం. నిడుపునంద వి. బరినంద, నందమధ్య భాగంలో తిన్నగా మూడు తొలికలతో కూడిన భాగం నిడుపుపట్టె రూ. నిడిప్పట్టె, వి. తొక్కుడుపీట, డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె. నిడుపుబల్ల రూ.చూ. నిడిబల్ల. వి. 1. తొక్కుడుపట్టె, రాట్నం అడ్డపట్టె; 2. నిలుపుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. నిడుపులేకచిత్రమ్ము వ్రాయ(గల విశ. అసాధ్యమైనపనులు చేయగల. కు. సం. 8.138. నిడుప్పట్టె రూ. చూ. నిడుపుపట్టె. వి. తొక్కుడుపీట, డబ్బారాట్నం పీటకు బిగించినపొడుగు పట్టె. నిడుబ్బల్ల రూ.చూ. నిడిబల్ల. వి. 1. తొక్కుడుపట్టె. రాట్నం అడ్డపట్టె; 2. నిలువుపట్టె. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె.

నిడుప్పట్టె చూ. నిడుపు

నిడుబ్బల్ల చూ. నిడుపు.

నిడువంచు చూ. నిడువు.

నిడువు రూ.చూ. నిడుపు. వి. 1. దైర్ఘ్యం, నిడివి; 2. నిలువు. విశ. పొడవయిన.

నిడువంచు వి. ఎండుల్లొట్టికి పెట్టిన నిడువుగా ఉండే అంచు. <నిడువు + అంచు[3]. నిడువుబద్ద రూ.చూ. నిడిబద్ద. వి. నిలువుపట్టె. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. నిడువుబల్ల రూ.చూ. నిడిబల్ల. వి. 1. తొక్కుడుపట్టె, పత్తిపట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చినపట్టె; 2. నిలువుకమ్మి, అచ్చుకట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె; 3. నిడుపుబల్ల, రాట్నం అడ్డపట్టె; 4. అనుజంగం, అనుపీటలు బిగించిన పొడుగుపట్టె. నిడువులు వి.బ.వ. తూము, నీళ్ళుపోటానికి ఉపయోగించే పొడుగుపాటి గుండ్రని మట్టిపైపులు.

నిడుసు వి. చదవటంలో దీర్ఘాలతో కూడిన పెద్దధ్వని. సకలనీతి. 307.

**నిడూర్పు** చూ. నిడు.
**నిడ్డ** వి. దెబ్బ.
**నిడ్రేవు** రూ.చూ. నిడిరేవు. వి. వీథిరేవు, ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.
**నింట** రూ.చూ. నిట్ట. వి. 1. జలపూరం, వెల్లువ. హరి. ఉ. 6.27 ; 2. పొంగు, అతిశయం. నవనాథ 2.81పు. 27పం.
**నిండఁబడు** చూ. నిండు.
**నిండరివేడి** చూ. నిండు.
**నిండవిరీడి** చూ. నిండు.
**నిండా** చూ. నిండు.
**నిండాగు** చూ. నిండు.
**నిండార్చి** చూ. నిండు.
**నిండించు** చూ. నిండు.
**నిండినయిల్లు** చూ. నిండు.
**నిండినింపులువాఱు** చూ. నిండు.
**నిండినిల్లు** చూ. నిండు.
**నిండు** విణ. పూర్ణమైన. భార. ఆది. 1.101; అ.క్రి. 1. పూర్ణమగు, సమాప్తమగు. భార. ఆది. 2.37; 2. వ్యాపించు, ప్రసరించు. భార. సభా. 1.203; 3. సర్వాంగ సంపూర్ణమగు. కు. సం. 6.82; 4. నెరవేరు, సిద్ధించు, సఫలమగు. రం. రా. ఉ. 5పు. 23పం. ; 5. అతిశయించు, అధికమగు. హరి. ఉ. 9.10; 6. ఆయువు, మొ॥ నవి ముగియు. కాశీ. 4.40; 7. జలాదులచే పూర్ణమగు. విక్ర. 1.90; 8. సంతోషించు. వి. పూర్ణత; క్రి. విణ. ద్రు. అధికంగా, పూర్ణంగా. భార. మౌసల. 83.

క. నెఱె (నెఱెద్-నెఱద్-). నిండు, పూర్తిగా, తయారగు, పక్వానికివచ్చు, తెలిసికొను; కొడ. నెర-నెరప్-, (నెరత్-). నింపు. నెరె. ఏదోఒకదానితో నిండి ఉండు తు. నెరియుని, నెరెవుని. నిండు; త. నిఱై (-వ్-, -న్త్-). నిండు, సంతృప్తిపొందు, (-ప్ప్-, -త్త్-). నింపు; మ. నిఱ. నిండుదనం; కో. నెర్వ్- (నెర్ధ్-). యుక్తవయసువచ్చు, ఫలానికివచ్చు; తొ. నెఙ్ (నెఙ్ధ్-). నిండు, యుక్తవయసువచ్చు (స్త్రీ). (గడ్డం) పెరగటం మొదలుపెట్టు; గోం. నింద్. నిండు, నిహ్తా. నించు, నీహ్-(నీహ్త్-). నిండు; కొం. నిన్జ్-, నిన్-. నిండు, పొంగి ప్రవహించు (నది); కుఇ. నెన్జ. నిండు, నెష (నెహ్త్-). నించు, నెస్ప. నించు, నెప్ప (నెప్త్-). ముగించు; కువి. నెన్జ్. నిండు, పూర్ణమగు; కొలా. నిండ్. నిండు; నా. నిన్. నిండు, నిప్ప్. నింపు; కురు. నీన్ధ్. నిండు, నిన్ధ్. నిండు; మాల్తొ. నింద్. నిండు, నింద్గ్ర్. నిండు.

<మూ.ద్రా. *నిన్-.

**నిండఁబడు** అ.క్రి. 1. వ్యాపించు. భాస్క.రా.యు. 284; 2. నిండు. <నిండు+-అ౯+పడు. **నిండరివేడి** రూ. నిండవిరీడి. వి. జములరివేణి, పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణికుండలు. <నిండు+అరివేడి. **నిండవిరీడి** రూ.చూ. నిండరివేడి. వి. జములరివేణి, పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణికుండలు. <నిండు+అవిరీడి. **నిండా** క్రి విణ. ఎక్కువగా, కానా, పూర్తిగా. <నిండు+ఆ. **నిండారు** అ.క్రి. 1. అతిశయించు, అధికమగు. భార. విరా. 2.359; 2. నిండు, పూర్ణమగు. మార్క. 3.91; 3. నిండు, వ్యాపించు. ఆము. 4.53; 4. లోతుకలదగు, గంభీరమగు. పాండు. 4.178; 5. కడచు, అతిక్రమించు. అచ్చ.రా.బాల. 83. < నిండు+ఆరు[1]. **నిండార్చి** వి. గుండ్రంగా ఉండే ఆర్చి. <నిండు+ఆర్చి. **నిండించు** స.క్రి. 1. నెరవేర్చు, సిద్ధింపచేయు. భార.ఆరణ్య. 7.361; 2. వ్యాపింపజేయు. ఉ.హరి. 2.50. <నిండు+-ఇంచు[3]. **నిండినయిల్లు (-ఇల్లు)** రూ. నిండినిల్లు. వి. నిండుగాఉన్న ఇల్లు. పండి. చ. ప్రథమ. 2.4.94. **నిండినింపులువాఱు (-పాఱు)** అ క్రి. పొంగి పొరలు. రాధా. 14.103. **నిండినిల్లు** రూ.చూ. నిండినఇల్లు. వి. బిడ్డపాపలున్న ఇల్లు, జనమున్న ఇల్లు. హంస. 4.237. <నిండిన+ఇల్లు. **నిండుకట్టు** వి. రాట్నానికి చుట్టిన ఒక చిలప పట్టుదారం. **నిండుకట్టువేయు** అ.క్రి. రాట్నానికి చుట్టిన ఒక చిలప పట్టుదారంవేయు. **నిండుకడవరీతినుండు** అ.క్రి. స్థిమితంగా ఉండు. కళా. 4.135. **నిండుకుండ** వి. గంభీరుడు. **నిండుకొను** అ.క్రి. 1. వ్యాపించు. భీమ. 2.101; 2. తనివిచెందు. శాశ్వ.సం. 11.236; 3. సంతోషించు. ఉ.రా. 1.138; 4. అతిశయించు. శేష. 2; 5. అయిపోవు, వ్యయమగు, ఖాళీఅగు. **నిండుకొలువగు** అ.క్రి. సభతీరు. శుక. 2.43. < నిండు+కొలువు+అగు. **నిండుగడ్డి** వి. మేలుగడ్డి, కళ్ళంలో ఇంకా తొక్కించని గడ్డి. **నిండుగార** వి. గిలాబా, గోడమీద సున్నం మొదలైనవాటి పూత. **నిండుజములు** వి.బ.వ. నేత నేసేటప్పుడు, పన్నెగూటిలోకి వచ్చిన పట్టు పడుగులో పై రెండు పోగులు, కింది రెండు పోగులు. **నిండుజవ్వనము** వి. నెలజవ్వనం, ఆం.భా. 2.118. **నిండుజున్నం (-సున్నం)** వి. గానుగ సున్నం, గానుగ తిప్పి జిగురు మెత్తదనం కలిగించిన సున్నం. **నిండుదొర** వి. ధీరుడు. రామాభ్యు. 6.237. **నిండుపలక** వి. దోనెనుంచి పన్నెవరకూ నేసిన నేత. **నిండుపలకవేయు** స.క్రి. దోనెనుంచి పన్నెవరకూ నేయు. **నిండుపొట్ట** వి. ఈనుపొట్ట, ఆకులు విశబడి ఎన్నులు పైకి కనబడేముందున్న దశ. **నిండుపొయ్యి** వి. పొంతపొయ్యి, రెండు గడ్డలేపెట్టి చేసినట్టి మట్టిపొయ్యి. **నిండుబట్టలు పెట్టుట** వి.బ.వ. లాంఛనప్రాయంగా పూర్తి బట్టలు పెట్టటం. **నిండుబారి** వి. దిగుబారి, ఎద్దులు మోట లాగుతూ దిగువకు నడిచే ఏటవాలు దారి. **నిండుబుగిడి** వి. పూర్ణబుగిడి, పూర్తిగా మొగ్గ మాదిరిగా నేసిన డిజైను. **నిండుమనము** వి. నిండైన మనస్సు, నెమ్మనం. భార.ఆది. 1.100. **నిండుమనిషి** వి. గర్భిణి. **నిండుమాట** వి. 1. సంభాషణం; 2. భావయుక్తమైన పలుకు. **నిండువన్నెలు** వి.బ.వ. వస్త్రవిశేషం. ప్రబంధ. 272. **నిండువెన్నెల** వి. పండువెన్నెల. ఉ.హరి. 2.161. **నిండుసున్న** వి. పూజ్యం.
**నిత్తెపెండ్లికొడుకు** చూ. నిత్తెము.
**నిత్తెమల్లె** చూ. నిత్తెము.

**నిత్తెము** విణ. **1**. శాశ్వతమైన. దశా. 10.55 ; **2**. నిరంతరం.
సం. నిత్య-, ఎడతెగని, ఎల్లప్పుడు ; ప్రా. ణితియ, ణిచ్చ-. నిరంతరం.
<సం. నిత్య- + -ము.
**నిత్తెపెండ్లికొడుకు** వి. నిత్యశోభనుడు. రాధా. 3.15. **నిత్తెమల్లె** వి. ఒకరకం పూలచెట్టు, మల్లికా విశేషం. భల్లా. 3. సం. నిత్యమల్లికా. చూ. నిచ్చమల్లె (Hibiscus Hirtey).

**నిత్యకొత్తలు** విణ.బ.వ. నిత్యనూతనాలు. కాళ్ల.సం. 8.104.
సం నిత్య-. ఎడతెగని, శాశ్వతమైన.
<సం. నిత్య- + క్రొత్త + -లు. (మిశ్రన.).

**నిత్యతుమ్మి** వి. తుముకిచెట్టు, పచ్చని పూలూ ఎర్రని పళ్ళూ కాసే ఒకరకం చెట్టు (Diospyros Embryopleris).

**నిత్యపడి** రూ. నిత్యయపడి. వి. దివసపడి, నిత్యం నియమంగా చేయవలసింది. బసవ. **4**.128 పు. 728 పం.
సం. నిత్య-. శాశ్వతమైన, ఎడతెగని.
<సం. నిత్య- + పడి. (మిశ్రన.).

**నిత్యమల్లె** వి. ఎరుపు తెలుపు పూలు పూసే లత.
సం. నిత్యమల్లికా. సుగంధ పుష్ప విలసిత లతా విశేషం.
<సం. నిత్యమల్లికా.

**నిత్యమాచెల్లపాటిమానెడుబియ్యం** వి. మాచర్ల-గ్రామంలో నిర్ణీతమైన కొలమానం అయిన మానికతో రోజూ కొలిచే బియ్యం. ద.హిం.శా.సంపు. 10 శా.సం. 505. క్రీ.శ. 1313.
సం. నిత్య-. ఎడతెగని, శాశ్వతమైన.
<సం. నిత్య- + మాచెల్లపాటి మానెడు బియ్యం.

**నిత్యమానెండునెయి** వి. రోజూ మానెడు నేయి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 976.
సం. నిత్య-. శాశ్వతమయిన, ఎడతెగని.
<సం. నిత్య- + మానెండునెయి. (మిశ్రన.).

**నిత్యయపడి** రూ.చూ. నిత్యపడి. వి. నిత్యపడి. నె.శా. కందుకూరు. 49.

**నిత్యశావ** రూ. నిత్యశేవ. వి. ఎల్లప్పుడూ చేసే సేవ. నె.శా. కందుకూరు 49.
సం. నిత్యసేవా. నిరంతరమయిన సేవ.
<సం. నిత్యసేవా.

**నిత్యశేవ** రూ.చూ. నిత్యశావ. వి. చిరకాలం చేసే ఆరాధన H.A.S. 19.56. క్రీ.శ. 1755.

**నిత్యసానియంబాటితవ్వెండు** వి. కొలమాన విశేషం. ద.హిం. శా.సం. 10. శా.సం. 79.
సం. నిత్య-. శాశ్వతమయిన, ఎడతెగని.

**నిత్యామృతము** వి. పాలు, నెయి, అన్నం మొ॥ నిత్యోపహారం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1239.
సం. నిత్య-. ఎడతెగని, శాశ్వతమయిన, అమృత-. సుధ.
<సం. నిత్యామృత- (అర్థవిపరి.).

**నిదరాము** వి. సాయంత్రం ప్రారంభించి తెల్లవార్లూ నిదానంగా కాల్చిన ఆము.
సం. నితరామ్, ఎల్లప్పుడు, నిత్యం.
<సం. నితరామ్.

**నిదానము** వి. **1**. ఆత్రపడక విచారించటం; **2** చక్కగా విచారించటం; **3**. మట్టం అంతా ఒకే ఎత్తులో ఉండటం; విణ. ఎగుడు దిగుడులేని, సమస్థితిలో ఉన్న.
సం. నిర్ధారణ-. నిశ్చయం, నిష్కర్షించటం, నిధాన-. ఉంచటం, ఆశ్రయం, ఆధారం, పదిలపరచటం ;
క. నిదానవ్ర.
<సం. నిధాన-.
**నిదానించు** అ.క్రి. చక్కగా విచారించు, ఆత్రపడక విచారించు. నవనాథ. 5.186 పు. 1 పం.
క. నిదానిసు.

**నిదానస్థుడు** వి. నిబ్బరమైనవాడు.
సం. నిధానస్థ-. ఆశ్రయం కలవాడు, నిధియందున్నవాడు.
<సం. నిధానస్థ-.

**నిదానించు** చూ. నిదానము.

**నిది** వి. మదనం, తూర్పారపొయ్యకముందు పొల్లు, ధాన్యం కలిసిఉన్న కుప్ప.
సం. నిధి-. ఆధారం, పాతర, బొక్కసం.
<సం. నిధి-.

**నిదిగము** వి. అధికారం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 644. క్రీ.శ. 1060.
సం. నిధిగ-. నిధినిపొందిన.

**నిదిరించు** చూ. నిదుర.

**నిదుర** రూ. నిద్దుర. వి. నిద్ర. భార. విరా. 1.135.
సం. నిద్రా. కూర్కు ; ప్రా. ణిద్దా ; దే.పా. నిజ్ఝా. శౌ. ణిద్దా; అమా. నిద్దా; పా. నిద్దా; అప. ణిద్ద, ణిద్దా, ణింద ;
క. నిద్ద; తు. నిదె.
<సం. నిద్రా.
**నిదిరించు** రూ.చూ. నిదురించు. అ.క్రి. నిద్రపోవు. అష్టమ.క. 1.22పు. 15 పం. <నిదుర + -ఇంచు[3]. **నిదురకునియ్యకొను(-ఇయ్యకొను)** అ.క్రి. సంగమానికి సమ్మతించు. సిం.ద్వా. **4**.236. **నిదురకు(బడు(-పడు)** అ.క్రి. నిద్రించటానికి మొదలుపెట్టు. కకుత్థ. **4**.30. **నిదురక్రమ్ముకొనివచ్చు** అ. క్రి. నిద్ర ముంచుకొనివచ్చు. శుక. 1.326. **నిదురతెలియు** అ.క్రి. మేలుకొను. ఆము. **4**.139. **నిదురపుచ్చు** రూ. నిద్దురపుచ్చు. స.క్రి. నిద్రింపజేయు. శుక. 1.65. **నిదురపుట్టు** అ.క్రి. నిదురవచ్చు. గంధ. **1**.130. **నిదురపోతు** రూ. నిద్దురపోతు. వి. **1**. నిద్రాళువు, ఎప్పుడూ నిద్రపోయే స్వభావం కలవాడు. భాగ. 9.409 ; **2**. అలసుడు, సోమరిపోతు. **నిదురపోవు** రూ.చూ. నిదురవోవు. అ.క్రి. నిద్రించు. **నిదురమంపు** వి. నిద్రమత్తు. పారి. 2.64. **నిదురవోవు(-పోవు)** రూ. నిదురపోవు, నిద్దురపోవు, నిద్దురవోవు. అ.క్రి. నిద్రించు. భార. శల్య. 2.393. **నిదురించు** రూ. నిదిరించు. అ.క్రి. నిద్రపోవు. భాగ. 10 పూ. 250. <నిదుర + -ఇంచు[3].

నిదురించు చూ. నిదుర.

నిద్ద రూ.చూ. నిద్దము. విశ. గట్టియైన.

నిద్దము రూ. నిద్ద, నిద్దా. విశ. 1. అధికమైన. కాశీ. 2.11 ; 2. సాంద్రమైన, దట్టమైన. కాశీ. 6.81 ; 3. మనోజ్ఞమయిన, మనోహరమయిన. హర. 4.86 ; 4. స్నిగ్ధమైన, నున్నని. హర. 5.45 ; 5. ప్రేమగల, స్నేహయుక్తమైన. పాండు. 1.7.

సం. స్నిగ్ధ-. నునుపయిన ; ప్రా. ణిద్ధ- సిణిద్ధ- ; జై. మహా. ణిద్ధ, నిద్ధ, సిణిద్ధ ; శౌ. సిణిద్ధ ; అ.మా. నిద్ధ. నునుపు, నిద్ధయా. స్నిగ్ధత, సిణిద్ధ ; పా. సినిద్ధ-. ఆర్ద్రం ; అప. సణిద్ధ-.

<ప్రా. ణిద్ధ-.

నిద్దా రూ.చూ. నిద్దము. విశ. 1. అధికమైన. పెద్దనచాటువు ; 2. ప్రశస్తమైన, శ్రేష్ఠమైన. ఘటికా. 2.87 ; 3. స్నేహయుక్తమయిన, ప్రేమగల. రాజవా. 2.20 ; 4. సాంద్రమయిన, దట్టమయిన. దశా. 1.211.

నిద్ది రూ.చూ. మిద్దె. వి. రాతికప్పుగాని, మట్టికప్పుగాని కల ఇల్లు.

నిద్దుర రూ.చూ. నిదుర. వి. నిద్ర. శృం.నై. 8.17.

నిద్దురకాచు అ.క్రి. జాగరణంచేయు. పాండు. 3.71. నిద్దురగొను(-కొను) అ.క్రి. నిద్రించు, కూర్కుడు. సాంబ. మాన. 23. నిద్దురపుచ్చు రూ.చూ. నిదురపుచ్చు. అ.క్రి. నిద్రపోజేయు, నిద్రింపజేయు. శుక. 2.98. నిద్దురపోతు రూ.చూ. నిదురపోతు. వి. 1. నిద్రపోయే స్వభావం కలవాడు, నిద్రాళువు. భల్లా. 4 ; 2. అలసుడు, సోమరిపోతు. నిద్దురపోవు రూ.చూ. నిదురపోవు. అ.క్రి. నిద్రించు, నిద్రపోవు. దశా. 1.275. నిద్దురలేనిప్రోడలు వి.బ.వ. దేవతలు. సాంబ. దేవ. 18. నిద్దురవోవు(-పోవు) రూ.చూ. నిదురవోవు. అ.క్రి. నిద్రించు, నిద్రపోవు.

నిద్రకాయు నిద్రపోకుండాఉండు.

సం. నిద్రా. నిదుర.

<సం. నిద్రా + కాయు.

నిద్రగన్నె వి. లజ్జాళువు, రక్తపాది, అత్తపత్తిచెట్టు (Mimosaensitive, M. Pudica).

సం. నిద్రా. నిద్ర.

నిద్రగన్నేరు వి. దక్షిణ అమెరికానుంచి తేబడిన నిరుపయోగమయిన కలప కల్గినచెట్టు (Enterolobium Saman).

నిద్రపోతు వి. నిద్రాళువు. ద్వి. భల్లా. 2.38.

సం. నిద్రా-. నిదుర.

<సం. నిద్రా + -పోతు.

నిద్రమబ్బు వి. నిద్రమంపరం. హంస. 5.81.

నిద్రమొగం వి. 1. తెలివితక్కువవాడు ; 2. చురుకుదనంలేనివాడు.

సం. నిద్రా-. నిదుర.

<సం. నిద్రా + మొగము.

నిద్రవాటు వి. నిదరబట్టుచోటు.

సం. నిద్రా. నిదుర.

<సం. నిద్రా + వాటు.

నిధిరాశి వి. మదనం, తూర్పార పొయ్యకముందు పొల్లు, ధాన్యం కలిసిఉన్న కుప్ప.

సం. నిధిరాశి-. పాతరల కుప్ప.

<సం. నిధిరాశి- (అర్థవిపరి.).

నినుచు రూ.చూ. నించు. స.క్రి. 1. ఏయు, ప్రయోగించు. భార.విరా. 5.176 ; 2. నాటు. భార. భీష్మ. 2.140 ; 3. నిండించు, నించు. భార.శల్య. 2.413 ; 4. వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. భాస్క.రా.యు. 1239 ; 5. వీక్షించు. పద్మ. 8.95 ; 6. చిప్పిలజేయు. భోజ. 4.7. 7. ఉంచు, పెట్టు. మను. 1.78 ; 8. కలిగించు, కలగజేయు. ఆము. 5.12 ; అ.క్రి. అతిశయించు. పాండు. 1.9.

నినుపారు చూ. నినుపు.

నినుపు రూ.చూ. నింపు. విశ. 1. సమృద్ధమయిన. నిర్వ.రా. 8.36 ; 2. మనోహరమయిన. వండి. చ. 1.18 పు ; వి. జలపూరం, వెల్లువ. భోజ. 7.10.

నినుపారు రూ. నింపారు. అ.క్రి. 1. అధికమగు, అతిశయించు. నిర్వ.రా. 1.55 ; 2. పూర్ణమగు, నిండు. రం.రా.యు. 313 పు. 15 పం. ; 3. చిప్పిలు, పైకుబుకు. పారి. 1.6 ; 4. వ్యాపించు. రాజ.చ. 2.155.

<నినుపు + -ఆరు[1].

నిన్న వి. 1. కడచిన రోజు, గతదివసం. భార.ఆది. 8.118 ; 2. అచిర భూతకాలం, కొద్ది కాలానికి ముందు. కు.సం. 10.145.

క. నిన్నె. కడచినరోజు, ఆలస్యంగా గడిచినకాలం ; కొడ. నిన్న, న్డి. ; త. నెరునల్, నెరునై, నెన్నల్. గడచినరోజు, నేఱు. ఆలస్యంగా, ఈమధ్య ; మ. ఇన్నలే. గడచినరోజు ; కో. నె, ర్ ; తొ. ఇనె. ఱ్. గడచినరోజు ; గోం. నిన్నే ; బ్రా. దరో.

నిన్నకుప్పనేడాళ్లు వి.బ.వ. కుప్పవేయగానే ధాన్యం ఇంటికి రాదనేటప్పటి పలుకుబడి. రాధికా. 3.8. నిన్నగాకమొన్న అవ్య. ఇటీవల. నిన్నజరిగినట్టుగా క్రి.విశ. ద్రు. ఇటీవల జరిగినట్టుగా. నిన్ననేటనే అవ్య. ఇటీవలనే. పాండు. 5.233. నిన్నమొన్నటివాఁడు విశ. చిన్నవాడు. రాధా. 1.14. నిన్నమొన్నలాగ అవ్య. ఇటీవల జరిగినట్లు. నిన్నమొన్నవలె అవ్య.ద్రు. సరికొత్తగా. కాశ. 2.120.

నిప్పచ్చు చూ. నిఱు.

నిప్పచ్చరము చూ. నిఱు.

నిప్పటి[1] వి. నురిసిన ధాన్యం తూర్పార పట్టినప్పుడు రాసి అంచున గట్టి గింజలతో కలిసి ఏర్పడిన భాగం.

నిప్పటి[2] చూ. నిప్పు.

నిప్పటిక చూ. నిప్పు.

నిప్పట్టు చూ. నిప్పు.

నిప్పస్తు చూ. నిఱు.

నిప్పాణిఅంచు వి. ఒకరకం పువ్వు పడేట్టు నేసిన అంచు.

నిప్పి రూ.చూ. నిప్పు. వి. అగ్గిముంట.

నిప్పు రూ. నిప్పి, నిప్పుక, నుప్పు. వి. అగ్ని ; అంగారం. భార.ఆది. 2.63.

క. నిప్, నిప్పరి. అగ్గి ; త. నెరుప్పు. నిప్పు.

మ. ఞారిప్పు, నెరిప్పు, ఞారి. వేడి, మంట ; తొ. నెప్ ; గోం. నిర్వానా. మండించు, ద్రేఇన్చ. మండు, ద్రేన. మంటతో ; కుయి. డ్రై. నిప్పంటించు ; పర్జి. నిర్. మండు, నిర్కప్-(నిర్కత్-). వెలిగించు ; కొలా. నిప్ప్. వెలిగించు, నిప్పక్. నిప్పురవ్వ ; గ. నిరిక్. దీపం వెలిగించు : ఒల్లా. నిర్ దానా. కాలు ; కురు. నియూ(ర్. నిప్పులు, మండే కర్రలు ; మాల్తో. నెరె. మంట, నర్గె. మంటల్లో పైకిలేచు, నర్గ్రతె. పైకి మండించు.

<మూ.ద్రా. *నెర్.

నిప్పటి[2] రూ.చూ. నిప్పట్టు. వి. **1**. ఆకులు కప్పి నిప్పులో వేసి కాల్చే అట్టు, భక్ష్య విశేషం. రామాభ్యు. 8.63 ; **2**. అరిసె. నిప్పటిక వి. అగ్గికుండ, శవం వెంబడి అగ్గి తీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. <నిప్పు+అటిక. నిప్పట్టు రూ. నిప్పటి[2]. వి. ఆకులుకప్పి నిప్పులో కాల్చే అట్టు, భక్ష్య విశేషం. కాశీ. 7.186. కొలా. ఇపటె, నీపటె, నిపటె. రొట్టె : నా. ఇపట్. **నిప్పుకంచుడు** వి. అగ్గికుండ, శవంతో పాటు అగ్గితీసుకొని పోటానికి వాడే మట్టిపాత్ర. నిప్పుకట్టె వి. కుట్టుకర్ర, ఆములో మంటను ఎగదోయటానికి నాలుగైదు అడుగుల పొడవున్న పంగల కర్ర. నిప్పుకు(జెదలంటు అ.క్రి. అతిపవిత్రమైనదానికి మైలఅంటు. ఉ.హరి. 5.90. <నిప్పు+-కున్+చెద+-లు+అంటు. నిప్పుకుండ వి. అగ్గికుండ, శవం వెంబడి అగ్గి తీసుకొని పోటానికి వాడే మట్టిపాత్ర. నిప్పుకోడి వి. వెన్నెల పులుగు. నిప్పుచట్టి వి. అగ్గికుండ, శవంతోపాటు నిప్పు తీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. నిప్పుచిప్ప వి. అగ్గికుండ, శవంతో పాటు అగ్గితీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. నిప్పు(జెదలంటు (-చెదలంటు) అ.క్రి. మంచిదానికి చెడుగుణాలు కలుగు. భాస్క.రా. అరణ్య. 2.71. నిప్పుతోచెలగాటము వి. ప్రమాదకరం. నిప్పుదాక వి. అగ్గికుండ, శవంతో పాటు నిప్పుతీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. నిప్పున(జెదలంటు(-చెదలంటు) అ.క్రి. మంచిదానికి చెడుగుణాలు కలుగు. బసవ. 3.60, నృసింహ. 4.32. నిప్పు(దిండి (-తిండి) వి. చకోరం, ఒకానొక పక్షి. నిప్పు(ద్రొక్కనకోతి (-త్రొక్కనకోతి) వి. ఒకచోటనిలవక ఎగిరెగిరి గంతులు వేసే వ్యక్తి. హంస. 3.155. నిప్పు(ద్రొక్కనట్లు (-త్రొక్కనట్లు) అవ్య. ఎగిరి పడినాడనటం. పండి.చ. ప్రథ. 2 పు. 418, నిప్పుపుల్ల వి. అగ్గిపుల్ల. నిప్పులగుంపు వి.బ.వ. నిప్పులు. నిప్పులమ్రింగుపులు(గు వి. వెన్నెల పులుగు. నిప్పులాంటిమనిషి వి. నిష్కళంకమయిన మనిషి. నిప్పులు వి.బ.వ. అగ్నికణాలు, విస్ఫులింగాలు. కు.సం. 2.28, భార.విరా. 2.133. నిప్పులుకక్కు అ.క్రి. క్రోధాతిరేకం చూపు. నిప్పులుకన్నులనుప్పతిల్లు అ.క్రి. కనుల నిప్పులురాలు. పండి.చ. ద్వితీ. 5.466 పం. నిప్పులు వెద(జల్లు అ.క్రి. తీవ్రమగు. రుక్మాం.చ. 3.96. నిప్పులొడి(గట్టుకొను(-కట్టుకొను) స.క్రి. చిచ్చును ఒడిలో కట్టుకొను. నిప్పులోఒకకాలునీటిలోఒకకాలుఉంచుకొను అ.క్రి. విచక్షణ కలిగి ఉండు. నిప్పువన్నెగుత్తులకాసుగు వి. అంగారవల్లరి, ఒకజాతిగానుగు చెట్టు. నిప్పొడి(గట్టు స.క్రి. స్వయంగా కీడు తెచ్చికొను. రామాభ్యు. 6.236. <నిప్పు+ఒడిన్+కట్టు.

నిప్పుక రూ.చూ. నిప్పు. వి. అగ్ని, అంగారం. ఉ.హరి. 5.287.

గ. నిరుక్. దీపం వెలిగించు.

నిప్పుకలు వి.బ.వ. నిప్పు కణాలు, అంగారాలు. ఆము. 4.98.

నిప్పొడి(గట్టు చూ. నిప్పు.

నిప్పోటము వి. చదవటంలో అతిత్వర. సకల. స. 35పు. 307.

నిబద్ది రూ. నిబ్బది, నిబ్బద్ది. విశ. సత్యమయిన, నిజమయిన. ప్రబోధ. 2.53.

సం. నిబద్ధ-. రచితం, కట్టబడింది ; ప్రా. నిబద్ధ-. సంబద్ధం ;

క. నిబద్ధి. సత్యమయిన ; త. నిపత్తి. వాస్తవం.

<ప్రా. నిబద్ధ-.

నిబద్దించు రూ. నిబద్దిలించు. స.క్రి. నిజపరుచు. రాధా. 1.25. <నిబద్ది+-ఇంచు[3]. నిబద్దిమనిషి వి. సత్యవాది, ఖండితవాది. నిబద్దిలించు రూ.చూ. నిబద్దించు. అ.క్రి. నిజపరచు. ఉ. హరిశ్చ. 4.51.

నిబంధకాలు వి.బ.వ. దేవాలయ పరిచారకులు. ద. హిం. శా. సంపు. 10. పు. 12.

సం. నిబంధక-. ఏర్పాటు చేసేవాడు.

నిబంధము వి. **1.** నియమితకాలంలో వాగ్దత్తమయిన దానిని ఇచ్చే నిబంధనం. ద. హిం. శా. సంపు. 6. శా. నం. 1052. క్రి. శ. 1350 ; **2.** దేవాలయోద్యోగం.

సం. నిబంధ-. కట్టటం, బంధించటం, నిర్ణయం, ఆధారం.

<సం. నిబంధ- (అర్థవిపరి.).

నిబంధసమస్య వి. నిర్ణీతమైన దానద్రవ్యం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 736. క్రి. శ. 1380.

సం. నిబంధ-. ఏర్పాటు, నిర్ణయం, సమస్యా. సమస్య.

<సం. నిబంధసమస్యా (అర్థవిపరి.).

నిబాతకట్నము వి. నిబంధకట్నం. నె. శా. ఒంగోలు. 31. క్రి. శ. 1559.

సం. నిబద్ధ-. ఏర్పాటుచేయబడ్డ.

<సం. నిబద్ధ- + కట్నము.

నిబ్బ వి. నిజం.

సం. నిభ-. ప్రకాశం, కాంతి.

నిబ్బడుగు వి. పల్లకీ బెస్తలు మెట్టపల్లాలు మొ॥ నవి తెలియటానికి ఉపయోగించే హెచ్చరికపదం. ప్రబంధ. 605. <నిబ్బ + అడుగు.

నిబ్బణము వి. పెళ్ళిలో చేసే ఎదుర్కోలు సన్నాహం.

నిబ్బది రూ.చూ. నిబద్ది. వి. నిజం.

నిబ్బద్ది రూ.చూ. నిబద్ది. వి. నిజం. సాంబ. మాన. 51.

నిబ్బనముగంప వి. పెళ్ళిలో పెళ్ళికొడుకు వెంబడికొనిపోయే గంప, కందపెట్టె.

**నిబ్బరము** రూ. నిబ్బరికము. విణ. **1**. యథార్థమయిన. నిశ్చయమయిన. బసవ. 7. 213పు. 141పం.; **2**. నిశిత మయిన. హరి. ఉ. 2.33; **3**. అధికమయిన, గాట మయిన. హరి. ఉ. 7.81; **4**. భరింపరాని. శృం. నై. 5.177; **5**. దృఢమయిన. భీమ. 1.118; **6**. సాంద్ర మయిన, దట్టమయిన. పారి. 2.52; వి. **1**. అతిశయం, ఆధిక్యం. శృం. నై. 2.107; **2**. దిట్టరి, సాహసి. భాగ. 1.173; **3**. పారవశ్యం. విష్ణుపు. 2.300; **4**. ఋజుత, సూటి. సారంగ. 1.126; **5**. అశ్వగతి విశేషం. చంద్రాంగ. 2.70; **6**. బెస్తలు సవారి మోసేటప్పుడు మెట్టపల్లం మొ. నవి సూచించే హెచ్చరిక పదం. ప్రబంధ. 605; **7**. దిట్టతనం, ధైర్యం. శుక. 3.585; **8**. తదేకాగ్రత. హంస. 1.186.

సం. నిర్ఝర-. తీవ్రమయినది, నిండిన; ప్రా. ణిబ్బర-. పూర్ణం, వ్యాపకం;

క. నిబ్బర.

<ప్రా. ణిబ్బర-.

**నిబ్బరించు** రూ.చూ. నిబ్బరికించు. అ.క్రి. **1**. అతిశ యించు. చంద్రాంగ. 6.142; **2**. నిదానించు. <నిబ్బ రము +- ఇంచు³.

**నిబ్బరికము** రూ.చూ. నిబ్బరము. వి. **1**. ఋజుత్వం, సూటి. నిరంకు. 3.61; **2**. కారుణ్యం, దయ. ఆం. భా. 1.131.

**నిబ్బరికించు** రూ. నిబ్బరించు. అ.క్రి. **1**. కరుణించు. పరమ. వి. 4.111; **2**. ఉప్పొంగు. యయా. 2.40; **3**. ఆలోచించు, నిదానించు.

**నిబ్బరికించు** చూ. నిబ్బరికము.

**నిబ్బరించు** చూ. నిబ్బరము.

**నిబ్బు** వి. పాళీ.

ఇం. *Nib*. పాళీ.

<ఇం. Nib.

**నిభాయించు** స.క్రి. **1**. తాళు, భరించు, సహించు; **2**. నిర్వ హించు.

సం. నిర్వాహ-. నిర్వహణ; ప్రా. నిర్వాహ-.

ఒ. నిభాయిబ; హిం. నిభానా. నిర్వహించటం; గు. నిభావు; మరా. నిభావిణె.

<హిం. నిభా (నా) +- ఇంచు³.

**నిమటాయి** వి. ఒకానొక తీగ.

**నిమవ(డు** వి. అశ్వ విశేషం. సిం. ద్వా. 3.141.

**నిమాజు** రూ.చూ. నమాజు. వి. ప్రార్థన. పూజ.

**నిమాజుగహ** రూ. చూ. నమాజుగహా. వి. మసీదు, మహమ్మదీయుల ప్రార్థనా మందిరం. నిమాజుగాహ రూ.చూ. నమాజుగహా. వి. మసీదు.

**నిమాయిస్** వి. మగ్గం చట్టం అడ్డపట్టె, నిలువుపట్టె కలసినచోట బిగింపుకు వేసినకొయ్య చెక్క.

**నిమితకా(డు** చూ. నిమితము.

**నిమితము** వి. నియమనం.

సం. నియమిత-. నియమించబడ్డ; ప్రా. ణిఅమిత, ణిఅమయ.

క. నేమిత. నియమితం. నిర్ణీతం.

<ప్రా. ణిఅమిత-.

**నిమితకా(డు** వి. **1**. మోతకాడు. ఆము. 2.95; **2**. యోధుడు. రామాభ్యు. 8.185; **3**. నియమితుడు, ఉద్యోగి, సేవకుడు. ఆం. భా. 2.25.

**నిమిత్తము** వి. చుంబనం, ముద్దు. హంస. 5.148.

సం. నిమిత్త-. నామమాత్రకారణం, హేతువు.

<సం. నిమిత్త- (అర్థవిపరి.).

**నిమిరి** వి. లేతబూడిదరంగుగల గట్టికలపనిచ్చే చెట్టు (Terminalia Panicula).

**నిమినిమాలుగా** క్రి. విణ. ద్రు. ఇంచుమించుగా.

**నిముకళా** చూ. నిమురు, కళ్లము. వి. **1**. కైలుచేసిన కళ్ళంలోని అడుగు ధాన్యం; **2**. కొరత.

**నిముకు** స.క్రి కుడుచు, పానంచేయు. గౌ. హరి. ఉ. 2.388.

**నిమురు** రూ.చూ. నివుర. స.క్రి. **1**. సవరించుకొను. ఉ. హరి. 1.58; **2**. వాత్సల్యంవల్ల చేతితోరాచు. పల్నా. వు. 77; **3**. స్పృశించు, తాకు. పారి. 4.9; **4**. అపరించు, అలుము.

**నిమురుకొను** స.క్రి. **1**. సవరించుకొను, తడుముకొను. హరి. పూ. 5.182; **2**. ఆవరించు, అలముకొను. శ్రీరం. మా. 2.241.

**నిముసము** వి. **1**. రెప్పపాటు కాలం. మను. 2.17; **2**. అల్ప కాలం, కొంచెంసేపు. విజయ. 1.104; **3**. రెప్పపాటు.

సం. నిమిష-. రెప్పవేయటం, రెప్ప వేసేటంత కాల పరిమితి; ప్రా. నిమిస-, నిముస-, నిమేస-. నేత్ర సంకోచం; అ.మా. నిమిసమ్. రెప్పపాటు; పా. నిమిస;

క. నిమిస, నిముస, నివిస. నిమిషం.

<ప్రా. నిముస-.

**నిమే** వి. నగం. జే.వ. 60.

హిం.ఉ. నీమ్. నగం.

<ఉ. నీమ్.

**నిమోనియా** వి. శ్వాసకోశంవాపు.

ఇం. ***Pneumonia***. శ్వాసకోశ సంబంధమైన వాపు.

<ఇం. Pneumonia.

**నిమ్చా** వి. చిన్నకత్తి, ఖడ్గవిశేషం. రంగా.చ. 3.35.

ఉ. నీమ్చా. చిన్నఖడ్గం; పార. నీమ్చా. వస్త్ర విశేషం, చిన్నకత్తి.

<ఉ. నీమ్చా.

**నిమ్తగాడు** వి. సీమపెంకు కప్పే పనివాడు.

**నింపాది** చూ. నింపు.

**నింపారు** చూ. నింపు.

**నింపిరి** వి. మలం. ఆం.భా. 2.134.

**నింపు** చూ. నిండు, రూ. నినుపు. స.క్రి. **1**. మామిడికాయ మొ. వాటిలో కారం మొ. నవి కూరు. కు.సం. 2.217; **2**. నిండజేయు, పూరించు, పూర్ణంచేయు. నిర్వ.రా. 8.47; **3**. వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. భార. ద్రోణ. 4.135;

4. సిద్ధింపజేయు, నెరవేర్చు. వసు. 4.105 ; 5. కలిగించు. చంద్రాంగ. 2.147 ; వి. బలుపు. కావ్యా. చూ. 3.41 ; విణ. 1. మనోహరమయిన. కు.సం. 3.260 ; 2. అధికమయిన. కళా. 6.237 ; 3. సమృద్ధమయిన, పూర్ణమయిన. ద్వి. పరమ. 3.143 పు. 4 పం.

నింపాది విణ. 1. సమృద్ధమయిన ; 2. సుఖమయిన. సం. ఆది-. మొదటి, మొదలయిన. < నింపు + సం. ఆది-. నింపారు రూ.చూ. నినుపారు. అ.క్రి. 1. పూర్ణమగు, నిండు ; 2. అధికమగు, అతిశయించు ; 3. వ్యాపించు ; 4. చిప్పిలు, పైకి ఉబుకు. < నింపు + -ఆరు[1]. నింపుకొను స.క్రి. నెమ్మదిచేసుకొను. నింపుడుకాయ వి. గుత్తివంకాయ వంటిది, కోసి మసాలా ద్రవ్యాలు లోపలపెట్టి పాకం చేసింది. నింపువాఁడు విణ. సమృద్ధుడు, సంపన్నుడు.

నింబర్లు రూ.చూ. నెంబర్లు. వి.బ.వ. గింజ సన్నరకం నెంబరు వడ్లు.

నింబావలి రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నింబావళి రూ. నింబావలి, నింబోలి, నింబోలీ, నింబోళి, నింబోళీ, నిమ్మాళి. వి. ఒకరకం పసుపురంగు.

నింబు వి. తలుపు చెక్కలను కరిపించటానికి వాడే రెండు వైపులా పదునున్న తీగమేకు.

నింబోలి రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నింబోలీ రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నింబోళి రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నింబోళీ రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నిమ్మ వి. జంబీరం, జంభలం, ఉష్ణప్రాంతాలల్లో సారవంతమయిన తోటల్లో సాగుచేసి పెంచే పళ్ళచెట్టు. కు.సం. 7.94 (Citrusaurantium).

సం. నింబ-, నింబూ, నింబూకనిమ్మ- ; ప్రా. ణింబ-, నింబ-, లింబ-. ; పా. నింబ- ;

క. నింబి, నింబె; లింబె ; తు. నింబె, లింబి, లింబె ; కుయి. లెంబు ; కువి. లిమ్మ ; పర్జి. రిమ్మ ; కొలా. నింబ ; గ. నింబె.

< ప్రా. నింబ-.

నిమ్మకాయ వి. జంభీరం, నిమ్మకాయ. నిమ్మకాయ వాటము చేయు అ.క్రి. స్పష్టంచేయు. నిమ్మకు నెఱువువేసిన చందమున అవ్య. ద్రు. మరింత ప్రోదిచేసినట్లు. సారంగ. 2.165. నిమ్మకు నీరెత్తినట్టు అవ్య. 1. నిమ్మచెట్టుకు నీరుపోసినంతా అది నవనవలాడుతూ ఉంటుంది : 2. గుట్టుచప్పుడుగా అనే అర్థంలోనూ వాడుకలో ఉంది. నిమ్మగడ్డి వి. ఒకరకం గడ్డి (Citratus). నిమ్మచెట్టు వి. నిమ్మకాయలు కాసే చెట్టు. నిమ్మటాయి వి. 1. నల్లటి గట్టి చిన్న చెరువుచేప ; 2. గట్టి శరీరం కలవాడు ; 3. ఒకరకం అడవిగడ్డ, ఉర్లగడ్డ వంటిది (Ceropegia Bulbosa). నిమ్మతులసి వి. మందుల్లో ఉపయోగించబడే ఆకులుకల మొక్క (Ocicem gratissimum). నిమ్మపండు వి. నిమ్మచెట్టుకు కాసే పండు. నిమ్మపండునలంచిన పగిది అవ్య. ద్రు. గట్టిగా, సునాయాసంగా. ఉ.హరి. 3.71. నిమ్మపండు వైచియుఱుకు అ.క్రి. వెంటనే పరుగెత్తు. ఉ.హరి. 3.128. నిమ్మరంగు వి. ఒకరకం పసుపురంగు. నిమ్మరంగుచీర వి. ఒకరకం పసుపురంగు చీర. నిమ్మాకు తెగులు వి. ఆకులు ముడుచుకుపోయే మినప తెగులు

నిమ్మలి వి. 1. నిర్మలం ; 2. నిశ్చింత ; 3. స్వస్థత.

సం. నిర్మల-. స్వచ్ఛమైన, శుద్ధమైన, పాపంలేని ; ప్రా. నిమ్మల- ;

క. నిమ్మళవు.

< ప్రా. నిమ్మళ-.

నిమ్మలించు రూ.చూ. నిమ్మళించు. అ.క్రి. 1. నిశ్చింతమగు ; 2. సేదదీరు ; 3. జ్వరం మొ. నవి తగ్గు.

నిమ్మళమగు చూ. నిమ్మలము.

నిమ్మలము వి. 1. నిష్కళంకత. ఆం.భా. 2.191 ; 2. స్వాస్థ్యం ; విణ. 1. స్వస్థమైన, తగ్గిన, ఉపశమించిన ; 2. మందమయిన ; 3. అల్పధ్వనికల.

సం. నిర్మల-. శుద్ధం, పాపరహితమైనది ; ప్రా. ణిమ్మల-. విశుద్ధం ; అ. మా. నిమ్మల- ; పా. నిమ్మల- ; క. నిమ్మళవు. నిర్మలినం ; త. నిమ్మళమ్. నిష్కళంకమయినది.

< ప్రా. ణిమ్మల-.

నిమ్మళమగు అ.క్రి. అతిశయించు, హెచ్చు. చంపూ రా. 4.85. నిమ్మళించు రూ. నిమ్మలించు. అ.క్రి. స్వస్థడగు. ఉ.రా. 2.295.

నిమ్మళించు చూ. నిమ్మలము.

నిమ్మాకుతెగులు చూ. నిమ్మ.

నిమ్మాళి రూ.చూ. నింబావళి. వి. ఒకరకం పసుపురంగు.

నిమ్ము[1] వి. కొమ్ము మొ॥ వాటి ధ్వని విశేషం. కాళ. 3.36.

ప్రా. ణిమ్మ. నిర్మించు, రచించు.

నిమ్ము[2] రూ.చూ. నెమ్ము[1]. వి. 1. తలుపు చెక్కలను కరిపించటానికి వాడే రెండు వైపులా పదునున్న తీగమేకు ; 2. నెమ్ముతడి.

నిమ్ము[3] రూ.చూ. నెమ్మి[2]. వి. తినాసం ; వంజులం.

నియాన్‌లైటు వి. రంగుకల కాంతినిచ్చే దీపం.

ఇం. *Neon light*. పూర్తిగా మూయబడి తక్కువ వాయు పీడనం కల్గి విద్యుత్తు ప్రవేశించినప్పుడు రంగుకల కాంతి నిచ్చేదీపం.

< ఇం. Neon light.

నియోగము వి. పరివారం, పరిజనం. బసవ. 2.502పం. పండి. చ. 1.72పు.

సం. నియోగ-. అధికారంలో పెట్టటం, ప్రేరణం, ఆజ్ఞ, ఏర్పరచిన పని.

< సం. నియోగ- (అర్థవిపరి.).

నియోగిముష్టి వి. భుక్తికోసం వచ్చినా దర్పం తగ్గక అడుక్కోవటం. నియోగులయాచనలో కూడా దర్పం కనిపిస్తుంది.

సం. నియోగిన్. బ్రాహ్మణులలో ఒకశాఖకు చెందినవారు ; ముష్టి-. పిడికిలి.

< సం. నియోగిముష్టి- (అర్థవిపరి.).

నియ్యతు వి. స్వభావం.

సం. నియత-. నియమంకలది, స్థిరమైనది.
<సం. నియత-.

నియోగి వి. 1. ఒకరకం సేవకుడు. ఉ. రా. 6.190; 2. మంత్రి; 3. ఒకతెగ బ్రాహ్మణుడు.
సం. నియోగిన్. బ్రాహ్మణులలో ఒకశాఖకు చెందిన వాడు.
<సం. నియోగిన్.

నిరంగు వి. పేకాటలో ముక్కలు కలవకపోతే అనేమాట.
హిం. నిరంగ్. రంగులేకపోవటం. ఉదాసీనం, వివర్ణం.
<హిం. నిరంగ్.

నిరతము రూ.చూ. నిరుతము. విణ. 1. స్థిరమయిన. భార. భీష్మ. 1.181; 2. అవిచ్ఛిన్నం; క్రి. విణ. ఎల్లప్పుడు. భార. శాంతి. 3.106.
నిరతముగ క్రి. విణ. ద్రు. అవిచ్ఛిన్నంగా. భార. ఆరణ్య. 2.295.

నిరప వి. ఎర్రని గట్టికలప కలిగి జిగురునిచ్చే చెట్టు (Bauhinia retusa).

నిరప్పణ విణ. నిరభ్యంతరమయిన, అనర్గళమయిన, అడ్డులేని. వేంక. పంచ. 2.370.
సం. నిరర్పణ-; ప్రా. ణిరప్పణ-.
<ప్రా. ణిరప్పణ-.

నిరాటంకము వి. అడ్డులేనిది.
సం. నిరాతంక-. జంకులేనిది, భయంలేనిది, బాధ లేనిది, అడ్డులేనిది.
త. నిరాటంకమ్. అడ్డులేనివస్తువు.
<సం. నిరాతంక-.

నిరాణ విణ. స్వచ్ఛమయిన, మాలిన్యంలేని. శివ త. సా. 145.
క. నిరాళ.

నిరాదరువు వి. నిరాధారం, ఆదరువు లేకపోవటం.
సం. నిరాధార-. ఆధారంలేనిది, ఆశ్రయంలేనిది.
<సం. నిరాధార-.

నిరాపనింద వి. అపవాదు. సారంగ. 3.50.
సం. నిర్. పూర్తిగా అనే అర్థానిచ్చే ఉపసర్గ, అపనిందా. అపదూరు, దోషం లేనివానికి దోషాన్ని ఆరోపించటం.
<సం. నిరపనిందా.

నిరాబందరము వి. పనికి మాలినతనం.

నిరాహారి వి. ముని. యమా. 2.43.
సం. నిరాహారిన్. ఆహారం లేకుండా ఉండేవాడు, ఉపవాసం చేసేవాడు; ప్రా. ణిరాహారి.
<సం. నిరాహారిన్.

నిరు అవ్య. గతార్థకం.
నిరుడిమావియావు వి. ఒకసారి ఈనినఆవు, గృష్టి. <నిరు + ఏఁడు + మావియావు. నిరుడు వి. ఔ. గత సంవత్సరం, కడచిన సంవత్సరం. క్రీడా. 287. <నిరు + ఏఁడు. నిరుతపాలు వి. కొద్దిసెగమీద కాసిన పాలు.

నిరుకడము వి. ఒకానొక చెట్టు.

నిరుకు వి. 1. నిర్ణయం; 2. నిర్ణయం చేసిన వెల; 3. ధనవంతుడు.
క. నిరఖు. బజారుధర.

నిరుకుళము విణ. దిగంబరమయిన. పాండు. 2.229.
సం. నిరర్గళ-, అడ్డులేనిది; ప్రా. ణిరగ్గల-, నిరగ్గల-. అడ్డులేని.
<ప్రా. నిరగ్గల-.

నిరుతము రూ. నిరతము. విణ. అవిచ్ఛిన్నమయిన. ద.హిం. శా. సంపు. 6. శా. సం. 612. క్రీ.శ. 1148.
సం. నిరత-. మిక్కిలి ఆసక్తి కలది;
త. నిరత. ఎల్లప్పుడు.
<సం. నిరత (అర్థవిపరి.).

నిరుతి వి. నైరృతుడు. కు. సం. 12.46.
సం. నిర్‌ృతి. దక్షిణ పశ్చిమ దిక్పాలకుడు;
క. నిరుతి.
<సం. నిర్‌ృతి-.

నిరుపవలం వి. సీరుప్పు.
<నీరు + ఉప్పు + అలం.

నిరుపాధికసొమ్ము వి. హద్దులేక చెల్లించేసొమ్ము.
సం. నిరుపాధిక-. ఉపాధిలేనట్టి.
<సం. నిరుపాధిక- + సొమ్ము.

నిరుపాధికవృత్తి వి. సర్వస్వామ్య సహితమైన (భూ) భాగం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 28. క్రీ.శ. 1397.
త. నిరుపాతికం. అవధులు లేనిది.

నిరోహరి వి. పన్నుపర్యాయాలు లేకుండా ఉండటం. నె. శా. ఉదయగిరిశాసనం. శా. సం. 28,29. క్రీ. శ. 1470.

నిర్గముబెట్టు రూ. నిర్గెముపెట్టు. స.క్రి. ప్రయాణానికి శుభ ముహూర్తంలో చిన్నమూట కట్టుకొని స్థలాంతరాన ఉంచు.
సం. నిర్గమ-. వెడలిపోవటం, నిష్క్రమణం.
<సం. నిర్గమ- + పెట్టు.

నిర్గెముపెట్టు రూ. చూ. నిర్గముబెట్టు. స. క్రి. ప్రయాణానికి శుభముహూర్తంలో చిన్నమూట కట్టుకొని స్థలాంతరాన ఉంచు.

నిర్చెన రూ.చూ. నిచ్చెన. వి. దాపుకర్ర, ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను తాకటానికి పనికివచ్చే పరికరం.

నిర్జీరాయి వి. నిర్జీప్రాంతంనుంచి వచ్చే చలవరాయి.

నిర్జీరేకు వి. నిర్జీప్రాంతం నుంచి వచ్చే చలవరాతి పలక.

నిర్పేద రూ. నిఱుపేద. వి. అతి దరిద్రుడు. శృం నై. 1.101; విణ. అతికృశమైన, మిక్కిలి సన్నని.

నిర్మించు స.క్రి. సంతృప్తిపరచు. భార. ఆరణ్య. 2.336.
సం. నిర్మా. కట్టు, నిర్మాణంచేయు.
<సం. నిర్మా + -ఇంచు.

నిర్రేవు రూ.చూ. నిడిరేవు. వి. వీథిరేవు, ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు.

నిర్లూత చూ. నీరు. వి. జలజంతు విశేషం. హంస. 4.186.

నిర్వందం వి. నిర్బంధం, బలవంతం.
సం. నిర్బంధ-. బలాత్కారం, పట్టుదల, గట్టిగా బంధించటం.

<సం. నిర్బంధ-+-ము.

**నిఱనిఱ** వి. సీల్గటంలో అయ్యే ధ్వనికి అనుకరణం, ధ్వన్యను. పండి.చ. 2.101 పు.

**నిఱు** విణ. మిక్కలి.

క. నిఱు, నిండైన; నెఱె. పూర్తి; త. నిఱై. పూర్తి, నిండుదనం.

నిప్పచ్చ రూ.చూ. నిప్పచ్చరము. విణ. **1.** మిక్కలి పసిమికల; **2.** శూన్యమైన, రిక్తమైన; వి. **1.** నాశం; **2.** బీదరికం; **3.** లేమి. నిప్పచ్చరము రూ. నిప్పచ్చ, నివ్వచ్చరము. వి. నిప్పచ్చ. రిక్తత, దారిద్ర్యం. కవిజనా. 1.26; విణ. **1**. శూన్యమైన, రిక్తమైన. కాశీ. **4**.111; **2.** బలహీనం, దీనం. హర. 7.14. క. పజ్జౌ. బీద, నిస్సహాయత, నిస్సహాయుడు, పజ్జౌతన. బీదరికం; తు. పజ్జా. క్షామం, అరుదు; త. పంచెమ్. లేమి, కరవు, ప్రియం, పంచై. కరవు, బీదతనం; మ. పంచమ్, పజ్జమ్. కరువు, లేమి, బీదరికం; కో. పజ్మ్. కరువు; తొ. పొగ్జమ్, ఒగ్జమ్. కరువు. <నిఱు+పచ్చరము. నిప్పస్తు వి. **1**. పూర్ణమైన ఉపవాసం. వేంక. పంచ. 1.495; **2.** ఉపవాసం. ఆం.భా. 2.175. <నిఱు+పస్తు. నిఱునీఁగు స.క్రి. సంపూర్ణంగా పరిత్యజించు. కాశీ. 1.179. నిఱుపేద రూ.చూ. నిర్పేద. వి. అతిదరిద్రుడు, కడుబీద. శృం.నై. **4.73**; విణ. అతికృశమైన, మిక్కలి సన్నని. కాశీ. 1.90. నిఱుప్రేమ వి. నిండుప్రేమ. సారంగ. 1.130.

నిఱ్ఱనసీల్గు చూ. నిఱ్ఱు.

నిఱ్ఱనీలుగు చూ. నిఱ్ఱు.

నిఱ్ఱనీల్గు చూ. నిఱ్ఱు.

**నిఱ్ఱు** వి. సీల్గటానికి అనుకరణం. ధ్వన్యను.

నిఱ్ఱనసీల్గు రూ.చూ. నిఱ్ఱనీల్గు. అ.క్రి. గాత్రవినామం చేయు, ఒళ్ళు విరుచుకొను. చెన్నబసవ. 4.410. నిఱ్ఱనీలుగు రూ.చూ. నిఱ్ఱనీల్గు. అ.క్రి. **1.** మిక్కలి నీలుగు; **2.** గర్వించు. నిఱ్ఱనీల్గు రూ. నిఱ్ఱనసీల్గు, నిఱ్ఱనీలుగు. అ.క్రి. **1**. గాత్రవినామంచేయు, ఒళ్ళువిరుచుకొను. కాళ. **3.75**; **2**. మిక్కలినీలుగు; **3**. గర్వించు.

నిలక చూ. నిలుచు.

నిలకఇచ్చు చూ. నిలుచు.

నిలకడ చూ. నిలుచు.

నిలగొయ్య చూ. నిలువు.

నిలఁదీయు చూ. నిలుచు

నిలఁదొక్కుకొను చూ. నిలుచు.

నిలపకమ్మి చూ. నిలుపు.

నిలపటకొయ్య చూ. నిలుపు.

నిలపపట్టె చూ. నిలుపు.

నిలపరాయి చూ. నిలుపు.

నిలపరేపు చూ. నిలుపు.

నిలప్పట్టె చూ. నిలుపు.

నిలబలుకు చూ. నిలుచు.

నిలఁబడు చూ. నిలుచు.

నిలరాట చూ. నిలువు.

నిలవ రూ.చూ. నిలువ. వి. సేద్యగాడు పనికి రాకుండా నిలిచిన దినం.

నిలవరము చూ. నిలువు.

నిలాపనింద రూ.చూ. నీలాపనింద. వి. కారణంలేకుండా వచ్చిన నింద.

**నిలికి** చూ. నిలుచు. వి. విశ్రాంతి.

నిలిచినకాలున నిలువకయుండు చూ. నిలుచు.

నిలిచినచోట నిలువక చూ. నిలుచు.

నిలివేయు చూ. నిలుచు.

నిలుకడ చూ. నిలుచు.

నిలుకడదప్పు చూ. నిలుచు.

నిలుకడలేని మనిషి చూ. నిలుచు.

నిలుకాల నిలువక చూ. నిలుచు.

**నిలుగు**[1] రూ.చూ. నీల్గు[1]. అ.క్రి. **1.** ఒళ్ళువిరుచుకొను. ఉ.హరి. 6.77; **2**. గర్వించు. సారంగ. 3.55.

**నిలుగు**[2] రూ.చూ. నిలువు. వి. వాట, సారెమీదనుంచి కోసి కిందపెట్టిన అడుగులేని మట్టిపాత్ర.

**నిలుగు**[3] రూ. నీలుగు[2], నీల్గు[2]. అ.క్రి. చచ్చు. మార్క. 3.32.

పర్జి. ఈల్. ఆకులు పళ్ళు మొ. నవి రాలు; గ. ఈల్. రాలు, జారు.

నిలుగుంజ చూ. నిలువు.

నిలుగొయ్య చూ. నిలువు.

నిలుగ్రుడ్లుపడు చూ. నిలువు.

**నిలుచు** రూ. నిల్చు. అ.క్రి. **1**. నిలుచుండు, నిలబడు. భార. ఆది. 2.90; **2**. రావటంమాను. భార. ఆది. 5.68; **3.** యుద్ధాదుల్లో నిలబడు. వెనుదీయకుండు. భార. ఆది. 6.39; **4**. విస్తరిల్లు. భార. ఆది. 6.261; **5**. జీవించు, బతుకు. భార. ఆది. 6.278; **6**. తాళు, ఓర్చు. భార. ఆది. 6.291; **7.** పొదుకొను, స్థిరంగాఉండు. భార. సభా. 1.128; **8**. వర్తించు. భార. విరా. 1.64; **9**. నివసించు, కాపురముండు. భార.విరా. 1.118; **10**. చెడకుండు, నశింపకుండు. భార.ఉద్యో. 3.303; **11**. ఉండు. భార.ఉద్యో. 4.2; **12**. జీవంతోఉండు. హరి. పూ. 1.124; **13.** లగ్నమగు, సక్తమైఉండు. శృం.నై. 5.7; **14**. సమాహితచిత్తుడగు, మారుచింత లేకుండు. జైమినిభా. 1.7; **15**. తీరు, పోవు. జైమినిభా. 8.101; **16.** పొడుచు, ఉదయించు. గౌ.హరి.పూ. 554 పం.; **17.** అపలాయితుడగు, పారిపోక ఉండు. పారి. 5.3; **18**. స్థితిపొందు, వృద్ధిపొందు. పాండు. 2.213; **19.** కలుగు, పుట్టు. విష్ణుపు. 6.336; **20**. శేషించు, మిగులు. శుక. 2.350; **21**. విశ్రమించు. శుక. 3.604; **22**. ప్రతిష్ఠితమగు; **23**. కూర్చుండు; **24**. ఆగు, ప్రకృత క్రియనుండి విరమించు; **25**. వెళ్ళటంమాను; **26**. లేచు; **27**. కొనసాగించు.

క. నిల్, నిలు, నిల్లు (నిల్త్-, నిన్ద్-). నిలుచు; తు. నిల్పుని. నిలుచు, శాంతించు; త. నిల్ (నిన్-ఱ్-). నిలుచు, ఆగు, ఉండు మొ॥; మ. నిల్క; కో.

నిల్-/నిన్- (నింద్-). నిలుచు, నిల్ (-నిట్). నిలుచు ; తొ. నిల్- (నిద్-) ; గోం. నిల్ల్, నిత్. నిలుచు ; కుఇ. నిస. ఆగు, నిలకడగాఉండు, నిల్ప్. నిలుచు ; కువి. నీద్. జీవించు, నీచ్. నిలుచు, నీ. నిలుచు ; పర్జి. నిల్ప్ (నిత్). నిలుచు ; కోలా. ఇల్. నిలుచు ; గ. నిల్, నిల్క్ (నిత్-). నిలుచు ; కురు. ఇల్ (ఇల్చ్- ఇల్ల్-). లేచు, నిలుచు ; మాల్తొ. ఇల్ (ఇజ్). నిలుచు.

<మూ.ద్రా. *నిల్-.

నిలక వి. నిలుపు. **నిలకఇచ్చు** అ.క్రి. కాలు పెట్టటానికి వీలు ఏర్పడు. **నిలకడ** రూ.చూ. నిల్కడ. వి. స్థిరత్వం. <నిలుచు + కడ. **నిల(దీయు(-తీయు)** స.క్రి. నిర్బంధించు. **నిల(దొక్కుకొను(-తొక్కుకొను)** అ.క్రి. స్థిరపడు. **నిలబలుకు** స.క్రి. తన మాట నెగ్గునట్లు గట్టిగా వాదించి మాట్లాడు, తెగనాడు. <నిలుచు + -అ$^{7}$ + పలుకు. **నిల(బడు** రూ.చూ. నిలువ(బడు. అ.క్రి. నిలుచుండు. రామాభ్యు. 8.132. <నిలుచు + -అ$^{7}$ + పడు. **నిలిచినకాలున నిలువకయుండు** అ.క్రి. ఒకచోట నిలవక ఉండు. ద్విప.మధు.పు. 35. **నిలిచినచోటనిలువక** అవ్య. ఒకచోట ఉండక. విజయ. 1.43. **నిలివేయు** స.క్రి. నిలవబెట్టి బలవంతంగా పనిచేయించు. **నిలుకడ** రూ.చూ. నిల్కడ. వి. 1. స్థిరత్వం, నిశ్చలం. కు.సం. 3.42 ; 2. స్థితి, ఉనికి, వాసస్థానం. భార.విరా. 2.296 ; 3. సమాప్తి, ముగింపు. భార.విరా. 3.315 ; 4. ధైర్యం. భాస్క.రా.ఆరణ్య. 1.358 ; 5. అభినివేశం, పట్టుదల. హరి.పూ. 4.106 ; 6. ఉత్థానం, నిలబడటం. హర. 7.49 ; 7. నాట్యస్థితి విశేషం ; విణ. స్థిరమైన. **నిలుకడదప్పు (-తప్పు)** అ.క్రి. ధైర్యం కోల్పోవు. భాస్క.రా.యు. 1864. **నిలుకడలేనిమనిషి** వి. అస్థిరుడు. **నిలుకాలనిలువక** అవ్య. ఎక్కడా క్షణం నిలువక. మల్ల. 3.18. **నిలుచుకొను** అ.క్రి. నిలబడు. **నిలుచుండ(బెట్టు (-పెట్టు)** స.క్రి. నిలబెట్టు, ఉత్థితునిచేయు. హరి.పూ. 5.190. **నిలుచుండు** రూ. నిల్చుండు. అ.క్రి. ఉత్థితుడగు, నిలబడు. భార.ఉద్యో. 1.65. **నిలువరాని** అవ్య. ఆపరాని. రాజగో. 4.25. **నిలువనాడు** రూ. నిల్వనాడు. స.క్రి. స్థిరంగా పలుకు, దృఢంగా పలుకు. విప్ర. 5.39. <నిలుచు + -అ$^{7}$ + ఆడు. **నిలువనాడ(గలుగు** అ.క్రి. అబద్ధమైనా సత్యమనిపించే విధంగా చెప్పగలుగు. శుక. 1.537. <నిలుచు + -అ$^{7}$ + ఆడు + -అ$^{7}$ + అ$^{7}$ + కలుగు. **నిలువనీడగు** అ.క్రి. ఆశ్రయమగు. జైమినిభా. 1.22. <నిలుచు + -అ$^{7}$ + నీడ + అగు. **నిలువనేర్చు** అ.క్రి. ఉండగలుగు. పారి. 1.116. **నిలువ(దీయు** అ.క్రి. నిర్బంధించు. <నిలుచు + -అ$^{7}$ + తీయు. **నిలువ(బట్టు** రూ. నిల్వ(బట్టు. స.క్రి. దాచు, రహస్యంగా ఉంచు. శృం.నై. 2.72. <నిలుచు + -అ$^{7}$ + పట్టు. **నిలువ(బడు** రూ. నిల(బడు, నిల్వ(బడు. అ.క్రి. 1. నిలిచిపోవు, ఆగిపోవు. భార.కర్ణ. 3.221 ; 2. ఉత్థితుడగు, నిలుచుండు. భార.శాంతి. 6.335 ; 3. నశించు. మార్క. 5.98 ; 4. నిక్కి, నిక్కబొడుచు. హరి.పూ. 6.43. <నిలుచు + -అ$^{7}$ + పడు. **నిలువ(బెట్టు** స.క్రి. నిలబడేటట్లుచేయు. <నిలుచు + -అ$^{7}$ + పెట్టు. **నిలువరము** రూ.చూ. నిల్వరము. విణ. స్థిరమైన, యథార్థమైన. శశా. 3.56 ; వి. 1. మాంద్యం ; 2. రైల్వే స్టేషను. **నిలువరించు** రూ.చూ. నిల్వరించు. స.క్రి. 1. నిరోధించు, ఆపు, అడ్డగించు. భార.ఉద్యో. 4.274 ; 2. వహించు, నిలుపు. భాస్క.రా.యు. 2332 ; 3. మానుపు, ఉడిగించు. కవిక. 3.91 ; 4. ఉంచు, పెట్టు. కకుత్స. 1.158 ; 5. సంధించు, కూర్చు ; అ.క్రి. తాళు, సహించు. చంద్రభా. 4.109. **నిలువారము** రూ.చూ. నిల్వరము. విణ. 1. స్థిరమైంది ; 2. యాథార్థ్యం ; 3. సదనం.

**నిలుపరాని** చూ. నిలుచు.

**నిలుపీట** చూ. నిలువు.

**నిలుపు** రూ.చూ. నిల్పు. స.క్రి. 1. ఏర్పరచు. భార.ఆది. 5.85 ; 2. ఆపు. నిర్వ.రా. 4.69 ; 3. నిరోధించు, అడ్డగించు. నిర్వ.రా. 6.39 ; 4. నిశ్చలంగా చేసుకొను. భార.విరా. 2.292 ; 5. (బాణాదుల్ని) నాటు. భార.విరా. 5.148 ; 6. కూర్చుండబెట్టు. భార.విరా. 5.391 ; 7. ప్రతిష్ఠించు, స్థాపించు. భార.ఉద్యో. 2.206 ; 8. ప్రసరింపచేయు. భార.ఉద్యో. 4.89 ; 9. నియమించు, నియోగించు. భార.భీష్మ. 2.118 ; 10. స్థిరపరచు. భార.ద్రోణ. 2.59 ; 11. స్వస్థపరచు. దశకు. 5.36 ; 12. కాపాడు. కేయూ. 4.117 ; 13. నెలకొల్పు, పాదుకొల్పు. హరి.ఉ. 1.161 ; 14. లగ్నంచేయు, తగుల్కొనచేయు. శృం.నై. 1.69 ; 15. కలిగించు. కాశీ. 1.130 ; 16. వసింపచేయు. కాశీ. 3.234 ; 17. ఉంచు, పెట్టు. కాశీ. 4.136 ; 18. ధరించు, పెట్టుకొను. కాశీ. 7.147 ; 19. పోకుండచేయు. ఆము. 2.49 ; 20. మాన్పు, ప్రకృత క్రియనుంచి విరమింపచేయు. ఆము. 3.6 ; 21. నిర్మించు. కట్టించు. ఆము. 4.43 ; 22. చెడకుండా చేయు. వసు. 3.99 ; 23. (చాప మొ॥వాటిని) పరుచు. ఇందు. 2.36 ; 24. నెరవేర్చు, చెల్లించు. శుక. 4.10 ; వి. 1. బ్రతుకు, జీవనం. కు.సం. 4.14 ; 2. స్థైర్యం, నిలకడ. భార.విరా. 5.93 ; 3. ప్రాపు, ఆశ్రయం. భార.ద్రోణ. 2.266 ; 4. రక్షణ. భార.ద్రోణ. 2.355 ; 5. ఉత్థానం. హరి.ఉ. 10.22 ; 6. స్థానం, చోటు. విక్ర. 4.27 ; విణ. ప్రతిబంధకమయిన.

**నిలపకమ్మి** వి. ద్వారబంధపు నిలువుపట్టె. **నిలపటకొయ్య** వి. నిలువు, ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య. **నిలపపట్టె** రూ. నిలప్పట్టె. వి. ద్వారబంధపు నిలువు కమ్మి. **నిలపరాయి** వి. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్లను మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి. **నిలపరేవు** వి. వీథిరేవు, ఆముకు మధ్య భాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు. **నిలప్పట్టె** రూ.చూ. నిలపపట్టె. వి. ద్వారబంధపు నిలువుకమ్మి. **నిలుపుకుంచె** వి. సరిచేసేటప్పుడు, పడుగు ఆరుబదునులో ఉండగా

నందు నందుకూ ఆపుతూ దువ్వే కుంచె. **నిలుపుకొను** స.క్రి. 1. ఏర్పరచుకొను, నియమించుకొను. కేయూ. 3.16 ; 2. నెలకొల్పుకొను, పాదుకొల్పుకొను. ఉ.రా. 4.13. **నిలుపుచేయు** రూ.చూ. నిలుపసేయు. స. క్రి. 1. అడ్డగించు ; 2. ఆపుచేయు. **నిలుపుట** వి. లగ్నం చేయటం. భార. ఆది. 3.27. **నిలుపుదలచేయు** స.క్రి. అడ్డంచేయు, ఆపు. **నిలుపుమందు** వి. వీర్య స్తంభనం చేసే మందు. ప్రబంధ. 78 **నిలుపువాకిలి** వి. ముఖద్వారం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 36. క్రి.శ. 1422. **నిలుపుసేయు(-చేయు)** రూ. నిలుపుచేయు. స.క్రి. ఆపు. ద్వి.నల. 1 553. **నిలుపోపు** రూ. నిల్వోపు. అ.క్రి. సహించు. భార. ఆది. 6.176. <నిలుపు + ఓపు.

**నిలుపోపు** చూ. నిలుపు.

**నిలుబద్ద** చూ. నిలువు.

**నిలుబేడం** చూ. నిలువు.

**నిలుంపాత** చూ. నిలువు.

**నిలువ** రూ. నిలవ, నిల్వ. వి. 1. ఋణం, అప్పు. రం. రా. అయోధ్యా. 138 పు. 12 పం. 2. నిలిచిన వస్తువు, శేషం. సిం.ద్వా. 11.95 ; 3. సేద్యగాడు పనికి రాకుండా నిలిచిన దినం.

**నిలువజేయు(-చేయు)** స.క్రి. చేర్చిపెట్టు. **నిలువనీరువఁబండినట్లు(-పండినట్లు)** అవ్య. అలా నీటిలో పుట్టుకొని వచ్చినట్లు. సారంగ. 2.41. **నిలువసలువలు** రూ. నిలువసల్వలు, నిల్వసలువలు, నిల్వసల్వలు. వి.బ.వ. నిలిచిఉన్న సొమ్ము, దానిపై వచ్చిన పెచ్చు. పరమ. 4.175 పు. **నిలువసల్వలు** రూ.చూ. నిలువసలువలు. వి.బ.వ. నిలిచి ఉన్న సొమ్ము. దానిపైవచ్చిన పెచ్చు.

**నిలువంగి** చూ. నిలువు.

**నిలువడ్డ** చూ. నిలువు.

**నిలువనాడు** చూ. నిలుచు.

**నిలువనాడఁగలుగు** చూ. నిలుచు.

**నిలువనీఁడగు** చూ. నిలుచు.

**నిలువనేర్చు** చూ. నిలుచు.

**నిలువఁదీయు** చూ. నిలుచు.

**నిలువఁబట్టు** చూ. నిలుచు.

**నిలువఁబడు** చూ. నిలుచు.

**నిలువఁబెట్టు** చూ. నిలుచు.

**నిలువరము** చూ. నిలుచు.

**నిలువరించు** చూ. నిలుచు.

**నిలువాకులు** చూ. నిలువు.

**నిలువారము** చూ. నిలుచు.

**నిలువిచ్చు** చూ. నిలువు.

**నిలువీఁత** చూ. నిలువు.

**నిలువు** చూ. నిలుచు. రూ. నిలుగు[2], నిల్వు. వి. 1. అంతస్తు. భార. విరా. 1. 301 : 2. ఉత్థానం, నిలబడటం. భార. విరా. 3.150 ; 3. శరీరం. రామాభ్యు. 1.95 ; 4. స్థైర్యం, నిలకడ. కవిక. 3.80 ; 5. ప్రమాణం, కొలది. వైజ. 2.81 ; 6. చేయి పైకెత్తుకొని నిలబడిన పురుషుని పరిమాణం ; 7. పొడుగు, దైర్ఘ్యం ; 8. ఎత్తు, ఉన్నతి , 9. ద్వారబంధపు నిలువుకమ్మి ; 10. నిచ్చెనకు రెండు వైపులా ఉండే పొడుగాటి కర్ర ; 11. మనిషెత్తు, రెండు గజాలు ; 12. కామిరె, నిలువుగుంజ, దోర్నపట్టె కాధారంగా ఉండే నిలువు గుంజ ; 13. పండి కోయటానికి సిద్ధంగా ఉన్న పైరు ; 14. తాడిచెట్టు ప్రమాణం ; 15. ఒకదానికి ఇంకొకటి పేర్చటం ; 16. పత్తిరాట్నం కింది పీటకు దిగ్గొట్టిన నిలువుకొయ్య : 17. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువుకొయ్య ; 18. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య ; 19. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క ; 20. అనుజంగ, అనుపీటలు బిగించిన పొడుగుపట్టె ; 21. అనుపీట, అనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె ; 22. నిలువుకొయ్య, మరాను ఇరుసుమోసే పొడుగుకొయ్య ; 23. ఊడ్తెకాలు, నేలమీద మోసే ఊడ్తెకొయ్య ; 24. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేత బయలులో పాతిన కొయ్యరాట ; 25. నవారుమగ్గం కట్టుబడిలో అడ్డపీటకు బిగించిన నిలువుకొయ్య ; 26. పట్టుదారం చుట్టే డొలక కట్టుబడిలో ఇరుసును మోసే కొయ్య ; 27. వాట, సారెమీదనుంచి కోసి కిందపెట్టిన అడుగులేని మట్టిపాత్ర ; విణ. ఊర్ధ్వంగా ఉండే, మీదికుండే. నీలా. 3.49.

**నిలగొయ్య** రూ.చూ. నిలుగొయ్య. వి. మిడిగూటం, నేత బయలులో చివరపాతినకొయ్య. < నిలువు + కొయ్య. **నిలరాట** రూ.చూ. నిలువురాట. వి. నిట్టాడి, ఇంటిమధ్య పాతే పొడుగాటి కొయ్య స్తంభం. <నిలువు + రాట. **నిలవరము** వి. 1. ఒక మొత్తంలో ఇంకో మొత్తంతీసివేయగా నిలిచినది ; 2. నిజం. **నిలుగుంజ** వి. నిలువు, ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య. < నిలువు + గుంజ. **నిలుగొయ్య (-కొయ్య)** రూ. నిలగొయ్య. వి. మిడిగూటం. <నిలువు + కొయ్య. **నిలుగ్రుడ్లుపడు** అ.క్రి. కనుగ్రుడ్లు ఆడక నిలిచిపోవు. <నిలువు + గ్రుడ్లుపడు. **నిలుపీట** వి. అనుజంగ, అనుపీటలు బిగించిన పొడుగుపట్టె. <నిలువు + పీట. **నిలుబద్ద** వి. నిలువు పట్టె, మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగు పట్టె. <నిలువు + బద్ద. **నిలుబేడం** వి. తలుపులకు నిలువు గడియ. <నిలువు + బేడము. **నిలుంపాత** వి. మూసకట్టులోని నిలువు కర్ర. <నిలువు + పాత. **నిలువంగి** రూ. నిలువుటంగీ. వి. పొడవైన చొక్కా. హంస. 3.99. <నిలువు + అంగి. **నిలువడ్డ** వి. నిలువు ఆకుల రాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య. <నిలువు + అడ్డ. **నిలువాకులు** వి.బ.వ. 1. పట్టుదారం చుట్టే డొలక కట్టుబడిలో అడ్డ ఆకులకు ఆధారంగా ఇరుసుకు బిగించిన పట్టెలు ; 2. బీమ్ చక్రం కట్టుబడిలో, అడ్డాకును, ఇరుసును కలిపే కొయ్య పట్టెలు. <నిలువు + ఆకు + -లు. **నిలువిచ్చు** అ.క్రి. నిలువుదోపిచ్చు. తాళ్ల.సం. 3.452, <నిలువు + ఇచ్చు. **నిలువీఁత** రూ. నిలువుటీఁత. వి. నిలబడి ఈదే ఈత. ఘటికా. 2.130. <నిలువు + ఈఁత. **నిలువుఅస్తం** వి. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా

బిగించిన పొడుగుపట్టె. సం. హస్త-. చెయ్యి. <నిలువు+ సం. హస్త. **నిలువుకట్టె** వి. 1. రాటికి ఆధారంగా పాతిన నిలువుకొయ్య ; 2. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె ; 3. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుకంబం** వి. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుకమ్మ** వి. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుకమ్మి** వి. 1. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య ; 2. రాట్నం అడ్డపట్టె ; 3 డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య ; 4. దొడ్డిబిల్లకు వేసిన నిలువు కొయ్య ; 5. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువు చెక్క ; 6. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె ; 7. అచ్చు కట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె ; 8. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె ; 9. ద్వారబంధపు నిలువుపట్టె. **నిలువుకర్ర** వి. 1. పోటీకర్ర, పరంజాను నిలిపే పొడుగాటి కర్ర ; 2. నిచ్చెనకు రెండు వైపులా ఉండే పొడుగాటి కర్ర. **నిలువుకర్రలు** వి.బ.వ. డాబీ తడక బిగించిన పొడుగు కొయ్యలు. **నిలువుకాగు** వి. మూడుమూరలు ఎత్తుఉండే పెద్దమట్టిపాత్ర. **నిలువుకామ** వి. సూలం, రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. **నిలువుకాలు** వి. ఊతకాలు, నేలమీద మోసే ఊత కొయ్య. **నిలువుకాళ్లు** వి.బ.వ. 1. మ్రాన్పడి నిలిచి పోవటం ; 2. నిలుచున్నవాడు నిలుచున్నట్లుగానే అనుకొన్న పనిని చేయటం. **నిలువుకుండ** వి. నిలువుగా ఉండే నీళ్ళకుండ. **నిలువుకూజా** వి. పైన పొడుగ్గా సన్న మూతి మధ్య పొట్ట ఉండి నిలువుగా ఉండే కూజా. **నిలువుకొమ్ము** రూ. నిలువుగొమ్ము. వి. నిలువు పన, నిటారుగా ఉన్న కొమ్ము. **నిలువుకొయ్య** రూ. నిల్వుకొయ్య. వి. 1. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; 2. రాట్నం అడ్డపట్టె ; 3. మరాను ఇరుసును మోసే పొడుగు కొయ్య ; 4. అచ్చుకట్టే జంత్రం కింది పీటకుగాని, నిలువు కమ్మికిగాని బిగించిన పుల్ల ; 5. మరమగ్గం చట్రం నిలబెట్ట టానికి ఆధారంగా నేల బయలులో పాతిన కొయ్యరాట ; 6. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె ; 7. పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును మోసే నిలువు కొయ్య. **నిలువుకొలువు** రూ.చూ. నిల్వుకొల్వు. వి. నిలబడి చేసే సేవ. **నిలువుకోతలు** వి.బ.వ. బాధాకరాలు. కవిక. 4.181. **నిలువుగన్నులు** (-కన్నులు) వి.బ.వ. ఆశ్చర్యం. హంస. 2.141. **నిలువుగమ్మి** (-కమ్మి) వి. పారు, బండి చట్రంలో నిలువుపట్టె. **నిలువుగాళ్లు** (-కాళ్లు) వి.బ.వ. తావకాళ్ళకు వెనకమాను మొ॥ వాటి కాధారంగా నాటిన స్తంభాలు. **నిలువుగాళ్లుపడు** (-కాళ్లుపడు) అ.క్రి. స్తంభించిపోవు. **నిలువుగుజ్జు** వి. 1. పత్తిరాట్నం అడ్డపీటకు దిగ్గొట్టిన కొయ్య ; 2. డబ్బా రాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క ; 3. పట్టుదారం వడికే పెద్దరాట్నం ఇరుసును మోసే నిలువు కొయ్య ; 4. సిపాయిగుజ్జు, దూలానికీ, మేల్దూలానికీ మధ్య నిలిపిన పొడుగాటి ఒంటిగుజ్జు. **నిలువుగుంజ** వి. 1. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువు కొయ్య ; 2. అడ్డగుమ్మి తిరగటానికి ఆధారంగా అడ్డకట్టెకు పాతిన నిలువు కొయ్య ; 3. మరాను ఇరుసును మోసే పొడుగు కొయ్య ; 4. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె ; 5. మరమగ్గం చట్రం నిలబెట్ట టానికి ఆధారంగా నేత బయలులో పాతిన కొయ్యరాట. **నిలువుగుతి** రూ.చూ. నిలువుగుది. వి. పావతాడు, పూను గర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు. **నిలువుగుది** రూ. నిలువుగుతి. వి. పావతాడు, పూనుగర్రనూ పావుచెక్కనూ కలిపే తాడు. **నిలువుగూటం** వి. నవారు కొయ్య, నవారు నేసేచోట మగ్గానికి ఒక పక్క నేలలో పాతిన గూటం. **నిలువుగుమ్మడి** వి. బూడిదగుమ్మడి, పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగపైరు (Benincasa Cerifera). **నిలువుగూన** వి. సారా తయారీలో పొయ్యి మీద పెట్టే పెద్ద కాగు. **నిలువుగొట్టము** వి. నిలువుగా (పొడుగ్గా) ఉండే గొట్టం. **నిలువుగొమ్ము** (-కొమ్ము) రూ.చూ. నిలువుకొమ్ము. వి. నిలువుపన, నిటారుగా ఉన్న కొమ్ము. **నిలువుగొలువు** (-కొలువు) వి. నిలుచుండి చేసే సేవ. **నిలువుచాపు** వి. తొక్కుడుపీట, డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె. **నిలువుచిమ్ము** రూ. నిలువుజిమ్ము. వి. కొమిరె, సిడె (ఏతపు మాను) కు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య. **నిలువుచూపులు** వి.బ.వ. రెప్పపడని చూపులు. కవిక. 4.163. **నిలువుచూఱ** వి. నిలువుదోపు, భయంచేతగాని, భక్తిచేతగాని శరీరానికిఉన్న వస్తువు లన్నిటినీ దేవతాదుల కివ్వటం. గౌ. హరి. ఉ. 411 పం. **నిలువుచూఱగా** క్రి.విశే.ద్రు. నిలువుదోపుగా. **నిలువుచెక్క** వి. నిలువుపట్టె, మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుజంగ** వి. 1. ఆనుజంగ, ఆనుపీటలు బిగించిన పొడుగు పట్టె ; 2. నిలువుకమ్మి, అచ్చు కట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె. **నిలువుజాడి** వి. జంపుజాడీ, ఊరగాయ పెట్టటానికి నిలువుగా చేసిన మట్టిపాత్ర. **నిలువుజిమ్ము**(-చిమ్ము) రూ.చూ. నిలువుచిమ్ము. వి. కొమిరె, సిడెకు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య. **నిలువుజీతము** వి. నిలుచుండి సేవలుచేసే ఏర్పాటు చేసుకొని ఇచ్చే జీతం. **నిలువుటంగీ** రూ.చూ. నిలువంగి. వి. పొడవు చొక్కా. <నిలువు+అంగీ. **నిలువుటద్దము** రూ.చూ. నిల్వుటద్దము. వి. నిలువు ప్రమాణంకల అద్దం. ఉ.రా. 6.127. < నిలువు + అద్దము. **నిలువుటీత** రూ.చూ. నిలువీత. వి. నిలబడి ఈదే ఈత. యయా. 3.69. < నిలువు + ఈత. **నిలువుతాడు** రూ. నిల్వుతాడు. వి. 1. చెంప తాడు, కుచ్చు తాళ్ళలో డైమను తాడుకు ఒకవైపు కట్టినదారం ; 2. పావతాడు పూను గర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు ; 3. బిర్రు తాడు. మరమగ్గం నిలువు పట్టెను మేరువుపలకకు బిగించి సన్నపుల్లతో వడిపెట్టినదారం. **నిలువుతాళము** వి. పొడవుగా కడ్డీలాగా ఉండే తాళపుబుర్ర. **నిలువుతిత్తొలుచు** అ.క్రి. శరీరచర్మం విడదీయు. పండి. చ. ప్రథమ. 3.618పు. <నిలువుతిత్తి + ఒలుచు. **నిలువుతెపాళా** వి. నోరుఎంత ఉంటుందో మట్టుకూడ అంతే ఉండే మట్టిపాత్ర. **నిలువుదబర**

వి. నిలుపునట్టి, సిలువుగా అంచు వెడల్పుగా చేసిన మట్టి పాత్ర. నిలువుదబ్బ వి. **1**. ఆనుజంగ, ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె; **2**. రాటిఆకులను కలిపే నిలువుపల్ల; **3**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె. **నిలువుదారం** వి. **1**. పేటుదారం, నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడ దీసిన దారం; **2**. మగ్గంలో పూను గర్రకు కట్టినదారం; **3**. కుచ్చుతాళ్ళలో డైమనుతాడుకు ఒకవైపున కట్టినదారం. **నిలువుదొడ్డి** వి. డబ్బారాట్నం చక్రం బిగించే కొయ్యచట్రం. **నిలువుదోని** వి. పోతుదోనె, మోటబొక్కెన నీళ్ళుకుమ్మరించే చోటు. **నిలువుదోపిచ్చు** స.క్రి. నిలువుదోపిడి ఇచ్చు. ఆము. 7.13. <నిలువు దోఁపు + ఇచ్చు. **నిలువుదోపిడి** రూ. నిలువుదోవు. వి. **1**. ఇంట, వంట నున్న దానినంత దొంగలు అపహరించటం; **2**. మొక్కుబడి ప్రకారం ధరించిన నగలన్నీ దేవుడికి కానుక పెట్టటం. **నిలువుదోపిడీయిచ్చు (-ఇచ్చు)** స.క్రి. శరీరంలో ఉన్న ఆభరణాదులన్నిటినీ ఇచ్చు. సారంగ 3.162. **నిలువుదోపు** రూ.చూ. నిలువుదోపిడి. వి. **1**. ఇంట, వంటనున్న దానినంత దొంగలు అపహరించటం; **2**. మొక్కుబడి ప్రకారం ధరించిన నగలన్నీ దేవునికి కానుకపెట్టటం. **నిలువున** క్రి. విశ. ద్రు. **1**. నిలుచునట్లుగా; **2**. ఆపాదమస్తకం. **నిలువునగ** వి. నిలబెట్టిన కొయ్యవాసం. **నిలువునఁగూలు (-కూలు)** అ.క్రి. మొత్తంగాకూలు. ఉ. హరి. 1.53. **నిలువునఁగ్రాఁగు (-క్రాఁగు)** అ.క్రి. నిలిచినది నిలిచినట్లుగానే పరితాపం పొందు భార. విరా. 2.335. **నిలువునచీల్చు** స.క్రి. శరీరాన్ని నిలువుగా చీల్చు. ఒకరకమైన తిట్టు. **నిలువునసీరుగఁగరఁగించు (-కరగించు)** స.క్రి. పూర్ణంగా ఆనందపరవశం గావించు. శుక. 2.186. **నిలువునసీఱగు** అ.క్రి. నిలువెల్లా నాశనమగు. పారి. 5.12. <నిలువు + -నన్ + నీఱు + అగు. **నిలువునవొలిపించు (-ఒలిపించు)** అ.క్రి. ఒంటిమీద ఉన్నవన్నీ ఒలిచిపెట్టు. పాండు. 5.98. **నిలువునపాతివేయు** స.క్రి. శరీరాన్ని కప్పెట్టు, ఒకతిట్టు. **నిలువునిలివెడు** విశ. మనిషిఎత్తు. శుక. 1.222. **నిలువునిస్తారము** వి. ఆపాదమస్తకం. **నిలువునీరునఁబండినట్లు (-పండినట్లు)** అవ్య. సమృద్ధమైన నీరు నిలిచిన చేనులో పండిన పైరురీతిగా. సారంగ. 2.42. **నిలువునీఱగు** అ.క్రి. రూపమెల్ల భస్మమగు, పూర్ణంగా నశించు, భాస్క. రా. అరణ్య. 2.76. <నిలువు + నీఱు + అగు. **నిలువునూరుపండినట్లు** అవ్య. దిట్టంగా. నేత్రపర్వంగా, సమృద్ధిగా ఉన్నట్లు. తాళ్ల. సం. 8.248. **నిలువునూరుపండినరీతి** అవ్య. ద్రు. దిట్టంగా, సమృద్ధిగా ఉన్నవిధంగా. విప్ర. 2.78. **నిలువుపట్ట** రూ.చూ. నిలువుపట్టె. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; **2**. రాట్నం అడ్డపట్టె; **3**. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; **4**. డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; **5**. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; **6**. ఆనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; **7**. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె **8**. నేలమీద మోసే ఊడ్తెకొయ్య; **9**. అచ్చుకట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె; **10**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; **11**. డాబీచట్రం పొడుగుబద్ద; **12**. పట్టుదారం తోడే ఆను అడ్డ పీటలు బిగించిన పొడుగు పట్టె. **నిలువుపట్టి** రూ.చూ. నిలువుపట్టె. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; **2**. రాట్నం అడ్డపట్టె; **3**. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; **4**. డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; **5**. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; **6**. ఆనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; **7**. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె: **8**. నేలమీద మోసే ఊడ్తెగొయ్య; **9**. అచ్చుకట్టే జంత్రం కింది పీటకు బిగించిన పొడుగుపట్టె; **10**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగు పట్టె; **11**. డాబీచట్రం పొడుగుబద్ద; **12**. పట్టుదారం తోడే ఆను అడ్డ పీటలు బిగించిన పొడుగుపట్టె. **నిలువుపట్టీ** చూ. చూ. నిలువుపట్టె. వి. **1**. ఆకులరాట్నంఇరుసు బిగించే నిలువుకొయ్య; **2**. రాట్నం అడ్డపట్టె; **3**. డబ్బారాట్నం. ఇరుసు బిగించిన నిలువుకొయ్య; **4**. డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; **5**. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; **6**. ఆనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; **7**. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె; **8**. నేలమీద మోసే ఊడ్తెకొయ్య; **9**. అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగు పట్టె; **10**. మరమగ్గం చట్రంలో, పక్కగా బిగించిన పొడుగు పట్టె; **11**. డాబీచట్రం పొడుగుబద్ద; **12**. పట్టుదారం తోడే ఆను అడ్డపీటలు బిగించిన పొడుగుపట్టె. **నిలువుపట్టు** వి. నేతలో నిలువుకు వాడే పట్టుదారం. **నిలువుపట్టె** రూ. నిలువుపట్ట, నిలువుపట్టి, నిలువుపట్టీ. నిల్వుపట్ట, నిల్వుపట్టి, నిల్వుపట్టీ, నిల్వుపట్టె. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; **2**. రాట్నం అడ్డపట్టె; **3**. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య; **4**. డబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె; **5**. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క; **6**. ఆనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె; **7**. ఆనుపీటలు బిగించిన పొడుగుపట్టె; **8**. నేలమీద మోసేఊడ్తె కొయ్య; **9**. అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; **10**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె; **11**. డాబీ చట్రం పొడుగుబద్ద; **12**. పట్టుదారంతోడే ఆను అడ్డపీటలు బిగించిన పొడుగు పట్టె; **13**. ద్వారబంధపు నిలువు కమ్మి. **నిలువుపట్టెపుల్ల** వి. మగ్గం కుచ్చుతాడు కట్టటానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యపుల్ల. **నిలువుపన** వి. నిలువుకొమ్మ, నిటారుగా ఉన్న కొమ్మ. **నిలువుపార** వి. పరంకొమ్మ, బండి చట్రంలోని నిలువుపట్టె. **నిలువుపాలు** వి. పరంకొమ్మ, బండి చట్రంలోని నిలువుపట్టె. **నిలువుపీట** రూ. నిలువుపీటె. వి. **1**. రాట్నం అడ్డపట్టె; **2**. మొగలాను అడ్డపీటలు బిగించిన పొడుగు కొయ్య; **3**. అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె; **4**. నవారు

మగ్గం అడ్డపీటకు కింద బిగించిన పొడుగుపట్టె. **నిలువుపీటె** రూ.చూ. నిలువుపీట. వి. **1**. రాట్నం అడ్డపట్టె ; **2**. మొగలాసు అడ్డపీటలు బిగించిన పొడుగుకొయ్య ; **3**. అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె ; **4**. నవారు మగ్గం అడ్డపీటకు కింద బిగించిన పొడుగుపట్టె. **నిలువుపుల్ల** వి. రాటి ఆకుల్ని కలిపే నిలువుపుల్ల. **నిలువుపెంకు** వి. కప్పు పెంకు, ఇల్లు కప్పడానికి వాడే మామూలు పెంకు. **నిలువుపెండలము** వి. ఒకరకం దుంపమొక్క (Dioscorea alata). **నిలువుపోస్టు** వి. **1**. నిలబెట్టిన కొయ్యవాసం ; **2**. మూనకట్టులోని నిలువుకర్ర. ఇం. *Post*. స్తంభం. <నిలువు+ఇం. Post. **నిలువుబండ** వి. **1**. గోడకట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను, రాళ్ళను మధ్యఉంచి సందులు తప్పించి పక్కన మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి ; **2**. గేడిబండ, ద్వారబంధపు నిలువుకమ్మీకి గోడకు మధ్యలో బిగించిన రాయి. **నిలువుబద్ద** వి. **1**. రాటి ఆకుల్ని కలిపే నిలువుపుల్ల; **2**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుబల్ల** వి. అచ్చుకట్టే జంత్రం కిందిపీటకు బిగించిన పొడుగుపట్టె. **నిలువుబారు** వి. **1**. నిలబెట్టిన కొయ్యవాసం ; **2**. రాట్నం అడ్డపట్టె. **నిలువుబెండు** వి. ద్వారబంధపు నిలువుకమ్మి. **నిలువుబెలుగు** వి. నిలబెట్టిన కొయ్యవాసం. **నిలువుబొట్టు** వి. వైష్ణవ భక్తుల బొట్టు. **నిలువుబొమ్మ** వి. డబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క. **నిలువుబోటి(-పోటి)** వి. మూనపోటీకి నిలిపిన కర్ర. **నిలువుమగ్గం** వి. తివాసీలు నేసే మగ్గం. **నిలువుమంటపము** వి. పై అంతస్తు మంటపం. సం. మండప-. చవికె, రాతికట్టడం. <నిలువు+సం. మండప-. **నిలువుమంద** వి. పొలాల్లో రాత్రిపూటల్లో పశువుల్ని తాత్కాలికంగా మందపెట్టించే చోటు. **నిలువుంబేకలు(-పేకలు)** వి.బ.వ. పడుగుంబేకలు. నేతలో పొడుగు, అడ్డం. **నిలువురాట** రూ. నిలరాట. వి. డబ్బారాట్నం ఇరుసు బిగించిన నిలువుకొయ్య. **నిలువురాయి** వి. **1**. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళను మధ్యఉంచి సందులుతప్పించి పక్కల మూలల్లో బలంకోసంఉంచే పొడుగాటి పెద్దరాయి ; **2**. వాకిలికి అడ్డంగా నిలబెట్టిన విశాలమైన రాయి ; **3**. సరిగుంజ, ఆరుబయట పడుగుచాపటానికి నేలలో పాతిన రాతిస్తంభం. **నిలువురేవు** రూ. నిల్రేవు, నిర్రేవు. వి. వీధిరేవు, ఆముకు మధ్యభాగంలో పొయ్యికి ఎదురుగా చక్కగా ఉండే పెద్దరేవు. **నిలువుల పళ్లిక** వి. అంతస్తులుగా ఏర్పరచి తీగలు మున్నగు వాటిచే అల్లిన తట్ట. పండి.చ. 5.346 పు. **నిలువులాడి** వి. కామిరె, దోర్నపట్టె కాధారంగా ఉండే నిలువు గుంజ. **నిలువులు** వి.బ.వ. **1**. నిలువొర్లు, వంపు, ఒరలకు మధ్య అమర్చటానికి 4 లేక 5 అడుగుల కైవారంతో తయారు చేసినట్టి తిన్నగా ఉండే ఒరలు ; **2**. ద్వారపు గుర్రం పీటలకు వెనక భాగంలో ఊతగా ఉంచే కమ్ములు. **నిలువులుపడు** రూ. నిలువులువడు. అ.క్రి. నిశ్చేష్టమగు. నిర్వ.రా. 6.144. **నిలువులువడు(-పడు)** రూ.చూ. నిలువులుపడు. అ.క్రి. నిశ్చేష్టమగు. బసవ. 3 పు. 567 పం. **నిలువుసట్టి(-చట్టి)** వి. నిలువుదబర, నిలువుగా అంచు పెడల్పుగా చేసిన మట్టిపాత్ర. **నిలువుసాంచె** వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు, పడుగుపోగుల్లో కొన్నిటిని పైకిఎత్తే నిలువు దారాలు. **నిలువుసొంగ(-చొంగ)** వి. పొడుగుసొంగ, పొగపీల్చటానికి వాడే మట్టిగొట్టం. **నిలువుస్తంబం** రూ.చూ. నిలువుస్తంభం. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; **2**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతినరాట ; **3**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువుస్తంభం** రూ. నిలువుస్తంబం, నిలువుస్థంబం. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; **2**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతినరాట ; **3**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. సం. స్తంభ-. స్తంభం. <నిలువు+సం. స్తంభ-. **నిలువుస్థంబం** రూ.చూ. నిలువుస్తంభం. వి. **1**. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; **2**. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతినరాట ; **3**. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టె. **నిలువెల్ల కనకంబు** వి. ఒళ్ళంతా బంగారం. శుక. 1.206. సం. కనక-. బంగారం. <నిలువు+ఎల్ల+సం. కనక-. **నిలువొరలు** రూ. నిలువొర్లు. వి.బ.వ. నిలువులు, వంపు ఒరలకు మధ్య అమర్చటానికి **4** లేక 5 అడుగుల కైవారంతో తయారుచేసినట్టి తిన్నగా ఉండే ఒరలు. <నిలువు+ఒరలు. **నిలువొర్లు** రూ.చూ. నిలువొరలు. వి.బ.వ. నిలువులు, వంపు ఒరలకు మధ్య అమర్చటానికి **4** లేక 5 అడుగుల కైవారంతో తయారుచేసినట్టి తిన్నగా ఉండే ఒరలు. **నిలువోపు** అ.క్రి. ఓర్చు, సహించు. <నిలువు+ఓపు.

**నిలువెల్ల కనకంబు** చూ. నిలువు.

**నిలువొరలు** చూ. నిలువు.

**నిలువొర్లు** చూ. నిలువు.

**నిలువోపు** చూ. నిలువు.

**నిల్కడ** రూ. నిలకడ, నిలుకడ. వి. **1**. స్థిరత్వం, నిశ్చలత్వం. భార. ఆరణ్య. 1.358 ; **2**. ధైర్యం. రం.రా.బాల. 9 పు. 4 పం ; **3**. ఉత్థానం, నిలబడటం. హరి. పూ. 4.175 ; **4**. స్థితి, ఉనికి, వాసస్థానం. చంపూరా. 1.83 ; **5**. నాట్యస్థితి విశేషం. బహుళా. 5.77 ; **6**. అభినివేశం, పట్టుదల. ఉ.రా. 8.99 ; **7**. సమాప్తం, ముగింపు ; విణ. స్థిరమైన. ఉ.రా. 2.9.

**నిల్చు** రూ.చూ. నిలుచు. అ.క్రి. **1**. నిలబడు, నిలుచుండు. భార.ఆది. 3.201 ; **2**. యుద్ధాల్లో నిలబడు, వెనుదీయకుండు. భార.ఆది. 4.204 ; **3**. వర్తించు. భార.విరా. 5.323 ; **4**. జీవించు, బతుకు. పండి.చ. 5.253 పు. ; **5**. మాను, విరమించు. దశకు. 3.71 ; **6**. శేషించు. మిగులు. ఉ.హరి. 1.11 ; **7**. నివసించు, కాపురముండు, హర. 7.177 ; **8**. పాదుకొను, స్థిరంగాఉండు. భీమ. 5.143 ; **9**. వెళ్ళటం మాను. విక్ర. 3.73 ; **10**. కూర్చుండు. జైమిని భా. 1.137 ; **11**. చెడకుండు, నశింపకుండు. ఆము. 3.69 ; **12**. కలుగు, పుట్టు. కవిక. 1.45 ; **13**. సమాహితచిత్తుడగు, మారుచింత లేకుండు.

లు + ఆరికె. నీళ్లార్చు స.క్రి. స్నానం చేయించు. రాజ.చ. 2.122. <నీరు + -లు + ఆర్చు. నీళ్లు వి.బ.వ. నీరు. <నీరు + -లు. నీళ్లకారు రూ.చూ. నీళ్లగాఱు. అ.క్రి. 1. పాయు, చెడు ; 2. నిర్వీర్యమగు. నీళ్లకార్చు అ.క్రి. పని సానుకూలం చెయ్యకపోవు. నీళ్లకాఱు రూ.చూ. నీళ్లగాఱు. అ.క్రి. 1. మందమతితో ఉండు ; 2. దిగజారిపోవు. నీళ్లగట్టు(-కట్టు) అ.క్రి. చెట్లు మొ॥ వాటికి నీళ్ళు పెట్టు. వి.ప. 220. నీళ్లగాఱు(-కాఱు) రూ. నీళ్లకారు, నీళ్లకాఱు. అ.క్రి. ఉత్సాహం లేకుండు. నీళ్లచెల్లు అ.క్రి. ఋణం తీరు. నందక. 136. నీళ్లతట్టుకుపోవు స.క్రి. బయటికిపోవు, కాలవ తట్టుపోవు, దొడ్డికిపోవు. నీళ్లతోడు స.క్రి. 1. స్నానానికి నీళ్ళు పెట్టు ; 2. అపకారం చేయు. నీళ్లత్రాగినట్లగు అ.క్రి. సులభమగు, వశమగు. నిరంకు. 4.72. నీళ్లత్రాగినట్లు అవ్య. 1. కంఠోక్తిగా ; 2. అతిసులభం. నీళ్లత్రాగు స.క్రి. కల్లుత్రాగు. నీళ్లనమలు అ.క్రి. సందేహించు, సంశయించు. గొ.హరి. ప్ర. 122, ప్రభా. 4.8. నీళ్లపోసికొను అ.క్రి. 1. గర్భవతియగు ; 2. ఋతుస్నాత అగు. నీళ్లపోసేదిక్కులేకుండ అ.క్రి. ఆత్మలెవరూ లేకుండు. నీళ్లమోపించు అ.క్రి. నీళ్ళు మోయించు. కు.సం. 4.25. నీళ్లమోయించు అ.క్రి. తనకు దానుడుగా చేయించు. వి.ప. 2.84. నీళ్లవదులు అ.క్రి. ఆశవదులు. నీళ్లవిడుచు అ.క్రి. ఇకరాదని వదిలివేసుకొను. నీళ్లోడు అ.క్రి. నీళ్ళుకారు. <నీరు + -లు + ఓడు. నీళ్ళజేని వి. నదీతీరాల్లో పెరిగే చిన్న మొక్క (Homonosa Retusa). నీళ్ళమ్రి వి. సువాసనకల తెల్లని పూలూ నీలిరంగు పళ్ళూ ఉండే చెట్టు (Symplocos Beddomei). నీళ్ళవుప్పి వి. తోటల్లో పెంచబడే ఒకరకం మొక్క (Clerodendeon Inerme).

నీరుడు రూ.చూ. నీరు. వి. మూత్రం.

నీరెండ చూ. నీరు.

నీరెత్తు చూ. నీరు.

నీరెత్తువంగ చూ. నీరు.

నీరేటికడవలు చూ. నీరు.

నీరేనుఁగు చూ. నీరు.

నీరేగ్గు చూ. నీరు.

నీరొట్టియ చూ. నీరు.

నీరొట్టు చూ. నీరు.

నీరొద్ది చూ. నీరు.

నీరోలుం చూ. నీరు.

నీర్కట్టి చూ. నీరు.

నీర్కడిమి చూ. నీరు.

నీర్కావి చూ. నీరు.

నీర్కావివంచె చూ. నీరు.

నీర్గప్పిననివ్వ చూ. నీఱు.

నీర్గొబ్బి చూ. నీరు.

నీర్చిచ్చు చూ. నీరు.

నీర్చిచ్చుకాఁడు చూ. నీరు.

నీర్తల చూ. నీరు.

నీర్తాలు చూ. నీరు.

నీర్నేల చూ. నీరు.

నీర్పిల్లి చూ. నీరు.

నీర్మట్టు చూ. నీరు.

నీర్వట్టు చూ. నీరు.

నీర్వామి చూ. నీరు.

నీర్వకాల్వ రూ.చూ. నీరనకాల్వ. వి. ఆముతో కుండలు నరిగా కాలని తీరు.

నీర్వపెంకు రూ.చూ. నీరసపెంకు. వి. అవేలిపెంకు, కాలీకాలని పెంకు.

నీఱగు చూ. నీఱు.

నీఱు రూ. నిగుఱు, నివుఱు. వి. భస్మం, బూడిద. కు.సం. 5.82.

క. నీఱు. భస్మం, బూడిద ; త. నీఱు (నీఱ్). బూడిదగు, ధూళి, బూడిద, నీఱు (నీఱ్-). బూడిదచేయు, నివఱు (నివఱ్). పొడిచేయబడిన ; మ. నీఱుక. కాలి బూడిదగు, నీఱల్. రగిలేబాధ, నీఱుక. మండి భస్మంగా మారు, నీఱు. బూడిద ; గోం. నీర్. బూడిద ; పర్జి. నీడ్. బూడిద.

<మూ. ద్రా. *నీఱ్

నీర్గప్పిననిప్పు రూ.చూ. నీఱుగప్పిన నిప్పు. వి.బూడిదచే కప్పబడిన నిప్పు. నిరంకు. 2.105. <నీఱు + కప్పిననిప్పు. నీఱగు అ.క్రి. భస్మమగు, నశించు. బసవ. 3.79. < నీరు + అగు. నీఱుగప్పిననిప్పు రూ. నీర్గప్పిననిప్పు. వి. పైకి గొప్పగా కనపడకున్నా లోపల సత్వమున్న అన్న ఛాయలతో వాడే మాట. భార. విరా. 1.228. నీఱుగవిసిన నిప్పు వి. 1. బూడిదచే కప్పబడిన నిప్పు. భార. విరా. 5.351 ; 2. మరుగుపడిన మహిమ కలవాడు. నీఱుచేయు స.క్రి. బూడిదచేయు. కు.సం. 5.53. నీఱువాఱు(-పాఱు) అ.క్రి. వ్యాపించు, బూడిదగు. పండి.చ.ప్రథ. 2.397 వ.

నీల వి. నల్లజీడిరంగు.

సం. నీల-. నల్లనిది, నలుపు.

<సం. నీల-.

నీలఉన్ని వి. నలుపురంగుఉన్ని. నీలకంఠం వి. ఒకరకం నలుపురంగు, నెమిలికంఠం రంగు. సం. నీలకంఠ-. నెమలి. <సం. నీలకంఠ- (అర్థవిపరి.). నీలగొర్రె రూ. నీలిగొర్రె. వి. నల్లరంగు బొచ్చుగల గొర్రె. నీలఁడు వి. అశ్వవిశేషం. సిం.ద్వా. 3.141. నీలపురిగొంగడి రూ. నీలిపురి గొంగడి. వి. లంకపూగొంగడి, నీలంరంగు ఉన్నితో నేసిన గొంగడి.

నీలం రూ. నీశం. వి. 1. పీచుతక్కువ, తీపి ఎక్కువ ఉన్న చిన్న మామిడి పండు ; 2. సిరా రంగులు కలిసిన ఒక రకం రంగు.

సం. నీల-. నల్లనిది, నలుపు.

<సం. నీల-. అర్థవిపరి.

నీలంచిప్స్‌రాయి వి. ఎర్రమొరంరాయి, సాంకేతికంగా సున్నపురాయి (Calcium spar). < ఆం. chip. నీలంచీర వి. నీలంరంగు రాయి. నీలంపురి వి. పీచుతక్కువ, తీపి ఎక్కువ ఉన్న చిన్న మామిడి పండు. నీలంబెడ్డ వి. ఎరుపు

రంగు రాయి (Ocher).

**నీలదాక** చూ. నీరు.

**నీలపోతబుడ్డి** చూ. నీరు.

**నీలంపు** చూ. నీరు.

**నీలాజాలము** వి. 1. సులభం; 2. అజాగ్రత్త, లెక్కలేకుండటం.

**నీలాంజనము** వి. దీపపుసెమ్మె.

సం. నీలాంజన-. నల్లకాటుక, నీలాంజనా. మెరుపు.

<సం. నీలాంజన- (అర్థవిపరి.).

**నీలాటిరేవు** చూ. నీరు.

**నీలాపనింద** చూ. నీరాపనిందలు. రూ. నిలాపనింద. వి. కారణం లేకుండా వచ్చిన నింద.

**నీలాంబరం** వి. ఒకరకం నీలంరంగు.

సం. నీలాంబర-. నల్లటిబట్ట, తాళిసపత్రి.

<సం. నీలాంబర-. (అర్థవిపరి.).

**నీలాంబ్రము** వి. ఎప్పుడు మంచినీటి పారుదల గల భూమి.

సం. నీలాంబర-. నల్లని ఆకారం.

<సం. నీలాంబర-.

**నీలారి** చూ. నీరు.

**నీలారెక** రూ.చూ. నీటారిక. వి. ఆరిక గడ్డిలో ఒకరకం కలుపు మొక్క (Paspalum scrobiculatum).

**నీలాలి** వి. ద్విముఖ దీపిక. ఆం.భా. 2.165.

**నీలాలు** వి.బ.వ. 1. కన్నీళ్ళు; 2. దేవునికి మొక్కుబడి యిచ్చిన తలవెంట్రుకలు.

<సం. నీల-+-ము+-లు (అర్థవిపరి.).

**నీలి**[1] వి. మల్ల విద్యాసాధన విశేషం. ఆం.భా. 2.207.

**నీలి**[2] వి. 1. నలుపు, నీలిమ. కు.సం. 8.99; 2. నీలిమందు. ద. హిం. శా. సంపు. 7. శా. సం. 7.34. క్రీ.శ. 1228; 3. నీలవస్త్రం. ఆం.భా. 2.154; 4. నల్లనూలు; 5. ఇంద్రనీలం; 6. సాగుచేసే మెట్టపంట, కరునీలిచెట్టు (Indigofera Tinctoria); విశ. 1. నల్లని. మను. 4.33; 2. దుష్టురాలైన, ధూర్తురాలైన. పాండు. 3.71.

సం. నీల-. నల్లని; ప్రా. నీలీ. వనస్పతి విశేషం, నీలో. నీలిరంగు; అ. మా. నిల, నీలి. నీలిరంగు; పా. నీలి. నీలిచెట్టు, నీలిరంగు, నీల. నీలం;

క. నీలి; తు. నీలి; త. నీలి; మ. నీలం; ఒరయాన్. లీల్; కుఇ. నీలి; బ్రా. నీల్, నీలి.

<ప్రా. నీలీ.

**నీలిఎర** వి. బుట్టవిడిచిన తరవాత పది రోజులకు దనలి పురుగు విడిచే కూసం. **నీలికండ్లు** వి.బ.వ. అందమైన కండ్లు. **నీలికమ్మి** వి. నీలిరంగు దారంపెట్టి నేసినకమ్మి. **నీలికమ్మిచీర** రూ. నీలికమ్మిచీరె. వి. రెండుపోగుల నీలి వన్నె అంచు, కమ్మిపెట్టి నేసిన చీర. **నీలికమ్మిచీరె** రూ. చూ. నీలికమ్మిచీర. వి. రెండుపోగుల నీలివన్నె అంచు, కమ్మిపెట్టి నేసిన చీర. **నీలికాటైడిచీర** రూ.చూ. నీలికాట్రేడు చీర. వి. పంటకాట్రేడుచీర, గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర. **నీలికాట్రేడుచీర** రూ. నీలికాటైడిచీర. వి. పంట కాట్రేడుచీర, గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర. **నీలికుండ** వి. నీలితొట్టి, నీలిరంగు ఊరబెట్టే పెద్ద కుండ. **నీలికోవులు** వి.బ.వ. నీలిరంగు గుడ్డలు. **నీలికోళంబు** వి. నీలిరంగు నూలు ఎక్కువగాపెట్టి నేసిన తురకల గళ్ళలుంగీ. **నీలిగొర్రె** రూ.చూ. నీలగొర్రె. వి. నల్లరంగు బొచ్చుగల గొర్రె. **నీలిచాయ** రూ. నీలిసాయ. వి. ఒకరకం నల్లరంగు. **నీలిచీర** వి. దొంగల ఒక పనిముట్టు, నల్లనివస్త్రం. చెన్న బసవ. 3.294. **నీలిచెట్టు** వి. నీలిరంగు తయారీకి పనికి వచ్చే చెట్టు (Indigoferatinctoria). **నీలిజమికి** వి. నీలిరంగు పూలు పూసే చెట్టు (Passiflora Cacrulea). **నీలిడమాస్‌చీర** వి. నీలిరంగు పడుగులో మూడేసి వేళ్ళ వెడల్పు పట్టెలు, మూడేసి వేళ్ళ ఎడంలో పడేట్టు నేసిన చీర. **నీలితనము** వి. 1. దుష్టత్వం. చంపూ రా. 4.22; 2. మాయఏడుపు. **నీలితిన్నె** వి. ఇంద్రనీలవేదిక. యయా. 2.12. **నీలితొట్టి** వి. నీలికుండ, నీలిరంగు ఊరబెట్టే పెద్ద కుండ. **నీలిదట్టి** వి. నల్లనికాసెకోక, దొంగల ఒక పనిముట్టు. పరమ. 4.184. **నీలిపయ్యె** రూ. నీలిపసె. వి. నలుపు లేతఎరుపు కలిసిన రంగు. **నీలిపసె** రూ.చూ. నీలిపయ్యె. వి. నలుపు లేతఎరుపు కలిసిన రంగు. **నీలిపాపరుకంచుకోక** వి. ఒకరకం రంగుపెట్టి నేసిన చీర. **నీలిపురిగొంగడి** రూ. చూ. నీలపురిగొంగడి. వి. లంకపూగొంగడి, నీలంరంగు ఉన్నితో నేసిన గొంగడి. **నీలిబాన** వి. నీలికుండి, నీలిరంగు ఊరబెట్టే పెద్దకుండ. **నీలిమందు** వి. 1. బజారులో దొరికే విదేశపు నీలిరంగు; 2. నీలిఆకులు కడవల్లో ఊరబెట్టి తయారుచేసిన దేశవాళీ రంగు. **నీలిమబ్బు** వి. 1. వేట సాధనాల్లో ఒకటి. ద్వి.నల. 3.235 పం.; 2. నల్లమబ్బు. **నీలిరంగు** వి. 1. బొగ్గు మాదిరి ముదురునల్లరంగు; 2. నీలంరంగు మీద 'గ్రీన్స్' కలిపితే వచ్చే రంగు; 3. నీలం; 4. బులుగు, వర్ణపట్టికలో ఆకుపచ్చ, ఊదా రంగులకు మధ్యలోఉండే వర్ణం. **నీలివన్నె** వి. ముదురు నల్లరంగు. **నీలివన్నెచీర** వి. ఒకరకం నల్లవన్నె చీర. **నీలివార్త** వి. గాలివార్త. **నీలివిత్తనాలు** వి.బ.వ. నీలి మొక్క గింజలు. **నీలివావిలి** వి. లేతబచ్చలిపండు రంగు పూలు పూసే తీగ (Vitex Trifolia). **నీలిసాయ (-చాయ)** రూ.చూ. నీలిచాయ. వి. ఒకరకం నల్లరంగు.

**నీలిగించు** చూ. నీలుగు[1].

**నీలుగు**[1] రూ.చూ. నీల్గు[1]. అ.క్రి. 1. గాత్రవినామంచేయు, ఒళ్ళు విరుచుకొను, ఒళ్ళు వెనుకకు విరుచుకొను; 2. ఒళ్ళు నిగుడించు, ఒళ్ళు సాచు; 3. దేహాన్ని ఉబ్బించు, ఒళ్ళు పెంచు.

**నీలిగించు** స.క్రి. తిండిలేక మాడ్చు. **నీలుగుడు** వి. పొగరు.

**నీలుగు**[2] రూ.చూ. నిలుగు[3]. అ.క్రి. చచ్చు. నీలా. 3.56.

**నీలుమట్టం** చూ. నీరు.

**నీల్కుండ** చూ. నీరు.

**నీల్గు**[1] రూ. ఈలుగు, ఈల్గు, నిలుగు[1], నీలుగు[1]. అ.క్రి. 1. గాత్రవినామంచేయు, ఒళ్ళు విరుచుకొను, ఒళ్ళు వెనుకకు విరుచుకొను. భార.ఆది. 5.172; 2. దేహాన్ని ఉబ్బించు,

ఒళ్ళు పెంచు. హరి.పూ. **5.243** ; **3**. ఒళ్ళు నిగుడించు, ఒళ్ళు సాచు. భాగ. **8.374**.

క. నీళ్. పొడవు లేక ఎత్తు పెరుగు, వ్యాపించు, సాగబడు, నీళ. పెంపు, పొడవు, ఎత్తు, నీళితు. పొడవుగాఉన్న, నీళ్పు. పొడవు, నీడు. పెంచబడు, సాగదీయబడు, ఇచ్చు, పొడవు, ఎక్కువ, నీట. పొడవు ; కొడ. ని.ళ్. పొడవు, ని.డ్- (ని-. డ్డ్-). నిలువుగా సాగదీయు, ని.ట్- (ని.టి-), ని.డ్ ; తు. నీటుని, నీడుని. సాగదీయు, పొడవుచేయు, నీటావుని. సాగేటట్లు చేయు, పొడవుచేయు, నీట, నీటు. పొడవు పెంచబడిన, ఎత్తు, నీటానీటి. పొడవు ప్రకారం, నీచుని. పెంచు ; త. నీళ్ (నీళ్వ-, నీణ్డ్). పొడవుగాఉండు, పొడవు, పెంపు, ఎత్తు, నీళ. ఎక్కువ పొడవు లేక దూరం, చాల దూరంలో, నీళమ్. పెంపు, పొడవు, దూరం, నీళి (-ప్పి-, -త్-). పొడవు చేయబడు, పెంచబడు, ఎక్కువ కాలం, ఆలస్యం చేయబడు, నీళిప్పు. పెంచబడటం, నీళియతు. పొడవుగా ఉన్న, నీణు (నీణ్-). దూరం వెళ్ళు, నీటు (నీటి-). పొడవు పెరుగు, పొడవుసాగు, పెంచు, ఎత్తుకు పోవు, నీటి (-ప్పి-, -త్-). పొడవు చేయు (కాలం, దూరం). శాశ్వతంగా ఉండు, నీట్టు (నీట్టి-). పెంచు, సాగు, ఇచ్చు, లోపలికి పట్టేటట్లుచేయు, నీట్టు. పొడవు (కాలంలా). దూరం, నీట్టమ్. పొడవు, పొడవు చేయటం, బలం కలిగించటం, నీట్టల్. పొడవు చేయటం, పెంపు, లాగటం, నీట్టి (-ప్పి-, -త్-). పొడవుచేయు, ఆలస్యం, నికళమ్. పొడవు ; మ. నీళుక. ఎవరికివారు పెరుగు, పొడవు పెరుగు, నీళ, నీళే, నీళవే. దూరం, నీళమ్. పొడవు, దూరం, నీళల్. పొడవు పెరగడం, నీళ్, నీట్. పొడవు. నీటు. పొడవు, నీటుక. పొడవుగాఉండు, నీట్టుక. పొడవుచేయు, పెరగ నిచ్చు, ఆలస్యం, నీట్టమ్. పొడవు. సాగదీయు, నీట్టల్, పొడవుచేయు, నీట్టు. అధికారికమైన వ్రాత, దెబ్బ, నిచ్చెన, నీట్టిక్క. పొడవగు, సాగదీయబడు ; కో. ని.డ్- (ని.చ్-), ని.ణ్- (ని.డ్-). (ఇనుం) వ్యాకోచంవల్ల పొడవవడం, ని. ట్- (ని. ట్య-). పొడవుచేయు (ఇనుం), ని.ట్- (ని.చ్-). సాగదీయు (అవయవం) ; తొ. ని.డ్- (ని.డ్య-). సాగదీయ బడు (చెయ్యి), ని.ట్- (ని.ట్య-). సాగదీయు (చెయ్యి), ని.ళ్- (ని.డ్-). నిలువుగా సాగదీయబడు (తాడు). ఎవరికివారు సాగు. తొంగి చూచు ; కుఇ. ౖడీన్జ (ౖడీన్జి-). సాగదీయబడు, పొడవు చేయబడు, ౖడీస్క (ౖడీస్కి). బహువచనం, ౖడూ.ఇన్వ, ౖడూసుఇన్వ. పొడవు చేయబడు, సాగదీయబడు, తెరువబడు, ౖడూన్జ. పొడవు, పొడవు చేయబడిన, లాగబడిన, ౖడూన. బయటకు పొడవుగా లాగబడిన విధం.

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *నీ-శ్-/ *నివ్-ఉశ్ *నీ-ట్-, *నిట్-వ్-.

<మూ.మ.ద్రా. *నీశ్.

నీల్గు[2] రూ.చూ. నిలుగు[3]. అ.క్రి. చచ్చు. నార. పంచ. **1.85**.

నీల్గాక చూ. నీరు.

నీల్లటిక చూ. నీరు.

నీల్లసట్టి చూ. నీరు.

నీల్సట్టి చూ. నీరు.

నీళం రూ.చూ. నీలం. వి. బులుగు. వర్ణపట్టికలో **ఆకుపచ్చ**, ఊదారంగులకు మధ్య ఉండే వర్ణం.

నీళలముంచిననుబాలముంచినను చూ. నీరు.

నీళలాడు చూ. నీరు.

నీళ్లఅటక చూ. నీరు.

నీళ్లకడవ చూ. నీరు.

నీళ్లకుఎల్లుండి చూ. నీరు.

నీళ్లకుండీ చూ. నీరు.

నీళ్లగా(డి చూ. నీరు.

నీళ్లగురిగి చూ. నీరు.

నీళ్లగూన చూ. నీరు.

నీళ్లగోలం చూ. నీరు.

నీళ్లగోలెం చూ. నీరు.

నీళ్ల(గలయు చూ. నీరు.

నీళ్ల(గలియు చూ. నీరు.

నీళ్లచాయ చూ. నీరు.

నీళ్లచివది చూ. నీరు.

నీళ్లచెక్క చూ. నీరు.

నీళ్లతట్టు చూ. నీరు.

నీళ్లతీయు చూ. నీరు.

నీళ్లతొట్టి చూ. నీరు.

నీళ్లదాక చూ. నీరు.

నీళ్లదీయు చూ. నీరు.

నీళ్లదొర చూ. నీరు.

నీళ్లనాడు చూ. నీరు.

నీళ్లపిడత చూ. నీరు.

నీళ్లపుల్లరి చూ. నీరు.

నీళ్లబండ చూ. నీరు.

నీళ్లబుచ్చిగా(డు చూ. నీరు.

నీళ్లబుడ్డి చూ. నీరు.

నీళ్లముంచిననుబాలముంచినను చూ. నీరు.

నీళ్లముంత చూ. నీరు.

నీళ్లమూకిటి చూ. నీరు.

నీళ్లరాయ(డు చూ. నీరు.

నీళ్లతే(డు చూ. నీరు.

నీళ్లలోనిముల్లు చూ. నీరు.

నీళ్లవరుగు చూ. నీరు.

నీళ్లవేయు చూ. నీరు.

నీళ్లసట్టి చూ. నీరు.

నీళ్లాడు చూ. నీరు.

నీళ్లారికె చూ. నీరు.

నీళ్లార్చు చూ. నీరు.

నీళ్లు చూ. నీరు.

నీళ్లకారు చూ. నీరు.

**నీళ్లకార్చు** చూ. నీరు

**నీళ్లకాలు** చూ. నీరు.

**నీళ్లగట్టు** చూ. నీరు.

**నీళ్లగాలు** చూ. నీరు.

**నీళ్లచెల్లు** చూ. నీరు.

**నీళ్లతట్టుకుపోవు** చూ. నీరు.

**నీళ్లతోడు** చూ. నీరు.

**నీళ్లత్రాగినట్లగు** చూ. నీరు.

**నీళ్లత్రాగినట్లు** చూ. నీరు.

**నీళ్లత్రాగు** చూ. నీరు.

**నీళ్లనమలు** చూ. నీరు.

**నీళ్లపోసికొను** చూ. నీరు.

**నీళ్లపోసేదిక్కులేకుండు** చూ. నీరు.

**నీళ్లమోపించు** చూ. నీరు.

**నీళ్లమోయించు** చూ. నీరు.

**నీళ్లవదులు** చూ. నీరు.

**నీళ్లవిడుచు** చూ. నీరు.

**నీళ్లోడు** చూ. నీరు.

**నీళ్ళజేని** చూ. నీరు.

**నీళ్ళమఱ్రి** చూ. నీరు.

**నీళ్ళవుప్పి** చూ. నీరు.

**నీవరి** రూ.చూ. నివరి. వి. సస్య విశేషం.

**నీవారి** రూ.చూ. నివరి. వి. తృణధాన్య విశేషం. వైదీ. 69.

**నీవు** రూ. ఈవు, నీ. సర్వ. యుష్మదర్థకం. భార.ఆది. 1.100.

క. నీమ్, నీన్. నీవు ; కొడ. నీ, నీను ; తు. ఈ ; త. నీ ; మ. నీ ; కో. నీ ; తొ. నీ ; గోం. ఈమ్మా, ఇమ్మ, నిమా, నిమ్మె ; కొం. నీన్ ; కుఇ. ఇను ; కువి. నీనూ, నీను ; పర్జి. ఈన్ ; పెంగొ. ఏన్, ఏనెజ్ ; మండ. ఈన్ ; కొలా. నీ.వ్ ; నా. నీవ్, ఈవ్ ; గ. ఈన్ ; ఒల్లా. ఈన్ ; కురు. నీన్ ; మాల్తొ. నిన్ ; బ్రా. నీ.నీన్.

< మూ.ద్రా. *నీ(న్).

**నీసు** రూ.చూ. నీచు. వి. **1.** మాంసం, చేపలకూర ; **2.** పొలుసు కంపు.

**నీసుబోతు** వి. అసూయాపరుడు.

< ఈసు + పోతు.

**-ను**[1] రూ.చూ. -న్[1]. ప్రత్య. ద్రు. ద్వితీయా విభక్తిప్రత్యయం. **1.** ద్వితీయార్థంలో. భార. ఆది. 1.45 ; **2.** తృతీయార్థంలో ; **3.** సప్తమ్యర్థంలో.

**-ను**[2] రూ.చూ. -న్[2]. ప్రత్య. ద్రు. తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైకవచనం.

**-ను**[3] రూ. -న్[3]. ప్రత్య. ద్రు. ఉత్తమపురుషైక వచన ప్రత్యయం. భార. ఆది. 4.100.

**-ను**[4] రూ.చూ. -ఉను. ప్రత్య. ద్రు. సముచ్చయార్థకం. భార. ఆది. 1.141.

**-ను**[5] రూ.చూ. -న్[5]. ప్రత్య. ద్రు. తుమర్థ భావలక్షణార్థాల్లో వచ్చేప్రత్యయం.

**-ను**[6] ప్రత్య. ద్రు. ప్రథమాంతాలైన అస్మద్విశేషణాలకు ప్రాయికంగా వచ్చే అంతాగమం. భార. ఆది. 1.156.

**నుక్కట** వి. **1.** బాధ. మార్క. 2.38 ; **2.** అసియాడటం, జవ్వాడటం. గౌ. పంరి. ఉ. 910పం.

**నుక్సాను** వి. నష్టం.

హిం.ఉ. నుక్సాన్. నష్టం.

< ఉ. నుక్సాన్.

**నుగ్గగు** చూ. నుగ్గు.

**నుగ్గడుచు** చూ. నుగ్గు.

**నుగ్గాడు** చూ. నుగ్గు.

**నుగ్గించు** చూ. నుగ్గు.

**నుగ్గు** చూ. నూఱు[1]. రూ. నుర్గు. నుఱుగు. వి. **1.** చూర్ణం పొడి. భార. ఆది. 2.49 ; **2.** ముక్క, ఖండం. భార. భీష్మ. 2.331 ; **3.** సమూహం, గుంపు ; అ.క్రి. నలుగు. నృసింహ. 4.43.

క. నూఱు. పిండిచేయు, నూకు, నూగు. నూకు. నుగ్గు, నుర్గు, నుఱుగు. పిండిచేయు, నూరు, పొడిచేయు ; తు. నుగ్గుయుని. విరచు. నొక్కు, నురిపుని, నుర్పుని. విరచు, పిండిచేయు, నుగ్గు. చిన్న ; క. నుక్కుని. నలగగొట్టు ; త. నుఱుక్కు. పిండిచేయు, నుక్కు. చూర్ణం, నుఱుక్కుక. పొడిచేయు. నొక్కు ; మ. నూఱు ; కో. నుగె. విరిగినబియ్యం, నుగ్క్ (నుగ్క్-). దంచు ; గోం. నోరానా. ధాన్యందంపు ; కువి. నుయ్యాలి. దంపు ; పర్జి. నూకొల్, నూగుర్. నూక ; కొలా. నొర్ప్. ముక్కలు చేయు ; బ్రా. నుసింగ్. ముక్కలుచేయు, దంపు.

మూ. ద. ద్రా. *నుత్- *ఉన్క్-/ *నూత్- ఉర్క్, *నూత్.

**నుగ్గగు** అ.క్రి. **1.** నలిగిపోవు ; **2.** పొడిఅగు. < నుగ్గు + అగు. **నుగ్గడుచు** స.క్రి. నుగ్గయ్యేటట్లు కొట్టు, నలగగొట్టు. హరి. ఉ. 1.83. < నుగ్గు + అడుచు. **నుగ్గాడు** రూ.చూ. నుర్గాడు. స.క్రి. **1.** గుండచేయు, పొడిచేయు. కు. సం. 11.140 ; **2.** వధించు. భాస్క. రా. అరణ్య. 2.333 ; **3.** ఖండించు. రం. రా. సుందర. 269 పు. 8పం. **4.** పాడుచేయు, ధ్వంసంచేయు. రాజవా. 2.65 ; అ.క్రి. నుగ్గగు. < నుగ్గు + ఆడు. **నుగ్గించు** స.క్రి. తిట్టు, శపించు. విప్ర. 4.76. < నుగ్గు + -ఇంచు[3]. **నుగ్గుచేయు** రూ. నుగ్గుసేయు స.క్రి. **1.** వధించు, చంపు. భార. విరా. 2.179 ; **2.** ముక్కలుచేయు. పొడిచేయు. భార. విరా. 3.172. **నుగ్గునుగ్గు** వి. పొడిపొడి. **నుగ్గునూచగా** (-కాన్) అ.క్రి. ద్రు. ముక్కముక్కలుగా ఖండించు. భార. భీష్మ. 2.261. **నుగ్గునూచములగు** అ.క్రి. ముక్కముక్కలగు. రాజవా. 3.130. **నుగ్గునూచంబగు** అ.క్రి. **1.** ధ్వంసమగు. జైమినిభా. 2.11 ; **2.** ముక్కముక్కలగు. అష్టమ. క. 4.217. < నుగ్గు + నూచంబు + అగు. **నుగ్గుపిడకలు** వి.బ.వ. పిడకలు. పేడ, పొట్టు కలిపిఎండబెట్టి ఆము కాల్పులో వంట చెరకుగా వాడే పలచని పేడ ముద్దలు. **నుగ్గురాయి** వి. **1.** గాజువన్నెరాయి (Barite) ; **2.** ముగ్గువేసుకోడానికి పనికివచ్చే తెల్లని మెత్తనిరాయి (Ooze). **నుగ్గులు** వి.బ.వ. **1.** పిడకలు ; **2.** పిండి, పొడి ఇసుక మొదలైన వాటితో అందానికి రకరకాలుగా గీసే

గీతలు. నుగ్గులుచేయు రూ.చూ. నుగ్గులుసేయు. స.క్రి. 1. ముక్కలుచేయు, పొడిచేయు ; 2. వధించు, చంపు. నుగ్గులువాఱు(-పాఱు) అ.క్రి. పొడిఅగు. గౌ. హరి. ఉ. 1766పం. నుగ్గులుసేయు(-చేయు) రూ. నుగ్గులుచేయు. స.క్రి. 1. ముక్కలుచేయు, పొడిచేయు. భార. ద్రోణ. 1.291 ; 2. వధించు, చంపు. దశా. 2.406 ; 3. పిడకలుచేయు. నుగ్గుసేయు(-చేయు) రూ.చూ. నుగ్గుచేయు. స.క్రి. 1. వధించు, చంపు. భార. విరా. 5.83 ; 2. ముక్కలుచేయు, పొడిచేయు.

నుంకు వి. పస్తు, ఉపవాసం. ఆం. భా. 2.175.

త. నుంకు. నశించు, నశింపచేయు.

నుంగరవడ్లు రూ. నుంగరొడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

నుంగరొడ్లు రూ.చూ. నుంగరవడ్లు. వి.బ.వ. ఒకరకంవడ్లు.

నుంగు వి. తాటిపండు.

త. నుఙ్కు. లేత తాటికాయలోని గుంజు, లేతతాటి కాయ, నుకుమ్బు. లేతతాటిఆకు ; మ. నొఙ్ఙు. పండని తాటిపండు, లేత తాటాకు.

<త. నుఙ్కు.

నుచ్చిన రూ.చూ. నిచ్చెన. వి. దాపుకర్ర, ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను అందుకోటానికి పనికివచ్చే పరికరం.

నుచ్చిలి రూ. నుచ్చు³. వి. నురుగు, ఫేనం. హర. 2.83.

క. నొరె. నురుగు ; కొడ. నెరె ; తు. నురె. నురుగు ; త. నురై. నురుగు, కఫం, బుడగ ; మ. నుర. నురుగు, నురయుక. నురుగుకట్టు, నురెక్క. నురుగువచ్చు, కల్లులాగపులియు, నురి. చిన్ననీటిబుడగలు, నురిక్క. నీటిబుడగలు ఎగురు ; కో. నొర్. నురుగు.

నుచ్చు¹ వి. 1. గొర్రెల, మేకల పెంటిక. మను. 4.60 ; 2. మేక, గొర్రెపిల్లలు, నడుమ పాలు తాగేయకుండా మూత్రంలో మట్టిగలిపి, ఒకగుడ్డ పీలికమీద అప్పళించి ఈనిన జీవపు రొమ్ము చుట్టు ఉంచే గుడ్డపీలిక ; స.క్రి. నుచ్చు పాతలు చుట్టు.

నుచ్చుకోక వి. గొర్రెల, మేకల చన్నులకి చుట్టేగుడ్డ. బసవ. 3.1118పం. నుచ్చుపాత రూ.చూ. నుచ్చుప్రాత. వి. గొర్రెల, మేకల చన్నులకు చుట్టేగుడ్డ. నుచ్చు పీలిక వి. నుచ్చుటానికి ఉపయోగించే గుడ్డపీలిక. నుచ్చుప్రాఁత రూ. నుచ్చుపాత. వి. గొర్రెల, మేకల చన్నులకి చుట్టే గుడ్డ. వేంక.పంచ. 1.598.

నుచ్చు² వి. బట్టిలోని మూసివేసిన పొయ్యి.

నుచ్చు³ రూ.చూ. నుచ్చిలి. వి. ఫేనం, నురుగు.

నుచ్చులు వి.బ.వ. పశుజాతి పాలు తాగినప్పుడు నోటి వెంట కారే పాల చారలు. నుచ్చులునుచ్చులుగావచ్చు అ.క్రి. వ్యాధిచే నోటివెంట ఉమ్మివచ్చు.

నుచ్చుమల్లి వి. చిరతపులి.

నుచ్చెన రూ.చూ. నిచ్చెన. వి. 1. దాపుకర్ర, ఎత్తుగాఉన్న వస్తువులను, తావులను అందుకోటానికి పనికివచ్చే పరికరం ; 2. నడినెత్తి, మాడపట్టు.

నుజ్జు రూ.చూ. నజ్జు. విణ. క్షతినొందిన, మిక్కిలి నలిగిన. ఉ.రా. 7.477.

-నుంచి ప్రత్య. పంచమ్యర్థంలో వచ్చే అంత్య ప్రత్యయం. ద్రుతంపై ఉంచు ధాతువుకు క్త్వార్థకమైన ఇకారం చేర్చగా ఏర్పడిన పరప్రత్యయంగా పరిగణించబడే రూపం.

నుంజ వి. 1. సొగటాలపలక. ప్రబంధ. 923 ; 2. తాటి ముంజు.

నుంజాము చూ. నును.

నుడి రూ.చూ. నొడువు. వి. మాట, పలుకు, వాక్యం. ఉ.రా. 8.126.

నుడికారము రూ.చూ. నొడికారము. వి. 1. పలుకు, మాట, చమత్కారం, సరసత. భీమ. 1.15 ; 2. పలుకుబడి. జైమిని భా. 1.18 ; విణ. సరసమైన. శుక. 3.390. క. నుడికాఱ-. నుడిపడఁతుక వి. సరస్వతి. వేంక-ఆం.దేవ. 7. నుడివిల్లు వి. తూటవతనకు విల్లు, వింటితో పోల్చబడేది, కనుబొమ. కు.సం. 5.41. నుడివో నలుగ(గు(-అలు(గు) అ.క్రి. ముమ్మొనవాలు. ఆం.పదా.నుర. 12.

నుడు రూ.చూ. నొడువు. వి. 1. నుడికారం ; 2. వచనం ; 3. శబ్దం ; 4. చెడ్డపేరు.

నుడుగు రూ.చూ. నొడువు. వి. 1. మాట, పలుకు. వసు. 4.23 ; 2. లోకోక్తి, నానుడి ; స.క్రి. 1. వచించు, చెప్పు. బహులా. 5.99 ; 2. జపించు, జపంచేయు. భల్లా. 2 ; 3. సంభాషించు, మాటలాడు ; 4. నేర్పు, బోధించు. ; 5. చదువు, పఠించు.

నుడుగుపడఁతి వి. సరస్వతి. వేంక. ఆం. దేవ. 19. నుడుగుపడఁతిమామ వి. విష్ణువు. వేంక. ఆం. దేవ. 19. నుడుగుఱేఁడు వి. బృహస్పతి, గీర్పతి. యయా. 3.31. నుడుగులచెలి వి. సరస్వతి. యయా. 2.44. నుడుగులుదప్పినా నోముఫలమిచ్చు అ.క్రి. ఒకటి రెండు పొరపాట్లుజరిగినా చేసిన మంచిపనికి ఎప్పుడూ ఫలం ఉండు. తాళ్ల.సం. 8.220. నుడుగువాలు వి. గీర్వాణుడు, దేవత. ప్రబంధ. 217.

నుడుచుకొను రూ. నుడుసుకొను. స.క్రి. ముడుచుకొను, సరి చేసేటప్పుడు గంజి తడి ఆరిన తరవాత ముడుచుకొనిఉన్న పోగులు విడిబడటానికి లాకతో తట్టు.

నుడువరి చూ. నుడువు.

నుడువరితనము చూ. నుడువు.

నుడువు రూ.చూ. నొడువు. వి. 1. మాట, పలుకు. భార. ఆది. 4.103 ; 2. లోకోక్తి, నానుడి. రసిక. 3.113 ; స.క్రి. 1. వచించు, చెప్పు. భార. ఆది. 7.47 ; 2. సంభాషించు, మాటలాడు. పారి. 4.10 ; 3. చదువు, పఠించు. జాహ్న. 3.60 ; 4. నేర్పు, బోధించు.

నుడువరి వి. మాటలమారి, వాచాలుడు. <నుడువు+ అరి. నుడువరితనము వి. వాచాలత. బసవ. 1.454 పం. నుడువులనన(బోఁడి వి. సరస్వతి, వాగ్దేవి. దశా. 2.55. నుడువులపడఁతుక వి. వాగ్దేవి, సరస్వతి. అచ్చ.రా.యు. 550. నుడువులఱేఁడు వి. బృహస్పతి, గీర్పతి. నీలా. 2.82.

నుడుసుకొను రూ.చూ. నుడుచుకొను. స.క్రి. ముడుచుకొను,

సరి చేసేటప్పుడు గంజి తడి ఆరిన తరవాత ముడుచుకొని ఉన్న పోగులు విడివడటానికి లాకతో తట్టు.

-నుండి ప్రత్య. పంచమ్యర్థంలో వచ్చే అంత్య ప్రత్యయం. కు.సం. 12.73. ద్రుతంపై 'ఉండు' ధాతువుకు క్త్వార్థకమైన ఇకారం చేర్పగా ఏర్పడిన పంచమ్యర్థంలో పరప్రత్యయంగా పరిగణించబడే రూపం.

**నుతిక** రూ.చూ. నుతికె. వి. **1**. తెగ, మొత్తం ; **2**. దళం, దండు.

**నుతికె** రూ. నుతిక. వి. **1**. దళం, దండు. పల్నా.పు. 60 ; **2**. తెగ, మొత్తం.

**నుతినాడు** స.క్రి. స్తుతించు. భీమ. 3.178.

సం. నుతి-. స్తోత్రం.

< సం. నుతి- + -న్[1] + ఆడు.

**నుదుటఁబట్టముగట్టు** చూ. నుదురు.

**నుదుటికన్ను** చూ. నుదురు.

**నుదుటివ్రాసినవ్రాఁత** చూ. నుదురు.

**నుదురంటు** చూ. నుదురు.

**నుదురు** వి.బొ. నొసలు, ఫాలం. కు.సం. 5.108.

క. నొసల్ (ఉ). నుదురు ; తు. నెసలు, నసుడి. నుదురు ; త. నుతల్. నుదురు, కనుబొమ, తల, పుర్రె, పైభాగం, నెత్తి ; మ. నుతల్. నుదురు ; కొం. నెడ. తల పైభాగం ; మా. నిత్లు.

పో.చూ. సం. నిటల-, నిటాల-. నుదురు.

**నుదుటఁబట్టముగట్టు** అ.క్రి. స్థిరీకరించి ప్రకటించు. ఉ.హరి. 2.154. < నుదురు + -అ[7] + పట్టము + కట్టు. **నుదుటికన్ను** వి. ఫాలాక్షం, శివుని లలాట నేత్రం. కు.సం. 10.5. **నుదుటివ్రాసినవ్రాఁత** వి. కర్మఫలం. **నుదురంటు** అ.క్రి. నమస్కరించు. దాశ. 58. < నుదురు + అంటు.

**నును** విణ. **1**. నున్నని, స్నిగ్ధమయిన. కు.సం. 9.52 ; **2**. మనోహరమయిన, చక్కని. నిర్వ.రా. 3.50 ; **3**. అల్పమయిన. భార.విరా. 2.303 ; **4**. మెత్తని, మృదులమయిన. హర. 3.69 ; **5**. శేత. శృం.నై. 4.13 ; **6**. గాటమయిన. విజయ. 1.104.

క. నుణ్. మృదువైన, నున్నితమైన, శుభ్రమైన ; తు. నొణ్ణ, నొణ్ణగె. మృదువైన, చక్కని ; త. నుణ్. చిన్నది, వాడి, స్నిగ్ధం ; మ. నుణ్మ. చిన్నది, నుప్పమ్. బట్టయొక్క నాణ్యత ; కో. నున్క్ (నున్క్య-). పులును చేయటానికి ఎండు మాంసాన్ని చిన్న ముక్కలుగా చేయు.

**నుంజామ** వి. ఆవాలు మాదిరిగా ఉండే ఒకరకం ఆహార ధాన్యం. < నును + చామ. **నునుగంతలు** రూ.చూ. నున్నగింతలు. వి.బ.వ. నలపతో రెండోసారి సర్చిన పాత్రలు. **నునుఁదల (-తల)** వి. నున్ననితల, వెంట్రుకలు ఊడిపోయిన తల. **నునుపచ్చి** విణ. అప్పుడే తెచ్చిన, ఇంకా పచ్చిగా ఉన్న. పాండు. 1.10. **నునుపరి** విణ. **1**. మంచివాడు. జనప. 5.135 ; **2**. నునుపుకలది. **నునుమీను** **మనుమఁడు** వి. వ్యాసుడు. ప్రబంధ. 4. **నునువాఁడి** విణ. మెత్తని పదును.

**నునుపారు** చూ. నునుపు.

**నునుపు** రూ. నునుపు, నున్పు, నుంపు, నులుపు[1]. విణ. **1**. మనోహరం. కు.సం. 4.96 ; **2**. నున్నని, స్నిగ్ధమైన. కు.సం. 8.59 ; వి. **1**. సొగసు, మనోహరత. సిం.ద్వా. 4.185 ; **2**. నున్నన, స్నిగ్ధత్వం. మను. 3.28 ; **3**. గోడమీది సున్నం మొదలైనవాటి పూత ; **4**. కుమ్మరి కుండలపై రాసే చిత్ర విశేషం.

క. నుణుపు, నుణ్పు, నుప్పు. మెత్తని, నన్నని, నున్నితమైన ; త. నుణ్పు. చిన్నది, నున్నితమైన, పదునైన ; మ. నుప్పమ్. బట్టయొక్క మృదుత్వం.

**నునుపారు** రూ.చూ. నుంపారు. విణ. నున్నని. క్రీడా. పు. 25. < నునుపు + ఆరు. **నునుపుచేయు** స.క్రి. దిద్దికం పెట్టు, అచ్చు కట్టిన తరవాత అచ్చుకర్రమీది వడిదారం మెలికలు కొమ్ము బిళ్ళతో రుద్దుతూ చదును చేయు. **నునుపుపట్టు** రూ. నునుప్పట్టు. స.క్రి. పాతపట్టు, కుడి చేత్తో అడ్డవేలు వేసి ముఖ మేర్పరచడానికి కుండ నాల్గు పక్కల సాపుగా రావడానికి బట్టతో పట్టు. **నునుపునలప** వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సటానికి వాడే నలప. **నునుపేయు** స.క్రి. నున్నగించు, నున్నగింతనలపతో రెండోసారి సాపుచేయు. < నునుపు + వేయు. **నునుప్పట్టు** రూ.చూ. నునుపుపట్టు. స.క్రి. పాతపట్టు, కుడిచేత్తో అడ్డవేలు వేసి ముఖమేర్పడటానికి కుండ నాలుగుపక్కల సాపుగా రావటానికి బట్టతో పట్టు. < నునుపు + పట్టు.

**నునుపేయు** చూ. నునుపు.

**నునుప్పట్టు** చూ. నునుపు.

**నునువు** రూ.చూ. నునుపు. వి. కుమ్మరి కుండలపైరాసే చిత్ర విశేషం. హంస. 5.13.

**నుజ్జలప** చూ. నున్న.

**నుజ్జేతచేయు** చూ. నున్న.

**నుజ్జేయు** చూ. నున్న.

**నున్న** రూ. నున్నన, నున్ను. విణ. **1**. నునుపైన, స్నిగ్ధం, ఎచ్చు తగ్గులు లేని. భార. విరా. 2.239 ; **2**. మృదువైనది, మెత్తని. హర. 2.26 ; **3**. నన్నం. వీర. వి. 2.94 ; **4**. సుఖకరమైన. విప్ర. 2.38 ; **5**. చక్కని, మనోహరమైన. చంద్రాంగ. 2.36 ; **6**. అల్పం ; వి. **1**. నున్నతనం, స్నిగ్ధత. సాంబ. స్థా. 60 ; **2**. నున్నని ఉముక.

త. నుణ్మై. నునుపు.

**నుజ్జలప** వి. నున్నగింత నలప, కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సటానికి వాడే నలప. < నున్న + నలప. **నుజ్జేతచేయు** స.క్రి. నున్నగించు, నున్నగింత నలపతో రెండోసారి సాపుచేయు. < నున్న + చేఁతచేయు **నుజ్జేయు** రూ.చూ. నున్నచేయు. స.క్రి. నున్నగించు. నున్నగింత నలపతో రెండోసారి సాపుచేయు. < నున్న + చేయు, **నున్నగంతలేయు** రూ. నున్నగాంతలేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత నలపలో రెండోసారి సాపుచేయు. < నున్న + కంత + -లు + వేయు. **నున్నగంతసల్ప** రూ. చూ. నున్నగింత నలప. వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ నర్సటానికి వాడే పల్చని చదరమైన నలప. **నున్నగాంతలేయు** రూ. చూ. నున్నగంత లేయు. స.క్రి.

నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నున్నగాలి** వి. మందమారుతం. కావ్యా. చూ. 2.67. **నున్నగిచ్చు** రూ.చూ. నున్నగించు. స.క్రి. నున్నచేయు. వాటను గట్టింపు చేసి ఆకారం బాగా తెచ్చిన తర్వాత పల్చని సలపతో రెండోసారి నునుపువచ్చేటట్లుకొట్టు. **నున్నగించు** రూ. నున్నగిచ్చు. స.క్రి. నున్నచేయు, వాటను గట్టింపుచేసి ఆకారం బాగా తెచ్చినతర్వాత పల్చని సలపతో రెండోసారి నునుపు వచ్చేటట్లుకొట్టు. **నున్నగించుసల్ప** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే సలప. **నున్నగింతచేయు** రూ. నూనగంతచేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నున్నగింతలు** రూ. నునుగంతలు. వి.బ.వ. సలపతో రెండోసారి సర్సిన పాత్రలు. **నున్నగింతసలప** రూ. నున్నగంతసల్ప, నూనగంతసల్ప. వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే పల్చని చదరమైన సలప. **నున్నగింపుచేయు** స.క్రి. నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నున్నగింపుసలప** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే పల్చని చదరమైన సలప. **నున్నగుంటసలప** చూ. నున్నగింత సలప. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే పల్చని చదరమైన సలప. **నున్నగుదం** వి. మెత్తకుదం, వంటబానలు మొ॥ వాటిని రెండోసారి సర్సిన తీరు. **నున్నచేయు** రూ. నుజ్జేయు, నున్నజేయు, నున్నసేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నున్నజేతబల్ల (-చే(తబల్ల)** వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే సలప. **నున్నజేతరాయి (-చేతరాయి)** వి. పాత్రలను నునుపు చేసేటప్పుడు ఉపయోగించేరాయి. **నున్నజేతసల్ప** చూ. నున్నగింతసలప. వి. కుదంకొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్పడానికి వాడే సలప. **నున్నజేయు (-చేయు)** రూ.చూ. నున్నచేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు. **నున్న(దనము (-తనము)** వి. మెత్తన. భార. విరా. 2.221. **నున్నని** విణ. నునుపుగా ఉన్న. **నున్నపూత** వి. గిలాబా, గోడమీది సున్నం మొదలైన వాటి పూత. **నున్నపొరలదిండు** వి. రాతిగనిలోని 11వ పొర. **నున్నబల్ల** చూ. నున్నగింతసలప. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ నున్నగ సర్సటానికి వాడే సలప. **నున్నబీర** వి. మామూలు బీర కంటె కాయ చిన్నదిగాను, తొక్క నునుపుగాను ఉండే నేతిబీర (Aegyptica). **నున్నబెట్టు (-పెట్టు)** స.క్రి. కరిగించు. **నున్నబెండ** వి. ఒక రకం కూరబెండ. **నున్నసిరిపడు** వి. మంగలి. **నున్నసేయు (-చేయు)** రూ.చూ. నున్నచేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత సలపతో రెండోసారి సాపుచేయు.

**నున్నన** రూ.చూ. నున్న. విణ. నున్నని, స్నిగ్ధమైన. హర. 2.25 ; వి. నున్నతనం, స్నిగ్ధత్వం. సాంబ. స్థా. 60.

**నున్ని** వి. పాలచెట్టు, గృహాది నిర్మాణాలకు ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Mimusops hexandra).

**నున్ను** రూ.చూ. నున్న. విణ. మెత్తని, నున్నని, ఎగుడు దిగుళ్ళు లేని.

**నున్పు** రూ.చూ. నునుపు. విణ. 1. నున్నని, స్నిగ్ధమైన. కు. సం. 4.99; 2. మనోహరమైన; వి. 1. నున్నన, స్నిగ్ధత్వం ; 2. సొగసు, మనోహరత.

**నుప్పు** రూ.చూ. నిప్పు. వి. అగ్గిమంట.

**నుప్పులుకుండ** వి. అగ్గికుండ, శవం వెంబడి అగ్గితీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర.

**నుంపారు** రూ. నుంపు.

**నుంపు** రూ.చూ. నునుపు. విణ. 1. మనోహరం ; 2. నున్ననిది, స్నిగ్ధమైనది ; వి. 1. నున్నన, స్నిగ్ధత్వం ; 2. సొగసు, మనోహరత.

**నుంపారు** రూ. నునుపారు. అ.క్రి. నున్ననగు. మృదువగు, మెత్తనగు. బసవ. 3.696పం. < నుంపు + ఆరు[1].

**నుమ్మ** వి. ఆకులు తోళ్ళ శుద్ధికి కలప గృహాది నిర్మాణాలకూ బళ్ళు మొ. వాటితయారీకి ఉపయోగపడే చెట్టు (Anogeissus latifolia).

**నుయి** రూ.చూ. నూయి. వి. కూపం. బావి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 213. క్రీ.శ. 1237.

**నుయ్యి** రూ.చూ. నూయి. వి. కూపం, బావి. విజ్ఞా.వ్యవ. 151.

**నుయ్యోకొండోయను** స.క్రి. అదా ఇదా అని తటపటాయిస్తూ కూర్చుండు. < నుయ్యి + ఓ[2] + కొండ + ఓ[2] + అను. **నుయ్యోగొయ్యోచూచుకొను** అ.క్రి. తెగించు, చచ్చు. < నుయ్యి + ఓ[2] + గొయ్యి + ఓ[2] + చూచుకొను.

**నుయ్యోకొండోయను** చూ. నుయ్యి.

**నుయ్యోగొయ్యోచూచుకొను** చూ. నుయ్యి.

**నురనుర** చూ. నురువు[1]. వి. నురుగులధ్వనికి అనుకరణం. ఉ.హరిశ్చ. 2.126.

**నురిపిడి** రూ.చూ. నుటిపిడి. వి. కోసిన గడ్డిని కళ్ళంలో వేసి పశువులతో తొక్కించి గింజలు రాల్చటం.

**నుర(గు** రూ.చూ. నురువు[1]. వి. ఫేనం. ఉ.రా. 4.160.

**నుర(గుకొను** అ.క్రి. నురుగుకట్టు. కవిక. 5.110.

**నుర(గుదబ్బ** వి. కడుపులో కుడిపక్క ఉండే మాంసఖండ విశేషం, కారిజం, కాలఖండం.

**నురుజురోగం** చూ. నురువు[1]. వి. ఆకులమీద ఒకరకం తెల్లటి నురుగులాగ ఏర్పడే ఒకరకం జొన్న తెగులు.

**నురువు[1]** రూ. నుర(గు, నుర్వు. వి. 1. సముద్రాదుల ఫేనం, డిండీరం. భార.ఆది. 7.43 ; 2. కొన్ని ఫలాలనుండి వచ్చే ఫేన సదృశమైన ద్రవం. కేయూ. 4.75 ; 3. పశ్వాదుల నోటినుండి వచ్చే ఫేనం. హరి.పూ. 5.142.

క. నొరె. నురుగు ; కొడ. నెరె. నురుగు ; తు. నురె. నురుగు ; త. నురై. నురుగు, బుడగ ; మ. నుర. నురుగు, నురయుక. నురుగుకట్టు, నురెక్క. నురుగు వచ్చు, కల్లులాగ పులియు ; కో. నొర్. నురుగు.

**నురువులుగట్టు (-కట్టు)** అ.క్రి. తెట్టెలుగట్టు. ఆము. 4.100.

**నురువు[2]** స.క్రి. నెరువు, ఎత్తుపల్లాలు సరిచేయు, చదునుచేయు.

**నురువుడు** చూ. నుఱుము. వి. సస్యమంజరీ చూర్ణం.

**నుర్గాడు** చూ. నుర్గు.

**నుర్గు** రూ.చూ. నుగ్గు. వి. చూర్ణం, పొడి. కు.సం. 11.20.

**నుర్గాడు** రూ. నుగ్గాడు. అ.క్రి. నుగ్గగు. కు.సం. 11.24 ; స.క్రి. నుగ్గుచేయు. <నుర్గు + ఆడు.

**నుర్వు** రూ.చూ. నురుపు[1]. వి. పశ్వాదుల నోటినుండి వచ్చే ఫేనం. అచ్చ.రా.కిష్కిం. 66.

**నుఱిచియాడు** చూ. నుఱుచు.

**నుఱిపిడి** చూ. నుఱుచు.

**నుఱుగు** రూ.చూ. నుగ్గు. వి. చూర్ణం, పొడి.

**నుఱుచు** రూ. నూర్చు, నూఱుచు. స.క్రి. **1**. (ధాన్యాదికాన్ని, కాళ్ళు మొ. వాటితో) తొక్కి నలుపు, నలగగొట్టు. కు.సం. **4.11** ; **2**. నశింపచేయు. కళా. 6.8.

క. నుఱి. పొడిచేయు, నుర్చు, నుచ్చు. పొడిచేయు, నలగ్గొట్టు ; తు. నురుయుని. ముక్కలగు, నురిపుని. పొడిచేయు ; కువి. నూడ్పు. ధాన్యాదుల్ని నలగ్గొట్టు.

**నుఱిచియాడు (-ఆడు)** స.క్రి. సంహరించు. రాఘవ. **4**.142. **నుఱిపిడి** రూ. నురిపిడి, నూర్పిడి, నూఱిపిడి, నూఱుపుడు. వి. ధాన్యం మొ॥ వాటిని కాళ్ళు మొ॥ వాటితో తొక్కి నలపటం. భార.ద్రోణ. 3.268.

**నుఱుపు** చూ. నుఱుచు. రూ. నూర్పు, నూఱుపు. స.క్రి. **1**. ఖండించు, నరకు. కు.సం. 11.36 ; **2**. చంపు, వధించు. హరి.పూ. 6.9 ; **3**. ధ్వంసంచేయు. భాగ. 6.370 ; **4**. (ధాన్యాదికాన్ని కాళ్ళు మొ॥ వాటితో తొక్కి) నలుపు, నలగచేయు. శివధ. 5.9.

కువి. నుడ్పు. ధాన్యం నూర్చు, నుర్పు. నూర్చు ; కొలా. నొర్పు. నూర్చు.

**నుఱుమాడు** చూ. నుఱుము.

**నుఱుము** రూ. నఱుము, నఱువు. వి. నలి, పొడి. భార.ఆది. 6.299 ; స.క్రి. **1**. పొడిచేయు. నిర్వ.రా. 6.**114** ; **2**. బాధించు. అప్ప. **4.323** ; **3**. చంపు. పార్వ. **4**.109.

తు. నుర్పుని, నెర్పుని. ఏవగించుకొను ; త. నరి. బాధించు, నొప్పించు.

**నుఱుమాడు** రూ. నఱుమాడు. స.క్రి. **1**. ఖండించు, ముక్కలుచేయు. భార.విరా. 5.35 ; **2**. సంహరించు, చంపు. భార. భీష్మ. 2.153 ; **3**. పొడిచేయు, తవ్వు. భార.సౌప్తి. 1.18. <నుఱుము + ఆడు. **నుఱుముచేయు** రూ.చూ. నుఱుముసేయు. స.క్రి. **1**. సంహరించు, చంపు. ఆం.భా. 3.123 ; **2**. పొడిచేయు, పిండిచేయు. **నుఱుముసేయు (-చేయు)** రూ. నుఱుముచేయు. స.క్రి. **1**. సంహరించు, చంపు. భార.విరా. 3.28 ; **2**. పొడిచేయు, పిండిచేయు. భాస్క.రా.ఆరణ్య. 1.203.

**నులక** చూ. నులియు[1]. రూ. నుల్క. వి. నారను పేని తయారుచేసిన సన్నటి తాడు. ఆం భా. 2.295.

**నులకతాడు** రూ.చూ. నులకత్రాడు. వి. నులక, సారె లోపల పెండెల చుట్టూ కట్టే దారం. **నులకత్రాడు** రూ. నులకతాడు, నుల్కత్రాడు. వి. నారతో పేనిన దారం. పండి.చ. 3.176 పు. **నులకమంచము** రూ.చూ. నుల్క మంచము. వి. నులకతో నేసిన మంచం. **నులకశయ్య** వి. నులకమంచం. శివరా. 3.9.

**నులతలస్తంభం** చూ. నులి. వి. పైకి సుడి తిరుగుతూ పోయే మెలికలు చెక్కిన స్తంభం.

**నులతెడు** చూ. నులి. వి. చాపిన బొటనవేలుకు చూపుడు వేలుకు మధ్యభాగం కొలత.

**నులి** వి. **1**. చిక్కు, మెలిక. భాగ. 10. ఉ. **243** ; **2**. రాతిలో అక్కడక్కడ ముడిలాగ కనిపించే కఠినమైన భాగం ; విణ. **1**. మెలిపడినది, మెలికలు కలది. నవనాథ. 186 పు. 32 పం. ; **2**. అల్పమైన, చిన్న. ఉ.రా. 6.127.

క. నులి. (తాడు మొ॥ వాటిని) మెలిపెట్టు, నులికె, నులిగె. మెలి, మెలిపెట్టబడ్డ ; కొడ. ను.లి. దారం, తాడు, నూపుని. మెలిపెట్టటం ; తు. నూపుని. మెలిపెట్టు ; త. నుల్. నూలు ; మ. నుల్. నూలు, దారం, తొ. ను.క్ ; గోం. నూల్ ; కుఇ. నూడు ; కువి లూలు, లోలు ; పర్జి. నూల్ ; కోలా. నూల్. దారం ; గ. నూల్ ; ఒల్లా. నూల్ ; కురు. నా(ఏ(నా. కదిలేదాన్ని దేన్నైనా మెలిపెట్టు.

**నులికాయ** వి. అంచులో ఏటవాలు గీరలు ఎడం ఎడంగా పడేట్టు నేసిన డిజైను. **నులికాయంచు** వి. ఏటవాలు గీరలు ఎడం ఎడంగా పడేట్టు నేసిన ఒకరకం అంచు చీర. <నులికాయ + అంచు[3]. **నులికాయతీగె** వి. అంచులో నేసిన ఒక రకం డిజైను. **నులికాయతీగెబుగిడి** వి. అంచులో నులికాయ, తీగ, బుగిడి వరసగా పడేట్టు నేసిన డిజైను. **నులికొమ్ము మెకము** వి. ఇఱ్ఱి, మగజింక. సాంబ. తిర్య. **74**. **నులి కొమ్ములమెకము** వి. ఇఱ్ఱి, మగజింక. **నులిగాయ (-కాయ)** వి. దృష్టిదోషం, గాలిసోకు మొ॥ నవి కలగకుండా చంటి పిల్లలకి, పురుటాండ్రకి కట్టేకాయ, దిష్టిపూస. కాశ. **4.11**. **నులిగుల్ల** వి. క్షుద్రజలచరం. **నులిగొను (-కొను)** అ.క్రి. **1**. చిక్కుపడు, మెలికపడు. కళా. 3.83 ; **2**. వలయితమగు, చుట్టుకొనబడినదగు. ఆం. నా. శే. 67. **నులిగొమ్ముమెకము (-కొమ్ముమెకము)** వి. ఇఱ్ఱి, మగజింక. **నులిగొమ్ములమెకము (-కొమ్ములమెకము)** వి. ఇఱ్ఱి, మగజింక. ఆం.నా. సం తిర్య. 6. **నులిగొల్పు (-కొల్పు)** స.క్రి. మెలిపెట్టు. గొ. హరి. పూ. 2062 పం. **నులిజెముడు** వి. వృక్షవిశేషం, చిన్నచెముడు. హంస. 4.10. **నులితడ** రూ. నులిదడ. వి. మహాబల వృక్షం (Helicteres). ఆం. భా. 2.56. **నులితీయు** స.క్రి. చిక్కుపడ్డ పోగులు తీయు. **నులితెవులు** వి. ఆకులకు. కొమ్మలకు పట్టే నల్లటిపేను తెగులు. **నులిదడ** రూ.చూ, నులితడ. వి. ఆవర్తకి (Helicteres). **నులిపచ్చి** విణ. **1**. కొంచెం తడిసినది. ద్వి. పరమ. వి. 4.292 పు. ; **2**. కొదిపచ్చి. **నులపడు** రూ. చూ. నులివడు. అ.క్రి. **1**. దోషుడువడు. ఆం. భా. 3.116 ; **2**. మెలికపడు. **నులి పదును** వి. కొద్దిపచ్చి. **నులిపురుగు** వి. **1**. వంగ, కంది మొ॥ చెట్ల ఆకులు తినే సన్నటి చీడపురుగు ; **2**. కడుపులో పుట్టే చిన్నపురుగు, నుసిపురుగు. **నులిపెట్టు** స.క్రి. పురితిప్పు, అచ్చుతికేటప్పుడు బద్దె పోగుకు పడుగుపోగు కలిపివడి పెట్టు. **నులిబిల్ల (-పిల్ల)** వి. చిన్నదైన ఒకజాతి నీటిపురుగు.

జలచర విశేషం. హంస. 4.186. **నులివంక** వి. 1. కొంచెం వంకర. ఘటికా. 2.116 ; 2. పల్లకి బొంగుయొక్క దోషవిశేషం. ప్రబంధ. 605. **నులివడు** (-పడు) రూ. నులిపడు. అ.క్రి. 1. మెలికపడు. పారి. 4.16 ; 2. దోపుడువడు. **నులివాడు** రూ. ఉలివాడు[2]. అ.క్రి. కొద్దిగా వాడిపోవు. కు. సం. 10.101. **నులివాళ్లు** వి.బ.వ. కొంచెం వాడటాలు. (వసివాళ్లు). **నులివాళ్లువాడు** అ.క్రి. 1. వసివాడు. గౌ. హరి. ఉ. 911పం. ; 2. కొంచెంవాడు. విక్ర. 5.38. **నులివెచ్చ** వి. గోరువెచ్చ. హర. 2.107, పారి. 2.48 ; విణ. గోరువెచ్చనయిన. ఆము. 1.81. **నులివెచ్చన** వి. మందోష్ణం. **నులివెచ్చనూర్చు** అ.క్రి. కొంచెం వేడిగా నిట్టూర్చు. ద్వి. పరమ. వి. 529. **నులివెట్టు** (-పెట్టు) స.క్రి. 1. మెలిపెట్టు. భాగ. 10.ఉ. 544 ; 2. గుచ్చు. వరాహ. 8.29. **నులివే(డి** విణ. కొంచెం వెచ్చని. విక్ర. 5.219. **నులివే(డియూర్పు**(-ఊర్పు) వి. నిట్టూర్పు. గౌ. హరి. ఉ. 178పం. **నులివే(డియెండ**(-ఎండ) వి. సంధ్యా సమయం. భీమ. 3.37. **నులులు** వి.బ.వ. చిక్కుపడ్డ పోగులు. <నులి + -లు.

**నులించు** చూ. నులియు[1].

**నులిపిచేయు** చూ. నులుపు[2].

**నులియచంకె** వి. వృక్షవిశేషం. హంస. 4.10.

**నులియు**[1] అ.క్రి. మెలితిరుగు.

క. నులి. మెలిపెట్టు, నూల్. దారంచేయు, మెలితిప్పు. నూలు (నూ-త్-) ; తు. నూపుని, నుప్పుని. మెలిపెట్టు ; త. నూల్ (నూఱ్-ఱ్-). మెలిపెట్టు ; మ. నులెక్క. పిండటంవల్ల మెత్తగాచేయు ; కో. నుర్బ్. మెలిపెట్టు ; తొ. నూస్ఫ్ (నూస్త్-). రెండుకొనలు కలిపి చుట్టినదారం ; కుఇ. నొల్బ. మెలిపెట్టు. దారంచుట్టు ; కురు. నో(ఏ(- (నో(ఏ(చ్-). వంగేదానిని దేనినైనా చుట్టటం, గడ్డిమెలి.

<మూ. ద్రా. *నూల్/-*నో-ల్.

**నులించు** స.క్రి. నులియచేయు. నులువు. హరి. పూ. 8.50. **నులివు**[1] వి. 1. ఆభరణ విశేషం. ద్వి. పరమ. వి. 5.441 పు. ; 2. నులియటం.

**నులియు**[2] అ.క్రి. పొడిఅగు. చంద్రాంగ. 6.93.

క. నుళ్గు. పొడిఅగు. చిన్నముక్కలుగా చేయు ; తు. నులియుని. బద్దలగు, పగలగొట్టు, నులి. ముక్క. తునక ; త. నుఱి. పొడిచేయు, నుఱుఙ్కు. పొడిచేయబడు.

<నుళ్-వ్-/*నుఙ్-వ్-.

**నులియు**[3] రూ. చూ. ఉలియు[3]. అ.క్రి. (అలయిక మొ॥ వానిచే) చలించు, అల్లల్లాడు, వడకు. ద్వి. పరమ. వి. 1.125.

**నులివు**[1] చూ. నులియు[1].

**నులివు**[2]. వి. విధం, రీతి. ద్వి. పరమ. వి. 2.127 పు.

**నులుచు** రూ.చూ. నుల్చు. స.క్రి. 1. మెలివేయు. మెలిపెట్టు. కాశ. భీష్మ. 1.204 ; 2. సంహరించు, నశింపచేయు. వరాహ. 1.52 ; 3. నలుపు. పిసుకు. శుక. 2.115 ; 4. పడుగుపోగులు చేత్తో చదునుచేయు.

**నులుపు**[1] రూ.చూ. నునుపు. వి. మెత్తన, నున్నన, ఎగుడు దిగుడు లేకుండటం.

**నులుపు**[2] రూ.చూ. నుల్పు. స.క్రి. నలుపు, నలగగొట్టు. ఉ. రా. 2.61 ; వి. 1. పన్నాగం, పన్నుగడ ; 2. మెలి, మెలిక.

**నులిపిచేయు** స.క్రి. పన్నెదండెల మధ్య బిగించిన ఈనెలు కత్తితో నునుపుచేయు.

**నులుమాడు** చూ. నులుము.

**నులుము** చూ. నులియు[1]. రూ. నుల్మ. స.క్రి. 1. నలుపుకొను. భాగ. 10పూ. 372 ; 2. (ఇతరులనుండి) బలవంతంగా లాగు. ఒడిపి పుచ్చుకొను. వీర. వి. 4.146 ; 3. మెలిపెట్టు, కండను రెండువేళ్ళలో బట్టి ఇటు అటు తిప్పు. కళా. 4.41 ; 4. విడుచు. రాఘవ. 4.53 ; 5. ఉన్మూలించు. పెల్లగించు, నాశంచేయు. చంద్రాంగ. 1.84 ; 6. వధించు, చంపు. ఆం. భా. 3.123 ; 7. గట్టిగానొక్కు, పిసుకు ; 8. ఒత్తివేయు.

**నులుమాడు** రూ. నుల్మాడు. స.క్రి. మెలిపెట్టు.

**నులులు** చూ. నులి.

**నులుసు**[1] వి. శేషం, మిగులు. భాగ. 10 పూ. 130.

**నులుసు**[2] రూ.చూ. నుల్చు. స.క్రి. పడుగు పోగులు చేత్తో చదునుచేయు.

**నుల్క** చూ. నులుచు. రూ.చూ. నులక. వి. నులకతాడు, సారె లోపలి పెండెల చుట్టూ కప్పే దారం.

**నుల్కత్రాడు** రూ.చూ. నులకత్రాడు. వి. నారతో పేనిన దారం. భోజ. 4.203. **నుల్కమంచము** రూ. నులకమంచము. వి. నులకతో నేసిన మంచం. విష్ణుపు. 4.215.

**నుల్చు** చూ. నులియు[1]. రూ. నులుచు, నులుసు[2]. స.క్రి. 1. నలుపు, పిసుకు. కు.సం. 2.66 ; 2. మెలివేయు, మెలిపెట్టు. భాస్క. రా. కిష్కిం. 819 ; 3. సంహరించు, నశింపచేయు.

**నుల్తి** చూ. నుల్చు. వి. పడుగులో చిక్కుపడ్డ దారాలు.

**నుల్పు** చూ. నులియు[1]. రూ. నులుపు[2]. స.క్రి. నలుపు, నలగగొట్టు. కు.సం. 2.66 ; వి. పన్నాగం, పన్నుగడ. విప్ర. 5.62.

**నుల్మాడు** చూ. నుల్మ.

**నుల్మ** రూ.చూ. నులుము. స.క్రి. మెలిపెట్టు.

**నుల్మాడు** రూ.చూ. నులుమాడు. స.క్రి. మెలిపెట్టు, పెల్లగించు.

**నుల్లింద** వి. ఒకానొక చెట్టు. పి.శకు. 2.14.

**నువు** రూ.చూ. నువ్వు. వి. సస్యవిశేషం, తిలసస్యం. నీలా. 2.16.

**నువుగింజబ్రాహ్మడు** వి. క్షుద్ర దానాలు పట్టే బ్రాహ్మడు. **నువులు**[1] రూ.చూ. నువ్వులు. వి.బ.వ. తిలలు. వేమ. 2.85.

**నువురు** వి. నున్నన, చదును.

**నువులు**[2] రూ.చూ. నూలు[1]. వి. అంగుళంలో పదోవంతు లేదా పదహారోవంతు.

**నువ్వు** రూ. నువు, నూగు, నూవు, నూవ. వి. సస్యవిశేషం,

తిలసస్యం. భార.శాంతి. 2.344, ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1384 (Sesamum Indicum).

త. నూ, నూవు. నువ్వులు, నోలై. నువ్వులతో చేసిన ఉండ; గోం. నున్గ్. నువ్వులు, నూన్గ్. నువ్వులు; పర్జి. నువుల్. నువ్వులు, నూ.న్యె. నువ్వులనూనె; కొలా. నువ్వూ. నువ్వులు, ను.నె; నా. నువ్వ్. నువ్వుల్, నూనె. నువ్వులనూనె.

**నువ్వుకట్టె** రూ.చూ. నూగుకట్టె. వి. సాగుపైరు (Sesamum Indicum). **నువ్వుగింజయెత్తు (-ఎత్తు)** వి. నువ్వుగింజతో సరిసమానమైన బరువు. **నువ్వుగింజవేయుటకుం జోటులేకుండు** అ.క్రి. సమ్మర్దమగు, ఖాళీ లేకుండు. రామాభ్యు. 8.222. **నువ్వుచేను** వి. తిల్యం, నువ్వులు పండే చేను. ఆం.భా. 2.229. **నువ్వుటుండలు** వి.బ.వ. బెల్లం, నువ్వులు కలిపి చేసే ఉండలు, తినే పదార్థం. హర. 2.91. **నువ్వుంబువ్వ (-పువ్వ)** వి. నువ్వుచెట్టు పువ్వు. విజయ. 1.84. **నువ్వులంగండ్లనునోరంబోసికొను** స.క్రి. అనవసరంగా అనర్థం తెచ్చుకొను. ఉ.హరి. 5.158. **నువ్వులనూనె** వి. తైలం, నువ్వులనుంచి తీసిన నూనె. **నువ్వులు** రూ. నువులు[1], నూగులు, నూలు[2], నూవులు. వి.బ.వ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనె గింజల చెట్టు. వేమ. 1.380 (Sesamum Indicum). **నువ్వులుజాగ్రత్తపెట్టు** అ.క్రి. ఆశపదలుకొను. **నువ్వెత్తు** వి. నువ్వుగింజ ఎత్తు. <నువ్వు +ఎత్తు[1].

**నువ్వెత్తు** చూ. నువ్వు.

**నుస** వి. **1.** కండూతి. ఆం.భా. 2.129; **2.** గొంతుకలోని పొడిదగ్గు.

**నుసము** వి. కసరు. గౌ.హరి.పూ. 2523 పం.

**నుసరు** అ.క్రి. రాచు.

**నుసలింగ** వి. ఒకానొక చెట్టు.

**నుసలు** అ.క్రి. **1.** ఆడితప్పు. భాగ. 8.594; **2.** ఏమరు, ప్రమాదమొందు. గౌ.హరి.ఉ. 194 పం.; **3.** కదలు, మెదలు. గౌ. హరి. ఉ. 1526 పం.; **4.** పూను, ప్రయత్నించు. రామాభ్యు. 2.113; స.క్రి. **1.** వ్యతిరేకించు. రాజ. వి. 1.65; **2.** పట్టుకొను, గ్రహించు. రాజ. వి. 2.65.

**నుసి** రూ. నుసిమి. వి. **1.** పురుగులు తొలవగా రాలే మాను పొడి. శృం.నై. 5.12; **2.** నిగురు, కట్టెలు మొ॥నవి కాల్చటంవల్ల వచ్చిన బూడిద; **3.** బూడిద; **4.** తూర్పార పట్టినప్పుడు వేరుగా పడ్డ సన్నటి దువ్వ; **5.** తూర్పార పట్టని రాసిలో ధాన్యంతో కలిసిఉన్న సన్నటిపొట్టు; విణ. నుసిపట్టిన, పాతఅయిన. రామాభ్యు. 4.88.

క. నుసి. నలగగొట్టబడిన, పొడి, దుమ్ము; తు. నొప్పు, నొచ్చె. అల్పం, తేలిక, పనికిమాలిన, నుగ్గు, చిన్న, నుగ్గెలు. చిన్నతనం; త. నొ. చిన్న, అల్పం. మృదువైన, నొయ్వ (నొయ్వి-) పల్చగాఅగు, మృదువైన, తేలికతనం, నొచి (-వ్-, -న్త్-). పల్చగాఉండు, అల్పం, మృదువు, నొచవు. మృదుత్వం, సున్నితత్వం; మ. నొచ్చు. అల్పం, తేలిక, నుసు. చిన్న, అల్పం, లేత, నొయ్ (ఇ). అల్పంగాఉన్న దేదైనా; కో. నొచ.క్, ఒన్చ.క్. చిన్న.

**నుసిపురుగు** వి. ఘుణం, మాను తొలిచి నుసి రాల్చే పురుగు. క. నుసిహుఅ. నుసిపురుగు; మ. నుచ్చుపుఴు. **నుసిపురుగులు** వి.బ.వ. చిమ్మట పురుగులు. **నుసిరాలుకొయ్య** వి. సారంలేని ఎండుకర్ర.

**నుసిగగు** చూ. నుసి. అ.క్రి. కుదులు, పాటుదప్పు.

**నుసిమి** రూ.చూ. నుసి. వి. బూడిద, వస్తువులు కాలగా మిగిలిన పొడి.

**నుసిమిరి** వి. పశువుల తోక వెంట్రుకలు ఊడిపోయే రోగం, కురుపు రోగం, గొడ్లకి చర్మంమీద సున్నితంగా ఏర్పడే వ్యాధి.

**నుసిలేబొంగు** చూ. నుసులు.

**నుసుకు** చూ. నుసుము[2]. వి. మాగాణిలో నలగని మట్టిగడ్డ.

**నుసుకుతొక్కు** స.క్రి. మాగాణిలో నలగని మట్టిగడ్డలు చదును చేయటానికి తొక్కు. **నుసుకువేయు** స.క్రి. మాగాణిలో నలగని మట్టి గడ్డలు చదును చేయు.

**నుసుగులాడు** చూ. నుసుంగు. అ.క్రి. కీచులాడు, కలహించు.

**నుసుంగు** అ.క్రి. తొలగు, అపసరిల్లు. శృం.నై. 7.130.

పో.చూ. కురు. నూఖ్.

**నుసుమ** వి. ఎండాకాలంలో కంట్లో ముసిరే చిన్నదోమ.

క. నొళ, నొళవు, నొణ, నొణవు. ఈగ, నుసి. ఈలు, కాగితం, బట్ట మొ॥ వాటిని పాడుచేసే చిన్న పురుగు. నొరజు, నొరజ్జు. చిన్న ఈగ, కంటి దగ్గర ఎగిరే చిన్న పురుగు; త. నుళంపు, నుల్లల్, నొల్లల్. కంట్లో పడే పురుగు, దోమ, నిలమ్బి. చిన్న పురుగు, నుల్లాన్. కుట్టే చిన్న చీమ; మ. నుఴమ్పు. చిన్న ఈగ, కంటిదగ్గర ఎగిరే చిన్న పురుగు; గోం. నుల్లే. కొన్ని పూలని పాడుచేసే పురుగు, నుల్లె. చిన్న ఈగ, నులె, నూలె. దోమ; పర్జి. నుడ్డి. దోమ; కొలా. నుల్లె. ఈగ; మాల్తొ. నులొ. ఒకరకం చిన్న కీటకం.

**నుసుము**[1] స.క్రి. ఆకర్షించు. లాగు. వసు. 4.23.

**నుసుము**[2] చూ. నుసుకు. వి. **1.** రొంపి దుక్కిలో ఏర్పడ్డ బురద ముద్ద; **2.** తెల్లవారుజాము; **3.** తెల్లవారటానికి ముందటి చీకటి; **4.** తోరాలు తొక్కటం; **5.** ఎత్తు, పన్నాగం; **6.** మాగాణిలో నలగని మట్టిగడ్డ.

**నుసులు** అ.క్రి. **1.** కదలు, చలించు. పండి.చ. 2.114 పు.; **2.** ఒదుగు, ముడిగి ఉండు. భార.ద్రోణ. 1.185; **3.** (ఒడలు) విరుచుకొను. శశా. 4.62; వి. **1.** ఒదగటం, ముడుచుకోటం. భార. శల్య. 2.267; **2.** చలించటం, వెనుదీయటం. ఉ.హరి. 3.80; స.క్రి. నులుము, నలుపు. చంద్రరే. 3.135.

క. నుసుళ్. వెనుతిరుగు, ముడుచుకొను, దాక్కొను, నుసులిసు. తలుపులో ప్రవేశించేటట్లుచేయు; తు. నుగుపుని. వదులగు, నుగురుని. వదులగు, నడలు; త. నొచి, నుకై. వదులగు, నడలు, నొచివు. వంగి ఉండటం; కురు. నుక్. కదుపు, తిప్పు, నుకుర్, నూఖ్. దాక్కొను. దాచు, నూఖ్. (కళ్ల) ఓంచుకొను, అపజయం

పొందు, ఒడిపోవు, నుజ్ (నుడ్డ్). దాచు, గుప్తపరచు; మాల్తొ. నుక్. కదిలించు, కదల్చు, నూగ్. వంగిపోవు, నుడ్గర్. దాచు, మరుగుపరచు, నుడ్. దాచు, గుప్తపరచు.

మూ.ద్రా.*నుచ్/నుయ్; నుక్-వ్- <*నుయ్-వ్-. *నుచ్-/ నుక్-; *నుయ్-.

**నుసిలేబొంగు** వి. నున్నపు కుప్ప మధ్య పాతిన కొలత కర్ర. **నుసులుకొను** రూ.చూ. నుసుల్కొను. స.క్రి. నులుము కొను. చంద్రరే. 3.135; అ.క్రి. మెదలు, దొరలు. **నుసుల్కొను** రూ. నుసులుకొను. అ.క్రి. మెదలు, దొరలు. భీమ. 1.34.

**నుసుల్కొను** చూ. నుసులు.

**నుస్పెలు** వి. ఒకరకం చేప.

**నూ-** చూ. నువ్వు. విణ. సమాసాల్లో నూవు శబ్దం యొక్క లుప్తశేష రూపం.

**నూగాయకారం(-కాయకారం)** వి. నువ్వుకట్టె కాల్చిన బూడిద. **నూజాల్లకమ్మి** వి. ఒకరకం చీర కమ్మి. **నూజాల్లచీర** వి. నూజాల్ల కమ్మి పెట్టి నేసిన చీర. **నూఁబప్పు (-పప్పు)** వి. నువ్వుల పప్పు. **నూఁబిండి(-పిండి)** వి. నువ్వులపొడి. శృం.నై. 8.198. **నూఁబువ్వు(-పువ్వు)** రూ.చూ. నూఁబూవు. వి. నువ్వు పువ్వు. **నూఁబూవు(-పూవు)** రూ. నూఁబువ్వు. వి. నువ్వు పువ్వు. హర. 3.23.

**నూక** రూ.చూ. నూచము. వి. బియ్యం, గోధుమలు మొ॥ వాటి రవ్వ.

**నూకపొట్టు** వి. ఊక. **నూకపొడ** వి. గజ్జి పొడలాగ ఉన్న చిన్నచిన్న మచ్చ. **నూకలగంజి** వి. బియ్యపు నూకలతో కాచిన గంజి. **నూకలగడ్డి** వి. గడ్డి జాతికి చెందిన ఒకరకం కలుపుమొక్క (Panicum Species). **నూకలు** వి.బ.వ. **1**. బియ్యం మొ॥ వాటి చిన్న ముక్కలు. భార. అను. 3.48; **2**. అక్షతలు. **నూకవాటు** వి. నూకపారు, నూకలయ్యే ధాన్యం. **నూకిడి** వి. దంచితే ఎక్కువనూకలయ్యే వడ్లు.

**నూకించు** చూ. నూకు.

**నూకిడి** చూ. నూక.

**నూకు** స.క్రి. **1**. తోయు, గెంటు. బసవ. 3 పు. 701 పం; **2**. దాటు. పండి.చ. 1.44; **3**. పడదోయు, గెంటు. భాగ. 10 ఉ. 398; **4**. తోలు. మను. **4.44**; **5**. చిమ్ము; విణ. తోసే (ది). ప్రబంధ. 78.

క. నూకు. నూగు, నుజ్కు. తోయు, పక్కకుతోయు, ముందుకు తోయు, ప్రేరేపించు; కొడ. నుక్(ను-కి-). తోయు; తు. నూకుని. తోయు, పక్కకి జరుపు, ముందుకు తోయు, మోచేతితో తోయు, నెట్టు, నుర్కుని. నొక్కు. తోయు; త. నూక్కు(నూక్కి-). తోయు, పక్కకు జరుపు, విడిచిపెట్టు (ఆయుధం), మూయు; కొలా. ను.క్. (ను.కి-). కదలటం కోసం తోయటం; మాల్తొ. నొక్కుక. పొచ్చు.

మూ.ద.ద్రా.*నూన్క్క్/ *నూక్క్.

**నూకించు** స.క్రి. తోయించు. అచ్చ.రా.యు. 72. <నూకు + -ఇంచు[3]. క. నూకిసు. **నూకుడకట్టె** రూ.చూ. నూకుడు కట్టె. వి. గుంద్రటి ఎదురు దోనెను తిప్పే కర్ర. **నూకుడు** వి. నూకటం, తోపడు. రామరా. 387; హంస. 3.232. **నూకుడుకట్టె** రూ. నూకుడ కట్టె. వి. గుంద్రటి ఎదురు దోనెను తిప్పే కర్ర.

**నూగు** రూ.చూ. నువ్వు. వి. నూవు, తిలసస్యం.

**నూగుకట్టె** రూ. నువ్వు కట్టె, నూగ్గట్టె. వి. **1**. సాగు పైరు (Sesamum Indicum); **2**. నువ్వు కంప. **నూగుచిక్కుడు** వి. పచ్చపూలు పూసే తీగ (Rhynchosia Viscosa). **నూగుపొట్టు** వి. నువ్వుల పొట్టు. **నూగుబెండ**[1] వి. తీగెబెండ, మెట్ట నేలల్లో పెరిగే ఒకరకం కలుపు మొక్క (Abutilon Indicum). **నూగుబెండ**[2] వి. నల్ల పురుదుడు చెట్టు (Phylanthus Reticulatis). **నూగులు** రూ.చూ. నువ్వులు. వి. ఉష్ణ ప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజల చెట్టు (Sesamum Indicum). **నూగువెంపలి** వి. లేతఎరుపురంగుపూలు పూసేమొక్క (Tephrasia villosa). **నూగ్గట్టె** రూ. చూ. నూగుకట్టె. వి. **1**. నువ్వుకంప; **2**. సాగుపైరు (Sesamum indicum). <నూగు + కట్టె.

**నూగ్గట్టె** చూ. నూగు.

**నూఁక** వి. ఒకరకం చెట్టు.

త. నూక్కమ్, నూకు్క్. ఒకరకం చెట్టు.

**నూఁకు** చూ. ఊఁకు. వి. **1**. పూనిక, ప్రయత్నం. కకుత్థ్స. 1.120; **2**. దెబ్బ; **3**. తిట్టు; స.క్రి. అపహరించు; అ.క్రి. **1**. పరిగెత్తు; **2**. లోనికిపోవు, దిగు.

**నూఁగారు** చూ. నూఁగు.

**నూఁగు** రూ. నూఁగుడు. వి. **1**. ఆకులు, కాయలు, తీగలు, వడ్లు మొదలైన వాటిమీద చిన్నచిన్న ముళ్లలాగ ఉండే సూక్ష్మావయవ సమూహం. నిర్వ. రా. 6.51; **2**. అప్పుడే కొత్తగా బయలుదేరే రోమం, రోమాంకురం. భార. విరా. 1.245; విణ. లేతదైన. కాశీ. 1.7.

**నూఁగారు** రూ. నూఁగుటారు. వి. రోమావళి. కు. సం. 3.52. <నూఁగు + -ఆరు. **నూఁగుటారు** రూ. చూ. నూఁగారు. వి. రోమావళి. ఇందు. 2.191. **నూఁగుదోస** రూ.చూ. నూదోస. వి. కూతురు బుడమ. **నూఁగునూఁగుఁ బ్రాయము (-ప్రాయము)** వి. నూతనయౌవనం. కవిక. 3.10. **నూఁగుసుడి** వి. రెండుపిర్రల మీదఉండే సుడి. **నూదోస** రూ. నూఁగుదోస. వి. **1**. ఒకరకం దోస; **2**. రేణుకలు.

**నూఁగుడు** రూ.చూ. నూఁగు. వి. ఆకులు, కాయలు మొ॥ వాటికి ఉండే చిన్నచిన్న ముళ్ళవంటి సూక్ష్మావయవ పదార్థం. కవిక. 5.118.

**నూచ** రూ.చూ. నూచము. వి. **1**. పొడి, చూర్ణం. కు. సం. 11.143; **2**. ముక్క, శకలం. భార. ద్రోణ. 4.154.

**నూచము** రూ. నూక, నూచ. వి. పొడి. కు. సం. 11.20.

క. నూకు, నూగు. ముక్క, నుఱుకు, నుఱుగు, నుర్గు, నుగ్గు. పిండు, నలిపి ముక్కలు చేయు; కొడ. నురి. బియ్యం నూకలు, నుబ్బి. విరిగినబియ్యం ముక్కలు; తు. నురియుని. విరుచు, ముక్క

లగు ; త. నుఱుక్కు (నుఱుక్కి-). చిన్నముక్కలుచేయు, ముక్కలు ముక్కలుగా చేయు. నొఱుక్కు (నొఱుక్కి-). ముక్కలుచేయు, నలుపు, నుక్కు (నుక్కి-). ముక్కలు చేయు, రుబ్బు; మ. నుఱుక్కుక. ముక్కలు చేయు, నుఱుక్కు. ముక్క ; కో. నుచ్. నూక ; తొ. నుచ్. విరిగిన బియ్యం ; గోం. నూకా. బియ్యం విసరటంలో ముక్కలవటం ; కువి. నూకన్గ. బియ్యంనూకలు ; పర్జి నూకొల్, నున్గుఙ్. బియ్యంనూకలు ; కొలా. నొర్ప్. ముక్కలు చేయు ; బ్రా. నుసింగ్. ముక్కలు చేయు.

నూట వి. కూరగాయల పాదులకు తీగలు ఎగబ్రాకటానికి ప్రక్కన ఉంచిన పుల్లలు.

నూటనాట చూ. నూఱు[2].

నూటవెయ్యింటనొకతె చూ. నూఱు[2].

నూటికర్థము చూ. నూఱు[2].

నూటికొకరు చూ. నూఱు[2].

నూటికొకరుకోటికొకరు చూ. నూఱు[2].

నూటికొక్కఁడు చూ. నూఱు[2].

నూటికొక్కరుకోటికొక్కరు చూ. నూఱు[2].

నూటిడి చూ. నూవు.

నూటు వి. 1. గాతం, చేనిచుట్టూ రక్షణకు కంప పాతటానికి తీసిన గాడి ; 2. గుంజలు మొదలైనవి పాతటానికి గడ్డ పలుగుతో తవ్విన లోతైనగుంట.

నూతఁబడెదోపాఁతరఁబడెదో చూ. నూయి.

నూతి వి. గండమాల, గుడ్లు గుడ్లుగా ఏర్పడే పుండు.

నూతికప్ప చూ. నూయి.

నూతికసింద వి. పైడితంగేడు మొక్క (Cassia sophera).

నూతిగాజు చూ. నూయి.

నూతిటిక చూ. నూయి.

నూతినంద చూ. నూయి.

నూతొర చూ. నూయి.

నూదోస చూ. నూఁగు.

నూన రూ. చూ. నూనియ. వి. మంచినూనె, కొబ్బరినూనె వగైరా.

నూనగంతచేయు రూ.చూ. నున్నగింతచేయు. స.క్రి. నున్నగించు, నున్నగింత నలపలో రెండోసారి సాపుచేయు.

నూనగంతనల్ప రూ.చూ. నున్నగింత నలప. వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ, నున్నగ నర్సటానికి వాడే పల్చని చదరమైన నలప.

నూనిగిద్ద రూ.చూ. నూనెగిద్ద. వి. నూనెపోసిన చిన్నపాత్ర.

నూనిబుడ్డి రూ.చూ. నూనెబుడ్డి. వి. నూనెకుడుము, నూనెపోసి ఉంచటానికి వాడే మట్టిపాత్ర.

నూనియ రూ. నూన, నూనె. వి. 1. నువ్వులనూనె. తైలం. కు. సం. 6.52. 2. చమురునిచ్చే విత్తులుకల చెట్టుపేరుకు తర్వాత వచ్చినప్పుడు చమురు అని అర్థమిస్తుంది.

త. నూ, నూవు. నువ్వులు, నొలై. నువ్వుగింజలలో తయారు చేసినది ; గోం. నున్గ్, నూన్గ్ ; పర్జి. నువ్వల్. నూనెయ్. నువ్వులనూనె ; కొలా. నువ్వూ, ను. నె. చమురు ; నా. నువ్వ్, నూనె. నూనె.

< మూ. ద్రా. *నూ.

నూనె రూ.చూ. నూనియ. వి. 1. నువ్వులచమురు, తైలం, హర. 2.99 ; ద. హిం. శా. సంపు.4. శా. సంపు. 935 ; 2. చమురునిచ్చే చెట్టుపేరుకు తర్వాత వచ్చినప్పుడు చమురు అని అర్థమిస్తుంది.

నూనెకట్లపాము వి. నల్లని చారలున్న చిన్నవిషపు పాము. నూనెకుడుము వి. నూనెబుడ్డి, పొట్టపెద్ద, మూతి ఇరుకు, అడుగుపల్లం, పెద్దంచు తోటి ఉండే మట్టిపాత్ర. నూనెకొమ్ము వి. చమురుకొమ్ము, నూనె పోసుకొనే దుప్పి కొమ్ము. నూనెగచ్చ వి. పచ్చపూలు పూస్తూ నూనె ఇచ్చే గింజలుకల చెట్టు (Caesalpinia digyna). నూనెగడ్డ వి నీరు వెలిసే నేల, ఊటనేల. నూనెగమళ్ల వి.బ.వ. ఒంటెద్దు గానుగతో నూనె ఆడే ఒకజాతివారు. నూనెగిద్ద రూ. నూనిగిద్ద. వి. నూనెపోసిన చిన్నపాత్ర. నూనెగిన్నె వి. నూనెపోసిన చిన్నపాత్ర. నూనెగురిగి. రూ. నూనెగుర్గి. వి. నూనెపోసే చిన్నముంత. నూనెగుర్గి రూ.చూ. నూనె గురిగి. వి. నూనెపోసే చిన్నముంత. నూనెగొట్టం వి. నేత నేసేటప్పుడు నాడెను సాపుచెయ్యటానికి నూనె పోసుకొనే వెదురుగొట్టం. నూనెచెంబు వి. చమురుచెంబు, నూనె పోసిన చిన్నపాత్ర. నూనెపదును వి. నూనెతడి. నూనె పదునుపెట్టు స.క్రి. నూనె తడిపెట్టు. నూనెపాత వి. నూనెతో తడిపిన గుడ్డ. నూనెపాపట వి. నున్నని కాండం కలిగి కొమ్మ లుండని మొక్క (Pavetta Indica). నూనెపావు వి. నూనె పోసిన చిన్నపాత్ర. నూనెపెఱుక వి. వర్తక వ్యాపారాల నిమిత్తం ఎడ్లు, గుర్రాలపై మోయించే నూనె మూటలు. ద.హిం.శా.సం. 4. శా.సం. 935. క్రీ.శ. 1269. నూనెపొరదిండు వి. గనిలోని మొదటి రాతి పొర. నూనెబరిగె వి. నూనె పోసిన చిన్నపాత్ర. నూనెబాణి వి. మట్టిబాండలి, రెండంగుళాల లోతుతో అడుగు వెడల్పుతో రెండంచుల్తో ఉండే మట్టిపాత్ర. నూనెబుడ్డి రూ. నూనిబుడ్డి. వి. నూనె కుడుము, నూనె పోసి ఉంచటానికి వాడే మట్టి పాత్ర. నూనెబుడ్డిగాడు వి. పక్షి విశేషం (Ruticilla Rufiventris). నూనెబేహరులు వి.బ.వ. నూనె వర్తకుడు. ద.హిం.శా.సం. 7. శా.సం. 134. క్రీ.శ. 1228. నూనెమచ్చ వి. ఒకరకం చర్మ రోగం. నూనెముడి వి. కీలుగంటు, జారుముడి. మను. 3.31. నూనెముంత వి. గుచ్ఛబల. వృక్ష విశేషం. ఆం.భా. 2.54. నూనెమెరుగుడు వి. నూనెతో పెట్టే మెరుగు. నూనెయగిసె (-అగిసె) వి. నల్లగిసె, అతసి. నూనెయంటు (-అంటు) వి. తలంటు. పారి. 2.9 ; అ.క్రి. అభ్యంగన స్నానంలో నూనె తలకు ఒంటికీ రాయు. నూనెరేగడి వి. మంచి నల్లరేగడి. నూనెరోగం వి. పత్తితెగులు.

నూము రూ.చూ. నువ్వు. వి. సాగుపైరు (Sesamum Indicum).

నూయ రూ.చూ. నూయి. వి. బావి, నీటికోసం భూమిలోకి తవ్విన లోతైన గుంట.

నూయి రూ. నుయి, నుయ్యి, నూయ. వి.బొ. 1. చేదుడుబావి, కూపం. భార.ఆది. 3.144 ; 2. బావి, నీటి కోసం

భూమిలోకి తవ్విన లోతైన గుంట.

కువి. నూజి (జె- య్) నూయి ; కొలా. నువ్వి. ; నా. నువ్వి.

**నూత(బడెదో పాత(ర(బడెదో** అవ్య. కష్టపడెదవో, సుఖపడెదవో అనేటప్పటి నుడికారం. సారంగ. 3.222. **నూతికప్ప** వి. 1. కూపస్థ మండూకం. భార.ఉద్యో. 4.196 ; 2. మిడిమిడిజ్ఞానంకల వ్యక్తి. **నూతిగాజు** వి నూతొర, అడుగు ఎత్తులో మూడునాలు గడుగుల కైవారంతో చేసిన మట్టివలయం. **నూతిటిక** వి. బావి కట్టుబడిలో వాడే ఇటిక. < నూయి + -ఇ[9] + ఇటిక. **నూతినంద** వి. నూతొర, నూతుల్లో చుట్టూ మన్ను పడకుండా ఉండడానికి దించే వర. < నూయి + -ఇ[9] + నంద. **నూతొర** వి. కుమ్మరి వర, అడుగు ఎత్తులో మూడు నాలు గడుగుల కైవారంతో చేసిన మట్టి వలయం. < నూయి + -ఇ[9] + ఒర.

**నూరుగల్లకుండ** చూ. నూఱు[2]. వి. వెయ్యికళ్ళకుండ, చిన్న చిన్న చిల్లులు పెట్టినట్టి కాల్చని మట్టిపాత్ర.

**నూరుగాలము (-కాలము)** చూ. నూఱు[2]. అవ్య. ఎల్లప్పుడు, ఆరుగాలం.

**నూరునిండు** చూ. నూఱు[2]. అ.క్రి. అయుష్షునిండు. తాళ్ల.సం. 8.258.

**నూరువరహాలు** చూ. నూఱు[2]. వి. తోటల్లో పెంచబడే తెల్ల పూలు పూసే చెట్టు (Plumeria Acutifolia).

**నూర్గురు** చూ. నూఱు[2].

**నూర్చినూత(బోయు** చూ. నూర్చు.

**నూర్చు** రూ.చూ. నుఱుచు. స.క్రి. (ధాన్యం మొ॥ వాటిని) నలగగొట్టు. కు.సం. 11.42.

**నూర్చినూత(బోయు** స.క్రి. నశింపచేయు. ప్రబోధ. 2.68. **నూర్పిడి** రూ.చూ. నుఱిపిడి. వి. 1. ధాన్యం మొ॥ వాటిని కాళ్ళు మొ॥ వాటితో నలపటం ; 2. కోసిన గడ్డిని కళ్ళంలో వేసి పశువులతో తొక్కించి గింజలు రాల్చటం. **నూర్పు** రూ.చూ. నుఱుపు. వి. ధాన్యాదుల్ని (పశువుల, మనుషుల) కాళ్ళతో నలగ్గొట్టటం.

**నూర్జహా(ఖానీ** వి. శివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం.ఉ. నూర్జహా(ఖాని. అధిక కాంతికి స్థానం.

< ఉ. నూర్జహా(ఖాని.

**నూర్జహానుపచ్చ** రూ. నూర్జహాన్‌పచ్చ. వి. 1. అరిటాకుపచ్చలో లేతరంగు ; 2. రామచిలకపచ్చలో లేతరంగు.

హిం.ఉ. నూర్జహాన్. మిక్కిలి కాంతి.

< ఉ. నూర్జహాన్ + పచ్చ.

**నూర్జహాన్‌పచ్చ** రూ.చూ. నూర్జహానుపచ్చ వి. 1. అరిటాకు పచ్చలో లేతరంగు ; 2 రామచిలకపచ్చలో లేతరంగు.

**నూర్పిడి** చూ. నూర్చు.

**నూర్పు** చూ. నూర్చు.

**నూర్మొనలపట్టెము** చూ. నూఱు[2].

**నూర్వురు** చూ. నూఱు[2].

**నూర్వేలు** చూ. నూఱు[2].

**నూఱంచులకత్తిచే(గొంచుజోదు** చూ. నూఱు[2].

**నూఱంచులకైదువు** చూ. నూఱు[2].

**నూఱంచులవాలు** చూ. నూఱు[2].

**నూఱార్లు** చూ. నూఱు[2].

**నూఱాఱు** చూ. నూఱు[2].

**నూఱాఱులు** చూ. నూఱు[2].

**నూఱిపిడి** చూ. నూఱు[1].

**నూఱిపోయు** చూ. నూఱు[1].

**నూఱు[1]** స.క్రి. 1. రాచు, నలచు. భార.విరా. 2.221 ; 2. ఆయుధం మొ॥నవి పదునెక్కటానికి రాతిమీద ఒరపెట్టు. మను. 3.28 ; 3. సన్నెకల్లుమీద మెత్తగాచేయు. కాశి. 3.205.

క. నూఱు. నూర్చుదం, నుఱి. చిన్న ముక్కలుచేయు, పొడిచేయు ; తు. నురియుని. విరచు, ముక్కలుచేయు ; త. నూఱు (నూఱి-). నూరు, ముక్కలుచేయు, పగుల గొట్టు, చంపు, నొఱుక్కు (నొఱుక్కి-). నలుపు, నూరు, నుక్కు (నుక్కి-). పొడిచేయు ; మ. నూఱుక. పొడి చేయు ; కో. నుచ్. ధాన్యాలు ముక్కలుచేయు ; తొ. నుచ్. విరిగిన బియ్యం ; గోం. నొర్. నూరు ; కువి. నుయ్‌మ్లి. నూరు, నూయి. నూరు ; పర్జి. నూకొల్. ముక్కలైన బియ్యం ; కొలా. నొర్ప్ ; బ్రా. నుసింగ్. ముక్కలుచేయు, నుస్. ముద్దచేయు, నలుపు, నూరు.

< మూ.ద్రా. *నూ-.

**నూఱిపిడి** రూ.చూ. నుఱిపిడి. వి. ధాన్యం మొ॥ వాటిని కాళ్ళు మొ॥ వాటితో నలపటం. **నూఱిపోయు** స.క్రి. పాఠం మొ॥ వాటిని నాజేటట్లు చెప్పు, బాగా బోధించు. కకుత్థ. 3.12. **నూఱుకొనిత్రాగు** అ.క్రి. వేధించు. **నూఱుచు** రూ.చూ. నుఱుచు. స.క్రి. 1. నలగగొట్టు. ప్రబోధ. 2.68 ; 2. ధాన్యాదుల్ని కాళ్ళతోను, పశువులతోను తొక్కి నలగగొట్టు. **నూఱుపు** రూ.చూ. నుఱుపు. వి. ధాన్యం మొ॥ వాటిని కాళ్ళు మొ॥ వాటితో నలుపు. **నూఱుపుడు** రూ.చూ. నుఱిపిడి. వి. ధాన్యం మొ॥ వాటిని కాళ్ళు మొ॥ వాటితో తొక్కి నలపటం. **నూఱుఱాయి** వి. 1. సన్నెకల్లు ; 2. మంగలి కత్తి నూరే రాయి.

**నూఱు[2]** సర్వ. ఔ. శతం, వంద. భార. ఆది. 1.49 ; రామేశ్వరం శాసనం, క్రీ.శ. 625-650.

క. నూఱు. వంద ; కొడ. నూరు ; తు. నూదు ; త. నూఱు. వంద, నూఱ్ఱువర్. వందమంది ; మ. నూఱు (నూఱ్ఱు-). వంద, నూఱ్ఱ్- అణ్టు. వంద సంవత్సరాలు ; కో. నూర్. నూరు ; తొ. నూఱ్. వంద, ను.ఱ్ ; గోం. నూర్, నుర్.

< మూ.ద్రా. *నూఱ్-.

**నూటనాట** అవ్య.ద్రు. నూటికి కోటికి. **నూటవెయ్యింటనొకటె** సర్వ. అపురూపం అనటం. శుక. 3.520. **నూటికర్థము** వి. సారాంశం. **నూటికొకరు** సర్వ. బ.వ. అరుదు అనేటప్పటి నుడికారం. **నూటికొకరు కోటికొకరు** సర్వ. బ.వ. అరుదు అనేటప్పటి నుడికారం. **నూటికొక్క(డు** సర్వ. అరుదు అనేటప్పటి నుడికారం. **నూటికొక్కరు కోటికొక్కడు** సర్వ. బ.వ. అరుదు అనేటప్పటి నుడికారం. **నూర్గురు** రూ.చూ.

నూర్వురు. సర్వ. బ. వ. నూరుమంది, వందమంది. దశా. 2.162. **నూర్మొనలపట్టెము** వి. నూరంచుల ఆయుధం, వజ్రాయుధం. ఉ.రా. 3.22. **నూర్వురు** రూ. నూర్గురు, నూఱుగురు, నూఱువురు. వి. నూరుకు మహన్మహత్వర్థకరూపం, శత సంఖ్య కలవారు. భార. ఆది. 3.20. క. నూఱ్ఱువర్. వందమంది. **నూర్వేలు** రూ. నూఱువేలు. సర్వ. బ. వ. లక్ష. సిం.ద్వా. 2.53. **నూఱంచుల కత్తిచేఁ గాంచుజోదు** వి. వజ్రపాణి, ఇంద్రుడు. వేంక. ఆం. 12. **నూఱంచులకైదువు** వి. శతకోటి, వజ్రాయుధం. నృసింహ. 2.46. **నూఱంచులవాలు** వి. వజ్రాయుధం. ఆం.నా.సం. దేవ. 17. **నూఱార్లు** రూ. నూఱాఱులు. వి.బ.వ. అనేకం. రామాభ్యు. 7.129. < నూఱు[2] + ఆఱు + -లు. **నూఱాఱు** సర్వ. అనేకం. శుక. 4.109. < నూఱు[2] + ఆఱు. **నూఱాఱులు** రూ.చూ. నూఱార్లు. వి.బ.వ. అనేకం. **నూఱుగురు** రూ.చూ. నూర్వురు. సర్వ. నూరుమంది, వందమంది. ఉ. హరి. 1.84. **నూఱుచుక్కలప్రోవు** వి. శతభిషం. **నూఱునునిండు** స.క్రి. ఆయువు చెల్లు. కాశ. 3.205. **నూఱుమగనిలువులు** వి.బ.వ. శతపురుష ప్రమాణం, నూర్గురు మనుషుల ఎత్తు. పండి.చ. ద్వితీ. 5.486 ప. **నూఱువురు** రూ.చూ. నూర్వురు. సర్వ. బ.వ. వందమంది. కాశ. 3.205. **నూఱువేలు** రూ.చూ. నూర్వేలు. సర్వ. బ.వ. లక్ష.

**నూలమలగ** చూ. నూలు[1].

**నూలిగరసు** వి. ఇంద్రలుప్తకం, బట్టతల. ఆం.భా. 2.129.

**నూలిజాన** చూ. నూలు[1].

**నూలితడ[1]** చూ. నూలు[1].

**నూలితడ[2]** చూ. నూలు[1].

**నూలిపున్నమ** చూ. నూలు[1].

**నూలు[1]** రూ. నువులు2, నూళు. వి.జౌ.అనౌ. **1**. మొలనూలు. కు.సం. 9.68 ; **2**. తామర మొ. వాటిలోని దారం. క్రీడా. 2 ; **3**. తంతువు, ప్రత్తి వడికిన పోగు, దారం. ఆము. 2.20 ; **4**. అంగుళంలో పదోవంతు లేదా పదహారో వంతు.

క. నూఱ్ (నూల్త్-). నూలు. దారం (నూలుదారం), దారంతీయు, నులిగె. వడకటం, నూలిసు. వడకు. నులి. మెలిపెట్టు ; కొడ. ను.లి. దారం ; తు. నూలు. దారం, నూలు. త. నూల్. యజ్ఞోపవీతం, మంగళసూత్రం, దారం, నూలుదారం, (నూఱ్ప్-, నూఱ్జ్-). మెలిపెట్టు ; ను. నూల్. దారం, నూల్క్క. దారంవడకు ; కో. ను.ల్. దారం ; తొ. ను.స్. దారం. ను.స్ప్ (ను.స్త్-). దారం రెండు కొసలు చుట్టి కలుపు ; గోం. నూల్. దారం, తీగ, నోల్బ్. దారం మెలిపెట్టు ; కుఇ. నూడు. నూలు దారం ; కువి. లూలూ, లోలు. దారం ; పర్జి. నూల్ ; కొలా. నువ్, నూల్ ; గ. నూల్ ; ఒల్లా. నూల్ ; కురు. నోఁఏఁనొ. కదలేదాన్ని దేనైనా చుట్టు, గడ్డిగాని. తీగనుగాని చుట్టు.

< మూ.ద్రా. నూల్.

**నూలమలగ** వి. ఎద్దుపై గంతతో తెచ్చిన నూలుగోనె. **నూలిజాన** వి. పరికరాల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Grewia Tiliaefolia). **నూలితడ[1]** వి. పీచు బెరడు కలిగి ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Helecteres Isora). **నూలితడ[2]** వి. బూడిదరంగు ఆకులుండే చిన్నచెట్టు (Grewia Orbiculata). **నూలిపున్నమ** రూ. నూలుపున్నమ. వి. జంధ్యాల పౌర్ణమి, శ్రావణపూర్ణిమ. పండి.చ.ప్రథ. 2.361 ప. **నూలుకట్టె** వి. పలచటి రీపరుచెక్క. **నూలుకండె** వి. కండె, నేతలో వాడే పేకదారం చుట్ట. **నూలుకర్ర** రూ. నూలుగర్ర. వి. **1**. పడుగేరుకర్ర, పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కర్ర ; **2**. గంజిలో తడిపిన నూలు చిట్టెలు ఆరవేసిన కర్ర. **నూలుకుంచి** రూ.చూ. నూలుకుంచె. వి. కుంచెకు రెండువైపులా నూలు దారంతో అడ్డబద్దలు బిగించికట్టిన కుంచె. **నూలుకుంచె** రూ. నూలు కుంచి. వి. కుంచెకు రెండువైపులా నూలు దారంతో అడ్డ బద్దలు బిగించి కట్టిన కుంచె. **నూలుకొనిచెల్లు** అ.క్రి. నడచు. భార. భీష్మ. 1.232. **నూలుకొను** రూ.చూ. నూల్కొను. అ.క్రి. **1**. పురికొను. భార. భీష్మ. 1.87 ; **2**. పూనుకొను. వరాహ. 8.2 ; **3**. స్థిరపడు. ప్రబోధ. 5.18 ; **4**. చక్కబడు ; **5**. ఒప్పుకొను ; **6**. సమ్మతమగు ; **7**. వ్యాపించు ; **8**. కలుగు ; **9**. స.క్రి. **1**. సమ్మతించు ; **2**. స్థిరపరచు. **నూలుకొలుపు** రూ. నూలుకొల్పు. నూల్కొలుపు, నూల్కొల్పు. స.క్రి. **1**. ప్రసరింపజేయు. వ్యాపింపజేయు. కు.సం. 5.36 ; **2**. సమ్మతింపచేయు. కు.సం. 5.102 ; **3**. చక్కబరచు, సరిచేయు. ఉ.హరి. 5.140 ; **4** కలిగించు. వరాహ. 5.44 ; **5**. పురికొల్పు, ప్రేరించు ; **6**. కుదురుపరుచు, నెలకొలుపు. **నూలుకొల్పు** రూ.చూ. నూలుకొలుపు. స.క్రి. **1**. కుదురుపరుచు, నెలకొలుపు. భార. విరా. 4.187 ; **2**. చక్కబరుచు, సరిచేయు. భార. విరా. 5.121 ; **3**. పురికొల్పు, ప్రేరించు. భార. భీష్మ. 2.15 ; **4**. ప్రసరింపజేయు ; **5**. కలిగించు ; **6**. పురికొల్పు. **నూలుకోల** వి. పేకకట్టె, గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. **నూలుకోలు** వి. నూలు కొనటం. **నూలుగదురు(-కదురు)** వి. నేతకు కావలసినంత ఉన్ని నూలు చుట్టిన కట్టె. **నూలుగర్ర(-కర్ర)** రూ.చూ. నూలుకర్ర. వి. **1**. పడుగేరుకర్ర, పడుగు చాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి నున్నటి కర్ర ; **2**. గంజిలో తడిపిన నూలు చిట్టెలు ఆరవేసిన కర్ర. **నూలుగొట్టం** రూ. నూలుగొట్టెం. వి. పేకగొట్టం, గొంగడి వేసేటప్పుడు, మగ్గానికి బిగించిన ఉన్ని పడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురు గొట్టం. **నూలుగొట్టం చిమ్ము** స.క్రి. పేకగొట్టం చిమ్ము. **నూలుగొట్టచొరగొట్టు** స.క్రి. పేకగొట్టం చొరగొట్టు. **నూలుగొట్టెం** రూ.చూ. నూలుగొట్టం. వి. పేకగొట్టం, గొంగడి నేసేటప్పుడు మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం. **నూలుచు** స.క్రి. తిప్పు, తిరిగేటట్లు చేయు. **నూలుంట** వి. చుట్టచుట్టిన పడుగునూలు. < నూలు[1] + ఉంట. **నూలుండ** వి. వడికి చుట్టిన దారం. < నూలు[1]

+ఉండ. **నూలుతాడు** వి. **1.** నూలుతో పేనిన తాడు ; **2.** గోడలు తిన్నగా ఉన్నాయో లేదో చూడటానికి బేల్దారులు వాడే దారం. **నూలుతేగ** వి. సముద్ర తీర ప్రాంతాల్లో పొదలమీద పెరిగే మొక్క (Cassytha filiformis). **నూలుదిండు** వి. కదురు కడ్డీకి బంకతో నూలుచుట్టి చేసిన దిండు. **నూలుదుంప** వి. పెండలంతీగ (Dioscorea Pentaphylla). **నూలుపట్టినట్లు** అవ్య. నూలుపట్టిగీతగీసినట్లు, తిన్నగా. **నూలుపట్టు** అ.క్రి. **1.** దారం వేసి సూటిగా ఉండేటట్లు చేయు. భీమ. **3.59** ; **2.** పంటెకుగాని డబ్బాకుగాని నూలు చుట్టు. **నూలుపంటె** వి. చేత్తోనూలుచుట్టే పనిముట్టు, డబ్బాఆకారంలో ఉండే ఒకరకం కొయ్యపంటె. **నూలుపండుగ** వి. **1.** నూలుపున్నమ, శ్రావణ పౌర్ణిమ ; **2.** జనుము కోతకు వచ్చిన తరువాత నార వడకటం మొదలు పెట్టే రోజున చేసుకొనే పండుగ. **నూలుపున్నమ** రూ.చూ. నూలిపున్నమ. వి. నూలిపండుగ, శ్రావణ పౌర్ణమి. **నూలుపెట్టి** రూ.చూ. నూలుపెట్టె. వి. మిల్లు నూలుకట్ట. **నూలుపెట్టె** రూ. నూలుపెట్టి. వి. మిల్లు నూలు కట్ట. **నూలుపోఁగతుకు** అ.క్రి. కొత్త ముట్టు, వడకటం మొదలు పెట్టేటప్పుడు ఏకును సాగదీసి కదురుకు అంటించు < నూలుపోఁగు + అతుకు. **నూలుపోయు** స.క్రి. పంటెకుగాని, డబ్బాకుగాని నూలు చుట్టు, అనుపోయు. ఆనుగొట్టంలోకి పోగు తీసుకొని ఆను కొయ్యలకు చుట్టి వచ్చేట్టు చేయు. **నూలుబరిగ** వి. పేక కట్టె, గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. **నూలుబుడ్డి** వి. పంటెకు బదులు నూలు చుట్టుకొనే రేకు డబ్బా. **నూలురాటం** రూ. నూ్రలాటం. వి. కండెలరాట్నం. పేకకు పనికివచ్చే దారపు కండెలు చుట్టే రాట్నం. **నూలులంగ్డా** వి. పట్టుదారం చిలప. **నూలువాసిలోతప్పిపోవు** అ.క్రి. కొద్దిలో తప్పిపోవు. **నూలువాసిలోతప్పు** అ.క్రి. కొద్దిలో తప్పిపోవు. **నూలువిసురు** స.క్రి. ఆనుపోయు, ఆనుగొట్టంలోకి పోగు తీసుకొని ఆనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టుచేయు. **నూల్కొను** రూ. నూలుకొను. స.క్రి. **1.** ప్రసరింపచేయు. కు.సం. 9.135 ; **2.** స్థిరపరుచు. భార. ఉద్యో. **4.418** ; **3.** సమ్మతించు. ప్రబోధ. 5.37 ; అ.క్రి. **1.** చక్కబడు. భార.విరా. **4.174** ; **2.** ఒప్పుకొను. భార.విరా. 5.115 ; **3.** స్థిరపడు. భార.ఉద్యో. 2.97 ; **4.** పురికొను. భార.భీష్మ. 1.87 ; **5.** కలుగు. రం.రా.యు. **326** పు. 21 పం. ; **6.** సమ్మతమగు. సిం.ద్వా. 10.58 ; **7.** వ్యాపించు. గా. హరి. ఉ. 1402 పం. ; **8.** పూనుకొను. **నూల్కొలుపు** రూ.చూ. నూలుకొలుపు. స.క్రి. **1.** ప్రసరింపజేయు, వ్యాపింపచేయు. కు.సం. **5.118** ; **2.** పురికొల్పు, ప్రేరించు. భార.విరా. **4.268** ; **3.** చక్కబరుచు, సరిచేయు ; **4.** కుదురు పరుచు, నెలకొలుపు ; **5.** కలిగించు. **నూల్కొల్పు** రూ.చూ. నూలుకొలుపు. స.క్రి. **1.** అలంకరించు. కు.సం. **9.13** ; **2.** చక్కబరుచు, సరిచేయు పొందుపరుచు. వసు. **3.100** ; **3.** కుదురుపరుచు, నెలకొలుపు. ఉ.రా. 6.207 ; **4.** పురికొల్పు, ప్రేరించు ; **5.** ప్రసరింపజేయు, వ్యాపింపజేయు ; **6.** కలిగించు. **నూ్రలాటం** రూ.చూ. నూలురాటం. వి. కండెల రాట్నం, పేకకు పనికి వచ్చే దారపు కండెలు చుట్టే రాట్నం.

**నూలు**[2] రూ.చూ. నువ్వులు. వి.బ.వ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనె గింజల చెట్టు (Sesamum Indicum).

**నూల్కొను** చూ. నూలు[1].

**నూల్కొలుపు** చూ. నూలు[1].

**నూల్కొల్పు** చూ. నూలు[1].

**నూ్రలాటం** చూ. నూలు[1].

**నూళు** రూ.చూ. నూలు[1]. వి. దూదిపేని తయారు చేసిన దారం.

**నూవు** రూ.చూ. నువ్వు. వి. సస్యవిశేషం, నువ్వులు. ఆం.భా. 2.236,

**నూటిడి** వి. నువ్వులతో చేసిన భక్ష్య విశేషం. శృం.నై. 8.198. **నూవుగడ్డి** వి. ఆము పడుగులో కుండల కింద కుదుర్లుగా పెట్టటానికి వాడే గడ్డి. **నూవుచేను** వి. నూలు పండే చేను. ఆం.భా. 2.229. **నూవునేల** వి. నువ్వులు పండే పొలం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. **1243.** **నూవులపెంట** వి. నూవులు మొ॥ కాయధాన్యాలమ్మే వర్తక స్థలం. ద.హిం.శా. సంపు. 7. శా.సం. 734. క్రీ.శ. 1306. **నూవులు** రూ.చూ. నువ్వులు. వి.బ.వ. ఉష్ణప్రాంతాల్లో పెరిగే ఒకరకం నూనెగింజల చెట్టు (Sesamum Indicum).

**నృసింహము** వి. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

సం. నృసింహ-. రతిబంధ విశేషం.

<సం. నృసింహ- (అర్థవిపరి.).

**నెం** చూ. నంబరు. వి. నంబర్ అనే ఇంగ్లీషు పదానికి సాంకేతికాక్షరం.

**నెకబిక** వి. పట్టుదల. కళా. 8.102.

**నెకబికలుగఁబోట్లాడు** అ.క్రి. సంకుల సమరం చేయు. కళా. 8.104.

**నెక్క** రూ.చూ. లెక్క. వి. **1.** ఉరవ, గణితం, సంఖ్య ; **2.** గణన, పద్దు.

**నెక్కర**[1] వి. తెల్లపూలు పూసే గట్టి కలపనిచ్చే చెట్టు (Cordia Myxa).

**నెక్కర**[2] వి. ఒకానొక చెట్టు, గట్టి కలపనిచ్చే చెట్టు (Ximenia Americana).

**నెక్కొను** రూ.చూ. నెలవుకొను. అ.క్రి. **1.** పాదుకొను. స్థిరపడు. భార.విరా. 2.23 ; **2.** పుట్టు, కలుగు. భార. భీష్మ. 2.344 ; **3.** వసించు, ఉండు. భార.అను. 1.333 ; **4.** ప్రసరించు, వ్యాపించు. భాస్క.రా. ఆరణ్య, 1.24 ; **5.** అతిశయించు, అధికమగు. ఉబ్బ.రం.రా.ఉ. 100పు. 1. పం. ; **6.** ఫలించు, సిద్ధించు. హరి.ఉ. **4.66** ; **7.** తగులు, నాటు. సారంగ. 2.186 ; **8.** రాలు, పడు. కాళిందీ. 6.182 ; స.క్రి. పొందు, పడయు. పద్మ. 3.92.

**నెక్కోలు** వి. నెలవుకొనటం.

**నెక్కొలుపు** రూ.చూ. నెలవుకొలుపు. స.క్రి. **1.** పెట్టు, ఉంచు. నిర్వ.రా. 6.57 ; **2.** సంఘటించు, కూర్చు. మార్క. 1.248 ; **3.** పాదుకొలుపు. హంస. 1.230.

**నెక్కొల్పు** రూ.చూ. నెలవుకొలుపు. స.క్రి. **1**. పెట్టు, ఉంచు. భార.విరా. 1.321 ; **2**. పాదుకొల్పు ; **3**. సంఘటించు, కూర్చు.

**నెక్కోలు** చూ. నెక్కొను.

**నెక్లెసు** వి. కంఠాభరణం, మెడలో వేసుకొనే ఒకరకం నగ, మెడనగ.

ఇం. *Necklace*. విలువయిన రాళ్ళు, పూసలు మొ॥ వాటితో చేసిన మెడనగ.

< ఇం. Necklace.

**నెగడి** రూ. నెగడు[3]. వి. **1**. దుష్టమృగాలు రాకుండా కాపాడు కోటానికి, చలికాచు కోటానికి వేసే మంట. భార.అను. 2.388 ; **2**. అగ్నికుండం. శివరా. 3.130 ; **3**. కొరవి దయ్యం. పిశాచం. సాంబ. దేవ. 19.

త. ఞెకిళి. మంట, వంటచెరుకు, మంటపెట్టటానికి ఉపయోగించే కఱ్ఱముక్క, నెకిళి. మంట, నిప్పు, నెకిటి. చలికాచుకోటానికి, మృగాల్ని దూరంగా ఉంచటానికి వెలిగించే మంట.

**నెగడించు** చూ. నెగడు[1].

**నెగడు**[1] రూ. నెవడు. అ.క్రి. **1**. ప్రసిద్ధికెక్కు, ఖ్యాతమగు. భార. ఆది. 2.150 ; **2**. వర్ధిల్లు, వృద్ధిపొందు. భార. ఆది. **4.245 ; 3**. నడచు, ప్రవర్తించు. భార. సభా. 2.125 ; **4**. ఒప్పు. నిర్వ. రా. 10.158 ; **5**. బయలుపడు, ప్రకటితమగు. భార. విరా. 1.143 ; **6**. అతిశయించు, మిక్కుటమగు. భార. విరా. 2.216 ; **7**. కలుగు, సంభవించు. భార. విరా. 4.62 ; **8**. గర్వించు, గర్వపడు. కేయూ. 3.279 ; **9**. ఉండు, ప్రవర్తిల్లు. హర. 3.44 ; **10**. యత్నించు, పూను. గంధ. 199 ; **11**. వ్యాప్తమగు, వ్యాపించు. సాంబ. మాన. 50.

క. నెగళ్, నెగఱు. ప్రదర్శించు, కనబరుచు, ప్రసిద్ధికెక్కు, ప్రకాశించు, ముగియు, నెగఱ్క. కీర్తి, నెగళ్. ప్రత్యక్షమైన, గుర్తింపతగిన, బాగా తెలిసిన, ప్రఖ్యాతమైన, నెగఱ్చు. ప్రఖ్యాతంచేయు, ప్రశంసించు, ప్రకాశించు, నెగఱ్తె. కీర్తి, గుర్తింపు, నెగె. శుద్ధిచేయబడిన, స్పష్టమగు ; తు. నిగాసు, మెరుపు, ప్రకాశం ; త. నికళ్. కలుగు, సంభవించు, జరుగు, ప్రకాశించు, నికర్. చూడబడు, ప్రకాశించు, నికళ్ (-ప్)-,-త్-). ప్రకాశించు ; మ. నికఴుక. వర్ధిల్లు, నికట్టుక. ఫలించు, నికత్తుక. సిద్ధింపచేయు.

మూ. ద. ద్రా. *నిక్-అళ్ < *నివ్-అళ్.

**నెగడించు** స.క్రి. **1**. నెగడజేయు, ప్రవర్తింపజేయు. కు. సం. 1 49 ; **2**. వర్ధిల్లచేయు. ద్వి. భాగ. **4.74**పు. < నెగడు[1] + -ఇంచు[3]. **నెగడ్త** వి. ప్రసిద్ధి, ఖ్యాతి. కు. సం. 1.111. **నెగడ్తకు(జను** (-చను) అ.క్రి. పేరుకెక్కు, ప్రసిద్ధి చెందు. కు. సం. 1.102.

**నెగడు**[2] వి. క్రూర జలజంతు విశేషం, తంతునాగం. వేంక. పంచ. 1.264.

క. నెగళ్, నెగఱె. మొసలి ; తు. నెగళు. వెలుపలి, నెగరు. మొసలి, జలజంతువు.

పో. చూ. సం. నక్ర. మొసలి.

**నెగడు**[3] రూ.చూ. నెగడి. వి. **1**. మంట, చలికాచుకోటానికి వేసేమంట ; **2**. అగ్నికుండం ; **3**. కొరవి దయ్యం.

**నెగడ్త** చూ. నెగడు[1].

**నెగడ్తకు(జను** చూ. నెగడు[1].

**నెగపు** చూ. నెగయు.

**నెగయు** రూ. ఎగయు, నెవయు. అ.క్రి. **1**. పక్షులు మొ॥ నవి పైకి లేచు, ఎగురు. భార. ఆది. 2.39 ; **2**. ఉద్గమించు, బయల్వెడలు. కు. సం. 3.12 ; **3**. జలాదులనుండి పైకి లేచు, తేలు. ఉ. హరి. 4.28.

క. నెగె, నెసె. ఎగయు, ఎక్క పైకివెళ్ళు, దుముకు, నెగెపు. పైకిలేచు, ఎగరు. పైకిలేచు, ఎగురు, ఎవురు ; తు. నెగియుని. లేచు, పైకివచ్చు, నెగిపుని. గెంతు ; త. నివ (-ప్)-న్త్). లేచు, పెరుగు, విస్తరించు, నివప్పు. ఎత్తు ; మ. నికక్క. పైకిలేచు ; కో. ఇగ్. (ఇగ్య్-). తక్కినవారినుండి విడదీయు ; తొ. ఇక్ఫ్ (ఇక్త్-). ఇతరులనుండి విడివడు ; కొం. నిన్ ; కుఇ. నింగ. పైకిలేచు ; కువి. నిక్. లేచు, నిఫ్. పైకిలేచు ; కొలా. నెగయ్, నెగయ్త్. ఎగురు ; నా. నెగయ్. ఎగురు ; నెగప్. ఎగిరేటట్లుచేయు.

మూ. ద. ద్రా. మూ. మ. ద్రా. *నివ్-/*నిక్-వ్.

**నెగపు** రూ. ఎగపు. వి. ఎగరటం, ఉడ్డీనం. హరి. పూ. 4.85. **నెగయుదెంచు** (-తెంచు[1]) రూ. ఎగయుదెంచు. అ.క్రి. నీరుమొ॥ వాటినుండి పైకిలేచు, తేలు. భార. ఆది. 5.193. **నెగవు** రూ. ఎగవు. వి. ఎగరటం, ఉడ్డీనం. **నెగవైచు** స.క్రి. ఎగరవైచు. కళా. 6.14.

**నెగలము** వి. దండం. ద. హిం. శా. సంపు. **4**. శా. సం. **1283**.

**నెగవు** చూ. నెగయు.

**నెగవైచు** చూ. నెగయు.

**నెగి** క్రి. విశ. ద్రు. చక్కగా, బాగా. బెజవాడ శాసనం. క్రీ. శ. 898-934.

క. నెత్తర్ ; తు. నెత్తెరు ; త. నెయ్త్తోర్ ; పర్జి. నేతిర్, హెంగెత్, నికొ. మంచి ; కొలా. నెతుర్.

మూ. ద్రా. *నెయ్- + *తోర్-/*చోర్.

**నెగుచు** రూ.చూ. ఎగచు. స.క్రి. తరుము, వెన్నాడి పరుగెత్తించు. భాగ. 8.66.

**నెగులు** రూ. నెవులు, నొగులు, నొవులు. వి. **1**. కీడు, హాని. భార. ఆది. 5.160 ; **2**. బాధ, కష్టం. భార. శాంతి. 6.73 ; **3**. కోపం. కాశీ. **4.154** ; **4**. విరోధం, పగ. సారంగ. 2.247 ; **5**. దుఃఖం, విచారం. శుక. **3.53** ; **6**. ఇడుము, ఆపద. గౌ. హరి పూ. 1265.

త. నెకు (నెకువ్-, నెక్క-). బాధపడు, ఆపదలోనుండు ; కో. నెగ్- నెగ్య్. దురదృష్టంతో బాధపడు.

**నెగులుకొను** అ.క్రి. **1**. కంపించు. భాస్క. రా. యు. 579 ; **2**. బాధపడు. **నెగులుపడు** అ.క్రి. బాధనొందు. **నెగులుపఱుచు** స.క్రి. బాధించు, పీడించు. భాగ. 9.193. **నెగులుమాన్పు** స.క్రి. దుఃఖంపోగొట్టు. కాశ. 3.85. నెగులు

మోవ(బలుకు న.క్రి. కీడు కలుగునని సూచించు. ఉ. హరి. 2.189. నెగులువెట్టు (-పెట్టు) న.క్రి. బాధపెట్టు. భాస్క. రా. ఆరణ్య. 2.303.

**నెగ్గడము** విణ. సాంద్రమైన, దట్టమైన. ఆం. భా. 3.16 ; వి. తొక్కటం, సమ్మర్దం.

త. నెరుక్కం. సాంద్రత, గుమికూడి ఉండటం, బిగుతు ;

సం. నికట-. సామీప్యం, నిఘట్టన-. ఒరపిడి ; ప్రా. నిఘట్టన-.

**నెగ్గించు** చూ. నెగ్గు[1].

**నెగ్గు[1]** అ.క్రి. 1. నెరవేర్చు, సిద్ధించు. మొల్ల. కిష్కిం. 5 ; 2. మను, బతుకు. చంద్రరే. 3.43 ; 3. కార్యసిద్ధిపొందు. జయంపొందు.

క. నెగలు. తీసుకొను. యత్నంలోఉండు, చేయు, సంసిద్ధపడు ; త. నెగ్గి, నెగ్గ్య. పూర్తిఅయిన ; త. నికళ్ళు. సంఘటన, నికళ్త్తు (నికళ్త్తి-). చేయు, ప్రయత్నించు, జరిగేట్టుచేయు, నెరుంకు. అధికమగు, నెరుక్కు, నేర్. పూర్తిఅగు.

నెగ్గించు న.క్రి. 1. ఏవగించు. కు. సం. 8.147 ; 2. నెరవేర్చు, సిద్ధింపచేయు ; 3. జయంపొందు, గెలిపించు. నెగ్గుకొను స.క్రి. జయించు. పార్వ. 3.44. <నెగ్గు[1]+-ఇంచు[3].

**నెగ్గు[2]** అ.క్రి. జెండువడు, నిస్సత్త్వమగు. ప్రబంధ. 788 ; వి. గుండె అదురుకు అనుకరణం. శుక. 1.115.

క. నగ్గు, నెగ్గు. లేవలేకుండా అగు, నిస్సత్త్వమగు, నెగ్గు. అణగు, నొక్కు, నెక్కు. అధైర్యపడు, అణగు ; త. నెకు. బలహీనపరచు, దుర్బలమగు, క్షోభపెట్టు, ఆందోళన కలిగించు, నెకిళ్. వదులగు, నొక్కబడు, నెక్కు. వర్షం కురిసిన తర్వాత నేల బంద ఉండు, విశ్రాంతి తీసుకొను, ముక్కలగు.

**నెగ్గురు** వి. గుండె అదరటంలో అనుకరణం. పార్వ. 3.44.

**నెచ్చు** వి. 1. మిక్కిలి సన్నమైన నూకల సమూహం ; 2. మెత్తని బియ్యం పిండి.

**నెచ్చూలి** చూ. నెఱ.

**నెచ్చెలి** చూ. నెఱ.

**నెచ్చెలికత్తె** చూ. నెఱ.

**నెచ్చెలికాడు** చూ. నెఱ.

**నెచ్చెలికారము** చూ. నెఱ.

**నెచ్చెలితనము** చూ. నెఱ.

**నెచ్చెలియ** చూ. నెఱ.

**నెచ్చెలువ** చూ. నెఱ.

**నెంచ్చనము** వి. పల్లపుభూమి (నివేశనం కావచ్చు). ద.హిం.శా. సంపు. 5. శా.సం. 147 క్రీ.శ. 1300.

**నెంజిలి** వి. 1. మనోవ్యథ, ఆధి. పాండు. 4.173 ; 2. ఖేదం.

త. నెంచిటిత్తల్. భయంచే గుండె కంపించటం.

**నెటిక** రూ. నెటికె, నెట్టిక. వి. 1. అంగుళిపర్వం, వేలిగనుపు. పండి.చ. 2.104 పు ; 2. మెటిక, వేళ్ళు విరిచి చేసే శబ్దం.

క. నటికె, నటుకు, నటిగె, నటుకు, నట్టు, నెటికె, నెట్టు. వేళ్ళు విరిచిన శబ్దం, నటుక్కనె. శబ్దానుకరణం (విరవటం పగలటంవల్ల కలిగేది), నట్, నటు. వేళ్ళు విరవటం వల్ల అయ్యే ధ్వని ; తు. నటునటు. విరిగిన చప్పుడుతో, నటుకు. వేళ్ళువిరిచిన చప్పుడు ; త. నొటి. వేలిగనుపులు విరుచు, నొటిప్పు. వెంటనే, కదలిక, నొట్టై. ఇష్టంతో నెమ్మదిగా చరుచు, నెట్టి, నెట్టై. వేలి కణుపులు విరవటం వల్ల వచ్చే ధ్వని, నెటు-, నెట్-,ఎనల్-. విరిగిన చెట్టు పడేటప్పుడు అయ్యే ధ్వని ; మ. ఞొటి. మెటికలు విరవటం, ఞొట్టు. వేళ్ళు విరవటం, నొటి. మధ్యవేలు బొటనవేలు కలిసి చేసే ధ్వని, చిటిక, నొటిక్క. వేళ్ళతో వేసే చిటిక, నొటిప్పు. చిటికలు వేయటం, నొట్టు. వేళ్ళు విరవటంవల్ల అయ్యే ధ్వని, ధ్వని చేసేటట్లు పెదవులపై ముద్దుపెట్టు, ఞొటు. పడేటప్పటి ధ్వని, పడే చెట్టు, ఞొట్టుక. విరుగు, మందు ; కో. నొట్. నాలుకతో చేసిన శబ్దం, నొట్ ఇన్-(ఇథ్-). నాలుక ఆడించు.

నెటికతట్లు రూ.చూ. నెటికెతట్లు. వి.బ.వ. బాలక్రీడావిశేషం. నెటికలు విఱుచు న.క్రి. 1. వేళ్ళ సందుల్ని విరుచు. పండి.చ. 2.104 పు ; 2. ఏవగించుకొను. పద్మ. 2.239.

**నెటికె** రూ.చూ. నెటిక. వి. అంగుళి పర్వం, వేలిగనుపు.

నెటికెతట్లు రూ. నెటికతట్లు. వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146. నెటికెవిఱుచు న.క్రి. వేళ్ళ సందుల్ని విరుచు. శకా. 4.32.

**నెటుకురు** వి. 1. వీపు మొ. వాటి కీళ్ళ కదలికవల్ల కలిగే ధ్వనికి అనుకరణం. జైమినిభా. 8.17 ; 2. నెటిక విరవటం.

**నెటుక్కు** వి. ఖండించటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. దశా. 4.232.

**నెట్ట[1]** క్రి. విణ. మిక్కిలి, అధికంగా. కు.సం. 8.178.

క. నెట్టనె ; త. నెట్టై. పొడుగు ; మ. నెటుక్కమ్.

**నెట్ట[2]** రూ.చూ. నిట్ట. వి. రాటి కట్టుబడిలో ఉన్న ఆకులకు బిగించే వెదురుగొట్టం.

**నెట్టకసీల** రూ.చూ. నెట్టికశీల. విణ. మంచి స్వభావం.

**నెట్టణము** రూ.చూ. నెట్టనము. విణ. 1. యథార్థమైన, నిక్కమైన. శివ. సా. 2.190 ; 2. పూర్ణమైన, సమగ్రమైన ; 3. అనివార్యమైన, కాకతప్పని ; వి. అతిశయం, పెంపు.

**నెట్టన** క్రి.విణ. 1. అవశ్యం, తప్పక. భార. ఆది. 5.58 ; 2. మిక్కిలి అధికంగా. భార. సభా. 2.40 ; 3. చెచ్చెర, శీఘ్రంగా. భార. విరా. 2.31 ; 4. తెగించి, సాహసించి. భార. ఉద్యో. 1.344 ; 5. నిజంగా, యథార్థంగా. భార. భీష్మ. 1.125 ; 6. న్యాయంగా, పాడితప్పక. భార. ద్రోణ. 2.105 ; 7. అనాలోచితంగా, తొందరపడి. భార. సౌప్తి. 1.35 ; 8. చక్కగా, ఒప్పుగా. ఆము. 6.111 ; 9. నిండుగా, సమృద్ధంగా. పాండు. 2.24.

క. నెట్టన ; త. నెట్టం. పొడవు.

**నెట్టనము** రూ. నెట్టణము. విణ. 1. అనివార్యమైన ; కాకతప్పని. శివ.సా. 2.21 ; 2. పూర్ణమైన, సమగ్రమైన. రుక్మా.చ. 4.104 ; 3. యథార్థమైన, నిక్కమైన ; వి. అతిశయం,

పెంపు. చి(త్రభా. 5.34.

త. నెట్టుంకమ్. గర్వం, నిందాపదాలు.

**నెట్టపంట** (క్రి.విశ. నిష్కారణంగా. ఆం.నా.శే. 56.

**నెట్టము** రూ.చూ. నెట్టెము[1]. వి. 1. నెమలి ఈకలతో వేసిన దారాలపాగ. ఆం.భా. 3.34; 2. శిరస్త్రాణం, గుండ్ర పాగ.

**నెట్టి** వి. వరికోసి వేసిన కుప్ప.

త. నెట్టుమ్. పొడుగు, నెట్టాయమ్. ఇటుకల పేర్పు.

**నెట్టిక** రూ.చూ. నెటిక. వి. వేలిగనుపు, అంగుళి పర్వం.

నెట్టికసీల (-చీల) వి. వేలిగనుపులోని సీల.

**నెట్టికశీల** రూ. నెట్టకసీల. వి. 1. (బ్రహ్మచారి. జైమినిభా. 6.190; 2. (బ్రహ్మచారిణి. ఆము. 6.111.

సం. నైష్ఠికశీల. నిష్ఠాపరుడు; (ప్రా. నెట్ఠిఅసీల-, ణిట్ఠియ, నెట్టియసీల.

<సం. నైష్ఠికశీల-.

**నెట్టించు** చూ. నెట్టు.

**నెట్టియము** రూ.చూ. నెట్టెము[1]. వి. 1. చుట్టకుదురు. భీమ. 5.8; 2. గుండ్రపాగ.

**నెట్టు** అ.(క్రి. అతిశయించు, మిక్కుటమగు. ఉ.హరి. 4.39; స.(క్రి. 1. గెంటు, 2. పడదోయు. భాగ. 3.13; తోయు. కృ.శకు. 2.211, పల్నా .పు. 102; 3. నిరాకరించు, నిరసించు. రాజవా. 1.26; వి. 1. తావు, ఉనికిపట్టు. పాండు. 4.249; 2. పూనిక. హ.న. 1.29; 3. గెంటు, తోపు. కవిక. 3.151; 4. విషయం, పట్టు. దశా. 2.336; 5. ఉపహతి, నాశం. ఆం.భా. 3.50; 6. కష్టం; 7. అహంకారం; 8. రాసి; 9. స్పృహ; (క్రి.విశ. సూటిగా.

కొడ. నెఁట్ట్, నెఁట్టి-. చిన్న కదలికనిచ్చు; తు. నెసిపుని. నొక్కు; త. నెట్టు(నెట్టి-). గెంటు, తోయు, ముద్రవేయు (బంతులతో), నెట్టు. గెంటు, తోయు; మ. ఎ(రుక. తోయు; గోం. నత్. గుద్దు లేక తోయు (కిందకి), నత్తానా. గుద్దుకొను, కిందపడవేయు; కువి. నస. నొక్కు, తోయు. పో.చూ. నెప్. తుడుచు, (తుడిచే టప్పుడు) నెట్టు.

<మూ. (ద్రా. *నెత్-, *నెత్

నెట్టించు స. (క్రి. 1. జయించు, గెలుచు. సీతావి. 1.106; 2. అతిశయింపజేయు, పెంపొందించు. శేషధ. 2.92. నెట్టుకొను రూ. నట్టుకొను. వి. 1. కడగు, పూనుకొను. శృం.నై. 8.185; 2. చెలరేగు, విజృంభించు. కాశీ. 1.100; 3. అభినివేశం కలిగి ఉండు. హర. 4.86; 4. పట్టుపట్టు. భోజ. 7.236; 5. కుదురుకొను, స్థిరపడు. కళా. 3.40; 6. నెలకొను, నివసించు. ద్వి. పరమ. వి. 5.369; 7. అతిశయించు. యయా. 2.46; 8. కలుగు, సంభవించు. శశా. 3.4; స.(క్రి. తోసుకొను, గెంటుకొను. శివరా. 4.61. క. నెడిసు. స్థిరపడుచు, పాతు, నెడిగె. నేలలో స్తంభంపాతటం, నెడె. స్థిరపరచబడిన, పాతబడిన; తు. నెడ్పుని, నెడిపిని, నెడిపుని. పాతు. < నెట్టు + -ఇంచు[3]. నెట్టుకొలుపు రూ. నెట్టుకొల్పు. స.(క్రి. 1. ఉండు. కళా. 5.17: 2. కావించు, కలిగించు. కళా. 6.224. నెట్టుకొల్పు రూ.చూ. నెట్టుకొలుపు. స.(క్రి. 1. కావించు, కలిగించు. మల్ల. 57; 2. ఉంచు. నెట్టుడుకాయ రూ.చూ. నెట్టుడుగాయ. వి. ఒకరకం ఆట. నెట్టుడుగాయ(-కాయ) రూ. నెట్టుడుకాయ. వి. పిల్లలాడే ఒకఆట.హంస. 3.146. నెట్టుపడు అ.(క్రి. గెంటబడు, తోయబడు. వాల్మీ. 2.95. నెట్టుపలక వి. తూర్పార పోసే మనిషి నిలబడటానికి కట్టే ఎత్తుపీట. నెట్టుబొట్టనగోల వి. మగ పిల్లలాడుకొనే ఆట. హంస. 3.190. నెట్టుపడగా (క్రి.విశ.(దు. హెచ్చుకాఁగా. తాళ్ల. సం. 5.318; 2. రాసులు పడగా. <నెట్టు+పడు+-అ[7]+అగు+-అ[7]. నెట్టేయు స.(క్రి. సాపు చేసిన పాత్రల్ని (క్రమంగా ఒకచోట అమర్చు. <నెట్టు+వేయు. నెట్టోడు అ.(క్రి. చేష్టలు దక్కు. బసవ. 5.130. పం. <నెట్టు+ఓడు. నెట్లు వి.బ.వ. బాల(క్రీడా విశేషం. విష్ణుపు. 7.202. <నెట్టు+-లు.

**నెట్టె** వి. 1. ఉద్ది, జత. రం.రా.బాల. 21 పు. 9 పం.; 2. పత్తి, వేరుసెనగ మొ॥ పైర్ల వేరు తొలిచే పురుగు.

క. నెంటు.

నెట్టెకాయ వి. తీగకుగాక వేళ్ళలో గుత్తిగా కాసే వేరుసెనగ రకం. నెట్టెకొమ్ము వి. ఒకటి ముందుకు, ఒకటి వెనక్కు తిరిగి ఉండే కొమ్ము. నెట్టెలుకట్టు అ.(క్రి. ఉద్దులు ఏర్పరచు.

**నెట్టెము**[1] రూ. నెట్టము, నెట్టియము. వి. 1. శిరస్త్రాణం, గుండ్ర పాగ. హరి.పూ. 6.179; 2. కిరీటం. యయా. 57; 3. చుట్టకుదురు.

**నెట్టెము**[2] వి. ధ్వని, అరుపు. వేంక. పంచ. 3.157.

**నెట్టేయు** చూ. నెట్టు.

**నెట్టోడు** చూ. నెట్టు.

**నె(ట్రము** వి. ఒడిదుడుకు.

**నె(ట్రాడి** రూ.చూ. నిట్టరాడు. వి. పొడుగాటి కొయ్య.

**నెట్లు** చూ. నెట్టు.

**నెడిమె** చూ. నడిమి. వి. ద్వీపం.

**నెడ్డిన** వి. గర్వం.

**నెండు** స.(క్రి. లాగి బిగించు, జడ్డిగం తాళ్ళను దండెగాడి పట్టెకి బిగించు.

**నెం(డ్ర** వి. బోదవంటి గంట కలిగి బోదకన్న సన్నమైన పరకలు కలిగి పశు(గాసంగా ఉపయోగపడే ఒకరకం గడ్డి.

**నెత్త** వి. మత్స్య విశేషం.

త. నెత్తి. మొప్ప.

నెత్తలు రూ. నెత్తాలు[1]. వి.బ.వ. ఒకరకం చేపలు. <నెత్త+-లు. నెత్తల్లు వి.బ.వ. ఒకే ముల్లుతో ఉండే చిన్న సముద్రపు చేప. <నెత్త+-లు+-లు.

**నెత్తకమ్మ** చూ. నెత్తము[1].

**నెత్తటిల్లు** చూ. నెత్తము[2].

**నెత్తపలక** చూ. నెత్తము[1].

**నెత్తపు(బలక** చూ. నెత్తము[1].

నెత్తమాడు చూ. నెత్తము[1].

నెత్తము[1] వి. 1. కళ్ళవంటి గుర్తులు గలది, పాచికలాట, జూదం. భార.విరా. 5.244; 2. పందెం. ఉ.హరి. 3.120; 3. ఒకరకం జూదం. జైమినిభా. 3.42.

నం. నేత్ర-. కన్ను; ప్రా. ణేత్త-, ణిత్త; అ.మా. నిత్-, నేత్-. కన్ను; పా. నేత్త-. ప్రాపు; అప. ణేత్త-. నేత్రం;

క. నెత్త. కన్ను.

<ప్రా. ణేత్త-.

నెత్తకమ్మ వి. పాచికల పందెం. కళా. 6.120. నెత్తపలక రూ. నెత్తపుఁబలక. వి. జూదంబల్ల. పద్మ. 3.189. నెత్తపుఁబలక(-పలక) రూ.చూ. నెత్తపలక. వి. జూదంబల్ల. ఆం.భా. 2.305. నెత్తమాడు అ.క్రి. జూదమాడు. పండి.చ. ప్రథ. 2.368 ప. <నెత్తము[1]+ఆడు.

నెత్తము[2] వి. 1. కొండలమీది విశాల సమప్రదేశం. వరాహ. 6.107; 2. ఊరివారందరూ పశువుల్ని మేపుకోటానికి విడిచిపెట్టిన గయాళభూమి, బీడు. ఆము. 4.34; 3. మేడ మీది చదును ప్రదేశం. కులశేఖరమహీపాల చరిత్రము, 1ఆ.

నెత్తటిల్లు అ.క్రి. శ్రమతీర్చుకొను. భాను. 4.97. <నెత్తము[2]+ఇల్లు.

నెత్తమ్మి చూ. నెఱ.

నెత్తమ్మికొలనికాఁపు చూ. నెఱ.

నెత్తమ్మిదిమ్మలనిదులవిందు చూ. నెఱ.

నెత్తమ్మివిరివిందు చూ. నెఱ.

నెత్తరకట్టు రూ.చూ. నెత్తురుకట్టు. వి. రక్తం పారుకొనే జబ్బు.

నెత్తటి[1] చూ. నెటి[1].

నెత్తటి[2] చూ. నెటి[2].

నెత్తాల్ రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు.

నెత్తాలు[1] రూ.చూ. నెత్తలు. వి.బ.వ. చిన్నరకం ఎండుచేపలు.

నెత్తాలు[2] రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు.

నెత్తావి చూ. నెఱ.

నెత్తి వి. 1. తల, శిరస్సు. భార.శాంతి. 6.129; 2. శిరోజాలు, వెంట్రుకలు. శుక. 2.381; 3. ఒకానొక తిట్టు; 4. పణత, ఏడికోల దూర్చే కొయ్యమొద్దు; 5. రాతి పైభాగం.

క. నెత్తి. నుదురు, తల పైభాగం; కొడ. నెత్తి. నుదురు; తు. నెత్తి; త. నెఱ్ఱి. నుదురు, నెఱి. కనుబొమ, నుఅల్; మ. నెఱ్ఱి. నుదురు, నెఱుక. తల మీదిభాగం; కో. నెచ్. నుదురు; తొ. ని.ట్యో; గోం. నేచ్. తల పైభాగం; కొలా. నెత్తి; నా. నెత్తి; మాల్తొ. నైపె. నుదురు, కనుబొమ.

నెత్తికాయ వి. తలకాయ. భార.ఉద్యో. 4.160. నెత్తికి కళ్లువచ్చు అ.క్రి. పొగరెక్కు. నెత్తికిఁగన్నులెక్కు అ.క్రి. పొగరెక్కు. నలచ. 2.125. నెత్తికిచెప్పులడుగు అ.క్రి. పెద్దలను ధిక్కరించు. నెత్తికిచేతులువచ్చు అ.క్రి. దిగులు కలుగు. నెత్తికిఁబసరెక్కు అ.క్రి. పొగరెక్కు. పాండు. 5.101. నెత్తికెక్కు అ.క్రి. తగనిపెత్తనం చలాయించు. <నెత్తి+-కున్+ఎక్కు. నెత్తిగ వి. జూదరి. నెత్తిగాలము వి. తల నడమునట్టి గడారు (ప్రమాదకాలం అనటం). పండి.చ.ప్రథ. 3.512 ప. నెత్తిగీఁత వి. లలాట లిఖితం, నుదుటివ్రాత. వేంక.శ. 18. నెత్తిగోడ వి. 1. ఇంటి కప్పును వాలుగా దించటానికి అనువుగా పక్కగోడలమీద అటుఇటు ఏటవాలుగా కట్టిన గోడ; 2. చుట్టు గోడలమీద ముక్కోణం ఆకారంలో కప్పు వరకు కట్టిన పక్క గోడ. నెత్తిగోతలవాడు విణ. 1. ఒకజాతి ముష్టివాడు; 2. కఠినాత్ముడు. నెత్తిఁగట్టుకొనిపోవు (-కట్టుకొనిపోవు) స.క్రి. చచ్చేటప్పుడు విడవకుండా కూడా తీసికొనిపోవు. శుక. 3.183. నెత్తిచెరగు వి. తలమీద కప్పుకొనే చీర కొంగు. నెత్తిఁజేతులువెట్టు (-చేతులుపెట్టు) అ.క్రి. 1. ప్రమాణం చేయు. గొ.హరి.ఉ. 614 పం.; 2. మోసంచేయు. నెత్తినఎక్కించుకొను స.క్రి. అతిచనువుఇచ్చు. నెత్తినగుడ్డవేసుకొనిపోవు అ.క్రి. దిక్కులేక దిక్కులుపట్టి పోవు. నెత్తిన జేజమ్మదింపు స.క్రి. గర్వమణచు. నెత్తినఁజేతులిడు అ.క్రి. దిగులుపడు. కాశీ. 2.156. నెత్తినఁజేతులుపెట్టు అ.క్రి. ప్రమాణంచేయు. గొ.హరి.ఉ. పం. 614. నెత్తిననోటివాడు విణ. మర్మంలేక అరచి చెప్పేవాడు. నెత్తిననోరుపెట్టుకొని అవ్య. పదేపదే విడవకుండా చెప్పాను అనేపట్ల ఉపయోగించే పలుకుబడి. నెత్తిననోరుబెట్టుకొనిచెప్పు స.క్రి. పలుమారు బహిరంగంగా హితాన్ని చెప్పు. నెత్తినపెట్టుకొను స.క్రి. గౌరవించు, ఆదరించు. నెత్తినబట్టవేసుకొనిపోవు అ.క్రి. దిక్కులేక దిక్కుపట్టి పోవు. నెత్తినముసుగువేసుకొనిపోవు అ.క్రి. సర్వస్వం పోగొట్టుకొని ఊరు విడిచిపోవు. నెత్తిన వేసికొను స.క్రి. బాధ్యతంతా తానే భరించు. నెత్తినెత్తి కొట్టుకొను అ.క్రి. (ఒకరి అకృత్యంవల్ల) నొప్పిపడు, బాధపడు. నెత్తినోరుకొట్టుకొను అ.క్రి. మిక్కిలి బాధపడు. నెత్తినోరుబాదుకొను అ.క్రి. విలపించు. నెత్తిపిడుగు వి. హాని చేసేవాడు, వినాశకారి. రామాభ్యు. 6.52. నెత్తిపైకికళ్లు వచ్చు అ.క్రి. పొగరెక్కు. నెత్తిపైకెక్కు అ.క్రి. తలమీద పడు. <నెత్తి+పై+-కున్+ఎక్కు. నెత్తిపైచేతులుపెట్టు అ.క్రి. మోసగించు. నెత్తిబుఱుకుకొను (-పుఱుకుకొను) అ.క్రి. పశ్చాత్తాపపడు. నెత్తిబోకి వి. పోలికుండ, అంచు కొడిగి మూతి కొట్టేసి జాతర్లలో బలితిరిగేవాడు పట్టుకొని తిరిగే మట్టిపాత్ర. నెత్తిమాయు అ.క్రి. అభ్యంగనస్నానం చేయక పోయినప్పుడు తల మాయు. శుక. 2.381. నెత్తిమీదదేవరచేసికొను అ.క్రి. అనవసర ప్రాముఖ్య మిచ్చి నెత్తిన పెట్టుకొను. నెత్తిమీదనీళ్లకుండపగులు అ.క్రి. శోకాతిరేకం కలుగు. నెత్తిమీదికిచేతులువచ్చు అ.క్రి. విచారపడు. నెత్తిమీదిగింజనేలమీదపడు అ.క్రి. వివాహమగు. నెత్తిమీదిచిచ్చు వి. సన్నిహితమైన ఆపద. శాశ్వ.నం. 12.198. నెత్తిమూట వి. నెత్తిమీద పెట్టుకొని మోసే మూట. నెత్తిమొత్తుభస్మాసురులు వి.బ.వ. ఉపకారికే అపకారంచేసేవారు. నెత్తివాచిపోవు అ.క్రి. విసుగెత్తిపోవు. నెత్తివాచునట్లు అవ్య. ఎక్కువగా. నెత్తివాచేట్టుచీవాట్లుపెట్టు అ.క్రి. గట్టిగా మందలించు. నెత్తిసుడి వి. నొప్పసుడి'

నెత్తిమీద ఉండే సుడి. **నెత్తెణచు** స.క్రి. **1**. హానిచేయు, క్షుద్రవిద్యలు బెడిసి ప్రయోగించిన వానిమీదనే మరల తిరిగివచ్చు; **2**. నష్టపరచు. <నెత్తి+అణచు.

**నెత్తిరావ** వి. తప్పనిసరి.

**నెత్తుటజొత్తిలు** చూ. నెత్తురు.

**నెత్తుటబొట్టిడుకొను** చూ. నెత్తురు.

**నెత్తురు** రూ. నెత్రు. వి.బొ. రక్తం. ద.హిం.శా.సంపు. **10**. శా.సం. 645. క్రి.శ. 1060, భార.ఆది. 5.177.

క. నెత్తరు, నెత్తర్ (ఉ), నెత్తర, న్నెత్త. నెత్తురు, రక్తం; కొడ. నెత్తచణ్బి. రక్తచందనం; తు. నెత్తెరు. రక్తం; త. నెత్తమ్; కో. నెత్; తొ. నెత్స్కట్; గోం. నత్తుర్, నెతుర్, నెత్తుర్; కుఇ. నెదెరి. రక్తం; కువి. నెతొరి; పర్జి. నెతిర్, న్నెతో; కొలా. నెతుర్; నా. నెత్తుర్; గ. నెత్తూర్; బ్రా. దితర్.

**నెత్తుటజొత్తిలు** అ.క్రి. నెత్తుటిలో తోగు. ఉ.హరి. 1.45. <నెత్తురు+-అ[10]+జొత్తిలు. **నెత్తుటబొట్టిడుకొను** అ.క్రి. పగతీర్చుకొను. అము. 5.12. <నెత్తురు+-అ[10]+బొట్టు+ఇడుకొను. **నెత్తురుకట్టు** రూ. నెత్తరకట్టు. వి. రక్తం పారుకొనే జబ్బు. **నెత్తురుకట్టుమాన్యము** వి. రక్తం ఓడ్చి గడించుకొన్న మాన్యం. **నెత్తురుకందు** రూ.చూ. నెత్తురుఁగందు. వి. శిశువు. పాండు. 3.156. **నెత్తురుకళ్లె** వి. ఆకుతోట తెగులు. **నెత్తురుకూడు** వి. రక్తపాతం చేసి గడించిన భాగ్యం. **నెత్తురుగడ్డ** వి. ఒకవిధమైన కురుపు. **నెత్తురుగడ్డాకు** వి. ఒకరకం కలుపుమొక్క. <నెత్తురు+గడ్డి+ఆకు. **నెత్తురుగళవట్టు (-పట్టు)** అ.క్రి. రక్తం చూడగా మూర్ఛవచ్చు. కువ.చ. 2.148. **నెత్తురుగుడ్డు** వి. పసిపాప. **నెత్తురుగ్రక్కు (-క్రక్కు)** అ.క్రి. ఏదైనా దెబ్బ తగిలినప్పుడు, మూర్ఛవచ్చేటప్పుడూ, కొన్ని పట్లపోయే టప్పుడు నెత్తురు కక్కు, చావుదెబ్బతిని అని అర్థం. ఉ. హరి. 2.120. **నెత్తురుఁగందు (-కందు)** రూ. నెత్తురుకందు, నెత్రుకందు, నెత్రుఁగందు. వి. ఒంటిపై రక్తం తేరుతున్న లేతబిడ్డ, జొత్తుపాప. పి. శకు. 2.147. **నెత్తురుఁగళ (-కళ)** వి. నెత్తురుచూడటంవల్ల కలిగేమూర్ఛ. **నెత్తురుత్రావుడు** వి. రాక్షసుడు. **నెత్తురుదొమ్మ** రూ. నెత్రుదొమ్మ. వి. నెత్తురుకక్కటం లక్షణంగా వచ్చేదొమ్మ. **నెత్తురుఁద్రావుడు (-త్రావుడు)** వి. రక్తపాయి, రాక్షసుడు. అచ్చ. రా. యు. 60. **నెత్తురుపాటు** రూ.చూ. నెత్తురువాటు. అ.క్రి. ఎర్రనగు. **నెత్తురుపెనుపొడ** వి. ముర్రుపాము. **నెత్తురుపొడ** రూ.చూ. నెత్తురుఁబొడ. వి. ముర్రుపాము. **నెత్తురుప్రొద్దు** రూ. చూ. నెత్తురుఁబ్రొద్దు. వి. మధ్యాహ్నం. **నెత్తురుబంక** వి. మలంతో రక్తమూ జిగురూ పడే ఒకజబ్బు. **నెత్తురుబేది** వి. రక్తవిరోచనం. **నెత్తురుపచ్చ** వి. ముక్కులనుంచి నెత్తురుకారేవ్యాధి. **నెత్తురుముసర** వి. నెత్తురు పారుకొనే రోగం. **నెత్తురుఁబొడ (-పొడ)** రూ. నెత్తురుపొడ. వి. ఎర్రపొడలు కల ఒకజాతిపాము, ఉమ్మెత్తలోనిముర్రుపాము, మాతులాహి. **నెత్తురుఁబొత్తు** వి. ప్రాణస్నేహితుడు. యయా. 3.115. **నెత్తురుఁబ్రొద్దుఁ (-ప్రొద్దు)** రూ. నెత్తురుప్రొద్దు. వి. **1**. మధ్యాహ్నం. మను. 4.60; **2**. సంధ్యాకాలం. **నెత్తురువాటు (-పాటు)** రూ. నెత్తురుపాటు. అ.క్రి. పల్లటిల్లు, ఎర్రబారు. భార. విరా. **2.135**. **నెత్తురువిద్ద** వి. నెత్తురుకట్టు, నెత్తురుపెట్టు, రక్తమాన్యం అను పేర్లుగల ఈనాం. ద. హిం. శా. సంపు10. శా. సం. 172. క్రి. శ. 1170. **నెత్తురెక్క** వి. ముక్కులనుంచి నెత్తురుకారే ఒకరకమైన మేకలజబ్బు. **నెత్తురొత్తుమాన్యము** వి. రక్తం ఓడ్చి గడించుకొన్న మాన్యం.

**నెత్తురెక్క** చూ. నెత్తురు.

**నెత్తురొత్తుమాన్యము** చూ. నెత్తురు.

**నెత్తెణచు** చూ. నెత్తి.

**నెత్రు** రూ.చూ. నెత్తురు. వి. రక్తం. భార. భీష్మ. **3.225**.

**నెత్రుకందు** రూ.చూ. నెత్తురుఁగందు. వి. పసిబిడ్డ. **నెత్రుఁగందు (-కందు)** రూ.చూ. నెత్తురుఁగందు. వి. నెత్తురులో తేలుతున్న లేతబిడ్డ, జొత్తుపాప. పాండు. 1.156. **నెత్రుదొమ్మ** రూ.చూ. నెత్తురుదొమ్మ. వి. నెత్తురు కక్కటం లక్షణంగా వచ్చే దొమ్మ.

**నెనడు** వి. ఎముకలలోని కొవ్వు, మజ్జ. భార. ఉద్యో. **2.144**.

క. నెణ.

**నెనయు** రూ.చూ. ఎనయు. అ.క్రి. ఒప్పు. రం. రా. యు. 517పు. 11పం.

**నెనరు** వి. **1**. ప్రేమ, స్నేహం. కు. సం. **4.47**; **2**. దయ, కనికరం. ఉ.రా. **3.6**; **3**. స్త్రీ పురుషుల వలపు, మోహం. విజయ. 1.59; **4**. మచ్చిక, చనువు. దశా. **4.191**; **5**. కృతజ్ఞత; విణ. **1**. ప్రియమైన, ప్రేమాస్పదమైన. శృం. నై. **1.109**; **2**. కృతజ్ఞుడైన, విశ్వాసంకల. రాఘవ. 2.16.

త. నిణఇు. అభిమానం, ప్రేమ.

**నెనవు** వి. సంస్మృతి. వేంక. ఆం. మాన. 6.246

క. నెనవు.

**నెందోలు** చూ. నెఱ.

**నెన్నడ** చూ. నెఱి[1].

**నెన్నడపు** చూ. నెఱి[1].

**నెన్నడుము** చూ. నెఱ.

**నెన్నుదురు** చూ. నెఱ.

**నెన్నెఱులు** చూ. నెఱ.

**నెన్నొసలు** చూ. నెఱ.

**నెపపడు** చూ. నెపము.

**నెపపెట్టు** చూ. నెపము.

**నెపమార్చు** చూ. నెపము.

**నెపమిడు** చూ. నెపము.

**నెపము** రూ. చూ. నివబు. వి. **1**. కారణం, కతం. భార. ఆది. 1.125; **2**. వ్యాజం, మిష, మిథ్యాహేతువు. భార. సభా. 2.222; **3**. విధం, రీతి. కు. సం. 2.96; **4**. తప్పు, దోషం. భార. ఆరణ్య. 5.318; **5**. లేనిది మీద మోపటం.

**నెపపడు** అ.క్రి. నెపంపొందు, దోషిఅగు. వేంక. పంచ. 1.514. <నెపము+పడు. **నెపపెట్టు** రూ.చూ. నెపము పెట్టు. స.క్రి. దోషిఅను. <నెపము+పెట్టు. **నెపమార్చు**

అ.క్రి. నిర్మూలించు. <నెపము+అర్చు. నెపమిడు స.క్రి. సాకుపెట్టుకొను. మను. 2.41. <నెపము+ఇడు. నెపము పెట్టు రూ. నెపపెట్టు. స.క్రి. దోషిఅను.

నెప్తల్ రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

నెప్తాల్ రూ. నత్తాల్, నప్తాలు, నాప్టల్, నాప్తల్, నాప్తాల్, నెత్తాల్, నెత్తాలు², నెప్తల్, నెప్తాలు, నెప్తోల్, నేప్తోల్, మెత్తాల్, మెత్తోల్. వి. తడిరంగు, చనీళ్ళలో కలిపి నూలుకు వేసే రంగు.

ఇం. *Naphthalene*. రంగులు తయారు చేయటానికి వాడే స్ఫటికం లాంటి తెల్లటి పదార్థం.

<ఇం. Naphthalene.

నెప్తాలు రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

నెప్తోల్ రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి నూలుకు వేసేరంగు.

**నెప్పరము** రూ.చూ. నెప్పళము. వి. వేగం, త్వర. పారి. 4.66.

నెప్పరి చూ. నెప్పు².

నెప్పరించు చూ. నెప్పు².

నెప్పలు చూ. నెప్పు³.

నెప్పళము రూ. నెప్పరము. వి. వేగం, త్వర. భాగ. 8.55.

నెప్పు¹ స.క్రి. తోయు, గెంటు. వరాహ. 3.50.

త. నెజ్జు (నెజ్జి-). డీకొను, తోయు, నెట్టు (నెట్టి-). తోయు, రాయివిసరు ; గోం. నత్తానా. డీకొను, విసరు, తొలగించు ; కురు. నెప్. తుడుచు.

**నెప్పు²** రూ.చూ. నేర్పు. వి. **1**. కౌశలం ; **2**. ఉపాయం.

నెప్పరి వి. **1**. నేర్పుకలది. ముకుంద. 1.26 ప. 5 పం. ; **2**. నేర్పుకలవాడు. <నెప్పు²+-అరి. నెప్పరించు స.క్రి. మూదలించు, నిరూపించు.

నెప్పు³ వి. నెలవు, స్థానం.

నెప్పలు అ.క్రి. స్థానభ్రంశం పొందు, నిలకడ తప్పు. రామాభ్యు. 3.31. <నెప్పు³+-అలు. నెప్పుకొను అ.క్రి. నెలకొను, పాదుకొను. మను. 4.34.

**నెమకు** స.క్రి. వెదకు, అన్వేషించు. భార. శాంతి. 3.64.

త. నీటు. పొందు, వెదుకు.

నెమకుడు వి. అన్వేషణం, వెదకటం. ఆం.భా. 2.173.

నెమటాయి రూ. నెమటాయు. వి. ఒకానొక చిన్నమొక్క. హంస. 4.10.

నెమటాయు రూ.చూ. నెమటాయి. వి. ఒకానొక చిన్నతీగ.

నెమరు రూ. నెవరు. వి. **1**. రోమంథం, పశువులు మింగిన ఆహారాన్ని మరల నోటిలోకి తెచ్చుకొని చక్కగా నమలటం. ఆం.భా. 2.263 ; **2**. స్మృతి, జ్ఞప్తి.

క. నమలు, నెవరు. నెమరువేయు, నమలు, నెమరు. పశువులు నెమరువేయు ; తు. నౌన్తుని, నౌమ్పుని. నమలు, నౌన్తు. నమలడం.

నెమరుకు తిరుగు అ.క్రి. యోచనకు అందు. నెమరుకు వచ్చు స.క్రి. **1**. జ్ఞప్తికి వచ్చు ; **2**. నెమరు వేసుకోటానికి జంతువులు తాము మింగిన ఆహారాన్ని మళ్ళీ నోటిలోకి తెచ్చుకొను. నెమరుచు రూ.చూ. నెమర్చు. అ.క్రి. నెమరు వేయు. నెమరునకు( దెచ్చుకొను(-తెచ్చుకొను) స.క్రి. **1**. జ్ఞప్తికి తెచ్చుకొను. బహుళా. 1 ; **2**. పశువులు మింగిన ఆహారాన్ని మరల నోటిలోకి తెచ్చుకొను. నెమరుపెట్టు (-పెట్టు) స.క్రి. నెమరువేయు, పశువులు మింగిన ఆహారాన్ని మరల నోటిలోకి తెచ్చుకొని చక్కగా నములు. పి. శకు. 3.4. నెమరువేయు స.క్రి. పశువులు మింగిన ఆహారాన్ని మరల నోటిలోకి తెచ్చుకొని చక్కగా నములు ; ఆలోచించు. నెమర్చు రూ. నెమరుచు. స.క్రి. నెమరు వేయు. హరి. పూ. 8.165.

నెమర్చు చూ. నెమరు.

నెమలంచుపేటు చూ. నెమలి.

నెమలి రూ.చూ. నమిలి. వి. **1**. మయూరం. శృం.నై. 3.159 ; **2**. ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగించే నెమలి అడుగుచెట్టు. ఆం.భా. 2.48. (Vitex Pubescens) ; **3**. నీలివన్నెకల పందెం కోడిపుంజు.

నెమలంచుపేటు వి. నెమలిపేటు, నెమలి ఆకారంలో బొమ్మలు పడేట్టు నేసిన డిజైను. నెమలిఅంచు రూ. నమలి అంచు, నెమిలి అంచు. వి. నెమిలి బోర్డరు, నెమలి ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. నెమలిఅడుగు రూ.చూ. నెమిలియడుగు. వి. గృహాది నిర్మాణాల కుపయోగపడే కలప నిచ్చే చెట్టు (Vitex alata). నెమలికంఠంచీర వి. నిలువుకు కెంపు, అడ్డానికి పచ్చరంగు పెట్టి నేసిన కలనేత చీర. నెమలికండ్లచాపు రూ. నమలికండ్లసాపు. వి. అంచుల మధ్య నెమలికళ్ళ ఆకారంలో డిజైను నేసిన రెండు పంచెలు. నెమలికండ్లధోవతి రూ. నవిలికండ్ల దోవతి. వి. అంచులమధ్య మధ్య భాగంలో నెమలికళ్ళ మాదిరి డిజైన్లు నేసిన పంచె. నెమలికన్నంచ రూ.చూ. నెమలికన్నంచు. వి. నెమలికన్ను ఆకారంలో డిజైను నేసిన అంచు. నెమలికన్నంచు రూ. నమిలికన్నంచు, నెమలికన్నంచ. వి. నెమలికన్ను ఆకారంలో డిజైను నేసిన అంచు. నెమలికన్ను వి. **1**. అర్ధచంద్రం ; **2**. నెమలి ఈకలోని చివరి నేత్రాకారపు భాగం. నెమలికన్నుకాల్వు రూ. నమలికన్ను కాల్వు. వి. కన్ను కాల్వు, కాల్వులో నెమలికన్నుల మాదిరి ఏర్పడిన మచ్చ. నెమలికన్నుచీర వి. నీలం, పచ్చవన్నెల్లో నేసిన కలనేత చీర. నెమలికన్నునేత వి. బట్ట అంచులోగాని, కమ్మిలో గాని నెమిలికన్ను మాదిరి నమూనాలు పడేట్టు నేసిన నేత. నెమలికన్నుపేటు రూ. నెమ్మికన్నుపేటు. వి. నెమలి కన్ను ఆకారంలో నేసిన ఒకరకం డిజైను. నెమలిచెట్టు వి. త్రిపాది అనేచెట్టు. నెమలిచెట్టుపేటు వి. చెట్టుదగ్గర నెమలి ఉన్నట్టు అంచులో నేసిన డిజైను. నెమలిజుట్టుఆకు వి. మందులకు పనికివచ్చే ఒకరకం ఆకు. నెమలిపింఛంచీర వి. నిలువుకు నీలం, అడ్డానికి పచ్చరంగులు పెట్టి నేసిన చీర. నెమలిపేటు వి. నెమలంచుపేటు, నెమలి ఆకారంలో బొమ్మలు పడేట్టు నేసిన డిజైను. నెమలిబోర్డరు వి. నెమలి అంచు, నెమలి ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. ఇం. *boarder*. అంచు. <నెమలి+ఇం. boarder. నెమలి బ్లా

వి. నెమలి బులుగు, ఒకరకం నీలం రంగు. **నెమలిమొగ్గ** వి. నాట్యంచేసే బాలకులు కాళ్ళు పైకిపెట్టి చేతులతో నడిచే నెమలినాట్య విశేషం. **నెమలివడ్లు** వి.బ.వ. గుంటలలోను, దొరువులలోను, అడవి మొలుపుగా మొలిచి పంట పండే వడ్లజాతి, నివ్వరి. **నెమలివరి** రూ. నెమిలొరి. వి. వరి మొక్కలాంటి కలుపుమొక్క.

**నెమియించు** వి. నిర్మించు.

సం. నిర్మా. నిర్మించు, కట్టు, సృజించు.

<సం. నిర్మా + -ఇంచు[3].

**నెమిలంచుబేలు** చూ. నెమిలి.

**నెమిలి** రూ.చూ. నమిలి. వి. మయూరం. జైమినిభా. **4.79.**

**నెమిలంచుబేలు** వి. అంచులో నేసే నెమలి డిజైను. **నెమిలిఅంచు** రూ.చూ. నెమలిఅంచు. వి. నెమలి బోర్డరు, నెమలి ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. **నెమిలి కండ్లంచు** రూ. నమిలి కండ్లంచు. వి. నెమలికన్ను ఆకారంలో డిజైను నేసిన అంచు. **నెమిలికూజా** రూ. నమిలికూజా. వి. నెమిలిమూతి ఆకారంలో ఉండే కూజా. **నెమిలిపించెపుఁబుట్టము(-పుట్టము)** వి. నెమలి ఈకలతో చేసిన వస్త్రం. హర. **5.37. నెమిలియడుగు(-అడుగు)** రూ. నెమలిఅడుగు. వి. **1.** నెమిలిచెట్టు, పూలికరంజం. హంస. **4.11**; **2.** కుచనఖక్షతం. **నెమిలివడ్లు** వి.బ.వ. శాలిధాన్యం. హరి.పూ. 6. **నెమిలి సొరము** వి. షడ్జస్వరం. సం. స్వర-. ధ్వని. **నెమిలేరు** వి. నివ్వరి దాన్యం పంట. **నెమిలొరి** రూ.చూ. నెమలివరి. వి. వరిమొక్కలాంటి కలుపుమొక్క.

**నెమిలేరు** చూ. నెమిలి.

**నెమిలొరి** చూ. నెమిలి.

**నెముక** రూ.చూ. ఎమ్ము[1]. వి. అస్థి, శల్యం. ద్వి. భాగ. 2.62 వ.

**నెమురు** వి. **1.** తైల లేపనం; **2.** (బియ్యం మొ. నవి) నెమరటం; **3.** తడమటం.

**నెంబరు** రూ.చూ. నంబరు. వి. సంఖ్య.

**నెంబరుకుసుమ** వి. మంచిరకం మాట్టేరు వడ్లు. **నెంబరు కేసరి** వి. మంచిరకం వడ్లు. **నెంబరునూలు** రూ. నెంబర్నూలు. వి. మిల్లు నూలు, మిల్లులో తయారైన నూలు. **నెంబరురాయి** రూ.చూ. నంబర్‌రాయి. వి. గుమ్మం రాయి, గ్రామాల చివర, పొలాలకు, స్థలాలకు, వీథులకు మధ్య హద్దులను సూచిస్తూ పాతిపెట్టిన రాయి. **నెంబరు సన్నం** వి. మంచిరకం మాట్టేరు వడ్లు. **నెంబర్నూలు** రూ.చూ. నెంబరునూలు. వి. మిల్లు నూలు, మిల్లులో తయారైన నూలు. **నెంబర్‌రాయి** రూ.చూ నంబర్‌రాయి. వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతిన సర్వేరాయి. **నెంబర్లు** రూ.చూ. నంబర్లు. వి.బ.వ. గింజ సన్నరకం నెంబరు వడ్లు.

**నెంబర్నూలు** చూ. నెంబరు.

**నెంబర్‌రాయి** చూ. నెంబరు.

**నెంబర్లు** చూ. నెంబరు.

**నెంబు** రూ.చూ. నెమ్ము[2]. వి. బుడంమేకు, తలుపు చెక్కలను కరిపించటానికి వాడే రెండువైపులా పదునున్న తీగమేకు.

**నెమ్మ** వి. పడిశం, జలుబు.

**నెమ్మజుట్టు** వి. తోటల్లో ఏటా లేచే కలుపుమొక్క (Celosia Cristata).

**నెమ్మతి** చూ. నెఅ.

**నెమ్మది** చూ. నెఅ.

**నెమ్మనము** చూ. నెఅ.

**నెమ్మయి** చూ. నెఅ.

**నెమ్మలి** రూ.చూ. నమిలి. వి. మయూరం.

**నెమ్మలిపరుఁజు** వి. ఖడ్గాది ముష్టి సంగ్రాహ్య తలం, కత్తిపిడి. శృం.నై. **7.172.**

**నెమ్మాను** చూ. నెమ్ము[1].

**నెమ్మి[1]** రూ.చూ. నమిలి. వి. మయూరం. కృ.శకు. **2.11.**

**నెమ్మికన్నుపేటు** రూ.చూ. నెమలికన్నుపేటు. వి. నెమలి కన్ను ఆకారంలో నేసిన ఒకరకం డిజైను. **నెమ్మిజుట్టు** వి. బర్హిచూడం. **నెమ్మిరవుతు** రూ. నెమ్మిరౌతు. వి. మయూర వాహనుడు, కుమారస్వామి. **నెమ్మిరౌతు** రూ.చూ. నెమ్మిరవుతు. వి. మయూర వాహనుడు, కుమారస్వామి. **నెమ్మిఱేఁడు** వి. మయూరవాహనుడు, కుమారస్వామి.

**నెమ్మి[2]** రూ. నిమ్ము[3], నెమ్ము[3]. వి. తినాసం, వంజులం. పి.శకు. 2.14 (**Ougenia Dalvergioides**).

సం. నేమిన్-. తినాసం.

<సం. నేమిన్-.

**నెమ్మిచెట్టు** వి. తినిశవృక్షం.

**నెమ్మి[3]** రూ. నెమ్మిక. వి. **1.** సంతోషం, ప్రీతి. భార.ఆది. 2.125 ; **2.** ప్రసాదం, అనుగ్రహం. భార.ఆది. **3.110** ; **3.** స్నేహం, మిత్రభావం. భార.ఆది. 4.55 ; **4.** ప్రేమ, అనురాగం. భార.ఆది. **4.104** ; **5.** సుఖం. భార.సభా. 1.39 ; **6.** నిర్భయత్వం, నెమ్మది. భార.ఆరణ్య. 2.388 ; **7.** సుఖస్థితి. భార.ఉద్యో. **3.34** ; **8.** ఆసక్తి, తత్పరత. విక్ర. **2.165** ; **9.** క్షేమం, కుశలవార్త. అచ్చ.రా. సుందర. **86.**

తు. నెయిమె. సన్నని, నాణెమైన, నెయి.ములి. మెత్తని గడ్డి, నెయిపన్తి. మెత్తనిరకం గడ్డి, నెయ్యొలి. మృదువైన తాటిఆకు.

**నెమ్మిసేయు (-చేయు)** అ.క్రి. సంతోషపడు, ప్రీతి పొందు. శృం.నై. **3.172.**

**నెమ్మి[4]** రూ.చూ. నెమ్ము[2]. వి. బండి చక్రం చుట్టూ ఉండే కమ్మి. విష్ణు పు. **3.158.**

**నెమ్మి[5]** వి. **1.** పాలచెట్టు (Mimusops Hexandra) ; **2.** ఇళ్ళు మొ॥నవి కట్టుకోటానికి పనికివచ్చే లేతఎరుపురంగు కల గట్టి కలప నిచ్చే చెట్టు (Mimusops Roxburghiana).

**నెమ్మి[6]** వి. పొగడచెట్టు (**Mimusops Elengi**).

**నెమ్మిక** రూ.చూ. నెమ్మి[3]. వి. ప్రేమ, అనురాగం. రస. 3.

**నెమ్మించు** చూ. నెఅ.

**నెమ్మిలి** రూ చూ. నమిలి. వి. మయూరం.

**నెమ్ము[1]** రూ. నిమ్ము[2]. వి. **1.** తడి, తేమ ; **2.** తలుపు చెక్కల్ని కరిపించటానికి వాడే రెండువైపులా పదునున్న

తీగమేకు.

త. నమ (-ప్ప-, -త్త్-), నమర్ (-ప్ప-, -త్త్-), నము (-ప్ప-, -త్త్-). తడి, చెమ్మగా అగు.

**నెమ్మాను** అ.క్రి. చెమ్మగిల్లు. < నెమ్మ + అను. **నెమ్మకొను** అ.క్రి. చెమ్మగిల్లు.

**నెమ్మ**[2] రూ. నెంబు, నెమ్మి[4]. వి. **1**. బుడంమేకు, తలుపు చెక్కలను కరిపించటానికి వాడే రెండువైపులా పదునున్న తీగమేకు. పండి.చ. 1.43 పు.; **2**. పరానికి అడ్డంగా వేసే ఇనపబద్దీ లేక కొయ్యపట్టె; **3**. ముక్కరచీల, జంట నొగలను కాడి ముందు కలపటానికి బిగించిన ఇనపమేకు; **4**. బండి చక్రానికి చుట్టూ ఉండే కమ్మి.

సం. నేమి-, నేమీ. చక్రధార, బండి చక్రం చుట్టు కమ్మి; ప్రా. ణేమి; అ.మా. ణేమి; పా. నేమి;

క. నెమ్మి; బ్రా. నేమ. పక్క.

<ప్రా. ణేమి.

**నెమ్మచీల** వి. తలుపు చెక్కలను కరిపించటానికి వాడే రెండువైపులా పదునున్న తీగమేకు. **నెమ్మలు** వి.బ.వ. **1**. బండి పరంలోని అడ్డపట్టెల మధ్య వేసే ఇనపబద్దెలు; **2**. పరం అమర్చటానికి దొలుపుమీద కొట్టిన మేకులు; **3**. జంట నొగల బండి నొగలకు దొలుపుకు బిగించే మేకులు; **4**. బండి దొలుపు కిరువైపుల బిగువుకోసం కొట్టిన మేకులు.

**నెమ్మ**[3] రూ.చూ. నెమ్మి[2]. వి. ఒకరకం చెట్టు (Ougenia Dalbergiodes).

**నెమ్మ**[4] రూ.చూ. ఎమ్మ[1]. వి. ఎముక, అస్థి. చంద్రాంగ. 6.85.

**నెమ్మేను** చూ. నెఱి[1].

**నెమ్మొగము** చూ. నెఱ.

**నెమ్మోము** చూ. నెఱ.

**నెయి** రూ.చూ. నేయి. వి. ఆజ్యం. కాశ. 4.34.

**నెయిబులుగు** రూ.చూ. నేవీ బ్లూ. వి. ఒకరకం నీలంరంగు.

**నెయ్యపుఁగలను** చూ. నెయ్యము.

**నెయ్యపుఁగినుక** చూ. నెయ్యము.

**నెయ్యపుఁగిన్క** చూ. నెయ్యము.

**నెయ్యపుజగడము** చూ. నెయ్యము.

**నెయ్యపుటలుక** చూ. నెయ్యము.

**నెయ్యపుఱేఁడు** చూ. నెయ్యము.

**నెయ్యమాడు** చూ. నెయ్యము.

**నెయ్యమి** రూ.చూ. నెయ్యము. వి. **1**. ప్రీతి, సంతోషం. చమ. 1.90; **2**. ప్రేమ, అనురాగం. ఆం.భా. 1.136; **3**. స్నేహం, ప్రీతి. ఆం.భా. 2.186.

**నెయ్యము** రూ. నెయ్యమి, నేయము[1]. వి. **1**. ప్రేమ, అనురాగం. భార. ఆది. 3.27; **2**. వలపు. భార. ఆది. 3.186; **3**. ప్రీతి, సంతోషం. భార. ఆది. 3.224; **4**. తమి, ఆసక్తి. భార. ఆది. 8.172; **5**. ఒప్పిదం, మనోహరత. భాగ. 8.266; **6**. బాంధవ్యం, చుట్టరికం. కువ. చ. 3.65; విణ. **1**. ప్రియమైన, ఇష్టమైన. భార. ఉద్యో. 4.234; **2**. అనుకూలమైన. దశా. 2.130.

సం. స్నేహ-; ప్రా. ణేహ-, సణేహ-, సిణేహ-: జై.మహా. ణేహ-, సిణేహ-; అ.మా. నే.హ-; మా. ణేహ; పా. సినేహ-; అప. ణేహ-;

క. నేహ, నేస్త; త. నేయ; మ. నేశం.

<ప్రా. ణేహ-.

**నెయ్యపుఁగలను(-కలను)** వి. సురతం. దశా. 1.268. **నెయ్యపుఁగినుక(-కినుక)** రూ. నెయ్యపుఁగిన్క. వి. ప్రణయకోపం. పారి. 1.123. **నెయ్యపుఁగిన్క(-కిన్క)** రూ.చూ. నెయ్యపుఁగినుక. వి. ప్రణయకోపం. విష్ణుపు. 2.209. **నెయ్యపుజగడము** వి. ప్రణయ కలహం, పొలఅలుక. మను. 5.93. **నెయ్యపుటలుక(-అలుక)** వి. ప్రణయ కలహం. ఆం. నా.శే. 62. **నెయ్యపుఱేఁడు** వి. వలరాజు, మన్మథుడు. వసు. 6.88. **నెయ్యమాడు** అ.క్రి. చెలిమిచేయు, స్నేహంచేయు విష్ణుపు. 2.209. < నెయ్యము + ఆడు. **నెయ్యము తియ్యము** వి. ప్రేమ, ఆదరం. పారి. 1.134. **నెయ్యరి** వి. **1**. స్నేహితుడు. రామాభ్యు. 7.74; **2**. స్నేహితురాలు. < నెయ్యము + -అరి.

**నెయ్యరి** చూ. నెయ్యము.

**నెయ్యలు** చూ. నెయ్యి. వి.బ.వ. పేలాలు.

**నెయ్యి** రూ.చూ. నేయి. వి. **1**. ఆజ్యం. భీమ. 6.53; **2**. చమురు, కొవ్వు. మను. 4.18.

**నెయ్యిగురిగి** రూ.చూ. నెయ్యిగురిగె. వి. నెయ్యి వడ్డించటానికి వాడే చిన్న మట్టిగిన్నె. **నెయ్యిగురిగె** రూ. నెయ్యిగురిగి. వి. నెయ్యి వడ్డించటానికి వాడే చిన్న మట్టిగిన్నె. **నెయ్యిపిడ్త** రూ.చూ. నేతిపిడత. వి. నేతిపిడత, నెయ్యిపోసుకొనే మట్టిపాత్ర. **నెయ్యిలవాళ్లు** వి.బ.వ. నెయ్యుండలు చేసి అమ్మే ఒకజాతి. **నెయ్యుండలు** వి.బ.వ. పేలాలు పాకంపట్టి చేసిన ఉండలు.

**నెయ్యుండలు** చూ. నెయ్యి.

**నెయ్యుఁడు** చూ. నెయ్యము. రూ. నేయుఁడు. వి. **1**. ప్రేమాస్పదుడు, ఇష్టుడు. భార. ఆది. 8.318; **2**. మిత్రుడు, స్నేహితుడు. భార. సభా. 1.77.

**నెయ్యురాలు(-ఆలు)** వి. **1**. ప్రియురాలు, ఇష్టురాలు. ప్రబంధ. 724; **2**. స్నేహితురాలు, నేస్తకత్తె. **నెయ్యురు** వి.బ.వ. ఆప్తులు. భార. అరణ్య. 1.387. **నెయ్యురులు** వి.బ.వ. **1**. స్నేహితులు. ద్వి. పరమ. వి. 5.411; **2**. ఇష్టులు.

**నెయ్యురాలు** చూ. నెయ్యుఁడు.

**నెయ్యురు** చూ. నెయ్యుఁడు.

**నెయ్యురులు** చూ. నెయ్యుఁడు.

**నెర**[1] రూ.చూ. నెఱ. క్రి.విశ.ద్రు. **1**. పూర్ణంగా. పల్నా. పు. 57; **2**. మిక్కిలి, అధికంగా. ఘటికా. 2.200; విణ. **1**. పూర్ణమైన, గొప్ప. రామాభ్యు. 7 ఆ; **2**. నేర్పరియైన, ఉపాయశాలియైన. శుక. 1.247.

**నెరకాఁడు** రూ.చూ. నెఱకాఁడు. వి. పరిపూర్ణమైనవ్యక్తి. **నెరకొను** అ.క్రి. నిండుకొను. మను. 5.43. **నెరగోలకట్టె(-కోలకట్టె)** వి. **1**. పంగలుగా రెండుపుల్లలు కట్టిన వెదురు కర్ర; **2**. కొంకికర్ర, కళ్ళంలో నలిగిన గడ్డిని లాగే కర్ర.

నెరజాణ రూ.చూ. నెఱజాణ. వి. నేర్పరి. రాధికా. 2.58. నెరతనము రూ.చూ. నెఱతనము. వి. వినయవిధేయత. నెరయొంటరి(-ఒంటరి) వి. తుమ్మెద. వేంక. అం. 98. నెరవచ్చు అ.క్రి. అధికమగు, ఎక్కువగు. దశకు. 1.75; స.క్రి. వినవచ్చు. నెరవంజి రూ. నెరవంద, నెరవెంద. వి. తీక్ష్ణగంధం, మునగచెట్టు. నెరవంద రూ.చూ. నెరవంజి. వి. తీక్ష్ణగంధం, మునగచెట్టు. నెరవాడ వి. రజస్వల కావటం. నెరవాడియైన విణ. నిశితమైన. నెరవాద రూ. నెరవాది[1], నెర్వెద. వి. రజస్వల అవటం. నెరవాది[1] రూ.చూ. నెర వాద. వి. ఆడపిల్ల అయ్యే సమర్త, పెద్దమనిషి అవటం. నెరవాది[2] రూ.చూ. నెఱవాది. వి. సమర్థుడు. నెరవాది బిరుదు వి. ప్రసిద్ధుడు. రాధా. 3.46. నెరవిడి క్రి.విణ.ద్రు. నిండుగా, పూర్ణంగా. కు.సం. 4.39; వి. అతిశయం. ఆధిక్యం. ఉ.హరి. 3.24. క. నెఱవణిగె. నెరవిద్దె రూ.చూ. నెఱ విద్దె. వి. హస్తలాఘవం. నెరవిద్య వి. హస్తలాఘవం. సం. విద్యా. చదువు. < నెర[1] + సం. విద్యా. నెరవెంద రూ.చూ. నెరవంజి. వి. తీక్ష్ణగంధం, మునగచెట్టు. నెరవేద వి. రజస్వల కావటం. నెరసమస్య వి. పూర్తి పన్ను. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 748. క్రీ.శ. 1577. నెరసరి రూ.చూ. నెఱసరి. వి. 1. ఇబ్బంది శత్రువు; 2. సింహం; 3. పూర్ణోపమానం; 4. శూరుడు. నెరసాని వి. నేర్పరి అయిన స్త్రీ. శశా. 3.112.

నెర[2] వి. రాళ్ళ వరసలకు మధ్యనున్న స్థలం.

నెరక రూ.చూ. నెఱక. వి. వెంట్రుక.

నెరడరు రూ.చూ. నెరిడె[2]. వి. కడుపులో మేత పొట్టకుపైన ఉండే నెరిడెకు వచ్చే గుండె వాపు జబ్బు.

నెరడు[1] విణ. విషమమైన, హెచ్చు తగ్గులుకల. ఆం.భా. 2.276.

నెరడు[2] రూ.చూ. నెరిడె[2]. వి. కడుపులో మేత పొట్టకు పైనఉండే నెరిడెకు వచ్చే గుండెవాపు జబ్బు.

నెరపలం వి. ఒకరకమైన నీరుప్పి.

నెరపు చూ. నెరయు.

నెరపెట్టు చూ. నెరయు.

నెరయిక చూ. నెరయు.

నెరయించు చూ. నెరయు.

నెరయు రూ. నెరియు[1], నెఱయు. అ.క్రి. 1. నిండు, పూర్ణమగు. భార. ఆది. 3.157; 2. వ్యాపించు, ప్రసరించు. భార.ఆది. 8.196; 3. అతిశయించు. కు.సం. 5.74; 4. చెదిరిపడు. నిర్వ.రా. 8.38; 5. చెదురు. భార.విరా. 2.138; 6. నెరవేరు, సిద్ధించు. కాశీ. 6.197: 7. పడు. పల్నా.పు. 13; 8. విడివడు, తప్పించుకొను. మను. 3.84: 9. తెల్లనగు.

క. నెరపు. పూర్తిగా; తు. నెరియుని. నిండు; త. నిరై. నిండి ఉండు; కొలా. నెరై. వ్యాపించు.

నెరపు రూ. నెరుపు, నెఱపు. స.క్రి. 1. ప్రకటించు, చూపు. కు.సం. 12.78; 2. పరచు, విరివిచేయు. దశకు. 10.105; 3. నెరవేర్చు, జరుపు. నృసింహ. 2.76; 4. చిమ్ము, వెదజల్లు. భాస్క.రా. బాల. 173; 5. కావించు, చేయు. పి.శకు. 4.164; 6. ప్రసరింపజేయు, వ్యాపింపజేయు. వసు. 1.158; 7. నించు; 8. అతిశయింపజేయు; 9. వెలయించు; 10. ఎండలో పరచిన మట్టిని తడి ఆరటానికి చేత్తో అప్పుడప్పుడు కలియబెట్టు; విణ. అధికమైన, వ్యాప్తమైన. హరి.పూ. 8.23. నెరపెట్టు స.క్రి. కలగజేసుకొను. నెరయిక వి. నెరయటం. నెరయించు స.క్రి. వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. భాస్క.రా.యు. 1428. < నెరయు + -ఇంచు[3].

నెరవరి చూ. నెరవు[1].

నెరవు[1] రూ. నెఱవు. వి. 1. అగ్నికణం. కు.సం. 2.25; 2. పరివారం. భార.విరా. 3.27; 3. మార్గం. రం.రా. కిష్కిం.; 4. పూర్తి, సమృద్ధి; 5. వ్యాపనం; విణ. 1. శక్యమైన, సాధ్యమైన. భార.ఉద్యో. 1.17; 2. వ్యాప్తమైన. శృం.నై. 5.161; 3. అధికమైన. యయా. 5.148; 4. విశాలమైన.

నెరవరి వి. నేర్పరి, కుశలుడు. రంగా.చ. 2.109. < నెరవు + -అరి. నెరవేరు రూ.చూ. నెఱవేఱు. అ.క్రి. సంపూర్ణమగు. నెరవేర్చు రూ.చూ. నెఱవేర్చు. అ.క్రి. చేయు.

నెరవు[2] వి. 1. స్థానం. భార.విరా. 1.245; 2. చుట్టుపట్టు. అ.క్రి. గుమికూడు. పండి.చ. 4.244 పు; భార.శాంతి. 1.360.

క. నెరె. గుమికూడు, నెరవి, నెరవు. కలయిక, గుంపు; తు. నెరియుని, నెరెవుని. సమావేశమగు; త. నిరై, నెరుంక. గుంపుగా దగ్గరగా ఉండు.

మూ.ద.ద్రా. *నెర్-.

నెరవులు వి.బ.వ. పరివారం, అనుచరులు. కు.సం. 2.25.

నెరవు[3] వి. ఒకానొక చెట్టు. రం.రా.ఉ. 119 పు. 15 పం.

నెరవు[4] వి. మేలు, మంచి.

నెరవేరు చూ. నెరవు[1].

నెరవేర్చు చూ. నెరవు[1].

నెరసు వి. 1. నలుసు, రేణువు. బసవ. 3.773 పం.: 2. దోషం. హరి.పూ. 8.95; 3. చిన్న తప్పు. శృం.నై. 7.90; 4. లోపం. ప్రబోధ. 1.30; 5. అసత్యవచనం, కల్లమాట. వసు 3.148; 6. సికతా విశేషం, ఒకరకం ఇసక. ఆం.బా. 1.155; 7. గమళ్ళవాడు కత్తులు నూరే పొడి; విణ. నలుసు, చిన్న. విక్ర. 4.203.

నెరసుజూపు(-చూపు) వి. క్రీగంటి చూపు, కటాక్షం. విక్ర. 4.203. నెరసుదెగడు(-తెగడు) అ.క్రి. తప్పులెన్ను, నిందించు. భాస్క.రా.ఆరణ్య. 1.43. నెరసులుపట్టు అ.క్రి. తప్పులు పట్టు. నెరసువెట్టు(-పెట్టు) స.క్రి. దోషినిచేయు. పి.శకు. 3.189.

నెరాబరతు చూ. నెఱా. వి. ఆరుబయలు.

నెరి[1] రూ.చూ. నెఱి[1]. వి. 1. అందం; 2. విధం; 3. ఆచారం; 4. క్రమం; 5. న్యాయం.

నెరిపడు రూ.చూ. నెఱిఁబడు. అ.క్రి. 1. సిద్ధించు; 2. బాగుపడు.

**నెరి²** రూ.చూ. నెఱి². వి. **1**. వక్రత. పాండు. 1.117; **2**. పక్షిరెక్క; **3**. వస్త్రంకుచ్చె; **4**. వెంట్రుక; విశ. వంకరైన, కుటిలమైన. శుక. 1.226.

**నెరి³** రూ.చూ. నెఱి³. వి. **1**. పరాక్రమం; **2**. ప్రజ్ఞ; **3**. పూర్తి.

**నెరిక¹** రూ.చూ. నెఱిక. వి. గాగరా, పావడా. పారి. 4.22.

**నెరిక²** వి. సందు, చీలిక.

**నెరిగిపోవు** స.క్రి. హెచ్చు తగ్గులుగా ఉన్న పదును చదును చేయు.

**నెరిడ** రూ.చూ. నెరిడె². వి. కడుపులో మేత పొట్టకుపైన ఉండే నెరిడెకు వచ్చే గుండె వాపు జబ్బు.

**నెరిడి** రూ.చూ. నెరిడె². వి. **1**. కడుపులో మేత పొట్టకుపైన ఉండే నెరిడెకు వచ్చే గుండెవాపు జబ్బు; **2**. గుండె.

**నెరిడిదొమ్మ** రూ.చూ. నెరిడెదొమ్మ. వి. నెరిడెలో ఊపిరి సలపక పశువు చచ్చి పోయే దొమ్మ.

**నెరిడె¹** వి. ఒక చెట్టు పేరు.

**నెరిడె²** రూ. నరెడ, నల్లెడ, నెరడరు, నెరడు², నెరిడ, నెరిడి, నెరుడ, నెరెడరు, నెఱిడె, నెలెడ. వి. కడుపులో మేత పొట్టకుపైన ఉండే నెరిడెకు వచ్చే గుండె వాపు జబ్బు.

త. నెరి. బొబ్బల వల్ల ఏర్పడే కణువుల వాపు.

**నెరిడెకట్టు** వి. ఊపిరికట్టు, గుండెజబ్బు. **నెరిడెదొమ్మ** రూ. నెరిడిదొమ్మ. వి. నెరిడెలో ఊపిరి సలపక పశువు చచ్చిపోయే దొమ్మ.

**నెరిత** వి. ఒకరకం కంచెమొక్క (Laurus Involucrata).

**నెరిమిడి** రూ.చూ. నెరుము². వి. రెండు గుర్తుల మధ్య దూరం.

**నెరియ** రూ.చూ. నెఱియ. వి. **1**. పగులు, బీట; **2**. పిచ్చితనం.

**నెరియు¹** రూ.చూ. నెరయు. అ.క్రి. **1**. నిండు; **2**. నెరవేరు; **3**. వ్యాపించు; **4**. ప్రకాశించు.

**నెరియు²** రూ.చూ. నరయు. అ.క్రి. జుట్టు తెల్లనగు.

**నెరియెచీల** చూ. నెరియ. వి. దొలుపు చీల, బండి దొలుపును పోలు గర్రకు కలిపే మేకు.

**నెరుకు** విశ. ముతకైన, దట్టమైన. అష్టమ. క. 1.50 పు. 18 పం.

త. నెరుక్కమ్. సాంద్రత, గుమికూడటం, బిగుతు, నెరుక్కు. నొక్కు.

**నెరుంగొట్టె** వి. కొన్ని పశువులు నడిచేటప్పుడు ఎక్కువగా అరిగే వెలుపలి గిట్ట.

**నెరుడ** రూ.చూ. నెరిడె². వి. కడుపులో మేత పొట్టకుపైన ఉండే నెరిడెకు వచ్చే గుండెవాపు జబ్బు.

**నెరుపు** రూ.చూ. నెరపు. స.క్రి. **1**. ఎండలో పరచిన మట్టిని తడి ఆరటానికి చేత్తో అప్పుడప్పుడు కలియ బెట్టు; **2**. ఎత్తుపల్లాలు సరిచేయు, చదును చేయు; **3**. చాపిన పడుగు పోగులు పడుగేరు కర్రలమీద పరచు; **4**. నించు; **5**. నెరవేర్చు; **6**. పరచు; **7**. ప్రకాశింపజేయు; వి. **1**. వ్యాపనం; **2**. వెంట్రుకలు తెల్లబడటం.

**నెరుపుపెట్టు** స.క్రి. దిద్దకం పెట్టు, అచ్చు కట్టిన తరవాత అచ్చు కర్రల మీద వడిదారం మెలికలు కొమ్మ బిళ్ళతో రుద్దుతూ చదును చేయు.

**నెరుము¹** స.క్రి. **1**. రాచు. ద్వి.సార.చ. 2 ఆ.; **2**. పొడుచు, గుచ్చు. కళా. 3.90; **3**. గడ్డపారను దిగవేసి బెండడి ఎక్కువకావటానికి అటూ ఇటూ నెట్టి ఆడించు; **4**. ఎత్తుపల్లాలు సరిచేయు, చదును చేయు; **5**. ముందుకు సాగు.

క. నగ్గు. తుడిచివేయబడు, నెగ్గు, నెగ్గు. వంపుచేయబడు, పగులు; కొడ. నెర్కు. చేతులు నలుపుకొను; తు. నంణ్ణు, నాకుక్కు. పగులు, రాయబడు; త. నెరి. (-వ్-,-న్ట్-). విరచు, కొట్టు, ముక్కలుచేయు, నెరికల్. విరిగిన దేదైనా, నెరవు. పగులటం, విడదీయు, నెరుక్కు. నెరుక్కమ్. దగ్గర తనం, గట్టిదనం, దగ్గరగా రాయటం; మ. ఞెరియుక. పగులు, ముక్కలగు, ధ్వంసంచేయు; నిరజ్జుక. పాకు. కాళ్ళీడ్చు, నిరకుక్కక. తోయు; కో. నెర్క్. చేతులురాయు; తొ. నిన్ప్. తుడిచివేయబడు; గోం. నాజ్. గిన్నెకున్న పగులు; కుఇ. నేర. తట్టు, రుద్దు. పర్జి. నెగ్ను. దంచబడు; ఒల్లా. నెన్ప్. దంచు; కురు. నీడ్-. రుద్దు, తుడిచివేయు.

< మూ.ద్రా. *నేర్-/నెర్-.

**నెరుములు** వి.బ.వ. ఎక్కువగా కదలటం.

**నెరుము²** రూ. నెరిమిడి, నెరుపు¹, నేర. వి. నెరిమిడి, రెండు గుర్తుల మధ్య దూరం.

**నెరులు** చూ. నెరి². వి.బ.వ. ఛిద్రాలు.

**నెరువు¹** రూ.చూ. నెరుము². వి. నెరిమిడి, రెండుగుర్తుల మధ్య దూరం.

**నెరువు²** వి. నేతలో అడ్డం, వెడల్పు.

**నెరెడరు** రూ.చూ. నెరిడె². వి. కడుపులో మేత పొట్టకు పైన ఉండే నెరిడెకు వచ్చే గుండెవాపు జబ్బు.

**నెరై** రూ.చూ. నెఱియ. వి. చెక్కలో బీట వారిన భాగం.

త. నెరి. పగులు, గరుకుదనం.

**నెర్కపోవు** చూ. నెరియ. అ.క్రి. గాలికి కుండలు నెర్రెలు పోవు.

**నెర్గ్యము** వి. ఒక సుమూహూర్తంలో ముందుగా ప్రయాణ సన్నాహంగా ఒక వస్తువును అన్యస్థలంలో ఉంచి ఆవల వీలైనప్పుడు బయలు దేరటం.

సం. నిర్గమన-. బయటకు పోవటం.

< సం. నిర్గమన-.

**నెర్ర** రూ.చూ. నెఱియ. వి. గంటు, చీలిక, చీల్పు.

**నెర్రి** రూ.చూ. నెఱియ. వి. బీట. పగులు, చీల్పు.

**నెర్రె** రూ.చూ. నెఱియ. వి. **1**. గంటు, చీలిక, చీల్పు; **2**. చీలికలుగా ఉండే రంధ్రం.

**నెర్రెకొట్టు** స.క్రి. చిట్లు, పగులు చూపు.

**నెర్వెద** రూ.చూ. నెరవాద. వి. రజస్వల కావటం.

**నెఱ** రూ. నెర¹, నెఱా, నేఱా. విశ. **1**. నిండైన, పూర్ణమైన. కు.సం. 2.101; **2**. వాడి అయిన, నిశితమైన. భాస్క.రా. యు. 1026; **3**. ఉత్తమమైన, ప్రశస్తమైన. హరి.ఉ. 6.162; **4**. పెద్దదైన, గొప్పదైన. భోజ. 3.79; **5**. సమర్థుడైన, కుశలుడైన. ప్రభా. 2.33.

క. నెఱ(నెఱద్-, నెఱద్-). నిండు, పూర్తి అగు, తయారగు; కొడ. నెరె-(నెరవ్-, నెరన్డ్-). యుక్తవయసు వచ్చు, నెర-(నెరప్-, నెరత్-). నిండు, నెరె. దేనితోనైనా నింపు; త. నిఱై, నిరప్పుమ్. నిండుదనం, సంపూర్ణత్వం, నిరంప. నిండుగా; మ. నిరట్టుక. నరిచేయు; కో. నెర్వ్-(నెర్డ్-). యుక్తవయసు వచ్చు, పక్వానికివచ్చు; తొ. నెఙ్-(నెఙ్ధ్-). నిండుగా అగు; కొలా. నెరమ్-, నెరైత్. విస్తరించు; నెరయ్-(నెరయ్), వ్యాపించు, నెరప్-(నెరప్). విస్తరించు (ధాన్యం, మిరపకాయలు మొ॥).

నెచ్చూలి వి. ప్రియపుత్రి, గాదిలిబిడ్డ. ద్వి. పరమ. వి. 3.218 పు. <నెఱ+చూలి. నెచ్చెలి వి. 1. ప్రాణస్నేహితుడు. కు.సం. 5.91; 2. ప్రాణస్నేహితురాలు. భార.విరా. 1.246; 3. స్త్రీ, ఆడది. ద్వి. పరమ. వి. 3.146 పు. <నెఱ+చెలి. నెచ్చెలికత్తె వి. ప్రాణస్నేహితురాలు. కు.సం. 5.131. నెచ్చెలికాఁడు వి. ప్రాణస్నేహితుడు. శృం.నై. 7.55. నెచ్చెలికారము వి. స్నేహం. నెచ్చెలితనము వి. ప్రాణస్నేహం. భాగ. 10 పూ. 476. నెచ్చెలియ వి. ప్రియసఖి. <నెఱ+చెలియ. నెచ్చెలువ వి. మిక్కిలి మనోహరురాలైన ఆడది. ఉ.రా. 1.171. <నెఱ+చెలువ. నెత్తమ్మి వి. 1. వికసించిన పద్మం, ఫుల్లాబ్జం. కు.సం. 8.9; 2. తామర. ఆం.భా. 3.62. <నెఱ+తమ్మి. నెత్తమ్మికొలనికాఁపు వి. గాలి. వేంక. ఆం. 15. నెత్తమ్మిదిమ్మలనిదులవిందు వి. చంద్రుడు. వేంక. ఆం. 11. నెత్తమ్మివిరివిందు వి. సూర్యుడు. రాజవా. 3.29. నెత్తావి వి. నిండు పరిమళం, సువాసన. కు.సం. 6.33. <నెఱ+తావి. నెందోలు వి. పెద్దతోలు. పండి.చ. 1.40. పు. <నెఱ+తోలు. నెన్నడుము వి.ఔ. 1. చక్కనికౌను. సుందరావలగ్నం. ఉ.హరి. 5.276; 2. నట్టనడిమి ప్రదేశం, సరైన మధ్యభాగం. శృం.నై. 8.84. <నెఱ+నడుము. నెన్నుదురు వి.ఔ. 1. నుదురు. నిర్వ.రా. 2.41; 2. చక్కని నుదురు, సుందర ఫాలం. శృం.నై. 6.53; 3. విశాల ఫాలం. దశా. 1.123. <నెఱ+నుదురు. నెన్నెఱులు వి.బ.వ. పొడవైన వెంట్రుకలు, దీర్ఘ కేశాలు. చంపూ రా. 3.27. <నెఱ+నెఱి+-లు. నెన్నొసలు వి.ఔ. 1. ఫాలం, నుదురు. చా.మం. 1.122; 2. చక్కని నుదురు, సుందర ఫాలం. ఇందు. 6.17; 3. విశాల ఫాలం, వెడల్పైన నుదురు. <నెఱ+నొసలు. నెమ్మతి వి. 1. చప్పుడుచేయకుండటం; 2. సంపన్నత; 3. వ్యాధి నయమవటం. సం. మతి-. బుద్ధి. <నెఱ+సం. మతి-. నెమ్మది వి. 1. నిండుమనసు. కు.సం. 11.56; 2. నిశ్చింతత. శాంతి. భార. ద్రోణ. 2.317; 3. సుహృదయం, విశాల హృదయం. భార. శాంతి. 1.388; 4. మనస్సు. వసు. 3.130; 5. చప్పుడు చేయకుండటం; 6. సంపన్నత; 7. వ్యాధి నయంకావటం. <నెఱ+మది. నెమ్మనము వి. 1. మనస్సు. నిర్వ.రా. 9.5; 2. నిండుమనస్సు. శృం.నై. 3.205, సం. మనస్. హృదయం. <నెఱ+సం. మనస్. నెమ్మయి వి. శరీరం. వేంక. ఆం. 36. <నెఱ+మయి. నెమ్మించు అ.క్రి. అతిశయించు. పి.శకు. 1.86. <నెఱ+మించు. నెమ్మొగము వి. 1. నిండుమొగం. నిర్వ.రా. 8.38; 2. మొగం. భార. విరా. 2.223; 3. చక్కని ముఖం. భార. ద్రోణ. 2.145. <నెఱ+మొగము. నెమ్మోము వి. నిండుమొగం. భార. విరా. 2.45. <నెఱ+మోము. నెఱకాఁడు రూ. నెరకాఁడు. వి. 1. ప్రియుడు, ఇష్టుడు. అచ్చ.భా. 2.16పు.; 2. పరిపూర్ణుడు. నెఱగద్యానములు వి.బ.వ. గట్టివరహా, పెద్ద వరహా. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1224. క్రీ.శ. 1121. నెఱజాణ రూ. నెరజాణ. విశే. నేర్పరి. శివరా. 3.58. నెఱజాణతనము వి. నేర్పరితనం. శశా. 4.56. నెఱతనకాఁడు వి. పూర్ణుడు. నెరతనం కలవాడు. మను. 4.7. నెఱతనము రూ. నెరతనము. వి. 1. కుశలత, జాణతనం. విష్ణు పు. 4.220; 2. ధర్మం, న్యాయం. అచ్చ.రా.యు. 30; 3. వైకాల్యం, పూర్ణత. ఆం.భా. 2.163; 4. శక్తి, సామర్థ్యం. తారక 1 అ. నెఱదీపము వి. అఖండదీపం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 386. నెఱపడి వి. నిండుపడి. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 765. క్రీ.శ. 1394. నెఱమీటుమొన వి. పన్నెండు మొనల్లో ఒకటి, మల్లబంధ విశేషం. హంస. 1.206. నెఱవడి రూ.చూ. నెఱవణి. వి. 1. పరిపూర్ణత; 2. యుక్తి; 3. చమత్కారం. నెఱవణి రూ. నెఱవడి. వి. 1. పరిపూర్ణత. బసవ. 4.124 పు; 2. యుక్తి; 3. చమత్కారం. నెఱవాది రూ. నెరవాది². వి. 1. సమర్థుడు, శక్తిమంతుడు. బసవ. 5.148 పు; 2. వాచాలుడు, అధికంగా మాట్లాడేవాడు. ఉ.హరి. 3.113; 3. జాణ, నేర్పరి. క్రీడా. 130, భాగ. 10 పూ. 1410; 4. పరిపూర్ణుడు. విక్ర. 7.20. త. నిఱైవాది. నెఱవాదితనము వి. జాణతనం, నేర్పరితనం. వేంక. పంచ. 3.193. నెఱవాదియగు(-అగు) అ.క్రి. సమర్థ అగు. నెఱవిద్దె రూ. నెరవిద్దె. వి. హస్తలాఘవం కలజాల విద్య. నెఱసరి రూ. నెరసరి విశే. శౌర్యవంతమైన. హరి.పూ. 7.105; వి. 1. శౌర్యానికి పూర్ణోపమానమైంది, సింహం. వేంక. పంచ. 4.570; 2. నిండు సామ్యం, పూర్ణోపమానం. ఆం.భా. 3.56. త. నిఱైసరి. నెఱసీమ వి. మార్గం. నెవ్వగ వి. 1. సాంత విచారణ, పూర్ణాలోచన. భార. ఆది. 7.232; 2. అధిక దుఃఖం, మిక్కిలి చింత. భార. విరా. 2.59. <నెఱ+వగ. నెవ్వడవడు అ.క్రి. అధికంగా ఎండిపోవు. అధిక తాపం చెందు. కు.సం. 5.70. <నెఱ+వడ+పడు. నెవ్వడి వి. నిండువడి, అధికవేగం. భార. ఆది. 6.82. <నెఱ+వడి. నెవ్వలి విశే. 1. మిక్కిలి వట్రువైన, కు.సం. 8.12; 2. మిక్కిలిపెద్దదైన. <నెఱ+వలి. నెవ్వీఁగు విశే. మిక్కిలి నిక్కిన, ఉన్నతమైన. కు.సం. 5.109. <నెఱ+వీఁగు.

నెఱక రూ. నెరక. వి. వెంట్రుక, కేశం. పండి.చ. 1.90 పు. త. నెరికుళం.

నెఱఁకు చూ. నెఱను. వి. జీవస్థానం, మర్మం.

నెఱఁకులాడు అ.క్రి. ఆయువుపట్టున గుచ్చుకొను. భార. ఆరణ్య. 1.314. <నెఱఁకు+-లు+ఆడు. నెఱఁకులు

వి.బ.వ. మర్మాలు. భార. ఆది. 4.202. నెఱఁకులుమీటు స.క్రి. మర్మ భేదనంచేయు. నృసింహ. 4.135. నెఱఁకులేయు స.క్రి. మర్మ భేదనంచేయు. శృం.నై. 2.97. < నెఱకు + -లు + ఏయు.

**నెఱను** వి.ఔ. **1.** మర్మం, గుట్టు. కు.సం. 6.160 ; **2.** మర్మ స్థానం, ఆయువుపట్టు. భాస్క.రా.యు. 1048 ; **3.** కీలు, అవయవ సంధి. వరాహ. 11.126.

క. నెఱ్. జీవసంబంధమైన, ముఖ్యమైన భాగం, రహస్యం, నెఱు. ప్రాణాధారమైన అవయవం ; తు. నెరవు. పురుషుని మర్మస్థానం, నిరవు. గుదం ; త. నిఱమ్. యవ్వనం, చన్ను, మధ్యభాగం, శరీరం, చర్మం, తొ. నెఙ్ఱ్. జీవసంబంధమైన భాగం ; గోం. నడమ్. మగ జంతువుల మర్మ స్థానం.

**నెఱపించు** చూ. నెఱయు.

**నెఱపు** చూ. నెఱయు.

**నెఱయించు** చూ. నెఱయు.

**నెఱయు** రూ.చూ. నెరయు. అ.క్రి. **1.** నిండు, పూర్ణమగు. భార. ఆది. 5.15 ; **2.** వెలయు, ప్రకటితమగు. భార. ఆది. 6.160 ; **3.** ప్రకాశించు. భార. భీష్మ. 1.100 ; **4.** చక్కగా జరుగు. భార. కర్ణ. 1.48 ; **5.** అతిశయించు. రం.రా. ఆరణ్య. 148పు. 9 పం ; **6.** వ్యాపించు, ప్రసరించు. ఉ.హరి. 1.9 ; **7.** నెరవేరు, సిద్ధించు. ఉ.హరి. 2.173 ; **8.** చెదిరిపడు. హర. 1.27 ; **9.** చెదరు. దశా. 2.2961.

**నెఱపించు** స.క్రి. ప్రకటించు, వెలయించు. శశా. 5.46. < నెఱపు + -ఇంచు³. **నెఱపు** రూ.చూ. నెరపు. స.క్రి. **1.** కనపరచు, చూపు. భార. విరా. 1.198 ; **2.** చేయు, కావించు. భార. విరా. 2.216 ; **3.** ప్రకటించు, వెలయించు. భార.ఉద్యో. 3.236 ; **4.** నెరవేర్చు, నిర్వహించు. భార.ద్రోణ. 3.220 ; **5.** వ్యాపింపజేయు, ప్రసరింపజేయు. హరి.ఉ. 5.16 ; **6.** అతిశయింపజేయు, పెంపొందించు. ఉ.రా. 6.254 ; వి. **1.** వ్యాపనం ; **2.** (వెంట్రుకలు) తెల్లబడటం; విశ. అధికమైన. త. నిరైప్పు. **నెఱయించు** స.క్రి. వెలయించు. వసు. 6.91. < నెఱయు + -ఇంచు³.

**నెఱవు** రూ.చూ. నెరవు¹. విశ. **1.** పూర్ణమైన, సమృద్ధమైన. రం.రా.యు. 408 పు. 1 పం. ; **2.** విశాలమైన. ఉ.హరి. 4.272 ; **3.** యుక్తమైన, తగిన. మను. 4.27 ; **4.** చతురుడైన, నిపుణుడైన. అష్టమ.క. 1.34 పు. 22 పం. ; **5.** అధికుడైన, ఎక్కువవాడైన. అచ్చ.రా.యు. 33 ; **6.** వ్యాపకమైన ; **7.** వ్యాప్తమైన ; వి. **1.** పూర్తి, నిండుతనం. రం.రా.యు. 409 పు. 31 పం. ; **2.** వ్యాపనం ; **3.** మార్గం.

**నెఱవుకాఁడు** చూ. నెఱయు. వి. **1.** ప్రియుడు, ఇష్టుడు. అచ్చ.బా. 2.16 పు. ; **2.** పూర్ణుడు. **నెఱవేర్చు** రూ. నెరవేర్చు, నెఱవేఱుచు. స.క్రి. **1.** పూర్తినొందించు. ఉ.రా. 2.127 ; **2.** సిద్ధింపచేయు, ఈడేర్చు. కృ.శకు. 3.43. **నెఱవేఱు** రూ. నెరవేరు. అ.క్రి. **1.** సిద్ధించు. రాఘవ. 3.84 ; **2.** ముగియు, పరిసమాప్తమగు. **నెఱవేఱుచు** రూ.చూ. నెఱవేర్చు. స.క్రి. **1.** ముగియచేయు, పూర్తిచేయు ; **2.** ఈడేర్చు, సిద్ధింపచేయు.

**నెఱవేర్చు** చూ. నెఱవు.

**నెఱవేఱు** చూ. నెఱవు.

**నెఱవేఱుచు** చూ. నెఱవు.

**నెఱసు** వి. అశ్వశిక్షాభేదం. పి.శకు. 1.112.

**నెఱా** రూ.చూ. నెఱ. విశ. నిండైన, అధికమైన. హంస. 2.87.

**నెఱి**¹ రూ. నెరి¹. క్రి.విశ.ద్రు. **1.** అందంగా. కు.సం. 2.100 ; **2.** నిజంగా, వాస్తవంగా. భార.విరా. 2.47 ; **3.** చక్కగా, లెస్సగా. భార.ఉద్యో. 4.114 ; వి. **1.** అందం, ఒప్పిదం. కు.సం. 5.123 ; **2.** సౌశీల్యం, సుస్వభావం. భార.విరా. 2.3 ; **3.** పాడి, ధర్మం. భార.ఉద్యో. 2.159 ; **4.** క్రమం. భార.ఉద్యో. 3.34 ; **5.** విధం, రీతి. భార.శాంతి. 4.439 ; **6.** సదాచారం. భార.అను. 3.302 ; **7.** నిగ్గు, కాంతి. ఆం.భా. 3.61 ; విశ. **1.** న్యాయమైన, యుక్తమైన. రం.రా.ఉ. 127 పు. 8 పం. ; **2.** చక్కని, సుందరమైన. శృం.నై. 6.44.

క. నెఱి, నిఱి. వరసక్రమంలో అమర్చటం, అందం, సున్నితత్వం, నిఱి, నిఱు. క్రమంగా తయారు చేసిన, తయారగు, సిద్ధమగు ; నిఱతె, నీఱతె. సక్రమమైన, అందం, ఆకర్షణీయమైన, నిఱిసు. సిద్ధంచేయు. సర్దు; తయారుచేయు, నిఱిగె, నిఱుదె. సక్రమంగా, సర్దుబాటు, నీఱ. సున్నితమైన, అందమైన మనిషి (స్త్రీ), నీఱా, త. నెఱి. దారి, మార్గం, బాట, మతం, ఆదర్శం, నిబంధన, వరుస, నెఱిమై. నిబంధన, నమ్మకం, వాడుక ; మ. ఞెఱి. దారి, నెఱి. తిన్ననిదారి, నీతివర్తనం, నెఱివు. సరియైనమార్గం, సమానత్వం.

**నెత్తఱి**¹ వి. **1.** పెద్దఅల. కాశీ. 5.284 ; **2.** చక్కని వళి, కడుపుమీది అందమైన ముడత. వసు. 3.20. < నెఱి¹ + తఱి³. **నెన్నడ** రూ.చూ. నెన్నడపు. వి. చక్కని నడక, సవిలాస గమనం. దశా. 2.302. < నెఱ + నడ. **నెన్నడపు** రూ. నెన్నడ. వి. చక్కని నడక, సవిలాస గమనం. విక్ర. 4.17. < నెఱ + నడపు. **నెమ్మేను** వి. **1.** చక్కని శరీరం. కళా. 3.145 ; **2.** శరీరం. ఉ.రా. 6.276. < నెఱి + మేను. **నెఱికుఱులు** వి.బ.వ. అలకలు, ముంగురులు. **నెఱికొలుపు** రూ.చూ. నెఱికొల్పు. స.క్రి. చక్కగా తాల్చు, ధరించు. **నెఱికొల్పు** రూ. నెఱికొలుపు. స.క్రి. చక్కగా తాల్చు, ధరించు. విప్ర. 3.79. **నెఱిపట్టు** వి. ఒకరకం పట్టు, మంచిపట్టు. బసవ. 3 పు. 56 పం. **నెఱివడు** రూ.చూ. నెఱిఁబడు. అ.క్రి. సిద్ధించు. **నెఱిఁబడు (-పడు)** రూ. నెరిపడు, నెఱిపడు. అ.క్రి. **1.** యథార్థస్థితికివచ్చు, కుదుటపడు. భార.ఉద్యో. 4.143 ; **2.** సిద్ధించు, నెరవేరు. భార.శాంతి. 3.28.

**నెఱి**² రూ. నెరి². విశ. కుటిలమైన, వంకరైన. భార.ఆది. 7.73 ; వి. **1.** పక్షి ఈకలు మొ॥ వాటి చిక్కు, మెలి. భార.ఉద్యో. 2.112 ; **2.** రెక్క, పక్షం. భార.ఉద్యో.

3.301 ; **3**. వెం(్రుక తేశం. హరి.పూ. 6.177 ; **4**. పక్షం, వైపు. హరి.ఉ. 3.99 ; **5**. వస్త్రపుకుచ్చె, పింజె. జైమిని భా. 2.89 ; **6**. వక్రత, వంకర. కాశ. 1.53.

క. *నెఱి, నిఱి, నెఱిగె, నిఱిగె, నఱిగె, నెఱె, నీఱిగె*. ముడతలు, బట్ట ముడతలు, (చీర, పంచెలు మొ॥) నడుందగ్గర లోపలికి దోపటం, తాడు మీదనుంచి లాగి నప్పుడు బట్టలకి మడతలుపడు ; తు. *నెరి, నెరిగె*. బట్ట ముడత, ముడత ; త. *నెఱి (-వ్-, -న్తె-)*. కెరటంలాగ, (మనిషి జుట్టు) ఉంగరాలుగా ఉండు, *(-ప్ప్-, -త్-)*. కుదించుకొను, ముడుచుకొను (కోపంతో కనుబొమలు), ఉంగరాల జుట్టు, దారి మలుపు, వంపు, *నెఱిప్పు*. కను బొమల అల్లిక ; మ. *ఞెఱి*. ముడత, దోపటం, *ఞెఱియుక*. బట్ట మడత (బొమ్మలకి కట్టేటప్పుడు) పెట్టు, ముడత, *నెఱివు*. మహమ్మదీయుల గౌనుకు ముందు ఉండే మడత.

**నెఱ్ఱటి**[2] వి. **1**. అదముటంవల్ల స్ఫుటంగా ఏర్పడిన రేఖలు, నొక్కులు. కాశీ. 5.284 ; **2**. చక్కని పళి, కడుపు మీది ముడత. వసు. 3.20 ; **3**. పెద్ద అల, కల్లోలం. చంద్రభా. 4.25. <నెఱి[2] + తటి[3]. **నెఱిదప్పు (-తప్పు)** అ.క్రి. పొరగు. ఉ.హరి. 1.53.

**నెఱి**[3] రూ. నెరి[3]. వి. **1**. పరాక్రమం, పౌరుషం. భార.ఆది. 4.202 ; **2**. శక్తి, సామర్థ్యం. భార.ఆశ్ర. 1.73 ; **3**. స్థైర్యం, నిశ్చలత్వం. ప్రభా. 4.48 ; **4**. ఉత్సాహం, కుతూహలం. సారంగ. 2.122 ; **5**. సాహసం, తెగువ. శుక. 3.163 ; **6**. చిరుగడ్డ. ఆం. భా. 3.61 ; క్రి. విశ.(దు. **1**. పూర్ణంగా, నిండుగా. భార. ఆది. 6.154 ; **2**. గట్టిగా, దృఢంగా. పీర.వి. 4.107 ; **3**. మిక్కిలి, అత్యంతం. నరస. 5.173 ; విశ. **1**. శౌర్యం కల. హరి. ఉ. 2.121 ; **2** వాడికల, తీక్ష్ణమైన. పారి. 1.124.

క. *నెఱె (నెఱెద్-, నెఱద్-)*. మొత్తం, నిండు, పూర్తిఅగు, యుక్తమైన, సంభవించు ; కొడ. *నెరె- (నెలెవ్-, నెరన్ద్-)*. యుక్తవయస్కఅగు, నెరె. దేనితో నైనానింపు (సంచి, కుండ మొ॥నవి) ; కో. *నెర్వ్-(నెర్ద్-)*. యుక్తవయసు వచ్చు, పక్వానికివచ్చు ; తొ. *నెఱ్ (నెఱ్థ్-)*. నిండు, పెరుగు, యుక్తవయసువచ్చు.

**నెఱిక** రూ. నెరిక[1]. వి. **1**. పైటపావడా. శృం. నై. 6.22 ; **2**. వస్త్రపుకుచ్చెల, పింజె. సురా. 34 ; **3**. గాగరా, తాబందు. రాజవా. 3.124 ; **4**. చల్లడము, స్త్రీలు తొడుగు కొనే తొడలాగు. అచ్చ. భా. 3.10.

**నెఱికగట్టు (-కట్టు)** స.క్రి. కుచ్చెళ్ళుపోసికట్టు. హర. 3.212. **నెఱికవట్టు (-పట్టు)** అ. క్రి. కుచ్చెళ్ళు పోయు, కుచ్చెళ్ళుపెట్టు. ఆము. 6.128.

**నెఱిడె** రూ.చూ. నెరిడె[2]. వి. శుకరోగ విశేషం.

**నెఱియ** రూ. నెరియ, నెఱ్రై, నెఱ్ర, నెఱ్రి, నెఱ్రె, నెఱె. నెఱ్ఱె. అ.క్రి. **1**. భూమి మొ॥ వాటి బీట, పగులు. బసవ. 4 వ, 902 పం. ; **2**. చీలిక, పాయ. ఆము. 2.67 ; **3**. వివరం, కన్నం.

**నెఱియలువాఱు (-పాఱు)** అ.క్రి. బీటలువారు, పగులు. మను. 4.60.

**నెఱె** రూ.చూ. నెఱియ. వి. **1**. భూమి మొ॥ వాటి పగులు, బీట. చంద్రభా. 1.154 ; **2**. వివరం, కన్నం ; **3**. చీలిక, పాయ.

**నెఱెవాఱు (-పాఱు)** అ.క్రి. బీటలువారు, పగులు. పీర. వి. 3.206. **నెఱెవెట్టు (-పెట్టు)** అ.క్రి. తొలుచు. రంధ్రంచేయు. మను. 2.7.

**నెఱ్ఱె** రూ.చూ. నెఱియ. వి. వివరం, కన్నం. పీర. వి. 4.162.

**నెల**[1] వి. **1**. మాసం, చంద్రగతివల్ల ఏర్పడే కాలమానం. భార. ఆది. 8.115 ; **2**. చంద్రుడు. కు. సం. 4.111 ; **3**. పూర్ణిమ, పున్నమి. షోడ. చ. 6.30 ; **4**. ఋతుకాలం, గర్భధారణకు యోగ్యమైన కాలం. శుక. 2.112 ; **5**. వెన్నెల ; **6**. కర్పూరం ; **7**. స్త్రీశిరోభూషా విశేషం.

కొడ. *నెలచి*. చంద్రుడు, *నెలచిబొళి*. వెన్నెల ; త. *నిలవు, నిలా*. వెన్నెల, చంద్రుడు ; మ. *నిలా, నిలావు* ; తొ. *నెసాఫ్*. వెన్నెల ; గోం. *నలేన్జ్*. చంద్రుడు, విదియ చందమామ, *నెలెన్జ్, లెలేన్జ్*. చంద్రుడు ; కొం. *లేజ్జు*. చంద్రుడు ; కుఇ. *డాన్జు*. చంద్రుడు, నెల, ఋతువు, కాలం ; కువి. *లెన్జూ, లేను*. చంద్రుడు, నెల ; పర్జి. *నెలిఞ్*. చంద్రుడు ; కొలా. *నెల*. చంద్రుడు, నా. *నెల* ; గ. (ఒ). *నెలిజ్*. చంద్రుడు, *నెల్లిన్*. చంద్రుడు.

**నెలకట్టడ** వి. నెలనెలకు డబ్బు ఇచ్చే ఏర్పాటు. రామాభ్యు. 1.107. **నెలకట్టియ** రూ. నెలకట్టె. వి. అర్ధ చంద్రాకారంగా ఉన్న బాణం. ఉ. హరి. 6.50. **నెలకట్టె** రూ.చూ. నెలకట్టియ. వి. అర్ధ చంద్రాకారంగా ఉన్న బాణం. **నెలకన్నెఱుగని** విశ. చందమామను కూడ చూడని. కు. సం. 6.13. **నెలకల్లు** వి. చంద్రకాంతమణి. యయా. 1.70. **నెలకూన** వి. **1**. అర్ధ చంద్రాకృతిగా ఉండేది, నఖక్షతం, నెలవంక. వసు. 6.91 ; **2**. బాల చంద్రుడు. మృత్యు. 3.20. **నెలకొమ్ము** వి. గుండ్రంగా లోపలికి వంపు తిరిగిన కొమ్ము. **నెలచట్టు** వి. చంద్రకాంత మణి. ద్వి. పరమ. వి. 3.146పు. **నెలచూలి** వి. బుధుడు. <నెల[1] + చూలు + -ఇ[9]. **నెలచెలియలు** వి. లక్ష్మి. వేంక. ఆం. దేవ. 7. **నెలజోడు** వి. సూర్యుడు. వేంక. ఆం. దేవ. 12. **నెలతక్కువబిడ్డ** వి. దుర్బలుడు. **నెలతప్పు** అ.క్రి. నెలమసలు, గర్భముగు. **నెలతాలుపు** రూ.చూ. నెలతాల్పు. వి. చంద్రశేఖరుడు, శివుడు. **నెలతాల్పు** రూ. నెలతాలుపు. వి. చంద్రశేఖరుడు, శివుడు. యయా. 3.34. **నెలతునియ** వి. చంద్రకళ. **నెలత్రావదము** వి. చకోరపక్షి, వెన్నెల పులుగు. హ. న. 4.43. **నెలదారి** వి. చంద్రశేఖరుడు, ఈశ్వరుడు. దశా. 2.97. **నెలదారిసింగిణి** వి. పర్వతం. **నెలదిండి (-తిండి)** వి. విధుంతుదుడు, రాహువు. యయా. 2.6. **నెలనుదేగల** విశ. అసాధ్యకార్యాలను నిర్వర్తించ గల జాణనుమా అనేపట్ల నిరసనగా అనేమాట. కు. సం. 8.135. < నెల[1] +-ను + తెచ్చు. +- అ[7] + కల. **నెలపట్టి** వి. సౌమ్యుడు, బుధుడు. ఉ. రా. 7.492. **నెలపట్టు** వి. చంద్రగ్రహణం. **నెలపడి** వి. నెలకునరిపడే నియమిత ద్రవ్యం. ద. హిం. శా. సంపు. 6. శా. సం.

760. క్రీ. శ. 1398. నెలపదినాళ్లు వి.బ.వ. కొద్దిరోజులు. కాశ. 3.38. నెలపాలు వి. మగ శిశువు పుట్టినది మొదలు ఒక నెలవరకు, స్త్రీ శిశువు పుట్టినది మొదలు నలభై రోజుల వరకు తల్లికి ఉండే జాతాశౌచం. నెలపులుఁగు రూ.చూ. నెలపుల్గు. వి. చకోరపక్షి. నెలపుల్గు రూ. నెలపులుఁగు. వి. చకోరపక్షి. చంద్రాంగ. 3.92. నెలపూవు వి. చంద్రుడు. ఉద్భటా. 1.5. నెలపొడుచు అ.క్రి. చంద్రోదయమగు. నెలపొడుపు వి. చంద్రోదయం. శృం. నై. 2.39. నెలబాల వి. ఋతుమతి. నెలబెండ వి. నెలరోజులకు మొగ్గవేసే ఏడాకుల బెండ. నెలమసలు అ.క్రి. నెలతప్పు, గర్భోత్పత్తి అగు, గర్భవతియగు. బసవ. 1.12. నెలమూఁడువానలు కురియు అ.క్రి. దేశం సుభిక్షంగా ఉండు. జైమినిభా. 6.9. నెలమేపరి వి. రాహువు, విధుంతుదుడు, చంద్రుణ్ణితినే వాడు. నెలమొలక రూ. చూ. నెలమొల్క. వి. బాల చంద్రుడు. నెలకూన. నెలమొల్క రూ. నెలమొలక. వి. బాలచంద్రుడు. ఇందు. 1.7. నెలయల్లుడు (-అల్లుడు) వి. మన్మథుడు. ఆం. భా. 1.45. నెలయూటి వి. అడవిలో ఉండే ఒకరకం ఊటిపళ్ళు కాసేచెట్టు. కాశ. 3.69. నెలరేక వి. చంద్రరేఖ. ఇందు. 1.20. నెలఱా రూ. నెలఱాయి. వి. చంద్రకాంతశిల. చంద్రాంగ. 2.7. నెలఱాయి రూ.చూ. నెలఱా. వి. బొ. చంద్రకాంతశిల చలువరాయి. రామాభ్యు. 1.124. నెలలమానిసి వి. గర్భిణి. నెలలు వి.బ.వ. 1. మాసాలు; 2. ప్రసవకాలం. నెలలువిండు అ.క్రి. ప్రసవ సమయమాసన్నమగు. నెలవంక వి. 1. నెలకూన, బాల చంద్రుడు. క్రీడా. 17; 2. నక్షత్రం. వసు. 1.76. నెలవంకకత్తి వి. అర్ధచంద్రాకారం కల కత్తి. చిత్రభా. 3.125. నెలవంకకోల వి. అర్ధచంద్ర బాణం. భాస్క.రా. యు. 836. నెలవంకతూపు వి. అర్ధచంద్రాకారపు బాణం. ద్వి.పరశు.వి. 246 పు. నెలవంకార్చి వి. చేటార్చి, కిటికీల మీద, గుమ్మాల మీద వేసే అర్ధచంద్రాకారపు ఆర్చి. <నెలవంక+ఆర్చి. నెలవతి రూ.చూ. నెలవత్తి. వి. 1. పోకవలుకు. బహుళా. 5.19; 2. పచ్చకర్పూరం పలుకు. నెలవత్తి రూ. నెలవతి. వి. 1. పచ్చకర్పూరం పలుకు. కళా. 7.60; 2. పోకపలుకు. ఆం.భా. 2.167. నెలవంపు విణ. నెలవంక కలది, చంద్రుడు. శశా. 1.25. నెలవారము వి. సోమవారం. నెలవీసము వి. నెలపాలు, చంద్రకళ. నెలవెలుఁగు వి. చంద్రకాంతి, వెన్నెల. నెలవెలుఁగుమేపుఁ బులుఁగు వి. ఏకోరం, చంద్రకాంతిని తినే పిట్ట. యయా. 4.35. నెలసందు వి. పిల్లలకు ఒక నెల మారి మరొక నెలలో పడినప్పుడు కలిగే పీడ. నెలసరవ వి. నెల పెట్టిన తొలిదినం.

**నెల²** రూ.చూ. నెలవు¹. వి. ఉనికిపట్టు. పాండు. 1.153.

నెలకట్టు వి. 1. గచ్చుచేసిన నేల. కు.సం. 9.3; 2. శిలా రత్నాది నిబద్ధ భూమి, కుట్టిమం. భార.విరా. 4.26. క. నెలెగట్టు. నెలకొను రూ.చూ. నెలవుకొను. అ.క్రి. 1. కలుగు, సంభవించు. నిర్వ.రా. 2.4; 2. పాదుకొను, కుదురుపడు. నిర్వ.రా. 8.53; 3. నిలుచుండు, ఉండు. భార.శాంతి. 4.239; 4. కడగు, యత్నించు. రం.రా. ఉ. 34 పు. 13 పం. నెలకొలుపు రూ.చూ. నెలవుకొలుపు. స.క్రి. 1. నిలుపు; 2. పెట్టు. నెలకొల్పు రూ.చూ. నెలవుకొలుపు. స.క్రి. 1. పాదుకొలుపు, నిలుపు. భార. ద్రోణ. 5.248; 2. పెట్టు, ఉంచు. పారి. 2.16. నెలగొయ్య (-కొయ్య) వి. చేతిగూటం, మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య. నెలపంది వి. ముళ్ళపంది. నెలబీర వి. కూర దినుసుగా వాడే ఒకరకం బీర. నెలవీడు వి. ఉనికిపట్టైన పురం. ద.హిం.శా.సం. 10. శా.సం. 646. క్రీ.శ. 1062. కు.సం. 5.105.

**నెలకువ** చూ. నెలయు.

**నెలగ** వి. ధనం. సిం.ద్వా. 2.157.

**నెలఁత** రూ. నెలఁతుక. వి. 1. స్త్రీ, ఆడది. భార.విరా. 1.90; 2. ప్రియురాలు, భార్య. కవిరాజ. 1.96.

**నెలఁతుక** రూ.చూ. నెలఁత. వి. 1. స్త్రీ, ఆడది. భార.విరా. 2.255; 2. ప్రియురాలు, భార్య. కళా. 3.174.

**నెలపు** రూ.చూ. నెలవు¹. వి. స్థానం, చోటు.

**నెలంబద్ద** రూ.చూ. నెలిమిబద్ద. వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టటానికి వాడే పరికరం.

**నెలయు** అ.క్రి. ఉండు. కు.సం. 2.102.

క. నెలసు. ఉండు, నెలె. స్థలం; తు. నిలెపుని. స్థిరంగాఉండు, నిలెవు. ఇల్లు; త. నిలై. శాశ్వతంగా ఉండు; మ. నిలెక్క. నిలుచు.

నెలకువ వి. స్థానం, ప్రదేశం. నిర్వ.రా. 2.11.

**నెలవరి** చూ. నెలవు¹.

**నెలవు¹** చూ. నెలయు. రూ. నెల², నెలపు. వి. 1. మందిరం. కు.సం. 4.28; 2. స్థానం, చోటు. నిర్వ.రా. 8.72; 3. పట్టు, ఊత. భార.ద్రోణ. 3.198; 4. వాసస్థానం, ఉనికిపట్టు. భార.శాంతి. 3.212; 5. నెరవు, వ్యాపనం. హరి.ఉ. 1.33; 6. ఉనికి, స్థితి. హర. 7.22; 7. భాగం, ప్రదేశం. కాశీ. 1.77; విణ. 1. సుందరమైన. హర. 4.82; 2. పరిచితమయిన, అలవాటైన. ఇందు. 2.59.

క. నెలె. నిలబడ్డ స్థలం, స్థలం, నెలసు. ఉండు, స్థిరపడు; కొడ. నెలె. మజిలీచేసే చోటు; తు. నెలె. నిశ్చలం, నెమ్మది; త. నిలై; మ. నిలా; తొ. నెల్ప్. ఇంటిస్థలం.

నెలవరి వి. 1. కాపురం ఉండేవాడు. రామాభ్యు. 5.20; 2. పరిచితుడు, పరిచయం కలవాడు. కువ.చ. 1.20; 3. స్థలజ్ఞుడు, స్థలపరిచయం కలవాడు. సారంగ. 3.239. <నెలవు+-అరి. నెలవుకొను రూ. నెక్కొను, నెలకొను. అ.క్రి. 1. పాదుకొను, స్థిరపడు. కు.సం. 5.123; 2. వ్యాపించు, ప్రసరించు. భార.విరా. 1.23; 3. వర్తిల్లు, ఉండు. భార.శల్య. 2.127; 4. కలుగు, జనించు. మార్క. 4.244. నెలవుకొలుపు రూ. నెక్కొలుపు, నెక్కొల్పు, నెలకొలుపు, నెలకొల్పు, నెలవుకొల్పు. స.క్రి. 1. అమర్చు. కు.సం. 3.26; 2. పాదుకొలుపు, నిలుపు. భార.అను. 3.111; 3. ఉంచు. శృం.నై. 8.112. నెలవుకొల్పు రూ.చూ. నెలవుకొలుపు. స.క్రి. 1. అమర్చు;

**2**. పాదుకొలుపు, నిలుపు ; **3**. ఉంచు. నెలవుపడు అ.క్రి. నెలకొను, నిలుచు. నెలవుపఱుచు స.క్రి. నెలకొల్పు, నిల్పు. చంపూరా. 8.167. నెలవేదు అ.క్రి. స్థానభ్రష్టమగు. వసు. 2.142, కవిక. 6.7. < నెలవు$^{1}$ + ఏదు. నెలవొందు అ.క్రి. నెలకొను, వ్యాపించు. సమీర. 1.67. < నెలవు$^{1}$ + ఒందు.

**నెలవు$^{2}$** రూ.చూ. నెళవు. విశ. పరిచితమయిన, అలవాటయిన. ఇందు. 2.59 ; వి. పరిచయం. చంద్రికా. 4.42.

**నెలవేదు** చూ. నెలవు$^{1}$.

**నెలవొందు** చూ. నెలవు$^{1}$.

**నెలి** రూ.చూ. నెల్లి$^{2}$. వి. అగ్నిమంథం, ఒకరకం కూరాకు చెట్టు. హంస. 4.132.

**నెలింకట్టు** చూ. నెలిమి.

**నెలిమి** రూ. నెలుము. వి. గాలకట్టు, మూడేసి వరసల ఆకులను కలిపి కుట్టే విధానం.

నెలింకట్టు వి. గాలికట్టు, మూడేసి వరసల ఆకులను కలిపి కుట్టే విధానం. నెలిమిబద్ద రూ. నెలంబద్ద, నెలింబద్ద, నెల్లుబద్ద. వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టటానికి వాడే పరికరం. నెలింపోటు వి. గాలికట్టు, మూడేసి వరసల ఆకులను కలిపి కుట్టే విధానం. నెలింపోట్లు వి.బ.వ. పూరిల్లు వేసేటప్పుడు కట్లు కట్టటానికి పై కప్పులో పొడిచే పోట్లు. నెలింబద్ద రూ.చూ. నెలిమిబద్ద. వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టటానికి వాడే పరికరం.

**నెలింపోటు** చూ. నెలిమి.

**నెలింపోట్లు** చూ. నెలిమి.

**నెలింబద్ద** చూ. నెలిమి.

**నెలుము** రూ.చూ. నెలిమి. వి. చూరుకుట్టు బద్దతో ఆకుల్లో పొడిచిన రంధ్రం.

**నెలుపు** రూ.చూ. నెళవు. వి. పరిచయం.

**నెలెడ** రూ.చూ. నెరిడె$^{2}$. వి. కడుపులో మేత పొట్టకు పైన ఉండే నెరిడెకు వచ్చే గుండెవాపు జబ్బు.

**నెల్ల** రూ.చూ. నెల్లి$^{2}$. వి. అగ్ని మంథం, ఒకరకం కూరాకు చెట్టు.

**నెల్లి$^{1}$** చూ. నెలిమి. వి. చూరుకుట్టు బద్దతో ఆకుల్లో పొడిచిన రంధ్రం.

నెల్లిబద్ద వి. చూరుకుట్టు బద్ద.

**నెల్లి$^{2}$** రూ. నెలి, నెల్ల. వి. ఒకరకం కూరాకు చెట్టు, అగ్నిమంథం. E.I. సంపు. 5. శా.సం. 10. క్రీ.శ. 1102, మను. 4.60 (Clerodendron Phlomoides).

క. నెలి. ; కొడ. నెల్లికె. ; తు. నెల్లి. ; త. నెల్లి. ఒకరకం కూరాకు చెట్టు (Phyllanthus Emblica) ; మ. నెల్లి. ; గోం. నల్లే, నెల్లి. ; కొం. నెలి. చింత ; కుఇ. నెడి. ; కువి. లెల్లి. ; పర్జి. నెల్ల.

**నెల్లి$^{3}$** వి. కాంద్రేగు చెట్టు (Flacourtia Romontichi).

**నెల్లి$^{4}$** వి. లేతాకు పచ్చపూలు పూసే సుమారు 25 అడుగుల ఎత్తు పెరిగే చెట్టు (Premna Latifolia).

**నెల్లి$^{5}$** వి. చెడువాసన వచ్చే ఆకుపచ్చతో కూడిన పసుపు పూలు పూసే మొక్క (Premna Integrifolia).

**నెల్లికాయగంధకము** వి. గంధకం కణిక.

**నెల్లిపాషాణము** వి. ఒకరకం పాషాణం.

**నెల్లుబద్ద** రూ.చూ. నెలిమిబద్ద. వి. చూరుకుట్టు బద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టటానికి వాడే పరికరం.

**నెల్లూరికంద** వి. పెద్ద దుంపరకం కంద. వ్యు. నెల్లూరు ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రముఖ నగరం. ఆ ఊరి కంద పెద్దదని ప్రసిద్ధి.

< నెల్లూరు + -ఇ$^{3}$ + కంద.

**నెల్లూరిపిచోడి** వి. సన్నటి తేలిక రకం ధాన్యం. నెల్లూరు ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రముఖ నగరం.

< నెల్లూరు + -ఇ$^{3}$ + పిచోడి.

**నెల్లూరిమొలకొలకులు** వి.బ.వ. నెల్లూరి జిల్లాలో పండించే మొలకొలకులు. నెల్లూరు ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రముఖ నగరం.

< నెల్లూరు + -ఇ$^{3}$ + మొలకొలకులు.

**నెల్లూరునెఱజాణ** వి. సంగనాచి వంటి నేర్పరి, మాటలపొంకం ఉన్న స్త్రీ. నెల్లూరు ఆంధ్ర ప్రదేశ్‌లో ముఖ్యనగరం.

**నెల్లూరుసన్నము** వి. నెల్లూరు జిల్లాలో పండించే సన్నరకం వడ్లు. నెల్లూరు ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రముఖ నగరం.

**నెల్లేయు** చూ. నెలవు$^{1}$. స.క్రి. తిరిగేటట్లు చేయు.

**నెళనెళ** రూ.చూ. నెళినెళి. వి. విరగటం మొ॥ వాటిలోని ధ్వనికి అనుకరణం. హంస. 4.221.

**నెళము** రూ.చూ. నెళవు. వి. **1**. పరిచయం ; **2**. మర్మం.

**నెళవరి** చూ. నెళవు.

**నెళవు** రూ. నెలవు$^{2}$, నెలుపు, నెళము. వి. **1**. రహస్యం, గుట్టు. వేంక.పంచ. 1.248 ; **2**. మర్మ స్థానం, ఆయువు పట్టు. కవిక. 3.222 ; **3**. అభ్యాసం, అలవాటు. చెన్న బసవ. 1.98 ; **4**. పరిచయం ; విశ. యుక్తమైన, సమంజసమైన.

క. నెనపు, నెనవి, నెనవు, నెనహు, నెనహు. ఆలోచన, ప్రతిబింబం, గుర్తుచుకొను, నెనయిసు. ఆలోచించు, నెనసు. ; కొడ. నెన(నెనప్-, నెనత్.) ఆలోచించు, ప్రతిబింబించు ; తు. నెనపు, నెప. ఆలోచన, గుర్తు, భావన, నెనెపుని. ఆలోచించు ; త. నినై(-వ్-, -న్త్-). ఆలోచించు, పరిశీలించు, ప్రతిబింబించు, గుర్తుంచుకొను, ధ్యానించు. అర్థం చేసికొను, భావించు, నినైవు. ఆలోచన, ప్రతిబింబం ; మ. నినయుక. ఆలోచించు, కోరు, నినెక్క. ఆలోచించు ; కో. నెన్వ్(నెన్బ్-). ఆలోచించు ; తొ. నెన్ఫ్(నెన్ద్). ఆలోచించు ; కొం. నెన్. తెలిసికొను.

నెళవరి వి. **1**. పరిచితుడు. హంస. 1.231 ; **2**. మర్మజ్ఞుడు, గుట్టు తెలిసినవాడు. < నెళవు + -అరి.

**నెళినెళి** రూ. నెళనెళ. వి. విరగటం మొ॥ వాటిలోని ధ్వనికి అనుకరణం. ఉ.హరి. 3.72.

**నెవడు** రూ.చూ. నెగడు$^{1}$. అ.క్రి. వెలయు, ప్రసిద్ధికెక్కు. వేంక. పంచ. 4.150.

**నెవము** రూ.చూ. నివబు. వి. **1**. మిష, వ్యాజం. హరి.పూ.

1.83 : 2. తప్పు, నేరం.

**నెవయ(బడు** చూ. నెవయు.

**నెవయు** రూ.చూ. నెగయు. అ.క్రి. ఎగయు, ఎగురు. భార. సభా. 1.255.

**నెవయ(బడు** అ.క్రి. ఎగయు, ఎగురు. కకుత్థ. 5.37. <నెవయు+-అ⁷+పడు.

**నెవలియడుగు** రూ.చూ. నెమలి అడుగు. వి. గృహాది నిర్మాణాలకూ పరికరాల తయారీకి ఉపయోగపడే కలప నిచ్చే చెట్టు (Vitex Alata).

**నెవిబ్లూ** రూ.చూ. నేవీబ్లూ. వి. ఒకరకం నీలం రంగు.

**నెవిలి** రూ.చూ. నమిలి. వి. 1. నెమలి ; 2. కలపనిచ్చే చెట్టు (Holoptelea Integrifolia).

**నెవురు** రూ.చూ. నెమరు. వి. 1. రోమంథం ; 2. స్మృతి, జ్ఞప్తి.

**నెవులు** రూ.చూ. నెగులు. అ.క్రి. బాధ పొందు. కు.సం. 8.9 ; వి. నొగులు, బాధ. హరి.పూ. 3.220.

**నెవ్వ** చూ. నెగులు. వి. 1. దుఃఖం, వ్యథ. భాగ. 10 పూ. 1511 ; 2. అభావం, లేమి. ఆము. 4.245 ; 3. శ్రమ, ఆయాసం. వాల్మీ. 2.130 ; 4. దారిద్ర్యం. అచ్చ.రా. బాల. 3.

**నెవ్వగ** చూ. నెఱ.

**నెవ్వడవరు** చూ. నెఱ.

**నెవ్వడి** చూ. నెఱ.

**నెవ్వలి** చూ. నెఱ.

**నెవ్వీ(గు** చూ. నెఱ.

**నెసుళ్లు** వి.బ.వ. 1. దుర్బలులు. అచ్చ.రా.యు. 119 ; 2. ఒక జాతి కీటకాలు, ఈసుళ్ళు.

**నే¹** రూ.చూ. నేను, సర్వ.ద్రు. నేను. నిర్వ.రా. 2.43.

**నే²** రూ.చూ. నేయి. వి. ఘృతం, నేయి. భార.ఉద్యో. 2.243.

**నేదొప్ప** రూ. నేతిదొప్ప. వి. నేయిపోసిన గిన్నె. పాంచాలీ. 4.56. **నేపుటి** వి. నేతిపాత్ర. దాక్షారామ శాసనం. క్రీ.శ. 1038. **నేబీఱ** రూ.చూ. నేతిబీఱ. వి. మామూలు బీరకంటె కాయ చిన్నదిగాను, తొక్క నునుపుగాను ఉండే బీర. **నేమాన** వి. మానెడునెయ్యి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 280. క్రీ.శ. 1556.

**నేక్** వి. 1. యుక్తి; 2. నేర్పు.

ఇం. *Knack*. చమత్కారం, యుక్తి.

<ఇం. Knack.

**నేకీ** వి. మడిలో రాలిన చేని కోసిన తర్వాతి పంట.

హిం.ఉ. నేకీ. మంచితనం.

**నేగాల్పు** రూ.చూ. నాగాల్పు. వి. నారకాల్పు, ఆములో కుండలు కాలీకాలని స్థితి.

**నేచరు** వి. 1. ప్రకృతి ; 2. స్వభావం.

ఇం. *Nature*. ప్రకృతి, విశ్వం, రీతి.

<ఇం. Nature.

**నేచ్చాగు** చూ. నేఁత.

**నేచ్చిప** చూ. నేఁత.

**నేచ్చులిగె** చూ. నేఁత.

**నేజ** రూ.చూ. నేజా. వి. 1. చిల్లకోల, తోమరం. చంద్రికా. 2.83 ; 2. ఈటె, కుంతం, బల్లెం. దశా. 2.300.

**నేజము** రూ.చూ. నేజా. వి. 1. చిల్లకోల, తోమరం. నరస. 3.33 ; 2. ఈటె.

**నేజా** రూ. నేజ, నేజము. వి. 1. ఈటె, కుంతం, బల్లెం. యయా. 2.27 ; 2. చిల్లకోల. తోమరం. భాను. 3.23.

హిం. నేజా. బల్లెం : ఉ. నైజా ; పార. నేజా. చిన్న బల్లెం.

<పార. నేజా.

**నేజేఅంచు** వి. బొటనవేలెడు వెడల్పు నేతలో రెండు రంగులు వచ్చేట్టు నేసిన అంచు.

హిం.ఉ. నేజా. గుర్తు.

**నే(జెల్ల** రూ. ఏ(జెల్ల. అవ్య. సంతాప సూచకం. పు. నేను చచ్చిపోను. హరి.పూ. 5.154.

<నేను+చెల్లు+-అ⁷.

**నేటించు** చూ. నేటు.

**నేటితోతీఱు** చూ. నేఁడు².

**నేటు** విశే. 1. నర్మగర్భం, మేలంతో కూడినది. రాజవా. 1.135 ; 2. తిన్ననిది, ఋజువైనది. అచ్చ.రా.యు. 70 ; 3. దృఢం, గట్టిది. అచ్చ.రా.యు. 129 ; వి. 1. నిశ్చయం, నిర్ధారణం. నీలా. 2.41 ; 2. లెక్క, గణన. శుకచ. 2.143 ; 3. సత్యం, నిజం. ఆం.భా. 1.118 ; 4. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ. వాటిని కదలకుండా నిలపటానికి రెండు కర్రలను పై వైపున కట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలిక ఏర్పాటు.

క. నేటు.

**నేటించు** స.క్రి. సత్యం చెప్పు. అప్ప. 2.351 ; అ.క్రి. 1. చాగిలబడు ; 2. దృఢపడు. <నేటు+-ఇంచు³. **నేటుకొను** అ.క్రి. అతిశయించు, విజృంభించు. నీలా. 3.26. **నేటుచేయు** రూ. నేటుసేయు. స.క్రి. 1. నిశ్చయించు, దృఢపరుచు, నిర్ణయించు. రసిక. 6.100 ; 2. పాటిచేయు. గణించు. అచ్చ.రా.అయోధ్యా. 109. **నేటుసేయు(-చేయు)** రూ.చూ. నేటుచేయు. స.క్రి. 1. నిశ్చయించు, దృఢపరుచు, నిర్ణయించు. ద్వి.సార.చ. 3.100 పు. 16 పం ; 2. పాటి చేయు, గణించు.

**-నేండు** రూ.చూ. నాయడు. వి. ప్రభువు. ద.హిం.శా. 10 పు.

**నేంద్రగట్టె** వి. మొక్క పూర్తిగా ఎండిపోయే వరితెగులు.

**నేంద్రగడ్డి** వి. నేరెడుగడ్డి, ఏటా లేచి పెరిగే కలుపుమొక్క (Ischaemum laxum).

**-నే(డు¹** రూ.చూ. నాయ(డు. వి. శూద్రుల్లో కొందరి పేరు చివరలో ఉండే బిరుదు. ద.హిం.శా. సంపు. 4 శా.సం. 782. క్రీ.శ. 1269.

**-నే(డు²** వి.శా. 1. ఈ దినం, జరుగుతున్న దినం. భార. ఆది. 1.115 ; 2. ఇప్పుడు, వర్తమానకాలం. భార. ఉద్యో. 4.35.

కొడ. మొనియాండి. మొన్న, నిన్న-స్ని. నిన్న ; త. ఞాన్ఱు. సమయం, రోజు, ఞాన్ఱై. ఆ సమయంలో ; మ. ఞాన్ను. దినం ; గోం. నెన్డ్ (స్త్రీ) నెర్ ; కొం. నేన్ఱు.

కుఇ. నేఞ్జు ; కువి. నిఞ్జూ, నీఞ్జు.

**నేటితోఁతీఱు** అ.క్రి. ఇంతటితోసరి. హంస. 3.151.

**నేతికుండపై ఎలుక** చూ. నేయి.

**నేతిగోకుడు** చూ. నేయి.

**నేతిచాలు** చూ. నేయి.

**నేతిదాక** చూ. నేయి.

**నేతిదొప్ప** చూ. నేయి.

**నేతిపడి** చూ. నేయి.

**నేతిపిడత** చూ. నేయి.

**నేతిపుట్టగూగు** చూ. నేయి.

**నేతిబీర** చూ. నేయి.

**నేతిబీఱ** చూ. నేయి.

**నేతిబీఱకాయ** చూ. నేయి.

**నేతిబీఱపస** చూ. నేయి.

**నేతిబీఱాకు** చూ. నేయి.

**నేతిబుట్టుపావు** చూ. నేయి.

**నేతిబొడ్డ** చూ. నేయి.

**నేతిమినుము** చూ. నేయి.

**నేతివటపావు** చూ. నేయి.

**నేతివట్టుపావు** చూ. నేయి.

**నేతివసంతము** చూ. నేయి.

**నేతులుట్టఁగ** చూ. నేయి.

**నేత్తాడు** చూ. నేఁత.

**నేత్రపట్టు** వి. పట్టువస్త్రభేదం. సిం. ద్వా. 3.188.

సం. నేత్ర-. వస్త్రం, బట్ట.

<సం. నేత్ర- + పట్టు (మిశ్రస.)

**నేత్రువట్టము** వి. స్వాధీనపత్రం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 1014.

సం. నేతృ-. నాయకుడు.

**నేత్సివ** చూ. నేఁత.

**నేప** వి. ఒకరకం కలుపుమొక్క.

**నేదంచుచీర** వి. రెండేసి కొలకుల చొప్పున పసుపు, ఎరుపు పోగులు ఎడం ఎడంగా వచ్చేట్టు నేసినచీర.

<నేద + అంచు + చీర

**నేదురునేల** వి. గోదావరి నీళ్ళు నిలిచేనేల.

**నేద్దాక** చూ. నేయి.

**నేనవి** వి. కలుపు.

**నేని** రూ.చూ. ఏని. అవ్య.ద్రు. అవ్యర్థకం. భార.ఆది. 7.141.

**నేను** చూ. ఏను[1]. రూ. నే[1]. సర్వ. ద్రు. నాశబ్దప్రథమైక వచనం. భార. సభా. 2.122.

క. నాను, ఆన్, నాన్. నేను ; కొడ. న, ని, న ; తు. యాను, యేను ; త. నాన్, యాన్. నేను ; మ. ఞాన్ ; కో. ఆ. న్. బంధుత్వం ; తొ. ఒ.న్ ; గోం. అనా, నన్న, ననా ; కొం. నాన్ ; కుఇ. అను ; కువి. నానూ, నాను ; పర్జి. ఆన్ ; కొలా. అ. న్ ; నా. ఆన్ ; గ. ఆన్ ; ఒల్లా. ఆన్ ; కురు. ఏన్ ; మాల్తో. ఎన్ ; బ్రా. ఈ. చూ. త. యామ్.

<మూ. ద్రా. *యాన్.

**నా** సర్వ. నేనుశబ్దం యొక్క తృతీయాది విభక్త్యంగం.

**నేఁత** చూ. నేయు. వి. **1.** బట్టలు నేయటం. ఉ. రా. 6.160 ; **2.** ఇళ్ళు నేయటం. అచ్చ. రా. బాల. 59 ; **3.** కుప్ప కట్టుబడి, గడ్డికుప్ప నేసేటప్పుడు పడుగు అద్దమోటు కట్టిన తర్వాత అంతటినీ చొప్పతో కప్పుకుంటూ రావటం ; **4.** మగ్గానికి అమర్చిన పడుగులో పై పోగులకు, కింది పోగులకు మధ్య పేకదారం వేసి బట్ట తయారు చెయ్యటం ; **5.** మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు ; **6.** నేయవలసిన పడుగు ; **7.** ఆకుపేర్పు. ఆకుతో కప్పటం ; **8.** కప్పుపెంకు, ఇల్లుకప్పటానికి వాడేమామూలు పెంకు.

**నేచ్చాగు** రూ. చూ. నేఁతసాగు. వి. **1.** మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు ; **2.** దండె దగ్గరి నుంచి చివరివరకూ చాపిన పడుగునూలు. **నేచ్చివ** రూ.చూ. నేఁతచివ్వ. వి. దండెదగ్గరి పడుగుపోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం. **నేచ్చులిగె** రూ.చూ. నేఁతనులిగె. వి. గొంగడినేత చివరికి వచ్చినప్పుడు మూరెడు మిగిలిన పడుగులో వేసేదారం దూర్చిన చిన్న గొట్టం. **నేత్తాడు** రూ.చూ. నేఁతతాడు. వి. **1.** నేతమోకు, మగ్గంమీద నేతపడుగు బిఱ్ఱుపెట్టేలావు పాటితాడు ; **2.** నేతపగ్గపు తాడు, గొంగడి నేసేమగ్గం బిగించేతాడు. **నేత్సివ** రూ. చూ. నేఁతచివ్వ. వి. దండె దగ్గరి పడుగు పోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం. **నేఁతఎచ్చు** స.క్రి. నేతపెరుగు, బట్టకు ఒక వైపు నేత ఎక్కువగు. **నేఁతకట్టె** వి. నవారు నేసేటప్పుడు పడుగులో వేసిన పేకపోగు దట్టించే కొయ్య పని ముట్టు. **నేఁతకండె** వి. రాట్నం మీద జొన్నదంటు ముక్కకు చుట్టిన నూలు. **నేఁతకాఁడు** రూ. నేఁతగాఁడు. వి. **1.** తంతువాయుడు, బట్టలు నేసేవాడు. వేంక. పంచ. 1.214 ; **2.** పూరిల్లు కప్పేపనివాడు. **నేఁతకుంగు** అ.క్రి. నేతవిరుగు, బట్టకు ఒకవైపు నేతఎక్కువ వచ్చు. **నేఁతకొమ్ము** వి. పడుగుపై పోగులకు, కింది పోగులకు మధ్య వేసేపేక దారం కండె అమర్చి, చేత్తో విసిరే నాడె. **నేఁతకోయు** స.క్రి. నేసినబట్ట మగ్గంమీదినుంచి తీసేముందు బద్దెవదలి కోయు. **నేఁతగాఁడు** రూ.చూ. నేఁతకాఁడు. వి. **1.** పూరిల్లు కప్పేపనివాడు ; **2.** నేతపని చేసేవాడు. **నేఁతగాను** వి. పెడకోలచక్రం, పెడకోలనుమోసే కొయ్యచక్రం. **నేఁత గొట్టం** వి. పేకగొట్టం, గొంగడి నేసేటప్పుడు మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురు గొట్టం. **నేతఁచాపు** వి. మగ్గానికి అమర్చి నేతబయలులో చాపిన పడుగునూలు. **నేఁతచివ్వ** రూ. నేచ్చివ, నేత్సివ. వి. దండెదగ్గరి పడుగుపోగులు నెరపటానికి అచ్చుదగ్గర నేతపడుగులో దూర్చిన సన్నబెత్తం. **నేఁతచెక్రం** వి. పెడకోల చక్రం, పెడకోలను మోసే కొయ్య చక్రం. **నేఁతతగిలించు** స.క్రి. నేతపడుగు మగ్గానికి తగిలించు. **నేఁత తాడు** రూ. నేత్తాడు. వి. **1.** నేతమోకు, మగ్గంమీది నేత పడుగును బిఱ్ఱుపెట్టే లావుపాటి తాడు ; **2.** నేతపగ్గపుతాడు, గొంగడి నేసేమగ్గం బిగించే తాడు. **నేఁతదిగిపోవు** అ.క్రి.

నేతపూర్తి అగు. **నే(తదిగ్గోయు** స.క్రి. నేతబట్ట చివరకచ్చి కోసి మగ్గంమీదినుంచి తీసివేయు. <నేత+దిగు+-అ[7]+కోయు. **నే(తనాడి** రూ.చూ. నే(తనాడె. వి. నేతనేసేటప్పుడు, పడుగుపై పోగులకు కిందిపోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు. **నే(తనాడె** రూ. నే(తనాడి. వి. నేతనేసేటప్పుడు, పడుగుపైపోగులకు కిందిపోగులకు మధ్య వేసేపేకదారంకండె అమర్చిన పనిముట్టు. **నే(తనేయు** స. క్రి. కప్పుకట్టు, గడ్డికుప్ప నేసేటప్పుడు పడుగుఅద్దు, మోటుకట్టినతరవాతఅంతటినీచొప్పతో కప్పుకుంటూ వచ్చు. **నే(తపగ్గపుతాడు** వి. నేతతాడు, గొంగడి నేసే మగ్గం బిగించే తాడు. **నే(తపలక** వి. **1**. చేతిమగ్గం పన్నెపై బిగించిన చెక్క. ఆం.భా. 2.286; **2**. మర మగ్గంలో పన్నె బిగించిన కొయ్య చట్రం; **3**. మట్టప్పలక, ఆకు కప్పుమీది మిట్టపల్లాలు సరిచేసే చెక్కసాధనం. **నే(తపురుగు** రూ.చూ. నే(తపురువు. వి. సాలెపురుగు. వేమ. 3.159. **నే(తపురువు** రూ. నే(తపురుగు. వి. శ్రీ, సాలెపురుగు. కవిక. 6.172. **నే(తపూ(బోడి** వి. సాలెపడుచు. హంస. 2.28. **నే(తపెంకు** వి. కప్పు పెంకు, ఇల్లు కప్పటానికి వాడే మామూలు పెంకు. **నే(తపెరుగు** అ.క్రి. నేత ఎచ్చు, బట్టకు ఒకవైపు నేత ఎక్కువ వచ్చు. **నే(తబద్ద** వి. చూరుకుట్టుబద్ద, పూరింటి ఆకు కప్పును కుట్టటానికి వాడే పరికరం. **నే(తబయలు** రూ. నే(తబయిలు. వి. మగ్గం బయలు, ఇంట్లో నేతపనికి కేటాయించిన చోటు. **నే(తబయిలు** రూ.చూ. నేతబయలు. వి. మగ్గంబయలు, ఇంట్లో నేతపనికి కేటాయించిన చోటు. **నే(తముల్లు** వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపల్ల. **నే(తమోకు** వి. నేతలాడు, మగ్గంమీద నేత పడుగును బిర్రుపెట్టే లావుపాటి తాడు. **నే(తయంత్రము** మి.వి. మగ్గం. ఆం.భా. 1.286. **నే(తరి** వి. నేతగాడు. ఆం.భా. 2.283. <నేత+-అరి. **నే(తలాక** వి. మగ్గంలాక, నేతపడుగులో పై పోగులకు కింది పోగులకు మధ్య దూర్చిన వెదురుబద్ద. **నే(తవాడిచేయు** స.క్రి. మగ్గందగ్గర శుభ్రంచేసి, నేత మొదలు పెట్టటానికి మగ్గం సిద్ధంచేయు. **నే(తవిరుగు** స.క్రి. నేతకుంగు, బట్టకు ఒకవైపు నేత తక్కువవచ్చు. **నే(తసందు** వి. నేసిన బట్ట దగ్గరినించి, పన్నెవరకూ మగ్గంమీద ఉన్న పడుగు. **నే(తసాగు** రూ. నేచ్చాగు, నేసాగు. వి. **1**. మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగు నూలు; **2**. దండె దగ్గరినుంచి చివరివరకూ చాపిన పడుగునూలు. **నే(తసులిగె** రూ. నేచ్చులిగె. వి. గొంగడినేత చివరికి వచ్చినప్పుడు, మూరెడు మిగిలిన పడుగులో వేసే దారం దూర్చిన చిన్న గొట్టం. **నేసాగు** రూ.చూ. నే(తసాగు. వి. **1**. మగ్గానికి అమర్చి, నేతబయలులో చాపిన పడుగునూలు; **2**. దండె దగ్గరినుంచి, చివరివరకూ చాపిన పడుగునూలు.

**నేపరాయి** వి. సర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రని రాయి.

**నేపాలాలు** రూ.చూ. నేపాళాలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

**నేపాల్‌పొగాకు** వి. ఒకరకమైన పొగాకు.

సం. నేపాళ-. ఒకదేశం.

<సం. నేపాళ-+పొగాకు.

**నేపాళవేము** వి. మందుల్లో ఉపయోగపడే నూనెనిచ్చే చెట్టు (Croton Tiglium).

**నేపాళాలు** రూ. నేపాలాలు. వి.బ.వ. ఒకరకం వడ్లు.

సం. నేపాళ-. ఒకానొకదేశం, వృక్షవిశేషం.

<సం. నేపాళ-+-ము+-లు (అర్థవిపరి.).

**నేప్తోల్** రూ.చూ. నెప్తాల్. వి. తడిరంగు, చన్నీళ్ళలో కలిపి, నూలుకు వేసేరంగు.

**నేబాబు** రూ.చూ. నవాబు. వి. ప్రభువు.

**నేబు** వి. పన్నెండు కాసుల నాణెం. చంద్రరే. 2.34.

**నేమకము** వి. నేమం, నియమం. ఆనంద. పీఠి. 122.

సం. నియామక-. నియమించబడ్డది, అడ్డుపరచబడ్డది.

<సం. నియామక-.

**నేమగా(డు** చూ. నేమము.

**నేమతువన్నె** రూ. నేమతొన్నె. వి. చేకిలెట్టు వన్నె మాదిరి రంగు.

**నేమతొన్నె** రూ.చూ. నేమతువన్నె. వి. చేకిలెట్టువన్నె మాదిరి రంగు.

**నేమబంతి** వి. దక్కను మొ. చోట్ల 3 అడుగుల ఎత్తువరకు పెరిగే మొక్క (Blepharispermum subsessile).

**నేమము** రూ. నీమము. వి. వ్రతం, విధిగా చేయవలసిన పని, నియమం, కట్టుబాటు. భార. సభా. 1.49.

సం. నియమ-. వ్రతం; ప్రా. ణిఅమ-; ఆ.మా. నేమ. కార్యం; పా. నియమ; అప. ణియమ;

క. నేమ, నేమవు. నియమం; తు. నేయమ, నేమ, నేమక; త. నేమ; మ. నేయమం. నేమం.

<ప్రా. ణిఅమ-.

**నేమగా(డు** వి. నియమవంతుడు. ఘటికా. 2.176. **నేమించు** స.క్రి. నియమించు. యయా. 3.34. <నేమము+-ఇంచు[3].

**నేమించు** చూ. నేమము.

**నేము**[1] స.క్రి. **1**. (ధాన్యం మొ. నవి) చేటలో పోసి అటు ఇటు తిప్పు; **2**. నీళ్ళలో వేసి బియ్యాన్ని చేత్తో అటు ఇటు కదిలించి రాళ్ళు అడుగున చేర్చు; **3**. అలుకు, రుద్దు, పూయు.

త. నేమ్బు (నేమ్బి). చెరుగు, నోమ్బు (నోమ్బి-). చెరిగి వేరుచేయు (బియ్యం నుంచి రాళ్ళు); మ. నేంవుక. ధాన్యం చెరుగు, నావుక. బియ్యంలో రాళ్ళు ఏరు; గోం. ఏమానా. ధాన్యం మొ. వాటి పొట్టుతీయు; కుఇ. ఏంబా (ఎంబి). చెరిగి ధాన్యంనుంచి పొట్టుతీయు; కురు. నాబ్నా. చెరుగు (ధాన్యం).

**నేము**[2] రూ.చూ. మేము. సర్వ. మేము.

**నేంబోతికానాకుండ** రూ.చూ. నబోతికానేకుండ. వి. పెద్ద నగారా లాగా ఉండే వాద్యానికి వాడే మట్టికుండ.

**నేయము**[1] రూ.చూ. నెయ్యము. వి. స్నేహం, మైత్రి. రం.రా. యు. 302. పొ. 20. పం.

**నేయము**[2] రూ.చూ. నాయము. వి. ధర్మం.

**నేయి** రూ. నెయి, నెయ్యి, నే[2]. వి.ఔ. అనా. **1**. ఘృతం,

ఆజ్యం. భార. ఆది. 6.291 ; **2.** తైలం, చమురు. భార. అను. 1.138 ; **3.** కొవ్వు, మజ్జ. చిత్రభా. 3.122.

క. నెయ్, నేయ్. నెయ్యి ; కొడ. నెయ్ ; తు. నేయి. నెయ్యి, కొవ్వు, చమురు ; త. నెయ్. వెన్న, నెయ్యి, నూనె, చమురు ; కొవ్వు, తేనె, స్వయమ్. నెయ్యి, నూనె ; మ. నెయ్. జిగురుపదార్థం, కొవ్వు, నూనె, నెయ్యి ; కో. నెయ్. నెయ్యి ; తొ. నియ్ ; గోం. నీ ; కుఇ. నిజా. నూనె ; కువి. నీయూ ; పర్జి. నెయ్. చమురు, కొవ్వు ; కొలా. నెయ్. నెయ్యి, పాల్ నూనె. నెయ్యి ; నా. నెయ్. నెయ్యి ; గ. నెయ్, నెయ్యూ ; ఒల్లా. నెయ్ ; కురు. నేత. జిడ్డు, కొవ్వు ; మాల్తో. నెన్య. జంతువులకొవ్వు.

< మూ. ద్రా. *నెయ్.

**నేతికుండపైఎలుక** వి. రుచిమరిగి వదలనివాడు. నిర్వ. రా. 6.2. **నేతిగోకుడు** వి. **1.** వెన్న కాచాకా కింద ఏర్పడిన మాడు ; **2.** చమురు అడుగున తేలేమడ్డి ; **3.** గానుగ ఆడిన తర్వాత మిగిలిన మడ్డి. **నేతిచాలు** వి. ఆజ్యధార, హవిస్సు. **నేతిదాక** రూ. నేద్దాక. వి. నేతిపిడత, నెయ్యి పోసుకొనే మట్టిపాత్ర. **నేతిదొప్ప** రూ.చూ. నేదొప్ప. వి. నేయిపోసినగిన్నె. **నేతిపడి** వి. కొలమానం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 293 క్రీ. శ. 1241. **నేతిపిడత** రూ. నెయ్యిపిడ్త. వి. నేతిదాక, నెయ్యిపోసుకొనే మట్టిపాత్ర. **నేతిపుట్టగూసు** వి. పుట్టపైలేచే సన్నని పుట్టగొడుగు. **నేతిబీర** రూ.చూ. నేతిబీఅ. వి. మామూలు బీరకంటె కాయచిన్నది గాను, తొక్క నునుపుగాను ఉండేబీర (Aegyptica). **నేతిబీఅ** రూ. నేతబీర, నేబీఅ. వి. ఘృతకోశాతకి, ఒక రకం బీరకాయ. విష్ణుపు. 4.274. **నేతిబీఅకాయ** వి. అన్వర్థంకానిది, నేతిబీరకాయలో నేయి లేనట్లే సార్థకం కానప్పుడీ వ్యవహారం ఉంది. పాండు. 3.13. **నేతిబీఅపస** వి. నేతిబీరకాయ పసవంటి పసకలది. కవిరాజ. 3.131. **నేతిబీఅకు** విణ. వ్యర్థం. < నేతిబీఅ + ఆకు. **నేతిబుట్టుపావు** రూ.చూ. నేతివట్టుపావు. వి. ఆయిగురిగి, నెయ్యి కరగటానికి వాడే చిన్న మట్టిపాత్ర. **నేతిబొడ్డ** వి. ఒకరకం కంచెమొక్క (Ficus species). **నేతిమినుము** వి. నునుపుగా, మెరుపుగా ఉండే ఒకరకం మినుము. **నేతివటపావు** రూ.చూ. నేతివట్టుపావు. వి. ఆయిగురిగి, నెయ్యికరగటానికి వాడే చిన్నమట్టిపాత్ర. **నేతివట్టుపావు** రూ. నేతిబుట్టుపావు, నేతివటపావు. వి. ఆయిగురిగి, నెయ్యికరగటానికి వాడే చిన్నమట్టిపాత్ర. **నేతివసంతము** వి. నేతితో ఆడే వసంతం. భాగ. 10పూ. 809. **నేతులుట్టఁగ** విణ. చవులూరగ. పండి. చ. ప్రథ. 1.180పు. < నేయి + -లు + ఉట్టు². + -అ⁷ + అగ + -అ⁷. **నేద్దాక** రూ.చూ. నేతిదాక. వి. నేయిపిడత, నెయ్యిపోసుకొనే మట్టిపాత్ర. **నేయిపూసినకత్తి** వి. పైకిఆకర్షకంగా ఉండి ద్రోహంచేసేది. వేంక. పంచ. 1.229.

**నేయించు** చూ. నేయు.

**నేయు** స.క్రి. **1.** నేతచేయు, వయనంచేయు. శృం. నై. 1.48 ; **2.** పూరింటికి తుంగ విడవలితో కప్పుగాపేర్చు ; **3.** అల్లు, కూర్చు.

క. నెయ్, నెయి, నే, నేయ్, నేయి, నేయు. నేత నేయు ; తు. నెయుని, నేపిని, నేయుని, నైపిని. నేయు, సాలెపురుగు వలె అల్లు, నెయిపుని. జడవలె అల్లు ; త. నెయ్. నేయు ; మ. నెయ్క. నేయు, అల్లు ; కో. నెచ్. నేయు ; తొ. నిథ్. నేయు, నెస్ ; కుఇ. ఏస్పు ; నేయు ; కువి. నెహ్. అల్లు, నేహ్ ; కురు. ఎస్పు. నేయు ; మాల్తో. ఎస్. అల్లు.

< మూ. ద్రా. *నెచ్ *ఎచ్- > *నేయ్.

**నేయించు** అ. క్రి. నేసేటట్లుచేయు. < నేయు + -ఇంచు³.

**నేయుఁడు** రూ.చూ. నెయ్యుడు. వి. స్నేహితుడు.

**నేర** రూ.చూ. నెరము². వి. నెరిమిడి, రెండుగుర్తులమధ్య దూరం.

**నేరక** చూ. నేరుచు.

**నేరడ** రూ.చూ. నేరేడు. వి. ఒకరకం పళ్ళచెట్టు (Eugenia Jambolana).

**నేరడి** రూ.చూ. నేరేడు. వి. తలుపులు మొదలైనవాటి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే పెద్దచెట్టు (Eugenia Jambolana).

**నేరనిమంగ** చూ. నేరుచు.

**నేరపెట్టు** చూ. నేరము.

**నేరమి** రూ.చూ. నేరము. వి. **1.** దోషం, తప్పు. భార. సభా. 2.224 ; **2.** తెలియమి, అజ్ఞానం. భార. ఆరణ్య. 5.311.

**నేరమిపెట్టు** (-పెట్టు) రూ. నేరపెట్టు. స.క్రి. తప్పుపట్టు. ఉ.హరి. 1.67.

**నేరము** రూ. నేరమి. వి. తప్పు, అపరాదం. భార.ఆది. 7.237.

త. నేరమ్. తప్పు.

**నేరపెట్టు** రూ.చూ. నేరమిపెట్టు. స.క్రి. నెరపెట్టు, దోషి అనిచెప్పు. వేంక.పంచ. 4.494. **నేరముకొను** అ.క్రి. తప్పుపట్టు. బిల్హ. 3.158. **నేరములెన్ను** అ.క్రి. తప్పులు పట్టు. < నేరము + -లు + ఎన్ను. **నేరమెన్ను** అ.క్రి. తప్పుపట్టు. వర. రా. కిష్కిం.పు. 196. పం.7. < నేరము + ఎన్ను. **నేరఁబోతు** వి. తెలియనివాడు.

**నేరమెన్ను** చూ. నేరము.

**నేరఁబోతు** చూ. నేరము.

**నేరఁబోలు** చూ. నేరుచు.

**నేరళ్లమూల** వి. దక్షిణదిక్కు.

**నేరాజు** విణ. సరిగతో నేసినది, జరబాబు, కలధౌతవస్త్రం. ఆం. భా. 2.155.

ఉ. నర్‌జుల్. పట్టుబట్ట ; పార. నర్‌జుల్. అబిసేనియాలో తయారైన పట్టువస్త్రం.

< ఉ. నర్‌జుల్.

**నేరిమి** రూ. నేర్మి. వి. **1.** సామర్థ్యం. భార. విరా. 1.219 ; **2.** శక్తి ; **3.** ప్రావీణ్యం.

త. నేర్మై. ఒప్పందం.

**నేరు**¹ వి. **1.** తిన్నన ; **2.** అభిముఖం.

క. నేర్. తిన్నన, యుక్తత, మర్యాద ; తు. నేరె. తిన్నన ; త. నేర్. తిన్నన ; మ. నేర్. తిన్నన.

<త. నేర్.

**నేరుగా** క్రి.విశ. ద్రు. **1.** తిన్నగా, చక్కగా ; **2.** స్వయంగా, ముఖవచనంగా.

**నేరు**[2] రూ.చూ. నారు. వి. పొలంలో నాటటానికి పెంచిన వరి, మిరప మొ॥ వాటి మొలకలు.

**నేరుచు** రూ.చూ. నేర్చు. స.క్రి. **1.** తెలియు, ఎరుగు. భార. ఆది. 6.110; **2.** అభ్యసించు, కరచు ; అ.క్రి. **1.** సమర్థమగు, శక్తమగు. భార.విరా. 2.130 ; **2.** సంభవించు. భార.భీష్మ. 1.54 ; **3.** ఇష్టపడు, సమ్మతించు.

**నేరక** అవ్య. తెలియక. భార.ఆది. 1.43. **నేరనిమంగ** వి. ఏమెరుగని స్త్రీ. **నేరఁబోలు** అ.క్రి. సాధ్యమగు. భార.ఆది. 1.19. **నేరుచుకొను** రూ. నేర్చుకొను అ.క్రి. నేర్చుకొను.

**నేరుదొయ్య** రూ.చూ. నారుదొయ్య. వి. నారు పోసిన నలుచదరపు భూభాగం.

**నేరువరి** చూ. నేరుపు.

**నేరుపు** రూ.చూ. నేర్పు. వి. **1.** ప్రావీణ్యం, చతురత, సామర్థ్యం, శక్తి. ఉ.హరి. 3.116, శృం.నై. 6.117. **2.** రీతి, విధం ; స.క్రి. **1.** అభ్యసింపచేయు ; **2.** ఎత్తుపల్లాలు సరిచేయు, చదును చేయు.

**నేరువరి** రూ. చూ. నేర్పరి. వి. నేర్పుకలవాడు, చతురుడు. ప్రబోధ. 1.27. **నేరుపుకాఁడు** రూ.చూ. నేర్పుకాఁడు. వి. నేర్పరి, నేర్పు కలవాడు. **నేరుపులాఁడి** రూ. నేర్పులాఁడి. వి. జాణ. **నేరుపులాఁడు** రూ. నేర్పులాఁడు. వి. నేరుపుకాఁడు. అచ్చ.రా. బాల. 8.

**నేరువు** స.క్రి. ఎండటానికి ధాన్యాదులను పలచగా నేలమీద పోయు.

**నేరెటిదీవి** చూ. నేరెడు.

**నేరెటేఱు** చూ. నేరెడు.

**నేరెడు** రూ.చూ. నేరేడు. వి. దూలాలు, దర్వాజాలు, తలుపులు మొదలైన వాటి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే పెద్ద చెట్టు. ఒకరకం పళ్ళ చెట్టు. మార్క. 4.144 (Eugenia Jambolara).

**నేరెటిదీవి** రూ. నేరెడుదీవి, నేరేడుదీవి. వి. జంబూద్వీపం. శృం.నై. 5.76. **నేరెటేఱు(-ఏఱు)** వి. జంబూనది. మను. 2.36. **నేరెడుగడ్డి** వి. నేంద్రగడి, ఏటాలేచి పెరిగే కలుపుమొక్క. **నేరెడుదీవి** రూ.చూ. నేరెటిదీవి. వి. జంబూద్వీపం. హర. 2.3.

**నేరేడల్లులు** చూ. నేరేడు.

**నేరేడి** రూ.చూ. నేరేడు. వి. దూలాలు, దర్వాజాలు, తలుపులు మొదలైన వాటి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే పెద్ద చెట్టు (Eugenia Jambolana).

**నేరేడిపండు** వి. **1.** నేరేడువన్నె, ఒకరకం నీలం రంగు ; **2.** జంబూఫలం.

**నేరేడు** రూ. నేరఁడు, నేరడి, నేరెడు, నేరేడి, నేరోడి. వి.బొ. జంబూవృక్షం. మార్క. 4.143 (Eugenia Jambolana).

క. నేఱల్, నేఱళు, నేఱలె, నేఱళె, నేఱిల్, నేఱిళె, నీఱలు, నీర్లు, నేరేడు; కొడ. నెరుపణ్ణు. నేరేడుపండు; తు. నేరోలు, నేరాళు. నేరేడుపండు; మ. ఞాఱల్, ఞాఅల్ ; గోం. లేండీ, నెండీ ; కుఇ. లోన్డు. నేరేడుచెట్టు ; పర్జి. నాఁడి ; మాల్తొ. నాఁడి.

**నేరేడల్లులు** వి.బ.వ. అల్లో నేరేళ్ళు, నమస్కారాలు. సాంబ. మాన. 25. <నేరేడు+అల్లులు. **నేరేడుదీవి** రూ.చూ. నేరెటిదీవి. వి. తొలుదివి. **నేరేడుపండు** వి. జంబువు, జాంబవం. భీమ. 1.111; హర. 6.69. **నేరేడుపండుచీర** వి. నల్లనేరేడు పండు రంగు చీర. **నేరేడువన్నె** వి. నేరేడిపండురంగు, ఒకరకం నీలం రంగు. **నేరేడువన్నెకోక** వి. నల్లనేరేడు పండు రంగు చీర. **నేరేళ్లు** వి.బ.వ. నేరేడుపళ్ళు. కు.సం. 7.94. <నేరేడు+-లు.

**నేరేళ్లు** చూ. నేరేడు.

**నేరోడి** రూ.చూ. నేరేడు. వి. దూలాలు, దర్వాజాలు, తలుపులు మొదలైనవాటి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే పెద్ద చెట్టు (Eugenia Jambolana).

**నేర్చు** రూ. నేరుచు. స.క్రి. **1.** అభ్యసించు, కరచు. భార. ఆది. 1.150 ; **2.** తెలియు, ఎరుగు. భార. అరణ్య. 1.381 ; అ.క్రి. **1.** సమర్థమగు, శక్తమగు. భార.సభా. 2.312 ; **2.** ఇష్టపడు, సమ్మతించు. భార. అరణ్య. 1.265 ; **3.** సంభవించు.

క. నేర్. నమ్మతించు, ఫలించు, నేర్పు. యుక్తత, మర్యాద, నెరె. కలియు, దగ్గరగా వచ్చు, నెరపు, నెరహు, నెరయిసు, నెరసు, నెరెపు, నెరెవు. తీసుకొని వచ్చు, కలుపు, దగ్గరగా వచ్చు; కొడ. నె.ర్- (నె.రువ్-, నె.న్ద్-). దృష్టిలోకి వచ్చు ; తు. నెరియుని, నెరెవుని. సమావేశమగు, కలియు ; నేర్పుఱు. చక్కగా అభ్యసించు, కలియు ; త. నేర్ (-వ్-, -న్-). కలియు, దగ్గరగావచ్చు, ఒప్పుకొను, పోలు, సమానం, నెరి (-వ్-, -న్త్-). గుంపుగాఅగు, నెరుఙ్కు, (నెరుఙ్క్-). దగ్గరగా ఉండు, దగ్గరకు వెళ్ళు నెరై(-వ్-, -నెన్ద్-). గుమిగూడు ; మ. నేర్-ఇటుక. ఎదుర్కొను. నేరుక. సమ్మతించు.

మూ.ద.ద్రా. *నేర్-, *నే-.

**నేర్చుకొను** రూ.చూ. నేరుచుకొను. స.క్రి. **1.** తెలిసికొను ; **2.** అభ్యసించు.

**నేర్పరి** చూ. నేర్పు.

**నేర్పరితనము** చూ. నేర్పు.

**నేర్పు** రూ. నెప్పు[2] నేరుపు. వి. **1.** ప్రావీణ్యం, చతురత, సామర్థ్యం, శక్తి. భార.ఆది. 6.216 ; **2.** రీతి, విధం. వసు. 1.122 ; స.క్రి. **1.** అభ్యసింపచేయు. కు.సం. 1.42 ; **2.** ఎత్తుపల్లాలు సరిచేయు, చదునుచేయు, సమంగా పరచు ; **3.** ఎండబోసిన ధాన్యాన్ని పలచగా చేసి ఇటు అటు కలియబెట్టు.

**నేర్పరి** రూ. నేరుపరి. వి. నేర్పుకలవాడు, చతురుడు. భార. ఉద్యో. 2.36. **నేర్పరితనము** వి. సామర్థ్యం. భాగ. 10.932. **నేర్పుకాఁడు** రూ. నేరుపుకాఁడు. వి. నేర్పరి, నేర్పుకలవాడు. భార. ఆది. 6.32. **నేర్పులాఁడి** రూ.చూ. నేరుపులాఁడి. వి. జాణ, చతురత

కల స్త్రీ. నేర్పులాఁడు రూ.చూ. నేరుపులాఁడు. వి. జాణ. చాతుర్యం కలవాడు. నేర్పువాఁడు విణ. బోధకుడు.

నేర్మి రూ.చూ. నేరిమి. వి. 1. సామర్థ్యం. అచ్చ.రా. సుందర. 13 ; 2. శక్తి ; 3. ప్రావీణ్యం.

నేఱా రూ.చూ. నెఱ. విణ. 1. నిండు, అధికం. చంద్రాంగ. 5.73 ; 2. దిట్టమైన ; 3. వాడిఐన.

నేల వి. 1. పొలం. ఎఱ్ఱగుడిపాడు శాసనం. క్రీ.శ. 575 ; 2. భూమి. భార. ఆది. 2.46 ; 3. ప్రదేశం, తావు. భార. ఆది. 4.14; 4. దేశం. భార. విరా. 4.221, నె.శా. ఉదయగిరి. 8. క్రీ.శ. 1534; 5. భూలోకం. ఉ.హరి. 2.133; 6. మన్ను.
త. ఞాలమ్. నేల, భూమి ; మ. ఞాలమ్ ; గోం. నేలి, నెల్, నెలి. పొలం ; కుఇ. నేల, నేడ. వ్యవసాయానికి పనికివచ్చే మెట్టభూమి, నేడె. భూభాగం ; కువి. నేల; కొలా. ఎ.ల్ ; నా. ఏల్ ; కురు. నాల్. పల్లపుభూమి. < మూ. ద్రా. *ఞాల్.

నేలఆమిద వి. దక్కను కర్ణాటకల్లో పెరిగి ఆకుపచ్చతో కూడిన పసుపు పూలు పూసే మొక్క. (Jathropha glandulifera). నేలఆనబచెట్టు వి. భూకుంబి. నేలఉసిరిక వి. భూధాత్రి. (Phyllanthus Niruri, D. Phyllanthus urinatia). నేలఒలుము వి. దాలిబూదిచెట్టు (Rhynchosia (genus) ). నేలకడప వి. భూకబందం. నేలకడిమి వి. భూకదంబం (Nauclea Parviflora). నేలకఋచుకొను అ. క్రి. 1. పడిపోవు ; 2. ఓడిపోవు. నేలకలిగొట్టు వి. భూపాటలి. నేలకలియు రూ.చూ. నేలఁగలియు. అ.క్రి. నాశనమగు. నేలకాన్పు వి. భూపుత్రి, సీతాదేవి. అచ్చ. రా. అయోధ్యా. 98. నేలకుఁగోలకుఁదెచ్చు (-కోలకుఁదెచ్చు) స.క్రి. ఓడించు భార. ద్రోణ. 1.107. నేలకునింగికి సూత్రపట్టనేర్చు అ.క్రి. ఆకాశానికీ భూమికీ సూత్రపట్ట నేర్చు, అసాధ్య కార్యాన్ని తలపెట్టు. పండి. చ. 389వ. నేలకుఁదెచ్చు స.క్రి. 1. చంపు. భార. ద్రోణ. 2.236 ; 2. పడగొట్టు. నేలకుప్రాలు అ.క్రి. సొగిలపడు. కాశ. 4.75. నేలకొడివడు(-వడు) అ.క్రి. భూమంతా వ్యాపించు. కు.సం. 11.80. నేలకొయ్య రూ.చూ. నాలికకొయ్య. వి. 1. నాలిక కొయ్య, మగ్గంమీద నేతగుడ్డచుట్టే కొయ్యకు ఆధారంగా కుడిపక్కన నేలలో పాతిన కొయ్య ; 2. నాల్కగొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. నేలగాపరి (-కాపరి) వి. రాజు. అచ్చ. భా. 1.6. నేలగుంజ వి. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి, నేలలో పాతిన గూటం. నేలగుమ్మడి రూ. నేలగుమ్ముడు. వి. భూమి కర్కారువు, ఒకరకం గుమ్మడి. ఆం.భా. 2.57 (Gmelina asiatica). నేలగుమ్ముడు రూ.చూ. నేలగుమ్మడి. వి. విదారి, వృక్షవిశేషం (Impomada Digitatas Paniculata). నేలగొలిమిడి వి. గోరోమిచెట్టు. నేలఁగలపు (-కలపు) రూ. నేలఁగలుపు. స.క్రి. నేలపాలుచేయు, ధ్వంసంచేయు. భార. ద్రోణ. 8.243. నేలఁగలయు (-కలయు) రూ చూ. నేలఁగలియు. అ.క్రి. నాశనమగు. వరాహ. 4.21. నేలఁగలియు(-కలియు) రూ. నేలకలియు, నేలఁగలయు. అ.క్రి. నశించు. భార. సౌ. 1.202. నేలఁగలుపు (-కలుపు) రూ.చూ. నేలఁగలపు. స.క్రి. నేలపాలుచేయు, ధ్వంసంచేయు. కాశ. 2.118. నేలచట్టం వి. మిద్దెలోని గాడుపాటులో గలీజు కాకుండా నారబండలు పరచిన స్థలం. నేలచూపుజూచు(-చూచు) స.క్రి. ఎదుటివానిని తలఎత్తి చూడటానికి శంకించు. నేలచూలి వి. భూపుత్రి, సీతాదేవి. యయా. 3.22. < నేల + చూలు + -ఇ[9]. నేలజమ్మి వి. శమీరం (Dichrostachys cinera). నేలజీడి వి. మందుల్లో ఉపయోగపడే నూనెనిచ్చేచెట్టు (Baliospermum axillare). నేలజీరు అ.క్రి. నేలపై జీరాడు. శుక. 1.411. నేలజేజే వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. నరస. 5.22. నేలఁజూచు(-చూచు) స.క్రి. అవమానంతోనో, సిగ్గుతోనో తల వంచుకొను. పండి.చ. 2.47 వు. నేలంటు వి. 1. పునాది కట్టుదిట్టం ; 2. నేలమీద రాయటంతో సంబంధం. < నేల + అంటు. నేలంటుపాయని విణ. చాలా లేత ప్రాయానికి సంబంధించిన. నేలతంగెడు రూ.చూ. నేలతంగేడు[2]. వి. వరిపొలాల్లో కోతలు కాగానే పెంచే రెండు మూడడుగుల ఎత్తైన మొక్క (Cassia Angustifolia). నేలతంగేడు[1] వి. చిన్నతంగేడు, ఆకుల్యం. హంస. 4.10. (Cassia obovata). నేలతంగేడు[2] రూ. నేలతంగెడు. వి. మందుల్లో ఉపయోగపడే ఆకులుకల చిన్నచెట్టు. (Cassia Angustifolia). నేలతమ్మి వి. మెట్టతామర. నేలతాడి రూ. నేలతాడు. వి. తాళమూలిక, మునలిచెట్టు. హంస. 4.11 (Curculigo orchioides) నేలతాడు రూ.చూ. నేలతాడి. వి. తాళమూలిక. నేలతామర వి. మెట్టతామర, స్థలపద్మిని. ఆం.భా. 2.69. నేలతాలుపు రూ. నేలతాల్పు. వి. 1. పర్వతం, భూధరం. అచ్చ.రా. పీఠి. 7 ; 2. రాజు, భూధరుడు. అచ్చ.రా.యు. 21. నేలతాల్పు రూ.చూ. నేలతాలుపు. వి. 1. పర్వతం ; 2. రాజు. నేలతీఁటకసింద వి. కసిందలో ఒకభేదం, వృక్షవిశేషం. హంస. 4.16. నేలతొళసి వి. భూతులసి. నేలతో పీపుమోపవైచు అ.క్రి. వెల్లకిల పడవేయు. ఉ.హరి. 3.67. నేలనమలి రూ. నేలనమిలి, నేలనెమలి, నేలనెమిలి. వి. పక్షివిశేషం. చంద్రాంగ. 2.84. నేలనమిలి రూ. చూ. నేలనమలి. వి. పక్షివిశేషం. నేలనాకుకొను అ.క్రి. కిందపడు. నేలనానుపువాన వి. కొద్దిపాటి చినుకులు. నేలనాలుగుచెఱఁగులు(-చెఱగులు) వి.బ.వ. దేశంమొత్తం. భార. విరా. 2.7. నేలనెమలి రూ.చూ. నేలనమలి. వి. పక్షివిశేషం. రసిక. 1.67. నేలనెమిలి రూ.చూ. నేలనమలి. వి. పక్షివిశేషం. హంస. 3.13. నేలనేపాళము వి. దక్కను కర్ణాటకల్లో పెరిగే ఆకుపచ్చతో కూడిన పసుపు పూలుపూసే మొక్క (Jatrapha glandulifera). నేలనేరేడు[1] వి. భూమిజంబుకం. ఆం.భా. 2.46 (Eugenia Fruticosa). నేలనేరేడు[2] వి. తెల్లని చిన్న పూలుపూసే మొక్క (Premna herbacea). నేలపట్టి వి. 1. అంగారకుడు ; 2. నరకాసురుడు ; 3. భూపుత్రి, సీత. నేలపట్టు స.క్రి. దిగులుతో మూలపడు. నేలపడక వి. 1. మృతశయ్య, చచ్చినవాని పడక ; 2. నేలమీదపరుండటం. నేలపని వి. పునాది

గుంటలోపలి కట్టడప్పని. నేలపల్లటి రూ.చూ. నేలపల్లటీ. వి. పారావత విశేషం. ఆం.భా. 2.89. నేలపల్లటీ రూ. నేలపల్లటి. వి. పారావత విశేషం. సాంబ. తిర్య. 78. నేలపల్లేరు వి. నేలకు అంటుకుపోయే పల్లేరు (Tribulus Species). నేలపాక వి. నేలకు తగిలే కప్పుగల గొర్ల కొట్టం. నేలపాతర వి. నేలలో తవ్వి కట్టిన పాతర. నేలపాల వి. దూదిపాల మొక్క, అందమైన మొక్క (Oxystelma Esculentum). నేలపాలగు అ.క్రి. వ్యర్థమగు. < నేల+ పాలు[1] + అగు. నేలపాలుగ(జేయు(-చేయు) స.క్రి. నశింప చేయు. భార.శల్య. 2.325. నేలపాలుచేయు రూ. నేలపాలు సేయు. అ.క్రి. ధ్వంసంచేయు, పాడుచేయు. కు.సం. 2.66. నేలపాలుసేయు(-చేయు) రూ.చూ. నేలపాలుచేయు. స.క్రి. కూల్చు. భార. ద్రోణ. 1.169. నేలపిసర రూ.చూ. నేల పెసర. వి. వేరుసెనగ, నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis Hypogsea). నేలపిసిరి రూ.చూ. నేలపెసర. వి. వేరుసెనగ, నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis Hypogsea). నేలపురుగుడు వి. గట్టిగా ఉండే లేత ఎరుపు రంగు కలపనిచ్చే చెట్టు (Phyllanthus Reticulatus). నేలపెల్లగిలనార్చు అ.క్రి. గట్టిగా అరచు. కాశ. 2.56. < నేల+పెల్లగిలు+అ[7]+ఆర్చు. నేల పెసర రూ. నేలపిసరి, నేలపిసిరి. వి. వేరుసెనగ, నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis Hypogsea). నేలపైకాళ్లునిలువకుండు అ.క్రి. తొందరపడు. నేలపొన్న[1] వి. కోలపొన్న. అంఘ్రిపర్ణిక. ఆం.భా. 2.55 (Cassia Acutifolia). నేలపొన్న[2] వి. మందుల్లో ఉపయోగపడే ఆకులు కల చెట్టు (Cassia Angustifolia). నేలపొన్న[3] వి. లేత పసుపురంగు పూలుపూసి పచ్చికబయళ్ళలో పెరిగే మొక్క (Cassia Obovata). నేలపొన్న[4] వి. పసుపు పచ్చని పూలుపూసే మొక్క (Cassia mimosoides). నేలపో(క వి. ఒకరకం పోక చెట్టు (Calamus Crectus). నేలబట్టి వి. జాతి బట్టి, సున్నంకాల్చే గుండ్రటి బట్టి. నేలబట్టీఅము వి. జాతి బట్టి, సున్నంకాల్చే గుండ్రటి బట్టి. నేలబల్ల వి. మట్టప్పలక, ఆకు కప్పు మీది మిట్టపల్లాలు సరిచేసే చెక్క సాధనం. నేలబుడ్డ వి. వేరుసెనగ, నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పుదినుసు (Arachis Hypogsea). నేలబివి వి. పుట్ట, వల్మీకం. వేంక. ఆం. 88. నేలబెండ[1] వి. బంజరుల్లో పెరిగే మొక్క (Sida Acuta). నేలబెండ[2] వి. ఉత్తరసర్కారులూ, దక్కనూ, కర్ణాటకల్లో పెరిగి పీచునిచ్చే చెట్టు (Hibiscus Ficulneus). నేలబొద్దు వి. పలచని ఆకులు కలిగి సన్నగా ఉండే మొక్క (Vitis Repens). నేలబొయారం వి. భూగృహం, నేలకింది గది. నేలమట్టం రూ.చూ. నేలమట్టము. వి. భూమట్టం, నేలతో సమానమైన ఎత్తు. నేలమట్టమగు అ. క్రి. నశించు. నేలమట్టము రూ. నేలమట్టం. విశే. నేలతో సమాన మైనది, నాశితం. భాస్క.రా.యు. 315. నేలమట్టముచేయు స.క్రి. నాశనమొనరుచు. రామాభ్యు. 6.203. నేలమరిజొన్న వి. ఒకరకం జొన్న. నేలమలె రూ.చూ. నేలమాలె. వి.భూగృహం. నేలమాడు వి. గట్టి కలపనిచ్చే పెద్ద చెట్టు, తనిచెట్టు (Terminalia Tomentosa). నేలమానికె వి. భూగృహం. నేలమామెన వి. వృక్ష విశేషం. హంస. 4.10. నేలమాలాలకుచిచ్చుబెట్టు(-పెట్టు) స.క్రి. కయ్యాలు లేని చోట కయ్యాలు పుట్టించు. నేలమాలిగ రూ. నేలమాలె. వి. నేల అడుగున నిర్మించిన ధాన్యాగారం. నేలమాలె రూ. నేలమలె, నేలమాలిగ, నేలమాళిగ. వి. భూమిలోపలి ఇల్లు. కేయూ. 3.218. నేలమాలెలుద్రవ్వు(-త్రవ్వు) స.క్రి. లోలోపల కుట్రలు పన్ను. శుక. 2.507. నేలమాళిగ రూ.చూ. నేలమాలె, వి. నేల అడుగున నిర్మించిన ధాన్యాగారం. నేలమిన్నులుకాల్చు స.క్రి. గర్వంతో ఎగాదిగా చూచు. శుక. 3.23. నేలమీ(దనూకల్లేకపోవు అ.క్రి. ఆయుస్సు చెల్లిపోవు. నేలముచ్చు వి. 1. తలవంచి పిలిచినా పలకనివాడు; 2. అన్నీ తెలిసి అమాయకుని వలె ప్రవర్తించేవాడు. నేలములక రూ. నేలములగ. వి. వాకుడు, వార్తాకి. ఆం.భా. 2.58 (Solanum Indica). నేలములగ రూ.చూ. నేలములక. వి. వార్తాకి, వాకుడు. నేలముల్లాకు వి. నేలములక (Solanum Xanthocarpum). నేల మూటు వి. గుండాము, నేలమీద ఇష్టంవచ్చిన చోట పాత్రల్ని గుండ్రంగా పేర్చి కాల్చే చోటు. నేలమొలత్రాడు వి. సముద్రం. అచ్చ.రా.యు. 1.55. నేల(బెట్టికాలరాచు స.క్రి. మిక్కిలి పీడించు. బిల్హ. 2.117. నేల(బెట్టు(-పెట్టు) స.క్రి. 1. నేలకూల్చు. భార.కర్ణ. 3.262; 2. నశింప చేయు. బిల్హ. 2.120; 3. నేలపై ఉంచు. నేలయడుగు (-అడుగు) వి. పాతాళం. ఆం.భా. 1.145. నేలయవిసి మూ(గినట్లు అవ్య. నేలఈనినట్లు. భార.మౌసల. 183. నేలయీనినచందంబున (-ఈనినచందంబున) అవ్య. ద్రు. విపరీతంగా. హంస. 3.29. నేలయీనినట్లు(-ఈనినట్లు) అవ్య. జనసమ్మర్దం ఎక్కువగా ఉన్నప్పుడు ఉపయోగించే మాట. నేలయుసుమిన్ను(దన్ను(-తన్ను) అ.క్రి. చాలా గొప్పదగు. రుక్మా.చ. 1.125. నేలయుసిరిక(-ఉసిరిక) రూ.చూ. నేలుసిరిక. వి. భూధాత్రి. ఆం.భా. 2.48. నేలయెకిమీడు( ఎకిమీడు) వి. భూపతి, రాజు. ఉ.రా. 7.389. నేలయేలుదంట(ఏలుదంట) వి. క్షత్రియుడు, రాజు. సాంబ. మాన. 2. నేలరేగు వి. ఒకరకం చిన్న మొక్క (Tizyphus Nummularia). నేలరేను వి. భూబదరి. అచ్చ.రా.బాల. 44. నేలరోలు వి. నేలమీద గుంట చేసి తయారు చేసిన రోలు. నేలతే(డు వి. రాజు. రసిక. 1.94. అచ్చ.రా.బాల. 44. నేలలోవెడలు అ.క్రి. ఇల్లు విడిచి బయటికి వెళ్ళు. పాండు. 3.38. నేలవాకుడు వి. రోడ్ల పక్కనా బంజరుల్లోనూ పెరిగే ఒకరకం మొక్క (Solanum Xanthocar,um). నేలవాపు(-పాపు) స.క్రి. ప్రదేశం నుంచి తొలగచేయు, దూరంచేయు. భార. ద్రోణ. 1.216. నేలవావిలి[1] వి. క్రిమి సంహారానికి ఉపయోగపడే గింజల నిచ్చే రోడ్ల పక్కన నేలల్లోను పెరిగే ఒకరకం మొక్క (Vernonia Anthelmintica). నేలవావిలి[2] వి. నీలిరంగుతో కూడిన ఎరుపు పూలు

పూసే ఒకరకం చిన్న మొక్క (Vitex Trifolia). నేలవావిలి[3] వి. ఆకులు మందుల్లో ఉపయోగపడే, తోటల కంచెల్లో పెంచబడే ఒకరకం మొక్క (Justica gendarussa). నేలవిడిచినసాము వి. పునాదిలేనిపని. నేలవిడిచి సాధన వి. ఆధారంలేనిపని. వి|ప. 4.51. నేలవె|్రి వి. తలకాయనేలకు మోటించటం. నేలవెల(గ వి. భూపెలగ. (Feronia elephantum). నేలవేము వి. కిరాతతిక్త. (Sucertia chirata, Gentina cherayta). నేలవేలుపు రూ. నేలవేల్పు వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. యయా. 3.131. నేలవేల్పు రూ. చూ. నేలవేలుపు. వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. అచ్చ. రా. యు. 33. నేల|్రవాయు స.|క్రి. బదులు చెప్పలేక పోయినప్పుడు కాలితోనేలమీద రాయు. గా. హరి. పూ. 123ప. నేలశనగ రూ.చూ. నేలసెనగ. వి. వేరుసెనగ, పల్లికాయ. నేలసంపెఁగ వి. భూమిచంపకం. నేలసెనగ రూ. నేలశనగ, నేలసెనిగ. వి. వేరుసెనగ, నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis hypogsea). నేలసెనగబుడ్డలు వి.బ.వ. వేరుసెనగ కాయలు. నేలసెనిగ రూ.చూ. నేలసెనగ. వి. నేలసెనగ, నేలపెసర (Arachis hypogsea). నేలాము వి. 1. గుండాము, నేలమీదనే కుండలు కాల్చటానికి వీలున్నఆము ; 2. జాతిబట్టి, సున్నం కాల్చే గుం|్రడటిబట్టి. <నేల+ఆము. నేలా(పు వి. శ్యేన విశేషం, ఒక విధమైన డేగ. రసిక. 1.115. <నేల+ఆ(పు. నేలిగ్గూటం రూ.చూ. నాలిక గూటం. వి. 1. నాలికకొయ్య, మగ్గం మీద నేతగుడ్డ చుట్టేకొయ్యకు ఆధారంగా పాతినకొయ్య ; 2. నాలికొయ్య, ఉన్నిమగ్గం దోనుగను మోసే కుడివైపు గూటం. నేలీడ్పులవాడు విణ. నేలను రాస్తూ పాదంఎత్తి వేస్తూ నడిచేవాడు. నేలుసకరాకు వి. నేలుసిరిక, తోటల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క (Phyllanthus Niruri). నేలుసిరి రూ.చూ. నేలుసిరిక. వి. తోటల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క (Phyllanthus Niruri). <నేల+ఉసిరి. నేలుసిరిక రూ. నేలయుసిరిక, నేలుసిరి. వి. భూమ్యామలకి, ఒకరకం కలుపుమొక్క. హంస. 4.10 (Phyllanthus Niruri). <నేల+ఉసిరిక. నేలొద్ది వి. వృక్షవిశేషం. హంస. 4.11.

నేలాము చూ. నేల.

నేలా(పు చూ. నేల.

నేలిగ్గూటం చూ. నేల.

నేలీడ్పులవాడు చూ. నేల.

నేలుసకరాకు చూ. నేల.

నేలుసిరి చూ. నేల.

నేలుసిరిక చూ. నేల.

నేలొద్ది చూ. నేల.

నేల్కబల్ల రూ.చూ. నాలికబల్ల. వి. నాలికబద్ద, కోడిపీటల బండి (ఒకరకం బండి) ని తోలేమనిషి కూర్చోటానికి వీలుగా గోసినాగ దగ్గర వేసిన చెక్క.

నేవ వి. 1. కోపం ; 2. నింద.

నేవడము రూ.చూ. నేవళము. వి. లలంతికా విశేషం, మణులు గుచ్చిన హారం.

నేవము రూ.చూ. నివబు. వి. 1. మిష, వ్యాజం ; 2. తప్పు నేరం.

నేవలము రూ.చూ. నేవళము. వి. రత్నాల దండ.

నేవళము రూ. నేవడము, నేవలము, నేహరము. వి. లలంతికా విశేషం, మణులు గుచ్చిన హారం. హరి. ఉ. 4.160.

క. నేవణ, నేవళ, లేవా(ళ, లేపాళ. వెండి లేక బంగారు కంఠ భూషణం ; వడ్డాణం ; తు. నే(వళ. నెవల. వెండి లేక బంగారు వడ్డాణం.

సం. నూపుర-. మంజీరం, అందె ; |ప్రా. ణేఉర, ణిఉర. స్త్రీలకాలినగ ; జై.మహా. శౌ. అ.మా. అప. ణేఉర, నేఉర ; మా. ణేఉల.

నేవీబ్లూ రూ. నెయిబులుగు, నెవిబ్లూ. వి. ఒకరకం నీలంరంగు.

ఇం. *Navy blue*. ఒకరకం నీలంరంగు.

< ఇం. Navy blue.

నేవు స.|క్రి. దేవు.

నేషనల్ విణ. ఒకజాతికి చెందిన, మొత్తం జాతికి సామాన్యమైన.

ఇం. *National*. ఒకజాతికి చెందిన.

< ఇం. National.

నేసకం వి. బట్టనెయ్యటం, నేత.

నేసాగు చూ. నే(త.

నేస్తకత్తియ చూ. నేస్తము.

నేస్తకత్తె చూ. నేస్తము.

నేస్తకా(డు చూ. నేస్తము.

నేస్తంకట్టు చూ. నేస్తము.

నేస్తమసు చూ. నేస్తము.

నేస్తము వి. చెలిమి, మై|్రతి. శశా. 4.17, అని. 2.83 ; విణ. మి|్రతుడు. శశా. 4.41.

త. నేచమ్. |్రపేమ, అభిమానం. నేచన్. స్నేహితుడు ; మ. నేసన్. స్నేహితుడు.

నేస్తకత్తియ రూ. నేస్తకత్తె. వి. స్నేహితురాలు. నేస్తకత్తె రూ.చూ. నేస్తకత్తియ. వి. స్నేహితురాలు. నేస్తకా(డు వి. మి|్రతుడు. |ప్రబంధ. 78. నేస్తంకట్టు అ.|క్రి. స్నేహంచేయు. నేస్తమగు అ. |క్రి. చెలిమిచేయు. శశా. 4.41. <నేస్తము + అగు. నేస్తటికము వి. స్నేహం. నేస్తి వి. స్నేహితుడు. వేంక. ఆం. మాన. 26. నేస్తు వి. స్నేహం. నేస్తు(డు వి. మి|్రతుడు, స్నేహితుడు, అచ్చ. భా. 4.81. నేస్తురాలు వి. స్నేహితురాలు.

నేస్తటికము చూ. నేస్తము.

నేస్తి చూ. నేస్తము.

నేస్తు చూ. నేస్తము.

నేస్తు(డు చూ. నేస్తము.

నేస్తురాలు చూ. నేస్తము.

నేహరము రూ.చూ. నేవళము. వి. మణులు గుచ్చిన హారం. గా.హరి.ఉ. 623 పం.

నై[1] వి. చిన్న కుంట నుంచి తోడిన నీరు పోయే మార్గం, కాలవ.

హిం. నై. కాలవ.

<హిం. నై.

నై² వి. ఎరువు, పశువులపేడ, తొక్కిడి మొదలైనవి ఒకచోట ఎత్తుగా వేసిన కుప్ప.

హిం.ఉ. నై. వెదురుగొట్టం.

నైదిబ్బ వి. ఎరువుదిబ్బ. నైపోగు వి. చిన్న పెంటకుప్ప.

నైకలుచేయు స.క్రి. పిల్లలు పరస్పరం నమ్మించుకొను.

హిం. నైక్. కొంచెం.

నైజాకదొండ వి. చిన్నకాయరకం దొండ.

హిం.ఉ. నాజుక్. కోమలమైన

నైట్రాస్ వి. అద్దకం రంగు తయారు చెయ్యటానికి ముడి రంగులో కలిపే ఒకరకం రసాయనం.

ఇం. *Nitrous.* ఒకరకమైన రసాయనానికి సంబంధించిన.

<ఇం. Nitrous.

నైనారు రూ.చూ. నయనారు. వి. శివభక్తుడు.

నైబు వి. సైనికోద్యోగి. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 745.

హిం. నాయబ్. సహకారి, నేబ్. సహాయకుడు; మరా. నాయబ్. సహాయకుడు; ఉ. నాఇబ్, నాయబ్. సహాయకుడు; పార. నాఇబ్. సైనికాధికారి; అర. నాఇబ్. సహాయకుడు.

<ఉ. నాఇబ్.

నైరు వి. పంటకాలవ, పెద్దకాలవనుంచి పొలం చేరేవరకు తెచ్చిన కాలవ.

హిం. నహర్. కాలవ.

<హిం. నహర్.

నైసు విశే. 1. నాజూకైన; 2. నునుపుగల.

ఇం. *Nice.* నాజూకైన.

<ఇం. Nice.

నైస్‌కొట్టు స.క్రి. నున్నగించు, నున్నగింత నలపతో రెండోసారి సాపుచేయు. నైస్‌చేయు స.క్రి. నున్నగించు, నున్నగింత నలపతో రెండోసారి సాపుచేయు. నైస్‌పలక వి. నున్నగింత నలప, కుదంగుట్టిన తర్వాత పల్చగ సర్దటానికి వాడే నలప.

నైస్‌కొట్టు చూ. నైసు.

నైస్‌చేయు చూ. నైసు.

నైస్‌పలక చూ. నైసు.

నొక్కమ వి. పెద్ద నదాప, శతాహ్వయవృక్షం.

నొక్కలు చూ. నొక్కు.

నొక్కల్లు చూ. నొక్కు.

నొక్కు రూ. నొక్కుడు. స.క్రి. 1. గోరు, పల్లు మొ॥ వాటితో అదుము. కు.సం. 6.37; 2. వంపుతీయు. విజ్ఞా.ఆచా. 22; 3. నలియజేయు, నలుపు. కాశీ. 4.123; వి. 1. అదముటంవల్ల కలిగిన పల్లం. భాను. 4.95; 2. ముడత; 3. కరకుగంటు, రాతిలోని గుంట; 4. పాత్రలకు పడిన తగ్గు, చొట్ట.

క. నొగులు. అదిమేటట్లుచేయు, పిండబడు, నొగుల్చు. పగలగొట్టు; త. నొక్కు. కొట్టు, తిట్టు, తినటం బాగా తగ్గించు; మ. ఒకుక్క. అంచుకి గంటుపెట్టు, నొక్కు, ఞొక్కు. నొక్కు, అదుము.

నొక్కలు రూ. నొక్కల్లు. అ.క్రి. నొక్కుడుపడు. పద్మ. 9.193. నొక్కల్లు రూ.చూ. నొక్కలు. అ.క్రి. నొక్కుడు పడు. నొక్కుకాల్పు వి. ముదురుకాల్పు ఆములో కుండలు మొ॥ నవి ఎక్కువగా కాలి ఆకారం చెడిపోవు. నొక్కుపడు స.క్రి. వంగిపోవు, కుండలు మొ॥ నవి ఎక్కువ కాల్పువల్ల సొట్టపోవు. నొక్కుపూస వి. నొక్కుగల పూస, స్త్రీల ఆభరణాల్లో అలంకారార్థం ధరించే ఒకరకం పూస. శుక. 2.411. నొక్కులు వి.బ.వ. 1. వంపులు; 2. ముడతలు. నొక్కులుదిద్దు అ.క్రి. వంకీలు దిద్దు. వర.రా.ఆరణ్య. పు. 122. పం. 13. నొక్కులుదీఱు (-తీఱు) అ.క్రి. 1. వికసించు. జైమిని భా. 4.55; 2. వంకీలు తీరి చక్కనగు.

నొక్కుడు రూ.చూ. నొక్కు. వి. గోరు, పల్లు మొ॥ వాటితో అదమటం. యయా. 5.26.

నొక్కుడునేత రూ. నొక్కున్నేత. వి. ఒకరకం నేత, నేత నేసేటప్పుడు పావుచెక్కతొక్క అనిలో పేకపోగు జాగ్రత్తగా నొక్క ఎడం ఎడంగా వేస్తారు. నొక్కున్నేత రూ.చూ. నొక్కుడునేత. వి. ఒకరకం నేత, నేత నేసేటప్పుడు పావు చెక్క తొక్క అనిలో పేకపోగు జాగ్రత్తగా నొక్క ఎడం ఎడంగా వేస్తారు.

నొక్కున్నేత చూ. నొక్కుడు.

నొగ రూ. నగ². వి. 1. యుగంధరం, బండి కాడి కట్టుకర్ర. కు.సం. 4.83; 2. ఏడికర్ర, నాగటి కాడినీ పంటనీ కలిపే పొడుగు కర్ర; 3. ఒంటినొగ బండికి డొలుపుకు అమర్చిన పొడుగాటి కొయ్య; 4. రెండు నొగల బండి డొలుపుమీద చక్రానికి దగ్గరగా డొలుపుకు అడ్డంగా బిగించిన గుర్రప్పీటమీద వేసిన పొడుగాటి కొయ్య.

సం. యుగ-. బండికాడి; ప్రా. జుగ-;

క. నొగ. బండికాడి; తు. నుగ, నొగ; త. నుకమ్. బండియొక్క కాడి మాను, తలుపుకి రక్షణగా ఉండే అడ్డుకర్ర; మ. నుకమ్. బండియొక్క కాడిమాను.

<ప్రా. జుగ-.

నొగకంటు వి. రెండు ముక్కలు ఏడికోలగా అతికినచోటు. నొగకమ్మి వి. 1. నాగచీల, గొర్రు, గుంటక మొదలగువాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు; 2. గొర్రు నిర్మాణంలో దండెగాడి పట్టె కిందికి జరగకుండా నొగల మీద వేసిన మేకు. నొగకొయ్య వి. బండి డొలుపులో అమర్చిన లావుపాటి పలకల కొయ్య. నొగచివర వి. పంగల గుంజ చివర, ఇరుకుమాను. నొగచీల రూ.చూ. నగచీల. వి. 1. కోతేరు వేసినప్పుడు అరిగిపోకుండా నొగచివర వేసిన ఇనపరేకు; 2. నొగకమ్మి, గొర్రు, గుంటక మొదలగు వాటి దిండులో నొగలుదూర్చి వెనకవైపు కొట్టే మేకు; 3. గొర్రు నిర్మాణంలో దండెగాడి పట్టె కిందికి జరగకుండా నొగలమీద వేసిన మేకు. నొగచీలలు వి.బ.వ. డోలుగర్రకు డొలుప బిగించేచోట గాని, చివరలగాని కొట్టిన మేకులు. నొగతరిగె వి. 1. నాగచీల, గొర్రు గుంటక మొదలగు వాటి

దిండులో నొగలుదూర్చి వెనకవైపు కొట్టే మేకు ; **2.** గొర్రు నిర్మాణంలో దండెగాడిపట్టె కిందికి జరగకుండా నొగల మీద వేసిన మేకు. **నొగతాడు** వి. పోలుతాడు, కాడిని పోలుగర్రకు కలిపి చుట్టే తాడు. **నొగపీట** వి. బండితోలే మనిషి కూర్చోడానికి నొగమీద అమర్చిన చెక్క. **నొగమాను** వి. **1.** ఒంటి నొగబండికి డొలుపుకు అమర్చిన పొడుగాటి కొయ్య. **2.** రెండునొగల బండి డొలుపుమీద చక్రానికి దగ్గరగా డొలుపుకు అడ్డంగా బిగించిన గుర్రప్పీటల మీద వేసిన పొడుగాటి కొయ్య. **నొగమెట్టు** వి. **1.** నొగ చీల, గొర్రు, గుంటక మొదలగువాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు ; **2.** గొర్రు నిర్మాణంలో దండెగాడి పట్టె కిందికి జరగకుండా నొగలమీద వేసిన మేకు. **నొగమెండు** వి. **1.** నొగచీల, గొర్రు, గుంటక మొద లగు వాటి దిండులో నొగలుదూర్చి వెనకవైపు కొట్టే మేకు ; **2.** గొర్రు నిర్మాణంలో దండెగాడి పట్టె కిందికి జరగకుండా నొగలమీద వేసిన మేకు. **నొగలు** రూ. నగలు[2]. వి.బ.వ. గొర్రు, గుంటక మొదలగువాటి దిండుకు బిగించి కాడిమీద మోపే పొడుగు కొయ్యలు. **నొగలువిప్పి కూర్చొను** అ.క్రి. ఇది నాచేతకాదు అను. (బండి నొగలు విప్పటం బండి విప్పటమే).

**నొగవరం** చూ. నొగ. వి. పిల్లగనెం, మడికీ మడికీ మధ్య అడ్డుగా వేసిన చిన్న మట్టికట్ట.

**నొగిలించు** చూ. నొగులు[1].

**నొగులు**[1] చూ. నొచ్చు. రూ.చూ. నెగులు. అ.క్రి. **1.** వాడు కు.సం. 7.63 ; **2.** నొచ్చు, తృప్తిచెందు, బాధపొందు. భార. ఉద్యో. 3.26 ; **3.** వికలమగు. రాజవా. 2.42 ; వి. **1.** బాధ ఆం.భా. 1.150 ; **2.** వికలమవటం.

**నొగిలించు** స.క్రి. **1.** పగలగొట్టు, ముక్కలుచేయు. ఉ.హరి. 1.148 ; **2.** బాధించు, నొగలజేయు. వరాహ. 4.17. **నొగులుచు** రూ.చూ. నొగుల్చు. స.క్రి. **1.** ఎడలించు ; **2.** నొప్పించు. **నొగుల్చు** రూ. నొగులుచు. స.క్రి. ముక్కలు చేయు, పొడిచేయు. ఉ.హరి. 3.53, భాగ. 10 ఉ. 849.

**నొగులు**[2] చూ. నొక్కు. అ.క్రి. నలుగు, హరి. ఉ. 2.61.

**నొగుల్చు** చూ. నొగులు[1].

**నొచ్చిననోరఁ బలుకకుండు** చూ. నొచ్చు.

**నొచ్చిలి** వి. నీలిరంగుతో కూడిన ఎరుపు పూలుపూసే ఒకరకం చిన్న మొక్క (Vitex trifolia).

క. నెక్కి, లక్కి, లక్కిలి, లెక్కి, లొక్కి ; తు. తు. నెక్కి ; త. నొచ్చి. ఐదాకులున్న ఒకరకం చెట్టు, వెణ్-ణొచ్చి. మూడాకులున్న ఒకరకం చెట్టు ; మ. నొచ్చి. పో.చూ.సం. నిర్గుండీ.

**నొచ్చిలు** చూ. నొచ్చు.

**నొచ్చిళ్ళు** వి.బ.వ. లాల, చొంగ.

క. లోళ, లోళి, లోళు, లోళె, లోగడె, లోదడి, లోదళి, లోదళె, లోడ్లె, లోయి. చొంగ, కఫం ; తు. నోణె. చొంగ, లాల, ఝోలి. బంకగాఉన్న పదార్థం ; మ. ఝోళ. చొంగ, నోళ. చేపలు, పళ్ళు మొదలగు వాటిలో ఉన్న రసంలాంటి పదార్థం ; తొ. వె.ళ్, చొంగ. పో.చూ. సం. లాలా. చొంగ.

**నొచ్చు** రూ. నచ్చు[2]. అ.క్రి. **1.** మనస్సులోగాని శరీరంలో గాని బాధకలుగు. భార. ఆరణ్య. 2.105 ; **2.** మృతిపొందు. నిర్వ రా. 5.30 ; **3.** శ్రమపడు, కష్టంపొందు. హర. 3.10.

క. నో (నొన్డ్-), నొయ్యు, నోయు, నొయ్. నొప్పి. బాధ, దుఃఖపడు ; కొడ. నొ- (నొవ్వ్-, నొన్డ్-). బాధించు ; తు. నోపుని, నోపిని, నోయిపిని. బాధించు. నొప్పి ; త. నోవు, నొప్పి జబ్బు, బాధ, అభిమానం. నొవ్వు (నొవ్వి-). బాధించు, బాధ, నొచి (-వ్-, -న్డ్-). బాధలోఉండు ; మ. నోక. నొచ్చు, కష్టంలోఉండు, నోవుక. నొప్పితో బాధపడు ; కో. నొ.వ్. జబ్బు, నొప్పి ; తొ. ను. అనారోగ్యం ; గోం. నొయ్యానా. బాధించు. నొప్పి ; కొం. నోగు. జ్వరం ; కుఇ. నోవ. బాధ కలుగు. నొస్స, (నొస్త్-). బాధ కలిగించు ; కువి. నోహి. నొప్పి, నోమెరి. జ్వరం, జబ్బు ; పర్జి. నొయ్. (నొఙ్-). నొప్పిగాఉండు, నొప్పి ; కొలా. ఒయ్, ఒయ్త్ బాధలు, నొప్పులు ; నా. ఒయ్. నొప్పిగాఉండు, ఒయిప్. బాధ కల్గించు ; గ. నొయ్, బాధగాఉండు ; ఒల్లా. నొయ్. బాధగాఉండు ; కురు. నుఙ్గొ, నుంజనా, (నున్చాస్, నుంజచాస్). నొప్పి, చురుక్కుమనే నొప్పి ; మాల్తొ. నుఙ్గె. నొప్పి కలిగించు, నుంజువ్‌రె. బాధించు

< మూ.ద్రా. *నోయ్-/ *నో.

**నొచ్చిననోరఁ బలుకకుండు** అ.క్రి. పల్లెత్తుమాట అన కుండు. బసవ. 1.68. **నొచ్చిలు** అ.క్రి. రాలు, పడు. కృ.శ.కు. 3.107. **నొచ్చుకొను** స.క్రి. నిందించు. చంపూరా. 5.68 ; అ.క్రి. పశ్చాత్తాపపడు. **నొచ్చుకోలు** వి. పశ్చాత్తాప పడటం. **నొప్పించు** స.క్రి. నొవ్వజేయు, బాధించు. భార. విరా. 5.212. **నోఁగొను(-కొను)** స.క్రి. నొవ్వనాటు, బాధపడే టట్లు గుచ్చు. భాస్క.రా.యు. 1048. **నోవాడు (-ఆడు)** స.క్రి. **1.** బాధ అనుభవింపచేయు. భార. విరా. 5.282 ; **2.** తిరస్కరించు. భార. ఉద్యో. 4.317 ; **3.** నొవ్వ పలుకు. పారి. 3.15. **నోనేయు(-ఏయు)** స.క్రి. బాధపడే టట్లువేయు. భార. ఉద్యో. 4.229. **నోఁబడు(-పడు)** అ.క్రి. బాధను అనుభవించు. దశకు. 10.42. **నోఁబలుకు(-పలుకు)** స.క్రి. బాధపడేటట్లు మాట్లాడు. కు.సం. 7.28.

**నొంచు** చూ. నొచ్చు. స.క్రి. **1.** శరీరాన్నిగాని, మనస్సును గాని, బాధపడేటట్లు చేయు, నొప్పించు, బాధించు. భార. ఆరణ్య. 2.105 ; **2.** సంహరించు, చంపు.భార.విరా. 5.66.

**నొంచువాఁడు** విణ. ఘాతకుడు, హింసించేవాడు. ఆం.భా. 3.8.

**నొట్ట** రూ.చూ. నొష్ట. వి. నుదురు.

**నొట్టసుడి** రూ.చూ. నొష్టసుడి. వి. పణతసుడి, నెత్తి మీద ఉండే సుడి.

**నొట్టి** రూ.చూ. లొట్టి. వి. కల్లుతీయటానికి తాటిచెట్టుపై భాగంలో గీతకింద కట్టటానికి మెడపొడవుగా మూతి ఇరుంగగా ఉండే మట్టిపాత్ర.

నొట్టికుండ రూ.చూ. లొట్టికుండ. వి. కల్లుతీయటానికి చెట్టుపై భాగంలో గీతకింద కట్టటానికి మెడపొడవుగా మూతిబుంగగా ఉండే మట్టిపాత్ర.

నొడలదొంతి చూ. నొడి. వి. సంశయం, మాటకారి అని అర్థంకావచ్చు.

నొడి రూ.చూ. నొడువు. వి. మాట, పలుకు, పదం. ఆం.భా. 1.111.

నొడికాఁడు వి. మాటకారి. భార.అశ్వ. 3.181. నొడికారము రూ. నుడికారము. వి. 1. మాటల్లోని చమత్కారం, సరసత. శృం.నై. 8.55; 2. పలుకు, మాట. ఆం.భా. 1.111. నొడికారి వి. మాట చమత్కారం కలవాడు. నొడికారితనము వి. మాట చమత్కారం. ఉ.హరి. 1.64. నొడిమ వి. చెప్పినమాట. మల్హ. 1.42.

నొడుగు రూ.చూ. నొడువు. వి. మాట, నుడి. ఆం.భా. 1.111.

నొడుచు స.క్రి. తప్పులు పట్టు.

త. నొటి. తమ ఎడల ఇతరులకు దుర్భావం కలిగేటట్లు నిందించు.

నొడుపు వి. తప్పులు పట్టటం.

నొడుపు చూ. నొడుచు.

నొడువరి చూ. నొడువు.

నొడువరితనము చూ. నొడువు.

నొడువు రూ. నుడి, నుడు, నుడుగు, నుడువు, నొడి, నొడుగు. స.క్రి. 1. వచించు, చెప్పు. భార.ఆది. 2.33,54; 2. గ్రంథం, కవిత్వం మొ॥ వాటిని రచించు, చెప్పు. కాశీ. 1.7; 3. పఠించు, ఉచ్చరించు. భాగ. 7.253; 4. స్తుతించు, కొనియాడు. భాగ. 11.44; వి. పలుకు, మాట. భార. మౌసల. 85.

క. నుడి. వచించు, చెప్పు, పలుకు, మాట నుడిసు, నుడియిసు. మాట్లాడేటట్లుచేయు, నుడిహ. గొణగటం, చెప్పటం, నుడిసుహ. మాట్లాడేటట్లుచేయు, సంబోధించటం; తు. నుడియుని. వచించు, చెప్పు, నుడిపుని. మాట్లాడు, నుడి. మాట, పలుకు, నుడిపావుని. మాట్లాడేటట్లుచేయు, ఏదైనా సంగీత వాద్యం వాయించు; త. నొటి(-వ్-, -న్ద్-). చెప్పు, మాట్లాడు, వచించు, మాట; మ. నొటిక్క. తొందరగా మాట్లాడు, నొటియుక. అస్పష్టంగా మాట్లాడు.

మూ.ద.ద్రా. *నొటి-.

నొడువరి వి. వాచాలుడు. బసవ. 19 పు. 455 పం. <నొడువు+-అరి. నొడువరితనము వి. వాచాలత, మాటకారితనం. పండి.చ. 2.113 పు. నొడువుజవ్వని వి. సరస్వతి. చంపూరా. 2.30.

నొత్త వి. కుంపటి నిలబడటానికి లోపలికి ఉండే భాగం

త. నొతి. బురద.

నొత్తబీటలు వి.బ.వ. కుండపక్కల్లో నొక్కబడి చీలిన నెర్రెలు.

నొప్పము వి. ఆపద.

త.మ. నొప్పలమ్. విచారం.

నొప్పి చూ. నొచ్చు. వి. బాధ. భార. ఆది. 3.219.

నొప్పిగుంటి(-కుంటి) వి. వ్యాధిగ్రస్తుడు. నొప్పిఁబడు (-పడు) రూ.చూ. నొప్పివడు. అ.క్రి. బాధపడు. కాశీ. 2.50. నొప్పియెత్తు(-ఎత్తు[1]) అ.క్రి. నొప్పిపుట్టు. నొప్పివడు (-పడు) రూ. నొప్పిఁబడు. అ.క్రి. బాధపడు. వరాహ. 6.72. నొప్పులు వి.బ.వ. ప్రసవవేదన. ఇందు. 2.5. <నొప్పి+-లు.

నొప్పించు చూ. నొచ్చు.

నొప్పులు చూ. నొప్పి.

నొలి చూ. నులి. వి. శోకం.

నొల్ల చూ. నొల్లు[2].

నొల్లబల్ల చూ. నొల్లు[2].

నొల్లిబల్ల చూ. నొల్లు[2].

నొల్లు[1] స.క్రి. బిడ్డలు నోటిలో వేలుపెట్టుకొని చప్పరించు. నిర్వ.రా. 1.40.

క. నొణె. చప్పరించు; త. నొళ్. (నొళ్వ్-, నొణ్ట్-). చప్పరించు, మింగివేయు; మ. నుణ. చొంగ, లాల, నుణయుక. అత్యాశతో తినటం, నుణచ్చల్. పెదవులు చప్పరించటం, అత్యాశ, నుణచ్చి, నుణెక్క; కురు. నుళ్లనా. నమలకుండా చప్పరించు.

నొల్లు[2] స.క్రి. 1. (అత్యాశతో) పోగుచేయు; 2. ఏరికేయు, ఏరు; 3. ఒక వస్తువును పూర్తిగా తీసికొను.

త. నొళ్(నొళ్వ్-, నొణ్ట్), నొళ్కు(నొళ్కి). నీళ్ళలా పైకితోడు, ధాన్యంలా కొలుచు, నొణ్టు, (నోణ్టి-). నీళ్ళు పడవలోంచిపైకితేలు, పోగుపెట్టు; కుఇ. నొల్ప (నొల్ట్). ఎక్కించు; పర్జి. ఒల్ప్. పడవలో నీళ్ళు పైకి తోడు; కురు. నొల్నా. పైకిలాగు, (అర్ధవర్తులాకారంలో చేటతో ధాన్యం తీసినట్టు), నొల్లో. చేపలవల; మాల్తో. లొలె. చెమ్చాతో పైకి తీయు.

నొల్ల రూ. లొల్ల. వి. గుంటక, మాగాణిలో దున్నిన తరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం, చేనిదుక్కని చదరపెట్టే సాధనం. నొల్లబల్ల వి. వెడల్పాటి బారిగ. నొల్లిబల్ల వి. దంతె, ఆము తీసేటప్పుడు మసికిందికి లాగటానికి వాడే కొయ్య పరికరం.

నొవులు చూ. నొచ్చు. రూ.చూ. నెగులు. అ.క్రి. బాధపడు. చెన్నబసవ. 5.55.

నొవేనా వి. తొమ్మిది రోజుల పూజ.

బు. నోవేనా, నోవి. తొమ్మిది, నోవెంతా. తొంబది. నోను. తొమ్మిదగు; స్పా. నోవేనా.

<పో. నోవేనా.

నొవ్వారు చూ. నొవ్వు.

నొవ్వి చూ. నొచ్చు. రూ.చూ. నొవ్వు. వి. 1. వేదన, బాధ. విజ్ఞా. ప్రా. 50, భాస్క.రా.యు. 2145; 2. వ్యాధి, రోగం. నార. పంచ. 1.399.

నొవ్వు చూ. నొచ్చు. రూ. నొవ్వి, నోవి, నోవ. వి. 1. వేదన, బాధ.నిర్వ.రా. 4.93; 2. వ్యాధి, తెగులు. భార.ఉద్యో. 3.26.

క.తు.త. నోవు. బాధ, నొప్పి.

నొవ్వారు అ.క్రి. బాధ పొందు. భార.కర్ణ. 3.21. <నొవ్వు+-ఆరు.

నొష్ట చూ. నొసలు. రూ. నొట్ట. వి. నుదురు.

నొష్టసుడి రూ. నొట్టసుడి. .వి. పణతసుడి, నెత్తిమీద ఉండే సుడి.

నొస వి. రాళ్ళ వరసలకు మధ్యనున్న స్థలం.

నొసటియెముక చూ. నొసలు.

నొసటివ్రాలు చూ. నొసలు.

నొసలికన్ను చూ. నొసలు.

నొసలిచూపువేల్పు చూ. నొసలు.

నొసలిప్పిచ్చు చూ. నొసలు.

నొసలిరేఖలుగజిబిజిచేయు చూ. నొసలు.

నొసలు వి.ఔ. నుదురు, లలాటం. భార.అశ్వ. 4.15.

క. నొసలు, నొసల్. నొసలు, కనుబొమ, తలపుర్రె, పైభాగం, మీదిభాగం; తు. నెసలు, నసుడి; త. నుతల్; మ. నుతల్. నొనలు; కొం. నెద. తలపై భాగం; మాల్తొ. నిమ్లు;

సం. నిటాల. నుదురు.

నొసటియెముక(-ఎముక) వి. నుదుట ఉన్న ఎముక. నొసటివ్రాలు వి.బ.వ. బ్రహ్మ లిఖితం, కర్మ, విధి. నొసలికన్ను వి. నుదుటి మీది కన్ను. కాశీ. 3.196. నొసలిచూపువేల్పు వి. ఫాలాక్షుడు. చంద్రికా. 5.105. నొసలిప్పిచ్చు స.క్రి. చిట్లు, పగులుచూపు. నొసలిరేఖలు గజిబిజిచేయు స.క్రి. విధిరాతను చెరచు, ఆయుస్సును నశింపచేయు. బసవ. 7.208. నొసలొత్తుడునోరుతోడేలు వి. 1. గోముఖ వ్యాఘ్రం. వైజ. 3.18; 2. కటుభాషి; 3. సాధు వేషధారి.

నొసలొత్తుడునోరుతోడేలు చూ. నొసలు.

నోగాలికట్టె చూ. నొగ. వి. కాడికున్న రంధ్రంలో పెట్టే కొయ్య ముక్క.

నోఁగాను చూ. నొచ్చు.

నోఁచినవారు చూ. నోఁచు.

నోఁచియుండు చూ. నోఁచు.

నోఁచు స.క్రి. వ్రతం. యజ్ఞం మొ॥ వాటిని ఆచరించు. భార. ఆది. 4.103.

క. నోన్, నోను(నోన్తు). వ్రతం మొ॥ వాటిని ఆచరించు; తు. నోమ్పుని. ఉపవాసంచేయు; త. నోల్ (నోఱ్-ఱ్-). అనుభవించు, సహించు, కఠోర నియమాలను ఆచరించు, నోఱ్పు. తపస్సుచేయు, నోన్ (నోన్-ఱ్-); మ. నోల్క. ఉపవాస వ్రతమాచరించు, నోల్పిక్క. ఉపవాసం చేసేటట్లు చేయు.

మూ.ద్రా. *నోల్-/ *నో-న్-.

నోఁచినవారు విణ.బ.వ. అదృష్టవంతులు. ఉ.హరి. 1.168. నోఁచియుండు(-ఉండు) అ.క్రి. ఆ ఫలితానికై తగిన పుణ్యం చేసికొని ఉండు. పారి 1.131. నోఁత వి. నోచటం, ఆచరించటం. కవిక. 4.86.

నోటగడ్డకొట్టు చూ. నోరు.

నోటగడ్డిపెట్టు చూ. నోరు.

నోటగడ్డియిడు చూ. నోరు.

నోటఁగాయవేయు చూ. నోరు.

నోటదుమ్ముకొట్టు చూ. నోరు.

నోటనాలుకకలుగు చూ. నోరు.

నోటనాల్కలేనివాఁడు చూ. నోరు.

నోటనువ్వుగింజనాను చూ. నోరు.

నోటనువ్వుగింజపడు చూ. నోరు.

నోటబుగ్గిపడు చూ. నోరు.

నోటాట వి. గుండ్రం, వర్తులం, వలయాకారం.

నోటికడితీయు చూ. నోరు.

నోటికండ చూ. నోరు.

నోటికాడిదితీయు చూ. నోరు.

నోటికికళ్లెమువేయు చూ. నోరు.

నోటికితాళంవేసుకొను చూ. నోరు.

నోటికితాళమువేయు చూ. నోరు.

నోటికినాటకపోవు చూ. నోరు.

నోటికిపోవు చూ. నోరు.

నోటికిబుద్ధిచెప్పు చూ. నోరు.

నోటికివచ్చినట్లు చూ. నోరు.

నోటికీచేతికీపట్టించు చూ. నోరు.

నోటికూటికిఁజేయితెచ్చుకొను చూ. నోరు.

నోటికూడాడికూడు చూ. నోరు.

నోటికొకమాట చూ. నోరు.

నోటికొలఁది చూ. నోరు.

నోటిక్రొవ్వు చూ. నోరు.

నోటిగయ్యాళి చూ. నోరు.

నోటిగారడితనము చూ. నోరు.

నోటితీత చూ. నోరు.

నోటితుత్తర చూ. నోరు.

నోటిదురద చూ. నోరు.

నోటిపుల్ల చూ. నోరు.

నోటిపూత చూ. నోరు.

నోటిపేద చూ. నోరు.

నోటిబిగము చూ. నోరు.

నోటిబిగాలు చూ. నోరు.

నోటిమాటచాలు చూ. నోరు.

నోటిమాటనోటనెయుండు చూ. నోరు.

నోటిమాటనోరనేయుండు చూ. నోరు.

నోటిమాటమీద చూ. నోరు.

నోటిమాటమీదనిలబడు చూ. నోరు.

నోటిమాటలుకాకపోవు చూ. నోరు.

నోటిమాటల్లేకుండు చూ. నోరు.

నోటిముత్యాలురాలు చూ. నోరు.

నోటిరంకు చూ. నోరు.

నోటిలోకరక్కాయపడు చూ. నోరు.

నోటిలోగడ్డపడు చూ. నోరు.

నోటిలోదుమ్మికొట్టు చూ. నోరు.

నోటిలోదుమ్ముపడు చూ. నోరు.

నోటిలోనాలుకలేకుండు చూ. నోరు.
నోటిలోనీరూరు చూ. నోరు.
నోటిలోపడు చూ. నోరు.
నోటిలోపురుగులుపడు చూ. నోరు.
నోటిలోమన్నుకొట్టు చూ. నోరు.
నోటిలోవిద్దెగొట్టుకొను చూ. నోరు.
నోటివట్టం చూ. నోరు.
నోటివాడు చూ. నోరు.
నోటిశని చూ. నోరు.
నోటిసంచ చూ. నోరు.
నోటీసు వి. హెచ్చరిక.
ఇం. *Notice*. వార్త పంపటం, హెచ్చరిక, ప్రకటన.
< ఇం. Notice.
నోటు వి. 1. లిఖిత సంకేతం; 2. రూపాయికాగితం; 3. ప్రామిసరీనోటు.
ఇం. *Note*. డబ్బును నిర్ణీతకాలంలో చెల్లించేందుకు లిఖిత పూర్వకంగా చేసిన వాగ్దానం.
< ఇం. Note.
నోటుబుక్కు వి. ఏదైనా రాసుకునే పుస్తకం.
ఇం. *Note-book*. రాసుకునే పుస్తకం.
< ఇం. Note-Book.
నోటెడు చూ. నోరు.
నోట్సు వి. జ్ఞాపకార్థం రాసుకొనే సంగ్రహ లేఖనం.
ఇం. *Notes*. జ్ఞాపకం కోసం రాసుకొనే మాటలు, చిన్ని ఉత్తరాలు.
< ఇం. Notes.
నోతిగోలెం రూ.చూ. లోతుగోలెం. వి. పశువులకు నీళ్ళుపెట్టటానికి వాడేలోతైన మట్టితొట్టి.
నోతుదాక రూ.చూ. లోతుదాక. వి. నిలువుగా లోతెక్కువగా ఉండి పొట్టలేని మట్టిపాత్ర
నోతుమాడుగు రూ. చూ. లోతుమాడుగు. వి. కూటికుండ ఆకారంలో లోతుగా ఉండే మట్టిపాత్ర.
నోద్దాక రూ.చూ. లోతుదాక. వి. నిలువుగా లోతెక్కువగా ఉండి పొట్టలేని మట్టిపాత్ర.
నోవాడు చూ. నొచ్చు.
నోనేయు చూ. నొచ్చు.
నోఁత చూ. నోఁచు.
నోపు వి. మోపు, ఆధారం, పూనిక.
నోమించు చూ. నోము.
నోము వి. 1. వ్రతం. భార. ఆది. 4.103; 2. వ్రతఫలం. ద. హిం. శా. సంపు.4. శా. సం. 1373. క్రీ. శ. 1275; 3. యజ్ఞం. వీర. వి. 1.115; స.క్రి. 1. నోచు, వ్రతం. యజ్ఞం మొ॥ వాటిని ఆచరించు. కాశీ. 6.60; 2. పూజించు, అర్చించు. జైమిని. 8.75; 3. పోగొట్టు.
క. నోంపి, నోంపు. ఏదైనా మతసంబంధమైన పని, పవిత్రమైనపని; తు. నోంపు. భక్తికి సంబంధించిన పూజాదికాలు, నోమ్బు. ఉపవాసం, తపస్సు; త. నోన్పు, నోమ్పు. ఉపవాసం; మ. నోల్క (నోఱ్ఱు). ఉపవాసం చేయు, కఠినమైన జీవితాన్ని గడుపు, నొన్పు. తపస్సు, ఉపవాసం; కో. నోం(బ్). ఎవరైనా చనిపోయినప్పుడు పాటించే రోజులు.
నోమించు స.క్రి. నోముచేసేటట్టు చేయు. < నోము + -ఇంచు³. నోముదారము వి. తోరం. నోమునోఁచు స.క్రి. పుణ్యం చేసికొను. రా. గో. శ. 3.18. నోముపంట వి. వ్రతఫలం. క్రీడా. 88. భాగ. 10.1246. నోముఫలము వి. పుణ్యంవల్ల వచ్చేఫలితం. హంస. 2.169. నోముబొమ్మలు వి.బ.వ. సంక్రాంతి పండగల్లో బొమ్మల నోమునాడు పెళ్ళయిన స్త్రీలు నోచటానికి ఉపయోగించే మట్టిబొమ్మలు. నోములనెల వి. ఆశ్వయుజ మాసం. నోములపున్నమ వి. కార్తీకపూర్ణిమ. నోములముడి వి. నోముదారం కూర్చే బంగారు ముడి. నోములుపండు అ. క్రి. పుణ్యంఫలించు. పర. రా. అయోధ్యా. 261పు. 17పం.
నోఁబడు చూ. నొచ్చు.
నోఁబలుకు చూ. నొచ్చు.
నోయు చూ. నొచ్చు. అ.క్రి. 1. నొచ్చు, బాధపడు. భార. ఆది. 2.37; 2. కష్టాన్ని అనుభవించు. కు. సం. 6.13.
క. నో, నోయు. బాధపడు; తు. నోవుని, నోవిని. నోయిపుని. నొప్పిచేయు; త. నోయ్ (-ప్పు-, -త్తు-, -వ్-, -న్-). అనారోగ్యంగాఉండు; మ. నోక. బాధపడు. నోయి. అస్వస్థత, బాధ.
నోరగుమ్మలుగా చూ. నోరు.
నోరంగాయవేయు చూ. నోరు.
నోరఁగొలఁది చూ. నోరు.
నోరదుము చూ. నోరు.
నోరఁబట్టు చూ. నోరు.
నోరఁబ్రేవులుచూపు చూ. నోరు.
నోరాచనివాడు చూ. నోరు.
నోరాటము చూ. నోరు.
నోరాడనట్లుచేయు చూ. నోరు.
నోరాడు చూ. నోరు.
నోరార చూ. నోరు.
నోరార్చు చూ. నోరు.
నోరికిఁబోవు చూ. నోరు.
నోరికివచ్చినట్లు చూ. నోరు.
నోరికివచ్చినట్లుపలుకు చూ. నోరు.
నోరికివచ్చినట్లువెచ్చానకమ్ము చూ. నోరు.
నోరిచేటు చూ. నోరు.
నోరితాళము చూ. నోరు.
నోరిమాటనోరనవసియించు చూ. నోరు.
నోరిమాటనోరనెయుండు చూ. నోరు.
నోరిమాటనోరనేయుండక్ చూ. నోరు.
నోరినవి చూ నోరు.
నోరినవినుండనేరక చూ. నోరు.
నోరు వి.బ. 1. వాయి. ఆస్యం. కు.సం. 2.29, నె.గా.

ఉదయగిరి. 48. క్రీ.శ. 1252 ; **2**. పశువులు మొదలగు వాటి ముట్టె. శృం.నై. 2.5 ; **3**. మాటలాడే శక్తి. కళా. 3.180 ; **4**. పక్షులముక్కు ; **5**. పెద్దగా అరవటం ; **6**. మాటలతో పనులు చేసుకోవటం ; **7**. రాట్నం బొమ్మలో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి ; **8**. పాత్రలకు తెరిచికొని ఉండే మూతిభాగం.

త. నుకర్ (-వ్-, -న్త్-). ఆనందించు. తిను, తాగు, చేయు, నుకర్చి, నుకర్వు. సంతోషం, సంతోషంగాని, బాధగాని తెలియజేసే అనుభవం, నూణుక్క ; మ. నుకరుక. మింగు, నుకర్చ్చి. చప్పరించటం.

**నోటగడ్డకొట్టు** అ.క్రి. నోటమన్నుపోయు. < నోరు + -అ[7] + గడ్డ + కొట్టు[1]. **నోటగడ్డిపెట్టు** అ.క్రి. బుద్ధి చెప్పు. < నోరు + -అ[7] + గడ్డి + పెట్టు. **నోటగడ్డియిడు** అ.క్రి. బుద్ధి చెప్పు. < నోరు + -అ[7] + గడ్డి + ఇడు. **నోటఁగాయవేయు** రూ. నోరంగాయవేయు. అ.క్రి. ఊరకుండు. కవి రాజ. 3.145. < నోరు + -అ[7] + కాయ + వేయు. **నోటదుమ్ముకొట్టు** అ.క్రి. జీవనం పడగొట్టు. < నోరు + -అ[7] + దుమ్ము + కొట్టు[1]. **నోటనాలుకకలుగు** అ.క్రి. మాట్లాడ నేర్చు. **నోటనాల్కలేనివాఁడు** విణ. అమాయకుడు. < నోరు + -అ[7] + నాల్కలేనివాఁడు. **నోటనువ్వుగింజనాను** అ.క్రి. ఏరహస్యం కాని మనసులో దాగి ఉండు. < నోరు + -అ[7] + నువ్వుగింజ + నాను. **నోటనువ్వుగింజపడు** అ.క్రి. చనిపోవు. < నోరు + -అ[7] + నువ్వుగింజ + పడు. **నోటబుగ్గిపడు** అ.క్రి. నోటదుమ్ముపడు. శుక. 2.81. < నోరు + -అ[7] + బుగ్గి + పడు. **నోటికడితీయు** అ.క్రి. ఒకని సొత్తు హరించు, నోటికాడ కూడుతీయు, **నోటికండ** వి. నోటదగ్గరతిండి. కు.సం. 10.138. **నోటికాడిదితీయు** అ.క్రి. జీవనం పడగొట్టు. **నోటికికళ్లెముపేయు** అ.క్రి. నోరు మూయించు. **నోటికితాళంవేసుకొను** అ.క్రి. మౌనం ధరించు. **నోటికితాళముపేయు** అ.క్రి. ఎదురాడకుండాచేయు. **నోటికినాటకపోవు** అ.క్రి. తినటానికి చాలకపోవు. కాశ. 3.205. **నోటికిపోవు** అ.క్రి. జోలికిపోవు. **నోటికిబుద్ధిచెప్పు** అ.క్రి. జాగ్రత్తగా మాట్లాడు. **నోటికివచ్చినట్లు** అవ్య. స్వేచ్ఛగా. **నోటికిచేతికిపట్టించు** స.క్రి. **1**. మొత్తుకొను ; **2**. తిను. **నోటికూటికిఁజేయితెచ్చుకొను** స.క్రి. తిండికి లేకుండా చేసుకొను. శుక. 3.364. **నోటికూడాడికూడు** వి. జీవనం. **నోటికొకమాట** వి. ఎవరికి తోచినట్లు వారు మాట్లాడే పలుకు. **నోటికొలఁది** వి. **1**. నోటికి వచ్చినట్లు పలకటం. కు.సం. 1.38 ; **2**. నోరి పరిమాణం. **నోటిక్రొవ్వు** వి. నోటిబాగరు. మను. 6.45. **నోటిగయ్యాళి** వి. నోటి దురుసుతనం కల స్త్రీ. చెన్న బసవ. 4.39. **నోటిగారడితనము** వి. మాటకారితనం. **నోటితీత** వి. వాక్కండూతి, పద్ధతి లేకుండా మాట్లాడటం. హంస. 4.168. **నోటితుత్తర** వి. **1**. ఏమాటైనా చెప్పకుండా ఊరుకో లేక పోవటం ; **2**. విన్నది విన్నట్లు బయటకు చెప్పివేయాలనే నాలుక తీట ; **3**. వాచాలత ; **4**. పొగాకు వేసుకోవాలనిగాని ఏదైనా తినాలని గాని కలిగే తీవ్రవాంఛ. **నోటిదురద** వి. వాక్కండూతి. **నోటిపుల్ల** వి. అంగిట్లో బెజ్జాలు పడటం. **నోటిపూత** వి. నోట్లో ఏర్పడే చిన్నచిన్న పుళ్ళు. **నోటిపేద** వి. బుద్ధిహీనుడు. **నోటిబీగము** వి. దేవతలకు మొక్కుబడిగా మౌనవ్రతం అవలంబించటానికి దవడలకు కట్టుకునే లోహపు కడ్డీ. చంద్రభా. 5.41. **నోటిబీగాలు** వి.బ.వ. దేవతకు మొక్కుబడిగా నోటికి తాళం వేసుకోవటం. **నోటిమాటచాలు** అ.క్రి. మాటమాత్రం చెప్తే సరిపడు. **నోటిమాటనోటనెయుండు(-ఉండు)** అ.క్రి. నోటిలోమాట నోటిలో ఉండు. అవ్యవధానంగా ఉండు. కాశ. 2.36. **నోటిమాటనోరనేయుండు** అ.క్రి. అవ్యవధానంగా ఉండు. **నోటిమాటమీద** అవ్య. ఏమాత్రం రాతకోతలు అవసరం లేకుండా. **నోటిమాటమీదనిలబడు** అ.క్రి. సత్యవ్రతం కలవాడగు. **నోటిమాటలుకాకపోవు** అ.క్రి. చెప్పినంత సులువు కాకపోవు. **నోటిమాటల్లేకుండు** అ.క్రి. విరోధం ఏర్పడు. **నోటిముత్యాలురాలు** అ.క్రి. పలకకుండు, పలికితే నీదేమైనా పోతుందా అనేపట్ల ఉపయోగించే పదం. **నోటిరంకు** వి. **1**. వాగ్వ్యభిచారం ; **2**. వదరుబోతు తనం. **నోటిలోకరక్కాయపడు** అ.క్రి. లాభం తప్పి పోవు, వాడికి రావలసిన లాభం తప్పిపోయింది అనే పట్ల ఉపయోగించే పలుకుబడి. **నోటిలోగడ్డపడు** అ.క్రి. వచ్చే లాభం దక్కక పోవు. **నోటిలోదుమ్ముకొట్టు** అ.క్రి. జీవనం పడగొట్టు. **నోటిలోదుమ్ముపడు** అ.క్రి. నష్టమగు. **నోటిలోనాలుకలేకుండు** అ.క్రి. మాట్లాడ లేకపోవు. **నోటిలోనీరూరు** అ.క్రి. ఆశకలుగు. **నోటిలోపడు** అ.క్రి. దూషణకు పాత్రమగు. **నోటిలోపురుగులుపడు** అ.క్రి. ముఖంలో పురుగులుపడు (ఒకతిట్టు). పండి.చ. 1.637 వ. **నోటిలోమన్నుకొట్టు** అ.క్రి. జీవనం పడగొట్టు. **నోటిలో విద్దెగొట్టుకొను (-కొట్టుకొను)** అ.క్రి. నోరు మూసుకొను. **నోటివట్టం** వి. అనకూడని మాటలను దురుసుగా అనటం, వక్రవాక్కు కలిగి ఉండటం. **నోటివాడు** విణ. **1**. నోటిమాటలతోనే పని చేయించుకొనేవాడు ; **2**. మాట సాగించుకొనేవాడు ; **3**. మాటకారి ; **4**. అదరించి, బెదరించి పనులు చేసుకొనేవాడు. **నోటిశని** రూ.చూ. నోరిసని. వి. నోటిలోశని. **నోటిసంచ** వి. నోట్లో పుళ్ళుపడి మేత తినలేక పోవటం. **నోటెడు** వి. గుక్కెడు, గుటక. **నోరగుమ్ములుగా** క్రి.విణ. నోరార. తాళ్ల.సం. 9.48. < నోరు + -అ[7] + గుమ్ములు + అగు + -అ[7]. **నోరంగాయవేయు** రూ.చూ. నోటఁగాయవేయు. అ.క్రి. ఊరకుండు. ద్వి.పరమ. వి. 1.125. < నోరు + -అ[7] + కాయ + వేయు. **నోరఁగొలఁది** వి. దుర్భాషణం, నోటికివచ్చినట్లు మాట్లాడటం. కు.సం. 1.38. < నోరు + -అ[7] + కొలఁది. **నోరదుము** అ.క్రి. నోరు నొక్కు, మాటలాడనీయకుండు. ప్రభా. 3.5. < నోరు + అదుము. **నోరఁబట్టు** స.క్రి. పుక్కిలపట్టు, తాగు. జైమినిభా. 1.100. < నోరు + -అ[7] + పట్టు. **నోరఁబ్రేవులుచూపు** స.క్రి. నాదగ్గర ఏమీలేదు నువ్వే చూచుకొమ్మని చెప్పు. గౌ.హరి. ఉ.201. < నోరు + -అ[7] + ప్రేవు + -లు + చూపు. **నోరాచనివాడు** విణ. మాటలు నిలుపుకోలేక వదరువాడు. **నోరాటము** వి. వట్టిమాట. శుక. 2.79. **నోరాడనట్లుచేయు** స.క్రి. మాట మాట్లాడటానికి వీలు లేకుండా చేయు. శుక. 3.144 < నోరు + ఆడు + -అ[3] + -

ని + అట్లు + చేయు. నోరాడు అ.క్రి. నోరు మెదలు, మాట వెలువడు. భార. ఉద్యో. 4.183. <నోరు + ఆడు. నోరార వి. మనసార. సారంగ. 2.171. <నోరు + -ఆరు + -అ[7]. నోరార్చు స.క్రి. నోరాడించు, బూకరించు, బొంకు. గా.హరి.పూ. 300. <నోరు + ఆర్చు[3]. నోరికి(బోవు(-పోవు) అ.క్రి. నోరికింపగు, ఇష్టమగు. కకుత్థ్స. 4.51. నోరికివచ్చినట్లు అవ్య. స్వేచ్ఛగా. భార. విరా. 4.68. నోరికివచ్చినట్లు పలుకు స.క్రి. ముందూ వెనకలు తెలియక మాట్లాడు. భార. విరా. 4.68. నోరికివచ్చినట్లు వెచ్చానకిచ్చు స.క్రి. ఇష్టంవచ్చినట్లు తిట్టు. సారంగ. 3.217. నోరిచేటు వి. వట్టి వాగాడంబరం. భార. కర్ణ. 2.24. నోరితాళము వి. నోటిబీగం. పాండు. 3.77. నోరిమాట నోరనవసియించు అ.క్రి. నోటిమాట నోటిలోనే ఉండు, అవ్యవధానంగా ఉండు. కకుత్థ్స. 2.95. నోరిమాట నోరనెయుండు(-ఉండు) అ.క్రి. వెంటనే, అసీ అనకముందే. ఆము. 7.22. నోరిమాట నోరనే యుండన్ అవ్య. ద్రు. చెప్పీ చెప్పకముందే, అవ్యవధానంగా. వరాహ. 1.145. నోరిసని రూ. నోటిశని. వి. నోటిశని, తినటానికి యోగం లేకపోవటం. ఆము. 6.82. నోరిసని నుండనేరక అవ్య. శని మూడటం వల్ల ఉండలేక. ఆము. 7.18. నోరుకట్టివాయికట్టి అవ్య. ఏమీ తినకుండా. నోరుకట్టు అ.క్రి. ఏమీ తినకుండు. నోరుకట్టువడు(-పడు) అ.క్రి. మౌనంవహించు. నోరుకాచు అ.క్రి. రహస్యాన్ని దాచు. గా.హరి. ఉ. 1030–1081. నోరుకాయలుకాచు రూ.చూ. నోరు కాయలుగాచు. అ.క్రి. చాలాసార్లు పిలవటంవల్ల నోరు నొప్పిపెట్టు. నోరు కాయలుగాచు రూ. నోరు కాయలుకాచు. అ.క్రి. చాలాసార్లు పిలవటం వల్ల నోరు నొప్పిపెట్టు. నోరుకాయు అ.క్రి. వద్దన్నా తినకుండా ఉండు. నోరుకూరిపోవు అ.క్రి. నోరుపడిపోవు. మైరా. 2.9. నోరుకొట్టు రూ.చూ. నోరుగొట్టు. అ.క్రి. జీవనం పోగొట్టు. నోరుగలదేవత(-కలదేవత) వి. మాటకారి, నోటివాడు. నోరుగొట్టు(-కొట్టు[1]) రూ. నోరుకొట్టు. స.క్రి. 1. ఒకరు అనుభవించకుండ పాడుచేయు. శుక. 3.375. 2. వాదంలో దబాయించు. నోరుచచ్చినవాడు విణ. నోరులేనివాడు, మాటకారి కానివాడు. నోరుచాపు అ.క్రి. చేతకాక నోరు వెళ్ళబెట్టు. నోరుచించుకొను అ.క్రి. అరచు, గోలచేయు. నోరుచెడబొంకు స.క్రి. పచ్చి అబద్ధాలాడు. నోరుచేదుమేయు స.క్రి. దూషణోక్తులాడు. తాళ్ల. సం. 11.2. నోరుచేయు రూ. నోరుజేయు. స.క్రి. మాటలాడు. బహుళా. 2.61. నోరుచేసుకొను స.క్రి. తిట్టు, అరచు. నోరుజేయు(-చేయు) రూ.చూ. నోరుచేయు. స.క్రి. 1. గట్టిగా కేకలువేయు ; 2. ముందు మిగిలి తిట్టు. నోరుతిరుగు స.క్రి. సులభంగా ఉచ్చరించు. నోరుదెఱచు అ.క్రి. 1. అత్యాశపడు, ఆశపెట్టుకొను. భార.శాంతి. 3.30 ; 2. మాటలాడు. నృసింహ. 2.118 ; 3. బదులు చెప్పకుండు, నిరుత్తరుడగు. నోరు దెఱచుకొని కూర్చుండు అ.క్రి. ఏదో వస్తుందన్న ఆశతో నిరీక్షిస్తూ కూర్చొను. నోరుదొడుకు(-తొడుకు[1]) అ.క్రి. నోరుకదుపు. గా. హరి. ఉ. 1303 పం. నోరునిండుగా(గ్రోలు (-క్రోలు) స.క్రి. నోటినిండ తాగు. కళా. 4.201. నోరు నెత్తిన( బెట్టుకొను(-పెట్టుకొను) స.క్రి. 1. పెద్దగా వాగు ; 2. ఒక విషయాన్ని నమ్మపలికే ప్రయత్నంచేయు. నోరునొక్కు స.క్రి. మాటాడకుండా చేయు. నోరునోరే తెఱచు అ.క్రి. అత్యాశను చూపు. శుక. 2.162. నోరుపడిపోవు అ.క్రి. 1. మాటలు పడిపోవు ; 2. అరచి అరచి నోరు నొప్పిపెట్టు. నోరుపారవేసికొను స.క్రి. అకారణంగా దుర్భాషలాడు. నోరుపెగలకపోవు అ.క్రి. మాట్లాడకపోవు. నోరుపొక్కు అ.క్రి. నోరుపూయు. పాండు. 5.198. నోరుబట్టు(-పట్టు) వి. పథ్యం ఉండకుండు. నోరుమాలిన జంతువు వి. నోరులేని పశువు. కాశీ. 5.335. నోరుమాలినవా(డు విణ. నోరులేనివాడు, గడుసుతనంతో మాటలాడలేనివాడు. నోరుముద్దెర్లుపడు(-పడు) అ.క్రి. మాట్లాడకుండ ఉండు. నోరుముద్రలుపడు అ.క్రి. మాట్లాడకుండ ఉండు. నోరుమూయు అ.క్రి. మాట్లాడకుండు. నృసింహ. 4.37. నోరుమెంగ విణ. మూగ. కళా. 3.239. నోరుమెదపు స.క్రి. మాటాడు. నోరుమెదల్చు స.క్రి. నోరెత్తిమాట్లాడు, చెప్పు. పాండు. 3.157. నోరుమెదల్పలేని విణ. 1. ఇలా అని చెప్పలేని ; 2. నోరెత్త పీలు లేని. నోరులేనిజంతువులు వి.బ.వ. 1. వాక్కులేని పశ్వాదులు. ఆము. 5.43 ; 2. అమాయకులు. నోరులేనివాడు విణ. 1. పొందికగా మాటలాడ లేనివాడు ; 2. అమాయకుడు. నోరువాయిలేనిది విణ. 1. అధికంగా మాటాడలేని స్త్రీ ; 2. అమాయకురాలు. నోరువాయిలేనివాడు విణ. 1. మెత్తటివాడు ; 2. అమాయకుడు. నోరువాయెత్తు స.క్రి. నోరెత్తు, మాటాడు. పి.శకు. 2.45. <నోరు + వాయి + ఎత్తు[1]. నోరువ్విళ్లూరు అ.క్రి. నోరూరు, తినాలనే ఆశకలుగు. ఇందు. 2.70. నోరూరు అ.క్రి. 1. పులుపుగాని, కారం గాని కల వస్తువుల్ని చూచినప్పుడు తలచినప్పుడు నోటిలో ద్రవం పుట్టు. హర. 3.88. <నోరు + ఊరు[2]. నోరూవాయీలేని విణ. అమాయకుడయిన. నోరెగయు అ.క్రి. నోరువచ్చు. <నోరు + ఎగయు. నోరెగసు అ.క్రి. నోటినుంచి మాటలు పిగులు. <నోరు + ఎగసు. నోరెట్టు స.క్రి. గట్టిగా అరచు, గోలచేయు. <నోరు + పెట్టు. నోరెండు అ.క్రి. నోరు పిడచకట్టు. కాళ. 4.170. <నోరు + ఎండు. నోరెండుకొనియుండు(-ఉండు) అ.క్రి. దాహంవేయు. శుక. 1.263. నోరెత్తు స.క్రి. మాట్లాడు. భార. ఉద్యో. 1.349. <నోరు + ఎత్తు[1]. నోరెల్పుఎసల్లు వి.బ.వ. నోరు వెడల్పుగా ఉండే చిన్న మట్టిపాత్రలు. <నోరు + వెడల్పు + ఎసల్లు. నోరొత్తుకొను అ.క్రి. నోరు మూసికొను. గా.హరి. 229, 230పం. <నోరు + ఒత్తుకొను[1]. నోర్నోరన్ అవ్య.ద్రు. నోట్లోనుంచి నోట్లోకి. కు.సం. 4.113. నోళ్ల(బడు అ.క్రి. పదుగురు చెప్పుకొను, నిందాపాత్రమగు. కలు. శ. 74. <నోరు + -లు + -అ[7] + పడు. నోళ్లకొట్టిబ్రతుకు అ.క్రి. ఇతరుల జీవనాధారాన్ని చెరిచి తాను లాభపడు. <నోరు + -లు + కొట్టు[1] + -ఇ[13] + బ్రతుకు. నోళ్లదెరచు అ.క్రి. మాటలాడు. తాళ్ల. సం. 9.82. <నోరు + -లు + తెఱచు.

నోరూరు చూ. నోరు.

నోరూవాయీలేని చూ. నోరు.
నోరెగయు చూ. నోరు.
నోరెగసు చూ. నోరు.
నోరెట్టు చూ. నోరు.
నోరెండు చూ. నోరు.
నోరెండుకొనియుండు చూ. నోరు.
నోరెత్తు చూ. నోరు.
నోరెల్పుఎసల్లు చూ. నోరు.
నోరొత్తుకొను చూ. నోరు.
నోర్నొరన్ చూ. నోరు.
నోలిక వి. తడచెట్టు, గట్టి కలపనిచ్చే అందమైన చెట్టు (Pterospermum Heyneanum).
నోళ్ల(బడు చూ. నోరు.
నోళ్లుకొట్టి(బ్రతుకు చూ. నోరు.
నోళ్లుదెరచు చూ. నోరు.
నోవరి చూ. నోవ.
నోవి రూ.చూ. నొవ్వు. వి. 1. బాధ, నొప్పి ; 2. తెగులు, వ్యాధి.
నోవిక వి. ఉనులు, అనుకూల్యం. మల్లు. 2.4.
నోవు రూ.చూ. నొవ్వు. వి. 1. బాధ. భార.ఉద్యో. 3.267 ; 2. వ్యాధి. భార.అశ్వ. 2.117.
నోవరి వి. వ్యాధికలవాడు, బాధకలవాడు. <నోవ+-అరి.
నౌ రూ.చూ. నగు. వి. హాసం.
నౌకరి రూ. నవుకరి, నౌకరీ. వి. ఉద్యోగం, పరిచర్య, సేవ. చాటు పద్యరత్నం.
హిం.ఉ. నౌక్‌రీ. సేవ, పరిచర్య ; పార. నౌకరీ. సేవ, తక్కువతనం.
<ఉ. నౌక్‌రీ.
నౌకరీ రూ.చూ. నౌకరి. వి. సేవ, ఉద్యోగం.
నౌకరీఇనాం రూ.చూ. నౌక్రీఇనాం. వి. చాకలి, మంగలి మొ॥ ఊరినౌకర్లకిచ్చిన పారితోషికం.
నౌకరు రూ. నవుకరు. వి. బంట్రోతు, సేవకుడు. భద్ర.శ. 94.
హిం.ఉ. నౌకర్. భృత్యుడు, సేవకుడు ; పార. నౌకర్, నూకర్.
<ఉ. నౌకర్.
నౌకు రూ. నవుకు. విశ. నిమ్నమైన, పల్లంగా ఉన్న. ద్వి. సార.చ. 1.237 పం.
నౌక్రీఇనాం రూ. నౌకరీఇనాం. వి. చాకలి, మంగలి మొ॥ ఊరి నౌకర్ల కిచ్చిన పారితోషికం.
హిం.ఉ. నౌక్‌రీ. సేవ, పరిచర్య, ఉద్యోగం, ఇనామ్. బహుమతి.
<ఉ. నౌక్‌రీ+ఉ. ఇనామ్.
నౌగులు వి. సెనగపిండితో చేసిన తీపి బిస్కెట్ల లాంటి పిండి వంట.
నౌజు రూ. లౌజు. వి. భక్ష్య విశేషం, బెల్లం పాకంపట్టి అందులో కొబ్బరి కోరువేసి అచ్చులుగా చేసే తినుబండారం.
హిం. నౌజా. బాదాం ; ఉ. నౌజా, తాజ్ ; పార. తాజ్.
<ఉ. నౌజా.
నౌ(జు రూ. నవు(జు. వి. చాలాలేత అయిన.
నౌటాకు రూ.చూ. నవటాకు. వి. మూడు తన్నులు, గజంలో ఎనిమిదో వంతు.
నౌటు వి. చాలా సన్నని పేను.
నౌడు రూ.చూ. ఔడు. వి. పెదవి.
నౌడుకొట్టు రూ చూ. నవుడుకొట్టు. అ.క్రి. మిణకరించు.
నౌబతఖానా వి. నౌబతులు మోగించే ప్రదేశం.
ఉ. నౌబత్‌ఖానా. నౌబత్తులు మోగించే చోటు.
<ఉ. నౌబత్‌ఖానా.
నౌబతు రూ.చూ. నవుబత్తు. వి. చర్మవాద్య విశేషం. రంగా. చ. 2.238.
నౌబత్తు రూ.చూ. నవుబత్తు. వి. చర్మవాద్య విశేషం. రంగా. చ. 2.198.
నౌబత్తునగారాలు వి.బ వ. రాజలాంఛనాలైన వాద్యాలు.
నౌబోతికానాకుండ రూ.చూ. నబోతికానేకుండ. వి. పెద్ద నగారా లాగా ఉండే వాయిద్యానికి వాడే మట్టి కుండ.
నౌబోదినగారకుండా చూ. నబోతికానేకుండ. వి. పెద్ద నగారా లాగా ఉండే వాద్యానికి వాడే మట్టికుండ.
నౌరు రూ.చూ. నవురు. విశ. మృదువైన.
నౌరోజు వి. ఒక పర్వదినం. విశ్వే.శ. 55.
హిం.ఉ. నౌరోజ్. సంవత్సరాది; మరా. నౌరోజ్, నవ్‌రోజ్. సంవత్సరాది. ; పార. నౌరోజ్. సంవత్సరాది.
<ఉ. నౌరోజ్.
నౌలు రూ.చూ. నములు. స.క్రి. 1. పళ్ళతో ముక్కలు చేయు ; 2. ఆస్వాదించు ; 3. తిను.
నౌసారిపత్తి వి. ఏసెలు ఒక అంగుళం పొడుగు ఉండే పత్తి.
న్యూట్రాను వి. తటస్థ విద్యుత్కిరణం.
ఇం. *Neutron*. ప్రోటాన్ సమాన ద్రవ్య పరిమాణం కలిగి విద్యుదావేశం లేని తటస్థ విద్యుత్కిరణం.
<ఇం. Neutron.
న్యూసు వి. వర్తమానం, సమాచారం.
ఇం. *News*. సమాచారం, వృత్తాంతం, వార్తలు.
<ఇం. News.
న్యూసెన్సు వి. రోత పుట్టించే పని.
ఇం. *Nuisance*. బాధ, ఉపద్రవం, తొందర, అసహ్యాన్ని పుట్టించేది, రోత.
<ఇం. Nuisance.
న్యూస్‌పేపరు వి. వార్తాపత్రిక.
ఇం. *News Paper*. వార్తాపత్రిక
<ఇం. News Paper.

# ఆంధ్ర గ్రంథ సంకేత పట్టిక

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్దం |
|---|---|---|---|
| అ.చ. | అన్నమాచార్య చరిత్ర | చిన్నన్న | 16 |
| అచలా. | అచలాత్మజాపరిణయము | తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్య కవి | 18 |
| అచ్చ.భా. | అచ్చ తెలుఁగు భారవి | శ్రీరామకవి | |
| అచ్చ.రా. | అచ్చతెలుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి | 18 |
| బాల. | బాలకాండము | | |
| అయోధ్యా. | అయోధ్యాకాండము | | |
| అరణ్య. | అరణ్యకాండము | | |
| కిష్కిం. | కిష్కింధా కాండము | | |
| సుం. | సుందర కాండము | | |
| యు. | యుద్ధ కాండము | | |
| అధ్యా.రా. | అధ్యాత్మ రామాయణము | కోటమరాజు నాగయా మాత్యుఁడు | 17–18 |
| అధ్యా.సం. | అధ్యాత్మ సంకీర్తనలు | తాళ్ళపాక అన్నమాచార్యులు | 15–16 |
| అని. | అనిరుద్ధ చరిత్రము | కనుపర్తి అబ్బయా మాత్యుఁడు | 18 |
| అను. | అనుభవసారము | పాల్కురికి సోమనాథుఁడు | 13 |
| అప్ప. | అప్పకవీయము | కాకునూరి అప్పకవి | 17 |
| అభి.రా. | అభిషిక్త రాఘవము | నడిమింటి వేంకటపతి | |
| అష్టమ.క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | తాళ్ళపాక తిరువెంగళనాథుఁడు | 16 |
| అహల్యా. | అహల్యా సంక్రందనము | సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు | 18 |
| అహోబల. | అహోబల పండితీయము | అహోబలపండితుఁడు | 17 |
| ఆం.చం. | ఆంధ్ర చంద్రాలోకము | అడిదము సూరకవి | 18 |
| ఆనంద. | ఆనంద రంగరాట్ఛందము | కస్తూరి రంగకవి | 18 |
| ఆము. | ఆముక్త మాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | 15–16 |
| ఆం.భా.భూ. | ఆంధ్ర భాషాభూషణము | మూలఘటిక కేతన | 13 |
| ఇందు. | ఇందుమతీ పరిణయము | కుమారధూర్జటి | 16 |
| ఇందు.ప. | ఇందుమతీ పరిణయము | తెనాలి రామభద్రకవి | 16 |
| ఉ.రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు | 17 |
| ఉషా. | ఉషాపరిణయము | పసుపులేటి రంగాయమ్మ | 17 |
| ఉ.హరి. | ఉత్తర హరివంశము | నాచన సోమనాథుఁడు | 14 |
| ఉ.హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | తక్కెళ్లపాటి లింగన | 18 |
| ఉదయ. | ఉదయ నోదయము | నారనసూరన | 16–17 |
| ఉద్భటా. | ఉద్భటారాధ్య చరిత్రము | తెనాలి రామకృష్ణుఁడు | 16 |
| కకుత్థ్స. | కకుత్థ్స విజయము | మట్ల అనంతభూపాలుఁడు | 16 |
| కటి.శ. | కటివేల్పు శతకము | వైజర్సు అప్పయకవి | 18 |
| కలు.శ. | కలువాయి శతకము | డబ్బీరు నరసకవి | 19 |

